విజ్ఞానచంద్రికామండలి: ప్రచురణము 41.



# భారతదేశము-ఆర్థికచరిత్ర

సంపుటము 1.

గ్రంథకర్త

ఆత్మకూరి గోవిందాచార్యులు

రాజా ఎలెక్ట్రిక్ ప్రెస్, రాజమండ్రి.

1935



2 సంపుటముల వెల

రు. 10-0-0

# భారతదేశము-ఆర్థికచరిత్ర

## తొలిపలుకు.

## FORE WORD.

భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు,

(బందరు 17-10-34.)

కొంత కాలమునుండి- అనగా- అర్ధశతాబ్దమునుండి మన మాతృదేశములో రాజకీయపరివర్తనము తీవ్రముగా జరుగుతూన్నవిషయం అందరు ఎరిగియున్నదే. కాని యట్టి రాజకీయపరివర్తనము వేరు వేరువిధములుగ నెప్పటికప్పుడు మారుచున్నది. మొదటిలో రాజకీయమనగా తక్కిన సాంఘిక-ఆర్థిక-ధార్మిక-నైతిక- విషయములతో నెట్టిసంబంధము గలది కాదనుభావము వ్యాపించియుండేది. రాను రాను రాజకీయవిషయము లనగా సర్కారుకును- ప్రజలకును సంబంధించినపన్నులు-శిక్షలు-మున్నగు విషయములే కాక, దేశముయొక్క ఆర్థికస్థితి ప్రజలయొక్క భాగ్యభోగ్యములకు గూడ సంబంధించినవిషయమై యుండవలె ననుభావము ప్రబలుచున్నది. ఇప్పుడు రాజకీయవిషయము లను ప్రత్యేకశాఖ లేనేలేదనిన్నీ- మానవకోటికి ఏదేశము నందాయాపరిస్థితుల ననుసరించి జీవితముయొక్క సర్వశాఖలకు సంబంధించిన విషయము లను నిర్వచనము సర్వజనాంగీకృతమైనది.

ఈ సమగ్రమగునిర్వచనము గ్రహించినపుడు మాత్రమే శ్రీగోవిందాచార్యులుగారు వ్రాసిన ఈ గ్రంధముయొక్క పతక మనగాహన కాగలదు. పుస్తకముయొక్క విషయసూచిక చూస్తే ఒక్కభూగోళము కాదు-ఒక్కచరిత్ర కాదు-ఒక్కమతము-ఆచారము-వర్ణములకు సంబంధించిన విషయములు గాదు-ఈప్రక్క సహకారోద్యమము-ఆప్రక్క పరిపాలనావివరములు-మరియొకవైపున దేశముయొక్క ఆరో

మేర్పడినది. వర్తక సామ్రాజ్యము కొఱకు, దిగుమతిపన్నులు-ఉత్పత్తి పన్నులు అనివార్యములైనవి. ఇవన్నియు ఆంగ్లేయ రాజ్యముయొక్క శ్రేయస్సునకు వ్యతిరేకముగ నుండకుండ చూడవలసి వచ్చెను. ఇందులకు అట్టావా ఒడంబడికలో ప్రవేశించితిమి. దిగుమతిపన్నులు చూపుటకువైచి కళ్లనీళ్లు తుడిచి నాణెపుమారకములో దిగుమతిపన్నులవల్ల గలిగిన నష్టమును సీమదేశము కూడ బెట్టుకొనినది. అది కనిపెట్టి ప్రజలాందోళన సలుపగనే-ఉత్పత్తిపన్నులను పెంచి దేశీయ (వస్త్ర) పరిశ్రమను ప్రియముగ జేసినది. అటువెడితే పల్లేరుకాయలు-క్రింద అఖాతము-పైన ఎండ-ముందు నుయ్యి-వెనుక గొయ్యి అన్న సామ్యమయినది మన ఆర్థికస్థితి. ఈ చిక్కులను తెలిసికొనుటకు మారకము-నాణెములు-రాజ్యాంగముయొక్క ఋణములు-వారు కొనే అంగళ్లు-వారు అమ్మే వస్తువులు ఇవన్నియు తెలిసికోవలసి వచ్చింది. అందుచేత నీగ్రంథ మింత బాహుళ్యమైనదిగ, తలవని తలంపుగ మారినది. పాఠకులు మరియొక విషయ మడుగవచ్చును. "పరిపాలకులకును-వర్తకమునకును ఏమి సంబంధము గలదు" అని.

మనదేశమునందాచారము ననుసరించి ఉద్యోగస్థులు-వర్తకులు-అను భేద ముండవచ్చును. ఇంగ్లీషువారియందీభేదము లేదు. నేటి ఉద్యోగి రేపటి వర్తకుడు. నిన్నటి వర్తకుడు రేపటి ఉద్యోగి. లార్డు రీడింగు, లార్డు బర్కెన్‌హెడ్డు మొదలగువారెల్లున్నత ప్రభుత్వోద్యోగముల నిర్వహించి, పిమ్మట వర్తకులుగ మారినదియు 18 వ అధ్యాయమునందు వివరింపబడియే యున్నది. (18. వ అధ్యాయము. పేజీ 2141 మొదలు 2145 వఱకు.)

ఈవిధముగ మన దేశమంతయు "బ్రిటిషు ఎంపయిర్ అన్‌లిమిటెడ్" (British Empire Unlimited) అను కంపెనీకి ఒక బజారు. ఇం

దలి ఉద్యోగులెల్లరు ఆయాకంపెనీల ఏజెంట్లు. అంతే కాదు. మనఉ ద్యోగులుగూడ వారివర్తకమునకు ఏజెంట్లే. కోర్టుకు ఖద్దరు కట్టుకొని వెడితే వాయిదా ఇస్తారో లేదో యని భయం. బ్యాంకులకు ఖద్దరు కట్టుకొని వెడితే హుండీలు చెలామణి చేస్తారోలేదో యని భయం. జమాబందీకి ఖద్దరు కట్టుకొని వెడితే రిమీషను లిస్తారో లేదో యని భయం. కళాసీ అంటే భయం. కలక్టరుగారి ఢఫేదారంటే భయం. సాల్టు బంట్రోతంటే భయం. ఇంక పోలీసువారంటే భయమని చెప్పవలెనా? ఈవిధముగా నధికారరీత్యా వర్తకము పెంపొందించుకొనురాజ్యాంగముక్రింద మనము పరిపాలింపబడుచు మన దేశీయవృత్తులను కళలను చెడగొట్టుకున్నాము.

సం. 1891 సంవత్సరములో 100కి 61 మంది మాత్రమే వ్యవసాయముమీద జీవనోపాధికి ఆధారపడియుంటే 1931 సం. రములో 100 కి 76 మంది ఆధారపడియున్నారు. ఏల? చేతిపనులు నశించినవి. కమ్మరమేకులబదులు తీగెమేకులు వచ్చినవి. నాటుకలప పోయి పైగో కలపవచ్చినది. సీమనుండివచ్చే రుబరాయిడుతో (Ruberoid) కప్పు నేస్తున్నారు. కిటికీలు తయారుగ పైనుంచి దిగుమతి యగుచున్నవి. (Cretal Windows) రైళ్లపట్టాలక్రింద అడ్డకమ్ములు ఇనుపవి. సీమనుండి కూడా వచ్చుచున్నవి. వంతెనలు-తూములు యావత్తు సిమెంటుకాంక్రీటు కాక యినుపసామానులతో చేయవలెనని ఉత్తరవులు జారీఅగుచున్నవి. ఇంక నేతబట్టయొక్క చిత్రశోభ చెప్పేదేమిటి? వడ్రంగిపనిముట్లు-ఉలి-రంపం-మరోడి-అలుగులు-బరమ-కంసాలియొక్క- సుత్తి-అగరు-ఆకురాయి-ఒకటేమిటి ప్రతివస్తువు పైనుంచి రావలసినదే. అనుదినము మన ముపయోగించే తలనూనె-దువ్వెన-ముఖంపౌడి-మలాములు-పళ్లపౌడి-పంటిబ్రషులు-తలబ్రషులు-బూట్సుబ్రషులు-క్షౌరపుబ్రషులు-మంగలకత్తులు- కత్తెరలు- గోరుగుల్లులు- సబ్బులు- వాసలీనులు-

కలం-కాగితం, అద్దుడుకాగితం-సిరా-ఊటకలములు-బెల్టులు-మేజోళ్లు-చెప్పులు-కాఫీకప్పులు-చెంచాలు-బిస్కట్లు-ఊరేసిన చాపల మాంసం-చాకలెట్లు-టోపీలు-లాంతరులు-స్టవులు- తాళాలు-చెవులు-రింగులు-గొలుసులు-పిల్లలబళ్లు-మోటారులు- ఉప్పు-పంచదార-ఇనుపసామగ్రి-యంత్రసామగ్రి-కుర్చీలు-బల్లలు-రేకులు-ఒకటేమిటి-బజారులోనికి వెడితే సర్వం పైనుంచి రావలసిందే. అటువంటి సందర్భంలో "ఆర్థికచరిత్ర" ఒక పురాణమగుటలో నాశ్చర్యమేమి? ఖరీదులో పోటీవస్తే పన్నులలో కూడదీస్తారు. పన్నులలో పోటీవస్తే మారకంలో కూడదీస్తారు. మారకంలో పేచీవస్తే నాణెముల మొత్తములో ఒకసారి హెచ్చించి ఒకసారి తగ్గించి కూడ దీస్తారు. వెండి-రాగి లేకపోతే-నిక్కెలు వేస్తారు. అదీలేకపోతే రూపాయనోట్లు వేస్తారు. అదీకష్టమై వాటివెనక తగు లోహపు హామీ లేకపోతే బ్యాంకులు మూసి శాసనములనే మారుస్తారు. అక్కడికీ సర్దుబాటుకాకపోతే పరాయిదేశపు ఋణములను ఇయ్యజాలమంటారు. దేశీయుల ఋణములు ఇయ్యవలసివస్తే బ్యాంకు రేటు తగ్గిస్తారు. దాచుకోవడానికి వడ్డీలు తక్కువగా నుండుటచే పత్రములు కొంటారు ప్రజలు. కావలసిన మొత్తము అమ్మగానే బ్యాంకు రేట్లు హెచ్చిస్తారు. తీర్చేసమయానికి-తెచ్చేసమయానికి-కాలువల లోని నీరుమట్టమువలె బ్యాంకు రేట్లు-లేస్తూ-పడుతూ ఉండే ఏర్పాట్లు గవర్నమెంట్లు చేసుకుంటాయి. ఇంక గవర్నమెంటు అన్నా-రాజ్యాంగమన్నా-ఆర్థికచరిత్రయే.

ఆచరిత్ర ఒక "రాంకహానీ" అగుటలో ఆశ్చర్యమేమి? ఇక్లే చరిత్రను పరిశోధించుటలో సం 150లలో మొదట కంపెనీవారు-తరువాత గవర్నమెంటువారు-ఏవిధముగ ఓడలకు ప్రూటీబరువు క్రింద లండనులోని మట్టికిబదులు-ఉప్పు తేవలసివచ్చినదో చెప్పవలసియున్నది. కలకత్తాలో

చౌరంగీరోడ్డు పూర్వము హుగ్లీనదియొక్క పాయ. ఈరోడ్డును లండను మట్టితో పూడ్చారు. సం. 1856 నుండి మట్టిబదులు చెప్పైరు ఉప్పు వస్తున్నది. బట్టలవర్తకం తగ్గిపోయిందంటే-ఓడలవర్తకం-రైళ్ళరాబడి-బ్యాంకుల ఆదా-భీమాకంపెనీల రాబడి-ఎగుమతి దిగుమతీదార్ల ఖాతాలు-రేవులలో రైళ్లవద్ద పనిచేయు కూలీలపనులు- ఈరైళ్లు, ఓడలు నడుపు బొగ్గుగనులలో పనులు- తగ్గిపోయినవన్న మాటే. ఇంతేల? యుద్ధము పూర్తికాగానే, అదివరకు దేశీయపడవలను యుద్ధకాలములో ఎక్కువగ కట్టింప ప్రోత్సాహపరచియు-పిమ్మట గవర్నమెంటువారే నిరుత్సాహ పరచినారు. దీనివల్ల ఓడల యజమానులకు చాలా నష్టము కలిగినది. ఇక్లే ఇండియాలోని మిల్లులు బట్టనేయడం మొదలుపెట్టిన 25 సంవత్సరములకు తాత్కాలికముగ నూలుపైన, బట్టపైన, రు 100 కి రు. 25 ల వరకు ఉత్పత్తిపన్ను విధించినమీాదట బట్టయొక్క వెల విదేశపుగుడ్డకంటె హెచ్చుచేయవలసి వచ్చెను. చాల కాలము ఆందోళన జరిగిన మీాదట ఈపన్ను రు 3—8—0 లకు తగ్గించిరి. ఇంతకాలము దిగుమతియగు బట్టమీాద 100 కి రు 7-8-0 లు పన్ను ఉండేది. యుద్ధములో తాము గవర్నమెంటుకు చాలా సేవజేసినామనే కారణంచేత 1920 మొదలు 1925 వరకు మితవాదులున్నూ మిల్లువర్తకులున్నూ ఉత్పత్తిపన్నులను తీసివేయవలసినదనిన్నీ-దిగుమతి పన్నులను హెచ్చింపవలసినదనిన్నీ-గవర్నమెంటును తొందర పెట్టిరి. ఉత్పత్తిపన్ను ఎంత తగ్గితే అంత మన మిల్లుబట్ట చౌక కాగలదు. దిగుమతిపన్ను ఎంత హెచ్చితే అంత విదేశపుబట్ట ప్రియం కాగలదు. యుద్ధకాలంలో నూలు బట్టలమిల్లువారు చేసిన సేవ గవర్నమెంటు మరచిపోలేదు. యుద్ధముకాగానే వారిలాభములు పూర్తిగా కృశించిన వనికూడ తెలిసికొనకపోలేదు. ఇది యిలాఉండగా అసహాయోద్యమము కూడా విజృంభించింది. కాంగ్రెసువారితోబాటు-మితవాదులను గూడ

వసారి ఆరునెలలకున్నూ, మూడవసారి మూడునెలలకున్నూ అనారోగ్యకారణముచే విడుదలైనారు. తమ జీవితకాలము కూడ విశేషము లేదని వీరికి తెలుసును. కావున తమకున్న కొలదికాలములో ఈ మహాత్కార్యమును పూర్తిచేయవలెనను కోరిక వీరికి దృఢముగా గలిగి తమ సర్వస్వమును దీనికి అర్పించి ఆంధ్రులయొక్క కృతజ్ఞతకు వీరు పాత్రులైనారు. ఆంధ్రులుకూడ తమకు వీరు చేసిన సేవను గుర్తించి ఈపుస్తకమునకు తగిన ఆదరణను చూపుదురుగాక.

భోగరాజు పట్టాభిసీతారామయ్య.

# INTRODUCTION

DR. BASAVARSU RAMACHANDRA RAU,
M. A., PH. D., L. T., F. R. E. S. (LONDON).
*Professor of Economics and Commerce, Calcutta University; Author of Present Day Banking in India; Organised Banking in the days of John Company; Banks and the Money Market; the Future of Agricultural Industry; Bengal Finances etc. etc.*

In March 1933, a well-known gentleman with charming manners called upon me. He told me he had written a book upon Indian Economics and that if I were to write an introduction he would be greatly obliged. My late wife's alarmingly poor health and the piled up literary arrears of mine reminded me that the fulfilment of this promise was a hopeless one.

Soon after he sent me a printed work running into several chapters. His frequent references to my keen interest in the subject prompted me to satisfy his request. It is a welcome sign that the Andhra public are taking a keen interest in Indian Economic problems than before. The economic prosperity of the Andhra people depends directly as well as indirectly upon the efficiency of their agricultural, industrial and trading section of the population. An economic distribution of the produced wealth is no less important. Voluntary efforts and State intervention are alike needed to improve our economic prosperity.

Considerations of time as well as space forbid me to give an adequate summary of the contents of this remarkable survey. *The author has not only mastered the subject but has listed several books of references and authorities upon which he relies for his remarks. He has not only succeeded in placing the subject in its proper setting but full allowance is made for the*

*influence of political, social, religious, educational and linguistic conditions on the economic progress of our country. Those who are desirous of securing an intellectual grasp of the present-day intricate economic problems in which the human factor plays such a vital part, would do well to read this ponderous tome which can rightly be acclaimed as the first pioneer effort to state the A B C of the subject in the Telugu Language.* It is, indeed, true that few separate monographs of Mr. C. R. Reddy, Prof. M. Venkata Rangayya, Mr. Vepa Sytyanarayana Murti, Mr. C. V. Hanumantharao, and others stand as landmarks in the study of this subject. But his (Mr. Govindachary's) pioneer effort in creating a terminology for technical terms needs every encouragement.

I heartily commend his interpretative analysis of the facts and figures so assiduously collected by him from numerous authoritative sources. A large bulk of statistical and other information adds to the value of his study. *This voluminous work can be entitled a comprehensive study of Indian economic conditions summarising some of the principal problems and drawing a few remarkable conclusions on each of these problems. The character of the exposition, and the fairness of the argumentation which form the salient features of the book are highly commendable. The general public as well as the student of economics would secure ample and reliable guidance. For a correct understanding of the important Indian Economic problems such as unemployment, poverty and trade depression by the lay public which is a distinct service to the cause of Economic Science as well as the Telugu Language we are highly indebted to the author.*

I am tempted, however, to mention a few opinions of mine which have appealed to Mr. Govindachary. Like myself, he holds the opinion that India is overpopulated in spite of her present rich material resources, for its teeming millions are born in debt, live in debt, and die in debt. Fair standard of living borders on bare subsistence minimum Until their quality increases there will be no desirable change in the socio- economico-religious background.

Coming to our agricultural industry he insists like myself on the legal regulations coming to the aid of our reformers in checking the fragmentation of uneconomical land holding. An exhaustive catalogue of causes leading to large volume of unproductive debt adds to the utility of the section. Diversified and intensive agriculture can make the agricultural industry a paying occupation in spite of the great pressure of population on land. Scientific stock-breeding and stock control as recommended by me in my Economics of the Leather Industry would undoubtedly prove the salvation of her predominantly vegetarian population.

Internal trade has to be speeded up by increasing effective demand, improving transportation facilities, improved marketing conditions and proper standardisation of weights and measures. Rural reconstruction under such transformed economic conditions would lead to great development.

Organised manufactures are slowly developing in the country and occupy a prominent place in Indian economic structure but the heavy pressure on land is not yet sufficiently mitigated.

National pride and faith in India's mission are slowly changing the political environment of our country. General poverty, mounting indebtedness, increasing helplessness and appalling illiteracy make the economic problem of distribution a vitally important one. The economic progress of the Indian people is delayed by the benumbing influence of the evil money lender. Mere increasing of productive activity which indeed depends on proper utilisation of existing capital resources would not solve the economic problem. The present-day economic weaknesses have to be removed. The restoration of economic health is indeed a problem which can be solved by a painfully slow evolution. The ordered will of the educated people must be in the creation of a common economic endeavour. Economic endeavour, economic freedom, and economic stamina constitute the threefold path of securing sound and optimum improvement and progress in the national economy of the country.

The principles of Credit Co-operation are lucidly dealt with in Chapter VI. Special reference to the transportation

# ఉపోద్ఘాతము.

## INTRODUCTION.

(డాక్టరు. బసవర్సు రామచంద్రరావుగారు.)

(ఎమ్. ఎ., పిహెచ్. డి., ఎల్. టి., ఎఫ్. ఆర్. ఇ. ఎస్. లండను.)

ఆర్థిక-వర్తక-శాస్త్రపండితులు కలకత్తా విశ్వవిద్యాలయము.

1933వ సంవత్సరం మార్చి నెలలో సుప్రసిద్ధుడును, లలితమర్యాదుడును నగు నొకపెద్దమనిషి నన్ను చూడవచ్చెను. వారు భారతదేశార్థికచరిత్రను వ్రాసియున్నటుల జెప్పిరి. ఆపుస్తకమునకు నేను ఉపోద్ఘాతమును వ్రాసినచో సంతసించెదమనియును జెప్పిరి. అప్పటికి నాభార్య అనారోగ్యముగ నుండెను. నేనువ్రాయవలసిన విద్యావిషయములు గూడ జాల బెరిగియున్నవి. అందుచే నేనీకార్యమును నిర్వహించుట దుర్ఘటమని తలంచితిని.

పిమ్మట వారు అనేకాధ్యాయములతోగూడిన అచ్చుపుస్తకమును నాకు బంపిరి. నాకీ యార్థికవిషయములయందు గల గాఢాభిమతమును వారు తరుచు సూచించుటవలన నేనీ యుపోద్ఘాతమును వ్రాయబూనితిని. మునుపటికంటె నేడాంధ్రులు ఆర్థికసమస్యలయందధికాభిమానము వహించుచుండుట శుభసూచకము. ఆంధ్రుల ఆర్థికాభివృద్ధి ప్రత్యక్షముగను, బరోక్షముగను గూడ వారివ్యవసాయదారులయొక్కయు, వర్తకులయొక్కయు, సమర్థతపై నాధారపడియున్నది. ఉత్పాదితైశ్వర్యమును ప్రజలందరు ననుభవించునటుల జేయుటగూడ గమనింపదగిన విషయమే. స్వయంకృషియు ప్రభుత్వసహాయమునుగూడ మన యార్థికాభివృద్ధికి నవసరము.

కాలపరిమితివల్లను, స్థలసంకుచితమువల్లను, ఈ యుత్తమగ్రంథమునందు గల వివిధవిషయముల నన్నియు నిట వివరించుటకు సావకాశము లేదు. ఈగ్రంథకర్త, తమ నిర్ణయముల కాధారములగు వివిధ పుస్తకములను బేర్కొనుటయే కాక, ఈ ఆర్థిక సమస్యలను సంపూర్ణ పాండిత్యముతో వ్రాయగలిగెను. విషయవిభాగమును సక్రమపద్ధతి యందుంచుటలో విజయము బడయుటయే కాక, మన దేశార్థికాభివృద్ధిలో రాజకీయ, సాంఘిక, మత, విద్యా, భాషాపరిస్థితు లెట్టి స్థానము వహింప గలవను విషయచర్చకు గూడ సంపూర్ణ సావకాశమును గలిగించెను. ముఖ్యముగ మానవునిపై ఆధారపడియున్న నేటి క్లిష్టమగు ఆర్థికసమస్యలను గుఱించిన విజ్ఞానమును బడయవలెనని యభిలషించువారు, ఈ మహద్గ్రంథమును జదువుట సమంజసము. ఈ మహద్గ్రంథ మాంధ్రభాషయందు ఆర్థికవిజ్ఞానమునుగుఱించిన మార్గదర్శకమైన కృషియని న్యాయముగ సంతోషింపదగును. శ్రీయుతులు కట్టమంచి రామలింగారెడ్డిగారు, ప్రొఫెసరు ఎమ్. వెంకటరంగయ్యగారు, వేపా సత్యనారాయణమూర్తిగారు, సి. వి. హనుమంతరావుగారు, ప్రత్యేకముగ నార్థిక శాస్త్రమునుగుఱించి వ్రాసిన పుస్తకములు గమనార్హములను మాట నిజము. అయినను ఆంగ్లేయభాషయందు గల శాస్త్రీయశబ్దములకు తెలుగున సాంకేతికశబ్దములను కల్పించుటకై గ్రంథకర్త గావించిన మార్గదర్శకమగుకృషి ప్రశంసాపాత్రము.

వివిధాధారములనుండి అవధానముతో గ్రహించిన విషయములపైనను, అంకెలపైనను, నీ గ్రంథకర్త గావించిన వ్యాఖ్యానములను విమర్శనములను నేను హృదయపూర్వకముగ ప్రశంసించుచున్నాను. ఈ పుస్తకమునందు విశేషముగ నున్న అంకెలతోగూడిన వివిధవిషయము లీగ్రంథకర్తగారి విద్యాభినివేశనముయొక్క విలువను హెచ్చిం

చుచున్నవి. ఈ ఉద్గ్రంథము భారతదేశార్థికపరిస్థితులయొక్క సర్వతో ముఖ విజ్ఞానముగనున్న దనదగును. ముఖ్యార్థికసమస్యలను సంక్షిప్తముగ వివరించుచు, ప్రతివిషయముపైన కొన్ని ఎన్నదగిన నిర్ణయములు వ్రాయబడినవి. విషయములను వెలిబుచ్చినరీతియు, విషయచర్చయందు గల నిష్పక్షపాతమును ఈ పుస్తకమునందు గల ముఖ్యలక్షణములుగ శ్లాఘింపదగును. జనసామాన్యమునకును, ఆర్థికవిద్యార్థులకును గూడ నీ పుస్తకము విశేషమైనట్టియు, ఆధారపడ దగినట్టియు శిక్షనొసంగగలదు. నిరుద్యోగసమస్య-దారిద్ర్యము-వర్తక దుస్థితి-మొదలగు భారతీయార్థిక ప్రాముఖ్య సమస్యలను ప్రజాసామాన్యము సక్రమముగ నర్థము జేసికొనుటకు వీలుగ వ్రాయబడిన యీపుస్తకము ఆర్థికశాస్త్రవిజ్ఞానమునకును-ఆంధ్రభాషకును గూడ పేర్కొనదగినంత సేవజేయుటచే మన మీగ్రంథకర్తకెంతయు ఋణపడియున్నాము.

ఈసందర్భమున గోవిందాచార్యులుగారు నాతోనేకీభవించిన కొన్ని యభిప్రాయముల బేర్కొన కుతూహలపడుచున్నాను. నావలెనే వీరుగూడ, హిందూదేశము విశేషమగుసహజసంపద గలిగియుండియు, ప్రస్తుతముఅధికజనసంఖ్య సమస్యతోనున్నదని యభిప్రాయపడిరి. ఏలయన,హిందూదేశమందలివేనకువేలప్రజాసామాన్యము ఋణముతోనే బుట్టుచున్నారు. ఋణముతోనేబ్రతుకుచున్నారు. ఋణముతోనేజచ్చుచున్నారు. వీరిఅంతస్తుకనిష్ఠజీవితావసరములకు సమీపముగమాత్రమే గలదు. వీరియంతస్తు పెరిగి ప్రశస్తమైన సంతానము వృద్ధియైన గాని సాంఘికార్థిక మతసమస్యలయందు రావలసిన మార్పు రాదు.

వ్యవసాయ పరిశ్రమను బరీక్షించుచో నావలెనే ఆచార్యులు గారు కూడ, ఆర్థికాభివృద్ధికనర్థకరములగు సాగుబడిభూమియొక్క విభాగవిఖండములను నిరోధించుటకు వలయుశాసనము లవసరమని వ్రాసిరి.

రైతుల నిరర్థక ఋణమునకుగల కారణములను విపులముగ తర్కించిన భాగము లీయధ్యాయమును మఱింత యుపయోగకరముగ నొనరించి నవి. వివిధరకముల వ్యవసాయమును, వ్యవసాయాభివృద్ధియు నున్నచో వ్యవసాయ పరిశ్రమపై అధికజన సంఖ్యభారమున్నను, వ్యవసాయము లాభకరమగువృత్తి కాగలదు. నేను చర్మపరి శ్రమనుగుఱించి వ్రాసినపుస్తకమునందు సూచించినటుల, శాస్త్రసమ్మ తముగ పశువులను పోషించుటయు, పశుసంతతిని సక్రమమగు నియ మములతో బోషించుటయు, జేయుచో, విశేషముగ శాకాహారులగు జనసంఖ్యగల మన దేశము తరించగలదు.

గిరాకీ హెచ్చింపజేసియు, రాకపోకలవీళ్లనువృద్ధిజేసియు, మార్కెటులను గల్పించియు, తులామాపక ప్రమాణములను నిర్ణీతముజేసియు, అంతర్వ్యాపారమభివృద్ధిజేయ వలసియున్నది. ఈపరివర్తనమున గ్రామ పునర్నిర్మాణము విశేషాభివృద్ధికి దారితీయును.

దేశమునందు సంస్కృత పదార్థములు దినదినాభివృద్ధి నొందు చున్నవి. భారతీయార్థికనిర్మాణమునం దివిప్రాముఖ్యస్థానమునువహిం పగలవు. కాని సాగుబడిభూమిపై గలభారమింకను తొలగవలసి నంతగ దొలగిపోలేదు.

భారతదేశ సందేశమునందు గల జాతీయ గౌరవమును, విశ్వా సమును మనదేశపురాజకీయ పరిస్థితులయందు మార్పును గలిగించు చున్నవి. సర్వత్ర వ్యాపించియున్న దారిద్ర్యమును, దుర్భరముగనున్న ఋణమును, దినదినాభివృద్ధినొందుచున్న నిస్సహాయతయును, విద్యా హీనతయును, ఐశ్వర్యవిభాగసమస్య నొక ప్రాముఖ్యసమస్యగ నొనరిం చుచున్నవి. భారతదేశార్థికాభివృద్ధి పెట్టుబడిదార్ల చెడుపలుకుబడివల్ల వెనుకాడుచున్నది. ప్రస్తుతముగల పెట్టుబడిసదుపాయములపై నాధార పడియున్నఉత్పాదకశక్తి నభివృద్ధిజేసినంత మాత్రమున, ఆర్థికసమస్య

గోవిందాచార్యులుగారు వివరించిన వివిధసూచనలు ఆచరణ యోగ్యమైనవిగ నుండుటయే ఈ పుస్తకమునకుగల యొక ప్రాముఖ్య లక్షణము. కేరలుమార్క్సుగారి సిద్ధాంతముప్రకారము పెట్టుబడిదార్లపై యమితమగు పన్నును విధించుటగాని, హెన్రీజార్జిగారి సిద్ధాంతముప్రకారము భూమికామందులపై అపారమగు పన్నును విధించుటగాని, ఆచార్యులవారికి నచ్చలేదు. వ్యక్తిస్వాతంత్ర్యముతో వ్యవహరించుటగాని, సంపూర్ణస్వాతంత్ర్యముతో కూడిన స్పర్థగాని భారతదేశ సంతతార్థికాభివృద్ధి కనువగు మార్గములని ఆచార్యులవారు నమ్ముటలేదు. జర్మనీదేశమునందు గల జాతీయ సాంఘికవాదుల ప్రభుత్వతత్వముతో చాలవఱకు ఆచార్యులవారేకీభవింతురు. ప్రభుత్వమే నిర్ణీతనిర్మాణకార్యక్రమముతో ఆర్థికాభివృద్ధికి కృషి నొనరింపవలెనని ఆచార్యులవారి తలంపు.

31-11-34,
విశాఖపట్టణము.

బసవర్సు రామచంద్రరావు.

# ఆంధ్రప్రముఖుల అభిప్రాయములు

SJT. MAMIDIPUDI VENKATARANGAYYA GARU, M.A.

*Reader in the Department of Politics, Andhra University.*

VIZAGPATAM, 10—11—34.

*Dear Sir,*

With the limited time at my disposal, I could go through only portions of your treatise on "Indian Economic History." It is the first treatise of its kind in Telugu and it is mainly on this score that I welcome it. In spite of the efforts that are now being made to enrich Telugu Literature with books on "Knowledge Giving Subjects" as distinguished from books of mere literary beauty we do not find much real development in this direction. *But the public anxious to obtain acquaintance with the current economic, social and political problems is increasing by leaps and bounds. A good deal has to be done to satisfy that public and your trestise fulfils this purpose to an admirable degree.*

There is one difficulty in writing such a book. There are many technical terms for which there are no exact equivalents in the Telugu Language. If one takes the trouble to go through our ancient books on "Artha Sastra" and "Dharma Sastra" it will not be difficult to get some correct terms at least; but very few are in a position to do this. Most of our research scholars in Politics, Economics etc., are ignorant of Sanskrit and this makes them think that there is nothing worth studying in Sanskrit Literature which will throw light on the subjects of their research. Their knowledge of Telugu also is not much better. You have not suffered from these handicaps and. moreover, *your intimate contact with the ordinary populace has enabled you to discover the usage of many terms which may be safely regarded*

*as equivalents of corresponding terms in English.* To every chapter you have appended a list of such important terms. *I hope that those who propose to write in future on these economic subjects will go carefully through your treatise and try as far as possible to use in their books the terms you have used in yours so that a standardised terminology might come into existence.*

The other difficulty experienced by most Telugu writers on subjects like these is in making themselves intelligible to the generality of readers. They forget that they are writing for the ordinary reader and not for a body of learned scholars; and the result is that very few are in a position to understand them. You have successfully overcome this difficulty, *As your object seems to be to have as large a circle of readers as possible I find that you have taken special pains to write in easy intelligible and at the same time vigorous Telugu. No person of average intelligence who thinks a little on what he reads will have any reason to complain that he is unable to follow the course of your argument.* From another standpoint also your book is important. The question of making Telugu the medium of instruction in schools and Universities has been engaging the attention of educationists for several years. The lack of courage of conviction among our readers is the real obstacle in the way of the solution of this question. But at the same time it is pointed out that the Telugu Language has not developed to the extent required to enable it to become a suitable vehicle of modern thought. *Your book disproves the above contention. Currency, Banking, Public Finance, Exchange, International Trade are highly technical subjects. You have been able to express your ideas in appropriate language. Your book is a testimony to the flexibility and the richness of the Telugu Language.* It is only a bad workman that complains of his tools. A skilled author like you with real command over the language finds no difficulty whatever in using it for any purpose that is desirable and necessary. *I hope that the publication of your book will give an impetus to the "Vernacularisation" movement especially in the Andhra country.*

The intrinsic merit of a treatise like yours is to be judged with reference mainly to two principles (1) the extent to which

all the available materials have been studied and (2) the use made of the study. *I believe that a substantial portion of the materials have been made use of by you, especially the material dealing with the more recent times.* Your bibliography if you care to include it in your book is bound to be lengthy, The foot-notes in your treatise, the statistical tables in it show clearly that you consulted the voluminous reports on Agriculture, Co-operation, Banking, Currency, Tariffs etc., issued from time to time under the auspices of the Government. It is not an interesting piece of work to go through these dull reports; there is nothing attractive about their style or mode of writing. It required extraordinary patience for one to read them; and your efforts in this direction are indeed praiseworthy. Besides the official reports you consulted books written by eminent Indians Publicists, Politicains and Economists and you also made use of the publications of the Indian National Congress and other similar public organisations. Your materials, therefore, are of a varied and diverse character and *one who goes through your book will be struck by the large volume of original sources that are available for a real study of the economic history of India.* I trust that some at least among the readers of your book will be stimulated to go direct to these sources so that they might check your conclusions with their own.

There is bound to be difference of opinion in regard to the inferences you have drawn from the materials studied. There is the appalling poverty of the masses of our countrymen. There can be no denial of this from any responsible quarter. Though poverty is in the main an economic fact the causes of it are not all of them economic. It is the result of the interaction of social, economic, religious political and geographical conditions. It is not an easy thing to isolate the purely economic or the purely political phenomena and trace their effect on the poverty or the welfare of the people. You have given expression chiefly to the views held by the nationalist section of our countrymen, a section represented by such sincere patriots like Dadabhai Naoroji and Gokhale in the earlier generation and Mahatma Gandhi and Jawaharlal Nehru at present. Every phase of our public life is in the stage of controversy to-day. Unbiassed opinions are not possible to be formed. Many of your readers will naturally be

షయందు గల యీయజ్ఞానమే తమ పరిశోధనలయం దపారసహాయ కారిగ నుండగల సంస్కృతభాషయందు చదువదగిన దేమియు లేదని వారు తలంచుటకు కారణము.

అట్టివారికి ఆంధ్రభాషాజ్ఞానముగూడ అంతమాత్రమే. మీరన్ననో ఇట్టిప్రతిబంధకములు కలుగలేదు. అంతేకాక ప్రజాసామాన్యముతో మీరు కలసిమెలసి తిరుగుట కలవాటుపడినవారగుటచే ఆంగ్లేయశబ్దములకు సరియగు పర్యాయపదములని ధైర్యముతో చెప్పగలిగిన అనేక సాంకేతికపదముల యుపయోగమును మీరు కనిపెట్టగలిగిరి.

అట్టి ముఖ్యమగు సాంకేతికపదముల జాబితాను ప్రతిఅధ్యాయమునకును మొట్టమొదట మీరొసంగియున్నారు. ఇంతటితోపంచియు ఆర్థికసమస్యలపై వ్రాయదలంచినవారు మీ గ్రంథమును శ్రద్ధతోజదివి మీరు, మీ గ్రంథమునం దేసాంకేతికపదముల నుపయోగించిరో ఆపదములనే వారుగూడ తమపుస్తకములయం దుపయోగించెదరని యూహించుచున్నాను. అందువలన ఏకపదనిర్వచనము వాడుకలోనికి రాగలదు.

ఇట్టివిషయములపై గ్రంథములను వ్రాయుటలో చాలమంచిది ఆంధ్రగ్రంథకర్తలు తమ వ్రాతలను సామాన్యపాఠకుల కందరకును తెలియచేయజాలని మరొకకష్టమునకు గురియగుచున్నారు. పండితబృందములకేకాక, పామరులకుగూడ తెలియుటకొఱకే వ్రాయుచున్నామనెడి సంగతిని వారు మరచిపోవుచున్నారు. ఈకారణములవల్ల చాల కొలదిమందిమాత్రమే అట్టివారిపుస్తకముల నర్థముజేసికొనగలుగుచున్నారు. మీరన్ననో, జయప్రదముగ నీకష్టమును దాటగలిగిరి. సాధ్యమగునంతవఱ కందఱ కర్థమగునట్లు వ్రాయుటయే మీయుద్దే

శ్యమని తోచుచున్నది. అందువల్లనే సజీవమగు సులభశైలిలో అంద
అకు నర్థమగునటుల వ్రాయుటకై మీరు ప్రత్యేక శ్రమపడినట్లు తోచుచు
న్నది. సామాన్యపు తెలివితేటలుగలవారెవరుగాని, వారు చదువుచున్న
దేమియో గ్రహింపదలచినవారు మీరు వ్రాసినవిషయము లర్థము
కాలేదని చెప్పుటకు సావకాశములేదు.

మఱియొకవిధముగగూడ మీపుస్తకము ముఖ్యమైనది. తెలు
గుభాషయందే, పాఠశాలలయందును, విశ్వవిద్యాలయములయందును,
విద్య గఱపవలయు ననెడి సమస్య అనేకసంవత్సరములనుండి విద్యాభి
మానుల దృక్పథము నాకర్షించియున్నది. మన నాయకులకు, తమ
విశ్వాసముల నాచరణయందుంచగల ధైర్యము లేకపోవుటయే నేటి
వఱకీసమస్య పరిష్కరింపబడకపోవుటకు గల ముఖ్యప్రతిబంధకము.
కాని, ఆధునికభావప్రబోధమున కుపకరణముగ నుండదగినంతగ, ఆం
ధ్రభాష యభివృద్ధి జెందలేదని వారు వేలెత్తి చూపుచున్నారు. కాని
మీపుస్తక మీవాదము నిరాధారమని రుజువొనరించుచున్నది. నాణె
ములచెలామణివిధానమును, బ్యాంకులును, ప్రభుత్వాదాయవ్యయము
లును, మాఱకమును, అంతర్జాతీయవర్తకమును, విశేషముగు సాంకే
తికవిషయములు. అయినను, మీరు మీ భావములను సరియగుభా
షలో ప్రకటింపగలిగిరి. ఆంధ్రభాషయొక్క మృదుత్వమునకును (నయ
గుణమునకు) సమృద్ధికిని మీపుస్తకమొక యోగ్యతాపత్రము. ఆడ
లేకపోతే మాత్రమే మద్దెల ఓటిది.

భాషను సంపూర్ణస్వాధీనమునం దుంచుకొన్న నైపుణ్యముగల
మీవంటి గ్రంథకర్త, అవసరమును, వాంఛితమును అగు నేపనికైనను
అట్టిభాషను వినియోగించుకొనుటయం దెట్టికష్టముగాని పొందదు.
దేశభాషలలో చదువుచెప్పవలెనను ఉద్యమమునకు, ముఖ్యముగ ఆం

ముల ననుసరించి, ఎవరైనను వేరువిధమగు నిర్ణయములను గావింప సమకట్టినచో, అట్లొనరించుట కవకాశము గలదు.

ఈతరుణమును గైకొని మీ రీవిషయముపై మీగ్రంథమును జయప్రదముగ పూర్తిచేయగలిగినందులకుమిమ్మభినందించుచున్నాను. విద్యావ్యాసంగము నింకను గావించుటకును, ఆర్థిక రాజకీయ విషయములపై అనేక ఇతరపుస్తకములను వ్రాసి, ఆంధ్రభాష నైశ్వర్యవంతముగ నొనరించుటకును మీరు తీరికయు, సావకాశమును గలిగించు కొందురని యాశించుచున్నాను.

చిత్తగింపుడు.

విశాఖపట్టణము
10-11-34

మామిడిపూడి వెంకటరంగయ్య,
ఎం. ఏ.,

## DEWAN BAHADUR MOCHERLA RAMACHANDRA RAO PANTULU GARU.

I have not been able to carefully go through the exhaustive work of Mr. A. Govindacharya, on Indian Economics; but, a cursory glance through portions of the work shows that the author has taken great pains in dealing with the bigger Economic Problems of India, which have been engaging public attention for some years. One feature of the publication is that Mr. Govindachary has taken care to append to each chapter a glossary of terms showing the English equivalents of the many of the expressions used by him in Telugu. The public has not as yet become familiar with the phraseology of economic terms in Telugu; and without a glossary an intelligible study of the work would not have been possible. There are as yet no works worth mentioning in Telugu on Indian Economics and Mr. Govindachary must be congratulated on making a serious effort in creating literatue on Economics in Telugu. We may not agree with every thing on every subject dealth with by Mr. Govindachary. It is however clear from the numerous references that he has given, *that he has made an effort to place before the public both sides of the problem. I have no doubt that the Andhra public would find Mr. Govindachary's book very useful in acquiring a fairly accurate knowledge of economic problems.*

*I hope the College and School Libraries as well as other public Libraries and Co-operative Societies and Banks will place this book in their Libraries.* I wish Mr. Govindachary every success.

MADRAS.
17—11—1934.

M. RAMACHANDRA RAO.

## భూపతిరాజు వెంకటపతిరాజుగారు, సి. ఐ. ఇ.

భారతదేశార్థికచరిత్ర అనే గ్రంథము బ్రహ్మశ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులువారు రచించినది గుణాగుణ విమర్శనకై నా కొసగబడెను. సంతోషపూర్వకముగ చదివి చూచితిని. ఈ కాలములో ఆంధ్రభాషలో ఇంతచక్కని గ్రంథము మృదుమధురశైలిని, దేశాభ్యుదయము కోరు ప్రతిమనుజునకు సుబోధకమగునటుల విపులముగ ఆర్థికవిషయమై వ్రాయబడినది మరొకటిలేదు.

2148 పుటలు గలిగియుండి దేశాభ్యున్నతియు, జనసంఖ్య పెరుగుచుండుటయు, సంఘనిర్మాణ భేదాభేదములు, ఆరోగ్యవిషయము, జననమరణములు, ఆర్థికాభివృద్ధియు, క్షీణించుటయు, వ్యవసాయము, పంటలు, నీటివసతుల లోపాలోపములు, రయితులు, ప్రబల ఋణాక్రాంతులగుట, అందలికారణములు, సహకారోద్యమమువలన గలిగిన లాభములు, లోపములు, సరకులు సులభముగ విక్రయస్థానములకు పంపుటకు సౌకర్యములు, పరిశ్రమలు నానాటికి క్షీణించిన కారణములు, తిరిగి పరిశ్రమాభివృద్ధి గావించుచున్న విధానములు, కార్మికుల వేతనములు, వారలస్థితిగతులు, భారత వాణిజ్యసంపద, కాలానుసరణముగ గలిగిన మార్పులు, నాణెముల విలువ ప్రభుత్వమువారు మార్చుచుండుటయు, అందువలన ప్రజలకు కలిగిన లాభనష్టములు, ధరలు హెచ్చుచుండుటయు క్రమముగ తగ్గుచుండుటయు, అందువలన ప్రజలకుకలిగిన లాభము, రయితులుపొందిన నష్టము, బ్యాంకులు, అందువలన ప్రజలకు వర్తకులకు కలుగుచున్నలాభములు, అందలి మేలుకీళ్లు, కావలయు మార్పువిధానములు, ప్రభుత్వపు ఆదాయవ్యయ నిరూపణము, గత 20సంవత్సరములలో త్రిగుణితముగా హెచ్చిన

కారణము, అందువలన దేశమునకు గలిగిన లాభనష్టములు, ప్రజలకు కలుగుచున్న యిక్కట్లు, ప్రజలరాబడియు, ఆదాయవ్యయములు నురాను బీదస్థితినొందుచుండుటయు, ఆర్థికస్థితిగతులు, దేశమున కలుగుచున్న క్షామములు, వాటినివారణమార్గములు, ప్రజలుపొందుచున్న బాధలు, దారిద్ర్యపీడితులయి వేనవేలు కృశించుచుండుటయు; విద్యావ్యాప్తి, అందువలన కలిగిన లాభము, పలువురు నిరుద్యోగులయి యుండుటచే దేశమునకు సంభవించుచున్న అరిష్టములు, విద్యావిధానమున కలుగవలసిన మార్పులు, ప్రజలు చేయదగిన విషయములు, ఆర్థికాభివృద్ధికి కావలయు విధానములు మొదలగు పెక్కువిషయములు సాధారణజనులకు సహబోధ యగునటుల సులభశైలిని వ్రాసి దేశమునకు మహోపకారము గావించిరి. అచ్చటచ్చట వారిఅభిప్రాయములతో భేదముండవచ్చును. గాని మొత్తముమీద ఇట్టియుద్గ్రంథము ప్రతిమనుజుడును చదివితీరవలయును. ఇది చదువుటకు పదిదినములు పట్టునని చెప్పినచో పుస్తకసంపాదనకు, ఉచితరీతినివ్రాయుటకు, పదివందలదినములు పట్టుననుట నిస్సందేహము. వారికిగల స్వాస్త్యము దేశసేవకై ధారబోసి ఇట్టి మహాగ్రంథమును రచింపబూనుటయు అనారోగ్యస్థితిలో నుండియు పట్టువిడువక గ్రంథము పూర్తిచేయుటచే ఈ మహాశయునకు ఆంధ్రులేమి దేశాభిమానులేమి తోడ్పడుట కర్తవ్యము. పదివేలు వెచ్చించినగాని వేయి పదిహేను వందల ప్రతులు తయారుకానేరవు. ధర పదిరూపాయలు ఉంచుట సమంజసము. ప్రతి గ్రామమున ప్రతిపాఠశాలయందు ప్రతిభాండాగారమునందు ఉంచుట యేగాక దేశాభిమానముగల ప్రతివారును గ్రంథమును సంపాదించుట యేగాక దేశవ్యాప్తికయి పాటుపడుట సమంజసము. ఇతరదేశములతో

మన దేశముయొక్క ఆర్థికస్థితి సరిపోల్చినచో మన పైన్యస్థితికనుగొన వచ్చును.

పం|డెండుసంవత్సరములక్రిందట భూచక్రపర్యటన చేసినప్పుడు నాస్వానుభవమునుబట్టి నేను చెప్పగలను. మన దేశముయొక్క క్షీణ దశ ప్రపంచమున నాగరికతగల యేదేశమున లేదు. పూర్వము ఔన్నత్యదశలో నున్న స్థితియు నానా దేశములు ధనముతో తులతూగుచున్న స్థితిలో భారతదేశము దారిద్ర్యదేవతకు యెటులాలవాలమయినదో గమనించి మంచి స్థితికి రాబట్టుటకు ప్రయత్నించుట ప్రతి మనుజునికి ధర్మము. దేశమునకు మహోపకారమును గ్రంథరచనమున చేసిన గోవిందాచార్యులవారికి భగవంతుడు సదా తోడ్పడుటయే గాక భారతదేశాభిమానులందరు చేయూత నొసంగెదరని నాప్రార్థన.

విశాఖపట్టణము,
25-11-1934.

భూపతి రాజు వెంకటపతి రాజు.

Dr V. SHIVARAM, M.A., Ph.D. (Harward) F.R.His S.
*Head of the Department of Political Seicnce,*
*Lucknow University.*

*Dear Mr. Govindachary,*

Many thanks for your letter of 10th instant and the two Volumes of your thorough and exhaustive book on "Indian Economics". Due to the serious illness of my father, I have not had time to go through the whole work, but so far as I read, I have gained the impression that *it is a scholarly work with a thorough presentation of the subject from all aspects, well documented and patriotic in out look and inspiring and stimulating to the average reader.* Such books in Indian Vernaculars are badly needed and I congratulate you as being a pioneer in the field and as a benefactor of the Telugu Language and literature. *I am sure the Andhra public cannot but be grateful to you for this splendid service both to the cause of Economics and literature".*

With kind regards and best wishes for the success of your monumental work.

Lucknow,
19-11-34

Yours Sincerely,
V. SHIVARAM.

## ANDHRA BHISHMA NYAPATI SUBBA RAU PANTULU GARU

*Ex-member Madras and Imperial Legislative Councils.*

I must express my appreciation nay, my admiration of the labourious research and successful attempt of Mr. A. Govindachary in bringing out an exhastive treatise on the Economic History of India in two bulky volumes of more than a thousand pages each. *It is needless to say that this is the only work of the kind in Telugu dealing with the economic problems of India in all its bearings with an historic back ground and its usefulness to the non-English knowing public cannot be over emphasised. It is written in easy and readable style and ought to be in Libraries and Reading Rooms and also in the hands of every Andhra interested in economic upliftment of our country.* As the subject is very important I hope the author will before long bring out an abridged edition of this work to suit all classes and conditions of people. I wish this attempt every success, and hope that the author will get all encouragement at the hands of the public to enable him to pursue his activities in this line of research for the enlightement and betterment of the Andhras.

Rajahmundry,
6—12—1934.

N. SUBBA RAU.

ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావుపంతులుగారు

[మదరాసు శాసనసభ, ఇంపీరియలు కౌన్సిళ్లలో చాలకాలము సభ్యులుగ నుండిరి.]

ఒక్కసంపుటము వేయి పేజీలకు పైగా గలిగియుండిన రెండు పెద్దసంపుటములలో భారతదేశ ఆర్థికచరిత్రనుగుఱించి సంపూర్ణముగ వ్రాయుటలో శ్రీయుత ఆ. గోవిందాచార్యులుగారు గావించిన విశేషమైన పరిశోధనకును, విజయవంతమైన కృషికిని, నా ఆమోదమును-కాదు-నా ప్రశంసను తెలుపవలసియున్నది. ఆర్థికసమస్యలను గుఱించి సవిస్తరముగ చారిత్రకాధారములతో, వ్రాయబడిన ఇట్టి గ్రంథము తెలుగుభాషయం దిదియేయని వేరుగ జెప్పనవసరములేదు. ఇంగ్లీషు రానివారికి ఈ గ్రంథము సుహోపయోగముగ నుండునని నొక్కి-చెప్పనవసరములేదు. ఈ గ్రంథము తేటతెనుగున అందఱకును అర్థమగునటుల వ్రాయబడినది. ప్రతిగ్రంథాలయమునందునను పఠనమందిరమునందునను ఈపుస్తకము నుంచుటయేగాక మనదేశము ఆర్థికముగ నభివృద్ధి కావలెనని యభిలషించు ప్రతి ఆంధ్రునిచేతియందున నీ గ్రంథముండవలయును. ఈసమస్య బహు ప్రాముఖ్యమైనదిగనుక అన్నితరగతుల ప్రజలకు అన్నిపరిస్థితులయందు నుపయోగకరముగ నుండుటకై, ఈ గ్రంథమును సంక్షిప్తపఱచి మఱియొక చిన్న గ్రంథమును గూడ, ఈ గ్రంథకర్తగారు వ్రాసెదరని ఆశించుచున్నాను. గ్రంథకర్తగారు గావించిన ఈప్రయత్నము విజయవంతముగ నుండుననియు, ఆంధ్రులయభివృద్ధికిని విజ్ఞానమునకును వలయునట్టి పరిశోధనములొనరించుటకు కావలసిన సమస్తసహాయమును నీగ్రంథకర్తగారికిఆంధ్రలోకమొసంగుననియు, ఆశించుచున్నాను.

6-12-1934
రాజమండ్రి.

న్యాపతి సుబ్బారావు.

## శ్రీయుత అయ్యదేవర కాళేశ్వరరావుగారు.
(ఫ్రెంచిస్వాతంత్ర్య విజయము, అమెరికా సంయుక్తరాష్ట్రములు, తురుష్కసామ్రాజ్యం మొదలగు గ్రంథములను రచించిరి.)

శ్రీ ఆత్మకూరి గోవిందాచార్యులుగారిని ఎరుగనివారు ఆంధ్ర దేశమున లేరు. రాజకీయ నాయకులుగనేగాక భాషాకోవిదులుగను, పత్రికాసంపాదకులుగను కూడ సుప్రసిద్ధులైయున్నారు. వారిపుడు రచించిన "భారతదేశ ఆర్థికచరిత్ర" వారుచేయుచున్న మహత్తరమగు దేశసేవకు వన్నెదెచ్చినది. దానిని సమగ్రముగను, మృదుమధురముగను రచించి ఆంధ్రభాషయందుగల గొప్పకొరతను తీర్చిరి.

మన మిపుడు ఆర్థికయుగమునందు నివసించుచున్నాము. గడచిన రెండువందలయేండ్లనుండియు మానవరాజకీయచరిత్ర కేవలము ఆర్థికచరిత్రయైనది. పూర్వకాలపు సామ్రాజ్యములు శూరులగు చక్రవర్తులచేతను సైనికయోధులచేతను రాజ్యాధికారము వైభవములకొరకు స్థాపింపబడుచు వచ్చినవి. నవీనసామ్రాజ్యము లట్లుగాక కొన్ని జాతుల ద్రవ్యలాభములకొరకు వారి రాజకీయధురంధరులచే నిర్మింపబడినవి.

నవీనప్రపంచమునందు జరుగుచున్న యుద్ధము లన్నియు నీసామ్రాజ్యస్థాపనములకొరకును సామ్రాజ్యస్థాపనలతో కలుగు పోటీల వలనను జరుగుచున్నవి. సామ్రాజ్యాధీశులు తమతమ దేశముల ఆర్థికలాభముల కనువగు ప్రభుత్వ పద్ధతులనే తమ స్వాధీనమునకు వచ్చిన దేశముల పై స్థాపించిరి.

సామ్రాజ్యతత్వమునకు ప్రధానస్థానమైన ఇంగ్లాండుచే భరతవర్షమునందు ఆంగ్లేయసామ్రాజ్యము స్థాపించబడి పాలించబడుచున్నది. ఆంగ్లేయరాజ్యాంగవేత్తయగు జోసెఫ్ ఛేంబర్లేనుగారు "సామ్రా

జ్య మనగ వర్తకము. మనకు ఇదివర కున్నట్టియు, ముం దుండబోవు నట్టియు ఖాతాదారులలో కెల్ల ప్రధానమైనట్టియు, విలువగలిగినట్టియు దేశము భరతవర్షమైయున్నది" అని చెప్పియున్నాడు.

అందువలన ఆర్థికస్వతంత్రములేని రాజకీయస్వాతంత్రము నిరుపయోగమైనది. మన దేశమున కివ్వదలచిన స్వల్పరాజ్యసంస్కరణములలో ఆంగ్లేయవర్తకలాభములకు ఆంగ్లేయపెట్టుబడికిని ఏమాత్రము లోపము వాటిల్లకుండ నందుకు రక్షణములను గట్టిగ నుంచెదమని జాయింటుకమిటీ నివేదికలో వ్రాయబడియున్నది. మన పరిశ్రమాభివృద్ధికొరకును, దేశదరిద్రము పోవుటకును పూర్ణస్వరాజ్య మెంతయావశ్యకమో శ్రీ గోవిందాచార్యులగారి గ్రంథముచదివిన సుబోధకమగును. ప్రపంచములోని అన్ని దేశములలోవలెనే మన దేశముయొక్కయు ప్రధానసమస్య ఆర్థికమైయున్నది. ఎంతయో కష్టపడి ఎన్నిగ్రంథములనో పరిశీలించి మన దేశముయొక్క ఆర్థికసమస్య లన్నిటిని కడువిపులముగ చర్చించి సామాన్యజనులకు బాగుగ బోధపడురీతిని మాతృభాషయం దీయార్థికచరిత్రను వ్రాసినందుకు శ్రీ ఆచార్యులవారు ఆంధ్రదేశముయొక్క కృతజ్ఞత కెంతయు పాత్రులు. విషయములు పూర్తిగను విపులముగను వ్రాసియుండుటవలన గ్రంథము చాల పెద్దదయిన మాట వాస్తవమే. ఇంత పెద్దగ్రంథమునకు స్వల్పఖరీదే నిర్ణయమైనది. ప్రతిఆంధ్రుడును ఈగ్రంథమును చదివితీరవలెను. ముఖ్యముగ ప్రతిగ్రంథాలయమువారును దీనిని తెప్పించుకొని తీరవలెను.

విజయవాడ,
6-12-1934.

అయ్యదేవర కాళేశ్వరరావు.

# గ్రంథకర్త విజ్ఞప్తి.

భారతదేశ ఆర్థిక చరిత్ర యనగా నేమి?

ఆర్థికసిద్ధాంతము లన్ని దేశముల కొక్కరీతిగ వర్తింపవు. "ధనోత్పత్తి వినియోగములకును, వినిమయవిభాగములకును, గల యాదర్శమును ప్రేరేపణయు, సీమయందునను, హిందూదేశమునందునను గూడ, నొక్కరీతిగనే యుండు"ననియు నందువలన ఆర్థికసిద్ధాంతము లన్ని దేశములకు సమానముగనే వర్తించుననియు గొందఱి వాదము. సర్వకాల సమస్తదేశములయందున నొక్కరీతిగ వర్తించుటకు ఆర్థికసిద్ధాంతములు నిశ్చలమగు హిమవత్పర్వతమువంటి పర్వతములుగావు. మహోన్నత పర్వతరాజములకు గూడ వృద్ధిక్షయములు గలవు. ఆయామానవచిత్తవృత్తుల సంస్కరణము ననుసరించియు, ఆయాదేశముల నైసర్గిక లక్షణముల ననుసరించియు, ఆయా కాలముల అవసర అనవసరముల ననుసరించియు, ఆయా దేశముల రాజకీయాధికారముల ననుసరించియు, ఆర్థికపరిణామము గలుగుచుండును. ఆర్థికపరిణామావస్థల ననుసరించి ఆర్థికసిద్ధాంతములు గూడ రూపభేదమును బొందకమానవు. ఆర్థికసిద్ధాంతములు నిర్ణీతములనియు, సంతత మొక్క రీతిగ వర్తించుననియు, చెప్పుట సక్రమవాదముగాదని విప్లవానంతరపు రష్యాదేశపు ఆర్థికవ్యవస్థయు, నేటిఆర్థిక దుస్థితియందలి ప్రపంచక్షోభయుగూడ, ఋజువొనరించుచున్నవి.

ప్రజల మానసికవృత్తుల ననుసరించియు, దేశనైసర్గిక, రాజకీయ, కాలమాన పాత్రముల ననుసరించియు నేదేశమున కాదేశమే

ఆర్థికసూత్రముల నిర్వచించుకొనుచుండవలయును. నీమకు వర్తించిన ఆర్థికసూత్రములే భారతికిగూడ వర్తించునని తలంచుట "కాననివాని నూతగొని కాననివాడు విచక్షువస్తువుల్ గానగ జూచుభంగి"యే యగును. ఆధ్యాత్మికతత్త్వమునకు భారతభూమియే జన్మభూమి. ఇచ్చటనే పుట్టి పెరిగి యేపుగాంచినది. నేడీ యాధ్యాత్మిక తత్త్వ మొకచోట బీటలు వేసినను, మరొకచోట మాలిన్యమై మాసిపోయినను, వేరొక చోట కప్పబడియున్నను, ఇంకను మిళుకుమిళుకు మనుచు నేదోయొక మూల ప్రకాశించుచునేయున్నది. ఐహికజీవిత సౌఖ్యము సర్వతో ముఖముగ నభివృద్ధియొనరించుకొనుచు, నీ మిళుకుమిళుకు మనుచు గ్రుంకుచున్న దేశీయ ఆధ్యాత్మిక జ్యోతిని దేదీప్యమాన మొనరించు టయే భారతీయులవిధి. ఐహికసుఖాభివృద్ధివలన ఆముష్మికజీవిత వినాశన మొనరించుకొనుట భారతీయులకర్తవ్యము గాదు.

ఐహికాముష్మికసుఖ సమన్వయమున హిందూదేశ సర్వవిధ పరిస్థితులను భారతీయ మానసిక పరిణామావస్థలతో సమన్వయ మొ నరించి భారతీయార్థికాభివృద్ధి కనువగు మార్గముల నిరూపించుకొనుట యే భారతీయుల ముఖ్యధర్మము. ఆధ్యాత్మిక వ్యక్తిత్వమును గోల్పో వక-ఆధునికప్రపంచమునందు ఆర్థికముగ నగ్రస్థానము వహించి ఇతర దేశములతోపాటు ఐహికసుఖసంపదలయందు సమానస్థితి నార్జించుట యే భారతీయుల నేటికర్తవ్యము.

ఈ కర్తవ్య నిర్ణయమునకు 'తోడ్పడవలెనను సంకల్పమే ఈ గ్రంథరచనకు గారణము. ఈ గ్రంథమునందలి యంశములను మూడు విధములుగ విభజింపదగును. 1. భూతకాల భారతదేశార్థిక చరిత్ర. 2. వర్తమానకాల భారతదేశార్థిక పరిణామము. 3. భవిష్యత్కాల మునందు భారతీ యవలంబింపదగు ఆర్థికనీతివిచారణ. ఈ విషయ చర్చనే "భారతదేశార్థిక చరిత్ర" యని నిర్వచింప దగును. ఈ విష

యములను జర్చించుటయే యీ గ్రంథమునకు "భారతదేశము-ఆర్థిక చరిత్ర" యని పేరిడుటకు కారణము. భూతకాల భారతదేశార్థిక చరిత్రను వ్రాయుటలో గతించినదానిని రాపాడించుటకు బూనలేదు. వర్తమానవిషయ పరిజ్ఞానమున కవసరమగునంతవఱకే గతచరిత్ర. ఆయా అధ్యాయములయందు క్లుప్తముగ వ్రాయబడెను. భవిష్యత్కార్యక్రమ నిరూపణమునకు వర్తమానస్థితి నెఱుంగుట యత్యవసర. మగుటచే 1858 వ సంవత్సరమునుండియు వివరముగ వ్రాయబడెను. కర్తవ్యనిరూపణమున బహుజనాంగీకారముగ నందు సూచనల.గావించుటకే విశేషకృషి చేయబడెను.

ఆంధ్రమహాజనులకు ఆంధ్రమున ప్రస్తుతభారతదేశార్థికస్థితిని సవిస్తరముగ మనవి. దెలుపగల గ్రంథమొక్కటియు లేదు. అర్థశాస్త్రపరిజ్ఞానబోధకములగు గ్రంథము లాంధ్రమున నాలుగు గలవు. కాని ఆర్థికోత్పత్తి సాధనోపకరణముల గుఱించియు - వాటి పరిణామావస్థను గుఱించియు, నేటివఱ కెవరును వ్రాసియుండలేదు.

1920 సంవత్సరమునుండియు భారతీయార్థిక స్థితిని గుఱించిన గ్రంథమును వ్రాయవలెనను నీప్సితముగలదు. కాని ఆనాటినుండియు ఝంఝూమారుతమువలె ఆసేతు హిమాచల పర్యంతము వీచుచున్న జాతీయోద్యమమున తన్మయుడనై తీఱిక చిక్కించుకొనజాలనైతిని. 1921 వ సంవత్సరమున కడలూరుజైలునందు రాజకీయఖయిదీగనున్నకాలమునం దీవిషయమై కొంతకృషి సల్పితిని. హృద్రోగపీడితుడనై మరణావస్థయందున్నతరుణమున జైలునుండి విడుదల కాబడుటచే నాటి వ్రాతప్రతి (కొంతవఱకు వ్రాసినది) జైయిలునందే కోల్పోవలసివచ్చెను. పిమ్మట ఆరోగ్యమును సాధించుప్రయత్నమునం దీపనిని జేయజాలకపోతిని.

1923 వ సంవత్సరమునుండియు "సత్యాగ్రహి" పత్రికాసంపాదకత్వమునను, నిరంతర కాంగ్రెసు మహాసభా తీర్మానాచరణయందు

నను మునుగుచు దేలుచు నుండుటచే నీగ్రంథరచననుగుఱించి యోజిం చుటకైన తీఱిక గలుగలేదు.

1930 వ సంవత్సరమునందు విజృంభించిన ఉప్పుసత్యాగ్రహ జాతీయోద్యమమున రాయవేలూరు సెంట్రలు జయిలునందు విశ్రాం తిలభించినది. ఈసారి విడిఖయిదు వేయబడినది. "ఏ" తరగతియు నొస గబడెను. నిర్మలమనంబున గ్రంథము వ్రాయుటకును-విషయపరిశోధన మునకును నిదియే తరుణమని తలంచి ఈసంవత్సర విశ్రాంతికాలమునం దీగ్రంథరచనకు వలయుకృషి ముగింపఁగలనని యాశించితిని. ఆఱు మాసములు కృషి సల్పితిని. ఇంతలో నా సంకల్పమునకు వికల్పము సంభవించినది. హృద్రోగము తిరుగబెట్టినది. ప్రాణాపాయస్థితి దాపు రించినది. అనారోగ్య కారణమున మరల ప్రభుత్వమువారిచే జయిలు నుండి విడుదలచేయబడితిని. నాటనుండియు హృద్రోగపీడితుడనగుచు నీగ్రంథరచనకు వలయుకృషిని సంపూర్ణముగ ముగింపజాలనైతిని. రవంత హృద్రోగము వెనుకాడుచున్నదని భ్రమించునంతలో 1930వ సంవత్సరమున ప్రభుత్వమువారిచే నిలిపివేయబడిన సత్యాగ్రహి పత్రి కను పునరుద్ధరింపవలసి వచ్చెను. ఇంతలో మరల జాతీయోద్యమము ప్రారంభింపబడినది. 1923 జనవరి యందు కారాగృహవాసము లభిం చినది. ఈమారును విడిఖయిదును "ఏ" క్లాసును నొసగబడుటచే నీ గ్రంథవిషయకకృషిని పూర్తిజేయ గలనని యాశించితిని. కాని నా యాశ అడియాస యైనది. చరిత్ర చర్విత చరణమనునట్లు నా హృ ద్రోగముగూడ చర్వితచర్వణముగ తీవ్రస్వరూపమున విజృంభించినది. ప్రభుత్వమువారు హృద్రోగకారణమున విడుదలజేసిన ఆఱుమాస ములవఱకు నీగ్రంథమును గుఱించి తలంచుటకైన తగిన ఆరోగ్యము లభించలేదు. నన్నీహృద్రోగము జీవితపర్యంతము వీడునదికాదని విశ్వ సించి 1933 వ సంవత్సరం నవంబరు నుండియు నీగ్రంథమును వ్రాయుట

గృహిణి ప్రమాదకరమగు జబ్బుస్థితియం దున్నప్పుడుగూడ పరిశీలించి ప్రశంసనీయముగ నాకు దోడ్పడిరి.

విషయాను క్రమణిక.

శ్రీయుతులు బుద్ధిరాజు రాజభూషణరావుగారు, బి.ఎ., బి.ఎ., (ఏలూరు), సోమంచి లింగయ్యగారు, బి.ఎ., బి.ఎల్., (ఏలూరు) మొదటిసంపుటమునకును, ప్రొఫెసరు కిళాంబి రంగాచార్యులుగారు, ఎం. ఎ., బి. ఎల్., (విజయనగరం) రెండవసంపుటమునకును తమకార్యములను త్రోసిపుచ్చి కూడ విషయానుక్రమణికను తయారుజేసిపెట్టిరి.

వైద్యసహాయము

ఈగ్రంథమును వ్రాయుటకై గ్రంథములకొఱకు వివిధ పట్టణములు తిరుగాడవలసివచ్చినది. కొన్నితావుల నెలలకొలది కాపుర ముండవలసివచ్చినది. ఈశ్రమకు తఱుచు హృద్రోగము బయటపడుచుండెడిది. పలువుర వైద్యులసహాయమున హృద్రోగోపశమనము బొందుచుండెడివాడను. ఇందు మొదటివారు కీ॥ శే॥ డాక్టరు అహోబలరావునాయుడుగారు (బందరు). వీరు నిర్మలప్రేమతో మిత్రభావమున గావించిన వైద్యసహాయము నాకు చిరస్మరణీయము. ఆయుర్వేదాచార్య విజయసారథి ఆచార్యులుగారు (బందరు), ఆయుర్వేదాచార్య నరిసింహాచార్యులు గారు (రామమోహన ధర్మవైద్యశాలవైద్యులు (బెజవాడ), డాక్టరు కోకా నరసింహారావునాయుడుగారు (బందరు) డాక్టరు వల్లూరి నరిసింహారావుగారు, డాక్టరు వల్లూరి వెంకటరత్నంగారు డాక్టరు హా. వ. జోగయ్యశర్మగారు (ఏలూరు) ఆయుర్వేద డాక్టరు రంగాచార్యులుగారు (శ్రీకృష్ణా ఆయుర్వేదఫార్మసీ, ఏలూరు) అవసరమగునపుడెల్ల కడు నాదరణమున వైద్యసహాయ మొనరించి గ్రంథరచనకు తోడ్పడిరి.

డాక్టరు, బెండపూడి పేర్రాజుగారు, విశాఖపట్టణము.

ముఖ్యముగ డాక్టరు బెండపూడి పేరరాజుగారు [విశాఖపట్టణము] గావించిన సహాయ మనుపమానము. అమితప్రేమతోగూడినభక్తితో, మైత్రితోగూడిన గౌరవముతో, గతించిన నాలుగుసంవత్సరములనుండియు వీరొనరించిన ప్రోత్సాహసహాయములే ఈగ్రంథ

రచనము కొఱవడ కుండుటకును, ఈ గ్రంథము ముద్రింపబూనుటకును గూడ ముఖ్య కారణములు.

*ప్రేమాస్పదులు.*

ఈ గ్రంథరచనకు బూనిన గతించిన నాలుగుసంవత్సరములనుండియు నాకు దోడ్పడినవారిని స్మరించినపుడు శ్రీయుతులు వేపా వేంకటేశ్వర్లుగారు [విశాఖపట్టణము] కొండ సచ్చిదానందరాజు [గుండుగొలను, ఏలూరు తాలూకా] గారు, కొమ్మాజ్యోస్యుల గంగాధరరావుగారు [బి. ఎ., చీపురుపల్లి విశాఖపట్టణంజిల్లా] కలగర కృష్ణారావుగారు [ఏలూరు] గరికిపాటి జోగయ్యగారు [ఏలూరు] జోసెఫ్‌గారు [రామచంద్రజోగి, ఏలూరు] వీరిని స్మరింపకతీరదు. వీరందఱు గురుభావమున నాకొనరించిన యుపచారము నా జీవితపర్యంతము మరచిపోవజాలను. ఈ ప్రేమాస్పదులగు యువజనమిత్రుల యుపచారమే నాకు లభింపనియెడల ఈ గ్రంథమును ముగింపగలిగి యుండెడివాడనుగాను.

*అభిప్రాయము లొసంగిన ఆంధ్రప్రముఖులు.*

ఎంతయో శ్రమపడినగాని తీరిక లభించనంతటిపని గలిగియుండియు నాకోరికను మన్నించి, డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు తొలిపలుకును, డాక్టరు బసవర్సు రామచంద్రరావుగారు పీఠికను వ్రాసిరి. ఇట్లే ఇతర ఆంధ్రప్రముఖులుగూడ, తీరిక జేసికొని తమ యభిప్రాయముల దయతో నొసగిరి.

ఈవిధముగ వివిధరీతుల నాకు తోడ్పడిన పెద్దలందఱకు నావందనముల నర్పించుచున్నాను. మిత్రులకు కృతజ్ఞతను దెలుపుచున్నాను. పిన్నలకు ఆశీర్వచనముల నందజేయుచున్నాను. ఈ గ్రంథమును తమ మండలిపక్షమున ప్రకటించుట కంగీకరించిన విజ్ఞానచంద్రికామండలి వారికి నేనెంతయు కృతజ్ఞుడను.

*రాజన్ ప్రెస్సు.*

ఆంధ్రమునం దిట్టి పెద్దపుస్తకములను శాస్త్రవిషయక పుస్తకములను ముద్రించుటకింకను ముద్రాక్షరశాలలు అలవాటుపడలేదు. అయినను రాజమండ్రి రాజన్ ఎలెక్ట్రిక్ ప్రెస్సు

వారు శ్రోత్తయనక, కష్టమనక, సంతోషపూర్వకముగ లాభాలాభము లనుమాత్రమే గమనింపక, ఎక్కుడుతప్పులు లేకుండగ, సుందరముగ నీపుస్తకమును ముద్రించిరి. ఇందులకు రాజా ప్రెస్ ప్రొప్రయిటరుగా రగు శ్రీయుత చిత్రపు నాగరాజు (బి. ఏ.) గారెంతయు ప్రశంసాపాత్రులు.

విసుగుజెందక స్నత్యమును మాత్రమే పాటించి అచ్చు కాగితములను కడుంగడు శ్రద్ధతో సరిజూచిన శ్రీమాన్ నండూరి శోభనాద్రాచార్యులుగారు (ఏలూరు) ను, శ్రీయుత కామరాజు వెంకటరమణశర్మగారును అభివందనపాత్రులు.

**ధనసహాయ మొనరించిన వారికి కృతజత.** ఈగ్రంథమును వ్రాయుటకు బూనినదిమొదలు ముద్రించుట ముగించువఱకును 1. విషయపరిశోధనకై గావించిన సంచారమునకును 2. వలయుపుస్తకములను కొనుటకును, వ్రాతప్రతులను తయారుచేయుటకును, ముద్రించుటకును, ఇతర చిల్లరఖర్చులును గలిసి మొత్తము పెద్దపద్దులు లెక్కించినంతవఱకు సుమారు రూ. 5500 లకు పైగ ఖర్చుఅయినది. చిల్లరపద్దు లన్నియు గమనించుచో సుమారు రూ. 6000 లు అయినదని చెప్పదగును. ఇందులకుమింజుమలె ఆంధ్రమహాశయులనుండి నా కప్పుడప్పుడు లభించిన ధనసహాయవివరములు వేఱొకచోట ముద్రింపబడినవి. ఈగ్రంథమును ఆంధ్రుల సన్నిధానమున సమర్పింపగలుగునట్లు నాకు ధనసహాయ మొనరించిన ఆంధ్రమహాశయు లందఱకు వినయపూర్వక వినతుల నర్పించుచు, ఇంకను ఆంధ్రమహాశయుల నుండి సహాయము రాగలదని యాశించుచు, ఈ నావిజ్ఞప్తిని విరమించుచున్నాను.

ఇట్లు,
ప్రజాసేవకుడు,
ఆత్మకూరి గోవిందాచార్యులు,
గ్రంథకర్త.

ఏలూరు,
6-12-1934.

# విషయసూచిక.

## 1. వ అధ్యాయము.

## సహజసంపద.

విషయము



# 4. వ అధ్యాయము.

## ఆరోగ్యము-ఆర్థికాభివృద్ధి.



# 5. వ అధ్యాయము.

## వ్యవసాయము.

విషయము | పేజీ

# 6 వ అధ్యాయము.

## రైతులఋణము - సహకారోద్యమము.

విషయము | పేజీ

# 8. వ అధ్యాయము.

## పరిశ్రమలు.

విషయము | పేజీ

# 9. వ అధ్యాయము.

## కార్మికులు.

# మొదటిసంపుటము-పట్టికలవివరము.

## 1. వ అధ్యాయము.

## సహజసంపద.



## 2. వ అధ్యాయము.

## జనసం

# 4. వ అధ్యాయము.

## ఆరోగ్యము-ఆర్థికాభివృద్ధి.



# 5. వ అధ్యాయము.

## వ్యవసాయము.

# 7. వ అధ్యాయము.

## రాకపోకలవీళ్లు.

విషయము — పేజీ



# 8. వ అధ్యాయము.

## పరిశ్రమలు.

# 9. వ అధ్యాయము.

# కార్మికులు.

## 3 వ అధ్యాయము. సంఘనిర్మాణము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 130 | Foot Note | M. A. Ph. D. (R. C. S.) | M. A,. Ph. D. F. R. E. S. |
| 150 | శీర్షిక 3 | చాతుర్వర్ణములు | చాతుర్వర్ణ్యములు(ఇట్లే అన్నిచోట్ల గ్రహింపవలెను.) |
| 152 | 6 | 100 | 120. |
| 157 | 11 | వంశపారంపరముగ | వంశపారంపర్యముగ |
| 159 | Foot Note 1 | Pag | Page |
| 171 | 8 | ప్రభుత్వమందెనను | ప్రభుత్వమందైనను. |
| 171 | 12 | వ్యయమగుచున్నది | వ్యయమగుటయు జరుగుచున్నది. |
| 177 | 13 | పాకీరు | పాలేరు. |
| 181 | 10 | వధ్యశిలకు | వధ్యశాలకు |

## 4 వ అధ్యాయము. ఆరోగ్యము-ఆర్థికాభివృద్ధి.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 203 | 2 | నేసంఘము | ఏ సంఘము. |
| 204 | 22 | కలిసి పనిచేయుట | కలిసి పనిచేయుటచే |
| 205 | 2 వ శీర్షిక 3 | బోటకమని | బూటకమని. |
| 207 | 10 | స్త్రీలసౌకర్యము. | స్త్రీలీసౌకర్యము |
| 207 | 4 శీర్షిక 3 | Tucker | టక్కరు. |
| 209 | 18 | పాము పరుగువలె యింతవరకు | పాముపరుగువలె పరుగెత్తకుండ నింతవరకు. |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 217 | 17 | మానప్రాణముల | మానసప్రాణముల |
| 227 | 16 | తాలూకాబోర్డులు | తాలూకాబోర్డుల |
| 231 | 16 | మెటర్నిటీబిల్లు | (మెటర్నిటీబిల్లు) |
| 234 | 9 శీర్షిక 3 | పారిశుధ్యము | పారిశుద్ధ్యము. |
| 235 | పట్టికకడపటిపంక్తి | మినియును | మిలియను |
| 237 | 11 | దీర్ఘరోగములు, | దీర్ఘరోగములు. |
| 244 | 12 | పచ్చికబీళ్లులు | పచ్చికబీళ్లు |
| 245 | 3 | తటాతములు | తటాకములు |
| 245 | 13 | గ్రామాధికారియైనను | గ్రామాధికారినైనను |
| 246 | Foot-Note 2 | Vera Anstey | Veera Anstey |
| 247 | 23 | మలమూత్రవిసర్జన | మలమూత్రవిసర్జన |
| | | యొనరించుకొనునట్లు | మొనరించుకొనునట్లు |
| 248 | 12 | బాటలు చేయించు | బాటలు వేయించు |
| | | కొనవలెను | కొనవలెను |
| 252 | 10 | జేయబూని | జేబూని |

## 5 వ అధ్యాయము. వ్యవసాయము.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 257 | 12 | సత్యము, | సత్యము. |
| 268 | పట్టిక 2వ పంక్తి | పనిరాని భూమి | పనికిరాని భూమి |
| 278 | పట్టిక | రేప్ ఆవాలు | కుసుమ, ఆవాలు. |
| 285 | 10 | తక్కువ పంటకు | తక్కువ పంటకు. |
| 295 | 7 | ఉపప్రశ్నలకు | ఉపప్రశ్నలకు |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 303 | పటిక | తయారగు సరుకు | తయారగు సరకు. (ఇట్లే అన్నిచోట్ల "సరుకు" నకు "సరకు" అని గ్రహింప వలెను.) |
| 326 | 6 | యుద్భవింపదు | యుద్భవించును. |
| 329 | 11వ శీర్షిక 12వ. పంక్తి | దొరకును." | దొరకును."౨ |
| 331 | 20 | కరస్నాగలికిని | కఱ్ఱునాగలికిని. |
| 334 | 23 | టకాలి | తకాలి. |
| 336 | 4 | సహాయ | సహాయ్య |
| 360 | 1 | యడవిపదార్థము లెగుమతి | యడవిపదార్థముల ఎగుమతి. |
| 377 | 12 | కరువు | కఱవు (ఇట్లే అన్ని చోట్ల గ్రహింప వలెను.) |
| 380 | ఉపశీర్షిక | భూమిశిస్తు | భూమిసిస్తు (ఇట్లే అన్నిచోట్ల గ్రహింపవలెను.) |
| 393 | 11 | మొత్తమునకే | మొత్తమునకీ |
| 393 | 12 | ఇందులకు రైతులు. | రైతులు. |
| 397 | Foot-Note. | Mr. Mahadeva ghar | Mr. Mahadeva Ayyar |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 400 | పట్టిక | Dated 30—11—31 | Dated 30-11-31 |
| | Foot-Note | | Quoted by Mr. Rao Sahib K. Chittabbayi Naidu's Presidential address W. G. Dt. Ryots' conference |
| 425 | 22 | నగటునే | నగటున |
| 426 | 7 | జరాయితీహక్కును | జరాయితీహక్కును. |
| 432 | 8 | పరిష్కరించునప్పుడే | పరిష్కరించునప్పుడే |
| 436 | 14 | వీటికృషి.వీటివలన | వీటివలన |
| 452 | 34 శీర్షిక 3 వ పంక్తి | సింధూనదుల | సింధునదుల |
| 453 | 4 | బలప్రదమైనవి | ఫలప్రదమైనవి. |

6 వ అధ్యాయము-రైతులఋణము-సహకారోద్యమము.

| | | | |
|---|---|---|---|
| 490 | -- | మూలముకాదు. | మూలముకాదు.* |
| 505 | 9 | తంతునంతుయు | తంతునంతయు. |
| 509 | 18 | ఇట్లీదేశమునందు | ఇట్లు దేశమునందు |
| 509 | 22 | చిర స్థిరాస్తి | చర స్థిరాస్తి |
| 510 | 19 | ఋణభారమునఅత్యధిక | ఋణభారము నత్యధిక |
| 523 | Foot-Note | From Gordon O Brin | From Gordon & Brice |
| 531 | 13 | ప్రభుత్వమువారికి | ప్రభుత్వమువారి |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 799 | 15 | (The mining and geogriphical) | (The mining and Geogrephical) |
| 799 | 16 | (Institute of India) | Iistitute of India |
| 810 | 5 | చోటుకు | చోటునకు. |
| 813 | 8 వ శీర్షిక | రాష్ట్రశాఖలు | రాష్ట్రశాఖలు. |
| 814 | 9 | భేధములు | భేదములు |
| 814 | 16 | సహాయ | సహాయ్య (ఇట్లే అన్నిచోట్లగ్రహింపవలెను.) |
| 819 | 15 | మక్కా | "మక్కా |
| 819 | 18 | (Bill of lading | Bill of lading) |
| 828 | 19 | దగును | దగును. |
| 829 | 15 వ శీర్షిక | తురుష్కసామ్రాజ్యము | తురుష్కప్రజాస్వామికము. |
| 830 | 1 | ఇట్లే | "ఇట్లే |
| 843 | 5 | లేకగాదు | లేకగాదు. |
| 853 | 19 | తూకపుసుంకములును | నిర్దేశశుల్కములును |
| 856 | 4 | అదనపుసుంకమును దిగుమతి | అదనపు సుంకమును |
| 858 | 16 | మూసయిఁనమున | మూసయినుమును |
| 866 | 16 | అలజడికాలము | అలజడికాలము |
| 882 | 11 | విడుదలమీాద | విడుదలలమీాద |
| 884 | 13 | రైలుచార్జీహెచ్చు | రైలుచార్జీహెచ్చు. |

| పుట | పం : | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 887 | 1 | పరిసితులు | పరిస్థితుల |
| 904 | 22 | నివిధవర్ణముల | వివిధవర్ణముల |
| 906 | 14 | ఆసమావేశమునందు సమావేశమై | ఆసమావే శమునందు. |
| 907 | 7 | వల్లభవాయిఘటేలు | వల్లభాయి పటేలు |
| 909 | పట్టిక | తళమిము | తవిళము |
| 914 | 24 | నేటికి | వాటికి |
| 917 | 9 | చెప్పదగదు." | చెప్పదగదు."2 |
| 922 | 18 | వడుకుట | వడుకుటకు |
| 926 | 4 | నుపయోగించి | నుపయోగించిన |
| 926 | 19 | సయుూము | సయాము |
| 928 | 7 | స్థిగతులు | స్థితిగతులు |
| 928 | 10 | ష రా | రిమ రా |
| 928 | Foot-Note | Gate | Jute |
| 980 | 1 | ఆధారపరిస్థితులు | ఆధారపడు పరిస్థితులు |
| 990 | 20 | అనిరి | అని. |
| 996 | Foot Note[2] | Rpport | Report |
| 999 | 21 | త్యజింప . | ద్భవింప |
| | | 9 వ అధ్యాయము-కార్మికులు. | |
| 1001 | 9 | బ్రిబిషు | బ్రిటిషు |
| 1006 | Glossary[4] | Worker Compensation act | Wokmen's Compensation act |
| 1016 | 14 | పద్ధతియందలి | పద్ధతియంద |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1026 | 6 | గడచి | గడచిన |
| 1030 | 6 | నెలసరి జీత ములును | నెలసరి జీత ములునుగలవు |
| 1030 | 14 | బహూారకనిధులు | బహూకర నిధులు. |
| 1034 | 4 | మంది | మందికి |
| 1039 | 23 | తేలినది | తేల్చినది. |
| 1042 | 15 | ఆవేశనశాసనమును | ఆవేశనశాస నము |
| 1042 | 16 | పెట్టెను | పెట్టబడెను. |
| 1048 | 22 | నెక్కువని | నెక్కువపని |
| 1052 | పట్టిక | (Open workings) | మామూలుగ |
| 1059 | 6 | యజమానులకు | యజమానులు |
| 1088 | 17 | జాలరు | జాలదు |
| 1093 | 3 | నమ్మెలకు | సమ్మెలకు |
| 1095 | 6 | విచారించుటగాక | విచారించుటకు |
| 1096 | 13 | ఈశాసనమునందు | ఈశాసనము అమలునందు |

# భారతదేశము-ఆర్థికచరిత్ర

## సహజసంపద.

1 వ అధ్యాయము.

సాంకేతిక పదములు — **Glossary.**

| | |
|---|---|
| సహజసంపద లేక ప్రకృతి సంపద | = Natural Wealth |
| జనసంఖ్య | = Population |
| వర్షపాతము | = Rain Fall |
| శీతోష్ణస్థితి | = Climate |
| జలపాతోద్భవ విద్యుచ్ఛక్తి | = Hydro ElectricPower |
| వస్తునిర్మాణశాలలు లేక కర్మాగారములు | = Workshops |

| | | |
|---|---|---|
| 16 డ్రాములు (Drachms) | | 1 ఔన్సు (Oz) |
| 16 ఔన్సులు | ... | 1 పౌను (lb) |
| 14 పౌనులు | ... | 1 స్టోను (St) |
| 28 పౌనులు | .... | 1 క్వార్టరు (qr) |
| 4 క్వార్టర్లు | ... | 1 హండ్రడువైటు (Cwt) |
| 20 హండ్రడువైట్లు | ... | 1 టన్ను (ton) |

\+ ఇది కలుపుటకు గుర్తు.

— ఇది తీసివేయుటకు గుర్తు.

ప్రదర్శించు బెబ్బులు లున్నవి. ఘీంకరించు మదపుటేనుగు లున్నవి వివిధమగు జంతుసంతతికి కొదువలేదు. ఉత్తరహిందూస్థానమున గోధుమ పంట, ఫలవృక్షములు, దేవదారువృక్షములును కోరమాండలు-మల బారు సముద్రతీరప్రాంతములయందలి పల్లపుప్రదేశములలో ధాన్యము, నారికేళఫలములు మొదలగు వివిధాహార పదార్థ సముదాయమును, వంగ, బీహారు, ఓఢ్ర దేశములయందు రాక్షసిబొగ్గు గనులు, ఇనుప గనులు, పంజాబునందలి ఉప్పుగనులు, మైసూరునందలి బంగారుగనులు మొదలగు ఖనిజసంపత్తియు నీ మహద్విభూతికి ప్రబలనిదర్శనములు. నీవు "రత్నగర్భ" అను బిరుదము నొందుటకీ సహజవిభూతియే కారణము. రత్నగర్భవగు ఓ జననీ! వందన శతంబులు. అందుకొనుము.

## 2. వైశాల్యము-జనసంఖ్య.

భారతావని వైశాల్యము 1,094,300 చతురపు మైళ్ళు (బ్రిటిషుపరిపాలనక్రిందనున్న భాగము) + 711,032 చతురపుమైళ్ళు స్వదేశసంస్థానములు, అడవులు, గలిసిన వైశాల్యము. ఆసేతుహిమాచలపర్యంత భారతభూమి 1,805,332 చతురపుమైళ్ళు. [1] "1,808,679 చతురపుమైళ్ళు కట్టకడపటి మదింపు" ఉత్తరదక్షిణదిశలపొడవు 2000 మైళ్ళు. తూర్పుపడమరల వెడల్పు 2,500 మైళ్ళు. బ్రిటిషుహిందూదేశ జనసంఖ్య 270,612,162 + స్వదేశసంస్థానములు, ఏజన్సీలు కలిపి జనసంఖ్య80,838,527. భారతభూమి మొత్తపు జనసంఖ్య 351,450,689. కట్టకడపటి మదింపుసంఖ్య [2] "352,837,778." భారతదేశము బ్రిటిషు దీవులకంటె 15 రెట్లు పెద్దది. సుమారు రష్యాను మినహాయించుచో, ఐరోపాఖండమంతగలదు. హిందూదేశమునకు 6000 మైళ్ళు పొడుగు

1. *Census report-Page 3.* 2. *Census report-Page 4.*

గల భూమి సరిహద్దుగ గలదు. హిందూదేశ సముద్రతీరపు సరిహద్దు సుమారు 5000 మైళ్ళు గలదు.

## 3. భూ గో ళ స్థి తి.

భారతభూమిని, మూడుభాగములక్రింద విభజింపదగును.

(1) ఉత్తరదిశయందలి హిమవత్పర్వతములు, వాయవ్య మూల యందలి పర్వతపంక్తులు, భారతావనికిని, యితర ఆసియా ఖండమునకును సరిహద్దులు.

(2) ఉత్తరహిందూస్థానమందలి ఫలవంతప్రదేశము, గంగాసింధు నదీనదములచే ఫలవంతమగుచు 150 మైళ్ళు మొదలు 300 మైళ్ళవఱకు వ్యాపించియున్నది.

(3) దక్షిణ ద్వీపకల్పము సముద్రమునకంటె 1500 మొదలు 2500 అడుగులవఱకు ఎత్తుగ వ్యాపించియున్నది. ఇందున్న మహో న్నతప్రదేశము నైఋతిమూలగ సముద్రమునకంటె 9000 అడు గుల ఎత్తుననున్నది. తూర్పుసముద్రతీరమందలి డెల్టా హిందూ దేశమందలి యితర ఫలవంతప్రదేశము లన్నిటికన్న మిన్న యైనది. పశ్చిమ సముద్రతీరము విశాలముగ లేదు. పడమటి కనుమలు సముద్రమునకు గోడపెట్టినట్లుగ నున్నవి. తూర్పు సముద్రతీరములు నదీముఖములు. ఇవి యిసుకతో నిండి యుండును. పడమటితీరమున వర్షపాత మత్యధికము. ఇందుచే సంవత్సరమునందు 3, 4 నెలలు మాత్రమే సముద్రవ్యాపార మున కనుకూలముగ నున్నవి. సహజమగు ఓడరేవులుకలవు. మహానది, గోదావరి, కృష్ణ, కావేరి మొదలగు పురాణ నదీ ప్రవాహజలముచే నీభూమి ఫలవంతమగుచున్నది. ఈ పీఠ భూమి వింధ్యపర్వత పంక్తులవలనను సాత్పురా పర్వతావళి

చేతను, గంగా సింధు మైదానభాగమునుండి వేరుచేయబడు చున్నది. ఈ పీఠభూమి పైభాగము అరణ్యావృత పర్వత శిఖరములచే నలరారుచున్నది. ఈ పర్వతపంక్తులు ప్రకృతిలక్ష్మికి నిలయములు.

## 4. వర్షపాతము.

ఆకాశమున, మే మాసాంతమునకు మేఘము లెగబ్రాకుట ప్రారంభించును. మొట్టమొదట సింహళద్వీపమున వర్షించును. పిమ్మట మేఘసముదాయము రెండుఖండములగును. దక్షిణద్వీప కల్పముల కిరుప్రక్కలనుండియు బ్రాక నారంభించును. తూర్పు పడమర దిశలకు వ్యాపించును. పడమటిదిశగ బయలువెడలిన మేఘావళి పడమటి కనుమలయం దత్యధిక వర్షము గురియును. అటనుండి, (N. E.) యీశాన్య దిశగ ప్రయాణము సాగించును. తూర్పుదిశగ సంచారమొనరింప బోయిన మబ్బులు బంగాళాఖాతము నుండి అస్సాము పర్వతపంక్తి నాశ్రయించును. అట నత్యధికవర్షము కురియును. పిమ్మట గంగానది దిగువ భాగములయందు, హిమవత్పర్వతములయందు వర్షించి హిందూస్థానమునకు మరలిపోవును. పశ్చిమోత్తర దిశ (వాయవ్యమూల N. W.) గా పోయి అంతరించుచుండును. అక్టోబరు నెల మొదలు పెట్టుసరికి వర్షకాల మంతరించుచుండును జూన్ మొదలు మూడు నాలుగు మాసములయం దేవో కొన్ని ప్రాంతములయందుతప్ప నెల్లయెడల వర్షము కురియుచుండును. మదరాసురాజధానియందలి ఆగ్నేయమూల, (S. E.) సముద్రతీరప్రాంతములయందు, అక్టోబరు, నవంబరు, డిశంబరు, మాసములయందుమాత్రమే వర్షించుచుండును(N. W). వాయవ్యమూలయందు, జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలలలో తఱుచు కొలదికొలదిగ వర్షించును, గంగానది ప్రాంతమునగూడ నీ కాలమున

### 1. టన్నుల బియ్యము

| | |
|---|---|
| భారతదేశము ... ... | 49 00000 |
| జపాను, కొరియా ... ... | 15000000 |
| ఇండో చైనా ... ... | 6000000 |
| హాలెండు-తూర్పు ఇండీసు దీవులు ... | 5000000 |
| సయాము ... ... | 4000000 |
| జావా మదుర ... ... | 4000000 |
| ఫిలిప్పైన్ దీవులు ... ... | 4000000 |
| ప్రపంచోత్పత్తి ... ... | 87000000 |

1930 వ సంవత్సరపు పై అంకెల ననుసరించి ప్రపంచమునందు, వరిపంటలో భారతదేశ మగ్రస్థానము వహించుచున్నటుల తెలియు చున్నది.

గోధుమలు. పంజాబు, పశ్చిమోత్తర పరగణాలలో గోధుమ లే ముఖ్యమైనపంట. 19 వ శతాబ్దమునుండియు, ఉత్తరహిందూస్థానమందు గోధుమపంట విరివిగ సాగుచేయబడుచున్నది.

### 2. లక్షల క్వార్టర్లు - గోధుమ.

| | | | |
|---|---|---|---|
| 1. సోవియట్ రష్యా | 1300 | 10. జర్మని | 170 |
| 2. అమెరికాసంయుక్త రాష్ట్రములు | 1060 | 11 రొమేనియా | 160 |
| | | 12. ఉత్తరఆఫ్రికా-యీజిప్టు | 130 |
| 3. కెనడా | 490 | 13. యుగోస్లావియా | 110 |
| 4. భారతదేశము | 490 | 14 పోలెండు | 100 |
| 5. ఆర్జంటైనా | 300 | 15. హంగేరి | 100 |
| 6. ఫ్రాన్సు | 290 | 16. బల్గేరియా | 70 |
| 7. ఆస్ట్రేలియా, న్యూజిలాండు | 270 | 17. జెకోస్లావకియా | 60 |
| 8. ఇటలీ | 260 | 18. బ్రిటిషుదీవులు-ఐరిషుఫ్రీస్టేటు | 50 |
| 9. స్పెయిన్ | 180 | 19. జపాను-కొరియా | 50 |

*1. From Whitkers Almanac. 2. From Whitkers Almanac.*

1930 వ సంవత్సరపు పై అంకెల ననుసరించి ప్రపంచమునందు గోధుమపంటలో భారతదేశ మాక్రమించుచున్న ప్రాముఖ్యస్థానము తెలియగలదు.

జొన్న—మొక్క ధాన్యము, గోధుమలు పండని ప్రదేశములలో జొన్న, జొన్న—చోళ్ళు. మొక్కజొన్న, చోడి మొదలగునవి పండింపబడు చున్నవి. ఇవియే ఆయా ప్రదేశములయందు ముఖ్యాహారముగ నుపయోగింప బడుచున్నవి.

బార్లీ—ఓట్లు. సంయుక్త, బీహారురాష్ట్రములలో బార్లీ ధాన్యము సుమారు 60 లక్షల యెకరములలో పండింపబడు చున్నది. పంజాబు, సంయుక్తరాష్ట్రములలో ఓట్లు పండింపబడుచున్నవి. ఓట్లపంట పోర్చుగీసువారిచే అమెరికానుండి ఇండియాకు తేబడెను.

అపరాలు. 1 కోటీ నాలుగులక్షల యెకరములలో అపరాలు పండింపబడుచున్నవి.

చెఱకు. చెఱకుపంటకు హిందూదేశము పుట్టినిల్లు. ఈఅంకెలు పంచదార యుత్పత్తియందు భారతదేశ మాక్రమించు చున్న స్థానమును దెలుపుచున్నవి.

[1]. పంచదార- (చెఱకుగడలనుండి) బీటుదుంపలనుండి

| | టన్నులు. | | టన్నులు. |
|---|---|---|---|
| భారతదేశము | 3250000 | జర్మనీ | 2500000 |
| క్యూబా | 3075000 | రష్యా | 1775000 |
| జావా | 2975000 | ఫ్రాన్సు | 1190000 |
| హవాయి | 870000 | అమెరికా | 1160000 |
| ఫార్మోసా | 800000 | జెకోస్లావకియా | 1180000 |
| ఫిలిప్పైనుదీవులు | 790000 | పోలెండు | 760000 |
| పోర్టోరికో | 700000 | | 11800000 |
| ఆస్ట్రేలియా | 540000 | | |
| ప్రపంచపుటుత్పత్తి | 16250000 | | |

1. *From Whitkers Almanac.*

| 1 పొగాకు. | | | టన్నులు. |
|---|---|---|---|
| అమెరికా | ... | ... | 680000 |
| ఇండియా | ... | ... | 600000 |
| రష్యా | ... | ... | 180000 |
| గ్రీసు | ... | ... | 70000 |
| ప్రపంచపు టుత్పత్తి | ... | ... | 2000000 |

1930 వ సంవత్సరపు పై అంకెల ననుసరించి పొగాకుపంటలో ప్రపంచమున భారతదేశము రెండవస్థాన మాక్రమించుచున్నది.

నల్లమందు. బీహారు, బెంగాలు, సంయుక్తరాష్ట్రములలో నల్లమందు పంటగలదు. స్వదేశసంస్థానములలో నీపంట అత్యధికము.

## 6. అడవులు.

హిందూదేశ సహజ సంపదలో అడవులు ప్రత్యేకస్థానము వహింపగలవు. ఈ అడవులవలన విలువగల కలప, రకరకముల జిగురులు, మందులు, రంగులు, పదునుజేయు వస్తువులు, వార్నీసులు, లభించుచున్నవి.

## 7. జంతుసంతతి.

జంతుసంతతికి లోటులేదు. ఎద్దులు, ఆవులు, దున్నలు, గేదెలు, గొఱ్ఱెలు, మేకలు, గాడిదలు, కంచర గాడిదలు, గుఱ్ఱములు, లొట్టి పిట్టలు, పందులు యివి ముఖ్యమయినవి. హిందూదేశమందలి విశాలారణ్యప్రదేశములలో అనేక పక్షిజాతులు గలవు. పాలు, పెరుగు,

1. From Whitkers Almanac.

మాంసము, మొదలగు ఆహారములకు కొదువలేదు. ఉన్ని, చర్మములు, కొమ్ములు, వర్తకమున కుపయోగింపబడుచున్నవి.

### 1. వివిధ దేశముల జంతు సంతతి.

| . | దేశము. | గుఱ్ఱములు. | పశువులు. | గొఱ్ఱెలు. | పందులు. |
|---|---|---|---|---|---|
| 1 | బెల్జియం | 1245971 | 1758654 | | 1249621 |
| 2 | జెకోస్లావకియా | 747650 | 4538904 | 836049 | 3088025 |
| 3 | డెన్మార్కు | 494465 | 3057438 | 190984 | 4871897 |
| 4 | ఫిన్లాండు | 394850 | 1902600 | 1310000 | 426000 |
| 5 | ఫ్రాన్సు | 2985650 | 15631140 | 10451760 | 6101810 |
| 6 | జర్మనీ | 3519504 | 18431207 | 3500923 | 23364565 |
| 7 | బ్రిటిషుదీవులు | 1211825 | 7758551 | 24669494 | 2669925 |
| 8 | ఐరిషుఫ్రీస్టేటు | 447699 | 4038344 | 3515147 | 1052217 |
| 9 | ఇటలీ | 967406 | 6892722 | 9896038 | 3157434 |
| 10 | స్వీడన్ | 653000 | 3060000 | 652000 | 1761067 |
| 11 | స్విజర్లాండు | 140023 | 1609073 | 133838 | 924271 |
| 12 | రష్యా | 31158400 | 52581700 | 89859900 | 12182700 |
| 13 | కెనడా | 3295000 | 8937000 | 3696000 | 4000000 |
| 14 | అమెరికా | 12803000 | 58955000 | 51911000 | 52323000 |
| 15 | దక్షిణాఫ్రికా | 856040 | 10517984 | 45010446 | 835236 |
| 16 | ఆస్ట్రేలియా | 1845614 | 11202134 | 104558342 | 1018324 |
| 17 | న్యూజిలాండు | 297195 | 3765668 | 30841287 | 487739 |
| 18 | జపాను | 1490360 | 1488240 | 20728 | 706151 |
| 19 | హిందూదేశము | 2218803 | 146958583 | 35783401 | |

1930 సంవత్సరపు పై అంకెలవలన జంతుసంతతియందు భారతభూమి ప్రపంచమునందన్ని దేశములతోపాటు సమముగ నున్న దనదగును. కాని భారతదేశ జనసంఖ్య ననుసరించి చూచుచో నగటున విదేశములకంటె తక్కువ జంతుసంతతి గలదు.

1. *From Canada Year Book 1932.*

| దేశము. | 1920 వ సం॥ జనసంఖ్య 1000కి గల పశు సంతతి. | 1927వ సం॥ జనసంఖ్య 1000కి గల గొఱ్ఱెలు. |
|---|---|---|
| ఆస్ట్రేలియా | ... 259 ... | ... 167 ... |
| న్యూజిలాండు | ... 150 ... | ... 1854 ... |
| దక్షిణాఫ్రికా | .. 120 ... | ... 578 ... |
| ఐకమత్యపు స్టేటు | ... 136 ... | ... 105 ... |
| కెనడా | ... 80 ... | ... 37 ... |
| భారతదేశము | ... 61 ... | ... 7 ... |

పశువుల కధికాహారము లభించువీల్లు గలిగించుటయు పశురోగ వైద్యాలయములు విరివిగ స్థాపించుటయు నొనరించుచో, పశుసంతతి యభివృద్ధి కాగలదు,

## 8. ఖనిజసంపద.

పురాతన భారతదేశమున ఖనిజపరిశ్రమ లద్భుతముగ నుండెడివి. కాలానుగతముగ రాజ్యాధికారముతోపాటు ఇవియు రూపుమాసినవి. రాగి, అన్నభేధి, సోడాయుప్పు మొదలయినవి నశించిపోయినవి. టిబెట్, కాశ్మీర దేశములనుండి వెలిగారపు దిగుమతి నశించిపోయినది. ఇనుము, ఉక్కు, రాగి, సీసములు ఉత్పత్తి వెనుకబడినవి. 19 వ శతాబ్దాంతమునను లోహోత్పత్తి యించుమించుగ రూపుమాసినది. నేడు రాక్షసిబొగ్గు, బంగారము, ఉప్పు, అభ్రకము, సురేకారము, ఇనుము, (manganese) మాంగనీసు మొదలగు అపరిష్కృత లోహములు, (ores) హిందూదేశమునం దుత్పత్తియగుచున్నవి. బర్మాలో పెట్రోలు, సీసము, వెండి, రాగి, తుత్తునాగము, కెంపులు లభించుచున్నవి. ఈ దిగువపట్టిక ఖనిజోత్పత్తి వివరముల దెలుపగలదు.

1. From Canada Year Book 1932.

| ఖనిజము యొక్క పేరు | | ఉత్పత్తి 1914 | | ఉత్పత్తి 1927 | | ఉత్పత్తి 1930 | |
|---|---|---|---|---|---|---|---|
| | | మొత్తము | విలువ రూ. | మొత్తము | విలువ రూ. | మొత్తము | విలువ రూ. |
| (Coal) రాతిబొగ్గు | (టన్నులు) | 16464263 | 58610695 | 22082336 | 94870013 | 23803048 | 92625323 |
| (Salt) ఉప్పు | ,, | 1348225 | 7249347 | 1611945 | 11380155 | 1711348 | 12741409 |
| (Gold) బంగారము | (ఔన్సులు) | 607388 | 35075330 | 384273 | 21800629 | 329232 | 18685211 |
| (Petrol) పెట్రోలియము | (గాలన్లు) | 259342710 | 24105892 | 281113909 | 59247675 | 311030108 | 52497812 |
| (Salt-petre) సూరేకారము | (Cwts) | 316211 | 4201476 | 123018 | 1522666 | 76538 | 721501 |
| (Chromite) రంగుల సంబంధము | (టన్నులు) | 5888 | 39160 | 57207 | 880957 | 50684 | 867456 |
| (Copper ore) అపరిష్కృతపురాగి | ,, | 5324 | 109410 | 16882 | 4613605 | 140895 | 7033545 |
| (Diamonds) వజ్రములు | (వన్నెలు) | 55 | 11867 | 113 | 44943 | 1321 | 72533 |
| (Iron ore) అపరిష్కృతపు ఇనుము | (టన్నులు) | 441574 | 544740 | 1846735 | 5101861 | 1849025 | 4872527 |
| (Jade Stone) ఒకవిధమయిన రాయి | (Cwts) | 4971 | 1005771 | 2018 | 302440 | 1572 | 218522 |
| (Lead) సీసము | (టన్నులు) | 10548 | 3034185 | 65967 | 22027742 | 79730 | 18504616 |
| (Mangnesite) మాంగనీసు సంబంధము | ,, | 1680 | 8353 | 19638 | 229338 | 16523 | 84739 |
| (Manganese ore) మాంగనీసు | ,, | 682898 | 13158965 | 1120353 | 3812776 | 829946 | 16203186 |
| (Mica) అభ్రకము | (Cwts) | 40506 | 1321351 | 42614 | 2452055 | 52727 | 2668986 |
| (Monazite) | (టన్నులు) | 1186 | 621165 | 280 | 51054 | 14 | 1890 |
| (Platinum) వెండివంటి ఒకవిధమైనలోహము | (ఔ॥) | 37 | 3195 | | | | |
| (Rubies) కెంపు - బరాస్త | (వన్నెలు) | 304872 | 646988 | | 279834 | 30090 | 131155 |
| (Silver) వెండి | (ఔన్సులు) | 236446 | 403460 | 6024806 | 9498541 | 7072050 | 7708568 |
| (Tin ore) అపరిష్కృతమగు తగరము | (Cwts) | 5395 | 329274 | 69900 | 6617773 | 85418 | 4554117 |
| Wolfram (Tungsten ore) | (టన్నులు) | 2326 | 2678152 | 1160 | 570003 | 2452 | 1809881 |
| (Zinc) తుత్తినాగము | ,, | 8553 | 161430 | 67135 | 7006018 | 64800 | 6480075 |

*(From Statistical Abstract for British India.)*

మోటారులకు; లాంతర్లకు, స్టౌలకు, యీనూనె వాడబడుచున్నది. పెట్రోలియంలో నూటికి 90 వంతులు బర్మాయందే లభించుచున్నది. 1904 వ సంవత్సరములో 118 మిలియను గాలన్లును 1928 లో 305.9 మిలియను గాలన్లును తీయబడినది. అయినప్పటికి విదేశములనుండి 1928 లో 104.4 మిలియన్ల గాలన్లు దిగుమతియైనది. ఇంకను నూనె బావులు వెదకి పట్టుకొనవలసి యున్నది. అధికోత్పత్తికి ప్రయత్నించ వలెను. 100 కి 30 లేక 40 వంతులు హిందూదేశమున లభించుచో హిందూదేశమందు వాడుకొనుటకు సరిపోవునని టారిఫ్ బోర్డువారు వ్రాసిరి. అటాక్ (Attock) అస్సాము నూనె. బావులు అభివృద్ధి యగుటకు చాల వీలున్నదని టారిఫ్ బోర్డువారు వ్రాసిరి. హిందూ దేశమునకు కొఅదల యగుచున్న నూనె, అమెరికానుండి ముఖ్యముగ దిగుమతి యగుచున్నది. బర్మానుండి తెల్లమైనము (Paraffin) మొదలగునవి స్వల్పముగ విదేశముల కెగుమతి యగుచున్నవి.

ఉప్పు. అన్ని ప్రాంతముల దొరకును. ఉత్పత్తి సులభము. ప్రజలు స్వంతముగ తయారుజేసి వాడుకొనుచుండెడివారు. పంజాబులో కోహాట్ గనులయందును, సాల్టురేంజియందును, రాజపు టానాలో సాంబారుసరస్సునందును, కచ్చిసంస్థానమందును, బొంబాయి, మదరాసు సముద్రతీరములయందును, సింధునదీ ముఖద్వారము కడను అపరిమితముగ ఉప్పు లభించును. మన దేశమున తయారగు ఉప్పులో సగము ప్రభుత్వయంత్రముల వలనను, సగము లైసెన్సుల వలనను తయారగుచున్నది.

| 1 ఉప్పు. | | | టన్నులు. |
|---|---|---|---|
| అమెరికా | ... | ... | 7000000 |
| జర్మనీ | ... | ... | 3000000 |
| రష్యా | ... | ... | 3000000 |
| చైనా | ... | ... | 2400000 |
| బ్రిటిషుదీవులు | ... | ... | 2000000 |
| భారతదేశము | ... | ... | 1800000 |
| ఫ్రాన్సు | ... | ... | 1600000 |
| ప్రపంచపుటుత్పత్తి | | ... | 28000000 |

1930 వ సంవత్సరపు పై అంకెల ననుసరించి, భారతదేశమున ఉప్పుపంట స్వల్పముగ నున్నది. ఇందులకు ఉప్పుపంటపైగల నిషేధములే కారణము. ప్రపంచమునకంతకు గూడ సరిపడు ఉప్పును భారత భూమియే పండింపగలదు. సహజముగగూడ లభింపగలదు.

బంగారము. బంగారము పురాతన కాలమునుండియు మనదేశమునందుత్పత్తి యగుచున్నది. మైసూరునందలి కోలారు, బంగారుగనులు, ముఖ్యము. 1880 వ సంవత్సరమున ఆంగ్లేయాధిపత్యమున కోలారు గనులనుండి బంగారము విరివిగ తీయబడుట ప్రారంభింపబడెను. 1885 వ సం॥లో బంగారు తీయుపద్ధతి స్థిరపడినది. 1900 లో 513 వేల ఔన్సుల బంగారము తీయబడెను. దానిఖరీదు 284 లక్షలు. 1903 వ సంవత్సరమున విద్యుచ్ఛక్తివలన ఉత్పత్తి అధికమయ్యెను. నైజాము ప్రభుత్వమందలి హట్టిలో 1903 వ సంవత్సరమున బంగారు

1. *From Whitkers Almanac*

గని లభించినది. 1920 వ సంవత్సరమునుండియు నీగని పనిచేయుట లేదు. పంజాబు, మధ్యరాష్ట్రములు, సంయుక్తరాష్ట్రములలో గూడ బంగారము అత్యల్పముగ లభించుచున్నది. 1928 వ సంవత్సరమున 376063 ఔన్సులబంగారము తీయబడెను. దీనివిలువ రు 21282585 లు. ప్రపంచసువర్ణోత్పత్తిలో హిందూదేశము 100 కి 3 వంతులుమాత్రమే యుత్పత్తిచేయుచున్నది.

| | | [1] ట్రాయిఔన్సులు |
|---|---|---|
| దక్షిణాఫ్రికా | ... ... | 10700000 |
| అమెరికా, సంయుక్తరాష్ట్రములు, ఫిలిపైను దీవులు | | 2200000 |
| కెనడా | ... ... | 2100000 |
| మెక్సికో | ... ... | 650000 |
| ఆస్ట్రేలియా-న్యూజిలాండు | ... | 650000 |
| దక్షిణ రోడేసియా | ... ... | 548000 |
| భారతదేశము | ... ... | 360000 |
| మొత్తం ప్రపంచపుటుత్పత్తి | ... | 19000000 |

1931 వ సంవత్సరపు పైయంకెల ననుసరించి సువర్ణోత్పత్తి యందు భారతభూమి ప్రపంచమునం దాక్రమించుచున్న స్థానము తెలియగలదు.

ఇనుము. 19వ శతాబ్దము వఱకు మనదేశమునం దినుప పరిశ్రమ వర్ధిల్లినది. ఆసేతు హిమాచల పర్యంతము అనాదినుండియు, ఇనుప పనిముట్లు తయారు చేయబడుచుండెడివి. విదేశములనుండి

1. *From Whitkers Almanac*

యినుపసరకులు దిగుమతియగుట ప్రారంభించినది మొదలు స్వదేశపరి శ్రమ అడుగంటెను. 1830 వ సంవత్సర ప్రాంతమున సేలం, నర్మదా మధ్యమం దినుపపరిశ్రమ పునరుద్ధరింపబడుటకు ప్రయత్నింపబడెను. ఇనుము కరిగించుటకు వలయు కట్టెలు లభింపనందున ప్రభుత్వ సహాయము లేనందున, ఆప్రయత్నము నిష్ఫలమయినది. 1870 వ సంవత్సరములో ప్రభుత్వము, రాణీగంజి బొగ్గుగనులపై దొరికిన యినుమును కరిగించుటకై సర్కారు అయిరన్ వర్క్సును స్థాపించెను. కరిగించుటకు రాతిసిబొగ్గు నుపయోగించిరి. 1889వ సంవత్సరమునం దీ కంపెనీ బెంగాల్ అయిరన్ అండు స్టీలు కంపెనీ అను ఆంగ్లేయసంస్థ కిచ్చివేయబడినది. 20 వ శతాబ్దములో ఒరిస్సాదేశమున ఇనుపగనులు కని పెట్టబడినవి. 1907 లో తాతా అయిరన్ అండు స్టీలుకంపెనీ, స్వదేశీ మూలధనముతో స్థాపింపబడి, స్వదేశస్థులచే నడుపబడుచున్నది. సంవత్సరమునకు 15 లక్షల టన్నుల యినుము తయారగుచున్నది.

మాంగనీసు. Manganese ఒకవిధమైన లోహము.

1892 నుండియు నేటివఱకు విశాఖపట్టణము జిల్లా నుండి ఎగుమతి యగుచున్నది. మధ్యరాష్ట్రములలో గూడ శ్రేష్ఠమయిన గనులుకలవు. 1900 సంవత్సరమున 93 వేల టన్నులును, 1907 లో 92290 టన్నులును ఎగుమతిచేయబడెను. అప్పటికి యీఎగుమతిలో మనదేశ మగ్రస్థానము వహించినది. రష్యాదేశము నోడించెను. తరువాత నుత్పత్తి తగ్గినది. యుద్ధమునకు పూర్వము 712797 టన్నులుమాత్రమే ఎగుమతి. 1928 లో 978449 టన్ను లుత్పత్తియయ్యెను.

అభ్రికము. Mica.

19 వ శతాబ్దమునందే బీహారు, నెల్లూరు జిల్లాల నుండి అభ్రిక మెగుమతి చేయబడుచుండెను. 1911-12 సంవత్సరములకు 16 వేలుమొదలు 31 వేల టన్నులవఱకు

వలనను, పెట్రోలియం బర్మాలోనే యుండుటవలనను, బొంబాయి, మదరాసు రాజధానుల కెగుమతిజేయుట కధికవ్యయ మగుచున్నది. యంత్ర సహాయమున అధికోత్పత్తికివలయు సౌకర్యములు లేకపోయినవి. వంగదేశమున నారపరిశ్రమకును బీహారులో యినుప పరిశ్రమకును గావలసిన రాక్షసిబొగ్గు స్థానికముగ లభించుచున్నది. బొంబాయి రాష్ట్రమందు పరిశ్రమల కన్నిటికి రాక్షసిబొగ్గే దిక్కు. ఇది ఆఫ్రికా, కలకత్తాలనుండి దిగుమతియగుచున్నది. ఇప్పుడు బర్మా, అమెరికా, రష్యాలనుండి దిగుమతియగు నూనెను మిల్లులన్నియు వాడుచున్నవి. గ్రేటిండియన్ పెనిన్షులర్ రైల్వేకంపెనీ, దక్షిణ ఇండియా యంత్రశాల లీనూనెనే వాడుచున్నవి. రేవుస్థానములలో యీనూనె రాక్షసి బొగ్గుతో పోటీ చేయుచున్నది. కలప విస్తారముగ లభించుచున్నను, ఈనూనెతో పోటీ చేయగలుగునంత కొద్దిఖరీదున లేదు.

జలపాతోద్భవ విద్యుచ్ఛక్తిచే నిప్పుడు యంత్రములు నడుప మొదలు పెట్టుచున్నారు. కోలారు విజయము, పశ్చిమతీరమందు జలపాత విద్యుచ్ఛక్తి యుత్పత్తియోచనలకు ప్రోత్సాహకరముగ నున్నది. కోలారు నందలి బంగారపు గనులలో నుపయోగించుటకై, మైసూరు ప్రభుత్వము కావేరీనదికి శివసముద్రము కడ జలపాత విద్యుచ్ఛక్తి యుత్పత్తి 1903 వ సంవత్సరమున ప్రారంభించిరి. బొంబాయి పశ్చిమోత్తర పరగణాలలో నీ శక్తి యెక్కువ యుపయోగపడును. పడమటి కనుమల యందలి వర్ష, జలపాత శక్తిని వినియోగించు మార్గముల నరయుటకై జమ్. షెడ్. జి. తాతాగారు విశేషకృషిసల్పి 1903 లో అకాలమృత్యువు వాతబడిరి. వారి కుమారుడు 1907 లో బొంబాయి నగరమునకు విద్యుచ్ఛక్తి నిచ్చుటకు లైసెన్సును బొందిరి. 1910 లో 1 కోటి 75 లక్షల పెట్టుబడితో హైడ్రో ఎలక్ట్రికుపవర్

సప్లయికంపెనీ స్థాపించిరి.పడమటి కనుమల యెత్తు 2000 అడుగులు. అవి మేఘముల నిరోధించుచున్నవి. అందువలన పశ్చిమదిశను 200 అంగుళముల వర్షము గురియుచున్నది. ఈ నీటిని నిలువచేయుటకు లోన్వాలా, షిరావడా, వాల్వహన్‌లలో 3 డాములను కట్టి నీరును నిలువజేసి పిల్ల కాలువలద్వారా లోన్వాలా (జలస్థావరము) రిజర్వాయిరుకు గొంపోబడి దానినుండి 1725 అడుగుల ఎత్తునుండి గొట్టములగుండ కొపోరీ విద్యుచ్ఛక్తి యంత్రనిలయములకు తేబడుచున్నది. ఇంత ఎత్తునుండి నీరు పడుటవలన చతురపు అంగుళమును 1కి 750 పౌనుల శక్తి యుద్భవించుచున్నది. ఈ విద్యుచ్ఛక్తి యంత్రములు నిర్మింపబడక పూర్వమే బొంబాయి యందలి బట్టలమిల్లుల యధికారులీ జలపాతశక్తినంతయు తమ కొసంగవలసినదని తాతాగారిని కోరిరి. ఈ యంత్రాగారము 1911 లో ప్రారంభింపబడి 1915 లో పూర్తియైనది. మొట్టమొదట నీయంత్రముల వలన 30వేల గుఱ్ఱముల విద్యుచ్ఛక్తి నుద్భవింప జేయ బూనిరి. కాని పెట్టుబడి 3 కోట్లవఱకు పెరిగినది. అందువలన 40 వేల యెలక్ట్రికు గుఱ్ఱముల శక్తివఱకు జనించుచున్నది. ఈశక్తినే బొంబాయి బట్టల మిల్లులకును, ట్రాంవే కంపెనీకిని వినియోగించుచున్నారు. ఒక్క బొంబాయి నగరమందే లక్ష 60 వేల గుఱ్ఱములశక్తి ఖర్చుపడుటకు సావకాశము కలదు. బొంబాయి బట్టల మిల్లులకు మాత్రమే లక్షగుఱ్ఱముల శక్తి యవసరము. లోన్వాలా యందలి తాతాహైడ్రో ఎలక్ట్రికువర్క్సు విజయవంతమగుట వలన నితరులకుగూడ ప్రోత్సాహము కలిగినది. 21000000 రూపాయలతో 1916 సంవత్సరం ఆగష్టు మాసమున ఆంధ్రవాలీకంపెనీ యనుపేర మఱియొకటి స్థాపింపబడినది. 1922 వ సంవత్సరమునుండియు, బొంబాయి నగరమునకును పరిసరప్రాంతములకును విద్యుచ్ఛక్తి యొసంగబడుచున్నది. 1919 లో 9 కోట పెట్టుబడితో తాతాపవర్‌కంపెనీ లిమిటెడ్ అను మూడవ

కంపెనీ నిర్మింపబడి యొకభాగమే పూర్తియైనది. ఈకంపెనీవారి యుద్దేశ్యములన్నియు నెఱవేఱునో 11 లక్షల 50 వేల గుఱ్ఱముల శక్తిని యీకంపెనీ జనింపజేయగలదని మదింపు. ఈ మూడుకంపెనీలకును తాతాఅండుసన్సు లిమిటెడ్ వారే మానేజింగు ఏజెంట్లు. వీరే 80100000 రూపాయల పెట్టుబడితో 35000000 గుఱ్ఱములశక్తి నుద్భవింపజేయు మఱొక కంపెనీని స్థాపింపనున్నారు.

మనదేశమం దితర ప్రదేశములలోగూడ నీజలపాత విద్యుచ్ఛక్తి యంత్రముల నిర్మింప జూచుచున్నారు. మైసూరులో షింషానదిని బట్టి ఒకప్రాజెక్టును నిర్మింపజూచుచున్నారు. కాశ్మీరులో జీలం నదినుండి శ్రీనగరునకు, బర్మ్యుల్లాకును విద్యుచ్ఛక్తి పంపబడుచున్నది. 20 వేల గుఱ్ఱములశక్తి నుద్భవింపజేసి దీపములకును, పట్టు యంత్రశాలలకును, నిచ్చుచున్నది. దీనికి కాశ్మీరరాజ్య ప్రోత్సాహము కలదు. పంజాబు ప్రభుత్వము మండీసంస్థానములో ఉహాక్ నదియొద్దున గొప్ప విద్యుచ్ఛక్తి యంత్రశాలలను నిర్మించినది. పంజాబులోని 20 పట్టణముల కును, సిమ్లా, అంబాలా, పాటియాలా, షహరన్‌పూరు, మీరటు, ఢిల్లీ పట్టణములకును మొత్తము 47 నగరములకు విద్యుచ్ఛక్తి నొసంగుటకు ప్రణాళిక వేయబడినది. ఈ ప్రణాళిక సక్రమముగ నెఱవేఱుచో యూనిటు 5 దమ్మిడీలచొప్పున విద్యుచ్ఛక్తి లభింపగలదు. పల్లపుభూములలో నిలువనీరు పోగొట్టుటకును, మెరక భూములలోనికి నీటిని రానిచ్చుటకును పంజాబు దేశమునందీస్కీము చాల సహాకారియై వ్యవసాయమునకు, అత్యంతోపకారి కాగలదు. బొంబాయి దూది పరిశ్రమాలయమునకును, రైళ్ళకును, విద్యుచ్ఛక్తి యుపయోగింప బడుచున్నది. యంత్రశాలలను నూనెవలన గాని, కట్టెలవలన గాని నడపుటయం దవలంభించు స్థలమునుబట్టియు, నిలువజేయు సదు

పాయములను బట్టియు నెగుమతి దిగుమతి ఖర్చు లగుచున్నవి. కాని జలపాత విద్యుచ్ఛక్తి యంత్రముల కంతకన్న నెక్కువ ఖర్చు లగుచున్నవి. ఈ విద్యుచ్ఛక్తి నిర్మాణమునకు డాములకు నెక్కువ పెట్టుబడి కావలసివచ్చుచున్నది. బొంబాయి నగరమునందు యూనిటు అర్ధణా చొప్పున నొసంగబడుచున్నది. స్కాండినేవియాలో అణాకు 20 యూనిట్లు. పంజాబు ప్రాజెక్టులో యూనిటు 9 పైసలు. ఈ విద్యుచ్ఛక్తి వెల నేడధికముగ నున్నను స్వల్ప ఖరీదునకు లభింపజేయు మార్గములు గలవు

1918 వ సంవత్సరమున హిందూదేశ ప్రభుత్వము జలపాత శక్తి నుద్భవింపజేయుటకు పనికివచ్చు నదీనదములను గురించి విచారించిరి. ఈవిచారణ ఫలితముగ జలపాత విద్యుచ్ఛక్తిని సృష్టించుటకు భారతవర్షమం దధికసదుపాయములు గలవని తేలెను. హిందూదేశమునందుగల మహానదులలో నించుమించుగ నన్నినదులయందు నేదో యొక ప్రదేశమున కొలదిగనో, గొప్పగనో జలపాత విద్యుచ్ఛక్తి నుద్భవింప జేయగలుగుదుము.

# 10. పరిశ్రమల యెల్లలు.

ప్రాచీన భారతవర్షమునం దేగ్రామమున కాగ్రామము, జీవిత పరికరముల నన్నియు నిర్మించుకొనుటకు శక్తిమంతములై గ్రామములుండెడివి. నాడు ప్రత్తిపరిశ్రమ గృహపరిశ్రమగ నుండెడిది. బట్టల నేత, బియ్యపుదంపు, గానుగులపని, కాయగూరలు, కొయ్యపనులు విరివిగ నుండెడివి. కొన్నిప్రాంతములలో చేతిపను లభివృద్ధి నొందినవి. సన్నబట్టలు, చందనపుపెట్టెలు, వెండిబంగారు నగలు, చేయబడి యెగు

# భారతదేశము-ఆర్థికచరిత్ర

## జన సం ఖ్య.



### 2 వ అధ్యాయము

---

సాంకేతిక పదములు — Glossary.

| | |
|---|---|
| జనసాంద్రత | = Density of population |
| సంతాన నిరోధము | = Birth Control |
| ఉత్పాదకశక్తి | = Productive Capacity |
| గరిష్టము | = Maximum |
| కనిష్టము | = Minimum |
| అంతసు లేక జీవితవిధానము | = Standard of life |

| | | |
|---|---|---|
| 10 లక్షలు | = | 1 Million మిలియను |
| సగటు వయస్సు | = | Mean age |

## దశాంశభిన్నగణితము

అంకెల పట్టికలను గ్రహించునపుడు అంకెలమధ్య వేయబడు చున్న చుక్కను గమనింపవలసియున్నది. ఈ చుక్కను దశాంశభిన్న గణితమందురు. అనగా నీ చుక్కకు ఎడమవైపుననుండు అంకెలు పూర్ణసంఖ్యలు. కుడివైపుననుండు మొదటిఅంకె పదివంతులలో నెన్నవ వంతో దానిని తెలుపును. ఎట్లన .6 అంకెకు పదింట ఆరువంతులని యర్థము. .65 యీ అంకెకు నూరింట 65 వంతులని యర్థము. .655 యీ అంకెకు వేయింట 655 వంతులని యర్థము.

10.6 పుట్లు. ఇందు పది పూర్ణసంఖ్య 6 దశాంశభిన్నము— అనగా పదిపుట్లును, పుట్టి 10 భాగములుచేయగా వచ్చిన ఆరుభాగము లును అని గ్రహింపవలయును.

# జనసంఖ్య

## 1. మొత్తపు జనసంఖ్య.

1931 వ సంవత్సరపు జనాభాలెక్కల ననుసరించి భారతదేశ జనసంఖ్య 352837778. స్వదేశ సంస్థానముల జనసంఖ్య 81310845. బర్మాతో గూడిన బ్రిటిషుఇండియా జనసంఖ్య 271526933. బర్మా గాక బ్రిటిషుఇండియా జనసంఖ్య 256859787.

బ్రిటిషుఇండియా వైశాల్యము 862679 చ. మై. స్వదేశసంస్థానముల వైశాల్యము 712508 చ. మై. బర్మాదేశవైశాల్యము—

బర్మాదేశముతోగూడ బ్రిటిషుఇండియా యందు 100 కి 77 మందియు, స్వదేశసంస్థానములయందు 100 కి 23 మందియు నివసించుచున్నారు. బర్మాదేశమును విడదీయుచో బ్రిటిషుఇండియాయందు 100 కి 76 మందియు స్వదేశసంస్థానములయందు 100 కి 24 మందియు వసించుచున్నారు.

నేడు ప్రపంచజనసంఖ్య 1850000000 అని మదింపువేయబడుచున్నది. ఈ మదింపు ననుసరించి, భారతదేశజనసంఖ్య ప్రపంచజనసంఖ్యలో 5వ వంతు కాగలదు.

బ్రిటిషు ఇండియాయందుకంటె సంస్థానములయందు జనాభివృద్ధి యధికము. బ్రిటిషు ఇండియాయందు 100 కి 10.02 జనాభివృద్ధి. సంస్థానములయందు 100 కి 12.9 జనాభివృద్ధియు కలదు.

జనాభా లెక్కలను గురించి ప్రభుత్వనివేదికయందిట్లు విమర్శింపబడెను.

(1931 వ సంవత్సరమున వేయబడిన జనాభాలెక్కలు సరియయినవని విశ్వసింప వీలులేదు. ఆకాలమున కాంగ్రెసు మహాజనసభవారి యాజ్ఞానుసారము దేశమందు సత్యాగ్రహోద్యమము కొనసాగింపబడుచున్నది. జనాభాలెక్కలు బహిష్కరింపవలెనని కాంగ్రెసు నాయకులు ప్రజలను హెచ్చరించిరి. ఈహెచ్చరిక ననుసరించి కొందఱు వ్యక్తులు జనాభాలెక్కలను బహిష్కరించిరి. కొన్ని ప్రదేశములలో బహిష్కారము విజయము బడసెను.

[1] "1931 వ సంవత్సరపు జనాభా రాజకీయాందోళనకు గురియయ్యెను. ఒకటిరెండు ప్రదేశములలో జనాభాలెక్కలు బహిష్కరింపబడినవి. గుజరాతుదేశమున తప్ప ఇతరదేశములలో బహిష్కారము విజయవంతముగ కొనసాగలేదు. ఈ బహిష్కారము వలన 0.04% వంతులు పొరపాటు మొత్తపు జనసంఖ్యలో కలిగియుండునని యూహింపవచ్చును. ఈపొరపాటు గరిష్టపరిమాణమున గమనించుచో 0.085% గలదనవచ్చును."

## 2. మతము - జనసంఖ్య.

వివిధమతస్థు లాయారాష్ట్రములయందిట్లుండిరి. హిందువులు 239195140; మహమ్మదీయులు 77677545; బౌద్ధులు 12786806; కొండజాతులు 8280347; క్రైస్తవులు 6296763; సిక్కులు 4335771; జైనులు 1252105; జోరాష్ట్రియినులు 109752; జ్యూసు 24141; చిల్లరమతములు మతము కనుగొననివారు 571187; మతము ననుసరించి జనాభాలెక్కలు తయారుచేయబడనివారు 2308221.

1. (*From the Census Report*)

ఈపట్టిక ననుసరించి హిందూమతస్థులయం దభివృద్ధి ఇతర మతస్థులందరికంటె స్వల్పముగ నున్నది. 100కి పదిమంది హెచ్చినట్లుగ గోచరించుచున్నను, నీయభివృద్ధిగూడ జనాభివృద్ధిగాదు. ఇతరమత స్థులు కొందఱు హిందూమతములోనికి జేర్చుకొనబడుటవలన హిందూ మతస్థులసంఖ్య మాత్రమే కొంతహెచ్చినదని జనాభాలెక్కలయధికారి వ్రాసెను. [1] కొండజాతులు దిక్కుమాలినవారై క్షీణగతియందున్నారని తేలుచున్నది. కొండజాతులు 1981 వ జనాభాలెక్కలలో హిందూమత స్థులక్రింద కొంతమందిచెప్పుటచేత క్షీణగతి హెచ్చుగ దోచుచున్నదని జనాభాయధికారి వాదము. ఇందొకింత సత్యముండవచ్చును. కాని 100కి 15 వంతులకుపైగ తగ్గుదల గోచరించుచుండుటచే నీజాతివృద్ధిపొందుటకు మారుగ క్షయమగుచున్నదనుటయేనిజము. సిక్కుమతములోనికి కొంత మంది హిందూమతస్థులు జేరుటయే సిక్కులజనసంఖ్యయందుగోచరించు చున్న విశేషాభివృద్ధికికారణము. జైనులునుగానురానుతగ్గిపోవుచున్నారు. ఇందులకు హిందూసంఘమునందువలెనే యీసంఘమునందుగూడ అతి బాల్యవివాహములుండుట, వితంతువివాహములు నిషేధింపబడుటయే కారణము. బౌద్ధులయందభివృద్ధి ప్రశంసనీయముగనున్నది. పార్శీలయం దభివృద్ధి మెండుగ నుండుటకు వారిలో మరణములసంఖ్య స్వల్పము. కాని మొత్తపుజనసంఖ్యతో పోల్చిచూచిన జైనులవలె పార్శీవారు గూడ జనబాహుళ్యమున తగ్గుచున్నారు. జ్యూలు జనబాహుళ్యమున తగ్గుటలేదు. ఇతరమతస్థులను తమమతములోనికి కలుపుకొనుటవలనను సహజముగను స్త్రీపునర్వివాహములుండుటవలననుగూడ మహమ్మదీయు లభివృద్ధియందున్నారు. క్రైస్తవమతమందు గోచరించుచున్న యభివృ ద్ధికి ముఖ్యముగ నిమ్నజాతులను తమలో కలుపుకొనుటయేకారణము.

## 3. జనసంఖ్య - వృద్ధి - క్షయము.

ఈదిగువపట్టిక ననుసరించి ఆయా ప్రదేశముల జనసంఖ్యయందు గలిగిన వృద్ధిక్షయములను దెలిసికొనగలము.

---

1. *Census Report P. 387.*

| | ప్రదేశము. | విస్తీర్ణము చ. మై. | జనసంఖ్య. | 1921-1931వ సం॥ మధ్యగిలిగిన మార్పు. |
|---|---|---|---|---|
| | హిందూదేశము. | 1803679 | [illegible] | +10.0 |
| | రాష్ట్రములు. | 1093171 | 271526933 | +10.0 |
| 1 | అజ్మీరు-మార్వారా. | 2711 | 560292 | +13.1 |
| 2 | అండమానులు నైకోబార్ దీవులు. | 3143 | 29463 | + 8.8 |
| 3 | అస్సాము. | 55014 | 8622251 | +15.6 |
| 4 | బెలూచిస్థానము. | 54228 | 463508 | +10.2 |
| 5 | వంగము. | 77521 | 50114002 | + 7.3 |
| 6 | బీహారు-ఒరిస్సాలు. | 83054 | 37677576 | +10.8 |
| 7 | బొంబాయి రాష్ట్రము-ఏడెను. | 123679 | 21930601 | +13.3 |
| 8 | బర్మా. | 233491 | 14667146 | +11.0 |
| 9 | మధ్యపరగణాలు-బీరారు. | 99920 | 15507723 | +11.5 |
| 10 | కూర్గ. | 1593 | 163327 | − 0.3 |
| 11 | డెల్హీ. | 573 | 636246 | +30.3 |
| 12 | మదరాసు. | 142277 | 46740107 | +10.4 |
| 13 | పశ్చిమోత్తర పరగణాలు. | 13518 | 2425076 | + 7.7 |

| | ప్రదేశము. | విస్తీర్ణము చ. మై. | జనసంఖ్య. | 1921-1931వ సం॥ మధ్యగిలిగిన మార్పు. |
|---|---|---|---|---|
| 14 | పంజాబు. | 99200 | 23580852 | +14.0 |
| 15 | సంయుక్త రాష్ట్రము. | 106248 | 48408763 | + 6.7 |
| | ఆ స్వదేశసంస్థానములు-ఏజన్సీలు. | 712503 | 81310845 | +12.8 |
| 16 | అస్సాముసంస్థానములు. | 12320 | 625606 | +17.8 |
| 17 | బెలూచిస్థానసంస్థానములు. | 80410 | 405109 | + 6.9 |
| 18 | బరోడా. | 8164 | 2443007 | +14.9 |
| 19 | వంగసంస్థానములు. | 5434 | 973336 | + 8.5 |
| 20 | బీహారు-ఒరిస్సా సంస్థానములు | 28648 | 4652007 | +17.5 |
| 21 | బొంబాయి సంస్థానములు. | 27994 | 4468396 | +15.5 |
| 22 | మధ్యపరగణాల ఏజన్సీ. | 51597 | 6632790 | +10.5 |
| 23 | మధ్యపరగణాల సంస్థానములు. | 31175 | 2483214 | +20.1 |
| 24 | గ్వాలియరు. | 26367 | 3523070 | +10.3 |

| | ప్రదేశము. | విస్తీర్ణము చ. మై. | జనసంఖ్య. | 1921-1931వ సం॥ మధ్య గలిగిన మార్పు. |
|---|---|---|---|---|
| 25 | హైదరాబాదు. | 82698 | 14436148 | +15.8 |
| 26 | కాశ్మీరము | 84516 | 3646243 | + 9.8 |
| 27 | మదరాసు సంస్థానముల ఏజన్సీ. | | | |
| | కొచ్చిను. | 10698 | 6754484 | +23.7 |
| | తిరువాన్కూరు. | 1480 | 1205016 | +23.1 |
| | ఇతర మదరాసు సంస్థానములు. | 7625 | 5095973 | +27.2 |
| | | 1593 | 453495 | — 4. |
| 28 | మైసూరు | 29326 | 6557302 | + 9.7 |
| 29 | పశ్చిమోత్తర పరగణాల ఏజన్సీలు. | 22838 | 2259288 | +20.0 |
| 30 | పంజాబుసంస్థానము | 5820 | 437787 | + 7.3 |
| 30 | పంజాబు సంస్థానముల ఏజన్సీ. | 31241 | 4472218 | +11.6 |
| 32 | రాజపుటానాఏజన్సీ. | 129059 | 11225712 | +14.2 |
| 33 | సిక్కింస్టేటు. | 2818 | 109808 | +34.4 |
| 34 | సంయుక్తరాష్ట్రముల సంస్థానములు. | 5943 | 1206070 | + 6.3 |
| 35 | పడమటి హిందూదేశ సంస్థానముల ఏజన్సీ. | 35442 | 39992[illegible]0 | +12.9 |

\+ ఈగుర్తు వృద్ధి.

— ఈగుర్తు క్షయము.

(*From Census Report P. 35*)

జనాభివృద్ధి. 16 వ శతాబ్దాంతకాలమున మనదేశ జనసంఖ్య 10 కోట్లని మూర్లండుగారు 'అక్బరుమరణాంతర' మనుపుస్తకమున లిఖించియుండిరి. 1872 వ సంవత్సరపు జనాభానుసరించి 260.16 మిలియనుల జనసంఖ్యగలదు. 1921 వ జనాభాలెక్కల మదింపు 318.94 మిలియన్లు లేక 32 కోట్లు. 1931 వ సంవత్సరపు జనాభా లెక్కల మదింపు 35 కోట్లు. 1872వ సంవత్సరపు జనసంఖ్యకును 1921 లేక 1931 వ సంవత్సరపు జనసంఖ్యతో బోల్చినచో నభివృద్ధి గోచరించుచున్నది.

నిశ్చయముగ నిదియంతయు నభివృద్ధికాదు. నాటికంటె నేడెక్కువ ప్రదేశములలో శ్రేష్ఠమగువిధమున జనాభాలెక్కలు వేయబడినవి. ఈతారతమ్యమున కిదియొక ముఖ్యకారణము.

| అభివృద్ధి. | | ఒక జనాభానుంచి, మరియొక జనాభా లెక్కవరకు గల తారతమ్యము. |
|---|---|---|
| జనాభా లెక్కలు. | జనసంఖ్య. (మిలియన్లు) | |
| 1872 | 206.16 | ... |
| 1881 | 253.89 | +23.2 |
| 1891 | 287.31 | +13.2 |
| 1901 | 294.36 | + 2.5 |
| 1911 | 315.15 | + 7.1 |
| 1921 | 318.94 | + 1.2 |
| 1931 | 352.83 | +10.6 |

పై లెక్కల ననుసరించి 1872–1921 వ సంవత్సరములమధ్య అనగా 49 సంవత్సరములలో 100 కి 20 మంది మాత్రమే హెచ్చిరి.

అని 1930-31 వ సంవత్సర ప్రభుత్వనివేదికయందు వ్రాయబడెను.[1] హిందూదేశ జనాభివృద్ధిని పరీక్షించుటకిది మార్గముకాదు. ఒకచిన్నప్రదేశమును వేరొకపెద్దప్రదేశముతో పోల్చిన జనబాహుళ్యము గోచరించుటయం దసహజములేదు.

"ఇంగ్లండు వేల్సులలో గతజనాభానుంచి 100 కి 5.4 మందిమాత్రమే యభివృద్ధియైరి కాని గతఏబదిసంవత్సరములనుండియు జూచుచో 100 కి 53.8 మంది హెచ్చిరి. గతజనాభానుంచి నేటికి అమెరికాలో 100 కి 16 గురు హెచ్చిరి. సింహాళద్వీపమునందు 100 కి 18 గురును, నీదరుల్యాండ్సుదీవులలో 100 కి 26 గురును హెచ్చిరి. జావాయందు 100 కి 20 మందిహెచ్చిరి."[2] ఈఅంకెలతో హిందూదేశమందు గత 60 సంవత్సరములనుంచియుగల అభివృద్ధి 100కి 30.7 మందినిపోల్చుచో భారతీయ జనాభివృద్ధి అత్యల్పముగ నున్నదనుట నిశ్చయము.

హిందూదేశమునందింతటి స్వల్పఅభివృద్ధికి హిందూదేశ దరిద్రస్థితియే ముఖ్యకారణము. దారిద్ర్యము రోగకారణము. రోగములు జనక్షయకారణము. హిందూదేశమున 100 కి ప్రతి 10 సంవత్సరములలో 7 లేక 8 వంతులుమాత్రమే సగటున అభివృద్ధి యగుచుండెననదగునని జనాభాలెక్కల కమీషనరు వ్రాసెను.

## 4. జనన మరణములు.

హిందూదేశమందలి జనాభివృద్ధి విదేశములయందలి జనాభివృద్ధివలెలేక మందగతియందుండుటకుగల హేతువేమి? హిందూదేశమం

---

(1. *See P. 145 India in 1930—31.*)
(2. *From Census Report P. 5.*)

దలి జననమరణముల సంఖ్యకును, విదేశముల జననమరణముల సంఖ్యకును బోలికలేదు.

| సంవత్సరములు. | 1000 కి ఎన్ని జననములు? | 1000 కి ఎన్ని మరణములు? |
|---|---|---|
| 1885-90 | 35.83 | 27.44 |
| 1891-1900 | 35.43 | 31.31 |
| 1901-1910 | 38.18 | 33.94 |
| 1911-17 | 38.68 | 30.31 |
| 1918 | 35.35 | 62.46 |
| 1919 | 30.24 | 35.87 |
| 1920 | 32.98 | 30.84 |
| 1911-20 వసంవత్సరములకు సగటు. | 36.9 | 34.13 |
| 1921 | 32.20 | 30.59 |
| 1922 | 31.85 | 24.02 |
| 1923 | 35.06 | 25.00 |
| 1924 | 34.44 | 28.49 |
| 1925 | 33.65 | 24.72 |
| 1926 | 34.77 | 26.76 |
| 1927 | 35.27 | 24.89 |
| 1928 | 36.79 | 25.59 |
| 1929 | 35.47 | 25.95 |
| 1930 | 35.99 | 26.85 |

(*From Statistical Abstract for British India. 1930-31 P. 461.*)

1901వ సంవత్సరము మొదలు 1922 వఱకు మరణముల సంఖ్య 1000 కి సుమారు 24.02 మొదలు 62.48 మధ్యనున్నది. 1918 లో 1000 కి 62.48 మందియు, 1922 లో 24.02 మందియు చని పోయిరి. ఇంగ్లండు, వేల్సులలో 1927 వ సంవత్సరమున 1000 కి 12.3 మాత్రమే చనిపోయిరి. 1891-95 సంవత్సరముల మధ్య ఇంగ్లండు వేల్సులలో జననములు 1000 కి 30.5, మరణములు 18.7 కలవు. 1926వ సంవత్సరము వచ్చుసరికి జననములు 17.8 ను, మరణములు 11.6ను గలవు. మరణములసంఖ్య అత్యధికముగ తగ్గినది. ఇంగ్లండు వేల్సులకంటె మనదేశమున మరణములసంఖ్య రెండింతలున్నది. 1929వ సంవత్సరమున వివిధదేశముల యందలి జనన మరణము లిట్లున్నవి.

| | జననములు.[1] | మరణములు. |
|---|---|---|
| ఫ్రాన్సు | 17.7 | 18.0 |
| అర్జెంటైనా | 30.1 | 13.6 |
| ఇంగ్లండు, వేల్సులు | 16.3 | 13.4 |
| జర్మనీ | 17.9 | 12.6 |
| స్వీడను | 15.2 | 12.2 |
| న్యూజిలాండు | 19.0 | 8.8 |
| బ్రిటిషుఇండియా | 35.5 | 25.9 |

ఈ పట్టికలవలన నితరదేశములకంటె మనదేశమునం దన్నివయస్సులయందునను స్త్రీ పురుష మరణము లధికముగ నున్నవని తెలిసికొనగలము.

(1. *From India in 1931. P. 149.*)

సాలు 1కి వివిధదేశములలో 1000 కి గల పురుషమరణములు—వయస్సుననుసరించి.

| వయస్సు | ఆస్ట్రేలియా 1901—1910. | డెన్మార్కు 1906—1910. | ఇంగ్లండు 1901—1910. | ఫ్రాన్సు 1898—1903. | జర్మనీ 1901—1910. | హాలెండు 1900—1909. |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| 0 | 95.10 | 120.67 | 144.34 | 163.26 | 202.34 | 140 46 |
| 5 | 2.81 | 2.85 | 5.42 | 6.35 | 5.28 | 4.96 |
| 10 | 1.79 | 1,81 | 1.82 | 3.03 | 2.44 | 2.26 |
| 15 | 2.55 | 2.48 | 2.61 | 3.75 | 2.77 | 2.60 |
| 20 | 3.70 | 3.86 | 3.78 | 6.99 | 5.04 | 5.07 |
| 25 | 4.48 | 4.04 | 4.54 | 7.52 | 5.13 | 4.92 |
| 30 | 5.19 | 4.47 | 5.66 | 7.86 | 5.56 | 4.75 |
| 35 | 6.38 | 5.28 | 7.32 | 9.42 | 6.97 | 5.37 |
| 40 | 8.16 | 6.89 | 9.31 | 11.04 | 9.22 | 6.79 |
| 45 | 10.83 | 9.38 | 12.23 | 13.63 | 12.44 | 8.98 |
| 50 | 13.95 | 11.87 | 16.57 | 17.01 | 16.93 | 11.77 |
| 55 | 18.16 | 17.07 | 23.08 | 21.53 | 23.57 | 16.86 |
| 60 | 25.84 | 23.89 | 32.62 | 30.84 | 32.60 | 24.29 |
| 65 | 38.59 | 34.03 | 45.57 | 44.30 | 47.06 | 37.20 |
| 70 | 61.62 | 53.63 | 67.08 | 68.32 | 69.36 | 57.43 |
| 75 | 96.10 | 80.79 | 100.62 | 108.70 | 106.40 | 89 21 |
| 80 | 137.95 | 131 97 | 141.63 | 167.80 | 157 87 | 137.00 |
| 85 | 197.01 | 191.64 | 203 15 | 230.50 | 231.60 | 204 00 |
| 90 | 277.36 | 290.48 | 295 .66 | 276.80 | 320.02 | 290.00 |
| 95 | 381.11 | ... | 369.66 | 341.50 | 413.99 | 600.00 |
| 100 | 525.36 | ... | 449.69 | 460.00 | 496.68 | ... |

వివిధదేశములలో 1000 కి సాలుసరిగల వయసుననుసరించి స్త్రీమరణములను దెలుపుచున్నది.

| వయస్సు | ఇండియా 1901—1910. | ఇటలీ 1901—1910. | జపాను 1898—1903. | నార్వే 1901—1910. | స్వీడను 1901—1910. | స్విజర్లాండు 1901—1910. | అమెరికా 1901—1910. |
|---|---|---|---|---|---|---|---|
| | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) |
| 0 | 284.60 | 152.11 | 140.92 | 66 79 | 75.98 | 112.58 | 105.51 |
| 5 | 26.20 | 8.50 | 8.10 | 4.28 | 5.16 | 4.06 | 5.00 |
| 10 | 12.90 | 2.90 | 3.77 | 3.19 | 3.25 | 2.26 | 2.36 |
| 15 | 13.40 | 4.89 | 6.38 | 4.58 | 4.19 | 3.81 | 3.09 |
| 20 | 17.00 | 6.48 | 9.64 | 6.13 | 5.26 | 5.40 | 4.90 |
| 25 | 20,00 | 7.33 | 9.92 | 6.66 | 5.96 | 6.18 | 5.91 |
| 30 | 23.10 | 7.58 | 9.98 | 6,93 | 6.12 | 6,63 | 6.87 |
| 35 | 26.60 | 7.89 | 10.67 | 7.43 | 6.50 | 7.22 | 7 77 |
| 40 | 30.80 | 8.54 | 11.38 | 7.73 | 7.00 | 8.22 | 8 54 |
| 45 | 35.30 | 8.80 | 11,49 | 8.06 | 7.68 | 9.07 | 10 27 |
| 50 | 40.60 | 10.66 | 13.80 | 9.46 | 9.11 | 12.34 | 12.78 |
| 55 | 47.40 | 14.44 | 18.52 | 11.94 | 11.96 | 17.53 | 18 08 |
| 60 | 57.80 | 23.26 | 26.50 | 16.11 | 16.60 | 27.01 | 25.53 |
| 65 | 74.40 | 37.54 | 39.87 | 24.12 | 24.92 | 43.27 | 37·33 |
| 70 | 101.20 | 64.07 | 60.72 | 37.13 | 40.32 | 67.14 | 54.72 |
| 75 | 146 00 | 103.74 | 92,00 | 60.72 | 67.02 | 104.03 | 81.13 |
| 80 | 224.90 | 168.42 | 137.20 | 96.29 | 109.48 | 154.71 | 122.14 |
| 85 | 362.80 | 247.27 | 204,50 | 150.31 | 173.55 | 220.16 | 178.61 |
| 90 | 590.70 | 356.92 | 304.80 | 218.48 | 252.73 | 309.20 | 246.87 |
| 95 | ... | 521.98 | 454.40 | 311.60 | 360.75 | 402.96 | 324.90 |
| 100 | ... | ... | 677.30 | 396.00 | 440.00 | 590.07 | 393.81 |

ప్రత్యేకముగ నగరముల మరణసంఖ్య దుర్భరము. బొంబాయి నగరమున 1000 కి 27.5; చెన్నపట్టణమున 1000 కి 47.9; కలకత్తా యందు 1000 కి 36.7; 1925 వ సంవత్సరమున మరణించిరి. ఈ సంవత్సరమందే లండను నగరమున 1000 కి 11.7 మాత్రమే మరణించిరి. 1925 వ సంవత్సరములో కాశీయందు 1000 కి 46.1 గురును; కాశీ కంటోన్మెంటునందు 1000 కి 12.3 గురును; పూనానగరమున 31.4 గురును; పూనా కంటోన్మెంటునందు 1000 కి 11.6 గురును మరణించిరి.

1930 వ సంవత్సరమున ముఖ్యనగరములయందు మరణముల సంఖ్య యిట్లున్నది.

| | | |
|---|---|---|
| 1 మదరాసు | 43.64 | |
| బొంబాయి | 23.79 | |
| కలకత్తా | 28.9 | |
| | నగరము | కంటోన్మెంటు |
| పూనా | 46.80 | 11.29 |
| కరాచీ | 29.35 | 13.48 |
| హైదరాబాదు | 30.52 | 6.65 |
| అహమ్మదు నగరము | 27.58 | 10.19 |
| లక్నో | 47.11 | 18.33 |
| కాశి | 55.74 | 12.04 |
| కాన్పూరు | 44.17 | 15.17 |

*(1. From Statistical Abstract for British India 1930-31 P. 467)*

| | నగరము | కంటోన్మెంటు |
|---|---|---|
| అలహాబాదు | 39.50 | 11.18 |
| ఆగ్రా | 49.31 | 19.97 |
| బార్లే | 35.10 | 14.49 |
| మీరటు | 22.71 | 16.55 |
| ఫైజాబాదు | 28.03 | 7.20 |
| ఫరూకాబాదు | 53.61 | 26.27 |
| మధుర | 54.37 | 10.45 |
| ఝాన్సీ | 60.06 | 14.28 |
| జబల్ పురము | 20.57 | 9.0 |

నగరముల మరణసంఖ్యకును, కంటోన్మెంటుల మరణసంఖ్యకును గల విశేష వ్యత్యాసము గమనీయము. కంటోన్మెంటులు ప్రతిచోట విశాలముగ నిర్మింపబడుచున్నవి. అనారోగ్యకారణము లచ్చట కానరావు. అచ్చట భాగ్యవంతులగు నాంగ్లేయులుందురు. వారితాబేదార్లుందురు. ఆరోడ్లు తీర్చి దిద్దినట్లుండును. అచ్చటియిండ్లు విశాలముగ ప్రాణవాయువుతో నిండియుండును. కంటోన్మెంటులలో తక్కువమరణముల సంఖ్య కివియే కారణములు. కంటోన్మెంటులకును, నగరములకునుగల యీతారతమ్యము ననుసరించి ప్రజల (అంతస్తు) జీవితవిధాన మధోగతియం దుండుటయే అధికమరణములకు కారణమని స్పష్టము. ఏ మతస్థు లెంతమంది చనిపోవుచున్నదియు నీపట్టిక తెలుపుచున్నది.

| 1 మతము. | 1921 | 1925 | 1930 |
|---|---|---|---|
| క్రైస్తవులు | 16.61 | 18.64 | 20.79 |
| హిందువులు | 30.87 | 24.72 | 27.67 |
| మహమ్మదీయులు | 29.54 | 24.99 | 25.13 |
| బౌద్ధులు | 21.58 | 18.68 | 21.14 |
| ఇతరులు | 52.54 | 33.88 | 35.84 |

ఇతరజాతులనగ గర్భదరిద్రావస్థయందున్న బీదలు. పై అంకెలనుబట్టి చూచిన, దారిద్ర్యముతో బాటు అల్పాయువు వెన్నంటియుండునని రుజువుపడెను.

మనదేశమునందున్న నేటి అధికమరణములకు కారణ మత్యధిక దుర్భరదారిద్ర్యావస్థయే యనుట నిర్వివాదాంశము. ఈ మరణములు జూన్, జులై, ఆగష్టు మాసములలో ప్రారంభించి డిశంబరు మొదలు ఫిబ్రవరి వఱకు విరివిగ నుండి, మార్చి, ఏప్రియల్ మాసములలో తగ్గుచుండును. మాతాశిశువుల మరణములు పరీక్షించుచో గర్భనిర్భేద్యముగ నున్నది. 15–30 సంవత్సరములమధ్య ప్రసవించిన స్త్రీల మరణములు 10–30 సంవత్సరముల వయస్సుగల స్త్రీ మరణములు, పురుష మరణములకంటె నత్యధికము.

(1.From Statistical Abstract for British India 1930-31 P. 461)

### మ ద రా సు.

| వయస్సు | 1881. | 1891. | 1901. | 1911. | 1931. |
|---|---|---|---|---|---|
| 0 | 22.35 | 26 92 | 26.21. | 25,92 | 28.71 |
| 10 | 32.92 | 38.70 | 36.93 | 37.78 | 37.61 |
| 20 | 27.86 | 32 55 | 30.43 | 31.60 | 30.60 |
| 30 | 23.59 | 26.57 | 24.24 | 25.35 | 24.36 |
| 40 | 19.06 | 21 06 | 18 60 | 20.06 | 19.17 |
| 50 | 14.28 | 15.91 | 14.05 | 15.74 | 14.79 |
| 60 | 9.60 | 11.06 | 10.10 | 11.70 | 10.56 |
| 70 | 5.66 | 6.94 | 6.27 | 7.68 | 6.45 |
| 80 | 2.92 | 3.85 | 3.35 | 3.98 | 3.13 |
| 90 | 1.00 | 1.82 | 1 56 | 1.50 | 1.13 |

### బొం బా యి.

| వయస్సు | 1881 | 1891. | 1901. | 1911. | 1931. |
|---|---|---|---|---|---|
| 0 | 23.04 | 26.12 | 22.77 | 22.52 | 27.84 |
| 10 | 32.87 | 37.20 | 34 62 | 33.33 | 36.72 |
| 20 | 27.38 | 30.87 | 28.39 | 26.43 | 29.61 |
| 30 | 22.71 | 24 67 | 22.27 | 21.32 | 23.70 |
| 40 | 18.01 | 18 94 | 16.90 | 17 23 | 18.43 |
| 50 | 13.17 | 13.88 | 12.48 | 13.51 | 13.73 |
| 60 | 8.66 | 9.59 | 8.73 | 9.94 | 9.55 |
| 70 | 5.01 | 6.05 | 5.38 | 6.55 | 5.89 |
| 80 | 2.51 | 3.39 | 2.81 | 3.48 | 2.95 |
| 90 | .50 | 1.65 | 1.07 | 1.41 | 1.00 |

## పంజాబు.

| వయస్సు | 1881. | 1891. | 1901. | 1911. | 1931. |
|---|---|---|---|---|---|
| 0 | 24.80 | 26.58 | 23.18 | 21.23 | 28.05 |
| 10 | 35.57 | 38.07 | 35.45 | 31.38 | 38.07 |
| 20 | 29.92 | 31.76 | 29.59 | 26.12 | 31.22 |
| 30 | 24.96 | 25.60 | 24.54 | 21.60 | 25.45 |
| 40 | 20.05 | 20.22 | 19.99 | 17.55 | 20.13 |
| 50 | 15.07 | 15.56 | 15.43 | 14.15 | 15.09 |
| 60 | 10.25 | 11.41 | 10.70 | 10.63 | 10.22 |
| 70 | 6.19 | 7.60 | 6.39 | 6.53 | 5.98 |
| 80 | 3.32 | 4.48 | 3.28 | 3.11 | 2.91 |
| 90 | 1.20 | 2.26 | 1.38 | 1.13 | 1.19 |

## సంయుక్త రాష్ట్రములు.

| వయస్సు | 1881. | 1891. | 1901. | 1911. | 1931. |
|---|---|---|---|---|---|
| 0 | 23.10 | 24.45 | 25.30 | 21.21 | 24.56 |
| 10 | 32.97 | 34.10 | 35.26 | 31.44 | 35.45 |
| 20 | 27.38 | 27.75 | 28.43 | 25.27 | 29.06 |
| 30 | 22.63 | 22.35 | 22.01 | 20.89 | 23.11 |
| 40 | 17.46 | 17.74 | 16.76 | 17.18 | 17.96 |
| 50 | 12.91 | 13.56 | 12.64 | 13.47 | 13.61 |
| 60 | 8.36 | 9.63 | 8.92 | 9.84 | 9.64 |
| 70 | 4.78 | 6.15 | 5.50 | 6.50 | 5.98 |
| 80 | 2.41 | 3.42 | 2.96 | 3.42 | 2.98 |
| 90 | .50 | 1.60 | 1.23 | 1.11 | .71 |

# జనసంఖ్య

| వయస్సు | బర్మా 1901. | బర్మా 1911. | బర్మా 1931. | మధ్యరాష్ట్రములు, హైదరాబాదు 1881. | మధ్యరాష్ట్రములు, హైదరాబాదు 1931. |
|---|---|---|---|---|---|
| 0 | 30.29 | 31.48 | 30.61 | 22.83 | 28.10 |
| 10 | 39.39 | 39.88 | 39.55 | 32.46 | 37.29 |
| 20 | 33.28 | 32.82 | 32.49 | 26.92 | 30.22 |
| 30 | 27.68 | 27.30 | 26.28 | 22.20 | 24.42 |
| 40 | 22.58 | 22.04 | 20.90 | 17.55 | 19.42 |
| 50 | 17.45 | 16.51 | 16.04 | 12.85 | 15.18 |
| 60 | 12.18 | 11.00 | 11.04 | 8.43 | 10.57 |
| 70 | 7.37 | 6.66 | 6.52 | 4.85 | 5.77 |
| 80 | 3.84 | 3.61 | 3.28 | 2.42 | 2.67 |
| 90 | 1.75 | 1.77 | 1.62 | .50 | 1.22 |

| వయస్సు | బీహారు, ఒరిస్సాలు. 1931. | రాజపుటానా, అజ్మీరు, మార్వారా. 1931. | సింధు, పశ్చిమోత్తర పరగణాలు. 1931 |
|---|---|---|---|
| 0 | 28.88 | 23.60 | 25.43 |
| 10 | 37.59 | 33.60 | 34.47 |
| 20 | 29.97 | 27.41 | 27.79 |
| 30 | 23.55 | 21.45 | 21.77 |
| 40 | 17 93 | 16.95 | 17.10 |
| 50 | 13.36 | 13.10 | 13.43 |
| 60 | 9.39 | 9.35 | 9.74 |
| 70 | 5.96 | 5.80 | 5.57 |
| 80 | 3.08 | 2.92 | 2.73 |
| 90 | 1.20 | 1.00 | 1.07 |

హిందూదేశ మొత్తమున

| వయస్సు | 1881. | 1891. | 1901. | 1911. | 1931. |
|---|---|---|---|---|---|
| 0 | 23.67 | 24.59 | 23.63 | 22 59 | 26.91 |
| 10 | 34 00 | 35 46 | 34.73 | 33.36 | 36.38 |
| 20 | 28·55 | 29.24 | 28 59 | 27.46 | 29 57 |
| 30 | 23.80 | 23.66 | 22.90 | 22.45 | 23.60 |
| 40 | 18.90 | 18.75 | 17 91 | 18.01 | 18.60 |
| 50 | 13.93 | 14.28 | 13 59 | 13.97 | 14.31 |
| 60 | 9.25 | 10.12 | 9.53 | 10.00 | 10.25 |
| 70 | 5.44 | 6.48 | 5.80 | 6.19 | 6.35 |
| 80 | 2.87 | 3.65 | 3.07 | 3.06 | 3.13 |
| 90 | 1.00 | 1.69 | 1.23 | 1.15 | 1.12 |

ఇంగ్లండు.

| వయస్సు | 1901. | 1911. | 1921. |
|---|---|---|---|
| 0 | 44.07 | 46.04 | 55.62 |
| 10 | 49.65 | 52·35 | 44 64 |
| 20 | 41.04 | 43 67 | 45 78 |
| 30 | 33.06 | 35.29 | 37 40 |
| 40 | 25.65 | 27 27 | 29.19 |
| 50 | 18.89 | 19.85 | 21.36 |
| 60 | 12.90 | 13.83 | 14.36 |
| 70 | 8.02 | 8 25 | 8.75 |
| 80 | 4.40 | 4.64 | 4 93 |
| 90 | 2.32 | 2.37 | 2.82 |

| వయస్సు | బర్మా | | | మధ్యరాష్ట్రములు, హైదరాబాదు | |
|---|---|---|---|---|---|
| | 1901. | 1911. | 1931 | 1881. | 1931. |
| 0 | 32.21 | 32.61 | 31.00 | 24.65 | 28.21 |
| 10 | 38.92 | 40.22 | 37.23 | 31.84 | 34.79 |
| 20 | 32.98 | 32.67 | 30.40 | 26.72 | 28.33 |
| 30 | 28 96 | 27.21 | 25.76 | 22.69 | 24.08 |
| 40 | 24.62 | 22.24 | 21.33 | 18.50 | 20.24 |
| 50 | 19.00 | 16.75 | 16.64 | 13.75 | 16.19 |
| 60 | 13.16 | 11.15 | 11.63 | 8.90 | 11.60 |
| 70 | 7.77 | 6.72 | 6 89 | 5.03 | 6.88 |
| 80 | 3.96 | 3.63 | 3.49 | 2.46 | 2.95 |
| 90 | 1.83 | 1.77 | 1.68 | .50 | 1.25 |

| వయస్సు | బీహారు, ఒరిస్సాలు. 1931. | రాజపుటానా, అజ్మీరు, మార్వారా. 1931. | సింధు, పశ్చిమోత్తర పరగణాలు. 1931 |
|---|---|---|---|
| 0 | 26 90 | 25.96 | 23.28 |
| 10 | 33.78 | 33.45 | 29.87 |
| 20 | 27.07 | 26.78 | 23.81 |
| 30 | 22.54 | 21.74 | 18.65 |
| 40 | 18 11 | 17.47 | 15.07 |
| 50 | 13.72 | 13 62 | 12.25 |
| 60 | 9.75 | 9.87 | 9.05 |
| 70 | 6.21 | 6.19 | 5.24 |
| 80 | 3.40 | 3.09 | 2.16 |
| 90 | 1 53 | 1.15 | ... |

## పంజాబు.

| వయస్సు | 1881. | 1891. | 1931 |
|---|---|---|---|
| 0 | 26.85 | 27.62 | 26.57 |
| 10 | 35.05 | 37.13 | 34.80 |
| 20 | 29.88 | 31.97 | 28.88 |
| 30 | 25.77 | 26.87 | 24.44 |
| 40 | 21.35 | 21.89 | 20.49 |
| 50 | 16.28 | 17.08 | 16.14 |
| 60 | 10.90 | 12.33 | 11.48 |
| 70 | 6.43 | 8.01 | 7.03 |
| 80 | 3.37 | 4.63 | 3.43 |
| 90 | 1.30 | 2.30 | 1.31 |

## హిందూదేశ మొత్తమున.

| వయస్సు | 1881. | 1891. | 1901. | 1911. | 1931. |
|---|---|---|---|---|---|
| 0 | 25.58 | 25.54 | 23.96 | 23.31 | 26.56 |
| 10 | 33.42 | 34.40 | 33.86 | 33.74 | 33 61 |
| 20 | 28 44 | 29.28 | 28.64 | 27.96 | 27.08 |
| 30 | 24.48 | 24.69 | 23.82 | 22.99 | 22.30 |
| 40 | 20.03 | 20.20 | 19.12 | 18.49 | 18.23 |
| 50 | 14.96 | 15.59 | 14.50 | 14.28 | 14.65 |
| 60 | 9.79 | 10 87 | 10.02 | 10.11 | 10.81 |
| 70 | 5 63 | 6.80 | 5.98 | 6.22 | 6.74 |
| 80 | 2 88 | 3.76 | 3.12 | 3.06 | 3.25 |
| 90 | .91 | 1.75 | 1.64 | 1.10 | 1.18 |

ఇంగ్లండు.

| వయస్సు | 1901. | 1911. | 1921. |
|---|---|---|---|
| 0 | 47.70 | 50 02 | 59.58 |
| 10 | 51.98 | 55.02 | 57.53 |
| 20 | 43.45 | 46.36 | 48.73 |
| 30 | 35.43 | 37.84 | 40.26 |
| 40 | 27.81 | 29.65 | 31.86 |
| 50 | 20.63 | 21.87 | 23.69 |
| 60 | 14.08 | 14.81 | 16.22 |
| 70 | 8.74 | 9.13 | 9.95 |
| 80 | 4.84 | 5.10 | 5.56 |
| 90 | 2.68 | 2 55 | 3.13 |

ఈ దిగువ పట్టికలు వివిధదేశములయందుగల జీవితప్రమాణ మును దెలుపుచున్నవి.

ఈ దిగువపట్టికలు క్రమక్రమముగ భారతదేశమునందు ఆయు క్షీణమగుచున్నటుల సుబోధకమొనరించుచున్నవి. 1881 వ సంవత్స రమునుండి నేటివఱకు ఆయుఃప్రమాణము దిగజారుచున్నది. వివిధదేశ ముల ఆయుఃప్రమాణము పరీక్షించుచో హిందూదేశమునందుకంటె తక్కువ ఆయుర్దాయముగల దేశములు గోచరించుటలేదు.

## వివిధదేశ పురుష జీవిత ప్రమాణము.

| వయస్సు | ఆస్ట్రేలియా 1901—1910. | డెన్మార్కు 1906—1910. | ఇంగ్లండు 1901—1910. | ఫ్రాన్సు 1898—1903. | జర్మనీ 1901—1910. | హాలెండు 1900—1909. |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| 0 | 55 20 | 54.9 | 48.53 | 45.74 | 44.82 | 51.0 |
| 5 | 57.91 | 59.4 | 55.90 | 53.57 | 55.15 | 58.3 |
| 10 | 53.53 | 55.1 | 51.81 | 49.75 | 51.16 | 54.3 |
| 15 | 49.03 | 50.5 | 47.31 | 45.45 | 46.71 | 49.8 |
| 20 | 44.74 | 46.3 | 43.01 | 41.53 | 42.56 | 45.7 |
| 25 | 40.60 | 42.2 | 38.86 | 39.03 | 38.59 | 41.8 |
| 30 | 36 52 | 38.0 | 34.76 | 34.35 | 34.55 | 37.8 |
| 35 | 32.49 | 33 9 | 30 79 | 30.71 | 30.53 | 33.6 |
| 40 | 28.56 | 29.7 | 26.96 | 27.15 | 26 64 | 29.5 |
| 45 | 24.78 | 25.9 | 23 27 | 23.64 | 22.94 | 25.6 |
| 50 | 21.16 | 22.1 | 19.76 | 20.26 | 19.43 | 21.8 |
| 55 | 17 67 | 18.5 | 16.48 | 16.95 | 16.16 | 18.1 |
| 60 | 14.35 | 15 2 | 13.49 | 13 81 | 13.14 | 14.7 |
| 65 | 11.31 | 12.1 | 10.80 | 10.96 | 10.40 | 11.6 |
| 70 | 8 67 | 9.3 | 8.39 | 8.42 | 7.99 | 8.9 |
| 75 | 6.58 | 6.9 | 6.41 | 6.34 | 5.97 | 6.7 |
| 80 | 4.96 | 5 1 | 4.86 | 4.87 | 4.38 | 4.9 |
| 85 | 3 65 | 3.7 | 3.53 | 3.91 | 3.18 | 3 5 |
| 90 | 2.64 | 2 6 | 2.56 | 3.29 | 2.35 | 2.2 |
| 95 | 1.88 | ... | 2.07 | 2.66 | 1.80 | 1.0 |
| 100 | 1.18 | ... | 1.53 | 1.93 | 1.50 | ... |

(*From Census Report 1931 P. 171.*)

## వివిధదేశ స్త్రీ జీవితప్రమాణము

| వయస్సు | ఇండియా 1901—1910. | ఇటలీ 1901—1910. | జపాను 1898—1903. | నార్వే 1901—1910. | స్వీడను 1901—1910. | స్విజర్లాండు 1901—1910. | అమెరికా 1901—1910. |
|---|---|---|---|---|---|---|---|
| | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) |
| 0 | 23 31 | 44 83 | 44 85 | 57,72 | 56.98 | 52.15 | 52.54 |
| 5 | 35 40 | 55.20 | 51.97 | 59.06 | 59.40 | 56.15 | 56.89 |
| 10 | 33.74 | 51.53 | 48.34 | 55.09 | 55.58 | 51.98 | 52.89 |
| 15 | 30 78 | 47.43 | 44.36 | 51.05 | 51.48 | 47.62 | 48.51 |
| 20 | 27.96 | 43 69 | 41 06 | 47.35 | 47.66 | 43.69 | 44.39 |
| 25 | 25.40 | 40.14 | 38 02 | 43.81 | 43.93 | 39.89 | 40.53 |
| 30 | 22 99 | 36.58 | 34.84 | 40.24 | 40.20 | 36.10 | 36.75 |
| 35 | 20.69 | 32.92 | 31.54 | 36.61 | 36.38 | 32.27 | 33.01 |
| 40 | 18.49 | 29.18 | 28.19 | 32.93 | 32.53 | 28.43 | 29.28 |
| 45 | 16 38 | 25 38 | 24 71 | 29.15 | 28 64 | 24.55 | 25.53 |
| 50 | 14.28 | 21.47 | 21.11 | 25.31 | 24.74 | 20.71 | 21.86 |
| 55 | 12 20 | 17.65 | 17.61 | 21.53 | 20.90 | 17.05 | 18.32 |
| 60 | 10 11 | 14.02 | 14.32 | 17.85 | 17.19 | 13.67 | 15.09 |
| 65 | 8.10 | 10 81 | 11.35 | 14.38 | 13.69 | 10 67 | 12.13 |
| 70 | 6.22 | 8.02 | 8.77 | 11.23 | 10.53 | 8.15 | 9.52 |
| 75 | 4.52 | 5.83 | 6 61 | 8.49 | 7.81 | 6.09 | 7.29 |
| 80 | 3.06 | 4.11 | 4.85 | 6.29 | 5.64 | 4.51 | 5.43 |
| 85 | 1.93 | 2.94 | 3.45 | 4.57 | 4.02 | 3.34 | 4.05 |
| 90 | 1.10 | 2.01 | 2 36 | 3.31 | 2 91 | 2.45 | 3.05 |
| 95 | ... | 1.31 | 1.55 | 2.43 | 2.10 | 1.76 | 2.37 |
| 100 | ... | ... | .83 | 1.81 | 1.70 | 1.10 | 1.90 |

(*From Census Report 1931 P. 172.*)

ఏజాతియయిన అభివృద్ధియందున్నదియు లేక క్షీణగతియందు న్నదియు తెలిసికొనవలెనన్న, సగటున ఆజాతియందుగల ఆయుర్దాయమే పరీక్షింపవలసియున్నది. "గత శతాబ్దములో ఫ్రాన్సుదేశమున సగటున జీవితప్రమాణము (Expectation of Life) 29 సంవత్సరములనుండి 40 సంవత్సరములవఱకు పెఱిగినది. అమెరికాలో జీవిత ప్రమాణము వృద్ధియగుచున్నది. 1890 వ సంవత్సరమున 31.1 సంవత్సరములే సగటున మరణముల వయస్సు. 1910 వ సంవత్సరమున 38.7 వఱకు పెఱిగినది. జర్మనీయందు జీవితప్రమాణము 38. 1 సంవత్సరములనుండి 48.35 సంవత్సరములవఱకు పెరిగినది."[1] హిందూదేశమందలి స్థితి యెట్లున్నది? జీవితప్రమాణమునం దభివృద్ధిలేదు. భారతీయులు నూరేండ్లవఱకు గూడ జీవించుచుండెడివారు. నేను నానాటికి జీవితప్రమాణ మధోముఖముబట్టినది. "భారతీయుని సగటు ఆయువు నేడు 22 సంవత్సరములు మాత్రమే. ఆంగ్లేయుని సగటు ఆయువన్నో 46 సంవత్సరములవఱకు గలదు."[2] అని విశ్వేశ్వరయ్యగారు చెప్పిరి.

"భారతీయ జీవితప్రమాణము దిగజారుచున్నది. చాలమంది మన జనసంఖ్య సంతాన బాహుళ్యమువలన అల్పజీవులగుచున్నారు. బాల్యవివాహములు అశక్తత గలిగించుచు, నధిక శిశుమరణములకు కారణమగుచున్నవి" అని పి. కె. వాటల్‌గారు నిర్ణయించిరి.[3]

శిశు మరణములు. భారతదేశమున గల శిశు మరణములకు పరిమితిలేదు. ఈ దిగువ పట్టికలు హిందూదేశమందలి శిశు మరణములను, ఇంగ్లండునందలి శిశు మరణములను దెలుపుచున్నవి.

---

1. *Quoted by Dr. B. Ramachandra Rao, M.A. Ph.D. F.R.C.S. The Calcutta Review p. 237. Nov. 1926.*

2. *See Sir M. Visweswarayya's presidential Address at the I. E. Conference held at Poona July 1924.*

3. *Population problem in India by Mr. P. K. Wattal,*

1 ఇంగ్లండు

| సంవత్సరము | 1000 కి సంవత్సరపు వయస్సు లోపలి మరణములు. | సంవత్సరము | 1000 కి సంవత్సరపు వయస్సు లోపు మరణములు. |
|---|---|---|---|
| 1850-5 | 156 | 1911-5 | 110 |
| 1870-5 | 153 | 1916 | 89 |
| 1991-5 | 151 | 1924 | 75 |
| 1896-1900 | 156 | 1925 | 75 |
| 1902-5 | 138 | 1926 | 70 |
| 1906-10 | 117 | | |

2 ఇండియా.

| సంవత్సరము. | 1000 కి సంవత్సరపు వయస్సులోపలి మరణములు. | | సంవత్సరము. | 1000 కి సంవత్సరపువయస్సులోపలి మరణములు. | |
|---|---|---|---|---|---|
| | పురుషులు. | స్త్రీలు. | | పురుషులు. | స్త్రీలు. |
| 1911 | 214 | 196 | 1916 | 209 | 195 |
| 1912 | 216 | 199 | 1917 | 212 | 198 |
| 1913 | 193 | 197 | 1918 | 274 | 260 |
| 1914 | 219 | 204 | 1919 | 228 | 220 |
| 1915 | 208 | 195 | 1920 | 201.31 | 188.06 |

*1. (Quoted by Jathar & Beri from The Nation & Atheneum 29 Jan. 27 Page nil-)*

*2. (From Brij Narayan P. 25.)*

| సంవత్సరం. | పురుషులు. | స్త్రీలు |
|---|---|---|
| 1921 | 205·16 | 190.14 |
| 1922 | 183.16 | 166.38 |
| 1923 | 182.56 | 167.99 |
| 1924 | 196.72 | 179.94 |
| 1925 | 181.21 | 167.02 |
| 1926 | 197.24 | 180.21 |
| 1927 | 174.01 | 159.30 |
| 1928 | 180.93 | 164.32 |
| 1929 | 185.46 | 169.49 |
| 1930 | 189.12 | 171.88 |

శిశుమరణములు_1000 కి స్త్రీపురుషశిశువులు కలిసి యిట్లున్నవి.

| సం॥రం | | సం॥రం | |
|---|---|---|---|
| 1911 | 204.98 | 1922 | 175.09 |
| 1912 | 207.65 | 1923 | 175.56 |
| 1913 | 194.61 | 1924 | 188 66 |
| 1914 | 211·83 | 1925 | 174.40 |
| 1915 | 201·90 | 1926 | 189.04 |
| 1916 | 202.34 | 1927 | 166.93 |
| 1917 | 205 18 | 1928 | 172.94 |
| 1918 | 266.96 | 1929 | 178.39 |
| 1919 | 224.40 | 1930 | 180.83 |
| 1920 | 194.93 | | |
| 1921 | 197.9 | | |

*1. From Statistical Abstract For British India 1930*

[1] (According to occupation of father)

| వృత్తి Occupation. | 1000కి జననముల సంఖ్య Crude birth rate | శిశుమరణములు |
|---|---|---|
| పైతరగతులు మధ్యతరగతులు | 98 | 38 |
| రెండవ తరగతి Intermediate Class | 104 | 55 |
| నేర్పరులగు పనివాండ్రు Skilled workers | 141 | 77 |
| రెండవ తరగతి | 162 | 89 |
| నేర్పరితనము లేని కూలీలు. | 178 | 97 |

అమెరికా దేశమునకు సంబంధించిన పై పట్టిక కూడ ఆర్థిక స్థితి ననుసరించియే శిశు మరణములలో హెచ్చుతగ్గులు గలుగునని స్థిర పఱచుచుండెను. ఇందులకు కూలీల పసిపిల్లలలోగల అధికమరణములే తార్కాణము.

2. కుటుంబమునందు గల జనసంఖ్య ననుసరించి అమెరికా దేశమునందలి శిశు మరణము లిట్లున్నవి.

| [2] కుటుంబీకులు. | (1000కి) శిశుమరణములు. |
|---|---|
| 4 గురు పిల్లలకు తక్కువకుటుంబములు. | 118 |
| 6 గురు పిల్లలు లేక హెచ్చుమంది. | 267 |
| 7 గురు ,, ,, | 280 |
| 8 గురు ,, ,, | 291 |
| 9 గురు ,, ,, | 303 |

(*1. From Seventy Birth Control Clinics by C.H. Robinson, quoted by Mr. A. P. Pillay. P. 128.*)

(*2. From Vital Statistics by Sir Arthur Newsholme quoted by Mr. A. P. Pillay P. 128.*)

తల్లిధరించిన గర్భముల సంఖ్య ననుసరించి శిశుమరణములు. (According to number of pregnancies)

| | Pregnancies per 1000 years of married life. 1000 సం॥ వివాహ జీవితమునకు వచ్చిన కడుపులు. | శిశు మరణముల సంఖ్య. | 1. Still births abortions and miscarriages to live births. పుట్టకుండా చచ్చినవారు, గర్భస్రావములు. గర్భవిచ్ఛిన్నములు 100 కి ఎన్ని. | Live births per 1000 years of married life. 1000 వివాహ జీవితమునకు సజీవజననములు. | Children alive per 1000 years of married life. 1000 వివాహ జీవితమునకు బ్రతికియున్న పిల్లలు. | 1000 గర్భములకు సజీవ జననములు. | 1000 గర్భములకు పుట్టి బ్రతికిన పిల్లలు. |
|---|---|---|---|---|---|---|---|
| 5 కడుపులు లేక లోపు | 441.1 | 226.3 | 12.5 | 391.5 | 278.7 | 888.4 | 633.7 |
| 6 కడుపులు లేక పైన | 533.6 | 272.2 | 20.9 | 477.5 | 262.2 | 894.8 | 504.4 |
| Primiparae | | | 37.9 | | | 726.4 | 726.4 |

*(From the records of the Sholapur maternity and infant welfare association. Quoted by Mr. A. P. Pillay 'Welfare problems in Rural India' P. 127.)*

ఈఅంకెలు బొంబాయిరాజధాని యందుగల షోలాపూరు జిల్లాకు సంబంధించినవి. అమెరికాలో కానుపునకు కానుపునకు మధ్య గల కాలవ్యత్యాసము ననుసరించి సంభవించు శిశు మరణములు యీపట్టిక దెలుపును—

| 1కానుపునకు-కానుపునకుమధ్యగల కాలవ్యత్యాసము. Interval since preceding birth. | శిశుమరణములు 1000 కి |
|---|---|
| 1 వ కానుపు | 94.8 |
| 2 వ కానుపు-పైకానుపులు | 106.6 |
| కానుపునకు-కానుపునకుమధ్య 1 సంవత్సరం లేదా | 146.7 |
| 2 ,, | 98.6 |
| 3 ,, | 86.5 |
| 4 ,, | 84.9 |

3. అధిక మరణములు—అత్యధిక జననముల ననుసరించుచున్నటుల తోచుచున్నది. ఇంగ్లండు నందలి జననమరణముల జూచుచో (Fertility census report of England) పెద్ద కుటుంబములలో శిశు మరణము లధికముగనున్నట్లు తెలుచున్నది.

4. శిశు మరణములు— శిశువుల జనన క్రమము ననుసరించి కూడ నున్నవి. (Order of the Child in the Family)

(1. *From the relation of birth-control to infant mortality and pregnancy waste by Mr. Norman E. Himes-quoted by Mr. A. P. Pillay P. 129*)

ఈపట్టిక తల్లివయస్సుననుసరించిన శిశుమరణములసంఖ్యను దెలుపును.

| తల్లివయస్సు | 1000 కి శిశుమరణములు |
|---|---|
| 18 సం॥ ల లోపు | 160.3 |
| 18 సం॥ మొదలు 19 వరకు | 128.9 |
| 20 ,, 24 ,, | 109.5 |
| 25 ,, 29 ,, | 101.4 |
| 30 ,, 34 ,, | 104.7 |
| 35 ,, 39 ,, | 126.5 |
| 40 ,, 44 ,, | 131.3 |
| 45 పైన | 250.0 |

5. జనసాంద్రత-క్రిక్కిరిసిన గాలి, వెలుతురు రాని ఇండ్లలో ప్రజ నివసించుటయు గూడ అధిక శిశుమరణములకు కారణమని డాక్టరు పిళ్ళగారు వ్రాసిరి.[2]

"అధిక శిశుమరణములను గురించి 1930 వ సంవత్సరమున బొంబాయి నగరమునందు సోర్లీగారు విచారించిరి."[3] వీరి నివేదిక యందు కొన్ని విశేషములు గలవు. ఈయన 2053 తల్లులను గురించి యోచించెను. ఇందు 100 కి 39.2 వంతులు పాటుపడు స్త్రీలు 100 కి 60.8 వంతులు పాటుపడనివారు. 100కి 91.48 మంది హిందువులు; 3.80% మహమ్మదీయులు; 4.72% క్రైస్తవులును గలరు. పాటుపడు తల్లులలో 100 కి 75 మంది బట్టల మిల్లులలో పనిచేయు

(1.From the Relation of Birth control to infant mortality and pregnancy waste by Norman E. Himes-quoted by Mr. A. P. Pillay Page 129.)

2. Mr. A. P. Pillay. O. B. C. M. B. B. S. p. 9.

3. Mr. Sorely.

చాలవఱకు తగ్గుననుటకు సందియములేదు. ప్రజల దరిద్రావస్థ, దుస్సహ జీవయాత్ర అత్యల్పఅంతస్తు (Low Standard of Life), పీడ, రోగములే, అధిక మరణములకు, అల్పాయుర్దాయమునకు, జనాభివృద్ధి నాశనమునకు అన్నిటికంటె ముఖ్యకారణములు. భారతీయులకు సరియగు నిద్రాహార విహారములున్నచో పాశ్చాత్యదేశములయందలి ప్రజలకు గల సౌకర్యములే భారతదేశమునందున్నచో, మనదేశ జనసంఖ్య గూడ సక్రమాభివృద్ధి నొందెడిది.

## 5. జ న సాం ద్ర త.

ఆయాప్రదేశముల నైసర్గిక లక్షణముల ననుసరించియు, శీతోష్ణ స్థితులయందు గల వ్యత్యాసముల ననుసరించియు, దేశార్థిక పరిస్థితుల ననుసరించియు, పరిశ్రమస్థానముల ననుసరించియు, జనపదములయం దధిక జనసంఖ్య, లేక అల్పజనసంఖ్య గలిగియుండును. 1921 వ సంవత్సరపు జనాభా ననుసరించి హిందూదేశమునందు చతురపు మైలు ఒకటికి 177 గురు నివసించుచున్నారు. బ్రిటిషు ఇండియా దేశమునే పరీక్షించుచో, చతురపు మైలు ఒకటికి 225 మందియు, స్వదేశసంస్థానములయందు చతురపు మైలు 1 కి 101 మందియు వసించుచున్నారు.

1931 వ జనాభా లెక్కల ననుసరించి చ॥ మైలు 1 కి 195 మంది హిందూదేశపు మొత్తమునను, రాష్ట్రములలో చ॥ మైలు 1 కి 248 మందియు నివసించుచున్నారు.

ఇతర దేశములయందలి జనసాంద్రత ఇట్లునది.

## 1 వ పట్టిక.

| దేశము | విస్తీర్ణము చ. మై | జనసంఖ్య వేలలో (0000)లు | చ॥ మైలు 1 కిగల జనసంఖ్య |
|---|---|---|---|
| గ్రేటుబ్రిటను | 89047 | 42917 | 482.0 |
| పశ్చిమ ఐరోపాఖండము | 2823191 | 342022 | 121.1 |
| ఇంగ్లీషురష్యా | 2188990 | 102489 | 46.8 |
| ఆసియా రష్యా | 6323480 | 33675 | 5.3 |
| ఇండియా | 1805332 | 318942 | 176.3 |
| జపాను | 260738 | 76988 | 295.3 |
| ఈజిప్టు | 12023 | 12751 | 106.0 |
| చైనా | 4277170 | 436095 | 102.0 |
| కెనడా | 3603336 | 8788 | 2.4 |
| ద. ఆఫ్రికా | 473089 | 6929 | 14.6 |
| ఆస్ట్రేలియా | 2974581 | 5436 | 1.8 |
| న్యూజిలాండు | 103568 | 1219 | 11.7 |
| అమెరికా | 2973774 | 105711 | 35.5 |
| బ్రెజిలు | 3275510 | 30636. | 9.3 |
| అర్జెంటైను | 1553119 | 8699 | 7.5 |
| ఇతరదక్షిణాఫ్రికాప్రదేశములు | 268000 | 31907 | 9.3 |

*(See "Is unemployment inevitable? P. 61. Report of the Unemployment Committee in the United Kingdom." Quoted by Dr. B. Ramachandrarao. Calcutta Review Nov. 1926 P. 245.")*

2 వ పట్టిక.

| 1దేశము. | జనసాంద్రత. చ. మై.1కి | దేశము. | జనసాంద్రత. చ. మై.1కి |
|---|---|---|---|
| బెల్జియం | 654 | స్పెయిను | 107 |
| ఇంగ్లండు, వేల్సు | 649 | జపాను | 215 |
| ఫ్రాన్సు | 184 | అమెరికా సంయుక్త రాష్ట్రములు— | 32 |
| జర్మని | 332 | న్యూజిలండు | 11.8 |
| నెదరులాండ్సు | 544 | ఈజిప్టు | 34 |
| ఆస్ట్రియా | 199 | | |

3 వ పట్టిక.

ఈ పట్టిక 1931 వ జనాభా నివేదికనుండి గ్రహింపబడెను.

| 2దేశము. | వైశాల్యము. | జనసంఖ్య. | చ. మై. 1కి జనసాంద్రత. |
|---|---|---|---|
| ఇంగ్లండు, వేల్సు | 58000 | సుమారు 40000000 | 685 |
| ఐరోపాఖండము | 3750000 | 475000000 | 127 |
| అమెరికా | 3027000 | 128000000 | 41 |
| చైనా (టిబెట్టు-మంగోలియా చైనా, టర్కిస్థానము - మంచూరియాలు కలిపి) | 4250000 ($4\frac{1}{4}$ మిలియను)- | 342000000 | 80.5 |
| చైనాదేశము మాత్రమే— | 1500000 ($1\frac{1}{2}$ మిలియను)- | | 200 మొదలు 220 వఱకు |

1. *From Census Report 1931 P. 4.*
2. *From Census Report 1931. P. 5.*

ఈఅంకెల ననుసరించి జనసాంద్రత, ఆర్థిక వృద్ధి క్షయములకు సూచికగా నోపదని చెప్పదగును. 2 వ పట్టిక ననుసరించి అమెరికా, ఈజిప్టు దేశముల జనసాంద్రత యించుమించుగ సమముగనున్నది. కాని అమెరికా ఈజిప్టుదేశమునకంటె నెన్నియో రెట్లు భాగ్యవంతము. ఇట్లే అమెరికా, ఇంగ్లండుల జనసాంద్రతయం దమితభేదము కలదు. అంతమాత్రమున అమెరికాదేశమునకంటె ఇంగ్లండు భాగ్యవంత మనుటయు తగదు.

జనసాంద్రత ననుసరించి జనుల ఆర్థికవిషయములను గనుగొన వలయునన్న ఏదేశమున కాదేశమే పరీక్షింపదగును. హిందూదేశమందలి వివిధరాష్ట్రముల జనసాంద్రత 1921, 1931 వ సంవత్సరములలో జనాభా లెక్కల నివేదిక ననుసరించి ఈక్రిందిపట్టికప్రకారమున్నది.

చతురపు మైలు 1 కి 250 మంది కంటె నెక్కువ సేద్యగాండ్రు జీవింపజాలరని పాశ్చాత్యదేశములలో మదింపువేసిరి. అమెరికాయందు చ॥ మైలు 1 కి 400 సేద్యగాండ్రు నివసింపగలరనిరి. మనదేశమున చ॥ మైలు 1 కి 646 మంది వంగదేశమున కొచ్చిను సంస్థానమున 814 మందియు గూడ నివసింపవలసివచ్చుచున్నది. కాని గాకపోకల వీళ్ళ నేర్పరచుచో, జనసంఖ్యయొక్క వివిధవృత్తులు సక్రమాభివృద్ధికర ముగ మారుచో, వ్యవసాయముపై నాధారపడువారు పరిశ్రమలవంకకు మరలుచో ఆయారాష్ట్రముల జనసాంద్రతయందు గల విభేదములు తొలగిపోవుట కవకాశము గలదు. ఇతర దేశముల జనసాంద్రతతో భారతదేశ జనసాంద్రతను బోల్చిచూచిన, భారతదేశ మధికజనసంఖ్య తో నిండియున్నదన జాలము.

# 6. జనసంఖ్య—వారివృత్తులు.

ఈదిగువ పట్టిక ననుసరించి యే యే వృత్తిపై ఎంతమంది జీవించుచున్నదియు తేలగలదు. భారతదేశమున మూడువంతులప్రజలు వ్యవసాయముపై నాధారపడియుండిరి. 1891 వ సంవత్సరపు జనాభా లెక్కల ననుసరించి 100 కి 61.6 గురు వ్యవసాయదారులును, 1901 వ సం॥పు జనాభా లెక్కల ననుసరించి 66.50 గురు వ్యవసాయ దారులును 1911లో 72.02 గురును, 1921లో 72.89 గురును గలరు. ఈఅంకెల ననుసరించి, రాను, రాను ప్రజలు వ్యవసాయముమీదనే ఆధారపడియుండుట హెచ్చినదని తేలుచున్నది. 1891 మొదలు 1901 వఱకు 100 కి 5 గురు వ్యవసాయముపై నాధారపడువారి సంఖ్య పెఱిగినది. ఈఅంకెలను సక్రమముగ జనాభాలెక్కలను వేయనట్లుగ పరిగణించి గమనింప మానివేసెదము. అయినను 1901 మొదలు 1911 వఱకు, 1911 మొదలు 1921వఱకు హెచ్చైన సంఖ్యనుబట్టి చూచినను వ్యవసాయముపై నాధారపడువారి సంఖ్య ప్రబలినదనుట నిర్వివాదాంశము. 1911 మొదలు 21 వఱకు గల లెక్కలను బట్టి చూచినను, సుమారు 100 కి 1 వంతు వ్యవసాయముపై నాధారపడియుండుట హెచ్చైనది. ఇది గమనార్హమగు మొత్తము గాదనుట తగదు. ఏలనన, 100 కి 1 చొ॥ 32 కోట్లకు నెంతమంది యగుదురు? ఇదియే గాక యీలెక్కల ననుసరించి, ప్రజల ఆర్థికవాతావరణ మెట్లు వీచుట ప్రారంభించినదియు సుబోధకమగుచున్నది.

| ప్రజల వృత్తులు. | 1921 లో | 1911 న కంటె గల హెచ్చు= + తగ్గు= — |
|---|---|---|
| 1. వ్యవసాయము. | 72.98 | + 1.8 |
| 2. ఖనిజములు. | 0.017 | + 2.3 |
| 3. పరిశ్రమలు. | 10.49 | - 6.0 |
| 4. ఎగుమతి, దిగుమతి. | 1.37 | -13.8 |
| 5. వర్తకము. | 5.73 | + 2 |
| 6. పోలీసు, మిలిటరీలు. | 0.69 | - 9 |
| 7. చిత్రలేఖనము మొదలగు ఆర్ట్సు | 1.59 | - 7.1 |
| 8. పరిపాలనా యంత్రము. | 0.34 | - 0.1 |
| 9. స్వతంత్ర పోషకులు. | 0.15 | -11.1 |
| 10. ఇండ్లలో నౌకర్లు. | 1.44 | - 0.06 |
| 11. పలుతరగతులవారు. | 3.51 | +20.1 |
| 12. నిరర్థకులు. (unproductive) | 1.04 | - 5.7 |
| 13. మొత్తముమీద జనాభివృద్ధి. | | + 1.2 |

ఇందులో పరిశ్రమలమీద ఆధారపడునట్లు చూపబడిన 10.49 గురులోను 100 కి 4 గురు మాత్రమే పరిశ్రమలని పిలువదగిన

వాటిపై బ్రతుకుచున్నారు. మిగతావారందఱు గ్రామములలో వ్యవసాయమున కనుబంధముగనుండు పనులపై జీవించెడివారే. గ్రామములయందలి వడ్రంగులు, కమ్మరు లనబడు వారందఱు గూడ పరిశ్రమలపై నాధారపడియుండు వారి క్రింద మదింపు వేయబడిరి. అట్లనుటకు వీలులేదు. వీరును వ్యవసాయకులపై నాధారపడువారే. వారి పనిముట్లు వీరిచే తయారగును వ్యవసాయభాగముగనున్నవి. వ్యవసాయకుల కుటుంబములలో వీరు గూడ సభ్యులే. ఇతరులు గూడ నిట్లే. చిల్లరపరిశ్రమలపై నాధారపడు 6.49 గురినికూడ వ్యవసాయకుల సంఖ్యకు చేర్చుచో, వ్యవసాయముపై నాధారపడుచున్న వారి సంఖ్య 100 కి 7½ వఱకు అదనముగ పెరిగిన దనగలము. మఱియు పని చేయువారిపై పనిచేయకుండ ఆధారపడియుండువారి సంఖ్య కూడ హెచ్చినది. 1901 లో 47 గురు కష్టించువారిపై 53 గురు ఆధారపడువా రుండెడివారు. 1921 వచ్చుసరికి 46 గురు కష్టించువారికి 54 గురు ఆధారపడువారు హెచ్చిరి. ఇందులకు తోడు ఏతరగతికి చెందని నిర్వ్యాపార, నిరుద్యోగుల సంఖ్య 100 కి 20.1 గురు వఱకు హెచ్చైనది. పైగ నాకాలమున పరిశ్రమలు గూడ నడుగంటినవి. పరిశ్రమలవలన నగరములయం దంతవఱకు కాలక్షేపము జేయువారి సంఖ్యలో 100 కి 6 గురు తగ్గిపోయిరి. ఈభారమంతయు గూడ వ్యవసాయకులపైన బడెను.

1931 వ జనభాలెక్కల ననుసరించి యేవృత్తియం దెంతమంది ప్రజ లుండినదియు నీపట్టిక దెలుపగలదు.

| సంఖ్య | జీవనాధారమైనవృత్తి | ప్రతి 10000 మంది పాటుపడు వారికి యేవృత్తియం దెంతమంది గలరు. | |
|---|---|---|---|
| | | 1921 | 1931 |
| ఎ. | ముడిదినుసులు పండించువారు | 7241 | 6734 |
| 1 | కూరగాయలు-మాంసాహారములవృత్తి | 7217 | 6711 |
| 2 | ఖనిజములవ్యాపారము | 24 | 23 |
| బి. | చిల్లరవర్తకము-కూలీ-గుమాస్తా-కంట్రాక్టరు అనబడువారు | 1759 | 1665 |
| 3 | పరిశ్రమలు | 1075 | 997 |
| 4 | యానము | 134 | 153 |
| 5 | వర్తకము | 550 | 515 |
| సి. | ప్రభుత్వోద్యోగులు-చిత్రకళలు | 283 | 269 |
| 6 | సైన్యము | 71 | 55 |
| 7 | ప్రభుత్వపరిపాలన | 69 | 64 |
| 8 | వృత్తులు-చిత్రకళలు-మతము-న్యాయవాదులు-వైద్యులు-ఉపాధ్యాయులు మొదలగువారు | 143 | 150 |
| డి. | ఇతరులు | 717 | 1332 |
| 9 | స్వంతఆదాయముపై జీవించువారు | 13 | 14 |
| 10 | దాసీపని (ఇండ్లలో) | 173 | 708 |
| 11 | వృత్తి వివరముగ జెప్పనివారు | 406 | 505 |
| 12 | ఉత్పాదకశక్తి లేనివారు-ఖయిదీలు-పిచ్చివారు-ముష్టివారు-వ్యభిచారవృత్తి గలవారు | 125 | 105 |

| [1]దేశము; జనాభా లెక్కల సంవత్సరము. | వ్యవసాయం, జంతువులు,కూరగాయలు మీద జీవించువారు. | గనులు, పరిశ్రమలవలన జీవించువారు. | వర్తకము,ఎగుమతి, దిగుమతుల వలన జీవించువారు. |
|---|---|---|---|
| జర్మని 1907 | 28.6 | 42.2 | 13.4 |
| ఆస్ట్రియా 1910 | 48.4 | 26.5 | 12.4 |
| ఇటలీ 1911 | 34.2 | 16.9 | 5.0 |
| స్పెయిను 1910 | 21.1 | 5.2 | 1.5 |
| ఫ్రాన్సు 1911 | 40.7 | 35.8 | 9.8 |
| నెదర్‌లాండ్సు 1909 | 10.9 | 13.5 | 7.5 |
| డెన్‌మార్కు 1911 | 36.4 | 27.3 | 16.6 |
| స్విట్జరులాండు 1910 | 27.7 | 42.7 | 16.4 |
| బ్రిటిషుదీవులు, అయిర్లండు (పని చేయువారు మాత్రమే) 1911 | 11.6 | 56.8 | 18.1 |
| సంయుక్తరాష్ట్రములు (10 సంవత్సరములకు పైబడినవారు) 1920 | 26.3 | 33.4 | 17.9 |
| ఇండియా 1921 | 72.9 | 10.6 | 7.1 |

విదేశములతో పోల్చి చూచుకొనిన, హిందూదేశమునందు వ్యవసాయకులపై నత్యధికభారము పడినదనుట నిర్వివాదము. హిందూదేశము ¾ వంతులు వ్యవసాయముపై నాధారపడియున్నది. "స్టేడు గారు మనదేశమున కుటుంబము 1 కి 5 లేక 7 యకరముల పల్లపు

1. *Taken from Brij Narayan- Population of India Page 92.*

భూమియు, 20 లేక 25 యకరముల మెరకభూమియు నున్నచో జీవిత యాత్ర సాగుననని వ్రాసిరి.[1]

హట్టనుగారి మదింపు ననుసరించి సేద్యగాడు 1 కి హిందూదేశమున 2.9 యకరములు మాత్రమే గలదు. ఇందు 0.61 యకరము పల్లపుసాగు భూమి వచ్చును. వ్యవసాయముపై నాధారపడువారిని, భూకామందులుగ శిస్తులను పుచ్చుకొనువారిని, వ్యవసాయ కార్మికులను మదింపునందు జేర్పక పరీక్షించుచో, వ్యవసాయముచేయు సేద్యగాడు 1కి యు 4½ రాగలదనియు, నిందు యు 1 పల్లపు సాగుండు ననియు హట్టనుగారి మదింపు.[2]

ఇట్లు భూమిని వంచినచో సగము జనసంఖ్యకు మాత్రమే సరిపడును. సేద్యమునకు పనికివచ్చు భూమి చాల గలదు. వలయు సౌకర్యములు లేక బీడుగనున్నది. పంటలు గూడ హెచ్చులేదు. గృహ పరిశ్రమలు నశించిపోయినవి. మిల్లుల పరిశ్రమలు దేశమందంతట నల్లుకొనలేదు. ఈపరిస్థితులలో నిరాధారులసంఖ్య, కష్టించువారిపై నాధారపడువారి సంఖ్య, కొలదిగనున్న వ్యవసాయపు భూములపై నాధారపడియుండువారి సంఖ్య అత్యధికమగుటలో వింతలేదు. 1880 వ సంవత్సరపు కఱవుల కమీషనువారు ఈపరిస్థితులకు హిందూదేశమందలి గర్భదరిద్రస్థితి కారణమని వ్రాసిరి. నాటినుండి నేటివఱకు ఆర్థికాభివృద్ధియగుటకుమారు క్షామమే యభివృద్ధియగుచున్నది. ఈస్థితి తొలగవలెనన్న వ్యవసాయ పారిశ్రామికాభివృద్ధి దేశమునందు సర్వతోముఖముగ జరుగుటయే కర్తవ్యము.

1. *Quoted by Veera Ansty.*
2. *Census Report P. 288.*

# 7. నగరములు—పట్టణములు.

1931 వ సంవత్సరపు జనాభా లెక్కల ననుసరించి నగర, పట్టణ, గ్రామములలో ప్రజలెట్లు వసించుచున్నదియు నీదిగువ పట్టికలు తెలుపగలవు.

| | 1 పట్టణముల తరగతులు. | పట్టణముల సంఖ్య. | | మొత్త మాయాతరగతుల, ఆయాపట్టణముల జనసంఖ్య. | |
|---|---|---|---|---|---|
| | | 1921 | 1931 | | |
| 1 | 100000 జనసంఖ్య, అంతకుపైన, | 35 | 38 | 8211704 | 9674032 |
| 2 | 50000 మొ॥ 100000 వఱకు. | 54 | 65 | 3517749 | 4572113 |
| 3 | 20000 మొ॥ 50000 వఱకు. | 200 | 268 | 5968794 | 8091288 |
| 4 | 10000 మొ॥ 20000 వఱకు. | 451 | 543 | 6220889 | 7449402 |
| 5 | 5000 మొ॥ 10000 వఱకు. | 885 | 987 | 6223011 | 6992832 |
| 6 | 5000 ల లోపు. | 691 | 674 | 2333129 | 2205760 |
| | మొత్తపు జనపదములు. | 687981 | 699406 | | |
| | నగరపట్టణములు. | 2316 | 2575 | | |
| | గ్రామములు. | 685665 | 696831 | | |

## మొత్తపు భారతదేశ జనసంఖ్య.

1921 లో గల 318942480 మంది జనసంఖ్యలో
286467204 మంది గ్రామవాసులు.
32475276 మంది నగరపట్టణవాసులు.

1931 లో గల 352837778 మంది జనసంఖ్యలో
313852351 మంది గ్రామవాసులు.
38985427 మంది నగరపట్టణవాసులు.

1. (*Census Report 1931, P. 46*)

5000 ప్రజలు నివసించు ప్రదేశము పట్టణ మనబడు చున్నది. 1891 వ జనాభా ననుసరించి పల్లెలలో 100 కి 93.5 మందియు, 1921వ జనాభాననుసరించి 89.8 మందియు మాత్రమే కలరు. 1921 వ జనాభా ననుసరించి మనదేశమున 2575 పట్టణము లును, 685260 గ్రామములును గలవు. 1931 వ జనాభాలో 2575 పట్టణములు గలవు. బ్రిటిషు ఇండియాలో 1698 పట్టణములును సంస్థానములలో 877 పట్టణములును గలవు. 696831 గ్రామములు గలవు. భారతదేశమంతయు గ్రామముల మయము. ఐరోపాఖండ మిట్లు గాదు. హిందూదేశమున 100 కి 10 మంది మాత్రమే నగర ములయందు వసించుచున్నారు. "ఇంగ్లండులో నగరములయందు 100 కి 78 గురు, అమెరికాయందు నగరములలో 51 గురు, ఫ్రాన్సులో నగరములయందు 100 కి 43 గురు, జర్మనీలో 100 కి 46 గురు వసించుచున్నారు. ఆస్ట్రియా హంగేరీలలో 100 కి 26 గురు, బాల్కను దేశములలో 100 కి 18 గురు, రష్యాయందు 100 కి 14 గురు పట్టణ వాసులు."[1]

హిందూదేశమున 1911-21 వ సంవత్సరముల మధ్య పట్టణ ములయందు 100 కి ఒకవంతుకు లోపుగ మాత్రమే జనసంఖ్య పెరిగెను. 1931 (ఫిబ్రవరి 14) వ జనాభాలెక్కల ననుసరించి నగర ములలో, పట్టణములలో నివసించు జనసంఖ్య 100 కి 11 వఱకు పెరి గెను. అనగ 1921 కంటె 0.9 వంతు పెఱిగెను. పల్లెలయందు 100 కి 89 మంది వసించుచున్నారు.

ఈ మనపట్టణవాస జనసంఖ్యతో విదేశములయందలి పట్టణ వాసము పోల్చుకొని పరీక్షింపదగును.

1. *From Brij Narayan.*

నగరవాసుల సంఖ్య పెరిగెను. గ్రామములలో జీవనోపాధి సుసాధ్యము గాక, జనప్రవాహము నగరముల వంకకు మరలెను. నగరముల యందుగల నారమిల్లులు, దూదిమిల్లులు, ధాన్యపుమిల్లులు మొదలగు వాటిలో కూలినాలిచేసి జీవించుకొనుటకై పోవుచున్నారు. నగర వాసులు అల్పాయుర్దాయులై, జనసంఖ్య క్షీణించుచున్నది. నగరపట్ట ణముల జనసంఖ్య అత్యధికముగనుండుటయే దీనికి కారణము. అయి నను, మొత్తపు జనసంఖ్యలో బహు స్వల్పప్రమాణమే నగరముల యందు జీవించుట అనాగరిక లక్షణమనియు, ఆర్థికాభివృద్ధికి ప్రతిబంధక మనియు రనడీవంటివారు పేర్కొనిరి. పల్లెల జనసంఖ్యను నగరముల వంకకు మరల్చుట ఆచరణీయముగాదు, ఆచరణయోగ్యము గాదు. నగరపట్టణములయం దుద్భవించుచున్న నాగరికత అభివృద్ధి సూచ కముగాదు. మిల్లు పరిశ్రమ లభివృద్ధి పొందవలెనన్నను, లండను, న్యూయార్కు, బొంబాయి, కలకత్తా మొదలగు మహానగరముల నిర్మింప బనిలేదు. మహానగర నిర్మాణములు ప్రజల శారీరకార్థిక నైతిక, బల, విచ్ఛిన్నములకే కారణములగుచున్నవి.

కాని భారతదేశ విస్తీర్ణము జనసంఖ్యల ననుసరించి చూచు చో, భారతదేశమునం దింతవఱకు విదేశములలో వలె నగరముల సమస్య యుద్భవింపలేదు. పాశ్చాత్యదేశములయందు గల నగరముల దుస్సహజీవనము ప్రబలలేదు. 'బస్తీలనుండి పల్లెలకు మరలుడు' అని గొంతెత్తి యఱచుటకు తరుణము రాలేదు. ఇట్లు కేక లిడుటకు చాల కాలము గతింపవలెను.

బస్తీసౌకర్యములు, లాభములు.

"పల్లెలలో పనులుచేసిన పన్ను బస్తీలలో సౌక ర్యము లొనగూర్చుటకై వినియోగింప రాదనుట సంకుచితదృష్టి. నగరముల ప్రాముఖ్యమును ఆయా రాష్ట్ర ప్రభుత్వములకు లేక కేంద్రప్రభుత్వమునకు నగరము లెంత

ఆదాయమును పన్నుల మూలముగ నొసంగుచున్నవి యను ప్రశ్నతో వీక్షింపరాదు. నగరములు పారిశ్రామిక ఆర్థిక, విజ్ఞాన, రాజకీయ అభివృద్ధులకు నిలయములు. నగరముల పలుకుబడియే ప్రతి దేశమున ప్రతిమూల మూలలకు నెగబ్రాకి, రాష్ట్రములయం దితర ప్రదేశముల యభివృద్ధికి తోడ్పడుచున్నది." అని సర్. విలియమ్ మారిసు, సంయుక్తరాష్ట్రముల గవర్నరుగారు నుడివిరి.[1]

"సంస్కృత పదార్థములకొఱకు పల్లె లెట్లు ముడిదినుసుల పండించుచున్నవో, సాంఘికజీవనముకొఱకు నగరములు జన సంఖ్యను, ఉత్సాహమును, స్వతంత్రాభిప్రాయములను ప్రకో పింపజేయుచున్నవి. నగరములు వివిధాభిప్రాయముల నేకోన్ము ఖమునకు దెచ్చి, సంఘాభిమతమును సృష్టించుచున్నవి. పల్లెల నుండి పరిశుభ్ర జీవనదులు ప్రవహించుచున్నవి. నగరములనుండి ఉద్రేకపూరితములును, నైతికోత్సాహవంతములును నగు నభి ప్రాయ ప్రవాహములు మారుమూలలనుండు పల్లెపల్లెకు కూడ ప్రవహించుచున్నవి. నగరము సాంఘిక సహజస్వభావమును రెచ్చ గొట్టి, కష్టజీవులగు స్త్రీ పురుషులలో నుత్సాహము రగుల్కొలుప గలదు. వారి ఆలోచన శక్తిని పెంపొందించి, వారి యోచనకై నిర్ణీత అభిప్రాయముల నొసంగగలదు." అని ప్రొఫెసరు గిడ్డింగు గారు వ్రాసిరి.[2]

"నగరములు, వివేకోద్భవమునకు, కార్యోత్సాహమునకు, కార్యాచరణకు కేంద్రములు" అని ఖజానా విచారణ సంఘము వారు వ్రాసిరి.[3]

---

*1. From the reply to the Address of the Cawnpore Trust July 28, 1923.*

*2. Quoted by Dr. B. Ramachandra Rao.*

*3. Report of the Indian Fiscal Commission P. 28*

నగరములు భారతీయజీవనమునందు గూడ ప్రాముఖ్యస్థానము వహించుచున్న మాట నిశ్చయమే. నగరములకు రాకపోకల సౌకర్య ము లధికముగనున్నవి. ప్రపంచ పరివర్తనముతో సంబంధము గలిగి యున్నవి. వివిధమత కుల వృత్తులతో గూడిన ప్రజల సర్వవిధసాంప్ర దాయములు పరస్పరప్రేరేపణలకులోనై, జాతీయభావ సంభవమునకు దారిదీయుటకు నగరములయందు వీలున్నది. ప్రజలందఱకు సంబంధిం చిన ఆర్థికదృక్పథమే ప్రధానస్థానము వహించి మత కుల వృత్తి వివక్షు తలు అప్రాధాన్యస్థితియందుంచుట కవకాశముగలదు. పాశ్చాత్య దేశములయందు నగరముల జనసంఖ్య అధికముగనుండి పరిశ్రమ లన్నియు నగరములయందుండుటచే ధనాఢ్యుల ధనశోషణను, పీడను కార్మికులు భరింపజాలకపోవుచున్నారు. ఈకారణముననే నూతన విప్ల వములన్నియు పాశ్చాత్యఖండములలో నగరములనుండి బయలువెడ లినవి. రాజకీయార్థిక విప్లవములకు నగరములే జన్మస్థానములగుటచే పాశ్చాత్యఖండములలో నగరములే నేటికిని ప్రధాన ప్రాముఖ్యస్థాన ములు వహించుచున్నవి. భారతభూమియొక్క సహజస్థితివేరు. భారత భూమి ముఖ్యముగ వ్యవసాయదేశ మగుటచే, ఏనూతనవిప్లవము జనింపవలెనన్నను, సేద్యగాండ్రు మొట్టమొదట సంసిద్ధులు కావలెను. పిమ్మట పట్టణములయందలి కార్మికులు సంసిద్ధులుగ నుండవలెను. అందుచే భారతవర్షమందు పల్లెలే ప్రధానస్థానము వహింపకతీరదు. డాక్టరు బి. రామచంద్రరావుగారు వ్రాసినటుల "ఈదేశమున రాజకీయ స్వాతంత్ర్యము-లేక-ఆర్థికస్వాతంత్ర్యము- దేనిని సంపాదింపవలెనన్నను,

అసంతృప్తులై యుండు సేద్యగాండ్రే కష్టించి పనిచేయు పట్టణముల యందలి కార్మికులతోగూడి నిశ్చయముగ అభివృద్ధిని బడయగలరు."[1]

అందుచే భారతదేశము తనదృష్టిని పల్లెలపై నిగుడించు పట్టణవాసముటత్యవసరము. కాని పట్టణముల నుదాసీనభావమున జూడ బెడుగులు. రాదు. పరిశ్రమ లభివృద్ధి యయినకొలదిని పట్టణముల జనసంఖ్య పెరుగుట సహజము. పట్టణములజనసంఖ్య పెరిగి అదియొక క్లిష్టసమస్యగ పరిణమించుటకు పూర్వమే తగుజాగరూకత వహించు టత్యవసరము. "ఆధునిక నాగరికసమస్యలలో పట్టణములు విరివిగ పెఱుగుచున్న సమస్యయే ప్రాముఖ్యసమస్య."[2]

"పట్టణసౌకర్యములనుగుఱించి చెప్పుచు, పట్టణమే సజీవమనుట ఆశ్చర్యకరమగుసత్యేతరవిషయము. నిజముగసంకుచితస్థలము సజీవముగ నుండును. ఒత్తిడిగనుండును. తుందుడుకుగ నుండును. అయితే, యీజీవ కళ ఆగిపోవుటకు సిద్ధపడుచున్న గడియారపు సంచలనమువంటిది." అని పట్టణములను గుఱించి అమెరికాదేశస్థుడగు లాంగుస్టాఫ్‌గారు వ్రాసిరి.[3]

భారతదేశమునకుగల స్వల్ప అనుభవమే లాంగుస్టాఫ్‌గారి నుడువులు సత్యములని మనకు సుబోధకమొనరించుచున్నది. "భారతీయులు పల్లెలలో పరిశుభ్రమగు ప్రాణవాయువును పీల్చుకొనుట కలవాటు పడిరి. దేశవాళీభోజనమున కలవాటుపడిరి. ఈరెండును పట్టణముల

---

1. *From Calcutta Review Mar. 1926 P. 405*

2. *See Mackenzie J. S. Introduction to Social Philosophy P. 101.*

3. *Quoted by Prof. Giddings- Democracy and the Empire P. 88*

రము. పట్టణమధ్యమున యంత్రాలయములుండుటవలన వాటి పొగ, ధూళి ప్రజల ఆరోగ్యాభివృద్ధికి భంగకరము. వ్యభిచారవృత్తిగల స్త్రీలను గూడ ప్రత్యేకించి ఊరిబయటకు పంపివేయవలెను. కుష్టు మొదలగు అంటువ్యాధుల రోగులను ప్రత్యేకచికిత్సాలయములకు పురపాలకసంఘములే పంపివేయవలెను. లేదా, ప్రత్యేక చికిత్సాలయముల నిర్మింపవలెను. మురుగుపోవుటకు వీళ్ల నేర్పరుపకముందు పట్టణనిర్మాణమునకు బూనరాదు. మురుగుకాలువలను భూగర్భమునుండి త్రవ్వుట యారోగ్యకరము. దాహోదకము పరిశుభ్రముగ ప్రజలకందుబాటులో లేకుండ పట్టణముల నభివృద్ధిచేయరాదు ఇతరపారిశుధ్యవిషయముల గూడ మనపట్టణములలో పురపాలకసంఘములు జాగరూకత వహించుటలేదు. బొంబాయి, కలకత్తాలవంటి నగరములలో విద్యుచ్ఛక్తివలన యంత్రములు నడుపుట ప్రారంభించి రాక్షసిబొగ్గు నుపయోగించుట మానుచో ప్రజల ఆరోగ్య మభివృద్ధి కాగలదు. ఇతరపట్టణముల యందు గూడ పరిశ్రమలకు విద్యుచ్ఛక్తినే వినియోగించుచో ప్రాణవాయువు విషవాయువు గాకుండ పీల్చుకొనుటకు మంచిగాలి లభించును. పట్టణజీవితమును గర్హింపజూచుటకంటె పట్టణవాసము ప్రాణసంకటము గాకుండ జూచుట ముఖ్యధర్మము. ఇందులకు ప్రభుత్వము విశేషధనము పురపాలకసంఘములకు విరాళముల రూపముగ గాని, ఋణములరూపముగగాని యొసంగవలెను. ప్రభుత్వసహాయము లేనిదే పట్టణములు ప్రాణసంరక్షణ కుపకరించవు. నగరములు లేక పట్టణములు అందునిర్మింపబడు మహోన్నతసౌధరాజములవలన నేర్పడుటలేదు. నగరములన కొండనంటు గోడలుగావు. వాటియందు నివ

సించు మానవప్రాణములే. మానవప్రాణసంరక్షణకే యితరపరికరము లవసరము. ఈదృక్పథముననే నగరములు,పట్టణములు నిర్మింపబడవలెను. అభివృద్ధిపఱచవలెను. పరిపాలింపబడవలెను. అప్పుడే భారతీయార్థికాభివృద్ధికాగలదు. ప్రస్తుతస్థితిలో పట్టణములను పల్లెలకు దిగుమతిచేయుట గాని, పల్లెలను పట్టణముల కెగుమతిచేయుటగాని రెండును అనవసరములే. కాకపోకలవీల్లు అభివృద్ధి యగుకొలదియు పట్టణము, పల్లెయు రెండును అవినాభావసంబంధము గలిగి పరస్పరాభివృద్ధికి దోడ్పడగలవు. పల్లెటూరివాండ్రు పట్టణములజూచుచు, నూతనవిషయము లెఱుంగుటయు నవసరమే. పట్టణవాసులు పల్లెల ఆర్థికాభివృద్ధిపై శీతకన్నువేయక జాగరూకతవహించుటయు ముఖ్యమే. భారతీయార్థికాభివృద్ధికి పట్టణములయొక్కయు, పల్లెలయొక్కయు కలియికయే ముఖ్యావసరము.

## 8. పురుషులు—స్త్రీలు.

నగరములలో స్త్రీలసంఖ్యకంటె పురుషులసంఖ్య యధికము. 21 వ సంవత్సరపు జనాభానుసరించి పురుషులు 163995554 గురు; స్త్రీలు 154946926; అనగ వేయిమంది పురుషులకు 945 మంది వంతున స్త్రీలు గలరు.

1931 వ సంవత్సరపు జనాభాలెక్కలననుసరించి నగరములలో 1000 మంది పురుషులకు 815 మంది స్త్రీలును, పల్లెలలో 1000 మంది పురుషులకు 957 మంది స్త్రీలును గలరు. హిందూదేశపు మొత్తమున 1000 మంది పురుషులకు 941 మంది స్త్రీలుమాత్రమే గలరు.

వివిధరాష్ట్రములలో స్త్రీ పురుషుల సంఖ్యయందలి తారతమ్యములిట్లున్నవి.

| రాష్ట్రములు-సంస్థానములు | 1000 పురుషులకు గల స్త్రీలు మొత్తపు జనసంఖ్యలో | 1000 పురుషులకు నగరములలో గల స్త్రీల సంఖ్య |
|---|---|---|
| మదరాసు | 1025 | 993 |
| బీహారు ఒరిస్సాలు | 1005 | 820 |
| మధ్యరాష్ట్రములు-బీరారు | 998 | 886 |
| పశ్చిమ ఇండియా సంస్థానములు | 974 | 995 |
| హైదరాబాదు రాజ్యము | 959 | 932 |
| బర్మా | 958 | 681 |
| మధ్య ఇండియా | 948 | 864 |
| వంగము | 924 | 601 |
| రాజపుటానా | 908 | 913 |
| సంయుక్తరాష్ట్రములు | 902 | 805 |
| బొంబాయి | 901 | 773 |
| అస్సాము | 900 | 577 |
| అజ్మీరు-మార్వారా | 892 | 823 |
| పశ్చిమోత్తరపరగణాలు | 843 | 642 |
| పంజాబు | 831 | 699 |

ఈదిగువపట్టికవలన హిందూదేశమందలి ముఖ్యనగరములలో పురుషులసంఖ్యకును, స్త్రీలసంఖ్యకును గల వ్యత్యాసమును, వివాహితులగు స్త్రీపురుషుల సంఖ్యలోగల వ్యత్యాసమును గ్రహింపగలము.

| నగరములు-కంటోన్మెంటులతో కలసి | 1000 పురుషులకు గల స్త్రీల సంఖ్య | వివాహమైన 1000 పురుషులకు గల వివాహమైన స్త్రీల సంఖ్య |
|---|---|---|
| కలకత్తా | 468 | 365 |
| బొంబాయి | 554 | 499 |
| మదరాసు | 897 | 936 |
| హైదరాబాదు | 886 | 822 |
| లాహోరు | 565 | 646 |
| రంగూను | 477 | 360 |
| ఢిల్లీ | 694 | 754 |
| అహమ్మదాబాదు | 717 | ... |
| అమృతసరం | 666 | 756 |
| లక్నో | 722 | 733 |
| కరాచీ | 688 | 679 |
| పూనా | 550 | 447 |
| కాన్పూరు | 694 | 781 |
| నాగపూరు | 848 | 838 |
| ఆగ్రా | 799 | 865 |
| బెనారెస్ | 792 | 776 |

ఈపట్టికలవలన 1921 వ సంవత్సరమునకంటె గూడ 1931 వ సంవత్సరమునకు నగరములయందలి స్త్రీ పురుషులయొక్క స్థితి అసహజముగ మారినట్లు గ్రహింపగలము.

ఈదిగువపట్టిక వివిధమతములయందు 1931 వ జనాభా ననుసరించి ఆయావయస్సులయందు 1000 మంది పురుషులకుగల స్త్రీల సంఖ్యను తెలుపుచున్నది.

ఏమతమువారు, ఏవయస్సువారు, 1000 మంది పురుషులకు స్త్రీ లెంతమందిగలరు—

పుట్టుకయందే స్త్రీశిశువులకంటె పురుషశిశువులసంఖ్య హెచ్చుగనున్నది. తొలికానుపునందు పురుషులే యధికముగ జనించు చుండిరని కొందరినిర్ణయము. తొలికానుపునందు పురుషులే అధిక సంఖ్యాకులుగ జనించుచున్నను, లేకున్నను పురుషులధికముగ జనించు చుండిరనుట నిశ్చయము.

1000 మంది తొలిపుట్టుక మగపిల్లలకు సగటునపుట్టిన ఆడు పిల్లలసంఖ్య నీపట్టిక తెలుపగలదు.

| | | ప్రతి 1000 మంది పురుషులకుగల స్త్రీలసంఖ్య. |
|---|---|---|
| బెలూచిస్థానము | 566 | 832 |
| కాశ్మీరము | 590 | 869 |
| బరోడా | 699 | 923 |
| గ్వాలియరు | 726 | 908 |
| వంగము | 730 | 942 |
| మధ్య ఇండియా | 732 | 940 |
| ఢెల్హి | 759 | 793 |
| పంజాబు | 786 | 823 |
| మధ్యపరగణాలు | 795 | 1004 |
| బొంబాయి | 808 | 923 |
| పశ్చిమ ఇండియా సంస్థానములు | 829 | 965 |
| తిరువాన్కూరు | 862 | 987 |
| అండమాను దీవులు | 875 | 893 |
| అస్సాము | 879 | 945 |
| మదరాసు | 882 | 1010 |
| కొచ్చిను | 924 | 1023 |
| మైసూరు | 967 | 965 |

ఇట్లు ఆడుపిల్లల కంటె మగపిల్లలు హెచ్చుగ పుట్టుటకు గల కారణము లేవి?

(1) హెచ్చు ధరలు అధిక పురుష జననములకు కారణమని పిళ్లగారు వ్రాసిరి. ఇందులకు హేతువాద మనూహ్యమనిరి. యుద్ధకాలమున ధర లధికముగ పెఱిగినవి. ఈ సంవత్సరములలో ఇంగ్లండునందు పురుష జననము లధికముగ నున్నవనిరి. ఇదియే యుదాహరణగ జూపిరి.

(2) ఆయాజాతీయ సాంప్రదాయములు.

(3) శీతోష్ణస్థితి—పల్లపుభూములలో శీతోష్ణస్థితి పురుషజననములకు, మెఱకభూములలో శీతోష్ణస్థితి స్త్రీజననముల కనుకూలములని పరీక్షలవలన దెలియుచున్నది.

(4) పసితనమందుననే ఆడపిల్లలను చంపివేయు దురాచారములు.

(5) వలస పోవుట.

(6) కఱవులు. కఱవులలో స్త్రీ లధికముగ మరణించుట.

(7) స్త్రీల ప్రత్యేక వ్యాధులు.

---

(*From Welfare Problems in Rural India by Mr. A. P. Pillay, O. B. E. M. B. B. S.*)

పురుషులు 1000 కి యే దేశమున ఏవయస్సువా రెంతమంది స్త్రీలుగలరు ?

| 1దేశము | సంవత్సరము | 0-10 | 10-20 | 20-30 | 30-40 | 40-50 | 50-60 | 60-70 | 70 సం॥ములకు పైన |
|---|---|---|---|---|---|---|---|---|---|
| జర్మనీ | 1910 | 989 | 995 | 1001 | 1004 | 1033 | 1112 | 1219 | 1314 |
| ఆస్ట్రియా | 1910 | 989 | 1023 | 1043 | 1049 | 1087 | 1071 | 1118 | 1199 |
| ఇటలీ | 1911 | 963 | 1017 | 1121 | 1108 | 1057 | 1031 | 1028 | 1088 |
| హంగేరీ | 1910 | 990 | 1012 | 1059 | 1051 | 1015 | 993 | 1017 | 1061 |
| ఫ్రాన్సు | 1911 | 989 | 994 | 1021 | 1008 | 1026 | 1059 | 1155 | 1300 |
| ఇంగ్లండు, వేల్సు | 1911 | 996 | 1009 | 1114 | 1082 | 1078 | 1093 | 1167 | 1416 |
| సంయుక్త రాష్ట్రములు | 1910 | 979 | 990 | 953 | 903 | 884 | 859 | 925 | 1023 |
| జపాను | 1913 | 976 | 968 | 967 | 969 | 949 | 972 | 1042 | 1210 |
| ఇండియా | 1911 | 992 | 874 | 1024 | 910 | 912 | 950 | 1092 } | |
| ,, | 1921 | 998 | 869 | 1022 | 905 | 902 | 926 | 1049 } | |
| | 1931 | | | | 891 | 866 | 910 | | |

ఈపట్టికననుసరించి 1000 పురుషులకు స్త్రీలసంఖ్య వివిధదేశములయం దెట్లున్నదియు గమనింపదగును ఇతర దేశములలో పురు

1. *From Brij Narayan.*

షులకంటె యావనవతులగు స్త్రీలసంఖ్య యధికముగనున్నది. మనదేశ మున స్త్రీలు తక్కువగనున్నారు. పది సంవత్సరములలోపున అన్నిదేశ ములయందు పురుషులకంటె స్త్రీలు తక్కువగనుండిరి.

10, 20 సంవత్సరముల వయస్సులో మనదేశమున స్త్రీలసంఖ్య తక్కువగ కనిపించుచున్నది. ఇందులకు బాలింతలధికముగ మరణించు టయే కారణము. పరదా రెండవకారణము. అతిబాల్యవివాహముల వలన యుక్తవయస్సువచ్చి అవయవపుష్టి కలుగకపూర్వమే స్త్రీలు పిల్లలతల్లులు కావలసివచ్చుచున్నది. ఇందువలన బరోడా జనాభా లెక్కల అధికారి వర్ణించినటుల యువతులు పునస్సంధాన · మందిరము నందుండి శ్మశానవాటికకు పోవుచున్నారు. పరిశ్రమలయందు పనిచేయు చున్న స్త్రీలకు గర్భవతులుగ నున్నపుడు, బాలింతలుగ నున్నపుడు వలయువిశ్రాంతి లభించుటలేదు. అందువలన స్త్రీలధికముగ మరణించు చున్నారు. ప్రసూతికాలమందు తగు వైద్యసహాయ్యము లభింపక పోవుటయు గూడ స్త్రీజనాభివృద్ధి లేకుండుట కొకకారణము. "మూడవవంతు బాలింతలుమాత్రమే వైద్యసహాయమును బడయగలుగు చుండి"రని మదరాసులో ప్రసూతిమరణములగుఱించిన విచారణనివేదిక యందు వ్రాయబడెను.[1] ఇట్టికారణములవలన ఒక జనాభాలెక్కల కాలమునుండి మరొక జనాభాలెక్కలువేయు పదిసంవత్సరములలోను స్త్రీలసంఖ్య తగ్గిపోవుచున్నది.

1. *(Census Report P. 93)*

| 1వయస్సు | మొత్తము జనసంఖ్య. | | |
|---|---|---|---|
| | జనసంఖ్య | పురుషులు | స్త్రీలు |
| | మిలియన్లు | మిలియన్లు | మిలియన్లు |
| 0- 5 | 39.65 | 19.48 | 20.17 |
| 5-10 | 46.74 | 23.84 | 22.90 |
| 10-15 | 36.74 | 20.17 | 16.57 |
| 15-20 | 26.14 | 13.65 | 12.49 |
| 20-25 | 26.06 | 12.56 | 13.50 |
| 25-30 | 27.59 | 14.02 | 13.57 |
| 30-35 | 26.13 | 13.37 | 12.76 |
| 35-40 | 18.96 | 10.30 | 8.66 |
| 40-45 | 19.58 | 10.07 | 9.51 |
| 45-50 | 11.64 | 6.34 | 5.30 |
| 50-55 | 13.74 | 7.03 | 6.71 |
| 55-60 | 5.57 | 2.99 | 2.58 |
| 60-65 | 8.88 | 4.31 | 4.57 |
| 65-70 | 2.51 | 1.30 | 1.21 |
| 70 పైన | 5.34 | 2.58 | 2.76 |
| వయస్సు తెలియనివారు (మిలియన్లలో కాదు) | 24 | 24 | ... |
| మొత్తము | 315.35 | 162.08 | 153.27 |

ఈ దిగువపట్టిక గతించిన 50 సంవత్సరములలోను (5 జనాభా లెక్కలలోను) 1891 మొదలు 1931 వఱకు ప్రతి 10000 మంది స్త్రీ పురుషులకు-మనజనసంఖ్యయందు ఆయావయస్సులయందున్న వారెంత మంది గలదియు తెలుపుచున్నది.

1. *Census Report 1921.*

| వయస్సు | 1931 | | 1921 | | 1911 | | 1901 | | 1891 | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | పు | స్త్రీ | పు | స్త్రీ | పు | స్త్రీ | పు | స్త్రీ | పు | స్త్రీ |
| 0-10 ... | 2802 | 2889 | 2673 | 2810 | 2710 | 2816 | 2648 | 2721 | 2837 | 2928 |
| 10-20 ... | 2086 | 2062 | 2087 | 1896 | 2013 | 1823 | 2180 | 1917 | 1974 | 1758 |
| 20-30 ... | 1768 | 1856 | 1640 | 1766 | 1718 | 1839 | 1666 | 1787 | 1678 | 1801 |
| 30-40 ... | 1431 | 1351 | 1461 | 1398 | 1451 | 1391 | 1457 | 1408 | 1455 | 1401 |
| 40-50 ... | 968 | 891 | 1018 | 967 | 1014 | 969 | 1019 | 991 | 1004 | 949 |
| 50-60 ... | 561 | 545 | 619 | 606 | 609 | 607 | 614 | 621 | 590 | 596 |
| 60-70 ... | 269 | 281 | 347 | 377 | 340 | 380 | | | | |
| 70-ఇంతకు పైగ | 115 | 125 | 160 | 180 | 145 | 175 | 466 | 555 | 462 | 578 |
| సగటు వయస్సు | 23.2 | 22.8 | 24.8 | 24.7 | 24.7 | 24.7 | 24.7 | 25.1 | 24.4 | 24.9 |

"1931 వ సంవత్సరపు జనాభా ననుసరించి 5 సంవత్సరముల లోపువా రధికముగ నుండిరి. 5-10 సంవత్సరముల మధ్యవారు తక్కువగ హెచ్చిరి. 10-30 సంవత్సరముల మధ్య స్త్రీలు హెచ్చిరి. ఈ హెచ్చుదల ననుసరించి, రాబోవుదశలో అధిక జననములుండ వచ్చును. 70 సంవత్సరములవారు సుమారొక మిలియను మంది తగ్గిరి. ఇందులకు ఇన్ఫ్లూయంజా కారణము" అని జనాభా లెక్కల నివేదికయందు వ్రాయబడెను.

ఈదిగువపట్టిక వివిధదేశములయందు 100000 మంది పురుషులకును సగటున సజీవులగుచున్న పురుషులసంఖ్యను దెలుపుచున్నది.

| వయస్సు | ఆస్ట్రేలియా 1901—1910. | డెన్మార్కు 1906—1910. | ఇంగ్లండు 1901—1910. | ఫ్రాన్సు 1898—1903. | జర్మని 1901—1910. | హాలెండు 1900—1909. |
|---|---|---|---|---|---|---|
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) |
| 0 | 100000 | 100000 | 100000 | 100000 | 100000 | 100000 |
| 5 | 87585 | 85229 | 79398 | 77692 | 74211 | 80243 |
| 10 | 86622 | 84240 | 78083 | 75944 | 72827 | 78850 |
| 15 | 85789 | 83461 | 77297 | 74818 | 72007 | 78010 |
| 20 | 84493 | 82205 | 76113 | 72948 | 70647 | 76612 |
| 25 | 82802 | 80523 | 74546 | 70230 | 68881 | 74684 |
| 30 | 80844 | 78862 | 72741 | 67653 | 67092 | 72907 |
| 35 | 78607 | 76988 | 70472 | 64839 | 65104 | 71155 |
| 40 | 75887 | 74773 | 67668 | 61641 | 62598 | 69090 |
| 45 | 72479 | 71879 | 64230 | 58033 | 59405 | 66532 |
| 50 | 68221 | 68284 | 59903 | 53818 | 55340 | 63265 |
| 55 | 63107 | 63730 | 54435 | 49004 | 50186 | 59107 |
| 60 | 56782 | 57639 | 47564 | 43199 | 43807 | 53551 |
| 65 | 48670 | 50114 | 39278 | 35998 | 36079 | 46287 |
| 70 | 38275 | 40684 | 29898 | 27465 | 27136 | 36866 |
| 75 | 25962 | 29370 | 19754 | 17815 | 17586 | 25800 |
| 80 | 14330 | 17333 | 10608 | 8774 | 8987 | 14681 |
| 85 | 5995 | 7373 | 4349 | 3037 | 3212 | 6085 |
| 90 | 1652 | 1968 | 1117 | 728 | 683 | 1636 |
| 95 | 244 | .. | 149 | 122 | 74 | 111 |
| 100 | 15 | .. | 13 | 11 | 4 | .. |

(*Census Report 1931. P. 169.*)

ఈదిగువపట్టిక వివిధదేశములయందు 100000 మంది పురుషులకును సగటున సజీవులగుచున్న పురుషులసంఖ్యను దెలుపుచున్నది.

| వయస్సు | ఇండియా 1901—1910. | ఇటలీ 1901—1910. | జపాను 1898—1903. | నార్వే 1901—1910. | స్వీడను 1901—1910. | స్విజర్లాండు 1901—1910. | అమెరికా 1901—1910. |
|---|---|---|---|---|---|---|---|
| | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) |
| 0 | 100000 | 100000 | 100000 | 100000 | 100000 | 100000 | 100000 |
| 5 | 55308 | 72816 | 76887 | 88366 | 86491 | 82469 | 82195 |
| 10 | 50212 | 71325 | 74891 | 86769 | 84762 | 81201 | 80605 |
| 15 | 47213 | 70264 | 73602 | 85475 | 83533 | 80335 | 79544 |
| 20 | 43833 | 68579 | 71310 | 82817 | 81638 | 78797 | 77957 |
| 25 | 39973 | 66303 | 68304 | 79068 | 79037 | 76718 | 75679 |
| 30 | 35831 | 64108 | 65596 | 75866 | 76619 | 74506 | 73222 |
| 35 | 31533 | 61962 | 62976 | 73104 | 71331 | 72060 | 70342 |
| 40 | 27136 | 59669 | 60101 | 70408 | 71897 | 69100 | 66996 |
| 45 | 22803 | 56962 | 56743 | 67579 | 69050 | 65364 | 63301 |
| 50 | 18658 | 53799 | 52629 | 64356 | 65702 | 60692 | 58963 |
| 55 | 14787 | 49838 | 47523 | 60507 | 61601 | 51703 | 54075 |
| 60 | 11229 | 44902 | 41160 | 55862 | 56548 | 47298 | 47701 |
| 65 | 8002 | 38198 | 33384 | 49827 | 50010 | 38402 | 39996 |
| 70 | 5134 | 29835 | 24519 | 41911 | 41680 | 28306 | 31050 |
| 75 | 2736 | 19762 | 15570 | 32206 | 31227 | 18014 | 21547 |
| 80 | 1032 | 10079 | 7964 | 21083 | 19350 | 8928 | 12295 |
| 85 | 202 | 3245 | 2918 | 10610 | 8732 | 3068 | 5214 |
| 90 | 11 | 580 | 631 | 3656 | 2380 | 645 | 1492 |
| 95 | ... | 38 | 57 | 747 | 332 | 75 | 266 |
| 100 | ... | ... | 1 | 72 | 20 | 2 | 25 |

*(Census Report 1931. P. 169)*

ఈ పై పట్టికల ననుసరించి మనదేశమునందు గల స్త్రీ పురుషాదులు నడివయసునందలి వారెట్లు వివిధదేశములతో పోల్చిన స్వల్ప సంఖ్యాకులుగ సజీవులగుచున్నారో తెలిసికొనగలము.

1000 కి ఏవయస్సువా రేదేశమునం దెంతమంది గలరు?[1]

| 1వయస్సు | జర్మని | ఫ్రాన్సు | ఇంగ్లండు వేల్సు | సంయుక్త రాష్ట్రములు | జపాను | బ్రిటిషు ఇండియా | |
|---|---|---|---|---|---|---|---|
| | 1910 | 1911 | 1911 | 1910 | 1918 | 1911 | 1921 |
| 10 లోపు | 234 | 171 | 209 | 222 | 244 | 276 | 274 |
| 10-20 | 208 | 166 | 190 | 198 | 198 | 192 | 198 |
| 20-30 | 164 | 158 | 178 | 187 | 154 | 178 | 170 |
| 30-40 | 139 | 148 | 152 | 146 | 138 | 142 | 143 |
| 40-50 | 105 | 127 | 115 | 106 | 101 | 99 | 94 |
| 50-60 | 76 | 104 | 80 | 72 | 77 | 61 | 61 |
| 60-70 | 51 | 77 | 51 | 43 | 57 | 36 | 36 |
| 70 పైన | 23 | 49 | 30 | 26 | 31 | 16 | 17 |

ఈ పట్టికల ననుసరించి 1-10; 10-20 సంవత్సరముల మధ్య జనసంఖ్య అధికముగ నున్నది. అట్లే 50 సంవత్సరములకు పై బడిన జనసంఖ్య అత్యల్పముగ నున్నది. నడియీడు రాకపూర్వమే అత్యధికులు మరణించుచున్నారు. సంఘమున కిందుమూలమున నత్యధిక నష్టము. విదేశములలో 60-65 సంవత్సరముల వఱకు గూడ 15 సంవత్సరములు మొదలు పనిపాటలు చేయగలుగుదురు.

1. *(Brij Narayan-Quoted by Jathar and Beri)*

హిందూదేశము ఉష్ణప్రదేశమగుటను ఆర్థికదుస్థితియం దుండుట వలలను తగుశరీరపోషణ లేక నడివయస్సునందే పనిపాటలు చేయు కాల మింకను తీరకముందే, పలువురు గతించుచున్నారు. అందుచేత కష్టించి పనిచేసి సంఘమును పోషింపవలసిన జనసంఖ్య మొత్తపు జన సంఖ్యతో పోల్చినయెడల అసహజస్థితియందున్నదనుట నిశ్చయము.

ఈ దిగువ పట్టిక ననుసరించి 1921 వ జనాభాలెక్కలలో ఆయా వయస్సుగల స్త్రీ పురుషు లెట్లున్నదియు గ్రహింపగలము. మఱియు నీదిగువ పట్టిక ననుసరించి యుక్తవయస్సునందున్నవా రెంతమంది తక్కువగ నున్నదియు సుబోధకము. ఇందులకు దైన్యజీవితవిధానమే కారణము. వలయు ఆహారములేనివాని కారోగ్యముండదు. ఆరోగ్యము లేనివానియందు జీవశక్తి స్వల్పము. జీవశక్తి లేనివాడు తరుచు రోగ ముల పాలగుచుండును. వివిధరోగము లధికమరణమునకు హేతువు. ఇట్లే దేశము నానాటికి క్షీణించుచున్నది. పట్టణములయందు, నగరముల యందు జీవించు ప్రజకు ఆర్థికదుస్థితియేకాక పీల్చుకొన ప్రాణవాయువు గూడ సక్రమముగ లభింపదు. ప్రాణవాయువు చొరబడు గృహము లఱుదు. అనారోగ్యవంతులనుజేసి బీదరికము దెప్పించి ఆయుక్షీణ మొందించు గంజాయి, కల్లు, సారాయి, నల్లమందులు సులభముగ దేశమం దంతట లభించుచున్నవి. ఇక పట్టణములయందు, నగర ములయందు, పల్లెలయందు అనారోగ్యమునకు, అల్పాయుర్దాయ మునకు జవసత్వనాశనమునకు కొదువ ఎట్లుండును? కట్ట గుడ్డ, తిన తిండి నివసించుటకు నీడ, కొదువయైన దేశమున సక్రమజనాభివృద్ధి యుండు టెట్లు?

## వివిధదేశములయందు వయస్సు ననుసరించి జనసంఖ్యను దెలుపు పట్టిక—100 కి.

| దేశము | జనాభా లెక్క సం॥ | 5 | 5-9 | 10-14 | 15-19 | 20-29 | | 30-39 | | 40-49 | | 50-59 | | 60 | మొత్తము | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | పు | స్త్రీ | పు | స్త్రీ | పు | స్త్రీ | పు | స్త్రీ | | పు | స్త్రీ |
| ఇండియా | 1921 | 12.6 | 14.8 | 11.7 | 8.3 | 8.4 | 8.6 | 7.5 | 6.8 | 5.2 | 4.7 | 3.2 | 2.9 | 5.3 | 51.6 | 48.1 |
| జపాను | 1925 | 13.8 | 11.6 | 11.3 | 9.9 | 8.1 | 7.7 | 6.2 | 5.8 | 5.3 | 5.2 | 3.7 | 3.7 | 7.7 | 50.2 | 49.8 |
| ఫ్రాన్సు | 1921 | 6.2 | 7.7 | 8.8 | 8.9 | 6.8 | 8.2 | 6.5 | 7.8 | 6.7 | 7.1 | 5.5 | 5.9 | 13.7 | 47.5 | 52.5 |
| జర్మని | 1925 | 9.4 | 6.4 | 10.0 | 10.5 | 8.9 | 9.5 | 6.4 | 7.8 | 5.9 | 6.5 | 4.7 | 4.9 | 9.1 | 48.4 | 51.6 |
| ఇంగ్లండు, వేల్సులు | 1921 | 8.8 | 9.3 | 9.7 | 9.3 | 7.3 | 8.8 | 6.7 | 7.9 | 6.3 | 6.9 | 4.6 | 5.0 | 9.4 | 47.7 | 52.3 |
| అమెరికా | 1920 | 10.9 | 10.8 | 10.1 | 8.9 | 8.6 | 8.8 | 7.8 | 7.2 | 6.1 | 5.4 | 4.2 | 3.7 | 7.5 | 51.5 | 48.5 |
| రష్యా | 1926 | 15.2 | 10.4 | 11.6 | 11.5 | 8.3 | 9.3 | 5.6 | 6.3 | 4.3 | 4.5 | 2.9 | 3.4 | 6.7 | 48.3 | 51.7 |

# 10. సంతాన నిరోధము.

మనదేశమునందు జనక్షయస్థితి యిట్లుండ నిప్పటికే మనదేశ జన సంఖ్య అధికముగ నున్నదనియు, నింతకంటె పెరిగినచో దేశము భరింప లేదనియు గొందఱు తలంచుచున్నారు.

ప్రపంచమందలి అధికజనసంఖ్య సమస్యపై పలువురార్థికశాస్త్ర వేత్తలు పలువిధములుగ వ్రాసిరి. ప్రకృతికి స్వతస్సిద్ధమగు జన క్షయము రోగాదికారణములచే గలుగుచున్నను, అవసరమగు జనసంఖ్యకు లోటుకలుగక యుండుటకై అధికజనసంఖ్య యవ సరమని కొందఱి మతము. ధనాఢ్యులగు పెట్టుబడిదార్లు తమ పెట్టుబడులతో పరిశ్రమల నభివృద్ధిపఱచుటకు స్వల్పవేతనములపై కూలీలు లభింపవలెనన్న అధికజనసంఖ్య యుండుట అవసరమని కొందఱిమతము. విదేశములపై దండయాత్రలకు వెడలుటకుగాని, విదేశదండయాత్రలనుండి స్వదేశసంరక్షణ మొనరించుటకుగాని అధిక సైన్య మవసరము. అందుచే మారణయంత్రములకు మానవ ప్రాణముల నాహుతి యొసంగుచుండుటకై అధికజనసంఖ్య యవసరమని కొందఱిమతము. ఆదాయము లేనివారు, ఆస్తులు లేని వారు అధిక జనసంఖ్యగ నున్నచో ధనాఢ్యులపైకి తిరుగబడుటకు సంఘశక్తి హెచ్చుగ లభించునని సాంఘికవాదుల మతము. "తోమసు ఎక్వినాసు మొదలు గాడ్వినుగారివఱకు (From St. Thomas Aquinas down to Godwin) జనాభివృద్ధి యవసరమేయని వ్రాసిరి"[1] మాల్థాసుగారు ఆహారోత్పత్తికంటె జనాభివృద్ధి అత్యధికముగ నగు ననియు, అందుచే అధికజనాభివృద్ధి ఆర్థికాభివృద్ధికరము గాదనియు నిర్ణయించిరి. పలువు రార్థికశాస్త్రవేత్త లీవాదము నాధారముగ

---

*1. See A. M. Carr. Sunders. The Population Problem p.p. 20-23.*

అయినను అధికసంతానోత్పత్తికే ఇటలీదేశమునందు ముసలోనీ గారు ప్రోత్సాహ మొసంగుచున్నారు నూతనదంపతులకును సంతానవతులకును ముసలోనీగారు బహుమానముల నిచ్చుచున్నారు. జర్మనీ దేశమునందుగూడ అధికసంతానోత్పత్తికే హిట్లరుగారు ప్రోత్సాహ మొసంగుచున్నారు. పాశ్చాత్యదేశముల యందలి ప్రస్తుత పరిస్థితు లిట్లుండ హిందూదేశమునందు సంతాననిరోధ సమస్య గమనింప నవసరములేదనుట సాహసముకాదు.

"అధిక జనసంఖ్యాసమస్య హిందూదేశమున లేనేలేదు. హిందూ దేశజనసంఖ్య హిందూదేశభాగ్యోత్పత్తి జేయగలిగినంతయు జేసి యింక నధికోత్పత్తిజేయుట కేవిధముగను వీలులేని పరిస్థితులయందు లేదు. ఏదేశమున గరిష్ఠోత్పాదకశక్తి వినియోగింపబడి ఆయుత్పత్తివలన ప్రజలు జీవింపజాలకున్నారో, ఆదేశమునం దధికజనసంఖ్యా సమస్య యుండు"నని కానన్ గారు చెప్పిరి.[1]

ఈ నూతనమును హిందూదేశమున కన్వయింపజేసి పరీక్షించి నను హిందూదేశమునం దధికజనసంఖ్యా సమస్య కలదనజాలము. హిందూదేశ దుర్భర దారిద్ర్యస్థితి పరకీయదాస్యమువలన సంభవించినది. నేడు ప్రజలగరిష్ఠోత్పాదకశక్తినిమించిన జనసంఖ్య యుండుట మనదారి ద్ర్యమునకు కారణముకాదు ప్రజలయందుత్పత్తిశక్తి రగులుకొనుటకే యవకాశ మొసంగబడలేదు. సహజసంపద పోషింపబడలేదు. పోషింప బడకుండుటయే కాక, సహజసంపద నంతయు నన్వేషింపలేదు. అన్వే షింపబడిన సహజసంపద భారతీయులచే భారతీయులకొఱకు భారతీయ ప్రభుత్వపుటండను వినియోగించుచో నీ దరిద్రస్థితి దుర్భరముగ నుండదు. పాశ్చాత్యదేశములలో వలె అత్యధిక జనాభివృద్ధియుండుట

1. *Quoted by Jathar & Beri. P. 57.*

ప్రారంభమై జనక్షయము లేకపోయినను. హిందూదేశము తన జన సంఖ్యను పోషించుకొనగలుగునని యూహించుకొనగలము.

హిందూదేశమునందు జనక్షయ మత్యధికముగ నున్నది. ఎప్పుడు కఱవుకాటకములు దాపరించునో యెఱుకలేదు. ఎప్పుడు మశూచి విషూచిజాడ్యములు ప్రబలునో యెవరును గుర్తింపజాలరు. వీటిని నిరోధించుటకై వలయు సంపూర్ణరాజ్యాధికారము చేతినిండలేదు. ఏ ఒక్క కాటకము యేప్రదేశమునందు వచ్చినను, వేలకొలది ప్రజలు ఆకలి, అగ్గిలోబడి బుగ్గియగుచున్నారు. ఏ మహామ్మారిజాడ్యము ప్రబలినను వేలకొలదిప్రజ తృటిలో మాయమగుచున్నారు. ఇట్లు మాయ మగుటచే జనసంఖ్య హఠాత్తుగ తగ్గిపోవుచున్నది. ఇందులకుతోడు సంతాననిరోధము గూడ నవలంబించుచో నచిరకాలమున భారతీయ జనసంఖ్య నశించిపోవును. ప్రస్తుతమున్న అత్యధిక జనక్షయస్థితి నరికట్ట గలిగినపుడు సంతాననిరోధ సమస్య యోచింపవదగునేమో? ప్రపంచ జనసంఖ్యలో భారతీయులు అయిదవవంతుగ నున్నారు. అయినను ప్రపంచమునందంతటి కంటె హీనముగ నున్నారు. ప్రబలమగు సంఘ శక్తి గలిగియుండియు హైన్యము ననుభవించుచున్న మనము సంఘశక్తిని బుద్ధిపూర్వకముగ నశింపజేసికొనుచో మనమింతకంటెగూడ నధోగతి పాలగుదుము. అధికజనసంఖ్య యనగా నధికసంఘోత్పాదకశక్తి. పారి శ్రామికముగ నభివృద్ధికి మొదలుపెట్టవలసిన భారతదేశము సంఘశక్తిని తగ్గించుకొనుట కిది తరుణముగాదు. పుట్టినవారు సంఘాదాయమును, తినుటకువలయు నోరును, కడుపును మాత్రమే కలిగి పుట్టుటలేదు. సంఘాదాయము నభివృద్ధిపరచుటకు వలయు కాలుచేతులను గూడ గలిగియే పుట్టుచున్నారు.

"మనుష్యుడు క్రొత్తక్రొత్తలగు నుపకరణముల దయారు జేసియు, నెరువుల జాగ్రత్తపెట్టియు, జలాధారముల వృద్ధిపఱచియు,

పంటలలో మార్పులుగావించియు, నూతనములగు నాహారపదార్థముల గనుకొనియు, సారవిహీనములగు భూములను సహితము సారవంతము లుగజేసి సారవంతములగు వానినుండి నొకకాలమునకంటె మఱియొక కాలమున రెండు మూడు నాలుగు రెట్లు అధికమగు ఫలమును బొందగల వాడాయెను. వ్యవసాయచరిత్రయన నీయంశములలో గల మార్పుల చరిత్రయే. ఇట్టిమార్పుల నవలంబించి ఇంగ్లండు, యునైటెడ్ స్టేట్సు, జర్మనీ మున్నగు దేశములలో నూరుసంవత్సరములకు బూర్వము నొక ఎకరమునుండి ఫలింపజేసినదానికంటె నాలుగైదురెట్లధికముగ నిప్పుడు ఫలింపజేయుచున్నారు. జనసంఖ్య హెచ్చినను మనజన్మము దుఃఖ భూయిష్టమగునని విచారింపవలసినది లేదు, మనుష్యుడు వాని బుద్ధి బలమువలన దనకు గలుగు నాటంకములు నన్నింటిని ఎప్పటికప్పుడు గాకపోయినను క్రమక్రమముగ నయిన బోగొట్టుకొనుటకు సమర్థుడై యున్నాడు."[1]

ఆధునిక యంత్రసహాయమున శాస్త్రపరిశోధనలతో గూడిన వ్యవసాయాభివృద్ధి జరుగుచో నధికాహారము ప్రజకు లభింపగలదు. పల్లపుసాగున కనువగు ప్రయత్నము లొనరించుచో నేటికన్న పంట భూమి హెచ్చగలదు. ఆధునికశాస్త్ర పరిశోధనల నుపయోగించు కొనుచో జనసంఖ్యకంటె అతి త్వరితగతిని ఆహారోత్పత్తి కాగలదు. అధికాదాయోత్పత్తి సాధనములగు వివిధపరిశ్రమ లభివృద్ధిపరచుచో నధికాదాయము లభింపగలదు. భారతదేశమునందీ యవకాశము లన్నియు గలవు. ఈపరిస్థితులలో హిందూదేశమునం దధికజనసంఖ్యా సమస్య గలదనుట సమర్థనీయముగాదు. కాని హిందూదేశమున జనాభి

---

1. అర్థశాస్త్రము (పేజీ. 78.) శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు, ఎమ్. ఎ. ఆర్థికపండితుడు, ఆంధ్రవిశ్వవిద్యాలయము.

వృద్ధికి విముఖత గలిగించు చిత్తప్రవృత్తిమాత్రి మనసరము. ప్రజాసా మాన్యమున (Standard of life) నేటిజీవితవిధానమునకంటె లేక అంతస్తు కంటె నుత్తమమగు జీవితవిధానమును గనుపుట అత్యావసరమను విద్యావ్యాప్తి నొనరింపవలెను. ఇట్టి విద్యావ్యాప్తియే అధిక జనసంఖ్య గలుగకుండ నిరోధింపగలదు. మనదేశజనసంఖ్య సమస్య మనకులభించుచున్న నేటి ఆహారపరిమాణము ననుసరించి నిర్ణయింప రాదు. కాలక్రమమున మనము పొందగల అంతస్తు ననుసరించి నిర్ణయింపదగును.

"ప్రొఫెసరు సెలిజిమానుగారు (Seligman) వ్రాసినటుల జనసంఖ్యసమస్య జనబాహుళ్యమునను సరించి నిర్ణయింపదగదు. ప్రజ సమర్థతతో నుత్పత్తిచేయుట దానిని సమానముగ పంచుకొనుట ఇవియే జనసంఖ్యను సమస్యను నిర్ణయింపవలెను.[1] అందుచే నధికజనసంఖ్య సమస్య నివారింపవీలులేనిదని తలంపరాదు. భారతీయులు ఆర్థికముగ నభివృద్ధిపొంది ఆరోగ్యముగను ధృఢముగను సమర్థతతోను బ్రతుకగలుగునట్టి ఉత్తమఅంతస్తును బడయుచో నేటికంటె అధికజనసంఖ్యను భారతదేశము భరింపగలదు. శాస్త్రసమ్మతమగు వ్యవసాయముచేయ ప్రారంభించుచో, పారిశ్రామికాభివృద్ధి సక్రమముగ జరుగుచో, పరిశ్రమలలో కార్మికులను సక్రమముగ నద్దగలుగుచో, మనదేశభాగ్యవంతులు నిరాడంబరజీవితమును గడుపగలుగుచో, మనప్రభుత్వము అనవసరపు ఉద్యోగులకై సైనికవ్యయమువంటిఖర్చును మానివేయుచో, దళారీలను తొలగించివేయుచో లేక వర్తకమునందలి అనవసరపుపోటీ లేకుండ

1. (*Principles of Economics P. 61 7th Edition*)

యున్నది. జవసత్వము లుడిగియుండుటయే మన ఆర్థికాభివృద్ధికి ప్రతిబంధకము. ఈప్రతిబంధకము తొలగుటకు జాతీయఅంతస్తు హెచ్చవలెను. సర్వతోముఖార్థికాభివృద్ధి యైననాడే జాతీయఅంతస్తు హెచ్చగలదు. అందుచే సర్వతోముఖార్థికాభివృద్ధికి యత్నించుటయే జనసంఖ్యసమస్యను పరిష్కరించుటకు మార్గము. సంతాననిరోధమార్థికాభివృద్ధి కవసరమేయని విశ్వసింపబూనినను, పాశ్చాత్యదేశములయం దవలంబించుచున్న సంతాననిరోధపద్ధతుల నవలంబించుట మానవవిజ్ఞానము పై దండెత్తుటయే యగును. గర్భోత్పత్తినిరోధమున కౌషధములను సేవించుట,గర్భవిచ్ఛిన్నములగు నౌషధముల నుపయోగించుట, రబ్బరు గొట్టములు, తైలములు మొదలగువాటిని వాడుట, భారతీయజాతి యందుగల వంశపరంపరానుగత చిరతరనైతికశక్తిని రూపుమాపుటయే యగును. ఈకృత్రిమవిధానముల నవలంబించుటకుమారుగ ప్రజల యందు నైతికశక్తి నభివృద్ధిచేయుటకై యత్నింపవగును. సంతాననిరోధమునకై కృత్రిమవ్యాపారముల నవలంబించుటకంటె చిత్తచాపల్యనిరోధమునకై విజ్ఞానమును ప్రబోధించుట సమంజసము.

అట్టి విజ్ఞానప్రబోధము భారతీయుల కొంటబట్టినట్లుగ నితర సాధనము లలవడజాలవు. నేడు హిందూదేశమున సంతాననిరోధప్రబోధము సలుపుచున్న మాల్తూజియన్‌లీగు గలదు. వీరిప్రచారము ప్రజాసామాన్యమున కింతవఱకు చెవిసోకలేదు. పంజాబులో మాత్రము సిక్కునేద్యగాండ్రు సంతాననిరోధపద్ధతుల నవలంబించుచున్నటుల డార్లింగుగారు వ్రాసిరి. గురంధరపురప్రాంతముల నొక మంత్రసాని 150 మందిస్త్రీలకు సంతానప్రాప్తి లేకుండచేసెను. మైసూరుప్రభుత్వ

మువారు తమప్రాముఖ్యమగు 4 ఆసుపత్రులలో 1930 వ సంవత్సర మున సంతాననిరోధవైద్యము జరుగుట కామోదించిరి. ఇట్లీసంతాన నిరోధపరిచారము ఆచరణ నామమాత్రముగ నున్నది. జనబాహుళ్య మున కింతవఱకీవిషయమే తెలియదు. మదరాసు రాజధానియందు ప్రభు త్వము ఆసుపత్రులయందు సంతాననిరోధ వైద్యసదుపాయము లొన రింపదలంచిరి. ఈప్రభుత్వాభిప్రాయమును క్రైస్తవ కేతలిక్కులు తీవ్ర ముగ నిరోధించుచున్నారు. ప్రజాభిప్రాయ మీవిషయమై సంపూర్ణ వ్యతిరేకమును వెల్లడించుచున్నది. మదరాసుప్రభుత్వము ప్రజాభిప్రాయ విరుద్ధముగ నీపనికి బూనుటకంటె ప్రజోపయోగకరమగు మరొకపనికి బూనుట సమంజసముగాదా?

# 11. వివాహములు.

1921 వ సంవత్సరమునగల జనాభాయందు 71057754 గురు పురుషులును, 71593131 మంది స్త్రీలును వివాహము జేసికొనిరి. 80685182 గురు పురుషులును, 54841195 గురు స్త్రీలును వివాహా ములు చేసికొనలేదు. జనాభానుసరించి 10338395 మంది పురుషులకు భార్యలును, 26834838 మంది స్త్రీలకు భర్తలును చనిపోయిరి. 1931 వ సంవత్సరపు జనాభానుసరించి భారతదేశమందంతట 84258467 మంది పురుషులును 836 7 23 మంది స్త్రీలును వివాహము లొనరించు కొనిరి. 86328001 పురుషులును 59728048 మంది స్త్రీలును వివా హము లొనరించుకొనలేరు. 9658116 పురుషులును, 16248468 స్త్రీ లును భార్యాభర్తలను గోల్పోయిరి. అనగా 1008 46.7 గురు పురు

షులును 49.3 స్త్రీలును వివాహములొనరించుకొనిరి. 100కి 5.4 గురు పురుషులును 15.4 గురు స్త్రీలును భార్యాభర్తలను గోల్పోయిరి. పురుషులలో సగమువంతు వివాహములొనరించుకొనలేదు. స్త్రీలలో మూడవవంతునకు కొలదిపైగ అవివాహితలు గలరు.

100

| | | వివాహము కాని వారు. | వివాహము లైనవారు. | భార్యా భర్తలను గోల్పోయిన వారు. |
|---|---|---|---|---|
| ఇండియా | పురుషులు | 47.9 | 46.7 | 5.4 |
| | స్త్రీలు | 34.6 | 49.9 | 15.5 |
| బర్మా | పురుషులు | 56.1 | 39.2 | 4.7 |
| | స్త్రీలు | 52.1 | 37.4 | 10.5 |
| బర్మాగాక ఇండియా | పురుషులు | 47.6 | 47.0 | 5.4 |
| హిందువులు | పురుషులు | 46.3 | 48.0 | 5.7 |
| | స్త్రీలు | 32.4 | 50.7 | 16.9 |
| జైనులు | పురుషులు | 50.3 | 41.5 | 8.2 |
| | స్త్రీలు | 33.7 | 44.2 | 22.1 |
| సిక్కులు | పురుషులు | 55.0 | 37.0 | 8.0 |
| | స్త్రీలు | 41.1 | 47.5 | 11.4 |
| మహామ్మదీయులు | పురుషులు | 50.0 | 45.6 | 4.4 |
| | స్త్రీలు | 35.8 | 51.3 | 12.9 |
| ఇతరులు | పురుషులు | 53.6 | 42.6 | 3.8 |
| | స్త్రీలు | 45.2 | 43.9 | 10.9 |
| ఉత్తర అయిర్లెండు | పురుషులు | 64.4 | 31.5 | 4.1 |
| | స్త్రీలు | 61.1 | 30.5 | 8.4 |

## A. స్త్రీ, పురుషులలో 1000 కి వివాహమైనవా రెంతమంది ?

| రాష్ట్రములు. | వయస్సు | పురుషులు | | | స్త్రీలు | | |
|---|---|---|---|---|---|---|---|
| | | 1921 | 1911 | 1901 | 1921 | 1911 | 1901 |
| బంగాళము | 15-19 | 228 | 274 | ... | 881 | 896 | ... |
| | 20-39 | 795 | 817 | ... | 784 | 792 | ... |
| బీహారు, ఒరిస్సా | 15-19 | 450 | 419 | ... | 792 | 828 | ... |
| | 20-39 | 807 | 830 | ... | 824 | 841 | ... |
| పంజాబు | 15-19 | 268 | 275 | 290 | 753 | 778 | 755 |
| | 20-39 | 660 | 661 | 695 | 890 | 882 | 896 |
| సంయుక్తరాష్ట్రములు | 15-19 | 459 | 475 | 495 | 870 | 886 | 878 |
| | 20-39 | 743 | 758 | 775 | 862 | 868 | 862 |
| బొంబాయి | 15-19 | 328 | 349 | 348 | 831 | 851 | 796 |
| | 20-39 | 746 | 770 | 764 | 819 | 840 | 818 |

## B. స్త్రీలలో అవివాహితలు 1000 కి ఎంతమంది—1921.

| వయస్సు | బంగాళము | బీహారు | సంయుక్త రాష్ట్రములు | పంజాబు | బొంబాయి |
|---|---|---|---|---|---|
| 10-15 | 459 | 535 | 488 | 744 | 486 |
| 15-20 | 55 | 262 | 95 | 227 | 125 |

ఈపట్టికవలన హిందువులకంటె మహమ్మదీయులలో 15 సంవత్సరములలోపు వయస్సుగల వివాహము లధికముగనున్నట్లు దోచుచున్నది. కాని యీసంఖ్య నిశ్చయముగాదు. శారదాశాసనవ్యతిరేకముగ వివాహములైనను కానియట్లు లెక్కలలో జాలమంది హిందువులు చెప్పుటచే నిట్లు గోచరించుచున్నది. 1921 వ జనాభాలెక్కల ననుసరించి మహమ్మదీయ బాల్యవివాహములకంటె హిందువులలో 100కి 4 వంతులధికము. 1921 లో ఇంగ్లండు, వేల్సులయందు 1926 వ సంవత్సరమున ఉత్తరఐర్లెండుదేశమున 15 సంవత్సరములకు లోపు బాలికలలో నొకబాలికయైనను వివాహముకానట్లు జనాభాలెక్కలు దెలుపుచున్నవి.

ఈదిగువపట్టిక బాల్యవివాహములసంఖ్య గతించిన 10 సంవత్సరములయందెట్లు పెరిగినదియు సుబోధక మొనరించుచున్నది.

| వయస్సు | పురుషులు | | స్త్రీలు | |
|---|---|---|---|---|
| | 1921. | 1931. | 1921. | 1931. |
| 0- 1 | 6921 | 36882 | 9066 | 44082 |
| 1- 2 | 6687 | 41228 | 11595 | 63954 |
| 2- 3 | 16484 | 63375 | 32197 | 114099 |
| 3- 4 | 28915 | 118844 | 60755 | 232813 |
| 4- 5 | 51677 | 168397 | 104850 | 346904 |
| 5-10 | 757405 | 1888773 | 2016687 | 4200584 |
| 10-15 | 2344066 | 3217626 | 6330207 | 7269208 |

ఈదిగువపట్టిక గతించిన పదిసంవత్సరములయందు బాలవితంతువులసంఖ్య యెట్లు పెరిగినదియు తెలుపుచున్నది.

| వయస్సు | | వితంతువులు 1921. | 1931. |
|---|---|---|---|
| 0- 1 | ... | 759 | 1515 |
| 1- 2 | ... | 612 | 1785 |
| 2- 3 | ... | 1600 | 3485 |
| 3- 4 | ... | 3475 | 9076 |
| 4- 5 | ... | 8693 | 15019 |
| 5-10 | ... | 102293 | 105482 |
| 10-15 | ... | 279124 | 185339 |

స్త్రీపురుష వివాహములకు సంబంధించిన పై పట్టికలన్నియు విషాదవృత్తాంతమును ప్రకటించుచున్నవి. విదేశములకంటె మనదేశమున వివాహము లధికముగ నున్నవి. ఈ వివాహసంస్థను సంస్కరింప వలసియున్నది. కాని హిందూదేశమున అతిబాల్య వివాహములు హెచ్చుగనుండుటచే వివాహమే సంతానోత్పత్తికి ప్రారంభమనదగదు. వివాహకాలమునకును, పునస్సంధానకాలమునకును, చాలసంవత్సరములు వ్యవధియుండును. గృహస్థాశ్రమమునందున్న దంపతుల కనేక నియమములు, విధులు గలవు. నోములు, వ్రతములు, మొదలగు మతసాంఘికాచారములు, నివృత్తిమార్గప్రబోధకములు. చిత్తచాంచల్యనిరోధకములు. అందువలన హిందూదేశమందలి అధికవివాహముల సంఖ్య అధికజనోత్పత్తికి కారణముగ గ్రహింప వీలులేదు. మఱియు వివాహములైన స్త్రీలందఱు సంతానవతులగుటలేదు.

ఈదిగువపట్టిక వివాహములైన స్త్రీలయందుగల సంతానవిహీనలైన స్త్రీలసంఖ్యను దెలుపుచున్నది.

| వివాహ కాలములకు గల భార్యవయస్సు. | | కాపురముచేసిన కాలపరిమితి | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | సం॥ 0–4 | | సం॥ 5–9 | | సం॥ 10–14 | | సం॥ 15 అంతకు పైన | |
| | | సంతానము గలవారు | లేనివారు | సంతానము గలవారు | లేనివారు | సంతానము గలవారు | లేనివారు | సంతానము గలవారు | లేనివారు |
| 0–12 | ... | 1588 | 1592 | 5933 | 1188 | 11792 | 645 | 26767 | 604 |
| 13–14 | ... | 63803 | 28590 | 93718 | 16982 | 91871 | 10106 | 203135 | 9509 |
| 15–19 | ... | 81610 | 34427 | 92905 | 19473 | 87890 | 13509 | 165421 | 12917 |
| 20–29 | ... | 15751 | 6085 | 19350 | 3711 | 20710 | 2727 | 43098 | 3020 |
| 30 లు అంతకు పైగ | ... | 1739 | 808 | 1901 | 576 | 2433 | 446 | 5740 | 463 |
| | | 164491 | 71502 | 213807 | 41930 | 214696 | 27433 | 444161 | 26513 |

(*Census Report 1931. P. 205.*)

అధికవివాహములే అధికజనోత్పత్తికి కారణములని తలంపజూచినను, బాల్యవివాహముల నిరోధించుటకై వలయు నిషేధశాసనముల గావించుకొనుచుంటిమి. స్త్రీపురుషాదులకు వివాహవయసు 20 సంవత్సరములకుపైగ నిర్ణయింపవలెను. ప్రస్తుత బాల్యవివాహ నిషేధ శాసనము లేక శారదాచట్టము నిరుపయోగముగనున్నది. అతిబాల్య వివాహముగూడ నితర క్రిమినలు నేరములవలెనే ప్రభుత్వము వారిచే శిక్షాపాత్రమొనరింపవలెను. పోలీసుశాఖయే నేరారోపణజేయువలెను. వివాహము జరిగినపిమ్మట శిక్షించుటకుమాత్రమేకాక వివాహప్రయత్నములనే శిక్షార్హముగజేసి జరుగకుండజేయుటకు పోలీసుశాఖకు, న్యాయశాఖకుగూడ నధికారమొసంగవలయును. జరిగినవివాహములు శాస్త్రసమ్మతముగావని రద్దుచేయుటకుగూడ శిక్షాధికారుల కధికారమీయవలెను. ప్రతిస్త్రీయు వివాహమొనరించుకొనుట ధర్మమను మతాచారమును సంహరింపవలెను. విద్యార్థిదశయందున్నపుడే పిల్లలతండ్రులుగనుండుట తటస్థించుచున్నది. స్త్రీపురుషులు వివాహముచేసికొనుటయే విధియను మతాచారమే యిందులకు కారణము. కుటుంబ పోషణకు శక్తిలభించినవారుమాత్రమే వివాహమాడదగును. వివాహమాడినవారుసహిత మింద్రియలోలురుగాక మితమగు సంతానముతో తృప్తిబొందవలెను. పుట్టినపిల్లలు కొలదియైనను వారిని జాగరూకతతో బోషించుచో దేశార్థికాభివృద్ధికి వారుపయోగపడగలరు. వివాహసంబంధములగు నాచారముల మనము శీఘ్రగతిని మార్చుకొనుట అవసరము.

ఈఅధికవివాహములకు మనదేశమందలిమతాచారములే ముఖ్యకారణమనికూడ చెప్పజాలము. దేశమునందుగల అల్పఅంతస్తు లేక దరిద్రస్థితియే ప్రాముఖ్యకారణమనిగూడ జెప్పదగును. ధనాధిక్యము

| 1దేశము పేరు | తగ్గుదల | |
|---|---|---|
| | మరణసంఖ్య | జననసంఖ్య |
| హామ్బర్గు | 11.5 | 12.2 |
| వర్టెంబర్గు | 11.3 | 10.3 |
| శాక్జనీ | 10.8 | 10.8 |
| బవేరియా | 9.2 | 5.9 |
| నీదరు లాండ్సు | 9.2 | 5.7 |
| బాడెను | 8.3 | 5.8 |
| ప్రూసియా | 8.2 | 5.5 |
| ఆస్ట్రియా | 8.2 | 4.3 |
| హెస్సీ | 8.0 | 5.9 |
| అలాసికీలోరైను | 7.9 | 5.4 |
| బెల్జియము | 6.4 | 6.2 |
| ఇంగ్లండు, వేల్సులు | 6.0 | 3.2 |
| డెన్మార్కు | 5.2 | 2.8 |
| స్కాట్లెండు | 5.0 | 6.5 |
| ఫిన్‌లాండు | 4.0 | 5.8 |
| స్వీడను | 3.4 | 4.7 |
| నార్వే | 2.8 | 3.6 |
| ఇటలీ | 2.6 | 2.3 |
| స్విజర్లాండు | 2.3 | 3.8 |

"ఈదేశములు జననములసంఖ్యను తగ్గించుకొనుటవలన మరణములసంఖ్యకూడ తగ్గినది." అని సంతాననిరోధ సిద్ధాంతవాదుల మతము. మరణములు తగ్గుటకు జననములు తగ్గవలెనని యంగీకరించినను, జననములుకూడ అధికఅంతస్తువలననే తగ్గును. అధికఅంతస్తువలన జననములు తగ్గుటయేకాక రోగనిరోధకశక్తి ప్రబలి, మరణములుకూడ తగ్గును. జననమరణముల తగ్గుదలకు అధికఅంతస్తును పొందుటయే ప్రశస్తమగు మార్గము.

1. *From Census Report 1931.*

పాశ్చాత్య దేశములయందు వివాహవయస్సు హెచ్చు + స్త్రీ లందరు వివాహముచేసికొనవలెనను నియమములేదు. ఈరెండుకారణములు స్వల్పసంతానమునకు హేతువులైనను స్త్రీపునర్వివాహముల కధికారముండుటచే నధికసంతానమున కవకాశముగలదు. భారతదేశమున వివాహవయస్సు స్వల్పము + స్త్రీలందరు వివాహముచేసికొనవలెనను నియమమున్నది. ఈరెండును సంతానాభివృద్ధికి కారణములు అయినను, స్త్రీపునర్వివాహములు నిషేధింపబడినవి. పై నాలుగుకులములయందు లేవు. పునర్వివాహమున కధికారముగల కులములుగూడ పై కులముల ననుసరించుచున్నవి. వితంతువు లధికముగ నున్నారు. వితంతువులుగ నుండుటచే సంతానాభివృద్ధికి అవకాశము తొలగింపబడినది. అందుచే భారతదేశమందలి వివాహవిధానము పాశ్చాత్య విధానమునకంటె సంతానాభివృద్ధికరముగాదు. రెండుపద్ధతులు సంతాన సమస్యకు అవకాశ నిరోధములను సమానముగనే గల్పించియున్నవి. కాని భారతదేశమందలి వితంతువులకు పునర్వివాహము లేకుండుట సహజస్థితి కాజాలదు. వివాహమొనరించుకొనుటకు, మానుటకు స్త్రీకి గూడ స్వాతంత్ర్య మొసంగవలయును. సంతాన నిరోధమునకు స్వాతంత్ర్యము పరికట్టుటకంటె వేఱుమార్గము లరయుటయే సమంజసము.

## 12. బ్రహ్మచర్యము.

సంతాననిరోధ సమస్యయే సనాతన భారతవర్షమందలి ఆశ్రమ ధర్మములకు మూలము. బ్రహ్మచర్యాశ్రమము, గృహస్థాశ్రమము, వానప్రస్థాశ్రమము, సన్న్యాసాశ్రమము అను నాలుగు ఆశ్రమములలో మూడు ఆశ్రమములకు బ్రహ్మచర్యమే పునాది. ఒక్క గృహస్థాశ్రమమే సంతానోత్పత్తికి ప్రత్యేకింపబడెను. ఈ యాశ్రమమునందు

సంతానోత్పత్తికికూడ నియమితకాలము, సంతానసంఖ్యయు గలదు. ఈ నియమముల ననుసరించుచో కృత్రిమసంతాన నిరోధమార్గము లతో బనిలేదు. ఈయాశ్రమధర్మములు నేడు నశించినవి. పునరుద్ధరణ భావ్యమే. అయిననేమి? పునరుద్ధారణకు వలయు వాతావరణమిప్పుడు లేదు. అయినను బ్రహ్మచర్యోపదేశమున కనువగు స్థితిగలదు. నేటి ఆదర్శపురుషుడగు గాంధీమహాత్ముని యుపదేశమూలమున బ్రహ్మచర్య ప్రబోధమున కనుకూలమగు వాతావరణమేర్పడినది. ఈ వాతావర ణము నూతగగొని సంతాననిరోధ ప్రచారకులు బ్రహ్మచర్య ప్రబోధముజేయుట ధర్మము. మదరాసు హైకోర్టు న్యాయవాదులగు శ్రీ వేపా రామేశంపంతులుగారివంటి సంతాననిరోధ ప్రచారకులు బ్రహ్మచర్య తత్వమునే ప్రబోధించు టుచితము. విద్యావిధానమును బ్రహ్మచర్యదీక్ష కనువగునట్లుగ మార్చుటయు దగును. ఇట్లు సహజపరి వర్తనమార్గముల నవలంబించి సంతాననిరోధప్రచారము సల్పుట నైతి కార్థిక శారీరకశక్తుల యభివృద్ధికి మార్గము. కృత్రిమపద్ధతి అనవ సరము, నింద్యము, విసర్జనీయము.



# భారతదేశము-ఆర్థికచరిత్ర.

## సంఘనిర్మాణము.

### ౩ వ అధ్యాయము.



సాంకేతిక పదములు — Glossary.

| | | |
|---|---|---|
| వ్యక్తి | = | Individual |
| ప్రభుత్వకోశము | = | Treasury |



ఏవంత్వయి; నాన్యథేతో౽స్తి;
నకర్మలిప్యతేనరే॥[1]

కర్మ చేయుచు శతసంవత్సరములు జీవింపవలెనని యాశింపుము. అదియే నీవు చేయగలిగినది. ఇంతకన్న వేరు విధములేదు. నరునకు కర్మ అంటదు.

## 3. చాతుర్వర్ణములు.

ఈ యిహాపరసాధన సమన్వయము హిందూజీవితమునందే పరిపూర్ణత్వము నొందినది. క్రీస్తు క్రైస్తవమతప్రవర్తకుడు. బైబిలు క్రైస్తవమతగ్రంథము. క్రైస్తవమతశాసనము.

నేటికి సుమారు దీని వయస్సు 2 వేల వత్సరములు మాత్రమే గలదు. మహమ్మదు మహమ్మదీయమతప్రవర్తకుడు. ఖొరాను మహమ్మదీయ మతగ్రంథము. మహమ్మదీయమత శాసనము. నేటికి దీని వయసు దాదాపు 14 వందల సంవత్సరములు మాత్రమే గలదు. హిందూమతమున కొక మతప్రవర్తకుడు లేడు. ఏకమతగ్రంథము లేదు. ఏకమత శాసనము లేదు. దీని వయస్సు నిర్ణయించుట కెంద రెందరో మహాపండితులు తబ్బిబ్బులయిరి. ఏనాడు పుట్టినదో! ఎట్లు పెరిగినదో! నేటివఱ కెవరును నిర్ణయింపజాలకపోయిరి. హైందవ విజ్ఞానకోశము లగు వేదము లపౌరుషేయములందురు. ఏపురుషునిచేత నేనాడు వ్రాయబడినవో యెఱుకలేదు. ఈవేదము లనంతములు. (అనంతావై వేదాః). భారతావనియందు మహాపురుషు లెందరెందరో యుద్భవించిరి. మతప్రవర్తకు లెందరో పుట్టిరి. యోగీశ్వరు లెందరో యోగనిష్ఠాగరిష్ఠులయిరి, శాస్త్రవిద్యాపారంగతు లెందరెందరో జనించిరి.

1. ఈశోపనిషత్తు

షట్చ్రక్రవర్తులు పుట్టిరి. బాహుబలు లెందఱో పుట్టి పెరిగిరి. రణరంగ వీరులు విరాజిల్లిరి. శస్త్రవిద్యోపాసకు లుద్భవించిరి. సిద్ధిని బడసిరి. కర్షకులు, శిల్పులు, పారిశ్రామికులు ఊరూర వెలసిరి. సంఘపోషకు లయిరి. సంఘసేవా తత్పరతయే యోగికి, వీరునకు, వర్తకునకు, శిల్పికి నెల్లరకు ప్రధానాశ్రయము. మహర్షి గౌరవనీయుడే, శిల్పి యును గౌరవనీయుడే. రణరంగయోధుడు బూజనీయుడే. పారిశ్రామి కుడును బూజనీయుడే. వర్తకుడు సన్మానయోగ్యుడే. కర్షకుడును సన్మానయోగ్యుడే. రాజు మాననీయుడే. సేవకుడును మాననీయుడే. సంఘగౌరవమునందు వ్యత్యాసములేదు. సంఘమంతయు నేక శరీర ముగ గ్రహింపబడినది. శరీరమునకు తల యెట్లవసరమో కాలుచేతులు గూడ నట్లే యవసరము. కాలుచేతు లెట్లవసరమో తలయు నట్లే యవసరము. తలలేని మొండెము నిరుపయోగము, కాలుచేతులులేని మొండెము గూడ నిరుపయోగమే. శరీరమునకు పైభాగమున దల యున్నంత మాత్రమున నడుగుభాగముననున్న కాళ్ళకన్న మిన్నగాదు. శరీరావయవములన్నియు సమానముగ పనిజేయ గలిగినపుడే శరీర సౌష్ఠవ మేర్పడి స్వశక్తిపై నాధారపడగలదు. స్వశక్తి యుద్భవింపవలెనన్న శరీరాంగములన్నియు సమానముగ బోషింపబడుట విధి. ఈశరీరోదాహరణమున హిందూసంఘ నిర్మాణమును వీక్షింపదగును. చాతుర్వర్ణ నిర్మాణసిద్ధాంత మిదియే. సంఘమునకువలయు మతరాజకీయార్థిక సంరక్షణ యవిచ్ఛిన్నముగ లభించుటకే చాతుర్వర్ణపరిణామము గలిగినది. ఇది యొకరేర్పఱచినది గాదు. యుగయుగములనుండి తరతరములనుండి హైందవజీవితానుభవ పరిపాకమీస్వరూపమును గాంచినది. రైలుపట్టాలవలె యేపురుషుడైన హిందూజీవితవిధానము నిర్ణయించి యున్నచో నాపట్టాలు వేలకొలది సంవత్సరము లట్లేనిల్చియుండుట యసహజము. క్రైస్తవ, మహమ్మ

దీయమతములవలె మతరాజకీయార్థికములయం దేభాగమున కధిక ప్రాముఖ్య మొసంగియున్నను, హిందూజీవిత సిద్ధాంతములు స్వరూపనాశనమై చాలకాలము గతించెడిది. క్రైస్తవమతము రాజకీయోద్యమముగ ప్రారంభింపబడి నూతనమతముగ పరిణమించినది. ఇందు మతరాజకీయార్థికముల సమన్వయము లేదు. సమన్వయము జేయుటకు "క్రీస్తుదేవు"న కాయువుజాలదు. "క్రీస్తుదేవుడు" 108 సంవత్సరములు జీవించియుండినను పరిపూర్ణసమన్వయము జేయజాలకపోయెడివాడు. హిందూసంఘమునం దవతారపురుషులని పేర్కొనబడు దశావతారములు ప్రత్యేకవిషయములం దాదర్శప్రాయములయినవిగాని సంఘనిర్మాణమునకు మూలములుగావు. ఏయవతారపురుషుని భౌతికజీవితముగాని నిత్యము గాజాలదు. అందుచే నేయవతారపురుషుడుగాని సాధింపజాలని సమన్వయము వేలకొలది సంవత్సరముల కాలచక్రపరిభ్రమణమున హిందూజీవితమునకు మాత్రమే సిద్ధించినది. ఈహిందూసంఘనిర్మాణమున బీదసాదల కనురాగముగలదు. క్రీస్తుదేవుడు చెప్పినటుల "భాగ్యవంతులు భగవంతుని స్వర్గలోకమునకు బోవుట యసాధ్యము. సూదిబెజ్జముగుండ ఒంటె దూరివెళ్ళుటయైన సాధ్యముగాని భాగ్యవంతుడు స్వర్గలోకమునకుబోవుట సాధ్యముగాదు."[1] అని హిందూజీవితమున భాగ్యవంతుడు గర్హింపబడలేదు; దూషింపబడలేదు. అత్యధిక భాగ్యము నేవ్యక్తిగాని గుట్టబెట్టుటకు వీలులేకుండ సంఘనిర్మాణము గలదు. కలసిరి సంఘానుభవమునకు వీలుగనుండునట్లు సంఘార్థికస్థితి సృష్టింపబడినది. వ్యక్తిగత పరస్పరసంఘర్షణకు స్థానములేదు. సంఘజీవనమునకు, వ్యక్తిగతజీవితమునకు పరస్పరసామరస్యము గలదు. తనయందు సమస్తప్రకృతిని, ప్రకృతియందు తన్ను ప్రతిబింబించుకొను దివ్యసిద్ధాంతబీజములు సంఘనిర్మాణమునందంతట వెదజల్లబడినవి.

---

1. *The Bible X 23.*

హిందూసంఘము విభాగములయి విఖండములుగ గోచరించును. కాని యీవిభాగస్థితియందే యేకత్వసిద్ధియుగూడ గలదు. అందువలననే హిందూసంఘనిర్మాణ మెన్ని రాజకీయదండయాత్రలకు లోనైనను విచ్ఛిన్నముగాకుండ నేటికిని నిల్చియున్నది.

## 4. వర్ణ విభాగము-ఆర్థిక స్థితి.

హిందూదేశమందలి చాతుర్వర్ణ్య విభాగమును బ్రత్యేకముగ నార్థికదృష్టితో బరీక్షించెదము. ఈవిభాగ మార్థికాభివృద్ధికరమా? లేక వినాశనకరమా? ఆర్థికాభివృద్ధికి విద్య, రాజకీయాధికారము, వర్తకపారిశ్రామికవృత్తులు, కార్మికులు, సత్యావసరములని ఆధునిక పాశ్చాత్యార్థిక శాస్త్రజ్ఞులందరు గూడ నంగీకరించుచున్న విషయమే. ఆర్థికాభివృద్ధికి విద్యావిజ్ఞానమత్యవసరము. శాస్త్రపరిశోధకులు పెంపొందుట తప్పనిసరి. పరిశ్రమ, వర్తకము, వ్యవసాయము, ఆర్థికోత్పత్తికి సాధనములు. ఈ యుత్పత్తి కారకులు కార్మికులు. ఈ యార్థికాభివృద్ధిని, ఆర్థికాభివృద్ధి కారకులను సంఘమును సంరక్షించుటకు రాజకీయసంస్థ ముఖ్యము. ఆర్థికాభివృద్ధికి వలయు నీవిషయ విభాగము ననుసరించియే చాతుర్వర్ణము లేర్పడినవి.

1. విద్యాభ్యాసము. విద్యాప్రబోధము, శాస్త్రపరిశోధన బ్రాహ్మణులవిధి. వర్తకము, కృషి, వైశ్యులవిధి. కార్మికవృత్తి శూద్రులవిధి. ఈ మువ్వుర సంరక్షణ క్షత్రియులవిధి. ఈ విధినిర్ణయ మార్థికాభివృద్ధికరమే గాని నాశనహేతువు కాజాలదు. ఇట్లు విధులు ప్రత్యేకింపబడుటవలన నాయా వృత్తులు ప్రత్యేకాభివృద్ధి నొందినవి. ఇట్లు ప్రత్యేకింపబడుటయే ప్రపంచమునందంతట హిందూ

యనుట నిశ్చయము. వ్యక్తిగతస్వాతంత్ర్యమునకు భారతీయసంఘనిర్మాణమున విహారములేనిమాట వాస్తవమే. ఇందువలననే భారతదేశమున నిరుద్యోగసమస్య దానిఫలితముగ ద్వేషాసూయాభావములు పెంపొందుట కవకాశములు కొలదిగనే కలవు. పుట్టినదిమొదలు తండ్రిపెంపకమున ఆతనివృత్తిరహస్యములన్నియు పుత్రునకుసిద్ధించును. యుక్తవయస్సు వచ్చినతోడనే యుదరపోషణకై తిరుగులాడవలసిన పనిలేదు. తండ్రివృత్తినే తనయు డాచరించుటవలన వ్యక్తిపోషణయేకాక వృత్తిపోషణకూడ జరిగినది. పుట్టుకతోడనే వృత్తియేర్పడుట యస్వాతంత్ర్యస్థితిగాదు. స్వాతంత్ర్యమును సక్రమముగ వినియోగించుకొనుటకు మార్గమేయగును. స్వాతంత్ర్యమన విచ్చలవిడిగ ప్రవర్తించుట గాదు. నేటిపాశ్చాత్యార్థిక దృక్పథమున సనాతన భారతదేశమందలి సంఘనిర్మాణమును విమర్శించుట తగదు. పాశ్చాత్యదేశమున యంత్రశక్తివలన పరిశ్రమాభివృద్ధి యగుచున్నది. భారతదేశమున పరిశ్రమలు హస్తలాఘవమున జరిగినవి. హస్తలాఘవమునకు వంశపరంపరానుగతశిక్షణ మవసరము. ఈశిక్షణ వంశపరంపరానుగతముగ లభింపకున్నచో నౌకరులయొద్ద సిద్ధించుట సుసాధముగాదు. సులభముగ వ్యయప్రయాసలులేకుండ స్వగృహముననే పారిశ్రామికవిద్య లభించుచు వచ్చినది. హస్తములతోమాత్రమే పరిశ్రమాభివృద్ధి జరుగవలసియుండుటచే అనవసరముగ నధికోత్పత్తి జరుగుటకువీలులేదు. ఈకారణమున పోటీలుపడి ధనాఢ్యులకు, కార్మికులకు మధ్య బరస్పరసంఘర్షణలు సంభవింపలేదు.

వ్యక్తులకు, వ్యక్తులకు పరస్పర వైషమ్యములు జనించుట కవకాశ మత్యల్ప మొసరింపబడినది. ప్రకృతిజన్యమగు వ్యక్తిగత పరస్పర సంఘర్షణాభిలాష నిట్లు కనిష్ఠావస్థకు గుంగదీయుట వ్యక్తిస్వాతంత్ర్యము నరికట్టుటగాదు.

వివిధకులములు, వివిధభాషలు, ఆర్థికాభివృద్ధికి బ్రతిబంధక మనుటయు నిర్హేతుకవాదమే, హిందూదేశము బ్రిటిషుదీవులవంటి యొక స్వల్పద్వీపము గాదు. ఐరోపాఖండమంతటి మహాభూభాగము. అట్టితటి హిందూదేశ సమస్యను జర్చించునపుడు బ్రిటిషుదీవులతోగాని, ఫ్రాన్సు, బెల్జియము దేశములతోగాని విడదీసి పోల్చుట సమంజసము గాదు ఐరోపాఖండము నంతను నేకభాగముగ గ్రహించి హిందూదేశ ముతో బోల్పదగును. అట్లు పోల్చుచో హిందూదేశమునందు వలెనే ఐరోపాఖండమందుగూడ వివిధభాషలు గలవని తేలును. వివిధ సంఘములు గలవని తేలును. ఏకమత సామరస్యము లేదని తేలును. క్రైస్తవ మతమునందుగూడ విభాగములు గలవు. వివాహముల నెల్లరు బరస్పరము జేయనొల్లరు. వంశపారంపరముగ ధనాఢ్యకోటికి చెందినవారు వారిలోవారే సంబంధబాంధవ్యముల గలిగియుందురుగాని యితరులను దరికి జేరనీయరు. సంఘుజీవనమున గూడ నెల్లరకు సమానత్వము లేదు. అయినను బాశ్చాత్యదేశములేల నార్థికాభివృద్ధియందున్నవి?

భారతీయుల చిత్తవృత్తి అరణ్యములపాలై యహోరాత్రము లాసర్వేశ్వరుని గుఱించి యోజింపవలెననియే యుండుటను నపవాదమును గుఱించియు మఱికొంత యోజించెదము భారతీయులు నూతనయంత్ర జ్ఞానమును గలిగియుండకుండుటకు కారణ మీచిత్తవృత్తియే యని వ్యతిరేకుల వాదము. ఇది విచిత్రవాదము. ఖగోళశాస్త్రమునంతయు పిడికిటయందుబట్టిన భారతీయవైజ్ఞానికులు ఆధునికయంత్రనిర్మాణమును గ్రహింపక పోలేదు. రామాయణకాలమునందే శ్రీరాముడు లంకనుండి యయోధ్యకు వాయువిమానముపై బోయినట్లు పురాణము దెల్పుచున్నది. ఆయుగమునందే వాయువిమానమును నిర్మింపగలిగిన భారతీయ విజ్ఞానము నేటి యంత్రనిర్మాణమును గ్రహింపలేదనుట సాహసము. ఈ యాధునికయంత్రనిర్మాణమున నేడు ప్రపంచమునందంతట

బ్రిదర్శన మగుచున్న దుర్భరస్థితిని వారానాడే యూహించి సహజ మానవశక్తితో నుత్పత్తిజేయుట మానవకంటకముగాదని యట్లుచేసిరి. కృత్రిమశక్తుల నుద్భవింపజేసి మానవునియం దంతర్గర్భితముగ నుండు నానురీసంపత్తిని రెచ్చగొట్టుటకు బూనలేదు. మఱియు నీ నవీనయంత్ర యుగము ప్రారంభమై యెంతకాలమైనది? రెండుశతాబ్దములయిన బూర్తిగాలేదే! ఆధునిక పారిశ్రామిక పరివర్తన మితరదేశములయందు గలిగిన కాలమున భారతావని స్వాతంత్ర్యమును గోల్పోవకుండనున్నచో నితరదేశములతోబాటు నేడు తులతూగకుండ నుండెడిదని యెవరు చెప్పగలరు? తన పరిశోధనలలో నుపయోగించుచున్న పనిముట్లను భారతీయ చేతిపనివాండ్రుగూడ నైపుణ్యముగ తయారుచేయగలరని సర్. జె. సి. బోసుగారు చెప్పుచున్నారు. బోసుగారు భారతీయనిర్మాణ కౌశల్యమును గొనియాడుచున్నారు. పాశ్చాత్య పండితుడగు (Max Muller) మాక్సుముల్లరుగారిట్లు నుడివిరి.

"పాశ్చాత్యదేశముల కాధునికవిజ్ఞానసిద్ధిగలిగి యొకశతాబ్దము మాత్రమే యయినది. అందుచే భారతీయవిజ్ఞానముతో బాశ్చాత్య విజ్ఞానమును బోల్చునపుడు గడచిన యొకటిరెండుతరములనుండియు బాశ్చాత్యులు సంపాదించిన విజ్ఞానమును మఱచిపోవలయును. అప్పుడే హైందవవిజ్ఞానము, బుద్ధిసూక్ష్మత లొరులకు దీసిపోవునవిగావని గ్రహింప గల్గుదుము."[1]

ఈపాశ్చాత్యపండితుని నిర్ణయమే సత్యము. హైందవచిత్తవృత్తి యరణ్యవాసమునకు బోయి తపమాచరింపవలెననియే యుండునను వాదమునకు రాధాకృష్ణపండితుడు తగుసమాధాన మొసంగియున్నాడు. ప్రపంచమునం దన్నియాత్మలకన్న దన "యాత్మయే" యమూల్య

(1. *Max Muller—Sacred Books of the Hindus. Vol. 16*)

మైనదను భావమున దనకుదానొక్కడే సిద్ధినిబొందవలెనను . సంకల్పము సక్రమముగాదు. ఉపనిషత్తులు కర్మమాచరింపవలెనని విధించుచున్నవి. ఈకర్మ స్వార్థముతో గూడియుండరాదు.[1]

"శరీర మాత్మకు ప్రతిబంధకముగాదు. ఆత్మను క్రిందదీయు భారము గాదు. ఆత్మకు శరీర ముపకరణమేగాని .ఆత్మనుబంధించు కారాగృహముగాదు."[2]

కలవలె జీవితముగూడ మిథ్యయనియు బ్రపంచమంతయు మాయయనియు దలంచుట ఉపనిషద్ధర్మముగాదు. ఉపనిషదర్ధ మునకది వ్యతిరేకము.........................ఉపనిషత్తులు భగవంతుని విశ్వసించుచున్నవి. అట్లే ప్రపంచమునుగూడ విశ్వసించు చున్నవి.[3]

ఇట్లే యాధునిక కర్మ యోగాచార్యుడగు లోకమాన్య బాల గంగాధర తిలక్ తన గీతాసారమను మహోత్కృష్ట గ్రంథమున కర్మ యోగమును గుఱించి వివరించెను. హైందవ వేదపురాణేతిహాస సారమగు "భగవద్గీత" యిట్లుపదేశించుచున్నది.

[4] శ్లో॥ అన్నాద్భవన్తి భూతాని పర్జన్యాదన్నసమ్భవః।
యజ్ఞాద్భవతిపర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥

శ్లో॥ కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షర సముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞేప్రతిష్ఠితమ్॥

శ్లో॥ ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహయః।
అఘాయురిన్ద్రియారామో మోఘం, పార్థ సజీవతి॥

---

*1. Page—215. 2. Page—217. 3. Page—219.*
*From Indian Philosophy. Vol. I. Sir S. Radha Krishna. Vice Chancellor. Andhra University.*

4 (భగవద్గీత; 3 వ అధ్యాయము;—14, 15, 16 శ్లోకములు)

మగు ప్రేమచే గనబడిన వస్తువునెల్ల వీక్షించెదను. అపవిత్రతను గంట చూచునది లేదు. అని ప్రమాణమును చేయుట.

ఇంద్రునకు యజ్ఞాహుతి నిచ్చుచున్నాను. అతడు హస్తేంద్రియమున కధిపతి. హస్తేంద్రియమున కధిపతియగు నింద్రున కాహుతి నిచ్చుటయననేమి? సకలమానవుల హస్తములకొఱకై నాహస్తములను వేల్చుచున్నాననియే దీనిభావము. ప్రపంచమునందందఱకు బరిశ్రమాది కళలు నేర్పించి వారిచే కర్మలనాచరింపజేయుచు దేశమున దుర్భిక్షము లేకుండజేసి ప్రజలకు చేతినిండ పనిగలుగునట్లుచేయుటకు సంకల్పించు కొనుటయే ఇంద్రున కాహుతులొసంగుట. మనకర్మలన్నియు నొండొరులకు సహాయముజేసికొనుచు కర్మలు చేయుచుండుటయే ఇంద్రుని సంతృప్తి చేయుట. చంద్రున కాహుతులిచ్చుట యననేమి? చంద్రుడు హృదయమున కధిపతి. మనహృదయములను కలిపి ఒక్కవ్యక్తివలె వర్తింపజేయుటయే యగును. మనహృదయములయందు ప్రేమశక్తి నుద్భవింపజేసి ఆశక్తిచే నొండొరుల బంధించుకొనుటయే యగును. అందఱి హృదయములకొఱకును నాహృదయమును సమర్పించుచున్నా నని దీక్షబూనుటయే యగును.

ఇట్లే దేవతల కాహుతులిచ్చుటయన న ప్రత్యేకశక్తులను సర్వ మానవులకొఱకును ధారపోయుటయే యని విస్పష్టమగుచున్నది.

దేవతాప్రీత్యర్థము యజ్ఞకర్మ ఆచరించుచుంటిననగ "నాజాతి కొఱకు నాహస్తములను వినియోగించుచున్నాను. నామనసు నాదేశ మునకై యిచ్చివేయుచున్నాను. నాసర్వశక్తులను నాదేశమునకై వినియోగించుచున్నాను. అనియేయర్థము. ఇదియే యజ్ఞకర్మలసారాంశము" (స్వామిరామతీర్థ).

యజ్ఞమన కర్మమన నైహికమునకు సంబంధింపని యాముష్మిక

వ్యాపారముగాదు ఆకలిబాధను మఱచి గాలిలో గంతులువేయుట హిందూవేదాంత సిద్ధాంతము గాదు. ప్రజాసంరక్షణ కాధారమగు నాహారోత్పత్తికి కర్మచేయనివాడు సన్యాసియు గాడు; యోగియును గాడు. భగవద్గీతయందిట్లు నిర్వచింపబడెను.

[1] శ్లో॥ అనాశ్రితః కర్మఫలం కార్యంకర్మకరోతియః ।
సససన్న్యాసీచ యోగీచ ననిరగ్నిర్నచాక్రియః ॥

ఎవడు చేయవలసిన కర్మమును కర్మఫలము నపేక్షింపక చేయుచున్నాడో వాడే సన్యాసియు, యోగియు నగుచున్నాడు. అగ్నిహోత్రమును, గర్మములను విడిచినవాడు సన్యాసియు, యోగియు గాజాలడు. అగ్నిహోత్రాదులు, కర్మము అనగా నాహారోత్పత్తి కర్మమని గ్రహింపదగును.

ఇట్లు కర్మాచరణయే విధ్యుక్తధర్మమని హైందవ వేదాంతముద్ఘోషించుచుండ హైందవచిత్తవృత్తి భూమినివిడిచి సాముజేయుననుట పొరపాటు. ఇది కల్ల. బొల్లివాదము. హైందవవేదాంతమిట్లున్నను భారతీయ ప్రస్తుతార్థిక దుస్థితికి కారణము లేవి?

# 6. ప్రస్తుతార్థిక దుస్థితి–కారణములు.

భారతభూమి యార్థికసంరక్షణకు వలయు రాజకీయాధికారమును గోల్పోయినది. మహమ్మదీయరాజుల రాజ్యాధికారతృష్ణకు గుఱియైనది. వరుసగ మహమ్మదీయ దండయాత్రలకు లోనైనది. రజతసువర్ణముల గోల్పోయినది. విజ్ఞానకోశము లగ్నిహోత్రునిపాలయినవి. సంఘనిర్మాణమున భ్రష్టత్వముగలిగినది. మొట్టమొదటి మహమ్మదీయదండ

1. ఆరవ అధ్యాయము, భగవద్గీత, శ్లోకము 1.

యాత్రీలు హిందూరాజ్యాధికారమువంకకే గుఱిపెట్టలేదు. హిందూ సంఘ జీవితముపై గూడ దాడివెడలెను. తత్ఫలితముగ సంఘనిర్మాణ మున నూతననిబంధనలు చొప్పింపబడి సాంఘికపరివర్తనమునకు ప్రతి బంధకములయ్యెను. హిందూమహమ్మదీయమతములు మైత్రితో మెలంగి రాజకీయతంత్రము భారతీయార్థికాభివృద్ధికరముగ మరలనేర్పడి భారతావని తొల్లిఁటియుచ్చస్థితికి సమీపించుచున్నంతలో ఆంగ్లేయ యుగప్రారంభమైనది. ఈస్టిండియాకంపెనీ వర్తకమునకై వచ్చినది. లాభమునకై పరిపాలించినది. కంపెనీ పరిపాలనకాలమున భారతభూమి శోషింపబడెననుట చరిత్రప్రసిద్ధాంశము. ఇట్లు వరుసగ గొన్నితరములు కష్టించి గడించినసొమ్ము పదిలముగ లేనపుడెట్టి మహోత్కృష్ట జాతి యందైనను జీవితమందు నిర్లక్ష్యము, విముఖత్వము, స్తబ్ధత్వముగలు గుటయం దాశ్చర్యములేదు. చాలకాలము ధనమానప్రాణములకు సం రక్షణలేక ప్రభుత్వములు ప్రజలను సంరక్షింపలేకున్నపుడు, సంరక్షింప జూడనపుడు ప్రజలలో నిర్వీర్యము, నిరుత్సాహము జనింపకుండు టెట్లు? సంఘజీవితము పతనముగాకుండుటెట్లు? ఈఅరాజకస్థితియే భారత భూమి పూర్వాశ్రమమునుండి ప్రస్తుతాశ్రమమునకు గ్రమముగ దిగజారుటకు కారణముగాని భారతీయసంఘ నిర్మాణమును గాదు. వేదాంతతత్వమును గాదు.

## 7. అవిభక్తకుటుంబములు.

చాతుర్వర్ణనిర్మాణసిద్ధాంతము ననుసరించియే కుటుంబనిర్మా ణము గూడ గలదు. హిందువుల కుటుంబనిర్మాణమును బరీక్షించుచో ప్రస్తుతము రష్యాదేశమునందు గల సామ్యవాదము జ్ఞప్తికి వచ్చు చున్నది. 5, 6 తరములవఱకు గూడ విభాగములు గాని కుటుంబ

ములు గలవు. మలబారునం దవిభక్తకుటుంబములే గలవు. ఇట్లు పలువు రన్నదమ్ములు, వారి బిడ్డలు, మనుమలు, అత్తకోడండ్రు, యాడుబడుచులు అవిభక్తముగ . కుటుంబజీవనము జేయుటచే నుత్కృష్టమగు ప్రేమానుబంధానురాగము లేర్పడును. అసమర్థులు, అనారోగ్యవంతులు, అంగవిహీనులు మొదలగువా రవిభక్తకుటుంబములలో సురక్షితముగనుందురు. అవిభక్తకుటుంబమునంతను బోషించుటకై యెల్లరు కష్టించి పనిజేయుటయందు వినయము, స్వార్థత్యాగము, సుశిక్షణ మొదలగు సద్గుణము లలవడును. కుటుంబమునందు గలవారందఱకు కొలదిగనో గొప్పగనో యాహారము లభించును. తల్లిదండ్రుల గోల్పోయిన పిల్లలున్నచో పెద్దవారగునట్లుగ పెంపబడుదురు. దిక్కుమాలినవారై గత్యంతరము లేక వీధులవెంట దిరుగాడ నవసరములేదు. అవిభక్తకుటుంబముల విధానమున ప్రస్తుత పాశ్చాత్యదేశములందు గల వృద్ధాప్యపు భృతులు మొదలగు సంఘసంరక్షణ భారము ప్రభుత్వము వహించ నవసరముండదు. స్వల్పాదాయముతో నధిక జనసంఖ్యను బోషించుట కనువుగనుండును. కుటుంబమందుగల పిన్నపెద్దలందఱు పనిజేయుచుందురు. అందుచే నుత్పత్తి యధికముగ నుండును. ఏపనిగాని కూలికి జేయించుకొను నవసరముండదు. అవిభక్తకుటుంబములచే వ్యవసాయపు భూమి విభాగములయి విఖండములయి పనికిరాకుండ పోవుట కవకాశములేదు. అవిభక్తకుటుంబ జీవన మన్నివిధముల లాభకరమే కాని నష్టదాయకముగాదు. పాశ్చాత్యదేశములయందు కుటుంబమనగా భర్త, భార్య, మైనార్టీ తీరని పిల్లలు మాత్రమే యుందురు. అవిభక్తకుటుంబ స్థితి గానరాదు. ఈస్థితికి వ్యక్తిస్వాతంత్ర్యమే ప్రధాన కారణమందురు. హిందూదేశమందలి యవిభక్త కుటుంబములలో నీ వ్యక్తిస్వాతంత్ర్యము లేకుండుట పెద్ద

గంగానదికి ఆనకట్టగట్టి వ్యవసాయాభివృద్ధి గావింపనొనరించిన ప్రభుత్వ ప్రయత్నముకు హిందువు లాందోళనమొనరించి విరమింపజేసిరి. గంగా ప్రవాహము సరికట్టరాదనియే హిందువుల ప్రతిఘటన. ఈప్రతిఘటన వలన వ్యవసాయకులకు నీరు లేకుండ జేయుటయేగాక గవర్నమెంటునకు రాబడి కూడ లేకుండబోయెను. మహమ్మదీయులైనను ఆర్థిక ప్రతి రోధకములగు మతవిశ్వాసములకు బాహ్యులుగారు. ఋణముల నీయ రాదనియు వడ్డీలను పుచ్చుకొనరాదనియు మహమ్మదు అనుచరులమని తలంచు మహమ్మదీయులు విశ్వసించెదరు. వర్ణవివక్షత స్వశక్తిని నాశన మొనరించుచున్నది. "రసపుత్రుడు తన సాంప్రదాయమునకు, తన విశ్వాసమునకు గర్వించుచుండును. తాను రణరంగయోధుడ ననియే తలంచును గాని వ్యవసాయము చేయనొల్లడు. పంజాబులో వ్యవసాయమును బాగుగ జేయజాలనివా డీతడే. ఈతడే సంకరము గాని రసపుత్రుడైనచో నాగలిని ముట్టనే ముట్టరాదను నిషేధము గలదు."[1]

"కుల నియమములు అన్ని కులములవారు కలిసి పనిచేయుటకు వీలు కల్పింపకుండుటచే విశేష కృషి వ్యర్థమగుచున్నది. ఆహారపదార్థానుభవమున గూడ నత్యద్భుతముగ నాహారము పాడగుచున్నది. ఆయాకులములయందు గల ఆహార నిషేధములును, ఆహారపదార్థముల తయారు చేయుటయందు గల విభేదములే యిందులకు కారణము. అగ్రవర్ణములవారి యాహారము నావర్ణములవారే వండవలెననియు, ఆవంటయందు గూడ ప్రత్యేకపు పద్ధతులుండుటయు, నీ వంటవండుటకు గూడ ప్రత్యేక పాత్రసామగ్రులనే యుపయోగింపవలెనను నిబంధనలుండుటయు ననవసర వ్యయకారణములు.

1. *From M. L. Darling—The Punjab peasant in prosperity and Debt. p. 38.*

కాలేజీ హాస్టలులందు కూడ విద్యార్థులకు కులవివక్షతల ననుసరించి ప్రత్యేక భోజనశాలలు, వంటశాలలు గలవు.................. గోసంరక్షణయం దెంతటి ఆర్థిక దుర్వ్యయమున్నది! లభించుచున్న ఆహారమును;—అన్ని విధములగు మాంసమును, ముఖ్యముగ ఆవు మాంసమును, నుపయోగించుకొన జాలకున్నారు. ఇంతియే కాదు. ముఖ్యముగ గోసంరక్షణయం దాపాదింపబడుచున్న పవిత్రత వలన రోగపూరితములగు గోవులను కూడ పోషించుచు అనవసర ముగ మేత పాడుచేయబడుచున్నది. వీటివలన అప్రశస్తమగు, అనారోగ్యకరమగు జంతుసంతతి యభివృద్ధి యగుచున్నది. మాంసాహార నిషేధమును తొలగించినను, జీవహింస కూడదను మతాచారము తీసి వేసినను అత్యద్భుతముగ శాస్త్రసమ్మతమగు గోసంతతి నభివృద్ధి చేయగలము. ముసలి ఆవులను, రోగపూరితములగు ఆవులను సంరక్షించుటవలన సాలుసరి 176 కోట్లు వ్యయమగుచున్నదని మదింపు వేయబడెను. అనగ భూమిశిస్తువలన వచ్చు ఆదాయముకంటె నీమొత్తము నాలుగు రెట్లధికము.

జీవహింస కూడదను తత్వమువలన పండ్లతోటలను, కూరగాయల తోటలను పాడుజేయు కోతి, నక్క, ఎలుక మొదలగువాటిని గూడ జంపుటలేదు"[1] అని వీరాయాన్స్టి యనునామె వ్రాసినది.

ఈమె విపరీతస్థితిని చిత్రించినది. ఈమె హేతువాదమునంతయు నంగీకరింప వీలులేకున్నను గమనింపదగిన విషయములు లేకపోలేదు. రసపుత్రుడు నాగలిని చేపట్టనంతమాత్రమున వ్యవసాయాభివృద్ధికి ప్రతిబంధక మగుటలేదు. అందఱు మాంసాహారులు గానంతమాత్రమున ఆహార మనవసరముగ వ్యయమగుచున్నదనుటయు పాటింపదగిన

1. *Economic Development of India* p. 53. by *Vera Anstey.*

వాదము గాదు. గోసంరక్షణకొఱకగుచున్న వ్యయము గమనీయముగ నున్నను మానవుడు ఐహికజీవి మాత్రమే గాదని గమనించు టవసరము. ఆహార నిద్రాభయ మైథునముల కొఱకే మానవుడు జీవించుట లేదు. ఉత్తమ మానవాదర్శ జీవితమునకు, జీవిత పరిపూర్ణమునకు అహింసాసిద్ధి యత్యవసరము. ఈ దివ్యసిద్ధాంతమును పాశ్చాత్యు లూహింపజాలరు. కాని నదీనదములయందు భారతదేశమున పెంపొందిన మత మూర్ఖవిశ్వాసముల నణగద్రొక్కు టత్యవసరము. ఆర్థికాభివృద్ధికి ప్రతిబంధకమగు మూర్ఖమతకులతత్వముల పారద్రోలవలయును. వర్ణవిభాగము కర్మకారణమున గలుగునను భావమే సమసిపోయినది. జన్మమే వర్ణమునకు మూలమను దురూహయే ప్రబలియున్నది. వర్ణముల మధ్య పరస్పరాధారముండవలసిన ఆవశ్యకతయే తొలగినది. నేటివర్ణములకును,ఆర్థికసంస్థకునుసంబంధమేమియులేదు.సంబంధములేకుండుటయే గాక వర్ణములకు మతముమూలమను భావమాచరణకు వచ్చుటచే మతమందు చొరబడిన మూర్ఖాచారము లన్నియు ఆర్థికవ్యయకారణములుగ నున్నవి. వేలువేలు వర్ణములకు వేలువేలు మత సాంఘికాచారములు పేర్కొనబడుచున్నవి. ఈఆచారముల నడుప్టింపవలెనను మూఢత్వమున కొందఱును, విశ్వాసము లేకున్నను సాంఘికుల యభిప్రాయమునకు వెఱచి మఱికొందఱును అనవసరధనవ్యయమునకు గురియగుచున్నారు.

కులతత్వము విజృంభించుచో ప్రత్యేకత్వమేర్పడును. ఈప్రత్యేకత్వము సాంఘికశక్తినంతయు నేకోన్ముఖముగ రాకుండ నిరోధించుటకవకాశము గలదు. సాంఘికశక్తినంతయు నిర్మలబుద్ధితో కేంద్రీకరించిన గాని యేదేశమందునను ఆర్థికాభివృద్ధి కాజాలదు. పతితావస్థయందున్న భారతభూమిలో భారతీయులందఱు నిశ్చలబుద్ధితో పరస్పర ద్వేషాసూయాభావములు లేక సాంఘికశక్తినంతను కేంద్రీకరించుట ఆర్థికాభివృద్ధికి తోడ్పడును.

నేడు మనము పరాధీనులమై యుండుటచే ప్రజ్వరిల్లుచున్న మతకులతత్వపిశాచము జాతీయభావబీజములను వేరుపురుగుగ నున్నది. ఏరాజ్యాంగ విధానమైనను సమర్థులగు వారిచే నడుపబడిన గాని ప్రజా సామాన్యమున కా రాజ్యాంగము తగురీతి నుపయుక్తము కాజాలదు. ప్రజల ఆర్థికాభివృద్ధికి తోడ్పడజాలదు. సమర్థతకు మారుగ మతము, కులము ప్రధానస్థానము వహింపవలసివచ్చును. కులమునకు, మతము నకు ప్రాధాన్య మొసంగి అసమర్థత పరిగణింపకుండుటవలన స్వరాజ్య ప్రభుత్వముండెనను స్వల్పవ్యయమున అధికఫలితము కలుగుటకు మారుగ అధికవ్యయమున స్వల్పఫలితము లభించుట సహజము. అసమ ర్థులచే నడుపబడు ప్రభుత్వయంత్రమున అనవసరదుర్వ్యయమగు టయు కులాభిమానప్రేరణమున అనవసరకర్మల కధికముగ ధనము వ్యయమగుచున్నది. దేశాభివృద్ధికర కార్యముల కొకప్పుడు ధనము సంకుచితమగుచున్నది. కులవిభాగమున్నంతకాల మీస్థితి తొలగ జాలదు. కులభావము నమసిపోవలెను. జన్మననుసరించి న్యూనతాధిక్యత లేర్పడ రాదు. చాతుర్వర్ణవిభాగ మంతరించినగాని నేటికులముల ననుస రించిన దోషములు తొలిపోవు.

ఈ కులతత్వము మన రాష్ట్ర రాజధానియందు, మహారాష్ట్రము నందు మాత్రమే కలదు. కులతత్వము ప్రభుత్వోద్యోగముల నపే క్షించు స్వార్థపరుల మూలమున బుట్టి పెరిగి పెంపొంది యొక దశకాలము విజృంభించినది నేడు మరల వెనుకబట్టుచున్నది.

అయినను నిష్ప్రయోజనమగు కులవిభాగము జీవింపవలసిన పనిలేదు నిర్జీవమై నిరుపయోగముగనున్న యీకులవిభాగము జీవించి యున్నచో నెప్పుడైన జాతీయజీవనమునకు కంటకముగాగలదు. అయిన నీకులములయందలి దోషములు నివారింపబడిన యెడల ప్రస్తుతస్థితి

వుని స్థానమును పుట్టుకనుబట్టికాక స్వభావమును బట్టియు సమర్థతను బట్టియు నిర్ణయించెను. ఈ నియమ మచంచలముగ పాటింపబడిన యెడల అది విస్పష్టవిలక్షణత్వమును అత్యుత్తమమును నగు మూల సూత్రముగ నుండెడిది. ఆకాలమునం దీసూక్ష్మ మానసిక సూత్రము ననుసరించి సంఘవ్యవస్థనునిర్ణయించుట కష్టము. ఏలనన సంఘము కొంత వఱకు యంత్రమువంటిది యగుటవలన నెట్టియుత్తమస్థితియందున్నను భౌతిక ప్రమాణములలోనికిని, భౌతికచిహ్నములలోనికిని దిగజారును. అందువలన జన్మమేవర్ణమున కాధారముగ మారుట ఆచరణయందు చూచుచున్నాము. ఏకాలమునందైనను సంపూర్ణముగ నార్థిక నియమ మనుసరింపబడలేదు. ప్రాచీనకాలమునం దవసరము ననుసరించి మారగలిగిన మార్దవము సంఘమున కుండెడిది. రాను రాను బహు శాఖలు కలదియై చిట్లము కట్టుకొని పోయినను తొల్లింటి మార్దవమును సంపూర్ణముగ జారవిడువలేదు. కట్టుదిట్టముగనుండిన వర్ణవిచక్షణము నందుగూడ నాచరణయం దార్థికవృత్తులలో సంకరము కలదు. మార్పులేక చెక్కబడిన ఆదర్శమునుగాని ఆచారమునుగాని ప్రతివిషయమునందును సజీవసంఘముయొక్క ప్రాణశక్తి యనుసరింపజాలదు. ఎట్టిభావముయొక్కగాని వ్యవస్థయొక్కగాని భౌతికస్థితికికూడ దౌర్బల్యావస్థలు కలవు. అట్టి వ్యవస్థలయొక్క లోపమేమి? ఘనీభవించిన మతపరిపాలనగ బిగిసికొనిపోయి తన పవిత్రతనుగాని ఉపయోగమునుగాని శాశ్వతముగ పోషించుకొన జాలక ఆత్మను గోల్పోయి నామమాత్రావశిష్టము దాని యుపయోగము గతించినను మానవాభివృద్ధితో పాటు నభివృద్ధి చెందుచుండిన అవసరములను తీర్చు సమర్థత లేకపోయినను నష్టమై భ్రష్టమైన స్థితిలో సంకెను పట్టుకొని వ్రేలాడుచుండును. భారతీయ సంఘ మీస్థితి నుండి తప్పించుకొన జాలకపోయెను. ఈలోటులలో మునిగి

పోయెను. ఏయుద్దేశ్యముతో ప్రారంభింపబడెనో ఆయుద్దేశ్యమును గోల్పోయెను. గందరగోళమగు కులములలోనికి పతితమయ్యెను. కష్టనష్టములకు కారణమయ్యెను. వీటిని తొలగించివేయుటకై మన మిప్పుడు చెప్పనలవిగాని తిప్పలు పడుచున్నాము" అని అరవిందయోగి యుద్ఘోషించుచున్నాడు.[1]

"వర్ణ విచక్షణములకు ముఖ్యలక్షణము వృత్తి......కులములు మానవులచే తయారు చేయబడినవి. అనుదినము పటుత్వము దప్పు చున్నవి. ఇవి తొలగిపోవలయును," ఇవి గాంధీ మహాత్ముని ప్రవచ నములు.[2] కులములు తొలగుటయే కాక ప్రస్తుతార్థిక వ్యవస్థ కూడ రూపభేదము నొందవలయును.

గ్రామములయందలి రైతులకు వ్యవసాయము చేయుచున్నవారు పంచములే. భారతదేశమున వ్యవసాయరూపమగు ధనోత్పత్తికి పంచములచెమటయే మూలము. అయిననేమి? పంచములు 'పాలేరు' పనియే చేయుచున్నారు. కష్టించి చెమటోడ్చి పండించిన పంటయందు గాని భూమియందుగాని వీరికెట్టిహక్కును లేదు. అస్పృశ్యత నివారింప బడి పంచములుగూడ సాంఘికసమానత్వమును బొందినయెడల'పాలేరు' పనిచేయ నిరాకరించెదరని కొందఱుభూస్వాములు తలంచుచున్నారు. అవర్ణులనబడువారిని అస్పృశ్యులుగ నుంచిననేగాని 'కూలిపని' భూకా మందుల యిష్టమువచ్చినటుల చేయరను ఆర్థికస్వార్థపరత్వముగూడ అస్పృశ్యతను మతముమఱుగున పాటింపజేయుచున్నది. నేటిఆర్థిక వ్యవస్థగూడ మారి అస్పృశ్యులనబడువారికి ఇతరసాంఘికులతోబాటు ఆర్థికస్వాతంత్ర్యము లభించినగాని అస్పృశ్యత పూర్తిగ తొలగ

1. *From Arya p. 733, Article—A Rationalistic Critic on Indian Culture.*

2. *From Harijan Dated 12-1-1934 p. 6.*

జాలదు. ఈపరివర్తనమునకు ప్రభుత్వయంత్రముగూడ పలువిధముల తోడ్పడవలసియున్నది.

1. ప్రభుత్వవ్యవహారములలో వర్ణవిభాగము గమనింపరాదు. జనాభాలెక్కలయందు, కోర్టులయందు మొదలగుచోట్ల వర్ణసాంకేతికమును గుర్తింపరాదు. వ్యవహారవిషయముల లిఖితపత్రములయందు వర్ణము నుదాహరింపరాదని శాసింపవలెను.

2. భోజనశాలలు, కాఫీహోటళ్ళు, సత్రములు, చలివేంద్రిలు మొదలగునవి బ్రాహ్మణభోజనశాలలనియు రాజులభోజనశాలలనియు వైశ్యులభోజనశాలలనియు కులములప్రత్యేకస్థితిని నిరూపించుచు స్థాపించనీయరాదు.

3. ప్రభుత్వోద్యోగములయందు కులములననుసరించిన విభాగముండరాదు.

4. చాతుర్వర్ణ్య విభాగము తొలగించుటకై ప్రభుత్వము సర్వవిధముల కృషి సలుపుటయే విధి.

5. వివిధవర్ణములవారు భోజనప్రతిభోజనము లొనరించునట్లు ప్రచార మొనరింపవలెను. అంతర్వివాహము లొనరించుకొనుట కుత్సాహము గల్పింపవలెను.

6. హిందూదేవాలయములలో హిందూమతస్థు లందఱు ప్రవేశించుటకు శాసనరూపమగు హక్కును గలిగింపవలెను.

ఇట్లే సాంఘికశాసనములు, వారసత్వపు హక్కులు సవరించుటయు దప్పదు. బరోడాసంస్థానమున వర్ణదౌష్ట్యనివారణ శాసన మొనరించి హిందూసంఘమున కంతకు బరోడారాజ్యము మార్గదర్శకముగ వర్తించెను. (Caste Tyranny Removal Bill). ఈ శాసనమునకు శాసనసభవారి యామోదమును గోరుచు బరోడాదివానుగారి

శాసనావసరము నిట్లు వివరించిరి. "కులపెద్దల దుండగములనుండి ప్రజలను సంరక్షించుటయు హిందూసంఘము నేటికన్నను విచ్ఛిన్నమై విభాగములై విఖండములై అరలపెట్టవలె గాకుండ నిరోధించుటయు నీ శాసనము ప్రవేశపెట్టుటయందలి ముఖ్యోద్దేశము."[1] ఈ శాసనము ననుసరించి వెలివేయుట, వర్ణాంతర వివాహముల నిషేధము, విదేశ సంచారము చేయరాదనుట మొదలగు సంఘశాసనముల నాధారముగ గొని సంస్కర్తలను పూర్వాచారపరాయణులు బాధించుటకు వీలు లేదు. అట్టిప్రవర్తన దండనార్హముగ నొనరింపబడినది. ఇట్టిశాసనములు ప్రతిరాష్ట్రమున, ప్రతిసంస్థానమున గావించుట సమంజసము.

హిందూసంఘ జీవనమున నూతన విషయముల బర్జించుకొను శక్తి గలదు. వర్జనీయముల విసర్జించుకొనుటకును శక్తి గలదు. వర్ణ విభాగము మతము నాధారముగ గొని యెంతయోకాలము నిలిచి యుండదు. నూతన పరిణామ స్థితి పొడుకొనుట ప్రారంభమైనది. వర్ణాంతర వివాహములు, భోజన ప్రతిభోజనములు జరుగుచున్నవి. మఱొక తరము గడచుచో, ప్రస్తుత చాతుర్వర్ణ్యమేకమై నూతన సంఘ నిర్మాణమునకు దారితీయునని విశ్వసించుట గాలిలో నిండ్లు గట్టుట గాదు. నూతనసంఘ నిర్మాణావశ్యకత యువజన హృదయ సీమలలో పాతుకొనుట ప్రారంభించినది. ఈ భావబీజములను బోషించుటయే దేశభక్తుల విధి.

## 10. హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మతములు.

కులముల నేకమొనరించుటతో మన పని తుదముట్టదు. భారత దేశమున హిందూ, మహమ్మదీయ, క్రైస్తవ మతములు మూడుగలవు.

1. *Hindu. Oct, 15. 1933.*

జండాక్రిందకు తెచ్చుటకై కొందఱు మహమ్మదీయప్రముఖులు తలం చుట శోచనీయము. "నేను మొట్టమొదట మహమ్మదీయుడను. పిమ్మట భారతీయుడను" అని కీర్తిశేషుడైన మౌలానామహమ్మదాలీగారు కూడ ప్రకటించిరి. భారతదేశమును మహమ్మదీయభాగముగను హిందూభాగముగను రెండుభాగము లొనరింపవలెనని సర్ మహమ్మదు ఇక్బాలుగారు ప్రకటించిరి. ఉత్తరహిందూస్థానమందలి హిందువులను దక్షిణహిందూదేశమునకును దక్షిణాదినిగల మహమ్మదీయులను ఉత్తరాదికిని పంపివేయవలెనని ఇక్బాలుగారిసూచన. సింధు, పంజాబు, బెంగాలు, పశ్చిమోత్తరవరగణాలు, బెలూచిస్థానములతోగూడిన మహమ్మదీయభాగమును ఆఫ్గనిస్థానము మొదలగు మహమ్మదీయ రాజ్యములతో గలిపివేయవలెనని వీరియూహ. ఇది మతమూర్ఖతగలవారి పిచ్చియూహయే. అధికసంఖ్యాకులగు మహమ్మదీయమతస్థులీ భావమును తిరస్కరించిరి. టర్కీప్రజాస్వామికప్రభుత్వఅధ్యక్షుడగు ముస్తఫాకెమల్ పాషాగారు కిలాఫత్ మతపీఠము నెత్తివేసిరి. ఇట్లీపీఠమునెత్తివేసి వివిధ దేశములయందుగల మహమ్మదీయులదృష్టి టర్కీవంకకు నిగుడింపబని లేదని మహమ్మదీయ ప్రపంచమునకు ముస్తఫా కెమల్ పాషాగారుద్బోధించిరి. కెమల్ పాషాగారు గావించిన మతసంస్కరణమును భారతీయ మహమ్మదీయులు గుర్తించుట అవసరము.

"1924వ సంవత్సరము మార్చినెల 3వ తేదీని తురుష్కపార్లిమెంటువారు ఖిలాఫతుపదవిని రద్దుపరచిరి. ఖిలాఫతు పదవిలోనున్న అబ్దులుమజీదు ఎఫ్పెండీ తనకుటుంబముతోకూడ తురుష్కమును వదలి యూరపుఖండమునకు లేచిపోయెను. అబ్దులుమజీదు ఎఫ్పెండీ మిగుల యోగ్యుడే. జాతీయభావముగలవాడే గాని ఖిలాఫతుపీఠము నిలిచియుండుట తురుష్క సంపూర్ణప్రజాస్వామికమునకు అపాయకరమని యెంచి

జాతీయవాదులు ఖిలాఫతును రద్దుపరచి ఎప్పెండీ ఖలీఫాను వెళ్ళ గొట్టిరి.........................అమెరికా సంయుక్తరాష్ట్రములు ఆంగ్లేయ సామ్రాజ్యమునుండి విడిపోయి స్వతంత్రమైన ప్రజాస్వామిక మైనపుడు మతమునకును ప్రభుత్వమునకును ఎట్టి సంబంధము లేదని రాజ్యాంగవిధానములో నిర్ణయించుకొనిరి. అచట ప్రభుత్వ మేమత మును పోషింపదు. ఏమతమును నిషేధింపదు. అటులనే తురుష్క జాతీయవాదులును గావింప నిశ్చయించుకొనిరి............కావున సంపూర్ణప్రజాస్వామికమును స్థిరముగ నిలుచునటుల చేయుటకేగాక, దేశములోని సమస్త మతసంఘములకును స్త్రీలకును పురుషులకును స్వతంత్రము కలుగజేయుటకును, అభివృద్ధికవసరమైన కార్యములు చేయుటలో మతమనుపేర మతగురువు లడ్డుబాకుండుటకును, ఖిలాఫ తును షేకుల్ ఇస్లాము పదవిని రద్దుపరచి మతగురువుల ప్రతిభను, పలుకుబడిని నాశనముచేయుట అత్యవసరమని తురుష్క జాతీయ వాదులు తలచిరి. అన్నిపోరాటములు జయప్రదముగ ముగిసి దేశము స్వతంత్రమును పొంది దేశములో తమ పలుకుబడి దృఢముగస్థాపింప బడినపిమ్మట నీగొప్ప మతసంస్కరణములకు బూనుకొనిరి.

హిందూదేశ ముసల్మానులగు హిజ్ హైనెస్ ఆగాఖాన్, రైటు ఆనరబుల్ అమీరుఆలీగార్లు ఖిలాఫతుయొక్క పలుకుబడిని తగ్గించకూడ దనియు, హిందూదేశమహమ్మదీయులు ఖిలాఫతుయొక్క క్షేమము కోరు చున్నారనియు, తురుష్క ప్రధానమంత్రి ఇజ్మత్ పాషాకు వ్రాయుట యేగాక, కాన్‌స్టాంటినోపిలులోని ప్రధానపత్రికల కాలేఖయొక్క ప్రతులను బంపిరి. ముగ్గురు పత్రికాధిపతులాలేఖను ప్రచురించి ఖిలా ఫతు పక్షమున వ్యాసములను వ్రాసిరి. ఖిలాఫతు పక్షము నవలం బించుట ప్రజాస్వామికమునకు ద్రోహము గావించుటయని యాపత్రిక లను తురుష్క ప్రభుత్వము వెంటనే యణచివైచెను.

ఖిలాఫతును రద్దుపరచిన తరువాత చిరకాలము నుండియు ప్రభుత్వమువారిచే పోషింపబడుచుండిన మహమ్మదీయ మదరసాలను (మత గురువుల స్థానములను) జాతీయ ప్రభుత్వమువారు మూసివైచి వాటియొక్క మిగుల విలువగల యాస్తుల నన్నిటిని తీసికొనిరి. ఫకీరు ప్రతిష్ఠాపన లన్నియు రద్దుపరచి వాటి ఆస్తులనుగూడ ప్రభుత్వము వారు తీసికొనిరి. ఆ భవనము లన్నిటిలోను ప్రభుత్వపాఠశాలలను తెరచిరి. మతగురువులకు హోజాలనిపేరు. హోజాలక్రిందను ఫకీరుల క్రిందను ప్రభుత్వముయొక్క మూడవవంతు ఆస్తియుండెను. రంగుగుడ్డ తగిలించుకొన్న ప్రతివాడును హోజా యగుచుండెను. చదువు సంధ్యలు, యోగ్యప్రవర్తన యక్కరలేదు. వారు మదరసాలలో విద్యార్థులకు మతము పేర మౌఢ్యమును నేర్పుచుండిరి. అర్థము తెలియకుండ ప్రార్థనలను వల్లించుచు విద్యార్థులచే వల్లింపజేయుచుండిరి. చాలమంది ఫకీరులు మహాత్మ్యములు కనబరచుచు కత్తులను, అగ్నిని మ్రింగుచు తాయెత్తులను విభూతిని రక్షరేకులను కట్టుచు ప్రజలనుమోసగించి ద్రవ్యార్జనముచేయుచుండిరి. ఆద్రవ్యమును చాలవఱకు త్రాగుడుకును చాలమంది భార్యలను పోషించుటకును ఖర్చుపెట్టుచుండిరి. మతప్రతిష్ఠాపనలన్నియు నీహోజాలతోను ఫకీరులతోను నిండియుండెను. కావున జాతీయప్రభుత్వ మీప్రతిష్ఠాపనల నన్నింటిని తీసికొని ప్రజలవిద్యాభివృద్ధికి వినియోగింప సాగిరి.........................చిరకాలమునుండి యీ దేశములో ముస్లిముపిల్లలకందరికిని ప్రభుత్వపోషణక్రింద మతపాఠశాలలుండి యుచట ఖురానును, అరబ్బీభాషను నేర్పుచుండిరి. వాటినన్నిటిని 1924 సంవత్సరము మార్చినెల 3 వ తేదీని ప్రభుత్వవిద్యామంత్రి మూసివేయించి వాటిఆస్తులను ప్రభుత్వములో కలుపుకొనెను. వాటిస్థానమున ప్రభుత్వమువారెక్కువ ప్రాథమికపాఠశాలలను నెలకొలిపి దేశములోని ప్రతిబాలుడును బాలికయును ఏడుసంవత్సరముల

వయసుమొదలు పదునారుసంవత్సరముల ఈడువఱకును నుచితముగ ప్రాథమికవిద్య నభ్యసించితీరవలెనని శాసనముచేసిరి ప్రభుత్వపాఠశాలలలో మతవిద్య గరపరు. మతసంఘములు తమస్వంతఖర్చుమీద పెట్టుకొను పాఠశాలలలో మతవిద్య నేర్చుకొనవచ్చును. ప్రభుత్వపాఠశాలలలో విద్యార్థులకు నీవిదేశభక్తి, ప్రజాప్రభుత్వముయొక్క యుత్కృష్టత, ప్రజలహక్కులు, అన్నిసంఘములమధ్య సోదరత్వము మతమునకు బదులు చెప్పబడుచున్నవి. అరబ్బీ,పారసీభాషలను నేర్పుటమాని విద్య తురుష్కభాషలో నివ్వబడుచున్నది................శుక్రవారము నాడు కచ్చేరీలకు సెలవిచ్చుటమాని ప్రపంచములోని మిగతదేశములవలెనే ఆదివారమునాడు ప్రభుత్వపుఆఫీసులన్నియు మూసివేయబడుచున్నవి."[1]

ఆఫ్గనుస్థాన చక్రవర్తియగు అమునల్లాగారు భారతీయ మహమ్మదీయులకు జాతీయతత్వప్రబోధము గావించిరి. భారతదేశమందలి మహమ్మదీయులు మొట్టమొదట "భారతీయుల"మని తలపోయవలెననిరి. భారతదేశముతో మునిగి తేలుటయే భారతీయమహమ్మదీయుల కర్తవ్యమని బొంబాయినగరమునం దుపన్యసించిరి.

హిందువులయందుగూడ హిందూదేశమును హిందువులే పరిపాలింపవలెనను అత్యాశగలవారు కొందఱుకలరు అయిరోపా ఖండమును క్రైస్తవమతస్థులు పరిపాలించుచున్నటుల, మహమ్మదీయమతస్థులు టర్కీ, ఆఫ్గనుస్థానముల పరిపాలించుచున్నటుల హిందూమతస్థులు హిందూదేశమును పరిపాలింపవలెనని వీరియాశ ఈ యాశ నిరర్థకము. ఇదియు మతమూర్ఖత్వమునందొక భాగము. ఇట్టి యాశగలవారు లెక్కకుమాత్రమున్నారు. హిందూమహమ్మదీయులమధ్య నిట్టి ప్రత్యేక

1. (శ్రీ)యుత అయ్యదేవర కాళేశ్వరరావుపంతులుగారి "తురుష్కప్రజాస్వామికము"నుండి గ్రహింపబడెను.)

అంతర్దృష్టిగల భక్తుడు దేవాలయము, మసీదు, చర్చి, ఈమూడింటిలో దేనిమరుగున సత్యపథము నవలోకించినను అతనికొక్కటియే. ఈశ్వర లగ్నహృదయమునకు విభేదములుగోచరింపవు. అతనికి సత్యము బహు వర్ణశోభితమును నేకవర్ణశోభితమునై గూడ ప్రత్యక్షమగును. మోక్షము కొఱకై ఏప్రత్యేకమత సిద్ధాంతమునుగాని స్వీకరించుట ఆవశ్యకము గాదు. ఏప్రత్యేకమత సిద్ధాంతమునుగాని నిరాకరించుటయు భగవంతుని చే దండనార్హముగాదు. ఏజాతిజనులుగాని ఏదేశజనులుగాని ఈశ్వరుని ప్రత్యేకాభిహితులు కాజాలరు. మానవలోకమున ధర్మాభివృద్ధి జేయుటకు తమమతమే అగ్రస్థానము వహించుచున్నదనియు నన్యమతములు సారహీనములనియు తలంచుట బుద్ధిజాడ్యము. మతము పరిగణింపవలసినది గాదు. శీలమే గణింపదగినది.''[1]

"మానవలోకమునకు సుఖాశీర్వచనములు దెచ్చినది మతముకంటె వేఱొకటి లేకున్నను మానవలోకమును భయభ్రాంత మొనరించినదియు మతముకంటె వేఱొకటిలేదు. ప్రేమను, శాంతిని ప్రసాదింపగలిగినది మతముకంటె వేఱొకటిలేకున్నను అసూయాద్వేషముల భయానకముగ సృష్టింపగలిగినదియు మతముకంటె వేఱొకటిలేదు. మానవ సౌభ్రాతృత్వమును పెంపొందింపగలిగినది మతముకంటె వేఱొకటి లేకున్నను మానవునికి, మానవునికి మధ్య అమితశత్రుత్వమును నెలకొల్పగలిగినదియు మతముకంటె వేఱొకటిలేదు మానవులకు మృగములకు గూడ వాసయోగ్యములగు సత్రములను, ఆసుపత్రులను ఉచితముగ గట్టింపగలిగినది మతముకంటె వేఱొకటిలేకున్నను ప్రపంచమును అపార రక్తసిక్త మొనరింపగలిగినదియు మతముకంటె వేఱొకటిలేదు.''[2] ఇవి వివేకానందస్వాములవారి సూక్తులు. ఈవాక్యములు సత్యములు.

1. (సర్. యస్. రాధాకృష్ణ.)

2. *From Swami Vivekananda's Works P. 358 Vol. II Mayavati Memorial Edition.*

హిందూ మహమ్మదీయ క్రైస్తవమతములు మూడింటియందు సమానధర్మములు గలవు. మానవ శ్రేయోదాయకములగు సమాన ధర్మములు గ్రహించి ప్రాతబడి తుప్పుపట్టిన యీమూడుమతముల పేర్ల నేల రూపుమాపరాదు? ఒక్కటేమతము ప్రపంచమంతయు నను సరించుటకు వీలగునట్లు భారతభూమియందు హిందూమహమ్మదీయ క్రైస్తవసమ్మేళన మొనరించుట సమంజసముగాదా? ప్రపంచమునందంతటను వ్యాపించియున్న ముఖ్యమతము లివియే. భారతదేశమందీ మతములసమ్మేళన మొనరింపగలుగుచో ప్రపంచమామోదించునని విశ్వసింపనగును. అట్టిపరివర్తనము గలుగుచో జాతిమతాభిమానముల బంధములను ద్రెంచుకొని మానవకోటి ఐహికాముష్మిక సుఖసమన్వయమున ప్రశాంతముగ జీవింపగలదు. ఈసంకల్పము నేడు పరిహాసపాత్రముగగూడ నుండును. కాని కాలగర్భమునందిట్టి పరివర్తన మసాధ్యము మాత్రము గాదు.

జాతీయైక్యము.

మానవ సేవాపరాయణు లీపరివర్తనకు భావబీజము లప్పుడే వెదజల్లియున్నారు. హిందూమతమునందలి న్యూనతాధిక్యతల తొలగించుటకై దయానందుడు తన జీవితమును ధారపోసి దివంగతుడైనాడు. మతము మానసిక పరివర్తనమే గాని ప్రదర్శనీయమైనది గాదు. అన్ని మతముల కొక్కడే దేవుడని సర్వమతములయం దేకభావము ప్రకటించి రామమోహనుడు కీర్తిశేషుడైనాడు. సర్వమత సహనమే మానవ శ్రేయోదాయకమని విశ్వమానవ సౌభ్రాతృత్వమును డిక్కులు పిక్కటిల్లునట్లుగ జీవిత పర్యంతము గర్జించి డాక్టరు అనిబిసెంటు ప్రకృతిలో లీనమైనది.

నానాదేశ విజ్ఞానసమన్వయమున విశ్వమానవత్వ మానసిక పరిణామావస్థలను సమ్మేళనమొనరింప రవీంద్రకవిచంద్రుడు విశ్వ

భారతికి కై వారము లొసంగుచున్నాడు. జాతీయ అంతర్జాతీయ మానవ కళ్యాణమునకై గాంధీ మహాత్ముడు తన జీవిత సర్వస్వము సమర్పించుచున్నాడు.

"దేశ వైకమత్య మొనగూర్ప గలిగిన దొకటిగలదు. అదియే యొక జాతీయవీరుడు దేశముకొఱకు ప్రాణముల నర్పించుట. లేదా, ఆదేశ నాయకుడు సత్యముకొఱకై ప్రాణములు విడుచుట. లేదా, అతనిని చెప్పనలవిగాని బాధలకు లోనుజేయుట. స్వార్థరహితుడై యతడు తన ప్రాణసమర్పణచేత ప్రజల ప్రేమ గౌరవములకు పాత్రు డగుచున్నాడు. అతడెట్లు తన స్వార్థమును జంపి త్యాగియయ్యెనో, అట్లే ప్రజలు హృదయానురాగబద్ధులై వర్తించుట కవకాశ మేర్పడు చున్నది. ఇట్టి ధీరుల త్యాగమువలననే దేశదేశము లైక్యము బొందు చున్నవి. త్యాగమే దేశాభివృద్ధికి, నైకమత్యమునకు బలము." అని దివంగతుడైన స్వామి రామతీర్థ, గాంధీ మహాత్ముడు భారతజాతీయోద్ధ రణరంగమున బ్రవేశింపక పూర్వము వ్రాసియున్నాడు. ఈమాటలు నేటికి సత్యములైనవి. స్వార్థత్యాగమూర్తి యగు మహాత్ముని త్యా గాగ్ని జ్వాలలో పడి భారతీయ విభేదములన్నియు దగ్ధమగుచున్నవి. హిందూ మహమ్మదీయ క్రైస్తవ సిక్కు పారసీ మతస్థు లందఱు మహాత్ముని త్యాగగుండమున తమ తమ సంకుచితాభిప్రాయముల నాహుతి చేయుచున్నారు. ఈత్యాగాగ్ని శిఖలచే పునీతులై పలువురు త్యాగమూర్తులగుచున్నారు. ఆసేతు హిమాచల పర్యంతము త్యాగ స్వరూపము పల్లెపల్లెలయందు విహరింపసాగినది. ఈత్యాగము భార తీయ దృక్పథము నైకమత్యము వంకకు కేంద్రీకరింప జేయుచున్నది.

"జాత్యైకమత్యమునకు జాతీయ పండుగులు జరుగుట అత్యా వసరము. దేశమందున్న అన్నిభాగములవారు ఆపండుగలకు వచ్చు చుండవలెను. శీతకాలమందు దక్షిణదేశమున, వేసవియందు ఉత్తర

హిందూస్థానమున, వసంతకాలమున పశ్చిమ హిందూస్థానమున కొన్ని దేశీయపు పండుగలు మన మేర్పాటుచేసికొనిన బాగుండును. మన ప్రేమాభివృద్ధికి, సంఘీభావమునకు మిక్కిలి తోడ్పడును. అచ్చటకు వివిధపండితులు, వివిధశాస్త్రజ్ఞులు, వేదాంతులు, తత్వకోవిదులు, శిల్ప కళాచతురులు, భాషాప్రవీణులు అందరు వచ్చెదరు........శిల్ప కళలు, పారిశ్రామికకళలు, వాటి ప్రదర్శనములు జరుగుచుండును.

పూర్వకాలమునందువలె సోదరుడు తనచెల్లెలితోను, భార్య భర్తతోను, కుమారుడు తల్లితోను వచ్చి ప్రేమతరంగములలో విహ రింపవచ్చును. ఒకచోట నాటకము, కొకచోట నుపన్యాసవేదికలు, నొక చోట విద్యాప్రదర్శనములు జరుగుచుండును. అట్టి దేశీయపువండుగల వలన దేశమందలి వివిధభాగముల ప్రజలప్రేమానుబంధములు బిగింప బడుచుండును. జాతీయసారస్వత మభివృద్ధిపఱచుటచేత జాత్యైకమత్య మంతయు సమకూడును." అని స్వామిరామతీర్థ వక్కాణించియుం డెను. ఈవాక్యములు 1930 వ సంవత్సరమునుండియు నాచరణయోగ్య ములైనవి. 1930 వ సంవత్సరమునుండియు దేశీయమహాజనసభ (Indian National Congress) శాఖోపశాఖలు వివిధరాష్ట్రములయందు పలుమార్లు సమావేశములైనవి. ఈసమావేశములన్నియు దేశీయపు పండుగులవలెనే యున్నవి. ఈసమావేశములతో కలిసి వివిధసమస్యలపై చర్చించుటకు వేఱువేఱుసభలు సమకూడుచున్నవి. దేశమందలి అన్ని మూలలనుండియు నన్నిమతములవారు, నన్నివృత్తులవారు, పండితులు, పామరులు, ధనాఢ్యులు, బీదవారందరు సమావేశమగుచున్నారు. స్వదేశీవస్తుప్రదర్శనములు జరుపబడుచున్నవి. మతకులవివక్షతలు లేక భోజనప్రతిభోజనము లొనరింపబడుచున్నవి. ఇన్ని యేల! "మేమందరము భారతీయులము" మనుభావ మీసభలు ప్రకోపింపజేయుచున్నవి. మరికొన్ని

మత సమ్మేళనమైనచో వీలుండునేమో? ఇది మతయుగము కాదు. భారతభూమియందు కొఱవడినది యీ మతభావము గాదు. భారతజాతికి ఆర్థికపునర్నిర్మాణమే నేటి ముఖ్యావసరము. ఆర్థికప్రణాళిక ననుసరించిన జాతీయతను నెలకొల్పుటయే మనవిధి. అట్టిజాతీయతయందు మత కలవైషమ్యములకు స్థానముండదు. ఆనాడు ఒండొరుల ద్వేషించుకొనుటకు మార్గముగనున్న మతము తొలగిపోయి ప్రేమించుకొనుట కవసరమగునంతమాత్రమే నిలిచియుండును. కాని భారతభూమి ఆర్థికదుస్థితియందున్నంత కాలము అస్వాతంత్ర్యము ననుభవించుచున్నంతకాలము ఈపరివర్తనము శీఘ్రగతిని రాజాలదు.

మత సాంఘిక సంస్కరణము-ప్రభుత్వాధికారము.

మత సాంఘిక సంస్కరణమున ప్రభుత్వము జోక్యము కలిగించుకొనరాదని కొందఱి విశ్వాసము. సనాతన కాలమునుండియు భారతదేశమున మత సాంఘిక రాజకీయములు వేఱువేఱుగ వ్యవహరింపబడ లేదు మనుస్మృతి, పరాశరస్మృతులే యిందులకు తార్కాణము. ఈస్మృతులు సర్వతోముఖజీవిత విధానము నంతయు శాసించినవి. మత సాంఘిక సంస్కరణమునకు ప్రభుత్వాధికారమును వినియోగింపరాదను వాదము సమర్థింపదగినది కాదు. మత సాంఘిక రాజకీయ జీవిత సమీకరణ మొనరించుటయే ప్రభుత్వ విధి. స్వాతంత్ర్యము ననుభవించుచుండిన దేశములయందు ప్రభుత్వములు ప్రజల సర్వతోముఖాభివృద్ధికి తోడ్పడుచునే యున్నవి.

హిందూదేశమునందీ పరివర్తనము గలుగుటకు బ్రిటిషు రాజకీయవేత్తలు తోడ్పడుటలేదు. అస్పృశ్యతా నివారణకై భారత శాసనసభయందు ప్రవేశపెట్టబడిన బిల్లులు శాసనము లింతవఱకు గాలేదు. శాసనములగుటకు ప్రభుత్వసహాయము లభింపలేదు. ప్రత్యేక

మతప్రబోధమునకు గాని రాజ్యాంగతంత్రము సహాయకారిగ నుండ రాదను సిద్ధాంతమునైనను ప్రభుత్వమాచరించుటలేదు. "ప్రభుత్వము వారిచేగాని, ప్రభుత్వసహాయమున గాని నడుపబడు విద్యాలయము లలో మతప్రబోధ మొనరించు విషయమున ప్రభుత్వాభిప్రాయ మంతకంతకు మారుచున్నది.

ఇదివఱకే యితరవిషయములలో సాంఘికకక్షలు మితిమీరి యుండ నీవిషయమున కూడ సాంఘికకక్షలు ప్రబలుటకీమార్పు దోహద మొసంగుచున్నది ప్రభుత్వసహాయమున నడుపబడు లేక ప్రభుత్వము వారిచే నడుపబడు పాఠశాలలలో మతవిద్యాభ్యాసము మొట్టమొదట నిషేధింపబడినది. పిమ్మట నీనిషేధము తొలగింపబడినది. ఏమతమునకు గాని ప్రత్యేకస్థానమొసంగరాదనియు మతవిద్యకగు వ్యయము ప్రభుత్వ కోశమునుండి భరింపవీలులేదనియు పాఠశాలకాలమున మతవిద్య గఱుప రాదనియు నియమముల నేర్పరచిరి. ఈనియమము లాచరింపబడ లేదు. మిషనుపాఠశాలలు ప్రభుత్వసహాయమున నడుపబడుచున్నను విద్యార్థులకు క్రైస్తవవిద్యాభ్యాసము (బైబిలు చదువుట) విధాయకమొనరింప బడుచున్నది. ఇట్లు బైబిలు చదువుట తప్పనిసరిగనున్న పాఠశాలలకు సహాయమొనరించుట పరోక్షముగ క్రైస్తవమతప్రచారమునకుసహాయ మొనర్చుటయని ప్రజలుగ ననుస్మృతి ప్రకటింపబడుచునేయున్నది. ఈఅసమ్మతిని తొలగింపలేదు తొలగించుటకుతగుమార్గముగ మదరాసు ప్రభుత్వ పత్రికను (10 అక్టోబరు 1933) యీయబడినయాజ్ఞను మరి క్లిష్టమొనరించి నది. ప్రభుత్వసహాయమును పొందు మహమ్మదీయ పాఠశాలలయందు మహమ్మదీయ మతవిద్య గఱుపుట కనుజ్ఞనియబడెను. స్థానికసంస్థలు, పురపాలకసంఘములు కూడ మహమ్మదీయ మతవిద్యకై ధనము విని యోగింపవచ్చునని..... మదరాసుప్రభుత్వమీ ప్రకటనవలన విషమ

స్థితి సంభవించుట కమితసావకాశము గలిగించిరి." అని హిందూ పత్రిక వ్రాసినది.[1] ఇట్లు మతవిద్య గఱపుటచే ప్రత్యేకత్వము, మత మూర్ఖత్వములు ప్రబలుటకే మార్గమగును. జాతీయైక్యమునకు ప్రతి బంధక మగును.

బ్రిటిషు ప్రధానామాత్యుడగు రామ్సేమెక్డనాల్డు మంత్రిగారు సాంఘిక సమస్యపై యొసంగిన తీర్పుగూడ భారతజాతీయైకమత్యము నకు ప్రబల నిరోధకముగ నున్నది. శవపరీక్షకై వైద్యుడు శవమును క్షురమొనరించునటుల, కసాయివాడు మేకను చిత్రవధ గావించినటుల భారతజాతిని మెక్డనాల్డుగారితీర్పు భిన్నభిన్నము లొనరించినది. శాసన సభల యెన్నికలకు మతము ననుసరించి ప్రత్యేక నియోజకవర్గము లుండవలెననిరి.

హిందూ, మహమ్మదీయులు కలిసి హిందూ, మహమ్మదీయ మతస్థు లందరిచే నెన్నుకొనబడుటకు వీలు కలిగింపలేదు. ఏమతము వారా మతస్థులనే యెన్నుకొనుట కనువుగ నియోజకవర్గములను ప్రత్యేకించిరి. ఇంతతో మెక్డనాల్డుమంత్రి తృప్తిపొందలేదు. స్త్రీ పురు షుల మధ్యగూడ ప్రత్యేకత్వమును నెలకొల్పుటకు బూనెను. స్త్రీలకు ప్రత్యేక నియోజకవర్గములను నిర్ణయించెను. హిందూసంఘమునందు గూడ పంచములను విడదీసి ప్రత్యేక నియోజకవర్గము లేర్పఱచెను. కాని, మహాత్ముడు సుప్రసిద్ధమగు నుపవాసము గావించి పంచము లకును, నితర హిందూమతస్థులకును సంయుక్త నియోజకవర్గముల సాధింపగలిగెను.

ప్రత్యేక నియోజకవర్గములున్నచో భారతజాతి మతవిభేద ముల మఱచిపోయి జాతీయసిద్ధిని బడయజాలదు. మతతత్వదాస్య

---

(1. *The Hindu Editorial dated 10 October 1933*)

మున రాజకీయార్థిక దాస్యమునుంచి తప్పించుకొనజాలదు. మత కుల తత్వముల ప్రేరణమున నెన్నుకొనబడు ప్రజాప్రతినిధు లాయామత కులముల లాభములకై యత్నించుచుందురు. ఎవరికి వారు ప్రత్యేక లాభములకై యత్నించుటలో పరస్పర సంఘర్షణ ప్రభవించుచుండును. మత కులముల పరస్పరసంఘర్షణమున విశాల జాతీయ దృక్పథమలవడదు. జాతీయార్థికాభివృద్ధికై యేకోన్ముఖముగ జాతి ప్రయత్నింపజాలదు. రాజకీయ సంస్థలయందు గూడ మతమునకు ప్రాముఖ్యమే దేశమందునను లేదు. ఏనాడును, ఏకాలమందునను ఏస్వాతంత్ర్యప్రియుడును మెక్డనాల్డుమంత్రి చేసిన సాంఘిక పరిష్కారము వంటి పరిష్కారమును కలయందైన గాంచియుండడు. రౌండుటేబిలు సభకు బ్రిటిషు ప్రభుత్వమువారిచే గొంపోబడిన సభ్యులు సాంఘిక సమస్యను తమలో తాము పరిష్కరించుకొనజాలక పోయిరను నెపమున మెక్డనాల్డు మంత్రి పిల్లుల రొట్టెముక్క తగవును తీర్చిన కోతివలె కడు సాహసమున పరిష్కరించెను. ఈతీర్పును భారతనారీ లోకమంతయు నిరసించుచున్నది. జాతీయవాదులుగ నున్న అధిక సంఖ్యాకులగు హిందూ మహమ్మదీయ క్రైస్తవ మతస్థులందఱు ప్రతిఘటించుచున్నారు. అయిన నేమి? స్వార్థపరులగు కొందఱు హిందూమహమ్మదీయులను వెంటబెట్టుకొని స్వార్థప్రేరితులగు ఆంగ్లేయ రాజకీయవేత్తలీ ప్రతిఘటనల నాలించుటలేదు. మెక్డనాల్డు మంత్రి తీర్పు ఆంగ్లేయులకు, భారతీయులకు గూడ అవమానకరమే. భారతజాతీయైకమత్యమునకు దోడ్పడుటకు మాఱుగ భారతీయజాతిని చీల్చి చింపిరిగుడ్డవలె చేయగలిగినట్లు నేటి ఆంగ్లేయ జాతీయనాయకుడు సాంఘిక సమస్యపై తీర్పు జెప్పెనని లోకము నిందింపకమానదు. స్వపరిపాలనకై మహత్తరత్యాగము సలుపుచున్న నేటి భారతజాతీ యీ

# భారతదేశము-ఆర్థికచరిత్ర

## ఆరోగ్యము - ఆర్థికాభివృద్ధి.

### 4 వ అధ్యాయము.

సాంకేతిక పదములు — Glossary.

| | | |
|---|---|---|
| ఆరోగ్యశాఖ | = | Health department |
| పారిశుద్ధశాఖ | = | Sanitary department |
| ప్రభుత్వము-లేక ప్రభుత్వపరిపాలన | = | Administration of the Government. |
| గ్రామప్రజాప్రభుత్వము | = | Village Republic |
| ఉద్యోగనియమ సంఘము | = | Public Service Commission. |

—

# ఆరోగ్యము-ఆర్థికాభివృద్ధి

## 1. ఆరోగ్యస్థితి.

ఆరోగ్యము, ఆర్థికస్థితి యీ రెండును పరస్పరాధారములు. అనారోగ్యవంతు లధికముగనుండి నిరంతర రోగపీడితులుండు నేసంఘము గాని ఆర్థికాభివృద్ధి నొందజాలదు. రోగవంతు లార్జింపజాలకుండుటయే కాక ఆర్జించుచున్న యేకొలదిమందిపైననో ఆధారపడుచుండుటవలన సంఘజీవితవిధాన మత్యల్పమై దుర్భరముగ నుండును. భారతదేశమందు రోగములు, మలేరియా, కొంకిపురుగు జబ్బు, బోదకాళ్ళు, క్షయ, కాలజ్వరము మొదలగునవి ప్రబలియున్నవి. ఈవ్యాధులు ప్రబలియుండుటచే ప్రజలయం దారోగ్య మత్యల్పముగ నున్నది. కష్టించు శక్తి కూడ నశించిపోయినది. ఈకారణమున (Indian Industrial Commission) పరిశ్రమల విచారణ సంఘము కార్మికులయం దారోగ్య మభివృద్ధి పొందించుటకు ఆరోగ్యశాఖను నిర్మింప సూచించిరి. ఆకమీషనువారు "ఏసంఘముగాని ఏదేశముగాని ఎంత ఆరోగ్యమును కొనగలరో అంతటి ఆరోగ్యమును పొందగలరు." అని వ్రాసిరి. ఈవాక్యమునం దెంతయు సత్యము గలదు. వీలయినంత ఆరోగ్యము కొనుటకు కావలసిన ఆర్థికస్థితి భారతదేశమున నశించిపోయినది. ఆరోగ్యము కొఱకు ఎంత ధనము వెచ్చింపబడినను, అది ఫలప్రదమే. ఆరోగ్యము కొఱకు ధనము వెచ్చించిన కొలది, ప్రజలలో నిర్మాణశక్తి అధికమగును. అయిననేమి? మనదేశమునందు ఆరోగ్యవిషయము సంపూర్ణముగ నిర్లక్ష్యము చేయబడుచున్నది. ఆరోగ్యశాఖపై అత్య

ల్పముగ వ్యయపరుపబడుచున్నది. హిందూదేశమునందు నేడు ప్రబలి యున్న జాడ్యములు నిరోధింపబడుచో ప్రజల యార్థికస్థితి యసమా నముగ నభివృద్ధి కాగలదు.

ప్రపంచమునందెల్ల నడుపబడుచున్న ఆరోగ్యోద్యమ ఫలితము లను పరీక్షించుచో ఆరోగ్యశాఖపై వెచ్చింపబడు ధనము ననుసరించి ఆయాదేశముల యార్థికస్థితులయందు విశేషభేదములు గోచరించు చున్నవి. ఆరోగ్యాభివృద్ధి, వైద్యసహాయము, సాంఘికాచారముల సంస్కరణల మూలముననే లభింపదు. ఆర్థికపరిస్థితుల నభివృద్ధిచేయుచు అందులకువలయు అంగనిర్మాణసౌష్టవము గూర్చుచో విశేషముగ సిద్ధింపగలదు. ఆధునికయుగమందితర స్వతంత్రదేశములలో లభించు చున్న ఆరోగ్యాభివృద్ధికి పారిశ్రామిక విప్లవములవలన లభించిన అధిక అంతస్థే కారణము. ఉత్తమారోగ్యసిద్ధి పొందవలెనన్న ఉన్నత సాంఘి కాదర్శము లత్యావసరములు. ప్రజాధిపత్యము వహించియున్న ప్రభుత్వ హృదయములలో ప్రజల యారోగ్యాభివృద్ధికై దృఢతర సత్సంకల్ప ముండవలెను. ప్రజలలో ఆరోగ్యవిషయములు గమనించుటకు వలయు విద్యకై ప్రభుత్వము విశేషధన ముపయోగింపవలెను. ఆరోగ్యశాఖను మానవసేవాదర్శములతో నడుపగల యుద్యోగులుండవలెను. మన దేశమందున్నత సాంఘికాదర్శములకు లోటులేదు. మిగిలినవన్నియు లోటుగనేయున్నవి. ఉన్నతసాంఘికాదర్శములు గూడ నితరదేశములలో వలెనే మనదేశమందు ప్రవేశించుచున్న పారిశ్రామిక విప్లవమువలన భంగపాటు చెందుచున్నవి. మిల్లుపరిశ్రమలలో, గనులయందు స్త్రీపు రుషులు అకాలములయందుగూడ కలిసిపనిచేయుట ఆరోగ్యమేగాకుండ నైతికచిత్తవృత్తికూడ నశించుచున్నది. అయితే వీరిసంఖ్య అత్యల్పము.

ఇట్లు కార్మికులు పనిచేయు పద్ధతుల ననుసరించియు కాలము

ననుసరించియు ఏకస్థలమందు వేనకువేలుగ గుడిసెలలో వసించుచుం డుటచేతను అసహజవ్యాధులకు లోనగుటయేగాక మామూలు ఆరో గ్యముకూడ వారికి లేకున్నది. ఈ పరిస్థితులు వర్తకస్థానములందు, పారి శ్రామిక ప్రదేశములయందు గలవు. ఈ స్థానములందే అనారోగ్యము విచ్చలవిడిగ చెలరేగుచున్నది. ఈ అనారోగ్యమును, వ్యాధులను పాశ్చాత్యదేశములందు సక్రమముగ ప్రతిఘటించుచున్నారు. అనేక విధములగు సాంఘిక శాసనములను గావించి కార్మికుల: యార్థికస్థితిని యభివృద్ధి పఱచుచున్నారు. దరిద్రమున సంభవించు రోగములన్నియు తరిమివేయబడుచున్నవి. పాశ్చాత్యదేశముల ననుసరించి మనదేశమున గూడ పరిశ్రమలను పెంపొందింప ప్రయత్నము లిప్పుడిప్పుడు జరుగు చున్నవి. ఈ పారిశ్రామిక పరివర్తనముతోపాటు ఆరోగ్యవిషయమునం దనుపమాన ప్రయత్నములు గావించుట అత్యవసరము.

## 2. రోగములు - శీతోష్ణస్థితి.

ఒకప్పుడు మనదేశమందలి రోగములన్నియు మనదేశశీతోష్ణ స్థితికి సంబంధించినవనియు నివారింప వీలులేనివనియు కొందరు చెప్పు చుండెడివారు. నేడామాట బోటకమని పలువు రొప్పుకొనుచున్నారు. దరిద్రావస్థయే మనదేశమందలి రోగములకు ప్రథమకారణమని నే డనేకమంది ప్రముఖు లంగీకరించిరి. కర్నలు గ్లీనువిస్టనుగారిట్లు వ్రాసిరి. "ప్లేగు, మలేరియా, కుష్ఠు, దీర్ఘజ్వరము, కలరా, రక్తగ్రహణి, టైఫా యిడ్ జ్వరము మొదలగు వ్యాధులన్నియు దరిద్రావస్థకు సంబంధించి నవియే గాని శీతలదేశములకన్న ఉష్ణదేశములయందు సహజముగ నుండునవి గావు." మనదేశమునందున్న అధిక మరణములకీ దరిద్రావస్థ

స్థితుల కంటగట్టబడిన వ్యాధి, మరణములు జీవిత అపరిశుభ్రతకును ఆర్థికస్థితికి సంబంధించినవియే గాని శీతోష్ణస్థితికి సంబంధించినవి గావు.

డానను (Lt. Col. Danon) గారు కూడ నిట్లు వ్రాసిరి. "ఇంగ్లండునందువలెనే ఇండియాలో గూడ ఆరోగ్యవిషయమున తగు శ్రద్ధ గైకొనబడి ఆరోగ్యాభివృద్ధికి వలయునంత ధనమును వ్యయపరచినచో మనదేశమందు గూడ ఇంగ్లండులోవలెనే అధికవ్యాధులు, మరణములు నుండవు." ఇందుల కుదాహరణముగ ఆయన సంయుక్తరాష్ట్రములలో క్రిస్టియనులు 1000 కి 6.55 మంది మాత్రమే చనిపోవుచున్నారనియు సైన్యములో 1000 కి 10 మంది మాత్రమే మరణించుచున్నారనియు వ్రాసెను. 20-40 సం॥ల మధ్య వయస్కులగు నితరులు 1000 కి 21.5 గురు చనిపోవుచున్నారు. ఈ హెచ్చుతగ్గులకు ఆర్థికస్థితియందు గల తారతమ్యమే కారణమనుట నిశ్చయము. వీరాయానిస్టీ యను నామె తన పుస్తకమునం దిట్లంగీకరింపక తప్పలేదు. "భారతదేశమందలి ప్రస్తుతస్థితి ఆర్థికముగను నైతికముగను అధోగతియందున్నమాట కాదనజాలము. ఆరోగ్యవిషయము చేబూనుటవలన ననేక ఇతర విషయములలో కష్టములు వచ్చునని ఆరోగ్య విషయమం దుదాసీనత వహింపతగదు."

## 5. ఆరోగ్యోద్యమము.

ఆరోగ్యాభివృద్ధికి గావలసిన ఆర్థికాభివృద్ధితోబాటు నాలుగు విషయములు గమనింపవలసియున్నవి.

1. అంటురోగములు రాకుండ జూచుట.

2. వైద్యసహాయము.

3. పారిశుద్ధ్యము.
4. ఆరోగ్యవిషయప్రచారము.

ప్లేగు.

పూర్వకాలమున మనదేశమందు ప్లేగు కలదనియందురు. కాని 19 వ శతాబ్ద ప్రారంభమున ప్లేగు కాన్పింపదు. మరల 1896లో ప్రారంభించినది. ఇది చీనాదేశము నుండి మనదేశమునకు వచ్చినదనుచున్నారు. 1894, 95, 96 సం॥లలో కాంటక్, హాంకాంగు రేవుపట్టణములలో నీవ్యాధి వ్యాపించియుండు టచే అచ్చటినుండియే మనదేశమునకుకూడ వ్యాపించినదనబడుచున్నది. ప్రప్రథమమున నీజాడ్యము బొంబాయినగరమునం దారంభమైనది. పట్టణమంతయు పాడువడినది. ఆసంవత్సర ప్రాంతముననే దేశమంతయు నల్దిక్కుల నలముకొనిపోయినది. ఆశతాబ్దాంతమునందీ జాడ్యము ప్రపంచమునందంతటనున్నది. మనదేశమందు కార్చిచ్చువలె వ్యాపించినది. 1896 మొదలు 1921 వరకు ప్లేగుచే బ్రిటిషుఇండియాయందు 15.2 మిలియన్లమంది మరణించిరి, స్వదేశసంస్థానములయందు 18.4 మిలియనులు మరణించిరి. మొత్తము హిందూదేశమున 33.6 మిలియన్లు మరణించిరి. 1907 వ సంవత్సరమున 1160000 మంది గతించిరి. ఈజాడ్యము ప్రప్రథమమున నేదేశమునుండి యెప్పుడొచ్చివచ్చినను ఈజాడ్యము దేశమందెల్లయెడల పాముపఱుగువలె యింతపఱకు నిరోధింపబడకుండుటకు ప్రజల ఆర్థికస్థితియే కారణము. ముఖ్యముగా నిరుపేదలనే యీ జాడ్యము పొట్టబెట్టుకొనుచున్నది భాగ్యవంతుల నంటుటలేదు. అంటినను మరణములుతక్కువ. దారిద్ర్యమునకును ప్లేగునకును పరస్పర సంబంధమున్నదని చెప్పకతీరదు.

1898లో ప్రభుత్వమొక విచారణసంఘమును నిర్మించెను. బొబ్బరోగమునుగూర్చి వారుగావించిన ముఖ్యసూచనలను ప్రభుత్వమాచ

రింపలేదు. గృహముల వీడుట, ఎలుకల చంపించుట ప్రయాణికుల పరిశోధించుట మొదలగు స్వల్పరక్షణోపాయముల నాచరించిరి. ప్రజలు భయకంపితులైరి. రోగము విచ్చలవిడిగ నాట్యమాడుచునే యున్నది. తగురీతి నెదుర్కొన్నచో రోగము మాయమగుట నిశ్చయమని సంఘ సూచన. అట్లు మార్కొనలేదు. వ్యాధి తగ్గలేదు. 1939 వ సంవత్సరమున హిందూదేశమొత్తమున 70000 మందియు 1930-31 వ సంవత్సరమున సుమారు 20000 మందియు మరణించిరి.

మశూచి. 18 వ శతాబ్దాంతమువఱకు సీమదేశమున మశూచి విస్తారముగ నుండెడిది. పిమ్మట గలిగిన ఆర్థిక విద్యాభివృద్ధులవలన తగ్గినది. మనదేశమున విస్తారము ప్రబలియున్నది. నిరోధించుటకు టీకాలు వేయబడుచున్నవి. వీనివలన మేలుకన్న కీడెక్కువముగాడుచున్నదని ఆధునిక పరిశోధకులు నిశ్చయించుచున్నారు.

"బ్రిటిషుపార్లమెంటులో యుద్ధముల సెక్రటరీ ఆల్‌స్టీటుగారు చెప్పిన లెక్కల ననుసరించి హృదయరోగముగల సోల్జర్లకు సాలు 1కి పౌ॥ 4000000 ల ధనము పెన్షన్లక్రింద నీయబడుచున్నది. ఐరోపా మహాసంగ్రామమునందు హృద్రోగమువచ్చిన 109000 ల మంది పెన్షనుల పొందుచున్నారు. నా అనుభవము ననుసరించి యీ హృద్రోగములకు బలవంతముగ మనుష్యులకు వేయుచున్న టీకాలే కారణమను నిర్ణయమునకు వచ్చితిని. మఱియు ప్రస్తుతము ఇంగ్లీషువైద్యమునందు ఇంజక్షనులపైగల వెఱ్ఱికూడ నిందులకు ముఖ్యకారణము.

ఆరోగ్యము పదిలపరచుకొనవలెనన్నచో పరిశుభ్రమగు నాహారవాయువులే ముఖ్యావసరములు. రోగము పుట్టకుండజేయుట కారోగ్యపదార్థములనే శరీరములోనికి ఎక్కించుట, పాపమును పారద్రోలుటకు

దయ్యము నారాధించుట వంటిదే." అని డాక్టరు వాల్సరు, ఆర్. ఎమ్. డి. జి. సి. గారి దృఢనిశ్చయము.[1]

ఇంగ్లండులో నియమింపబడిన ప్రభుత్వమువారి టీకాల విచారణ సంఘసమక్షమున టీకాలువేయుట అనర్థకమని పలువురు వైద్యులు సాక్ష్య మొసంగిరి. టీకాలవలన మశూచి రాకున్నను నితర వ్యాధులు వచ్చుచున్నవనిరి. ఈ విషయమింకను వైద్యుల పరిశోధనలయందున్నది.

"ఇతరవ్యాధుల ప్రతిఘటించు సహజశక్తులు క్షీణించుచున్నవి. జీవహింస పెరుగుచున్నది. అన్యశోణితసారము మనశరీరములో ప్రవేశించి వ్యాధినిరోధించు శక్తిని నిర్మూలించుచున్నది." అని వ్యతిరేకుల వాదము.

సీమలో టీకాల ప్రతిఘటన సంఘమువారు టీకాల నాపుటకు తీవ్రముగ ప్రయత్నించుచున్నారు. టీకాల విచారణ సంఘమువారి యెదుట వైద్యులు సాక్ష్యమొసగుచు మశూచికంటె టీకాలవలననే హెచ్చు మరణములున్నవని చెప్పిరి. మనదేశమునందు 1900 సం॥లో 1000 కి .45 మంది, 1925 లో .24 మంది మశూచిచే మరణించిరి. ఈవ్యాధి వ్యాప్తము కొంత తగ్గినది. ఇతర దేశముల కంటె నత్యధికముగ నున్నది. 1929 లో 72884 మందియు 1930 లో 50000 మందియు మరణించిరి.

విషూచి. దీనికే కలరా యను పేరు. అంటుజాడ్యము. అపరిశుభ్రిత అసంపూర్ణ అపరిశస్త ఆహారవిహారనీరాదుల మూలమున కలుగుచున్నది. ఒక్క సంవత్సరమునం

1. సత్యాగ్రహిపత్రిక 1928 ఏప్రియలు 3.

నుండి మనకు దిగుమతియగుచున్నది. ఇదంతయు 10 వ వంతునకైనను జాడ్యమురాకుండ నాపుచేయలేదు.

హిందూదేశమునందు చలిజ్వరములేని ప్రదేశమేలేదు. మొత్తము జ్వరములచే సాలుసరి "3500000 మొదలు 4000000" వఱకు చనిపోవుచున్నారు. ఇందులో మూడింట రెండువంతులు చలిజ్వరముచేత చనిపోవుచున్నారు. "ఇతరజబ్బులన్నిటికంటె మలేరియాజ్వరముచేతనే అధికమరణములు సంభవించుచున్నవి. 1930 లో ఆసుపత్రులయందు 10 మిలియనుల చలిజ్వరరోగులు కలరు."[1] 1925_26 వ సంవత్సరములలో సమావేశమైన వైద్యపరిశోధకులసభా సలహాల ననుసరించి 1927 లో మలేరియా పరిశోధనసంఘము స్థాపింపబడినది. (Malaria Survey of India).

ఇన్ఫ్లూయంజా. ఇది అంటు జ్వరము. వేనకు వేలను కబళించినది. వెలుతురు, గాలి, ఆహారము, నిద్ర లేకుండుటచే నీజాడ్యము ప్రబలుచున్నది. మానవ జవసత్త్వముల హరించుచున్నది.

కుష్టు. అసహ్యాకరమైనది, భయంకరమైనది. ప్రథమమున పాశ్చాత్యదేశముల నావరించినది. తీవ్రముగ ప్రతిఘటింపబడి నిరోధింపబడినది. ఇప్పు డెచ్చటనో గాని లేదు. మనదేశమునం దతిఘోరముగ వ్యాపించుచున్నది. 1874 లో కుష్టు రోగులకు ఇండియన్ మిషను ప్రారంభింపబడినది. 1898 లో వసతిగృహనిర్మాణశాసనము గావింపబడినది. 1920 నుండి అధికారము రాష్ట్రప్రభుత్వముల కీయబడినది. ప్రస్తుతము మనదేశమున 103000 కుష్టురోగులున్నారు ఇందులో మూడువంతులు మాత్రమే

(1. See India in 1930—31 P. 484)

వసతి గృహములయం దున్నారు. సుమారు 73 నివారణశాలలున్నవి. శాలకు సగటున 1000 గురు రోగులున్నారు. ఇంకను 40 వేలమంది దరిద్రులు దిరిపె మెత్తుకొని జీవించుచున్నారు. వీరుగాక పలువురు ప్రాథమికదశలో గృహములలో గుందుచున్నారు. మొత్తము 5 నుండి 10 లక్షల వఱకు గలరని మతింపు వేయబడినది. ఈ రోగులందఱు సంఘమునుండి ప్రత్యేకింపబడి చికిత్సచేయబడినగాని విముక్తి లేదు. జాడ్యమున కంతులేదు. ప్రాథమిక దశయందలి రోగుల ప్రత్యే కించిన గాని ప్రయోజనములేదు. అట్లు గావించుటకు 1898 చట్టాను సారము కేంద్రరాష్ట్ర ప్రభుత్వములు ప్రతిరాష్ట్రమునకు కావలయు వసతి గృహముల నిర్మించి యుండవలసినది. అట్లు చేయలేదు. వ్యాధి భయంకర రూపమును దాల్చుచున్నది.

1925 వ సంవత్సరపు జనవరిలో లార్డురీడింగుగారు కుష్టురోగ నివారణ సంఘమును స్థాపించిరి. (Indian Council of the British Empire Leprosy Relief Association). ఇందులకు రు 2023500 ల రూపాయల విరాళమును సంపాదించిరి. సంవత్సరము 1కి రు 122372 లు పై మూలధనమువలన ఆదాయము వచ్చుచున్నది. ఇందులకు తోడు 1930-31 లో రు 2000 లు ఇతరవిధముగ లభించినవి. ఈమొత్తమును వ్యయపరచి కేంద్రరాష్ట్ర సంఘములు కుష్టురోగ నివారణోపాయ ముల గనుగొనుచున్నవి. వీరి అన్వేషణ ఫలితముగ "కుష్టురోగియందు జబ్బును ప్రతిఘటింపగల శక్తి ఆహారము ననుసరించి కలిగింపవలెనని తేలినది."[1] 1930 వ సంవత్సరమునందీ కుష్టురోగ నివారణ సంఘము రు 131000 లు ఖర్చుపెట్టినది. ఇందు రు57520లు రాష్ట్రశాఖల కొసం గినది. 104 మంది వైద్యులకు కుష్టురోగనివారణ విధానమును గురించి కలకత్తాయందు శిక్షణ గఱుపబడెను. ఈసంఘమువారి అన్వేషణ ము

1. *India in 1930—31 p. 422*

వలన కుష్ఠురోగము అనాగరిక జాతులలో హెచ్చుగ నున్నదని తేలు చున్నది. ఇట్టివారిచేత దాసీపనులు చేయించుకొనుటచే నితరులకు కూడ నంటుకొనుచున్నది.

ఇది విపరీతముగు నంటుజాడ్యము. ఒక్కొక్కని జబ్బు అనేక గ్రామములయం దంటుకొనుచున్నది. "చాలకాలమునుండి కడుపునిండా ఆహారములేనివారికి సరియగు, తిండిలేనివారికి సవాయి, చలిజ్వరము కొంకిపురుగు మొదలగు జబ్బులుగలవారికి నీజబ్బుఅంటుకొనుచున్నది."[1] ఈ జబ్బు అంటుకొనుటకువలయు కారణములన్నియు హిందూదేశమున గలవు. ఇంక నీజబ్బు వ్యాపించుటయం దాశ్చర్యమేమి? సంయుక్త రాష్ట్రములు, ఢిల్లీ, పంజాబులలో అన్వేషణము జరిగెను. "652 గ్రామములలో 222307 మంది పరీక్షింపబడిరి. ఇందు 304 గ్రామములలో నీయంటువ్యాధి గలదు. 650 మంది కీజబ్బుగలదు. జనాభాలెక్కలలో 109 గురు మాత్రమే కుష్ఠువ్యాధి గలవారు కలరని వ్రాయబడెను."[2] ఈ పరిశోధనల ననుసరించి యీ వ్యాధిగలవారు తమవ్యాధిని బహిరంగపరచుకొనుటకు మారుగ దాచుకొనుచున్నారని తేలుచున్నది. ఇది దురలవాటు. ఈ వ్యాధి ప్రాథమిక దశయందే నివారణీయము. ప్రారంభమునందే యితరుల కంటుకొనును. కాన ప్రారంభదశయందే వైద్యము చేయించుకొనవలెను.

**విషమజ్వరము Typhoid Fever.** మనదేశమందు ప్రబలియున్న జబ్బులలో విషమజ్వరము కూడ నంటువ్యాధియే. ఇది ప్రమాదకరమైనది. చెడునీరు త్రాగుటవలనవచ్చు జబ్బులలో నిదియు చేర్పబడినది. ప్రపంచమునందంతట గలదు. మనదేశమందుగల అపరి

1. *India in 1930-31 P 423.*

2. *India in 1930—31 P. 423*

శుభ్రి పరిస్థితులచే నిచ్చట నధికముగ గలదు. తరుచు వచ్చుచున్నది. "ఆంగ్లేయులకు తీవ్రముగ వచ్చుచున్నది."[1] ఈజ్వరమువలన పలువురు చనిపోవుచున్నారు. ఎంతమంది చనిపోవుచున్నదియు వివరించుటకు వలయు లెక్కలు ప్రభుత్వమువారిచే వేయబడుటలేదు. "1896 వ సంవత్సరమున సర్. ఆల్మరీతురిట్టుగారు కనిపెట్టిన యింజెక్షనులు తీసికొనుటవలన జ్వరమురాకుండగ నిరోధించుటకు వీలున్నది."[2] గత ఐరోపా మహాసంగ్రామమున సైనికులీజ్వరముచే మిక్కుటముగ పీడింపబడిరి. రిట్టుగారి యింజెక్షనులు తీసికొనిన సైనికులయం దత్యల్పసంఖ్యాకులకుమాత్రమే యీజ్వరమువచ్చినది. ఈయింజెక్షనులు తీసికొనినచో రెండుసంవత్సరములవఱ కీజ్వరము రాకుండగనుండునట. జ్వరమువచ్చినపుడు వైద్యముకంటె విశ్రాంతి యెక్కుడు గుణమొసగునని వైద్యులు చెప్పెదరు.

రక్తగ్రహణి. రక్తగ్రహణికూడ భారతదేశమున తఱుచు వచ్చుచున్నది. కఱవులయం దధికముగ వచ్చుచున్నది. యాత్రికు లీజబ్బునకు తఱుచుగ గురియగుచున్నారు. జైళ్ళయందలి ఖయిదీలే యారక్తగ్రహణిజాడ్యమున కునికిపట్టు. రక్తగ్రహణికూడ మానవ ప్రాణముల బలిగొనుచున్నది. శక్తిమంతమగు నాహారము లేకుండుటయే యీ జాడ్యమునకు కారణము. జైళ్ళయందు రక్తగ్రహణిచే బాధింపబడని ఖైదీ యుండనేయుండడు. జైళ్ళయందు అమానుషమగు పనులు చేయించుచు నందువలన జనించు తాపోపశాంతికరమగు చల్ల ఖయిదీల కీయబడుటలేదు. చల్ల వాడుట భారతదేశమందలి అన్ని ప్రాంతముల వంశపరంపరానుగతముగ వచ్చుచున్న యలవాటు. కడుబీదవాడు గూడ గంజితోబాటు చల్లను వాడుచుండును. ఇట్లు

1. *India in 1930—31 P. 421*

2. *India in 1930 —31 P. 421*

మునగూడ క్షయవ్యాప్తమగుచున్నందున తగువిశ్రాంతి నివారణోపాయమనుట నిశ్చయము. అన్నికారణములకంటె ముఖ్యమగు దారిద్ర్యమునుండి భారతీయుడు సంరక్షింపబడి కడుపార తిండి లభించినగాని యీరోగమును నిరోధింపజాలము.

## 6. వైద్యసహాయము.

ప్రభుత్వపోషణలేక ఆయుర్వేద యూనానీవైద్యములు నశించి పాశ్చాత్యవైద్యమే పాదుకొనినది. యుద్ధమునకు పూర్వము 4100 వైద్యాలయములు. 1917 లో 2991. 1924 లో 3569. 7 వైద్యకళాశాలలు, 18 వైద్యవిద్యాలయములు. 1919 లో 3043 వైద్యవిద్యార్థులు గలరు. అందు కొలదిగ స్త్రీలు. 7 కోట్లగ్రామములకు 3669 మాత్రమే గలవు. అన్నియు నుచితశాలలు గావు. ఉచితశాలలయందుగూడ వైద్యులు కొబ్బరిచెట్ల మొవ్వులపై గూర్చుందురు. నిరుపేదల కందుబడిలో లేరు.

1764 లో హైందవవైద్యసమ్మేళనము స్థాపింపబడినది. అందలి యుద్యోగములకు పాశ్చాత్యులే దిగుమతియైరి. 1853 నుండి యిందు జేరుటకు హైందవులకు హక్కు వచ్చినది. కాని సీమపట్టము లుండవలెను. 1885 మొదలు 1910 లోపుగ 89 గురు నల్లవారు మాత్రమే చేర్చుకొనబడిరి. వైద్యశాఖ లన్నిటియందు నాంగ్లేయులే పెత్తనముల జలాయించుచున్నారు. వా రభ్యసించు విద్య కేర్పాట్లు మనదేశమున చేయలేదు. వారికిచ్చు ఈ పోటీపరిక్ష కూడ నింగ్లండునందే యేర్పరుపబడినది. ఎమ్. డి. ఎమ్. యస్. సి. ల పరీక్షలయందు మాత్రమే ఇండియాయందు నావకాశమున్నది. ఈ (I. M. S) ఐ. ఎమ్. ఎస్.

యుద్యోగులపై వెచ్చింపబడుచున్న ధనము గ్రామముల వెంబడి వైద్యాలయముల కుపయోగించుచో నుపయుక్తముగ నుండెడిది.

అట్లొనరించుటకు ప్రభుత్వము సిద్ధపడుట లేదు. హిందూదేశమునం దితర యుద్యోగములయందున్న ఆంగ్లేయుల వైద్యసహాయమునకై ఆంగ్లేయోద్యోగులే యుండవలె ననుచున్నారు. సైమను సంఘమువా రీవిషయమై చర్చించిరి. రౌండుటేబిలుసభయం దీసమస్య తర్కింపబడినది. సైమనుసంఘనివేదికయం దిట్లున్నది. "ఆంగ్లేయోద్యోగులు తమకును, తమ కుటుంబమునకును వైద్యసహాయమునకై ఆంగ్లేయ డాక్టర్లుండవలెనని నొక్కి చెప్పుచున్నారు. ఇది అత్యవసరమే యని మేము తలంచుచున్నాము. హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శికి గల అధికారము; ఆంగ్లేయ డాక్టర్లను రాష్ట్రశాఖలలో నియమించుట, వారి జీత భత్తెములు నిర్ణయించుట, వలయునంతమందిని నియమించుటలో గల బాధ్యత తొలగింపరాదు."[1] రౌండుటేబిలు సభయందలి యుద్యోగముల యుపసంఘ మిట్లు వ్రాసెను. "కేంద్రప్రభుత్వ అధికారమునగాని, రాష్ట్రీయప్రభుత్వ అధికారమునగాని వైద్యశాఖోద్యోగములు ఆంగ్లేయులకు ప్రత్యేకింపరాదు. సివిలు వైద్యశాఖోద్యోగము లన్నియు ఉద్యోగనియమ సంఘమువారిచే (Public Service Commission) నియమింపబడెను. ఇట్లు నియమించుటలోనే ఆంగ్లేయోద్యోగుల అవసరములనుగూడ గుర్తించి అవసరమగు ఆంగ్లేయవైద్యులను నియమింపవలెను. వారికి జీతభత్తెముల నొసంగవలయును."[2] సైమనుసంఘమువారి సూచనకు, రౌండుటేబిలు సంఘమువారి సూచనకు మూలసిద్ధాంతమునందు విశేషతారతమ్యమున్నను, ఫలితమొక్కటియే;

---

*1. See p. p. 338. p 292. Report of the Indian Statutory Commission).*

*2. Indian Round Table Conference: Proceedings of Sub Committees Volume VIII, Pages 249—252.*

ప్రత్యేకముగ ఆంగ్లేయోద్యోగులకొఱకు ఆంగ్లేయవైద్యుల నధికజీత భత్తెములమీద నియమించుట తొలగదు. ఇది మనవిధి యనుచున్నారు. కాని భారతదేశమందలి విశ్వవిద్యాలయములలో వైద్యవిద్యయందు కృతార్థులైనవారి పట్టములను ఇంగ్లండునందలి వైద్యసమ్మేళనమువారు గుర్తింపకుండ నిరాకరించుచున్నారు. (General Medical Council of Great Britain). మొట్టమొదట 1892 వ సంవత్సరమున భారతీయవైద్య విద్య బిరుదములపట్టములను ఇంగ్లండు వైద్యసమ్మేళనమువారు గుర్తించిరి. 1922 వ సంవత్సరముమొదలు నిర్ణీతకాలమునకే గుర్తించుచున్నారు. భారతదేశమందలి వైద్యవిద్య సక్రమముగ నున్నదా లేదా యని వీరుపరీక్షించుచు గుర్తించుచుండవలెనని వీరిసిద్ధాంతము. 1930 వ సంవత్సరము ఫిబ్రవరి 24 వ తేదీని ఇంగ్లండు వైద్యసమ్మేళనము గుర్తింపనిరాకరించినది. ప్రభుత్వమువారి అభిమతమునుగూడ నీసడించివైచెను.

బ్రిటిషు వైద్యసమ్మేళనవారి మన్ననలకు పాత్రమగుటకు అఖిలభారత వైద్యసమ్మేళన శాసనమును గావించుటకై ప్రభుత్వము వారు ప్రయత్నించిరి. (All India Medical Council Bill). 1933 వ సంవత్సరమున శాసన మొనరించిరి. సీమ వైద్య బిరుదములను భారతీయ ప్రభుత్వము గుర్తించుచు వారికే ఉన్నతోద్యోగముల నిచ్చుచు వారి వెంటబడుచున్నపుడు వారు భారతీయ బిరుదముల నీసడించుటలో వింతలేదు. ఇతరదేశముల వైద్యవిద్యకు గల అగ్రస్థానమే సీమకు గూడ నొసంగి ఆదేశపు వైద్యులపై అనవసర అధికవ్యయము చేయకుండ నున్నచో ఆసొమ్మును పల్లెల ఆరోగ్యాభివృద్ధికై వినియోగించుటకు వీలుగనుండును.

వైద్యసంఘ శాసనమున (Medical Council Bill) భారతీయ

వైద్య విద్యాపట్టములను గుర్తించిన గాని భారతదేశమునం దితర దేశముల వైద్యవిద్యాపట్టములు గుర్తింపబడవను నియమము గలదు. ఈనియమమును తొలగించిన గాని హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి యీశాసనము నామోదింపడని కేంద్రప్రభుత్వ సభ్యుడు భారతశాసన సభ్యులకు మొట్టమొదట బెదిరించెను. కాని చిట్టచివర కెట్టి యభ్యంతరములు లేకుండ నీవైద్యసమ్మేళనపు బిల్లు శాసనమయ్యెను.

పాశ్చాత్యవైద్యమునందు నేర్పతగినది శస్త్రచికిత్స, రోగనిదానములు మాత్రమే. ఔషధభాగమునందు ఆయుర్వేదము, యూనానీ వైద్యవిధానములే ప్రశస్తమైనవి. ఆయుర్వేదమునందు గల వివిధమగు మూలికా ప్రకరణములు లోహప్రకరణములు పాశ్చాత్యవైద్యమున లేవు. అలోపతీవైద్యమున మూలికలు, మందులు కొలదిగ మాత్రమే గలవు. ఆయుర్వేదము యూనానీ వైద్యపద్ధతులు పునరుద్ధరించి శస్త్రచికిత్స రోగనిదానములతో గూడిన వైద్యవిద్యాభ్యాసమే భారతదేశమునందు నెలకొల్పతగును. మదరాసునందు కీర్తిశేషులైన పానగల్లు రాజాగారు మంత్రిగ నున్నపుడు నెలకొల్పబడిన వైద్యవిద్యాలయమువంటి విద్యాలయములే భారతభూమియం దవసరము. ప్రత్యేకముగ పాశ్చాత్య వైద్యవిద్యాప్రబోధమునకై ధనము వ్యయపుచ్చరాదు. ఇట్లు దుర్వ్యయము తగ్గించుచో ప్రజల ఆరోగ్యాభివృద్ధికి అవసరమగునంత ధనము వ్యయపుచ్చ గలుగుదుము.

క్రైస్తవ మిషనులుగూడ కొన్ని ఆసుపత్రుల నచ్చటచ్చట పెట్టినవి. వీరిఆసుపత్రులే స్త్రీలకొకింత యుపయోగముగనున్నవి. 1885 లో కౌంటెసుడప్రిను నేషనల్ సంఘమును స్థాపించినది. ఆసంఘమువారే స్త్రీవైద్యులను మిషనుఆసుపత్రులకు పంపగలుగుచున్నారు. 1878 కటి

## 7. పారిశుద్ధ్యశాఖ (SANITARY DEPARTMENT).

పట్టణములయం దిండ్లు కట్టుటకు నియమములు స్థానికసంస్థల యధికారమునం దుంచబడినవి. ఈస్థానికపరిపాలన 19వ శతాబ్దారంభము నుండియు ప్రారంభింపబడినది. అప్పుడు రాజధాని నగరములయందు మాత్రమే ప్రప్రథమమునం దేర్పరుపబడినది. 1850 సంవత్సరమున జిల్లాలకు కూడ వ్యాపించునట్లు చట్టము సవరణచేయబడినది. 1868 సం వత్సరమునందలి శానిటరీ కమిషనువారు ప్రతిరాష్ట్రమందును శానిటరీ బోర్డులను స్థాపింపవలెననియు వాటికి పరిశుభ్రత నియమముల నాచరణ యందు బెట్టుటకు వలయు నధికారము నొసంగవలెననియు ప్రతి గ్రామమందున పరిశుభ్రత నియమముల నాచరణయందు పెట్టుటకు వలయు శాసనములను ప్రతిరాష్ట్రము గావింపవలెననియు సూచించిరి. 1870 లో లార్డుమేయోగారిచే ప్రవేశపెట్టబడిన చట్టమును దీని ననుసరించి లార్డు రిప్పను దొరగారు 1882 లో గావించిన స్థానికప్రభుత్వ నియమములను 1883-84 సంవత్సరములలో గావింపబడిన శాసనముల ననుసరించియు స్థానిక సంస్థ లేర్పఱుపబడి నిర్వహింపబడుచున్నవి. ఈస్థానిక పరిపాలనా బీజములు 1850 లోనే వేయబడినను నేటివఱకు పుష్పించి ఫలింపలేదు. మొరడువలె అధికారశూన్యముగ నుండి ఆర్థిక దరిద్రమున మునిగితేలుచున్నవి. ఈ స్థానికప్రభుత్వమున పట్టణముల యందే యింకను పరిశుభ్రత యేర్పరచుటకు వీలులేకున్నది. వివిధ పట్టణములలో నింకను డ్రయినేజీస్కీములుగూడ లేవు. మురుగుపోక, పట్టణమందలి ప్రజలుమురుగుచున్నారు. పల్లెలమాట చెప్పనవసరము లేదు. పల్లెల కీస్థానికప్రభుత్వములు పారిశుధ్య పరిశుభ్రత విషయమునందు నిరుపయోగముగనున్నవి. పల్లెలయందలివీధులు అపరిశుభ్రమునకు నిలయములు. కాలకృత్యములు నెరవేర్చుకొనుటకు ప్రత్యేకస్థలములులేక

గ్రామకంఠములుగూడ విస్తారములేక కీవాడలయందే కాలకృత్యములు దీర్చుకొనుపరిస్థితి గలదు. పరిశుభ్రదాహోదకముగూడ లభించుటలేదు. స్థానికప్రభుత్వములు ప్రస్తుతాధికారముతో ప్రస్తుతధనముతో నేమియు చేయలేకున్నవి. చేయనోపవు. గ్రామములకు పోవుటకు సరియైన మార్గములైన లేనేలేవు. రోడ్లులేవు. స్థానికప్రభుత్వపుపేరు వినబడుట ప్రారంభించి ముప్పాతికశతాబ్దము ముగిసినను, జనపదములయందు పరిశుభ్రతయైన నెలకొల్పజాలకపోయినవి. ఈ శానిటరీశాఖ పేరుగ ఇండియన్ మెడికల్‌సర్వీసు ఉద్యోగస్థులు మరికొందరవసరమైరి. వారికుద్యోగము లొసంగబడుచున్నవి. వీరందరు ఇంగ్లండునుండి దిగుమతిచేయబడుదురని యిదివరలోనే వ్రాయబడినది. ఇండియాప్రభుత్వమువారు యిండియన్ మెడికల్‌సర్వీసు డైరెక్టరుగారిని శానిటరీకమీషనరుగ నియమించుదురు. ఈయనక్రింద రాష్ట్రప్రభుత్వములు శానిటరీకమిషనర్లను, డిప్యూటీకమిషనర్లను నియమించుచున్నవి. నగరములయందలి స్థానిక పరిపాలనాసంఘములు, పట్టణములయందలి మ్యునిసిపాలిటీలు, హెల్తు ఆఫీసర్లను నియమించుచున్నారు. జిల్లాబోర్డులక్రింద హెల్తుఆఫీసులు, హెల్త్‌ఆఫీసర్లు, తాలూకాబోర్డులు, శానిటరీయినస్పెక్టర్లు కలరు. వీరందరికి డబ్బుదండుగయేగాని యీశాఖవలన జరుగుపని రవంతయులేదు. 1898 లో నియమింపబడిన ప్లేగుకమిషనువారు పారిశుధ్యశాఖవిషయమై చేయవలసినపనులు అంటువ్యాధులు రాకుండ నిరోధించుపద్ధతులు వివరించిరి. ఆసూచన లింతవఱకు అమలులోనికి రాలేదు.

1912 లో లార్డుకర్జనుగారి కాలమునం దీశాఖ యొకింత సంస్కరింపబడినది. 1911-12-14 సం॥లలో బొంబాయి, చెన్నపట్టణము, లక్నోలయందు అఖిలభారత శానిటరీ సభలు జరిగినవి. వివిధ రాష్ట్రములయం దిట్టి సభలే జరిగి చర్చలతో మాత్రమువి ముగిసినవి.

పట్టణములయందు, పల్లెలయందు గల పారిశుధ్య పరిణామావస్థ దోమ కుత్తుకవలెనున్నది. మదరాసు రాజధానిలోగల 42 వేల జనపదములలో 100 కి 98.6 వంతుల జనావాసములలో మరుప్రదేశములే లేవు. ఇందులకు ధనాభావము, ప్రజల కధికారశూన్యత, తగుసంఖ్య శానిటరీ యుద్యోగస్థులు లేకుండుట, ఉన్న కొలదిమందియు సక్రమముగ విధి నిర్వర్తింపకుండుటలే కారణములు. 1911 లో పరిశోధన శాఖ యేర్పరుపబడి (Indian research found association) సాలీనా 5 లక్షల విరాళముతో పని ప్రారంభించినది. 1926_27 సం॥ నందీ విరాళము హెచ్చింపబడి 6.7 లక్షలతో అంటురోగ వ్యాప్తి నిరోధ పరిశోధనము జరుగుచున్నది. 1930_31 వ సంవత్సరమున 750000 విరాళము ప్రభుత్వమువారిచే నీసంఘమున కొసంగబడినది. ఇందు 500000 పరిశోధలకును 200000 ఉద్యోగస్థుల జీతభత్తెములు, పెన్షనులకును వినియోగింపబడెను. ఈసంవత్సరమున 47 పరిశోధనల నొనరించెను. కలకత్తా, బొంబాయి, కాన్పూరు, లక్నో, అలహాబాదు మొదలగు నగరముల నగరాభివృద్ధి సంఘము లేర్పడినవి. (Improvement Trusts). ధనాభావముచే నీసంఘముల పని మొండిపడినది. మాంటేగ్యు సంస్కరణల ననుసరించి కేంద్రప్రభుత్వము సలహాదారులు. పబ్లికుహెల్తు కమీషనరు యింపీరియల్ బోర్డు ఆఫ్ హెల్తు ద్వారా రాష్ట్రప్రభుత్వమునకు సలహా నొసంగుచున్నాడు. అంటు వ్యాధుల వ్యాప్తులు, మరణముల లెక్కల మదింపున కొక యుద్యోగి గలడు. కేంద్రప్రభుత్వమువారి యుద్యోగములు ప్రత్యక్ష ప్రజోపయోగకారులు గావు. అధికారముగల రాష్ట్రప్రభుత్వము లీశాఖకై ధనము వినియోగింపవలసివచ్చునప్పుడు మొండిచేయి చూపుచున్నది.

1929-30 వ సంవత్సరమున డేరాడూన్ నందు కేంద్ర పరిశోధన సంస్థ నెలకొల్పుటకు (Central research institute) సంకల్పింపబడెను.

ప్రభుత్వము, ఆర్థికసలహా సంఘము (Standing Finance Committee), హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శియు నందఱంగీకరించిరి. పనిమాత్రము జరుగలేదు. ఈవిషయమై 8-2-1930 వ సంవత్సరమున ఎమ్. ఆర్. జయకరుగారు భారత శాసనసభలో తీర్మాన ముపపాదించిరి, ఈతీర్మాన ఫలితముగ నీవిషయమంతయు పునర్విమర్శింపబడవలెనని ప్రభుత్వము వారు నిర్ణయించిరి. ఉద్యోగులు, అనుద్యోగులు అగు వైద్యులు పారిశుద్ధ్యశాఖవారు గలిసి 1930 జూలై యందు సిమ్లాలో సభజేసిరి. ఈ సభకు ఆరోగ్యశాఖ కార్యదర్శి యగు సర్. ఫ్రాంకునోసీగారే అధ్యక్షత వహించిరి. ఈసభవారు కేంద్రవైద్య పరిశోధనసంస్థను ఏ విశ్వవిద్యాలయమునకైన ననుబంధముగ నెలకొల్పవలె ననిరి. డేరా డూనునందు వలదనిరి. ఈతీర్మానము కాగితమును నలుపుచేయుటకే సరి పడినది. ఫ్లెచ్చరు కమిటీవారి సూచన, భారత శాసనసభవారి తీర్మానము, సిమ్లా వైద్యసమ్మేళనమువారి తీర్మానము, యీమూడును మన్నింపబడలేదు. ధనాభావమువలన ఆచరింప వీలులేదని ప్రభుత్వము వారనిరి. "ఇట్టి ప్రాముఖ్య విషయమునందీ పరివర్తనము చాల విషాద కరము."[1]

(All India Institute of Hygiene and Public Health) అఖిల భారత ఆరోగ్యసంస్థ మాత్రము తలపెట్టబడినట్లుగ పరిశోధన శాఖవారి యాజమాన్యమున కలకత్తాయందు ప్రారంభింపబడినది,

కార్యాలయము నిర్మింపబడినది. పర్లాకిమిడిరాజాగారు పర్లా కిమిడిట్రిస్టు అనుపేరున 1 లక్షరూపాయలు విరాళమొసంగిరి. ఈవిరాళముతో నాహారవిషయమైన పరిశోధనలు కూనూరునందు జరుగుచున్నవి. ఈపరిశోధనలు ప్రజాసామాన్యమున కుపయోగకరముగలేవు.

---

1. (*India in 1930-31 P. 428*)

దొక్కొక్క నెల పూర్తిజీతముమీద విశ్రాంతి నొసగవలెననిరి. స్త్రీ కార్మికులు పురుషులతోబాటు పనిచేయుచున్నను తక్కువ కూలి పొందుచు మరల యిండ్లకుపోయి గృహకృత్యము లొనరించుటకు శ్రమపడుటయు నీశ్రమవలన స్త్రీలనారోగ్యముచే నశక్తులగుచున్నారు. మాతృలోకమిట్టిదుస్థితియందున్నప్పుడు ఆరోగ్యాభివృద్ధియగుటయెట్లు? స్త్రీలకు పనిచేయు కాలపరిమితి తగ్గించి పురుషులతోబాటు సమానవేతనములొసంగుట సమంజసము. బొంబాయియందు కొన్నిమిల్లులవారు తమంతటతామే మాతా శిశు సంరక్షణశాలల నేర్పఱచిరి. సుమారు 4వేలమంది వానియందుగలరు. ఇందుమూలమున మిల్లులకెట్టినష్టము వచ్చుటలేదు. కలకత్తా నార, దూదిమిల్లుల పనివాండ్రను గురించియు టీతోటలు, రాక్షసిబొగ్గు గనులయందున పనిచేయు పనివాండ్రను గురించియును కర్జను (Curgel) సతి విచారించినది. ఫ్యాక్టరీలయందలి గర్భిణీస్త్రీలస్థితి దుర్భరమని యామె నిశ్చితాభిప్రాయము. గనులయందు, తేయాకు తోటలయందు సుచితస్త్రీసంరక్షణావైద్యాలయములచ్చటచ్చటగలవు కాని పేర్కొనదగినట్లుగ లేవని యామె వివరించినది. 1928 లో నియమింపబడిన రోయల్ అగ్రికల్చరల్ కమిషనువారు వ్రాసినట్లుగ ప్రతి పల్లెపల్లెయందును స్త్రీజనోపయోగకరముగ విద్యాసంస్థలున్నచో నీసంస్కరణలు కొనసాగించుట సులాయాసము. ఇందులకగు ధనము ప్రభుత్వమే వెచ్చింపవలెను. (Lt col. C. L. Dum)కల్నలుడమ్ గారు వ్రాసినట్లు తల 1కి 0-2-0 చొప్పున ఆరోగ్యవిషయమై ప్రభుత్వము వెచ్చించుచో మాతాశిశువులు సంరక్షింపబడగలరు. ఆరోగ్యవారము, శిశు ప్రదర్శనవారము లిప్పుడిప్పుడే మొలకలెత్తుచున్నవి. (The Countess of Dufferin Fund) డఫిరిన్ దొరసానినిధి, "విక్టోరియా మెమోరియల్ పుమెన్సు స్కాలరుషిప్పుఫండు, (The Lady Chelmsford fund for Maternity) ఛెలమ్సుఫర్డు దొరసాని ప్రసూతి సంరక్షణనిధి, రీడింగు

దొరసాని మాతాశిశువుల నిధి, స్త్రీల మెడికల్ సర్వీసు వారిచే పరిపాలింపబడి ఆవగింజయం దరభాగప్రచారము చేయుచున్నవి. పురాతన కాలమునుండియు వచ్చుచున్న ఆయుర్వేదవైద్యసహాయమే దేశమునం దెల్లయెడల విరివిగగలదు. స్థానికసంస్థలీ వైద్యసహాయమును చేబట్టుట ప్రశంసనీయము. ప్రభుత్వము సైన్యముయొక్క ఆరోగ్య పారిశుద్ధ్యములకై యెట్లు వారికి అధికజీతములు, విశాలగృహములు మొదలగునవి యొసంగుచున్నదో అట్లే భారతజాతి యంతటి ఆరోగ్యపారిశుధ్య విషయములపై శ్రద్ధవహించి వలయుధనము వెచ్చించియున్నచో దేశమీపరిస్థితదుస్థితియం దుండెడిదిగాదు.

1000 కి సేనయందలి మరణములు.[1]

| 1801-30 | 1831-56 | 1901-5 | 1906-09 |
|---|---|---|---|
| 84.6 | 57.7 | 12.2 | 8.7 |
| .. | 15.6 | 10.0 | 6.5 |

| 1911 | 1920-24 | 1925 |
|---|---|---|
| 4.9 | 5.24 | 2.89 |
| 4.5 | 7.70 | 4.01 |

సేనయందుగల యీ స్వల్పమరణములకు రానురాను తగ్గుచు వచ్చిన యీస్వల్పమరణములకు వారిపై ప్రభుత్వము వెచ్చించుచున్న యధికవ్యయమే కారణము. ఆరోగ్యశాఖకు బ్రిటిషుదీవుల యందెట్లు వ్యయమగుచున్నదియు, మనదేశమునందెట్లు ఖర్చుపెట్టుచున్నదియు పోల్చి చూచినచో ప్రభుత్వమెట్లు భారతదేశమున ఆరోగ్య

1. *From Vera Anstey.*

సంరక్షణ నిర్లక్ష్యమునం దుంచినదియును సువ్యక్తమగును. 1925-26లో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వములు ఆరోగ్య, పారిశుధ్య, వైద్యశాఖలపై మొత్తము 619 లక్షలు ఖర్చుపెట్టిరి. ఇది 32 కోట్లప్రజలకు "ఇంగ్లండు వేల్సులలో ధర్మదాతల యుచిత వైద్యాలయములుగాక ప్రభుత్వము 1925 లో 59.4 మిలియన్ పౌండ్లు లేక 7920 లక్షల రూపాయలు ఖర్చుపెట్టబడినవి." 1

"ఇందు నేషనల్ హెల్తు యిన్స్యూరెన్సుపై పెట్టబడుచున్న ఖర్చు చేర్చలేదు. అదికూడ కలుపుచో 65.1 మిలియనుపౌన్లు లేక 8680 లక్షల రూపాయలు ప్రజారోగ్యముకొఱకు ఖర్చుపెట్టబడు చున్నట్లగును. ఇందు స్థానికసంస్థలు పెట్టుచున్న వ్యయముకూడ చేరినది. ఈ వ్యయము తీసివేసినను కేంద్రప్రభుత్వ మొక్కటే 8 మిలియనుల పౌనులు లేక 2400 లక్షల రూపాయలు ఖర్చు చేయుచున్నట్లు నిర్ధారణ యైనది. పశ్చిమదీవులలోను, బ్రిటిషు దక్షిణఅమెరికా కాలనీలయందును 2 మిలియనుల జనసంఖ్యకు 639115 పౌన్లు లేక 85 లక్షల రూపాయలు ఖర్చుపెట్టబడుచున్నవి."2

# 9. ప్రభుత్వబాధ్యత.

ఈ అంకెల ననుసరించి ఆరోగ్య విషయమున ప్రభుత్వమెట్టి నిర్లక్ష్యము, అశ్రద్ధ వహించినదో సుబోధకము గదా! ఆరోగ్య, పారిశుధ్య వైద్యవిషయములలో ప్రభుత్వము వహించిన యీనిర్లక్ష్యముననే ప్రజలు రోగులై, అల్పాయుర్దాయులై, బలహీనులై, నిర్వీర్యులై పోయిరి. నిర్మాణశక్తి, నిర్మాణకౌశల్యము, ఉత్సాహములు

---

1 ...om Vera Anstey

2 ...oted from Vera Anstey.

నశించిపోయినవి. ఈ పతనము ఆర్థికాభివృద్ధిని ప్రతిఘటించినది. ఆర్థిక పతితావస్థ దాపరించినది. కంటికి గోచరించుచున్నంతవరకు రోగుల సంఖ్య ననుసరించి దేశమునకు గలుగుచున్న ఆర్థికనష్టమును మదింపు వేయగలము. ఈ పత్రికపుటయందలి పట్టిక ననుసరించి దేశమందెంత మంది శక్తిహీను లున్నదియు తెలిసికొనగలము.

అంటు వ్యాధులవలన సాలుసరి చచ్చిపోవుచున్నవారి సంఖ్యయు మనము సుమారుగ తెలిసికొనగలిగితిమి.

| | | | |
|---|---|---|---|
| ప్లేగు | 20000 | 1930-31 | మరణించిరి. |
| మశూచి | 50000 | 1930-31 | మరణించిరి. |
| విషూచి | 200000 | 1930-31 | మరణించిరి. |
| చలిజ్వరము, ఇన్ ఫ్లూయంజా, విషమ జ్వరము, మొదలగు జ్వరములు. | 4000000 | 1930-31 | మరణించిరి. |

క్షయవ్యాధి. 1000000 (మిలియను) సుమారు మరణించుచున్నారు.

మొత్తం—5270000 మంది 1930—31 వ సంవత్సరమున అంటు జాడ్యములవలన మరణించిరి.

ఈమరణములవలన శక్తి విహీనులవలన దేశమున కార్థికముగ నెంత నష్టము వాటిల్లుచున్నది?

శక్తిహీనులగు 1100430 మందిని పోషింపవలెనన్న, ఆరోగ్య వంతుడగు నిరుద్యోగిని పోషించుటకంటె హెచ్చు మొత్తము వ్యయ మగును. ఆహారము, మందు వైద్యునకు అగు వ్యయము మాత్రమే

కొలది నేడేట మరణించుచుండుటచేతను లక్షలకొలది అశక్తులై దీర్ఘవ్యాధిపీడితులై యుండుటచేతను, వీరికొఱకు అభాగ్యదేశము లక్షల కొలది వ్యయపరుపవలసి వచ్చుటచేతను, ఆరోగ్యవంతులుగనున్న వారి యందెంత చిత్తవైకల్యము గలుగునో యూహింపజాలము. ఈచిత్త వైకల్యమున చేయగలిగినంత ధనోత్పత్తికర్మ నారోగ్యవంతులుగూడ చేయనోపరు. ఇట్లు చేయగలిగినంతపనిని చేయజాలనందున అపరోక్షముగ సంభవించుచున్న ఆర్థికనష్టమెంతయో కలదు. మదింపు మాత్రము వేయజాలము.

హిందూదేశమందు (బ్రిటిషుఇండియా) మొత్తము 1930 వ సంవత్సరమున అన్నివిధములగు ఆసుపత్రులు 6445 గలవు. ఈ ఆసుపత్రులవలన 67869419 మంది రోగులు చికిత్స పొందిరి. 54169 మంది ఆసుపత్రులలో చనిపోయిరి. ఈ ఆసుపత్రులకు రు 41457860 లు సాలుసరి ఖర్చగుచున్నది.

ఆసుపత్రులయందు చనిపోవుచున్న రోగులకు రోగి 1 కి రు 100 లు ఖర్చు మదింపువేయదగును. బంధుగుల రాకపోకలకు, మతవిషయమగు కర్మలకు, దహనసంస్కారములకు రు 100 లకు తక్కువగాదు. అందువలన ఆసుపత్రులయందు చనిపోవువారి నిమిత్తమె రు 5416900 లు సంఘము వెచ్చించుచున్నది. ఈ వ్యయమును ఆసుపత్రులకై పెట్టబడుచున్న వ్యయమును గలిపి చూచిన రు 46874760 లు ఆసుపత్రుల యందలి రోగులకై వ్యయమగుచున్నది. అనారోగ్య కారణమున సంఘద్రవ్యము రు 6708274760 లు అన్నివిధములగు రోగులక్రిందను వ్యయమగుచున్నది.

ఇట్లు అశక్తిమంతులు, అసమర్థులు గల సంఘము ఆర్థికముగ

నభివృద్ధి పొందుటెట్లు ? అనారోగ్యమునకై అత్యధికవ్యయ మొనరింప వలసిన సంఘము ఆర్థికముగ నెట్లు పెంపొందగలదు ?

# 10. కర్తవ్యము-గ్రామ పునర్నిర్మాణము.

ప్రతి సంవత్సర మింతటి ఆర్థిక నష్టము గలుగకుండ నుండవలె నన్న కర్తవ్యమేమి? ఆరోగ్యపరిచార మొనరింపవలె ననుటయు, నొనరించుటయు గూడ సులభములే. వాసిపైన వివరింపబడిన ఆరోగ్య పరిచారవివరము లన్నియు కొనసాగింపబడినను ప్రజలీ దుస్థితినుండి తొలగజాలరు. "బీదవాండ్రకు వ్యవసాయాభివృద్ధివలన గృహపరిశ్రమల పునరుద్ధారణమువలన మొదలగు సాధనములచే తినుటకు తిండి లభించునట్లు చేయక విశేషాంశములు చెప్పుటవలన నుపయోగములేదు. ఆకలిబాధచే నోర్వజాలని దరిద్రులు రెండవ పూట తిండిని గుఱించి మాత్రమే యోజింపగలరుగాని మఱియొకవిషయము యోజింపజాలరు." అని బ్రెయినుగారు వ్రాసిన వాస్తవ నిశ్చయము.1 ఆరోగ్యమే మహా భాగ్యము. అనారోగ్యవంతులగు భాగ్యవంతులకంటె ఆరోగ్యవంతుడగు కార్మికుడే దేశమునకుపయోగమనుటయు సత్యమే. కాని ఆరోగ్య, భాగ్యములురెండును జంటగనే మెలగును. ఆరోగ్యము లేనివానికి భాగ్యముండదు. భాగ్యములేని వాని కారోగ్యముండదు. ఈరెండును లేని భారతదేశమున రెంటిని ఈడుజోడుగ పునరుద్ధరింపవలెను. రెండును సక్రమాభివృద్ధిపొందుటకు కర్తవ్యమొక్కటియే కలదు.

భారతదేశమునకు పునాదియగు గ్రామములు సర్వతోముఖాభివృద్ధిని బొందుటకనువుగ పునర్నిర్మాణము గావలయును. గ్రామముల

---

1. *See page 69 Welfare Problems in Rural India. From S. Brayne M. C. I. C. S. Deputy Commissioner, Jhelam.*

యందు ప్రజాస్వామిక ప్రభుత్వములు స్థాపింపబడవలయును. (Village Republics.) ప్రజాస్వామిక గ్రామప్రభుత్వములు భారతీయచరిత్రమునకు నూతనములుగావు.

"మనుస్మృతియందును, క్రీస్తునకు పూర్వము 4వ శతాబ్దమునందు వ్రాయబడిన కౌటిల్యుని అర్థశాస్త్రమునందును, క్రీస్తుశకము 7 వ శతాబ్దమునందు వ్రాయబడిన శుక్రనీతియందును ప్రజా స్వామిక గ్రామప్రభుత్వములవిషయమై విపులముగ చర్చింపబడియుండెను. ఆనాడే ప్రజాస్వామికప్రభుత్వము లెట్లు వర్ధిల్లియున్నదియు నెఱుంగుట కాశ్చర్యము గలుగును.

గ్రామములలో గ్రామస్థులచే నెన్నుకొనబడిన గ్రామసంఘము లుండెడివి. ఇట్లే 10 గ్రామములకు, 100 గ్రామములకు, 1000 గ్రామములకుకలిసి నేటితాలూకా జిల్లాలవలె విభజింపబడి ప్రభుత్వములుండెడివని మనువ్రాసెను.............గ్రామసంఘములు వివిధకార్యములకై వేఱువేఱుసంఘములుగ విభజింపబడుచుండెడివి. ఈసంఘములు గ్రామమును పరిపాలించుచుండెడివి. ఒకగ్రామమునందిట్టివి 12 సంఘములుండెడివని నేను గుర్తించితిని.".................

"గ్రామములు సంపూర్ణమగు స్వపరిపాలన గలిగియున్నవి. కేంద్రప్రభుత్వాధికారము వీటిపై లేదు. గ్రామోద్యోగులను గ్రామ పంచాయతీలే నియమించుచుండెడివి. గ్రామోద్యోగులు గ్రామ పంచాయతీలకు లోబడియే పనిచేయవలసి యుండెను."[1]

* * *

హిందూదేశమున రాజ్యాంగమునకు ప్రజాస్వామిక గ్రామ

1. (*From Dr. Banerjea's Public Administration in Ancient India*)

ప్రభుత్వమే పునాది. ఈస్థితి మన మూహింపజాలని కాలమునుండియు 1816 వ సంవత్సరము వఱకును గలదు. అప్పటినుండియు నీ గ్రామ పరిపాలనా విధానము నాశనమొనరింపబడినది. గ్రామముల యందలి ఉమ్మడి వ్యవసాయము తొలగింపబడి ప్రతి సంవత్సరము పంటలో పాలు తీసుకొను ఆచారమును తొలగించిరి. గ్రామప్రజలనుండి వారి యుద్యోగస్థులను వారెన్నుకొను అధికారము తొలగించివేయబడెను. పన్నులు నగదురూపముగ చెల్లించునట్లు శాసింపబడెను. ఈమార్పు హిందూదేశ ఘోరదరిద్రావస్థకు ముఖ్యకారణము."............ అని డాక్టరు బీసెంటుగారును, ఎ. రంగనాధంగారును నుడివిరి.[1]

ఈగ్రామ ప్రజాస్వామిక ప్రభుత్వ పరిపాలన మెట్లుండెడిది ?

"ప్రతిగృహస్థునకు ఓటు ఉండెడిది. గ్రామనియమముల నుల్లంఘించినవానికి మాత్రము ఓటు అధికారము తీసివేయబడు చుండెడిది. సివిలు, క్రిమినలు అధికారమును గ్రామప్రభుత్వములే గలిగియుండెడివి. ఒకగ్రామమునకు మఱియొకగ్రామమునకు తగవు గలుగుచో మాత్రము వేఱొకరీ తగవును తీర్చెడివారు............. ఓట్లను చేతులెత్తుటమూలముగను, లేక రంగుకాగితముల నుపయోగించుట మూలముగను, అవసరమగునపుడు పెట్టెలలో పడవేయుచును గూడ పంచాయితీల కెన్నికలు జరుగుచుండెడివి. (ఈవిధాన మంతయు అర్థశాస్త్రమునందు, శుక్రనీతియందు విపులముగ గలదు.)...............

గ్రామనిర్మాణవిధానము గూడ, ఆచరణయం దుండెడిది...... పశుసంతతి మేతకు ఉమ్మడిబీళ్లుండెడివి. అడవులు పశువులమేతకు

1. *From the Indian Village System as it was. Lecture I by Dr. Besant and Mr. A. Ranganadham, published in Janmabhumi Oct. 7,1926.*

నివసించిన చైనాదేశసంచారియగు ఫాహియానుగారు (Fahien) గూడ నీవివరములనన్నింటిని గుర్తించెను. ఈయనతనసంచారకాలమందెప్పుడు గాని యొక్కమారైన దొంగలచే నడ్డగొట్టబడలేదని వ్రాసెను."[1]

"బౌద్ధయుగమున పట్టణములకంటె పల్లెలే విశేషముగనుండెడివి. జనులు విశేషభాగము పల్లెలయందే నివసించువారు. ఆకాలమునాటి పల్లెలు సస్యఫలశోభితములై, నేత్రపర్వముజేసెడివి. అప్పటిగ్రామజీవనము పరిశుద్ధమయి, సౌఖ్యప్రదమయి తనరారుచుండెడిది. గ్రామములోని యిండ్లన్నియు............పరస్పరసహాయమున కనుకూలించునట్లు ఒక్కచోటనే కట్టబడెడివి. ప్రతిగ్రామమునంటియు నొక్కచిట్టడవియు, దానికావల పచ్చికబీడును, దానినిజేరి గ్రామవాసుల వరిపొలములు నుండెడివి. ఆకాలమున ప్రతిగ్రామమున పశువులమేత కుపకరించు పచ్చికబీళ్లులు, గృహనిర్మాణాదికృత్యముల కుపకరించుకలపయు, భోజనాదికముల పచనమునకై వలయుకట్టెలును, లభించు అడవిప్రదేశములుండెడివి. పచ్చికబయళ్లు గ్రామవాసుల కెవ్వరికిని ప్రత్యేకముగ నుండవు. వరికోతలైన తరువాత ఊరిపశువు లన్నియు పొలములలో దిరిగి మేయును. తక్కినకాలములయందు పశులకాపరులు కదుపులను పచ్చికబీళ్ళకు దోలుకొని పోవుదురు. పంటకాల్వలను గ్రామవాసులే త్రవ్వించుకొందురు. నీరు అన్నిపొలములకును సమముగ బోవునట్లు నియమములు గలవు. నీరు సమముగ బారునదియు, లేనిదియు గ్రామాధికారి కనిపెట్టి చూచుచుండును.

ప్రతిగ్రామమునకు నొక్కొక్కగ్రామాధికారి యుండును. గ్రామవ్యవహారములన్నియు గ్రామసభతో నాలోచించి యాతడే

---

1. *From The Indian Village System as it was. Lecture by Dr. Besant and A. Ranganadham, Published in Janmabhumi Nov. 4—1926.*

నిర్వహించును. గ్రామపరిపాలన మంతయు గ్రామస్థులే నిర్వహించుకొనెవరు. తేనికి ప్రసక్తిలేదు. గ్రామమునకు వలయు బాటలు, తటాతములు, ఆరామములు, దేవాలయములు గ్రామమ లే నిర్మించుకొనును. న్యాయవిచారణకు గ్రామపంచాయతీలు గలవు. ఇవియే గ్రామమున నుదయించు వివాదముల పరిష్కరించును. గ్రామములో చౌర్యములు, బందిపోటులు మిక్కిలి అరుదుగ జరుగుచుండెను. "పల్లెలలో నివసించు జనులు పసిపాపలను చేతులలో నాడించుకొనుచు, తలుపులు మూసికొనుట యెట్టిదో యెరుంగక సుఖముగ జీవించుచుండిరి." అని బుద్ధుని సంభాషణములను గ్రంథమున ఆనాటిగ్రామ జీవనము వర్ణింపబడినది.

దీనినిబట్టి పూర్వకాలమున గ్రామములు సంపూర్ణస్వాతంత్ర్యము ననుభవించినట్లు స్పష్టమగుచున్నది. ఆకాలమున ప్రతిగ్రామమును ఒక్కొక్క ప్రజాస్వామికరాష్ట్రమైయుండెనని వేఱొకసందర్భమున నుడివితిమి. గ్రామాధికారియైనను తేడు నియమింపడు. ఈపదవి వంశపరంపరానుగతమైనది. ఇది సాధారణముగ జ్యేష్ఠపుత్రునియందు సంక్రమించుచుండును. ఆకుటుంబమున గ్రామాధికారిపదవి నలంకరింపగల దక్షులెవ్వరును లేనియెడల గ్రామసభ వేరొకకుటుంబమునుండి తగినవాని గ్రామాధికారిగ నియమించును.

గ్రామములోని ప్రజలు చాలభాగము కృషివలననే జీవించువారు. కృషీవలులే కాక కుంభకారులు, స్వర్ణకారులు, చర్మకారులు, శిల్పులు, సాలెలు, మున్నగువారుకూడగ్రామముననుండువారు. గ్రామవాసులకు వలయుపాత్రలు, వ్యవసాయసాధనములు, గ్రామముననే సృష్టియయ్యెడివి.

ఆకాలమున పల్లెలలోనిప్రజలు లేమియెట్టిదో యెఱుంగరు. దుర్భిక్ష

మనునది యాకాలమున గానబడదని గ్రీకురాయబారి మెగస్తనీసు నుడివియున్నాడు. అనావృష్టి యావహిల్లినను నీటివసతులు సంపూర్ణముగనుండి సేద్యము నిరాఘాటముగసాగుటవలన పంటలెప్పుడును ఫలించుచునేయుండినవి.......అన్నమన్నమని అడలు క్షుద్బాధితుల ఆర్త నాదము లాకాలమున వినబడకుండెను. ఎక్కడచూచినను నవ్వుమోములు, కోమలశరీరములు, సంతోషారావములు, పచ్చనిపైరులు, సుఖజీవనము, కుంభవృష్టిగ క్షీరములనొసగు గోజాలములు, అంబా యని గంతులువైచుచు, ఏనుగుగున్నలవలె కండపుష్టిగలిగి, యీగ వాలిన జారిపోవు లేగదూడలు,కంటికి కానవచ్చెడివి. తిండిలేకశుష్కించి ప్రాణావశిష్టములైన తనూలతలు, వివర్ణవదనములు, 'ఒక్కకబళము-పట్టెడన్నము' అనిగోలపెట్టు క్షుద్బాధాపీడితుల యరపులు ఆకాలమున కానరాకుండెను.[1]

"మహమ్మదీయ దండయాత్రలవలన గ్రామజీవనము రవంతయు పాడుపడలేదు..........ఈదండయాత్రలవలన సాంఘికముగను ఆర్థికముగను గలిగినమార్పు లతిస్వల్పము. మహమ్మదీయ పరిపాలనాఫలితములు చాలగలవు. వారినిర్మాణకౌశల్యమున భారతదేశమందలి విశేష భాగమును పునర్నిర్మాణము గావింపగలిగిరి. అభివృద్ధికరమగు అధికారపూరితమగు కేంద్రప్రభుత్వ మాదర్శముగగొని నిర్మాణముసాగించిరి." అని వీరాయాన్స్టీయనునామె వ్రాసినది.[2] సనాతనకాలమందలి గ్రామ జీవనమునకు బౌద్ధయుగమందలి గ్రామజీవనమునకు మహమ్మదీయ యుగమందలి గ్రామజీవనమునకు నేటికాలపు గ్రామజీవనమునకు పోలిక యెనగలదా?

1. "బౌద్ధమహాయుగము"నుండి గైకొనబడెను.

2. *Economic Development of India p. 51 by* Vera *Anstey.*

సనాతనకాలమందలి భారతీయ భాగ్యరాసులకు, దీర్ఘాయురారోగ్యములకు ప్రజాస్వామిక గ్రామపరిభుత్వములే కారణమనుట నిర్వివాదాంశము. నేడు మరల భారతీయభాగ్యోదయముగావలెనన్న ప్రజాస్వామిక గ్రామపరిభుత్వములు నెలకొల్పుటయే కర్తవ్యము. ఈగ్రామ పరిభుత్వములు ఆధునికావసరముల ననుసరించి ఆధునికవిజ్ఞానము ననుసరించి నెలకొల్పదగును. గ్రామపరిభుత్వములు స్వయంసహాయమున సాగవలెనన్న ఆపరిభుత్వములకు ఆదాయమత్యవసరము.

ప్రజాస్వామిక గ్రామపరిభుత్వములకు, ఆయాగ్రామముల యందు వసూలుచేయబడు భూమిశిస్తులో నాల్గవవంతునకు తక్కువ గాకుండగ నీయవలెను. ఈ సొమ్ముతో గ్రామములు పునర్నిర్మాణమునకు బూనుచో ఆరోగ్య-ఆర్థికాభివృద్ధులు రెండును ఏకోన్ముఖముగ కాగలవు. భూమిశిస్తులో కొంతభాగము గ్రామపరిభుత్వముల కొసంగుచో, గ్రామములయందీ కార్యక్రమము కొనసాగుటకు వీలుండును.

1. గ్రామకంఠములను విశాలపఱుపవలెను. గ్రామములచుట్టు నుండు భూమిని ముదరా యిచ్చియైన గ్రామస్థులందరి యుపయోగమునకు [illegible]నవలెను. ఇట్లొనర్చుటవలన పశువులు తిరుగుటకు వీలుగనుండును. పల్లపువ్యవసాయముగల గ్రామములయందు నీరు ఊరిచుట్టు నిలువయుండుటవలన కలుగు అనారోగ్యపరిస్థితులు తొలగగలవు.

2. స్త్రీపురుషాదులు కాలకృత్యములు నెరవేర్చుకొనుటకు వలయు సదుపాయము లొనరింపవలెను. పొలములయందు గోతులు త్రవ్వి ఆగోతులచుట్టు టిన్ను రేకులతో మరుగు నేర్పఱచి ఆగోతులలో మలమూత్రవిసర్జన యొనరించుకొనునట్లు శాసించుకొనవలెను.

తయారగుచో రైతులఆర్థికస్థితి పెంపొందగలదు. సాలునకు ఆరుమాస ములు రైతుకుటుంబమునకు తీరికగలదు. ఈతీరికకాలము నూలువడు కుటకై వినియోగించుకొనగలుగుదురు.

14. కోళ్ళను ఆధునికపద్ధతులపై పెంచి కోడిగ్రుడ్డులను చుట్టు పట్ల బస్తీలకు పంపుచుండవచ్చును.

15. పల్లెలయందుగూడ మరబియ్యము వాడుచున్నారు. మర బియ్యము రోగములకు కారణమగుచున్నది. పల్లెలయందు పనిలేనివారి సంఖ్య యిందువలన పెరుగుచున్నది. దంపుడుబియ్యమును వాడుట ప్రారంభించుచో, రోగనిరోధనశక్తి వృద్ధికాగలదు. దంపుడువలన అన వసరవ్యయము తగ్గును.

16. తవుడు పశువులకాహారముగ లభించుటయేగాక, తవుడు తో బిస్కట్లనుజేయుట నేర్చుకొనుచో, ఆర్థికాభివృద్ధికి తోడ్పడును.

17. విదేశములనుండి చేపలుగూడ మనదేశమునకు దిగుమతి యగుచున్నవి. సాలుసరిసుమారు రు 3866000 విలువగలచేపలు దిగుమతి యగుచున్నవి. (1926_27). ఆధునికపద్ధతులపై చేపలనుపోషించురీతిని చేపలనుపెంచి యెగుమతిచేయవచ్చును.

18. విదేశములనుండి పండ్లు, కూరగాయలు గూడ దిగుమతి యగుచున్నవి. రు 16176000లు విలువగలపండ్లు, కూరలు 1926_27 లో దిగుమతిగలదు. దిగుమతియగుపండ్లు కూరగాయలరకములను గ్ర హించి, పల్లెలలో ఆవిత్తనములువేసి, పెంచి, ఎగుమతిచేయవచ్చును.

19. ఆధునికపద్ధతులపై పశుసంతతిని పోషించి, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, కల్తీలేనివి పట్టణముల కెగుమతిచేయవచ్చును. వెన్న

విస్తారముగ తయారుచేయుచు, నిలవజేయు పద్ధతుల గ్రహించి యెగుమతుల జేయవచ్చును.

20. ప్రపంచమునందలి వ్యవసాయ పారిశ్రామిక సంబంధ నూతనవిషయము లెప్పటికప్పుడు పల్లెలలో వ్యాపించుటకు వీలుగ గ్రంథాలయములు, పఠనమందిరములు స్థాపింపవలయును. పత్రికలు ప్రజలచే జదివించుచుండవలెను.

21. ఈ గ్రామపునర్నిర్మాణమునందు ఉపాధ్యాయుడు లేక ఉపాధ్యాయిని ప్రాముఖ్యస్థానము వహించునట్లొనరింపవలెను.

22. గ్రామాదులలో దూరశ్రవణయంత్రము నెలకొల్పవలెను. (Broad-casting). ఆరోగ్యాభివృద్ధులను గుఱించియు, వర్తక పారిశ్రామిక వ్యవసాయవిషయములను గుఱించియు, ముఖ్యస్థానములనుండి ప్రత్యేకశాస్త్రజ్ఞులచే నుపన్యాసము లిప్పించుచుండవలయును. ఈయంత్రముల నుపయోగించు నధికారము ప్రత్యేకముగ ప్రభుత్వవశమందుండ రాదు.

23. గ్రామఫోను ప్రతిగ్రామమందున గ్రామప్రభుత్వ పక్షముననుండవలెను. ఆర్థిక రాజకీయ పారిశ్రామిక వ్యవసాయక ఆరోగ్య విషయములపై పాటలు, ఉపన్యాసములు, గల రికార్డులను వేయుచుండవలెను. గ్రామఫోనుకంపెనీలు యిందులకు సంబంధించిన ప్రముఖుల నుండి యుపన్యాసములు గ్రహించుచుండవలయును.

24. ఆరోగ్యశాఖ, పారిశుద్ధ్యశాఖలు వివిధగ్రామప్రభుత్వముల యందలి ఆరోగ్యోద్యమమును సంబంధము గలిగించుచుండదగును. ప్రపంచమునందలి ప్రత్యేకవిషయములనెత్తి గ్రామప్రభుత్వములను

నివేదించుచుండవలెను. ఈశాఖలు సలహానొసంగునవి మాత్రముగ నుండవలెను.

25. రోగములును, అనారోగ్యమును దేవతలులేక గంగానమ్మల వలన సంభవించుచున్నవనుమూఢవిశ్వాసమును గ్రామములనుండి పారదోలవలెను. జాతరలు, కొలుపులు, నైవేద్యములు, మొదలగు మూఢాచారములు తొలగించుచో, అనవసరవ్యయము తొలగగలదు. ఆరోగ్యాభివృద్ధికి ఆర్థికాభివృద్ధియే మూలమనియు, ఆర్థికాభివృద్ధికి స్వయంకృషియే కర్తవ్యమనియు పల్లెపల్లెలయందు దృఢవిశ్వాసము ప్రబలజేయవలయును. ఇట్లు ఆదాయాభివృద్ధికరమగు పనులను వ్యయనివారణోపాయముల జేయుటూని నిర్వహించి, ఆరోగ్యసంరక్షణ జరుగవలెనన్న గ్రామప్రభుత్వములు నెలకొల్పి ఆప్రభుత్వములకు భూమిశిస్తునందు గమనార్హమగు భాగమునొసంగినగాని భారతదేశమం దారోగ్యసమస్య, ఆర్థికసమస్యలు రెండును సక్రమముగ సంస్కరింపబడజాలవు. "చిరకాలానుగతముగనున్న స్తబ్ధత్వముతొలగి, గ్రామములు సంస్కరింపబడవలెనన్న ప్రభుత్వమువారి సర్వాధికారము సర్వశక్తులు గ్రామోద్ధరణకై వినియోగింపవలెను. ప్రభుత్వశాఖలన్నియు (All Departments) గ్రామోద్ధరణకై కృషిసలుపవలెను."[1] అని వ్యవసాయసంఘమువారు వ్రాసినటుల ప్రభుత్వనిర్మాణమునకంతకు గ్రామప్రభుత్వములే పునాదియైననాడే గ్రామములసమస్య పరిష్కరింపబడగలదు.

బొంబాయిప్రభుత్వ గవర్నరగు సర్. ఎఫ్. స్కాయిసుగారుగూడ గ్రామపునరుద్ధరణావశ్యకతను గుర్తించిరి. కాని గ్రామపునరుద్ధరణకు సంపూర్ణమగు సర్వతోముఖాధికారముగల ప్రజాస్వామిక గ్రామప్రభుత్వము లత్యవసరమని గ్రహింపజాలకపోయిరి. గ్రామపునరుద్ధరణకు

1. *From Royal Commission on Agriculture.*

గ్రామములనుండి వసూలుచేయబడుచున్న రివిన్యూ లేక భూమిశిస్తులో కొంతయైనను ఏగ్రామమున కాగ్రామమునం దొసంగవలెనని గూడ గ్రహింపజాలకపోయిరి.

నేడు మదరాసు రాజధానియందుగల గ్రామపంచాయితీలు గ్రామపునర్నిర్మాణమునకుశక్తిమంతములుగావు. పంచాయితీలకు క్రొత్త పన్నులను విధించుకొనుటకు హక్కుగలదు. క్రొత్తపన్ను విధించుట యనగ ఆర్థికముగ ప్రజలను కృశింపజేయుటయే యగును. (ప్రభుత్వాదాయవ్యయ ప్రకరణమునందీ పన్నులనుగురించి విపులముగ చర్చింపబడెను.) పంచాయితీలు విధించుకొనుపన్నును గ్రామాధికారులైన వసూలుచేయునట్లు శాసింపబడలేదు. మైసూరురాజ్యమునందు పంచాయితీలు వేసికొనుపన్నును గ్రామాధికారులు వసూలుచేయుదురు. పంచాయితీ ప్రతిగ్రామమునం దేర్పఱచుట విధిగ శాసింపబడలేదు. గ్రామాభివృద్ధి సంఘములో (Village Development Committee) పంచాయితీల ప్రతినిధులసంఖ్య పలుకుబడిని వినియోగింప గలిగినంతగ లేదు. ఈసభ్యులు పంచాయితీల సభ్యులనుండి యెన్నుకొనురీతి లోకలు బోర్డుచట్టము సవరించుటత్యవసరము. గ్రామపంచాయితీల నొకింతసజీవముగ నొనరింపవలెనన్న తాలూకా, జిల్లాబోర్డుల నెత్తివేయవలెను. ప్రతిగ్రామమందున పంచాయితీలను స్థాపించి, యీపంచాయితీల అధ్యక్షులచే (ప్రెసిడెంట్లు) తాలూకా పంచాయితీలసంఘము నొకదానిని స్థాపింపదగును. ఈసంఘము పంచాయితీలకు సలహాదారుగమాత్రముండవలెను. నేడు తాలూకా, జిల్లాబోర్డులకు చెందుచున్న లోకలు సెస్సులవలన వచ్చుచున్న రాబడిని ఏగ్రామపురాబడిని ఆగ్రామపంచాయితీల కొసంగవలెను. మత్తుపదార్థముల రాబడిని మానివేసి మద్యపాననిషేధశాసన మొనరింపనంతకాలము కనీసమీ రాబడిలో కొంత

| | | |
|---|---|---|
| ప్రభుత్వము లేక ప్రభుత్వవిధానము లేక పరిపాలనావిధానము | = | Administration of the Government |
| నిరకునామాసంఘము | = | Tariff Board |
| ఖజానా విచారణసంఘము | = | Fiscal Commission |
| ఆదాయవ్యయశాసనము | = | Budget |
| కేంద్రవ్యవసాయపరిశోధనమండలి | = | Imperial Council of Agricultural Research |
| వ్యవసాయసంఘము | = | Agricultural Board |
| సుంకము | = | Duty |
| ఎగుమతి | = | Export |
| దిగుమతి | = | Import |
| ప్రదర్శనము | = | Demonstration |
| ప్రయోగము | = | Experiment |
| ప్రచారము | = | Propaganda |
| పరిశోధనము | = | Research |



# వ్యవసాయము

## 1. వ్యవసాయ ప్రాముఖ్యత.

భారతదేశమున ౩ వంతుల ప్రజ వ్యవసాయవృత్తిపై నాధారపడుచున్నారు. వ్యవసాయవృత్తి ప్రధానవృత్తి. ప్రాముఖ్యవృత్తి. భారతదేశ ఆర్థికస్థితి చక్కబడవలెనన్న వ్యవసాయాభివృద్ధి చేయుట మొదటివిధి. పరిశ్రమాభివృద్ధి వ్యవసాయాభివృద్ధికి జేదోడుగ మాత్రమే యుండగలదు. వ్యవసాయాభివృద్ధివంకకు మరలక పరిశ్రమాభివృద్ధికిమాత్రమే విశేషకృషి సల్పుట కట్టలేనిసాము. వ్యవసాయాభివృద్ధివలన సర్వవిధ ఆహారవస్తుసముదాయము లభించుటయే గాక, పరిశ్రమలకు వలయు ముడిదినుసులు గూడ సిద్ధించును. ఇట్టి ప్రాముఖ్యతగల వ్యవసాయాభివృద్ధి నేడు మనదేశమునం దెట్లున్నది? వ్యవసాయస్థితి యెట్లున్నది? వ్యవసాయకుల గతి యెట్లున్నది? ఏదృక్పథమున జూచినను వ్యవసాయస్థితి అధోగతియందున్నది. ఇట్లనుట సాహసముగాదు. సత్యము, భూములపంట, ఎరువు, భూములపరిమితి, వ్యవసాయపరికరములు, భూమియందలి వ్యవసాయకుల హక్కు, బేహక్కులు, భూమిసిస్తు, పెట్టుబడి, వ్యవసాయకుల భాగ్యభోగ్యములు, పశుసంతతి, పచ్చికబయళ్ళు మొదలగు వ్యవసాయాభివృద్ధికిని, కర్షకుని ఆర్థికాభివృద్ధికిని వలయు నీసత్యాంగములు నభివృద్ధికనుగుణ్యముగ లేవు. వ్యవసాయకులస్థితి కడుదీనముగ నున్నది.

# 2. వ్యవసాయాభివృద్ధి కొందఱి అభిప్రాయములు.

వ్యవసాయమును గుఱించియు, వ్యవసాయకుల స్థితుల గురించియు ననేకు లనేకవిధముగ నభిప్రాయము లొసంగిరి. ఎవరును భారతదేశమునందు 'వ్యవసాయస్థితి యభివృద్ధియందున్నది' అన జాలక పోయిరి. వ్యవసాయకులు సక్రమముగ జీవయాత్ర జేయగలుగుచున్నారనియైన వ్రాయుట కాధారము లేకపోయినది. కేంద్రప్రభుత్వమునకు వ్యవసాయమును గుఱించి సలహానొసంగు నుద్యోగియగు డాక్టరు క్లౌస్టన్‌గారు (Clouston) వ్యవసాయ విచారణ సంఘమువారి సముఖమున సాక్ష్యమొసంగుచు నిట్లు చెప్పిరి.

"హిందూదేశమునందు దైన్యావస్థయందున్న జాతులు గలవు. పరిశ్రమలుగూడ దైన్యావస్థయందేయున్నవి. దైన్యావస్థయందున్న వాటిలో దురదృష్టవశమున వ్యవసాయముగూడ నొకటి."[1]

బ్యాంకింగు విచారణసంఘ సభ్యులగు మను సుబేదారుగార్లు అల్పసంఖ్యాకుల బ్యాంకింగుసంఘ నివేదికయం దిట్లు వ్రాసిరి. "వ్యవసాయదారుడు వ్యవసాయమును తాను పడిన కష్టమునకు పెట్టిన పెట్టుబడికి ఫలితము బొందుటకై వ్యవసాయము జేయుచున్నాడా? లేక చేయుటకు వేఱువృత్తిలేక, పోవుటకు వేఱుచోటులేక, వ్యవసాయము చేయుట యతని యాచారమగుటచేతను, వేరుగత్యంతర మేమియు లేకపోవుటను వ్యవసాయము జేయుచున్నాడా? ఈప్రశ్నలలో రెండవ ప్రశ్నయం దిమిడియున్న "గత్యంతరము లేనిస్థితియే కర్షకుడు వ్యవసాయము నంటిపెట్టుకొని యుండుటకు కారణము."

---

1. *Agricultural Commission Report minutes of evidence Vol I, Evidence by the Officers of the Government of India.*

హెచ్. ఎమ్. హిండ్మాన్ గారిట్లు వ్రాసిరి.

"విదేశప్రభుత్వము అత్యధికవ్యయమునకు కారణమగుచున్నది. ఢిల్లీ, ఢక్కాలయందు ప్రభుత్వమువారు కట్టిన అనవసర ముఖ్యస్థానములకై అనేకమిలియను పౌనులు వ్యయపడెను. ఈదుర్భరవ్యయమును చేయుటకై ఘోరముగ మరింతభూమిసిస్తు వసూలుచేయబడుచున్నది. వ్యవసాయదారు లంతకంతకు దరిద్రులగుచున్నారు."[1]

డబ్ల్యు. యస్. బ్లంటుగారిట్లు వ్రాసిరి.

"రైతులకుగల ఋణమంతయు హెచ్చుపన్నుల నిచ్చుకొనవలసి వచ్చుటచేతనే ప్రారంభమైనదని నిశ్చయముగ చెప్పగలము." —— ——"ఇది నికృష్టమయిన దుర్ణయము. ఇంగ్లీషుపరిపాలనవలన నీయపకారము రైతులకు దాపరించినది."

"దార్జన్యమువలన ప్రాణాపాయములేకుండ రైతులను మనము సంరక్షించితిమి. కాని ఆకలిబాధచే చేచ్చిపోవలసిన యపాయస్థితిని మాత్రము హెచ్చించితి మనదగును."[2]

ప్రస్తుత బ్రిటిషు ప్రధానామాత్యుడగు రామ్సేమేక్డనాల్డుగారిట్లు వ్రాసిరి.

"అధికపుపన్నులభారము, ఆపన్ను నిచ్చుకొనుటలోగల కష్టములు ప్రజలను దరిద్రులనుగాజేయుటకుం బొల్పడెననుట నిర్వివాదము."[3]

రోగములవలన కోల్పోబడుచున్న ఆర్థికశక్తి యింతయని చెప్పజాలము. మలేరియాజ్వరము వేలకొలదిప్రజలపైబడి లక్షలకొలది ప్రజలఆర్థికశక్తిని దిగమ్రింగుచున్నది. కలరా, ప్లేగులు తరుచు దేశమునందు నలుమూలల తుడిచివేయుచున్నవి. తగుఆహారములేక వచ్చు

1. *H. M. Hyndman—The Truth about India Page 43.*
2. *W. S. Blunt—India under Ripon P. P. 245-6*
3. *J. R. Macdnold—The Govt of India P. 141.*

# 3. హిందూదేశమున సాగుబడిభూముల పరిమితము.

ప్రస్తుతము వ్యవసాయదారుల ఆర్థికస్థితి సుబేదారుగారు చిత్రించి నట్లులనే యున్నది.

## 1 వ పట్టిక.

### బ్రిటిషు ఇండియా

### బ్రిటిషు హిందూదేశమున వ్యవసాయము చేయబడుచున్న భూమి విస్తీర్ణము.

మిలియనుల ఎకరములు.

| | ఎకరములు మిలియన్లు 1901-2 | గ్రామపు లెక్కల ననుసరించి 100 కి ఎన్ని ఎకరములు. | ఎకరములు మిలియన్లు 1928-29. | గ్రామపు లెక్కల ననుసరించి 100 కి ఎన్ని ఎకరములు. | ఐ | | |
|---|---|---|---|---|---|---|---|
| సర్వే చేయబడిన భూమి. | 552.92 | ... | 669.98 | ... | | | |
| గ్రామపు లెక్కలననుసరించిన భూమి (పరిమితము). | 553.70 | ... | 667.47 | ... | 668 | 668 | 667 |
| అడవులు. | 66.36 | 12.0 | 87.09 | 13.0 | 87 | 88 | 89 |
| సేద్యము చేయబడని భూమి. | 137.96 | 24.9 | 148.37 | 22.2 | 147 | 147 | 145 |

మిలియను ఎకరములు

| | ఎకరములు మిలియన్లు 1901-2 | గ్రామలెక్కలననుసరించి 100 కి ఎన్ని ఎకరములు? | ఎకరములు మిలియను 1928-9 | గ్రామలెక్కలననుసరించి 100 కి ఎన్ని ఎకరములు? | 1929-30 | | |
|---|---|---|---|---|---|---|---|
| వ్యవసాయమునకు పనికివచ్చియువ్యవసాయము చేయబడని భూమి | 107.52 | 19.4 | 154.70 | 23.2 | 155.0 | 154 | 155 |
| బీళ్ళు | 42.15 | 7.6 | 49.14 | 17.4 | 50.0 | 50 | 49 |
| సేద్యపుభూమి నికరము | 199.71 | 36.1 | 228.17 | 34.2 | 228 | 229 | 229 |
| రెండుపంటలు పండించుభూమితోగూడ కలిసిన మొత్తపు వ్యవసాయపు భూమి | 220.35 | ... | 262.32 | 34.1 | 261 | 262 | 263 |
| పల్లపుసాగు భూమి | 32.58 | ... | 49.74 | 21.9 | 51 | 50 | 49 |

| మొత్తపుభూమిలో | 1929-30 | 30-31 | 31-32 |
|---|---|---|---|
| (1) వ్యవసాయపుభూమి 100 కి | 34.1 | 34 | 34.33 |
| (2) వ్యవసాయపుభూమిలో పల్లపుసాగుభూమి 100కి | 22.4 | 21.9 | 21.4 |
| (3) వ్యవసాయపుభూమిలో ఆహారపదార్థముల పంటభూమి 100కి | 80.5 | 81.7 | 77.9 |
| (4) వ్యవసాయపుభూమిలో ఆహారేతరపదార్థముల పంటభూమి 100కి | 19.5 | 18.3 | 6.1 |

(స్వదేశసంస్థానములు గాక)

సాగుబడిభూమి-మిలియనుల ఎకరములు

| | ఎకరములు మిలియన్లు 1901-2 | గ్రామపు లెక్కల ననుసరించి సాగుబడి భూమిలో 100కి | ఎకరములు మిలియన్లు 1928-29 | గ్రామపు లెక్కల ననుసరించిసాగుబడి భూమిలో 100 కి ఎన్ని ఎకరములు | 1929-1930. | 1930-1931. | 1932-1933. |
|---|---|---|---|---|---|---|---|
| వరి | 70.07 | 31.8 | 81.13 | 30.9 | 79.42 | 80.63 | 82.0 |
| గోధుమ | 18.61 | 8.4 | 24.93 | 9.5 | 24.73 | 24. 0 | 32.2 |
| బార్లీ | 6.22 | 2.8 | 7.53 | 2.9 | 7. 0 | 7. 0 | |
| జొవార్ | 21.82 | 9.8 | 20.53 | 7.8 | 23. 2 | 22. 8 | |
| బజిరా | 13.20 | 5.9 | 12.95 | 4.9 | 13. 2 | 13. 6 | |
| రాగి | 3.75 | 1.7 | 3.91 | 1.5 | 3.99 | 3.97 | |
| మొక్కజొన్న | 6.20 | 2.8 | 6.01 | 2.3 | 6. 5 | 6.45 | |
| కందులు | 9.78 | 4.4 | 13.63 | 5.2 | 11.45 | 13.64 | |
| ఇతరధాన్యాదులు-పప్పుదినుసులు | 27.35 | 12.4 | 29.65 | 11.3 | 30.29 | 30.03 | |
| ధాన్యాదుల మొత్తము | 177.00 | 80.0 | 200.27 | 76.3 | 200.01 | 202.73 | |
| ఇతర ఆహారపు పంటలు, (కూరగాయలు,పండ్లు, పప్పు దినుసులు సుగంధ ద్రవ్యములు పండు భూమి విస్తీర్ణము) | 8.03 | 3.7 | 7.85 | 3.0 | 7.89 | 8.24 | |
| పంచదార | 2.60 | 1.3 | 2.67 | 1.1 | 2.58 | 2.86 | 3.3 |
| మొత్తము ఆహార పదార్థములు పండు భూమి | 187.63 | 85.0 | 210.79 | 80.4 | 210.48 | 213.83 | |

(స్వదేశసంస్థానములుగాక)

సాగుబడిభూమి మిలియనుల

ఎకరములు

| | ఎకరములు మిలియన్లు 1901-2 | గ్రామపు లెక్కల ననుసరించి 100 కి ఎన్ని ఎకరములు సేద్యము | ఎకరములు మిలియన్లు 1928-29 | గ్రామపు లెక్కల ననుసరించి 100 కి ఎన్ని ఎకరములు సేద్యము | 1929-30. | 1930-31. | 1932-1933. |
|---|---|---|---|---|---|---|---|
| నూనె విత్తుల పంట పొలముల విస్తీర్ణం. | | | | | | | |
| అగిసె విత్తులు | 2.27 | 1.0 | 2.09 | 0.8 | 1.92 | 1.99 | 2.6 |
| నువ్వులు | 3.75 | 1.7 | 3.67 | 1.4 | 3.55 | 3.63 | 5.9 |
| కుసమ (రేప్) ఆవాలు | 2.88 | 1.3 | 4.29 | 1.6 | 3.55 | 3.29 | 3.1 |
| వేరుశనగ | ... | ... | 5.40 | 2.1 | 5.01 | 5.31 | 6.9 |
| కొబ్బరి | ... | ... | 0.65 | 0.2 | 0.65 | 0.63 | |
| అముదములు | ... | ... | 0.53 | 0.2 | 0.43 | 0.45 | 1.5 |
| ఇతరనూనె విత్తులు | 3.07 | 1.4 | 1.26 | 0.5 | 1.19 | 1.11 | |
| నూనె విత్తుల మొత్తపు సాగు | 11.97 | 5.4 | 17.89 | 6.8 | 16.32 | 16.45 | |
| నారలసాగుబడివిస్తీర్ణము | | | | | | | |
| ప్రత్తి | 10.30 | 4.7 | 16.51 | 6.3 | 16.14 | 14.20 | 22.55 |
| గోగునార | 2.28 | 1.0 | 3.06 | 1.2 | 3.26 | 3.40 | 2. 4 |
| ఇతరనారలు | 0.56 | 0.2 | 0.66 | 0.2 | 0.66 | 0.71 | |
| మొత్తము | 13.14 | 5.9 | 20.28 | 7.7 | 20.06 | 18.31 | |

1 వ పట్టిక ననుసరించి మొత్తపుభూమిలో 100 కి 35.2 వంతుల భూమి సాగుబడికనువుగలేదని తేలుచున్నది. 34.2 వంతులభూమి సాగుబడి యగుచున్నది. ప్రస్తుతపు బీళ్ళును సాగుబడికి పనికివచ్చు బీళ్ళు కాని మిగతభూమియుకలిసి 30.6 వంతులు వ్యవసాయాభివృద్ధి కనువగు భూమి కలదు.

**స్వదేశసంస్థానముల భూమివివరములు.** ఈదిగువపట్టికలు హిందూదేశమునందలి స్వదేశసంస్థానములలో గల భూమివివరములను దెలుపును.

మిలియను ఎకరములు

| | 1927-28 | 1928-29 |
|---|---|---|
| అడవులు | 18 | 17 |
| వ్యవసాయమునకు పనిరానిభూమి | 24 | 25 |
| సాగునకు పనికివచ్చియు సాగుచేయబడని భూమి | 16 | 16 |
| బీళ్ళు | 12 | 11 |
| సాగుచేసిన భూమి | 65 | 67 |
| మొత్తపుభూమి | 135 | 136 |

వ్యవసాయముచేయబడిన భూమి వివరములు

| | 1927-28 | 1928-29 |
|---|---|---|
| సాగుచేసిన భూమి నికరం | ఎ 65 మి | ఎ 67 మి |
| సాగుచేసిన భూమి మొత్తము | ,, 68 ,, | ,, 71 ,, |
| పల్లపుసాగు భూమి | ,, 8 ,, | ,, 9 ,, |
| ఆహారపదార్థముల పంటభూమి | ,, 50 ,, | ,, 51 ,, |
| ఆహారేతరపదార్థముల పంటభూమి | ,, 17 ,, | ,, 18 ,, |

(సాగుచేసిన భూమిమొత్తములో ఒకసారికంటె హెచ్చుగ సాగుచేసిన భూమిపరిమితికూడ చేరియున్నది.)

| | మిలియను ఎకరములు | |
|---|---|---|
| | 1927-28 | 1928-29 |
| మొత్తపుభూమిలో సాగుబడిభూమి 100కి | 48.1 | 49.3 |
| సాగుబడిభూమిలో పల్లపుసాగుభూమి 100కి | 12.3 | 13.4 |
| మొత్తపుసాగుబడిభూమిలో ఆహారపదార్థముల పంటభూమి | 76.9 | 71.8 |
| మొత్తపు సాగుబడిభూమిలో ఆహారేతర పదార్థముల సాగుబడిభూమి | 23.1 | 28.2 |

మనదేశమునందుగల స్వదేశసంస్థానములలో 70 సంస్థానములకు మాత్రమే అంకెలులభించుచున్నవి. అందుచే పైపట్టికలో 70సంస్థానముల తాలూకు అంకెలుమాత్రమే యొసంగబడెను. లేక స్వదేశసంస్థానముల యందుగల భూమిలో 100కి 56 వంతుల భూమియొక్క లెక్కలు మాత్రమే యొసంగబడెను.[1] ఈఅంకెలు సరియయినవనికూడ తలంప వీలులేదు.

ఈఅంకెలను బ్రిటిషుఇండియాయందలి అంకెలతోపోల్చి పరిశీలించిన తేలెడిసారాంశములేమి? సంస్థానములలో మొత్తపుభూమిలో 100కి సుమారు 48 వంతుల సాగుబడిభూమి కలదు, అనగా బ్రిటిషు ఇండియాకంటె మొత్తపుభూమిలో 100కి గల సాగుబడిభూమి పరిమితి హెచ్చుగనున్నది. ఆహారపదార్థములనుపండించు భూమిపరిమితిసుమారు 100కి 72, 77 వంతుల మధ్యగలదు. అనగ బ్రిటిషుఇండియాయందు కంటె ఆహారపదార్థములను పండించు భూమిపరిమితి మొత్తపుభూమిలో తక్కువగనున్నది. పల్లపుసాగుభూమి మొత్తపుసాగుబడిభూమిలో 100కి 12 ఎకరముల వంతున మాత్రమే గలదు. బ్రిటిషుఇండియాయందు పల్లపుసాగుభూమి మొత్తపుభూమిలో 100కి సుమారు 20 వంతులు గలదు.

1. *Agricultural Statistics of India Vol. II*

రాష్ట్రములయందు గలభూమివివరము

## 1930-31 లో రాష్ట్రములయందు సాగుబడిభూమి-సాగుబడికానిభూముల నీపట్టికలు దెలుపును.

(సంస్థానములుగాక-ఎకరములలో)

| రాష్ట్రము | సర్వేచేయబడిన భూమిపరిమితి | స్వదేశసంస్థానములు | నికరం: సర్వేచేయబడిన వి స్తీరము | నికరం: గ్రామలెక్కల ననుసరించిన వి స్తీరము |
|---|---|---|---|---|
| మదరాసు | 91089440 | ... | 91089440 | 91024181 |
| బొంబాయి | 97449907 | 18568960 | 78880947 | 78880947 |
| వంగదేశము | 52664669 | 3477760 | 49186909 | 49186909 |
| సంయుక్తరాష్ట్రములు | 72648741 | 4348232 | 68300509 | 67993345 |
| పంజాబు | 65257965 | 3286700 | 61971265 | 60180382 |
| బర్మా | 155849528 | ... | 155849528 | 155849528 |
| బీహారు, ఒరిస్సాలు | 71507695 | 18334720 | 53172975 | 53172975 |
| మధ్యపరగణాలు, బీరారు | 83931811 | 19960727 | 63971084 | 64184380 |
| అస్సాము | 43361410 | 8061440 | 35299970 | 35299970 |
| పశ్చిమోత్తర పరగణాలు | 8578214 | 140800 | 8437414 | 8565130 |
| అజ్మీరు, మార్వారా | 1770921 | ... | 1770921 | 1770921 |
| మనిపూరు పరగణా | 31353 | ... | 31358 | 31353 |
| కూర్గు | 1012260 | ... | 1012260 | 1012260 |
| ఢిల్లీ | 370194 | ... | 370194 | 370194 |
| మొత్తము | 745524108 | 76179339 | 669344769 | 667522475 |

| రాష్ట్రము | సాగుబడిభూమి | | సాగుబడికానిభూమి | | అడవులు |
|---|---|---|---|---|---|
| | వ్యవసాయము చేయబడిన నికరంభూమి | బీళ్ళుగనున్న భూమి | బీళ్ళుకాని సేద్యమునకుపనికివచ్చుభూమి | సాగుబడికి పనికిరానిభూమి | |
| మదరాసు | 34222604 | 10326235 | 12219111 | 20186249 | 13369982 |
| బొంబాయి | 32620701 | 10507261 | 6785990 | 19849811 | 9117184 |
| వంగదేశము | 23460300 | 5578689 | 5971428 | 9587035 | 4594457 |
| సంయుక్తరాష్ట్రములు | 35542446 | 2595517 | 10647202 | 9939769 | 9268411 |
| పంజాబు | 26683664 | 3990897 | 14826306 | 12713218 | 1966297 |
| బర్మా | 18022971 | 3794912 | 59788871 | 52993485 | 21249289 |
| బీహారు, ఒరిస్సాలు | 24470900 | 6358791 | 6891306 | 8116448 | 7340530 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 25364376 | 3348517 | 14160752 | 4938879 | 16371856 |
| అస్సాము | 5982993 | 1946101 | 18946727 | 4571030 | 3353119 |
| పశ్చిమోత్తరపరగణాలు | 2072253 | 811339 | 2691108 | 2632112 | 353318 |
| అజ్మీరు, మార్వారా | 319347 | 180050 | 308343 | 866399 | 96782 |
| మనిపూరుపరగణా | 7194 | 267 | 3968 | 949 | 18975 |
| కూర్గు | 137978 | 171362 | 11690 | 334045 | 357185 |
| డెల్హీ | 207509 | 17680 | 63924 | 81081 | ... |
| మొత్తము | 229115236 | 49617618 | 154016726 | 146810510 | 87962385 |

మున పాశ్చాత్యదేశములయందు విరివిగ పంటలు పండింపబడుచున్నవి. నూతనయంత్ర సాహాయ్యమున నవీనపరికరములతో నధికోత్పత్తి చేయుట ప్రస్తుత ప్రపంచపరివర్తనమునం దుపయోగకరమేనాయని కొందఱిప్రశ్న. అధికమగువంటలవలన పంటలధరలు పడిపోయియుండెననియు నందు వలన నధికోత్పత్తి అనవసరమనియు గొందఱి యూహ.

"ఉత్పత్తిని తగ్గించివేయుటయే నేటిప్రధానకర్తవ్యము. పంట భూములను తగులబెట్టుటయు నిలువచేసియుంచిన ధాన్యాదుల నగ్నిహోత్రుని పాలొనరించుటయును, ప్రజలకర్తవ్యమని నావిశ్వాసము." అని యొకయుద్యోగి తమతోనుడివినటుల సర్. టి. విజయరాఘవాచార్యులుగారు కోయంబుత్తూరు వ్యవసాయకళాశాలయం దుపన్యసించుచు నిట్లు ప్రశ్నించిరి.

"ఏదేశమునందు 70 మిలియనుల ప్రజలు రోజు 1 కి ఒకపూట మాత్రమే తిని జీవించుచున్నారో, ఏదేశమునందు 363 మిలియనుల ప్రజలున్నారో, ఆదేశములో వారి ఆహారపదార్థోత్పత్తి అధికముగ నున్నదనియు ఆయుత్పత్తిని తగ్గించివేయవలెననియు తలంచుట సక్రమదృష్టియేనా? ఒకవంక ఆహారపదార్థముల ధరలుతగ్గి ఆహారముచౌకగ నున్నది. రైతునకు అధికోత్పత్తిజేయుటకై ప్రోత్సాహము లభించుట లేదు. అయినను వేఱొకవంక 70 మిలియనుల ప్రజ నిరాహారులై యొకపూటమాత్రమే తిని బ్రతుకుచున్నారు. దీనికికారణమేమి? ఏసంస్థ వలన నీస్థితిగలిగినది? అందుగల లోటులేమి? ఈప్రశ్నకు వ్యవసాయార్థిక స్థితిని గణించు ఆర్థికశాస్త్రజ్ఞులు సమాధానముల నరయవలయును."[1]

"లక్షలకొలది ప్రజ నిరాహారులై ఆకలిబాధపడుచుండ, ఆహార పదార్థములనుగుట్టలుపెట్టుచు తగులబెట్టుచున్నారు. పైరులను ధ్వంసము

1. *From Sir T. Vijayaraghavachary's Speech at Coimbatore Agricultural College—Hindu 24th oct. 1933.*

చేసివేయుటకై క్రిమికీటకములను పంటపొలములమీదకు వదలు చున్నారు. పండినపంటను కూడదీయక పాడుజేయుచున్నారు. గోధుమ, ప్రత్తి, టీ, కాఫీ, మొదలగు నాహారపదార్థముల యుత్పత్తిని తగ్గించు టకై వివిధజాతులవారు సమావేశమై, అంతర్జాతీయసభలయం దాలో చించుచున్నారు.” అని పండిత జవహరలాలు నెహ్రూగారు ప్రపంచ పరిస్థితుల వర్ణించుచు నుడివిరి.[1] ఈస్థితి యెట్లుదాపరించినది? ఇందులకు తరుణోపాయమేమి? అనుప్రశ్నలు విజయరాఘవాచార్యులుగారికి తోచినరీతిగనే యోచనాపరుల కందఱకు స్ఫురింపకమానవు. ఈప్రపంచ పరిస్థితులలో భారతవర్ష కర్తవ్యనిర్ణయము సునాయాసము కాదు.

మానవుని సహజమగుశక్తితో వ్యవసాయము చేయునపుడు అధి కోత్పత్తికి స్థానములేదు. వ్యవసాయభూమియందు హక్కు ఏకొలదిమంది వ్యక్తులయందున్నను మానవకృషి యవసరమగుటచే యితరమానవుల సాహాయ్యమత్యవసరము. ఒరులసాహాయ్య మపేక్షించుటలో నాతనికి గూడ తనయుత్పత్తియందొక భాగమొసంగక తీరదు. ఈకారణమున నిరుద్యోగసమస్య విపరీతముగ ప్రబలుటకు వీలులేదు. యంత్రసాహా య్యమున అధికోత్పత్తి చేయబూనుచో కార్మికులతో పనియుండదు. నిరుద్యోగసమస్య ప్రబలును. ప్రజాసామాన్యమున కొనుగోలుశక్తి తగ్గి పోవును. అధికోత్పత్తి చేయుచుండుటవలనను, ప్రజాసామాన్యమున కొనుగోలుశక్తి తగ్గి సరుకు నిలవయుండుటవలనను ఆహారపదార్థములు గుట్టలుబడుచున్నవి. ఈగుట్టలను తగులబెట్టుటకై ప్రయత్నించుటయు లేక ఉత్పత్తి నిరోధమార్గముల నరయుటయే కర్తవ్యమని పాశ్చాత్య దేశములయందలి ధనాఢ్యులాలోచించుచున్నారు. ఈవిధానము మా నవలోకమునంతను వంచించుచున్నది. ఈవిధానమునుండి మానవలోక ముద్ధరింపబడవలెనన్న అధికోత్పత్తిజేయ విరమించుట సాధనోపాయము కాజాలదు. మానవుడు ప్రకృతితో యుగయుగములనుండి పోరాడి

---

1. *From Mr. Javaharlal Nehru's 'Whither India' Articles, 1933.*

నేటికి సఫలీకృతుడయ్యెను. ప్రకృతితనసంపదను విచ్చలవిడిగ నొసంగు చున్నది. ఈసంపదను మానవసంఘమంతయు ననుభవించుటకు వీలగు రీతిని రాజకీయార్థిక సాంఘికసంస్థలను సంస్కరించుటయే కర్తవ్యము.

యంత్రయుగమునుండి వెనుకకు మరలుట మానవుల కర్తవ్యము కాజాలదు. యంత్రప్రయోగమున గలుగుచున్న అరిష్టములను, వ్యత్యాసములను తొలగించుకొనుటయే మానవలోక కళ్యాణమార్గము. వ్యవసాయమున యంత్రయుగము భారతదేశమునం దింతవఱకు ప్రారంభింప బడలేదు. సాధ్యమగునంత త్వరితగతిని ప్రారంభించి అధికాహారోత్పత్తికి బూనుటయే భారతీయుల విధి. ఇతర ప్రపంచమంతయు యంత్రయుగమునం దున్నంతకాలము భారతావని యంత్రములపట్ల విముఖత వహించుట ఆత్మవధ వంటిది. కాని, యంత్రముల నుపయోగించుట వలన గలుగు అధికోత్పత్తిని ధనాఢ్యకోటి కోటీశ్వరులగుట కనువుగ నుంచరాదు. 7 కోట్ల నిరాహారుల ఆకలిబాధను నివృత్తింపగల ఆర్థిక సౌధమును నిర్మింపవలయును. సంఘాదాయము స్వల్పమైనను, అధికమైనను సాంఘికులందఱు సమానముగ ననుభవించుటకు వీలగు ఆర్థిక సంస్థ అత్యవసరమని ప్రపంచమునందంతట గుర్తింపబడుచున్నది.

ఐరోపాఖండము మరణావస్థ సమీపించునంతటి రోగపూరితమై యున్నది. ప్రపంచమునంతను నూతన వికాసమొకటి యావహించి ప్రపంచ జాతులయందు మరల సామాన్యజ్ఞానము తలయెత్తనిచో ఈ తరమునందే పాశ్చాత్య నాగరికత రూపుమాసిపోవును"[1] అని సర్. టి. విజయరాఘవాచార్యులుగారు నుడివినటుల ఈ యంత్రయుగమునం దధికోత్పత్తిని ప్రజలు అందఱు సమానముగ ననుభవింపదగు ఆర్థికసంస్థ నెలకొల్పబడనిచో, ప్రపంచమున శాంతియుండదు. పాశ్చాత్య ఆర్థికనిర్మాణము పటాపంచలు కాక తప్పదు. ఈ పరిణాము

1. *Sir T. V. Achariar's Speech, Oct. 24, 1923 at Coimbatore.*

మున భారతదేశ వ్యవసాయాభివృద్ధికి యంత్రముల నుపయోగించు టతోపాటు ప్రస్తుతార్థికనిర్మాణమును గూడ సంస్కరించుకొనదగును. ప్రజలకందఱకు నాహారపదార్థములు విరివిగ లభించుచున్ననాడు ఆహారపదార్థోత్పత్తి తగురీతి వినియోగింపబడి నూతన ఆహారపదార్థోత్పత్తికి ప్రోత్సాహము కలుగును. ఎప్పటికపుడు నూతన పదార్థముల యవసరము గోచరించుచున్ననాడే ఆహారపదార్థముల ధరలు గూడ లేచును. మఱియు ధరలు తక్కువగనున్నను అధికోత్పత్తియు, విడుదలయు ఒకదానినొకటి యనుసరించుచో, రైతునకు హెచ్చురాబడియే కలుగును. ఏవిధముగ జూచినను స్వల్ప వ్యయప్రయాసలతో యంత్రసహాయ్యమున నధికోత్పత్తి జేయుచు ఆ ఆహారపదార్థములన్నియు సంఘమున కంతకు లభింపజేయుటయే భారతదేశ కర్తవ్యము. ఆహారపదార్థోత్పత్తి నిరోధమార్గముల నవలంబించుట కాని, అట్టి నిరోధమార్గముల నన్వేషింపబూను అంతర్జాతీయ నిర్ణయములకు తల యొగ్గుట కాని, భారతీయ సౌఖ్యజీవనమునకు గరళమువంటిది. ప్రపంచార్థికసమావేశ ఫలితముగ కొన్ని దేశములు గోధుమపంటను తగ్గించుట కొడంబడికలు గావించుకొనినవి. ఈ యొడంబడికయందు భారత దేశము చేరలేదు. ఇది వివేకమైన పనియే.

## 5. భూమిబలము-తక్కువపంట.

నేటి యన్వేషణము ననుసరించి నూతన వ్యవసాయమున కొక మూడవవంతు మాత్రమే వ్యవసాయమున కర్హమగుభూమి యున్నను నేడు వ్యవసాయమున కర్హముగాదని తలంచబడు భూమియందు చాల భాగము కృషివలన వ్యవసాయమున కర్హము గావింపవచ్చును. వ్యవసాయమే నేడు భారతదేశమునకు జీవనాధారముగ నున్నను శాస్త్రసమ్మతమగు వ్యవసాయమింకను ప్రారంభింపబడకుండుట శోచనీయము. మన దేశమునందు సగటుపంట అత్యల్పముగ నున్నది. "పల్లపుసాగుతో

1 (1909—1921)

| దినుసులు | ఉత్పత్తి వివరములు | బ్రిటిషు దీవులు | అమెరికా | ఫ్రాన్సు | ఆస్ట్రేలియా | ఈజిప్టు | ఇండియా |
|---|---|---|---|---|---|---|---|
| గోధుమలు | మొత్తపు విస్తీర్ణము | 843498 | 25255894 | 5329880 | 3806000 | 590128 | 10449242 |
| | ,, పంట | 20085820 | 216338079 | 87848770 | 39902557 | 10072683 | 68166598 |
| | సగటు పంట | 23.8 | 8.6 | 16.5 | 10.5 | 17.1 | 6.5 |
| ధాన్యము | మొత్తపు విస్తీర్ణము | ... | 413598 | 50 | ... | 122129 | 32878775 |
| | ,, పంట | ... | 8093970 | 300 | ... | 3320493 | 516261203 |
| | సగటు పంట | ... | 19.6 | 6.0 | ... | 27.2 | 15.7 |
| నూనెవిత్తులు | మొత్తపు భూమివిస్తీర్ణము | 19483 | 471464 | 18178 | ... | 272 | 904105 |
| | ,, పంట | ... | 2060529 | 69558 | ... | 2338 | 2788166 |
| | సగటు పంట | ... | 4.4 | 3.8 | ... | 8.7 | 3.0 |
| ప్రత్తి | మొత్తపు విస్తీర్ణము | ... | 12718193 | ... | 8556 | 541912 | 7480510 |
| | ,, పంట | ... | 18082535 | ... | ... | 1482624 | 8128878 |
| | సగటు పంట | ... | 1.4 | ... | ... | 2.7 | 1.1 |
| చెఱకు | మొత్తపు విస్తీర్ణము | ... | 84580 | ... | ... | ... | 968548 |
| | ,, పంట | ... | ... | ... | ... | ... | ... |
| | సగటు పంట | ... | ... | ... | ... | ... | ... |

గోధుమపంటలో హిందూదేశము ప్రపంచమున రెండవస్థాన మాక్రమించుచున్నది. కాని సగటుపంట అన్నిదేశములకంటె తక్కువ. ప్రపంచమున డెన్మార్కునందు హెచ్చు 34.3.

హిందూదేశము ధాన్యపుపంటలో అన్ని దేశములకంటె ప్రథమస్థాన మాక్రమించినది. కాని సగటుపంట చాల తక్కువ. ప్రపంచమున స్పెయినునందు హెచ్చు 57.0 (క్వింటల్సు: 100 పౌనులు తూకము.)

నూనెవిత్తుల పంటలో హిందూదేశము ప్రపంచమందన్నిదేశములకంటె ప్రథమస్థాన మాక్రమించినది. కాని సగటుపంట చాల తక్కువ.

ప్రత్తిపంటలో హిందూదేశము రెండవస్థాన మాక్రమించుచున్నది. కాని సగటుపంట అన్నిదేశములకన్న తక్కువ.

ఇండియా పంచదార కమిటీవారి రిపోర్టు ననుసరించి హిందూదేశమున సగటుపంట 1.07 టన్నులు, కూబాయందు 1.06 టన్నులు, జావాయందు 4.12 టన్నులు, హవాయియందు 4.61 టన్నులు.

షరా:-నార, నల్లమందు, కాఫీ, తేయాకు మొదలగు పంటలు వదలివేయబడినవి. ఇవి పోల్చదగినవి కావు. విస్తీర్ణము హెక్టార్ల మానమునను, పంట క్వింటల్సు మానముననుగ్రహింపవలయును.

1. Quoted by Mr. K. T. Shaw—Wealth & Taxable Capacity of India-Page 314.

(Forecasted crops) ఎ 1 కి వివిధరాష్ట్రములయందుగల సగటుపంట (పౌనులలో-తూకము) †Average yield per Acre)

| రాష్ట్రములు | వరి | | గోధుమ | | చెఱకు | | దూది | | నార | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1930-31 | 1931-32 | 1930-31 | 1931-32 | 1930-31 | 1931-32 | 1930-31 | 1931-32 | 1930-31 | 1931-32 |
| మదరాసు | 1031 | 1015 | ... | ... | 6220 | 6107 | 74 | 79 | ... | ... |
| బొంబాయి (సింధుదేశము, స్వదేశసంస్థానములు కలిసి) | 968 | 1044 | 468 | 462 | 5901 | 5757 | 88 | 84 | ... | ... |
| వంగదేశము | 1002 | 961 | 538 | 564 | 2792 | 2625 | 99 | 91 | 1302 | 1240 |
| సంయుక్తరాష్ట్రములు | 565 | 677 | 790 | 819 | 2378 | 3135 | 152 | 111 | ... | ... |
| పంజాబు | ... | ... | 749 | 746 | 1588 | 1744 | 128 | 81 | ... | ... |
| బర్మా | 885 | 749 | ... | ... | ... | ... | 97 | 60 | ... | ... |
| బీహారు, ఒరిస్సాలు | 903 | 912 | 838 | 855 | 2241 | 2489 | 81 | 82 | 1042 | 918 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 555 | 718 | 459 | 468 | 3627 | 3564 | 89 | 48 | ... | ... |

*From Indian Finance Year Book.*

(Forecasted crops) ఎ 1 కి వివిధ రాష్ట్రములయందుగల సగటుపంట (పౌనులలో-తూకము) (Average yield per Acre)

| రాష్ట్రములు | వరి | | గోధుమ | | చెఱకు | | దూది | | నార | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1930-31 | 1931-32 | 1930-31 | 1931-32 | 1930-31 | 1931-32 | 1930-31 | 1931-32 | 1930-31 | 1931-32 |
| అస్సాము | 681 | 771 | ... | ... | 2104 | 2240 | 143 | 162 | 1290 | 800 |
| పశ్చిమోత్తరపరగణాలు | ... | ... | 544 | 536 | 2764 | 2647 | 92 | 89 | ... | ... |
| అజ్మీరు, మార్వారా | ... | ... | 560 | 560 | ... | ... | 142 | 163 | ... | ... |
| కూర్గు | 1448 | 1457 | ... | ... | ... | ... | ... | ... | ... | ... |
| ఢిల్లీ | ... | ... | 589 | 560 | 896 | 1493 | 100 | 169 | ... | ... |
| హైదరాబాదు | 582 | 742 | 258 | 258 | 3288 | 4160 | 43 | 56 | ... | ... |
| మైసూరు | 666 | 675 | 363 | 373 | 2122 | 1991 | 56 | 43 | ... | ... |
| బరోడా | 486 | 599 | 614 | 522 | 4480 | 3360 | 77 | 76 | ... | ... |
| గ్వాలియరు | ... | ... | 541 | 584 | ... | ... | 67 | 48 | ... | ... |
| మధ్యఇండియా | ... | ... | 374 | 350 | ... | ... | 67 | 44 | ... | ... |
| రాజపుటానా | ... | ... | 577 | 640 | ... | ... | 58 | 68 | ... | ... |

*From Indian Finance Year Book.*

తగు పెట్టుబడిలేకపోవుటయు, ఎరువులు లేకపోవుటయు నిందులకు కారణము. పశువులపేడ, చెత్త, మొదలగు ఎరువు లుపయోగించినను, ప్రస్తుతపు వ్యవసాయపు భూమిలో 100 కి 50 ఎకరములకు మాత్రమే చాలును. కాని, యిట్టి ఎరువంతయుగూడ పొలములలో వేయుట లేదు. పశువులపేడ పిడకలక్రింద చేయబడి, వంటచెరుకుక్రింద నుప యోగింపబడుచున్నది. ఈదురభ్యాసమును ప్రజలు మానవలెనని వంటచెరుకు వారికి సులువుగను, చౌకగను, లభించునట్లొనరింపవల యును. ఇందులకు ఖాళీస్థలములయందెల్ల చెట్లు వేయించుటయు, అడవి కలపను చౌకగ హిందూదేశమునకంతకు నెగుమతి దిగుమ తులు జరుగునట్లొనరింపవలయును. కలప ఎగుమతిపై, రైలుచార్జీలు తగ్గింపవలయును.

నూనెగింజలు,నూనెతీసివేసినపిప్పి లేకపిండి,ప్రత్తిగింజలు, ఎరిముల పొడి, చెత్త, అశుద్ధము, మొదలగునవి సహజమగు ఎరువులు. కాని నూనెవిత్తులు, ప్రత్తి విదేశముల కెగుమతియగుచుండుటచే నీఎరువులు లభించుటలేదు. ఈఎరువులు లభించుట కెగుమతులు నిషేధించుటయే గత్యంతరమగును. పరిశ్రమలు లేనందున ముడిదినుసులతోపాటు ఎరువుదినుసులన్నియు విదేశములకు పోవుచున్నవి. పరిశ్రమల యభి వృద్ధితోబాటు ఎరువు దినుసులన్నియు మనదేశమునందే ఖర్చు అగుటకు వీలుండును. నేడు పరిశ్రమలభివృద్ధి పొందలేదు. పరిశ్రమ లభివృద్ధిపొందకముందే, ఎరువులగు పంటల మెగుమతిని నిషేధిం చుచో రైతునకే నష్టము కలుగును. నిషేధింపకపోయినచో, ఎరువు లేక ఇతర పంటలు హెచ్చుగ పండుటయే లేదు. ఎట్లయినను, రైతు నకే నష్టముసంభవించును. అందుచే, ఎరువుల ఎగుమతులను నిషే ధించి, యితర పంటలధికముగ పండించుటయే ఆచరణీయము. అధికపు పంటలలో ఎరువుల ఎగుమతిని నిషేధించుటవలన గలుగునష్టము కూడి వచ్చును. ఈదిగువ రెండుపట్టికలవల్ల, ఎరువులఎగుమతి తెలిసికొనగలము.

## 1 వ పట్టిక

| | 1930—31 | | | 1931—32 | | | 1932—33 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | ఉత్పత్తి టన్నులు | నికరం ఎగుమతి | నికరం ఎగుమతి ఉత్పత్తిలో 100 కెన్ని వంతులు | ఉత్పత్తి టన్నులు | నికరం ఎగుమతి | నికరం ఎగుమతి ఉత్పత్తిలో 100 కెన్ని వంతులు | ఉత్పత్తి టన్నులు | నికరం ఎగుమతి | నికరం ఎగుమతి ఉత్పత్తిలో 100 కెన్ని వంతులు |
| వేరుసెనగ | 3154000 | 601174 | 19 | 2657000 | 671978 | 24.9 | 2886000 | ... | ... |
| అగిసవిత్తులు | 377000 | 256778 | 60.8 | 411000 | 120288 | 29.2 | ... | 72190 | ... |
| (Rape)కుసుమ, ఆవాలు | 988000 | 85878 | 8.6 | 1028000 | 56670 | 5.5 | ... | ... | ... |
| నువ్వులు | 526000 | 809 | 0.2 | 465000 | 10498 | 2.8 | 545000 | ... | ... |
| ఆముదపువిత్తులు | 120000 | 91022 | 75.9 | 145000 | 203974 | 72 7 | 146000 | 85890 | ... |
| ప్రత్తివిత్తులు | 1741000 | 41850 | 2.4 | 1355080 | 11655 | 0.9 | 1500000 | 2889 | ... |
| నూనెతీసిన పిప్పి (Oil cakes) | | 254000 | | | 291000 | | | 287000 | |
| కొమ్ములు మొదలగునవి (హంండ్రెడు వైటులు) | | 21000 | | | 13 | | | 88 | |
| చేపలు | | 278000 | | | 251000 | | | 221000 | |

1. *From Indian Finance Year Book, 1933.*

## 2 వ పట్టిక

| | వేలపరిమాణము | | | | | ధర (వేలరూపాయలు) | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | యుద్ధమున పూర్వము సగటు | యుద్ధము సగటు | యుద్ధానంతరము సగటు | 1925-6 | 1929-30 | యుద్ధమున పూర్వము సగటు | యుద్ధము సగటు | యుద్ధానంతరము సగటు | 1925-6 | 1929-30 |
| నూనెవిత్తులు (Essential) ముఖ్యమైనవి | టన్నులు 10 | 8 | 9 | 10 | 4 | 2057 | 2416 | 3588 | 3072 | 1568 |
| అగిసగింజలు (Non-essential) | 379 | 270 | 251 | 308 | 248 | 79890 | 49494 | 75772 | 80853 | 57287 |
| వేరుశనగ | 212 | 119 | 195 | 455 | 714 | 35257 | 19117 | 56197 | 120233 | 163886 |
| (Rape seed) కుసుమ | 273 | 91 | 206 | 112 | 44 | 41469 | 14301 | 50737 | 26809 | 9208 |
| నువ్వులు | 119 | 33 | 28 | 40 | 11 | 24815 | 6735 | 10273 | 11734 | 2718 |
| ఆముదములు | 114 | 89 | 48 | 110 | 106 | 16643 | 15755 | 11454 | 26769 | 21496 |
| కొబ్బరికురిడీ | 31 | 16 | 7 | ... | ... | 11043 | 6073 | 2884 | 74 | 68 |
| పత్తి | 240 | 69 | 155 | 197 | 58 | 17998 | 5025 | 18805 | 21811 | 5487 |
| ఆవాలు | 4 | 3 | 2 | 3 | 3 | 1008 | 916 | 975 | 1103 | 762 |
| గసగసాలు | 33 | 5 | 6 | 6 | ... | 6941 | 958 | 2097 | 1616 | 71 |
| యితర రకములు | 9 | 2 | 8 | 8 | 7 | 2323 | 648 | 1803 | 2118 | 2112 |
| మొత్తము టన్నులు | 11453 | 708 | 923 | 1250 | 1195 | 243697 | 121742 | 235864 | 296368 | 264676 |

*From Reviews of the Trade of India 1925-26; 29-30*

ఈ అంకెలవలన ఎంత ఎరువుదినుసు ఎగుమతి అయిపోవు చున్నదియు తెలియుచున్నది. ఈఎగుమతులపై విశేషముగ నెగుమతి సుంకమును విధింపవలెననియు, అట్లు విధించుటచే ఎగుమతులు తగ్గి, ఎరువుచేయుటకు లభించుననియు, 1919 సంవత్సరమున వ్యవసాయపుబోర్డువారభిప్రాయపడిరి.(Board of agriculture). ఈవ్యవసాయ సంఘమువారి యభిప్రాయముతో పన్నుల విచారణసంఘము వారు కూడ నేకీభవించిరి. (Indian taxation enquiry committee). కాని ఖజానా విచారణ సంఘమువారు (Indian fiscal commission) మాత్ర మంగీకరింపలేదు. వ్యవసాయ విచారణ సంఘమువారు నిషేధించుటకుగాని, అధికముగ ఎగుమతి సుంకములను విధించుటకుగాని అంగీకరింపలేదు. నూనెపరిశ్రమ నభివృద్ధిచేయుటయే కర్తవ్యమని వ్యవసాయ విచారణ సంఘమువారు వ్రాసిరి. నూనెవిత్తుల ఎరువులతోపాటు చేపలఎరువును అశుద్ధమునుగూడ ఎరువుచేయుట అవలంబింపవలయును. పొలములయందు గోతులు త్రవ్వి, అశుద్ధమును ఎరువుగ వినియోగించుకొనుట సులభసాధ్యము. జపానుదేశమున అశుద్ధమును ఎరువుగ కొనుచుందురు. ఎరువుల అంతర్వ్యాపారము చౌకగ జరుగుటకై రైలు రేట్లను తగ్గింపవలయును.

ప్రభుత్వమువారిచే అమ్మబడు కృత్రిమపు ఎరువులు.

ప్రభుత్వ వ్యవసాయశాఖవారిచే ఎరువులు అమ్మబడుచున్నవి. ఈఎరువులు రైతునకు సులువుగ లభించుటలేదు. ఈఎరువుల నుపయోగింపవలెనను కుతూహలముగూడ రైతులకు గలుగలేదు. ఈఎరువులఖరీదు హెచ్చుగనున్నది. ఈఎరువుల నుపయోగించినను ఫలితములేదని కూడ అనుభవజ్ఞులగు రైతులు చెప్పుచున్నారు. "వ్యవసాయశాఖవారు ఎరువుల ఉపయోగములను, అనుపయోగములను నిర్వచించి చెప్పగల స్థితియందు లేరు." అని వ్యవసాయ విచారణసంఘమువారు

# 7. వేఱు వేఱు పంటల ప్రాముఖ్య స్థితి.

నేడు హిందూదేశమునందు పండు పంటలను భారతదేశము వినియోగించుకొనగలుగుచో, ఏ వస్తువునకును విదేశములకు చేయి జాపనక్కరలేదు. ఆహారపదార్థములు, ముడిదినుసులు గూడ వివిధము లగునవి గలవు. ఆహారము కొఱకు వలయుపంటలే 100కి 80.4 ఎకర ముల్లల్లో పండింపబడుచున్నవి. ముడిదినుసులు 100కి 19.6 ఎకరము లలో పండింపబడుచున్నవి. ముడిదినుసుల పంటలు వేయుట నానాటికి హెచ్చుచున్నది. ఆహారమునకు వలయు పంటలలో వరిపంట ముఖ్య మైనది. గోధుమ రెండవస్థాన మాక్రమించుచున్నది. పిమ్మట రాగి, జొన్న, మొక్కజొన్న, పప్పుదినుసులు పంటలు గమనింపదగియున్నవి. ఆహారమునకు కాని యితరమగుపంటలలో ప్రత్తి, గోగునార, మొద లగునవి ప్రధానస్థానము వహింపగలవు. నారదినుసులలో ప్రత్తి మొట్ట మొదట గమనింపదగియున్నది. ఇవి 100కి 7.4 వంతుల మొత్తపు సాగుబడిభూమిలో పండింపబడుచున్నవి. నూనెవిత్తులు మూడవస్థానము వహించును. ఇవి 100కి 6.8 వంతులు సాగుబడిభూమిలో పండింపబడు చున్నవి.

**వరి.** వరి భారతదేశమునందంతట ఆహారముగ నుపయో గింపబడుపంట. బియ్యము అవసరములేని ప్రదేశము లేదు. మొత్తపుసాగుబడిభూమిలో 100కి 30 వంతుల భూమిలో వరి పంటయే వేయబడుచున్నది. 1932-33వ సంవత్సరమున 30655000 టన్నుల వరిపంటపండెను. ప్రపంచమునందు పండుచున్న వరిపంటలో హిందూదేశపుపంట సుమారు 100కి 40వంతులు గలదు. ప్రపంచము నందు బియ్యము నెగుమతిచేయుటలో హిందూదేశము ప్రాముఖ్య స్థానము వహించుచున్నది.

| | | | |
|---|---|---|---|
| మదరాసు రాజధానిలో | 11.5 | మిలియను | ఎకరములలోను |
| బొంబాయిరాజధానిలో | 3.2 | ,, | ,, |
| వంగరాష్ట్రమున | 21.7 | ,, | ,, |
| సంయుక్త రాష్ట్రమున | 6.1 | ,, | ,, |
| బర్మా | 12.6 | ,, | ,, |
| బీహారు, ఒరిస్సా | 13.07 | ,, | ,, |
| మధ్యరాష్ట్రములు | 7.0 | ,, | ,, |
| అస్సాము | 4.5 | ,, | ,, |

1932-33వ సంవత్సరమున వరి పండింపబడెను.

బర్మాయందు సుమారు సాగుబడిభూమిలో 100కి 15 వంతులే వరిపంట వేయబడుచున్నను ఎగుమతిలో బర్మాదేశ మగ్రస్థానము వహించుచున్నది. ఇందులకు బర్మాజనసంఖ్య తక్కువగనుండుటయు జనసంఖ్యకంటె పంట హెచ్చుగనుండుటయే కారణము. బర్మాయొక్క ఎగుమతి వర్తకమునందు వరిపంట యెగుమతి 100కి 88 వంతులు గలదు. బర్మాయందుపండు ధాన్యపుపంటలో సగము ఎగుమతియగు చున్నది. రానురాను బర్మాదేశపు ఎగుమతి హెచ్చుచున్నది. హిందూదేశపుఎగుమతి తగ్గుచున్నది. ఈపంట డిశంబరు, జనవరిమాస ములలో కోయబడును. ధాన్యమున వేఱు వేఱురకముల ధాన్యములు గలవు. వరిపంట ముఖ్యమగు పంటయైనను విస్తారముగనున్న పంట యగుటచే నేటివఱకు పరిశోధనలేమియు జరుగలేదని జె. మెకన్నా గారు వ్రాసిరి.[1]

**గోధుమ.** గోధుమపంట మొత్తపు సాగుబడిభూమిలో 100కి 10 ఎకరములలో పండింపబడుచుండెను. అక్టోబరు మొదలు డిశంబరువఱకు గోధుమపంట వేయబడుచుండును. మార్చి

1. J. Mackenna—Indian Agriculture. p. 46.

మొదలు మేవలకు కోయబడుచుండును. గోధుమ పంజాబునందు, సంయుక్తరాష్ట్రములయందు, పశ్చిమోత్తరపరగణాలయందు ముఖ్యమగు నాహారము. ఇతరప్రాంతముల ఎగుమతికై పండింపబడుచున్నది. 32.6 మిలియను యకరములలో 1932-33వ సంవత్సరమున గోధుమ పంట పండింపబడెను.

| | | | |
|---|---|---|---|
| బొంబాయిరాజధానిలో | 3.03 | మిలియను | ఎకరములలో |
| వంగరాష్ట్రమున | 0.1 | ,, | ,, |
| సంయుక్తరాష్ట్రమున | 1.8 | ,, | ,, |
| పంజాబురాష్ట్రమున | 9.7 | ,, | ,, |
| బీహారు, ఒరిస్సాలలో | 1.2 | ,, | ,, |
| మధ్యరాష్ట్రములు, బీరారులలో | 3.5 | ,, | ,, |
| ఢిల్లీ | 1.2 | ,, | ,, |
| మధ్యఇండియా | 2.07 | ,, | ,, |
| రాజపుటానా | 1.2 | ,, | ,, |

గోధుమ పండింపబడుచున్నది.

మదరాసు, బర్మా, కూర్గు, మైసూరులలో గోధుమపంటలేదు.

ప్రపంచమునందలి గోధుమపంటలో సుమారు పదియవవంతు హిందూదేశమున పండింపబడుచుండెను. యుద్ధకాలమున ప్రభుత్వము వారు గోధుమను కొనుచుండుటచే గోధుమ సాగు హెచ్చినది. 1870 వ సంత్సరమున సూయజుకాలువ త్రవ్వబడిన నాటనుండియు, గోధుమలు ఎగుమతియగుట హెచ్చెను. యుద్ధకాలమునందుకంటె యుద్ధానంతరమునుండియు ఎగుమతి తగ్గినది. 1929-30 వ సంవత్సరమున ఎగుమతి 13000 టన్నులు మాత్రమేగలదు. 100 కి 1 వంతు మాత్రమే, మొత్తపు ఉత్పత్తిలో ఎగుమతి గలదు. 1932-33 వ సంవత్సర

మున 2194 టన్నులు మాత్రమే ఎగుమతిగలదు. ఇది గమనింపదగిన ఎగుమతికాదు. కాని, దిగుమతి మాత్రము నానాటికి హెచ్చుచున్నది. 1929-30 వ సంవత్సరమున 268000 టన్నులగోధుమ దిగుమతి గలదు. 1932-33 వ సంవత్సరమున 20790 టన్నుల గోధుమల దిగుమతి గలదు. గోధుమనువాడుట హెచ్చగుటయే, యీదిగుమతికి కారణమా ? లేక గోధుమపంట పాడయిపోవుటవలన దిగుమతి హెచ్చుచున్నదా ? ఈప్రశ్నలకు రెండువిధముల సమాధానమొసంగబడుచున్నది. 1907 వ సంవత్సరము మొదలు గోధుమపంట పరిశుభ్రముగ పండింపబడుచున్నది. అమెరికా, కనడా. దేశముల గోధుమలకు గల ప్రశస్త్యము మాత్రము భారతదేశమందలి గోధుమల కింకను రాలేదు. పూసావ్యవసాయసంస్థవారి పరిశోధనలవలన గోధుమల రకము చాలవఱకు బాగుపడెను.

బార్లీ.

బార్లీధాన్యము మనుష్యులకును పశువులకునుగూడ ఆహారముగనున్నది. ఎగుమతి స్వల్పముగ గలదు. హిందూదేశమునందునే బార్లీధాన్యము కావలసియున్నవి.

జొన్నలు, రాగులు.

జొన్నలు, రాగులు మదరాసు, హైదరాబాదు, బొంబాయి రాజధానులలో ప్రజలకు ఆహారముగనున్నవి, ఈ పంటతాలూకు దంటయు పశుసంతతికిగూడ ఆహారమగుచున్నది. ఈపంటకు ఎరువు అంత హెచ్చుగ నవసరములేదు. (1931-32 లో) హిందూదేశమొత్తమున జొన్నలు 34.08 మిలియనుల ఎకరములలోను 13.6 మిలియనుల ఎకరములలో రాగులును పండింపబడినవి. వీని ఎగుమతి అంతగలేదు.

పప్పుదినుసులు.

పప్పుదినుసులు. హిందూదేశమునందంతట విరివిగ పండింపబడుచున్నవి. భారతదేశమునందంతటను ఆహా

15.78 కోట్ల విలువయు గలిగిన పంచదార హిందూదేశమునకు దిగుమతి అయినది. 1932-33 వ సంవత్సరమున 3.3 మిలియనుల ఎకరములలో చెఱకుగడ నాటబడెను.

| | మిలియను ఎకరములు 1932-33 లో |
|---|---|
| మదరాసు | 0. 1 |
| బొంబాయి | 0.09 |
| వంగము | 0. 2 |
| సంయుక్తరాష్ట్రములు | 1. 7 |
| పంజాబు | 0. 5 |
| బీహారు, ఒరిస్సా | 0. 3 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 0.02 |
| అస్సాము | 0.03 |
| పశ్చిమోత్తర పరగణాలు | 0.05 |
| హైదరాబాదు | 0.04 |
| మైసూరు | 0.04 |

ఈ అంకెలననుసరించి ఉత్తరహిందూస్థానమున చెఱకుపంట హెచ్చుగనున్నదని తెలిసికొనగలము. దక్షిణహిందూదేశమున చెఱకుపండు భూవిస్తీర్ణము తక్కువగనున్నను ఉత్తరహిందూస్థానపు చెఱకుకంటె ప్రశస్తమైన చెఱకు పండింపబడుచున్నది. చెఱకుపంటనుంచి బెల్లము తయారుచేయుచున్నంత విరివిగ తెల్లనిపంచదార తయారు చేయబడుటలేదు. చెఱకుగానుగలు పూర్వకాలమునుండియు కర్మాగారములలో చేయబడుచున్నవి. నేడు ఇనుపగానుగలతో చెఱకురసము తీయబడుచున్నది. తెల్లపంచదార బీహారు, ఒరిస్సా, సంయుక్తరాష్ట్రములలో ఫ్యాక్టరీలయందు తయారుచేయబడుచున్నది. బొంబాయియందుగూడ తెల్లపంచదారను తయారుచేయుటకు ప్రయత్నములు జరుగుచున్నవి.

| రాష్ట్రములు | చెఱకుతో పనిచేయుచున్న ఫ్యాక్టరీలు | బెల్లముతో పనిచేయుచున్న ఫ్యాక్టరీలు |
|---|---|---|
| బీహారు, ఒరిస్సా | 12 | 1 |
| సంయుక్తరాష్ట్రములు | 14 | 5 |
| పాంచాలము | 1 | 2 |
| చెన్నపురి | 2 | 4 |
| బొంబాయి | 1 | 0 |

ఈఫ్యాక్టరీలుగాక 27 క్రొత్త ఫ్యాక్టరీలు కట్టింపబడుచున్నవి. ఇవి 1932-33వ సంవత్సరమునందే పని ప్రారంభించునని అంచనా వేయబడెను. 1932-33వ సంవత్సరమునందే బీహారు,ఒరిస్సాలలో 7 ను సంయుక్తరాష్ట్రములలో 20 ను క్రొత్త ఫ్యాక్టరీలు తలయెత్తినవి. పంజాబు, చెన్నరాష్ట్రము, బొంబాయిలలో ఈపరిశ్రమ ముందడుగు వేయుటలేదు. ఆంధ్రమున పంచదారఫ్యాక్టరీలు మొలకెత్తుటయు చచ్చుటయు గూడ జరిగెను.

1903వ సంవత్సరమున జర్మనీనుండి దిగుమతియగుచుండిన పంచదారపై దిగుమతిసుంకములను విధించుటవలన ఆస్ట్రియా, జర్మనీలనుండి పంచదార దిగుమతి తగ్గెను. జావా, మారుతీ ద్వీపములనుండి దిగుమతిప్రారంభించెను. ఈపరదేశపు దిగుమతులు యుద్ధమునకుపూర్వము స్వదేశపంచదార పరిశ్రమను పోటీచేయుచుండుటచే స్వదేశపరిశ్రమ వెనుకపట్టినది. చెఱకుపండించుభూమి తగ్గింపబడినది. యుద్ధకాలమున 1918-19 ప్రాంతముల వరకు స్వదేశపరిశ్రమ తలయెత్తగలిగెను. 1910వ సంవత్సరము మొదలు 1930వ సంవత్సరమువఱకుగల 20 సంవత్సరములకు సగటుజేసిచూచుచో మాత్రము చెఱకుపంట నిలకడగ

నున్నదనవలెను. 2840000 ఎకరములలో సగటున పండింపబడుచున్నది. విదేశములనుండి పంచదార యిట్లు దిగుమతియగుచున్నది.

| యుద్ధమునకుపూర్వము సగటు | | యుద్ధకాలము సగటు | | యుద్ధానంతరము సగటు | |
|---|---|---|---|---|---|
| 1909-10 | 1913-14; | 1914-15 | 1918-19; | 1919-20 | 1923-24 |
| టన్నులు. 727. | | 553. | | 517. | |

| | 1928-29 ; | 1929-30 ; | 1930-31 ; | 1931-32 ; | 1932-33 |
|---|---|---|---|---|---|
| టన్నులు. | 937. | 1013. | 1003. | 556. | 401. |

ఇట్లు విదేశములనుండి పంచదార దిగుమతియగుచుండుటవలన స్వదేశ పరిశ్రమాభివృద్ధికి ప్రతిబంధకముగనున్నది. ఎ 1 కి ఫలసాయము తక్కువగనుండుటయు, చెఱకురసమును దీయుటకు నవీనయంత్రముల నుపయోగింపకుండుటయు, ఫ్యాక్టరీలదగ్గరనే వలయునంత చెఱకుగడ లభింపకుండుటయు, పెట్టుబడి హెచ్చుగ పెట్టవలసివచ్చుటయు, మొదలగు కారణములు పరిశ్రమాభివృద్ధికి అడ్డుతగులుచున్నవి.

యుద్ధానంతరమునుండియు పంచదార యుత్పత్తి అధికముగ నున్నది. క్యూబా, వెస్టుయిండీసులయందు చెఱకుగడ బాగుగ నాటబడినది. ఈఅధికోత్పత్తివలన ధరపడిపోయినది. మఱియు విదేశములయందలి నిరకునామా పద్ధతులవలనగూడ ధరపడిపోయినది. హిందూదేశమున దిగుమతీసుంకములు విధించినను దిగుమతిసుంకములను హెచ్చించుచు వచ్చినను గూడ ధర తక్కువగనేయున్నది. పాశ్చాత్యదేశములయందు బీటుదుంపల పంచదార కూడ(Beet Sugar)అధికముగ నుత్పత్తియగుచున్నది. ఆయాదేశముల ప్రభుత్వములు పంచదార పరిశ్రమాభివృద్ధికి విరాళముల నొసంగుచు ప్రోత్సహించుచున్నవి. అందుచే దేశదేశముల బజారులయందు బీటుదుంప పంచదార విహరింపసాగినది. బెల్లమునకు మారుగ పంచదార నుపయోగించుట ప్రారంభింప

బడుటచే భారతదేశమునందీ పరిశ్రమకు తగుప్రోత్సాహము లభింప
కున్నది. 1901-2వ సంవత్సరమునుండియు చెఱకుగడ పంటయందు
పరిశోధనలు జరుపబడుచున్నవి. కోయంబుత్తూరునందు చెఱకుపంట
యందు శ్రేష్ఠత్వమును దెచ్చుటకై ఒకసంస్థ యేర్పరుపబడినది.
(Cane breeding Station). 1919వ సంవత్సరమున హిందూదేశప్రభుత్వ
ము పంచదార పరిశ్రమాభివృద్ధిని గుఱించి యోజించుట కొకసంఘ
మును నియమించిరి. (Sugar Committee). ఈసంఘమువారు 1921వ
సంవత్సరమున తమనివేదికను ప్రభుత్వమునకు సమర్పించిరి. జావాలో
గల చెఱకుపరిశ్రమరీతిగ స్వల్పమగుమార్పులతో హిందూదేశమందు
గూడ పంచదారపరిశ్రమను నెలకొల్పవలెనని సూచించిరి. ఇందులకై
పంచదార సంఘమును స్థాపింపవలెననిరి. (Sugar Board). వివిధరాష్ట్ర
ములలో పరిశోధనలు జరుపుటకై కేంద్రపరిశోధనశాలను స్థాపింపవలె
ననియు వారు సూచించిరి. (Imperial Research Institute). పంచదార
సంఘమువారు పరిశోధనశాలను నడుపుచు ప్రభుత్వమునకు పంచదార
పరిశ్రమపై సలహాల నొసంగవలెననిరి.

పంచదారపరిశ్రమ విషయములను నేర్పుటకొక పాఠశాలను
గూడ స్థాపింపవలెననిరి. 1930వ సంవత్సరమున పంచదారపరిశ్రమను
సంరక్షించుటనుగురించి యోజించుటకై నిరకునామాసంఘమును ప్రభు
త్వమువారు నియమించిరి. 1931వ సంవత్సరమున నిరకునామాసంఘ
మువారు వారి రిపోర్టులో సంరక్షణ యొసంగవలెనని సూచించిరి. చెఱకు
గడను విస్తారము నాటించుటయే కర్తవ్యమునిరి. తెల్లపంచదార పరి
శ్రమ నభివృద్ధిపరచునగాని చెఱకుపంట నిలవజాలదనిరి. పరిశ్రమాభి
వృద్ధికి విరాళములనొసంగ బోర్డువారునిరాకరించిరి. కాని పంచదారపై
దిగుమతిసుంకముల విధించుటకంగీకరించిరి. హండ్రదువైటు 1కిరు7-4-0

యుద్ధమునకు పూర్వమునకంటె వీటిఎగుమతి తగ్గినది. అగిసెవిత్తులు ముఖ్యముగ ఎగుమతికేపండింపబడుచున్నవి. కుసుమఆవాలు, నువ్వులు ఎగుమతి తగ్గినది. యుద్ధమునకు పూర్వము కుసుమ ఆవాలు 100కి 23 వంతులును, నువ్వులు 100కి 25 వంతులును వాటిఉత్పత్తినుండి ఎగుమతియగుచుండెడివి. 1931-32 వ సంవత్సరమున 1023000 టన్నుల కుసుమ ఆవాలును పండింపబడినవి. 1930-31వ సంవత్సరమున 100కి 3.6 వంతులును, 1931-32వ సంవత్సరమున 100కి 5.5వంతులును మాత్రమే వాటిఉత్పత్తినుండి ఎగుమతిగలదు. నువ్వులు 1932-33వ సంవత్సరమున 545000 టన్నులు పండింపబడెను. ఇందు 100కి 2.3 వంతులు మాత్రమే ఎగుమతిగలదు. వేరుసెనగ యుద్ధమునకు పూర్వపు 5 సం॥లకు సగటున మొత్తపువేరుసెనగపంటలో 100కి 35 వంతు లెగుమతి యగుచుండెను. యుద్ధకాలమున 100కి 12 వంతులు మాత్రమే ఎగుమతిజరిగెను. 1929-30వ సంవత్సరమునకు మరల ఎగుమతి హెచ్చెను. 1929-30వ సంవత్సరమున 100కి 29 వంతులును, 1930-31లో 100కి 19 వంతులును, 1931-32లో 100కి 24.9 వంతులును ఎగుమతిగలదు. వేరుసెనగ 1932-33లో 2386000 టన్నులు పండెను. 1931-32లో 2697000 టన్నుల వేరుసెనగ పంట గలదు. ఈఅంకెలవలన నూనెవిత్తులలో వేరుసెనగయే నేటికి హెచ్చుగ ఎగుమతియగుచున్నది. నూనెవిత్తులు హిందూదేశమునుండి ఎగుమతియగువాటిలో 5 వ స్థానము నాక్రమించుచున్నవి. హిందూదేశమున నూనెవిత్తులను సక్రమముగ వినియోగించు పరిశ్రమలింకను అభివృద్ధియందులేవు. పశ్చిమ ఖండములలో నూనెవిత్తులను పలువిధముల నుపయోగించుచున్నారు. అమెరికాయందు ప్రత్తిగింజలనుండి నూనె తీయుచున్నారు. పిప్పిని పొలములకు ఎరువుగ నుపయోగించుకొనుచున్నారు. పశువుల కాహారముగగూడ వినియోగించుచున్నారు. హిందూదేశమన్ననో రైతులు

ప్రత్తిగింజలను వినియోగించుకొనకుండ విదేశముల కెగుమతిచేయు చున్నారు. యుద్ధకాలమునందలి పరిస్థితులవలన ఐరోపాఖండము వారుగూడ నూనెవిత్తులను పండింపమొదలుపెట్టిరి. మననూనెవిత్తులు చాలవఱకు అయిరోపాఖండమునకే ఎగుమతియగుచున్నవి. ఈఎగుమతులు నేడు తగ్గుసూచనలు గోచరించుచున్నవి. హిందూదేశపు అగిసె విత్తులకును అర్జెంటైనువారి అగిసెవిత్తులకును పోటీగలదు. మననువ్వులకును చీనాదేశమువారి నువ్వులకును పోటీగలదు. మన వేరుసెనగకును పడమటి ఆఫ్రికావారి వేరుసెనగకును పోటీగలదు. చీనా, దక్షిణ అమెరికా, పడమటి ఆఫ్రికాలయందు పండు కాయకూరలనుండి గూడ నూనెలు తీయబడుచున్నవి. ఇందువలనగూడ మన నూనెవిత్తులఎగుమతి రానున్నకాలమున ప్రపంచమున విపరీతపరిస్థితు లుద్భవింపకున్నచో తగ్గిపోవుననియే ప్రస్తుతపరిస్థితులు సూచించుచున్నవి. మఱియు వేరుసెనగనూనె వలన నువ్వులనూనెకు ప్రాముఖ్యము గూడ తగ్గుచున్నది.

అగిసెవిత్తులు. అగిసెవిత్తులు నారకొఱకు పండింపబడుట లేదు. నూనెకొఱకే పండింపబడుచున్నవి. విత్తులు, విత్తులనూనె, నూనెతీసినపిప్పిమూడు రీతులుగ ఎగుమతిఅగుచున్నవి.

| | | మిలియను ఎకరములు |
|---|---|---|
| అగిసెవిత్తులు. | 1930—31 లో | 3.0 |
| ,, | 1931—32 లో | 3.2 |
| ,, | 1932—33 లో | 3.2 |

పండింపబడెను. మదరాసు రాజధానిలో అగిసెవిత్తుల పంట లేదు. బొంబాయిలో 0.1, వంగమున 0.1, సంయుక్తరాష్ట్రములలో

0.8, బీహారు ఒరిస్సాలలో 0.6, మధ్యరాష్ట్రములు, బీరారులలో 1.1, హైదరాబాదు 0.2, రాజపుటానా 0.09 మిలియనుఎకరములలో పండింపబడుచున్నవి. ఇతర రాష్ట్రములలో అగిసెవిత్తులు పండింపబడుటలేదు. యుద్ధమునకు పూర్వము సగటున సాలుసరి 380000 టన్నులు ఎగుమతి గలదు. 1929-30 వ సంవత్సరమునకు సగటున 248000 టన్నుల ఎగుమతి మాత్రమే గలదు.

నువ్వులు. అన్ని రాష్ట్రములలోను నువ్వులు పండింపబడుచున్నవి. మదరాసు రాజధానిలో 0.8, బొంబాయి 0.6, వంగము 0.1, సంయుక్తరాష్ట్రములలో 1.2, బర్మా 1.5, పంజాబు 0.1, బీహారు, ఒరిస్సా 0.2, మధ్యరాష్ట్రములు, బీరారులలో 0.5, హైదరాబాదు 0.6, బరోడా 0.07, రాజపుటానా 0.03 మిలియను ఎకరములలో 1932-33 వ సంవత్సరమున నువ్వుపంట గలదు. మొత్తము 1932-33 వ సంవత్సరమున 5.9 మిలియనులఎకరములలో నువ్వుపంట వేయబడెను. 1932-33 వ సంవత్సరమున 545000 టన్నుల నువ్వులు పండెను. మొత్తపుపంటలో 100-కి 2.3 వంతులు ఎగుమతి గలదు. ప్రపంచమున కవసరమగు నువ్వులలో బ్రిటిషు సామ్రాజ్యమే సగము ఎగుమతి చేయుచుండెను. మనదేశమునుండి నువ్వులఎగుమతి తగ్గుచున్నది.

కుసుమఅవాలు. కుసుమఆవాలును 1932-33 వ సంవత్సరమున 6.05 మిలియను ఎకరములలో పండింపబడుచున్నవి. 1932-33వ సంవత్సరమున వివిధరాష్ట్రములయందీ పంట పండింపబడెను.

| | | |
|---|---|---|
| బొంబాయిరాజధాని | 0.2 | మిలియను ఎకరములు |
| వంగదేశము | 0.7 | ,, ,, |
| సంయుక్తరాష్ట్రములు | 2.8 | ,, ,, |
| పంజాబు | 1.1 | ,, ,, |
| బీహారు, ఒరిస్సాలు | 0.6 | ,, ,, |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 0.07 | ,, ,, |
| అస్సాము | 0.2 | ,, ,, |
| పశ్చిమోత్తర పరగణాలు | 0.1 | ,, ,, |
| హైదరాబాదు | 0.01 | ,, ,, |
| బరోడా | 0.02 | ,, ,, |
| రాజపుటానా | 0.03 | ,, ,, |

హిందూదేశమొత్తమున 1023000 టన్నులు ఉత్పత్తి గలదు. యుద్ధమునకు పూర్వము 100 కి 20 వంతులు ఎగుమతి యగుచుండెను. ఇప్పుడీ ఎగుమతి అంతకంతకు దిగజారుచున్నది.

| | | |
|---|---|---|
| 1928—29 లో | 100 కి | 9 వంతులును |
| 1929—30 లో | 100 కి | 4 వంతులును |
| 1930—31 లో | 100 కి | 3.6 వంతులును |
| 1931—32 లో | 100 కి | 5.5 వంతులును |

మాత్రమే ఎగుమతి గలదు.

వేరుసెనగ. వేరుసెనగ నూనెవిత్తులలో ముఖ్యమగు పంట. రాను రాను వృద్ధియగుచున్నది.

| | | మిలియను ఎకరములు |
|---|---|---|
| మదరాసు రాజధానిలో | 1932-33వ సం॥ | 3.4 |
| బొంబాయి | | 1.6 |
| బర్మా | | 0.6 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | | 0.1 |
| హైదరాబాదు | | 1.1 |
| | మొత్తం | 6.9 |

ప్రత్తి పండింపబడసాగినది. హిందూదేశపు ప్రత్తి అమెరికా, ఈజిప్టుదేశముల ప్రత్తివలె మృదువుగనుండక ముతకగనుండును. లాంకషైరు మిల్లులు తయారుచేయు సన్ననిబట్టలకు వలయు నూలు హిందూదేశపు ప్రత్తివలన రాదు. జపానుదేశమువారే ముఖ్యముగ హిందూదేశపుప్రత్తిని కొనుచున్నారు. జపానువారి బట్టలదిగుమతిపై హిందూదేశ ప్రభుత్వము దిగుమతిసుంకములను లాంకషైరు బట్టల మీదకంటె హెచ్చుగ విధించుటచే జపానువారు హిందూదేశపు ప్రత్తిని బహిష్కరించెదమనుచున్నారు. జపానువారితో రాజీకుదురక బహిష్కరణమే జరుగుచో, హిందూదేశపు ప్రత్తిపంటకు ప్రమాద స్థితి సంభవింపకతీరదు. హిందూదేశమున ప్రత్తిపంట ఎ 1 కి 75 మొదలు 100 పౌనుల వఱకు మాత్రమే గలదు. (Lint cotton) అమెరికాలో ఎ 1కి 180 పౌనులును, ఈజిప్టునందు ఎ 1కి 300 మొదలు 400 పౌనులవఱకును పండింపబడుచుండెను. హిందూదేశమున చాలతక్కువ పంటవచ్చుచున్నది. విదేశపువిత్తనములను వృద్ధిచేయుటకు వ్యవసాయ శాఖ రవంత కృషిచేయుచున్నదిగాని కృషి ఫలింపలేదు. మన దేశపు విత్తనములవలననే అధికముగపండుటకు ప్రయత్నములు చేయవలెను. "సింధుదేశమున ఈజప్టు, అమెరికాదేశముల విత్తనములు వేయబడినవి. కొంతవఱకు అభివృద్ధికలదు. సుక్కూరు బేరేజి ప్రోజెక్టుక్రింద విదేశపు విత్తనములను నాటుచున్న భూమిపరిమితి హెచ్చుగలదు. 1904 వ సంవత్సరమున మదరాసు రాజధానిలో కాంబోడియాప్రత్తి విత్తనములు నాటుట ప్రారంభింపబడెను. బొంబాయి, పంజాబు, సంయుక్తరాష్ట్రములలోగూడ అమెరికా ప్రత్తివిత్తనములను నాటుచున్నారు. కాని ఈప్రత్తికి ధరతక్కువగనుండుటచే నీవిత్తనమువ్యాప్తి చెందదేమోయను భయముగలుగుచున్నది. పంజాబునందలి అమెరికా ప్రత్తియు, మదరాసు కాంబోడియా ప్రత్తియు, సూరతుప్రత్తియు

సన్న నూలుతీయుట కుపయోగపడునని లాంకషైరు పరిశోధకులిప్పు డిప్పుడే చెప్పుచున్నారు. హిందూదేశపుప్రత్తి యుద్ధమునకుపూర్వము కంటె నేడు లీవరుపూలు బజారున అమెరికాప్రత్తికంటె హెచ్చుగ విక్రయింపబడుచున్నది."[1]

సెప్టెంబరు 1917 వ సంవత్సరమున హిందూదేశప్రభుత్వము ప్రత్తిసంఘము (*Cotton Committee*) ను నియమించెను. ఈసంఘము వారు తమ నివేదికను 1919 ఏప్రియలునందు ప్రభుత్వమునకు సమ ర్పించిరి. ఈనివేదికయందు ప్రత్తిపంటకు సంబంధించిన ముఖ్య విషయములనేకములుగలవు. ప్రత్తిపండించుట, ప్రత్తిపట్టుట, అమ్ముట మొదలగు విషయములలో నూతనమార్గములను రైతునకు లాభ కరమగు రీతులను పేర్కొనెను. సింధు, పంజాబు, పశ్చిమోత్తర పరగణాలయందును, సంయుక్తరాష్ట్రములయందును ప్రత్తిపంటను హెచ్చుగ నాటింపవలెనని సూచించిరి. వ్యవసాయశాఖ నభివృద్ధి పరచవలెననిరి. ప్రత్తిసంఘమనుపేర నొకశాశ్వతసంఘమును స్థాపింప వలెననికూడ సూచించెను. (Central Cotton Committee). ఈసంఘము వారు వ్యవసాయశాఖవారితోకలిసి ప్రత్తివర్తకము నభివృద్ధిపరచ వలెనని వీరిసూచన. ఈస్టిండియా కాటన్ ట్రేడు ఎసోసియేషన్ అను పేర బొంబాయిలో నొకవర్తకసంఘము నేర్పరచవలెననికూడ ప్రత్తివిచారణసంఘమువారు సూచించిరి. వీరిసూచనలు వెంటనే ఆచరింపబడలేదు.

1922వ సంవత్సరమున ఈస్టిండియా కాటన్ ఎసోసియేషను స్థాపింపబడెను. 1921 వ సంవత్సరమున బొంబాయిలో మొట్టమొదట

1. *See Encyclopaedia Britannica 13th edition—Article on India.*

హిందూదేశ ప్రత్తిసంఘమువారు (Central Cotton Committee) సమావేశమైరి. ఈసంఘమువారి ప్రయత్నములవలన కొన్ని శాసనములు గావింపబడినవి. ప్రత్తిని ఎగుమతిచేయుశాసనము (Cotton Transport Act) ను గావింపజేసిరి. ప్రత్తిలో కల్తీలేకుండ జూచుటయే ఈశాసనము యొక్క ముఖ్యోద్దేశము. ఈశాసనము మొట్టమొదట బొంబాయి రాష్ట్రమునకును, పిమ్మట మదరాసురాష్ట్రమునకును వర్తింపజేసిరి. 1925-26వ సంవత్సరమున ప్రత్తినిపట్టుట, ఏకుట వీటినిగురించి మరొక శాసనము గావింపబడెను. (Cotton Ginning and Pressing Factories Act). ప్రత్తిసంఘమువారు బొంబాయిలో వడుకుటలో పరిశోధనలు జరుపుటకొరకు సాంకేతిక పరిశోధనశాలను స్థాపించిరి. (Technological Laboratory). మధ్యఇండియాయందుగల స్వదేశసంస్థానముల సహాయమున ఇందూరునందుగల వ్యవసాయపరిశ్రమసంస్థలో (Institute of Plant Industry) ప్రత్తినిగురించి పరిశోధనలు చేయించుచున్నారు. వివిధరాష్ట్రములలో పరిశోధనలు జరుగుటకేర్పాట్లు జరుగుచున్నవి. హిందూదేశమందలి మిల్లులుపయోగించు ప్రత్తిబేళ్ళపైనను హిందూదేశమునుండి ఎగుమతియగుచున్న ప్రత్తిబేళ్ళపైనను బేలు 1కి రు0-2-0 వంతున సుంకము విధింపబడుచు, ఆరాబడి హిందూదేశ ప్రత్తిసంఘమున కొసంగబడుచున్నది. ఈరాబడియే యీసంఘము పనిచేయుట కాధారము. 1927వ సంవత్సరమున బొంబాయిలో మరొకశాసనము గావింపబడెను. (Cotton Markets Act). ప్రత్తిపంట విషయమున భారత దేశము శ్రద్ధవహింపవలసియున్నది. భారతదేశమున విశేషముగ ప్రత్తి పండింపబడుచున్నను, కట్టుటకు భారతభూమి విదేశములనుండి [illegible] ఎదురుచూచుచున్నది. లాంకషైరుమిల్లులకు సన్ననిదారములుతీయుటకు వలయుప్రత్తిని అందించుటయెట్లను యోచనలతో ప్రత్తిసంఘమువారు కాలక్షేపము చేయుటకంటె భారతదేశమునందే వివిధరకములప్రత్తిని

పండించుటకును, ఆపత్తిని భారతదేశమందే యుపయోగించుటకును మార్గముల నరయదగును.

గోగునార.

ప్రపంచమునందు వాడబడుచున్న గోగునార ముఖ్యముగ హిందూదేశమునందే పండింపబడుచున్నది. హిందూదేశపు ఎగుమతివర్తకములో 100కి సుమారు 27వంతులు నార ఎగుమతివర్తకమే గలదు. 1932-33వ సంవత్సరమున గోగునార 2.4 మిలియను ఎకరములలో వేయబడెను. మొత్తపుసాగుబడిభూమిలో 100కి 1.2 వంతులుమాత్రమే గోగునారపంట పండింపబడుచున్నది. వంగదేశమునందలి గంగా బ్రహ్మపుత్రానదుల డెల్టాలలోను అస్సాముదేశమున, కూచిబిహారు సంస్థానమున, ఒరిస్సాలయందు గోగునారపంటగలదు. నదుల ఒండ్రువలన నీభూములు బలపడి ఎరువు అవసరములేకుండగనే యిచ్చట నీపంట పండుచున్నది. 1930-31వ సంవత్సరమునగల 3402254 ఎకరముల గోగునారపంటభూమిలో వంగదేశమునందే 3028300 ఎకరములుగలదు. సంయుక్తరాష్ట్రములలో 2938 ఎకరములును, బీహారు, ఒరిస్సాలలో 179000 ఎకరములును, అస్సాములో 192016 ఎకరములును గోగునార పండింపబడుచున్న భూమిగలదు. అనగా వంగదేశమునందే సుమారు 100కి 90 వంతులు గోగునారపంట భూమిగలదు. గత అరశతాబ్దమునందున గోగునార పండించుభూమియు పంటయునుగూడ వృద్ధియైనవి. 1932-33వ సంవత్సరమున 5845000 బేళ్ళగోగునారపండింపబడెను. (బేలు 1కి 400 పౌనులు) 1931-32వ సంవత్సరమున 586618 టన్నుల ముడినారయు, గోగు తాళ్ళు మొదలగు తయారైన నారసరకులు 663618 టన్నులును, ఎగుమతి అయినవి. 1930-31వ సంవత్సరమున మొత్తపు ఉత్పత్తిలో

ముగ పండింపబడుచున్నది. 1931-32వ సంవత్సరమున 1.3 మిలియను ఎకరములలో పొగాకు వేయబడెను.

| | |
|---|---|
| మదరాసురాజధాని | 0. 2 |
| బొంబాయి | 0. 1 |
| బెంగాలు | 0. 3 |
| సంయుక్తరాష్ట్రములు | 0. 7 |
| పంజాబు | 0.07 |
| బర్మా | 0. 1 |
| బీహారు, ఒరిస్సాలు | 0. 1 |
| మధ్యపరగణాలు, బీరారు | 0.01 |
| పశ్చిమోత్తర పరగణాలు | 0.01 |
| హైదరాబాదు | 0.08 |
| మైసూరు | 0.02 |
| బరోడా | 0.04 |

పొగాకు చాలవరకు మనదేశమునందుననే వినియోగింపబడుచున్నది. మదరాసు, రంగూనులనుంచి ముడి పొగాకు ఎగుమతి గూడ యగుచున్నది. పొగాకు ఎగుమతికంటె సిగరెట్లమూలమున దిగుమతి హెచ్చుగనున్నది. 1930-31 వ సంవత్సరమున 572000 టన్నుల పొగాకు పండెను. ముడిపొగాకు 27970510 పౌనులును, తయారైన పొగాకుసరకు 1122122 పౌనులును ఎగుమతి జరిగెను.

1608381 పౌనుల పొగాకును 3321606 పౌనుల తయారైన పొగాకు సరకును (సిగరెట్లు, చుట్టలు) దిగుమతి జరిగెను. పొగాకుపై దిగుమతి సుంకములు హెచ్చించుటచే హిందూదేశమందలి పొగాకునకే హెచ్చుఖర్చుండుననియు అందుచే పంటగూడ వృద్ధియగుటకు సావకాశము గలదనియు తలంపబడుచున్నది. వ్యవసాయ పరిశోధకమండలి వారు పూసాయందు ప్రశస్తమగు పొగాకుపండు మార్గముల నన్వేషించుచున్నారు. వర్జీనియా పొగాకువంటి పొగాకును తయారుజేయుటకై ప్రయత్నములు జరుగుచున్నవి.

**మేత పంటలు**

పశువులమేతకు పనికివచ్చుపంటలు 1930-31వ సంవత్సరమున 9299888 ఎకరములలో వేయబడెను. 1901-2 వ సంవత్సరమున 2.94 మిలియను ఎకరములలోనే వేయబడెను. పంజాబు, బొంబాయి, సంయుక్తరాష్ట్రములలో హెచ్చుగ మేతదినుసుల పంటలు గలవు. హిందూదేశమునందుగల పశుసంతతికి ఈమేత పంట చాలదు. ఈజిప్టుదేశపు ఒక తరహా పరిమళమైనగడ్డిని వ్యవసాయశాఖవారు హిందూదేశమున ప్రవేశపెట్టిరి. (Egyptian clover).

**రబ్బరు.**

రబ్బరు మైసూరు, కొచ్చిను, తిరువాన్కూరుసంస్థానములయందును, కూర్గునందును పండింపబడుచున్నది. పండిన రబ్బరు చాలవరకు ఎగుమతియగుచున్నది. విదేశములనుండి తయారైన రబ్బరుసరకును దిగుమతిచేసికొనుచున్నాము. ప్రపంచమునందుగల రబ్బరుపంటలో హిందూదేశపు రబ్బరుపంట 100కి 3 వంతులు మాత్రమే గలదు. 1931-32 లో 0.2 మిలియను ఎకరములలో రబ్బరుపంట గలదు.

# 8. ఆహారపు దినుసుల ఎగుమతి.

ఈదిగువట్టికవలన 1930 సంవత్సరమునకు పూర్వము ఆహార పదార్థముల యెగుమతియు నారలయెగుమతియు నెట్లున్నదియు తెలిసికొనగలము. ఎరువుల యెగుమతులను దెలుపుచు నొసంగిన లోగడపట్టికను గూడ నీసందర్భమునందు గ్రహింపదగును. ఈ రెండుపట్టికలను గ్రహించుచో పంటదినుసులు విదేశముల కెట్లు ఎగుమతి యగుచున్నదియు పూర్తిగ తెలిసికొనగలుగుదుము.

ధాన్యము, బియ్యము ఆహారపు దినుసుల ఎగుమతిలో ముఖ్యస్థానము వహించుచున్నవి. గోధుమ ఎగుమతి రానురాను తగ్గిపోయినది. ఇళ్లే, పప్పులు, బార్లీ, జొన్న, రాగి, మొక్కజొన్న మొదలగు ధాన్యాదులు ఎగుమతియగుచున్నవి. కాని వీటి ఎగుమతియు గమనింపదగినట్లుగ లేదు. ఆహారపు దినుసుల ఎగుమతి యన నేడు బియ్యమునకే వర్తించును.

ఆహారపదార్థముల నెగుమతిచేయదగునా? ఈప్రశ్నయే విమర్శింపదగియున్నది.

“ఎగుమతులు హెచ్చుచున్నకొలదియు దేశము భాగ్యవంతమగుచున్నది. దేశమునందుకావలసిన సరకు పోను మిగతా సరకును ఎగుమతిచేయుటవలన ప్రపంచమునందుగల హెచ్చుధరలు లభించుట లాభము. హెచ్చుధరకు మన సరకును పంపి తక్కువ ధరలకు విదేశములనుండి తయారగు వస్తువులను తెప్పించుకొనుట దేశమునకు లాభకరమే. దేశమున కనవసరమైన సరకు మాత్రమే ఎగుమతి అగుచున్నది” అని కొందఱివాదము.

| (41) | | పరిమాణము (వేలలో) | | | | | ధర (వేలరూపాయలలో) | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | యుద్ధమునకు పూర్వము సగటు | యుద్ధము సగటు | యుద్ధానంతరము సగటు | 1925-26 | 1929-30 | యుద్ధమునకు పూర్వము సగటు | యుద్ధము సగటు | యుద్ధానంతరము సగటు | 1925-26 | 1929-30 |
| ధాన్యము, నూక, పిండి, పప్పుదినుసులు | టన్నులు. | | | | | | | | | | |
| ధాన్యములు (పూక) | ,, | 42 | 82 | 85 | 86 | 28 | 2718 | 2009 | 8186 | 8687 | 2220 |
| బియ్యము | ,, | 2898 | 1685 | 1462 | 2549 | 2298 | 256655 | 188825 | 248866 | 896054 | 812842 |
| గోధుమ | ,, | 1808 | 807 | 287 | 212 | 18 | 189686 | 108841 | 86061 | 88025 | 2124 |
| గోధుమపిండి | ,, | 55 | 57 | 56 | 67 | 51 | 8699 | 11820 | 15026 | 15620 | 10718 |
| పప్పుదినుసులు | ,, | 159 | 129 | 141 | 189 | 97 | 12981 | 18852 | 20278 | 20916 | 16878 |
| బార్లీ | ,, | 227 | 198 | 40 | 42 | 6 | 19816 | 22178 | 4656 | 5628 | 672 |
| జొన్నారు, బజిరా | ,, | 41 | 41 | 11 | 14 | 15 | 8760 | 4415 | 1789 | 1804 | 2518 |
| ఇతరరకములు | ,, | 181 | 181 | 27 | 4 | 2 | 14296 | 28245 | 8403 | 680 | 449 |
| మొత్తముఆహార పదార్థములు | ,, | 4411 | 8141 | 2009 | 8068 | 2510 | 458111 | 874180 | 480889 | 480889 | 847916 |
| తేయాకు | పౌనులు (తూకం) | 266497 | 822691 | 821169 | 825788 | 876684 | 180678 | 175487 | 271217 | 271217 | 260064 |
| నారలు-ప్రత్తి | టన్నులు. | 489 | 891 | 521 | 745 | 727 | 882788 | 886819 | 647889 | 949928 | 650770 |
| ముడినార | ,, | 764 | 464 | 554 | 647 | 807 | 222024 | 128028 | 195277 | 872457 | 271788 |
| మొత్తము నారలు | ,, | 1194 | 855 | 1075 | 1892 | [illegible] | 554807 | 464847 | 842666 | 1822885 | 922508 |

జరుగుచున్నంతవఱకైన తగ్గినను ఎగుమతులను నిషేధించి అధికాహారమును ప్రజల కొసంగదలంచిన సంకల్పము వికల్పమగుట లేదా యను ప్రతివాదము రాగలదు. నిజమే, కాని ఎగుమతి జరుగుచున్నంత వరకైనను ఉత్పత్తియగుట తగ్గునని యూహించుటకంటె మామూలు పంటలను పండించుటయే భారతదేశపు రైతుల నైజగుణమని యూహించుట సమంజసము.

ఎగుమతులను నిషేధింపరాదను వాదమును సమర్థించుచు ఖజానా విచారణసంఘమువారు నిరూపించిన యితరకారణములన్నియు ఎగుమతు లనాహారము లేని నిలవసరకు అనదురభిప్రాయముపై నాధారపడియుండుటచే వివరించి విమర్శింపబడలేదు. పంటలు పండకపోయినను కఱవులువచ్చినను ఎగుమతులు గాకుండనున్నప్పుడే ప్రజలకు లాభకరముగాని, ఎగుమతులగుచుండుటవలన కాజాలదు. అధికోత్పత్తికి ఎగుమతులవల్లనే ప్రోత్సాహము గలుగునని తలంచుట పొరపాటు. దేశమునందు ప్రజాసామాన్యమునకంతకు ఆహారములభించునట్లొనరింపగలుగుచో విదుదలయు హెచ్చుగనేయుండును. దేశమునందు హెచ్చువిదుదల యున్నను అధికోత్పత్తికి ప్రోత్సాహము గలుగును. ఈకారణములచే ఆహారపదార్థముల యెగుమతిని నిషేధించు సిద్ధాంతము సక్రమమైనది గాదనజాలము. "1918-1920వ సంవత్సరమునందు వలె ఆహారపదార్థముల కొఱత సంభవించినపుడును దేశమునందుగల అంతర్వ్యాపారములో ధరలు హెచ్చినపుడు వాటినితగ్గించుటకును ఎగుమతులను నిషేధించుట యుపయోగకరమే." అని వీరాయాన్స్టెగూడ తనపుస్తకమునం దంగీకరించెను. ఇట్లే పలువురార్థిక శాస్త్రవేత్తలు విపరీతకాలములయందు నిషేధించుట తగుపనియని తలంచుచున్నారు. ఆహారపదార్థములు విరివిగ నెగుమతియే జరుగుచున్నయెడల ఆయెగుమతియే విపరీతస్థితి. అట్టిఆహారపదార్థములను ఎల్లకాలములయందు

నిషేధించి ప్రజాసామాన్యమున కంతకు నాహారము సులభముగ లభింపజేయుటయే కర్తవ్యము. కాని యిట్టి నిషేధము నేడు భారత భూమియం దవసరమా? ఆహారపదార్థముల యెగుమతి అంతకంతకు సహజముగ తగ్గిపోవుచున్నది. ఈదిగువపట్టికవలన రానరాను ముఖ్య పంటల ఎగుమతి ఎట్లుతగ్గుచున్నదియు తెలిసికొనగలము.

| యుద్ధమునకు పూర్వపు సగటు | యుద్ధకాలపు సగటు | యుద్ధానంతరపు సగటు | 1929-30 వ సం॥ అంతమగు 3 సం॥ సగటు | 1930-31 | 1931-32 | 1932-33 | |
|---|---|---|---|---|---|---|---|
| 9 | 5 | 5 | 6.6 | 7.1 | 7.0 | ... | వరి |
| 14 | 9 | 8 | గమనింపదగిన ఎగుమతి లేదు. | | | | గోధుమ |
| 96 | 89 | 95 | | 88.2 | | | టీ |
| 56 | 51 | 61 | | | | | ప్రత్తి |
| 51 | 31 | 48 | | 73.7 | | | ముడినార |
| 73 | 63 | 59 | | 60.8 | 29.2 | | అగిసెవిత్తులు |
| 23 | 8 | 19 | | 3.6 | 5.5 | | కుసుమఆవాలు |
| 25 | 8 | 6 | | 0.2 | 2.3 | | నువ్వులు |
| 35 | 12 | 19 | | 19.0 | 24.9 | ... | వేరుసెనగ |
| 40 | 44 | 27 | | | | | నీలిమందు |
| | | | 3.0 | .04 | | | బార్లే |
| | | | 0.5 | 0.3 | | | కంబులు |

ఈపట్టిక ఆయాపంటల మొత్తపు ఉత్పత్తులలో 100కి ఎన్నివంతు లెగుమతియగుచున్నదియు తెలుపుచున్నది.

యుద్ధమునకు పూర్వముగల ఎగుమతులు యుద్ధానంతరము నుండియులేవు. యుద్ధానంతరపుస్థితి 1930వ సంవత్సరమునుండియు మారిపోయినది.

ఈదిగువపట్టికకూడ 1930వ సంవత్సరమునకు పిమ్మట ముఖ్య పంటల ఎగుమతియు, వాటిఖరీదులును ఎట్లుతగ్గిపోయినదియు తెలుపుచున్నది.

| | టన్నులు 1931—32 | రూపాయలు 1931—32 | టన్నులు 1932—33 | రూపాయలు 1932—33 |
|---|---|---|---|---|
| గోగునార | 1250000 | 331128000 | 1243000 | 314391000 |
| ప్రత్తి | 423000 | 234472000 | 368000 | 203721000 |
| | పౌనులు | | పౌనులు | |
| తేయాకు | 341518000 | 194374000 | 378337000 | 171528000 |
| | టన్నులు | | టన్నులు | |
| ధాన్యము | 2301000 | 178439000 | 1828000 | 142265000 |
| నూనెవిత్తులు | 988000 | 145883000 | 732000 | 113068000 |

మరల ప్రపంచమునందొక మహాసంగ్రామము దాపరించుచో మాత్రమే హిందూదేశమునుండి పంటలధికముగ ఎగుమతియగు సమస్య యుద్భవింపదు.

## 9. ముడిదినుసుల ఎగుమతి.

నేడు పాశ్చాత్యప్రపంచమున అన్నివిధములగు పంటలను పండించుకొనుచున్నారు. స్వయంసహాయ సిద్ధాంతమును వారు ఆచరింప మొదలుపెట్టిరి. యుద్ధకాలమునందు ముడిదినుసులకై యితర దేశముల మీద వారాధారపడవలసివచ్చుటచే ముడిదినుసులను పండించుటకై అయిరోపాఖండము విశేషకృషి సల్పుచున్నది. ఈకృషివలన భారత దేశపు ముడిదినుసుల ఎగుమతికూడ తగ్గుటకే సూచనలు గోచరించుచున్నవి. యుద్ధమునకు పూర్వమువలె యుద్ధకాలమునందువలె యుద్ధా

నంతరము ముడిదినుసుల ఎగుమతికూడ తగ్గిపోయినది. 1930వ సంవత్సరమునుంచియు, హెచ్చుగ ముడిదినుసుల ఎగుమతికూడ తగ్గుటకు మొదలుపెట్టెను. ముడిదినుసుల ఎగుమతిని నిషేధించుట అవసరమా? కాదా? అను సమస్యసకంటె ముడిదినుసుల ఎగుమతి సహజముగ తగ్గిపోవుచో భారతదేశముయొక్క గతియేమి? అనుసమస్య ప్రాముఖ్య స్థానము వహించును.

ముడిదినుసుల ఎగుమతి సహజముగ తగ్గిపోవుచో పరిశ్రమ లభివృద్ధికాని మనదేశమున ముడిదినుసుల విడుదలకు అవకాశ ముండదు. ఆనాడు ముడిదినుసులను పండించుట విరమింపబడుటలో వింతయుండదు. ఆస్థితిరాకపూర్వమే ముడిదినుసులను భారత భూమియందే వినియోగించుకొను పరిస్థితులేర్పడవలెను. ఈపరిస్థితులేర్పడుటకు పరిశ్రమలకు వినియోగపడు ముడిదినుసుల ఎగుమతిని నిషేధించుటయే కర్తవ్యము. నిషేధించుటవలన ముడిదినుసుల ధరలు తగ్గి పరిశ్రమలవలన తయారగువస్తువులు విదేశస్థుల వస్తువులకంటె చౌకగ విక్రయించుటకు వీలుగనుండును. విదేశముల వస్తువులకంటె చౌకగ తయారుచేయగల పరిస్థితులేర్పడుచో క్రొత్త పరిశ్రమ లేర్పడుటకు ప్రోత్సాహకరముగగూడ నుండును. ముడిదినుసులను చౌకచేయుటవలన పండించువారికి ఖర్చులుపోను ఆదాయము మిగులకుండపోవుచో పండించుటకు ప్రోత్సాహము నశించునను వాదముగలదు. ఇది గమనింపనక్కఱలేదు. ముడిదినుసుల ఎగుమతివల్ల ఆదాయము హెచ్చువచ్చుచున్నను తయారైన వస్తువులను విదేశముల నుండి తెప్పించుకొనుచుండుటవలన హెచ్చుడబ్బును రైతులు ఖర్చు పెట్టుచున్నారు. ముడిదినుసులు చౌకచేయుటవలనగలుగునష్టము తయారైన స్వదేశవస్తువులు చౌకగ లభించుటలో కూడివచ్చును. చౌకగ వస్తువులను తయారుచేయగలిగి విదేశములతో పోటీచేయగలుగుచో

హిందూదేశములో మొత్తమున 250 లక్షల నాగళ్ళు గలవు.[1] ఇందులో 17000 మాత్రమే వ్యవసాయశాఖవారివలన అమ్మబడిన క్రొత్త నాగళ్ళు గలవు. నూతన పరికరముల నుపయోగించుటలో కొన్ని చిక్కులు గలవు. క్రొత్తనాగళ్ళు రైతుల కందుబాటులో లేవు. వ్యవసాయశాఖవారు క్రొత్తనాగళ్లను అమ్ముటయందు శ్రద్ధవహించుట లేదు. ఇందులకుతోడుగ నూతన యంత్రములను చిన్నరైతులు కొనజాలరు. చెఱకురసము తీయుటకు వలయు యంత్రములు, కుప్పలుకొట్టుటకు వలయు యంత్రములు, పంటలను మోసికొనిపోవు యంత్రములు మొదలగునవన్నియు చిన్నరైతు కొనజాలడు. కాని క్రొత్తనాగళ్లను కొనుటయందిట్టి అధికవ్యయము లేదు. యంత్రసహాయమున నాగళ్లనుచేయుట ప్రారంభించుచో నేడుప యోగించుచున్న నాగళ్లకంటె ప్రశస్తమైనవి తక్కువఖరీదునకు లభింప గలవని వ్యవసాయ విచారణసంఘమువారు మదింపువేసిరి. రంగూను సమీపమునగల హ్యామ్‌బీయందు వ్యవసాయశాఖవారి ప్రయోగ శాలయందిట్టి నాగళ్ళు చౌకగ తయారగుచున్నవి. కాని చెడిపోయి నపుడు మరమ్మతు చేయించుకొనుట కష్టము.

ఈపనిముట్లను గుఱించి విశేషపరిశోధన జరుగవలసియున్నది. నేడు వాడబడుచున్న నాగళ్ళు భూమిని లోతుగదున్ని మట్టిని తిరుగ వేయజాలవని వ్యవసాయసంఘమువారి యభిప్రాయము. క్రొత్తరకపు నాగళ్ల నుపయోగించుటకు హిందూదేశమందలి ఎద్దులకు శక్తిలేద నియు, ఎద్దులశక్తిననుసరించి పరీక్షించుచో నేడుపయోగింపబడుచున్న నాగళ్లే యుపయుక్తములనియు పంచదార విచారణసంఘమువా రభి ప్రాయపడిరి. (Sugar Committee). ఎద్దులబలము చాలక వ్యవసాయ దారుడు క్రొత్తనాగళ్లనుపయోగించుట మానలేదు. ఆతడు సునాయా

1. *Agricultural Statistics of India.*

సముగ పొలములకు మోసిగొని పోగలవాటినే యుపయోగించుట క్లిష్టపడుచున్నాడని కొందఱిమతము. "హిందూదేశమునందలి భూమి ననుసరించి మట్టిని తిరుగ వేయ నవసరములేదనియు భూమియందుగల తడిని పదిలపరచుటయే అవసరమనియు తలంచుటయే క్రొత్తనాగళ్లను ఉపయోగింపకుండుటకు కారణమని వ్యవసాయ విచారణసంఘమువారి నిర్ణయము. మట్టిని తిరుగ వేయుటవలన లాభముకలుగుననుట నిశ్చయమైనను, మట్టియందలి తడిని పదిలపరచుటగూడ నవసరమేయని వ్యవసాయ విచారణసంఘమువారి నిర్ణయము. ఏవిధముగ నేపనిముట్లతో దున్నిన స్వల్పవ్యయప్రయాసలును అధికలాభమును గలుగునో తెలిసికొనుటకు వరుసగ కొన్నిసంవత్సరముల ప్రయోగమువలన పరిశోధించుటయే కర్తవ్యము.

"ఇంగ్లండునందుగల వ్యవసాయపరికరముల దుకాణమువారు వారు తయారుచేయించుచున్న 350 రకముల నాగళ్ళలోను 12 రకముల నాగళ్ళ నుపయోగించుటవలననే అధికోత్పత్తికి వీలున్నదని మాకు తెలిపిరి." అని వ్యవసాయ విచారణసంఘమువారు వ్రాసిరి. 250 లక్షల నాగళ్లతో వ్యవసాయము చేయబడుచున్న యీదేశమున క్రొత్తనాగళ్ళను సక్రమముగ ప్రయోగించి, పరిశోధనలుసలిపి రైతులకు తుదినిర్ణయము దెలుపుట వ్యవసాయశాఖవారి కర్తవ్యము.

"కర్రనాగలికిని, తేలికయైన నినుపనాగలికిని భేదమంత రైతులకు తెలియకపోవుటచేతను, వారికి తెలిసినను ద్రవ్యలోపముచే వారికది లభింపకపోవుటచేతను విరివిగ నినుపనాగళ్ళు వాడకములోనికి రాలేదు. దాని వాడకమును పెంచుటకు రెండుమార్గాంతరములు కనిపించును. మొదటిది దానియుపయోగములను రైతులకు పూసగ్రుచ్చినట్లు తెలుపవలయును. దానిని కొని వాడవలెనను నభిలాషగల రైతులకు ద్రవ్య

సాధనములను కలిగించి వారు సులభముగ తీర్చుకొని నాగలిని సంపాదించుకొను మార్గమును చూపించుట రెండవది. రెంటిప్రయోజనము నుద్దేశించి వ్యవసాయశాఖవారిప్పుడు ఒకపద్ధతిని ప్రారంభించిరి. అది రైతులు తెలిసికొనవలయును. దాని యుపయోగమును పూర్ణముగ వారు పొందవలయును......... వారికి ముఖ్యముగ నినుపనాగళ్ళు, సులభముగ తిరిగే మోటచక్రములు, చేలగట్లువేసే యంత్రములు, (కోయంబుత్తూరులో నిట్టియంత్రములను వాడకముచేయుచున్నారు.) గుంటకములు (భూమిని పదునుచేయు పరికరము) ప్రయోజనకారిగ నుండును. ఇవి చిన్నపనిముట్లుగాని విలువథైన యంత్రములుకావు. దీనికి పెట్టుబడి విశేషము పెట్టనక్కరలేదు. బీదసాదలు వీనిని సులభముగ కొనవచ్చును.

ఇనుపనాగళ్ళు మన దేశములోనే తయారై చాలచౌకగ లభించుచున్నవి. పూర్వమివి అమెరికా మున్నగు ఐరోపా దేశములనుండి దిగుమతికావలసి యుండెను. అప్పుడు దీనిలో రు 8 లకు తక్కువది లేకుండెను. ఒకప్పుడు ముప్పది నలుబది పెట్టినగాని దొరకని నాగళ్ళును కలవు.

ఇప్పుడా చిక్కుపోయెను. బొంబాయిలోని కూపరుకంపెనీవారేమి, పూనాయందలి కిర్లాస్కరు కంపెనీవారేమి, ఇంకను తదితరులేమి చాలచౌకగ నిప్పు డినుపనాగళ్లను తయారుచేసి విక్రయించుచున్నారు.

ఇప్పుడైదుమూపాయిలకు మించకుండ రైతులకు ఇనుపనాగళ్ళు దొరకుచున్నవి. వీనికి కంపెనీధర ఇప్పుడు రు 3—12—0 లున్నది. వ్యవసాయశాఖవారు రైతులుకోరినప్పుడు వీనిని తెప్పించి వానికిగింద నగు ఖర్చులతో రు 4—4—0 లకు విక్రయించుచున్నారు......

తేలికయైన నాగలి మెట్టపొలముల దుక్కికి పనికివచ్చును. దీనిని కూపరు 25 లైటునాగలి యని వ్యవహరింతురు. ఇక బరువైన నాగలి యొకటిగూడ కలదు. దానికి కూపరు 26 యని పేరు. దానివెల రు 8-8-0 లుండును. ఇంక నితర రకముల నాగళ్ళును కలవు.

ఏవరీ కంపెనీవారి హిందూస్థానీనాగలి యని ఒకటి అమ్మకము మొదలిడిరి. దానిలాభాలాభములను ప్రయోజనాప్రయోజనములను వ్యవసాయశాఖవారు పరీక్షచేయించిరి. కోయంబుత్తూరులో ఇంజనీరున్నాడు. పనిముట్లను పరిశీలించి మనదేశమునకును మన రైతులకును పనికివచ్చునట్లు వానిలోనే యేమార్పులు కావలయునో వారు చూచెదరు.

క్రొత్తగ తయారైన హిందూస్థానీ నాగలివంటి నాగలిని తక్కువవెలకు ఒకటి తయారుచేయవలసినదని వివిధకంపెనీలవారిని వారు కోరియుండిరి. కూపరు, కిర్లోస్కరు కంపెనీలును కోయంబుత్తూరులోని పి. యస్. జి. అండు సన్సువారును కొన్ని నాగళ్లను దానివిధముగ తయారుచేసిరి. వానిలో కూపరు కంపెనీవారు తయారుచేసిన 11 నెంబరు నాగలి బాగున్నది. దీని ఖరీదు రు 6½ లు. రైతులకుపయుక్తముగ నుండు పనిముట్లజాబితాను వ్యవసాయశాఖ వ్యవసాయ పంచాంగములో ప్రకటించుచుండును.

ఇక్కడ మరొకవిషయమును మరవరాదు. మామూలుఎద్దులు ఇనుపనాగళ్లను లాగలేవేమో యను భయము కొందర కుండవచ్చును. అది కేవలము భ్రమగాని వేరుకాదు. నిజమునకు బక్కఎద్దులైనను కొయ్యనాగలికంటె ఇనుపనాగలినే కొంచెము సులువుగ లాగును. ఇనుపనాగలికి పట్టు తక్కువ యుండును. కర్రనాగలి భూమిలోనికి బాగుగ దిగదు. దిగినను కూరుకొనిపోయి కదలిరాదు. ఇనుపనాగలి విషయ

ఈ పనిముట్లు ఉపయోగకరముగ నున్నను తక్కువ భూమి గల రైతునకు మాత్రమే పనికివచ్చును. తక్కువ భూమి గల రైతు అధికోత్పత్తి కవసరమగు యంత్రములను కొనజాలడు. హెచ్చు భూమి గల రైతునకు యంత్ర సహాయ మత్యవసరము. బరువును మోసికొని పోవు మోటారులను, ట్రాక్టరులను (దున్నుటకు, విత్తులను జల్లుటకు, ఊడ్చుటకు, కోయుటకు, కొట్టుటకు, మొదలగు వ్యవసాయపు పనులన్నింటికి పనికివచ్చు యంత్రములు) పెద్దరైతు వినియోగించుకొన వచ్చును. ఒక్క వ్యవసాయ యంత్రము 8 లేక 10 జతలయెద్దుల పనికి సరిపోవునని పూసా పరిశోధనశాలయందు ప్రత్యక్షముగ గనుగొనబడెను. కొలది కొలదిగ బొంబాయి, పంజాబు, మధ్యరాష్ట్రములలో నీ నూతన యంత్రముల నుపయోగించుచున్నారు. ఈ యంత్రములు జమీందారుల వంటివారు వేలకొలది ఎకరము లొక్కఖండముగ నున్నపుడు మాత్రమే యుపయోగించుకొనగలరు. ఈ నూతన యంత్రములను భారతదేశమునందే తయారుచేయుచో కొంత ఖరీదు తగ్గగలదు. భారతదేశము నందంతట అధికోత్పత్తి జరుగవలెనన్న వ్యవసాయదారు లందఱకు నూతన యంత్రములు లభించు మార్గముల నరయవలయును. ప్రభుత్వమువారే వ్యవసాయ యంత్రములను నిర్మించు ఫ్యాక్టరీలను నెలకొల్పుట సమంజసము.

## 12. పశు సంతతి.

పశుసంతతికి ఆహారముగ ప్రత్తివిత్తులు మొదలగునవి యుపయోగింపబడుచుండెడివి. నేడట్టి బలకరమగునాహారము విదేశములకెగుమతి యగుచుండుటచే పశుసంతతిగూడ నీరసించి నానాటికి బలహీనమగుచున్నది. అల్పాహారమున పశువులు జీవచ్ఛవములగుచున్నవి. ఆహారముకొఱకై ఎండినపొలముల వెంట దిరుగాడుటయే పశుసంతతికి గతి

యుగుచున్నది. ప్రపంచమునందు దంతటికంటెను జనసముదాయ మెట్లు హెచ్చుగ నున్నదో, పశుసంతతి గూడ నట్లే హెచ్చుగ నున్నది. భారతీయ జీవరాశికి ఆహార సదుపాయము మాత్రమే స్వల్పముగ నున్నది. హిందూదేశమునందు గల పశువుల సంఖ్యను 1919-20 వ సంవత్సరమునందును, 1924-25 వ సంవత్సరమునందును మదింపు వేయబడెను. బర్మాయందును, మధ్యరాష్ట్రముల యందును, ప్రతి సంవత్సరము మదింపు వేయబడుచున్నది. ఈ యంకెల ననుసరించి హిందూదేశమున పశుసంతతి యిట్లు గలదు.

| | | |
|---|---|---|
| ఆవులు, ఎద్దులు, గేదెలు, దున్నపోతులు | 151.0 | మిలియనులు |
| మేకలు, గొఱ్ఱెలు | 62.5 | ,, |
| గుఱ్ఱములు, కంచరగాడిదలు, గాడిదలు | 3.2 | ,, |
| ఒంటెలు | 0.5 | ,, |

స్వదేశ సంస్థానములయందు 51 సంస్థానముల లెక్కలు మాత్రమే లభించుచున్నవి. ఈ సంస్థానములలో 1924-25 వ సంవత్సరమున 36 మిలియనుల ఆవులు, ఎద్దులు, గేదెలు, దున్నపోతులును గలవు. 25 మిలియనుల మేకలును గొఱ్ఱెలును గలవు. 1 మిలియను గుఱ్ఱములును కంచరగాడిదలును గాడిదలును కలిసికలవు. 262000 ఒంటెలును గలవు. విదేశములలో పశువు 1 కి 7 గొఱ్ఱెల వంతున మదింపు వేయుదురు. కాని హిందూదేశమున పశువులును దున్నపోతులును గొఱ్ఱెలకంటె 17 రెట్లుగ ప్రాముఖ్యస్థానము వహించుచున్నవని వ్యవసాయవిచారణసంఘమువారు వ్రాసిరి. పశుసంతతి హిందూదేశ

మునను దక్షిణప్రాంతములకు మిక్కిలి యనుకూలముగనున్నది. ఇచ్చట వ్యవసాయ మునకు పశుసంతతియే ముఖ్యాధారము. ఇంగ్లెండు, ఆస్ట్రేలియా, అమెరికాలలో పశుసంతతి ఆ దేశస్థుల యుపయోగమునకంటె జంతువుల సరకును విదేశముల కెగుమతి చేయుట కవసరముగ నున్నది. హిందూదేశమునుండి పశువులుగాని వాటివలన తయారగు సరకుగాని విదేశముల కెగుమతి యగుటలేదు. తోళ్లను కొమ్ములును మాత్రమే ఎగుమతియగుచున్నవి. ఇతర ప్రపంచభాగములలో పశు సంతతి ఆహారముకొఱకును పాటి పాలకొఱకును పెంపబడుచున్నది. హిందూదేశమున ముఖ్యముగ వ్యవసాయముకొఱకే పెంపబడు చుండెను. ఎద్దులేనిచో భారతవర్షమున వ్యవసాయమే లేదు. 100 కి 80 మంది ప్రజకు ఆహారమే యుండదు. ఈకారణముననే గోమాత భారతవర్షమున పూజింపబడుచున్నది. వ్యవసాయముకొఱకు యంత్ర ములను, కంచరగాడిదలను, గాడిదలను, ఒంటెలను ఎక్కడోగాని యుప యోగించుటలేదు. వ్యవసాయపు దినుసులను కొండప్రాంతములలో మోసికొనిపోవుటకు మాత్రమే ఈజంతువు లుపయోగింపబడుచున్నవి.

గొఱ్ఱెలు, మేకలు.

గొఱ్ఱెలుకూడ అడవిప్రాంతముల విశేషముగ పోషింప బడుచున్నవి, బెంగాలు, బర్మా, అస్సాములలో శీతోష్ణ స్థితి సరిపడనందున గొఱ్ఱెలు స్వల్పము. మదరాసు నందు గొఱ్ఱెలు, మేకలు హెచ్చుగపుట్టిపెరుగుచున్నవి. ఈమేకలమందలుగూడ బలముగలవిగలేవు. సాలుసరిగొఱ్ఱె 1కి 2పౌనుల బొచ్చుకంటె హెచ్చులభింపదు. కోయంబుత్తూరుజిల్లా, రాజపుటానా ఏజన్సీ, బికనీరుమొదలు దక్షిణప్రాంతముల కొంచెము మంచిరకముల

మందలున్నవి. వర్షములు తక్కువగనున్న మధురానగరంజిల్లా, మూరడాబాదు మొదలగు సంయుక్తరాష్ట్రములయందలి జిల్లాలలోను హిమవత్పర్వతప్రాంతములయందును మంచిరకపు మందలు గలవు. ఈమందలు ఊలుకొఱకు పెంపబడుటలేదు. మాంసాహారముకొఱకే విశేషముగ పెంపబడుచున్నవి. ఈపెంపుడును, ఈసంతతియును గూడ కడునీరసముగ నున్నవి.

గొఱ్ఱెలసంతతి నభివృద్ధిపఱచుటకై ఈస్టిండియా కంపెనీవారు ప్రయత్నించిరి. 1835 వ సంవత్సరమున ఇంగ్లండునుంచి 120 గొఱ్ఱెలను హిందూదేశమునకు దిగుమతిచేసిరి. ఈదిగుమతిగొఱ్ఱెలకు పుట్టిన సంతతివలన ఊలు బాగుగ లభించుచున్నటుల గోచరించెను కాని 1843 వ సంవత్సర ప్రాంతముననే యీకృషి మరల విరమింపబడెనని వ్యవసాయ విచారణసంఘమువారు వ్రాసిరి.

ఆవులు, ఎద్దులు, గేదెలు, దున్నపోతులు.

1914-15 వ సంవత్సరపు మదింపు ననుసరించి పశుసంతతి 147 మిలియనులనియు 1919-20వ సంవత్సరపు మదింపు ననుసరించి 146 మిలియనులనియు 1924-25 వ సంవత్సరపు మదింపు ననుసరించి 151 మిలియనులనియు లెక్కలువేయబడినవి. ఈ అంకెలయందుగల పెరుగుదల మదింపులయందు గమనింపబడిన శ్రేష్ఠత్వము ననుసరించి యని చెప్పవచ్చును.

1924-5 వ సంవత్సరమున వివిధరాష్ట్రములయందు పశుసంతతి యెట్లున్నదియు నీదిగువపట్టిక తెలుపగలదు. ఈపశుసంతతికి మేతమేయుటకుగల భూమికూడ తెలియగలదు.

"ఇతర దేశములలోవలె పశుసంతతి లాభకరముగ నుండుటకు ఎద్దులకు తగినంతపని యుండవలెను. ఆవులు హెచ్చుగ పాల నీయవలెను. ఎరువులన్నియు భూమి బలమునకై వినియోగింపబడవలెను" అని వ్యవసాయ విచారణ సంఘమువారి నిశ్చయము. పశువుల మేతకు సరియగు సదుపాయములు చేయకుండినచో పశుసంతతి నేటికంటెను బలహీనమై కొలది కాలములోనే క్షీణించి నశించిపోవును. మేతకు వలయు బీడు లేర్పఱచుట అసాధ్యమగుటచే ప్రస్తుతపు పంటలలో మేతకు వలయు పంటల నధికముగ వేసి, పండించి మేతకై వినియోగింపవలెను. నూనెవిత్తులు మొదలగు ముడిదినుసులు విదేశముల కెగుమతి జరుగకుండ నిషేధింపబడినచో పశుసంతతికి ఆహారము సరిపడును.

విదేశముల పశుసంతతి, హిందూదేశపు పశుసంతతి.

హిందూదేశమునందు వలెనే హాలెండునందు పశుసంతతి హెచ్చుగలదు. ఈజిప్టునందు పశుసంతతి అత్యల్పము. కాని హిందూదేశమునందు వలెనే ఈజిప్టునందుగూడ వ్యవసాయమునకు పశుసంతతి అత్యవసరము. అందుచేత నీదేశములతో హిందూదేశమును పోల్పవచ్చును.

| | | పశువులు |
|---|---|---|
| [1]బ్రిటిషుఇండియా 100 ఎకరముల సాగుబడి భూమి 1 కి | | 67 |
| హాలెండు పల్లపు సాగునకు | ఎ 100 కి | 38 |
| ఈజిప్టు పల్లపు సాగునకు | ఎ 100 కి | 25 |

1. *Agricultural Commission's Report P. 188.*

## మిలియనులు.

| [1]దేశము | సాగుబడికి తగిన భూమి ఎకరములు | పశుసంతతి సంఖ్య | 100 ఎకరముల సాగుబడి భూమికిగల పశువుల సంఖ్య |
|---|---|---|---|
| జర్మనీ | 50.7 | 18.4 | 32 |
| ఆస్ట్రియా | 4.8 | 2.2 | 46 |
| డెన్మార్కు | 6.9 | 3.1 | 45 |
| స్పెయిను | 39.8 | 3.7 | 10 |
| ఫ్రాన్సు | 54.8 | 15.6 | 28 |
| గ్రేటుబ్రిటను | 12.6 | 7.1 | 56 |
| హంగెరీ | 13.8 | 1.8 | 13 |
| ఇటలీ | 34.1 | 6.9 | 20 |
| నీదరులాండ్సు | 2.3 | 2.4 | 104 |
| పోలెండు | 45.6 | 9.4 | 21 |
| రొమేనియా | 31.8 | 4.0 | 13 |
| స్విజర్లాండు | 1.2 | 1.6 | 133 |
| జికోస్లావోకియా | 14.4 | 4.5 | 31 |
| రష్యా | 246.2 | 52.6 | 21 |
| యుగోస్లావియా | 17.5 | 3.8 | 22 |
| కనడా | 62.4 | 8.9 | 14 |
| అమెరికా | 355.8 | 59 | 17 |
| అర్జెంటేనా | 64.0 | 32.2 | 50 |
| జపాను | 14.4 | 1.5 | 10 |
| ఈజిప్టు | 8.5 | 1.6 | 19 |
| దక్షిణాఫ్రికా | 9.3 | 10.7 | 116 |
| ఆస్ట్రేలియా | 30.4 | 11.2 | 37 |
| న్యూజిలాండు | 2.0 | 3.8 | 190 |
| బ్రిటిషుఇండియా | 308.7 | 154.6 | 50 |

1. *From Indian Finance Year Book P, 321.*

ఈఅంకెల ననుసరించి హిందూదేశమున సాగుబడిభూమి ఎ 100 కిని గల 50 పశుసంతతియు నితరదేశములతో పోల్చిచూచిన 6 వ స్థానమునందు గలదు. మిగిలిన 18 దేశములయందును సాగుబడి భూమి 100 ఎ॥ లకును గల పశుసంతతి హిందూదేశమునందుగల రీతిని అధికముగలేదు. అమెరికాదేశమునకు పిమ్మట సాగుబడిభూమి హిందూదేశమునందే హెచ్చు గలదు. అందుచే సాగుబడిభూమియు హెచ్చుగ గలదు. పశుసంతతియు హెచ్చుగ గలదు.

హాలెండునందు గుఱ్ఱములును, ఈజిప్టునందు గాడిదలును, వ్యవసాయమునం దుపయోగింపబడుచున్నవి. ఈజిప్టునందు గేదెలు హెచ్చు.

| 1. దేశము | పశువులు | గొఱ్ఱెలు | జనసంఖ్య | తలకి |
|---|---|---|---|---|
| ఇంగ్లండు 1922 | 4.9 మిలియనులు | 10మి. | 26మి. | 0.3 |
| బ్రిటిషుఇండియా 1919-20 . | 145.0మి | 46మి. | 247మి. | 0.6 |
| జర్మని 1912 | 20.0మి | 5మి. | 80మి. | 0.2 |

ఈఅంకెల ననుసరించి పశుసంతతికి లోటులేదనియు, పశుసంతతి యొక్క-శక్తి నభివృద్ధిపరచుటయే మనకర్తవ్యమనియు సుబోధకమగుచున్నది. ఇందులకు పశుసంతతి శక్తిహీన మగుచుండుటకుగల కారణములనరసి వాటిని తొలగించుట మొట్టమొదటి పని. వ్యవసాయాభివృద్ధికి భంగములేకుండ పశుసంతతిని తగ్గించి బలవంతమగు సంతతికై ప్రయత్నించుట రెండవపని.

**పశుసంతతిని తగ్గించుటకు మార్గములు.**

1. ఏజిల్లాలో వ్యవసాయపుబత్తడి హెచ్చుగనుండునో ఆజిల్లాలో ఎద్దులు హెచ్చుగ కావలసియుండును. ఎద్దులు హెచ్చుగ కావలసియున్నపుడు పశుసంతతిని హెచ్చుగ పోషించుచు, పాలింపవలసియుండును. ఇందుచేత పశుసంతతి వృద్ధియగుచుండును. పశుసంతతి వృద్ధిఅయిన

1. *From Economic Development of India P. 171.*

కొలదియు మేతతగ్గిపోవుచుండును. మేతతగ్గి పశుసంతతి నీరసించినకొల దియు క్రొత్తపశువులకై ఆవులను పోషించుటయు వృద్ధియగుచుండును. వ్యవసాయము హెచ్చినకొలదియు, మేతబీడులు తగ్గుచు మేత తక్కువ యగుటయేకాక పశుసంతతి హెచ్చినకొలదియుకూడ సంఖ్యనుబట్టి మేతతగ్గిపోవును. ఈస్థితి సుడివలెనున్నది. ఒకచెడుగును మరొకచెడుగు చుట్టుచున్నది. ఈస్థితి తొలగుటకు వ్యవసాయమునకై ఎద్దుల అవసర మును తగ్గించివేయవలెను. ఎద్దులఅవసరమును తగ్గించినకొలదియు పశు సంతతిని హెచ్చుగ పోషింప నవసరముండదు. పోషింపవలసిన యవ సరముకూడ తగ్గును. అప్పుడు మేతకు కొదువరాదు. ఎద్దులఅవసరము తగ్గించుటకుగాను నూతనయంత్ర సహాయమున వ్యవసాయమును మొదలుపెట్టుటయే కర్తవ్యము. వేరొకమార్గము గోచరింపదు.

2. హిందూదేశమున రైతు కడుబీదవాడుగనున్నాడు. ఈబీద రికమున విఖండములను వ్యవసాయము చేయవలసివచ్చుటచే వ్యావ సాయపుఖర్చు లదనముగనున్నవి. నాగలికి పనికివచ్చు ఎద్దులను పో షించుటకు ఖర్చు హెచ్చు. పంజాబు లాల్‌పూరు జిల్లాయందు (Lyallpur) 111 ఎకరముల వ్యవసాయమును కూలీలచేత చేయించుటకు 13 ఎద్దులు పోషింపబడినవి. వీటికి మొదటిసాలున రు 271/లును, రెండవసాలున రు 283-3-0 ను వ్యయమాయెను. సగటున ఎ 1 కి ఎద్దులవ్యవసాయమునకు రు 16-9-0 వ్యయపరుపబడెను. ఎ 46½ల వ్యవసాయమునకు (ఉమ్మడి) నాలుగుఎద్దులు పోషింపబడినవి. జత 1 కి రు 338 లు పోషణకు ఖర్చుపడెను. ఎ 1 కి ఎద్దులతో వ్యవసాయము నకు రు 14-9-0 ఖర్చుతేలెను. ఇట్లు ఎద్దుల పోషణకు ఖర్చు అదన ముగనగుటకు హెచ్చుభూమిని 1 జతఎడ్లతో వ్యవసాయముచేయుటయే కారణము,

ఈదిగువపట్టిక ఏరోగమువలన నెన్ని పశువులు మరణించినదియు తెలుపగలదు.

1. (వేలలో) '000'

| | 1923-24 | 1924-25 | 1925-26 | 1926-27 |
|---|---|---|---|---|
| Rinderpest పెద్దరోగము | 94.3 | 155.5 | 275.9 | 202.2 |
| Haemorrhagic Septicaemia గురక రోగము * | 41.2 | 32.7 | 38.8 | 36.4 |
| Foot & Mouth diseases కాలికి, నోటికి వచ్చు రోగములు-గాళ్ళు | 9.4 | 12.6 | 19.9 | 13.6 |

ఈ అంకెలు పశుమరణముల నన్నింటిని తెలుపజాలవనియు, మరణములసంఖ్య ఇంతకంటెను చాల అధికముగ నుండుననియు వ్యవసాయ విచారణ సంఘమువారు వ్రాసిరి. ఈఅంకెల ననుసరించి గూడ ఆయేటికాయేడు మరణములసంఖ్య హెచ్చుచున్నటుల తెలియుచున్నది. మఱియు పశుమరణములవలన రైతు నష్టపడుటయే గాక రోగము తగిలి కుదిరినను 100 కి 70 పెద్దరోగము తగిలిన పశువులు జీవచ్ఛవములైపోవును. ఇందువలన కలుగుచున్న నష్టమెంతయో కలదు. ప్రతిసాలున రైతులు నాలుగుకోట్ల రూపాయల విలువగల పశువులను కొనుచుందురని పంజాబు దేశమునందలి మదింపు ననుసరించి వ్యవసాయ విచారణసంఘమువారు నిర్ణయించిరి. రైతులు పశువులను కొనుటకై చేయు ఋణమంతయు పశురోగముల వలన గలిగిన నష్టమేయని వ్యవసాయ విచారణసంఘమువారి నిర్ణయము.

1. *From Agricultural Commission's Report P. 278.*

* దీనినే గొంతుకవాపు, గొంతుకమాద, గుదిపెట్టు, నేరీడి గుణము అని పలుతెఱంగుల చెప్పుదురు.

ఈ దిగువపట్టిక ననుసరించి రైతులు పశువులను కొనుటకై చేయుచున్న ఋణమును గ్రహింపగలము.

| రాష్ట్రము | 1924-25వసం॥ తీసికొనినఋణము లక్షలలో | మొత్తముఋణములో 100 కి ఎన్ని వంతులు. | 1925-26వసం॥ తీసికొనినఋణము లక్షలలో | మొత్తపు ఋణములో 100 కి ఎన్ని వంతులు. |
|---|---|---|---|---|
| బీహారు, ఒరిస్సాలు | 7.33 | 13.0 | 9.25 | 11.0 |
| మదరాసు | 11.91 | 7.5 | 11.85 | 7.0 |
| పంజాబు | 32.95 | 20.75 | 37.52 | 20.5 |
| సంయుక్తరాష్ట్రములు | 18.03 | 37.7 | 16.49 | 36.7 |

రోగముల అన్నిటికంటెను భయంకరముగ పశుసంతతిని పెద్ద రోగము పీడించుచున్నది. పశురోగములను నిరోధించుటకు ప్రభుత్వ శాసనములు అవసరమని వ్యవసాయ విచారణసంఘమువారు వ్రాసిరి. మదరాసులో గావింపబడిన 1866 వ సంవత్సరపు పశురోగశాసనము (Cattle Diseases Act) ఆచరణయందు నిరుపయోగముగ నున్నది. బర్మాయందు గూడ 1914 వ సంవత్సరమునం దిట్టి శాసనము గావింపబడెను. భారతదేశమున కంతకును గలిపి పశురోగ నిరోధ శాసనమనుపేర నొక శాసన మొనరింపవలెనని వ్యవసాయ విచారణ సంఘమువారి సూచన. రోగములు తగిలిన గొడ్లను ప్రత్యేకించి వేయుట, చికిత్సను చేయించి తీరవలెనుట, రోగములు తగిలిన వెంటనే చికిత్సాలయములకు గొనిపోవుట, లేక వైద్యులకు నివేదించుట మొదలగు పనులను విధి యొనరింపవలెను.

కాని, యీవిధి నిషేధములన్నియు తగినంతమంది పశురోగ వైద్యులు లేకపోయినచో నిరుపయోగమగును. పశురోగ చికిత్సాలయములు పెట్టకపోయినచో వ్యర్థమగును. పశురోగవైద్యులు యితర వైద్యులవలె లేరు.

ప్రభుత్వము వారిచే మాత్రమే కొలదిమంది నియమింపబడిరి. "వీరిసంఖ్యను పశువులసంఖ్యతో పోల్చిచూచిన నూరువేలపశువులకు ఒకవైద్యుడుచొప్పునగలడు. ఈయుద్యోగస్థులలో ప్రతి 15 మందికి 1డు మాత్రమే పశురోగచికిత్సావిధానమును శాస్త్రసమ్మతముగ చేయగల సర్జనుగలడు. మిగిలినవారు అసిస్టెంటుసర్జనులుగ మాత్రమేయున్నారు." అని వ్యవసాయసంఘమువారు వ్రాసిరి. హిందూదేశమొత్తమున కేంద్ర శాఖలో (Indian Veterinary Service) 32 సర్జనులు గలరు. రాష్ట్ర శాఖలో (Provincial Veterinary Service) 52 గలరు. 1927 లో పశు వైద్యశాఖయందు యినస్పెక్టరులు, అసిస్టెంటు సర్జనులు గలిసి 1400 మాత్రమే గలరు. 33 మంది గెజెటెడ్ ఉద్యోగస్థులు మాత్రమే పశురోగముల చికిత్స చేయగలరు. పశురోగ వైద్యాలయములు 1926-27 వ సంవత్సరమునం దిట్లు గలవు.

| | | | |
|---|---|---|---|
| పంజాబునందు | ... | ... | 219 |
| సంయుక్త రాష్ట్రమున | ... | ... | 149 |
| బీహారు, ఒరిస్సాలు | ... | ... | 122 |
| బొంబాయి | ... | ... | 122 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | | ... | 94 |
| మదరాసు | ... | ... | 87 |
| వంగము | ... | ... | 47 |
| అస్సాము | ... | ... | 45 |
| పశ్చిమోత్తర పరగణాలు | | ... | 19 |
| బర్మా | ... | ... | 5 |

ఈ వైద్యాలయములు జిల్లా ముఖ్యస్థానములు మొదలగు చోట్ల నెలకొల్పబడుచున్నవి. అత్యల్పసంఖ్యగ నుండిన యీ వైద్యా

లయములు గూడ ప్రజల కందుబాటులో లేవు. ఈ అంకెల ననుసరించి పశురోగచికిత్సకు తగు సదుపాయములు లేవనుట నిర్వివాదము. ఈకొఱతను గుర్తించి పశురోగవైద్యుల సంఖ్యను హెచ్చించుటయును వైద్యాలయములను హెచ్చించుటయును ముఖ్య కర్తవ్యములు.

"ప్రతి 25000 పశువులకు ఒక పశురోగవైద్యుని (అసిస్టెంటు సర్జనుని) నియమింపవలెను. జిల్లా 1 కి ఒక సర్జనుని నియమింపవలెను. అనగా హిందూదేశమొత్తమున సుమారు 400 మంది సర్జనులను 7500 మంది అసిస్టెంటు సర్జనులను నియమింపవలెను." అని వ్యవసాయ విచారణసంఘమువారు వ్రాసిరి. ఇంతమంది యుద్యోగస్థులను తయారు చేయవలెనేగాని విదేశములనుండి దిగుమతిచేయరాదు. పశురోగ చికిత్స విద్యాభ్యాసమునకు వసతులు గల్పింపవలెను. వైద్యవిద్యాకళాశాలలవలె పశురోగ వైద్యవిద్యాకళాశాలలనుగూడ విరివిగా స్థాపింపవలెను. ఇతరవైద్యులవలె పశురోగవైద్యులుగూడ విరివిగ వ్యాపించుటకనువగు సదుపాయముల నొనరింపవలెను. ఉపకార వేతనముల నొసంగియైన పశురోగవైద్యులను సృష్టింపవలయును. పశురోగవ్యాప్తిని నిరోధించుట, రోగములకు చికిత్సచేయుచుట అత్యావసరవిషయములు. నేటివఱకు రైతులు సాంప్రదాయానుగుణ్యమగు వైద్యమునే చేసికొనుచున్నారు.

4. ఆవులను పోషించుటకై రైతు ఊరూరు దిరుగాడుచున్నాడు. ఎక్కడ ఏఆబోతు లభించినను వివక్షతలేక ఆవును వదలుచున్నాడు. ఎడ్లపై రైతు ఆధారపడుచుండుటయే యిందులకు కారణము. నూతనయంత్రసహాయమున ఎడ్లపై ఆధారపడవలసినస్థితి రైతునకు తొలగించివేయుచో గోవులను పోషించుటలో రైతు వివక్షత వహింపగలడు. మఱియు మేలైన ఆబోతులను రైతులకందుబాటులో

కొలది వ్యయపరచి పెంచుట ఆర్థికాభివృద్ధికరముకాదు. వీటికై విని యోగించు మేత లాభకరముగ నుపయోగించి దేశమునకుపయోగించు గోసంరక్షణ చేయవచ్చును. గోసంరక్షణయన చావనున్నవాటిని అన వసరముగ పోషించుటకాదు. బలకరమగు ప్రశస్తమైన గోసంతతి నుద్భవింపజేయుటకై ప్రయత్నించుటయే గోసంరక్షణ. ప్రశస్తమగు ఆబోతులనుపెంచుచు, నుత్తమజాతి గోసంతతి జనించుటకై గోసంర క్షణశాలలు ప్రయత్నింపదగును. ఆవులను బాగుగపోషించుచు, వాటి పాలను వృద్ధిజేయుటకై ప్రయత్నింపవచ్చును. ఆవుపాలను ప్రజలకు చౌకగ లభింపజేసి జాతీయశక్తిని పెంపొందించుటకు బూనవచ్చును. గోసంరక్షణశాలలిట్టి సత్కార్యము లొనరింపజాలకపోయినచో నేడు చేయుచున్న పనిని మాత్రము కొనసాగించుట దేశారిష్టకరము. పశు సంతతికి మేతచాలక పశువులు క్షీణించుచున్న దేశమున రోగముల పాలైన పశువులను, ముసలిపశువులను పోషించుటవలన మేత అనవ సరముగ వ్యయమై దేశమునకనర్థము సంభవించుచున్నది. పాటునకు గాని, పాలనొసంగుటకుగాని పనికిరాని పశువులను పోషింపరాదను నిషేధశాసనము గావించుటకూడ సమంజసమే. ఏపశువులు పోషింప దగినవియు వ్యవసాయశాఖవారు లైసెన్సుచేయునట్టి శాసనమొనరింప దగును. ఇట్టి విధినిషేధములను గల్పించి సంఘాదాయమును పెంపొం దింపజాలని పశుపోషణను విరమింపజేయవలెను.

•

కఱవులు వచ్చుచు, రోగములు వచ్చుచు నడీకారులో నున్న పశువులే వేనకువేలు చనిపోవుచున్నవి. మేత చాలక, రోగములను నిరోధించుకొను శక్తి పశుసంతతిలో గూడ క్షీణించి నడివయసు నందే చనిపోవుచున్నవి. ఇట్టి పశువులకు అధికాహారము లభింపజేసి శక్తి నభివృద్ధిపరచుటయే అత్యవసరము. ఇందులకు మూరుగ మేతను

నిరుపయోగమగు పశువులకై ఖర్చుపెట్టనీయరాదు. కాని "ఆర్థికాభి వృద్ధికిని, మత విశ్వాసమునకును నీ విషయమునందు పరస్పర సంఘర్షణ గలిగినది. ఆర్థికాభివృద్ధికి వలయు దృష్టితోనే ఈ సమస్యను గుర్తించి పరిష్కరింపవలసి యున్నది......గోవధను నిషేధించుచు శాసన మొనరింపవలెనని కొందరు హిందువులు కోరుచున్నారు. ఇది ఆచరణీయము గాదు. ఆచరింపవలసినదియును గాదు. ఇందులకు ఆర్థికవాదమే కారణము. సక్రమముగ సంరక్షింపబడుచుండిన గోసంతతియు సరియగు వంగడమునకు పుట్టిన గోసంతతియు కొలదిగ నున్నను మేలే. నిరుపయోగమై ఆహారములేక మాడు పశువుల సంఖ్య అధికముగనున్నను ఫలితము లేదు. కాని గోవధ చేయుటయందు బలమగు పశువులను అవసరమగు పశువులను గూడ విడుచుట లేదు. అందుచే ఉచితానుచితములను గమనింపక చేయు గోవధను శాసన రూపముగ నిషేధింప తగును." అని వామన గోవింద కాళీగారు వ్రాసిరి.[1]

ప్రజలలో చాలమంది మాంసమును తినువారుగలరు. మాంస భక్షణ యుండుటవలననే ఆవులు, ఎడ్లు వధ్యశాలకు పోవుచున్నవి. మఱియు వీటిని పోషించుటకు రైతు శక్తిహీనుడై యుండుటవలన కటికివానికి చౌకగ నమ్మివేయుచున్నాడు. ఇట్లు అమ్ముటయు కొనుటయు నీ రెండునుగూడ ఆర్థికసిద్ధాంతమున కనుగుణ్యముగనే యున్నవి. మతవిశ్వాసము కొంతకాలమువఱకు నుద్రేకోత్సాహముల పురికొల్పుచు పోషింపగలదు. కాని ఆర్థికవృత్తిని తారుమారు చేయజాలదు. అందుచే గోవధనుపూర్తిగ నిషేధింపతగదు. కాని, బొంబాయి వంటి ప్రదేశములలో పాలిచ్చుట మానినవెంటనే పడుచు ఆవులను, చూడితోనున్న ఆవులనుగూడ వధ్యశాలకు పంపుచున్నారు. ఇది

1. *From Indian Economics P. 146. Vol 1. By. Mr. V. G. Kāle*

కూడని పని. ఆర్థికముగ లాభకరము గాదు. అందుచే, ఈతల ఈనదగిన గోవులను, ఈనుటకు సిద్ధముగనున్న గోవులను వధింపరాదని నిషేధించుట అవసరము.

మతముకొఱకు గోవధను చేయనిచ్చుటగాని (మహమ్మదీయులు పండుగలలో చంపుచున్నటుల) మతముకొఱకు గోవధను నిషేధించుట గాని (హిందువులు కోరుచున్న రీతిని) హర్షింపదగిన పనులు గావు. ఆర్థికముగ లాభకరములును గావు. జవసత్వములు గలిగియుండి, మఱి కొన్ని యీతలవఱకు నుపయోగించు గోవులను వధించుటయు, నిరుప యోగముగనుండు ముసలిగోవులను పోషించుటయు నీ రెండుపనులను శాసనరూపముగ నిషేధింపవలయును.

**ఆవుపాలను పితుకుయంత్రము.** వ్యవసాయమునకు నూతనయంత్రముల నెట్లు వినియో గింపవలసియున్నదో పాలను దీయుటకుగూడ నూతన యంత్రముల నుపయోగింపదగును. అమెరికా దేశము నందు యంత్రసహాయముననే పాలను రైతులు పితుకుచున్నారు. "అమెరికా దేశముననందలి పాలనుపితుకు చేతియంత్రములు గం 1కి 250 పౌనుల పాలను పితుకుచున్నవి. మఱికొన్ని యంత్రములు గం 1 కి 800 పౌనుల పాలనుగూడ పితుకగలవు. పాలనుండి వెన్నను తీయుటకుకూడ యంత్రములుగలవు. ఇట్లు యంత్రములవలన తీసినపాలనే దూడలకు కూడ పోయుదురు......

బాగుగ పోషింపబడిన ఆవు అమెరికా దేశమునందు 20 మొదలు 30 పౌనుల పాలవఱకు ప్రతిదినమున ఒసంగును. ఈ పాలలో ఒక పౌను వెన్న లభించును.........

అమెరికా దేశమునందు 20000000 ఆవులుగలవు. సాలుసరి వీటి పాలు, వెన్న రు 2025000000 ల విలువయుండును. వీటివలన సాలుసరి

రు 600000000 లు మొదలు రు 800000000 ల వఱకు లాభము వచ్చుచున్నదని గ్రహింపవలెను........

అయిదు ఆవులు గల రైతు ఒక ఆవును అమ్మివేసి పాలను పితుకు యంత్రమును కొనుట మంచిది. నాలుగు ఆవులపాలను యంత్రముతో పితికి వెన్న తయారుచేయుచుండినచో, పూర్వపు పద్ధతులకంటె లాభకరముగనుండును. అమెరికా దేశమునందు క్రొత్తపద్ధతుల ననుసరించి మంచిఆవు సాలుసరి రు 260 ల నికరాదాయము నొసంగగలదు."[1]

ఇట్లే భారతదేశమునందుగూడ పాలను పితుకు యంత్రము నుపయోగించి లాభము తీయుటకై ప్రయత్నింపదగును. "పాలను, వెన్నను అమ్ము పరిశ్రమకు హిందూస్థానమున జయప్రదమగు స్థానముగలదు. ఈపరిశ్రమ యేఒకరాష్ట్రమునందుగాని ఏఒకప్రత్యేక ప్రదేశమునందుగాని మాత్రమే నెలకొల్పవలెనని ప్రయత్నింపరాదు. ఆవు లెచ్చటెచ్చట గలవో, ఆయాతావులయందెల్ల పాలను, వెన్నను పరిశ్రమగ తయారుచేయునట్లొనరింపదగును" అని (Imperial Dairy Expert) యీ పరిశ్రమపై పరిశోధనలు సలుపుచుండిన కేంద్ర ప్రభుత్వ నిపుణుడు తెలిపెను. ఇట్లు భారతవర్షమునందంతట ఈపరిశ్రమ అభివృద్ధిపరచుటకు నలయు నూతన యంత్రములను అమెరికా దేశమువలె నుపయోగింపవలెను.

## 13 అడవుల యుపయోగము.

అడవులపోషణ, యభివృద్ధి, అడవుల యుపయోగము వ్యవసాయమున కత్యంతప్రాముఖ్యములు. ఈ అడవులనుండివచ్చు కలప, వంట చెరుకు, అడవియందుదొరికెడి యితరపదార్థములు సహజముగ ప్రజ

1. *From the Improvement of Indian Agriculture. Some lessons from America p. 141 to 157 By Mrs, Saint Nihal Singh.*

| 1 రాష్ట్రము | రాష్ట్ర విస్తీర్ణము | అడవుల విస్తీర్ణము చ. మై. | | | | 2వ శీర్షికతో 6వ శీర్షికను పోల్చుచో 100కి ఎన్ని వంతులు? | అడవుల ఫలసాధనము. | |
|---|---|---|---|---|---|---|---|---|
| | | 1వ తరగతి ప్రత్యేకింపబడినవి. | 2వ తరగతి సంరక్షింపబడినవి. | 3వ తరగతి ఇతరములు. | మొత్తము | | కలప,వంట చెరకు | ఇతరములు. రు. |
| | | | | | | | (Cu. ft.) | |
| మదరాసు | 142835 | 18968 | ... | 176 | 19139 | 13.4 | 24502000 | 1866906 |
| బొంబాయి | 123251 | 13717 | 1160 | ... | 14877 | 12.1 | 44024000 | 1844284 |
| వంగము | 76854 | 6506 | 678 | 3445 | 10624 | 13.8 | 25204000 | 559110 |
| సంయుక్త రాష్ట్రములు | 106720 | 5182 | 4 | 54 | 5240 | 4.9 | 31318000 | 1568452 |
| పంజాబు | 96830 | 1534 | 3206 | 552 | 5292 | 5.4 | 29686000 | 1923924 |
| బర్మా, షాన్ స్టేట్సు, కరేని | 243515 | 33008 | ... | 114025 | 147033 | 60.3 | 97068000 | 899109 |
| బీహారు, ఒరిస్సా | 83083 | 1799 | 1220 | 3 | 3022 | 3.6 | 10468 | 243858 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 99955 | 19618 | ... | ... | 19618 | 10.6 | 36669000 | 2902547 |
| అస్సాము | 55156 | 6153 | ... | 14829 | 20982 | 38.0 | 15400000 | 752541 |
| పశ్చిమోత్తరపరగణాలు | 13183 | 245 | ... | ... | 245 | 1.8 | 3224000 | 94828 |
| బెలూచిస్థానము | 54228 | 316 | ... | 472 | 788 | 1.4 | 410736 | 60174 |
| అజ్మీరు, మార్వారా | 2767 | 141 | ... | ... | 141 | 5.1 | 477819 | 51081 |
| కూర్గు | 1582 | 519 | ... | ... | 519 | 32.8 | 458188 | 21552 |
| అండమాను దీవులు, నైకోబారు | 3143 | 52 | ... | 2138 | 2190 | 69.6 | 3934586 | 8498 |
| మొత్తము | 1102602 | 107753 | 6263 | 135694 | 249710 | 22.6 | 322852829 | 12586854 |

1. *From Statistical Abstract for British India 1930—31.*

(3) నిబంధనలులేని అడవులు. (Unreserved) or unclassed. 1929-30 వ సంవత్సరమున 1 వ తరగతి అడవులు 107353 చతురవు మైళ్ళు విస్తీర్ణమును రెండవ తరగతి అడవులు 6298 చ॥ మై॥ విస్తీర్ణ మును మూడవ తరగతి అడవులు 135503 చ॥ మై॥ విస్తీర్ణమును గలిగి యున్నవి. పై పట్టిక వలన ఏరాష్ట్రమునం దేతరగతి అడవుల విస్తీర్ణ మెంత గలదో తెలిసికొనగలము. (1930-31).

నిబంధనలు గలిగి ప్రత్యేకింపబడిన అడవులలో ప్రభుత్వము వారి అనుజ్ఞ గైకొనక చేయు నేపనియైనను నేరమే. సంరక్షింపబడు చుండిన అడవులలో ప్రత్యేకముగ నిషేధింపబడిన కృత్యము లొనరించుచో నేరమగును. ఇతరములు లేక నిబంధనలు లేని అడవులు కొండలయందున్నవి. ముఖ్యముగ బర్మా, అస్సాము, బెంగాలు రాష్ట్రములయందు గలవు. ఈ అడవులలో సహజసంపద చాల గలదు. అన్వేషింపవలసియున్నది.

1921 వ సంవత్సరము వఱకు అడవులశాఖ భారత ప్రభుత్వ నిబంధనల ననుసరించి రాష్ట్రప్రభుత్వములచే పరిపాలింపబడుచుండెను. 1921 వ సంవత్సరము నుండియు రాష్ట్రప్రభుత్వములకే సంపూర్ణాధి కారము గలదు. వీటిపై ఖర్చు సంవత్సరాదాయమునుండి పెట్టబడు చున్నది. 1900 వ సంవత్సరమునుండియు ఖర్చులకంటె ఆదాయమే చాల హెచ్చుగ నున్నది. ఈయడవులపరిపాలన శాస్త్రసమ్మతముగ గమనింప జూచుచో, నాదాయమునకై చూడక పెట్టుబడి విస్తారముగ పెట్టవలసియున్నది.

[1]ఈ దిగువపట్టిక ననుసరించి హిందూదేశమొత్తమున అడవులమీద ప్రభుత్వమునకువచ్చుచున్న ఆదాయవివరములను తెలిసికొనగలము.

| | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 |
|---|---|---|---|---|---|
| ఆదాయము | 61884248 | 60779782 | 57869552 | 61251357 | 47884396 |
| వ్యయము | 34784624 | 33871542 | 33354224 | 34752851 | 33993219 |
| నికరలాభము | 26999624 | 26908190 | 24515328 | 26498506 | 28841177 |

[2]ఈ దిగువపట్టిక మదరాసు రాజధానియందు అడవులపై ప్రభుత్వమునకు వచ్చుచున్న ఆదాయ వ్యయ లాభములను దెలుపగలదు.

మ ద రా సు రా జ ధా ని.

| | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 |
|---|---|---|---|---|---|
| ఆదాయము | 5623959 | 5344431 | 6154768 | 6355921 | 5269087 |
| వ్యయము | 4451726 | 4231190 | 4189382 | 4381358 | 4250108 |
| నికరలాభము | 1172233 | 1113241 | 1965286 | 1974563 | 1018979 |

*1, 2. From Statistical Abstract for British India 1930—31.*

ఈఆదాయమునకై గమనింపక, అడవుల నభివృద్ధిపఱచుటకు మారుగ, అడవులవలన రాబడి మార్గములు అన్వేషింపబడుచున్నవి. ఈఅడవులమీాద వచ్చుచుండిన రాబడినైనను అడవులయభివృద్ధికి వినియోగించుటలేదు. అడవులు నశించిపోవుచున్నవి. వీటిపరిపాలన యన్ననో, ప్రజలకు కష్టముగ నున్నది.

అడవులగ్రామ పంచాయితీలు.

ప్రజలకు అడవులపరిపాలన లాభదాయకముగ నుండుటకు, ఆయా అడవుల పరిపాలన పరిసరగ్రామముల కొసంగుటయే మంచిపని. మదరాసుప్రభుత్వము అడవులపంచాయితీలను స్థాపించుచున్నారు. ఈ పంచాయితీలను రెవెన్యూబోర్డువారి అధికారమునకులోబడి పంచాయితీల ఆఫీసరు పరిపాలించుచున్నాడు. బోర్డువారు ఆయా గ్రామపంచాయితీల సరిహద్దులలో మేపుకొనవలసిన పశువులసంఖ్యను ఆ పంచాయితీవారు చెల్లింపవలసిన రుసుమును నిర్ణయించుచుందురు. ఇతర విషయములలో పంచాయితీలే పరిపాలించుట కధికారము గలదు. కొన్ని పంచాయితీలకు రుసుము నిర్ణయింపబడుట లేదు. కొన్నింటికి అడవులశాఖవారివలన పరిపాలింపబడినప్పటి ఆదాయముకంటె తక్కువగ నిర్ణయింపబడుచున్నది. కొన్ని పంచాయితీలకు మూడు సంవత్సరములవఱకు మాత్రమే రుసుము నిర్ణయింపబడినది. 1923 వ సంవత్సరము నుంచియే యీ పంచాయితీలకు అడవుల నొసంగుచున్నారు. సుమారు 3200 చ॥ మై॥ విస్తీర్ణముగల అడవులను పంచాయితీల వశమొనరించిరి. సంయుక్తరాష్ట్రములలోను, బొంబాయి రాష్ట్రమున, మధ్యపరగణాల లోను మదరాసువిధానము ననుసరింపవలెనను సంకల్పము కలదు. పంజాబునందీవిధాన మాచరణీయము కాదని తలంపబడెను. ఒక రాష్ట్రమునకును మరొక రాష్ట్రమునకును అడవులపరిపాలనయందనేక తార

భక్షింపబడును. చేపల యభివృద్ధిని సంరక్షణను శాస్త్రోక్తముగ జేయుటకు విశేష కృషి సలుపబడుటలేదు. మదరాసులో 1905 వ సంవత్సరమున, వంగ బీహారు ఒరిస్సాలలో 1906 వ సంవత్సరమున, పంజాబులో 1912 వ సంవత్సరమున చేపలశాఖలు స్థాపింపబడెను. బొంబాయి రాష్ట్రమునందు చేపలశాఖపరిశ్రమల శాఖవారిచే పరిపాలింపబడుచున్నది. మదరాసు రాజధానియందు చేపలశాఖ యితర రాష్ట్రములకంటె కొంచెము బాగుగ పనిచేయుచున్నది. ఈశాఖవారిచే చేపనూనెయు, చేపనూనెతో సబ్బులును తయారుచేయబడుచున్నవి. ఈశాఖవారు చేప ఎరువును రైతులకు సులువుగ లభింపజేయుటకు విశేష కృషి సలుపుట లేదు. ఈశాఖ సక్రమమగు కృషి సల్పినదనుట సాహసమగును. ప్రభుత్వమువారి నిర్లక్ష్యమునకు గురియైన విషయములలో చేపల సమస్య ప్రధానస్థానము వహించు ననదగును.

## 15. హక్కు, బేహక్కులు.

వ్యవసాయాభివృద్ధికి సేద్యము చేయబడు భూములలో వ్యవసాయదారులకు గల హక్కు బేహక్కుల నిర్ణయముకూడ నొక ప్రాముఖ్య విషయము. వ్యవసాయదారులకు భూములయందన్ని ప్రాంతములయందు ఒకే విధమగు హక్కులు లేవు. ఈస్టిండియా కంపెనీ రాజ్యాధికారము వహించినది మొదలు తన రాజ్యాధికారము సుస్థిరముగ నుండుటకై ఏప్రదేశములయందెట్లు ప్రవర్తింపవలయునో అట్టి నీతి నవలంబించెను. భూమియందు సర్వాధికారములు కర్షకుల కొసంగక భూకామందుతనము ప్రభుత్వమునదని నిశ్చయింపబడెను. ఈ నిర్ణయ ప్రకారము వ్యవసాయదారులు ప్రభుత్వమునకు కొంత రుసుము, పన్ను లేక పంటలో భాగము నొసంగవలయును.

కొన్నిచోట్ల ప్రభుత్వమునకు, వ్యవసాయదారులకు మధ్య మరియొక తరగతి ప్రజలను చొప్పించిరి. ఈస్టిండియా కంపెనీకి పూర్వపు రాజ్యాధికారములయందు పన్నులను వసూలుచేయు నధికారులు మొదలగువారికి, స్వదేశరాజులపై తిరుగబడి యీస్టిండియా కంపెనీ వారికి సహాయముచేసినవారికి భూకామందుతనమొసంగి వారివద్దనుంచి కొలదికప్పముల బుచ్చుకొనుచున్నట్లేర్పర్చుకొనిరి. నేడు ప్రభుత్వమునకును స్వయముగ వ్యవసాయముజేసికొను రైతునకును మధ్య జమిందారులు, భూకామందులు మొదలగు మధ్యవారు కలరు.

సనాతనకాలమునుండియు కర్షకులు పంటలో నొకభాగము ప్రభుత్వమునకిచ్చు నాచారము గలదు. మొత్తపుపంటలో ఆరవవంతు ప్రభుత్వమున కీయవలెనని మనుశాస్త్ర నిర్ణయము. యుద్ధములు మొదలగు విపరీతపరిస్థితులు సంభవించుచో పంటలో 4 వ వంతు ప్రభుత్వమున కొసంగవలెనని మనునిర్ణయము. ప్రభుత్వోద్యోగులు కుప్పలుగొట్టు కాలమున ప్రభుత్వభాగమును పంటనుండి తీసికొనెడివారు. ఇట్లిచ్చుట రైతులకు సదుపాయముగనే యుండెడిది. పంటననుసరించి ప్రభుత్వపు వరుమానము మారుచుండెడిది. మహమ్మదీయ కాలమునందిట్లు పుచ్చుకొనుపద్ధతి క్రమముగమారి నాణెములరూపముగ వసూలుచేయబడుట ప్రారంభింపబడెను.[1]

టైపూమారు తనకాలమున పంటలో భాగముపుచ్చుకొను ఆచారము నగదుగాపుచ్చుకొనునట్లుగ మార్చుటకు యత్నించెను. పిమ్మట

1. *See Taxation Enquiry Committee Report, para 153.*

1540-55 సంవత్సరములమధ్య షేర్షానవాబు యత్నించెను. అక్బరు కాలమున టోడరుమాల్ భూమిసిస్తు నిర్ణయము శాస్త్రయుక్తముగ నిర్ణయించెను. భూములుకొలువబడినవి. నాలుగుతరములక్రింద విభజింప బడినవి. మొత్తముపంటలో మూడవవంతునకుమారుగ దానికిమ్మాతు పుచ్చుకొనుటకై నిర్ణయింపబడెను. అంతకుపూర్వపు 19 సంవత్సరముల ఖరీదుల ననుసరించి మూడవవంతునకు సగటుఖరీదు నిర్ణయింపబడెను. నగదురూపముగ లేక పంటరూపముగ నిచ్చుటకు రైతునకే స్వాతంత్ర్య మొసగబడెను. ఈవిధముగ మహమ్మదీయ రాజ్యపరిపాలనయందు హిందూరాజుల పరిపాలననాటిపద్ధతులను మార్పలేదు. 1713 వ సంవత్సరప్రాంతమునకు మహమ్మదీయ కేంద్రప్రభుత్వాధికారము విచ్ఛిన్నమై స్థానికరాజ్యాధికారములు స్థాపింపబడినవి. ఈకాలమున భూమి పన్నునిర్ణయము వివిధగతుల మారినది. రైతు తనఆదాయములో 9వ వంతు నిచ్చుచుండెడివాడు. ఒకప్పుడు జిల్లాలను పరగణాలను వేలము వేసెడివారు. ఈవేలములో కొన్న హెచ్చుపాటదారుడు ముందుగ నాసొమ్మును ప్రభుత్వమునకిచ్చి తాను రైతులయొద్దనుండి వసూలు చేసికొనుచుండెడివాడు. హెచ్చువసూళ్ళను లాభముగ తీసికొనెడివాడు. ఇట్లు పన్నులను వసూలుచేసికొనెడివారే బంజరుభూముల నాక్రమించుకొనుచుండెడివారు. చుట్టుపట్లనుండు రైతులయొద్ద భూముల నెట్లో లాగుకొనెడివారు. లార్డుకార్న్‌వాలీసు పభుత్వమునాటికి వీరే భూకామందులుగ పరిణమించిరి. పన్నువసూళ్ళకై పాటలుపాడిన వీరు రాను రాను జమీందారులుగ మారిరి. తరతరములనుండి భూమినాశ్రయించియున్న సేద్యగాండ్రు తరిమివేయబడిరి. వారిహక్కులనన్నిటిని జులుం చేసి వీరు (ఈజమీందారు లనబడువారు) సంపాదించిరి. ఈస్థితి వంగ

దేశమునుండి ప్రాకి నానాఫర్నవీసు మరణాంతరమునుండియు మహారాష్ట్ర దేశమునకు దాపరించెను. రానురానీ యాచారము దేశమంతయు వ్యాపించినది. పంజాబు, సంయుక్తరాష్ట్రములలో కొంతవఱకు వ్యాపించినది. అక్బరుకాలమునాటి భూమిసిస్తు నిర్ణయవిధానమంతయు నిట్లు పటాపంచలై సేద్యగానికిని ప్రభుత్వమునకును మధ్య జమీందారులు భూకామందులనువారు పుట్టిరి. సేద్యగానికుండవలసిన హక్కులనపహరించిరి.

## 16. భూస్వాములు.

ప్రస్తుతము భూస్వామ్యము 3 విధములుగ నున్నది.

1. ఎస్టేట్లు:—వీటిపైన ఒకరుగాని కొంతమంది ఉమ్మడిదారులుగాని కలిసి కొంతమొత్తపుపన్ను నిచ్చుకొనవలెను. ఈపద్ధతి వంగదేశమున గలదు.

2. కట్టుబడిగ్రామములు:—అనగా చిన్న ఎస్టేట్లు. ఇవియు మొదటితరగతి ఎస్టేట్లవంటివేకాని వాటికిని వీటికిని కొన్ని భేదములు కలవు. ఈగ్రామపు యెస్టేట్లపై అధికార మొకభూస్వామిగాని కొందరు భూస్వాములు కలిసిగాని యనుభవించుచున్నారు. ఈయనుభవించు నందరిపైన కట్టుబడినిచ్చుకొను బాధ్యత కలదు.

3. రైతువారీ:—ప్రతిరైతు కొంతభూమి కలిగియుండును. ఎవరికివారే ప్రభుత్వమునకు పన్నునిచ్చుకొను బాధ్యతగూడ కలిగియుండును. ఈమూడురకముల భూస్వామ్యములు జమీందారీ, మహల్వారీ, రైత్వారీ పద్ధతులని పిలువబడుచున్నవి.

బేడెన్‌పవల్‌గారు రైతునకును ప్రభుత్వమునకును మధ్యగనిరికిన హక్కుదారుల నిట్లు వివరించెను.

బడినవి. మధ్యరాష్ట్రములలో 12 సంవత్సరముల కాలనిర్ణయము కొంత కాల మవలంబింపబడెను. పిమ్మట సంవత్సరమున కిచ్చుకొనవలసిన దానికి 2½ రెట్లు చెల్లించి భూస్వామ్యము గొనునట్లేర్పరచిరి. 1920వ సంవత్సరమున కొన్ని మార్పులు జరిగెను. రెండురకముల రైతుహక్కు లేర్పరుపబడినవి. రెండురకముల రైతులకు వినిమయాధికారము గలదు. మదరాసురాష్ట్రమున 1885 వ సంవత్సర వంగదేశశాసనము ననుసరించి 1908వ సంవత్సరమున ఎస్టేట్సులాండుఆక్టు గావింపబడెను. ఈశాసన మామోదించునాటికి జమీందారీ భూములలో గల రైతులకు (సొంతసాగులేని భూములకు) రైతుహక్కు లొసంగబడెను. రైత్వారీ భూములలో రైతులకెట్టి హక్కులుగలవో అట్టిహక్కులను జమీందారీభూములలో రైతులకు సంక్రమింపజేసెను.

ఈ శాసనము 1933 వ సంవత్సరమున మరల సంస్కరింపబడెను. ఈ సంస్కరణమున రైతు నూతన హక్కులనుగాని, జమీందారుల వలన పడు బాధలనుండి తొలగుట కవకాశములను గాని, పొందజాలకపోయెను. మదరాసు శాసనసభ జమీందారుల వంటయిల్లుగ మారుటయే యిందులకు కారణము. ప్రజానాయకులు రాజకీయ కారణమున శాసనసభలను బహిష్కరించుటచే, రైతును సంరక్షింపగలవారు శాసనసభయందు లేకపోయిరి. కాని పూర్ణమగు అగ్రహారం ఈనాములయందుగూడ రైతునకు భూస్వామ్యపుహక్కును కలిగించిరి. కుడివరం, మేలువరం హక్కులు రెండును గలవారినుండి వ్యవసాయపు హక్కును తొలగించుటవలన ఆర్థికవ్యవస్థయందు తలక్రిందులగు మార్పు కలిగెను. అగ్రహారములు అమ్ముడుపోయినవి. భూములు విఖండములైనవి. ఈనాందారులకు సంపూర్ణాధికారము తొలగించుట వలన నీ భూములపై ఋణములిచ్చినవారును పుచ్చుకొనిన వారును గూడ అత్యధికదుస్థితికి పాల్పడుదురు. ఈ అగ్రహార

ములు ఏకఖండముగ నుండినచో, నీ శాసనమువలన అరిష్టమంతగ లేదు. అగ్రహారీకులందరును, అగ్రహారపు భూములు కొన్నవారును గూడ అల్పభూమికి కామందులుగనుండుటచే వీరియందిపుడు నిరుద్యోగ సమస్య యేర్పడును. వ్యవసాయము స్వయముగా చేయనివాడు రెండు హక్కులను కలిగియుండరాదు. కాని స్వయముగ వ్యవసాయము చేయదలంచుకొనినవానికి గూడ నీశాసనము ననుసరించి సావకాశము లేదు. ఈనాముదారులకీ శాసనమును గురించి ముందుగ దెలియ జేసి కొంతకాలవ్యవధి నొసంగి పిమ్మట నీశాసన మొనరించి యుండి నచో సర్వసమ్మతముగ నుండెడిది. 1880 వ సంవత్సరపు శాసనము ననుసరించి బొంబాయియందు లోగడగల రైతులకే రైతుహక్కు లొసంగబడెను. 1862 వ సంవత్సర శాసనము ననుసరించి ప్రత్యేక భూస్వామ్యములు గూడ గలవు. పైనవివరించినట్లు వ్యవసాయము జేయుటవలన లేక ఆక్రమణలవలన నేర్పడిన (Occupancy Tenant) యిట్టి రైతుహక్కులేగాక యితరములగు రైతుహక్కులుకూడ గలవు. వంగదేశమునందువలె సంయుక్తరాష్ట్రములయందు నిర్ణీతపు పన్నుపై ఏర్పరుపబడిన భూస్వామ్యములు గల రైతులు గలరు. మధ్యరాష్ట్రముల యందు మొదటిసెటిల్‌మెంటు కాలమునం దేర్పరుపబడిన ఖాయపు రైతులు గలరు. (Absolute Occupancy Tenants). కొన్నితావులయందు భూకామందెప్పుడు పొలము వీడి పొమ్మనుచో నప్పుడు పొలమును వీడ వలసిన రైతులు కలరు.

భూస్వాధీనపుహక్కు లెట్టివి? (Occupancy Privilege).

హక్కులు. పన్ను హెచ్చించుటకు కాలనిర్ణయముగలదు. పన్ను నిర్ణయించుటకు నియమములు గలవు. పన్నును దావా చేసి హెచ్చింపవచ్చును. రైతు, భూస్వామి రాజీపడి హెచ్చించుకొన వచ్చును. వంగదేశమున 15 సంవత్సరముల కొకమారు రూపాయకు

2 అణాలకంటె పన్ను హెచ్చించుటకు వీలులేదు. చుట్టుపట్ల భూముల కంటె తక్కువపన్ను గలిగియున్నను, ధరలు హెచ్చినను, జమీందారులు, లేక భూకామందులు పంట హెచ్చుగుటకు పొలమునందేమైన మరమ్మతులుచేసియున్నను, పన్ను హెచ్చించుటకు కోర్టువారు డిక్రీ నొసంగగలరు. రైతుగూడ భూమిసత్తువ తగ్గిపోయినను, ధరలు తగ్గిపోయినను పన్నుతగ్గించవలెనని వ్యాజ్యము వేయవచ్చును. మధ్యరాష్ట్రములలో సెటిలుమెంటు ఆఫీసర్లు పన్నును నిర్ణయించెదరు. పదిసంవత్సరముల కొకమారు సెటిలుమెంటు జేయవచ్చును. మదరాసు రాష్ట్రమున 100కి 12½ కంటె నొకసారి పన్నును హెచ్చించుటకు వీలులేదు.

2. రైతును భూమినుండి తొలగించివేయకుండ కొన్ని నియమములు గలవు.

3. ఈ భూస్వాధీనపుహక్కు వంశపరంపరానుగతముగ నుండును. దాన విక్రియాది అధికారముకూడ గలదు.

4. భూమినుండి తొలగించివేయుటకు ముందు తగు నోటీసు నీయవలయును. పన్నునిచ్చుటకు వాయిదాలు గలవు.

5. ప్రభుత్వమువారు జమీందారులకు, భూకామందులకు దుర్భిక్షమువలన పన్నులు తగ్గించుచో, రైతునకు కూడ పన్నును తగ్గించవలెను.

రైత్వారీ ప్రదేశములయందింత కృత్రిమ తంత్రంగమేమియు లేదు. రైతునకు ప్రభుత్వమునకు మధ్య మరొకడులేడు. కాని పన్నులనుప్రభుత్వమువారు ఇష్టమువచ్చినట్లుగ విధించుచున్నారు. ఈబారినుండి రైతు సంరక్షింపబడుటకు వలయు శాసనములు మాత్రము లేవు.

# 17. సెటిలుమెంట్లు.

భూమినిస్తు శాశ్వత నిర్ణయము.

సేద్యము జేసికొనువాడు తరిమివేయబడి జమీందారులు మొలకలెత్తుటచే, సేద్యగానికి భూమి పోయినది. భూమి గలవానికైనను ఒకవంక జమీందారుల పీడయు మరొకవంక అప్పటి రాష్ట్రాధికారుల దుర్నయములును ఏకమై రైతును పీల్చి పిప్పిగ జేయసాగెను. కుంపినీ పరిపాలన ప్రారంభమున రైతు అధోగతికి త్రోయబడెననుట చరిత్రాంశము. 1765 వ సంవత్సరమునకు పిమ్మట క్లైవుగారి పరిపాలనలో రైతుపడ్డకష్టము లిన్నియన్ని యని చెప్పనలవిగాదు. కంపెనీవారి తాబేదార్లు, నవాబుగారి తాబేదార్లు వీరిరువురును రైతులకష్టముల నినుమడింపజేసిరి. 1769 వ సంవత్సరమున నియమింపబడిన రివిన్యూ అధికారులు రైతును సంరక్షింపజాలకపోయిరి. 1770 వ సంవత్సరమున వచ్చిన కరువువలన రైతు కుంగి కృశించిపోయెను. 1772 వ సంవత్సరమున కంపెనీవారే ప్రత్యేకముగ రివిన్యూయధికారమును స్వీకరింప నిశ్చయించుకొనిరి. వారన్ హేస్టింగ్సు పన్నుల వసూళ్ళపద్ధతిని కొంత దిగ మార్చెను. కలక్టర్లను నియమించెను. కేంద్రరాష్ట్ర జిల్లాబోర్డుల నేర్పరచెను. కాని పన్నులను విధించుపద్ధతి ఘోరముగనే యున్నది. మొట్టమొదట నాలుగుసంవత్సరముల కొకపర్యాయము పన్నులను వర్తకులకు, ధనాఢ్యులకు వేలము వేసెడివారు. పిమ్మట సంవత్సరమున కొకమారు వేలము వేయసాగిరి. ఈపాటదారులకు న్యాయాన్యాయ విచక్షణలేదు. ఈయవలసినపన్నులను, నీయనక్కరలేనిపన్నులను రైతుల నుండి దౌర్జన్యముగ వసూలుచేయుచు, రైతులరక్తమును పానము జేసిరి. ఈస్టిండియాకంపెనీకి తనవాటాదార్లకు హెచ్చులాభములను పంచిపెట్టవలెనని గల సంకల్పమే రైతులరక్తమును పానమొనరింప

చేయుచుండినవారి జమీందారులగుటవలన వారిపలుకుబడిని తొల గించి పన్నువసూళ్ళకై యితరవిధానములను బ్రవేశపెట్టుట కష్టదాయకమని తలంచుట మూడవకారణము. క్లైవు, వారన్ హేస్టింగ్సుల పరిపాలనమున రైతుపడిన చెప్పనలవిగాని కష్టము నొకింతయైన తొలగింప వలెనను సత్సంకల్పము నాల్గవకారణము. మొదటి 3 కారణములు ఫలప్రదములైనవిగాని నాల్గవకారణము సిద్ధింపలేదు. పన్నుల పాటదారుల బారినుండి రైతు సంరక్షింపబడెనని చెప్పవచ్చును. కాని ఆపాటదారులే యీజమీందారులుగూడ నగుటవలనను, జమీందారులకు సర్వాధికారము గలిగించుటవలనను, రైతుల దుర్దినము తొలగలేదు. ఇది వంగదేశమునందలి భూమిసిస్తు నిర్ణయచర్

మదరాసు, బెనారెసులు, భూమిశిస్తు శాశ్వత నిర్ణయము.

1795 వ సంవత్సర ప్రాంతమున బెనారెస్‌నందు భూమిసిస్తునిర్ణయమునకు దిగిరి. గ్రామములయందలి భూమిలో గ్రామస్థులందరు భూస్వామ్యము గలిగి యుండిన పద్ధతి ఆంగ్లేయుల కానాడర్థము గాలేదు. గ్రామములయందు గల యెవరినో యొకరిని యేరి వారికాగ్రామముపై సర్వాధికార మొసంగుచు, వారితో భూమిసిస్తు నిర్ణయమునకు దిగిరి.

మదరాసునందు 1/3 వంతు భూమి మాత్రమే భూమి సిస్తు నిర్ణయము గావింపబడినది. (జమీందారులకు ఈనాముదార్లకును కలిపి) ఇదివరలో రాజ్యముల పరిపాలించినవారి సంతతికి ఆంధ్రదేశమున, అరవదేశమున కొన్నిజమీలనిచ్చి వారితో భూమిసిస్తునిర్ణయము గావించుకొనిరి. బ్రిటిషుప్రభుత్వస్థాపనకు తోడ్పడినవారికిగూడ జమీలనిచ్చిరి. వంగదేశమునందువలెనే కొన్నికొన్ని గ్రామములను కలిపి జిల్లాలక్రింద నేర్పరచిరి. ఈజిల్లాలలో పన్నులవసూళ్ళు వేలము వేయ

ప్రారంభించిరి. హెచ్చుపాటదారులకు సేలములలో జిల్లాలను కొద్ది వేసెడివారు. ఈపాటదారులే జమీందారులైరి. కాని పన్నునురాబట్టు కొనుట కీపద్ధతి వీలుగలేదని కొంతకాలమునకు మదరాసుప్రభుత్వము తలంచెను. అందుచే సర్. తామస్ మనోగ్రిగారు రైత్వారీపద్ధతిని కనిపెట్టి, జమీందార్లను సృష్టించుట మానివేసిరి. మనోగ్రిగారి పరి పాలననాటికే శివ వంతు భూమి జమీందారులపాలై భూమిసిస్తుశాశ్వత నిర్ణయము గావింపబడెను. రైత్వారీపద్ధతి ప్రవేశపెట్టిన సర్. తామస్ మనోగ్రిగారును కలనల్ రీడుగారును రైత్వారీపద్ధతియందుగూడ భూమి సిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెననియే తలంచిరి. 1796 వ సంవ త్సరమున రీడుగారు సేలమునందిట్లే ప్రకటించిరి. సర్. తామస్ మన్రోగారు ఇంగ్లండులో కామన్సుసభవారియెదుట సాక్ష్యమిచ్చుచు రైత్వారీపద్ధతిని గుఱించి యిట్లు చెప్పిరి.

"రైత్వారీపద్ధతియనగ భూమిపై సిస్తును నిర్ణయించుట. ఇట్లు నిర్ణయింపబడిన సిస్తు శాశ్వతముగనుండును. ప్రతిరైతును శాశ్వతముగ నిర్ణయింపబడిన సిస్తును ప్రభుత్వమునకిచ్చుచు అతనియిష్టమువచ్చినంత కాలమా భూమిని దున్నుకొని యనుభవింపవచ్చును. ఎప్పుడుగాని ఆసిస్తు హెచ్చింపబడక నిర్ణీతమగుసిస్తుతో నాతడాభూమిని యనుభ వింపగలడు. ఆతడిట్లు నిర్ణయింపబడిన భూములనుగాక బంజరుభూముల నాక్రమించుకొనుచో మాత్రము ఆక్రమణభూమి పరిమితికి మరల సిస్తు నిర్ణయింపబడును. ఒకసారి నిర్ణయింపబడిన సిస్తు మరల మార్ప బడదు.........వంగదేశమందలి భూమిసిస్తు నిర్ణయమునకును, రైతు వారీపద్ధతి భూమిసిస్తునిర్ణయమునకు నెట్టివిభేదము లేదు. కాని వంగ దేశమునందువలె గాక ఆక్రమణభూమికి మాత్రము మరల పన్ను నిర్ణయింపబడుచుండును.'' 19 వ శతాబ్దమధ్యమున భూమిసిస్తునిర్ణ యము, వసూళ్ళు రైతునకు కష్టతమముగనే యున్నవి. 1848-1852-

1854 వ సంవత్సరములమధ్య పార్లమెంటువారు జరిపిన విచారణ యందు రైతుల కష్టములు నివేదింపబడినవి. 1855 వ సంవత్సరమున రాష్ట్రమంతయు తిరిగి సర్వే చేయబడి భూమిసిస్తు పునర్నిర్ణయము గావించుటకు నిశ్చయించుకొనిరి. ఆనాటి భూమిసిస్తు శాశ్వత నిర్ణయ సిద్ధాంతమును వీడలేదు. మదరాసు ప్రభుత్వము రైత్వారీపద్ధతియొక్క మూలసిద్ధాంతమును భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయించుటయే యని నుడివెను. 1861 వ సంవత్సరమున రాష్ట్రప్రభుత్వములన్నియు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెనని లార్డుకానింగుగారు సూచించిరి. అప్పుడు మదరాసు ప్రభుత్వము కూడ నాసూచనల నామోదించెను. సర్. జోన్ లారెన్సు గారు, సర్. ఛార్లెస్ఉడ్ గారు, సర్. స్టాఫర్డునార్తుకోటుగారు వీరందరు భూమిశిస్తు శాశ్వతముగ నొనరించుట కంగీకరించిరి. 1862 వ సంవత్సరమున హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి భూమిసిస్తును పునర్విమర్శింపవలయుననియాజ్ఞాపించుచు భూమిసిస్తు శాశ్వత నిర్ణయ సిద్ధాంతము నంగీకరించెను. కాని 1883 వ సంవత్సరమున అప్పటి హిందూదేశరాజ్యాంగకార్యదర్శి భూమిసిస్తు శాశ్వతనిర్ణయ పద్ధతియే వలదనెను.

కంపెనీపరిపాలనయందు వెలస్లీ, మింటో, హేస్టింగ్సు, బెంటిక్, మన్రో మొదలగు గవర్నర్లు, గవర్నరుజనరల్సు మొదలగు వారలు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెనని ప్రయత్నించిరి. కాని కంపెనీడైరక్టర్లు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయించుట లాభసాటి బేరముగాదని 1820 సంవత్సర ప్రాంతమునందా పద్ధతిని త్రోసివేసిరి. అంతకు పూర్వము గావించిన ప్రకటనలును, చేసిన వాగ్దానములును అన్నియు వమ్ముజేసిరి.

# 18. చక్రవర్తి పరిపాలనము-భూమిసిస్తు నిర్ణయము.

ఈస్టిండియాకంపెనీ యెత్తివేయబడి రాణీగారిపరిపాలన ప్రారంభింపబడినపిమ్మట లార్డుకానింగుగారు భూమిసిస్తు నిర్ణయసమస్యను విమర్శింపసాగిరి. ఒరిస్సాయందు సంభవించిన 1860 వ సంవత్సరపు కఱవుసందర్భమున హిందూదేశమునకువచ్చిన కలనల్ బరుడుస్మిత్తుగారు భూమిసిస్తునిర్ణయము శాశ్వతముగ నిర్ణయింపవలెనని సూచించిరి. సర్ చార్లస్ ఉడ్‌గారు (అప్పటి హిందూదేశరాజ్యాంగకార్యదర్శి) ఆసిద్ధాంతముతో నంగీకరించిరిగాని ఆచరణయం దుంచలేకపోయిరి. ఆయన పిమ్మట వచ్చిన హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శియగు సర్ స్టాఫోర్డునార్తుకాటుగారు 1867 వ సంవత్సరమున భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెననిరి. కాని 100కి 80 ఎకరములభూమి సాగుబడియందున్నచోట్లను కాలువలవలన పల్లపుసాగుబడివలన 100కి 20 వంతులకంటె వ్యవసాయమునం దాదాయము హెచ్చుటకు వీలులేని భూములకు వీరిసూత్రము ననుసరించి భూమి యభివృద్ధికి రాగలదని యాశించునంతకాలము భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడుటకు వీలుండదు. ఈయన తరువాత హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగ వచ్చిన లార్డు కింబర్లేగారు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెనను సిద్ధాంతమునే త్రోసిరాజనిరి. అప్పటినుంచియు భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపవలెనను సంకల్పమునే ప్రభుత్వమువారు విడనాడిరి.

భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడని భూములకు వంగదేశమున అత్యాధ్యయ్యందు మఱికొందఱు జమీందారులతో సెటిలు

నైనను మదరాసుప్రభుత్వ మాచరణయందుంచలేదు. భూమిసిస్తు నిర్ణయము శాసనబద్ధమొనరింపవలెనని జాయింటు పార్లమెంటు కమిటీవారు సూచించిరి. సంస్కరణలు ప్రారంభింపబడినపిమ్మట మదరాసు శాసనసభవారు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెనని తీర్మానించిరి. భూమిసిస్తునిర్ణయము శాసనబద్ధ మొనరించువఱకు సెటిలుమెంట్లు నాపుజేయవలయునని తీర్మానించిరి. 1921 వ సంవత్సరమునందు ఉద్యోగులను, అనుద్యోగులను గలిపి యీసమస్య చర్చించుట కొకసంఘమును నిర్మించిరి. ఈసంఘమునకు ప్రభుత్వసభ్యుడగు అబీబుల్లాసాహెబుగా రధ్యక్షుడు. రివిన్యూబోర్డువారిచే వ్రాయబడిన భూమిసిస్తు నిర్ణయశాసనమును గుఱించి విచారించుటకై యీసంఘము నియమింపబడెను. ఈసంఘమువారు భూమిసిస్తు శాశ్వతనిర్ణయ సిద్ధాంతమును గుర్తించిరి. అత్యవసరసమయములయం దధికపుపన్ను విధించుటకు ప్రభుత్వమున కధికారముండవలెననిరి. భూమిసిస్తు నిర్ణయించుటయం దధికారము శాసనసభవారి కుండవలెనని అధికసంఖ్యాకులగు సభ్యులు నిర్ణయించిరి. కాని యీనిర్ణయాధికారము శాసనసభ కలిగియుండరాదని ప్రభుత్వమువారు ప్రతిఘటించిరి. 100కి 18 రూపాయల మూడుపావులాలకంటె సెటిలుమెంటునందు హెచ్చింపమని మాత్రమనిరి. ఈనియమములతో గూడిన చట్టమును శాసనసభయందు ప్రవేశపెట్టిరి. శాసనసభవారికి భూమిసిస్తు నిర్ణయమునం దధికారమొసంగని యీశాసనము ప్రజల కనుపయోగమని యీబిల్లును శాసనసభ్యులు నిరాకరించివేసిరి. భూమిసిస్తు నిర్ణయశాసన మొనరింపబడలేదు. కాని ప్రభుత్వమువారు 100 కి 18 రూ. 12 అణాలకంటె హెచ్చింపమని నిర్ణయించుకొనిరి. సెటిలుమెంటు కాలమునకు పూర్వపు 20 సంవత్సరముల ధరలనుబట్టి సగటుధర, దానిననుసరించి ఆదాయమును మదింపువేసి అందులో వ్యవసాయమునకగు ఖర్చు

లను మినహాయించి మిగిలిన నికరాదాయములో సగము భూమిసిస్తు క్రింద నిర్ణయింపబడవలయునని ప్రభుత్వసిద్ధాంతము. భూమితరము ననుసరించియు సాగుబడిసౌకర్యముల ననుసరించియు భూముల మెట్ట పల్లపుసాగుల ననుసరించియు పన్నులనిర్ణయము. ఏభూమియందైన ఖనిజములుండినచో నాభూమికి ప్రత్యేకపుపన్ను కట్టుదురు.

బొంబాయి రైత్వారీపద్ధతి.

బొంబాయియందు భూమిసిస్తు నిర్ణయశాసనములు గలవు. గుజరాతునందలి తాలూకాదార్లు, కొంకణ తీరమందలి కొట్లు, ఖైరా, బ్రోచి జిల్లాలయందలి ఉమ్మడిగ్రామముల సెటిలుమెంట్లు విషయములలోగూడ ప్రత్యేక శాసనములు గలవు. అనేకవిధములగు ప్రయత్నములు బొంబాయి రాజధానియందుగూడ జరిగినవి. తుట్టతుదకు రైత్వారీపద్ధతిని ఆచరణకు తెచ్చిరి. మదరాసు రైత్వారీపద్ధతి లక్షణములే, బొంబాయి రైత్వారీపద్ధతికిగూడ గలవు. పన్ను నిర్ణయించు పద్ధతిలో మాత్రము తేడాగలదు. మదరాసురాజధానియందువలె అచ్చట కొన్ని కొన్ని గ్రామములనేరి, వాటి యార్థికస్థితి ననుసరించి, జిల్లాల కన్నింటికి భూమిసిస్తు నిర్ణయింపరు. మదరాసురాజధానియందువలె భూమి యొక్క తరముననుసరించి తరము హెచ్చింపరు. భూమియొక్క బలాబలములు పరీక్షింపబడి ఒకసారి నిర్ణయింపబడెను. భూమి బలాబలములు రూపాయివిలువలో మదింపు వేయబడినవి. అనగా ఒకటవ రకపుభూమి 16 అణాలనబడును. ఏభూమికాభూమి నికరాదాయము ననుసరించి పన్ను విధింపబడదు. మొత్తముగ ఒక తాలూకా తీసికొనబడి, ఆతాలూకా మొత్తముమీద పన్ను నిర్ణయింపబడును.

1. శీతోష్ణస్థితులు, నైసర్గికలక్షణములు, వ్యవసాయాభివృద్ధుల ననుసరించి తాలూకాల వారీగ విడదీసెదరు.

చిన సెటిలుమెంటు, తగ్గించినప్రదేశము మచ్చునకైనలేదు. ఒకవంక రైతు ఆర్థికముగ నానాటికి దిగులుపడుచున్నను, సెటిలుమెంటు ఉద్యోగస్థులకు రైతు ఆర్థికముగ నభివృద్ధియం దున్నటులనే గోచరించుచుండెను. ఇందులకనువుగనే లెక్కలను తయారుచేయుచున్నారు. సెటిలుమెంటుఉద్యోగస్థులు తయారుచేయులెక్కలు బూటకములని బొంబాయిరాజధానియందలి బార్డోలీ సెటిలుమెంటు చరిత్ర విస్పష్టముగ వెల్లడించుచున్నది. తమయుద్యోగిలెక్కలు తప్పులని బొంబాయి ప్రభుత్వ మంగీకరించుట విధియైనది. బార్డోలీరైతులు పీరాధిపీరుల వలె హెచ్చుపన్నులన్నియు నిరాకరించిరి. ప్రభుత్వ నిర్బంధవిధానము నోర్మితో సహించిరి. తత్ఫలితముగ బొంబాయిప్రభుత్వము బ్రూమ్‌ఫీల్డుసంఘమువారిని విచారణకై నియమించెను. బ్రూమ్‌ఫీల్డుగారు హైకోర్టున్యాయమూర్తి. వీరివిచారణయందు సెటిలుమెంటు కమీషనరుయొక్క మదింపులన్నియు తప్పులనివ్రాసిరి. కమీషనరు సూచించిన హెచ్చుదల సమర్థించుటకు వీలుగాదని తగ్గించిరి. వీరినిర్ణయమును బొంబాయిప్రభుత్వ మంగీకరించెను. బ్రూముఫీల్డు కమిటీవారు బార్డోలీ సెటిలుమెంటుపై వ్రాసిన వాక్యములిట గమనింపదగును.

"జయకరుగారు (బార్డోలీ సెటిలుమెంటు ఆఫీసరు) 100 కి 33 రూపాయలవంతున పన్నును హెచ్చింపవచ్చునని సూచించిరి. కాని పండించుటకగు ఖర్చు హెచ్చినదనియు, ధరలలో నిలకడలేదనియు గూడ నాతడు గమనించెను. ఈరెండు కారణములచేత కొంత తగ్గింపవలసియుండునని అంగీకరించుచు, 100 కి రు 33 లకు బదులు రు 25 లను మాత్రమే వసూలుచేయవచ్చుననెను. ఈయన 100 కి రు 25 లనే యేలసూచించవలెను? రు 20 లేక 15 లేక 10 రూపాయలనేల సూచింప

రాదు? ఇదియంతయు నూహాపైగావించిన పనియేగాని నిర్ణీతమగు లెక్కల ననుసరించి చేసిన పని గాదు."[1]

మదరాసు రాజధానియందలి ఉత్తరసర్కారుల సెటిలుమెంటు ఆఫీసరుయొక్క లెక్కలు గూడ బార్డోలీ లెక్కలవలె తప్పులతడికయని ఋజువుపడెను. మదరాసు శాసనసభవారి తీర్మానానుసారము మదరాసు ప్రభుత్వమొక విచారణసంఘమును నియమించెను. ఈసంఘమునకు మదరాసు ప్రభుత్వమున ఇంజనీరుగా పనిజేసి ఫించను బుచ్చుకొని మదరాసు ప్రభుత్వపు మంత్రిగగూడ నుండిన కీర్తిశేషులైన దివాన్ బహద్దూరు ఆరోగ్యస్వామి మొదలియారుగా రధ్యక్షులుగ నుండిరి. ఈయన డెల్టాజిల్లాలయందు ఎగ్జిక్యూటివు ఇంజనీరుగ చాలకాలము పనిచేసియుండిరి. ఈయనకు రైతుజీవితవిధానము కరతలామలకము. ఈయన సంఘసభ్యులతో కలిసి జిల్లాలయందు పర్యటన మొనరించెను. సెటిలుమెంటు ఆఫీసరు పరీక్షించిన గ్రామములను, మరికొన్ని గ్రామములను కూడ కలిపి పునర్విమర్శించిరి. రైతుల ఆర్థిక స్థితిని...పంటలు, పంటలకగుఖర్చు, గొడ్లు, గొడ్లకగుఖర్చు, మరమ్మతులు, మరమ్మతులకగు ఖర్చు, ఋణము మొదలయిన విషయముల నన్నింటిని సమగ్రముగ విచారించిరి. రైతుపై నధికపు పన్ను విధింపరాదని నిర్ణయించిరి. వీరినిర్ణయమును మదరాసు ప్రభుత్వము పెడచెవిని బెట్టెను. వీరి నివేదిక చిత్తుకాగితముల బుట్టలో త్రోసి వేయబడెను. 100 కి 18-8-0 చొ॥ అదనపు పన్ను విధింపబడెను. ఆరోగ్యస్వామి కమిటీవారు అదనపు పన్నును విధించుటను గురించి తమ నివేదికయందిట్లు వ్రాసిరి.

---

1. *From the Special Enquiry Report of Messrs. Broomfield and Maxwell. p.p. 25, 26 27, regarding Bardoli and Chorasi Taluqs resettlement.*

రమునుండియు పంటలధరలు పడిపోయినవి. పన్నులన్నో హెచ్చినవి. దేశమునందలి నలుమూలలనుండియు పన్నులను తగ్గింపవలెనను రైతుల ఘోష ప్రతిధ్వనించుచున్నది. శాసనసభ్యులు, పత్రికలు, ప్రజాసేవకులు రైతులను కృంగదీయుచున్న పన్నుభారమును తగ్గింపవలెనని ప్రభుత్వమువారికి మొరలిడుచున్నారు. కేంద్రప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యుడగు సర్ ఫజ్లీహుస్సేనుగారు స్టేటుకౌన్సిలు సభలో (సెప్టెంబరు 5.వ తేదీ 1933) నుపన్యసించుచు వివిధరాష్ట్రములలో పన్నుభారమును తగ్గించుట కొనరింపబడిన ప్రయత్నముల నొకజాబితాగా వర్ణించిచెప్పెను. ఈజాబితావలన రైతులకు తగ్గిన పన్నుభారమెంత యనుప్రశ్నకు మదరాసు రాజధానియందలి ప్రభుత్వచర్యయే సమాధాన మొసంగగలదు.

"గతించిన నాలుగుసంవత్సరములనుంచియు, ధరలు క్రమక్రమముగ దిగజారినవి. రైతులయొద్ద వారిదివరలో జేసిన ఋణములపై వడ్డీతీర్చుటకైనను సొమ్ములేకపోయినది. భూమిపన్ను చెల్లించినపిమ్మట కుటుంబమును పోషించుటకు వలయునంతగూడ మిగులలేదు. క్రొత్తగ ఋణముపుట్టుటలేదు. పన్నులను చెల్లించుటకై భార్యలమెడలయందుగల నగలనూడ బెటికి అమ్మివేయుచున్నారు. రైతులఘోష వెంటనే పన్నును తగ్గించివేసినగాని తగ్గదు." అని మదరాసురాజధానియందలి ప్రముఖులందరు ప్రభుత్వమునకు రైతులమొరను పలుమార్లు సర్వవిధముల విన్నవించిరి. ప్రస్తుతమున్న భూమిపన్నులో 100కి రు 50 వంతున తగ్గించివేయవలెనని రైతులఘోష. ఇది సాధ్యముగాని పనియని ప్రభుత్వవాదము. మదరాసుప్రభుత్వమువారి ఆదాయవ్యయ శాసనమున ఆదాయముకంటె వ్యయమధికముగ లేకుండజూచుటయే కర్తవ్యమని ప్రభుత్వమువారి నిశ్చయము. ప్రభుత్వాదాయవ్యయ శాసనమున

తరుగులేకుండ జూచుట ప్రభుత్వమువారి ప్రాథమికవిధియేగాని ప్రజల ఆదాయవ్యయములలో వ్యయమే పన్నులమూలమున హెచ్చుచుండగ నెంతకాలము ప్రభుత్వాదాయ వ్యయములు సమముగ నుండగలవు? అనవసరపుఖర్చును, దుర్వ్యయమును తగ్గించి ప్రజలకు పన్నులను తగ్గించుట ప్రభుత్వవిధి. ఇది సాధ్యపడని పనిగాదు.

"1933-34 వ సంవత్సరము ముగియుసరికి మదరాసు ప్రభుత్వమునకు రు 27140 లక్షలు నిలువయుండును. ఈమొత్తముమాత్రమే గాక నిలువసొమ్ములోనుంచి మెట్టూరుప్రోజెక్టునకు 0.07 లక్షలు పెట్టుబడుల క్రింద వ్యయపరచుటకును, కావేరి-మెట్టూరుప్రోజెక్టుక్రింద ఖర్చుపెట్టుటకై రు 26.29 లక్షలును ప్రత్యేకింపబడినవి. అనగా 1933-34 వ సంవత్సరము ముగియుసరికి రు 297.76 లక్షల సొమ్ము నిలువయుండునని తేలును.

ఈ మొత్తముగాక 41 జలపాతోద్భవ విద్యుచ్ఛక్తి యంత్ర నిర్మాణములకును సాలుసరి ఆదాయమునుండి రు 35.77 లక్షలు ఖర్చు పెట్టదలంచిరి. ఈమొత్తమును అప్పుజేసి పెట్టుబడిపెట్టవలయునే కాని సాలుసరి ఆదాయమునుండి ఖర్చుపెట్టరాదు. 16 పల్లపుసాగు కట్టడములకు రు 21 లక్షలు సాలుసరి ఆదాయమునుండి ఖర్చుపెట్టబూనిరి. ఈ సొమ్ము గూడ అప్పుజేసియైన ఖర్చుపెట్టవలెను. లేదా క్షామ నివారణనిధిలో కనిష్టముగ నుండవలసిన రు 40 లక్షలకు మించి యుండిన సొమ్ములోనుంచి తీసియైన ఖర్చుపెట్టవలెను. ఈ రెండు మొత్తములను గూడ సాలుసరి నిలువకు జేర్చుచో మొత్తము రు 354.53 లక్షల నిలువ తేలును.

ముఖ్యమగు కట్టడములకు పెట్టుబడులకై పెట్టు ఖర్చును, సాలుసరి ఆదాయమునుండి ఖర్చుపెట్టుటకిది మొదటిసారి కాదు,

1930–31 వ సంవత్సరమునందుగూడ రు 53 లక్షలు ముఖ్యమగు కట్టడములకై పెట్టుబడిపెట్టుటకుగాను (For Capital expenditure)నిలువ సొమ్మునుండి (From balances) తీసికొనబడెను. ఇట్లొనరించుటయేకాక సాలుసరి రాబడినుంచి, లేక, నిలువసొమ్మునుంచి ఋణములకు గడువు పూర్తికాకపూర్వమే గూడ నిచ్చివేయుచున్నారు. 1929–30 వ సంవత్సరమున రు212 లక్షలును, 1930–31 వ సంవత్సరమున రు 67 లక్షలును మొత్తము రు279 లక్షలు రాష్ట్రీయఋణనిధికి(Provincial Loans fund) జమకట్టబడెను. ఇదిసక్రమమైన ఆర్థికవిధానముకాదు. ఈవిధానమువలన, పన్నుల నిచ్చుకొనుచున్న రైతులు సంరక్షింపబడజాలరు. రైతు యీయగలదానికంటె నధికముగ వసూలుచేయుచునా సొమ్మును తక్కువవడ్డీమీాదగల ఋణమును తీర్చుటకై వినియోగించుట తగినపనియేనా? అనగా అధికపు వడ్డీలమీాద ఋణముచేయుచు రైతుబ్రతుకుటకై కొట్టుకొనుచున్న కాలమున ఋణముచేయుచు పన్నుల నిచ్చుకొనుచున్న కాలమున ఋణముగూడ సామాన్యముగ లభింపకున్న కాలమున అదనముగ రైతులయొద్ద వసూలుచేయుచు, తక్కువ వడ్డీఋణములను గడువుకూడ సమీాపించకపూర్వము తీర్చుచుండుట సక్రమమైన ఆర్థికపద్ధతియేనా? ఈపద్ధతిని విరమించి, యిట్టివ్యయమున్న ఋణముచేసికాని క్షామనివారణనిధినుండి గాని గైకొనియుండినచో రు 334.53 లక్షలు నిలవ యుండును. ఈసొమ్మును పన్నును తగ్గించుటకై వినియోగించుచో రు 1 కి 0–4–0 చొ॥ రెండు సంవత్సరములు పన్నును తగ్గించుటకు వీలున్నది. (మదరాసురాజధానిలో రైతువారిభూమిపై వచ్చుచుండిన ఆదాయము 6 కోట్లు) ఈరెండు సంవత్సరములలోపుగ వ్యయమును కుంచించి రు 1 కి 0–8–0 ల వంతున పన్నును తగ్గించివేయుటకు సావకాశములు గలవు".....

"1917-18 వ సంవత్సరమునందీ రాష్ట్రీయమున జీతబత్తెములకు రు 468.96 లక్షలు వినియోగింపబడెడివి. ఈమొత్తము 1925-26 వ సంవత్సరమునకు 762.63 లక్షలవఱకు పెరిగెను. పెన్షనులకు 1917-18లో 33.33 లక్షలు వినియోగింపబడుచుండెను. 1925-26 వ సంవత్సరము నకు 53.19 లక్షలవఱకు పెరిగెను. ఈదుర్భరవ్యయమును కనీసము 1917-18 వ సంవత్సరమునందు ఖర్చుపెట్టినంత మొత్తమునకైనను తగ్గింపవలయును. క్రొత్తగజేరు ఉద్యోగస్థులకు నిర్ణయింపబడిన జీతము లనుకూడ తగ్గించవలయును. ఇట్లుతగ్గించుచో రాబోవు 5 సంవత్సరముల లోను రు 100 కి 50 వంతున రైతులపైగల అధికపు పన్నును సగము వఱకు తగ్గింపగలము."[1]

నికరపుపంటలో సగము ప్రభుత్వమున కీయవలెనను పంపకమే రైతుల కరిష్టదాయకముగ నున్నది. తరములను నిర్ణయించుటలోగల లోపములును, నికరపుఆదాయమును నిర్ణయించుటలోగల లోటులును కలిసి, రైతులకష్టముల నినుమడింప జేయుచున్నవి. 100 కి రు 18-8-0 కంటె హెచ్చింపమని ప్రభుత్వము నిర్ణయించినను ఉన్నపన్నులనే చెల్లింపజాలనిరైతులు క్రొత్తపన్ను రవంతయైనను చెల్లింపజాలరుగదా!

1924-25 వ సంవత్సరమున నియమింపబడిన పన్నులవిచారణ సంఘమువారు (*Taxation Enquiry Committee*) భూమిశిస్తును సగము వఱకు తగ్గింపవలెననిరి. నికరపుఆదాయములో నాల్గవవంతుమాత్రమే

1. *From the Memorandum of Mr. Mahadeva Ghar to Madras Legislative Council Members.*

| పనివివరము | ఉపయోగించిన పశువుల జతలు | పనివాండ్ర సంఖ్య | | | మొత్తం ఖర్చు | | |
|---|---|---|---|---|---|---|---|
| | | పురుషులు | స్త్రీలు | బాలురు | రు | అ | పై |
| అకు తీసికొని వెళ్ళుటకు, ఊడ్చుటకు. | | | 7 | 1 | 2 | 14 | 0 |
| తరువాత చేయవలసిన పనులు. | | | | | | | |
| కలుపు తీత వగైరా. | | | 9 | 1 | 1 | 14 | 0 |
| కలుపు యేరివేయుటకు. | | 2 | 4 | 1 | 1 | 8 | 0 |
| కోత వగైరా. | | | | | | | |
| కోత | | 6 | 4 | | 4 | 2 | 0 |
| కట్టివేత. | | 2 | 6 | | 3 | 2 | 0 |
| కుప్పలనూర్చిడికి. | 3¼ | 7 | 2 | 1 | 9 | 4 | 0 |
| చెరుగుట, తూయుట, సంచులలో పట్టుటవగైరాలకు. | | 7 | 4 | 1 | 4 | 0 | 0 |
| మొత్తము. | | | | | 52 | 0 | 0 |

*From Agricultural Research Station, Samalkot- Ref. No. 268/31 Dated 30-11-31.*

రాబడిని మదింపువేయుచో సగటున మంచిపొలమునకు ఎ 1·కి 11 బస్తాలకంటె పంటపండదు. బస్తా 1 కి నేటివెల (1933-34) సగటున రు 2-8-0 కంటె హెచ్చుగలేదు. పంటమీద ఆదాయము రు 27-8-0. గడ్డిమీద ఎ 1 కి మూడుబళ్ళగడ్డికి రు 3-0-0 లు కళ్ళములో అమ్మిన రాగలదు. అనగా మొత్తము అన్నివిధముల ఆదాయము ఎ 1 కి రు 30-8-0 రాగలదు.

| | | |
|---|---|---|
| ఎ 1 కి పన్నులుగాక ఖర్చు | రు 52—0—0 | (మేనేజిమెంటు ఖర్చులు చేరలేదు.) |
| ఎ 1 కి పన్నులు సగటు | 8—0—0 | |
| మొత్తము ఖర్చు | 60—0—0 | |
| ఎ 1 కి జమ- పంట, గడ్డి కలిపి | 30—8—0 | |
| సాలుసరి వచ్చుచున్న నష్టము | 29—8—0 | |

ఇట్లు నష్టమును భరించుచు గూడ రైతులేల వ్యవసాయమును జేయుచున్నారు? వేరువృత్తిలేదు. వ్యవసాయమునందలి పనులన్నియు రైతులే స్వయముగ నిర్వహించుకొనుచున్నందున అందలి కూలి వారికి ముట్టుచున్నది. పొరుగువానికి కూలిచేయుట కంటె తనకు తానే కూలిజేసికొని జీవించవలెనను పూర్వసాంప్రదాయము ననుసరించి భూమిని అంటిబెట్టుకొని ప్రాకులాడుచున్నాడు. ధర సగటున రు 5-0-0 లని మదించుకొనినను,జమకును ఖర్చునకును సరిపోవుచున్నది. పన్నులను ఇచ్చుటకు గూడ మిగులుటలేదు. కూలిరూపముగ లభించుచున్నదానినుండియు ఋణమును జేసియు, పన్నులనిచ్చుచున్నాడు. కష్టించిచేసిన కూలికిగూడ తగినంత పన్నులవలన మిగులుటలేదు. ఇది యతిశయోక్తి కాదు. పర్మనెంటుసెటిలుమెంటు గావించిన జమీందారులపై రుసుము హెచ్చించి ప్రభుత్వవ్యయమునకు దగు ధనము జమీందారులవలన సంపాదించుటకుమారుగా కష్టించి పనిచేయు రైతులనుండి యధికపు పన్నులు వసూలుచేయబడుచున్నవి. ఇందువలన రైతులకు భూమియందు, వ్యవసాయమునందు ఉత్సాహము, ప్రీతి, అభినివేశము క్రమక్రమముగ దగ్గిపోవుచున్నవి. దేశమునందు పన్నులు విధింపగల

పరిమాణమును మదింపువేయుట అత్యావసరము. అట్టిమదింపుపైన భూమిసిస్తు గూడ విధింపదగును. ఈ పరిమాణమును గమనింపకుండ అధికభారమును బలహీనులగు రైతులపై బలవంతముగ మోపుచుండుటచే రైతు దుర్భరభారము భరింపజాలక క్రుంగి పోవుచున్నాడు. ఈభారమును తొలగించుటకై చిరకాలమునుండి పలువురు పలువిధముల సూచనలు గావించిరి.

# 21. సూచనలు.

1. భూమిసిస్తువిధించుటలో చిన్నరైతునకును పెద్దరైతునకును నొక్కరీతిగ విధింపరాదు. కుటుంబపోషణకుజాలని యాదాయము వచ్చు రైతులపై పన్నును తీసివేయవలయును. కుటుంబ పోషణకు పోను నిలవయుండు రాబడులపై ఆదాయమునసుసరించి పన్ను విధింపదగును. కుటుంబపోషణకు వలయు రాబడిని జీవితమునకు అవసరమైన వివిధవస్తుసముదాయముల ధరలననుసరించి అప్పుడప్పుడు నిర్ణయించుచుండదగును. కుటుంబపోషణకువలయు ఆదాయముయొక్క కనిష్టపరిమాణమును, గరిష్టపరిమాణమును గూడ నిర్ణయించుచో నగుటున పల్లెననుసరించియు, పట్టణము ననుసరించియు పన్నుగట్టదగిన ఆదాయమునునిర్ణయించుట సులభసాధ్యమగును. కుటుంబమును పోషించుటకువలయు ఆదాయము సర్వకాలములయందొకరీతిగనే యుండదు.

"1888-90 వ సంవత్సరములమధ్య అత్యల్పఅంతస్తుతో జీవించుటకుగాను కావలసిన వివరములను శ్రీనివాసరాఘవ అయ్యంగారి మదింపుల ననుసరించి గ్రహింపగలము.

నెల 1 కి బ్రాహ్మణులు మొదలగు పైకులములవారికి నెల 1 కి రు 3- 12-0 యును, కూలీలు మొదలగువారికి నెల 1 కి రు 1-12-6, తల 1 కి కోయంబుత్తూరు జిల్లాయందు ఖర్చుఅగుచుండెనని శ్రీనివాసరాఘవయ్యంగారు మదింపువేసిరి.

| 1 పైకులములకు. | | కూలీలకు. | | | |
|---|---|---|---|---|---|
| బియ్యము | 2—0—0 | చోళ్ళు | 1 | 0 | 0 |
| ఉప్పు | 0—1—6 | ఉలవలు లేక సెనగలు | 0 | 1 | 0 |
| పప్పు | 0—1—6 | ఉప్పు | 0 | 1 | 6 |
| మిరపకాయలు | 0—0—6 | మిరపకాయలు | 0 | 0 | 6 |
| చింతపండు | 0—1—0 | చిల్లరలు | 0 | 1 | 0 |
| మినుములు | 0—7—0 | కిరసనాయిలు | 0 | 1 | 6 |
| చల్ల | 0—2—6 | మంచినూనె | 0 | 2 | 0 |
| కిరసనాయిలు | 0—2—6 | చింతపండు | 0 | 0 | 6 |
| వంటచెరకు | 0—8—0 | పొగాకు, తమలపాకులు మొదలగునవి | 0 | 4 | 0 |
| మంచినూనె | 0—2—0 | | | | |
| కూరలు | 0—1—0 | | | | |
| మొత్తము | 3—11—6 | మొత్తము | 1 | 12 | 0 |

ఇందు బట్టలకగుఖర్చు చేర్పబడలేదు.

| | | | |
|---|---|---|---|
| "బళ్లారిజిల్లాలో కంబళీ, తలపాగా, రెండుకట్టుగుడ్డలు, చెప్పుల జతకు అగుఖరీదు. | 4 | 0 | 0 |
| కోయంబుత్తూరుజిల్లాలో చెప్పులు, బట్టలు. | 2 | 0 | 0 |
| కడపజిల్లాలో బట్టలకు. | 4 | 8 | 0 |
| సేలంజిల్లాలో బట్టకు రు 1-0-0, కంబళీ 0-14-0. మొత్తం | 1 | 14 | 0 |
| ఉత్తర ఆర్కాటు జిల్లాలో బట్టలకు. | 1 | 0 | 0" |

"ఈఅంకెల ననుసరించి పైకులములలో బట్టలకు సాలుసరి తల 1 కి రు 4-0-0 లును, కూలీలకు తల 1 కి సాలుసరి 2-0-0 ల వంతును మదింపువేయవచ్చును. అనగా కోయంబుత్తూరుజిల్లాలో పైతరగతుల ప్రజలకు తల 1 కి సాలుసరి కనీసము రు 48-10-0 లును, కూలీలకు తల 1 కి సాలుసరి రు 23-0-0 లును ఖర్చుఅగును."[2]

*1. From Mr. Srinivasa Raghavayyangar's Memorandum on the Progress of the Madras Presidency.*

*2. Quoted by Economic Enquiry Committee of Kistna, West Godavari and East Godavari Dts.*

పన్నును విధింపవలెను. ఈఆదాయపుపన్ను నికరపుఆదాయములో నాల్గవవంతు ఆదాయమునకు మించనిరీతిగ వర్తకము, వడ్డీవ్యాపారము మొదలగు ఆదాయములపై పన్నువిధించురీతిగనే సాలుసరి విధించు చుండవలెను.

4. యుద్ధములు మొదలగు విపరీతపరిస్థితులు గలుగుచో మాత్రము పన్నును హెచ్చించుటకు ప్రభుత్వమునకు సంపూర్ణాధికార ముండవలెను.

5. భూమియొక్క సగటువిలువనుబట్టి ఆవిలువపై కొంతపన్నును విధించుట. అనగా రు 2000 కిమ్మతుగల భూమిపై 100 కి 20 వంతున గట్టుచో రు 400 ఒకేసారి యిచ్చివేయవలసివచ్చును. ఇట్లు పన్నుగట్టిన భూములపై ఏవిధమగు పన్నులనుగాని కట్టరాదు.

ఇట్టిసూచనలే పలువురార్థికశాస్త్రవేత్తలు, పలువురు రాజకీయ వేత్తలు, పలువురు ప్రభుత్వోద్యోగులు చేయుచున్నారు.

రైతు సుఖజీవనము జేయవలెనన్నచో, దేశమునందు వ్యవసా యాభివృద్ధి కావలెనన్నచో, భూమిసిస్తుసమస్య ప్రథమమున పరిష్క రించుట అత్యవసరము. ఈపరిష్కారమున ఆకలిబాధదీర్చుట ప్రధా నాంగముగ నుండవలెను. మహాత్ముడు రెండవరౌండుటేబిలు సమావే శమునందు చెప్పినటుల, కలిమిలేముల మధ్యగల పరస్పర సంఘర్షణమునే భారతీయులు మొట్టమొదటగ నెదుర్కొనుట తప్పదు.[1]

ఇట్లెదుర్కొనుటలో ఈస్టిండియాకంపెనీ పరిపాలననాటినుం డియు నేర్పరుపబడిన హక్కు బేహక్కులన్నియు విమర్శించుటయం దన్యాయములేదు. భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడెనని చెప్ప బడు భూములపైన సిస్తును పునర్విమర్శించునంతమాత్రమున దేశము

1. *Between haves and have nots—Mahatma Gandhi.*

నందలి యాకలిసమస్యను తీర్పజాలము. జమీందారులకు, పెద్దభూస్వామందులకు గల భూములను ప్రభుత్వము స్వాధీనముజేసికొనవలయును. ధనరూపముగ ప్రతిఫలమునిచ్చియైన నీభూములను స్వాధీనముజేసికొని సేద్యగాండ్ర కొసంగవలయును. ఇట్లొనరించుటకు రాజకీయాధికారము సంపూర్ణముగ రైతులవశమును, కార్మికులవశమును గావలెను. జమీందారుల పలుకుబడి నశింపవలెను. ఈపరిస్థితులింతలోరావు. ఈపరిణామము గలుగువఱకు గత్యంతరమేమి?

## 22. ప్రభుత్వ వాగ్దానము.

జమీందారులనుండి భూమిని తీసికొనుట లేక శాశ్వతముగ నిర్ణయింపబడిన భూమిసిస్తును హెచ్చించుట చేయుచో, వాగ్దానభంగ మొనరించుట యగునని ప్రభుత్వము వాదించును. ఎప్పటికిని భూమిసిస్తు హెచ్చింపని పద్ధతిపై ఈస్టిండియాకంపెనీ జమీందారులతో గావించుకొనిన యొడంబడికలను ప్రభుత్వము మన్నింపజూచుటయం దాశ్చర్యము లేదు. కాని ప్రజాప్రభుత్వమునందు గూడ ఈస్టిండియా కంపెనీ గావించుకొనిన అక్రమపుటొడంబడికలు మన్నింపబడవలె ననుట న్యాయము కాజాలదు. అట్లు మన్నించుచో కంపెనీనాటి వర్తక ప్రభుత్వమునకును ప్రస్తుత నిరంకుశ ప్రభుత్వవిధానమునకును రానున్న ప్రజాప్రభుత్వమునకును వ్యత్యాసమేయుండదు. కంపెనీనాటి యొడంబడికలను మన్నించుట అసహజము. అక్రమము. అన్యాయము. ఆర్థికవినాశనకరము. భారతావని భవిష్యదార్థికాభివృద్ధికి భంగకర మగు కంపెనీనాటి యొడంబడికలను, ప్రస్తుత ప్రభుత్వవిధానమందు గావింపబడిన శాసనములను తలక్రిందులుగ మార్చివేయుటయం దవి నీతిలేదు, అన్యాయము లేదు. అట్లొనరించుటయే విధ్యుక్తధర్మము.

మదరాసు శాసనసభయందు ఎస్టేటులాండుయాక్టు చట్టమును 1933 వ సంవత్సరమున సవరించుచు 'భూమియందుగల హక్కులను' తొలగించు సూత్రమును ప్రభుత్వమువారే అంగీకరించుట గమనింప దగిన విషయము. ఈనాముగ్రామములభూమియందు యీనాందారు లకుగల సంపూర్ణపు హక్కును తొలగించు సవరణను ప్రభుత్వసభ్యుడే యుపపాదించెను. శాసనసభ్యు లామోదించిరి. పూర్వమెప్పుడో ఎవరి వలననో ఒసంగబడిన హక్కులు 'శాశ్వత బ్రహ్మకల్పముగ నుండ నవ సరములే'దను సిద్ధాంతమును మదరాసు ప్రభుత్వమువారు ధృవపరచిరి. ఇది రానున్న కాలమునకు పునాది యనదగును.

## 23. కర్తవ్యము.

కాని యీధర్మనిర్వహణమున కొంతతడవు వేచియుండుట తప్పదు. అందుచే భూమిసిస్తు స్వరూపమునే మార్చివేయుట యుక్తము. బెంగాలునందు భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడిన కాలముననే దేశమందంతట భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడి యున్నచో, దేశ మార్థికముగ శోషింపబడుట కవకాశము స్వల్పముగ నుండెడిది. రమేశచంద్రదత్తు నుడివినటుల రైతు పరాధీనస్థితికి బొల్పడియుండెడివాడు కాడు. నేడా పరిస్థితులు లేవు. నిరంకుశ ప్రభుత్వవిధానమునం దాచరింపవలసిన కార్యవిధానమునకును, ప్రజాప్రభుత్వమునం దాచరింపవలసిన కార్యవిధానమునకును బహు వ్యత్యాసముండును. లాభాలాభముల దృష్టితో పరీక్షించినను, భూమి సిస్తును శాశ్వతముగ నిర్ణయించుటయు, భూమిసిస్తును అప్పుడప్పుడు నిర్ణయించుచుండుటయు, నీరెండుపద్ధతులును ప్రజాప్రభుత్వమున దేశార్థికాభివృద్ధి కుపకరింపవు. ప్రజాప్రభుత్వమున రైతునకు, ప్రభు

త్వమునకు భేదభావము పనికిరాదు. రైతుల ఆర్థికాభివృద్ధియే దేశాభి వృద్ధికరము. అట్లే ప్రభుత్వార్థికాభివృద్ధియే దేశాభివృద్ధికరము. భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయించివేయుచో ప్రభుత్వాదాయము చెరువునందలి నీటివలె స్థంభించును. ప్రభుత్వాదాయము స్థంభించుచో, ప్రజోపయోగకర కార్యములకై వలయుధనము లభింపకపోవచ్చును. భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడక మార్పులకులోనగుచున్నచో, రైతుల జీవిత విధానము సముద్రతరంగములవలె లేచుచు, కూలుచు, ఆటుపోటుల పాలగుచుండును. వ్యవసాయమభివృద్ధి చేయుటకు రైతునకుత్సాహముండదు. అందుచే నీరెండుపద్ధతులను, వీడి మూడవపద్ధతి యోజింపదగును. వ్యవసాయాదాయముపై ప్రతి సాలున ఆదాయపుపన్ను విధించుచో శాశ్వత భూమిసిస్తు నిర్ణయపద్ధతి యందుగల దోషములును, అప్పుడప్పుడు భూమిసిస్తును నిర్ణయించుటలో గల దోషములును చాలవఱకు దగ్గింపగలము. జీవయాత్రకు సరిపడని పొలములుగల రైతులపై పన్ను తొలగించుటకిది మంచిత్రోవ. పెద్ద భూకామందులనుండియు, జమీందారులనుండియు సరియగు నాదాయ మును రాబట్టుకొనుటకుకూడ నిదియే ప్రశస్తమగు మార్గము. భూమి సిస్తునువీడి యిట్లాదాయపుపన్ను విధించుటవలన ప్రభుత్వాదాయము కొరవడునని కొందఱందురు. తక్కువభూమి గల పట్టాలే హెచ్చుగ నుండుటచేత నీపట్టాలపై ఆదాయపుపన్ను విధించుటకు వీలుండనందున ప్రభుత్వాదాయమునకెంతయో నష్టముగలుగునని నేటి రాజకీయ వేత్తల భయము. ఈనష్టము జమీందారుల ఆదాయములపైన, పెద్ద భూకామందుల ఆదాయముపైన విధించు ఆదాయపుపన్ను వలన చాలవఱకు ముదరా రాగలదు.

జీవనోపాధికి మించిన యాదాయములపైన ప్రభుత్వవ్యయము నకు వలయునంతగ పన్నులను విధించుటయే కర్తవ్యము. జీవనోపాధికి

భారతదేశపు సగటాదాయము విదేశములతో పోల్చుచో నత్యల్ప మనియు భారతభూమియందు దరిద్రదేవత తాండవమాడుచున్న దనియు మననముజేయుట అత్యవసరము.

## 24. భూమికి హక్కుదారు లెవరు?

భూమియందు భూస్వామ్యపుహక్కు ప్రభుత్వమునకు గలదా? రైతునకుగలదా? హిందూ, మహమ్మదీయ యుగములలో భూస్వామ్యపుహక్కు రైతునకే కలదని పన్నులవిచారణసంఘమువారే వ్రాసిరి. ఆంగ్లేయయుగమునందీ భూస్వామ్యపుహక్కు ప్రభుత్వమునకు గలదనిరి. ఇట్టిహక్కును ప్రభుత్వము కోరుటవలన భూమిసిస్తునిర్ణయమునందు గలిగిన విపరీతపు మార్పులేమియు లేవు. ఈహక్కు రైతులదేయగుచో గలుగు ప్రత్యేకపు సౌకర్యములును గోచరింపవు. ఇది యొక సిద్ధాంతవిషయమా? ఎట్లున్నను ఆర్థికముగ ఆంగ్లేయ యుగమునందు ఫలితము లొక్కవిధముగనే యుండును. ప్రజాప్రభుత్వ యుగమున భూస్వామ్యపు హక్కు ప్రజాప్రభుత్వమే కలిగియుండుట సమంజసము. బీదసాదల మధ్య సామరస్యము కుదుర్చు నార్థికవిధాన మవలంబించుటకు భూస్వామ్యపుహక్కు ప్రజాప్రభుత్వము కలిగియుండుటయే సమంజసము. ప్రపంచ భవిష్యత్ పరివర్తనము ననుసరించవలెనని భూస్వామ్యపు హక్కు ప్రజాప్రభుత్వమే కలిగియుండవలెను. భూమిసిస్తు పన్నుగ పరిగణింపవలయునా? లేక అద్దె (Rent) గ పరిగణింపవలయునా? అను విషయముగూడ చర్చనీయాంశముకాదు. ఈరెంటికిని ఆచరణయందు విభేదస్వరూపములేదు. సిద్ధాంత చర్చయందు సాంకేతికవిభేదము మాత్రమే కలదు. భూస్వామ్యపుహక్కు ప్రభుత్వమునకే కలదని నిర్ణయింపబడుచో నీసాంకేతిక విభేదముగూడ సమసిపోవును.

# 25. జమీందారీ రైతు.

భూమిసిస్తు నిర్ణయింపబడిన జమీలలో రైతుల బాధ లమిత ముగనున్నవి. జమీందారులకు భూములయందుగల సర్వాధికారముల వలన వారియిష్టానుసారము పన్నుల హెచ్చించుటయు, అవి చెల్లింప జాలకపోవుచో నా రైతుల నాభూమినుండి తొలగించివేసి యితరుల కిచ్చుచున్నారు. చిరకాలమునుండి వ్యవసాయము జేయుచుండినను ఆ రైతులకా భూమియందు వ్యవసాయము జేసికొనుటకుగూడ హక్కు కలుగుటలేదు. 1859, 1885, 1907, 1928 వ సంవత్సరములలో వంగ దేశమునందు గావింపబడిన శాసనములు; మదరాసు, సంయుక్త రాష్ట్రములు మొదలగు నితరరాష్ట్రములలో నీమధ్య గావింపదలంచిన శాసనములు రైతునకువలయు హక్కుల నొసంగలేదు. ప్రభుత్వమునకును, రైతునకును ఉండవలసిన సంబంధమెట్లు నిర్ణయింపబడవలెనో, అట్లే జమీందారీరైతుల విషయమునగూడ శాసనమొనరించుట అత్యావసరము. శాసనరూపముగ జమీలను తీసివేయువఱకు జమీందారీ రైతును రైతువారీపద్ధతియందలి రైతువలెనే సర్వవిధముల సంరక్షించుట ప

జమీందారీరైతుల సంక్షోభ మధికమగుచున్నది. వివిధప దేశములయందు జమీందారీరైతుల ఘోష ప్రతిధ్వనించుచున్నది. ఈ ప్రతిధ్వనికి ఆంధ్రదేశమునందు గత నాలుగుసంవత్సరముల నుంచియు, జమీందారీ రైతులలో గలిగిన సంచలనమే తార్కాణము. ఆంధ్రదేశమునందు జమీందారీరైతులు సమావేశమై గావించుచున్న ముఖ్య తీర్మానముల గొన్నింటి నిట పేర్కొనదగును.

1. "ప్రస్తుతము రైతుసేద్యములో నున్న సేరీ, కమతము, పాతబంజరు, జమీందారు తనకృషిచే సాగులోనికి తెచ్చితినని చెప్పు

భూమి, లంక యిజారా భూములుసహా జమీనులోని యావత్తుభూమి యు నెట్టి నిబంధనలతో నిమిత్తములేకుండా రైతుభూమిగా నిర్వచింప బడవలెను.

2. ప్రస్తుతసిస్తులు హెచ్చుగానున్న చోటులనెల్ల రైతు యొక్క ఆర్థికస్థితిని పురస్కరించుకొని పునర్విమర్శనము చేయవలెను. అట్లు చేయుటలో ప్రస్తుతము దుస్సహములని తలపబడుచున్న రైత్వారీ రేట్లనైనను జమీందారీ సిస్తులు మించకుండా చూడవలెను.

3. జమీందారుకు సంబంధించినంతవరకు రెండవ పేరాలో చెప్పబడినప్రకారం సంస్కరింపబడిన రేట్లు ముందెన్నడును హెచ్చు చేయబడరాదు.

4. పంటనష్టములు మున్నగు ప్రమాదములు తటస్థించినపుడు కాపుచేయుట (Suspension ఆపియుంచుట) మాఫుచేయుటకు (Remission రిమీషను) ఏర్పాటుండవలెను. ఈ యంశములో నిర్ణయాధికారము స్థానికప్రభుత్వము రివిన్యూఅధికారుల చేతులలో నుండవలెను. సదరు సూత్రములు రైతువారీ గ్రామములలోని రిమీషను సూత్రముల ననుసరించి యుండవలెను.

5. జమీందారీలలోని జలాశయములన్నియు సర్వేజేసి పరిశో ధింపబడవలెను. 5 లేక 10 సం||రములలో వీనినన్నిటిని తగుమరమ్మతు చేసి పునర్నిర్మాణము చేయగల విధానము తయారుకావలెను. ఇట్టిపని ముందు సూచింపబోవు ల్యాండుకోర్టువారు ప్రతిజమీందారీలోను జరిగించవలెను. ఇందులకగు ఖర్చులకుగాను ప్రతిజమీందారీలోను జమీందారుని ఆదాయమునుండి తగినంతసొమ్ము జలాశయ సంరక్షణ నిధి (Irrigation Sources Protection Fund) గా ప్రత్యేకింపబడవలెను. ఈ నిధినుండి యొక కేంద్ర జమీందారీ జలాశయ సంరక్షకనిధి

(Central Zamindari Irrigation Sources Protection Fund) రాష్ట్రమొత్తముపై నేర్పడవలెను. ఈ కేంద్రనిధినుండి స్వల్పవడ్డీతో ఆయా జమీందారులు పైపనులనిమిత్తము బదులు పుచ్చుకొనవచ్చును. ఈ యంశములన్నియు పల్లములోను, మెరకలోను మురుగుపారుదలకు కూడ వర్తించవలెను.

6. జమీందారు తనసిస్తుబాకీనిగూర్చి న్యాయస్థానముద్వారా డిక్రీ పొందకుండగనే ఆస్తిని జప్తుచేయుటకు అవకాశము నిచ్చెడు ఎస్టేటుల్యాండుచట్టములోని ప్రస్తుతనిబంధనలు రద్దుకావలెను.

7. రైతులకు చిరకాలమునుండి అడవులు,కంచెలు,బంజరుభూములలోగల మేత, కట్టెలు, వ్యవసాయము, కలప, ఎరువు వగయిరాలకు గలహక్కు స్థిరపడవలెను. సదరుహక్కును పురస్కరించుకొని జమీందారీ గ్రామములలో లంకలుసహా తగు గోభూములు ఏర్పడవలెను. ప్రస్తుతము పశువులమేతకుగాను రయితుల కుపయోగపడుచున్న అటవీ భాగములు గ్రామ పంచాయితీల పాలనలోనికి రావలెను. సదరు భూభాగములపై ప్రస్తుతమున్న ఫీజు ఫారెస్టు పంచాయితీలు గవర్నమెంటుకు చెల్లించు రేటుకంటె మించియుండరాదు.

8. పుంతలు లేక దారులు, డొంకలు, చెరువులు, కాలువలు, (గట్లు పడకలుసహా) మందబైళ్ళు, కళ్ళములు, రుద్రభూములు మున్నగు నిదివరలో నట్టియుపయోగములో నుండినట్టియు, ప్రస్తుతముపయోగములో నున్నట్టియు, సాముదాయికప్రదేశములు అన్నియు నవి ఏవిధముగా పుట్టబడినను స్థానికసంస్థలపరము కావలెను.

9. జమీందారీలోని ఆరణ్యక, ఉదక, ఖనిజసంపద యావత్తు ప్రజాక్షేమము నిమిత్తము ప్రభుత్వపరము కావలెను.

10. జమీందారునకు కావలసిన సాలుసరి గ్రామ డిమేండు

ములలో స్త్రీలకు గూడ మూడవవంతు భాగమున్నది. బర్మాదేశ మందలి కొన్ని తెగలలో స్త్రీపురుషాదులకు సమానభాగములు గలవు. ఇట్లు సమానభాగములను పంచుకొను వారసత్వపు హక్కులవలన భాగ్య భోగ్యము లెల్లరకు సమానమగుచుండుటకు వీలుగ నుండును. కాని జనసంఖ్య యభివృద్ధియైన కొలదియు భూములు విడిపోయి కనిష్టాహారము గూడ లభింపని స్థితిగలుగును. కనీసమొక జతయెడ్లకైనను సాలీనా పనియుండునంతటి భూమి కూడ రైతునకు లేక విడిపోవుట వలన వ్యవసాయాభివృద్ధి కాజాలదు. ఈస్థితియే నేడుభారతదేశమునందు ప్రబలియున్నది. అందుచే కుటుంబజీవనము జరుగక రైతుల భూముల తాకట్టుపై ధనాఢ్యులకడనుండి ఋణముల దెచ్చుచున్నారు. కొలది కాలములోనే యీ రైతుభూమి యాధనాఢ్యుని వశమగుచున్నది. ఇట్లు భారతదేశమునందు 800 కోట్ల అప్పు రైతులకు గలదని అంచనా వేయబడెను. ఈ యప్పులవలన వ్యవసాయకుని చేతినుండి యేనాడు ధనాఢ్యుని చేతికి భూమి మారుచున్నదో ఆనాటినుండియు వ్యవసాయకునికా భూమియందునగాని, వ్యవసాయమునందున గాని యభివృద్ధి లేకపోవుట సహజము. అందుచే వ్యవసాయాభివృద్ధి నిరోధింప బడుచున్నది. భూమియం దధికారములేక వ్యవసాయము మాత్రమే కూలిపనిగ చేయుచున్నపుడు భూమిని బాగుచేయవలెనను దీక్షగాని యభిమతముగాని లేకపోవుటయం దాశ్చర్యములేదు. భూమి విభాగములను గురించి డాక్టరు హెరాల్డుమాను (Mann) గారు వివరించిరి. దక్కనునందు ప్రతిగ్రామమున రైతు ఒకటికి 1771 వ సంవత్సరమునందు 40 ఎకరముల వ్యవసాయపు భూమి కలిగియుండెడివాడు. 1818 వచ్చుసరికి రైతు 1 కి 17½ ఎకరములకును 1820 లో 14 ఎకరములును 1915 వచ్చుసరికి 7 ఎకరములకును తగ్గిపోయినది. ఈనాడు రైతు 1 కి 5 ఎకరములకంటె తక్కువగనుండును.

## మదరాసు రాజధానియందు 1330వ ఫసలీ లేక 1920-21వ సంవత్సరమున గల భూముల పట్టాదారుల వివరములను దెలుపు పట్టిక

| వివరము | ప్రత్యేకపు పట్టా. | | | | ఉమ్మడిపట్టా. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పట్టాల సంఖ్య | పట్టాలకుగల భూమిపరిమితి | | సిస్తు | పట్టాల సంఖ్య | వాటాదారుల సంఖ్య | పట్టాలకు గల భూపరిమితి | | సిస్తు |
| | | మెరక | పల్లం | | | | మెరక | పల్లం | |
| | | ఎకరములు | | రు | | | ఎకరములు | | రు |
| రు 1 సిస్తు లేక అంతకంటె తక్కువ చెల్లించవలసిన పట్టాలు | 508620 | 290719 | 19423 | 312815 | 377491 | 1246576 | 176582 | 11836 | 200277 |
| 10 లేక అంతకంటె తక్కువ, రు 1 కంటె యెక్కువ | 1679176 | 4553330 | 511348 | 7056929 | 926440 | 2925695 | 3085823 | 210530 | 4015228 |
| 30 ,, 10 ,, | 574975 | 3519924 | 841533 | 8916101 | 376492 | 1317197 | 2857253 | 337678 | 5516161 |
| 50 ,, 30 ,, | 140892 | 1323786 | 481494 | 4590551 | 84944 | 314596 | 976507 | 229080 | 2693245 |
| 100 ,, 50 ,, | 33940 | 1126599 | 573167 | 4913746 | 45718 | 188439 | 740411 | 261949 | 2716976 |
| 250 ,, 100 ,, | 33293 | 757043 | 563210 | 4511975 | 16455 | 72772 | 482565 | 215135 | 2070659 |
| 500 ,, 250 ,, | 6761 | 300283 | 292188 | 2183249 | 2715 | 12947 | 141337 | 84226 | 793170 |
| 1000 ,, 500 ,, | 2143 | 244415 | 197296 | 1374866 | 738 | 4078 | 76196 | 48969 | 431285 |
| 1000 లకు పైన | 782 | 228375 | 195293 | 1259372 | 170 | 2591 | 78182 | 35724 | 287931 |
| మొత్తము | 3080582 | 12345979 | 3674952 | 35119604 | 1831168 | 6084886 | 8615356 | 1485127 | 18724982 |

(ఉమ్మడిపట్టాలు, ప్రత్యేకపుపట్టాలు కలిపిన మొత్తం 4861745.) (మొత్తపు సిస్తు రు 53844586.)

1 మదరాసు రాజధానియందు 1335 వ ఫసలీ లేక 1925-26 వ సంవత్సరమునగల పట్టాదారుల సంఖ్యయు, వారు చెల్లించు సిస్తులను దెలుపు పట్టిక.

| వివరములు | ప్రత్యేకపు పట్టాలు. | | | | ఉమ్మడి పట్టాలు. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పట్టాల సంఖ్య | పట్టాలకుగల భూమిపరిమితి | | సిస్తు | పట్టాల సంఖ్య | పట్టాదారుల సంఖ్య | పట్టాలకు గల భూమిపరిమితి | | సిస్తు |
| | | మెరక | పల్లం | | | | మెరక | పల్లం | |
| | | ఎకరములు | | రు | | | ఎకరములు | | రు |
| రు 1 అంతకు తక్కువ సిస్తు చెల్లించు పట్టాలు | 615262 | 338607 | 26051 | 371630 | 471096 | 1780692 | 220799 | 17162 | 265067 |
| 10 లేక 1 తక్కువ | 1890396 | 4861046 | 553049 | 7768341 | 1046605 | 3382964 | 3315074 | 268960 | 4477139 |
| 30 ,, 10 ,, | 617093 | 3568563 | 860852 | 9466741 | 370458 | 1308109 | 2703033 | 433323 | 5737531 |
| 50 ,, 30 ,, | 144721 | 1346680 | 489830 | 4952134 | 77533 | 299910 | 919119 | 247539 | 2621425 |
| 100 ,, 50 ,, | 83230 | 1152873 | 574439 | 5211883 | 39339 | 158472 | 658289 | 238268 | 2449674 |
| 250 ,, 100 ,, | 32835 | 769963 | 561147 | 4628286 | 13460 | 63818 | 426192 | 205295 | 1858620 |
| 500 ,, 250 ,, | 7042 | 383989 | 292702 | 2256905 | 2402 | 12049 | 133338 | 83512 | 724413 |
| 1000 ,, 500 ,, | 2404 | 214760 | 203418 | 1492572 | 588 | 3966 | 63797 | 43900 | 375597 |
| 1000 లకు పైన | 862 | 256717 | 203033 | 1489496 | 189 | 2438 | 62908 | 36960 | 314228 |
| మొత్తం. | 3393845 | 12838198 | 3764516 | 37637988 | 2021670 | 7012418 | 8502549 | 1574919 | 18823694 |

(ఉమ్మడిపట్టాలు, ప్రత్యేకపుపట్టాలు కలిపి మొత్తం 5415515.) (మొత్తపుసిస్తు రు 56461682 లు.)

1. *From Royal Commission on Agriculture in India Vol III.*

ఈపట్టికల రెంటివలన 5 సంవత్సరముల కాలములో భూమి యెట్లు విఖండమ్ములైనదో తెలిసికొనగలము. 1921 వ సంవత్సరమున గల మొత్తపు పట్టాలు 4861745. 1925 వ సంవత్సరమున 5415515 వఱకు పెరిగినవి. ఈపట్టాలు మాత్రమే విభాగములనియు, విఖండములనియు తలంపరాదు. ఒక్కొక్క పట్టాదారుడు గ్రామములో నలుమూలల చిన్నచిన్న ఖండికలను గలిగియుండును. 1921 లో పైలెంకల ననుసరించి మదరాసు రాజధానిలో పట్టా 1 కి సగటున ఎ 5-37 లును, 1925–26 లో ఎ 4-93 లును గలిగియుండెను. పట్టాయందు చేరియున్న ఖండములను గుర్తింపగలుగుచో, భూమి యెట్లు భిన్నభిన్నములైనదియు సుబోధకమగును.

ఈదిగువ పట్టికలవలన కృష్ణా, గోదావరి, పశ్చిమగోదావరి జిల్లాలలో భూమి ఎట్లు విఖండములై యున్నదియు తెలిసికొనగలము. (Fragmentation of Holdings).

—♦ కృష్ణా జిల్లా ♦—

| | పట్టాదారుల సంఖ్య | 100 కి ఎంత మంది | పరిమిత ఎకరములు | 100 కి గల ఎకరముల పరిమితి |
|---|---|---|---|---|
| 1 ఎకరము-అంతకు తక్కువ | 766 | 23.3 | 354.95 | 1.4 |
| 5 ఎ॥ అంతకుతక్కువ, 1 ఎ॥ కంటె హెచ్చు | 1311 | 39.9 | 3512.28 | 13.8 |
| 10 ఎ॥ ,, 5 ఎ॥ ,, | 581 | 17.7 | 4184.12 | 16.5 |
| 15 ,, ,, 10 ,, ,, | 222 | 6.7 | 4162.49 | 16.4 |
| 20 ,, ,, 15 ,, ,, | 153 | 4.7 | 2681.64 | 10.5 |
| 25 ,, ,, 20 ,, ,, | 80 | 2.4 | 1782.46 | 7.0 |
| 30 ,, ,, 25 ,, ,, | 42 | 1.3 | 1180.98 | 4.7 |
| 50 ,, ,, 30 ,, ,, | 91 | 2.8 | 4394.73 | 17.3 |
| 80 ,, ,, 50 ,, ,, | 23 | 0.7 | 1347.34 | 5.3 |
| 80 ,, పైగ | 18 | 0.5 | 1791.23 | 7.1 |

1931 వ సంవత్సరపు జనాభాలెక్కల నివేదికయందిట్లు వ్రాయబడెను.

"సాగుబడియగుచున్న భూమిపరిమితిని, వ్యవసాయముచేయుచున్న వారిసంఖ్యను పోల్చిచూచినచో సగటున వ్యవసాయదారు 1 కి య 2-9 సెంట్లు సాగుబడిభూమి వచ్చును. ఇందు ఎ 0-65 సెంట్లు మాత్రమే పల్లపు సాగుభూమి కలదు."[1]

ఈచిన్న ఖండముల భూమితో రైతు కుటుంబపోషణ మొనరించుకొనుట యెట్లు? అధికపుపన్నుల నిచ్చుటెట్లు? భూమిపై పెట్టుబడి పెట్టుచు బాగుచేయుట యెట్లు? అందుచే విస్తారముగ భూమి దరిద్ర దేవత వాతబడియున్న రైతులచే వ్యవసాయము చేయబడుచున్నది. ఇందులకుతోడుగ భూమిపంపకమున మంచిచెడ్డల ననుసరించి చీలికలు క్రింద తెగగొట్టబడుచున్నవి. (Fragmentation). ఒక్కొక్క ఖండము నందు ఎంతమంది పంచుకొనవలసివచ్చుచో అంతమంది యన్ని భాగములక్రింద నాఖండమునే విఖండములుగ చీల్చుకొనుచున్నారు. వ్యవసాయము చేసికొనుటకు రైతునకు సులువు దప్పుచున్నది. విభాగములు, విఖండములు జరుగకుండ నిషేధింపవలెననిన వారసత్వపు హక్కులకు వ్యతిరేకమగును. వారసత్వపు హక్కులకు వ్యతిరేకము గాని పద్ధతిని వ్యవసాయమున కనువుగ విభాగ విఖండముల నిషేధించుచు రెంటికిని పరస్పర నైపుణ్యముగాని శాసనములు గావించుటకు వీలులేదు. పంజాబు దేశమునందువలె (కోఆపరేటివు) సహకారసంఘములను స్థాపించి యీచిన్నచిన్న చీలికల నేకమొనరించుటకు ప్రయత్నించుట సమంజసమని కొందఱి తలంపు. 3 సంవత్సరములలో 133 సంఘములిందుల కేర్పరుపబడి 35000 విఖండములను 4500 ఖండములుగ నొనరింపగలిగిరి.

---

1. *From Census Report P. 288.*

"మొదటి 5 సంవత్సరములలోను యె 39757 లు కలుపబడి నవి. 6 వ సంవత్సరమున 20000 లు కలుపబడినవి. 1926 లో 38000 ఎకరములు కలుపబడినవి. ఇట్లు కలుపుటకుగాను 8 గురు ఇన్స్పెక్టర్లును, 85 మంది సబుఇనస్పెక్టరులును నియోగింపబడిరి. గతసంవత్సర మిట్లుకలుపుటకు 1 లక్షరూపాయలుమాత్రమే ఖర్చు. అనగా యె 1 కి రు 1-6-0 లు మొదలు రు 2-11-0 ల వఱకుమాత్రమే సగటున ఖర్చు తేలినది. ఈవిధానము కొనసాగి అనుభవము సంపాదించినకొలదియు ఖర్చుకూడ తగ్గగలదు. 1927 వ సం॥ జూలై వఱకు 98000 ఎకర ములు కలిపివేయబడినవి. 314 గ్రామములలో నీపని కొనసాగినది. 133000 విఖండములు కలిపి యీవిఖండములు 25300 భాగములుగ నొనరింపబడినవి. ఈభాగములు సగటున యె 0-70 ట్లు పరిమితినుండి ఎ 3-80 సెంట్లు పరిమితివఱకు పెంపబడెను.

ఈ మార్పులవలన ఎవరును తమకుగల భూమిపరిమితిని కోల్పో లేదు. విఖండములను కలుపుటకు పూర్వముగల పరిమితికి యెవరికిని తక్కువరాలేదు. చిన్న చిన్న ఖండములు గలవారిని తొలగించివేయ లేదు. నిర్బంధింపబడలేదు. లాభాలాభముల ననుసరించి రైతులకు నచ్చజెప్పబడి ఖండములు కలుపబడెను.[1]

ఈపద్ధతి యుపయుక్తముగనే యున్నది. కాని ఈపద్ధతి విభా గములనుగూడ కలుపుట కుపయోగపడదు.

ఇందులకు తోడు భూమికలిగియుండి వ్యవసాయము జేసికొను వారికంటె వేరు వృత్తిలేక వ్యవసాయమునకు దిగువారధికముగ నున్నారు. పంజాబులో 100 కి 22.5 మంది సగటునే ఒక్క ఎకరము అంతకంటె తక్కువ పొలమును వ్యవసాయము జేయుచున్నారు.

1. *Agricultural Journal of India March 1927, by C. F Strickland, I. C. S.*

100 కి 15.4 మంది ఒకటి లేక 2½ ఎకరముల భూమిని, 100 కి 17.9 మంది 2½ ఎకరములు లేక 5 ఎకరముల వ్యవసాయమును, 100 కి 20.5 మంది 5 లేక పది ఎకరములను వ్యవసాయము జేయుచున్నారు.

ఈవిభాగ విఖండముల సమస్య భూస్వామ్యపుహక్కు గలవారి యందు(Right holders) గలదు. (అనగా భూమియందు వంశపరంపర ముగవచ్చు హక్కును గలిగియున్నవారు)- వీరు భూకామందులు గావచ్చును. జరాయితీహక్కును పొందినవారు గావచ్చును. వ్యవసాయ దారులయందు (Cultivators) గూడ నీవిభాగ విఖండ సమస్య గలదు. (అనగా భూకామందుగగాని జిరాయితీదారుగ గాని వ్యవసాయము చేయువారియందు) ఈ రెండు తెగలవారియందును గల విభాగవిఖండ సమస్యలకు తారతమ్యమేమియు లేదు. కారణ నివారణోపాయములు రెండును గూడ సమానములే.

**మధ్యరాష్ట్రముల విఖండములను కలుపుశాసనము.** మధ్యరాష్ట్రములయందు(Central Provinces) భూవిఖండ ములను గలుపుటకు ప్రయత్నించుచున్నారు. ఇక్కడ పంజాబునందువలె సహకార పరపతిసంఘముల మూల కలుపుటకు ప్రయత్నింపబడుటలేదు. పంజాబు నందు భూమియొక్క మంచిచెడుగులు కొంచెమించు మించుగ సమానముగనున్నవి. అందుచే విఖండముల గలుపుటకును మార్చుటకును వీలుగలిగెను. మధ్యరాష్ట్రములయందు భూముల తర ములయందు, మంచిచెడుగులయందు, హక్కుబేహక్కులయందు విశేష క్లిష్టపరిస్థితులుండుటచే శాసనమొనరింపవలసి వచ్చెను. 1928 వ సంవ త్సరమున మధ్యరాష్ట్రముల శాసనసభ విఖండములను గలుపు శాసన మొనరించెను.(The Central Provinces Consolidation of Holdings Act). ఈశాసనమును చెటిసుగరా డివిజనునకు మొట్టమొదట వర్తింపజేసిరి.

(Chhattisgarh). ఈశాసనము ననుసరించి యొక యుద్యోగి నియమింపబడెను. ఈశాసనము ననుసరించిన విధానమునుబట్టి ఏగ్రామమందైన కొంత నిర్ణీతమగు భూమిని కలిగియున్న (భూమిహక్కుతో గూడ) యే యిద్దరుగాని, కొందరుగాని తమవిఖండములను గలుపవలెనని ప్రభుత్వోద్యోగిని కోరవచ్చును. కాని శాశ్వతహక్కు గలవారిలో సగమునకు తక్కువగానిమంది ఆగ్రామభూమిలో మూడింటరెండువంతుల భూమిని కలిగియున్నవారు ప్రభుత్వోద్యోగి నిర్ణయము నంగీకరింపని యెడల నీశాసనమమలులోనికి రాదు. అంగీకరించుచో మాత్రము మిగిలినవారు కూడ నంగీకరించితీరవలయునను నియమము కలదు. ఇట్లంగీకరింపబడిన నిర్ణయము నెవరుగాని సివిలుకోర్టుల మూలమున ప్రతిఘటించుటకు హక్కులేదు. ఈ నిర్ణయము వంశపరంపరగ నమలునందుండును. ఈయుద్యోగి నిర్ణయము సెటిలుమెంటు కమీషనరుగారి యంగీకారమును మాత్రము బొందవలయును. రాష్ట్రప్రభుత్వమునకు గూడ మార్చుట కధికారము కలదు. ఈవిధానము బాగుగనే యున్నదని వ్యవసాయ విచారణ సంఘమువారి నిశ్చయము.[1]

**బొంబాయి విఖండములను గలుపు శాసనము.** బొంబాయిరాజధానియందు విఖండములను గలుపుటకు 1927 వ సంవత్సరమున శాసనసభ యందొక చట్టము ప్రవేశపెట్టబడెను.

చట్టము ననుసరించి లాభకరముగ వ్యవసాయము చేయుటకనువగు భూపరిమితిని మొట్టమొదట నిర్ణయింపవలసియున్నది. ఈనిర్ణయమునకంటె తక్కువ పరిమితిగల ఖండములన్నియు విఖండములుగ ప్రకటింపబడును. ఇట్లు ప్రకటింపబడిన పిమ్మట ఆ విఖండములు మరెవరికిని అమ్ముటకు వీలులేదు. ఆవిఖండములకు చేరియున్న భూస్వామికి లేక వ్యవసాయదారునకు విఖండములను కలుపుటకు

1. *Agricultural Commission Report para 125.*

విఖండములను కలుపుటకుగూడ శాసనము లొనరించుకొనవలసి వచ్చును.

రైతులసమ్మతిపై విఖండములను గలుపుటకు సాధ్యముగాదని అనుభవజ్ఞులు దలంచుచున్నారు. పంజాబునం దవలంబించుచున్న విధానము సంపూర్ణముగ కొనసాగలేదు. ఈవిధానమును ఇతరరాష్ట్రములు అనుసరింపలేదు. సంయుక్తరాష్ట్రముల శాసనముగూడ ఆచరణయం దుపయోగకరముగలేదు. పంజాబునందు విఖండముల సమస్యపై కృషిసలుపుచున్న కాల్వెర్టుగారు (H. Calvert), డార్లింగుగారు (M. L. Darling), స్టికులాండుగారు (C. F. Stickland) మువ్వురును విఖండ సమస్యను పరిష్కరించుటకు తీవ్రమగు శాసనములు గావలెనని వ్యవసాయ విచారణసంఘమువారి యెదుట సాక్ష్యమొసంగిరి. "రైతుల సహకారముతో గూడిన శాసనములొనరింపబడినవి. అవి (Permissive Legislation) నిరుపయోగములైనవి." అనిగూడ వీరుచెప్పిరి. బరోడాయందుగూడ రైతులసహకారముపై నాధారపడుచు విఖండములను కలుపుటకనువగు శాసనము లొనరింపబడినవి. కాని యీశాసనములు నిష్ప్రయోజనము లైనవని సర్. మనూభాయి మేహతాగారు ప్రకటించిరి.[1]

ఈజిప్టుదేశమున వారసులు భూమినిపంచుకొనినను, వ్యవసాయము మాత్రము కుటుంబమునందొక్కడే అందరిపక్షమున చేయుచుండును. లేక అందరిపక్షమున మరొకధర్మకర్తకు (Trustee) వ్యవసాయము చేయుట కిచ్చివేసెదరు. ఈపద్ధతిని హిందూదేశమునందుగూడ అవలంబింపదగునని కొందఱిసూచన.

*1. Sir. Manubhai Metha's Presidential Address 1926 to Bombay Provincial Co-operative Conference.*

# 28. విభాగ విఖండముల వలన గలుగు లాభములు.

ఈసూచనల ననుసరించి విఖండములను కలుపుట అత్యవసరము కాదని తలంచువారుగూడ కలరు. విఖండములవలన కొన్నిలాభము లున్నవి. కొన్నికొన్ని పరిస్థితులలో విఖండములుండుటయే రైతున కార్థికముగ లాభకరము. వివిధతరగతుల భూములలో కొంతకొంత భూమిని కలిగియుండుటవలన కాలముననుసరించి కలుగు నష్టములు అన్నిఖండములకు గలుగకుండ నుండుటకు వీలుగలదు. కొన్నిఖండ ముల పంట పోయినను, మరికొన్నిఖండములయందైనను లభించును. పల్లపుసాగుబడిగల డెల్టాజిల్లాలయందొక గ్రామపుభూమి మూడుపంట కాలువలక్రింద గలదు. ఇందేపంటకాలువక్రిందనైన భూమియంత యును గలిగియుండుట రైతునకు లాభకరముకాదు. ఒకకాలువక్రింద భూమికి నీరుయెక్కుట సులభము. మరొకకాలువక్రింద భూమి సారము గలదగుటచే పంట హెచ్చు. మూడవకాలువక్రిందభూమి ఊరునకు సమీపము. రైతునకు వ్యవసాయపుహంగు హెచ్చు. పెంటజేసికొనుట సులభము. ఇందేకాలువక్రింద భూమియు, రైతువిడుచుట లాభకరము కాజాలదు. అన్నికాలువలక్రిందను భూమిని గలిగియుండుటయే అత నికి లాభకరము. ఇట్లె మెరకపంటగల భూములలో రైతు భూసారము ననుసరించి వేరువేరుపైరులను వేయుచుండును. మెరకసాగు రైతునకు రెండుమూడు చోట్ల భూమియున్నచో, రెండుమూడురకముల పైరులను వేయును. ఒకపైరు పాడయిపోయినను, వేరొకభాగమునందలి పైరయి నను ఆతనికి దక్కును.

"హిందూదేశమునందనేక ప్రదేశములలో రెండుమూడు రక ముల పంటలు వేరువేరు భూములలో వేయబడుచున్నవి. కాలమానము

ననుసరించి ఒకపంట ఒకభూమిలో పాడయినను మరొకభూమినుండి వేరొకపంటవలననైన రైతునకు ప్రతిఫలము వచ్చుచున్నది. పాశ్చాత్య దేశముల వ్యవసాయమువలె గాక, పంటలను మార్చుచు, సేద్యము చేయుటకు విభాగములు, విఖండములు, వేరువేరుచోట్ల నుండుట వలననే భారతదేశమునందు వీలగుచున్నది.” అని రాధాకమల ముఖర్జీ గారి నిర్ణయము.[1]

ఈవాదమునందెంతయో సత్యమున్నది. విభాగ విఖండముల సమస్య పరిష్కరించునపుడే విషయము గుర్తించు టత్యవసరము. మఱియు, పెద్దకమతములవలన సంఘమునకు కలుగులాభనష్టములను చిన్నకమతములవలన సంఘమునకుకలుగు లాభనష్టములనుగూడ గమనింపవలెను. ఒకప్పుడు వ్యక్తికి లాభకరమగు విషయము సంఘమునకు గూడ లాభకరము కాకపోవచ్చును.

<u>పెద్ద కమతములు</u> వ్యవసాయముచేయుట కనువుగనున్నను, వ్యవసాయమునందు ఖర్చును క్లుప్తపరచుటకు వీలైనను, విశేషధన మొక్కరికే సంక్రమించుటచే వారు దానధర్మాదులను విరివిగచేయుటకు సావకాశము గలించుచున్నను, సంఘదృక్పథమున లాభకరము కాదు. ఇందువలన ధనాఢ్యకోటి ప్రబలుదురు. సంఘాదాయమంతయు గొందఱివశమే యగుచుండును.

<u>చిన్నకమతములు</u> వ్యవసాయముచేయుటకు కష్టముగనుండును. అధికశ్రమ, స్వల్పఫలితము లభించుచుండును. ఖర్చులుగూడ హెచ్చుగ నుండును. అందఱకు సామాన్య అంతస్తు మాత్రమే లభించును. అత్యధిక అంతస్తు లభించదు. కాని సంఘమునందు భాగ్యము కొంతవరకైన చిన్నకమతముల వలన వ్యాప్తిజెందగలదు. ధనాఢ్యులకును, కడుబీదల

---

1. *Radha Kamal Mukerji's article on Fractionalization, April 1927, Indian Journal of Economics.*

కును మధ్యగ నొక మధ్య శ్రేణి ప్రజలుండుటకు వీలగును. పొలము స్వల్పముగనుండుటచే విశేషకృషి జేయుటకు వీలగును. ఖండక్షేత్రముల సేవ్యము వలన కాయకష్టమునందు, ఆరోగ్యమునందు, స్వచ్ఛంద జీవనమునందు అలవాటుపడు పల్లెటూరు జాతి సాంప్రదాయ మేర్పడగలదు. ధనాఢ్యుల నిరంకుశమునకు విశేషప్రజ లోనుగా నవసరము కలుగదు. ఇందువలన సంఘమునందొక విధమగు సుస్థిరత్వ మేర్పడగలదు. ఇట్టి లాభముల వలన విభాగవిఖండములు కూడ సమర్థింపబడుచున్నవి. ప్రస్తుత శాసనముల ననుసరించియు సంఘార్థిక వ్యవస్థ ననుసరించియు ఇంగ్లండునందువలె పెద్దకమతములు హిందూదేశమునందేర్పరచుట తగనివని యని కొందఱి విశ్వాసము.

# 29. ఒక రైతు కుటుంబమున కెంత భూమి కావలయును?

చిన్నకమతములు ఆర్థికాభివృద్ధికరము కాదనుటయందు మరొక విషయము గమనింపవలసియున్నది. ఎంతభూమి రైతుకుటుంబమునకవసరము? ఎంతకమతము సేవ్యము చేయుటయం దనవసరవ్యయముండదు? తక్కువ వ్యయప్రయాసలతో నొక రైతుకుటుంబము సేవ్యము చేసికొని సుఖజీవనము గడుపుట కెంత కమతము కావలసియుండునను విషయము నిర్ణయించుట కష్టము. అన్నిరాష్ట్రముల యందున, అన్నిదేశములయందున నొకేరీతిగ నీ పరిమాణమును నిర్ణయింపజాలము. ఈ నిర్ణయమునందు గమనింపదగు విషయములేమి?

1. ఏప్రదేశమున రైతుకుటుంబమునకు వలయు భూమిని మనము నిర్ణయించుచున్నామో, ఆప్రదేశమున పెట్టుబడి విరివిగను

వేసికొని ఏబారుగురుగల తనకుటుంబమును పోషించుకొనుచున్నాడు. నేపిల్సు,ప్యారిసు నగరములచుట్టును నిట్టితోటలే విస్తారముగగలవు. ఒక నగరముచుట్టును పది పది హేనువందల కుటుంబములు జీవించుచున్నవి. ద్రాక్షి, ఆలివు, నిమ్మ, బంగాళాదుంప, పొగాకు, నారింజ వగయిరా నాలుగయిదు ఎకరముల విస్తీర్ణముగల తోటలమీదనే ఒక కుటుంబము జీవింపగలుగుచున్నది.

గోధుమ వగయిరా అపరములు పండించువారికి 10 లేక 12 ఎకరముల భూమి కావలసివచ్చుచున్నది. తదితర వ్యవసాయమునకు, పశువులమేతకు 25 లేక 50 ఎకరములభూమి కావలసివచ్చుచున్నది.

అపరదినుసులు పండించుచోట ముఖ్యముగ జర్మనీలో 10 లేక 12 ఎకరముల భూమి కావలసివచ్చుచున్నది. దక్షిణజర్మనీలో 12½ ఎకరముల భూమిమీద నొకకుటుంబము సుఖజీవనము చేయ గలుగుచున్నది. అనగ ఆరైతు పశువృద్ధియు, మేకలు, పందులు, కోళ్లు గలిగియుండి వీటికృషి వీటివలన గలుగు ఫలితము వ్యవసాయ ఫలసాయమునకు తోడుగ నుండును. భూమి బలపడుచుండును. 2 ఎకరముల మేర గోధుమ పండించును. రెండు ఎకరములు పచ్చిక బీడుగ నుండును. కొద్దిభూమిలో పొగాకు వేయును. మరికొంతలో ఫలవృక్షములు వగయిరాలు పెంచును.

హాలెండు దేశమున పందులు, కోళ్లు, పశువులు గలిగి వ్యవసాయము చేయుచున్నవాడు 7½ ఎకరముల మీదనే జీవించుచున్నాడు. 10 ఎకరములున్నచో మిగుల్చుకొనగలుగుచున్నాడు. వీరందరు భూమిని బాగుగ బలముజేసి పంటలు పండించుకొందురు.

ఇంగ్లాండు దేశమున కుటుంబవ్యయము కొంత యధికముగ నుండును. వారి అంతస్తు హెచ్చు. అందుచే అచ్చట పదిఎకరములకు

తక్కువ వ్యవసాయము చేసిన గిట్టుబడియే యుండదు. ఆక్సుఫర్డు, యార్క్‌షైరు ప్రాంతములలో పాతిక ముప్పది ఎకరముల వ్యవసాయము చేసినచో నితర పరిశ్రమల యాధారములేక రైతు తన్ను పోషించుకొనగలడు.

యూరపుఖండమునం దేదేశమున జూచినను, 2 ఎకరముల కూరతోటల భూమివలన లేక, 7, 8 ఎకరముల గోధుమ మొదలగు అపరముల భూమివలన, లేక 25 మొదలు 30 ఎకరముల సాగుబడి భూమివలన కుటుంబపోషణ జరుగుచున్నది.

మనదేశమునం దెట్లున్నది? పంజాబు విషయముల గొన్నింటిని పరిశీలించెదము. పంజాబులో 1¼ ఎకరము మొదలు రెండు ఎకరముల న్నర విస్తీర్ణముగల తోటలమీద పెక్కు వ్యవసాయ కుటుంబములు జీవించుచున్నవి. ఒక కుటుంబములో నొకముసలివాడు, తన కుమారుడు, యిద్దరు స్త్రీలు, ముగ్గురు పిల్లలును గలరు. ఒకకాడి దున్నలు, ఒక గాడిద కలవు. ఈకుటుంబము అరఎకరము లోపుగ గల భూమిని దున్నుకొని కాలక్షేపముచేయుట తానెరుంగుదునని పంజాబు సహకార సంఘముల రిజిష్ట్రారగు డార్లింగుగారు చెప్పుచున్నారు.

ముసలివాడు దున్నలతో పొలముదున్నును. మోటలాగుటకు వానినే యుపయోగించును. పడుచువాడు పండినకూరగాయలను గాడిద మీద వేసికొని బస్తీకిగొనిపోయి అమ్ముకొనివచ్చును. పంజాబులో మరియొకగ్రామమున ఒకడు తాను, తనభార్య, నలుగురుపిల్లలును గల కుటుంబమును ముప్పాతిక ఎకరము మాత్రమేగల జరీబుతోటలో కూరలుపండించి పోషణమొనర్చుచున్నాడు. అతడు బావిక్రింద వ్యవసాయము చేయుచున్నాడు. కూరలు, మొక్కజొన్న, సస్యపుపొగాకు పండించుచుండును. పొడుముపొగాకున కక్కడ విలువ యెక్కువ,

పంజాబులోని పట్టణముల సమీపమున పాడుముపోగాకు అంత మంచిదికాదు. అందుచే రెండుఎకరముల తోటమీదగాని జీవింపలేకున్నాడు. సియల్‌కోట ప్రాంతమున ఒకఎకరము తోటమీదనే కుటుంబ పోషణ మొనర్పగలుగుచున్నారు. పంజాబులో పల్లపుసాగు చేయువారికి కుటుంబపోషణకు సుమారు 15 ఎకరములు మొదలు 30 ఎకరములవఱకు కావలసివచ్చుచున్నది. ఆమాత్రపు విస్తీర్ణము లేనియెడల కుటుంబమును పోషించుట కష్టము.[1]

## 30. సమిష్టి వ్యవసాయము.

ఈపై విషయములన్నియు గమనించినపిమ్మట తేలిన సారాంశము లేమి?

1. విఖండములను గలిపినంత మాత్రమున రైతునకు నూతన సౌఖ్యలోకము సిద్ధింపదు. కలుపకపోయినచో నష్టముగలుగుట నిశ్చయము.

2. పెద్దకమతములవలన వ్యవసాయాభివృద్ధికి వీలున్నది. కాని, సంఘూదాయమంతయు కొందఱివశము మాత్రమే యగుటచే పెద్దకమతములు వాంఛనీయము కాదు. చిన్నకమతములవలన నూతనయంత్రసహాయమున అధికోత్పత్తిని చేయజాలము. అధికోత్పత్తి కావలసినను నూతనయంత్రముల నుపయోగింపదలంచినను చిన్నకమతములు పనికిరావు.

3. నేటివఱకు గావింపబడిన శాసనములును ప్రయత్నములును ఈసమస్యను పరిష్కరింపజాలకపోయెను. పాశ్చాత్య దేశములయం

1. సత్యాగ్రహిపత్రికనుండి 1928 మార్చి 26.

దవలంబించిన పద్ధతులుకూడ మన దేశ పరిస్థితుల కుపయోగపడు నట్లుగ లేవు.

ఇక మన కర్తవ్యమేమి? వ్యవసాయపుభూమిని పెంచియు, ప్రశస్తమగు వ్యవసాయముజేసియు, పంటల నధికముగ పండించవలె ననుట నిర్వివాదాంశము. ఇందులకు పెద్దకమతములు, నూతనయంత్ర ములు అత్యవసరములు. కాని పెద్దకమతములవలన గలుగునష్టము లను తొలగించవలయును. పెద్దకమతములవలన గలుగు నష్టములు తొలగింపజూచిన వ్యష్టివ్యవసాయము పనికిరాదు. చిన్నకమతముల వలన గలుగుచున్న లాభములను వదిలపరచుటకుగూడ వ్యష్టివ్యవసా యము కూడదు. సమిష్టివ్యవసాయ సిద్ధాంతమును ప్రవేశబెట్టుచో పెద్ద కమతములవలన గలుగు లాభములును చిన్నకమతములవలన గలుగు లాభములును రెండునుగూడ పొందగలము. విఖండవిభాగ సమస్యయు, సునాయాసముగ పరిష్కారము కాగలదు. సమిష్టివ్యవసాయమును ప్రవేశపెట్టుటకు మూడుమార్గములు గలవు.

1. రైతులు తమలో తామేకమై ఉమ్మడిగ వ్యవసాయము నంతను చేయించుకొని ఎకరములవారీని ఫలసాయమును పంచుకొన వచ్చును. ఇట్లు చేయుచో స్వల్పవ్యయమగును. లాభమధికముగ నుం డును. ఉమ్మడిగ వ్యవసాయపు పనిముట్లను, యంత్రములనుగూడ తెప్పించుకొనుటకు వీలుండును. అనుభవము ననుసరించి ఏయేభాగ ములు కలిపి వ్యవసాయముచేయుట కనువుగ నుండునో నిర్ణయించుకొన గలుగుదురు. కాని ఐచ్ఛికముగ రైతులిట్లు కలిసి పనిచేయజాలరు.

2. వ్యవసాయ సహకార సంఘములు స్థాపింపబడి సమిష్టివ్యవ సాయము చేయించవచ్చును. ప్రతిగ్రామమున సహకారసంఘమే భూమి నంతను వ్యవసాయమ్ముజేసి ఎకరముల వారీని ఫలసాయమ్మును (ఖర్చులు

ఆసంఘము పన్నులను చెల్లించివేయగలదు. పన్నులనుగూడ గ్రామపు మొత్తమున నిర్ణయించుటకు వీలుండును. ఈపన్నులవసూళ్ళకై విశేష వ్యయప్రయాసలుండవు. పన్నులవసూళ్ళకొఱకును, భూముల సరిహద్దుల సంరక్షణకొఱకును మొదలగుపనులకై నేడుపోషింపబడుచున్న అధికప్రభుత్వయంత్రమును తగ్గింపగలుగుదుము. మరియు రైతులకు దావాలబాధకూడ నూటికి 90 వంతులు తగ్గును. (గట్లనువేసికొనుట, పచ్చగడ్డిని కోసికొనుట మొదలగుచోట్ల గలుగు పోరాటములవలన సివిలు క్రిమినలుకోర్టులకు పోవుట తగ్గును.)

ఏవిధముగ పరీక్షించినను సమిష్టివ్యవసాయము నేదోయొక విధముగ ప్రవేశపెట్టుట సర్వవిధముల లాభకరముగ దోచుచున్నది.

## 31. వ్యవసాయాభివృద్ధికి రష్యాదేశమునం దవలంబించుచున్న పద్ధతులు.

"రష్యాదేశమునందు వ్యవసాయాభివృద్ధి వాయువేగమున జరుగుచున్నది. 5 సంవత్సరముల కార్యక్రమ మేర్పరుపబడెను. ఈకార్యక్రమమునందు వ్యవసాయసమస్యల నన్నింటిని చాలవఱకు సంస్కరింప సమకట్టిరి. రష్యా విప్లవానంతరము సేద్యపుభూమి విభాగము లొనరింపబడి ప్రజకు పంచిపెట్టబడినను వ్యవసాయాభివృద్ధిమాత్రము జరుగలేదు. సేద్యముచేయబడుచున్న భూమిలో 100 కి 60 వంతుల భూమిని 100 కి 60 వంతులమంది ప్రజలు వ్యవసాయము చేయుచున్నారు. వీరు మధ్యతరగతిప్రజలు. 100 కి 30 వంతులభూమిని 100 కి 10 వంతులప్రజ వ్యవసాయము చేయుచున్నారు. వీరు భాగ్యవంతులగు రైతులు. మిగిలిన 100 కి 10 వంతులభూమిని మిగిలిన 100 కి 30 వంతులరైతులును వ్యవసాయము చేయుచున్నారు. వీరు బీద

రైతులు. భూమి పంచిపెట్టబడినను, వ్యవసాయమునకు సంబంధించిన విఖండవిభాగముల సమస్యయు, ఎఱువులసమస్యయు, అధికోత్పత్తిసమస్యయు రష్యాదేశమునందునగూడ పరిష్కరింపబడలేదు. 5 సంవత్సర కార్యక్రమమునందే యీసమస్యలను పరిష్కరింప నిశ్చయించిరి. ప్రస్తుతము రష్యాయందు వ్యవసాయము మూడుభాగములుగ జరుగుచున్నది.

1. చిన్నచిన్నరైతులు, చిన్నకమతములు.
2. ఉమ్మడి వ్యవసాయము.
3. ప్రభుత్వ వ్యవసాయము.

మనదేశమునందువలెనే చిన్నచిన్నరైతులు పూర్వసాంప్రదాయముల ననుసరించి వ్యవసాయము చేయుచున్నారు. వీరికి రష్యాదేశ ప్రభుత్వము వివిధరీతుల సహాయము చేయుచున్నది. చిన్నకమతముల మీాద పన్నులను తీసివేసెను. పెట్టుబడిని వలయునంతగ సకాలమున లభింపజేయుచున్నది. విప్లవమునకు పూర్వము 16 మిలియనులు (160 లక్షలు) మాత్రమేయున్న రైతులసంఖ్య నేడు 26 మిలియనుల వఱకు పెరిగెను. ఈ 260 లక్షలమంది వ్యవసాయదారులును చిన్న చిన్న కమతములను సాగుచేయుచుండుటచే వ్యవసాయాభివృద్ధి కాలేదు. అందుచే చిన్నచిన్నకమతముల మధ్యగల సరిహద్దుగట్లనుకూడ తీసివేసి వ్యష్టివ్యవసాయము నాపుజేసి సమిష్టివ్యవసాయమునకు ప్రారంభించిరి. ఈసమిష్టివ్యవసాయమున గ్రామములు, తాలూకాలు, జిల్లాలు కూడకలిసిపోయినవి. పల్లెలును, బస్తీలునుకూడకలిసిపోయినవి. ఉరాల్సునందు (Urals) ఇరిబిట్ జిల్లాలో (Irbit) 135000 హెక్టర్లభూమిని కలిపివేసిరి. (హెక్టరనగా 2471 ఎకరములు). ఇందు 110 గ్రామములు కలిసిపోయినవి. ఈగ్రామములలో 19000 ప్రజలు గలరు.

ఈ పెద్దకమతమును 5 భాగము లొనరించిరి. ఈపనియంతయు జరుపుటకు ఏవిధమగు దార్ఢ్యమును ప్రభుత్వమువా రుపయోగించ లేదు. ప్రజలు తమకమతమును 1929-1930 సంవత్సరాంతమునకు 275000 హెక్టార్లకు పెంచుట కాశించుచున్నారు. ఇట్లే దేశమునందు పలుతావుల సమిష్టివ్యవసాయము జరుగుచున్నది. ఇట్లు ప్రజలు సమిష్టి వ్యవసాయమునకు బూనుటకు వారియందుగల సమిష్టిభావమే కారణముకాదు. రష్యాదేశ ప్రభుత్వము ఒక్క 1929-30 వ సంవత్సరమునసే సమిష్టి వ్యవసాయమునకు తోడ్పడుటకుగాను 320 మిలియను రూబిల్సు సొమ్మును ప్రత్యేకించెను. ప్రభుత్వమువారు వ్యవసాయ యంత్రములను మోటారు ట్రాక్టర్లను (ట్రాక్టరనగా ఒకేయంత్రము. దున్నుట, నాటుట, కోయుట, నూర్చుట మొదలగు పనులన్నియు చేయు యంత్రము.) ఉంచు శాలలను దేశమందంతటకట్టించిరి. ఇంకను కట్టించుచున్నారు. 1929-30 వ సంవత్సరమున 200 శాలలను 5 మిలియనుల హెక్టారుల భూమిని సేద్యముచేయుటకు తగియున్న యంత్రముల నుంచుటకొఱకై నిర్మించిరి. 5 సంవత్సరముల కార్యక్రమమును ముగియునప్పటికి 40 మిలియను హెక్టారుల భూమిని సేద్యము చేయుటకు వలయుయంత్రముల నుంచు శాలలను నిర్మింపగలరు. ఈ శాలలయందు నేడు 5 వేల ట్రాక్టరులు పనిజేయుచున్నవి. 5సంవత్సరముల కార్యక్రమమును ప్రారంభించుటకు పూర్వము వ్యవసాయయంత్రములు 1 బిలియను రూబిల్సు విలువగలిగినవి మాత్రమే యున్నవి. ఈ 5 సంవత్సరముల కార్యక్రమము ముగియునప్పటికి మూడు బిలియనుల రూబిల్సువిలువగల యంత్రములుండును. అనగా 5 సంవత్సరముల కార్యక్రమ ప్రారంభమున 30000 ట్రాక్టరులు గలవు. ఈ కార్యక్రమము ముగియునప్పటికి 350000 లేక 400000 వఱకు పెరుగగలవు. ఈసంవత్సరముల పిమ్మట సాలుసరి 100 కి 35 వంతులు అద

నముగ ఫలసాయ ముండునని అంచనా వేయబడెను. ఈ ఫలితమునకై ప్రభుత్వమువారు రైతులతో నొడంబడిక గావించుకొను చున్నారు. వ్యవసాయ యంత్రశాలలు వ్యవసాయము చేయుట కొడంబడును.

రైతులు, యంత్రములతోపాటు పాటుబడుట కంగీకరించెదరు. యంత్రముల కృషియు, రైతులపాటును,గలిపి, పండినపంటలో యంత్రముల నొసంగినందులకై అద్దెను ప్రభుత్వమున కొసంగెదరు. మిగిలిన పంటను రైతు లనుభవించెదరు. యంత్రములతో పాటు ఎరువులను గూడ, ప్రభుత్వమువారే రైతుల కందిచ్చెదరు. ఈ ప్రభుత్వసహాయమువలన, సమిష్టివ్యవసాయదారులు అధికలాభములను పొందుచుండుటచే, చిల్లరరైతులందరు గూడ, ఉమ్మడివ్యవసాయమునకు తమంతతామే యంగీకరించుచున్నారు. 100 కి 85 వంతుల రైతు లీసహాకారవ్యవసాయమునకు 5 సంవత్సరములలోను బూనెదరు.

మఱియు, రష్యాప్రభుత్వమువారే వ్యవసాయశాలలను నడుపుచున్నారు. పెద్దకమతముల వలనను, ఖనిజములతో గూడిన ఎరువుల నుపయోగించుట వలనను, యంత్రముల సహాయమునను, అల్పవ్యయమునను, అధికోత్పత్తికి గలమార్గములను ప్రదర్శించుచున్నారు. ఈప్రదర్శనము, సమిష్టివ్యవసాయమునకు ప్రోత్సాహకరముగ నున్నది.*[1]

(ఈపైవిషయములు గ్రింకోగారి అయిదుసంవత్సరముల కార్యక్రమమను పుస్తకమునుండి గ్రహింపబడినవి.)

# 32. ప్రదర్శనము, పరిశోధనము, ప్రచారము, ప్రయోగము.

విద్యావ్యాప్తిలేని భారతవర్షమున-చదువను వ్రాయను గూడ నెఱుంగనిరైతు లధిక సంఖ్యాకులుగనుండిన భారతవర్షమున- వ్యవసా

*1. These Notes are taken from "The five year plan of the Soviet union by Mr. G. T. Grinko" P. 135-177*

గుఱించి ప్రతిదినము రైతులకు టెలిఫోనుల మూలమున తెలియపఱచు చుందురు. రాబోవు 24 గంటలలోను వాతావరణమున గలుగు మార్పులను రైతులు తెలిసికొనుచుండుటవలన వాతావరణము ననుసరించి పాడగుపంటలు పాడుకాకుండ రైతులు సంరక్షించుకొన గలుగుచున్నారు.

సాలుసరి అమెరికా సంయుక్తరాష్ట్రప్రభుత్వము వ్యవసాయ విద్యా ప్రచారమునకై రు 15000000 లను వినియోగించుచుండును. (1 మిలియనుపౌనులు) ........

అమెరికాయందలి అయోవారాష్ట్రము (Iowa) వ్యవసాయ విద్యాప్రవీణులను ప్రత్యేకపు రైలుమీద ప్రచారమునకై పంపు చుండును. కళాశాలనుండి ప్రత్యేకపురైలుబండి బయలుదేరు కాలము ముందుగ ప్రకటింపబడుచుండును. ఆ రైలు స్టేషనులకు చేరుసరికి రైతులచ్చట వేచియుందురు. ఆ రైలుమీదనే సభలు జరుపబడును.

ఈవిధముగ అమెరికాప్రభుత్వము సర్వవిధముల వ్యవసాయ విద్యాప్రచారమునకై కృషిసల్పుచున్నది. ఏ రైతునకైనను ఏవిషయమైన తెలియకపోయినచో ఆ రైతు తెలిసికొనుట నిరాకరించెనని చెప్పవలయునే గాని ప్రభుత్వమువారతనికి తెలిసికొనుటకు సదుపాయము లొనగూర్పలేకపోవుటచేత గాదు."[1]

అమెరికాదేశమునందువలెనే సర్వవిధముల వ్యవసాయ విషయములను ప్రచారము చేయవలెను. రాష్ట్రీయ, దేశీయ ప్రదర్శనములను పంటలు, పరికరములు, మొదలగునవి సమకూర్చుచు, నేర్పాటు చేయుచుండవలెను. నేడు అక్కడక్కడ జరుగుచున్న గొడ్లసంతలకు

1. *From the Improvement of Indian Agriculture Lessons from America by Mrs. Saint Nihal Singh. P. 29 to 62.*

వ్యవసాయశాఖవారు పోవుచు ప్రచారము చేయదగును. గొడ్లసంతలలో ఎరువులు, విత్తనములు, నూతనపరికరములు, మొదలగువాటిని గూడ విక్రయమునకై వ్యవసాయశాఖవారు గొనిపోవుచుండవలెను. వ్యవసాయపు పనిముట్లు, గొడ్లు అమ్మకములకై ప్రత్యేకపుసంతలను పెట్టింపదగును. నూతనయంత్రములను తెప్పించి యీశాలలయందుంచి రైతులకు అద్దెకు ఇచ్చుచుండవలెను. పరిశోధనకు, ప్రయోగమునకు, ప్రదర్శనమునకు, ప్రచారమునకు ఎంతసొమ్ము వినియోగించినను ఫలప్రదమేయగును. ఎంతసొమ్మునైన వినియోగించుటకు ప్రభుత్వము సంసిద్ధమైనగాని వ్యవసాయ మభివృద్ధికాజాలదు. సమిష్టివ్యవసాయమునకు రైతులను పురికొల్పుటయే ప్రయోగమునకు, ప్రచారమునకు ముఖ్యాదర్శముగ నుండవలెను.

## 33. వ్యవసాయ సదుపాయములు, ప్రభుత్వవిధానము.

18 వ శతాబ్దమునందే పాశ్చాత్యప్రపంచము వ్యవసాయాభివృద్ధికర విజ్ఞానము నొకింత మెఱుంగగలిగెను. 1815 వ సంవత్సరప్రాంతముననే వ్యవసాయాభివృద్ధి బ్రిటిషుదీవులలో పూర్ణవికాసము నొందినది. ఫ్రాన్సు, జర్మనీలలో 19 వ శతాబ్దమువఱకు వ్యవసాయాభివృద్ధికర నూతనవిధానవిప్లవము రానేలేదు. 19 వ శతాబ్దమధ్యమువఱకు పరివర్తన మితరదేశములయందు కలుగుచునేయున్నది. ఈకాలముననే పొలములకు కట్టలు వేసికొనుట, కంచెలు పెంచుట, పంటలను మార్చుచు వేయుచుండుట, వేళ్లను గడ్డియును వృద్ధిపొందు పంటలు వేయుట, మురుగుకాలువలను త్రవ్వించుకొనుట, ఎరువులను గుర్తించుట, నేర్చుకొనిరి. వ్యవసాయసాధనకు వలయు సామగ్రిని ఆధునికయంత్రి

శక్తితో తయారుచేయుట మొదలుపెట్టిరి. ఈ యంత్రసహాయమున వ్యవసాయమును వర్తకముగ మార్చిరి. 1870 వ సంవత్సరప్రాంతమున శాస్త్రపరిశోధనరూపముగు వ్యవసాయము ప్రవేశపెట్టబడెను. నాటి నుండియు వ్యవసాయసంరక్షణకొఱకు వ్యవసాయపుదినుసుల ఎగుమతి, దిగుమతులపై సుంకములు విధింప ప్రారంభించిరి.

భారతవర్షమున సనాతనకాలమునుండియు, నీవ్యవసాయాభినివేశము వంశపరంపరానుగతముగ క్రీస్తుపుట్టుట కెన్నియోవేల సంవత్సరములనుండియు భారతీయ రక్తనాళములలో ప్రవహించుచున్నది. రాజకీయపరిస్థితుల ననుసరించి జీవితవిధానమంతయు మారునుగదా? అట్లే వ్యవసాయాభివృద్ధికూడ మధ్యకాలమున సన్నగిలినది. రైతు నూతనవిషయముల గనిపెట్టుటకు దగుపెట్టుబడి లేదు. ధైర్యముచేసి నూతనవిషయము వ్యవసాయమున బ్రవేశపెట్టుటయు నది విఫలమును నగుచో ఆయేడాదంతయు నాతడు పస్తుండవలసినదే. సేద్యగాండ్ర యందనేకులు జీవితాధారమునకుకూడ చాలనంతభూమిని మాత్రమే కలిగియున్నారని పైన వ్రాయబడెను. భారతదేశమున వ్యవసాయమునకు మూడు నీటిఆధారములు గలవు. (1) బావులు (2) పంటచెరువులు (3) నదులు.

బావులు. ఈ బావులను వ్యక్తులే త్రవ్వించుకొనుచున్నారు. ప్రభుత్వ మీబావులను త్రవ్వించుకొనుటకు అప్పులిచ్చు విధానమును తయారుజేసిరి. ఈ అప్పులు సముద్రమునందు కాకిరెట్టవలె నున్నవి. కృష్ణాజిల్లావంటి జిల్లాలో రూ 5000 లు మాత్రమే యొసంగబడుచుండెను. ఈఅప్పునకు వడ్డికూడ గలదు. నూటికి రు 5 మొదలుకొని రు 6-8-0 వఱకు వడ్డీగలదు. మామూలు బావిని త్రవ్వించుటకు రాతితో కట్టకుండ గొయ్యివలె కట్టుటకు లేక

త్రవ్వుటకు రూ 300-0-0 మొదలు రు 600 వఱకు అగుచున్నది. శాశ్వతముగ త్రవ్వించవలెనన్న రూ 1000 లకు పైగ ఖర్చగును. ఈనూతులనుండి వ్యవసాయమునకు నీరు మోటలవలన తోడబడు చున్నది. ఆయిలుఇంజను లచ్చటచ్చట ప్రవేశపెట్టబడుచున్నవి. నూతులవలన సంయుక్తరాష్ట్రములయందు, పంజాబు, మదరాసు, బొంబాయి రాష్ట్రములయందు వ్యవసాయము హెచ్చుగ జరుగు చున్నది. తోటలకు దేశమందంతటను నూతులే యుపయోగించు చున్నారు. పల్లపుసాగులో 100 కి 25 వంతులు నూతులవలన సాగు బడి. దేశమునందంతట సుమారు 25 లక్షల వ్యవసాయపు నూతులు గలవు. 135 లక్షల ఎకరములభూమి వ్యవసాయము చేయబడుచున్నది. ఈనూతు లన్నిటిని రైతులే త్రవ్వించుకొనిరి.

చెరువులు. ఆంగ్లేయయుగమునకు పూర్వమే భారతదేశము నందు చెరువులు విరివిగ గలవు. వాననీరును చెరువుల లోనికి మళ్లించి వ్యవసాయమునకా నీరుపయోగించుట కధిక సదుపాయములు గావింపబడినవి. కృష్ణదేవరాయలు కాలమునాటి చెరువులు రాయలుసీమయందు నేటికిని అత్యంత వైభవముగ నున్నవి. ఇప్పుడు దేశమునందంతటగల యిట్టివ్యవసాయపు చెరువులు చిరకాలమునుండి భారతవర్షమునందున్నవే. ఈచెరువులకు తగు మరమ్మతు ప్రభుత్వము చేయించకపోవుటచే అనేక తావులయందలి పంటచెరువులు పాడయిపోవుచున్నవి. పంజాబు, సింధు దేశములయందు తప్ప యీపంటచెరువుల పద్ధతి దేశమునందంతట గలదు. మదరాసు, హైదరాబాదు, మైసూరురాష్ట్రములయం దధికముగ చెరువుల వ్యవసాయ మున్నది. ఉత్తర హిందూస్థానమందలి మహానదుల నిరంతర ప్రవాహోదకమిట్లు వంశపరంపరానుగతముగ చిరకాలమునుండియు

ముగనున్నను రైళ్ళవలన అమితధననష్ట మగుచున్నను, వ్యవసాయము నుపేక్షించి రైళ్ళకొఱకంతధనము వెచ్చించుట యకృత్యమని నిరసించిరి. ఇంతవఱకు గావింపబడిన కృషియు సక్రమముగలేదు. వలయు ముఱుగుకాలువలు త్రవ్వింపబడలేదు. ఉన్నవి సరిగ బాగుచేయబడుట లేదు. అందుచే భూములు చవుడువేయుచున్నవి. మలేరియా మొదలగు వ్యాధులు వ్యాప్తి జెందుచున్నవి.

వివిధమైన ఏళ్ళుగలవు. ఈఏళ్ళ జలమంతయు సక్రమముగ వ్యవసాయమున కుపయోగించుటకు వలయు ప్రయత్నముల జరుపలేదు. ఈనీటిని ఉపయోగింపక పోవుటయే గాక, సరియగుకట్టలు లేనందున ప్రతిసంవత్సరము వరదలువచ్చి వ్యవసాయమును పాడొనరించుచున్నవి. గోదావరి ఆయకట్టువలన నూటికి 22 రూపాయల ప్రతిఫలము ప్రభుత్వమునకు ముట్టినది. కృష్ణా ఆయకట్టువలన నూటికి 18 రూపాయల ప్రతిఫలము ముట్టినది. (Irrigation works) వ్యవసాయపు కట్టడముల మీద సగటున 100 కి రు 7 మొదలు రు 8 ల వఱకు గిట్టినది. ప్రభుత్వము 100 కి రు 3 మొదలు రు 3½ ల వఱకు వడ్డీతో నిందు కొఱకై అప్పుజేసెను. ఈవడ్డీ మినహాయింపబడుచో, ప్రభుత్వమునకు 100 కి రు 3 మొదలు రు 5 వఱకు లాభమువచ్చినది. 1921 లో ఫలదాయకమైన పనులవలన 100 కి రు 9 లు వచ్చినవి. ప్రతిఫలము రానివి మినహాయించుచో, ప్రభుత్వమునకు 100 కి రు 11 ల వఱకు వచ్చినదని చెప్పవచ్చును. సంరక్షణములగు కట్టడములవలన 100 కి రు 1 తక్కువగ వచ్చినది. చిల్లర పనులవలన 100 కి రు 4 మొదలు రు 6 ల వఱకు వచ్చెను.

| 1రాష్ట్రము | సేద్యపు భూమిలో పల్లపు సాగు 100 కి ఎన్ని ఎకరముల విస్తీర్ణము |
|---|---|
| అస్సాము | 5.7 |
| వంగరాష్ట్రము | 6.2 |
| బీహారు, ఒరిస్సా | 17.4 |
| బొంబాయి | 3.9 |
| సింధుదేశము | 7.8 |
| బర్మా | 8.4 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 4.2 |
| మదరాసు | 29.7 |
| పశ్చిమోత్తర పరగణాలు | 34.4 |
| పంజాబు | 44.1 |
| సంయుక్తరాష్ట్రములు | 22.0 |
| ఇతర ప్రదేశములు | 19.3 |

ఈఅంకెలు 1921-22 మొదలు 1925-26 సంవత్సరము వఱకు గల 5 సంవత్సరములకు సగటున వేసిన మదింపు.

ఈపట్టిక వలన ఏరాష్ట్రమునందెంత పల్లపుసాగుబడి భూమి కలదియు తెలియుచున్నది.

1878-79 వ సంవత్సరమున 10.50 మిలియనుల ఎకరములును, ఈశతాబ్ద ప్రారంభమున 19.25 మిలియను ఎకరములును, 1919-20వ సంవత్సరమున 28.1 మిలియనుల ఎకరములును పల్లపుసాగు చేయబడెను. 1922-23 న 28.33 మిలియను ఎకరములును, 1927-1928 వ సంవత్సరమున 27.5 మిలియనుల ఎకరములును సాగుచేయబడెను. లేక దేశమొత్తమున చేయబడిన అన్ని విధములగు వ్యవసాయముల లోను 100 కి 12 వంతులు మాత్రమే ప్రభుత్వము వారిచే కట్టబడిన వ్యవసాయపు కట్టడములవలన నభివృద్ధి కలిగెను.

1. *See India 1928—29, Page 110.*

(మి లి య న ల ఎ క ర ము లు)

| రాష్ట్రములు | ప్రభుత్వము వారి కాలువలు | ప్రభుత్వమునకు జోక్యము లేని ఇతర కాలువలు | చెరువులు | నూతులు | ఇతరవనరులు | మొత్తము. |
|---|---|---|---|---|---|---|
| మదరాసు | 3. 7 | 0. 2 | 3. 4 | 1. 4 | 0. 5 | 9. 2 |
| బొంబాయి | 3. 4 | 0.08 | 0. 1 | 0. 7 | 0. 2 | 4. 5 |
| వంగము | 0.05 | 0. 2 | 0. 9 | 0.04 | 0. 3 | 1. 4 |
| సంయుక్తరాష్ట్రములు | 3. 3 | 0.02 | 0.06 | 5. 6 | 2. 0 | 11. 0 |
| పంజాబు | 10. 6 | 0. 4 | 0.04 | 4. 0 | 0. 1 | 15. 2 |
| బర్మా | 0. 6 | 0. 3 | 0. 2 | 0.02 | 0. 3 | 1. 5 |
| బీహారు, ఒరిస్సాలు | 0. 9 | 0. 9 | 1. 6 | 0. 6 | 1. 4 | 5. 4 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | * | 0. 9 | * | 0. 1 | 0.04 | 1.00 |
| అస్సాము | 0.01 | 0. 3 | ... | ... | 0. 3 | 0. 6 |
| పశ్చిమోత్తర పరగణాలు | 0. 4 | 0. 4 | ... | 0.08 | 0.09 | 1. 0 |
| అజ్మీరు, మార్వారా | ... | ... | ... | 0. 1 | ... | 0. 1 |
| మొత్తము. | 23. 1 | 3. 7 | 6. 3 | 12. 7 | 5. 3 | 51. 0 |

* ఇతరకాలువల మొత్తమునందీ సంఖ్యలు చేరియున్నవి.

ఈ పైపట్టిక వలన 1929-30 వ సంవత్సరమున బ్రిటిషు ఇండియాయం దేరాష్ట్రమున ఏనీటివసరువలన ఎంతభూమి సాగు చేయబడినదియు తెలిసికొనగలము.

సుక్కూరు బేరేజీవంటి స్కీములు నాలుగును విజయముగ పూర్తియగుచో వ్యవసాయపు భూమి 50 మిలియనుల ఎకరముల వఱకు హెచ్చగలదని అంచన.

1922 వ సంవత్సరము మొదలు 19 ప్రాముఖ్యమైన నీటివసతుల కట్టడములను ప్రభుత్వమువారు ప్రారంభించిరి. కొన్ని పూర్తి యైనవి. కొన్ని పూర్తికాకున్నవి. వీటికై 500 మిలియన్ల రూపాయలు అనగా 5000 లక్షల రూపాయలు పెట్టుబడి పెట్టబడెను. ఇందులో పంజాబునందు సట్లజ్ వాలీప్రాజెక్టునకు 14.6 కోట్లుఖర్చు. దీని క్రింద 50 లక్షల ఎకరముల క్రొత్తసాగు గాగలదు. సింధుదేశమందలి సుక్కూరు బారేజికి 20.4 కోట్లు ఖర్చగునని అంచన. 50 లక్షల ఎకరములు సాగగునని అంచన. తమిళరాష్ట్రమున మెట్టూరు ప్రాజెక్టునకు 7.3 కోట్లు ఖర్చు అగునని అంచన. 30 లక్షల ఎకరములు సాగగునని అంచన. సంయుక్తరాష్ట్రములలో శారద, అయోధ్య కాలువల పని జరుగుచున్నది. మధ్యరాష్ట్రములలో 14 సంవత్సరములు వరుసగ చేయవలసిన కార్యక్రమము నిరూపించుకొనబడెను. ఇట్లే అన్ని రాష్ట్రములయందును క్రొత్త స్కీములు గలవు.

## 35. తుంగభద్రా ప్రాజెక్టు.

రాయలసీమయందుగల తుంగభద్రానదికి ఆనకట్ట కట్టువిషయమై 1898 వ సంవత్సరమున కఱవుల కమీషనువారు వ్రాసిరి.

కాలు. ఈతాలూకాలకీ ప్రాజెక్టు వినియోగింపదు. కర్నూలుజిల్లాలోని నీరులేని శిరువెళ్ళకొండచాలు, కోవెలకుంట్ల, అవుకుప్రాంతములకీ ప్రాజెక్టు నిరుపయోగము. నెల్లూరు, గుంటూరు మండలములకును ఈప్రాజెక్టునకును సంబంధమేయుండదు.

## 36. వెల్గోడు ప్రాజెక్టు.

ఈ తుంగభద్రా ప్రాజెక్టుతో గలిపి నిర్వహింపదలంచిన ఇతర ప్రాజెక్టుల మాటయేమి? కడప-కర్నూలు కాలువను వెడల్పుచేసియు, లోతుచేసియు, నెక్కువనీటిని ప్రవహింపజేయుటయు, వెల్గోడుప్రాజెక్టును నిర్మించుటయు, నీరెండునుగూడ 1903-4 సంవత్సరమునందే తుంగభద్రా ప్రాజెక్టుతో కలిపి తలపెట్టబడెను. 1930 వ డిశంబరున ఈప్రాజెక్టులనుగురించి మదరాసుప్రభుత్వమువారు మరల ఆశలను గల్పించిరి. తుంగభద్రాప్రాజెక్టునకు అగుఖర్చులో సగముమాత్రమే మదరాసుప్రభుత్వము భరించుచుండుటచే నీప్రాజెక్టునుకూడ నిర్మించుటకు మదరాసుప్రభుత్వము వెనుకాడవలసిన పనిలేదు.

## 37. సంగమేశ్వరం ప్రాజెక్టు.

సంగమేశ్వరం ప్రాజెక్టుకూడ తుంగభద్రా ప్రాజెక్టుతో కలిపి యోజింపబడెను. ఈప్రాజెక్టు నెల్లూరుమండలమువారి కత్యంతోపయోగము. 1923 వ సంవత్సరమునందీ ప్రాజెక్టునుగురించి విచారించుటకై యొకయుద్యోగికూడ నియోగింపబడెను. కృష్ణానదికి సంగమేశ్వరమునొద్ద రిజర్వాయరును నిర్మించిన నెల్లూరు, కడప, కర్నూలు, చెంగల్పట్టుజిల్లాలకు నీటివసతి చాలినంతగలుగునని యీయుద్యోగి నివేదించెను. ఈనివేదికననుసరించి సంగమేశ్వరం ప్రాజెక్టునకు ప్రధాన

స్థానము లభించెను. తుంగభద్రాప్రోజెక్టుకంటెగూడ దీనికెక్కుడు సౌకర్యములున్నవని తలంపబడెను. 1925 వ సంవత్సరమున నియమింపబడిన ఆరోగ్యస్వామి కమిటీవారు నెల్లూరుజిల్లాకు సంగమేశ్వరం ప్రోజెక్టునుండి నీరునిచ్చుట లాభమని వారినివేదికయందు వ్రాసిరి. 1926 వ సంవత్సరమున హాకిన్సుదొరగారు (అప్పటి ఇరిగేషనుఛీఫ్ ఇంజనీరు) తుంగభద్రాప్రోజెక్టును నిర్మించుటలో గలుగునష్టమును పూడ్చుటకై తుంగభద్రా ప్రోజెక్టుతోపాటు సంగమేశ్వరం ప్రోజెక్టును గూడకలిపి పని ప్రారంభింపవలెననియు వ్రాసిరి. నెల్లూరుజిల్లాయందు వెంగళాపురంప్రోజెక్టు,రాళ్ళపాడుప్రోజెక్టులువిరమింపబడినవి. మోపాడు మాచవరము ప్రోజెక్టు నిర్మించుటకై ప్రజలయొద్ద ధనము గూడ వసూలుచేసి తిరిగివాపసుచేసిరి. నెల్లూరుజిల్లాయందు నెల్లూరు, కోవూరు తాలూకాలును, కావలితాలూకాలో కొంతభాగమును మాత్రమే నీటి వసతులను గలిగియుండెను. తక్కినతాలూకాల నీటివసతులు దత్తమండలమునందు వలెనే యున్నవి.

# 38. వ్యవసాయాభివృద్ధి, ప్రభుత్వము వహించిన అశ్రద్ధ.

ఇట్లే వ్యవసాయాభివృద్ధికి వేరువేరు ప్రోజెక్టులెన్నియో గమనించి నిర్మింపవలసియున్నవి. నిర్మించి పనిచేయుచున్న ప్రోజెక్టులలో మరమ్మతు లెన్నియో కావింపవలసియున్నవి. గోదావరినది ఆనకట్టపైన పూడిపోవుచున్నది. అఖండగౌతమి మఱికొన్ని సంవత్సరములలో లంకలతో నిండిపోవును. గోదావరినదికిగట్టిన బ్రిడ్జి పైభాగమునందంతయు వృక్షములతోగూడినలంకలుపెరుగుచున్నవి. ఈలంకలు

పెరుగుటకు బ్రిడ్జియే కారణమని కొందరి యూహ. ఆనకట్ట కట్టు నపుడు ఆనకట్ట క్రిందిభాగము గుండ నీరును వదలుటకు పెద్ద తూములుగూడ కట్టబడెననియు ఆతూములు కనుగొని తలుపులెత్త బడుచో, ఆనకట్ట పైభాగమునందుగల యిసుకపఱ్ఱలన్నియు కొట్టుకొని పోవుననియు కొందరందురు. కాని ఆతూములు నేడు కనిపెట్టబడినట్లుగ తోచదు. అందులకు ప్రియత్నములుకూడ జరుగుచుండుట లేదు. వెం టనే యేదోయొక మార్గమరసి, యిసుకతిన్నె లన్నియు కొట్టుకొని పోవునట్లొనరింపకున్నచో, గోదావరి డెల్టాయంతయు మఱికొన్ని సం వత్సరములలో నిరుపయోగము గాకమానదు. అవసరమగుచో గోదా వరినదిపై కట్టిన వంతెనను పడగొట్టించివేయవలెను. ఆనకట్ట దిగువ భాగమునుండి మరల కట్టింపవచ్చును. ఈసమస్య మదరాసు ప్రభు త్వమువారిదృష్టి నింతవఱ కాకర్షించినటుల తోచదు. ఈసమస్య యన నేల? స్వల్ప మరమ్మతులనుగూడ సకాలమున చేయించుట లేదనుట గోరంతదానిని కొండంతగ చెప్పుటకాదు. వ్యవసాయాభివృద్ధికరమగు చిన్నచిన్న పనులనుగూడ నెట్లు నిలిపియుంచిరో ప్రభుత్వప్రకటనము వలననే సుబోధకమగుచున్నది. 1932 వ సంవత్సరమున నీటిపారుదల యభివృద్ధి సంఘమువారు గావించిన సూచనలను, అందుపై ప్రభుత్వము వారు గావించిన నిర్ణయములను పరీక్షించుచో, వ్యవసాయాభివృద్ధి కవసరమగు చిల్లరపనులగూడ నిర్లక్ష్యముగ చూచుచున్నారని చెప్ప గలము.

ఇంతటి చిల్లరపనులనుగూడ నెరవేర్పకపోవుటకు గల కారణ మేమి? డబ్బు కొఱవడినదనియే ప్రభుత్వపుసాకు. ఆయేటి కాయేడు భూమిపన్ను హెచ్చుచున్నను, క్రొత్త ప్రాజెక్టుల నిర్మాణమునకు, మరమ్మతులకు ప్రభుత్వమున కాదాయము సరిపోవుటయే లేదు.

అన్నింటికంటె ముఖ్యముగ వ్యవసాయాభివృద్ధికై ఎంతధనమైన విని యోగింపవలెనను సిద్ధాంతమును ప్రభుత్వమువా రంగీకరింపవలయును.

ఈదిగువ పట్టిక ననుసరించి మదరాసు రాజధానియందు వ్యవసాయమున కెంత స్వల్పముగ ప్రభుత్వమువారు వినియోగించుచున్నదియు తెలిసికొనగలము.

| | రు | అ | పై |
|---|---|---|---|
| [1] మదరాసు | 24 | 0 | 0 |
| హిందూదేశము | 38 | 10 | 8 |
| జపానుదేశము | 216 | 15 | 0 |
| ఫ్రాన్సుదేశము | 948 | 0 | 0 |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | 1681 | 0 | 0 |

ప్రతి 1000 మంది జనసంఖ్యకు ఆయాదేశము లెంతసొమ్ము వ్యవసాయాభివృద్ధికై వినియోగించుచున్నదియు పైఅంకెలు తెలుపుచున్నవి. అన్ని దేశములకంటె భారతదేశమున అత్యల్పము. స్వల్పముగ వ్యవసాయాభివృద్ధికై ప్రభుత్వాదాయము వినియోగించుచున్న దేశమున వ్యవసాయఫలితముగూడ స్వల్పముగ నుండుటయం దాశ్చర్యములేదు.

"ప్రస్తుతమున్న సాగుబడిభూమిని ప్రపంచమునం దితరదేశములతో పోల్చి చూచినచో హిందూదేశమునందే పల్లపుసాగుబడి భూమి హెచ్చుగనున్నదని తేలును.

| | |
|---|---|
| బ్రిటిషుఇండియా | య 31700000 లు |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | య 20000000 లు |
| జపానుదేశము | య 7000000 లు |
| ఈజిప్టు | య 6000000 లు |

1. *From Sir K. V. Reddinayudu's Evidence before Royal Agricultural Commission, Vol. III. P. 381.*

వలన వ్యవసాయము జరుగుచున్నదనవలెను. 1929-30 వ సంవత్సరమున పల్లపు సాగునకు నీరుఅందిచ్చు కాలువలు మొదలగు మార్గములు 75000 మైళ్ళ పొడుగున గలవు. గవర్నమెంటువారు గావించిన నీటిపారుదల వనరులవలన పండినపంటల కిమ్మతు 128 కోట్లుండునని మదింపు. 1925-26 మొదలు 1929-30 వ సంవత్సరము వఱకు గల 5 సంవత్సరములలోను సగటున సాలుసరి రు 137 కోట్ల విలువగల పంటలు ప్రభుత్వమువారొనరించిన నీటివనరులవలన గలిగెనని మదింపు. 1929-30 వ సంవత్సరాంతమునకు పల్లపుసాగు కట్టడములపై 130 కోట్లు వినియోగింపబడెను. ఇందుపై రు 12.9 కోట్లు రాబడి వచ్చెను. ఇందులకు ఖర్చు రు5.9 కోట్లు. అనగా 100 కి 5.4 వంతులు ప్రభుత్వమునకు నికారాదాయము. 1920-1921 వ సంవత్సరమున 42.2 కోట్లు పెట్టుబడి గలదు. 1927-28 వ సంవత్సరమున 115.3 కోట్లు గలదు.

దక్కనునందు పల్లపుసాగు పెట్టుబడిపై ప్రభుత్వమునకు 100 కి 1 లేక 2 వంతులును, పంజాబునందు 100 కి 15.08 వంతులును, మదరాసునందు 8.9 వంతులును, సంయుక్తరాష్ట్రములయందు 100 కి 5.56 వంతులును నికారాదాయము వచ్చుచున్నది. ఈఆదాయములలో శారదా, అయోధ్య కాలువలును, సట్లెజ్ వాలీ ప్రోజెక్టును, లాయడ్ బారేజి ప్రోజెక్టును, మెట్టూరు ప్రోజెక్టులపై వచ్చునను తలంపబడు ఆదాయములను కలిపి మదింపు వేయలేదు.

ప్రభుత్వమువారు పెద్ద కాలువలను మాత్రమే త్రవ్వించుచున్నారు. పిల్లకాలువలను రైతులే త్రవ్వించుకొనుచున్నారు. సింధుదేశమునందీ నీటిపన్ను భూమిసిస్తులో కలిసియున్నది. మదరాసు, బొంబాయి రాజధానులయందు కొన్ని ప్రాంతములలో భూమిసిస్తు

ప్రత్యేకముగ గలదు. పల్లపుసాగు పన్నులో నీటిపన్ను గూడ చేరి యున్నది. వంగదేశమున నీరు పెట్టినను పెట్టుకొనకపోయినను గూడ కొలదిగనైన భూమిపన్ను చెల్లించియే తీరవలెను. ఇతర ప్రదేశముల యందు నీటిపన్ను ప్రత్యేకముగ గలదు.

## 39. వ్యవసాయాభివృద్ధి ప్రభుత్వశాఖలు.

వ్యవసాయమునందు నూతనవిషయములు గ్రహింపబడి వ్యాప్తి చేయబడుటకు విశేష ప్రయత్నములు ప్రభుత్వ వ్యవసాయశాఖలచే నొనరింపబడలేదు.

మొట్టమొదట 1866 వ సంవత్సరమున ఓఢ్ర, వంగదేశముల యందు సంభవించిన క్షామకాలమున క్షామవిచారణసంఘము వ్యవసాయశాఖ నొకదాని నేర్పరుపవలయునని సూచించెను. ఈసూచన గాలికెగురగొట్టబడెను. 1869 వ సంవత్సరమున ప్రత్తిపంట యభివృద్ధి పరచుటకై ప్రతిరాష్ట్రమున వ్యవసాయశాఖలను స్థాపింపవలెనను సూచన మాంచెష్టరునకు ప్రత్తి యెగుమతి చేయువారు (Manchester Cotton Supply Association) గావించిరి. ఈసూచనయు నాటిప్రభుత్వమువారి మన్ననకు పాత్రముకాలేదు. కాని హిందూదేశపు ప్రభుత్వ పరిపాలనక్రింద 1871 వ సంవత్సరం జూన్ మాసమున వర్తక, వ్యవసాయక, రివిన్యూశాఖలనుగలిపి యొకశాఖ నేర్పరిచిరి. "ఈశాఖ 1879 వ సంవత్సరము వఱకును పనిజేసినది. అంతట ముగింపబడెను. ఈశాఖ వ్యవసాయాభివృద్ధికర సమస్యలపై నెట్టికృషిగాని చేసినదని చెప్పుటకు వీలులేదు." అని వ్యవసాయ విచారణసంఘమువారే వ్రాసిరి.[1]

1. *Agricultural Commission Report Page 15.*

లార్డుమేయోగారి ప్రభుత్వమున జరిగినకృషి యిదియే. 1880 వ సంవత్సరపు క్షామనివారణసంఘ నివేదిక వ్యవసాయసమస్యను సాకల్యముగ విమర్శించెను. వ్యవసాయాభివృద్ధికరములగు సూచనలెన్నియో కావించెను. కఱవులు రాకుండనుండుటకై వ్యవసాయాభివృద్ధియే ముఖ్యమనెను. వ్యవసాయాభివృద్ధికై ప్రతిరాష్ట్రమునందును వ్యవసాయశాఖలను స్థాపింపవలెను. గ్రామజీవనము పునరుద్ధరింపబడుట అత్యవసరమనెను. వీరి సూచనలన్నియు నిష్ప్రయోజనములైనవి. హిందూదేశ ప్రభుత్వముపట్ల నీసూచనలు చెవిటివానియొద్ద శంఖమూదినట్లయ్యెను. తర్కవితర్కములతో కాలము ముగిసెను.

మదరాసు రాజధానిలో 1863 వ సంవత్సరమున అప్పటి గవర్నరు సర్ విలియమ్ డెన్షన్‌గారు (Sir William Dension) వ్యవసాయాభివృద్ధి విషయమై యోచింపసాగిరి. వ్యవసాయ పరికరములు సక్రమముగ లేవని తలంచిరి. ఎరువుచేయుట రైతులకు నేర్పదలంచిరి. వలయునన్ని చెట్లు లేవనుకొనిరి. పశుసంతతినీరసముగనున్నట్లు నిశ్చయించిరి. పల్లపుసాగు, విద్య, తక్కువపన్ను, నూతన పరికరములు, వ్యవసాయము నభివృద్ధిపరచగలవని విశ్వసించిరి. నూతన పరికరములపై వీరిదృష్టి కేంద్రీకరింపబడెను. దున్నుటకు, కోయుటకు, ఊడ్చుటకు, కుప్పలు నూర్చుటకు, నీరుపెట్టుటకు మొదలగు వ్యవసాయపు పనులకన్నింటికి ఇంగ్లండునకు వ్రాసి, నూతన యంత్రములను తెప్పించిరి. ఈపనిముట్లతో సైదాపేటయందు వ్యవసాయముజేయుటకు ప్రారంభించిరి. సైదాపేట మదరాసునకు 5 మైళ్ళ దూరమున గలదు. ఇందు 350 ఎకరములు ఖండము గలదు. ఈపనిముట్లను నీపొలమును 1864వ సంవత్సరమున నొక సంఘమున కొప్పగించిరి. ఈసంఘము 1871 వ సంవత్సరము వఱకు వ్యవసాయము జేసెను. ఆనాటికి పనిముట్లు పాడయినవి. సంఘసభ్యులు నిరుత్సాహులయిరి. వీరికృషి నిష్ఫల మయి

నది. ఇందులకు కారణమేమి? వ్యవసాయవిచారణ సంఘమిట్లు వ్రాసెను.

"మొట్టమొదట స్థానిక సౌకర్యములను అసౌకర్యములను విచారింపలేదు. సుశిక్షితులగు పరిశోధకులు లేరు. పరిచారకులు లేరు. భూమి రాజధానియందలి ప్రశస్తమగు భూమితో సమానమగు భూమి కాదు. ప్రత్యేకస్థితిగల భూమియైన గాదు. పాశ్చాత్యదేశమున విజయము పొందిన పద్ధతులే హిందూదేశమున గూడ జయమగునని యూహాపై ప్రారంభించిరి." 1

ఈసంఘమువారు విఫలము పొంది కృషి విరమించుకొనిన పిమ్మట ప్రభుత్వమువారీ పరికరములను స్వాధీనపరచుకొనిరి. పిమ్మట క్రియారూపమగు పనియేమియు లేదు. తర్కవితర్కములతో నొకదశ ముగిసినది. 1876 వ సంవత్సరమున సైదాపేటయందే వ్యవసాయ కళాశాలను స్థాపించిరి. 1884 వ సంవత్సరమునందీ కళాశాలపై యధికారము రివిన్యూబోర్డువారు విరమించుకొనిరి. విద్యాశాఖ డైరక్టరున కొసంగిరి. 1905-6 వ సంవత్సరము వఱకు నీ కళాశాల విద్యాశాఖాధికారిచే పరిపాలింపబడెను. వ్యవసాయశాఖ స్థాపించినది మొదలు వ్యవసాయశాఖచే పరిపాలింపబడుచుండెను. సైదాపేటయందలి వ్యవసాయ ప్రదర్శనశాల 1885 వ సంవత్సరమునందే మూసివేయబడెను. కళాశాలకు సంబంధించిన కొలది భాగము మాత్రము గలదు. 1885 వ సంవత్సరము నుంచియు వ్యవసాయశాఖ యున్నను వ్యవసాయపు లెక్కను వేయుటయే వారిపని. 1863 వ సంవత్సరము మొదలు 1900 సంవత్సరము వఱకు మదరాసు ప్రభుత్వము వ్యవసాయాభివృద్ధికి జేసిన పనియేమి? మొట్టమొదట పెట్టిన సైదాపెట వ్యవసాయశాల వ్యయప్రయాసలకు లోనై నిష్ఫలమైనది. నిరుపయోగమైనది. పిమ్మట వ్యవసాయవిద్యాప్రచార మనుపేర షహార

1. *Agricultural Commission Report Page 28.*

ప్రభుత్వ వ్యవసాయశాఖాధికారులు వీటిని పాలించుచున్నారు. ఈశాఖవారు నూతనపరిశోధనముల జేయుటయేగాక, వ్యవసాయవిషయముల ప్రదర్శనము లేర్పరచుటయు, ప్రచారము గావించుటయు, వ్యవసాయపు ఆధునికపనిముట్లను, విత్తనములను అమ్ముటయు, పంచిపెట్టుటయు చేయవలసియున్నది. ఈపనులయందేపనియు ఈపరిశోధనశాలలు తృప్తికరముగ గావించుటలేదు. ఇవియున్నట్లు రైతులకైనను తెలియదు.

1915 వ సంవత్సరమునకు 29 గురు వ్యవసాయ ప్రత్యేకోద్యోగులును, 22 ఇతర పెద్దయుద్యోగులు, మరికొంతమంది యుద్యోగులు మాత్రమే యీశాఖలలో హెచ్చు జీతములమీద పోషింపబడుచున్నారు. వ్యవసాయరాష్ట్రశాఖాధికారులు (డైరక్టర్లు) ఇండియన్ సివిల్‌సర్వీస్‌నందు నుండియే నియమింపబడుచు వచ్చిరి. ఇప్పుడిప్పుడే వ్యవసాయశాస్త్రజ్ఞులు నియమింపబడుచున్నారు. స్వదేశసంస్థానములు, బరోడా, మైసూరు, ట్రావెన్కూరు మొదలగునవికూడ నీవ్యవసాయశాఖవంటి శాఖలనే తమరాజ్యములయందేర్పరచెను.

1914 సం॥రపు వ్యవసాయపు పురుగులు, పక్షులను చంపు చట్టమెన్నడును ఆచరణయందుంచబడలేదు. ఆంబోతులను పెంచి పశుసంతతి యభివృద్ధియగునట్లు చేయుటకూడ వ్యవసాయశాఖవారి ధర్మములయందొకటిగ నిర్ణయించబడియున్నది. ఇట్లుపోషించినవాటిని ఎవరైన కొన్నచో వాటిని పోషించుటకు రు 30 లు మొదలు రు 80 ల వఱకు రకము ననుసరించి విరాళమొసంగవలెనను నియమముగూడ గలదు. ఈ నియమావళి మచ్చునకైన విరివిగ నమలునందుంచబడుటలేదు. 1930 ప్రారంభమున సగటున జిల్లా 1 కి ఒక ఆంబోతు చొప్పున మాత్ర మొసంగుటకు ప్రయత్నించబడుచుండెను.

పశువైద్యశాఖవారు బుడ్డలను అప్పుడప్పుడు గొట్టుచున్నారు. 1926_27 వ సంవత్సరమున 282826 గిత్తలకు బుడ్డలు గొట్టబడినవి. వ్యవసాయ కళాశాలలు 6 నిర్మింపబడినవి. పూస, కోయంబత్తూరు, నాగపురము, కాన్పూరు, లాయలుపూరు, మాండలేలయందున్నవి. రెండవతరగతి కళాశాలలు బెంగుళూరు, పూసాలయందు కూడగలవు. మూడవతరగతి ఉన్నత వ్యవసాయ పాఠశాలలు లేవు. వ్యవసాయవిద్య నాధారముగజేసి, విద్యాభ్యాస మొసగగల ప్రాథమిక విద్యాలయములులేవు. కార్మికులకు, వ్యవసాయదారులకు, వ్యవసాయదార్ల పిల్లలకు ఎవరికిని ఏవిధమగు వ్యవసాయవిద్యయు దేశభాషలయం దొసగబడు ప్రయత్నమేమియు జరుగలేదు. కళాశాలయందు పాశ్చాత్య విద్యాభ్యాసము పొందినవారికి వ్యవసాయవిద్య నభ్యసించుటకు కళాశాలలుండుటవలన కలుగు లాభములేదు. ఆకళాశాలలైనను దేశము మొత్తముమీద ఆరుమాత్రమే కలవుగదా!

ఈ వ్యవసాయశాఖవారి కృషివలన 1929-30 వ సంవత్సరమున 13484926 ఎకరములు అనగా మొత్తపు సాగుబడిభూమిలో 100 కి సుమారు 6 ఎకరములు మాత్రమే క్రొత్తపద్ధతులపై వ్యవసాయము చేయబడుచున్నది. దీనిననుసరించి వ్యవసాయాభివృద్ధి యెంతస్వల్పముగ జరిగినదియు వ్యక్తపడుచున్నది.

## 39. ముగింపు

ఇంతవఱకు వ్యవసాయసమస్యలన్నియు విమర్శింపబడినవి. భారతదేశమునందు వ్యవసాయ మధోగతియందున్నదని గ్రహించితిమి. ఇందులకు రెండుకారణములు గోచరించుచున్నవి. 1890 వ సంవత్సర

ప్రాంతమువరకు వ్యవసాయ విషయములయందు పూర్తి విజ్ఞానమును బడయజాలని బ్రిటిషుదీవులు నాటికి హిందూదేశమునుండి వ్యవసాయ విజ్ఞానము నార్జింపవలసిన స్థితియందే యుండుటచే భారతీయులకు నూతన విషయప్రబోధము గావింపజాలకపోయినవి. వ్యవసాయమున సంపూర్ణ వికాసమునొందని బ్రిటిషుదీవులచే భారతభూమి పరిపాలింపబడవలసి వచ్చుటచే తన సహజపరివర్తనమును గోల్పోవుట విధియైనది. పరిపాలనా విధానమునందుగూడ వ్యవసాయాభివృద్ధి సమస్య కర్హస్థానము లభింపలేదు. భారత దేశ ప్రభుత్వయంత్రమున వ్యవసాయసమస్యకు ప్రాముఖ్యస్థానము లభించినగాని భారత దేశమునం దార్థికాభివృద్ధి జరుగనేరదు. భారత దేశ వ్యవసాయాభివృద్ధికి చేయవలసిన ముఖ్యవిషయములయందైన వెంటనే శ్రద్ధవహింపవలసియున్నది.

1. అధికపుపన్నులను తగ్గించివేయవలెను. జమీందారీరైతులపై విధింపబడుచున్న అధికపు కట్టుబడులను తగ్గింపవలయును.

2. నిరకునామాపద్ధతి వ్యవసాయాభివృద్ధికరముగ మార్పవలయును.

3. ఎరువుల ఎగుమతిని నిషేధింపవలయును. సమిష్టివ్యవసాయమును ప్రవేశపెట్టవలయును.

4. దేశమునందాహారమునకు వలయు పదార్థముల ఎగుమతి సక్రమముగ నిషేధింపవలెను. ఇట్లే విదేశములనుండి వచ్చు సరకులతో పోటీచేయు చవుకదినుసుల దిగుమతికూడ నిషేధింపవలెను.

5. పరిశ్రమలకును, వ్యవసాయమునకును పరస్పర విరోధము రాని ఆర్థికనీతినవలంబింపవలసి యున్నది. ఎట్లన 1924 సం॥రపు ఉక్కు సంరక్షణ చట్టమున జమ్షెడుపూరునందు తయారుచేయబడుచున్న (అగ్రికల్చ

రల్ ఇంప్లిమెంట్సు కంపెనీ లిమిటెడ్) వ్యవసాయపు పనిముట్ల సంరక్షణకై దిగుమతియగు వ్యవసాయపు సరకులపై 100 కి 10 మొదలు 25 ల వరకు దిగుమతిపన్ను విధించెదమని ప్రభుత్వమువారనిరి. ఇందు వలన వ్యవసాయపు పనిముట్లకు కంపెనీవారి పరిశ్రమకు ప్రోత్సాహము కలుగుట వాస్తవమే. (ప్రభుత్వమునకు రాబడివచ్చును.) కాని వ్యవసాయదారులు దిగుమతిఅయిన పనిముట్లు కొనవలసివచ్చుచో, నధికపు ఖరీదు పెట్టవలసివచ్చును. అందుచే వ్యవసాయదారులకు నష్టము రాగలదు. ఇది యోచించి ప్రజాప్రతినిధులు ఆశాసనమండలి ఆనియమమును సక్రమముగ త్రోసిపుచ్చిరి. ఇందులో పరిశ్రమకును వ్యవసాయాభివృద్ధికిని పరస్పరము విరోధస్థితిని గోచరింపజేసిరి. ఈ వైరుధ్యమనవసరము. ప్రభుత్వమువారు వ్యవసాయపుపనిముట్లకంపెనీవారికి అభివృద్ధి నిమిత్తము ప్రతిసాలున (Subsidy) కొంతవిరాళమిచ్చియున్నచో ఆకంపెనీకూడ అభివృద్ధిపొందెడిది. అట్లుచేయలేదు. ఇట్లు పరస్పర వైరుధ్యమువచ్చు విషయములయందిట్లు విరాళముల నొసగుచో పరిశ్రమలు, వ్యవసాయముకూడ పరస్పరాధారములై అభివృద్ధి పొందగలవు.

6. వ్యవసాయ ప్రాథమిక, మాధ్యమిక ఉన్నతకళాశాలవిద్యలు ప్రజలకు లభించుటకు తగుపర్పాటు లొనరింపవలెను. ఇంతవఱకు ప్రత్యేక వ్యవసాయవిద్యయేకాక మామూలు ప్రాథమికవిద్యగూడ ప్రజలకు గఱుపలేదు. నిరక్షరకుక్షులగు ప్రజలు వ్యవసాయశాస్త్రవిషయముల గ్రహింపజాలరు. వ్యవసాయవిషయమైన ప్రచారము గ్రామములవెంట నిరంతరము చేయింపవలెను.

7. వ్యవసాయాభివృద్ధితోపాటు నాశనమొనరింపబడిన గృహపరిశ్రమలు పునరుద్ధరింపవలసియున్నవి. వ్యవసాయములేని కాలముల

4. పశురోగములు వ్యాపించకుండ నిరోధమార్గముల నరయవలెను.

5. పల్లెలయందు స్త్రీసంఘములు (ప్రబోధమునకు వీలుగ నుండునట్లు) ఏర్పరచవలెను.

6. వ్యవసాయోత్పత్తి పదార్థముల అమ్మకమునకై నియమముల ననుసరించిన సంతల నేర్పరచవలెను.

7. ఇట్లు సంతలనేర్పరుచుటకు ప్రతిరాష్ట్రప్రభుత్వము వ్యవసాయశాఖకు చేర్చి యొక యుద్యోగిని నియమింపవలెను. ఇందే సూచనగాని ఆచరణయందింతవఱకు నుంచబడలేదు.

ఇట్టి అనేకసంస్కరణములు వ్యవసాయాభివృద్ధికి వెనువెంటనే ఆచరింపవలసియున్నవి. ఇన్ని యేల? మరల గ్రామజీవనము సర్వతోముఖముగ నభివృద్ధి పొందినగాని ప్రజల ఆర్థికస్థితి చక్కబడజాలదు. నిర్జీవమైయున్న గ్రామజీవనము సజీవముగ నెంతత్వరితముగ చేయగలుగుదుమో అంత శీఘ్రముగ దేశము సిరిసంపదలతో నోలలాడగలదు.



# భారతదేశము-ఆర్థికచరిత్ర

## రైతులఋణము—సహకారోద్యమము.

### 6 వ అధ్యాయము.

సాంకేతికపదములు_GLOSSARY.

| | |
|---|---|
| సహకారము | = Co-operation |
| సహకారపరపతిసంఘములు | = Co-operative Credit Societies |
| అపరిమితబాధ్యత లేక సమిష్టి బాధ్యత | = Unlimited liability |
| బాధ్యత లేక పూచీ | = Liability |
| పరిమితబాధ్యత లేక వ్యష్టిబాధ్యత | = Limited Liability |
| వాటాసొమ్ము లేక వాటాధనము | = Share Capital |
| ఉత్పత్తిసంఘములు | = Production Societies |
| గృహనిర్మాణసంఘములు | = Housing Societies |
| వినియోగసంఘములు | = Consumers Stores |
| క్రయవిక్రయసంఘములు | = Purchase and Sale Societies. |
| క్రయోత్పత్తిసంఘములు | = Production and Sale Societies. |
| వ్యవసాయ ప్రాథమిక పరపతి సంఘములు | = Primary Agricultural Credit Societies |
| వ్యవసాయేతర ప్రాథమిక పరపతి సంఘములు | = Primary Non-Agricultural Credit Societies |

ఋణేతర వ్యవసాయ సహకార సంఘములు = Non-Credit Agricultural Societies

ఋణేతర వ్యవసాయేతర సహకార సంఘములు = Non-Credit Non-Agricultural Societies.

సార్థకము = Productive

నిరర్థకము = Unproductive

పరిశీలన = Supervision

డిపాజిట్టు లేక నిక్షేపము = Deposit

వ్యాపారపుపెట్టుబడి = Working Capital

మూలధనము = Reserve Fund

పరోపకారనిధి = Common Good Fund

ఋణములు = Loans

సాధారణసభ = General Body

కార్యనిర్వాహకవర్గము = Working Committee or Board of Directors

కేంద్రసంఘములు = Central Societies

విచారణ = Inspection

లెక్కలతనిఖీ = Audit

ఎత్తివేయుట = Dissolution

సాదాతనము = Simplicity

సంయోగ్యము = Elasticity

% ఈగుఱుతు 100 కి

రోజువారీకాతా = Current Account

దూరపువాయిదా అప్పులు = Long Term Loans

దగ్గిరవాయిదా అప్పులు =Short Term Loans
వినియోగము =Consumption
సామ్యవాదము =Bolshevism
సెంట్రిలుబ్యాంకు =Central Bank
రాష్ట్రీయబ్యాంకు =Provincial Bank
సిబ్బంది =Staff
నికరము లేక శిష్టము =Net

హిందూదేశము నందలి సహకారోద్యమ పరిణామమునందు గమనింపదగిన ఘట్టములు.

(1) 1904 వ సంవత్సర సహకార పరపతిసంఘముల శాసనము.

(2) 1912 వ సంవత్సర సహకార పరపతిసంఘముల శాసనము.

(3) 1915 మెక్లాగను కమిటీవారి నివేదిక.

(4) 1919 సహకారశాఖ రాష్ట్రీయ ప్రభుత్వముల వశమగుట.

(5) సహకారోద్యమ ప్రచారమునకై పాఠశాలలు, యూనియనులు, ఫెడరేషనులు నెలకొల్పబడుట.

(6) వివిధ రాష్ట్రములయందు సహకారోద్యమ విచారణసంఘములను నియమించుట—ఆసంఘముల నివేదికలు.

(7) వివిధ రాష్ట్రముల యందలి ప్రత్యేక శాసనములు.

(8) 1928 వ్యవసాయ విచారణసంఘ నివేదిక- సహకారోద్యమమును గుఱించిన సూచనలు.

(9) 1931 వ సంవత్సరము నందలి బ్యాంకింగు విచారణసంఘముల నివేదికలు- అందు సహకారోద్యమమును గురించి కావించిన సూచనలు.

మొత్తమున ప్రభుత్వమున కిచ్చుచున్న భూమిపన్నుతో పోల్చిన నీఅప్పు రూపాయకు 19 రూపాయల వంతున గలదు.[1]

**బొంబాయి.**

బొంబాయి రాష్ట్ర మొత్తమున సింధురాష్ట్రముతో గూడ కలిపి, 81 కోట్లు అప్పు కలదు. మొత్తపు భూమిపన్ను కంటె అప్పు 15 రెట్లధికము.[2]

**వంగదేశము.**

వంగదేశమున రైతుల అందఱకు రు 100 కోట్ల అప్పు కలదు. ప్రతి వ్యవసాయదారుని కుటుంబమునకు సగటున రు 160 ల అప్పు తేలును.[3]

**సంయుక్త రాష్ట్రములు.**

సంయుక్తరాష్ట్రముల రైతుల ఋణము 124 కోట్లు. ఇందు భూకామందుల అప్పు గూడ మదింపు వేయబడెను.[4]

**పంజాబు.**

ఈ రాష్ట్రమునందు 1921 వ సంవత్సరమున రైతుల అప్పు 90 కోట్లు. 1929 లో 135 కోట్లు. అనగా, 8 సంవత్సరములలో చాల పెరిగిపోయెను. భూమి సిస్తుతో పోల్చిన 1921 లో రూపాయ 1 కి 19 రూపాయలును, 1927 లో 27 రు॥ లును అప్పు కలదు. 1921 లో తల ఒక్కంటికి రైతుల అప్పు 76 రూపాయలు. 1929 లో 104 రూపాయలు. ఎకరము ఒక్కంటికి 1921 లో రు 31 లును, 1929 లో రు 45 లును అప్పు కలదు.[5]

1. మదరాసు బ్యాంకింగు విచారణ సంఘ నివేదిక పేరా 96, 98
2. బొంబాయి బ్యాంకింగు విచారణ సంఘ నివేదిక పేరా 49, 50
3. వంగదేశపు బ్యాంకింగు విచారణ సంఘము, పేరా 90.
4. సంయుక్తరాష్ట్రముల బ్యాంకింగువిచారణసంఘ నివేదిక, *Appendex* 2.
5. పంజాబు బ్యాంకింగు విచారణ సంఘ నివేదిక పేరా. 22

మధ్యపరగణాలు, బీరారు.

ఈ రాష్ట్రమున రైతుల మొత్తపు అప్పు 36¼ కోట్లు. మొత్తపు పంటలో 100 కి 49 వంతులు. భూమిసిస్తు కంటె యిచ్చుకొనవలసిన వడ్డీ 2½ రెట్లధికము. అప్పు వ్యవసాయము వలన వచ్చు నికరాదాయములో 3 వ వంతు. రైతు కుటుంబము ఒక్కొంటికి సగటున రు 227 ల అప్పుకలదు.[1]

బీహారు, ఒరిస్సాలు.

ఈ రాష్ట్రమున మొత్తపు ఋణము 155 కోట్లు. ఇందు రైతుల అప్పు 129 కోట్లు. భూకామందులకు 24 కోట్లు. 2 కోట్లు చిల్లర కుటుంబములకు కలదన దగును.[2]

అస్సాము.

ఈ రాష్ట్రమున మొత్తపు అప్పు [కొండలు లేని జిల్లాల రైతులకు] 22 కోట్లు. భూమిసిస్తు కంటె అప్పు 22 రెట్లధికము. కుటుంబము ఒక్కొంటికి సగటున రు 242 ల అప్పు. 100 కి 15 కుటుంబములు మాత్రమే అప్పులేనివి కలవు.[3]

బర్మా.

ఈ దేశమున రైతుల అప్పు రు60 లేక రు 50 కోట్లు.[4]

ఈ యంకెల ననుసరించి హిందూదేశమునందలి యీ 9 రాష్ట్రములలో రైతులకు సుమారు రు 800 కోట్ల అప్పు గలదని మదింపు వేయబడెను. ఈ అప్పంతయు ఫలశూన్యమైనదే. భూముల మరమ్మతుల క్రింద చేయబడిన ఋణము కాదు. ఆయేటికా యేడు పెరుగుచున్నది. 1901 లో మాక్లగనుగారి అంచనా ననుసరించిన

1. మధ్యపరగణాల బ్యాంకింగు విచారణ సంఘము పేరాలు 644-653-654
2. బ్యాంకింగు విచారణ సంఘము పేరా 90.
3. బ్యాంకింగు విచారణ సంఘము పేరా 33.
4. బ్యాంకింగు విచారణ సంఘము పేరా 108.

రు 300 కోట్ల అప్పును 1930 కి 800 కోట్ల వఱకు పెరిగెను. ఇందు వలన రైతు దినదినాభివృద్ధి యందు లేడనుట స్పష్టము. రైతులొక రోజుకంటె మరొకరోజున దరిద్రులగుచుండిరని అప్పుల పెరుగుదల వలన నిశ్చయింపగలము.

## 3. ఋణకారణము లేమి?

ఈ ఋణమునకు కారణములిట్లు కొందఱు నిరూపించు చున్నారు.

1. జనసంఖ్య పెఱిగి, వ్యవసాయముపై పలువురాధారపడుట.

2. భూమి విభాగములై విఖండములగుట.

3. వ్యవసాయమునకు దోడుగ నుండు పరిశ్రమలు లేకపోవుట.

4. రైతుల యనారోగ్యస్థితి వ్యవసాయకాలములయందు తరుచుగ జబ్బుపడుచుండుట.

5. ప్రతి సంవత్సరము సుభిక్షముగ నుండక పంటలు పండక తిండికై అప్పు జేసికొనవలసివచ్చుట.

6. పశురోగములవలన, కాటకములవలన పశువులు చచ్చిపోవుట. ఇందువలన మరలమరల క్రొత్తపశువులను కొనవలసివచ్చుచుండుటచే అప్పు జేయవలసివచ్చుట.

7. ఆదాయమునుండి రైతు నిలువ జేసికొనకపోవుట. పశువుల మరణములవలన గలుగు నష్టమునకును, వ్యవసాయపు పనిముట్లు చెడు చుండుటవలన గలుగు నష్టమునకును వలయుసొమ్ము నిలువజేసికొనక పోవుట.

8. రైతునకు వ్యాజ్యములయందుగల ప్రీ

9. రైతుల దూబరా ఖర్చు. (వివాహములకు, మతవిషయము లకు అగు ఖర్చు.)

10. తాత ముత్తాతలనుండియు వచ్చుచున్న అప్పు.

11. నవనాగరిక జీవితము.

12. ఋణదాతలు వసూలుచేయుచున్న హెచ్చు వడ్డీలు.

13. రైతు లిచ్చుకొనుచున్న అధికపు భూమిసిస్తు.

పై నుదహరింపబడిన కారణములలో 1, 2, 3, 4 లు రైతుల యప్పునకు ప్రత్యక్షకారణములుగ జెప్ప వీలులేదు. పరోక్షముగ నీకారణములు ఆర్థికాభివృద్ధికి భంగకరములనుట నిశ్చయము. కాని యీకారణములను నివారించుకొనుటకు వలయు నధికారము రైతులయందులేదు. దేశమునందు సర్వతోముఖార్థికాభివృద్ధి లేకపోవుటయే పలువురు వ్యవసాయముపై బ్రతుక వలసివచ్చుటకు కారణము. పలువురు వ్యవసాయముపై బ్రతుక వలసి వచ్చుటవలనను వారసత్వపు హక్కులను మార్చుట మొదలగు సంస్కరణములను ప్రభుత్వము చేయకపోవుటవలనను ఆర్థికాభివృద్ధికి ప్రతిబంధకములుగ భూమి విభాగములై విఖండములైనది. వ్యవసాయమునకు దోడుగనుండు గృహపరిశ్రమలన్నియు విదేశపువస్తువుల దిగుమతి వలనను ఈస్టిండియాకంపెనీవారి వర్తకపు నీతివలనను నాశనమైనవి. దేశమునందు ఆర్థికాభివృద్ధిలేక, అత్యల్పమగు అంతస్తు ఏర్పడి రోగములను నిరోధించుకొను శక్తిని ప్రజలు కోల్పోయిరి. ఈనాలుగు కారణములకునుగూడ రైతు బాధ్యుడుకాదు. అధికముగ రోగములు వ్యాప్తిజెందుటను నిరోధించు బాధ్యత ప్రభుత్వమువారిపై నెట్లు గలదో పంటలు విఫలము కాకయుండునట్లు వ్యవసాయ సౌకర్యము లొనగూర్చు బాధ్యతయు ప్రభుత్వమువారి మీదనే కలదు. పండిన

ననుగూడ వ్యాజ్యకారణములగు వ్రాతలు వ్రాయబడి రిజిష్టరీ చేయ బడుచుండెను. ఏగ్రామమున కాగ్రామముననందే ఒకటి రెండు రోజుల గడువుమాత్రమే యొసంగి రిజిష్టరీచేయించుకొనుట విధిచేయుచో సత్య విరుద్ధములగు వ్రాతలకును వ్యాజ్యకారణములగు పనులకును సావ కాశము హెచ్చుగ లభింపదు. రైతులకు ఖర్చు తగ్గును. వ్యాజ్యములకు వెడలిన కేసులలో న్యాయము లభించుటకు సదుపాయములు లభించును.

9 వ కారణమగు రైతుల దుబారాఖర్చులను గుఱించి యొకింత చర్చింపదగును. వివాహాదులకు, పండుగలకు, వేడుకలకు, రైతులు విశేషముగ ఖర్చుపెట్టుటయే యప్పునకు కారణమని వ్యతిరేక వాదము. ఈవాదమును సమర్థింపవీలులేదని 1875 వ సంవత్సరమున నియమింపబడిన దక్కనురైతుల విచారణసంఘమువారిట్లు ఖడించిరి.

"రైతులయప్పునకు వివాహములకును, పండుగలకును జేయు ఖర్చే కారణమని యనవసర ప్రాముఖ్య మీవిషయమున కొసంగి చెప్పబడుచుండెను. ఈవివాహాదులకు పెట్టబడుచున్న ఖర్చు రైతుల యార్థికస్థితినిబట్టి హెచ్చని చెప్పకతప్పదు. కాని, యట్టి ఖర్చులు ఎప్పుడోకాని రావు. ఎంతకాలమునకో ఒకప్పుడు వచ్చెడి యట్టి ఖర్చును గృహకృత్యములకై పెట్టుట తగినపనియే. ఇట్టిఖర్చే రైతుల యప్పునకు పునాది యనజాలము.......... ప్రతిసంవత్సరము రైతు జీవితాధారమునకై . వలయు వ్యవసాయపుఖర్చును, (అనగా విత్తులు, గొడ్లు, పన్ను) పంట చాలనందున జేయు అప్పును రైతుల అప్పునకు మూలము. వివాహాది కర్మలకు జేయు అప్పుమాత్రము రైతుల అప్పునకు మూలముకాదు.

ఇట్లే వంగదేశపు బ్యాంకింగు విచారణసంఘమువారును నిర్ణ యించిరి. ఇదియే రైతుల అప్పునకు సరియగు కారణము.

వివాహములకు విశేషముగ రైతులు అప్పుజేయక కలదానితో చేయవలెనన్న, బాల్యవివాహనిషేధ శాసనమందలి వయస్సును హెచ్చింపదగును. తల్లిదండ్రులే వివాహమును గావింపవలెనను సంఘాచారమును తొలగించుటకు వలయు శాసనము లొనరించుచో, వివాహములపై ఖర్చు తగ్గగలదు. వివాహములను రిజిష్టరీచేసికొనుచో, శాస్త్రసమ్మతమను శాసనమును అన్ని కులమతములకును వర్తింపజేసినయెడల సంఘాచారము ననుసరించి చేయబడుచున్న అధిక వ్యయమును తొలగింపగలము. వివాహములను రిజిష్టరీచేయుట హిందూ ధర్మమునకు విరుద్ధమని తలంచువారు కలరు. వివాహము మతసంబంధమైనవిషయమని వీరివిశ్వాసము. నేడు వివాహములయందు జరుపబడుచున్న కర్మకాండ, లేక, తంతును తొలగించివేసినంతమాత్రమున వివాహమునందుగల మతభావము మట్టిపాలగునా? కాదు. కృత్రిమమగు తంతునందు మాత్రమే మతభావము పొంచియుండలేదు. నేడు వివాహములయందు జరుపబడుచున్న మంత్రతంత్రాదులన్నియు సంఘసాక్ష్యముకొఱకై ఏర్పడినవి. రిజిష్టరీచేయుటవలన సంఘము యొక్క సాక్ష్యమవసరములేదు. వివాహవయస్సును హెచ్చించి భార్యాభర్తలు తమ వివాహమును రిజిష్టరీచేసికొనవలెనను విధిని నిర్ణయించుశాసనమొనరించుచో, వివాహములకు పరిమితిలేని వ్యయము చేయబడదు. అందువలన హిందూవివాహ రిజిష్ట్రేషను శాసనము నొనరింపదగును. ఈశాసనమునందు స్త్రీలకు 16 సంవత్సరములును పురుషులకు 20 సంవత్సరములును వివాహకాలమునకు తక్కువగనుండరాదని శాసింపవలెను. ఈవయస్సులకు మించినవారు రిజిష్టరీపూర్వకమగు వివాహమును చేసికొనుట కధికారమొసగవలెను. ఈవయస్సునకు లోబడిన స్త్రీపురుషుల వివాహములు చెల్లనేరవని నిషేధింప

వలెను. అట్టివారి సంతతికి వారసత్వపు హక్కులను తొలగింపవల యును. ఇతర విధములగు శిక్షలను విధించుటయు యోచింపదగును.

10 వ కారణమగు తండ్రి తాతలనాటి అప్పు ప్రస్తుతపుఅప్పు నకు కారణమగుట నిజమే. తండ్రి తాతలును నేటి యార్థికస్థితియందే యుండుటచే ఋణములపాలయిరి. ఇది సక్రమమైన ఋణమే. 11 వ కారణమగు నవనాగరికజీవనము బ్రిటిషుదీవుల సంపర్కమువలననే సంభవించినది. కృత్రిమమగు ఆడంబరముతో గూడిన జీవితము హెచ్చి నది. ఆర్థికోత్పత్తి యదనముగలేదు. సృష్టింపబడిన హెచ్చుధరలవలన రైతు తన్ను తాను మోసగించుకొనదొడగెను. ఆడంబరజీవితమునుండి ప్రజలను మరలించుటకై గాంధిమహాత్ముడు నేడు విశేషకృషి సల్పు చున్నాడు. నవనాగరికమని మురియుచుండిన పెనుభూతమునుండి రైతు మరలుటత్యవసరము. ధరల హెచ్చుతగ్గులనుబట్టి జీవితవిధానము నెగద్రోయుటయు దిగదీయుటయు తగనిపని.

12 వ కారణమగు ఋణదాతలు పుచ్చుకొనుచున్న వడ్డీ హెచ్చుగనుండుటచే రైతు అప్పులపాలగుచుండెననుట యందొకింత సత్యము కలదు. పురాతనకాలమందు గ్రామజీవనము సక్ర మముగ నుండుటచే ఋణదాత హెచ్చువడ్డీలతో రైతులను పీడించుట కవకాశముండెడిది కాదు. ఆంగ్లేయ యుగమునందా యవకాశము తొలగినది. వేరుసంరక్షణలేదు. ఎంతవడ్డీయైనను పుచ్చు కొనగూడదను శాసనములేదు. ఇచ్చితీరవలెనను శాసనములున్నవి. పండినపంట చాలక క్షుద్బాధకై రైతు యెంతవడ్డీకైనను తలయొగ్గి షాహుకారుల నాశ్రయించుట విధియగుచున్నది. పన్నులభారము తగ్గి రైతునకు జీవించుటకైన వలయుపంట మిగులుచో షాహుకారుల నాశ్రయింపవలసిన పనియుండెడిదికాదు. స్వల్పవడ్డీలపై హెచ్చు

ఫాయిదాలమీద నప్పులనిచ్చు బ్యాంకులేర్పడియున్నను రైతునకింత దుస్థితి పట్టెడిదికాదు.

వడ్డీలకు వడ్డీనిచ్చియైన రైతు పెట్టుబడిని తెచ్చుకొనుట తప్పదు. సులువుగ వేరొకచోట పెట్టుబడి పుట్టుటకు వీళ్ళులేవు. దుక్కి దున్నుట ప్రారంభించినది మొదలు కుప్పనూర్చువఱకు రైతు పరుల పెట్టుబడిపై జీవించుచున్నాడు. పండినపంటలో పెట్టుబడి యంతయు గూడ తీరక మరుసాలునకు బెరుగుచున్నది. ఇట్లు రైతు జీవితపర్యంతము పెట్టుబడిదారులకు అమ్ముడుపోవుచున్నాడు. బస్తాధాన్యము నిచ్చుచో, అరబస్తా లేక గుండెత్తు నాములనిచ్చు షరతుమీద తిండికి ధాన్యమును అప్పు పుచ్చుకొనుచు రెండుమూడు మాసములలో పండు పంటయందు తిరిగి యిచ్చివేయుచున్నాడు. ఇట్లిచ్చివేయుటలో వడ్డీల కంటె మించిన నాము నిచ్చివేయుటయేకాక పంటను నిలవచేసికొని హెచ్చుధరలకు అమ్ముకొను సావకాశమునుగూడ కోల్పోవుచున్నాడు. రైతునకు పెట్టుబడి సుడిగుండమువలె నున్నది. ఈసుడిగుండమున బడి మునుగుచు దేలుచు జీవయాత్ర నెట్లో కొనసాగించుచున్నాడు. కొంత కాలమునకు భూమియే పెట్టుబడిదారుని వశమగుచున్నది. ఈస్థితి దుర్భరము. అయినను షాహుకార్లపై దాడివెడలుట తగదు. నేటి మన ఆర్థికసౌధమునకు షాహుకారే మూలముగ నున్నాడు. నేటికిని గ్రామజీవనమున షాహుకారే ప్రజోపయోగముగ నున్నాడు. డబ్బును సమకూర్చుటయందు, సంరక్షించుటయందు, వితరణమొనరించుట యందు షాహుకారునకే ప్రధానస్థానము నేటికిని గలదు. ఆర్థిక సౌధ మును నిర్మించగల దక్షతయును, శక్తియును, యుక్తియును, షాహు కారునందే కలవు. ఎట్టి పెట్టుబడివిధానమును మనము నెలకొల్పగలిగి నను షాహుకార్లను అట్టివిధానమునందిముడ్చుటకే యత్నింపదగును.

పోవుట లేక తీసివేయకుండుట ఋణకారణమగుట నిశ్చయము. ఏవిధముగ బరీక్షించినను, రైతుల అధికఋణమునకు భూమిసిస్తును భరింపలేకపోవుటయే కారణమని చెప్పుటకు వెనుకాడబనిలేదు.

## 4. ఋణవిముక్తికి ప్రభుత్వ శాసనములు.

రైతుల ఋణసమస్య 17 వ శతాబ్దమునుండియు గూడ ప్రజానాయకుల దృష్టి నాకర్షించెను. రైతులను అప్పులబారినుండి తొలగించుటకై పలయుశాసనము లొనరింపవలెనను ఆందోళనకలదు. 1880వ సంవత్సరమునందుదక్కనురైతులకమీషనువారును,1901వసంవత్సరమునందు కఱవుల కమీషనువారును రైతుల ఋణసమస్యను దర్కించిరి. 1878 వ సంవత్సరపు దక్కనురైతుల సంరక్షణ శాసనము (Daccan Agriculturists Relief Bill), 1882-83 వ సంవత్సరపు తకావీ అప్పుల శాసనము, 1884 వ సంవత్సరపు వ్యవసాయకుల బ్యాంకుస్కీము (Agricultural Bank Scheme), 1897 వ సంవత్సరపు నైకల్సనుగారి రిపోర్టు (Nicholson's Report), 1899 పంజాబునందలి భూవిక్రియ శాసనము (Punjab Land Alienation Bill), 1903 వ సంవత్సరపు సహకారపరపతి శాసనములును గావించునపుడు రైతుల ఋణసమస్య విచారింపబడి తర్కింపబడెను.

వ్యవసాయదారుల ఋణసమస్యను విమర్శించుచు సర్ ఎడ్వర్డు మాక్లిగన్‌గారు (Sir Edward Maclagin), ఋణసమస్య పరిష్కరించుటకై ప్రభుత్వమువారొనరించిన కృషిని నాలుగు విధములుగ విభజించెను.

1. అనవసరపు అప్పులను చేయవలదని రైతులను హెచ్చరించుటకై సలిపిన ప్రబోధము.

2. వ్యవసాయదారుల ఋణమునకు సంబంధించినంతవఱకు సివిలు లాను సవరించుట.

3. భూమి అన్యాక్రాంతము కాకుండ గావించిన శాసనములు.

4. పెట్టుబడి లభించుటకును, ఋణమును తీర్చుకొనుటకును, గావించిన శాసనములు.

ఈనాలుగు విధములుగను ప్రభుత్వమువారొనరించిన కృషిని విమర్శింపదగును.

అనవసరపు అప్పులు చేయవలదను ప్రబోధము.

1. రైతులకు ప్రబోధముచేయుటకు వలయువిద్యయే గఱపబడలేదు. ఋణదాతచెప్పు లెక్కలను సరిసాచు కొనుటకు తగినంత విద్యయైనను పల్లెలయందు వ్యాపింపజేయలేదు. ఆదాయములో నిలువజేసికొని దాచుకొనుటకుగాను సేవింగ్సుబ్యాంకులు పెట్టబడెనని ప్రభుత్వమువారు చెప్పెదరు. ఈసేవింగ్సుబ్యాంకులసంగతి రైతులకు తెలియనే తెలియదనుట వింతకాదు. తపాలాకచేరీలు ఊరూర లేవు. రైతులకు సేవింగ్సుబ్యాంకులసంగతి తెలియజేసినను, ఊరూర నెలకొల్పిననుగూడ ఫలితములేదు. నిలువజేసికొనుటకు ఆదాయము మిగులు ప్రయత్నములులేక ఆదాయము మిగులుచో అది దాచుకొనుటకు సేవింగ్సుబ్యాంకులు పెట్టుటవలన గలుగు లాభమేమి? ఇది ఎద్దు ముందర బండినిపెట్టుట వంటిది.

సివిలులాను సవరించుట.

2. 1879 వ సంవత్సరమున దక్కను వ్యవసాయదారుల సంరక్షణశాసనము గావింపబడెను. 1875 వ సంవత్సరమున నియమింపబడిన దక్కనురైతుల విచారణసంఘమువారి సూచన ననుసరించి యీశాసన మొనరింప

బడెను. ఈకమీషనువారి విచారణయందు ఋణపడినవారు ఋణ దాతలను తీవ్రముగ విమర్శించిరి. ఈశాసనముననుసరించి ఒప్పుకొనిన వడ్డీ హెచ్చుగనున్నచో తగ్గించుటకు కోర్టులకధికారముకలదు. ఇట్లే యితరవిషయములయందుగూడ మార్పులను గావించిరి. కాని యీశాసనము రైతునకనుకూలించుటకుమారు అపకారమొనరించెను. దావాలనుపెంచెను. రైతునకును, పెట్టుబడిదారునకును మధ్య పరస్పరవైషమ్యములను వృద్ధిగావించెను. ఈశాసనము గావించినదిమొదలు భూమి అన్యాక్రాంతమగుట హెచ్చెనని 1901 వ సంవత్సరపు కఱవులకమీషను వ్రాసెను.

1899 లో కంట్రాక్టు చట్టము సవరింపబడెను. (Cotract Act). 1918 లో అప్పుల శాసనము సవరింపబడెను. (Usurious Loans Act). ఈశాసనము మరల 1926 లో సవరింపబడెను. కాని యీశాసనము అమలునందుంచబడలేదని వ్యవసాయ విచారణ సంఘమువారు వ్రాసిరి. ప్రతి రాష్ట్రమునందున యీశాసనము కాగితముమీద మాత్రమే కలదనియు, నిరుపయోగమైనదనియు వ్యవసాయవిచారణ సంఘమువారి నిర్ణయము. ఈశాసనమును గురించి వివిధరాష్ట్రముల యందలి బ్యాంకింగు విచారణసంఘములవారు వివిధరీతుల అభిప్రాయమొసంగిరి. ఈశాసనము నమలులోనికి తెచ్చినను "యిచ్చిపుచ్చుకొను" వ్యాపారమునంతను యీశాసనము ననుసరించి నడుపుటకు వీలులేదు. ఇందువలన వడ్డీలను తగ్గించుటకు తగినంత సావకాశమును లేదు.

పంజాబునందు 1930 వ సంవత్సరమున గావింపబడిన లెక్కలను నిర్ణయించు శాసనమును (Punjab regulation of accounts bill), 1927 వ సంవత్సరపు బ్రిటిషు పెట్టుబడిదారుల శాసనమును (British

money lenders bill) బాగుగ నున్నవని వ్యవసాయ విచారణసంఘము వారు రాష్ట్రప్రభుత్వములకు సూచించిరి.

పంజాబు శాసనము ననుసరించి పెట్టుబడిదారులు తమలెక్కలను సరిగా వ్రాయవలెను. ప్రతి ఆరుమాసములకును అప్పుపుచ్చుకొనినవానికి ఎంతసొమ్ము ఆ ఆరుమాసములలోను అతడు వాడుకొనినదియు, ఆతడెంతమొత్తము నీయవలసియున్నదియు జమాఖర్చులనువేసి పంపుచుండవలెను. ఇట్టి లెక్కలు సరిగాలేనిచో కోర్టువారికి ఆసొమ్మును అంతయుగాని కొంతగాని డిక్రీ యీయకుండ నిరాకరించుట కధికారము కలదు.

ఇంగ్లీషు శాసనము ననుసరించి పెట్టుబడిదారుడు పెట్టుబడులు పెట్టుటకు లైసెన్సును పొందవలయును. వడ్డీకి వడ్డీనికట్టుట నిషేధింపబడెను. అప్పుపుచ్చుకొనినవాడు కోరినవెంటనే అతని అప్పునకు సంబంధించిన లెక్కలను ఋణదాత యొసంగవలెను. ఇట్లు పెట్టుబడిపెట్టుటపై విధినిషేధములను గల్పించు శాసనము లొనరించుచో పెట్టుబడిపెట్టుటయే తగ్గునను భయము వ్యవసాయ విచారణసంఘము వారికి కలుగలేదు. బొంబాయి బ్యాంకింగు విచారణసంఘమువారు విధినిషేధములతోగూడిన శాసనములవలన రైతునకును, పెట్టుబడిదారునకును గూడ చిక్కులుగలిగి పెట్టుబడియే లభించకపోవచ్చునని యభిప్రాయపడిరి. మరియు, అట్టిశాసనములను పెట్టుబడిదారులు సునాయాసముగ నిరుపయోగ మొనరింపగలరని బొంబాయి బ్యాంకింగు విచారణ సంఘమువారి నిర్ణయము.

పంజాబునందలి 1930 వ శాసనమును ఇతరరాష్ట్రములవారు అనుసరింపవలదని పంజాబుబ్యాంకింగు విచారణసంఘమువారు హెచ్చ

(Agriculturist Loans Act). ఈశాసనముననుసరించి దగ్గిరవాయిదా అప్పులను విత్తనములు, పశువులు, ఎరువులు, పనిముట్లు మొదలగునవి కొనుటకు ప్రభుత్వమువారు రైతులకొసంగవచ్చును. కాని ఈ శాసనముల ననుసరించియైనను రైతులు ఋణబాధనుండియు అధికపు వడ్డీల బారినుండియు పెట్టుబడిదారుల పీడనుండియు తప్పించుకొనజాలకపోయిరి. ఇట్టిశాసనములు కలవనియైన రైతులందఱకు తెలియదు. ప్రభుత్వమువారెప్పుడును తెలియజెప్పుటకై ప్రయత్నింపలేదు. తెలియజెప్పినను, అప్పుపుట్టుటకై రివిన్యూశాఖవారు జరుపు తంతుతో కాలయాపనమగును. ఇంతలో రైతునకవసరమే తీరును. మరియు హామీలొసంగుట.కూడ గలదు. హామీలనుగూడ చిన్నరైతులొసంగలేరు. కొంతమంది రైతులేకమైనగాని యీఅప్పుపుట్టదు. ఏకమగుటకు ఈఅప్పులను తెచ్చికొనుటకుపోవు కాలములోపుగ వ్యవసాయపు అదను పోవును. అందుచే రైతు వీటిని వినియోగించుకొనలేదనుటకంటె నీశాసనములు వినియోగపడునట్లు లేవనదగును. ప్రభుత్వమువారు ఉదారముగ నీశాసనములను వినియోగింపలేదనికూడ చెప్పవచ్చును. 1901-3 వ సంవత్సరమున పల్లపుసాగుకమీషను తకావీఅప్పులక్రింద 6 కోట్లుమాత్రమే యొసంగబడెనని వ్రాసెను. ఈమొత్తము సముద్రములోవేసిన నీటిబిందువే యగును.

ఈదిగువపట్టికవలన మదరాసురాజధానియం దొసంగిన తకావీ అప్పుల వివరములను తెలిసికొనగలము.

మఱియు నీ దిగువపట్టిక ననుసరించి ఎంత స్వల్పముగ తకావీ ఋణము రైతుల కొసగబడినదియు సుబోధకమగుచున్నది. ఈదిగువ 1,2 పట్టికలవలన తకావీ అప్పులను కోరిన రైతులందఱకు కూడ ప్రభుత్వమువా రొసంగుటలేదని తెలియగలదు.

| ఫసలీ. | తకావీఅప్పులు—రైతులకిచ్చిన మొత్తము | | | రైతువారీ పట్టాదారుల సంఖ్య. |
|---|---|---|---|---|
| | భూమి అభివృద్ధి శాసనము ననుసరించి 1883 | వ్యవసాయదారుల ఋణ శాసనము ననుసరించి 1884 | మొత్తము. | |
| | రు. | రు. | రు. | |
| 1334 | 1715856 | 2003807 | 3719663 | 4861148 |
| 1333 | 1724680 | 1837781 | 3562461 | 4861148 |
| 1332 | 760647 | 720480 | 1481127 | 4869378 |
| 1331 | 822255 | 1315956 | 2138211 | 4869378 |
| 1330 | 745903 | 881686 | 1627589 | 4862005 |
| 1329 | 589543 | 866708 | 1456251 | 4222548 |
| 1328 | 283811 | 755551 | 1039362 | 4222548 |
| 1327 | 198179 | 626393 | 824572 | 4222548 |
| 1326 | 215859 | 528428 | 744282 | 4222548 |
| 1325 | 239721 | 511530 | 751251 | 4222548 |
| మొత్తము | | | 17344769 | 45435762 |
| 10 సంవత్సరములకు కలిసినసగటు | | | 1734477 | 4543576 |

పట్టాదారు 1కి ఎంత సగటున } $\frac{1734477}{4543576}$వ వంతు రూపాయి=సుమారు రు. 0—6—1 మాత్రమే.

*From Mr. N. Macmichael's evidence P. 263 Vol III, Royal Commission on Agriculture.*

భూమి కిమ్మత్తు కట్టెదరు. ఆతనికి భూమియందుగల హక్కును విమర్శించెదరు. ఆతని దస్తావేజులకు ఋజువుపడెదరు. పిమ్మట ఆరైతునకు అప్పు అవసరమైనదియు లేనిదియు పరీక్షించెదరు. ఈపరీక్షల ఫలితమును రివిన్యూ ఇనస్పెక్టరు తహశీలుదారునకు పంపును. ఆయన చిన్న మొత్తములైనచో ఆర్డరు వేయుచుండును. పెద్దమొత్తములైనచో డిప్యూటీ కలెక్టరుగారికి ఉత్తరువుల నిమిత్తము పంపుచుండును."

ప్రశ్న:—ఈతంతున కెంతకాలము పట్టును?

సమాధానము:—ఈవిషయము సిబ్బందీననుసరించి యుండును. ఇందులకై ప్రత్యేకముగ గొంతసిబ్బందిని నియమించుచో వారము లేక పదిరోజులలో నిర్ణయించుటకు వీలుండును. లేక మామూలుగ నుండు పరివారమే పనిచేయవలసివచ్చి వారికి యితరపనులు గూడ నున్నచో చాల ఆలస్యమగును."[1]

మదరాసు ప్రభుత్వమువారి వ్యవసాయశాఖ డైరక్టరుగారి పై సమాధానముల ననుసరించియే తకావీఅప్పులు రైతులకు సులువుగ లభించుటలేదనియు నీశాసనముల ననుసరించి ఋణసమస్య పరిష్కరింపబడుటకు సావకాశము లేదనియు స్పష్టపడుచున్నది.

మరియు తకావీఅప్పులు రైతులకు వ్యవసాయము నిమిత్తము మాత్రమే యొసగబడును. రైతులకు జీవితమునం దడుగడుగునకు అప్పుకావలసిన స్థితిగలదు. షాహుకార్లయొద్ద అప్పుపనికైనప్పట్టును. వసూలునందుగూడ తకావీఅప్పులవలె షాహుకారులఅప్పు కంఠమున కురివలె ఆయేడే బాధించదు. 1917 వ సంవత్సరమున వ్యవసాయ సంఘమువారు తకావీఅప్పులను సులువుగ రైతులకొసంగుట కేర్పాటు లొనరింపవలెనని తీర్మానించిరి. 1922 వ సంవత్సరమునుంచియు

1. *From Vol III Agricultural Commission's Report P 290*

బొంబాయియందు రాష్ట్రీయకోఆపరేటివు బ్యాంకుపరముగ తకావీ అప్పులను రైతులకిప్పించుచున్నారు. 1929-30 వ సంవత్సరమునుంచియు తకావీఅప్పులను విరివిగ రైతులకులభింపజేయవలెనను ప్రయత్నములుకలవు. కాని నిష్ఫలములైనవి.

ఈశాసనముల మూలముగ రైతులకొసంగిన అప్పులుమాత్రమే కాక కొన్నికొన్ని కుటుంబములకుకూడ అప్పుడప్పుడు అప్పులొసంగబడినవి. (టాగూరు కుటుంబమువంటి కుటుంబములకు). జమీందారులు అప్పులపాలైనపుడు వారిజమీలను స్వాధీనపరచుకొని జమీలు పోకుండ అప్పులను తీర్చుచున్నారు.

రైతులఋణసమస్యకు ప్రభుత్వమువారొనరించుచున్న కృషి యిదియే. ఈకృషివలన రైతులఋణసమస్య ఆవగింజలో అరభాగమైన పరిష్కరింపబడలేదు. ఒకసంవత్సరమునకంటె మరొకసంవత్సరము వృద్ధియగుచున్నది. బ్యాంకింగు విచారణసంఘములు మదింపు వేసినట్లుగ 800 కోట్లుమాత్రమే రైతులఋణమని చెప్పవీలులేదు. ఇది కనిష్టప్రమాణమై యుండును. రైతులు తమఋణమును వెలిపుచ్చక దాచుకొనుట కలవాటుపడిరి. రైతులు తమకుగల ఋణమునంతను సిగ్గువిడిచిచెప్పుచో కనీసము రైతులఋణము రు 1200 కోట్లు గలదని తేలును. ఇందులకు సంశయింపబనిలేదు.

రాష్ట్రీయ బ్యాంకింగు విచారణసంఘములే ఋణములను మదింపువేయుటలో గల లోపముల నిట్లు నిరూపించెను.

1. చాలమంది రైతులకు తమకుగల అప్పుల వివరములే తెలియవు. చాలమంది తమకుగల అప్పుల వివరములను తెలుపుట కిష్టపడలేదు.[1]

1. బొంబాయి నివేదిక, 45 వ పేరా.

పంటయుహెచ్చలేదు. వెండిబంగారములు కొలదిగనుండినను, అవియు అమ్మివేయబడెను. అప్పుమాత్రమే హెచ్చినది. అయినను ఆస్తి హెచ్చకపోయినను 1930 వ సంవత్సరమువఱకు పరపతిహెచ్చుగ గలదు. ఈపరపతి సహజముగ పెరిగియుండిన (అనగా ఆస్తిహెచ్చి పరపతిపెరిగియుండిన) నేడు ధరలు పడిపోయినను, అప్పు బాధకరముగ నుండెడిదికాదు. కనీసము అప్పుఆస్తులురెండును సరిపోయెడివి. ఇట్లు పరపతి సహజముగ పెఱుగక కృత్రిమముగ ప్రభుత్వమువారి నాణెముల చెలామణివిధానమువలన నొకప్పుడు ధరలు పెంచబడి మరొకప్పుడు తగ్గింపబడినవి. అధికపుపరపతి కృత్రిమముగ సృష్టింపబడెను. నాణెముల చెలామణివిధానమువలన గలిగిన యీకృత్రిమావస్థయే రైతుల నేటి దుస్థితికి ముఖ్యకారణము.

"లక్ష్యములేక నాణెములను చెలామణియందు హెచ్చించుట వలన చెలామణివిధానము నశించిపోవును. కాని గతించిన పదిసంవత్సరములనుండియు హిందూదేశమునం దవలంబించినట్లుగ నాణెములను చెలామణినుండి తీసివేయుపద్ధతి రైతుపట్ల నిర్దాక్షిణ్యముగ ప్రవర్తించుటయే యగును. ప్రపంచమునం దంతటికంటె హిందూదేశమున వ్యవసాయదారుల ఋణభారము హెచ్చుగనున్నది. గతించిన మూడుసంవత్సరములయందును దిగజారిన ధరలీ ఋణభారమున నత్యధిక మొనరించెను. రైతునకీవిషయమున గావింపబడిన అన్యాయమునకు పరిమితిలేదు. రూపాయవిలువను తగ్గించుటయే యీదుస్థితి నుండి రైతునుసంరక్షించుటకు తరుణోపాయము" అని గావినుజోన్సు గారు నాణెముల చెలామణి విధానమువలననే రైతులఋణభారము మితిమీరినదని ధృవపరచుచున్నారు.[1]

---

*1. From the Note of Mr. Gavin Jones on Economic Situation submitted to the Upper India Chamber of Commerce. See Hindu 9—1—34.*

అయిననేమి? ఈబాధ్యతను ప్రభుత్వమువారు గుర్తింపలేదు. పంటలధరలు పడిపోవుటవలన గలిగిన ప్రస్తుతార్థిక దుస్థితినుండి రైతును సంరక్షించుటకై విదేశములయందలి ప్రభుత్వములు వివిధ రీతుల ప్రయత్నించుచున్నవి.

"ఆస్ట్రేలియా ప్రభుత్వమువారు తమరైతులదుస్థితిని గుర్తించిరి. ఆస్ట్రేలియాయందు రైళ్ళపై రెండుసంవత్సరములలోను 20 మిలియను పౌనులు (27 కోట్లరూపాయలు) నష్టపడినను, వ్యవసాయపుదినుసులపై రైళ్ళచార్జీలను తగ్గించివేసి, రైతులకు తోడ్పడుచున్నారు. తమ ఓడకేవులనుగూడ తగ్గించుట కేర్పాటులొనరించిరి.

న్యూజిలాండు దేశమున రైతు ఆర్థికదుస్థితినుండి సంరక్షింపబడుటకు రైతునకగు ఖర్చులను తగ్గింపవలెనని గుర్తింపబడెను. ఆస్ట్రేలియా దేశమునందు వలెనే న్యూజిలాండుదేశమున గూడ జేసిరి.

దీనితో బోల్చిచూచినయెడల హిందూదేశ ప్రభుత్వమువారు ఎప్పుడును అట్టిసహాయమును జేయక నిరాకరించుచున్నారు. ఆస్ట్రేలియాదేశమందలి రైళ్ళ ఆదాయవ్యయముతో బోల్చిచూచిన హిందూదేశమందలి రైళ్ళ ఆర్థికస్థితి చాలబాగుగ నుండినను, వ్యవసాయపు దినుసులపై రైళ్ళ రేట్లను తగ్గింపవలయునని దేశమంతయు ఘోషించుచున్నను, ఈఆందోళమునంతయు ప్రభుత్వమువారు వినిపించుకొనుటలేదు. చెవిటివానివద్ద శంఖమూదినట్లుగ నున్నది.

వ్యవసాయపు దినుసుల ఎగుమతులపై రైళ్ళరేట్లను తగ్గించుటయేకాక కొన్నిదేశముల ప్రభుత్వములు వ్యవసాయపు దినుసుల ఎగుమతిని పోషించుటకై విరాళములనుగూడ నొసంగుచున్నవి.

అమెరికా దేశమున అతిస్వల్పవడ్డీలకు ప్రభుత్వమే రైతులకు అప్పులనిచ్చుచున్నది. రైతుల తణఖాలను ప్రభుత్వమువారే తీర్చుట కంగీకరించుచున్నారు.

అమెరికాయందు వ్యవసాయపు భూముల తణఖాదారులు తమ తణఖాపత్రములను ప్రభుత్వమువారి కొసంగవలెను. ఇందులకుమారుగ ప్రభుత్వమువారు 100 కి సంవత్సరమునకు 4 వంతుల వడ్డీతో నిచ్చు ప్రభుత్వ ఋణపత్రముల నొసంగెదరు. ఈపద్ధతివలన వ్యవసాయదారుల ఋణభారము చాలవఱకు తగ్గినది. వ్యవసాయపు దినుసులను పండించుటకగు ఖర్చు యిందువలన తగ్గినది. (అనగా పంటలు తక్కువవెలకు అమ్మినను ఖర్చులు తక్కువ అగుటవలన రైతులకు లాభమువచ్చును.)

ఇటలీదేశమున హెచ్చువడ్డీల బారినుండి రైతు సంరక్షింపబడెను. ఈరైతుల ఋణములన్నియు 25 సంవత్సరముల తణఖాపత్రములుగ మార్చివేయబడెను. ప్రతిసంవత్సరము వడ్డీక్రింద కొంత యిచ్చుకొనుచుండవలెను. మొత్తము 100 కి 7½ మాత్ర మొసగబడును. ఇందుగల వ్యత్యాసమును ప్రభుత్వమువారు భరించెదరు. వ్యవసాయమే మన ముఖ్య పరిశ్రమ. ఇతరదేశములయందున, అధినివేశరాజ్యముల యందున, అమెరికాయందున, రైతుల సంరక్షణకై చేసిన ప్రయత్నములతో మనదేశమునందు ప్రభుత్వమువారొనరించిన ప్రయత్నములను పోల్చిన అత్యల్పముగ నుండుట విచార కారణము................హిందూదేశ ప్రభుత్వమును స్వదేసంస్థానములునుగూడ మన ముఖ్యపరిశ్రమకు దోహద మొసంగుటకు చేయవలసినదంతయు జేయలేదు."[1]

---

*1. From Dewan Bahaddur M. Ramachandrarao's Presidential Address, Mysore Provincial Co-operative Conference 29 September 1933.*

# 6. ప్రపంచార్థికదుస్థితి, రూసువెల్టుగారి కార్యక్రమము.

ప్రపంచార్థికదుస్థితి అమెరికాయందునగూడ నలుముకొనినది. అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వాధ్యక్షుడగు రూసువెల్టుగారీ దుస్థితినుండి అమెరికాదేశపు ప్రజలను సంరక్షించుటకై గావించు చుండిన కార్యక్రమము ప్రపంచమునంతను సమ్మోహింపజేయు చున్నది. రూసువెల్టుగారి కార్యక్రమమందలి ముఖ్యవిషయములను పరిశీలించెదము.

1. రైతులపైగల వడ్డీభారమును దొలగించుటయే మొట్టమొదటి పని. రైతులతనఖాపత్రములను ప్రభుత్వమువారు చెల్లింప నంగీకరించుటవలన నీఫలితము లభించెను.

2. వ్యవసాయదారుల పంటల ధరలు హెచ్చించుటకు ప్రయత్నించుట రెండవపని. ఉత్పత్తిని తగ్గించుటకై శాసన మొనరింపబడెను.(Under the Agricultural Adjustment Act.) ఇందువలన ధరలు కొలదిగ హెచ్చినవి. వ్యవసాయదారుడు కొనవలసిన ఎరువులు మొదలగువాటి ధరలు నిలకడగనుండి, పంటల ధరలు కొంచెము హెచ్చినవి. ఇందువలన రైతులకు ఆదాయము కొంచెము హెచ్చుగ మిగిలినది.

3. వ్యవసాయదారునివలె కార్మికునికిగూడ సదుపాయము లొనరించుటకై ప్రయత్నించుటయే మూడవపని. కార్మికుని సంపాదనయందు ఖర్చులుపోను నిలవయుండినగాని దేశమునందలి పంటలను లేక ఇతరవస్తువులను విరివిగ గొనజాలడు. ప్రజాసామాన్యము విరివిగ

రస్యము కుదుర్చుటకై శాసనరూపముగ సంఘములను నియమించుటకు గొన్ని రాష్ట్రములయందు ప్రయత్నింపబడుచుండెను. కొన్ని రాష్ట్రములయందు వడ్డీలను తగ్గించుటకై శాసనరూపముగ బ్రయత్నింపబడుచుండెను. వడ్డీలను నిర్ణయించుటకు మరికొన్ని రాష్ట్రములయందు ప్రయత్నములు జరుగుచున్నవి.

ఈప్రయత్నములన్నియు మూలసమస్యయగు ఋణభారమును తొలగింపజాలవు. రైతుల రక్తమాంసాదులను భక్షించుచు ఋణసమస్య దీర్ఘజాడ్యముగ నున్నది. ఈజాడ్యమును సమూలముగ నివారించుటకై ప్రయత్నింపవలెను. జాడ్యలక్షణములను నివారించుటకై చేయు ప్రయత్నములు నిష్ఫలములగును. అందులకై పడు పాటు నిరుపయోగమగును.

## 8. ఋణసమస్య-పరిష్కార మార్గములు.

వ్యవసాయాభివృద్ధి సమస్యలో ఋణసమస్య ప్రాముఖ్యస్థానము వహించును. ఋణసమస్య పరిష్కారము కానియెడల, వ్యవసాయాభివృద్ధి సమస్య పరిష్కారము కాదు. సంపూర్ణముగ రైతులకుగల ఋణమునంతయు రద్దుపరచు మార్గముల నన్వేషించుటయే కర్తవ్యము. ఆస్తియేకాని, ఏవిధమగు అప్పును లేక రైతుల జీవితము మరల ప్రారంభమగు పద్ధతి నన్వేషింపవలెను.

1. అప్పులను రద్దుచేయుటవలన జీవనోపాధికి భంగమురాని వారికి రైతులనుండి రావలసిన అప్పులను రద్దుచేయవలయును. అనాధలు, వృద్ధులు, వికలాంగులు మొదలగువారు రైతులకు అప్పులనిచ్చియుండి ఆఅప్పులను రైతులు తిరిగి తీర్చకపోయినయెడల వారు కనిష్ట ప్రమాణమున కూడ జీవయాత్రను చేయలేని స్థితియందుండినయెడల

అట్టివారికి రైతులొసంగవలసిన అప్పులను రైతులకుమారుగ ప్రభుత్వమువారే ఋణమును తీర్మానింపవలెను.

2. ఇట్లు సంపూర్ణముగ ప్రభుత్వము రైతులఋణమును తుడిచి వేయుటకు సాహసింపకపోయినయెడల ప్రభుత్వమువారే రైతు లొసంగ వలసిన ఋణమునకంతకును బాధ్యత వహింపవలయును. ఋణ దాతలయొద్దనుంచి ఋణపత్రములను కొనివేయవలయును. ప్రభుత్వ ఋణపత్రములను వారికొసంగదగును. కనీసము 50 సంవత్సరములలో ప్రభుత్వ ఋణపత్రములు తీర్చివేయుటకు నియమముండవలెను. ప్రభుత్వమువారిట్టి ఋణపత్రముల కొసంగువడ్డీ వ్యవసాయపుభూములపై గిట్టు వరుమానముకంటె అదనముగనుండరాదు.

3. రైతులఋణమునకై ప్రభుత్వమువారు సంపూర్ణముగ బాధ్యతగూడ వహింపజాలనియెడల వెంటనే రైతులకు పరపతి హెచ్చిం చుటకైన బూనవలెను. పరపతి హెచ్చించుటకు వడ్డీరేటును తగ్గించుట యొకమార్గము. రు 100 కి రు 3-0-0 లకంటె వడ్డీ చెల్లనేరదను శాసన మొనరింపదగును. బ్యాంకుల వడ్డీలనుగూడ నూటికి మూడురూపా యలకు తగ్గింపవలెను. ఇట్లు తగ్గించినయెడల భూమిమీదవచ్చు రాబడి కంటె వడ్డీరేటు హెచ్చుగనుండదు. అప్పుడు ఋణదాతలు భూములను కట్టుకొనుటకు సునాయాసముగ నంగీకరించెదరు. బ్యాంకులలో స్వల్ప వడ్డీలపైన విశేషధనము దాచుకొనబడును. ఆసొమ్మును బ్యాంకులు రైతులకు తిరిగి యిచ్చుటకు వీలగును. వడ్డీపైన భూమికంటె అదన ముగ ఆదాయము వచ్చుచుండుట కూడ భూములపరపతి తగ్గుటకొక కారణము. భూములరాబడికిని, వడ్డీకిని సమానస్థాన మొసంగినయెడల భూమిపరపతి హెచ్చును. మరియు పరిశ్రమాభివృద్ధికి సులువుగ పెట్టు బడికూడ లభించును. పరిశ్రమాభివృద్ధికి పెట్టుబడి లభించుటకును

భూమిపరపతి హెచ్చుటకును వడ్డీరేటు తగ్గించుటతోపాటు భారత దేశమునందుండి ఎవరును విదేశములలో పెట్టుబడి పెట్టరాదని కూడ శాసింపవలెను. నేడుగల అప్పులను తీర్చుటకు సుమారు 25 సంవత్సరములకు తక్కువకాని కాలపరిమితి నేర్పరచవలయును.

ఈవిధముగ జేసినయెడల రైతుల ఋణబాధ యొకింత తొలగును. కాని ఋణభారము తొలగదు. వ్యవసాయాభివృద్ధికి మార్గమేర్పడదు. సంపూర్ణముగ ఋణమును రద్దుచేసి వ్యవసాయపు భూమిని ఉమ్మడి వ్యవసాయమునకై ప్రజాస్వామిక గ్రామ ప్రభుత్వములకు స్వాధీన మొనరించిననాడే వ్యవసాయసమస్యయు, ఋణసమస్యయు గూడ పరిష్కరింపబడును. అంతవరకును పరిష్కరింపబడవు.

## 9. సహకార పరపతి సంఘములు-ఋణసమస్య.

నేటి సహకార పరపతి సంఘముల మూలమున ఋణసమస్య పరిష్కారము కాదు. గత ముప్పది సంవత్సరములనుండియు సహకారోద్యమము తలపెట్టబడినను నేటివఱకు సహకారోద్యమము జయము గాంచలేదు. ఋణసమస్యను పరిష్కరించలేకపోయెను. సహకారోద్యమ పరివర్తనమంతయు దెలిసికొనినయెడల నీ స త్య ము నెఱుంగగలుగుదుము.

## 10. సహకారోద్యమ తత్వము.

సహకారభావము ప్రకృతిసిద్ధము. మానవుల నైసర్గిక లక్షణము. ఏమానవుడును తనకు తానే జీవింపజాలడు. పుట్టినది మొదలు గిట్టువఱకు తానొరులకు సహాయము జేయుచు తానొరుల సహాయమును బొందుచు తానొరులతో గలిసి చరించుచు జీవయాత్ర గడుపు

చున్నాడు. మత సాంఘిక రాజకీయార్థిక జీవిత విభాగములయం దేజీవిత విజయమునకైనను సహకారతత్వమే మూలము. వ్యక్తికి, సంఘమునకు, జాతికి, దేశమునకు మొదలగు అన్నింటి జీవిత విజయమునకును సహకారతత్వమే ప్రధానాంగము. వ్యక్తులమధ్య, సంఘముల మధ్య, కులములమధ్య, మతములమధ్య, దేశములమధ్య పరస్పరద్వేషాసూయ భావములు పెంపొంది ప్రజలను సంక్షోభింపజేయుచున్నవి. అయినను మానవ ప్రపంచమంతయు అశాంతిమయము కాలేదు. కంటికి గోచరించుచుండిన ద్వేషాసూయ భావముల వెనుక ప్రకృతిసహజమును, ప్రేమమయమునునగు సహకారతత్వముండుటవలననే ప్రపంచమంతయు భీభత్సమయమగుటలేదు. పశువులన్నియు నేకముగ మందగ పోవుటకే యభిలషించుచుండును. ఒంటరిగపోవుట కిచ్ఛగింపవు. పక్షులన్నియు గగనమార్గమున బారులు తీర్చిపోవుచుండును. ఒంటరిగబోవు. పిపీలికలు సహితము కలిసి వసించుచుండును. ఆహారమార్జించుటకు ఏక ప్రయత్నమునే చేయుచుండును. పశుపక్షి పిపీలికలయందు గోచరించుచుండిన ప్రేమమయమగు సహకారభావము మానవ ప్రపంచమున మాసిపోయినదా? పశువుల మందయందు కొన్ని పోట్లగొడ్లుండినంత మాత్రమున మందయంతయు సహాయనిరాకరణభావమునజీవించుచుండెనని చెప్పదగునా? ఇట్లే అధికార అహంకారమున స్వార్థపరత్వమున సంకుచిత జాతీయభావమున వ్యక్తులమధ్య పోటీ పెరుగుచుండినమాట నిజమే. మతములమధ్య ద్వేషము పెంపొందుచుండినదనుటయు సత్యమే. దేశదేశములు పోరాటములకు డీకొనుచుండుటయు నిర్వివాదాంశమే. ఇంతమాత్రమున మానవ లోకమునందు సహకారతత్వము సమసిపోయిన దనజాలము. మరుగుపడి యుండినదని చెప్పదగును. దీనిపై బడిన ఆచ్ఛాదనమును దొలగించి రత్నమును సానబట్టినయట్లు ప్రదీపింపజేయుటయే నేటి ప్రపంచ కర్తవ్యము. ముఖ్యముగ పసచెడి వన్నెతరిగి

"కొంతమంది వ్యక్తులు ఏకాదర్శ సిద్ధిని సమిష్టికృషివలన బడ యుట్లకై సమ్మేళన మగుటయే సహకార మనదగును. బంతిఆటను ఆడువారిజట్టు లేక దొంగలగుంపు లేక ఇతరులను మోసముచేయుటకై కొంతమందిచేరి ఏర్పరచుకొను దళారీకంపెనీలు మొదలగునవి కూడ సహకారముమీదనే ఆధారపడినవి. కాని ఒక శతాబ్దము నుండియు గల సహకారోద్యమచరిత్ర సహకారోద్యమమునకు మరొక అర్థ మును జెప్పుచున్నది. ఋజువర్తనమున ఏకాదర్శముపై ఆర్థికలాభ మును సమిష్టి కృషితో సముపార్జన చేయుటయే సహకారోద్యమ మున కర్థము. సహకారోద్యమమునకు బూనిన వ్యక్తులు తమలో తాము పరస్పర మెరుంగుట కూడ ముఖ్యావసరమే" అని సి. యఫ్. స్ట్రిక్‌లాండు గారు సహకారోద్యమమును నిర్వచించిరి.[1]

"ఉత్పత్తియందును, పంపకమునందును గల పోటీలను దొల గించివేయుటయును ఉత్పత్తి చేయువారికిని వినియోగించుకొనువారికిని మధ్యగనుండు దళారీలను దప్పించివేయుటయును సహకారోద్యమము నకు సాంకేతికార్థ మనదగును." అని సెలిగ్మానుగారు వ్రాసిరి.[2] "సహకారోద్యమము పరస్పర సహాయమునకై ప్రారంభింపబడుచు అందఱకు సమాన సామర్థ్యము నొసంగుచుండును." అని మిరిక్కు గారు నుడివిరి.[3]

"సహకారోద్యమమొక ప్రత్యేక ఆర్థిక సంస్థ. నిర్ణీతమగు వర్తక కార్యములకై నిర్ణీతమగు నియమములతోగూడి సమిష్టికృషి చేయబడును. ప్రస్తుత పారిశ్రామిక వ్యవస్థల కవసరమగు రుజువర్తనము కంటె నుత్తమమగు వర్తకమునకును ధర్మమునకును పరస్పర సమ

1 *See C. F Strickland Cooperation in India P 12*

2 *Principles of Economics. By Seligman.*

3 *Federal Farm Loan System P 18 by Myric.*

న్వయ మొనరించు భావమే సహకారోద్యమ మూలము.'' అని గార్డను గారును, ఓబ్రిను గారును సహకారోద్యమమును గురించి నిర్వచించిరి.[1]

"స్వేచ్ఛతో తమంత తా మొక సంఘముగా నేర్పడి పరస్పరము తమ శక్తియుక్తులను, ధనమును వినియోగించుచు తమ సంఘమును తామే స్వయముగ పరిపాలించుకొనుచు ఉమ్మడిగ లాభనష్టముల ననుభవించుటయే సహకారోద్యమము'' అని హెరిక్కుగారు వ్రాసిరి.[2]

"సహకారసంఘమనగా వ్యక్తులు తమంతట తామే ఏర్పరచు కొనిన సంఘ మనదగును. తమ సాంఘికార్థిక స్థితులను జక్కజేసికొనుటకుగాను సమానమగు హక్కులతో ప్రజాస్వామికముగ ఐశ్వర్యసాధనముల నేర్పరచుకొనుటయనియు జెప్పదగును.''[3]

"సహకార సంఘములకును, జాయింటుస్టాకు కంపెనీలకును గల వ్యత్యాసమేమి యని ఆలోచనాపరులకు దోచవచ్చును. స్థూలముగ నిర్వచింపవలెననిన రెండుముఖ్యభేదములు కలవు. ఆదర్శముల యందును, అధికారములయందును గూడ భేదమున్నది. జాయింటుస్టాకు కంపెనీలలో వాటాదారునకు తనకుగల వాటాలననుసరించి అధికారము సంభవించును. 10 వాటాలుగల వాటాదారునకు 1 వాటాయుండిన వాటాదారునకంటె పదిఓట్లు అదనముగ నుండును. (పదిరెట్లు అదనముగ అధికారము కలదని యర్థము.) అందువలన పెట్టుబడి పెట్టిన ధనమే ప్రాముఖ్యస్థానము వహించుచున్నది. "సహకార సంఘములకు 'ఒకమనిషికి ఒక ఓటు' అనునదియే పరమధర్మము. భాగ్యవంతుడును, బీదవాడును, సహకారసంఘమునందిందువలన సమానులే. కంపెనీలకు లాభములను సంపాదించుటయే ముఖ్యాదర్శము. ఈలాభములు

---

*1 From Gordon O Brin Cooperation in Denmark.*

*2 Rural Credits by Mr. Herricks-quoted by Mr P. Mukherji Cooperative movement in India P 2.*

*3 Rural Reconstruction in Ireland.*

వాటాలవారికి పంచిపెట్టబడును. సహకారసంఘముల ఆదర్శము లాభములనార్జించుట కాదు. సహకారసంఘ సభ్యులకు చేయగలిగినంత ప్రత్యేకసేవ జేయుటయే సహకారసంఘమున కాదర్శము. అందువలన జాయింటుస్టాకు కంపెనీలకు "లాభము, హెచ్చులాభము, అందరికంటె హెచ్చులాభము" సంపాదించుటయే ఆదర్శము లేక ఏకంపెనీకి ఆకంపెనీయే లాభములకై ప్రయత్నించును. వెనుకబడిన కంపెనీలు దయ్యమునకే గురియగును. "వ్యష్టికృషి సమిష్టికృషికొఱకును, సమిష్టికృషి వ్యష్టికృషికొఱకును" చేయుటయే సహకారోద్యమ ఆదర్శము. అందువలన జాయింటుస్టాకు కంపెనీలకును సహకారోద్యమమునకును మూలసిద్ధాంతములయందే విభేదము కలదు."[1]

## 11. సహకారోద్యమ చరిత్ర.

ఈనిర్వాచనముల ననుసరించి సహకారోద్యమము సజీవమైనదనియు జాతీయజీవితమునందు ప్రాముఖ్యస్థానము వహింపగలదనియు గ్రహించుట సులభము. సహకారోద్యమపు పుట్టుకయు, వ్యాప్తియు, నింక గమనింపదగును. వివిధదేశములయందు ఆయాకాలములలో గల ఆర్థిక పరిస్థితుల ననుసరించి సహకారోద్యమము వివిధదేశములయందు వివిధరీతుల వ్యాప్తిగాంచెను. హిందూదేశమందలి సహకారోద్యమము జర్మనీ, డెన్మార్కు దేశములయందలి సహకారోద్యమములవలె ప్రారంభింపబడెను. నేడు హిందూదేశమునందు గల రైతుల స్థితికిని పారిశ్రామికుల స్థితికిని 1850 వ సంవత్సరప్రాంతమున జర్మనీయందలి రైతుల యొక్కయు, పారిశ్రామికుల యొక్కయు, ఆర్థికస్థితికిని చాలపోలిక కలదు. జర్మనీదేశమునందు నాడుగల యిరువురు మానవసేవకులా

1. *The Co-operative Movement in India P. 5 By Mr. P. Mukherji.*

దుస్థితిని సహింపజాలకపోయిరి. ఎవరికివారు వీటి దుస్థితి నెదుర్కొనుట యెట్లని యూహింపసాగిరి. (Schulze Delitsch) స్కల్జుడెలిట్షుగారు న్యాయమూర్తి. ఈయనచేతిపనివాండ్రతోను,చిన్న చిన్న వర్తకులతోను కలసిమెలసి వర్తించుచు వారి దీనస్థితిని నివారింప దలపెట్టెను. పరపతి సంఘములను స్థాపింపప్రారంభించెను. (Raiffeisen) రేఫీసనుగారు స్థానిక పారిపాలనయందుద్యోగిగ (Burgomaster) ప్రూసియాయందొక బీద జిల్లాలోపనిచేయుచుండెను. ఈజిల్లాయందలి రైతులు అర్థాకలితోపీడింప బడుచు పెట్టుబడిదారుల బారికి గురియైయుండిరి. ఈస్థితి నీయన సహింప జాలక పరపతిసంఘములను నితరవిధములగు సంఘములనుగూడ సేద్య గాండ్రకొఱకు స్థాపించెను. ఈయిరువుర మానవసేవకుల కృషియు, ప్రభుత్వపు మన్ననకు బాత్రముకాలేదు. ప్రభుత్వమువారిచే వ్యాప్తి నిరోధింపబడెను. కాని, అనతికాలములోనే ప్రభుత్వ ప్రతిఘటనను జయించి విదేశముల కాదర్శప్రాయముగ జర్మనీయందు సహకారోద్య మము శాఖోపశాఖలుగ విజృంభించెను. డెన్మార్కు, ఇటలీ, అయి ర్లెండు దేశముల కాదర్శప్రాయముగ నుండెను. ఇంగ్లండులో కార్మి కుల దుస్థితిని తొలగించుటకు చౌకగ వస్తువులను కొని కార్మికులకు విక్రయించుటకుగాను, క్రియవిక్రియ సంఘములు వ్యాప్తియందున్నవి. ఇందులభించు లాభములను కొనుగోలు మొత్తము ననుసరించి పంచి పెట్టబడుచుండెను. గృహనిర్మాణ సంఘములు, ఉత్పత్తి సంఘములు మొదలగునవికూడ ప్రారంభింపబడెను. కార్మికుల నైతికార్థికాభి వృద్ధియే యీసంఘముల ముఖ్యోద్దేశము. అయిర్లెండు, డెన్మార్కు, హాలెండు, స్విజర్లాండు దేశములలో వ్యవసాయ మభివృద్ధిపరచుటకై సహకారోద్యమము పనిచేయుచున్నది. అనగా పశుసంతతి నభివృద్ధి చేయుట వ్యవసాయపు దినుసులను సరియగు ధరలకు వలయుచోట్లకు పంపి అమ్ముట, పాలను, వెన్నను, మొదలగువాటినిగూడ సరియగు

ఈవిధముగ జర్మనీయందు బయలువెడలిన సహకారోద్యమము నేడు అంతర్జాతీయోద్యమముగ నున్నది. అంతర్జాతీయ సహకారోద్యమ దినముగ నొకరోజున సహకారవాదులందఱు సమావేశమగుచున్నారు. సహకారోద్యమమునకు మానవసేవ మూల సిద్ధాంతముగ నుండుటయే సహకారోద్యమ వ్యాప్తికి ప్రాణము.

## 12. హిందూదేశము-సహకారోద్యమ చరిత్ర.

హిందూదేశమున మొట్టమొదట సహకారోద్యమమును ఫ్రెడరిక్ నైకల్సన్‌గారు (Frederick Nicholson) తలపెట్టిరి. ఈయన మదరాసు రాజధానియందొక సివిలు సర్వీసు యుద్యోగి. సహకారోద్యమము రైతుల ఋణసమస్యను పరిష్కరింపగలదని యీయన విశ్వసించెను. అయిరోపాఖండమందుగల బ్యాంకులను గురించి యీయనకు విపులముగ దెలియును. మదరాసు ప్రభుత్వమువారు నైకల్సనుగారిని వ్యవసాయకులకు సంబంధించిన బ్యాంకులను గుఱించి విచారించుటకు నియమించిరి. నైకల్సనుగారు (1895-7 వ సంవత్సరము) తమ నివేదికను ప్రకటించిరి. ఈ నివేదికయందు సహకార పరపతిసంఘములను నెలకొల్పవలయునని నైకల్సనుగారు సూచించిరి. "హిందూదేశమునందు రైతునకు ఎల్లవేళల అప్పు కావలసియుండుటచే సహకారపరపతి సంఘములను నెలకొల్పుటయే తగిన పని" యని నైకల్సనగారి నిర్ణయము. యూరపుఖండమునందుగల సహకార పరపతిసంఘముల వలెనే మదరాసు రాజధానియందు సహకార సిద్ధాంతమునకు జెందిన "నిధులు" పనిచేయుచున్నవనియు, అందుచేత సహకారపరపతి సంఘములను స్థాపించుటకు వలయు వాతావరణము మదరాసు రాజధానియందు గలదనియు నైకల్సనుగారు ధృవపరచిరి. జర్మనీదేశమందుగల

రిఫీసను సంఘములవంటి సంఘములను పెట్టుట అత్యవసరమనియు, నైకల్సనుగారు వ్రాసిరి. అయిననేమి? ఈయన నివేదికను మదరాసు ప్రభుత్వమువారు చిత్తుకాగితముల బుట్టలో పడవేసిరి. 1899 వ సంవత్సరమున నైకల్సనుగారి నివేదికను విమర్శించుచు తీర్మానించిరి. "రైతుల కప్పునిచ్చు సమస్య అత్యవసర విషయము కా"దని మదరాసు ప్రభుత్వము ప్రకటించెను.[1]

ఇంతలో సంయుక్తరాష్ట్రములయందలి సివిలుసర్వీసు యుద్యోగియగు డూపెర్నెక్సుగారు (Mr. Dupernex) హిందూదేశపు ప్రజల బ్యాంకు అనుపుస్తకమును వ్రాసి ప్రకట్రించిరి. (People's Bank of India) ఈపుస్తకమున సహకారోద్యమ విషయములు విపులముగ గలవు. నైకల్సనుగారి నివేదికయు, డూపెర్నెక్సుగారి పుస్తకమును సహకారోద్యమ భావవ్యాప్తికి దోడ్పడెను.

సంయుక్తరాష్ట్రములయందును, పంజాబు, బెంగాలు దేశములయందును కొందఱు జిల్లాఅధికారులు తమస్వంతబాధ్యతపైన సహకార పరపతిసంఘములను స్థాపించిరి. ఈసంఘములు విజయమునొందలేదు. ఇందులకు ప్రభుత్వసహాయము లభింపకపోవుటయే కారణము. సహకారోద్యమము జయప్రదముగ కొనసాగుటకు ప్రభుత్వశాసనము లుండుట అత్యవసరమని తలంపబడెను. జాయింటుస్టాకు కంపెనీల శాసనము సహకార పరపతిసంఘములను స్థాపించుటకు నిరుపయోగమని గ్రహింపబడెను.

1901 వ సంవత్సరమున నియమింపబడిన కఱవులకమీషను వారుకూడ సహకార పరపతిసంఘములను వ్యాప్తిచేయవలెనని సూచిం

1. *See Govt. of India's Memorandum accompanying the Cooperative Credit Societies Act of 1904.*

2. *See Maclagan Committee Report, Para 4.*

చిరి. ఈసంవత్సరమునందుననే లార్డుకర్జనుగారి ప్రభుత్వమొక విచారణసంఘమును నియమించెను. ఈసంఘమునకు సర్. ఎడ్వర్డులా (Sir. Edward Law) గారు అధ్యక్షుడు. నైకల్‌సనుగారి నివేదికపై వివిధరాష్ట్రప్రభుత్వములొసంగిన అభిప్రాయములననుసరించి ఎడ్వర్డులా సంఘము నియమింపబడెను. ఈసంఘమువారికి హెన్రీవుల్ఫ్‌గారి సలహాకూడ లభించెను. ఈయన ఆనాటి సహకారవాదులలో ఘనుడు. ఈసంఘమువారి సూచనల ననుసరించియే 1903 వ సంవత్సరమున భారతశాసనసభలో (Imperial Legislative Council) సర్. డెన్జిల్ ఇబట్సనుగారు సహకార పరపతిసంఘముల బిల్లును ప్రవేశబెట్టిరి. ఈసందర్భమున సర్. విలియమ్ వెడ్డర్‌బర్న్‌గారి నామము జ్ఞప్తికిరాకమానదు. సహకారోద్యమ భావములకు బీజములను వెడ్డర్‌బర్న్‌గారే నాటిరి. (Sir William Wedderburn). ఈయన పూనాజిల్లాజడ్జిగ నుండెడివాడు. 1882 వ సంవత్సరప్రాంతమునందే ఈయన హిందూదేశప్రభుత్వము వారిని రైతులఋణసమస్యను నివారించుటకై వ్యవసాయబ్యాంకును స్థాపింపవలెనని ప్రోత్సహించెను. హిందూదేశ ప్రభుత్వమువారుకూడ పురంధరుతాలూకాయందు బ్యాంకును నెలకొల్పుట కంగీకరించిరి. నాడు ప్రభుత్వమువారంగీకరించిన ఈషరతులుకూడ బాగుగనున్నవి.

1. ఈ పురందరుతాలూకాయందలి రైతులఅప్పులను గవర్నమెంటువారే తీర్చివేయుట. ఈతాలూకాయందు వ్యవసాయదారుల బ్యాంకును స్థాపించినవెంటనే ప్రభుత్వమువారు తీర్చిన ఋణములను బ్యాంకువారు తీసికొనుట.

2. బ్యాంకువారు తామొసంగిన ఋణములను గొంతకాలము వఱకు రివిన్యూకోర్టుల మూలముగ వసూలుచేసికొనుట కధికారముండుట.

3. కొందఱు అప్పుదారుల కొసంగిన ఋణమును ఆ అప్పుదారులు ముందుగ బ్యాంకుఋణమును తీర్చవలెనను నియమముండుట.

4. స్టాంపుపన్ను మొదలగునవి బ్యాంకువారికి కొంతకాలము వఱకు లేకపోవుట.

5. ఈ బ్యాంకువారి తాలూకాయం దెవరికైనను ఏపనికైనను ఋణముల నిచ్చుటకు స్వాతంత్ర్యము గలిగియుండుట. అప్పులను తీసికొనువారికి భూమి యుండవలయును.

6. అప్పులమీదవడ్డీ 100కి రు 12—0—0లకు మించరాదు.

7. ప్రభుత్వమువారు చేయు ఇతరనియమములకు బ్యాంకు లోబడి యుండవలెను.

ఈషరతులకు లోబడి వెడ్డర్‌బర్‌గారు బ్యాంకును స్థాపింపనుండిరి. కాని హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి హిందూదేశ ప్రభుత్వమువారికి సూచనకు అంగీకారమును నిరాకరించెను. ప్రజల ఋణమును ప్రభుత్వమువారు తీర్చివేసి ఆ ఋణమునకు బాధ్యత వహింపవలెనను సిద్ధాంతమునే అంగీకరింప వీలులేదని హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి నిరాకరించెను.

ఇట్లు తొలుదొల్త వెడ్డర్‌బర్‌గారు కావించిన సత్ప్రయత్నములు కొనసాగకపోయినను రైతుల ఋణసమస్య వంకకు వెడ్డర్‌బర్‌గారే దేశీయుల దృష్టిని మరల్పగలిగెను. 1904వ సంవత్సరపు సహకార పరపతి సంఘముల శాసనమునకు వెడ్డర్‌బర్‌గారి భావ ప్రచారమే మూలము.

మునకు అప్పీలుచేసికొనుటకు సంఘమునకు సావకాశము కలదు.)
(4) రాష్ట్రప్రభుత్వములు తమయిష్టమువచ్చిన నియమములను గావించు చుండవచ్చును.

12. గవర్నమెంటువారు మొదటి మూడుసంవత్సరములును వడ్డీలేక రు 2000 లవరకు సంఘము కూడదీసికొను పెట్టుబడికి సమాన మొత్తము నిచ్చుటకు వాగ్దానముచేసిరి.

పరపతిసంఘములన్నియు సాదాతనముగలిగి సంయోగ్యముగ నుండవలెననియే యీశాసనమును గావించుటయందు ప్రభుత్వము వారికిగల ముఖ్యోద్దేశములని ఇబెట్సనుగారు వ్రాసిరి.[1]

ఈశాసనము నమలునందుంచుటకు ప్రతిరాష్ట్రమున రిజిష్ట్రారులు నియమింపబడిరి.

## 14. 1904-1912 వఱకును జరిగిన పని.

ఈశాసనము ననుసరించి ఆశించినంతపని జరుగలేదు. పరపతి సంఘము లేర్పరచుటకే యీశాసనమునం దధికారము కలదు. ఇతర విధములగు సహకారసంఘము లీశాసనము ననుసరించి స్థాపించుట కవ కాశము లేదు. పరపతిఅయినను హామీయొసంగువారు లేనిచో పుట్టదు. హామీ యొసంగగలిగినవారే గ్రామములయందు పెట్టుబడిదారులుగ నుండుటయు సహజము. స్వయముగ కొంతయైనను పెట్టుబడిలేని రైతు నకు హామీ లభింపదు. హామీ లభింపనందున అప్పు లభింపదు. భాగ్యవంతులకును, మధ్యతరగతి ప్రజలకును మాత్రమే హామీ లభిం

1, *See Sir Denzil Ebbetson's Explanatory Memorandum With 1904 Act.*

చుచు అప్పు పుట్టగలదు. బీదవానికి పైరు హామీమీదగాని మాట పలుకుబడిమీదగాని అప్పు దొరకదు. సంఘములనుండి స్వల్పముగు వడ్డీలకు మధ్యతరగతి రైతులు అప్పులను దెచ్చికొనుచు బీదవారికి హెచ్చు వడ్డీలమీద నొసంగుటయు గలదు. బీదవారికిని మధ్యతరగతి రైతులకును మధ్య వడ్డీవ్యాపారము నడుచుటకే సంఘములు తోడ్పడి నవి. అందుచేత బీదవారిబాములు గట్టెక్కలేదు. ఇందులకు తోడుగ అపరిమితబాధ్యత యుండుటచే సాహసించి సంఘము లేర్పరచుటకు ప్రజలు పూనలేదు. పరిమితిగల బాధ్యతతో సంఘములు పట్టణముల యందైనను స్థాపింపబడలేదు. మఱియు, రిజిస్ట్రారుగారును ఆయన తాబే దార్లును సంఘములు స్వేచ్ఛగ వ్యవహరించుటకు ప్రతిబంధకముల గల్పించుచున్నారు. ఈకారణముల వలన ప్రజలు భయభ్రాంతులై విశేషముగ సహకారమునకు బూనలేదు.

ఈ దిగువపట్టిక 1904-12 సంవత్సరముల మధ్యగల సహకా రోద్యమ వ్యాప్తిని దెలియజేయును.

| సంవత్సరము | సంఘముల సంఖ్య | ప్రాథమిక సంఘ సభ్యుల సంఖ్య | Working Capital వ్యాపారపు పెట్టుబడి |
|---|---|---|---|
| 1906-7 | 843 | 90844 | 2371683 |
| 1907-8 | 1357 | 149160 | 4414086 |
| 1908-9 | 1963 | 180338 | 8232225 |
| 1909-10 | 3428 | 224397 | 12468312 |
| 1910-11 | 5321 | 305058 | 20305800 |
| 1911-12 | 8177 | 403318 | 33574162 |

*See Maclagan Committee Report, para 5.*

1904 వ సంవత్సరపు శాసనమునందు పల్లెల సంఘములనియు, పట్టణముల సంఘములనియు గావించిన విభాగము అసహజముగ నుండెను. పల్లెల సంఘములకు వచ్చు లాభములను పంచుకొనరాదను నిషేధము సంఘములవ్యాప్తికి ప్రోత్సాహకరముగ లేదు. మదరాసు, పంజాబు రాష్ట్రములలో పెట్టుబడి సొమ్ము హెచ్చుగ గలదు. అందుచేత లాభములను పంచుకొనరాదను నిషేధమీ రాష్ట్రములయందుద్యమవ్యాప్తికి నష్టము కలిగించెను. ఈ పరిస్థితు లన్నియు గమనించి, 1904 వ శాసనమునందు గల లోటులను మాపుజేయుటకు మరొక నూతన శాసనమును 1912 వ సంవత్సరమునందు గావించిరి.

## 15. 1912 వ సంవత్సర శాసనము.

1912 వ సంవత్సరపు శాసనము ననుసరించి పరపతి సంఘములు మాత్రమే కాక, ఇతర విధములగు సహకారసంఘములను గూడ స్థాపింపవచ్చును. క్రియ విక్రియసంఘములు, ఉత్పత్తి సంఘములు, సహకారభీమా సంఘములు, గృహనిర్మాణ సంఘములు, మొదలగు సంఘములను స్థాపించుట కధికారము కలదు. ప్రాథమిక సంఘములు కాక, మూడు విధములగు కేంద్రసంఘములను స్థాపించుట కధికారముండెను.

1. యూనియనులు. ప్రాథమిక సంఘములు కొన్ని కలిసి, ఏర్పరచుకొనును.

2. కేంద్రబ్యాంకులు. సహకార సంఘములును ఇతర వ్యక్తులును కూడ నీ బ్యాంకులలో సభ్యులుగ నుందురు.

3. రాష్ట్రీయ బ్యాంకులు. వ్యక్తులతో మాత్రమే ఏర్పడును.

ఈ శాసనము ననుసరించి యితర విషయములయందు గూడ కొన్ని ముఖ్యమగు మార్పులు జరిగెను.

1. ఈ శాసనము ననుసరించి పల్లెల సంఘములనియు, పట్టణ సంఘము లనియు గావింపబడిన విభేదము రద్దుకాబడెను. అపరిమిత బాధ్యత గల సంఘములనియు, పరిమిత బాధ్యత గల సంఘము లనియు విభాగింపబడెను.

2. మదరాసు, పంజాబు, బర్మా రాష్ట్రములలో వాటాల మూలమున పెట్టు పెట్టుబడికి ప్రాముఖ్యత హెచ్చుగ గలదు. అందుచేత అపరిమితబాధ్యతగల సంఘములవారు. కూడ రాష్ట్రప్రభుత్వము వారి అనుమతినిబడసి లాభములను పంచుకొనుట కధికారమొసంగబడెను.

3. నాల్గవవంతు లాభమును మూలధనమునకు ప్రత్యేకించిన పిమ్మట ప్రతిసంఘమును తమకువచ్చిన లాభమునుండి నూటికి పది రూపాయలకు మించని మొత్తమును విద్యావ్యాప్తికి, బీదలసహాయము నకు మొదలగు దానములొనరించుటకై ప్రత్యేకించుకొనవచ్చును.

4. ఏసంఘమునకైనను రిజిష్టరీచేయబడిన మరొక సంఘము సభ్యునిగ నుండినయెడల అట్టిసంఘమునకు పరిమితిగల బాధ్యత మాత్రమే కలదు.

| రాష్ట్రములు:- సంస్థానములు | ప్రాథమిక సంఘముల సంఖ్య. | వేయి చ॥గ॥వి స్థీరము 1కి గల ప్రాథమిక సంఘముల సంఖ్య | 100000 మంది వసించు వారికి గల ప్రాథమిక సంఘముల సంఖ్య | ప్రాథమిక సంఘముల సభ్యుల సంఖ్య | 1000 మంది నివసించు వారికి గల సభ్యుల సంఖ్య. | ప్రాథమిక సంఘము 1కి గల ప్రాథమిక సంఘ సభ్యులు | వ్యాపారపు పెట్టుబడి రు 1000 లో | సంఘము 1కి గల వ్యాపారపు పెట్టుబడి రు 1000 లో | తల 1కి గల వ్యాపారపు పెట్టుబడి అణాలు | ప్రాథమిక సంఘ సభ్యుని 1కి గల వ్యాపారపు పెట్టుబడి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదునందలి బ్రిటిషుభాగము- | 13 | ...... | 18.0 | 6178 | 61.7 | 475.0 | 518 | 39.8 | 33 | 33.9 |
| డెల్హీ | 274 | 462.0 | 40.2 | 7795 | 12.2 | 26.4 | 2507 | 9.1 | 62 | 321.6 |
| మైసూరు | 2197 | 174.5 | 33.5 | 184428 | 20.5 | 61.3 | 189.64 | 8.6 | 45 | 141.0 |
| బరోడా | 1040 | 127.8 | 42.5 | 37321 | 15.2 | 35.8 | 79.94 | 7.1 | 57 | 201.0 |
| హైదరాబాదు | 2123 | 25.6 | 14.7 | 53120 | 8.6 | 25 | 106.49 | 5.0 | 71 | 200.4 |
| భూపాలు | 1160 | 168.0 | 159.1 | 20611 | 28.2 | 17.6 | 14.65 | 1.7 | 18 | 70.2 |
| గ్వాలియరు ♦ | 3864 | 146.6 | 120.8 | 68724 | 21.4 | 17.7 | 35.52 | 2.2 | 43 | 124.4 |
| ఇందూరు ♦ | 482 | 45.3 | 39.3 | 11124 | 10.1 | 24.1 | 49.88 | 11.3 | 73 | 439.4 |
| కాశ్మీరము ♦ | 2746 | 32.5 | 33.3 | 51430 | 15.5 | 18.7 | 39.40 | 3.2 | 43 | 173.8 |
| తిరువాన్కూరు | 1778 | 233.2 | 34.9 | 219159 | 43.0 | 123.3 | 55.92 | 3.2 | 17 | 25.5 |
| కొచ్చిను | 227 | 153.5 | 18.9 | 23328 | 20 4 | 107.1 | 21.22 | 9.4 | 28 | 37.3 |
| పుదుకోట్టు ♦ | 150 | 127.2 | 37.4 | 15385 | 38.2 | 100.2 | 18.18 | 12.0 | 72 | 118.2 |

♦ ఈగుఱుతుగల అంకెలు 1929-30 వ సంవత్సరము తాలూకు.

*(From Co-cperation in India.)*

పైన వేయబడిన పట్టికల ననుసరించి సహకారోద్యమము రైతులలో అత్యల్పముగ వ్యాప్తిజెందినట్లు సుబోధకమగుచున్నది. అన్నిరాష్ట్రములకంటె పంజాబు, మదరాసు, బొంబాయి రాష్ట్రముల యందొకింత హెచ్చుగ వ్యాప్తిగాంచెను. సహకారసంఘము లెంత స్వల్పముగ వ్యాప్తిజెందినదియు నీ దిగువపట్టికవలన నెక్కువగ రుజువగుచున్నది.

| 1రాష్ట్రము | గ్రామములయందు గల కుటుంబముల సంఖ్య (మదింపు) 000 లో (వేలు) | గ్రామములయందలి కుటుంబములు 100 కి గల సంఘములసంఖ్య | |
|---|---|---|---|
| | | అన్ని విధములగు సంఘములు | పరపతి సంఘములు |
| అజ్మీరు-మార్వారా | 66 | 15.4 | 15.0 |
| అస్సాము | 1486 | 2.9 | 2.9 |
| బెంగాలు | 8702 | 4.4 | 3.8 |
| బీహారు, ఒరిస్సాలు | 6525 | 3.2 | 3.1 |
| బొంబాయి | 2981 | 10.0 | 8.7 |
| బర్మా | 2384 | 3.9 | 3.7 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 2504 | 2.4 | 2.3 |
| కూరు | 31 | 36.2 | 36.2 |
| డెల్హీ | 37 | 11.5 | 11.5 |
| మదరాసు | 7408 | 8.3 | 7.9 |
| పశ్చిమోత్తర పరగణాలు | 383 | 0.2 | 0.2 |
| పంజాబు | 3694 | 10.9 | 10.2 |
| సంయుక్తరాష్ట్రములు | 8114 | 1.8 | 1.8 |

ఈపట్టిక ననుసరించి సహకారోద్యమము నేటివఱకు ప్రజలకెంత స్వల్పముగ నుపకారమొనరించినదియు తేటతెల్లమగుచున్నది. ఈపట్టికపై వ్యవసాయవిచారణసంఘమువారిట్లు వ్యాఖ్యానమునుగావించిరి.

"ఈ పై పట్టికవలన పంజాబు, మదరాసు, బొంబాయి రాజధానులలోగాక, ఇతర ముఖ్యరాష్ట్రములయం దత్యల్పసంఖ్యాకులగు పల్లెటూరివారీ యుద్యమమునందుండినట్లుగ దెలియుచున్నది."

1. *From Agricultural Commission's Report P. 447*

మదరాసు, పంజాబు, బొంబాయి రాజధానులలో కొంచెము హెచ్చుగ వ్యాప్తిజెందుట కీరాష్ట్రములలోగల రైతువారీ భూస్వామ్యమే కారణమనదగును. రైతువారీ పద్ధతిగల రాష్ట్రములలో హామీనిచ్చుటకు రైతులకు భూములుండును. అందువలన అప్పులను పుచ్చుకొనుటకు వీలుకలిగి, సహకారోద్యమ మొకింత వ్యాప్తిజెందెను.

విదేశములతో పోల్చిచూచిన, భారతదేశమున సహకారోద్యమము అణుమాత్రముగ నున్నదని యీదిగువపట్టిక తెలియజేయుచున్నది.

| 1 దేశము | విస్తీర్ణము చ॥ మైళ్లు | జనసంఖ్య | 1927-28వ సం॥ అంచనా జనసంఖ్యలో ఎంత మందికొక్క సహకారసభ్యుడుండును? |
|---|---|---|---|
| బెల్జియం | 32175 | 6678527 | 26 |
| జెకోస్లావకియా | 54877 | 14726158 | 21 |
| డెన్మార్కు | 15042 | 3500000 | 4 |
| ఫిన్లాండు | 149926 | 3634047 | 6 |
| ఫ్రాన్సు | 207076 | 40745874 | 17 |
| జర్మనీ | 182200 | 62592575 | 22 |
| ఇంగ్లాండు | 50827 | 37354917 | 8 |
| వేల్సు | 8016 | 2593014 | |
| స్కాట్లాండు | 30405 | 4842554 | |
| హాలెండు | 12761 | 7938114 | 41 |
| నార్వే | 124964 | 2809564 | 27 |
| స్వీడను | 173157 | 6141571 | 14 |
| స్విజర్లాండు | 15976 | 4066400 | 10 |
| సోవియట్ రష్యా | 8241673 | 14 కోట్ల 70 లక్షలు | 3 |
| భారతదేశము | 1805332 | 352986876 | 70 |

ఈఅంకెలు అన్నిరకములసంఘములలోని సభ్యులకును సంబంధించియున్నవి.

1. *From Economic Advance of British Co-operation—Quoted in* భారతదేశ స్థితిగతులు-లోకస్థితి గణితము. పే. 50.

ప్రపంచమునం దన్ని దేశములకంటె భారతదేశమున సహకారోద్యమము ప్రాథమికదశయందున్నదని పైపట్టిక విశదము చేయుచున్నది. 70 మందికొక సహకారసభ్యుడు మాత్రమే భారతదేశమున గలడు. రష్యాయందు ముగ్గురు మనుష్యులకు ఒక సహకారసభ్యుడు వంతున గలడు. పిమ్మట డెన్మార్కునందును, ఫిన్లాండునందును, బ్రిటిషుదీవులయందును, 4 గురికి, 6 గురికి, 8 గురికి 1 సహకారసభ్యుడు వంతున గలడు.

# 16. మెక్లాగన్ కమిటీ.

1914 వ సంవత్సరం అక్టోబరు 8 వ తేదీని హిందూదేశ ప్రభుత్వము సహకారోద్యమ సమస్యలను గురించి విచారణ సంఘమును నియమించుటకు తీర్మానించుకొనెను. సర్ ఎడ్వర్డు మాక్లగన్‌గారి అధ్యక్షతక్రింద నొకసంఘము నియమింపబడెను. సహకారోద్యమమున పెట్టుబడి హెచ్చుచున్నదనియు ప్రాథమిక సంఘములపై గల సంఘముల ఆర్థిక వ్యవహారములు క్లిష్టముగ నున్నవనియు తనిఖీ విచారణాధికారములు విస్పష్టముగ లేవనియు నందుచేత సక్రమపద్ధతుల నరయుటకై విచారణసంఘ మవసరమనియు ప్రభుత్వమువారు ప్రకటించిరి.

"ఈసంఘమువారు ప్రాథమికసంఘములపైన స్థాపింపబడుచుండిన ఆర్థికసంస్థలు సక్రమపద్ధతులపై వ్యవహరింపబడుచున్నదియు, లేనిదియు, తెలిసికొని అవసరమగు మార్పులను సూచింపవలెను. సెంట్రలు బ్యాంకులు, రాష్ట్రీయ బ్యాంకులు పరిపాలనా విధానమును, నియమావళియును పరీక్షించుటయు సహకార సంఘములమధ్య ఆర్థికసంబంధము సక్రమముగ నుండినదియు లేనిదియు విచారింపవలెను. లెక్కలతనిఖీ, పరిపాలనాపరీక్ష, మొదలగు కార్యనిర్వహణమును, మూలనిధుల వినియోగమును, మూలనిధులను లెక్కలలో వేయు పద్ధతియును గమనింప

8. మితవ్యయమును ప్రోత్సహించుటకై సేవింగ్సు బ్యాంకు, ఖాతాను పెట్టవచ్చును.

9. పరపతి సంఘములకు సెంట్రలు బ్యాంకులపై నాధార పడుటను తగ్గించి స్వయంసహాయమును అభివృద్ధిపరచుకొనుటయే ఆదర్శముగ నుండవలెను.

10. లెక్కలను తనిఖీ చేయుచుండుటయు, సంఘవ్యవహారము లను పరీక్షించుచుండుటయు ఉద్యమాభివృద్ధికి అత్యవసరములు.

ప్రభుత్వమువారు రెండుమూడు సంవత్సరముల కొకపర్యా యము తనిఖీచేసిన లెక్కలను తిరిగి తనిఖీచేయుచుండుటయు ప్రతి సంవత్సరమును సంఘములన్నియు గలసి తమలో తాము ఉద్యోగేతరుల చేత లెక్కలను తనిఖీచేయించుచుండుటయు నత్యవసరము.

11. అప్పులను తిరిగి వసూలు చేయుటలోగల విపరీతాధికారము తగదు. పంచాయితీ చేయించుచుండుట సమంజసము.

భారతదేశమున కంతకును గలిపి, యొక యుద్యోగిని సహకా రోద్యమమును గురించి సలహా నొసంగుటకు హిందూదేశప్రభు త్వము నియమింపవలెనని మెక్లాగను కమిటీవారు సూచించిరి. ఈసూ చనను ప్రభుత్వమువా రంగీకరింపలేదు. ఈ సంఘసూచనల ననుసరించి సహకారపరపతిసంఘములపై ప్రభుత్వమువారి హయాము హెచ్చి నది. దీనిఫలితముగ 1918-19 వచ్చుసరికి అభివృద్ధి వెనుకాడసాగెను. 1919వ సంవత్సరపు మాంటేగు సంస్కరణముల నాటనుండియు సహకారోద్యమము రాష్ట్రప్రభుత్వముల పరిపాలనయందున్నది. ప్రజాయత్తశాఖలలో నొకశాఖగ నున్నది. ఆయారాష్ట్రముల అవస రముల ననుసరించి కొన్నిరాష్ట్రములు ప్రత్యేక శాసనములను గావించు కొనెను. 1925వ సంవత్సరమున బొంబాయిరాజధానియందు ప్రత్యేక శాసనము గావింపబడెను. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమును, మధ్యరాష్ట్ర

ప్రభుత్వమును బొంబాయిప్రభుత్వ శాసనము ననుసరింపనున్నారు. బర్మాయందు 1927లో ప్రత్యేకశాసనము గావింపబడెను. బొంబాయి ప్రభుత్వమువారు ప్రత్యేక శాసనమునందు ఆయా సహకారసంఘము లను వాటి ఆదర్శముల ననుసరించియు, ఆర్థికము ననుసరించియు, పని చేయు పద్ధతుల ననుసరించియు ప్రత్యేక తరగతులుగ విభజించిరి. రద్దుపరచిన సంఘముల నెత్తివేయుటకు వలయు మార్గములను చక్కజేసిరి. పంచాయితీదార్ల మూలముగ సొమ్ము వసూలుచేయు నధికారమును హెచ్చించిరి. మదరాసునందు 1932 వ సంవత్సరమున ప్రత్యేక సహకారశాసనము గావింపబడెను. (Madras Act No. VI of 1932.) ఈశాసనమువలన సభ్యుల సమిష్టిబాధ్యతయందుగల సందిగ్ధ నిర్వచనము కొంతతొలగింపబడెను. సంఘముల నెత్తివేయుటకు సంఘ ములపై పెత్తనము చెలాయించుటకు ప్రభుత్వోద్యోగుల అధికారము హెచ్చింపబడెను. సహకారశాఖ రాష్ట్రీయప్రభుత్వముల వశమై ప్రజాయత్తశాఖలలో నొకశాఖగ నుండినను నూతనవికాస మిసు మంతయు బొందలేదు.

1926 వ సంవత్సరమున వ్యవసాయ విచారణసంఘమువారు వ్యవసాయసమస్యలను గురించి విచారించుటకు నియమింపబడినను వ్యవసాయసమస్యలలో సహకారోద్యమమొక ముఖ్యవిషయముగ పరిగణించి విమర్శించిరి. దానిసూచన లింతవఱకు ఆచరింపబడలేదు. పిమ్మట బ్యాంకింగు విచారణసంఘములు, వివిధరాష్ట్రములలో సహ కారోద్యమవ్యాప్తిని విచారించినవి. రాష్ట్రసంఘములు వ్యవసాయ దారులకుగల బ్యాంకుల సౌకర్యములను గుఱించియే విమర్శించినవి. మధ్యరాష్ట్రములయందును, సంయుక్త రాష్ట్రములయందును, మద రాసురాజధానియందును జరిపిన విచారణలవంటి విచారణను భారత వర్షమునకంతకు సమగ్రముగ జరుపుట సమంజసము.

# 17. సహకారసంఘముల తరగతులు.



పైన చిత్రించిన పటమును పరీక్షించినయెడల భారతదేశము నందు నిర్మింపబడిన సహకారోద్యమ అంగనిర్మాణమును గ్రహింపగలము.

ఈ దిగువ పట్టికల ననుసరించి ఆయా తరగతుల సహకార సంఘముల ప్రాముఖ్యస్థితిని గ్రహింపగలము.

హిందూదేశమునందుగల సహకార సంఘముల సంఖ్య.

| 1 | 1925-26 | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 |
|---|---|---|---|---|---|
| కేంద్రసంస్థలు (సెంట్రలు బ్యాంకులు- రాష్ట్రీయ బ్యాంకులు-బ్యాంకింగు యూనియనులు) | 567 | 577 | 598 | 598 | 598 |
| సూపరువైజింగు గారంటీయింగుయూనియనులు తిరిగి ఇన్సూరుచేయు సంఘములు. | 1406 | 1421 | 1442 | 1419 | 1282 |
| వ్యవసాయ సంఘములు (పశువుల ఇన్సూరెన్సు సంఘములతో సహా) | 71140 | 78940 | 84959 | 88377 | 92051 |
| వ్యవసాయేతర సంఘములు | 7069 | 8133 | 9052 | 9761 | 10256 |
| మొత్తము | 80182 | 89071 | 96091 | 100150 | 104187 |

1. *From Cooperation in India*

ననుసరించి సహకారోద్యమము యొక్క సర్వతోముఖాభివృద్ధిని గ్రహింపజాలము. "కొన్ని పరపతి సంఘములు క్రయ, విక్రయ సంఘముల లెక్కలలోను, కృష్యోత్పత్తి సంఘముల లెక్కలలోను గణింపబడుచున్నవి"[1]

## 18. వ్యవసాయ ప్రాథమిక పరపతిసంఘములు.

వివిధములగు సహకారసంఘములను గుఱించి విపులముగ పరిశీలించెదము. సహకారసంఘములలో 100కి 90 వంతులు వ్యవసాయపరపతిసంఘములున్నవి. వ్యవసాయ పరపతిసంఘముల కార్యనిర్వహణమునుగురించి గమనింపదగును.

**1. సంఘసంఖ్య (Size).** పదిమంది గ్రామస్థులుకలిసి పరపతిసంఘమును రిజిష్టరీ చేయించుకొనవచ్చును. ఇందు సభ్యు లత్యధికసంఖ్యాకులుగ నుండుటకంటె తగుమాత్రముగ నుండుట సమంజసము.

**2. పనిచేయు ప్రదేశము. (Area of operation)** గ్రామమునకొక సంఘమువంతున నుండుట మంచిది. గ్రామమునకొక సంఘమువంతుననే పనిజరుగుచున్నది. ఇందువలన సంఘసభ్యులు పరస్పర మెరుంగుటకు వీలుండును. ఒకరినొకరు తెలిసికొనియుండుటవలన అప్పులనిచ్చి పుచ్చుకొనుటలో జాగరూకతయు, శ్రద్ధయు వహించుటకు వీలుండును. కొన్నికొన్ని కులములకును, తెగలకును, ప్రత్యేకసదుపాయము లవసరమనియు ఏకులమున కాకులము సంఘములను స్థాపించుకొనవచ్చుననియు గొందఱు తలంచుచున్నారు.

---

1. *See B. G. Bhatnagar. The Co-operative Organization in British India p. 41.*

ఈపద్ధతిని అనుసరించినయెడల ఒకగ్రామమునందే మూడు నాలుగుసంఘములు పనిచేయవలసివచ్చును. శాసనమునందు సంఘము 1 కి ఉండవలసిన సభ్యులసంఖ్య నిర్ణయింపబడలేదు. పనిచేయవలసిన ప్రదేశము నిర్దేశింపబడలేదు. కొన్నిచోట్ల ఒకగ్రామమునందు ఒకటి రెండు సంఘములు పనిచేయుచున్నను, సామాన్యముగ గ్రామము 1 కి 1 సంఘమే పనిచేయుచున్నది. ఇట్లు అన్నికులములవారు కలిసి యొక సంఘముగ పనిచేయుటయే ప్రోత్సహింపదగును. కులములననుసరించి సంఘముల నేర్పరచుట దేశమున కరిష్టము. "ప్రాథమిక సహకార పరపతిసంఘముల సభ్యత్వము ఒకకులమునకు, ఒకమతమునకు, ఒక వృత్తికి, లేక గ్రామమునందలి కొందఱవ్యక్తులకు మాత్రమే ప్రత్యేకించుట తగదు." అని బ్యాంకింగు విచారణసంఘమువారికి సలహాదారులుగ నుండిన విదేశప్రముఖులు సూచించిరి. ఈసూచనను బ్యాంకింగు విచారణసంఘమువారుకూడ నంగీకరించిరి. "ఇట్లు వివిధ వృత్తులవారిని, వివిధకులములవారిని ఒకసంఘమునందు చేర్చుటవలన సోదరభావము, సహకారభావము పెంపొందును." అని బ్యాంకింగు విచారణసంఘమువారు వ్రాసిరి.[1]

3. బాధ్యత లేక పూచీ (Liability)

బాధ్యతకు పరిమితిలేదు. గవర్నమెంటువారికి అపరిమిత బాధ్యతను దొలగించుట కధికారము కలదు. బాధ్యత నుగుఱించి మెక్లాగనుకమిటీవారిట్లు వ్రాసిరి. "అపరిమిత బాధ్యత యనగా, సంఘసభ్యులందరు తగిలిన లోటును సమానముగ భరించుట. వాటాసొమ్ము ఉన్నయెడల లోటును భర్తీ చేసెదరు. వాటాసొమ్ము చెల్లించినను లోటుపూడనియెడల సంఘసభ్యులందఱి యొద్దనుంచి సమానముగ వసూలుచేసి

1. *Indian Central Banking Enquiry Committee Report P. 117.*

లోటును పూడ్చెదరు. సంఘమునకు ఋణము పెట్టినదాత యిష్టము వచ్చిన సంఘసభ్యునిమీాద చర్యదీసికొనుటకు వీలులేదు.[1]

ఇట్టి అపరిమితబాధ్యత నుంచుటవలన రెండు లాభము లున్న వని దీనిని సమర్థించువారు చెప్పుచున్నారు. సంఘసభ్యు లందఱకును సమానబాధ్యత పరస్పరశ్రద్ధ కలిగించుననియు నిట్టి బాధ్యతవలన సంఘమునందు పెట్టుబడిదారులకు విశ్వాసము జనించుననియు జెప్ప బడుచుండెను. అపరిమితబాధ్యత పలువిధములుగ నిర్వచింపబడుచుం డెను. అపరిమితబాధ్యత ఎప్పుడు ఆలోచింపవలసివచ్చును? కొనసాగిం చుట యెట్లు? ఈప్రశ్నలపై మదరాసు హైకోర్టువారును, పాట్నా హైకోర్టువారును భేదాభిప్రాయముల బ్రకటించిరి.[2]

ఈవిషయముపై కాల్వర్టుగారు విపులముగ చర్చించిరి. "సంఘ మునకు వచ్చిన నష్టము మొదట సంఘసభ్యునిపై బడును. తర్వాత అతనిహామీామీాదపడును. తర్వాత మూలధనముమీాదబడును. తర్వాత వాటాధనముపై బడును. తర్వాత సభ్యుల అపరిమితబాధ్యతపై బడును. కట్టకడపటకు పెట్టుబడిదారులపై బడును." అని కాల్వర్టుగారభిప్రాయ పడిరి.[3]

---

1. *Maclagan Committee Report Para 47.*

2. *Vide decisions of the Full Bench of the Patna High Court, 12 Patna Law Times p. 619, extracted at p. 478 of the Bihar and Orissa Co-operative Journal October 1931 and the decision of the Division Bench of the Madras High Court, a summary of which was published at p. 182 September 1931 issue of the Madras Journal of Co-operation and which was reffered to at p. 338-39 of the same Journal for December 1931. See the issue of the Madras Journal for January 1932 for the full Judgment of the Madras High Court.*

3. *See Mr. Calvert's Law and Principles of Co-operation P. 40.*

1925వ సంవత్సరమున బొంబాయిప్రభుత్వమువారు గావించిన ప్రత్యేక సహకారసంఘముల శాసనమునందీ విషయమును విపులముగ వ్రాసిరి. "ఎత్తివేయబడిన సంఘమునకుగల బాధ్యతకు ఆసంఘసభ్యు లందరు వ్యష్టిగను సమిష్టిగనుగూడ బాధ్యత వహింతెదరు."[1]

సమిష్టి బాధ్యతను గురించి బ్యాంకింగు విచారణసంఘమువారి అల్ప సంఖ్యాకుల నివేదికయందు మనూసుబేదారు గారిట్లు వ్రాసిరి.

"విద్యావ్యాప్తి యైనకొలదియు, సమిష్టిబాధ్యత సిద్ధాంతమును పలువురామోదింతెదరని తలంపజాలను. వ్యవసాయేతర విషయముల యందు వ్యక్తిజీవితములలో దగ్గిరబంధువులకును ప్రాణస్నేహితులకును గూడ అత్యవసర సమయములయందైనను అప్పులకు హామీయుండుట కెవరును నుద్యుక్తులుకారు. కొన్నిపరిస్థితులయం దితరులకు హామీగ నుండినయెడల తనకుగల ఆస్తిఅంతయును పోవుటకలదు. ఇతరులఋణ మునకై తన ఆస్తినిగూడ కోల్పోవుటకు సిద్ధముగ హామీయొసంగు మని కోరుట చాల విపరీతమైనపని."[2]

పరిపాలన. (Management) సంఘోద్యోగులు, గౌరవసేవకులు, సంఘ పరిపాలన, ప్రజాస్వామికము- సాధారణసంఘము, కార్యనిర్వాహకసంఘము అని రెండువిధముల పరి పాలకవర్గములు కలవు. సాధారణసంఘమున సంఘ సభ్యులందఱు సభ్యులుగనుందురు. కార్యనిర్వాహకవర్గము లేక పంచా యితీసంఘమును సాధారణసభ సాలుసరిసభయం దెన్నుకొనుచుండును. ఇందు 5 మంది లేక 9 మంది సభ్యులుందురు.

---

1. *The Bombay Act VII of 1925 Section 5 (2.)*
2. *See Banking Enquiry Committee Report Part 11, P. 89*

వలె సహకారసంఘములుకూడ తారుమారగుటకు వీలుండుననియు వీరిభావము. సంఘసభ్యులయొద్దనుండి డిపోజిట్లను తీసికొనుచు వ్యాపారపు పెట్టుబడిని వృద్ధిచేసికొనదగునని కొందఱి సూచన. ఇందువలన సంఘసభ్యులయందు మితవ్యయము కూడ ప్రోత్సహింపబడునని వీరి యాశ. ఈసిద్ధాంతమునకు ఆక్షేపణలేదు. కాని ఆచరణీయముకాదు.

సంఘసభ్యులు అప్పులను పుచ్చుకొను అవసరమునందే విశేషముగ నుందురు. అప్పులనుతీర్చి రాబడిలో నిలవజేసికొనుటకు తగిన ఆదాయము వచ్చుట దుర్లభము. అందుచేతనే డిపోజిట్ల మూలమున సమకూర్చబడుచుండిన వ్యాపారపు పెట్టుబడి హిందూదేశమునందత్యల్పముగ నున్నది. జర్మనీ దేశమునందు 100 కి 87 వంతుల వ్యాపారపు పెట్టుబడి డిపోజిట్లవలన లభించుచున్నది. హిందూదేశమునందు 100 కి 18 వంతుల వ్యాపారపు పెట్టుబడి మాత్రమే డిపోజిట్లవలన లభించుచున్నది. ఐరోపా ఖండమునందున గూడ ప్రారంభదశయందు డిపోజిట్లు అధికముగా రాలేదనియు, రానురాను పెరిగినవనియు, హిందూదేశమునందుగూడ నట్లే రానురాను వృద్ధియగుననియు నేడు ప్రారంభదశయగుటచే వచ్చుటలేదనియు కొందఱు చెప్పుచున్నారు.

హిందూదేశమునందు వ్యవసాయాభివృద్ధిలేక రైతులు అప్పుపుచ్చుకొను స్థితియందే యుండునంతకాలము డిపోజిట్లు వృద్ధియగునని తలంచుటభ్రమ. రైతులకాదాయము మిగలకపోవుటచే డిపోజిట్లు పెరుగుటలేదు. కాని ప్రారంభదశ యగుటవలనకాదు. పరపతిసంఘములలో డిపోజిట్లు వేసికొనుటవలన తక్కువవడ్డీ లభించును. ఇతరులకు వడ్డీకి నొసంగుచో హెచ్చువడ్డీ లభించుచున్నది. సహకారసంఘములు లేక బ్యాంకులు ఇచ్చు వడ్డీరేటునకంటె హెచ్చువడ్డీరేటును ఇతరచోట్ల

వుచ్చుకొనుటకు సావకాశము లభించుచున్నంతకాలము హెచ్చువడ్డీ న్యాయసమ్మతముగ నున్నంతకాలము సహకార సభ్యులుకూడ తమ సొమ్మును డిపాజిట్లుగ వేసికొనరు. మఱియు కొలదిగ ఆదాయము మిగిలినను రైతులు భూములను కొనుటకును లేక వెండి బంగారములను కొనుటకును అలవాటుపడియుండిరి. అన్ని కారణములకంటె రైతుల దరిద్రస్థితియే డిపాజిట్లు పెరుగకపోవుటకు ముఖ్యకారణము. వాటాల నేర్పరచి ఆవాటాసొమ్మును దఫాలవారీగా చెల్లించుపద్ధతి పెట్టిన యెడల కొలదికొలదిగనైన రైతులు మితవ్యయమున కలవాటు పడెద రని కొందఱి యూహ.

ఈపద్ధతివలన వాటాసొమ్మునుగూడ సంఘమునుండి తీసికొను ఋణమునుండియే యొసంగవలసివచ్చును. మితవ్యయమున లేక అధిక ఆదాయమున చెల్లించుననుకొనుట భ్రమ. సంఘములు పైనుండి తెచ్చు కొను ఋణముమీదనే ఆధారపడుచున్నవి. గవర్నమెంటువారు విశేషముగ ఋణమునొసంగుట మానివేసిరి. సెంట్రలు బ్యాంకుల ఋణముపైననే వ్యవసాయ పరపతిసంఘములు జీవించుచున్నవి. వాటాసొమ్ము, డిపాజిట్లు సంఘములవ్యాపారపు పెట్టుబడియందత్యల్ప ముగ నున్నవి.

ఈ దిగువనుదహరించిన పట్టికవలన 1930-31 వ సంవత్సరము నందు సహకారసంఘములకును, సెంట్రలుబ్యాంకులకును గల డిపాజిట్ల మొత్తమును దెలిసికొనగలము. రాష్ట్రీయబ్యాంకులకును సెంట్రలు బ్యాంకులకును డిపాజిట్లమొత్తము హెచ్చుగగలదు. ప్రాథమిక సంఘ ములకు అత్యల్పముగ నున్నదని యీపట్టికవలన గ్రహింపగలము.

## ఈ పట్టిక సహకారసంఘములయందలి డిపాజిట్లమొత్తమును దెలుపును 1930-31.

| రాష్ట్రములు-సంస్థానములు. | రాష్ట్రీయ బ్యాంకులు † | | సెంట్రలు బ్యాంకులు † | | ప్రాథమిక సంఘములు ‡ | | వ్యవసాయేతర ప్రాథమిక సంఘములు ‡ | |
|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తము రు. | వ్యాపార పెట్టుబడియందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పెట్టుబడియందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పెట్టుబడియందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పెట్టుబడియందు 100 కి ఎంత; |
| మదరాసు | 16140992 | 90.6 | 53016522 | 86.1 | 3651619 | 5.0 | 15710970 | 47.4 |
| బొంబాయి | 11825099 | 76.2 | 25147031 | 82.4 | 11958182 | 26.6 | 29606402 | 61.3 |
| బెంగాలు ♦ | 17762674 | 112.4 | 40483732 | 120.7 | 4085286 | 7.1 | 20519294 | 65.3 |
| బీహారు, ఒరిస్సాలు | 6748276 | 86.9 | 15301387 | 65.8 | 880590 | 3.6 | 1523816 | 40.5 |
| సంయుక్తరాష్ట్రములు | | | 5665767 | 61.6 | 272926 | 2.6 | 1041943 | 40.9 |
| పంజాబు | 8068184 | 75.0 | 5667085 | 79.9 | 7532948 | 8.8 | 5176143 | 37.4 |
| బర్మా ♦ | దొరకలేదు | | 3280720 | 64.0 | 1031788 | 6.3 | 1032541 | 15.9 |
| మధ్యరాష్ట్రములు,బీరారు | 9215616 | 91.3 | 19508624 | 79.4 | 763750 | 4.4 | 486876 | 34.1 |
| అస్సాము | 264564 | 68.5 | 1752626 | 85.1 | 496958 | 16.1 | 1623323 | 71.6 |
| పశ్చిమోత్తరపరగణాలు | | | 469642 | 94.7 | 7426 | 1.3 | 133085 | 51.1 |
| కూర్గు | | | 250302 | 86.8 | 56584 | 8.8 | 40107 | 21.7 |
| అజ్మీరు,మార్వారా | | | 1592742 | 60.3 | 45581 | 2.6 | 437467 | 47.4 |
| హైదరాబాదునందలి బ్రిటిషుభాగము- | | | | | | | 307408 | 59.3 |

| రాష్ట్రములు-సంస్థానములు | రాష్ట్రీయ బ్యాంకులు † | | సెంట్రలు బ్యాంకులు † | | ప్రాథమిక సంఘములు ‡ | | వ్యవసాయేతర ప్రాథమిక సంఘములు ‡ | |
|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తము రు. | వ్యాపార పుపెట్టుబడియందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పుపెట్టుబడియందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పుపెట్టుబడియందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పుపెట్టుబడియందు 100 కి ఎంత? |
| డెల్లీ | | | 1207298 | 89.2 | 31028 | 3.5 | 165695 | 59.1 |
| మైసూరు | 4209666 | 80 | 116022 | 60.7 | 507950 | 9.9 | 3970947 | 47.1 |
| బరోడా | | | 1572426 | 78.4 | 1137769 | 31.2 | 1057987 | 61.8 |
| హైదరాబాదు ♦ | 3238098 | 81.6 | 3785416 | 75.1 | 567460 | 7.4 | 288285 | 11.9 |
| భూపాలు | | | 165944 | 16.7 | 1609 | 0.1 | 22 | 0.1 |
| గ్వాలియరు ♦ | | | 1640701 | 26.5 | 137970 | 6.8 | 3968 | 6.7 |
| ఇందూరు ♦ | | | 1539628 | 71.6 | 65076 | 2.9 | 366311 | 58.1 |
| కాశ్మీరము ♦ | | | 2353124 | 68.3 | 16720 | 0.3 | 10628 | 1.9 |
| తిరువాన్కూరు | | | 962032 | 71.7 | 1094811 | 19.6 | 832000 | 36.9 |
| కొచ్చిను | | | 546226 | 85.2 | 981568 | 46.2 | 428345 | 20.2 |
| పుదుక్కోట ♦ | | | 455610 | 86.2 | 410440 | 78.2 | 619801 | 85.1 |

† సంఘములు, రాష్ట్రీయ బ్యాంకులు, సెంట్రలు బ్యాంకులు, వ్యక్తులు, యితర విధముల నుండియు గల సంవత్సరాంతపు డిపాజిట్ల మొత్తము.

‡ సభ్యుల, సభ్యేతరుల, సంఘముల తాలూకు అప్పులు, డిపాజిట్లు కలిసి సంవత్సరాంతమునకు గల డిపాజిట్లు.

♦ ఈ గుఱుతున కెదురుగనున్న అంకెలు 1929-30 వ సంత్సరము తాలూకు.

(*From Cooperation in India*)

హిందూదేశమందలి రైతులస్థితి సర్వకాల సర్వావస్థలయందు నను నొక్కరీతిగనే యుండును. రైతుల ఋణస్థితి సంపూర్ణముగ మార్పుజెంది వ్యవసాయ మభివృద్ధియైనగాని, సహకారోద్యమ సిద్ధాంతములను సక్రమముగ నడుపుటకు గూడ సావకాశము లేదు.

7. హామీ. (Security.)

సహకారసంఘములయందు ఋణముఁదీసికొను సభ్యుల యొద్దనుండి "ఋజువర్తన"మను హామీమాత్రమే పుచ్చుకొనుట ఆదర్శము. సంఘసభ్యులయందు ఋజువర్తనమును పెంపొందించుటయే సహకారసంఘముల ముఖ్యకర్తవ్యము. ఆస్తిని హామీగాతీసికొనుట సహకార సిద్ధాంతములకు విరుద్ధము. అప్పును తీసికొనువాడు తనస్థిరచరాస్తులను, తోటిసభ్యులను హామీగానిచ్చిన మంచివ్యాపారము జరుగును. సంఘద్రవ్యము తిరిగి వసూలగుటకును సావకాశములు హెచ్చుగనుండును. అయిన నీపద్ధతి మంచివర్తకమగునుగాని, సహకారసిద్ధాంతముల నాచరించుట కాజాలదు. సహకారసంఘములు సభ్యుల ఆస్తులను హామీగాతీసికొనని యెడల షాహుకారులకు మరొక అదనువచ్చినపుడు సభ్యులు తనఖా పెట్టివేయవచ్చును. సంఘములు హామీ పుచ్చుకొనకపోయిన మాత్రమున ఆస్తి పరాధీనముగాదని తలంచుటకు వీలులేదు. "లా" ననుసరించి తణఖాలను పట్టుటకు సంఘముల కధికారము కలదు. రాష్ట్రప్రభుత్వములకే నియమము ననులుజరుపుటయందు స్వాతంత్ర్యము కలదు. సంఘముల కపరిమితబాధ్యతను పొలగించి, వ్యక్తులయొద్దనుంచి స్థిరాస్తి హామీపుచ్చుకొనవలెనను నియమమేర్పఱచుకొనుట మంచిది. దగ్గిరవాయిదా అప్పులనైనను వేరు పేచీపూచీలులేని స్థిరాస్తిని హామీ తీసికొనియే యొసంగదగును.

8\. లాభములను పంచుకొనుట. (Division of profits.)

వ్యవసాయ పరపతిసంఘములలో జాయింటుస్టాకు కంపెనీలలోవలె పంచుకొనుటకు విశేష లాభము లుండవు. వాటాల మూలముగ పెట్టుబడిలేని సంఘములకు లాభములను పంచుకొనుటయే యుండదు. లాభమంతయు మూలధనముగ ప్రత్యేకింపబడును. 1912 వ సంవత్సర శాసనము ననుసరించి కొంతసొమ్మును విద్యాభివృద్ధికి, దానమునకును వినియోగింపవచ్చును. దీనినే ప్రజోపయోగనిధి యని అందురు. (Common Good Fund). వాటాలమూలముగ పెట్టుబడి వసూలు చేయబడిన సంఘములయందైనను నిర్ణీతమగు లాభములనే పంచెదరు. లాభములను పంచుకొనుటయే ముఖ్యోద్దేశముగ వ్యవసాయ పరపతి సంఘములయందు తలంపబడినయెడల సహకారోద్యమము క్రొత్తరకపు వర్తకముగ పరిణమించును. లాభముల పంపకమును బ్రోత్సహించుటకు మారుగ ప్రజోపయోగనిధిని వృద్ధిపరచుటకై ప్రోత్సహింపదగును. సమిష్టిదానము వలన నెన్నియో ప్రజోపయోగ కార్యముల నొనరించుటకు సులువుగ నుండును. ఈనిధిని వినియోగించుటయందు వివేకము వహింపదగును. జాతి మత కుల తత్వముల ప్రత్యేకప్రేరణ ననుసరించిగూడ నీనిధి వినియోగింపబడుచున్నది. ఇది దుర్వినియోగము. జాతీయభావమున సంఘలాభమునకై వినియోగింపదగును. ముఖ్యముగ సహకారోద్యమ భావ ప్రచారమునకును, గ్రామ పునర్నిర్మాణమునకును వినియోగింపవలెను. పుస్తకముల నచ్చువేయించుట, మ్యాజికులాంతరు ప్రచారము, ఉపన్యాసములు, ప్రదర్శనములు మొదలగువాటి మూలముగ సహకారోద్యమ ప్రచారము సలుపవలెను.

9. పంచాయితీ. (Arbitration.)

పరపతిసంఘములకును, సంఘసభ్యులకును మధ్యగ వచ్చుచుండు తగవులను పంచాయితీల మూలముగ పరిష్కరించుకొనవలెను. సివిలుకోర్టులకు పరపతిసంఘముల తగవులను దీర్చుటకై అధికారము తొలగించి వేయవలెను. లేనియెడల కాలవ్యాపనము, ధననష్టము సంభవించును. అనవసరమగు కక్షలు ప్రబలిపోవును. గ్రామములయందు సహకార సంఘములు సహకారమునకు తోడ్పడుటకు మారుగ విరోధములను, కక్షలను పెంచును. బొంబాయియందు, మఱికొన్ని యితరరాష్ట్రములయందు పంచాయితీల మూలముగ తగవులను పరిష్కరించుకొనుటకు సావకాశములు కలవు.

10. అప్పులనువసూలు చేయుటకుగల అమితఅధికారము. (Summary Powers)

బకాయిపడిన సొమ్మును వసూలుచేయుటకై సంఘముల కమితమగు నధికార మొసంగబడెను. ఈ అపరిమితాధికారము వలన మొదటినుండియు వహింపవలసిన శ్రద్ధ సంఘములు వహింపకపోవుట సహజము. సంఘసభ్యులందఱిపైనను గల ఉమ్మడిబాధ్యతయు, సివిలుకోర్టుల మూలముగ వసూలుచేయుటకు గల అధికారమును చాలును.

11. సంఘముల నెత్తివేయుట. (Dissolution.)

"సంఘముల నెత్తివేయవలసివచ్చుటకు వివిధకారణములు చెప్పబడుచున్నవి. జాగరూకతగలిగి పరిశీలింపకపోవుట, విచక్షణలేక అప్పులనిచ్చుట, ఋణమును దీసికొనినవారి అవిధేయత, వాయిదాలవెంబడిని తిరిగి సకాలమున ఋణముల నిచ్చివేయకపోవుట, కొంతమంది వ్యక్తులకు మాత్రమే అప్పులనిచ్చుచుండుట, సంఘఉద్యోగులు అసమర్థులుగ నుండుట లేక వారియందు ఋజువర్తనము లేకపోవుట, విచక్షణలేక సభ్యులను జేర్చుకొనుచుండుట, సంఘము పనిచేయుటకు వీలులేని

యంతగ పెద్దదిగనుండుట, సంఘసభ్యులు పాతఋణములను జెప్పక రహస్యముగ నుంచుట, పరిపాలనాప్రణాళిక దోషముగ నుండుట, సంఘ సభ్యులయందు అంతఃకలహములుపుట్టుట, తగినంతమంది సభ్యులు లేక పోవుట, లేక, వలయునంత పెట్టుబడి లేకపోవుట, ఏఒక్క సంఘసభ్యుడో అధికారమునంతను చెలాయించుచుండుట, సంఘవ్యవహారములయందు సభ్యులందఱును దగుశ్రద్ధను వహింపకపోవుట సంఘముల నెత్తివేయ వలసివచ్చుచుండుటకు గల ముఖ్యకారణములు." అని మెక్లాగను కమిటీవారు వ్రాసిరి.[1]

ఈ కారణము లన్నియు సత్యములు. ఇందులకు దోడుగ సహకారోద్యమముపై సర్వాధికారము వహించుచున్న ప్రభుత్వో ద్యోగుల నిరంకుశవర్తనముకూడ సంఘముల నెత్తివేయుటకొక ముఖ్య కారణము. ఏడుగురు కొడుకుల కథవలె ఉద్యోగేతరులు సంఘముల నొకవంక పెట్టుచుండుటయు, ఉద్యోగులు మరొకవంకనుంచి సంఘ ముల నెత్తివేయుటయుగూడ జరుగుచున్నది. ఎత్తివేయు నధికారమును తప్పనిసరిగ నెప్పుడైనను వినియోగించుచుండవలెను. చట్టముననుస రించి విచారణ సలిపినపిమ్మట సంఘము నెత్తివేయుటకు రిజిస్ట్రారునకు అధికార మొసంగ బడెను. సంఘములు బాగుగ పనిచేయుట కన్నింటి కంటె ముఖ్యముగ సహకారసభ్యులయందు ఋజువర్తనము పెంపొంద వలయును. సహకారసంఘములుకూడ వ్యక్తికక్షులకు, కులకక్షులకు, స్వార్థపరులకు, మోసమునకు నిలయములగుచున్నవి. కార్యనిర్వాహక వర్గమునకు, సంఘోద్యోగులకు సమర్థులగువారెన్నుకొనబడుటలేదు. వివిధములగు కక్షులననుసరించి కులంతరముల ననుసరించి యెన్నికలు జరుగుచున్నవి. ఈకక్షులబారినుండి సహకారోద్యమము సంరక్షింప

1. *Maclagan Committee Report, Para 86*

నందు 340 సమిష్టిబాధ్యతలేని సంఘములుకలవు. వీటియందు 119918 సంఘసభ్యులు గలరు. రు 46 లక్షల వాటాధనము కలదు. రు 11 లక్షల మూలధనము కలదు. 130 కోట్ల డిపోజిట్లు కలవు. ఈసంఘములు ప్రజావిశ్వాసమును చూరగొనినవి. స్థానికముగ డిపోజిట్లను విరివిగ సంపాదించుచున్నవి. ఈసంఘములలో ఎక్కువ సంఘములు నెల జీతములమీాద జీవించు గుమాస్తాల పరపతి సంఘములు. ఇదియే గమనింపదగిన విషయము. కలకత్తాయందలి ముఖ్యమగు ప్రభుత్వ కార్యాలయములకును, వర్తకశాలలకును గుమాస్తాల పరపతిసంఘములు కలవు. వీధులను తుడుచువారి సంఘములుకూడ గలవు. ఈసంఘములు సభ్యులలో మద్యపాననిషేధ ప్రచారమును జయప్రదముగ కొనసాగింపగలిగెను. అందువలన సంఘసభ్యులు ఆర్థికముగ నభివృద్ధి జెందిరి.

మధ్యరాష్ట్రములయందు ప్రజలబ్యాంకులను వృద్ధిచేయుటకు అవకాశము హెచ్చుగగలదు. ఇచ్చట వడుకుట, నేయుట, రంగులు వేయుట, గాజులుచేయుట, నూనెతీయుట మొదలగు పరిశ్రమలన్నియు గూడ నశించినవి. ఈరాష్ట్రమున 26 వ్యవసాయేతర పరపతిసంఘములుమాత్రమే కలవు. రు 10 లక్షల వ్యాపారపుపెట్టుబడి యున్నది. ఈసంఘములు ఆధునికపద్ధతులపై బ్యాంకులవ్యాపార మొనరించుటలేదు.

బొంబాయిరాష్ట్రము రు 50000 ల వ్యాపారపు పెట్టుబడితో పనిచేయుసంఘములు అర్బను బ్యాంకులక్రింద పరిగణింపబడుచున్నవి. ఈబ్యాంకులు నాలుగుమాసముల కొకసారి అప్పుఆస్తుల లెక్కలను ప్రభుత్వమువారికి పంపవలెను. 1925 వ సంవత్సరమునుంచియు బొంబాయిరాష్ట్రమునందు తాలూకా 1 కి ఒక ప్రజలబ్యాంకును నెలకొల్పుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. (1930 మార్చి).

బొంబాయి రాజధానియందు 76 అర్బనుబ్యాంకులు దిగ్విజయముగ పనిచేయుచున్నవి. వీటియందు 174820 మందిసభ్యులు కలరు. వ్యాపారపుపెట్టుబడి రు 282 లక్షలు. మూలధనము 194 లక్షలు. అర్బను సహకారసంఘములు బొంబాయిరాష్ట్రమునందు పనిచేసిన రీతిని యితరరాష్ట్రములయందు పనిచేయుటలేదు. వ్యవసాయేతర పరపతి సంఘములను విరివిగ నెలకొల్పి సక్రమముగ పనిచేసినయెడల పట్టణములయందు చిన్నవర్తకులు సంరక్షింపబడుదురు. గృహపరిశ్రమ లభివృద్ధిపరుపవచ్చును. కూలివాండ్రకు తోడ్పడుచు, వారియందు నైతిక జీవనమును పెంపొందింపవచ్చును. మధ్యతరగతి పారిశ్రామికులకు అపారముగ నీబ్యాంకు లుపయోగపడును. ఈబ్యాంకులు స్థానికముగ నుండు వర్తకమునకు, పరిశ్రమలకు అప్పుల నిచ్చినయెడల వారివిశ్వాసమును జూరగొనును. అందువలన స్థానికాభిమానము హెచ్చును. బ్యాంకు లభివృద్ధియగును. ఈబ్యాంకులు విశేషముగ డిపోజిట్లను కూడ నాడే రాబట్టగలవు. 1901 వ సంవత్సరమున సహకారోద్యమమును గురించి విచారణజేసిన సంఘమువారు వ్యవసాయేతర పరపతి సంఘములను గురించి యిట్లు వ్రాసెను.

"వ్యవసాయ పరపతిసంఘములను స్థాపించుటతో ప్రభుత్వము ప్రయత్నములు సఫలములైనవని తలంపరాదని మాయభిప్రాయము. ఇటలీయందు సహకార వ్యవసాయేతర పరపతి సంఘములు మొట్టమొదట పట్టణములయందు స్థాపింపబడెను. ఈసంఘములు విజయము పొందినవి. ఈయుదాహరణ ననుసరించి పట్టణములయందు సహకారపద్ధతిని పరపతిసంఘములను స్థాపింపదగునని తలంచుచున్నాము. ఈసంఘములు రెండువిధములుగ నుపయోగించును. గుమాస్తాలు, చేతిపనివాండ్రు మొదలగువారు తమ నిల్వసొమ్మును దాచుకొనుటకై

సేవింగ్సుబ్యాంకులకంటె లాభకరమగు సంస్థయొకటి కావలసి యున్నది. ఇందులకు తగునేర్పాటు లొనరించినయెడల వారియందు మితవ్యయమును ప్రోత్సహింపగలము. ఇటలీయందు పట్టణబ్యాంకులు గ్రామ పరపతిసంఘములకుగూడ ఋణము నొసంగును. ఇట్లే హిందూ దేశమునందుగూడ పట్టణసంఘములు గ్రామసంఘములకు ఋణముల నేల యొసంగరాదో తెలియుట లేదు." మెక్లాగను కమిటీవారు వ్యవ సాయేతర పరపతిసంఘముల అవసరమును గుఱించి యిట్లు వ్రాసిరి.

"వ్యవసాయదారులు చెల్లించుచుండిన వడ్డీకంటె తక్కువవడ్డీకి పట్టణములయందుండిన పారిశ్రామికులకు పెట్టుబడి లభించుటలేదు. ధరలు హెచ్చుచుండుటయు, చిన్నచిన్న అనారోగ్యకరమగు ఇండ్లును, జీతములు తరుచుగ సకాలములయందొసంగకపోవుటయు అధికమగు అంతస్తుతో జీవింపవలెనను సంకల్పమును పరిశ్రమలయందు క్లిష్టపరి స్థితుల బ్రవేశపెట్టును. ఈకష్టములనురవంతయైన దొలగింపగలిగిన ఏవిధ మగు సహకారసంస్థనైనను బ్రోద్బలపరచుట తగుపని. ఇతరవిధమగు ప్రజలమాట మరచిపోయి వ్యవసాయ పరపతిసంఘములనే విరివిగ స్థాపించుటవలన సెంట్రలుబ్యాంకులు తమడబ్బును సంవత్సరముపొడుగు నను పెట్టుబడిమీద వినియోగింపజాలకపోవుచున్నవి. సంవత్సరము నందు కొన్నినెలలు మాత్రమే వినియోగింపగలుగుచున్నవి...... ఈకారణముల వలన వ్యవసాయేతర పరపతి సంఘములను నెలకొల్పుట అత్యవసరమని మాసూచన." [1]

వ్యవసాయేతర పరపతిసంఘముల యవసరమును గుఱించి పరి శ్రమల విచారణసంఘమువారిట్లు వ్రాసిరి. [2]

1. *Maclagan Committee Report.*
2. *Industrial Commission of 1916—18.*

"భారతదేశమున పరిశ్రమ లభివృద్ధి జెందకపోవుటకు తగు పెట్టుబడి లభింపకపోవుటయే కారణమని నిరూపించితిమి. మేము సూచించినవిధమగు పరిశ్రమలబ్యాంకులు స్థాపింపబడినయెడల పారిశ్రామికులకు దోడ్పడగలవు. తాతాకంపెనీవారు ప్రభుత్వమువారి సహాయము నపేక్షింపకయే పరిశ్రమలబ్యాంకును స్థాపించిరి. చిన్నచిన్న పరిశ్రమలకు సహాయమొనరించుటకు తగు బ్యాంకులను స్థాపించుటకు అమిత సావకాశము కలదు.......... మధ్యతరగతి పారిశ్రామికులు నగరములయందును, పట్టణములయందును పెట్టుబడి లభింపక చిక్కులు పడుచుండిరని పలువురు సాక్ష్యులు చెప్పిరి. ఈపారిశ్రామికులు కోరబడిన హామీదారుల నొసంగజాలరు. శ్రమలేక విడుదలయగు సరకునుగూడ హామీ యొసంగజాలరు. ఈవిధముగ భారతీయులు ప్రత్యేక అసౌకర్యముల పాలగుచున్నారు. ఆంగ్లేయులే డైరక్టరులుగ నుండుటవలనను పెద్ద యుద్యోగులందరు ఆంగ్లేయులుగ నుండుటవలనను పారిశ్రామికులు బ్యాంకులను తృప్తిపఱచుట కష్టతమముగ నున్నది.............. పరిశ్రమలకు పెట్టుబడిని పెట్టుటకై కొన్నిబ్యాంకులు కలవు. ఈబ్యాంకులు యంత్రముల హామీమీదగాని, యంత్రాలయముల హామీ మీదగాని పెట్టుబడి నిచ్చుటలేదు. మధ్యతరగతి పారిశ్రామికులకు సహాయమొనరించుట అత్యవసరము."

"ధైర్యముగలిగి కొనసాగింపబడిన వ్యవసాయేతర సహకార పరపతి సంఘములు-అయిరోపాఖండమునందు-ముఖ్యముగ జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ దేశములయందు అత్యుత్తమఫలితముల నొసంగెను. లార్డు కార్మయికేల్ (Lord Carmichael) గారు ప్రకటించినటుల బ్యాంకులు విస్తారముగ స్థాపింపబడక పరిశ్రమాభివృద్ధి యభిలాష హెచ్చుగ నుండీ బంధముల త్రెంచికొని జాతీయశక్తి నుద్భవింపజేయదలంచుచు

ములు వ్యవసాయ పరపతిసంఘములవలె పనిచేయుచున్నవి. సభ్యులు స్వల్పసంఖ్యాకులుందురు. అందరు ఒకేవృత్తికి సంబంధించినవారుగ నుందురు. వాటాల ధనము తక్కువగనుండును. కేంద్రసంస్థలనుండి వలయు సొమ్మును అప్పు తెచ్చుకొనుచుండవలెను. అందువలన సమిష్టి బాధ్యతకలదు. శాసనమునననుసరించి సమిష్టిబాధ్యతయే యుండవలెనను నియమములేదు. నేతపరిశ్రమ భారతదేశమునందు విశేషాభివృద్ధినొందుటకు నేతగాండ్రకు పరపతిసంఘములను స్థాపించి వలయు పెట్టుబడిని సకాలమున స్వల్పవడ్డీతో లభింపజేయుట అత్యవసరము. ప్రభుత్వము వారు స్వయముగ నేతసంఘములకు ఋణముల నీయదగును. బొంబాయి రాష్ట్రమునందీ సంఘము లభివృద్ధియందున్నవి. చిన్న చిన్న రైతులు పెట్టుబడికై శ్రమపడుచున్న రీతిగనే చిన్నచిన్న చేతి పనివాండ్రుగూడ శ్రమపడుచున్నారు. వీరికి తక్కువవడ్డీలతో పెట్టు బడిలభించునట్లొనరించి చేతిపనులయభివృద్ధికిపాటుపడుటయే కర్తవ్యము.

మిల్లుకూలీల సంఘములు.

నగరములయందు, పట్టణములయందు, మిల్లులయందు పనిచేయుచుండిన కూలీలకు పరపతి సంఘములను నెల కొల్పవలయును. కూలీల నైతికార్థిక పరిస్థితులు దుర్భరముగ నున్నవి. తక్కువ జీతములు, గాలి-వెలుతురు రానిఇండ్లు, దళారీలు చేయుచుండిన మోసము, అజ్ఞానము, విద్యావిహీనత, అమితమగు ఋణబాధ, త్రాగుడు మొదలగు కష్టములకు గురియగుచు దుర్భర జీవితమును గడుపుచున్నారు. రోజుకూలి, లేక వారపుకూలి సంపాదించు కార్మికులను సహకార పరపతి సంఘములయందు చేర్చినయెడల కొంతవఱకు వీరి యార్థికస్థితిని చక్క బెట్టగలము. కార్మికాభిమానులు మిల్లు 1కి ఒక సహకార పరపతి సంఘమును స్థాపించి కార్మికులనైతికార్థికాభివృద్ధులకు తోడ్పడదగును.

కార్మికసంఘములు అచ్చటచ్చట గలవు. విరివిగ వ్యాపించుటలేదు. కార్మికులయందుగల విద్యావిహీనతయు, వలసబోవు తత్వమును సహకారోద్యమమునకు ప్రతిబంధకములు. అయినను రైతులతోపాటు కార్మికులుగూడ నభివృద్ధిజెందినగాని భారతదేశమునందార్థికాభివృద్ధి కలలోని మాటయగును. సహకారోద్యమాభిలాషులు తమశక్తి సామర్థ్యములను కార్మికులవంకకు ప్రసరింపజేయుట అత్యవసర విషయము.

నిమ్నజాతుల సంఘములు. మిల్లుకూలీలవలెనే నిమ్నజాతుల స్థితియు గలదు. పట్టణములయందు, నగరములయందు అంటరానివారని చెప్పబడు పంచముల ఆర్థికస్థితిని వృద్ధిచేయుటకు మాలపల్లెలయందు సహకార పరపతిసంఘములను స్థాపించుట అవసరము. మిల్లుకూలీల సంఘములవలెనే వీరికిని స్థాపింపదగును. బొంబాయి, మదరాసు రాష్ట్రములయందు నిమ్నజాతుల సంఘములు గలవు. ప్రభుత్వమువారు, నిమ్నజాతుల సంఘములకు గూడ స్వయముగ ఋణములనొసంగి పెట్టుబడి పెట్టుట అవసరము.

మదరాసు రాజధానియందు వ్యవసాయేతర సంఘములిట్లున్నవి.[1]

| సంఘములు. | సభ్యులు. |
|---|---|
| 1512 | 263381 |

ఇందు వ్యవసాయేతర పరపతిసంఘములు 1107.

| | |
|---|---|
| వీటిలో:—గవర్నమెంటు ఉద్యోగుల సంఘములు | 224 |
| మునిసిపలు, రైల్వే ఉన్నతోద్యోగుల సంఘములు | 73 |
| సాధారణోద్యోగులవి | 43 |
| ఫ్యాక్టరీపనివాండ్ర సంఘములు | 8 |
| మితవ్యయసంఘములు | 7 |
| ఇతర పట్టణ సంఘములు | 752 |
| మొత్తము | 1107 |

1. *Administration Reports of Government of Madras for 1931-33 on Co-operative Societies.*

# 20. ఋణేతర సహకారోద్యమము.

"ఇంగ్లండునందు క్రయవిక్రయోత్పత్తి సంఘములే ప్రజా విశ్వాసమునకు పాత్రములుగ నున్నవి. బాగుగా పనిచేయుచున్నవి. కాని ఇతర ఐరోపాఖండములయందు పరపతిసంఘములు బాగుగ పని చేయుట ప్రారంభించువఱకు క్రయవిక్రయోత్పత్తి మొదలగు కార్యములకై సహకారోద్యమము ప్రారంభింపబడలేదు. హిందూదేశము నందు గూడ ఐరోపాఖండమునందువలెనే పరపతిసంఘములు మొట్ట మొదట ప్రారంభింపబడెను."[1]

1912 వ సంవత్సరపు సహకారశాసనము ననుసరించి క్రయ విక్రయోత్పత్తి మొదలగు పరపతిలేని సంఘములను స్థాపించుటకు వీలుగలదు. అయినను పరపతిలేని సహకారోద్యమము నేటివఱకు తప్పటడుగులను వేయుచునే యున్నది. దినదినాభివృద్ధి గాంచుటలేదు. అన్నిరాష్ట్రములయందును సమానాభివృద్ధి జరుగుటలేదు. వ్యవసాయ మభివృద్ధియగుటకు రైతు సంపన్నుడగుటకు పరపతిసంఘములను నెల కొల్పుట మాత్రమే చాలదు.

రైతుల అప్పు తీర్చివేయబడినదని తలంచెదము. రైతులు విద్యావంతులైరని కూడ నూహించెదము. అంతమాత్రమున భూమి బలవంతమగునా? అధికముగ పంటలు పండునా? కృశించిన శరీరము లతో, పూర్వకాలపు పనిముట్లతో, నీటిపారుదలకు వలయునన్ని సౌకర్యములు లేని స్థితిలో, క్షుద్బాధచే ఎండి, నీరసించిన పశుసంత తితో, విభాగ విఖండములయిన భూమితో, మంచిరకపు విత్తులు లభింపక, పండిన పంటను అమ్ముకొనుటకు వలయు సదుపాయములు లేక, దళారీలు, మార్వాడీలు లాభముల నన్నింటిని తీసివేసికొనుచుండ

1. *Maclagan Committee Report, P. 107*

వారి బారినుండి తప్పించుకొనుటకు మార్గములు గోచరింపక రైతు వ్యవసాయమును లాభకరమగు వర్తకముగ నొనరింపజాలడు. రైతుల యభివృద్ధికి వలయు సర్వవిధములగు కృషియందునను పరపతి సంఘములకంటె పరపతిలేని యితరవిధములగు సహకారోద్యమమే పాశ్చాత్య ఖండములయందు మహోపకార మొనరించెను. హిందూ దేశమునందు గూడ నొనరింపగలదు. పండించువానికిని, వినియోగించువానికిని మధ్యగల దళారీ, లేక కమీషనువర్తకుడు తొలగింపబడుటకు డెన్మార్కు దేశమునందువలె ఋణేతర సహకారసంఘములను స్థాపించుటయే కర్తవ్యము.

# 21. ఋణేతర సహకారోద్యమ సమస్యలు.

ఋణేతర సహకారసంఘములను రెండు విధములుగ విభజింపవచ్చును. (1) ఋణేతర వ్యవసాయ సహకార సంఘములు. (2) ఋణేతర వ్యవసాయేతర సహకారసంఘములు. ఈ రెండు రకముల సంఘములను వివిధసంఘములుగ విభజింపవచ్చును. ముడిదినుసులను కొనుటకు, పనిముట్లను కొనుటకు, పంటలనమ్ముటకు, పండించుటకు, భీమా, ఇండ్లు కట్టుట, స్థలములుకొనుట మొదలగు వివిధసంఘములు కలవు.

1. బాధ్యత. శాసనము ననుసరించి ఋణేతర సంఘములకు సమిష్టి బాధ్యత యుండవలెనను నియమములేదు. సభ్యుల యిష్టము ననుసరించి వ్యష్టిబాధ్యతమీద లేక సమిష్టి బాధ్యతమీద నేవిధముగనైనను సంఘముల నెలకొల్పవచ్చును. ఆయాసంఘముల అవసరముల ననుసరించియు పరిస్థితుల ననుసరించియు బాధ్యత నిర్ణయింపబడుచున్నది. ఋణేతర వ్యవసాయ సహకారసంఘములు తఱచుగ సమిష్టి బాధ్యతపై నెలకొల్పబడుటలేదు. పాలసంఘ

# 23. ఋణేతర వ్యవసాయ సహకార సంఘములు.

ఋణేతర వ్యవసాయసహకార సంఘముల యుపయోగము వివరింపబడెను. నేటివఱకునీయుద్యమము వ్యాప్తి జెందలేదనుటనిశ్చయము. క్రయవిక్రయోత్పత్తి సంఘములు, విత్తులనమ్ము సంఘములు, పనిముట్ల నమ్ము సంఘములు, ఎరువులనమ్ము సంఘములు స్వల్పముగ గలవు. సహకారభీమాసంఘముల సిద్ధాంతములుగూడ వ్యాపించలేదు. పశువులను మాత్రమే కొన్ని తావులయందు భీమా చేయించుచున్నారు. వ్యవసాయ క్షేత్రములయందుండు ఇండ్లను, పంటలను, గడ్డిమేటులను భీమా చేయించుట ప్రారంభింపబడలేదు. పశువుల సహకారభీమా జయమగు చుండెనని తలంపబడెను. పశువులకువచ్చు పెద్దరోగము మొదలగు జబ్బుల విశేషవ్యాప్తి వలన ధనాభావముల చాల సంఘములెత్తివేయ బడుచుండెను. వ్యవసాయసంస్థ యందలి వివిధకార్యములకును, ఫల సాయమునకును పరికరములకును గూడ సహకారభీమా పద్ధతి వ్యాప్తి జేయవలయును. పశువులను పోషించుటకును, పశువుల మేతకును సహకారభీమా పద్ధతి నవలంబింపదగును. పొలములకు కంచెలనువేయుసంఘములు కొన్ని కలవు. పల్లపుసాగు సహకార సంఘములు కొలదిగ స్థాపింపబడినవి. వీటివలన మెరకపొలములకు నీరు తెచ్చుకొనుటకు వీలుగనున్నది. ఇట్టి పల్లపుసాగు సహకారసంఘములు మదరాసు, బెంగాలు రాజధానులయందు బాగుగ పనిచేయుచున్నవి. పంజాబునందు భూమి విఖండములను కలుపుటకు సహకారసంఘములు కలవు. ఉమ్మడి వ్యవసాయము చేయుటకు సహకార సంఘము లత్యవసరము. ఇటలీదేశమునందిట్టి సంఘములున్నవి.

వ్యవసాయదారులకు నిత్యకృత్యములకై వలయు పరికరముల సంఘములు ఇంగ్లండునందు బాగుగ నభివృద్ధి జెందినవి. హిందూ దేశమునందు వ్యవసాయదారుల అంతస్తు అత్యల్పమగుటచే గ్రామములయందు గల చిల్లర దుకాణములే వీరి అవసరముల గడతేర్చుచున్నవి. మంచిపాలను లభింపజేయుటకై సహకారసంఘము లత్యవసరము. పాలసంఘములు దేశమునం దచ్చటచ్చట గలవు. మొత్తము మీద ఋణేతర వ్యవసాయ సహకారోద్యమము అతిబాల్యావస్థ యందున్నదనుట నిశ్చయము.

“ బొంబాయియందుగల ప్రత్తి విక్రయసంఘములు (Cotton Sale Societies) ను; వంగదేశమునందుగల పల్లపుసాగుసంఘములు, పాలసంఘములును; మధ్యరాష్ట్రమునందుగల విత్తనములనమ్ము సహకారసంఘములు, గోశాల సంఘములును; పంజాబునందుగల భూమి విఖండములను గలుపు సహకారసంఘములు, కాలువలయందు మేటలు వేసిన ఒండ్రును తీసివేయు సంఘములు, వ్యవసాయ ఫలసాయము నమ్ము సంఘములును; హిందూదేశమునందు సరియగు నిర్మాణశాఖ యుండినచో సహకారోద్యమము కొలదికాలములోనే రైతులకు రావలసిన సర్వ విధములగు లాభములను రాబట్టగలుగునను విశ్వాసమును పురికొల్పుచుండెను.” అని డాక్టరు క్లౌస్టనుగారు వ్రాసిరి.[1]

ఈ పరివర్తనమునకు ప్రభుత్వమువారి వ్యవసాయ శాఖయు, పశురోగవైద్యశాఖయు, సహకారసంఘముల ప్రభుత్వశాఖయు మూడును పరస్పరమైత్రితో సహకారమున తమశక్తినంతయు కేంద్రీకరించుట అవసరమని కొందఱి సూచన. “ఋణేతర సహకారోద్యమ

1 *Reiew of Agricultural operations in India* (1926 7)

మూలముగనే ప్రజాసామాన్యమునకు నిపుణుల యుపదేశములు విని పించగలవు. ప్రభుత్వమువారి ఏప్రత్యేకశాఖయందలి ఉద్యోగస్థులైనను వ్యక్తిగతముగ రైతులను కలిసికొనజాలరు." అని వ్యవసాయ విచారణసంఘమువారి నిర్ణయము.[1]

బొంబాయియందు డివిజనులు, సంఘము లేర్పరుపబడినవి. ఈసంఘములయందు సహకార సంఘముల అసిస్టెంటు రిజిష్ట్రారును. వ్యవసాయశాఖవారి డిప్యూటీ డైరెక్టరును, కొంతమంది ఉద్యోగేతరులగు గౌరవసభ్యులును, సభ్యులుగనుందురు. తాలూకా పునర్నిర్మాణ సంఘములను పేరున (Taluq Development Association) కొన్ని సంఘములు సహకారశాసనము ననుసరించి రిజిష్టరీచేయబడినవి. ఈసంఘములును ప్రత్యేక వ్యవసాయ నిర్మాణికులను పేరున నియోగింపబడుచుండిన (Special Agricultural Organizers)ఉద్యోగస్థులును గ్రామముల వెంట పనిచేయుదురు."[2]

ప్రతి రాష్ట్రమునందును వ్యవసాయశాఖ డిప్యూటీకలెక్టరు హోదా కలిగిన పత్యేకోద్యోగిని సహకారశాఖ రిజిస్ట్రారునకు లోబడి పనిచేయునట్లుగ నియమింపవలయుననియు, నీయుద్యోగి ఋణేతర వ్యవసాయ సహకారోద్యమమును ప్రోత్సహించుచుండవలయుననియు, ఋణేతర సహకార సంఘములను స్థాపించుచుండవలయుననియు, అట్టి సంఘములు సక్రమముగ నడుచునట్లు చూడవలయుననియు వ్యవసాయ విచారణ సంఘమువారు సూచించిరి.[3]

---

1. *Agricultural Commission's Report, para 386.*
1. *Indian Economics-Jathar and Beri, p. 318.*
3. *Agricultural Commission's Report, para 388.*

"పెట్టుబడిదారుడును పంటలను కొనువాడును ఒక్కడే. పంటలను అమ్మ వీని చేతినుండి రైతు తప్పించుకొనజాలడు. పంటలను సహకార సంఘ ఖరీదుచేయువాడు తెలుచుగ సరియగుధరలను దెలియ ములు, క్రయవిక్ర నీయడు. తెలిసినను రావలసినంత ధరను తానీయడు. యు సంఘములు. పంటలు పండినవెంటనే ధరలు సహజముగ పడిపోవును. వ్యవసాయదారునకు తగు పెట్టుబడి లేనందున ధరలు హెచ్చువరకు పంటను నిలవచేసి యుంచజాలడు. పంటల హామీా మీాదనే ఋణమునుగూడ తెచ్చియుండినయెడల వడ్డీ మితముగ నుండును. పెట్టుబడిదారుని పరముగ పంటలను అమ్మివేయు షరతునకు రైతు లోబడియేయుండును. అందువలన కమీాషను ఏజెంటు, లేక దళారీ, లేక మధ్యవర్తకుడు ఏదోయొక నెపమున ధరను కోసివేయుచునే యుండును. ...... మధ్యవాడు సరకులో కల్తీ కలుపుటయు, తడిపివేయుటయు మొదలగు పనులొనరించుచుండును. ఇందువలన కొనువాడు ధర తగ్గించుచుండును. ఈనష్టమును రైతులేభరింపవలెను." అని కెటింజీగారువ్రాసిరి. ఈస్థితితొలగి సరియగు ధర రైతునకు లభించుటకు గ్రామములయందు పంటలనమ్ము సహకారసంఘములను నెలకొల్పదగును. లేక పరపతిసంఘములే క్రయ విక్రయ సంఘములను నెలకొల్పి, రైతుల పంటలను అవసరమగు చోట్లకు పంపి ఉమ్మడిగ నమ్ముచుండవలెను. ఇట్టి సంఘములు కాలిఫోర్నియాయందు బాగుగ పనిచేయుచున్నవి. ఇట్టిసంఘముల అనుభవము ననుసరించి యీాసంఘములు పనిచేయుటకు వలయు సూత్రముల నిట్లు జె. డబ్ల్యు. లాయిడుగారు క్లుప్తముగజెప్పిరి. (J. W. Lloyd)

1. పంటలను సరియగు మార్కెట్టులకు పంపుప్రయత్నములు పండించువారికట్టి ఆవశ్యకత బాగుగ తెలిసినయెడల విజయము గాంచును,

వర్తకము చేయువానికి పోవుచున్నది. సహకార సంఘముల మూల ముగ నీపని చేసినయెడల నీలాభమంతయు మరల సభ్యులకే చెందును. అనగా సుమారు సాలుసరి 34 లక్షలు తిరిగి వచ్చును. ఈవిధముగ పరపతి సంఘములన్నియు వర్తక సంఘములై యూనియనులక్రింద విభజింపబడి ఆయూనియనులన్నియు నొక కేంద్రవర్తకసంఘముగ నేర్పడినయెడల త్వరితగతిని జయము బడయగలుగుదుము.” అని హెన్నింగువేగారు వ్రాసిరి. (Mr. Henningway). “ఈవిధముగ భారతదేశమంతయు 325000 పరపతిసంఘములును, రాష్ట్రీయ సహకార వర్తకసంఘములుగను; రాష్ట్రీయ వర్తకసంఘములు అఖిలభారత సహకార వర్తకసంఘముగను నేర్పడినయెడల కనీసము 200 లక్షల రూపాయలు తిరిగి రైతున కొసంగగలుగుదు” మని హెన్నింగువే గారి మతింపు.[1]

“రాష్ట్రీయ వ్యవసాయ క్రయవిక్రయ సంఘములను స్థాపించి (Provincial Agricultural whole-sale Societies) వ్యవసాయమున కవసరమగు పరికరములను రైతులకు అందుబాటునందుంచుటయేకాక రైతుల పంటలను బజారులవెంట గొనిపోయి సరియగుధరలకు విక్రయ మొనరించుటయే కాక, వ్యవసాయమునకు అవసరమగు వస్తుసముదాయమంతయు నుత్పత్తిచేయగల మిల్లులను; ధాన్యము, నార, నూనె మిల్లులను స్వాయముగ కలిగియుండెడిరోజు వచ్చును. హిందూదేశమందంతట రాష్ట్రీయ వ్యవసాయ క్రయవిక్రయసంఘములు నెలకొల్పబడి, యీశాఖలతో గూడిన అఖిలభారత వ్యవసాయ క్రయవిక్రయసంఘమును నెలకొల్పవలెనను ఆదర్శము మాదృక్పథమునందు విస్పష్టముగ గోచరించుచున్నది. ఇట్టి పరిణామము ప్రపంచమునంతను విభ్రమమెందించును. నాడే ప్రపంచమునందంతట క్రమాభి

1. *From the Co-operative Movement in India.*

వృద్ధి జెందుచున్న సహకారవర్తకమునందు భారతవర్షముకూడ నగ్రస్థానమును బొందగలదు." [1]

సహకారోద్యమసహాయమున రైతునకు మంచివిత్తులకొసంగుటయు, నూతనపరికరముల నందిచ్చుటయు, ఎరువులనిచ్చుటయు, రైతున్నకు వలయు సర్వవిధములగు వస్తుసముదాయమునకును క్రయవిక్రయశాలల నేర్పరచుటయు గావించిననాడు వ్యవసాయము భారతభూమియందు నూతనతేజమున పునర్జన్మము నొందగలదు.

భూమి విఖండములను గలుపు సహకార సంఘములు.

భూముల విభాగ విఖండములను గురించి అయిదవ అధ్యాయమునందు వ్రాయబడెను. ఈవిఖండములను గలుపుటకు సహకారోద్యమము మూలముగ నెట్లు పనిచేయబడుచున్నదియుగూడ నొకింత 5 వ అధ్యాయమునందు వివరింపబడెను. విఖండములను గలుపుటకై సహకార సంఘములను స్థాపింపవలయు ననెడి ప్రయత్నము 1920 వ సంవత్సరమునందు పంజాబులో ప్రారంభింపబడెను. పంజాబునందు చిన్న చిన్న రైతులు హెచ్చుమంది కలరు. అందువలన విఖండములు కలుపనియెడల వ్యవసాయాభివృద్ధికి భంగకరము. మొట్టమొదట మార్చుకొనబడిన విఖండములు 4 సంవత్సరముల పిమ్మట వలదనినను మరల నిచ్చివేయుచుండెడివారు. ఇప్పుడీ పద్ధతి రద్దుకాబడెను. ఒక పర్యాయము మార్చుకొనిన భూమి శాశ్వతముగ ననుభవించుట కధికారము కలదు.

ఇట్టి మార్పుదలచేయు సహకార సంఘములలో భూకామందు లేక జిరాయితీ హక్కుదారుడు లేక మరెట్టి హక్కుగాని భూమియందుగలవారు మాత్రమే సభ్యులుగ నుండవలెను. సంఘసభ్యులందరిట్టి అంగీకార పత్రముపై సంతకము చేయవలెను.

---

1. *From the Co-operative Movement in India, P. 186.*

| సంవత్సరములు | గ్రామముల సంఖ్య | కలుపుటకు పూర్వము సంఖ్య | | | కలిపిన పిమ్మట సంఖ్య | | | మొత్తము తగ్గిన విఖండములు | కలుపుటకు పూర్వము విఖండము 1కి గల సర్వే నెంబర్ల సగటు | కలిపిన పిమ్మట విఖండము 1కి గల సర్వే నెంబర్ల సగటు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | పట్టా దారులు | సర్వే నెంబర్లు | విఖండ ములు | పట్టా దారులు | సర్వే నెంబర్లు | విఖండ ములు | | | |
| 1924 ఏప్రియలు మొదలు 1925 మార్చి వఱకు | 1 | 53 | 267 | 214 | 58 | 272 | 149 | 31 | 1-2 | 1-8 |
| 1925 ఏప్రియలు మొదలు 1926 మార్చి వఱకు | 1 | 5 | 81 | 47 | 5 | 81 | 48 | 9 | 1-7 | 1-9 |
| 1926 ఏప్రియలు మొదలు 1927 మార్చి వఱకు | 2 | 13 | 184 | 43 | 18 | 188 | 37 | 80 | 7-3 | 7-7 |
| 1927 ఏప్రియలు మొదలు 1928 మార్చి వఱకు | 5 | 91 | 1007 | 1597 | 91 | 1990 | 1373 | 96 | 14-9 | 18-6 |
| 1928 ఏప్రియలు మొదలు 1928 డిశంబరు వఱకు | 5 | 39 | 471 | 358 | 39 | 453 | 309 | 45 | 5-7 | 6-3 |

*(From Co-operation in India P. 185.)*

బరోడాసంస్థానము-విఖండములను గలుపుసంఘములు.

బరోడాసంస్థానమునందు గూడ విఖండములను గలుపుటకు సహకారసంఘములు గలవు. 1928 వ సంవత్సరాంతమునకు 11 సంఘములున్నవి. ఈ పైపట్టికననుసరించి బరోడారాజ్యమున గల యభివృద్ధిని తెలిసికొనగలము.

"ఇట్లు విఖండములను గలుపుటవలన గ్రొత్తగ బావులను త్రవ్వించుటకును, బీడుభూములను సాగుబడిలోనికి దెచ్చుటకును, సౌకర్యములు హెచ్చినవి. గతసంవత్సరము 933 బావులు త్రవ్వబడెను. 5206 ఎకరములు సాగుబడిలోనికి వచ్చెను. ఎ 3193 లు పల్లపుసాగు చేయుటకుకూడ ప్రారంభింపబడెను. గురుడసపురమున (Gurdaspur) 2000 చెట్లు వేయబడినవి. ఇందు 400 ఫలవృక్షములు. 49 గోతులు ఎరువులకై పొలములయందు రైతులు త్రవ్వుకొనగలిగిరి. 600 పాతనూతులు బాగుచేయబడినవి." అని పంజాబుదేశమునందు గలిగిన లాభములు ప్రభుత్వనివేదికయందు వివరింపబడెను.[1]

విఖండములను కలుపులవలన రైతునకు సేవ్యముచేయు సౌకర్యములు హెచ్చినవి. ఫలసాయము హెచ్చెను. మక్తాలు హెచ్చెను. "గురుడసపురమునందొక రైతు 5 ఎకరములకు రు 100 ల నిచ్చువాడు. అతడు విఖండములను గలిపినపిమ్మట రు 150 ల నిచ్చుచుండెను. ఇట్లే 855 మణుగులగోధుమ ముట్టుచుండిన భూకామందునకు 80 మణుగుల గోధుమ ముట్టుచున్నది." ఒకగ్రామమున 3040 విఖండములుగల యొకరైతునకు అన్నివిఖండములు కలిపివేయుటవలన ఒకతావుననే పెద్దకమత మేర్పడినది. మరొకరైతునకు 200 విఖండములుగ నుండెడి భూమి ఒకపెద్దకమతమైనది. మరొకరైతునకు ఎ 10 లు 84 విఖం

1. *Annual Report 1930.*

కొనియిచ్చుటకును, వడ్రంగులకు కలప కొనియిచ్చుటకును, వివిధము లగు పరిశ్రమలకు పనిముట్లను గొనియిచ్చుటకును, బట్టలను, పట్టుబట్టలను ఉత్పత్తిచేయుచు నమ్ముటకును, ఇండ్లుకట్టుటకును సంఘము లేర్పరుపబడినవి. సహకారస్టోర్సులలో నిత్యకృత్యములకు కావలసిన చిల్లరసరకు కొనుచు అమ్మబడుచుండెను." అని మెక్లాగను కమిటీ వారు వ్రాసిరి.[1]

అక్కడక్కడ ఎక్కడో నొకమూల నిట్టిసంఘములు స్థాపింపబడినమాట నిజమేకాని ఋణేతర, వ్యవసాయేతర సహకారోద్యమము గమనింపదగినట్లుగ వ్యాప్తిజెందలేదు.

చేతిపనివాండ్రు- క్రయవిక్రయోత్పత్తి సంఘములు.

రైతుల స్థితివలెనే చేతిపనివాండ్రస్థితియు నార్థికముగ నభివృద్ధి జెందవలసియున్నది. పరపతిసంఘముల నెలకొల్పుటయేకాక యితరవిధములగు సహకార సంఘములను గూడ నెలకొల్పినగాని చేతిపతివాండ్ర ఆర్థికస్థితి చక్కబడదు. చేతిమగ్గముల పరిశ్రమ సహకారసంఘములవలన అమితాభివృద్ధినొందుటకు సావకాశము లున్నవి. ముడిసరకును చిల్లరగ హెచ్చుధరకు కొనక చౌకగ మొత్తముగ గొనవచ్చును. మరమగ్గములను కొని యుపయోగింపవచ్చును. నేతగాండ్రే కట్టుకొనువారికి నేతబట్టలనమ్మి అందలి లాభములను పొందవచ్చును. వర్తకుల పెట్టుబడికి లోబడి, బట్టలునేసి, తిరిగి చౌకధరలకు వర్తకులకు అమ్మివేయ నవసరముండదు.

సహకారసంఘములవలన ఉత్పత్తియగు పరిశ్రమల ప్రదర్శనముల నేర్పరుపదగును. అట్టిప్రదర్శనములు సహకారోద్యమవ్యాప్తికి తోడ్పడగలవు. బొంబాయిరాజధానియందు సహకారవిధానము నను

1. *Maclagan Committee Report, para 10.*

సరించిన చేమగ్గముల పరిశ్రమయొక్క ప్రాముఖ్యస్థితిని ప్రభుత్వము వారు గ్రహించిరి. సహకారశాఖవారు నేతవిద్యను గఱపుటకై కొన్ని విద్యాలయముల నెలకొల్పిరి. శిల్పకారులనదగు చెప్పులుకుట్టువారు, కంసాలులు, బుట్టలనేయువారు, వడ్రంగులు కమ్మరులు, మొదలగు వారి యభివృద్ధికై కూడ సహకారసంఘముల నేర్పరుపదగును.

కార్మికుల సంఘములు. (Unskilled Labourers' Societies)

మదరాసు రాజధానియందు కార్మికులకు సహకార సంఘములు కలవు. ఈసంఘములు రోడ్లమరమ్మతులను జేయుటకును, నేలనుత్రవ్వుటకును కంట్రాక్టులను బుచ్చుకొనుచుండును. ఈసంఘములయందు చిన్న చిన్న రైతులుకూడ సభ్యులుగనుండిరి. ఈసంఘములు బాగుగ పనిచేయకపోవుటకు కంట్రాక్టరుల ప్రతిఘటన హెచ్చుగనున్నది. కార్యనిర్వహణముకూడ లోటుగనున్నదని ప్రభుత్వోద్యోగు లనుచున్నారు.[1]

పట్టణములయందలి వినియోగ సంఘములు. (Consumers Societies in Urban areas)

గ్రామములయందు వినియోగ సంఘములు నెలకొల్పబడుట లేదని యిదివరలో గుర్తించితిమి. పట్టణములయందు గూడ వినియోగ సంఘములు నెలకొల్పబడుట లేదనియే చెప్పదగును. అక్కడక్కడ కొన్నిసంఘము లుండుటవలన కొలదిగ పల్లెలకంటె పట్టణములయందీ యుద్యమము వ్యాపించినట్లుగ తలంపవలయును. సహకార వినియోగ సంఘములు మదరాసు, బొంబాయి, సంయుక్త రాష్ట్రముల యందు గలవు.

1. *See Agricultural Commission's Report. Minutes of Evidence. Vol. III. Evidence of the Registrar Madras; also his Annual Report 1927-8. Para 82*

మదరాసునందు గల టిప్లికేనులో సాగింపబడుచుండిన సహకార విక్రయశాల హిందూదేశమున కంతకు నుదాహరణముగ నున్నదని చెప్పవచ్చును. బొంబాయియందు, సంయుక్తరాష్ట్రములయందు కళాశాలల యందుగల భోజనశాలలకు (స్టోర్సు) సహకార వినియోగ సంఘములు కలవు. ఇవియు బాగుగ పనిచేయుచున్నవి. రైళ్ళఉద్యోగస్థులు కార్మికులుకూడ వినియోగ సంఘములను నెలకొల్పుకొనిరి. కాని వినియోగసంఘముల ఉద్యమవ్యాప్తిని మొత్తముగ పరిశీలించిన యెడల గమనింపదగిన యభివృద్ధి రవంతయు లేదనుట నిర్వివాదము. పాశ్చాత్య ఖండములతో ముఖ్యముగ ఇంగ్లండుతో బోల్చి చూచుకొనిన మన దేశమునం దభివృద్ధిలేదని స్పష్టపడును. "తగిన పరిశీలనాధికారము, వర్తకశక్తి, సభ్యులు సంఘముపట్ల చూపదగిన విశ్వాసమును కొఱవడి యుండుటయే" ఈయుద్యమవ్యాప్తి నిరోధమునకు కారణములని సహకారశాఖోద్యోగులు చెప్పుచున్నారు.[1]

బజారు ధరలకును వినియోగసంఘముల ధరలకును గల స్వల్ప వ్యత్యాసమును, నిర్ణీతమగు జీతములువచ్చు సభ్యులు విశేషముగ లేకపోవుటయు, నగదునకు మాత్రమే అమ్మక అరువులు పెట్టుచుండుటయు, సభ్యులు కానివారితోకూడ వ్యవహరించుచుండుటయు వినియోగసంఘములు విజయము బడయకపోవుటకు కారణములని కొందఱు నిరూపించుచున్నారు. వస్తువుల మంచిచెడ్డలను గమనింపగల శక్తి వ్యాప్తియగుట వినియోగ సంఘముల విజయమునకు మూలముగ నుండును. కార్మికులకును మధ్యతరగతి ప్రజలకును వినియోగసంఘముల వ్యాప్తి మహోపకార మొనరించును.

---

1. *See Annual Reports 1923—4; 1927—8 of Co-operative Registrar, Bombay.*

గృహనిర్మాణ సంఘములు.

ఇంగ్లండునందు సందుగొందులు బాగుచేసి బీదవారికి సరియగునిండ్లను గట్టించుటకై జేసినప్రయత్నములలో సహకార గృహనిర్మాణసంఘములు ప్రధానస్థానము వహించును. ఈసంఘములజయమే హిందూదేశము నకు సదుదహరణము. పల్లెపల్లెలయందునను గృహనిర్మాణసమస్య కలదు. కలకత్తా, బొంబాయి, మదరాసులవంటి నగరములలో కార్మికుల బాగునకై గమనింపవలసిన ముఖ్యవిషయములలో గృహ నిర్మాణసమస్య యొకటి. ఈసమస్య పట్టణములయందు తక్కువగ లేదు. మదరాసు, మైసూరు, బొంబాయి రాజధానులయందలి పట్టణ ములలో కొన్ని గృహనిర్మాణసంఘములు కలవు. బొంబాయిప్రభు త్వము వారు గృహనిర్మాణ సంఘములకు ధనసహాయము చేయుటకు నిర్ణయించుకొనిరి. మదరాసుప్రభుత్వముకూడ ధనసహాయము కొంత దిగ గావించుచున్నది. గృహనిర్మాణ సంఘములను నాలుగువిధము లుగ విభజింపవచ్చును.

1. గృహనిర్మాణమునకై సంఘసభ్యులకొఱకు స్థలములను మాత్రమే కొను సంఘములు. సంఘములు కొనియిచ్చు స్థలములలో సభ్యులు తమంతతామే ఇండ్లను కట్టుకొందురు.

2. సహకారపద్ధతిని ఇండ్లనుకట్టించు సంఘములు. ఈయిండ్లు చివఱకు సభ్యులస్వంతమగును. ఈరెండువిధములగు సంఘములును శాశ్వతముగ నుండవు. సభ్యులపట్ల విశేషసహకార ముండవలసినపని లేదు. ఇవి భాగ్యవంతుల సంఘములనదగును. వీటిని సంపూర్ణముగ సహకారసంఘము లనదగదు.

3. సమిష్టిగ ఇండ్లను కట్టుకొనుట, అందఱును అద్దెకు కాపుర ముండువారిగ నుండుట, అందఱకును అన్నిఇండ్లమీద హక్కుండుట,

ప్రాథమిక సంఘములకు మొదటి పైమెట్టు యూనియనులు. ప్రతి రాష్ట్రమునందున నేదోయొక విధమగు యూనియనులు పనిచేయు చున్నవి. ఈ యూనియనులను మూడువిధములుగ విభజింపవచ్చును. (1) బర్మాయందుగల పూచీపడు యూనియనులు (Guaranteeing Unions) (2) బొంబాయి మదరాసు రాజధానులయందుగల పెత్తనము చేయు యూనియనులు (Supervising Unions) (3) పంజాబునందు గల బ్యాంకింగు యూనియనులు. కొన్ని పరిసర గ్రామముల ప్రాథమిక సంఘములు కలిసి యొకయూనియనుగ నేర్పడుచున్నవి. ఈ యూని యనునందుగల సంఘప్రతినిధులు కలిసి యొక కమిటీని నియోగిం చెదరు. ఈకమిటీవారే యూనియను వ్యవహారములను చేయుచుం దురు. యూనియనునందుగల సంఘముల వ్యవహారముల జరిశీలించుచు సంఘములకు సలహా నొసంగుచుందురు. పూచీపడు యూనియను లున్నచోట ఆయూనియనునందుగల సంఘములు తీసికొనుట కర్హతగల ఋణమును యూనియనులే నిర్ణయించుచు కొన్నిషరతుల ననుసరించి ఆ అప్పు మొత్తమునకు హామీకూడ నొసంగెదరు. ఇట్టి యూని యనులుండుటవలన సంఘములపై పెత్తనము బాగుగ వహించుటయే కాక గ్రామ పరపతి సంఘములకును, సెంట్రలుబ్యాంకులకును మధ్యగ నీసంఘములు కొలికిపూసవలె నుండునని తలంపబడెను. మెక్లా గను కమిటీవారిట్టి యూనియనులను స్థాపింపవలెనని హెచ్చరించిరి.

సెంట్రలు బ్యాంకులు మాత్రమే యున్న రాష్ట్రములయం దిట్టి యూనియనులను స్థాపించుట తప్పనిసరియని మెక్లాగను కమిటీ వారు వ్రాసిరి. కాని బొంబాయియందు పెట్టబడిన హామీ యూని యనులు నిరర్థకములైనవి. పది సంవత్సరములకు పూర్వమే బొంబాయి

యందిట్టి హామీయూనియనులు పని చాలించినవి. మధ్యరాష్ట్రముల యందుగూడ విరమింపబడినవి. బీహారు, ఒరిస్సాలయందింకను కొన్ని సంఘములు గలవు. ఇవి నామమాత్రముగ నున్నవి. బర్మాయందు మాత్రమే పూచీ యూనియనులు బాగుగ పనిచేయుచున్నవని తలంప బడెను. కాని "బర్మాయందుగూడ నిట్టి యూనియనులు నిరర్థకము లైనవి. కొలదికాలములో నెతి వేయబడును."[1]

పూచీ యూనియనుల నెత్తివేసి వాటికి బదులుగ పెత్తనము వహించు యూనియనులను మాత్రమే నెలకొల్పవలెనని బర్మాసహా కారోద్యమ విచారణ సంఘమువారు వ్రాసిరి.

పెత్తనము వహించు యూనియనులను మొట్టమొదట మద రాసు రాజధానియందు విస్తారముగ స్థాపింపబడినవి. సహాకారోద్య మమునందొక ముఖ్యభాగముగ నున్నవి. బొంబాయి రాష్ట్రమున గూడ పిమ్మట స్థాపింపబడినవి. ఈయూనియనుల పక్షమున సూపరు వైజర్లు నియమింపబడుచున్నారు. వీరు సంఘములకుబోయి వారిలెక్క లను, అప్పు ఆస్తులను పరీక్షించుచు వారికి వలయు సలహాల నొసంగు చుందురు. బర్మాయందు జిల్లా యూనియనుబోర్డులుకూడ గలవు. మద రాసునందుగూడ జిల్లా ఫెడరేషనులు పుట్టినవి. అక్కడక్కడ గిట్టు చున్నవి. గిట్టినవి.

ఈదిగువ పట్టికవలన యూనియనుల వివరములను తెలిసికొన గలము. (బ్యాంకింగు యూనియనులు కాక).

1. *Committee on Co-operation in Burma 1928-29.*

| రాష్ట్రములు | యూనియనుల సంఖ్య. | యూనియనుల యందలి సంఘసంఖ్య | వ్యవసాయ పరపతి సంఘముల సంఖ్య | సిబ్బంది సంఖ్య (Staff) | ఖర్చులు రు. |
|---|---|---|---|---|---|
| మద్రాసు | 440 | 12883 | 12947 | 542 | 528675 |
| బొంబాయి | 102 | 2079 | 4574 | 108 | 89733 |
| బెంగాలు | 3 | 263 | 17963 | 7 | 553 |
| బీహారు, ఒరిస్సా | 215 | 10794 ♦ | 8582 | 211 | 30126 |
| సంయుక్తరాష్ట్రములు | 8 | 108 | 5444 | 157† | 120689 |
| బర్మా | 584 | 3508 | 3370 | 17 | 289845 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 19 | 4575 | 3817 | 366‡ | 369097 |
| అజ్మీరు, మార్వారా | 2 | 141 | 1234 | 2 | 824 |
| కూర్గు | 12 | 160 | 214 | | 173 |
| భూపాలు | 10 | 251 | 1039 | | |
| బరోడా | 2 | 40 | 821 | 1 | 521 |
| తిరువాన్కూరు | 26 | 1468 | 1377 | 26 | 15918 |
| మొత్తము | 1418 | 35770 | 61387 | 1432 | 1438036 |

♦ ఈ అంకెలలో రాష్ట్రీయ ఫెడరేషను నందలి సభ్యత్వసంఖ్య కూడ కలిసియున్నది.

† సంయుక్తరాష్ట్రముల రాష్ట్రీయ యూనియను సంఖ్య.

‡ ఈ అంకెలు ఫెడరేషను యూనియనులు కలిపి.

(*From Co-operation in India*)

పంజాబు, బెంగాలు, మధ్యరాష్ట్రములు, బీరారు, సంయుక్త రాష్ట్రములలో పెత్తనమువహించు స్థానికముగనుండు యూనియనులు లేవు. బ్యాంకింగు యూనియనులుమాత్రమే కలవు. ఇవియే సెంట్రలుబ్యాంకులుగ పనిచేయుచున్నవి. యూనియనులు ప్రాథమికసంఘములపై పెత్తనము వహించుటయేకాక, క్రియావిక్రయోత్పత్తి వ్యవహారములలో సెంట్రలుబ్యాంకులకును, ప్రాథమికసంఘములకును మధ్యగనుండి విశేషకృషి సలుపవలెను.

## 26. సెంట్రల్లు బ్యాంకుల్లు.

జిల్లా 1 కి ఒక సెంట్రలుబ్యాంకు ఉండుట అత్యవసరము. గ్రామపరపతిసంఘముల కవసరమగు ఋణమును సమకూర్చుచుండవలెను. సెంట్రలుబ్యాంకులను మెక్లాగనుకమిటీవారు మూడు విధములుగ విభజించిరి.

1. వ్యక్తులుమాత్రమే సభ్యులుగనుండు బ్యాంకులు.

2. సహకారసంఘములకు మాత్రమే సభ్యత్వ ముండు బ్యాంకులు.

3. సహకారసంఘములు, ఇతరవ్యక్తులును గూడ సభ్యులుగనుండు బ్యాంకులు.

మొదటితరగతి బ్యాంకులు వ్యక్తులకును, సంఘములకును మధ్య యెట్టి వ్యత్యాసమునుగాని చూపవు. పరిపాలనయందు, లాభములను పంచుటయందు, పెట్టుబడిని ప్రత్యేకించుటయందు వ్యక్తులకును, సంఘములకును (చేర్చుకొనినయెడల) సమానహక్కులే కలవు. ఇట్టి బ్యాంకులు నేడు పనిచేయుటలేదు. సహకారసంఘమువారి విచారణకు

స్వార్థమేకాని సహాకారోద్యమముపై ప్రేమకాదు. భాగ్యవంతుల యొక్కయు న్యాయవాదులు మొదలగు పట్టణములయందలి విద్యావంతులయొక్కయు సవతితల్లి ప్రేమను జూరగొనుట విరమించినగాని సహాకారోద్యమ మభివృద్ధి జెందజాలదు. చెరువునందు దిగి యీత నీదుటకు మొదలుపెట్టినగాని యీత నెన్నటికిని ఎవ్వరును నేర్వజాలరు. అట్లే రైతులపై బ్యాంకులను నడుపుకొను బాధ్యత మోపినగాని వారి కెన్నడును స్వశక్తి జనింపదు. పెట్టుబడి వ్యక్తుల వాటాలమూలముగ గాక డిపోజిట్లమూలముగ సంపాదించుటకు ప్రయత్నింపవలెను. లేక వడ్డీరేటును శాసనరూపముగ తగ్గించివేసినయెడల పెట్టుబడిదారులు తమపెట్టుబడిని బ్యాంకులలోవేసికొనక తప్పదు. ఇట్లే పెట్టుబడి లభించుటకు, సక్రమపరిపాలనకు వేరు మార్గముల నరయవలయును. వ్యక్తిసభ్యులకు సెంట్రలుబ్యాంకులలో స్థానమును దొలగించి వేయవలయును. నాడే సెంట్రలుబ్యాంకులు సహాకార సిద్ధాంతము ననుసరించి పని జేయగలవు.

**సెంట్రలు బ్యాంకులు పనిచేయు స్థల నిర్ణయము. (Area of a Central Bank)**

సెంట్రలుబ్యాంకు ఎంత ప్రదేశమునకు పని చేయవలసినదియు నిర్ణయింపబడుచుండును. సెంట్రలు బ్యాంకులు సంఘములకు ఋణమొసగు ప్రదేశములను నిర్ణయించుటయే కాక ఆప్రదేశమునందే సెంట్రలుబ్యాంకులు ఋణము దీసికొనవలెననికూడ కొన్ని రాష్ట్రముల యందు నిర్ణయము కలదు. దక్షిణ హిందూస్థానమున, మధ్య హిందూస్థానమున మొదలగు ప్రదేశముల యందు ఒక్కొక్క రివిన్యూజిల్లాయం దొకబ్యాంకు పనిచేయుచున్నది. కొన్నితావులయందు డివిజను 1 కి ఒక బ్యాంకు వంతున గలదు. బెంగాలు, బీహారు, ఒరిస్సా, సంయుక్త రాష్ట్రములు,

పంజాబు మొదలగు తావులయందు డివిజనుకంటెగూడ తక్కువ ప్రదేశమున కొకబ్యాంకు పనిచేయుచున్నది. ఇట్టి బ్యాంకులకు సంబంధించిన సంఘములసంఖ్యయు పెట్టుబడి మొత్తమునుగూడ స్వల్పముగనే యున్నది.

బ్యాంకుల సాధారణ సభ

బ్యాంకుల సాధారణసభలు సాలున కొకసారి జరుగును. సాలుమధ్య ప్రత్యేకసభలను జరుపవచ్చును. సభ్యుని 1 కి ఒక ఓటు గలదు. వాటాల ననుసరించి లేక పెట్టుబడి మొత్తము ననుసరించి ఓట్లు అదనముగ నుండవు. సాధారణసభలే కార్యనిర్వాహకవర్గసభ్యుల నెన్నుకొనును.

డైరెక్టరులు. (Board of Directors)

సాధారణ సభయందెన్నుకొనబడు డైరెక్టర్ల సంఘము వారు లేక కార్యనిర్వాహకవర్గము బ్యాంకువ్యాపారము నంతను నిర్వహించుచుందును. బ్యాంకుల డైరక్టర్ల సంఖ్య హెచ్చుగ నున్నది. ఇందులకు ప్రత్యేక ప్రాతినిధ్య సిద్ధాంతము నంగీకరించుటయే కారణము. సంఘముల పక్షమున గొంతమందియు, వ్యక్తులపక్షమున గొంతమందియు, నెన్నుకొనబడు చుండుటవలన డైరెక్టర్లసంఖ్య హెచ్చుగ నున్నది. ఇందువలన డైరెక్టర్ల మీటింగులు తరుచు జరుపుటకు వీలులేదు. జరుపబడినయెడల, రాకపోకలఖర్చులక్రింద అనవసరముగ నధిక వ్యయమగుచున్నది. ఒక్కొక్క బ్యాంకునకు 10 మంది మొదలు 24 గురువఱకు డైరెక్టరులు గలరు. వీరికొఱకగు ఖర్చును దగ్గించుటకు కార్యనిర్వాహకవర్గముల నేర్పరచుచున్నారు. డైరెక్టర్ల సంఘము; మరొక కార్యనిర్వాహకవర్గము; రెండుసంఘములు కార్యనిర్వహణమున పాల్గొనుచుండుట పరస్పర ప్రతిఘటనలకు కారణముగనున్నది. సాధారణ సభయందు, తక్కువమందిగల కార్యనిర్వాహకవర్గమునే ఎన్నుకొనుట

సముంజసము. తక్కువమంది నెన్నుకొనుటకుగాను ప్రత్యేక ప్రాతి నిధ్యములను తీసివేయవలెను. ధనముతోగూడిన వ్యాపారమును నడుపవలసిన బ్యాంకులలో డైరెక్టర్లందరు నొక్క దృక్పథమున పరస్పరవిశ్వాసమున బనిజేయవలెను. ప్రత్యేక ప్రాతినిధ్యమున ప్రత్యేకపు హక్కుల సంరక్షణకై పాటుపడుట సహజమగుటవలన పరస్పర విశ్వాసము పెంపొందదు. పరస్పర విశ్వాసములేని డైరెక్టర్లతోగూడిన బ్యాంకు లెన్నటికిని అభివృద్ధి జెందనేరవు. కార్యదర్శి లేక అధ్యక్షుడు, బ్యాంకుమేనేజరు సహాయమున అనుదినవ్యాపారమును నిర్వహించుచుందురు. డైరెక్టరులు సామాన్యముగ జీతములను తీసికొనరు. కొన్ని సెంట్రలుబ్యాంకుల డైరక్టర్లు ప్రతిసాలున కొందఱు మారు చుందురు. వ్యక్తిసభ్యులనుండియే కార్యదర్శియు ప్రెసిడెంటును, ఎన్నుకొనబడుచున్నారు. ఉత్తరహిందూస్థానమున ప్రభుత్వోద్యోగినే అధ్యక్షునిగ గొన్ని బ్యాంకు లెన్నుకొనవలెను. దక్షిణహిందూదేశమున ఉద్యోగేతరులే యెన్నుకొన బడుచున్నారు.

వ్యక్తిసభ్యులను పెన్షనుబుచ్చుకొనిన ఉద్యోగస్థులను, ఉద్యోగస్థులను, కార్యదర్శిగను, అధ్యక్షునిగను, నెన్నుకొనుట విరమింపబడవలెను. ఇందువలన సహకారోద్యమమున నిరంకుశపరిపాలన పెచ్చుపెరుగుచున్నది. సాధారణసభవారి తీర్మానములను, డైరెక్టర్ల తీర్మానములనుగూడ వీరు మన్నింపరు. బ్యాంకు కార్యదర్శి, ప్రెసిడెంటు, సాధారణసభవారి తీర్మానములను, డైరెక్టర్ల తీర్మానములను నిర్లక్ష్యముగ ద్రోసిపుచ్చి, వ్యతిరేకముగ వర్తించుట కించుకయు జంకరు. ఇందువలన సాధారణసభవారికి, డైరెక్టరులకును, డైరెక్టరులకు, కార్యదర్శి, ప్రెసిడెంటులకును, పరస్పరవిశ్వాసము తొలగిపోవు చున్నది. ఈఅవిశ్వాసమే బ్యాంకులు పడిపోవుటకు ముఖ్యకారణముగ నున్నది. ఈవిషయమై వ్యవసాయవిచారణసంఘమువా రిట్లు వ్రాసిరి.

"సభ్యులు సంఘవ్యాపారమునందు తగుశ్రద్ధవహింపరు. కార్య దర్శి ప్రెసిడెంటులచర్యను హద్దుపద్దులలో నుంచజాలరు. కార్యదర్శి ప్రెసిడెంటులవలన లోటులున్నను, వారిని ఆయుద్యోగములనుండి తొలగింపరు. సంఘోద్యోగులుకూడ జాగరూకతవహించి రావలసిన బాకీలను రాబట్టరు." ఈవాక్యములు పరపతిసంఘములకును, సెంట్రలు బ్యాంకులకును గూడ వర్తించును. వ్యక్తిసభ్యులకు వాటాలనొసంగుట కంగీకరించినను, పెట్టుబడిలకు నధికముగ లాభములను పంచిపెట్టుట కొడంబడినను, కొంతమందిని డైరెక్టరులుగ నెన్నుకొనుటకు దలయొగ్గినను, కార్యదర్శిగను అధ్యక్షునిగను, నెన్నుకొనరాదు. ఆచారము, నియమము, తొలగినగాని, సహాకారోద్యమ మభివృద్ధి జెందదు. సాధారణసభయు, డైరెక్టర్లసభయు, కార్యనిర్వాహక వర్గసభయు, తమసభలను వ్యాపార దృక్పథమున ముగించుకొనుట ముఖ్యావసరము. అనవసరముగ వ్యర్థ వాగ్వాదములతో రోజులకొలది సభలు జరుపుట వలన దుర్వ్యయ మగును. స్వల్పకాలమున హెచ్చు కార్యక్రమమును వ్యాపార దృష్టితో బ్యాంకుసభలను ముగింప గలిగిననాడు, సహకారోద్యమ విజయమునకు పునాది వేయబడెనని సంతసింప వచ్చును.

బ్యాంకుల సిబ్బందీ (Staff)

సెంట్రలు బ్యాంకులకు జీతమునిచ్చు మేనేజర్లు కలరు. వీరి విధులు ప్రతిరాష్ట్రమునందున నొకవిధముగ లేవు. కొన్ని రాష్ట్రములయందు ఆఫీసు ఉద్యోగస్థులపై మాత్రమే వీరికి అధికారము కలదు. మరికొన్ని రాష్ట్రములయందు బ్యాంకునకు సంబంధించిన సంఘములతాలూకు ఉద్యోగస్థు లందరిపైన అధికారము కలదు. మరికొన్ని రాష్ట్రములయందు మేనేజరులు సంచారము చేయుచుందురు. సంఘముల కార్యనిర్వహణమునకు బాధ్యత వహించెదరు. వీరికి ఆఫీసు పనితో నిమిత్తములేదు. కొన్ని రాష్ట్రములయందు రాష్ట్రీయ ఫెడ

బడినవి. మధ్యరాష్ట్రములలో 12 సంవత్సరముల కాలనిర్ణయము కొంత కాల మవలంబింపబడెను. పిమ్మట సంవత్సరమున కిచ్చుకొనవలసిన దానికి 2½ రెట్లు చెల్లించి భూస్వామ్యము గొనుటకేర్పరచిరి. 1920వ సంవత్సరమున కొన్నిమార్పులు జరిగెను. రెండురకముల రైతుహక్కు లేర్పరుపబడినవి. రెండురకముల రైతులకు వినిమయాధికారము గలదు. మదరాసురాష్ట్రమున 1885 వ సంవత్సర వంగదేశశాసనము ననుస రించి 1908వ సంవత్సరమున ఎస్టేట్సులాండుఆక్టు గావింపబడెను. ఈశాసన మామోదించునాటికి జమీందారీ భూములలో గల రైతులకు (సొంతసాగులేని భూములకు) రైతుహక్కు లొసంగబడెను. రైత్వారీ భూములలో రైతులకెట్టి హక్కులుగలవో అట్టిహక్కులను జమీం దారీభూములలో రైతులకు సంక్రమింపజేసెను.

ఈ శాసనము 1933 వ సంవత్సరమున మరల సంస్కరింప బడెను. ఈ సంస్కరణమున రైతు నూతన హక్కులనుగాని, జమీం దారుల వలన పడు బాధలనుండి తొలగుట కవకాశములను గాని, పొందజాలకపోయెను. మదరాసు శాసనసభ జమీందారుల వంట యిల్లుగ మారుటయే యిందులకు కారణము. ప్రజానాయకులు రాజ కీయ కారణమున శాసనసభలను బహిష్కరించుటచే, రైతును సంర క్షింపగలవారు శాసనసభయందు లేకపోయిరి. కాని పూర్ణమగు అగ్రహారం ఈనాములయందుగూడ రైతునకు భూస్వామ్యపుహక్కును కలిగించిరి. కుడివరం, మేలువరం హక్కులు రెండును గలవారినుండి వ్యవసాయపు హక్కును తొలగించుటవలన ఆర్థికవ్యవస్థయందు తల క్రిందులగు మార్పు కలిగెను. అగ్రహారములు అమ్ముడుపోయినవి. భూములు విఖండములైనవి. ఈనాందారులకు సంపూర్ణాధికారము తొలగించుట వలన నీ భూములపై ఋణములిచ్చినవారును పుచ్చు కొనిన వారును గూడ అత్యధికదుస్థితికి పాల్పడుదురు. ఈ అగ్రహార

ములు ఏకఖండముగ నుండినచో, నీ శాసనమువలన అరిష్టమంతగ లేదు. అగ్రహారీకులందరును, అగ్రహారపు భూములు కొన్నవారును గూడ అల్పభూమికి కామందులుగనుండుటచే వీరియందిపుడు నిరుద్యోగ సమస్య యేర్పడును. వ్యవసాయము స్వయముగా చేయనివాడు రెండు హక్కులను కలిగియుండరాదు. కాని స్వయముగ వ్యవసాయము చేయదలంచుకొనినవానికి గూడ నీశాసనము ననుసరించి సావకాశము లేదు. ఈనాముదారులకీ శాసనమును గురించి ముందుగ దెలియ జేసి కొంతకాలవ్యవధి నొసంగి పిమ్మట నీశాసన మొనరించి యుండి నచో సర్వసమ్మతముగ నుండెడిది. 1880 వ సంవత్సరపు శాసనము ననుసరించి బొంబాయియందు లోగడగల రైతులకే రైతుహక్కు లొసంగబడెను. 1862 వ సంవత్సర శాసనము ననుసరించి ప్రత్యేక భూస్వామ్యములు గూడ గలవు. పైనవివరించినట్లు వ్యవసాయము జేయుటవలన లేక ఆక్రమణలవలన నేర్పడిన (Occupancy Tenant) యిట్టి రైతుహక్కులేగాక యితరములగు రైతుహక్కులుకూడ గలవు. వంగదేశమునందువలె సంయుక్తరాష్ట్రములయందు నిర్ణీతపు పన్నుపై ఏర్పరుపబడిన భూస్వామ్యములు గల రైతులు గలరు. మధ్యరాష్ట్రముల యందు మొదటిసెటిల్‌మెంటు కాలమునం దేర్పరుపబడిన ఖాయపు రైతులు గలరు. (Absolute Occupancy Tenants). కొన్ని తావులయందు భూకామందెప్పుడు పొలము వీడి పొమ్మనుచో నప్పుడు పొలమును వీడ వలసిన రైతులు కలరు.

భూస్వాధీనపుహక్కు లెట్టివి? (Occupancy Privilege).

హక్కులు. పన్ను హెచ్చించుటకు కాలనిర్ణయముగలదు. పన్ను నిర్ణయించుటకు నియమములు గలవు. పన్నును దావా చేసి హెచ్చింపవచ్చును. రైతు, భూస్వామి రాజీపడి హెచ్చించుకొన వచ్చును. వంగదేశమున 15 సంవత్సరముల కొకమారు రూపాయకు

2 అణాలకంటె పన్ను హెచ్చించుటకు వీలులేదు. చుట్టుపట్ల భూముల కంటె తక్కువపన్ను గలిగియున్నను, ధరలు హెచ్చినను, జమీందారులు, లేక భూకామందులు పంట హెచ్చగుటకు పొలమునందేమైన మరమ్మతులుచేసియున్నను, పన్ను హెచ్చించుటకు కోర్టువారు డిక్రీ నొసంగగలరు. రైతుగూడ భూమిసత్తువ తగ్గిపోయినను, ధరలు తగ్గిపోయినను పన్నుతగ్గించవలెనని వ్యాజ్యము వేయవచ్చును. మధ్యరాష్ట్రములలో సెటిలుమెంటు ఆఫీసర్లు పన్నును నిర్ణయించెదరు. పదిసంవత్సరముల కొకమారు సెటిలుమెంటు జేయవచ్చును. మదరాసు రాష్ట్రమున 100కి 12½ కంటె నొకసారి పన్నును హెచ్చించుటకు వీలులేదు.

2. రైతును భూమినుండి తొలగించివేయకుండ కొన్ని నియమములు గలవు.

3. ఈ భూస్వాధీనపుహక్కు వంశపరంపరానుగతముగ నుండును. దాన విక్రయాది అధికారముకూడ గలదు.

4. భూమినుండి తొలగించివేయుటకు ముందు తగు నోటీసు నీయవలయును. పన్నునిచ్చుటకు వాయిదాలు గలవు.

5. ప్రభుత్వమువారు జమీందారులకు, భూకామందులకు దుర్భిక్షమువలన పన్నులు తగ్గించుచో, రైతునకు కూడ పన్నును తగ్గించవలెను.

రైత్వారీ ప్రదేశములయందింత కృత్రిమ తంత్రాంగమేమియు లేదు. రైతునకు ప్రభుత్వమునకు మధ్య మరొకడులేడు. కాని పన్నులనుప్రభుత్వమువారు ఇష్టమువచ్చినట్లుగ విధించుచున్నారు. ఈబారినుండి రైతు సంరక్షింపబడుటకు వలయు శాసనములు మాత్రము లేవు.

# 17. సెటిలుమెంట్లు.

భూమినిస్తు శాశ్వత నిర్ణయము.

సేద్యము జేసికొనువాడు తరిమివేయబడి జమీందారులు మొలకలెత్తుటచే, సేద్యగానికి భూమి పోయినది. భూమి గలవానికైనను ఒకవంక జమీందారుల పీడయు మరొకవంక అప్పటి రాష్ట్రాధికారుల దుర్నయములును ఏకమై రైతును పీల్చి పిప్పిగ జేయసాగెను. కుంపినీ పరిపాలన ప్రారంభమున రైతు అధోగతికి త్రోయబడెననుట చరిత్రాంశము. 1765 వ సంవత్సరమునకు పిమ్మట క్లైవుగారి పరిపాలనలో రైతుపడ్డకష్టము లిన్నియన్ని యని చెప్పనలవిగాదు. కంపెనీవారి తాబేదార్లు, నవాబుగారి తాబేదార్లు వీరిరువురును రైతులకష్టముల నినుమడింపజేసిరి. 1769 వ సంవత్సరమున నియమింపబడిన రివిన్యూ అధికారులు రైతును సంరక్షింపజాలకపోయిరి. 1770 వ సంవత్సరమున వచ్చిన కరువువలన రైతు కుంగి కృశించిపోయెను. 1772 వ సంవత్సరమున కంపెనీవారే ప్రత్యేకముగ రివిన్యూయధికారమును స్వీకరింప నిశ్చయించుకొనిరి. వారన్‌హేస్టింగ్సు పన్నుల వసూళ్ళపద్ధతిని కొంతదిగ మార్చెను. కలక్టర్లను నియమించెను. కేంద్రరాష్ట్ర జిల్లాబోర్డుల నేర్పరచెను. కాని పన్నులను విధించుపద్ధతి ఘోరముగనే యున్నది. మొట్టమొదట నాలుగుసంవత్సరముల కొకపర్యాయము పన్నులను వర్తకులకు, ధనాఢ్యులకు వేలము వేసెడివారు. పిమ్మట సంవత్సరమున కొకమారు వేలమువేయసాగిరి. ఈపాటదారులకు న్యాయాన్యాయ విచక్షణలేదు. ఈయవలసినపన్నులను, సీయనక్కరలేనిపన్నులను రైతుల నుండి దౌర్జన్యముగ వసూలుచేయుచు, రైతులరక్తమును పానము జేసిరి. ఈస్టిండియాకంపెనీకి తనవాటాదార్లకు హెచ్చులాభములను పంచిపెట్టవలెనని గల సంకల్పమే రైతులరక్తమును పానమొనరింప

జేయుటకు కారణము. రమేశచంద్రదత్తుగారి నిశ్చితాభిప్రాయమిదియే. ఈదుర్వ్యవస్థను తొలగించుటకే లార్డుకార్న్‌వాలీసు 1786 వ సంవత్సరమున హిందూదేశమునకు పంపబడెను.

వంగదేశము. (పర్మనెంటు సెటిలుమెంటు భూమిసిస్తు శాశ్వత నిర్ణయము.)

కార్న్‌వాలీసుగారు వంగదేశమున భూమిసిస్తు నిర్ణయము గావించిరి. భూమిసిస్తు నిర్ణయము గావింపవలెనని 1785 వ సంవత్సరమున కంపెనీ డైరక్టర్లామోదించిరి. ఈ భూమిసిస్తు నిర్ణయము పన్నులనువసూలు చేయుచు భూముల నాక్రమించుకొన్న జమీందారులతో జేసికొనిరి. నిర్ణయింపబడిన పన్నొసంగబడనిచో జమీలనమ్మి పన్ను వసూలుచేసికొనుటకు అధికారము ప్రభుత్వమునకు గలదు. జమీందారులక్రింద నుండు తాలూకాదార్లు, భూకామందులు, రైతులు సంరక్షింపబడుటకు వలయు శాసనాధికారము కూడ ప్రభుత్వమునకు గలదు. జమీందారులు పన్నులవలన వసూలగునని వేయబడిన యంచనాలో 11 వంతులలో 10 వంతులు పన్నుక్రిందనిర్ణయించిరి. ఒకవంతు జమీందారులకు వదలిరి. ఈ నిర్ణయమునందు నీతి, నియమములేదు. భూమియందు గల హక్కు బేహక్కులు విచారింపబడలేదు. ఈ భూమిసిస్తు నిర్ణయము 1793 వ సంవత్సరమున ఖాయపర్చిరి. జమీందారులకు గాని వారి సంతతివారికిగాని ఏకారణముచేత నైనను నధికముగ భూమిసిస్తు విధించుటకు గల యధికారమును ప్రభుత్వము వీడెను. జమీందారులకు నాటినిర్ణయించిన పన్ను కట్టుచు సర్వహక్కులతో జమీల ననుభవించుటకు స్వాతంత్ర్యమిచ్చిరి. (సర్వే) భూమికొలతలు గాని హక్కు బేహక్కుల నిర్ణయములుగాని లేకుండ నీవిధముగ సెటిలుమెంటు చేయుట చాల చిక్కులకు కారణమని బేడెన్‌పవల్‌గారు వ్రాసిరి.

---

1. *Land Systems of British India Vol 1, Page*

సర్. జె. యి. కోల్ బ్రూకుగారిట్లు వ్రాసిరి.

"భూమిసిస్తు నిర్ణయమువలన దోషములు రెండు. (1) జమీందారీలనేర్పరచి గ్రామస్థులకును, రైతులకును భూమియందుగలహక్కును తొలగించి భూమియందు సర్వాధికారములను జమీందారుల కొసంగుట.

(2) జమీందారు తనయిష్టప్రకారము రైతుపై పన్నుకట్టుట కధికార మొసంగుట."[1]

ఈయనవ్రాసినటుల రైతులకు భూమిహక్కు తొలగిపోయినది. జమీందారులు తమయిష్టమువచ్చినటుల రైతులపై పన్నులను గట్టిరి. రెండువిధముల రైతే దురదృష్టవంతుడుగ మారెను. జమీందారులు తాము ప్రభుత్వమున కిచ్చుకొనవలసివచ్చిన పన్ను నీయకపోయినచో జమీలు వేలమగునను భయమున పన్నువసూళ్ళలో రైతులనొత్తిడి చేసెడివారు. ఒత్తిడిజేసియు, ప్రభుత్వమున కీయవలసిన సాలుసరికప్పము నీయజాలకపోవుటచే కొన్నిజమీలు వేలములగుచుండెడివి. క్రొత్త జమీందారు వచ్చినపుడెల్ల రైతు వ్యవసాయముజేసికొను పద్ధతులన్నియు మారిపోయెడివి. ఈకష్టములు 1859-1885 వ సంవత్సర శాసనములవలనకు కొంతవఱకైన తొలగలేదు. లార్డుకారన్వాలీసు బ్రిటిషు దీవులయందొక జమీందారు డగుటయే హిందూదేశమున గూడ జమీందారీలను సృష్టించుటకొక కారణము. హిందూదేశమున జమీందారీలను సృష్టించి వారు బ్రిటిషుప్రభుత్వమున కండదండగ నుండునట్లొనరించుటయే జమీందారీల నేర్పరచుటకు రెండవకారణము. కారన్వాలీసు హిందూదేశమునకు వచ్చుసరికి పన్నులను వసూలు

---

1. *Sir J. E. Colle Brook—Quoted by Sir T. Morison—The Industrial Organisation of an Indian Province. P. 27.*

చేయుచుండినవారి జమీందారులగుటవలన వారిపలుకుబడిని తొలగించి పన్నువసూళ్ళకై యితరవిధానములను బ్రిటీషు పెట్టుట కష్టదాయకమని తలంచుట మూడవకారణము. క్లైవు, వారన్ హేస్టింగ్సుల పరిపాలనమున రైతుపడిన చెప్పనలవిగాని కష్టము నొకింతయైన తొలగింపవలెనను సత్సంకల్పము నాల్గవకారణము. మొదటి 3 కారణములు ఫలప్రదములైనవిగాని నాల్గవ కారణము సిద్ధింపలేదు. పన్నుల పాటదారుల బారినుండి రైతు సంరక్షింపబడెనని చెప్పవచ్చును. కాని ఆపాటదారులే యీజమీందారులుగూడ నగుటవలనను, జమీందారులకు సర్వాధికారము గలిగించుటవలనను, రైతుల దుర్దినము తొలగలేదు. ఇది వంగదేశమునందలి భూమిసిస్తు నిర్ణయచర్

మదరాసు, బెనారెసులు, భూమిశిస్తు శాశ్వత నిర్ణయము.

1795 వ సంవత్సర ప్రాంతమున బెనారెస్‌నందు భూమిసిస్తునిర్ణయమునకు దిగిరి. గ్రామములయందలి భూమిలో గ్రామస్థులందరు భూస్వామ్యము గలిగియుండిన పద్ధతి ఆంగ్లేయుల కానాడర్థము గాలేదు. గ్రామములయందు గల యెవరినో యొకరిని యేరి వారికాగ్రామముపై సర్వాధికార మొసంగుచు, వారితో భూమిసిస్తు నిర్ణయమునకు దిగిరి.

మదరాసునందు 3వ వంతు భూమి మాత్రమే భూమి సిస్తు నిర్ణయము గావింపబడినది. (జమీందారులకు ఈనాముదార్లకును కలిపి) ఇదివరలో రాజ్యముల పరిపాలించినవారి సంతతికి ఆంధ్రదేశమున, అరవదేశమున కొన్ని జమీలనిచ్చి వారితో భూమిసిస్తునిర్ణయము గావించుకొనిరి. బ్రిటిషుప్రభుత్వస్థాపనకు తోడ్పడినవారికిగూడ జమీలనిచ్చిరి. వంగదేశమునందువలెనే కొన్నికొన్ని గ్రామములను కలిపి జిల్లాలక్రింద నేర్పరచిరి. ఈజిల్లాలలో పన్నులవసూళ్ళు వేలము వేయ

ప్రారంభించిరి. హెచ్చుపాటదారులకు సేలములలో జిల్లాలను కొద్ది వేసెడివారు. ఈపాటదారులే జమీందారులైరి. కాని పన్నునురాబట్టు కొనుట కీపద్ధతి వీలుగలేదని కొంతకాలమునకు మదరాసుప్రభుత్వము తలంచెను. అందుచే సర్. తామస్ మన్రోగారు రైత్వారీపద్ధతిని కనిపెట్టి, జమీందార్లను సృష్టించుట మానివేసిరి. మన్రోగారి పరి పాలననాటికే శివ వంతు భూమి జమీందారులపాలై భూమిసిస్తుశాశ్వత నిర్ణయము గావింపబడెను. రైత్వారీపద్ధతి ప్రవేశపెట్టిన సర్. తామస్ మన్రోగారును కలనల్ రీడుగారును రైత్వారీపద్ధతియందుగూడ భూమి సిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెననియే తలంచిరి. 1796 వ సంవ త్సరమున రీడుగారు సేలమునందిట్లే ప్రకటించిరి. సర్. తామస్ మన్రోగారు ఇంగ్లండులో కామన్సుసభవారియెదుట సాక్ష్యమిచ్చుచు రైత్వారీపద్ధతిని గుఱించి యిట్లు చెప్పిరి.

"రైత్వారీపద్ధతియనగ భూమిపై సిస్తును నిర్ణయించుట. ఇట్లు నిర్ణయింపబడిన సిస్తు శాశ్వతముగనుండును. ప్రతిరైతును శాశ్వతముగ నిర్ణయింపబడిన సిస్తును ప్రభుత్వమునకిచ్చుచు అతనియిష్టమువచ్చినంత కాలమా భూమిని దున్నుకొని యనుభవింపవచ్చును. ఎప్పుడుగాని ఆసిస్తు హెచ్చింపబడక నిర్ణీతమగుసిస్తుతో నాతడాభూమిని యనుభ వింపగలడు. ఆతడిట్లు నిర్ణయింపబడిన భూములనుగాక బంజరుభూముల నాక్రమించుకొనుచో మాత్రము ఆక్రమణభూమి పరిమితికి మరల సిస్తు నిర్ణయింపబడును. ఒకసారి నిర్ణయింపబడిన సిస్తు మరల మార్ప బడదు.........వంగదేశమందలి భూమిసిస్తు నిర్ణయమునకును, రైతు వారీపద్ధతి భూమిసిస్తునిర్ణయమునకు నెట్టివిభేదము లేదు. కాని వంగ దేశమునందువలె గాక ఆక్రమణభూమికి మాత్రము మరల పన్ను నిర్ణయింపబడుచుండును." 19 వ శతాబ్దమధ్యమున భూమిసిస్తునిర్ణ యము, వసూళ్ళు రైతునకు కష్టతమముగనే యున్నవి. 1848-1852-

1853 వ సంవత్సరములమధ్య పార్లమెంటువారు జరిపిన విచారణ యందు రైతులకష్టములు నివేదింపబడినవి. 1855 వ సంవత్సరమున రాష్ట్రమంతయు తిరిగి సర్వే చేయబడి భూమిసిస్తు పునర్నిర్ణయము గావించుటకు నిశ్చయించుకొనిరి. ఆనాటి భూమిసిస్తు శాశ్వత నిర్ణయ సిద్ధాంతమును వీడలేదు. మదరాసు ప్రభుత్వము రైత్వారీపద్ధతియొక్క మూలసిద్ధాంతమును భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయించుటయే యని నుడివెను. 1861 వ సంవత్సరమున రాష్ట్రప్రభుత్వములన్నియు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెనని లార్డుకానింగుగారు సూచించిరి. అప్పుడు మదరాసు ప్రభుత్వము కూడ నాసూచనల నామోదించెను. సర్. జోన్ లారెన్సుగారు, సర్. ఛార్లెస్ఉడ్ గారు, సర్. స్ట్రాఫర్డునార్తుకాటుగారు వీరందరు భూమిశిస్తు శాశ్వతముగ నొనరించుట కంగీకరించిరి. 1862 వ సంవత్సరమున హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి భూమిసిస్తును పునర్విమర్శింపవలయుననియాజ్ఞాపించుచు భూమిసిస్తు శాశ్వత నిర్ణయ సిద్ధాంతము నంగీకరించెను. కాని 1883 వ సంవత్సరమున అప్పటి హిందూదేశరాజ్యాంగకార్యదర్శి భూమిసిస్తు శాశ్వతనిర్ణయ పద్ధతియే వలదనెను.

కంపెనీపరిపాలనయందు వెలస్లీ, మింటో, హేస్టింగ్సు, బెంటిక్, మన్రో మొదలగు గవర్నర్లు, గవర్నరుజనరల్సు మొదలగు వారలు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెనని ప్రయత్నించిరి. కానీ కంపెనీడైరక్టర్లు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయించుట లాభసాటి బేరముగాదని 1820 సంవత్సర ప్రాంతమునందా పద్ధతిని త్రోసివేసిరి. అంతకు పూర్వము గావించిన ప్రకటనలును, చేసిన వాగ్దానములును అన్నియు వమ్ముజేసిరి.

# 18. చక్రవర్తి పరిపాలనము-భూమిసిస్తు నిర్ణయము.

ఈస్టిండియాకంపెనీ యెత్తివేయబడి రాణీగారిపరిపాలన ప్రారంభింపబడినపిమ్మట లార్డుకానింగుగారు భూమిసిస్తు నిర్ణయసమస్యను విమర్శింపసాగిరి. ఒరిస్సాయందు సంభవించిన 1860 వ సంవత్సరపు కఱవుసందర్భమున హిందూదేశమునకువచ్చిన కలనల్ బరుడుస్మిత్తుగారు భూమిసిస్తునిర్ణయము శాశ్వతముగ నిర్ణయింపవలెనని సూచించిరి. సర్ చార్లస్ ఉడ్ గారు (అప్పటి హిందూదేశరాజ్యాంగకార్యదర్శి) ఆసిద్ధాంతముతో నంగీకరించిరిగాని ఆచరణయందుంచలేకపోయిరి. ఆయన పిమ్మట వచ్చిన హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శియగు సర్ స్ట్రాఫోర్డునార్తుకాటుగారు 1867 వ సంవత్సరమున భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెననిరి. కాని 100కి 80 ఎకరములభూమి సాగుబడియందున్నచోట్లను కాలువలవలన పల్లపుసాగుబడివలన 100కి 20 వంతులకంటె వ్యవసాయమునం దాదాయము హెచ్చుటకు వీలులేని భూములకు నీరిసూత్రము ననుసరించి భూమి యభివృద్ధికి రాగలదని యాశించునంతకాలము భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడుటకు వీలుండదు. ఈయన తరువాత హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగ వచ్చిన లార్డు కింబర్లేగారు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెనను సిద్ధాంతమునే త్రోసిరాజనిరి. అప్పటినుంచియు భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపవలెనను సంకల్పమునే ప్రభుత్వమువారు విడనాడిరి.

భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడని భూములకు వంగదేశమున అయోధ్యయందు మఱికొందఱు జమీందారులతో సెటిలు

మెంటుజేసిరి. వీరు 100 కి 70 వంతులు ప్రభుత్వమున కిచ్చునట్లుగ నిర్ణయము. ఆగ్రాయందు గావింపబడిన భూమిసిస్తు నిర్ణయపద్ధతి కూడ వంగరాష్ట్రమునందలి పద్ధతివలెనే యున్నది. భూస్వామ్యపు హక్కులు గల గ్రామములు, ఏయొకభూస్వామికో వంగదేశమునందు వలె కట్టిపెట్టుటకు వీలులేదని 1819 వ సంవత్సరమున హోల్టుమెకంజీ గారు విచారించి తెలిపిరి. ఏగ్రామమున కాగ్రామమున హక్కు బేహక్కులన్నియు సంపూర్ణముగ విచారింపవలయుననిరి. అప్పుడే ఒరిస్సాయందు, పశ్చిమోత్తర పరగణాలయందు, సంయుక్తరాష్ట్రము లనబడే ఆగ్రా, అయోధ్యపరగణాలయందు సెటిలుమెంటు సమస్య చర్చింపబడుచున్నది. ఆగ్రాయందు ప్రతిగ్రామమునందును, ఏ కొలదిమంది జమీందారులో, తాలూకాదార్లో కాక గ్రామస్థులందఱకు గల హక్కు బేహక్కులు విచారింపబడినవి. గ్రామమొత్తమున గ్రామ పెద్దలతో సెటిలుమెంటు జేసిరి. గ్రామములయందు భాగస్వాము లందరి పక్షమున గ్రామమందలి పెద్ద బాధ్యత వహించినను పన్నునిచ్చు కొనుటలో భాగస్వాములందఱు బాధ్యులే. ఆగ్రాతాలూకాదార్ల కిట్టి గ్రామముల పై భూకామందు అధికారములు స్వల్పముగ నున్నవి. ఈగ్రామములనుండి వసూలుచేయబడు పన్ను ప్రభుత్వమునకే చెందెను. కాని 100 కి పదివంతుల చొప్పున ప్రభుత్వమువారే యీతాలూకాదార్ల కిచ్చుచున్నారు. ఇట్లిచ్చు మొత్తమునకు సరిపోవునట్లు హెచ్చు పన్నును గ్రామములపై వేయుచున్నారు. ఈగ్రామములలో ఏభాగస్వామిగాని ఆస్థికి, పన్నునకు గూడ తన ప్రత్యేకబాధ్యతను విడదీసికొనుటకు హక్కుగలదు. సాలుసరి ఆదాయములో కొంతభాగము ప్రభుత్వపు పన్నుక్రింద పుచ్చుకొనుటకు ప్రారంభించిరి. ఈస్టిండియా కంపెనీకాలమున 100 కి 80 వంతులుగూడ తీసికొనబడెను. లార్డు విలియం బెంటిక్కుగా రిట్లమితముగ తీసికొనుట అన్యాయమని తలంచి

100 కి 66 వంతులు తీసికొనిరి. 1855 వ సంవత్సరపు సహారన్‌పూరు నియమముల ననుసరించి, 100 కి 50 వంతులకు తగ్గించిరి. ప్రస్తుతము గూడ నించుమించుగ 100 కి 50 వంతుల పన్ను వసూలుచేయ బడుచున్నది. ఇట్లే మహల్వారీ సెటిలుమెంటులన్నియు చేయబడినవి. ఆగ్రా, అయోధ్య, పంజాబు, మధ్యరాష్ట్రములలో మహల్వారీ సెటిల్ మెంట్లు గలవు. పంజాబునందుగూడ మహల్వారీసెటిలుమెంటే గలదు. ఒక రాష్ట్రమునకును, మరొక రాష్ట్రమునకును గొన్ని తారతమ్య ములు గలవు.

మదరాసు రాజధాని, భూమిసిస్తు సెటిలుమెంటు.

మదరాసురాజధానియందు సెటిలుమెంటు జేయుటకు నియమములతోగూడిన శాసనమేమియు లేదు. ప్రభుత్వమువారి యిష్టాయిష్టములే సెటిలుమెంట్లకు మూలము. 1883 వ సంవత్సరమున లార్డురిప్పనుగారు మదరాసు గవర్నమెంటునకు రైతులకు హామీనొసంగ వలెనని సూచించెను. నిర్ణీతమగు పద్ధతుల ననుసరించియే పన్నులను హెచ్చింపవలెననిరి. ఆసంవత్సరమున మదరాసు ప్రభుత్వ మాసిద్ధాంతము నంగీకరించెను. ధరలు హెచ్చినగాని పన్నులను హెచ్చింపమని మదరాసు ప్రభుత్వము నిర్ణయించుకొనెను. కాని 1885 వ సంవత్సరమునం దప్పటి హిందూదేశరాజ్యాంగ కార్యదర్శి మదరాసు ప్రభుత్వనిర్ణయముపై నెత్తిసిరాగీత పెట్టెను. మదరాసుప్రభుత్వమిట్లు రైతులకు వాగ్దాన మొసంగుట ప్రమాదకరమనెను. 1900 సంవత్సరమున మదరాసురాష్ట్రమున పించనుపుచ్చుకొనిన ప్రభుత్వోద్యోగులు భూమిసిస్తు నిర్ణయము నియమబద్ధ మొనరింపవలెనని ప్రభుత్వమును గోరిరి. 1902 వ సంవత్సరమున లార్డుకర్జనుగారు నియమబద్ధమొనరింప వీలులేదని తీర్మానించెను. 1919 వ సంవత్సరమున జాయింటు పార్లమెంటరీ కమిటీవారు గావించిన సూచనల

నైనను మదరాసుప్రభుత్వ మాచరణయందుంచలేదు. భూమిసిస్తు నిర్ణయము శాసనబద్ధమొనరింపవలెనని జాయింటు పార్లమెంటు కమిటీవారు సూచించిరి. సంస్కరణలు ప్రారంభింపబడినపిమ్మట మదరాసు శాసనసభవారు భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయింపవలెనని తీర్మానించిరి. భూమిసిస్తునిర్ణయము శాసనబద్ధ మొనరించువఱకు సెటిలుమెంట్లు నాపుజేయవలయునని తీర్మానించిరి. 1921 వ సంవత్సరమునందు ఉద్యోగులను, అనుద్యోగులను గలిపి యీసమస్య చర్చించుట కొకసంఘమును నిర్మించిరి. ఈసంఘమునకు ప్రభుత్వసభ్యుడగు అబీబుల్లాసాహెబుగా రధ్యక్షుడు. రివిన్యూబోర్డువారిచే వ్రాయబడిన భూమిసిస్తు నిర్ణయశాసనమును గుఱించి విచారించుటకై యీసంఘము నియమింపబడెను. ఈసంఘమువారు భూమిసిస్తు శాశ్వతనిర్ణయ సిద్ధాంతమును గుర్తించిరి. అత్యవసరసమయములయం దధికపుపన్ను విధించుటకు ప్రభుత్వమున కధికారముండవలెననిరి. భూమిసిస్తు నిర్ణయించుటయం దధికారము శాసనసభవారి కుండవలెనని అధికసంఖ్యాకులగు సభ్యులు నిర్ణయించిరి. కాని యీనిర్ణయాధికారము శాసనసభ కలిగియుండరాదని ప్రభుత్వమువారు ప్రతిఘటించిరి. 100కి 18 రూపాయల మూడుపావులాలకంటె సెటిలుమెంటునందు హెచ్చింపమని మాత్రమనిరి. ఈనియమములతో గూడిన చట్టమును శాసనసభయందు ప్రవేశపెట్టిరి. శాసనసభవారికి భూమిసిస్తు నిర్ణయమునం దధికారమొసంగని యీశాసనము ప్రజల కనుపయోగమని యీబిల్లును శాసనసభ్యులు నిరాకరించివేసిరి. భూమిసిస్తు నిర్ణయశాసన మొనరింపబడలేదు. కాని ప్రభుత్వమువారు 100 కి 18 రూ. 12 అణాలకంటె హెచ్చింపమని నిర్ణయించుకొనిరి. సెటిలుమెంటు కాలమునకు పూర్వపు 20 సంవత్సరముల ధరలనుబట్టి సగటుధర, దానిననుసరించి ఆదాయమును మదింపువేసి అందులో వ్యవసాయమునకగు ఖర్చు

లను మినహాయించి మిగిలిన నికరాదాయములో సగము భూమిసిస్తు క్రింద నిర్ణయింపబడవలయునని ప్రభుత్వసిద్ధాంతము. భూమితరము ననుసరించియు సాగుబడిసౌకర్యముల ననుసరించియు భూముల మెట్ట పల్లపుసాగుల ననుసరించియు పన్నులనిర్ణయము. ఏభూమియందైన ఖనిజములుండినచో నాభూమికి ప్రత్యేకపుపన్ను కట్టుదురు.

బొంబాయి రైత్వారీపద్ధతి.

బొంబాయియందు భూమిసిస్తు నిర్ణయశాసనములు గలవు. గుజరాతునందలి తాలూకాదార్లు, కొంకణ తీరమందలి కొట్లు, కైరా, బ్రోచి జిల్లాలయందలి ఉమ్మడిగ్రామముల సెటిలుమెంట్లు విషయములలోగూడ ప్రత్యేక శాసనములు గలవు. అనేకవిధములగు ప్రయత్నములు బొంబాయి రాజధానియందుగూడ జరిగినవి. తుట్టతుదకు రైత్వారీపద్ధతిని ఆచరణకు తెచ్చిరి. మదరాసు రైత్వారీపద్ధతి లక్షణములే, బొంబాయి రైత్వారీపద్ధతికిగూడ గలవు. పన్ను నిర్ణయించు పద్ధతిలో మాత్రము తేడాగలదు. మదరాసురాజధానియందువలె అచ్చట కొన్ని కొన్ని గ్రామములనేరి, వాటి యార్థికస్థితి ననుసరించి, జిల్లాల కన్నింటికి భూమిసిస్తు నిర్ణయింపరు. మదరాసురాజధానియందువలె భూమి యొక్క తరముననుసరించి తరము హెచ్చింపరు. భూమియొక్క బలాబలములు పరీక్షింపబడి ఒకసారి నిర్ణయింపబడెను. భూమి బలాబలములు రూపాయివిలువలో మదింపు వేయబడినవి. అనగా ఒకటవ రకపుభూమి 16 అణాలనబడును. ఏభూమికాభూమి నికరాదాయము ననుసరించి పన్ను విధింపబడదు. మొత్తముగ ఒక తాలూకా తీసికొనబడి, ఆతాలూకామొత్తముమీద పన్ను నిర్ణయింపబడును.

1. శీతోష్ణస్థితులు, నైసర్గికలక్షణములు, వ్యవసాయాభివృద్ధుల ననుసరించి తాలూకాల వారీగ విడదీసెదరు.

చిన సెటిలుమెంటు, తగ్గించినప్రదేశము మచ్చునకైనలేదు. ఒకవంక రైతు ఆర్థికముగ నానాటికి దిగులుపడుచున్నను, సెటిలుమెంటు ఉద్యోగస్థులకు రైతు ఆర్థికముగ నభివృద్ధియం దున్నటులనే గోచరించుచుండెను. ఇందులకనువుగనే లెక్కలను తయారుచేయుచున్నారు. సెటిలుమెంటుఉద్యోగస్థులు తయారుచేయులెక్కలు బూటకములని బొంబాయిరాజధానియందలి బార్డోలీ సెటిలుమెంటు చరిత్ర విస్పష్టముగ వెల్లడించుచున్నది. తమయుద్యోగిలెక్కలు తప్పులని బొంబాయి ప్రభుత్వ మంగీకరించుట విధియైనది. బార్డోలీరైతులు వీరాధివీరులవలె హెచ్చుపన్నులన్నియు నిరాకరించిరి. ప్రభుత్వ నిర్బంధవిధానము నోర్మితో సహించిరి. తత్ఫలితముగ బొంబాయిప్రభుత్వము బ్రూమ్ ఫీల్డుసంఘమువారిని విచారణకై నియమించెను. బ్రూమ్‌ఫీల్డుగారు హైకోర్టున్యాయమూర్తి. వీరివిచారణయందు సెటిలుమెంటు కమీషనరుయొక్క మదింపులన్నియు తప్పులనివ్రాసిరి. కమీషనరు సూచించిన హెచ్చుదల సమర్థించుటకు వీలుగాదని తగ్గించిరి. వీరినిర్ణయమును బొంబాయిప్రభుత్వ మంగీకరించెను. బ్రూముఫీల్డు కమిటీవారు బార్డోలీ సెటిలుమెంటుపై వ్రాసిన వాక్యములిట గమనింపదగును.

"జయకరుగారు (బార్డోలీ సెటిలుమెంటు ఆఫీసరు) 100 కి 33 రూపాయలవంతున పన్నును హెచ్చింపవచ్చునని సూచించిరి. కాని పండించుటకగు ఖర్చు హెచ్చినదనియు, ధరలలో నిలకడలేదనియు గూడ నాతడు గమనించెను. ఈరెండు కారణములచేత కొంత తగ్గింపవలసియుండునని అంగీకరించుచు, 100 కి రు 33 లకు బదులు రు 25 లను మాత్రమే వసూలుచేయవచ్చుననెను. ఈయన 100 కి రు 25 లనే యేలసూచించవలెను? రు 20 లేక 15 లేక 10 రూపాయలనేల సూచింప

రాదు? ఇదియంతయు నూహాపైగావించిన పనియేగాని నిర్ణీతమగు లెక్కల ననుసరించి చేసిన పని గాదు."[1]

మదరాసు రాజధానియందలి ఉత్తరసర్కారుల సెటిలుమెంటు ఆఫీసరుయొక్క లెక్కలు గూడ బార్డోలీ లెక్కలవలె తప్పులతడిక యని ఋజువుపడెను. మదరాసు శాసనసభవారి తీర్మానానుసారము మదరాసు ప్రభుత్వమొక విచారణసంఘమును నియమించెను. ఈసంఘమునకు మదరాసు ప్రభుత్వమున ఇంజనీరుగా పనిజేసి ఫించను బుచ్చుకొని మదరాసు ప్రభుత్వపు మంత్రిగగూడ నుండిన కీర్తిశేషులైన దివాన్‌బహద్దూరు ఆరోగ్యస్వామి మొదలియారుగా రధ్యక్షులుగ నుండిరి. ఈయన డెల్టాజిల్లాలయందు ఎగ్జిక్యూటివు ఇంజనీరుగ చాలకాలము పనిచేసియుండిరి. ఈయనకు రైతుజీవితవిధానము కరతలామలకము. ఈయన సంఘసభ్యులతో కలిసి జిల్లాలయందు పర్యటన మొనరించెను. సెటిలుమెంటు ఆఫీసరు పరీక్షించిన గ్రామములను, మరికొన్ని గ్రామములను కూడ కలిపి పునర్విమర్శించిరి. రైతుల ఆర్థిక స్థితిని...పంటలు, పంటలకగుఖర్చు, గొడ్లు, గొడ్లకగుఖర్చు, మరమ్మతులు, మరమ్మతులకగు ఖర్చు, ఋణము మొదలయిన విషయముల నన్నింటిని సమగ్రముగ విచారించిరి. రైతుపై నధికపు పన్ను విధింపరాదని నిర్ణయించిరి. వీరినిర్ణయమును మదరాసు ప్రభుత్వము పెడచెవిని బెట్టెను. వీరి నివేదిక చిత్తుకాగితముల బుట్టలో త్రోసి వేయబడెను. 100 కి 18-8-0 చొ॥ అదనపు పన్ను విధింపబడెను. ఆరోగ్యస్వామి కమిటీవారు అదనపు పన్నును విధించుటను గురించి తమ నివేదికయందిట్లు వ్రాసిరి.

---

1. *From the Special Enquiry Report of Messrs. Broomfield and Maxwell. p.p. 25, 26 27, regarding Bardoli and Chorasi Taluqs resettlement,*

"వ్యవసాయమే చాలమంది ప్రజలకు ముఖ్యవృత్తి యగుటవలన హెచ్చుపన్నులను, రైతును క్రుంగదీయుపన్నులను గట్టుటవలన రైతులు కడుబీదవారై పోవు స్థితి దాపరించుచున్నది. వేరువృత్తి లేనందువలన పన్నులన్నియు చెల్లించుచున్నాడు. భూమిని విడుదలగూడ పెట్టుట లేదు. సర్ నారీమను మార్జోరిబాంక్సు గారు మదరాసు శాసనసభ యందు పన్నులనుగట్టుటను గురించి యిట్లుపన్యసించిరి. "భూమియందు పండు పంటలో ప్రభుత్వమువారొక భాగమును తీసికొనుట కధి కారము గలిగియున్నారను సిద్ధాంతమే భూమిసిస్తును నిర్ణయించుటలో మదరాసురాజధానియం దాచరింపబడుచున్నది. భూకామందుల పరి స్థితులననుసరించి భూమిసిస్తు కట్టబడుటలేదు. భాగ్యవంతుని భూమిని, బీదవాని భూమిని వేరుచేసి యోచించుటలేదు. భూమియొక్క పంట ననుసరించియే సిస్తువేయబడుచున్నది గాని, సిస్తుచెల్లించువానియొక్క పరిస్థితుల ననుసరించి సిస్తు నిర్ణయింపబడులేదు." 1

"ఈయుపన్యాసమే ప్రస్తుతభూమిసిస్తు విధానమునకు మూల ముగనున్నచో నీవిధానమునకంటె అనాగరకమైన(Barbarous) మరొక విధానము నూహించుటకూడ కష్టమే. ఏనాగరిక దేశమునందుగాని యిట్టివిధానమును నేటిప్రపంచమున సహింపజాలరు. నేడింకను నీదేశము నందుగల పురాతన భూమిసిస్తుపద్ధతు లితరదేశములలో రూపు మాసిపోయినవి. మానవత్వము గలిగిన ఏప్రభుత్వమైనను తాను ఎవ రిపై పన్నులను విధించుచుండెనో, వారి పరిస్థితులను విచారించవలెను. రవంతయు నోపజాలని బరువును వారిపై త్రోయజాలదు. పన్నులను గట్టు ఏవిధానమునందైనను పన్నులను చెల్లింపవలసినవారి శక్తిని గమ నింపవలెననుట ప్రాథమిక సిద్ధాంతము. హెచ్చుపన్నులను గట్టనిచో ప్రభుత్వమే రూపుమాసిపోవు విపరీతపరిస్థితులు సంభవించిననేకాని

1. (*From Sir Normın Marjoribanks's Speech in Madras Legislative Council on 20th Nov. 1928*)

పన్నుభారత్వమును పన్నులనుగట్టుటలో గమనింపవలసిన యాప్రాథమిక సూత్రమును త్రోసిపుచ్చనేరదు.

ఈపన్నులను గట్టు విధానము అభివృద్ధికరముగ లేకుండుటయే కాక వేరువిధముగగూడ నున్నది. ఈభారము దిగనాసిలుచున్న బీద రైతులను మరింత క్రుంగదీయుచున్నది. "తరుచు సర్వేచేయుట, సెటిలు మెంటుచేయుట వ్యవసాయార్థికస్థితిని కలచుచున్నవి....సంవత్సరముల కొలదిగ జరుగుచున్న యీసర్వేలు, సెటిలుమెంటులు అమితవ్యయము నకు కారణముగనున్నవి. ఇందువలన లాభముకంటె నష్టమే హెచ్చు. ఇందులకు సాలుసరి 36 లక్షలు వ్యయమగుచున్నది. కృష్ణా,గోదావరి, పశ్చిమగోదావరిజిల్లాలలో అదనముగ వసూలుచేయదలంచిన పన్నును వరుసగ నాలుగుసంవత్సరములు వసూలుచేయుచో వచ్చుమొత్తమునకే ఖర్చు సరిపోవుచున్నది. ఇందులకు రైతులు వేసికొనవలసిన సర్వేరాళ్ళ ఖరీదును, వేయుటకగు కూలియుగూడ యీవ్యయమునకు చేర్చవలసి యున్నది."[1] ఇట్టి సెటిలుమెంటులవలన రైతులెట్లు భయకంపితులై యుందురో ఊహింపగలము.

## 20. 1930 మొదలు ప్రస్తుత ఆర్థిక దుస్థితి-పన్ను భారము.

ఒకప్పుడు హెచ్చించిన పన్నులను, మరొకప్పుడు రైతు ఆర్థిక దుస్థితిలోబడి అల్లలాడుచున్నను తగ్గింపనైనవలదా? 1930 వ సంవత్స

1. *From Kistna, East and West Godavari Dts. Economic Enquiry Committee's Report P. 96.*

రమునుండియు పంటలధరలు పడిపోయినవి. పన్నులన్నో హెచ్చినవి. దేశమునందలి నలుమూలలనుండియు పన్నులను తగ్గింపవలెనను రైతుల ఘోష ప్రతిధ్వనించుచున్నది. శాసనసభ్యులు, పత్రికలు, ప్రజాసేవకులు రైతులను క్రుంగదీయుచున్న పన్నుభారమును తగ్గింపవలెనని ప్రభుత్వమువారికి మొరలిడుచున్నారు. కేంద్రప్రభుత్వ కార్యనిర్వాహక సభ్యుడగు సర్ ఫజ్లీహుస్సేనుగారు స్టేటుకౌన్సిలు సభలో (సెప్టెంబరు 5 వ తేదీ 1933) నుపన్యసించుచు వివిధరాష్ట్రములలో పన్నుభారమును తగ్గించుట కొనరింపబడిన ప్రయత్నముల నొకజాబితాగా వర్ణించిచెప్పెను. ఈజాబితావలన రైతులకు తగ్గిన పన్నుభారమెంత యనుప్రశ్నకు మదరాసు రాజధానియందలి ప్రభుత్వచర్యయే సమాధాన మొసంగగలదు.

"గతించిన నాలుగుసంవత్సరములనుంచియు, ధరలు క్రమక్రమముగ దిగజారినవి. రైతులయొద్ద వారిదివరలో జేసిన ఋణములపై వడ్డీతీర్చుటకైనను సొమ్ములేకపోయినది. భూమిపన్ను చెల్లించినపిమ్మట కుటుంబమును పోషించుటకు వలయునంతగూడ మిగులలేదు. క్రొత్తగ ఋణముపుట్టుటలేదు. పన్నులను చెల్లించుటకై భార్యలమెడలయందుగల నగలనూడబెఱికి అమ్మివేయుచున్నారు. రైతులఘోష వెంటనే పన్నును తగ్గించివేసినగాని తగ్గదు." అని మదరాసురాజధానియందలి ప్రముఖులందరు ప్రభుత్వమునకు రైతులమొరను పలుమార్లు సర్వవిధముల విన్నవించిరి. ప్రస్తుతమున్న భూమిపన్నులో 100కి రు 50 వంతున తగ్గించివేయవలెనని రైతులఘోష. ఇది సాధ్యముగాని పనియని ప్రభుత్వవాదము. మదరాసుప్రభుత్వమువారి ఆదాయవ్యయ శాసనమున ఆదాయముకంటె వ్యయమధికముగ లేకుండజూచుటయే కర్తవ్యమని ప్రభుత్వమువారి నిశ్చయము. ప్రభుత్వాదాయవ్యయ శాసనమున

తరుగులేకుండ జూచుట ప్రభుత్వమువారి ప్రాధమికవిధియేగాని ప్రజల ఆదాయవ్యయములలో వ్యయమే పన్నులమూలమున హెచ్చుచుండగ నెంతకాలము ప్రభుత్వాదాయ వ్యయములు సమముగ నుండగలవు? అనవసరపుఖర్చును, దుర్వ్యయమును తగ్గించి ప్రజలకు పన్నులను తగ్గించుట ప్రభుత్వవిధి. ఇది సాధ్యపడని పనిగాదు.

"1933-34 వ సంవత్సరము ముగియుసరికి మదరాసు ప్రభుత్వమునకు రు 27140 లక్షలు నిలువయుండును. ఈమొత్తముమాత్రమే గాక నిలువసొమ్ములోనుంచి మెట్టూరుప్రోజెక్టునకు 0.07 లక్షలు పెట్టుబడుల క్రింద వ్యయపరచుటకును, కావేరి-మెట్టూరుప్రోజెక్టుక్రింద ఖర్చుపెట్టుటకై రు 26.29 లక్షలును ప్రత్యేకింపబడినవి. అనగా 1933-34 వ సంవత్సరము ముగియుసరికి రు 297.76 లక్షల సొమ్ము నిలువయుండునని తేలును.

ఈ మొత్తముగాక 41 జలపాతోద్భవ విద్యుచ్ఛక్తి యంత్ర నిర్మాణములకును సాలుసరి ఆదాయమునుండి రు 35.77 లక్షలు ఖర్చు పెట్టదలంచిరి. ఈమొత్తమును అప్పుజేసి పెట్టుబడిపెట్టవలయునే కాని సాలుసరి ఆదాయమునుండి ఖర్చుపెట్టరాదు. 16 పల్లపుసాగు కట్టడములకు రు 21 లక్షలు సాలుసరి ఆదాయమునుండి ఖర్చుపెట్టబూనిరి. ఈ సొమ్ము గూడ అప్పుజేసియైన ఖర్చుపెట్టవలెను. లేదా క్షామ నివారణనిధిలో కనిష్టముగ నుండవలసిన రు 40 లక్షలకు మించి యుండిన సొమ్ములోనుంచి తీసియైన ఖర్చుపెట్టవలెను. ఈ రెండు మొత్తములను గూడ సాలుసరి నిలువకు జేర్చుచో మొత్తము రు 354.53 లక్షల నిలువ తేలును.

ముఖ్యమగు కట్టడములకు పెట్టుబడులకై పెట్టు ఖర్చును, సాలుసరి ఆదాయమునుండి ఖర్చుపెట్టుటకిది మొదటిసారి కాదు,

1930—31 వ సంవత్సరమునందుగూడ రు 53 లక్షలు ముఖ్యమగు
కట్టడములకై పెట్టుబడిపెట్టుటకుగాను (For Capital expenditure) నిలువ
సొమ్మునుండి (From balances) తీసికొనబడెను. ఇట్లొనరించుటయేకాక
సాలుసరి రాబడినుంచి, లేక, నిలువసొమ్మునుంచి ఋణములకు గడువు
పూర్తికాకపూర్వమే గూడ నిచ్చివేయుచున్నారు. 1929—30 వ సంవ
త్సరమున రు212 లక్షలును, 1930—31 వ సంవత్సరమున రు 67 లక్ష
లును మొత్తము రు279 లక్షలు రాష్ట్రీయఋణనిధికి (Provincial Loans
fund) జమకట్టబడెను. ఇదిసక్రమమైన ఆర్థికవిధానముకాదు. ఈవిధా
నమువలన, పన్నుల నిచ్చుకొనుచున్న రైతులు సంరక్షింపబడ
జాలరు. రైతు యీయగలదానికంటె నధికముగ వసూలుచేయుచు
నాసొమ్మును తక్కువవడ్డీమీదగల ఋణమును తీర్చుటకై వినియోగిం
చుట తగినపనియేనా? అనగా అధికపు వడ్డీలమీద ఋణముచేయుచు
రైతుబ్రతుకుటకై కొట్టుకొనుచున్నకాలమున ఋణముచేయుచు పన్నుల
నిచ్చుకొనుచున్న కాలమున ఋణముగూడ సామాన్యముగ లభింప
కున్న కాలమున అదనముగ రైతులయొద్ద వసూలుచేయుచు, తక్కువ
వడ్డీఋణములను గడువుకూడ సమీపించకపూర్వము తీర్చుచుండుట
సక్రమమైన ఆర్థికపద్ధతియేనా? ఈపద్ధతిని విరమించి, యిట్టివ్యయమును
ఋణముచేసికాని క్షామనివారణనిధినుండి గాని గైకొనియుండినచో
రు 334.53 లక్షలు నిలవ యుండును. ఈసొమ్మును పన్నును
తగ్గించుటకై వినియోగించుచో రు 1 కి 0—4—0 చొ॥ రెండు సంవత్స
రములు పన్నును తగ్గించుటకు వీలున్నది. (మదరాసురాజధానిలో
రైతువారిభూమిపై వచ్చుచుండిన ఆదాయము 6 కోట్లు) ఈరెండు
సంవత్సరములలోపుగ వ్యయమును కుంచించి రు 1 కి 0-8-0 ల వం
తున పన్నును తగ్గించివేయుటకు సావకాశములు గలవు”......

"1917-18 వ సంవత్సరమునందీ రాష్ట్రమున జీతబత్తెములకు రు 468.96 లక్షలు వినియోగింపబడెడివి. ఈమొత్తము 1925-26 వ సంవత్సరమునకు 762.63 లక్షలవఱకు పెరిగెను. పెన్షనులకు 1917-18లో 33.33 లక్షలు వినియోగింపబడుచుండెను. 1925-26 వ సంవత్సరమునకు 53.19 లక్షలవఱకు పెరిగెను. ఈదుర్భరవ్యయమును కనీసము 1917-18 వ సంవత్సరమునందు ఖర్చుపెట్టినంత మొత్తమునకైనను తగ్గింపవలయును. క్రొత్తగజేరు ఉద్యోగస్థులకు నిర్ణయింపబడిన జీతములనుకూడ తగ్గించవలయును. ఇట్లుతగ్గించుచో రాబోవు 5 సంవత్సరములలోను రు 100 కి 50 వంతున రైతులపైగల అధికపు పన్నును సగమువఱకు తగ్గింపగలము."[1]

నికరపుపంటలో సగము ప్రభుత్వమున కీయవలెనను పంపకమే రైతుల కరిష్టదాయకముగ నున్నది. తరములను నిర్ణయించుటలోగల లోపములును, నికరపుఆదాయమును నిర్ణయించుటలోగల లోటులును కలిసి, రైతులకష్టముల నినుమడింప జేయుచున్నవి. 100 కి రు 18-8-0 కంటె హెచ్చింపమని ప్రభుత్వము నిర్ణయించినను ఉన్నపన్నులనే చెల్లింపజాలనిరైతులు క్రొత్తపన్ను రవంతయైనను చెల్లింపజాలరుగదా!

1924-25 వ సంవత్సరమున నియమింపబడిన పన్నులవిచారణ సంఘమువారు (*Taxation Enquiry Committee*) భూమిసిస్తును సగమువఱకు తగ్గింపవలెననిరి. నికరపుఆదాయములో నాల్గవవంతుమాత్రమే

1. *From the Memorandum of Mr. Mahadeva Ghar to Madras Legislative Council Members.*

పన్నుక్రింద వసూలుచేయవగుననిరి. గోదావరి, కృష్ణా జిల్లాల ఆర్థిక విచారణసంఘమువారుగూడ నిట్లేవ్రాసిరి. కాని వీరిసూచనలు నిరాకరింపబడెను.

కొలదిగతగ్గించిన జీతములనుగూడ తిరిగి హెచ్చించుటయే సమంజసమని మదరాసు ప్రభుత్వము నిర్ణయించుకొనెను. అధికపుపన్నులను తగ్గించుటకుమారుగ, తగ్గించినజీతములను తిరిగి పూర్తిజేసెను. సెటిలుమెంటువలన హెచ్చించిన పన్నును వసూలుచేయకయుండినంత మాత్రమున అధికపుపన్నుల భారమునుండి రైతు సంరక్షింపబడుటలేదు. రాష్ట్రిమొత్తమున ప్రతిజిల్లాయందును పన్నులను సగమువఱకు తగ్గింపదగును.

హిందూదేశమొత్తమున రైతులఆర్థికస్థితిని వెంటనే విచారించి పన్నులను సగమువఱకు తగ్గించుటకు మార్గము లరయదగును.

ఈదిగువపట్టిక ననుసరించి 1 ఎకరము వ్యవసాయమునకగు ఖర్చును, అందువలన రైతునకువచ్చుచున్న రాబడియు గ్రహింపగలము. చామర్లకోటయందలి ప్రభుత్వమువారి పరిశోధనశాలయందు ఎ 1 కి రు 52-0-0ల పెట్టుబడి యగుచుండినటుల నీదిగువపట్టిక తెలుపుచున్నది. కృష్ణాగోదావరిజిల్లాల సెటిలుమెంటు ఆఫీసరుగారుకూడ ఎ 1 కి రు 35ల ఖర్చులగుననిరి. గవర్నమెంటువారి వ్యవసాయక్షేత్రములలో ఎ 1 కి రు 50 మొదలు రు 60 ల వఱకు నగునని సెటిలుమెంటు ఆఫీసరుగారంగీకరించిరి.[1] ఈఖర్చులలో కొన్నిఖర్చులు చేర్చలేదు.

---

1. *Vide Settlement Officer's Scheme Report P. 69.*

i

| పనివివరము | ఉపయోగించిన పశువుల జతలు | పనివాండ్ర సంఖ్య | | | మొత్తం ఖర్చు | | |
|---|---|---|---|---|---|---|---|
| | | పురుషులు | స్త్రీలు | బాలురు | రు | అ | పై |
| మూడుసార్లు దమ్ముచేసి నేల చదునుచేయుటకు. | | | | | | | |
| జత1 కి 1 రోజుకు రు 1—12—0 చొప్పున. | 5½ | 5⅓ | | | 12 | 0 | 0 |
| లంకలు తీయుటకు. | | 4 | | | 2 | 0 | 0 |
| ఎరువు, ఎరువువేయుట. | | | | | | | |
| 2 రాళ్లయెత్తు (రాయికి 56 పౌనులు) ఎముకలపొడి. | | | | | 4 | 8 | 0 |
| షుమారు 4 వేల పౌనుల పచ్చియెరువు. | | | | | 1 | 0 | 0 |
| ఎరువువేయుటకు కూలి. | | 1 | 1 | | 0 | 8 | 0 |
| విత్తనములు, విత్తనములు జల్లుటకు. | | | | | | | |
| విత్తనముల ఖరీదు కలుపుకొని 1 ఎకరమునకు సరిపడు ఆకు లేక నారు. | | | | | 5 | 4 | 0 |

| పనివివరము | ఉపయోగించిన పశువుల జతలు | పనివాండ్ర సంఖ్య | | | మొత్తం ఖర్చు | | |
|---|---|---|---|---|---|---|---|
| | | పురుషులు | స్త్రీలు | బాలురు | రు | అ | పై |
| ఆకు తీసికొనివెళ్ళుటకు, ఊడ్చుటకు. | | | 7 | 1 | 2 | 14 | 0 |
| తరువాత చేయవలసిన పనులు. | | | | | | | |
| కలుపు తీత వగైరా. | | | 9 | 1 | 1 | 14 | 0 |
| కలుపు యేరివేయుటకు. | | 2 | 4 | 1 | 1 | 8 | 0 |
| కోత వగైరా. | | | | | | | |
| కోత | | 6 | 4 | | 4 | 2 | 0 |
| కట్టివేత. | | 2 | 6 | | 3 | 2 | 0 |
| కుప్పలనూర్పిడికి. | 3¼ | 7 | 2 | 1 | 9 | 4 | 0 |
| చెరుగుట, తూయుట, సంచులలోపట్టుటవగైరాలకు. | | 7 | 4 | 1 | 4 | 0 | 0 |
| మొత్తము. | | | | | 52 | 0 | 0 |

*From Agricultural Research Station, Samalkot- Ref. No. 268/31 Dated 30-11-31.*

రాబడిని మదింపువేయుచో సగటున మంచిపొలమునకు ఎ 1 కి 11 బస్తాలకంటె పంటపండదు. బస్తా 1 కి నేటివెల (1933-34) సగటున రు 2-8-0 కంటె హెచ్చుగలేదు. పంటమీద ఆదాయము రు 27-8-0. గడ్డిమీద ఎ 1 కి మూడుబళ్ళగడ్డికి రు 3-0-0 లు కళ్ళములో అమ్మిన రాగలదు. అనగా మొత్తము అన్నివిధముల ఆదాయము ఎ 1 కి రు 30-8-0 రాగలదు.

| | | |
|---|---|---|
| ఎ 1 కి పన్నులుగాక ఖర్చు | రు 52—0—0 | (మేనేజిమెంటు ఖర్చులు చేరలేదు.) |
| ఎ 1 కి పన్నులు సగటు | 8—0—0 | |
| మొత్తము ఖర్చు | 60—0—0 | |
| ఎ 1 కి జమ- పంట, గడ్డి కలిపి | 30—8—0 | |
| సాలుసరి వచ్చుచున్న నష్టము | 29—8—0 | |

ఇట్లు నష్టమును భరించుచు గూడ రైతులేల వ్యవసాయమును జేయుచున్నారు? వేరువృత్తిలేదు. వ్యవసాయమునందలి పనులన్నియు రైతులే స్వయముగ నిర్వహించుకొనుచున్నందున అందలి కూలి వారికి ముట్టుచున్నది. పొరుగువానికి కూలిచేయుట కంటె తనకు తానే కూలిజేసికొని జీవించవలెనను పూర్వసాంప్రదాయము ననుసరించి భూమిని అంటిబెట్టుకొని ప్రాకులాడుచున్నాడు. ధర సగటున రు 5-0-0 లని మదించుకొనినను,జమకును ఖర్చునకును సరిపోవుచున్నది. పన్నులను ఇచ్చుటకు గూడ మిగులుటలేదు. కూలిరూపముగ లభించుచున్న దానినుండియు ఋణమును జేసియు, పన్నులనిచ్చుచున్నాడు. కష్టించిచేసిన కూలికిగూడ తగినంత పన్నులవలన మిగులుటలేదు. ఇది యతిశయోక్తి కాదు. పర్మనెంటుసెటిలుమెంటు గావించిన జమీందారులపై రుసుము హెచ్చించి ప్రభుత్వవ్యయమునకు దగు ధనము జమీందారులవలన సంపాదించుటకుమారుగా కష్టించి పనిచేయు రైతులనుండి యధికపు పన్నులు వసూలుచేయబడుచున్నవి. ఇందువలన రైతులకు భూమియందు, వ్యవసాయమునందు ఉత్సాహము, ప్రీతి, అభినివేశము క్రమక్రమముగ దగ్గిపోవుచున్నవి. దేశమునందు పన్నులు విధింపగల

పరిమాణమును మదింపువేయుట అత్యావసరము. అట్టిమదింపుపైన భూమిసిస్తు గూడ విధింపదగును. ఈ పరిమాణమును గమనింపకుండ అధికభారమును బలహీనులగు రైతులపై బలవంతముగ మోపుచుండుటచే రైతు దుర్భరభారము భరింపజాలక క్రుంగి పోవుచున్నాడు. ఈభారమును తొలగించుటకై చిరకాలమునుండి పలువురు పలువిధముల సూచనలు గావించిరి.

## 21. సూచనలు.

1. భూమిసిస్తువిధించుటలో చిన్నరైతునకును పెద్దరైతునకును నొక్కరీతిగ విధింపరాదు. కుటుంబపోషణకుజాలని యాదాయము వచ్చు రైతులపై పన్నును తీసివేయవలయును. కుటుంబ పోషణకు పోను నిలవయుండు రాబడులపై ఆదాయముననుసరించి పన్ను విధింపదగును. కుటుంబపోషణకు వలయు రాబడిని జీవితమునకు అవసరమైన వివిధవస్తుసముదాయముల ధరలననుసరించి అప్పుడప్పుడు నిర్ణయించుచుండదగును. కుటుంబపోషణకువలయు ఆదాయముయొక్క కనిష్టపరిమాణమును, గరిష్టపరిమాణమును గూడ నిర్ణయించుచో నగుటున పల్లెననుసరించియు, పట్టణము ననుసరించియు పన్నుగట్టదగిన ఆదాయమునునిర్ణయించుట సులభసాధ్యమగును. కుటుంబమును పోషించుటకువలయు ఆదాయము సర్వకాలములయందొకరీతిగనే యుండదు.

"1888-90 వ సంవత్సరములమధ్య అత్యల్పఅంతస్తుతో జీవించుటకుగాను కావలసిన వివరములను శ్రీనివాసరాఘవ అయ్యంగారి మదింపుల ననుసరించి గ్రహింపగలము.

నెల 1 కి బ్రాహ్మణులు మొదలగు పైకులములవారికి నెల 1 కి రు 3- 12-0 యును, కూలీలు మొదలగువారికి నెల 1 కి రు 1-12-6, తల 1 కి కోయంబుత్తూరు జిల్లాయందు ఖర్చుఅగుచుండెనని శ్రీనివాసరాఘవయ్యంగారు మదింపువేసిరి.

| 1 పైకులములకు. | | కూలీలకు. | | | |
|---|---|---|---|---|---|
| బియ్యము | 2—0—0 | చోళ్ళు | 1 | 0 | 0 |
| ఉప్పు | 0—1—6 | ఉలవలు లేక సెనగలు | 0 | 1 | 0 |
| పప్పు | 0—1—6 | ఉప్పు | 0 | 1 | 6 |
| మిరపకాయలు | 0—0—6 | మిరపకాయలు | 0 | 0 | 6 |
| చింతపండు | 0—1—0 | చిల్లరలు | 0 | 1 | 0 |
| మినుములు | 0—7—0 | కిరసనాయిలు | 0 | 1 | 6 |
| చల్ల | 0—2—6 | మంచినూనె | 0 | 2 | 0 |
| కిరసనాయిలు | 0—2—6 | చింతపండు | 0 | 0 | 6 |
| వంటచెరకు | 0—8—0 | పొగాకు, తమలపాకులు మొదలగునవి | 0 | 4 | 0 |
| మంచినూనె | 0—2—0 | | | | |
| కూరలు | 0—1—0 | | | | |
| మొత్తము | 3—11—6 | మొత్తము | 1 | 12 | 0 |

ఇందు బట్టలకగుఖర్చు చేర్చబడలేదు.

| | | | |
|---|---|---|---|
| "బళ్లారిజిల్లాలో కంబళీ, తలపాగా, రెండుకట్టుగుడ్డలు, చెప్పుల జతకు అగుఖరీదు. | 4 | 0 | 0 |
| కోయంబుత్తూరుజిల్లాలో చెప్పులు, బట్టలు. | 2 | 0 | 0 |
| కడపజిల్లాలో బట్టలకు. | 4 | 8 | 0 |
| సేలంజిల్లాలో బట్టకు రు 1-0-0, కంబళీ 0-14-0. మొత్తం | 1 | 14 | 0 |
| ఉత్తర ఆర్కాటు జిల్లాలో బట్టలకు. | 1 | 0 | 0" |

"ఈఅంకెల ననుసరించి పైకులములలో బట్టలకు సాలుసరి తల 1 కి రు 4–0–0 లును, కూలీలకు తల 1 కి సాలుసరి 2–0–0 ల వంతు నను మదింపువేయవచ్చును. అనగా కోయంబుత్తూరుజిల్లాలో పైతర గతుల ప్రజలకు తల 1 కి సాలుసరి కనీసము రు 48-10-0 లును, కూలీలకు తల 1 కి సాలుసరి రు 23–0–0 లును ఖర్చుఅగును."[2]

1. *From Mr. Srinivasa Raghavayyangar's Memorandum on the Progress of the Madras Presidency.*

2. *Quoted by Economic Enquiry Committee of Kistna, West Godavari and East Godavari Dts.*

[illegible] ఈదిగువపట్టికవలన 1929 వ సంవత్సరమున హీనముగ జీవించుటకెట్లు వ్యయమగుచున్నదియు తెలియుచున్నది.

| | 4 గురు గల కుటుంబములో 5 ఎకరము...లు, అంతకు తక్కువగను పల్లపుభూమి గల రైతునకగు ఖర్చు. | | | 4 గురు గల కుటుంబములో 5 ఎకరములు, లేక అంతకుతక్కువ మెరకపొలముగల రైతునకగుఖర్చు. | | |
|---|---|---|---|---|---|---|
| | బస్తాలు | రు | రు | బస్తాలు | రు | రు |
| ధాన్యాదులు | 20 | 120-0-0 | 120-0-0 | 22 | 132-0-0 | 132-0-0 |
| చింతపండు మొదలైనవి | | 20-0-0 | | | 20-0-0 | |
| కూరగాయలు | | 6-8-0 | | | 0-0-0 | |
| పప్పులు | | 12-0-0 | | | 6-0-0 | |
| నెయ్యి, చల్ల | | 12-0-0 | | | 8-0-0 | |
| నూనె, ఊరగాయలు | | 6-0-0 | 56-8-0 | | 4-0-0 | 38-0-0 |
| కిరసనాయిలు | | 6-0-0 | 6-0-0 | | 4-8-0 | 4-8-0 |
| నాలుగు కట్టుబట్టలు | | 8-0-0 | | | 6-0-0 | |
| రెండు షర్టులు | | 1-8-0 | | | 1-0-0 | |
| మూడు కండువాలు | | 4-8-0 | | | 3-12-0 | |
| నాలుగు కోకలు | | 14-0-0 | | 3 కోకలు | 10-0-0 | |
| ఆరు రవికలు | | 2-4-0 | | 6 రవికలు | 2-0-0 | |
| పోషింపబడువారు | | 10-0-0 | | | 8-0-0 | |
| పిల్లలు | | 8-0-0 | 48-4-0 | | 6-0-0 | 37-4-0 |
| చాకలి ఖర్చు | | 3-0-0 | | | 3-0-0 | |
| మంగలి | | 1-8-0 | | | 1-8-0 | |
| కుండలు | | 1-8-0 | | | 1-0-0 | |
| కుంకుడుకాయలు | | 1-8-0 | | | 1 0 0 | |
| | | 1-8-0 | | | 1 0 0 | |
| పండుగలు | | 1-8-0 | | | 1 0 0 | |
| ప్రయాణములు | | 1-8-0 | | | 0 8 0 | |
| మందుఖర్చు | | 2-0-0 | | | 1 0 0 | |
| కొబ్బరినూనె, ఆముదము | | 2-0-0 | | | 1 0 0 | |
| ఇంటిమరమ్మతులు | | 3-0-0 | | | 2 0 0 | |
| పొగాకు | | 12-0-0 | | | 12 0 0 | |
| | | | 31-0-0 | | | 25 0 0 |
| మొత్తము | | | 261-12-0 | | | 236 12 0 |
| పెద్దవారి 1కి | | | 65 7 0 | | | 59 3 0 |
| తల 1కి | | | 52 5 7 | | | 47 5 7 |

| | నలుగురుపెద్దవారుగల కుటుంబ ఖర్చు. డెల్టా | కృష్ణా జిలా | 100<br>తూర్పు గోదావరి | పశ్చిమ గోదావరి జిలా |
|---|---|---|---|---|
| 5 ఎకరములపల్లము లేక అంతకు తక్కువ లేక 10 ఎకరముల మెరక లేక అంతకుతక్కువ గలిగి యున్న వారు. | 261 4 0 | 63.2 | 85.5 | 74.7 |
| 15 ఎకరముల పల్లము లేక 20ఎకరముల మెరక గలిగియున్న వారు. | 340 0 0 | 29.0 | 9.3 | 19.4 |
| 25 ఎకరముల పల్లము లేక 40 ఎకరముల మెరక గలిగినవారు. | 400 0 0 | 7.8 | 5.2 | 6.9 |

ఈపట్టికలు కృష్ణా, గోదావరి, పశ్చిమగోదావరిజిల్లాల ఆర్థిక విచారణ సంఘమువారి నివేదికనుండి గ్రహింపబడినవి.[1]

ఈ రెండుపట్టికలవలన సగటున 1 కుటుంబము కనిష్టమగు అంతస్తుతో పోషింపబడుటకుగాను రు 350–0–0 లు అవసరమని తేలుచున్నది. అనగా సాలుసరి రు 350–0–0 లు ఆదాయము మిగులు భూములపై పన్నును కట్టరాదు.

2. ఆహారపదార్థముల పండించుభూములపై వర్తకమునకై పనికి వచ్చు పంటల పండించు భూములకంటె తక్కువపన్ను విధింపదగును. ఆహారపదార్థోత్పత్తి జీవితమునకు ప్రధానాంగము. తక్కువపన్ను విధించుటవలన అధికముగ నాహారపదార్థముల నుత్పత్తిజేయుటకు రైతులకు ప్రోత్సాహము లభించును.

3. ఎకరములవారీగ భూమిపన్ను విధింపరాదు. రైతునకుగల పొలమంతటిపైన ఆతనికిమిగులు ఆదాయముపై మాత్రమే ఆదాయపు

1. *See Economic Enquiry Committee Report P. 81 and 82.*

పన్నును విధింపవలెను. ఈఆదాయపుపన్ను నికరపుఆదాయములో నాల్గవవంతు ఆదాయమునకు మించనిరీతిగ వర్తకము, వడ్డీవ్యాపారము మొదలగు ఆదాయములపై పన్నువిధించురీతిగనే సాలుసరి విధించుచుండవలెను.

4. యుద్ధములు మొదలగు విపరీతపరిస్థితులు గలుగుచో మాత్రము పన్నును హెచ్చించుటకు ప్రభుత్వమునకు సంపూర్ణాధికారముండవలెను.

5. భూమియొక్క సగటువిలువనుబట్టి ఆవిలువపై కొంతపన్నును విధించుట. అనగా రు 2000 కిమ్మతుగల భూమిపై 100 కి 20 వంతున గట్టుచో రు 400 ఒకేసారి యిచ్చివేయవలసివచ్చును. ఇట్లు పన్నుగట్టిన భూములపై ఏవిధమగు పన్నులనుగాని కట్టరాదు.

ఇట్టిసూచనలే పలువురార్థికశాస్త్రవేత్తలు, పలువురు రాజకీయవేత్తలు, పలువురు ప్రభుత్వోద్యోగులు చేయుచున్నారు.

రైతు సుఖజీవనము జేయవలెనన్నచో, దేశమునందు వ్యవసాయాభివృద్ధి కావలెనన్నచో, భూమిసిస్తుసమస్య ప్రథమమున పరిష్కరించుట అత్యవసరము. ఈపరిష్కారమున ఆకలిబాధదీర్చుట ప్రధానాంగముగ నుండవలెను. మహాత్ముడు రెండవరౌండుటేబిలు సమావేశమునందు చెప్పినటుల, కలిమిలేముల మధ్యగల పరస్పర సంఘర్షణమునే భారతీయులు మొట్టమొదటగ నెదుర్కొనుట తప్పదు.[1]

ఇట్లెదుర్కొనుటలో ఈస్టిండియాకంపెనీ పరిపాలననాటినుండియు నేర్పరుపబడిన హక్కు బేహక్కులన్నియు విమర్శించుటయందన్యాయములేదు. భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడెనని చెప్పబడు భూములపైన సిస్తును పునర్విమర్శించునంతమాత్రమున దేశము

1. *Between haves and have nots—Mahatma Gandhi.*

నందలి యాకలిసమస్యను తీర్పజాలము. జమీందారులకు, పెద్దభూకా మందులకు గల భూములను ప్రభుత్వము స్వాధీనముజేసికొనవలయును. ధనరూపముగ ప్రతిఫలమునిచ్చియైన నీభూములను స్వాధీనముజేసికొని సేద్యగాండ్ర కొసంగవలయును. ఇట్లొనరించుటకు రాజకీయాధికారము సంపూర్ణముగ రైతులవశమును, కార్మికులవశమును గావలెను. జమీం దారుల పలుకుబడి నశింపవలెను. ఈపరిస్థితులింతలోరావు. ఈపరిణా మము గలుగువఱకు గత్యంతరమేమి?

# 22. ప్రభుత్వ వాగ్దానము.

జమీందారులనుండి భూమిని తీసికొనుట లేక శాశ్వతముగ నిర్ణయింపబడిన భూమిసిస్తును హెచ్చించుట చేయుచో, వాగ్దానభంగ మొనరించుట యగునని ప్రభుత్వము వాదించును. ఎప్పటికిని భూమి సిస్తు హెచ్చింపని పద్ధతిపై ఈస్టిండియాకంపెనీ జమీందారులతో గావించుకొనిన యొడంబడికలను ప్రభుత్వము మన్నింపజూచుటయం దాశ్చర్యము లేదు. కాని ప్రజాప్రభుత్వమునందు గూడ ఈస్టిండియా కంపెనీ గావించుకొనిన అక్రమపుటొడంబడికలు మన్నింపబడవలె ననుట న్యాయము కాజాలదు. అట్లు మన్నించుచో కంపెనీనాటి వర్తక ప్రభుత్వమునకును ప్రస్తుత నిరంకుశ ప్రభుత్వవిధానమునకును రానున్న ప్రజాప్రభుత్వమునకును వ్యత్యాసమేయుండదు. కంపెనీనాటి యొడంబడికలను మన్నించుట అసహజము. అక్రమము. అన్యాయము. ఆర్థికవినాశనకరము. భారతావని భవిష్యదార్థికాభివృద్ధికి భంగకర మగు కంపెనీనాటి యొడంబడికలను, ప్రస్తుత ప్రభుత్వవిధానమందు గావింపబడిన శాసనములను తలక్రిందులుగ మార్చివేయుటయం దవి నీతిలేదు, అన్యాయము లేదు. అట్లొనరించుటయే విధ్యుక్తధర్మము.

మదరాసు శాసనసభయందు ఎస్టేటులాండుయాక్టు చట్టమును 1933 వ సంవత్సరమున సవరించుచు 'భూమియందుగల హక్కులను' తొలగించు సూత్రిమును ప్రభుత్వమువారే అంగీకరించుట గమనింపదగిన విషయము. ఈనాముగ్రామములభూమియందు యీనాందారులకుగల సంపూర్ణపు హక్కును తొలగించు సవరణను ప్రభుత్వసభ్యుడే యుపపాదించెను. శాసనసభ్యు లామోదించిరి. పూర్వమెప్పుడో ఎవరివలననో ఒసంగబడిన హక్కులు 'శాశ్వత బ్రిహ్మకల్పముగ నుండ నవసరములే'దను సిద్ధాంతమును మదరాసు ప్రభుత్వమువారు ధృవపరచిరి. ఇది రానున్న కాలమునకు పునాది యనదగును.

# 23. కర్తవ్యము.

కాని యీధర్మనిర్వహణమున కొంతతడవు వేచియుండుట తప్పదు. అందుచే భూమిసిస్తు స్వరూపమునే మార్చివేయుట యుక్తము. బెంగాలునందు భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడిన కాలముననే దేశమందంతట భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడియున్నచో, దేశ మార్థికముగ శోషింపబడుట కవకాశము స్వల్పముగ నుండెడిది. రమేశచంద్రదత్తు నుడివినటుల రైతు పరాధీనస్థితికి బొల్పడియుండెడివాడు కాడు. నేడా పరిస్థితులు లేవు. నిరంకుశ ప్రభుత్వవిధానమునం దాచరింపవలసిన కార్యవిధానమునకును, ప్రజాప్రభుత్వమునం దాచరింపవలసిన కార్యవిధానమునకును బహు వ్యత్యాసముండును. లాభాలాభముల దృష్టితో పరీక్షించినను, భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయించుటయు, భూమిసిస్తును అప్పుడప్పుడు నిర్ణయించుచుండుటయు, నీరెండుపద్ధతులును ప్రజాప్రభుత్వమున దేశార్థికాభివృద్ధి కుపకరింపవు. ప్రజాప్రభుత్వమున రైతునకు, ప్రభు

త్వమునకు భేదభావము పనికిరాదు. రైతుల ఆర్థికాభివృద్ధియే దేశాభి వృద్ధికరము. అట్లే ప్రభుత్వార్థికాభివృద్ధియే దేశాభివృద్ధికరము. భూమిసిస్తును శాశ్వతముగ నిర్ణయించివేయుచో ప్రభుత్వాదాయము చెరువునందలి నీటివలె స్థంభించును. ప్రభుత్వాదాయము స్థంభించుచో, ప్రజోపయోగకర కార్యములకై వలయుధనము లభింపకపోవచ్చును. భూమిసిస్తు శాశ్వతముగ నిర్ణయింపబడక మార్పులకులోనగుచున్నచో, రైతుల జీవితవిధానము సముద్రతరంగములవలె లేచుచు, కూలుచు, ఆటుపోటుల పాలగుచుండును. వ్యవసాయమభివృద్ధి చేయుటకు రైతునకుత్సాహముండదు. అందుచే నీరెండుపద్ధతులను, వీడి మూడవపద్ధతి యోజింపదగును. వ్యవసాయాదాయముపై ప్రతి సాలున ఆదాయపుపన్ను విధించుచో శాశ్వత భూమిసిస్తు నిర్ణయపద్ధతి యందుగల దోషములును, అప్పుడప్పుడు భూమిసిస్తును నిర్ణయించుటలో గల దోషములును చాలవఱకు దగ్గింపగలము. జీవయాత్రకు సరిపడని పొలములుగల రైతులపై పన్ను తొలగించుటకిది మంచితోవ. పెద్ద భూకామందులనుండియు, జమీందారులనుండియు సరియగు నాదాయ మును రాబట్టుకొనుటకుకూడ నిదియే ప్రశస్థమగు మార్గము. భూమి సిస్తునువీడి యిట్లాదాయపుపన్ను విధించుటవలన ప్రభుత్వాదాయము కొరవడునని కొందఱందురు. తక్కువభూమి గల పట్టాలే హెచ్చుగ నుండుటచేత నీపట్టాలపై ఆదాయపుపన్ను విధించుటకు వీలుండనందున ప్రభుత్వాదాయమునందెంతయో నష్టముగలుగునని నేటి రాజకీయ వేత్తల భయము. ఈనష్టము జమీందారుల ఆదాయములపైన, పెద్ద భూకామందుల ఆదాయముపైన విధించు ఆదాయపుపన్ను వలన చాలవఱకు ముదరా రాగలదు.

జీవనోపాధికి మించిన యాదాయములపైన ప్రభుత్వవ్యయము నకు వలయునంతగ పన్నులను విధించుటయే కర్తవ్యము. జీవనోపాధికి

సరిపడని రాబడిగలవారిపై పన్నులను తొలగించుటయే ధర్మము. సంఘమునందలి ప్రతివ్యక్తియు ప్రభుత్వముచే సంరక్షింపబడుచున్నందున ప్రభుత్వపోషణకు కొంతపన్ను నిచ్చుకొనవలెనను సిద్ధాంతము నేడు రాద్ధాంతము చేయబడుచున్నది. ఈసిద్ధాంతము పాతగిలి త్రుప్పు పట్టినది. మన్నింపవీలులేదు. దురదృష్టవంతుడగు సోదర సాంఘికుని కొఱకై అదృష్టవంతుడగువాడు త్యాగమొనరింపవలెననియే నేటి ధర్మము. అదృష్ట దురదృష్టములు మానవకల్పితములేకాని భగవంతుని నియమముకాదు. ఈవిశ్వాసము ప్రబలుచున్న నీకాలమున నీ విశ్వాసమునకు రష్యావంటిదేశ మాదర్శముచూపుచున్న నీసమయమున బీదవాడైనను, ప్రతివ్యక్తియు పన్నుభారమును వహింపవలయుననుట విప్లవకారణమగును. ఈదృష్టితోనే భూమిసిస్తు సమస్య పరిష్కరింపదగును. స్థానికపరిపాలనకై సెస్సులను చిన్నపట్టాదారులపై విధించుచుండుటగూడ యోజింపదగును. వారసత్వపు హక్కుల వలన భూమి లభించునపుడు ఆస్తివిలువనుబట్టి కొంతరుసుము విధించుటయు గమనింపదగిన పద్ధతియే.

విదేశములలో పన్నులను విధించు పద్ధతులు.

విదేశములయందలి భూమిసిస్తు పద్ధతులను నాలుగు విధములుగ విభజింపవచ్చును.

(1) భూమియొక్క కిమ్మతు ననుసరించి కొంత మొత్తమును వసూలుచేయుట.

2. సంవత్సరాదాయముపై ఆదాయము ననుసరించి వ్యవసాయాదాయముతో గూడ కలిపి ఆదాయపు పన్నును విధించుట.

3. మరణానంతరపు పన్ను. (Death Duty). లేక మూలధనము (కిమ్మతుపై) పన్ను. కొన్నిచోట్ల రెండింటిపైన పన్నుకలదు.

4. స్థానికపరిపాలనకు పన్నువిధించుట.[1]

1. *From Taxation Enquiry Committee Report, Vol 1. P. 39*

ఫ్రాన్సుదేశమున ప్రత్యేకపు భూమిసిస్తు సంవత్సరపు కిమ్మతులో 100 కి పదివంతులు. ఇటలీయందు భూమిసిస్తు ప్రత్యేకముగ భూకామందున కిచ్చుదానిలో 100 కి పదివంతులు. (Economic Rent). హంగేరీయందు సంవత్సరాదాయమునందు 100 కి 8 మొదలు 12 వంతులవఱకు గలదు. జపానునందు మొత్తపుఖరీదులో 100 కి ఒకటిలో నాలుగవవంతు.

2. వ్యవసాయాదాయముకూడ ఆదాయపుపన్ను విధింపదగినది. ఇక్లే వ్యవసాయపు ఆస్తులపైనగూడ మరణానంతరపుపన్నులు విధింపబడుచుండెను.

3. సంవత్సరాదాయమునందు భూమిసిస్తుక్రింద హెచ్చుభాగము స్థానికపరిపాలనకై విధింపబడుచుండెను. ఆస్ట్రేలియాయందు భూమిసిస్తు స్థానికపరిపాలనకు ప్రత్యేకింపబడినది. ప్రష్యాయందు (Prussia) 1893 సంవత్సరముమొదలు 1923 వ సంవత్సరమువఱకు స్థానికపరిపాలనకొఱకే భూమిసిస్తు విధింపబడెను. 1923 వ సంవత్సరమునుండియుగూడ ప్రభుత్వము విధించు భూమిసిస్తునకంటె స్థానికపరిపాలనకై రెండింతల ధనముగ విధింపబడుచున్నది. ఇటలీయందు స్థానికపరిపాలనకై భూకామందుల కిచ్చుదానిలో 100 కి 15 వంతుల చొప్పున వసూలుచేయబడుచున్నది. ఇంగ్లండునందు స్థానికపరిపాలనకై మాత్రమే ప్రాముఖ్యముగ భూమిపై పన్నువిధింపబడుచున్నది. విదేశములయందు పన్నులనువిధించురీతు లిట్లున్నవని పన్నుల విచారణ సంఘమువారు వ్రాసిరి.[1]

విదేశములయందలి పన్నులవిధానమును మన పన్నులవిధానముతో బోల్చుకొనినపుడు విదేశపద్ధతుల నవలంబింపదలచునపుడు

1. *From the Taxation Enquiry Committee Report P 39.*

భారతదేశపు సగటాదాయము విదేశములతో పోల్చుచో నత్యల్ప మనియు భారతభూమియందు దరిద్రదేవత తాండవమాడుచున్న దనియు మననముజేయుట అత్యావసరము.

## 24. భూమికి హక్కుదారు లెవరు?

భూమియందు భూస్వామ్యపుహక్కు ప్రభుత్వమునకు గలదా? రైతునకుగలదా? హిందూ, మహమ్మదీయ యుగములలో భూస్వామ్యపుహక్కు రైతునకే కలదని పన్నులవిచారణసంఘమువారే వ్రాసిరి. ఆంగ్లేయయుగమునందీ భూస్వామ్యపుహక్కు ప్రభుత్వమునకు గలదనిరి. ఇట్లీహక్కును ప్రభుత్వము కోరుటవలన భూమిసిస్తునిర్ణయమునందు గలిగిన విపరీతపు మార్పులేమియు లేవు. ఈహక్కు రైతులదేయగుచో గలుగు ప్రత్యేకపు సౌకర్యములును గోచరింపవు. ఇది యొక సిద్ధాంతవిషయమా? ఎట్లున్నను ఆర్థికముగ ఆంగ్లేయ యుగమునందు ఫలితము లొక్కవిధముగనే యుండును. ప్రజాప్రభుత్వ యుగమున భూస్వామ్యపు హక్కు ప్రజాప్రభుత్వమే కలిగియుండుట సమంజసము. బీదసాదల మధ్య సామరస్యము కుదుర్చు నార్థికవిధాన మవలంబించుటకు భూస్వామ్యపుహక్కు ప్రజాప్రభుత్వము కలిగియుండుటయే సమంజసము. ప్రపంచ భవిష్యత్ పరివర్తనము ననుసరించవలెనని భూస్వామ్యపు హక్కు ప్రజాప్రభుత్వమే కలిగియుండవలెను. భూమిసిస్తు పన్నుగ పరిగణింపవలయునా? లేక అద్దె (Rent) గ పరిగణింపవలయునా? అను విషయముగూడ చర్చనీయాంశముకాదు. ఈరెంటికిని ఆచరణయందు విభేదస్వరూపములేదు. సిద్ధాంత చర్చయందు సాంకేతికవిభేదము మాత్రమే కలదు. భూస్వామ్యపుహక్కు ప్రభుత్వమునకే కలదని నిర్ణయింపబడుచో నీసాంకేతిక విభేదముగూడ సమసిపోవును.

# 25. జమీందారీ రైతు.

భూమిసిస్తు నిర్ణయింపబడిన జమీలలో రైతుల బాధ లమిత ముగనున్నవి. జమీందారులకు భూములయందుగల సర్వాధికారముల వలన వారియిష్టానుసారము పన్నుల హెచ్చించుటయు, అవి చెల్లింప జాలకపోవుచో నా రైతుల నాభూమినుండి తొలగించివేసి యితరుల కిచ్చుచున్నారు. చిరకాలమునుండి వ్యవసాయము జేయుచుండినను ఆ రైతులకా భూమియందు వ్యవసాయము జేసికొనుటకుగూడ హక్కు కలుగుటలేదు. 1859, 1885, 1907, 1928 వ సంవత్సరములలో వంగ దేశమునందు గావింపబడిన శాసనములు; మదరాసు, సంయుక్తరాష్ట్రములు మొదలగు నితరరాష్ట్రములలో నీమధ్య గావింపదలంచిన శాసనములు రైతునకువలయు హక్కుల నొసంగలేదు. ప్రభుత్వమునకును, రైతునకును ఉండవలసిన సంబంధమెట్లు నిర్ణయింపబడవలెనో, అట్లే జమీందారీరైతుల విషయమునగూడ శాసనమొనరించుట అత్యావసరము. శాసనరూపముగ జమీలను తీసివేయువఱకు జమీందారీ రైతును రైతువారీపద్ధతియందలి రైతువలెనే సర్వవిధముల సంరక్షించుట ప

జమీందారీరైతుల సంక్షోభ మధికమగుచున్నది. వివిధప దేశములయందు జమీందారీరైతులఘోష ప్రతిధ్వనించుచున్నది. ఈ ప్రతిధ్వనికి ఆంధ్రదేశమునందు గత నాలుగుసంవత్సరముల నుంచియు, జమీందారీ రైతులలో గలిగిన సంచలనమే తార్కాణము. ఆంధ్రదేశమునందు జమీందారీరైతులు సమావేశమై గావించుచున్న ముఖ్య తీర్మానముల గొన్నింటి నిట పేర్కొనదగును.

1. "ప్రస్తుతము రైతుసేద్యములో నున్న సేరీ, కమతము, పాతబంజరు, జమీందారు తనకృషిచే సాగులోనికి తెచ్చితినని చెప్పు

భూమి, లంక యిజారా భూములుసహా జమీన్దారీలోని యావత్తుభూమి యు నెట్టి నిబంధనలతో నిమిత్తములేకుండా రైతుభూమిగా నిర్వచింప బడవలెను.

2. ప్రస్తుతసిస్తులు హెచ్చుగానున్న చోటులనెల్ల రైతు యొక్క ఆర్థికస్థితిని పురస్కరించుకొని పునర్విమర్శనము చేయవలెను. అట్లు చేయుటలో ప్రస్తుతము దుస్సహములని తలపబడుచున్న రైత్వారీ రేట్లనైనను జమీందారీ సిస్తులు మించకుండా చూడవలెను.

3. జమీందారుకు సంబంధించినంతవరకు రెండవ పేరాలో చెప్పబడినప్రకారం సంస్కరింపబడిన రేట్లు ముందెన్నడును హెచ్చు చేయబడరాదు.

4. పంటనష్టములు మున్నగు ప్రమాదములు తటస్థించినపుడు కాపుచేయుట (Suspension ఆపియుంచుట) మాఫుచేయుటకు (Remission రిమిషన్) ఏర్పాటుండవలెను. ఈ యంశములో నిర్ణయాధికారము స్థానికప్రభుత్వము రివిన్యూఅధికారుల చేతులలో నుండవలెను. సదరు సూత్రములు రైతువారీ గ్రామములలోని రిమిషన్ సూత్రముల ననుసరించి యుండవలెను.

5. జమీందారీలలోని జలాశయములన్నియు సర్వేజేసి పరిశోధింపబడవలెను. 5 లేక 10 సం॥రములలో వీనినన్నిటిని తగుమరమ్మతు చేసి పునర్నిర్మాణము చేయగల విధానము తయారుకావలెను. ఇట్టిపని ముందు సూచింపబోవు ల్యాండుకోర్టువారు ప్రతిజమీందారీలోను జరిగించవలెను. ఇందులకగు ఖర్చులకుగాను ప్రతిజమీందారీలోను జమీందారుని ఆదాయమునుండి తగినంతసొమ్ము జలాశయ సంరక్షణ నిధి (Irrigation Sources Protection Fund) గా ప్రత్యేకింపబడవలెను. ఈ నిధినుండి యొక కేంద్ర జమీందారీ జలాశయ సంరక్షకనిధి

(Central Zamindari Irrigation Sources Protection Fund) రాష్ట్ర మొత్తముపై నేర్పడవలెను. ఈ కేంద్రనిధినుండి స్వల్పవడ్డీతో ఆయా జమీాందారులు పైపనులనిమిత్తము బదులు పుచ్చుకొనవచ్చును. ఈ యంశములన్నియు పల్లములోను, మెరకలోను మురుగుపారుదలకు కూడ వర్తించవలెను.

6. జమీాందారు తనసిస్తుబాకీనిగూర్చి న్యాయస్థానముద్వారా డిక్రీ పొందకుండగనే ఆస్తిని జప్తుచేయుటకు అవకాశము నిచ్చెడు ఎస్టేటుల్యాండుచట్టములోని ప్రస్తుతనిబంధనలు రద్దుకావలెను.

7. రైతులకు చిరకాలమునుండి అడవులు,కంచెలు,బంజరుభూములలోగల మేత, కట్టెలు, వ్యవసాయము, కలప, ఎరువు వగయిరాలకు గలహక్కు స్థిరపడవలెను. సదరుహక్కును పురస్కరించుకొని జమీాందారీ గ్రామములలో లంకలుసహా తగు గోభూములు ఏర్పడవలెను. ప్రస్తుతము పశువులమేతకుగాను రయితుల కుపయోగపడుచున్న అటవీ భాగములు గ్రామ పంచాయితీల పాలనలోనికి రావలెను. సదరు భూభాగములపై ప్రస్తుతమున్న ఫీజు ఫారెస్టు పంచాయితీలు గవర్నమెంటుకు చెల్లించు రేటుకంటె మించియుండరాదు.

8. పుంతలు లేక దారులు, డొంకలు, చెరువులు, కాలువలు, (గట్లు పడకలుసహా) మందబైళ్ళు, కళ్ళములు, రుద్రభూములు మున్నగు నిదివరలో నట్టియుపయోగములో నుండినట్టియు, ప్రస్తుత ముపయోగములో నున్నట్టియు, సాముదాయికప్రదేశములు అన్నియు నవి ఏవిధముగా పుట్టబడినను స్థానికసంస్థలపరము కావలెను.

9. జమీాందారీలోని ఆరణ్యాక, ఉదక, ఖనిజసంపద యావత్తు ప్రజాక్షేమము నిమిత్తము ప్రభుత్వపరము కావలెను.

10. జమీాందారునకు కావలసిన సాలుసరి గ్రామ డిమేండు

నుండి 1 కి 0-1-0 తక్కువగాని మొత్తము గ్రామక్షేమనిధిగా గ్రామ పంచాయితీల కివ్వబడవలెను.

11. రైతుసంఘము శాసనరీత్యా అంగీకరింపబడవలెను. ఈ లోపుగా ప్రతిజమీందారీలోను తిరుపతి దేవస్థానమునకువలె రైతు సలహాసంఘములను ప్రభుత్వము నియమింపవలెను.

12. ప్రతి జమీందారీలోను విధిగా సర్వేయయి హెచ్చు రేటు గలచోట (గవర్నమెంటుకంటె) సిస్తునిర్ణయము (సెటిల్‌మెంటు) జరుగవలెను. ప్రాతకొలతలకును, క్రొత్తగావచ్చిన సర్వేగొలుసునకు వచ్చిన కొలతభేదమువలన కనబడు ఏరియా లేక విస్తీర్ణజాస్తినిబట్టి (సరిహద్దులలో మార్పులు లేనప్పుడు) సిస్తులో మార్పుజరుగరాదు. అట్టిమార్పు సబబైనదని రైతు అందులకంగీకరించి యున్నాడనియు, నమ్ముటకు తగినంత సాక్ష్యము రుజువుచేయవలసిన భారము యీపరిస్థితులలో జమీందారుపై నుండవలెను.

13. జమీందారీభూమిని ట్రాన్సుఫరు పొందువారికి పూర్వపు బాకీలనుగూర్చి యెట్టి పేచీపూచీలు లేకుండునట్లు ఏర్పాటు గావింపబడవలెను.

14. ఏతరగతిభూమిపైనైనను నజరానా లుండరాదు.

15. సంచారముచేయు భూన్యాయస్థానములు (Land Courts) ఏర్పడి జమీందారునకు రైతునకుగల యావదంశములను పరిష్కరించు నధికారము వీరిపరము కావలెను. అట్టి న్యాయాధిపతికి న్యాయనిర్ణయములో సహాయముచేయుటకు రైతులనుండియు, జమీందారులనుండియు సమానముగా నెన్నుకొనబడిన అసెసర్లుండవలెను. జమీందారుకు, రైతులకు మధ్య జరుగు యావత్తుగ్రంథము రు 1 స్టాంపుకంటె అధికముగా నుండరాదు.

16. జమీందారులు శాసనసభలలో తమ ప్రత్యేకస్థానము లను వదలుకొననంతకాలము సామాన్య నియోజకవర్గములకు అభ్యర్థు లుగా నిలువబడరాదు.

17. జమీందారీలలో ప్రస్తుతము సొంతకమతములను పేరుతో అనేకస్థలములలో నధికభూభాగములు కలవు. ఇవన్నియు పై పేరునకు జమీందారే వ్యవసాయము చేయుచున్నట్లు కనబడుచున్నను క్రియలో రైతుసేవ్యములోనే యున్నవి. పైగా నిట్టి విశాలభూభారము సొంత కమతమను పేరుతో రైతు జిరాయితీ హెుద్దునుండి తప్పించుటకు చేసిన ఏర్పాటుగాని యీభూముల వ్యవసాయమునకు జీవనాధారముగా చేసికొనుటగాని లేక ఇందులో తగుపరిశోధనలు చేసి రైతులలో వ్యవ సాయాభివృద్ధిని ప్రచారముచేయుటకుగాని జమీందారుని నిజోద్దేశము కాదని తెలియుచున్నది. అట్టిస్థలములలో సీకమతము భూములన్నియు రైతుహెుద్దునకు మార్చి రైతుల కివ్వబడవలెను.”

ఇవి విపరీతమగు కోరికలు కావు. కాని శాసనసభలయందు జమీందారుల పలుకుబడి హెచ్చుగ నున్నంతకాలము రైతునకు కష్టములు గట్టెక్కవు. ఈకోరికలు ఫలింపవు.

## 26. విభాగములు, విఖండములు, అందువలన నష్టములు.

వ్యవసాయాభివృద్ధికి భూమి పలువురచే పంచుకొనబడుచుండుట ప్రతిబంధకముగ నున్నది. మన దేశమునందు అవిభక్తకుటుంబములు విభాగములగుచుండుటచే భూఆస్తి వివిధభాగములయి ఏభాగస్వామికి గాని వ్యవసాయమునకు చాలినంతగ వచ్చుటలేదు. హిందూకుటుంబ ములలో ప్రతిపురుషునకు భాగము కలదు. మహమ్మదీయ కుటుంబ

ములలో స్త్రీలకు గూడ మూడవవంతు భాగమున్నది. బర్మాదేశ మందలి కొన్ని తెగలలో స్త్రీపురుషాదులకు సమానభాగములు గలవు. ఇట్లు సమానభాగములను పంచుకొను వారసత్వపు హక్కులవలన భాగ్య భోగ్యము లెల్లరకు సమానమగుచుండుటకు వీలుగ నుండును. కాని జనసంఖ్య యభివృద్ధియైన కొలదియు భూములు విడిపోయి కనిష్టాహారము గూడ లభింపని స్థితిగలుగును. కనీసమొక జతయెడ్లకైనను సాలీనా పనియుండునంతటి భూమి కూడ రైతునకు లేక విడిపోవుట వలన వ్యవసాయాభివృద్ధి కాజాలదు. ఈస్థితియే నేడుభారతదేశమునందు ప్రబలియున్నది. అందుచే కుటుంబజీవనము జరుగక రైతుల భూముల తాకట్టుపై ధనాఢ్యులకడనుండి ఋణముల దెచ్చుచున్నారు. కొలది కాలములోనే యీ రైతుభూమి యాధనాఢ్యుని వశమగుచున్నది. ఇట్లు భారతదేశమునందు 800 కోట్ల అప్పు రైతులకు గలదని అంచనా వేయబడెను. ఈ యప్పులవలన వ్యవసాయకుని చేతినుండి యేనాడు ధనాఢ్యుని చేతికి భూమి మారుచున్నదో ఆనాటినుండియు వ్యవసాయకునికా భూమియందునగాని, వ్యవసాయమునందున గాని యభివృద్ధి లేకపోవుట సహజము. అందుచే వ్యవసాయాభివృద్ధి నిరోధింప బడుచున్నది. భూమియం దధికారములేక వ్యవసాయము మాత్రమే కూలిపనిగ చేయుచున్నపుడు భూమిని బాగుచేయవలెనను దీక్షగాని యభిమతముగాని లేకపోవుటయం దాశ్చర్యములేదు. భూమి విభాగములను గురించి డాక్టరు హెరాల్డుమాను (Mann) గారు వివరించిరి. దక్కనునందు ప్రతిగ్రామమున రైతు ఒకటికి 1771 వ సంవత్సరమునందు 40 ఎకరముల వ్యవసాయపు భూమి కలిగియుండెడివాడు. 1818 వచ్చుసరికి రైతు 1 కి 17½ ఎకరములకును 1820 లో 14 ఎకరములును 1915 వచ్చుసరికి 7 ఎకరములకును తగ్గిపోయినది. ఈనాడు రైతు 1 కి 5 ఎకరములకంటె తక్కువగనుండును.

## మదరాసురాజధానియందు1330వ ఫసలీ లేక 1920-21వ సంవత్సరమున గల భూముల పట్టాదారుల వివరములను దెలుపు పట్టిక

| వివరము | ప్రత్యేకపుపట్టా. | | | | ఉమ్మడిపట్టా. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పట్టాల సంఖ్య | పట్టాలకుగల భూమిపరిమితి | | సిస్తు | పట్టాల సంఖ్య | వాటాదారుల సంఖ్య | పట్టాలకు గల భూ పరిమితి | | సిస్తు |
| | | మెరక | పల్లం | | | | మెరక | పల్లం | |
| | | ఎకరములు | | రు | | | ఎకరములు | | రు |
| రు 1 సిస్తు లేక అంతకంటె తక్కువ చెల్లించవలసిన పట్టాలు | 508620 | 290719 | 19423 | 312815 | 377491 | 1246576 | 176582 | 11836 | 200277 |
| 10 లేక అంతకంటె తక్కువ, రు 1 కంటె యెక్కువ | 1679176 | 4553830 | 511848 | 7056929 | 926440 | 2925695 | 3085823 | 210530 | 4015228 |
| 30 ,, 10 ,, | 574975 | 3519924 | 841583 | 8916101 | 376492 | 1317197 | 2857253 | 387678 | 5516161 |
| 50 ,, 30 ,, | 140892 | 1323786 | 481494 | 4590551 | 84944 | 314596 | 976507 | 229080 | 2698245 |
| 100 ,, 50 ,, | 83940 | 1126599 | 573167 | 4913746 | 45718 | 188439 | 740411 | 261949 | 2716976 |
| 250 ,, 100 ,, | 33298 | 757043 | 568210 | 4511975 | 16455 | 72772 | 482565 | 215185 | 2070659 |
| 500 ,, 250 ,, | 6761 | 300283 | 292188 | 2188249 | 2715 | 12947 | 141887 | 84226 | 793170 |
| 1000 ,, 500 ,, | 2143 | 244415 | 197296 | 1374866 | 738 | 4078 | 76196 | 48969 | 431285 |
| 1000 లకు పైన | 782 | 228375 | 195298 | 1259372 | 170 | 2591 | 78182 | 35724 | 287981 |
| మొత్తము | 3030582 | 12345979 | 3674952 | 35119604 | 1831168 | 6084886 | 8615356 | 1485127 | 18724982 |

(ఉమ్మడిపట్టాలు, ప్రత్యేకపుపట్టాలు కలిసిన మొత్తం 4861745.)

(మొత్తపు సిస్తు రు 53844586.)

[1] మదరాసు రాజధానియందు 1335 వ ఫసలీ లేక 1925-26 వ సంవత్సరమునగల పట్టాదారుల సంఖ్యయు, వారు చెల్లించు సిస్తులను దెలుపు పట్టిక.

| వివరములు | ప్రత్యేకపు పట్టాలు. | | | | ఉమ్మడి పట్టాలు. | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | పట్టాల సంఖ్య | పట్టాలకుగల భూమిపరిమితి | | సిస్తు | పట్టాల సంఖ్య | పట్టాదారుల సంఖ్య | పట్టాలకు గల భూమిపరిమితి | | సిస్తు |
| | | మెరక | పల్లం | | | | మెరక | పల్లం | |
| | | ఎకరములు | | రు | | | ఎకరములు | | రు |
| రు 1 అంతకు తక్కువ సిస్తు చెల్లించు పట్టాలు | 615262 | 338607 | 26051 | 371630 | 471096 | 1780692 | 220799 | 17162 | 265067 |
| 10 లేక 1 తక్కువ | 1890396 | 4861046 | 553049 | 7768341 | 1046605 | 3382964 | 3315074 | 268960 | 4477139 |
| 30 ,, 10 ,, | 617098 | 3563563 | 860852 | 9466741 | 370458 | 1308109 | 2703038 | 433323 | 5737531 |
| 50 ,, 30 ,, | 144721 | 1346680 | 489830 | 4952134 | 77588 | 299910 | 919119 | 247539 | 2621425 |
| 100 ,, 50 ,, | 83230 | 1152873 | 574439 | 5211883 | 39339 | 158472 | 658289 | 238268 | 2449674 |
| 250 ,, 100 ,, | 32335 | 769968 | 561147 | 4628286 | 13460 | 63818 | 426192 | 205295 | 1858620 |
| 500 ,, 250 ,, | 7042 | 333989 | 292702 | 2256905 | 2402 | 12049 | 133338 | 83512 | 724413 |
| 1000 ,, 500 ,, | 2404 | 214760 | 203413 | 1492572 | 588 | 3966 | 63797 | 43900 | 375597 |
| 1000 లకు పైన | 862 | 256717 | 203033 | 1489496 | 189 | 2438 | 62908 | 36960 | 314228 |
| మొత్తం. | 3393845 | 12838198 | 3764516 | 37687988 | 2021670 | 7012418 | 8502549 | 1574919 | 18823694 |

(ఉమ్మడిపట్టాలు, ప్రత్యేకపుపట్టాలు కలిపి మొత్తం 5415515.) (మొత్తపుసిస్తు రు 56461682 లు.)

*1. From Royal Commission on Agriculture in India Vol III.*

ఈపట్టికల రెంటివలన 5 సంవత్సరముల కాలములో భూమి యెట్లు విఖండములైనదో తెలిసికొనగలము. 1921 వ సంవత్సరమున గల మొత్తపు పట్టాలు 4861745. 1925 వ సంవత్సరమున 5415515 వఱకు పెరిగినవి. ఈపట్టాలు మాత్రమే విభాగములనియు, విఖండములనియు తలంపరాదు. ఒక్కొక్క పట్టాదారుడు గ్రామములో నలుమూలల చిన్నచిన్న ఖండికలను గలిగియుండును. 1921 లో పైఅంకెల ననుసరించి మదరాసు రాజధానిలో పట్టా 1 కి సగటున ఎ 5-37 లును, 1925–26 లో ఎ 4-93 లును గలిగియుండెను. పట్టాయందు చేరియున్న ఖండములను గుర్తింపగలుగుచో, భూమి యెట్లు భిన్నభిన్నములైనదియు సుబోధకమగును.

ఈదిగువ పట్టికలవలన కృష్ణా, గోదావరి, పశ్చిమగోదావరి జిల్లాలలో భూమి ఎట్లు విఖండములై యున్నదియు తెలిసికొనగలము. (Fragmentation of Holdings).

## —♦ కృష్ణా జిల్లా ♦—

| | పట్టాదారుల సంఖ్య | 100 కి ఎంతమంది | పరిమిత ఎకరములు | 100 కి గల ఎకరముల పరిమితి |
|---|---|---|---|---|
| 1 ఎకరము-అంతకు తక్కువ | 766 | 23.3 | 354.95 | 1.4 |
| 5 ఎ॥ అంతకుతక్కువ, 1 ఎ॥ కంటె హెచ్చు | 1311 | 39.9 | 3512.28 | 13.8 |
| 10 ఎ॥ ,, 5 ఎ॥ ,, | 581 | 17.7 | 4184.12 | 16.5 |
| 15 ,, ,, 10 ,, ,, | 222 | 6.7 | 4162.49 | 16.4 |
| 20 ,, ,, 15 ,, ,, | 153 | 4.7 | 2681.64 | 10.5 |
| 25 ,, ,, 20 ,, ,, | 80 | 2.4 | 1782.46 | 7.0 |
| 30 ,, ,, 25 ,, ,, | 42 | 1.3 | 1180.98 | 4.7 |
| 50 ,, ,, 30 ,, ,, | 91 | 2.8 | 4394.73 | 17.3 |
| 80 ,, ,, 50 ,, ,, | 23 | 0.7 | 1347.34 | 5.3 |
| 80 ,, పైగ | 18 | 0.5 | 1791.23 | 7.1 |

## తూర్పు గోదావరి జిల్లా

| | పట్టాదారుల సంఖ్య | 100 కి ఎంతమంది | పరిమితి ఎకరములు | 100 కి గల ఎకరముల పరిమితి |
|---|---|---|---|---|
| 1 ఎకరము-అంతకు తక్కువ | 2274 | 46.0 | 1081.37 | 7.1 |
| 5 ఎ॥ అంతకు తక్కువ 1 ఎ॥ కంటె హెచ్చు | 1950 | 39.5 | 4337.41 | 28.7 |
| 10 ఎ॥ ,, 5 ఎ॥ ,, | 373 | 7.6 | 2481.08 | 16.4 |
| 15 ,, ,, 10 ,, ,, | 132 | 2.7 | 1666.55 | 10.9 |
| 20 ,, ,, 15 ,, ,, | 57 | 1.2 | 988.70 | 6.5 |
| 25 ,, ,, 20 ,, ,, | 35 | 0.7 | 761.79 | 5.0 |
| 30 ,, ,, 25 ,, ,, | 68 | 1.4 | 628.76 | 4.2 |
| 50 ,, ,, 30 ,, ,, | 29 | 0.6 | 1072.74 | 7.1 |
| 80 ,, ,, 50 ,, ,, | 7 | 0.1 | 458.94 | 3.0 |
| 80 ,, పైగ | 13 | 0.2 | 1644.45 | 10.9 |

## పశ్చిమ గోదావ

| | పట్టాదారుల సంఖ్య | 100 కి ఎంతమంది | మితి ఎకరములు | 100 కి గల ఎకరముల పరిమితి |
|---|---|---|---|---|
| 1 ఎకరము-అంతకు తక్కువ | 321 | 24.3 | 147.21 | 1.3 |
| 5 ఎ॥ అంతకు తక్కువ 1 ఎ॥ కంటె హెచ్చు | 518 | 39.1 | 1257.60 | 11.4 |
| 10 ఎ॥ ... 5 ఎ॥ ... | 208 | 15.3 | 1430.93 | 13.0 |
| 15 ... ... 10 ... ... | 93 | 7.1 | 1129.09 | 10.3 |
| 20 ... ... 15 ... ... | 47 | 3.5 | 776.07 | 7.1 |
| 25 ... ... 20 ... ... | 37 | 2.8 | 791.75 | 7.2 |
| 30 ... ... 25 ... ... | 20 | 1.5 | 573.77 | 5.2 |
| 50 ... ... 30 ... ... | 45 | 3.4 | 1680.43 | 15.3 |
| 80 ... ... 50 ... ... | 29 | 2.0 | 1577.58 | 14.4 |
| 80 ... పైగ | 13 | 1.0 | 1521.01 | 13.9 |

—♦ మూడు జిల్లాలకు మొత్తం ♦—

| | పట్టాదారుల సంఖ్య | 100 కి ఎంతమంది | పరిమితి ఎకరములు | 100 కి గల ఎకరముల పరిమితి |
|---|---|---|---|---|
| 1 ఎకరము అంతకు తక్కువ | 3361 | 35.2 | 1583.53 | 3.0 |
| 5 ఎ॥ అంతకు తక్కువ 1 ఎ॥ కంటె హెచ్చు | 3799 | 39.6 | 9107.29 | 17.9 |
| 10 ఎ॥ ... 5 ఎ॥ ... | 1157 | 12.1 | 8096.08 | 15.8 |
| 15 ... ... 10 ... ... | 447 | 4.7 | 6958.13 | 13.5 |
| 20 ... ... 15 ... ... | 257 | 2.7 | 4441.41 | 8.6 |
| 25 ... ... 20 ... ... | 152 | 1.6 | 3336.00 | 6.5 |
| 30 ... ... 25 ... ... | 130 | 1.4 | 2383.51 | 4.6 |
| 50 ... ... 30 ... ... | 165 | 1.7 | 7147.90 | 13.8 |
| 80 ... ... 50 ... ... | 57 | 0.6 | 3383.86 | 6.6 |
| 80 ... పైగ | 44 | 0.4 | 4956.69 | 9.7 |

1921 వ సంవత్సరపు జనాభాలెక్కల ననుసరించి ఆయా రాష్ట్రములయందు వ్యవసాయదారు 1 కి సగటున భూమియిట్లుగలదు.

| రాష్ట్రము | ఎకరములు | రాష్ట్రము | ఎకరములు |
|---|---|---|---|
| బొంబాయి | 12.2 | బీహారు, ఒరిస్సా | 3.1 |
| పంజాబు | 9 2 | అస్సాము | 3.0 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 8.5 | సంయుక్తరాష్ట్రములు | 2.5 |
| బర్మా | 5.6 | | |
| మదరాసు | 4.9 | | |
| బెంగాలు | 3.1 | | |

*From Economic Enquiry Committee Report. Appendix No. 7 Vol III.*

1931 వ సంవత్సరపు జనాభాలెక్కల నివేదికయందిట్లు వ్రాయబడెను.

"సాగుబడియగుచున్న భూమిపరిమితిని, వ్యవసాయముచేయుచున్న వారిసంఖ్యను పోల్చిచూచినచో సగటున వ్యవసాయదారు 1 కి య 2-9 సెంట్లు సాగుబడిభూమి వచ్చును. ఇందు ఎ 0-65 సెంట్లు మాత్రమే పల్లపు సాగుభూమి కలదు."[1]

ఈచిన్న ఖండముల భూమితో రైతు కుటుంబపోషణ మొనరించుకొనుట యెట్లు? అధికపుపన్నుల నిచ్చుటెట్లు? భూమిపై పెట్టుబడి పెట్టుచు బాగుచేయుట యెట్లు? అందుచే విస్తారముగ భూమి దరిద్ర దేవత వాతబడియున్న రైతులచే వ్యవసాయము చేయబడుచున్నది. ఇందులకుతోడుగ భూమిపంపకమున మంచిచెడ్డల ననుసరించి చీలికలు క్రింద తెగగొట్టబడుచున్నవి. (Fragmentation). ఒక్కొక్క ఖండము నందు ఎంతమంది పంచుకొనవలసివచ్చుచో అంతమంది యన్ని భాగములక్రింద నాఖండమునే విఖండములుగ చీల్చుకొనుచున్నారు. వ్యవసాయము చేసికొనుటకు రైతునకు సులువు దప్పుచున్నది. విభాగములు, విఖండములు జరుగకుండ నిషేధింపవలెననిన వారసత్వపు హక్కులకు వ్యతిరేకమగును. వారసత్వపు హక్కులకు వ్యతిరేకము గాని పద్ధతిని వ్యవసాయమున కనువుగ విభాగ విఖండముల నిషేధించుచు రెంటికిని పరస్పర వైషమ్యముగాని శాసనములు గావించుటకు వీలులేదు. పంజాబు దేశమునందువలె (కోఆపరేటివు) సహకారసంఘములను స్థాపించి యీచిన్నచిన్న చీలికల నేకమొనరించుటకు ప్రయత్నించుట సమంజసమని కొందఱి తలంపు. 3 సంవత్సరములలో 133 సంఘములిందుల కేర్పరుపబడి 35000 విఖండములను 4500 ఖండములుగ నొనరింపగలిగిరి.

---

1. *From Census Report P. 288.*

"మొదటి 5 సంవత్సరములలోను యె 39757 లు కలుపబడినవి. 6 వ సంవత్సరమున 20000 లు కలుపబడినవి. 1926 లో 38000 ఎకరములు కలుపబడినవి. ఇట్లు కలుపుటకుగాను 8 గురు ఇన్స్పెక్టర్లును, 85 మంది సబుఇన స్పెక్టరులును నియోగింపబడిరి. గతసంవత్సరమిట్లుకలుపుటకు 1 లక్షరూపాయలుమాత్రమే ఖర్చు. అనగా యె 1 కి రు 1-6-0 లు మొదలు రు 2-11-0 ల వఱకుమాత్రమే సగటున ఖర్చు తేలినది. ఈవిధానము కొనసాగి అనుభవము సంపాదించినకొలదియు ఖర్చుకూడ తగ్గగలదు. 1927 వ సం॥ జూలై వఱకు 98000 ఎకరములు కలిపివేయబడినవి. 314 గ్రామములలో నీపని కొనసాగినది. 133000 విఖండములు కలిపి యీవిఖండములు 25300 భాగములుగ నొనరింపబడినవి. ఈభాగములు సగటున యె 0-70 ట్లు పరిమితినుండి ఎ 3-80 సెంట్లు పరిమితివఱకు పెంపబడెను.

ఈ మార్పులవలన ఎవరును తమకుగల భూమిపరిమితిని కోల్పోలేదు. విఖండములను కలుపుటకు పూర్వముగల పరిమితికి యెవరికిని తక్కువరాలేదు. చిన్న చిన్న ఖండములు గలవారిని తొలగించివేయలేదు. నిర్బంధింపబడలేదు. లాభాలాభముల ననుసరించి రైతులకు నచ్చజెప్పబడి ఖండములు కలుపబడెను.[1]

ఈపద్ధతి యుపయుక్తముగనే యున్నది. కాని ఈపద్ధతి విభాగములనుగూడ కలుపుట కుపయోగపడదు.

ఇందులకు తోడు భూమికలిగియుండి వ్యవసాయము జేసికొనువారికంటె వేరు వృత్తిలేక వ్యవసాయమునకు దిగువారధికముగ నున్నారు. పంజాబులో 100 కి 22.5 మంది సగటునే ఒక్క ఎకరము అంతకంటె తక్కువ పొలమును వ్యవసాయము జేయుచున్నారు.

---

1. *Agricultural Journal of India March 1927, by C. F Strickland, I. C. S.*

100 కి 15.4 మంది ఒకటి లేక 2½ ఎకరముల భూమిని, 100 కి 17.9 మంది 2½ ఎకరములు లేక 5 ఎకరముల వ్యవసాయమును, 100 కి 20.5 మంది 5 లేక పది ఎకరములను వ్యవసాయము జేయుచున్నారు.

ఈవిభాగ విఖండముల సమస్య భూస్వామ్యపుహక్కు గలవారి యందు(Right holders) గలదు. (అనగా భూమియందు వంశపరంపరముగవచ్చు హక్కును గలిగియున్న వారు)- వీరు భూకామందులు గావచ్చును. జరాయితీహక్కును పొందినవారు గావచ్చును. వ్యవసాయ దారులయందు (Cultivators) గూడ నీవిభాగ విఖండ సమస్య గలదు. (అనగా భూకామందుగగాని జిరాయితీదారుగ గాని వ్యవసాయము చేయువారియందు) ఈ రెండు తెగలవారియందును గల విభాగవిఖండ సమస్యలకు తారతమ్యమేమియు లేదు. కారణ నివారణోపాయములు రెండును గూడ సమానములే.

మధ్యరాష్ట్రముల విఖండములను కలుపుశాసనము.

మధ్యరాష్ట్రములయందు(Central Provinces) భూవిఖండ ములను గలుపుటకు ప్రయత్నించుచున్నారు. ఇక్కడ పంజాబునందువలె సహకార పరపతిసంఘముల మూల మున కలుపుటకు ప్రయత్నింపబడుటలేదు. పంజాబు నందు భూమియొక్క మంచిచెడుగులు కొంచెమించు మించుగ సమానముగనున్నవి. అందుచే విఖండముల గలుపుటకును మార్చుటకును వీలుగలిగెను. మధ్యరాష్ట్రములయందు భూముల తర ములయందు, మంచిచెడుగులయందు, హక్కుబేహక్కులయందు విశేష క్లిష్టపరిస్థితులుండుటచే శాసనమొనరింపవలసి వచ్చెను. 1928 వ సంవ త్సరమున మధ్యరాష్ట్రముల శాసనసభ విఖండములను గలుపు శాసన మొనరించెను.(The Central Provinces Consolidation of Holdings Act). ఈశాసనమును చెటిసుగరా డివిజనునకు మొట్టమొదట వర్తింపజేసిరి.

(Chhattisgarh). ఈశాసనము ననుసరించి యొక యుద్యోగి నియమింపబడెను. ఈశాసనము ననుసరించిన విధానమునుబట్టి ఏగ్రామమందైన కొంత నిర్ణీతమగు భూమిని కలిగియున్న (భూమిహక్కుతో గూడ) యే యిద్దరుగాని, కొందరుగాని తమవిఖండములను గలుపవలెనని ప్రభుత్వోద్యోగిని కోరవచ్చును. కాని శాశ్వతహక్కు గలవారిలో సగమునకు తక్కువగానిమంది ఆగ్రామభూమిలో మూడింటరెండువంతుల భూమిని కలిగియున్నవారు ప్రభుత్వోద్యోగి నిర్ణయము నంగీకరింపనియెడల నీశాసనమమలులోనికి రాదు. అంగీకరించుచో మాత్రము మిగిలినవారు కూడ నంగీకరించితీరవలయునను నియమము కలదు. ఇట్లంగీకరింపబడిన నిర్ణయము నెవరుగాని సివిలుకోర్టుల మూలమున ప్రతిఘటించుటకు హక్కులేదు. ఈ నిర్ణయము వంశపరంపరగ నమలునందుండును. ఈయుద్యోగి నిర్ణయము సెటిలుమెంటు కమీషనరుగారి యంగీకారమును మాత్రము బొందవలయును. రాష్ట్రప్రభుత్వమునకు గూడ మార్చుట కధికారము కలదు. ఈవిధానము బాగుగనే యున్నదని వ్యవసాయ విచారణ సంఘమువారి నిశ్చయము.[1]

బొంబాయి విఖండములను గలుపు శాసనము.

బొంబాయిరాజధానియందు విఖండములను గలుపుటకు 1927 వ సంవత్సరమున శాసనసభ యందొక చట్టము ప్రవేశపెట్టబడెను.

చట్టము ననుసరించి లాభకరముగ వ్యవసాయము చేయుటకనువగు భూపరిమితిని మొట్టమొదట నిర్ణయింపవలసియున్నది. ఈనిర్ణయమునకంటె తక్కువ పరిమితిగల ఖండములన్నియు విఖండములుగ ప్రకటింపబడును. ఇట్లు ప్రకటింపబడిన పిమ్మట ఆ విఖండములు మరెవరికిని అమ్ముటకు వీలులేదు. ఆవిఖండములకు చేరియున్న భూస్వామికి లేక వ్యవసాయదారునకు విఖండములను కలుపుటకు

1. *Agricultural Commission Report para 125.*

మాత్రమే (అమ్ముటకుగాని, మార్చుటకుగాని) శాసనమంగీకరించును. మూడింట రెండువంతులమంది విఖండములను గలిగియున్న వారును మొత్తపుభూమిలో సగమున కధికారము గలిగియున్న వారును ఏగ్రామమునందైన విఖండములను గలుపుట కంగీకరించుచు కలెక్టరుగారికి నివేదించుకొనిన పిమ్మట నీపనికై ప్రత్యేకోద్యోగి నియమింపబడును. ఈయుద్యోగికి గ్రామప్రతినిధుల ముగ్వురతో గూడి నొకవిధానమును తయారుజేయుటకు శాసనమునం దధికారము గలదు. ఈబిల్లు సెలెక్టు కమిటీకి పంపబడి 1928 వ సంవత్సరము మేనెలయందు శాసనసభవారి విచారణకు మరల వచ్చెను. ప్రజాప్రతినిధు లనబడువారీ చట్టమును జూచి యనవసరముగ భయభ్రాంతులైరి. ఆమోదింపబడదేమో యను భయముచే నుపసంహరించుకొనబడెను.

# 27. విదేశములయందలి విఖండములను కలుపు ఉదాహరణము.

ఈ విఖండముల సమస్య భారతవర్షమునందుమాత్రమే గలదని యూహింపరాదు. విదేశములయందుగూడ గలదు. విదేశములవారు విఖండములను గలుపుటకు శాసనము లొనరించుకొనిరి. విఖండములు గాకుండ నిరోధించుకొనుటకుగూడ శాసనములొనరింపబడెను. ఫ్రాన్సు, స్విజర్లాండు, బెల్జియము, జర్మనీ, డెన్మార్కు, జపాను, స్వీడను మొదలగు దేశములయం దవలంబించిన పద్ధతులను 5 విధములుగ విభజింపవచ్చును.

1. "శాసనరూపమగు నధికారమున, విఖండములనుగలిగియున్న వారి భూస్వామ్యమును తొలగించివేయుట—

2. శాసనరూపమగు నధికారమున, ఏకొలదిమంది భూస్వాముల కోటికమీదనో, లేక తమంతటతామో ప్రభుత్వములే విఖండములను స్వాధీనపరచుకొని, కలిపివేయుట.

3. భూమిని వారసత్వపు హక్కుల ననుసరించి విఖండములుగ పంచుకొనుటను శాసనరూపముగ నిషేధించుట.

4. అప్పులకొఱకై భూములను స్వాధీనపరచుకొనుటకు వీలులేని శాసన మొనరించుట.

5. ఒకపరికలిపి బాగుచేయబడిన భాగమును మరల యితరవిఖండములతో కలిసిపోకుండ నిషేధించుట."[1]

స్వీడనునందు కుటుంబమునందుగలవారందఱు భూమినిపంచుకొనుటకు వీలులేనిశాసనము లొనరింపబడెను. కుటుంబమునందలి భూమి యొసంగబడనివారికి ఇతరవిధములగు ముదరా యొసంగబడుచున్నది. ఇట్లే హిందూదేశమందునగూడ అన్నదమ్ములందఱకు భూమిని పంచిపెట్ట నవసరములేని అవిభాజ్యపుహక్కునొసంగుశాసనములొనరించుచో విఖండములు కాకుండ నుండునని కొందఱి యూహ. శ్రీయుత బసవర్సు రామచంద్రరావుగారు వెల్‌ఫేరు పత్రికయందిట్లే 1926 వ సంవత్సరమున వ్రాసిరి.[2]

వ్యవసాయ విచారణసంఘ నివేదికయందునగూడ విఖండములగుటకు వీలుకలిగింపని నిషేధశాసనములను జాకరూకతతో గావించుట అవసరమని వ్రాయబడెను. కొన్నిజమీందారీలవలె భూమి అవిభాజ్యముగ నుండవలెనను శాసనముల నేడు మనము గావించుకొనినంత మాత్రమున విఖండముల సమస్య పరిష్కరింపబడదు. ప్రస్తుతమున్న

---

1. *Keatinge Rural Economy in the Bombay Daccan p.p. 52-3*
2. *The future of Agricultural Industry 1926 May-1927 June "Welfare"*

విఖండములను కలుపుటకుగూడ శాసనము లొనరించుకొనవలసి వచ్చును.

రైతులసమ్మతిపై విఖండములను గలుపుటకు సాధ్యముగాదని అనుభవజ్ఞులు దలంచుచున్నారు. పంజాబునం దవలంబించుచున్న విధానము సంపూర్ణముగ కొనసాగలేదు. ఈవిధానమును ఇతరరాష్ట్రములు అనుసరింపలేదు. సంయుక్తరాష్ట్రముల శాసనముగూడ ఆచరణయం దుపయోగకరముగలేదు. పంజాబునందు విఖండముల సమస్యపై కృషిసలుపుచున్న కాల్వెర్టుగారు (H. Calvert), డార్లింగుగారు (M. L. Darling), స్టికులాండుగారు(C. F. Stickland)మువ్వురును విఖండ సమస్యను పరిష్కరించుటకు తీవ్రమగు శాసనములు గావలెనని వ్యవసాయ విచారణసంఘమువారి యెదుట సాక్ష్యమొసంగిరి. "రైతుల సహకారముతో గూడిన శాసనములొనరింపబడినవి. అవి (Permissive Legislation) నిరుపయోగములైనవి." అనిగూడ వీరుచెప్పిరి. బరోడా యందుగూడ రైతులసహకారముపై నాధారపడుచు విఖండములను కలుపుటకనువగు శాసనము లొనరింపబడినవి. కాని యీశాసనములు నిష్ప్రయోజనము లైనవని సర్. మనూభాయి మేహతాగారు ప్రకటించిరి.[1]

ఈజిప్టుదేశమున వారసులు భూమినిపంచుకొనినను, వ్యవసాయముమాత్రము కుటుంబమునందొక్కడే అందరిపక్షమున చేయుచుండును. లేక అందరిపక్షమున మరొకధర్మకర్తకు (Trustee) వ్యవసాయము చేయుట కిచ్చివేసెదరు. ఈపద్ధతిని హిందూదేశమునందుగూడ అవలంబింపదగునని కొందఱిసూచన.

1. *Sir. Manubhai Metha's Presidential Address 1926 to Bombay Provincial Co-operative Conference.*

# 28. విభాగ విఖండముల వలన గలుగు లాభములు.

ఈసూచనల ననుసరించి విఖండములను కలుపుట అత్యావసరము కాదని తలంచువారుగూడ కలరు. విఖండములవలన కొన్నిలాభము లున్నవి. కొన్నికొన్ని పరిస్థితులలో విఖండములుండుటయే రైతున కార్థికముగ లాభకరము. వివిధతరగతుల భూములలో కొంతకొంత భూమిని కలిగియుండుటవలన కాలముననుసరించి కలుగు నష్టములు అన్నిఖండములకు గలుగకుండ నుండుటకు వీలుగలదు. కొన్నిఖండ ముల పంట పోయినను, మరికొన్నిఖండములయందైనను లభించును. పల్లపుసాగుబడిగల డెల్టాజిల్లాలయందొక గ్రామపుభూమి మూడుపంట కాలువలక్రింద గలదు. ఇందేపంటకాలువక్రిందనైన భూమియంత యును గలిగియుండుట రైతునకు లాభకరముకాదు. ఒకకాలువక్రింద భూమికి నీరుయెక్కుట సులభము. మరొకకాలువక్రింద భూమి సారము గలదగుటచే పంటహెచ్చు. మూడవకాలువక్రిందభూమి ఊరునకు సమీపము. రైతునకు వ్యవసాయపుహంగు హెచ్చు. పెంటజేసికొనుట సులభము. ఇందేకాలువక్రింద భూమియు, రైతువిడుచుట లాభకరము కాజాలదు. అన్నికాలువలక్రిందను భూమిని గలిగియుండుటయే అత నికి లాభకరము. ఇట్లే మెరకపంటగల భూములలో రైతు భూసారము ననుసరించి వేరువేరుపైరులను వేయుచుండును. మెరకసాగు రైతునకు రెండుమూడు చోట్ల భూమియున్నచో, రెండుమూడురకముల పైరులను వేయును. ఒకపైరు పాడయిపోయినను, వేరొకభాగమునందలి పైరయి నను ఆతనికి దక్కును.

"హిందూదేశమునందనేక ప్రదేశములలో రెండుమూడు రక ముల పంటలు వేరువేరు భూములలో వేయబడుచున్నవి. కాలమానము

ననుసరించి ఒకపంట ఒకభూమిలో పాడయినను మరొకభూమినుండి వేరొకపంటవలననైన రైతునకు ప్రతిఫలము వచ్చుచున్నది. పాశ్చాత్య దేశముల వ్యవసాయమువలె గాక, పంటలను మార్చుచు, సేద్యము చేయుటకు విభాగములు, విఖండములు, వేరువేరుచోట్ల నుండుట వలననే భారతదేశమునందు వీలగుచున్నది.''అని రాధాకమల ముఖర్జీ గారి నిర్ణయము.[1]

ఈవాదమునందెంతయో సత్యమున్నది. విభాగ విఖండముల సమస్య పరిష్కరించునపుడే విషయము గుర్తించు టత్యవసరము. మఱియు, పెద్దకమతములవలన సంఘమునకు కలుగులాభనష్టములను చిన్నకమతములవలన సంఘమునకుకలుగు లాభనష్టములనుగూడ గమనింపవలెను. ఒకప్పుడు వ్యక్తికి లాభకరమగు విషయము సంఘమునకు గూడ లాభకరము కాకపోవచ్చును.

<u>పెద్ద కమతములు</u> వ్యవసాయముచేయుట కనువుగనున్నను, వ్యవసాయమునందు ఖర్చును క్లుప్తపరచుటకు వీలైనను, విశేషధన మొక్కరికే సంక్రమించుటచే వారు దానధర్మాదులను విరివిగచేయుటకు సావకాశము గలించుచున్నను, సంఘదృక్పథమున లాభకరము కాదు. ఇందువలన ధనాఢ్యకోటి ప్రబలుదురు. సంఘాదాయమంతయు గొందఱివశమే యగుచుండును.

<u>చిన్నకమతములు</u> వ్యవసాయముచేయుటకు కష్టముగనుండును. అధికశ్రమ, స్వల్పఫలితము లభించుచుండును. ఖర్చులుగూడ హెచ్చుగ నుండును. అందఱకు సామాన్య అంతస్తు మాత్రమే లభించును. అత్యధిక అంతస్తు లభించదు. కాని సంఘమునందు భాగ్యము కొంతవరకైన చిన్నకమతముల వలన వ్యాప్తిజెందగలదు. ధనాఢ్యులకును, కడుబీదల

1. *Radha Kamal Mukerji's article on Fractionalization, April 1927, Indian Journal of Economics.*

కును మధ్యగ నొక మధ్యశ్రేణి ప్రజలుండుటకు వీలగును. పొలము స్వల్పముగనుండుటచే విశేషకృషి జేయుటకు వీలగును. ఖండక్షేత్రముల సేవ్యము వలన కాయకష్టమునందు, ఆరోగ్యమునందు, స్వచ్ఛంద జీవనమునందు అలవాటుపడు పల్లెటూరు జాతి సాంప్రదాయ మేర్పడ గలదు. ధనాఢ్యుల నిరంకుశమునకు విశేషప్రజ లోనుగా నవసరము కలుగదు. ఇందువలన సంఘమునందొక విధమగు సుస్థిరత్వ మేర్పడ గలదు. ఇట్టి లాభముల వలన విభాగవిఖండములు కూడ సమర్థింప బడుచున్నవి. ప్రస్తుత శాసనముల ననుసరించియు సంఘార్థిక వ్యవస్థ ననుసరించియు ఇంగ్లండునందువలె పెద్దకమతములు హిందూదేశమునం దేర్పరచుట తగనిదని యని కొందఱి విశ్వాసము.

# 29. ఒకరైతు కుటుంబమున కెంత భూమి కావలయును?

చిన్నకమతములు ఆర్థికాభివృద్ధికరము కాదనుటయందు మరొక విషయము గమనింపవలసియున్నది. ఎంతభూమి రైతుకుటుంబమున కవసరము? ఎంతకమతము సేవ్యము చేయుటయం దనవసరవ్యయ ముండదు? తక్కువ వ్యయప్రయాసలతో నొక రైతుకుటుంబము సేవ్యము చేసికొని సుఖజీవనము గడుపుట కెంత కమతము కావలసి యుండునను విషయము నిర్ణయించుట కష్టము. అన్నిరాష్ట్రముల యందున, అన్నిదేశములయందున నొకేరీతిగ నీ పరిమాణమును నిర్ణ యింపజాలము. ఈ నిర్ణయమునందు గమనింపదగు విషయము లేమి?

1. ఏప్రదేశమున రైతుకుటుంబమునకు వలయు భూమిని మనము నిర్ణయించుచున్నామో, ఆప్రదేశమున పెట్టుబడి విరివిగను

చౌకగను లభించుచున్నదా? లేదా? యనువిషయము గమనింపవలసి యున్నది.

2. వ్యవసాయముచేయు పద్ధతులు గుర్తింపవలసియున్నవి.

3. వ్యవసాయము పెద్దకమతముగ చేయబడుచున్నదా? లేక చిన్నకమతముగ చేయబడుచున్నదా?

4. భూమియందు సారము గలదా? లేదా?

5. వ్యవసాయము చేయుటకు వలయు నీటివసతులు కలవా? లేవా?

6. ఎట్టిపంటలు పండింపబడుచున్నవి? ఆహారపదార్థములా? లేక వర్తకపుదినుసులా?

ఇట్టివిషయములు గమనించిగాని, రైతుకుటుంబమున కెంత భూమి కావలెననుసమస్య నిర్ణయింపజాలము. ఇవియన్నియు గ్రహించి నిర్ణయింపవలసివచ్చుచో, హిందూదేశమున గ్రామమునకు గ్రామమునకుకూడ వ్యత్యాసము లుండును. ఒకజిల్లాకును, మరియొకజిల్లాకును; ఒకరాష్ట్రమునకును, మరియొకరాష్ట్రమునకును విభేదములుండుటయం దాశ్చర్యములేదు.

"దక్కనునందు రైతుకుటుంబము 1 కి 40 లేక 50 ఎకరముల మంచిభూమి ఒకేకమతముగ ఒకపెద్దబావి గలిగియు పొలమునందే యిల్లుకట్టబడియు నున్నచో సరిపడును. సూరతుజిల్లాయందు మూడు ఎకరముల తోటయున్నచో ఆతోటయజమాని సుఖజీవనము చేయగలడు. డక్కను మెరకభూములు 30 ఎకరములున్నను చాలదు." అని కెయిటింజిగారి యభిప్రాయము.[1]

---

1. *Rural Economy in Bombay Daccan p. p. 52-3 by Mr Keatinge.*

సంయుక్తరాష్ట్రములలో రైతుకుటుంబము 1 కి 30 ఎకరము లున్నచో, ఆదర్శప్రాయముగ నుండునని స్టాన్లీజీవాన్సుగారు నుడివిరి. ఈమదింపులలో రైతునకుండవలసిన కనిష్టమగు అంతస్తును గొందఱు గుర్తించిరి. ఉత్తమఅంతస్తును మరికొందఱు గుర్తించిరి. అంతస్తునిర్ణయించుటలో శీతోష్ణస్థితులు, భూమిసారము మొదలగు పైనవివరింప బడిన విషయములను మాత్రమే కాక, ఆయాప్రదేశములయందలి ఆచార వ్యవహారములను పరిశ్రమాభివృద్ధులనుగమనింపవలసియున్నది. ఇవిగూడ గమనించుచో, భారతదేశమునందు నిర్ణయింపదగు అంతస్తునకును విదేశములయందు నిర్ణయింపబడు అంతస్తునకును వ్యత్యాస ముండును.

"పంజాబులో సట్లెజునదీడెల్టాలో 8 ఎకరముల సాగుబడిభూమి యొకకుటుంబమును పోషింపగలదు. బికనీరు రాజ్యమున పొలిమేరలలో వర్షమేమియు నుండదు. సంవత్సరమునకు పదిపన్నెండు దుక్కుల వర్షముగూడ నుండదు. ఒక్కొక్కప్పుడు అయిదారుదుక్కుల వర్షము మాత్రమే యుండును. అందువలన అక్కడ కుటుంబపోషణకు 92 ఎకరములభూమి కావలసివచ్చుచున్నది.

ఐరోపాలోని ఇటలీ, ఫ్రాన్సు, బెల్జియం మున్నగు దేశముల లోని వ్యవసాయము మూడువిధములుగ విభజింపవచ్చును.

(1) కూరలు, పండ్లు-నిమ్మ, ద్రాక్ష వగయిరా, జరీబుతోటలు (2) అపరములు—గోధుమ వగయిరాలు (3) సామాన్యసాగుబడి భూములు, అని మూడు విధములు.

కూరలుపండించు జరీబుతోటలు పట్టణమునకుగాని, ఒకబజారు నకుగాని సమీపముగనుండును. సామాన్యముగ రెండు ఎకరములు జరీబుతోటలో కూరగాయలు ప్రతిసంవత్సరమున ఆరేడు రకములుగ

వేసికొని ఏడారుగురుగల తనకుటుంబమును పోషించుకొనుచున్నాడు. నేపిల్సు,ప్యారిసు నగరములచుట్టును నిట్టితోటలే విస్తారముగగలవు. ఒక నగరముచుట్టును పది పది హేనువందల కుటుంబములు జీవించుచున్నవి. ద్రాక్షా, ఆలివు, నిమ్మ, బంగాళాదుంప, పొగాకు, నారింజ వగయిరా నాలుగయిదు ఎకరముల విస్తీర్ణముగల తోటలమీదనే ఒక కుటుంబము జీవింపగలుగుచున్నది.

గోధుమ వగయిరా అపరములు పండించువారికి 10 లేక 12 ఎకరముల భూమి కావలసివచ్చుచున్నది. తదితర వ్యవసాయమునకు, పశువులమేతకు 25 లేక 50 ఎకరములభూమి కావలసివచ్చుచున్నది.

అపరదినుసులు పండించుచోట ముఖ్యముగ జర్మనీలో 10 లేక 12 ఎకరముల భూమి కావలసివచ్చుచున్నది. దక్షిణజర్మనీలో 12½ ఎకరముల భూమిమీద నొకకుటుంబము సుఖజీవనము చేయగలుగుచున్నది. అనగ ఆరైతు పశువృద్ధియు, మేకలు, పందులు, కోళ్లు గలిగియుండి వీటికృషి వీటివలన గలుగు ఫలితము వ్యవసాయ ఫలసాయమునకు తోడుగ నుండును. భూమి బలపడుచుండును. 2 ఎకరముల మేర గోధుమ పండించును. రెండు ఎకరములు పచ్చిక బీడుగ నుండును. కొద్దిభూమిలో పొగాకు వేయును. మరికొంతలో ఫలవృక్షములు వగయిరాలు పెంచును.

హాలెండు దేశమున పందులు, కోళ్లు, పశువులు గలిగి వ్యవసాయము చేయుచున్నవాడు 7½ ఎకరముల మీదనే జీవించుచున్నాడు. 10 ఎకరములున్నచో మిగుల్చుకొన గలుగుచున్నాడు. వీరందరు భూమిని బాగుగ బలముజేసి పంటలు పండించుకొందురు.

ఇంగ్లాండు దేశమున కుటుంబవ్యయము కొంత యధికముగ నుండును. వారి అంతస్తు హెచ్చు. అందుచే అచ్చట పదిఎకరములకు

తక్కువ వ్యవసాయము చేసిన గిట్టుబడియే యుండదు. ఆక్సుఫర్డు, యార్కుషైరు ప్రాంతములలో పాతిక ముప్పది ఎకరముల వ్యవసాయము చేసినచో నితర పరిశ్రమల యాధారములేక రైతు తన్ను బోషించుకొనగలడు.

యూరపుఖండమునం దే దేశమున జూచినను, 2 ఎకరముల కూరతోటల భూమివలన లేక, 7, 8 ఎకరముల గోధుమ మొదలగు అపరముల భూమివలన, లేక 25 మొదలు 30 ఎకరముల సాగుబడి భూమివలన కుటుంబపోషణ జరుగుచున్నది.

మన దేశమునం దెట్లున్నది ? పంజాబు విషయముల గొన్నింటిని పరిశీలించెదము. పంజాబులో 1¼ ఎకరము మొదలు రెండు ఎకరముల న్నర విస్తీర్ణముగల తోటలమీద పెక్కు వ్యవసాయ కుటుంబములు జీవించుచున్నవి. ఒక కుటుంబములో నొకముసలివాడు, తన కుమారుడు, యిద్దరు స్త్రీలు, ముగ్గురు పిల్లలును గలరు. ఒక కాడి దున్నలు, ఒక గాడిద కలవు. ఈకుటుంబము అరఎకరము లోపుగ గల భూమిని దున్నుకొని కాలక్షేపముచేయుట తా నెరుంగుదునని పంజాబు సహకార సంఘముల రిజిష్ట్రారగు డార్లింగుగారు చెప్పుచున్నారు.

ముసలివాడు దున్నలతో పొలముదున్నును. మోటలాగుటకు వానినే యుపయోగించును. పడుచువాడు పండినకూరగాయలను గాడిద మీద వేసికొని బస్తీకిగొనిపోయి అమ్ముకొనివచ్చును. పంజాబులో మరియొక గ్రామమున ఒకడు తాను, తనభార్య, నలుగురుపిల్లలును గల కుటుంబమును ముప్పాతిక ఎకరము మాత్రమేగల జరీబుతోటలో కూరలుపండించి పోషణ మొనర్చుచున్నాడు. ఆతడు బావిక్రింద వ్యవసాయము చేయుచున్నాడు. కూరలు, మొక్కజొన్న, సస్యపుపొగాకు పండించుచుండును. పొడుముపొగాకున కక్కడ విలువ యెక్కువ,

పంజాబులోని పట్టణముల సమీపమున పాడుముపాగాకు అంత మంచిదికాదు. అందుచే రెండుఎకరముల తోటమీదగాని జీవింపలేకున్నాడు. సియల్‌కోట ప్రాంతమున ఒకఎకరము తోటమీదనే కుటుంబపోషణ మొనర్పగలుగుచున్నారు. పంజాబులో పల్లపుసాగు చేయువారికి కుటుంబపోషణకు సుమారు 15 ఎకరములు మొదల్లు 30 ఎకరములవఱకు కావలసివచ్చుచున్నది. ఆమాత్రపు విస్తీర్ణము లేనియెడల కుటుంబమును పోషించుట కష్టము.[1]

## 30. సమిష్టి వ్యవసాయము.

ఈపై విషయములన్నియు గమనించినపిమ్మట తేలిన సారాంశము లేమి?

1. విఖండములను గలిపినంత మాత్రమున రైతునకు నూతన సౌఖ్యలోకము సిద్ధింపదు. కలుపకపోయినచో నష్టముగలుగుట నిశ్చయము.

2. పెద్దకమతములవలన వ్యవసాయాభివృద్ధికి వీలున్నది. కాని, సంఘూదాయమంతయు కొందఱివశము మాత్రమే యగుటచే పెద్దకమతములు వాంఛనీయము కాదు. చిన్నకమతములవలన నూతనయంత్రసహాయమున అధికోత్పత్తిని చేయజాలము. అధికోత్పత్తి కావలసినను నూతనయంత్రముల నుపయోగింపదలంచినను చిన్నకమతములు పనికిరావు.

3. నేటివఱకు గావింపబడిన శాసనములును ప్రయత్నములును ఈసమస్యను పరిష్కరింపజాలకపోయెను. పాశ్చాత్య దేశములయం

1. సత్యాగ్రహిపత్రికనుండి 1928 మార్చి 26.

దవలంబించిన పద్ధతులుకూడ మన దేశ పరిస్థితుల కుపయోగపడు నట్లుగ లేవు.

ఇక మన కర్తవ్యమేమి? వ్యవసాయపుభూమిని పెంచియు, ప్రశస్తమగు వ్యవసాయముజేసియు, పంటల నధికముగ పండించవలె ననుట నిర్వివాదాంశము. ఇందులకు పెద్దకమతములు, నూతనయంత్రములు అత్యవసరములు. కాని పెద్దకమతములవలన గలుగునష్టములను తొలగించవలయును. పెద్దకమతములవలన గలుగు నష్టములు తొలగింపజూచిన వ్యష్టివ్యవసాయము పనికిరాదు. చిన్నకమతముల వలన గలుగుచున్న లాభములను పదిలపరచుటకుగూడ వ్యష్టివ్యవసాయము కూడదు. సమిష్టివ్యవసాయ సిద్ధాంతమును ప్రవేశబెట్టుచో పెద్దకమతములవలన గలుగు లాభములును చిన్నకమతములవలన గలుగు లాభములును రెండునుగూడ పొందగలము. విఖండవిభాగ సమస్యయు, సునాయాసముగ పరిష్కారము కాగలదు. సమిష్టివ్యవసాయమును ప్రవేశపెట్టుటకు మూడుమార్గములు గలవు.

1. రైతులు తమలో తామేకమై ఉమ్మడిగ వ్యవసాయము నంతను చేయించుకొని ఎకరములవారీని ఫలసాయమును పంచుకొన వచ్చును. ఇట్లు చేయుచో స్వల్పవ్యయమగును. లాభమధికముగ నుండును. ఉమ్మడిగ వ్యవసాయపు పనిముట్లను, యంత్రములనుగూడ తెప్పించుకొనుటకు వీలుండును. అనుభవము ననుసరించి ఏయేభాగములు కలిపి వ్యవసాయముచేయుట కనువుగ నుండునో నిర్ణయించుకొన గలుగుదురు. కాని ఐచ్ఛికముగ రైతులిట్లు కలిసి పనిచేయజాలరు.

2. వ్యవసాయ సహకార సంఘములు స్థాపింపబడి సమిష్టివ్యవసాయము చేయించవచ్చును. ప్రతిగ్రామమున సహకారసంఘమే భూమి నంతను వ్యవసాయముజేసి ఎకరముల వారీని ఫలసాయమును (ఖర్చులు

పోను) పంచిపెట్టగలదు. నూతన యంత్రములనుగూడ సులువుగ తెప్పించి వ్యవసాయము చేయుటకు వీలుండును. కాని విభాగమునకును విభాగమునకును మధ్యనుండు బాగుఓగులను గమనించుటకు వీలుం డదు. అయినను ఓగ్గైన పొలములోవచ్చు ఫలసాయముకంటె ఉమ్మడి వ్యవసాయమున నూతనయంత్ర సహాయమున అధికఫలసాయము వచ్చుటకు వీలుండుటచే మరమ్మతులకు సంబంధించిన స్వల్పభేదము లను రైతులు పాటింప నక్కరలేదు. సహకారసంఘముల మూలమున విఖండములను గలుపుటకే పంజాబుదేశమున రైతులు సుముఖముగ లేనపుడు ఉమ్మడివ్యవసాయమున కంగీకరించెదరాయను ప్రశ్న యుద యించును. రైతులయందీ చిత్తవృత్తి లేదని యంగీకరించినను కలిగిం చుట కష్టతమము కాదు. ఇందులకు ప్రభుత్వము తగుకృషి చేయవలెను. ప్రతితాలూకాయందునను నమోనాగా యుండదగు వ్యవసాయశాలను ప్రభుత్వము స్థాపింపవలయును. ఆశాలయందు నూతనయంత్రములతో వ్యవసాయముచేయుచు పెద్దకమతములుగ నుండి నూతనయంత్ర సహా యమున విశేషలాభమును పొందుట కెట్లు వీలున్నదియు రుజువుచేయ వలెను. నూతనయంత్రములు, పనిముట్లు ఆశాలనుండి సహకారసంఘ ములకు అద్దె కొసంగుచుండవలెను. ఇట్లన్నివిధముల ప్రోత్సాహ మొనరించుచో ప్రతిగ్రామమున వ్యవసాయ సహకారసంఘము స్థాపింప బడుసని యాశింపవచ్చును. లేదా, ప్రతిగ్రామమున సహకారసంఘము స్థాపించుట విధి యొనరించుచు శాసనము గావింపవలెను. అట్టి సహకార సంఘమునకు ఆగ్రామవ్యవసాయమునంతను కొనసాగించు టకు సర్వాధికారము శాసనరూపముగ గలిగింపవలెను. అన్నదమ్ముల విభాగములును వారసత్వపు హక్కులును వచ్చినపుడు ఏవంతుభూమికి అధికారము గలిగియున్నదియు రిజిష్టరు చేయుచుండవలెను. ఆవంతు ననుసరించి ఫలసాయమును మాత్రము పంచిపెట్టుచుండవలయును.

ఇట్లొనరించుచో, భూమియందుగల హక్కును తొలగించవలసిన యవసరముండదు. భూస్వామ్యములనుగూడ మార్చవలసిన పనియుండదు. రష్యాదేశమునందు ప్రభుత్వమువారి వ్యవసాయశాల వలన గలుగుచున్న లాభముల ననుసరించియు, వ్యవసాయ సహకారసంఘములకు ప్రభుత్వమువారొసంగుచున్న సహాయము ననుసరించియు, రైతులు తమంతట తామే ఉమ్మడి వ్యవసాయమునకు తమ భూములను సహకారసంఘముల కొసంగుచున్నారు. కొంతమంది ప్రభుత్వమువారికే యొసంగుచున్నారు.

3. సహకారసంఘములను స్థాపించుటకు కూడ వీలుకలుగకున్నచో కడపటిమార్గమొకటి గలదు. భూమియందు ప్రభుత్వమునకుగల భూకామందు హక్కు ననుసరించి భూమియందు ఏవ్యక్తికిని యెట్టిహక్కును లేదని శాసించవలెను. వ్యయసాయపు భూమినంతయు ప్రభుత్వము వశపరచుకొనవలెను. నాల్గవఅధ్యాయమునందు వివరింపబడిన ప్రజాస్వామిక గ్రామప్రభుత్వములకు వ్యవసాయముచేయుటకాయాగ్రామముల భూమిని వశపరచవలెను. గ్రామప్రభుత్వములు సమిష్టివ్యవసాయము చేయించుచు, గ్రామస్థులకు లేక భూస్వాములకు ఫలసాయము నిచ్చుచుండును. కూలిరూపముగను లేక వాటాల రూపముగను ఫలసాయము నొసంగవచ్చును.

ఈ మూడుమార్గములలో నేమార్గమువలననైన నూతన యంత్రసహాయమున స్వల్పవ్యయప్రయాసలతో అధికాహారోత్పత్తి జేయుటయే భారతదేశ కర్తవ్యము.

ఇట్లొనరించుటవలన పన్నులసమస్యకూడ సులువుగ పరిష్కారమగును. గ్రామపుమొత్తమున సహకారసంఘము లేక ప్రజాస్వామిక గ్రామప్రభుత్వము యీరెంటియందున దేనిని అమలులోనికిదెచ్చిన

సంఘము పన్నులను చెల్లించివేయగలదు. పన్నులనుగూడ గ్రామపు మొత్తమున నిర్ణయించుటకు వీలుండును. ఈపన్నులవసూళ్ళకై విశేష వ్యయప్రయాసలుండవు. పన్నులవసూళ్ళకొఱకును, భూముల సరిహద్దుల సంరక్షణకొఱకును మొదలగుపనులకై నేడుపోషింపబడుచున్న అధికప్రభుత్వయంత్రమును తగ్గింపగలుగుదుము. మరియు రైతులకు దావాలబాధకూడ నూటికి 90 వంతులు తగ్గును. (గట్లనువేసికొనుట, పచ్చగడ్డిని కోసికొనుట మొదలగుచోట్ల గలుగు పోరాటములవలన సివిలు క్రిమినలుకోర్టులకు పోవుట తగ్గును.)

ఏవిధముగ పరీక్షించినను సమిష్టివ్యవసాయము నేదోయొక విధముగ ప్రవేశపెట్టుట సర్వవిధముల లాభకరముగ దోచుచున్నది.

## 31. వ్యవసాయాభివృద్ధికి రష్యాదేశమునం దవలంబించుచున్న పద్ధతులు.

“రష్యాదేశమునందు వ్యవసాయాభివృద్ధి వాయువేగమున జరుగుచున్నది. 5 సంవత్సరముల కార్యక్రమ మేర్పరుపబడెను. ఈకార్యక్రమమునందు వ్యవసాయసమస్యల నన్నింటిని చాలవఱకు సంస్కరింప సమకట్టిరి. రష్యా విప్లవానంతరము సేద్యపుభూమి విభాగము లొనరింపబడి ప్రజకు పంచిపెట్టబడినను వ్యవసాయాభివృద్ధిమాత్రము జరుగలేదు. సేద్యముచేయబడుచున్న భూమిలో 100 కి 60 వంతుల భూమిని 100 కి 60 వంతులమంది ప్రజలు వ్యవసాయము చేయుచున్నారు. వీరు మధ్యతరగతిప్రజలు. 100 కి 30 వంతులభూమిని 100 కి 10 వంతులప్రజ వ్యవసాయము చేయుచున్నారు. వీరు భాగ్యవంతులగు రైతులు. మిగిలిన 100 కి 10 వంతులభూమిని మిగిలిన 100 కి 30 వంతులరైతులును వ్యవసాయము చేయుచున్నారు. వీరు బీద

రైతులు. భూమి పంచిపెట్టబడినను, వ్యవసాయమునకు సంబంధించిన విఖండవిభాగముల సమస్యయు, ఎరువులసమస్యయు, అధికోత్పత్తి సమస్యయు రష్యాదేశమునందునగూడ పరిష్కరింపబడలేదు. 5 సంవత్సర కార్యక్రమమునందే యీసమస్యలను పరిష్కరింప నిశ్చయించిరి. ప్రస్తుతము రష్యాయందు వ్యవసాయము మూడుభాగములుగ జరుగుచున్నది.

1. చిన్న చిన్న రైతులు, చిన్న కమతములు.
2. ఉమ్మడి వ్యవసాయము.
3. ప్రభుత్వ వ్యవసాయము.

మన దేశమునందువలెనే చిన్న చిన్న రైతులు పూర్వసాంప్రదాయముల ననుసరించి వ్యవసాయము చేయుచున్నారు. వీరికి రష్యాదేశ ప్రభుత్వము వివిధరీతుల సహాయము చేయుచున్నది. చిన్న కమతముల మీాద పన్నులను తీసివేసెను. పెట్టుబడిని వలయునంతగ సకాలమున లభింపజేయుచున్నది. విప్లవమునకు పూర్వము 16 మిలియనులు (160 లక్షలు) మాత్రమేయున్న రైతులసంఖ్య నేడు 26 మిలియనుల వఱకు పెరిగెను. ఈ 260 లక్షలమంది వ్యవసాయదారులును చిన్న చిన్న కమతములను సాగుచేయుచుండుటచే వ్యవసాయాభివృద్ధి కాలేదు. అందుచే చిన్న చిన్న కమతముల మధ్యగల సరిహద్దుగట్లనుకూడ తీసివేసి వ్యష్టివ్యవసాయము నాపుజేసి సమిష్టివ్యవసాయమునకు ప్రారంభించిరి. ఈసమిష్టివ్యవసాయమున గ్రామములు, తాలూకాలు, జిల్లాలు కూడకలిసిపోయినవి. పల్లెలును, బస్తీలునుకూడకలిసిపోయినవి. ఉరాల్సునందు (Urals) ఇరిబిట్ జిల్లాలో (Irbit) 135000 హెక్టర్లభూమిని కలిపివేసిరి. (హెక్టరనగా 2471 ఎకరములు). ఇందు 110 గ్రామములు కలిసిపోయినవి. ఈగ్రామములలో 19000 ప్రజలు గలరు.

ఈ పెద్దకమతమును 5 భాగము లొనరించిరి. ఈపనియంతయు జరుపుటకు ఏవిధమగు దౌర్జన్యమును ప్రభుత్వమువా రుపయోగించ లేదు. ప్రజలు తమకమతమును 1929-1930 సంవత్సరాంతమునకు 275000 హెక్టార్లకు పెంచుట కాశించుచున్నారు. ఇట్లే దేశమునందు పలుతావుల సమిష్టివ్యవసాయము జరుగుచున్నది. ఇట్లు ప్రజలు సమిష్టి వ్యవసాయమునకు బూనుటకు వారియందుగల సమిష్టిభావమే కారణముకాదు. రష్యాదేశ ప్రభుత్వము ఒక్క 1929-30 వ సంవత్సరము ననే సమిష్టి వ్యవసాయమునకు తోడ్పడుటకుగాను 320 మిలియను రూబిల్సు సొమ్మును ప్రత్యేకించెను. ప్రభుత్వమువారు వ్యవసాయ యంత్రములను మోటారు ట్రాక్టర్లను (ట్రాక్టరనగా ఒకేయంత్రము. దున్నుట, నాటుట, కోయుట, నూర్చుట మొదలగు పనులన్నియు చేయు యంత్రము.) ఉంచు శాలలను దేశమందంతటకట్టించిరి. ఇంకను కట్టించుచున్నారు. 1929-30 వ సంవత్సరమున 200 శాలలను 5 మిలియనుల హెక్టారుల భూమిని సేద్యముచేయుటకు తగియున్న యంత్రముల నుంచుటకొఅకై నిర్మించిరి. 5 సంవత్సరముల కార్యక్రమ మును ముగియునప్పటికి 40 మిలియను హెక్టారుల భూమిని సేద్యము చేయుటకు వలయుయంత్రముల నుంచు శాలలను నిర్మింపగలరు. ఈ శాలలయందు నేడు 5 వేల ట్రాక్టరులు పనిజేయుచున్నవి. 5సంవత్సర ముల కార్యక్రమమును ప్రారంభించుటకు పూర్వము వ్యవసాయయం త్రములు 1 బిలియను రూబిల్సు విలువగలిగినవి మాత్రమే యున్నవి. ఈ 5 సంవత్సరముల కార్యక్రమము ముగియునప్పటికి మూడు బిలి యనుల రూబిల్సువిలువగల యంత్రములుండును. అనగా 5 సంవత్సర ముల కార్యక్రమ ప్రారంభమున 30000 ట్రాక్టరులు గలవు. ఈ కార్యక్రమము ముగియునప్పటికి 350000 లేక 400000 వఱకు పెరుగ గలవు. ఈసంవత్సరముల పిమ్మట సాలుసరి 100 కి 35 వంతులు అద

నముగ ఫలసాయ ముండునని అంచనా వేయబడెను. ఈ ఫలితమునకై ప్రభుత్వమువారు రైతులతో నొడంబడిక గావించుకొను చున్నారు. వ్యవసాయ యంత్రశాలలు వ్యవసాయము చేయుట కొడంబడును. రైతులు, యంత్రములతోపాటు పాటుబడుట కంగీకరించెదరు. యంత్రముల కృషియు, రైతులపాటును,గలిపి, పండినపంటలో యంత్రముల నొసంగినందులకై అద్దెను ప్రభుత్వమున కొసంగెదరు. మిగిలిన పంటను రైతు లనుభవించెదరు. యంత్రములతో పాటు ఎరువులను గూడ, ప్రభుత్వమువారే రైతుల కందిచ్చెదరు. ఈ ప్రభుత్వసహాయమువలన, సమిష్టివ్యవసాయదారులు అధికలాభములను పొందుచుండుటచే, చిల్లరరైతులందరు గూడ, ఉమ్మడివ్యవసాయమునకు తమంతతామే యంగీకరించుచున్నారు. 100 కి 85 వంతుల రైతు లీసహాకార వ్యవసాయమునకు 5 సంవత్సరములలోను బూనెదరు.

మఱియు, రష్యాప్రభుత్వమువారే వ్యవసాయశాలలను నడుపుచున్నారు. పెద్దకమతముల వలనను, ఖనిజములతో గూడిన ఎరువుల నుపయోగించుట వలనను, యంత్రముల సహాయమునను, అల్పవ్యయమునను, అధికోత్పత్తికి గలమార్గములను ప్రదర్శించుచున్నారు. ఈప్రదర్శనము, సమిష్టివ్యవసాయమునకు ప్రోత్సాహకరముగ నున్నది.*[1]

(ఈపైవిషయములు గ్రింకోగారి అయిదుసంవత్సరముల కార్యక్రమమను పుస్తకమునుండి గ్రహింపబడినవి.)

## 32. ప్రదర్శనము, పరిశోధనము, ప్రచారము, ప్రయోగము.

విద్యావ్యాప్తిలేని భారతవర్షమున-చదువను వ్రాయను గూడ నెఱుంగనిరైతు లధిక సంఖ్యాకులుగనుండిన భారతవర్షమున- వ్యవసా

1. *These Notes are taken from "The five year plan of the Soviet union by Mr. G. T. Grinko" P. 135-177*

ద్యాభివృద్ధికి ప్రదర్శనము, ప్రచారము, అత్యవసరము. వ్యవసాయము క్షీణగతియం దుండిన దేశమునందు నూతనవిషయ పరిశోధనము, ప్రయోగము ఎంతఅవసరమో వీటిని ప్రదర్శించుటయు, ప్రచారము చేయుచుండుటయు గూడ నంతటి అవసరములే. అక్కడక్కడ ప్రయోగ శాలలు నెలకొల్పుటవలన ప్రయోజనము లేదు. అక్కడక్కడ రైతుల పొలములలో నూతన విషయములను ప్రయోగించి చూపించుటవల నను ప్రయోజనము లేదు. ఆయాపంటల విషయమున గనుగొనబడిన క్రొత్తవిషయములను గుఱించి, రైతులకు ప్రతిగ్రామమున తెలియున ట్లొనరింప వలయును. ప్రయోగశాలలలో చేయబడుచుండిన పరిశోధనలను రైతులందఱువచ్చి స్వయముగ చూచి అనుభవమును సంపాదించునట్లు రైతులను ఆకర్షింప వలయును. ఇందులకు ప్రదర్శనశాల ప్రయోగశాల యొకటిగ నుండదగును. ఇట్టిశాలలు తాలూకా 1 కి ఒక్కటియైన నుండవలెను. వీటిపనిని, ఎప్పటికప్పుడు వ్యవసాయశాఖ ప్రచారము చేయుచుండవలెను. ప్రయోగప్రచారశాలలపై డబ్బు వినియోగించుటకు వెఱువరాదు. వీటి ఆదాయవ్యయములు సరిపడియుండవలెనని గూడ తలంచరాదు. క్రొత్తపంట వేసి, నూతనపద్ధతిని వ్యవసాయము చేసినపుడు, దానికగు జమాఖర్చులను తయారుచేసి లాభాలాభములను దెలుపుపట్టిక ప్రదర్శింపదగియే యున్నది. కాని, యిట్టి శాలలు, నష్టముమీాద పనిచేయరాదనుట న్యాయగు సిద్ధాంతము కాదు. ప్రచారమువలన ప్రత్యక్షఫలితము వెంటనే లభింపదు. అపరోక్షముగ రైతులయందు నూతనవిషయములు వ్యాప్తి చెందుటయే ప్రచారమునకు ఫలితము. ప్రతిప్రచారప్రదర్శన శాలయందునను మంచి రకపు విత్తనములు, నూతనపరికరములు, ఎరువులు, ఆబోతులు గూడ నుండవలెను. వీటిని, మోటారుపై ఆతాలూకాయందలి ప్రతిగ్రామము నకుపోయి ప్రదర్శించుచుండవలెను. కొంతకాలమువఱకు, మంచిరకపు

విత్తనముల నుచితముగ పంచిపెట్టవలెను. వ్యవసాయ విచారణ సంఘముवారు విత్తనముల నుచితముగ పంచిపెట్టరాదనియు, విత్తనములను రైతులకు లభింపజేయుటలో నష్టముగ పనిచేయ నవసరము లేదనియు వ్రాసిరి. ఈపరిస్థితు లింకను రాలేదు. ప్రదర్శన ప్రయోగశాలలయందు సంవత్సరమునకు రెండు మూడు ప్రదర్శనములను గూడ ఏర్పాటు చేయవలెను. తాలూకా ముఖ్యగ్రామములలో గూడ నిట్టి ప్రదర్శనముల నేర్పఱుప వలయును. సంచారపు సినీమాలను గూడ రైతులకు వ్యవసాయవిషయ ప్రబోధమునకై వినియోగించుచుండవలెను.

తాలూకాయం దుండిన ప్రయోగ ప్రదర్శన శాలలనుండి తాలూకా యందలి గ్రామములకు టెలిఫోనులు నేర్పఱుపవలెను. అమెరికా దేశమున ప్రతివ్యవసాయ క్షేత్రమునకు ముఖ్యపట్టణముల నుండి టెలిఫోనులు గలవు. ఈటెలిఫోనులలో ఎప్పటికప్పుడు వ్యవసాయవిషయములను రైతులు పరస్పరము తెలిసికొనుచుందురు.

"అమెరికాయందు వ్యవసాయ విషయములను గుఱించి ప్రతిసాలున నిఘంటువులవంటి పుస్తకమును వ్యవసాయశాఖవారు అచ్చువేయించుచుందురు. ఈ పుస్తకము అందఱకు అందుబాటులోనుండునట్లుగ రు 1-8-0 లకు మాత్రమే అమ్ముచుందురు. వ్యవసాయదారులు వారి కాంగ్రెసుప్రతినిధికి వ్రాసి యుచితముగ గూడ తెప్పించుకొనవచ్చును. ప్రపంచమునందు జరిగిన వ్యవసాయవిషయ నూతనప్రయోగ సమస్యల నన్నింటిని నెలనెలకు ప్రకటించుచుందురు. ఈ నెలసరి పుస్తకముల నన్నింటి నొకపుస్తకముగ బైండు చేయించి అందఱకు పంచిపెట్టుచుందురు. వారి వారి జిల్లా ప్రతినిధుల ద్వారా కోరిన రైతుల కందఱకు కూరగాయల విత్తనములను వ్యవసాయశాఖ వారు పంపించుచుందురు. వ్యవసాయశాఖవారు వాతావరణములను

గురించి ప్రతిదినము రైతులకు టెలిఫోనుల మూలమున తెలియపఱచు చుందురు. రాబోవు 24 గంటలలోను వాతావరణమున గలుగు మార్పులను రైతులు తెలిసికొనుచుండుటవలన వాతావరణము ననుస రించి పాడగుపంటలు పాడుకాకుండ రైతులు సంరక్షించుకొన గలుగు చున్నారు.

సాలుసరి అమెరికా సంయుక్తరాష్ట్రప్రభుత్వము వ్యవసాయ విద్యా ప్రచారమునకై రు 15000000 లను వినియోగించుచుండును. (1 మిలియనుపౌనులు) ........

అమెరికాయందలి అయోవారాష్ట్రము (Iowa) వ్యవసాయ విద్యాప్రవీణులను ప్రత్యేకపు రైలుమీద ప్రచారమునకై పంపు చుండును. కళాశాలనుండి ప్రత్యేకపురైలుబండి బయలుదేరు కాలము ముందుగ ప్రకటింపబడుచుండును. ఆ రైలు స్టేషనులకు చేరుసరికి రైతులచ్చట వేచియుందురు. ఆ రైలుమీదనే సభలు జరుపబడును.

ఈవిధముగ అమెరికాప్రభుత్వము సర్వవిధముల వ్యవసాయ విద్యాప్రచారమునకై కృషిసల్పుచున్నది. ఏరైతునకైనను ఏవిషయ మైన తెలియకపోయినచో ఆరైతు తెలిసికొనుట నిరాకరించెనని చెప్పవల యునే గాని ప్రభుత్వమువారతనికి తెలిసికొనుటకు సదుపాయము లొన గూర్పలేకపోవుటచేత గాదు."[1]

అమెరికాదేశమునందువలెనే సర్వవిధముల వ్యవసాయ విషయ ములను ప్రచారము చేయవలెను. రాష్ట్రీయ, దేశీయ ప్రదర్శనము లను పంటలు, పరికరములు, మొదలగునవి సమకూర్చుచు, నేర్పాటు చేయుచుండవలెను. నేడు అక్కడక్కడ జరుగుచున్న గొడ్లసంతలకు

1. *From the Improvement of Indian Agriculture Lessons from America by Mrs. Saint Nihal Singh. P. 29 to 62.*

వ్యవసాయశాఖవారు పోవుచు ప్రచారము చేయదగును. గొడ్లసంతలలో ఎరువులు, విత్తనములు, నూతనపరికరములు, మొదలగువాటిని గూడ విక్రయమునకై వ్యవసాయశాఖవారు గొనిపోవుచుండవలెను. వ్యవసాయపు పనిముట్లు, గొడ్లు అమ్మకములకై ప్రత్యేకపుసంతలను పెట్టింపదగును. నూతనయంత్రములను తెప్పించి యీశాలలయందుంచి రైతులకు అద్దెకు ఇచ్చుచుండవలెను. పరిశోధనకు, ప్రయోగమునకు, ప్రదర్శనమునకు, ప్రచారమునకు ఎంతసొమ్ము వినియోగించినను ఫలప్రదమేయగును. ఎంతసొమ్మునైన వినియోగించుటకు ప్రభుత్వము సంసిద్ధమైనగాని వ్యవసాయ మభివృద్ధికాజాలదు. సమిష్టివ్యవసాయమునకు రైతులను పురికొల్పుటయే ప్రయోగమునకు, ప్రచారమునకు ముఖ్యాదర్శముగ నుండవలెను.

## 33. వ్యవసాయ సదుపాయములు, ప్రభుత్వవిధానము.

18 వ శతాబ్దమునందే పాశ్చాత్యప్రపంచము వ్యవసాయాభివృద్ధికర విజ్ఞానము నొకింత మెఱుంగగలిగెను. 1815 వ సంవత్సరప్రాంతముననే వ్యవసాయాభివృద్ధి బ్రిటిషుదీవులలో పూర్ణవికాసము నొందినది. ఫ్రాన్సు, జర్మనీలలో 19 వ శతాబ్దమువఱకు వ్యవసాయాభివృద్ధికర నూతనవిధానవిప్లవము రానేలేదు. 19 వ శతాబ్దమధ్యమువఱకు పరివర్తన మితరదేశములయందు కలుగుచునేయున్నది. ఈకాలముననే పొలములకు కట్టలు వేసికొనుట, కంచెలు పెంచుట, పంటలను మార్చుచు వేయుచుండుట, వేళ్లను గడ్డియును వృద్ధిపొందు పంటలు వేయుట, మురుగుకాలువలను త్రవ్వించుకొనుట, ఎరువులను గుర్తించుట, నేర్చుకొనిరి. వ్యవసాయసాధనకు వలయు సామగ్రిని ఆధునికయంత్రి

శక్తితో తయారుచేయుట మొదలుపెట్టిరి. ఈ యంత్రసహాయమున వ్యవసాయమును వర్తకముగ మార్చిరి. 1870 వ సంవత్సరప్రాంతమున శాస్త్రపరిశోధనరూపమగు వ్యవసాయము ప్రవేశపెట్టబడెను. నాటి నుండియు వ్యవసాయసంరక్షణకొఱకు వ్యవసాయపుదినుసుల ఎగుమతి, దిగుమతులపై సుంకములు విధింప ప్రారంభించిరి.

భారతవర్షమున సనాతనకాలమునుండియు, నీవ్యవసాయాభినివేశము వంశపరంపరానుగతముగ క్రీస్తుపుట్టుట కెన్నియోవేల సంవత్సరములనుండియు భారతీయ రక్తనాళములలో ప్రవహించుచున్నది. రాజకీయపరిస్థితుల ననుసరించి జీవితవిధానమంతయు మారునుగదా? అట్లే వ్యవసాయాభివృద్ధికూడ మధ్యకాలమున సన్నగిలినది. రైతు నూతనవిషయముల గనిపెట్టుటకు దగుపెట్టుబడి లేదు. ధైర్యముచేసి నూతనవిషయము వ్యవసాయమున బ్రవేశపెట్టుటయు నది విఫలమును నగుచో ఆయేడాదంతయు నాతడు పస్తుండవలసినదే. సేద్యగాండ్రయం దనేకులు జీవితాధారమునకుకూడ చాలనంతభూమిని మాత్రమే కలిగియున్నారని పైన వ్రాయబడెను. భారతదేశమున వ్యవసాయమునకు మూడు నీటిఆధారములు గలవు. (1) బావులు (2) పంటచెరువులు (3) నదులు.

బావులు. ఈ బావులను వ్యక్తులే త్రవ్వించుకొనుచున్నారు. ప్రభుత్వ మీబావులను త్రవ్వించుకొనుటకు అప్పులిచ్చు విధానమును తయారుజేసిరి. ఈ అప్పులు సముద్రమునందు కాకిరెట్టవలె నున్నవి. కృష్ణాజిల్లావంటి జిల్లాలో రూ 5000 లు మాత్రమే యొసంగబడుచుండెను. ఈఅప్పునకు వడ్డీకూడ గలదు. నూటికి రు 5 మొదలుకొని రు 6-8-0 వఱకు వడ్డీగలదు. మామూలు బావిని త్రవ్వించుటకు రాతితో కట్టకుండ గొయ్యివలె కట్టుటకు లేక

త్రవ్వుటకు రూ 300-0-0 మొదలు రు 600 వఱకు అగుచున్నది. శాశ్వతముగ త్రవ్వించవలెనన్న రూ 1000 లకు పైగ ఖర్చగును. ఈనూతులనుండి వ్యవసాయమునకు నీరు మోటలవలన తోడబడు చున్నది. ఆయిలుఇంజను లచ్చటచ్చట ప్రవేశపెట్టబడుచున్నవి. నూతులవలన సంయుక్తరాష్ట్రములయందు, పంజాబు, మదరాసు, బొంబాయి రాష్ట్రములయందు వ్యవసాయము హెచ్చుగ జరుగు చున్నది. తోటలకు దేశమందంతటను నూతులే యుపయోగించు చున్నారు. పల్లపుసాగులో 100 కి 25 వంతులు నూతులవలన సాగు బడి. దేశమునందంతట సుమారు 25 లక్షల వ్యవసాయపు నూతులు గలవు. 135 లక్షల ఎకరములభూమి వ్యవసాయము చేయబడుచున్నది. ఈనూతు లన్నిటిని రైతులే త్రవ్వించుకొనిరి.

చెరువులు. ఆంగ్లేయయుగమునకు పూర్వమే భారతదేశము నందు చెరువులు విరివిగ గలవు. వాననీరును చెరువుల లోనికి మళ్లించి వ్యవసాయమునకా నీరుపయోగించుట కధిక సదుపాయములు గావింపబడినవి. కృష్ణదేవరాయలు కాలమునాటి చెరువులు రాయలుసీమయందు నేటికిని అత్యంత వైభవముగ నున్నవి. ఇప్పుడు దేశమునందంతటగల యిట్టివ్యవసాయపు చెరువులు చిరకాలమునుండి భారతవర్షమునందున్నవే. ఈచెరువులకు తగు మరమ్మతు ప్రభుత్వము చేయించకపోవుటచే అనేక తావులయందలి పంటచెరువులు పాడయిపోవుచున్నవి. పంజాబు, సింధు దేశములయందు తప్ప యీపంటచెరువుల పద్ధతి దేశమునందంతట గలదు. మదరాసు, హైదరాబాదు, మైసూరురాష్ట్రములయం దధికముగ చెరువుల వ్యవసాయ మున్నది. ఉత్తర హిందూస్థానమందలి మహానదుల నిరంతర ప్రవాహోదకమిట్లు వంశపరంపరానుగతముగ చిరకాలమునుండియు

నుపయోగింపబడుచున్నది. అందులకువలయు ఆనకట్టలుగూడ పూర్వ కాలమందే కట్టబడియున్నవి. మదరాసు రాజధానియందు చెరువుల క్రింద వ్యవసాయము విస్తారముగ గలదు. సుమారు 40 వేల చెరువులు గలవు. సుమారు 30 లక్షల ఎకరములు చెరువులక్రింద సాగగు చున్నది.

## 34. ఆనకట్టలు - కాలువలు.

ఎ. డి. రెండవశతాబ్దమున నిర్మింపబడిన కావేరీ ఆనకట్టయే భారతదేశమందలి వ్యవసాయ ఉచ్ఛస్థితికి ప్రబలనిదర్శనము. దీనిని జూచియే కృష్ణా, గోదావరి, పంజాబు సింధూనదుల ఆనకట్టలు కట్ట బడినవి. ఆంగ్లేయయుగమునకు బూర్వమే భారతదేశమందలి ప్రభుత్వ ములు వ్యవసాయమునకు వలయు సాధనముల ననేకముగ నిర్మించిరి. మహమ్మదీయ మహాయుగమునందు ఉత్తరహిందూస్థానమున నీటి పారుదలకు వలయు కాలువల ననేకముగ త్రవ్వించిరి. వ్యవసాయమున కెట్టియిబ్బందియు నెన్నడును గలుగలేదు. గంగా, యమునానది కాలు వలను, కావేరి ఆనకట్టను 19వ శతాబ్దప్రారంభమున కుంపెణీవారు రవంత మరమ్మతుజేసిరి. గోదావరినదికి 1846 వ సంవత్సరమునందునను, 1857 లో కృష్ణానదికిని ఆనకట్టలనుగట్టిరి. ఈఆనకట్టలక్రింద 1½మిలి యను ఎకరములు సాగుచేయబడుచున్నది. 1866 మొదలు 20వ శతాబ్ద ప్రారంభమువఱకు అప్పులుజేసి పంజాబు మొదలగు ప్రాంతముల కొంత బీడుభూమిని వ్యవసాయపుభూమిగా ప్రభుత్వము మార్చెను. ఈభూములయందు గోధుమలు, ప్రత్తియు పండుచున్నవి.

1900 మొదలు పంజాబు, సింధుదేశముల కాలువల కట్టడ ములు పూర్తియైనవి. (Punjab and Sindh Canal Colony Works).

1905–17 లమధ్య (Triple Canals Project) త్రివిలుకెనాలుప్రాజెక్టును, శారదాకాలువయు (సంయుక్తరాష్ట్రములలో) కట్టింపబడెను.

1921 వఱకు కాలువలు మూడువిధములుగ విభజింపబడినవి. 1. (Productive) సార్థకములు లేక ఫలప్రదమైనవి. 2. (Protective) సంరక్షకములు. 3. (Minor) చిల్లరిపనులు. ఫలప్రదమైన కాలువల సందర్భమున అప్పులుచేయవచ్చును. అనగా 10 సంవత్సరములలోపల పెట్టుబడికి దగిన ప్రతిఫలము ప్రభుత్వమునకు సంపాదించగలవాటిమీద అప్పులనుజేసి ఖర్చుపెట్టవచ్చును. మిగిలిన రెండురకముల కాలువలకు ప్రభుత్వమునకు వచ్చుచున్న సంవత్సరాదాయమునుండియే ఖర్చుపెట్టబడుచున్నది. ఈఖర్చు కఱవులకని ప్రత్యేకింపబడిన సొమ్మునుండి తీయబడుచువచ్చినది. 1921 నుండియు ఈవిభాగములు తీసివేయబడినవి. మూడువిధములైన పనులకుగూడ అప్పుజేయవచ్చును. అయినను అప్పు జేసికూడ వ్యవసాయాభివృద్ధికరములగు పనులను చేయలేదు. నిన్న మొన్నటి 1923 లో ప్రారంభింపబడిన నాలుగుప్రాజెక్టులును తప్ప అంతకుముందు మరేవిధమైన వ్యవసాయాభివృద్ధికరమగు విశేషకృషియు ప్రభుత్వమొనరించలేదు. రైళ్ళనిర్మాణమునకై అప్పులుచేయుట యందుచూపిన శ్రద్ధాభక్తులు వ్యవసాయముపట్ల జూపుచో ఆంగ్లేయ యుగమున వ్యవసాయాభివృద్ధి యయినదని చెప్పుటకు వీలుండెడిది. రమేశచంద్రదత్తుగారు 1902 వ సంవత్సరమునకు 38 కోట్లుమాత్రమే వ్యవసాయమునకు ప్రభుత్వము ఖర్చుపెట్టినదనియు, రైళ్ళకై 370 కోట్లు ఖర్చుపెట్టెననియు చెప్పిరి. దేశమున కఱవుకాటకము లత్యధిక

ముగనున్నను రైళ్ళవలన అమితధననష్ట మగుచున్నను, వ్యవసాయము నుపేక్షించి రైళ్ళకొఱకంతధనము వెచ్చించుట యకృత్యమని నిరసించిరి. ఇంతవఱకు గావింపబడిన కృషియు సక్రమముగ లేదు. వలయు మురుగుకాలువలు త్రవ్వింపబడలేదు. ఉన్నవి సరిగ బాగుచేయబడుట లేదు. అందుచే భూములు చవుడు వేయుచున్నవి. మలేరియా మొదలగు వ్యాధులు వ్యాప్తి జెందుచున్నవి.

వివిధమైన ఏళ్ళుగలవు. ఈఏళ్ళ జలమంతయు సక్రమముగ వ్యవసాయమున కుపయోగించుటకు వలయు ప్రయత్నముల జరుపలేదు. ఈనీటిని ఉపయోగింపక పోవుటయే గాక, సరియగుకట్టలు లేనందున ప్రతిసంవత్సరము వరదలువచ్చి వ్యవసాయమును పాడొనరించుచున్నవి. గోదావరి ఆయకట్టువలన నూటికి 22 రూపాయల ప్రతిఫలము ప్రభుత్వమునకు ముట్టినది. కృష్ణా ఆయకట్టువలన నూటికి 18 రూపాయల ప్రతిఫలము ముట్టినది. (Irrigation works) వ్యవసాయపు కట్టడముల మీద సగటున 100 కి రు 7 మొదలు రు 8 ల వఱకు గిట్టినది. ప్రభుత్వము 100 కి రు 3 మొదలు రు 3½ ల వఱకు వడ్డీతో నిందు కొఱకై అప్పుజేసెను. ఈవడ్డీ మినహాయింపబడుచో, ప్రభుత్వమునకు 100 కి రు 3 మొదలు రు 5 వఱకు లాభమువచ్చినది. 1921 లో ఫలదాయకమైన పనులవలన 100 కి రు 9 లు వచ్చినవి. ప్రతిఫలము రానివి మినహాయించుచో, ప్రభుత్వమునకు 100 కి రు 11 ల వఱకు వచ్చినదని చెప్పవచ్చును. సంరక్షణములగు కట్టడములవలన 100 కి రు 1 తక్కువగ వచ్చినది. చిల్లర పనులవలన 100 కి రు 4 మొదలు రు 6 ల వఱకు వచ్చెను.

| [1]రాష్ట్రము | సేద్యపు భూమిలో పల్లపు సాగు 100 కి ఎన్ని ఎకరముల విస్తీర్ణము |
|---|---|
| అస్సాము | 5.7 |
| వంగరాష్ట్రము | 6.2 |
| బీహారు, ఒరిస్సా | 17.4 |
| బొంబాయి | 3.9 |
| సింధుదేశము | 7.3 |
| బర్మా | 8.4 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 4.2 |
| మదరాసు | 29.7 |
| పశ్చిమోత్తర పరగణాలు | 34.4 |
| పంజాబు | 44.1 |
| సంయుక్తరాష్ట్రములు | 22.0 |
| ఇతర ప్రదేశములు | 19.3 |

ఈఅంకెలు 1921-22 మొదలు 1925-26 సంవత్సరము వఱకు గల 5 సంవత్సరములకు సగటున వేసిన మదింపు.

ఈపట్టిక వలన ఏరాష్ట్రమునందెంత పల్లపుసాగుబడి భూమి కలదియు తెలియుచున్నది.

1878-79 వ సంవత్సరమున 10.50 మిలియనుల ఎకరములును, ఈశతాబ్ద ప్రారంభమున 19.25 మిలియను ఎకరములును, 1919-20వ సంవత్సరమున 28.1 మిలియనుల ఎకరములును పల్లపుసాగు చేయబడెను. 1922-23 న 28.33 మిలియను ఎకరములును, 1927-1928 వ సంవత్సరమున 27.5 మిలియనుల ఎకరములును సాగుచేయబడెను. లేక దేశమొత్తమున చేయబడిన అన్ని విధములగు వ్యవసాయముల లోను 100 కి 12 వంతులు మాత్రమే ప్రభుత్వము వారిచే కట్టబడిన వ్యవసాయపు కట్టడములవలన నభివృద్ధి కలిగెను.

1. See India 1928—29, Page 110.

(మిలియనుల ఎకరములు)

| రాష్ట్రములు | ప్రభుత్వము వారి కాలువలు | ప్రభుత్వమునకు జోక్యములేని ఇతర కాలువలు | చెరువులు | నూతులు | ఇతరవనరులు | మొత్తము. |
|---|---|---|---|---|---|---|
| మదరాసు | 3. 7 | 0. 2 | 3. 4 | 1. 4 | 0. 5 | 9. 2 |
| బొంబాయి | 3. 4 | 0.08 | 0. 1 | 0. 7 | 0. 2 | 4. 5 |
| వంగము | 0.05 | 0. 2 | 0. 9 | 0.04 | 0. 3 | 1. 4 |
| సంయుక్తరాష్ట్రములు | 3. 3 | 0.02 | 0.06 | 5. 6 | 2. 0 | 11. 0 |
| పంజాబు | 10. 6 | 0. 4 | 0.04 | 4. 0 | 0. 1 | 15. 2 |
| బర్మా | 0. 6 | 0. 3 | 0. 2 | 0.02 | 0. 3 | 1. 5 |
| బీహారు, ఒరిస్సాలు | 0. 9 | 0. 9 | 1. 6 | 0. 6 | 1. 4 | 5. 4 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | * | 0. 9 | * | 0. 1 | 0.04 | 1.00 |
| అస్సాము | 0.01 | 0. 3 | ... | ... | 0. 3 | 0. 6 |
| పశ్చిమోత్తర పరగణాలు | 0. 4 | 0. 4 | ... | 0.08 | 0.09 | 1. 0 |
| అజ్మీరు, మార్వారా | ... | ... | ... | 0. 1 | ... | 0. 1 |
| మొత్తము. | 23. 1 | 3. 7 | 6. 3 | 12. 7 | 5. 3 | 51. 0 |

* ఇతరకాలువల మొత్తమునందీ సంఖ్యలు చేరియున్నవి.

ఈ పైపట్టిక వలన 1929-30 వ సంవత్సరమున బ్రిటిషు ఇండియాయం దేరాష్ట్రమున ఏనీటివసరువలన ఎంతభూమి సాగు చేయబడినదియు తెలిసికొనగలము.

సుక్కూరు బేరేజీవంటి స్కీములు నాలుగును విజయముగ పూర్తియగుచో వ్యవసాయపు భూమి 50 మిలియనుల ఎకరముల వఱకు హెచ్చుగలదని అంచన.

1922 వ సంవత్సరము మొదలు 19 ప్రాముఖ్యమైన నీటివసతుల కట్టడములను ప్రభుత్వమువారు ప్రారంభించిరి. కొన్ని పూర్తి యైనవి. కొన్ని పూర్తికాకున్నవి. వీటికై 500 మిలియన్ల రూపాయలు అనగా 5000 లక్షల రూపాయలు పెట్టుబడి పెట్టబడెను. ఇందులో పంజాబునందు సట్లజ్ వాలీప్రాజెక్టునకు 14.6 కోట్లుఖర్చు. దీని క్రింద 50 లక్షల ఎకరముల క్రొత్తసాగు గాగలదు. సింధుదేశమందలి సుక్కూరు బారేజికి 20.4 కోట్లు ఖర్చగునని అంచన. 50 లక్షల ఎకరములు సాగగునని అంచన. తమిళరాష్ట్రమున మెట్టూరు ప్రాజెక్టునకు 7.3 కోట్లు ఖర్చు అగునని అంచన. 30 లక్షల ఎకరములు సాగగునని అంచన. సంయుక్తరాష్ట్రములలో శారద, అయోధ్య కాలువల పని జరుగుచున్నది. మధ్యరాష్ట్రములలో 14 సంవత్సరములు వరుసగ చేయవలసిన కార్యక్రమము నిరూపించుకొనబడెను. ఇట్లే అన్ని రాష్ట్రములయందును క్రొత్త స్కీములు గలవు.

## 35. తుంగభద్రా ప్రాజెక్టు.

రాయలసీమయందుగల తుంగభద్రానదికి ఆనకట్ట కట్టువిషయమై 1898 వ సంవత్సరమున కఱవుల కమీషనువారు వ్రాసిరి.

ఈ కమీషనువారి యెదుట సాక్ష్యమిచ్చిన ఇంజనీరు స్మార్టుగారు 1902 వ సంవత్సరం ఫిబ్రివరి 13 వ తేదీని యిట్లనిరి.

"తుంగభద్రాప్రోజెక్టును వెంటనే ప్రారంభింపవలెను. ఫునాదులు పరీక్షించుటకు త్రవ్వవలసిన గోతులు, మేమాసాంతములోపుగ పూర్తికావలయును. 1904–5 సంవత్సరములోనే తుంగభద్రాప్రోజెక్టుల ఎస్టిమేట్లు సిద్ధమయినవి. 12.18 కోట్లు అగునని అంచనా వేసిరి. ఇండియా ప్రభుత్వమువారీ అంచన సరిగలేదని 1905–6 సంవత్సరములో త్రిప్పి వేసి మదరాసుప్రభుత్వమువారిని సరిచూడవలసినదిగకోరిరి. కాని మదరాసుప్రభుత్వ మీప్రోజెక్టు విషయమై శ్రద్ధవహింపలేదు. 1909 వ సంవత్సరమునం దీప్రోజెక్టు నిర్మించు సంకల్పమే విరమించు కొనిరి. 1924 వ సంవత్సరమున శాసనసభయందు జరిగిన ఆందోళనకు ఫలితముగ 1925 వ సంవత్సరము జూనుమాసమున సీడెడ్ డిస్ట్రిక్టుల యిరిగేషన్ (Irrigation) కమిటీ నియమింపబడెను. వీరిరిపోర్టు 1926 వ సంవత్సరముననే సిద్ధమయినది. తుంగభద్రానదిపై నీటి అధికారము నైజాము సంస్థానమునకు గలదని వారితో ప్రభుత్వము సంప్రదించుటకు ప్రారంభించెను. ఈప్రోజెక్టు ఎప్పుడెట్లారంభమగునదియు తెలుపుటకు వీలులేదని యధికారులు ప్రత్యుత్తర మొసంగసాగిరి.

1933 వ సంవత్సరమున మదరాసు ప్రభుత్వము మైసూరుసంస్థానముతోను, నైజాముప్రభుత్వముతోనుగూడ వ్యవసాయసమస్యలను చర్చించి తుదిపరిష్కారము జరుపుకొనినటుల తెలియుచున్నది. జయమంగలి, పెన్న, పాలారు, చిత్రావతినదులనీరు మైసూరుప్రభుత్వము వారు అడ్డుతగులుచున్నారని మదరాసు ప్రభుత్వమువారి వాదము. ఈనదులనీటిచే మైసూరురాజ్యమున 6 తాలూకాలలో పల్లపుసాగు చేయబడుచున్నది. 1892 వ సంవత్సరమునందీ రెండుప్రభుత్వములు

గావించుకొనిన యొడంబడిక గూడ మరలచర్చింపబడెను. ఈరెండుప్రభుత్వములచర్చకు ఫలితముగ నేమిజరిగెనో, వివరము లింతవఱకును తెలియవు. (1933 డిశంబరు ఆఖరునకు).

నైజాము ప్రభుత్వమువారితో గావించుకొనిన యొడంబడిక వివరములు కొన్ని పత్రికలమూలమున తెలియుచున్నది.

నిజాంప్రభుత్వమువారు తుంగభద్రానదికి మల్లాపురముకడ ఆనకట్ట కట్టుటకు నిర్ణయించిరి. అచ్చటనే నీటిని నిలువచేయు చెరువును కూడ త్రవ్వించెదరు. ఈచెరువునందు నూరుమిలియనుల ఘనఅడుగుల నీరు నిలువయుంచుటకు వీలుండును. ఈచెరువునుండి త్రవ్వబడు పెద్ద కాలువ 140 మైళ్ళ పొడుగుగ నుండును. ఈకాలువయొక్క శాఖలు, పిల్లకాలువలు అన్నియు, మొత్తము మూడువేల అయిదువందలమైళ్ళ పొడుగుగనుండును. ఈప్రాజెక్టువలన రాయచూరుజిల్లాలో 19 లక్షల ఎకరములభూమి సాగుచేయబడును. ఈప్రాజెక్టు పూర్తియగుచో 41½ లక్షల రూపాయల భూమిపన్ను ప్రభుత్వమునకు చెందును. మదరాసు, నైజాం ప్రభుత్వముల యొడంబడికప్రకారము ఈ నిలువనీటి చెరువునుంచి (Reservoirs) సమానముగ నీరు తీసికొనెదరు.

ఈ యొడంబడికవలన మొదట తలపెట్టబడినంతభూమి రాయలసీమయందు సాగుకాదు. సుమారు బళ్ళారిజిల్లాలో ఆలూరు, ఆదవాని, రాయదుర్గ, బళ్ళారితాలూకాకును, కర్నూలుజిల్లాలో పత్తికొండ తాలూకాలో హింద్రీ తుంగభద్రలకు మధ్యనుండుపత్తికొండతాలూకా భాగమునకును, కర్నూలుతాలూకాకును, అనంతపురంజిల్లాలో గుత్తితాలూకాకును మాత్రమే యీప్రాజెక్టు పనికివచ్చును. తక్కిన ప్రాంతములకు దేనికిని ఇది యుపయోగింపదు. రాయలసీమయందు తాడిపత్రి, ధర్మవరము, అనంతపురము తాలూకాలు వానలేనితాలూ

కాలు. ఈతాలూకాలకీ ప్రాజెక్టు వినియోగింపదు. కర్నూలుజిల్లాలోని నీరులేని శిరువెళ్ళకొండచాలు, కోవెలకుంట్ల, అవుకుప్రాంతములకీ ప్రాజెక్టు నిరుపయోగము. నెల్లూరు, గుంటూరు మండలములకును ఈప్రాజెక్టునకును సంబంధమేయుండదు.

## 36. వెల్గోడు ప్రాజెక్టు.

ఈ తుంగభద్రా ప్రాజెక్టుతో గలిపి నిర్వహింపదలంచిన ఇతర ప్రాజెక్టుల మాటయేమి? కడప-కర్నూలు కాలువను వెడల్పుచేసియు, లోతుచేసియు, నెక్కువనీటిని ప్రవహింపజేయుటయు, వెల్గోడుప్రాజెక్టును నిర్మించుటయు, నీరెండునుగూడ 1903-4 సంవత్సరమునందే తుంగభద్రా ప్రాజెక్టుతో కలిపి తలపెట్టబడెను. 1930 వ డిశంబరున ఈప్రాజెక్టులనుగుఱించి మదరాసుప్రభుత్వమువారు మరల ఆశలను గల్పించిరి. తుంగభద్రాప్రాజెక్టునకు అగుఖర్చులో సగముమాత్రమే మదరాసుప్రభుత్వము భరించుచుండుటచే నీప్రాజెక్టునుకూడ నిర్మించుటకు మదరాసుప్రభుత్వము వెనుకాడవలసిన పనిలేదు.

## 37. సంగమేశ్వరం ప్రాజెక్టు.

సంగమేశ్వరం ప్రాజెక్టుకూడ తుంగభద్రా ప్రాజెక్టుతో కలిపి యోజింపబడెను. ఈప్రాజెక్టు నెల్లూరుమండలమువారి కత్యంతోపయోగము. 1923 వ సంవత్సరమునందీ ప్రాజెక్టునుగుఱించి విచారించుటకై యొకయుద్యోగికూడ నియోగింపబడెను. కృష్ణానదికి సంగమేశ్వరమునొద్ద రిజర్వాయరును నిర్మించిన నెల్లూరు, కడప, కర్నూలు, చెంగల్పట్టుజిల్లాలకు నీటివసతి చాలినంతగలుగునని యీయుద్యోగి నివేదించెను. ఈనివేదికననుసరించి సంగమేశ్వరం ప్రాజెక్టునకు ప్రధాన

స్థానము లభించెను. తుంగభద్రాప్రోజెక్టుకంటెగూడ దీనికెక్కుడు సౌకర్యములున్నవని తలంపబడెను. 1925 వ సంవత్సరమున నియమింపబడిన ఆరోగ్యస్వామి కమిటీవారు నెల్లూరుజిల్లాకు సంగమేశ్వరం ప్రోజెక్టునుండి నీరునిచ్చుట లాభమని వారినివేదికయందు వ్రాసిరి. 1926 వ సంవత్సరమున హాకిన్సుదొరగారు (అప్పటి ఇరిగేషనుచీఫ్ ఇంజనీరు) తుంగభద్రాప్రోజెక్టును నిర్మించుటలో గలుగునష్టమును పూడ్చుటకై తుంగభద్రా ప్రోజెక్టుతోపాటు సంగమేశ్వరం ప్రోజెక్టును గూడకలిపి పని ప్రారంభింపవలెననియు వ్రాసిరి. నెల్లూరుజిల్లాయందు వెంగళాపురంప్రోజెక్టు,రోళ్ళపాడుప్రోజెక్టులువిరమింపబడినవి. మోపాడు మాచవరము ప్రోజెక్టు నిర్మించుటకై ప్రజలయొద్ద ధనము గూడ వసూలుచేసి తిరిగివాపసుచేసిరి. నెల్లూరుజిల్లాయందు నెల్లూరు, కోవూరు తాలూకాలును, కావలితాలూకాలో కొంతభాగమును మాత్రమే నీటి వసతులను గలిగియుండెను. తక్కినతాలూకాల నీటివసతులు దత్తమండలమునందు వలెనే యున్నవి.

# 38. వ్యవసాయాభివృద్ధి, ప్రభుత్వము వహించిన అశ్రద్ధ.

ఇట్లే వ్యవసాయాభివృద్ధికి వేరువేరు ప్రోజెక్టులెన్నియో గమనించి నిర్మింపవలసియున్నవి. నిర్మించి పనిచేయుచున్న ప్రోజెక్టులలో మరమ్మతు లెన్నియో కావింపవలసియున్నవి. గోదావరినది ఆనకట్టపైన పూడిపోవుచున్నది. అఖండగౌతమి మఱికొన్ని సంవత్సరములలో లంకలతో నిండిపోవును. గోదావరినదికిగట్టిన బ్రిడ్జి పైభాగమునందంతయు వృక్షములతోగూడినలంకలుపెరుగుచున్నవి. ఈలంకలు

పెరుగుటకు బ్రిడ్జియే కారణమని కొందరి యూహ. ఆనకట్ట కట్టు నపుడు ఆనకట్ట క్రిందిభాగము గుండ నీరును వదలుటకు పెద్ద తూములుగూడ కట్టబడెననియు ఆతూములు కనుగొని తలుపులెత్త బడుచో, ఆనకట్ట పై భాగమునందుగల యిసుకపట్టలన్నియు కొట్టుకొని పోవుననియు కొందరందురు. కాని ఆతూములు నేడు కనిపెట్టబడినట్లుగ తోచదు. అందులకు ప్రియత్నములుకూడ జరుగుచుండుట లేదు. వెం టనే యేదోయొక మార్గమరసి, యిసుకతిన్నె లన్నియు కొట్టుకొని పోవునట్లొనరింపకున్నచో, గోదావరి డెల్టాయంతయు మఱికొన్ని సం వత్సరములలో నిరుపయోగము గాకమానదు. అవసరమగుచో గోదా వరినదిపై కట్టిన వంతెనను పడగొట్టించివేయవలెను. ఆనకట్ట దిగువ భాగమునుండి మరల కట్టింపవచ్చును. ఈసమస్య మదరాసు ప్రభు త్వమువారిదృష్టి నింతవఱ కాకర్షించినటుల తోచదు. ఈసమస్య యన నేల? స్వల్ప మరమ్మతులనుగూడ సకాలమున చేయించుట లేదనుట గోరంతదానిని కొండంతగ చెప్పుటకాదు. వ్యవసాయాభివృద్ధికరమగు చిన్నచిన్న పనులనుగూడ నెట్లు నిలిపియుంచిరో ప్రభుత్వప్రకటనము వలననే సుబోధకమగుచున్నది. 1932 వ సంవత్సరమున నీటిపారుదల యభివృద్ధి సంఘమువారు గావించిన సూచనలను, అందుపై ప్రభుత్వము వారు గావించిన నిర్ణయములను పరీక్షించుచో, వ్యవసాయాభివృద్ధి కవసరమగు చిల్లరపనులగూడ నిర్లక్ష్యముగ చూచుచున్నారని చెప్ప గలము.

ఇంతటి చిల్లరపనులనుగూడ నెరవేర్పకపోవుటకు గల కారణ మేమి? డబ్బు కొఱవడినదనియే ప్రభుత్వపుసాకు. ఆయేటి కాయేడు భూమిపన్ను హెచ్చుచున్నను, క్రొత్త ప్రాజెక్టుల నిర్మాణమునకు, మరమ్మతులకు ప్రభుత్వమున కాదాయము సరిపోవుటయే లేదు.

అన్నింటికంటె ముఖ్యముగ వ్యవసాయాభివృద్ధికై ఎంతధనమైన విని యోగింపవలెనను సిద్ధాంతమును ప్రభుత్వమువా రంగీకరింపవలయును.

ఈదిగువ పట్టిక ననుసరించి మదరాసు రాజధానియందు వ్యవసాయమున కెంత స్వల్పముగ ప్రభుత్వమువారు వినియోగించుచున్నదియు తెలిసికొనగలము.

| | రు | అ | పై |
|---|---|---|---|
| 1 మదరాసు | 24 | 0 | 0 |
| హిందూదేశము | 33 | 10 | 8 |
| జపానుదేశము | 216 | 15 | 0 |
| ఫ్రాన్సుదేశము | 948 | 0 | 0 |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | 1681 | 0 | 0 |

ప్రతి 1000 మంది జనసంఖ్యకు ఆయాదేశము లెంతసొమ్ము వ్యవసాయాభివృద్ధికై వినియోగించుచున్నదియు పైఅంకెలు తెలుపుచున్నవి. అన్ని దేశములకంటె భారతదేశమున అత్యల్పము. స్వల్పముగ వ్యవసాయాభివృద్ధికై ప్రభుత్వాదాయము వినియోగించుచున్న దేశమున వ్యవసాయఫలితముగూడ స్వల్పముగ నుండుటయం దాశ్చర్యములేదు.

"ప్రస్తుతమున్న సాగుబడిభూమిని ప్రపంచమునం దితరదేశములతో పోల్చి చూచినచో హిందూదేశమునందే పల్లపుసాగుబడి భూమి హెచ్చుగనున్నదని తేలుర.

| | |
|---|---|
| బ్రిటిషుఇండియా | య 31700000 లు |
| అమెరికా సంయుక్తరాష్ట్రములు | య 20000000 లు |
| జపానుదేశము | య 7000000 లు |
| ఈజిప్టు | య 6000000 లు |

1. *From Sir K. V. Reddinayudu's Evidence before Royal Agricultural Commission, Vol. III. P. 381.*

| | |
|---|---|
| మెక్సికో | య 5700000 లు |
| ఇటలీ | య 4500000 లు |
| స్పెయిను | య 3500000 లు |
| ఫ్రాన్సు—చిలీ, జావాలకు సగటున | య 3000000 లు |

మాత్రమేగలదు.” అని 1930-31వ సంవత్సరపు ఇండియాప్రభుత్వపు నివేదికయందు వ్రాయబడెను. ఇట్లు వ్రాయుచు వ్యవసాయాభివృద్ధికి ప్రభుత్వము చేయగలిగినదంతయు చేయుచున్నటుల సూచించెను. ఇది తలక్రిందుల వాదము. ఎకరములసంఖ్యను గమనించి యభివృద్ధియని తలంపరాదు. ఆఎకరములవలనవచ్చుచున్న ఫలసాయమెంత? తల 1కి ఫలసాయమెంత? తల 1కి ఇతరఫలసాయములెంత? ఏదేశమున వ్యవసాయముపై యెంతమంది జీవించుచున్నారు? ఈప్రశ్నలకువచ్చు సమాధానముల నన్నియు పరీక్షించినగాని వ్యవసాయాభివృద్ధి తెలిసికొనజాలము.

ఈదిగువ పట్టికవలన ఏదేశమునందెంతమంది ప్రజ లేవృత్తి మీాద జీవించుచున్నదియు తెలియగలదు.

| దేశము | వ్యవసాయము వలనజీవించు వారు 100 కి | పరిశ్రమల వలనజీవించు వారు 100 కి | వర్తకమువలన జీవించువారు 100 కి |
|---|---|---|---|
| అమెరికా | 22.0 | 29.3 | 15 |
| జర్మనీ | 30.5 | 38.1 | ... |
| ఫ్రాన్సు | 38.3 | 31.1 | 12.9 |
| కెనడా | 35.0 | 26.9 | 13.0 |
| ఇంగ్లాండు-వేల్సు | 7.0 | 40.0 | 14 0 |
| భారతదేశము | 71.2 | 11 2 | 5.9 |

సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్యగారి పైఅంచనాననుసరించి అన్నిదేశములకంటె భారతదేశమునందు వ్యవసాయముపై అధికసం

ఖ్యాకు లాధారపడియుండిరనియు, నితరవృత్తులపై జీవించువారు అల్ప ముగ నుండిరనియు తేలుచున్నది. అన్ని దేశములకంటె రెట్టింపుజన సంఖ్య వ్యవసాయముపై జీవించుచుండగ వ్యవసాయపుభూమి రెట్టింపు గలదా? లేదు. అమెరికాకంటె మూడువంతులమంది మనదేశమున వ్యవసాయముపై జీవించుచున్నారు. వ్యవసాయపుభూమి అమెరికా కంటె మూడింతలధికముగ గలదా? లేదు. అమెరికాకంటె 1 టిన్నర వంతుమాత్రమే అధికముగ గలదు. ఇట్లే ఇతరదేశముల ఆదాయము ననుసరించి పరీక్షించినను, మనదేశమున తక్కువఆదాయమే గలదు.

త 1 కి గల ఆదాయము.

| దేశము. | వ్యవసాయము వలన | పరిశ్రమలవలన | మొత్తము |
|---|---|---|---|
| అమెరికా | 286 | 1300 | 1586 |
| కెనడా | 464 | 1047 | 1511 |
| బ్రిటిషు దీవులు | 80 | 808 | 888 |
| స్వీడను | 129 | 384 | 513 |
| జపాను | 85 | 120 | 205 |
| భారతదేశము | 67 | 13 | 80 |

1932 న సంవత్సరమున సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య గారు గావించిన పైమదింపుల ననుసరించి చూచినను, వ్యవసాయా దాయము భారతదేశమున అత్యల్పము. అధికముగ నితర దేశముల కంటె సాగుబడిభూమి కలిగియుండుటయే వ్యవసాయాభివృద్ధికి తార్కాణ మనదగదు.

ప్రభుత్వమువారు తలపెట్టిన పైనూతనస్కీములు పెద్దవినాలు గును పూర్తిజేసినను 100 కి 22 ఎకరములు మాత్రమే ప్రభుత్వ కృషి

వలన వ్యవసాయము జరుగుచున్నదనవలెను. 1929-30 వ సంవత్సరమున పల్లపు సాగునకు నీరుఅందిచ్చు కాలువలు మొదలగు మార్గములు 75000 మైళ్ళ పొడుగున గలవు. గవర్నమెంటువారు గావించిన నీటిపారుదల వసరులవలన పండినపంటల కిమ్మతు 128 కోట్లుండునని మదింపు. 1925-26 మొదలు 1929-30 వ సంవత్సరము వఱకు గల 5 సంవత్సరములలోను సగటున సాలుసరి రు 137 కోట్ల విలువగల పంటలు ప్రభుత్వమువారొనరించిన నీటివసరులవలన గలిగెనని మదింపు. 1929-30 వ సంవత్సరాంతమునకు పల్లపుసాగు కట్టడములపై 130 కోట్లు వినియోగింపబడెను. ఇందుపై రు 12.9 కోట్లు రాబడి వచ్చెను. ఇందులకు ఖర్చు రు5.9 కోట్లు. అనగా 100 కి 5.4 వంతులు ప్రభుత్వమునకు నికారాదాయము. 1920-1921 వ సంవత్సరమున 42.2 కోట్లు పెట్టుబడి గలదు. 1927-28 వ సంవత్సరమున 115.3 కోట్లు గలదు.

దక్కనునందు పల్లపుసాగు పెట్టుబడిపై ప్రభుత్వమునకు 100 కి 1 లేక 2 వంతులును, పంజాబునందు 100 కి 15.08 వంతులును, మదరాసునందు 8.9 వంతులును, సంయుక్తరాష్ట్రములయందు 100 కి 5.56 వంతులును నికారాదాయము వచ్చుచున్నది. ఈఆదాయములలో శారదా, అయోధ్య కాలువలును, సట్లెజ్ వాలీ ప్రోజెక్టును, లాయడ్ బారేజి ప్రోజెక్టును, మెట్టూరు ప్రోజెక్టులపై నచ్చునను తలంపబడు ఆదాయములను కలిపి మదింపు వేయలేదు.

ప్రభుత్వమువారు పెద్ద కాలువలను మాత్రమే త్రవ్వించుచున్నారు. పిల్లకాలువలను రైతులే త్రవ్వించుకొనుచున్నారు. సింధు దేశమునందీ నీటిపన్ను భూమిసిస్తులో కలిసియున్నది. మదరాసు, బొంబాయి రాజధానులయందు కొన్ని ప్రాంతములలో భూమిసిస్తు

ప్రత్యేకముగ గలదు. పల్లపుసాగు పన్నులో నీటిపన్ను గూడ చేరి యున్నది. వంగదేశమున నీరు పెట్టినను పెట్టుకొనకపోయినను గూడ కొలదిగనైన భూమిపన్ను చెల్లించియే తీరవలెను. ఇతర ప్రదేశముల యందు నీటిపన్ను ప్రత్యేకముగ గలదు.

# 39. వ్యవసాయాభివృద్ధి ప్రభుత్వశాఖలు.

వ్యవసాయమునందు నూతనవిషయములు గ్రహింపబడి వ్యాప్తి చేయబడుటకు విశేష ప్రయత్నములు ప్రభుత్వ వ్యవసాయశాఖలచే నొనరింపబడలేదు.

మొట్టమొదట 1866 వ సంవత్సరమున ఓఢ్ర, వంగదేశముల యందు సంభవించిన క్షామకాలమున క్షామవిచారణసంఘము వ్యవసాయశాఖ నొకదాని నేర్పరుపవలయునని సూచించెను. ఈసూచన గాలికెగురగొట్టబడెను. 1869 వ సంవత్సరమున ప్రత్తిపంట యభివృద్ధి పరచుటకై ప్రతిరాష్ట్రమున వ్యవసాయశాఖలను స్థాపింపవలెనను సూచన మాంచెష్టరునకు ప్రత్తి యెగుమతి చేయువారు (Manchester Cotton Supply Association) గావించిరి. ఈసూచనయు నాటిప్రభుత్వమువారి మన్ననకు పాత్రముకాలేదు. కాని హిందూదేశపు ప్రభుత్వ పరిపాలనక్రింద 1871 వ సంవత్సరం జూన్ మాసమున వర్తక, వ్యవసాయక, రివిన్యూశాఖలనుగలిపి యొకశాఖ నేర్పరిచిరి. "ఈశాఖ 1879 వ సంవత్సరము వఱకును పని జేసినది. అంతట ముగింపబడెను. ఈశాఖ వ్యవసాయాభివృద్ధికర సమస్యలపై నెట్టికృషిగాని చేసినదని చెప్పుటకు వీలులేదు." అని వ్యవసాయ విచారణసంఘమువారే వ్రాసిరి.[1]

---

1. *Agricultural Commission Report Page 15.*

లార్డుమేయోగారి ప్రభుత్వమున జరిగినకృషి యిదియే. 1880 వ సంవత్సరపు క్షామనివారణసంఘ నివేదిక వ్యవసాయసమస్యను సాకల్యముగ విమర్శించెను. వ్యవసాయాభివృద్ధికరములగు సూచనలెన్నియో కావించెను. కఱవులు రాకుండనుండుటకై వ్యవసాయాభివృద్ధియే ముఖ్యమనెను. వ్యవసాయాభివృద్ధికై ప్రతిరాష్ట్రమునందును వ్యవసాయశాఖలను స్థాపింపవలెను. గ్రామజీవనము పునరుద్ధరింపబడుట అత్యవసరమనెను. వీరి సూచనలన్నియు నిష్ప్రయోజనములైనవి. హిందూదేశ ప్రభుత్వముపట్ల నీసూచనలు చెవిటివానియొద్ద శంఖమూదినట్లయ్యెను. తర్కవితర్కములతో కాలము ముగిసెను.

మదరాసు రాజధానిలో 1863 వ సంవత్సరమున అప్పటి గవర్నరు సర్ విలియమ్ డెన్షన్‌గారు (Sir William Dension) వ్యవసాయాభివృద్ధి విషయమై యోచింపసాగిరి. వ్యవసాయ పరికరములు సక్రమముగ లేవని తలంచిరి. ఎరువుచేయుట రైతులకు నేర్పదలంచిరి. వలయునన్ని చెట్లు లేవనుకొనిరి. పశుసంతతినీరసముగనున్నట్లు నిశ్చయించిరి. పల్లపుసాగు, విద్య, తక్కువపన్ను, నూతన పరికరములు, వ్యవసాయము నభివృద్ధిపరచగలవని విశ్వసించిరి. నూతన పరికరములపై వీరిదృష్టి కేంద్రీకరింపబడెను. దున్నుటకు, కోయుటకు, ఊడ్చుటకు, కుప్పలు నూర్చుటకు, నీరుపెట్టుటకు మొదలగు వ్యవసాయపు పనులకన్నింటికి ఇంగ్లండునకు వ్రాసి, నూతన యంత్రములను దెప్పించిరి. ఈపనిముట్లతో సైదాపేటయందు వ్యవసాయముజేయుటకు ప్రారంభించిరి. సైదాపేట మదరాసునకు 6 మైళ్ళ దూరమున గలదు. ఇందు 350 ఎకరముల ఖండము గలదు. ఈపనిముట్లను నీపొలమును 1864వ సంవత్సరమున నొక సంఘమున కొప్పగించిరి. ఈసంఘము 1871 వ సంవత్సరము వఱకు వ్యవసాయము జేసెను. ఆనాటికి పనిముట్లు పాడయినవి. సంఘసభ్యులు నిరుత్సాహులయిరి. వీరికృషి నిష్ఫలమయి

నది. ఇందులకు కారణమేమి? వ్యవసాయవిచారణ సంఘమిట్లు వ్రాసెను.

"మొట్టమొదట స్థానిక సౌకర్యములను అసౌకర్యములను విచారింపలేదు. సుశిక్షితులగు పరిశోధకులు లేరు. పరిచారకులు లేరు. భూమి రాజధానియందలి ప్రశస్తమగు భూమితో సమానమగు భూమికాదు. ప్రత్యేకస్థితిగల భూమియైన గాదు. పాశ్చాత్యదేశమున విజయము పొందిన పద్ధతులే హిందూదేశమున గూడ జయమగునని యూహప్రారంభించిరి." 1

ఈసంఘమువారు విఫలము పొంది కృషి విరమించుకొనిన పిమ్మట ప్రభుత్వమువారీ పరికరములను స్వాధీనపరచుకొనిరి. పిమ్మట క్రియారూపమగు పనియేమియు లేదు. తర్కవితర్కములతో నొకదశ ముగిసినది. 1876 వ సంవత్సరమున సైదాపేటయందే వ్యవసాయ కళాశాలను స్థాపించిరి. 1884 వ సంవత్సరమునందీ కళాశాలపై యధికారము రివిన్యూబోర్డువారు విరమించుకొనిరి. విద్యాశాఖ డైరక్టరున కొసంగిరి. 1905-6 వ సంవత్సరము వఱకు నీ కళాశాల విద్యాశాఖాధికారిచే పరిపాలింపబడెను. వ్యవసాయశాఖ స్థాపించినది మొదలు వ్యవసాయశాఖచే పరిపాలింపబడుచుండెను. సైదాపేట యందలి వ్యవసాయ ప్రదర్శనశాల 1885 వ సంవత్సరమునందే మూసివేయబడెను. కళాశాలకు సంబంధించిన కొలది భాగము మాత్రము గలదు. 1885 వ సంవత్సరము నుంచియు వ్యవసాయశాఖ యున్నను వ్యవసాయపు లెక్కను వేయుటయే వారిపని. 1863 వ సంవత్సరము మొదలు 1900 సంవత్సరము వఱకు మదరాసు ప్రభుత్వము వ్యవసాయాభివృద్ధికి జేసిన పనియేమి? మొట్టమొదట పెట్టిన సైదాపెట వ్యవసాయశాల వ్యయప్రయాసలకు లోనై నిష్ఫలమైనది. నిరుపయోగమైనది. పిమ్మట వ్యవసాయవిద్యాప్రచార మనుపేర షహర

1. *Agricultural Commission Report Page 28.*

యొడారివంటి వాదప్రతివాదములతో కాలము ముగిసినది. కడపట వ్యవసాయమునకు సంబంధించిన లెక్కల కూడికలు, తీసివేతలతో ప్రొద్దుపుచ్చుకొనిరి. కొలదిమంది పెద్ద యుద్యోగులు మాత్రము పోషింపబడిరి.

ఇదియే ఫలితము. 1895-97 సంవత్సరములమధ్య గోదావరి జిల్లాయందలి చెఱకుపంటకు తెగులుపట్టినది. 1898 వ సంవత్సరమున వేరుశనగపంట దిగనాసిలినది. 1903-4 సంవత్సరములలో మిరియపు పంటకు తెగులుతగిలినది. ఇట్లే ప్రత్తిపంటవిషయమై యోచింపవలసి వచ్చినది. ఈపరిస్థితులచే ప్రభుత్వదృష్టి శుష్కతర్కములనుండి మరలుట విధియైనది. విదేశములనుండి వేరుశనగవిత్తులను దెప్పించిరి. కలెక్టర్ల మూలముగ నీవిత్తులక్కడక్కడ సంభావనగ నిప్పించిరి. 1901 వ సంవత్సరమున ప్రత్తిపంట విషయమై పరిశోధనజేయుటకు బళ్ళారియందు, తిరునల్వేలియందు వ్యవసాయ పరిశోధనశాలలను స్థాపించిరి. అనంతపురమునందుగూడ నిట్టిశాలను పెట్టిరి. 1905 వ సంవత్సరమునకు పూర్వము వ్యవసాయాభివృద్ధికై ప్రభుత్వము జేసిన మహాకృషి.యిదియే.[1]

1899-1905 లో లార్డుకర్జన.గారు వైస్రాయిగ నుండిరి. ఈకాలమున వ్యవసాయశాఖ నొకదాని నేర్పరచిరి. 1898 లో హిందూదేశ రాజ్యాంగకార్యదర్శిగారు డాక్టరు వోవెల్కారు (Vovelker) గారిని భారతదేశసంచార మొనరింప నియమించెను. ఈయన సంచార మొనరించి గావించిన సూచనలననుసరించి ఇద్దరు ప్రత్యేకోద్యోగస్థులు నియమింపబడిరి. 1904లో పూసాయందు(Imperial Institute of Agriculture) కేంద్రవ్యవసాయసంస్థ స్థాపింపబడినది. పూసా బీహారులో దర్భాంగు జిల్లాయందుగలదు. ఇందులకు పౌ 30000 ల విరాళ మొసంగబడెను.

---

1. *From The Agricultural Commission Report Page 23—24*

ఈసంస్థకు (Henry Philiphs of Chicago) హెన్రీఫిలిఫ్సుగారు పౌ 10000 లు విరాళ మొసగిరి. 1905 నుంచియు భారతప్రభుత్వము వ్యవసాయాభివృద్ధి యనుపేరిట రాష్ట్రప్రభుత్వములకును, పూసాసంస్థకును ప్రతిసాలున రు 20 లక్షలు ఖర్చుపెట్టుచున్నది. ఈసంస్థయందు వ్యవసాయశాస్త్ర ప్రవీణులను నియమించిరి. ఈపేరుమీదుగ 8 గురుద్యోగస్తులు నియమింపబడిరి. వ్యవసాయకళాశాలగూడ నిచ్చట నడుపబడుచున్నది. ఈసంస్థయున్న సంగతికూడ రైతులెఱుంగరు. ఇందువలన కలిగిన ప్రతిఫలము సాలునకు 20 లక్షలు ఖర్చుపెట్టుటతప్ప మరేమియు లేదనుట సాహసముకాజాలదు. "పూసాసంస్థ హిందూదేశమున వ్యవసాయోద్యమము నేవిధముగనైన పూర్తిగ నాకర్షింపగలిగియుండునను ఆశ నెరవేరలేదు" అని వ్యవసాయ విచారణసంఘమువారే వ్రాసిరి.[1]

కేంద్ర వ్యవసాయశాఖ (Imperial Department of Agriculture) వారు మరికొన్ని పనులొనరించుచున్నారు. పశువులను పోషించుట, పశువులను పెంచుచు పాలు, వెన్న మొదలగునవి ప్రశస్తముగ తయారుజేయుట, (Animal Husbandary and dairying) కొఱకు, కార్నల్ (Karnal) బెంగుళూరు, వెల్లింగుటన్ (Wellington) ల యందు సంస్థ లేర్పరుపబడినవి. ముక్తేశ్వరము నొద్దగల పశురోగ వైద్యపరిశోధనశాల గూడ భారత వ్యవసాయశాఖవారి పరిపాలన యందే గలదు. (Veterinary Research). 1915 వ సంవత్సరమునందు వ్యవసాయ పరిశోధనశాలలు రాష్ట్రప్రభుత్వముల యధీన మొనరింపబడినవి. 1925_26 వ సంవత్సరమునందు వ్యవసాయ పరిశోధనశాలలు భారతదేశమందంతట 182 మాత్రమే గలవు. ఇవి 2 ఎకరములు మొదలు 2251 ఎకరముల విస్తీర్ణము గలవిగ నున్నవి.

1. *Agricultural Commission Report P. 30.*

ప్రభుత్వ వ్యవసాయశాఖాధికారులు వీటిని పాలించుచున్నారు. ఈశాఖవారు నూతనపరిశోధనముల జేయుటయేగాక, వ్యవసాయవిష యముల ప్రదర్శనము లేర్పరచుటయు, ప్రచారము గావించుటయు, వ్యవసాయపు ఆధునికపనిముట్లను, విత్తనములను అమ్ముటయు, పంచి పెట్టుటయు చేయవలసియున్నది. ఈపనులయందేపనియు ఈపరి శోధనశాలలు తృప్తికరముగ గావించుటలేదు. ఇవియున్నట్లు రైతుల కైనను తెలియదు.

1915 వ సంవత్సరమునకు 29 గురు వ్యవసాయ ప్రత్యేకోద్యో గులును, 22 ఇతర పెద్దయుద్యోగులు, మరికొంతమంది యుద్యోగులు మాత్రమే యీశాఖలలో హెచ్చు జీతములమీద పోషింపబడు చున్నారు. వ్యవసాయరాష్ట్రశాఖాధికారులు (డైరక్టర్లు) ఇండియన్ సివిల్‌సర్వీస్‌నందు నుండియే నియమింపబడుచు వచ్చిరి. ఇప్పుడిప్పుడే వ్యవసాయశాస్త్రజ్ఞులు నియమింపబడుచున్నారు. స్వదేశసంస్థానములు, బరోడా, మైసూరు, ట్రావెన్కూరు మొదలగునవికూడ నీవ్యవసాయ శాఖవంటి శాఖలనే తమరాజ్యములయం దేర్పరచెను.

1914 సం॥రపు వ్యవసాయపు పురుగులు, పక్షులను చంపు చట్ట మెన్నడును ఆచరణయందుంచబడలేదు. ఆంబోతులను పెంచి పశుసం తతి యభివృద్ధియగునట్లు చేయుటకూడ వ్యవసాయశాఖ వారి ధర్మముల యందొకటిగ నిర్ణయింపబడియున్నది. ఇట్లుపోషించినవాటిని ఎవరైన కొనుచో వాటిని పోషించుటకు రు 30 లు మొదలు రు 80 ల వఱకు రకము ననుసరించి విరాళమొసంగవలెనను నియమముకూడ గలదు. ఈ నియమావళి మచ్చునకైన విరివిగ నమలునందుంచబడుటలేదు. 1930 ప్రారంభమున సగటున జిల్లా 1 కి ఒక ఆంబోతు చొప్పున మాత్ర మొసంగుటకు ప్రయత్నింపబడుచుండెను.

పశువైద్యశాఖవారు బుడ్డలను అప్పుడప్పుడు గొట్టుచున్నారు. 1926_27 వ సంవత్సరమున 282826 గి. త్తలకు బుడ్డలు గొట్టబడినవి. వ్యవసాయ కళాశాలలు 6 నిర్మింపబడినవి. పూన, కోయంబత్తూరు, నాగపురము, కాన్పూరు, లాయలుపూరు, మాండలేలయందున్నవి. రెండవతరగతి కళాశాలలు బెంగుళూరు, పూసాలయందు కూడగలవు. మూడవతరగతి ఉన్నత వ్యవసాయ పాఠశాలలు లేవు. వ్యవసాయవిద్య నాధారముగజేసి, విద్యాభ్యాస మొసగగల ప్రాథమిక విద్యాలయములులేవు. కార్మికులకు, వ్యవసాయదారులకు, వ్యవసాయదార్ల పిల్లలకు ఎవరికిని ఏవిధమగు వ్యవసాయవిద్యయు దేశభాషలయం దొసగబడు ప్రయత్నమేమియు జరుగలేదు. కళాశాలయందు పాశ్చాత్య విద్యాభ్యాసము పొందినవారికి వ్యవసాయవిద్య నభ్యసించుటకు కళాశాలలుండుటవలన కలుగు లాభములేదు. ఆకళాశాలలైనను దేశము మొత్తముమీద ఆరుమాత్రమే కలవుగదా !

ఈ వ్యవసాయశాఖవారి కృషివలన 1929-30 వ సంవత్సరమున 13484926 ఎకరములు అనగా మొత్తపు సాగుబడిభూమిలో 100 కి సుమారు 6 ఎకరములు మాత్రమే క్రొత్తపద్ధతులపై వ్యవసాయము చేయబడుచున్నది. దీనిననుసరించి వ్యవసాయాభివృద్ధి యెంతస్వల్పముగ జరిగినదియు వ్యక్తపడుచున్నది.

# 39. ముగింపు

ఇంతవఱకు వ్యవసాయసమస్యలన్నియు విమర్శింపబడినవి. భారత దేశమునందు వ్యవసాయ మధోగతియందున్నదని గ్రహించితిమి. ఇందులకు రెండుకారణములు గోచరించుచున్నవి. 1890 వ సంవత్సర

ప్రాంతీయుల వరకు వ్యవసాయ విషయములయందు పూర్తి విజ్ఞానమును బడయజాలని బ్రిటిషుదీవులు నాటికి హిందూ దేశమునుండి వ్యవసాయ విజ్ఞానము నార్జింపవలసిన స్థితియందే యుండుటచే భారతీయులకు నూతన విషయ ప్రబోధము గావింపజాలకపోయినవి. వ్యవసాయమున సంపూర్ణ వికాసమునొందని బ్రిటిషుదీవులచే భారతభూమి పరిపాలింపబడవలసి వచ్చుటచే తన సహజపరివర్తనమును గోల్పోవుట విధియైనది. పరిపాలనా విధానమునందుగూడ వ్యవసాయాభివృద్ధి సమస్య కర్హస్థానము లభింపలేదు. భారత దేశ ప్రభుత్వయంత్రమున వ్యవసాయసమస్యకు ప్రాముఖ్యస్థానము లభించినగాని భారత దేశమునం దార్థికాభివృద్ధి జరుగనేరదు. భారత దేశ వ్యవసాయాభివృద్ధికి చేయవలసిన ముఖ్యవిషయములయందైన వెంటనే శ్రద్ధవహింపవలసియున్నది.

1. అధికపుపన్నులను తగ్గించివేయవలెను. జమీందారీ రైతులపై విధింపబడుచున్న అధికపు కట్టుబడులను తగ్గింపవలయును.

2. నిరకునామాపద్ధతి వ్యవసాయాభివృద్ధికరముగ మార్పవలయును.

3. ఎరువుల ఎగుమతిని నిషేధింపవలయును. సమిష్టివ్యవసాయమును ప్రవేశపెట్టవలయును.

4. దేశమునందాహారమునకు వలయు పదార్థముల ఎగుమతి సక్రమముగ నిషేధింపవలెను. ఇట్లే విదేశములనుండి వచ్చు సుంకరహిత పోటీచేయు చవుకదినుసుల దిగుమతికూడ నిషేధింపవలెను.

5. పరిశ్రమలకును, వ్యవసాయమునకును పరస్పర విరోధము రాని ఆర్థికనీతినవలంబింపవలసి యున్నది. ఎట్లన 1924 సం॥రపు ఉక్కు సంరక్షణ చట్టమున జమ్షెడుపూరునందు తయారుచేయబడుచున్న (అగ్రికల్చ

రల్ ఇంప్లిమెంట్సు కంపెనీ లిమిటెడ్) వ్యవసాయపు పనిముట్ల సంరక్షణకై దిగుమతియగు వ్యవసాయపు సరకులపై 100 కి 10 మొదలు 25 ల వరకు దిగుమతిపన్ను విధించెదమని ప్రభుత్వమువారనిరి. ఇందు వలన వ్యవసాయపు పనిముట్లకు కంపెనీవారి పరిశ్రమకు ప్రోత్సాహము కలుగుట వాస్తవమే. (ప్రభుత్వమునకు రాబడివచ్చును.) కాని వ్యవసాయదారులు దిగుమతిఅయిన పనిముట్లు కొనవలసివచ్చుచో, నధికపు ఖరీదు పెట్టవలసివచ్చును. అందుచే వ్యవసాయదారులకు నష్టము రాగలదు. ఇది యోచించి ప్రజాప్రతినిధులు ఆశాసనమండలి ఆనియమమును సక్రమముగ త్రోసిపుచ్చిరి. ఇందులో పరిశ్రమకును వ్యవసాయాభివృద్ధికిని పరస్పరము విరోధస్థితిని గోచరింపజేసిరి. ఈ వైరుధ్య మనవసరము. ప్రభుత్వమువారు వ్యవసాయపుపనిముట్లకంపెనీవారికి అభివృద్ధి నిమిత్తము ప్రతిసాలున (Subsidy) కొంతవిరాళమిచ్చియున్నచో ఆకంపెనీకూడ అభివృద్ధిపొందెడిది. అట్లుచేయలేదు. ఇట్లు పరస్పర వైరుధ్యమువచ్చు విషయములయందిట్లు విరాళముల నొసగుచో పరిశ్రమలు, వ్యవసాయముకూడ పరస్పరాధారములై అభివృద్ధి పొందగలవు.

6. వ్యవసాయ ప్రాథమిక, మాధ్యమిక ఉన్నతకళాశాలవిద్యలు ప్రజలకు లభించుటకు తగుపర్పాటు లొనరింపవలెను. ఇంతవఱకు ప్రత్యేక వ్యవసాయవిద్యయేకాక మామూలు ప్రాథమికవిద్యగూడ ప్రజలకు గఱుపలేదు. నిరక్షరకుక్షులగు ప్రజలు వ్యవసాయశాస్త్రవిషయముల గ్రహింపజాలరు. వ్యవసాయవిషయమైన ప్రచారము గ్రామములవెంట నిరంతరము చేయింపవలెను.

7. వ్యవసాయాభివృద్ధితోపాటు నాశనమొనరింపబడిన గృహపరిశ్రమలు పునరుద్ధరింపవలసియున్నవి. వ్యవసాయములేని కాలముల

యందీ పరిశ్రమలవలన కొంత ధనార్జనకు వీలుండును. ముఖ్యముగ ఆహారమును పండించుటతోబాటుగ వస్త్రములను వడుకుట, నేయుట పూర్వకాలమువలె పునరుద్ధరింపబడుచో రైతు దరిద్రదేవతనుండి తప్పించుకొనగలడు. మరియు ప్రత్తిపరిశ్రమ గృహపరిశ్రమగ ప్రారంభించినచో రైతునకు ఎరువుగూడ లభింపగలదు. (ప్రత్తిగింజలు). దీనితోపాటు పశుపోషణము నభివృద్ధిపరచుచో వాటి మలపు ఎరువు గూడ లభింపగలదు. గృహపరిశ్రమల పునరుద్ధరించుచో మరల గ్రామజీవనము సజీవము కాగలదు.

8. వ్యవసాయాభివృద్ధికి, భారతవ్యక్తిత్వమునకును, సంఘజీవనమునకును ననుగుణ్యముగ అమెరికాదేశమునుండియు రష్యానుండియు మనముగ్రహింపవలసిన నూతనవిషయము లనేకములు వ్యవసాయమునందు గలవు. వారివలె నూతనయంత్రముల నుపయోగింపవలయును. వ్యవసాయ విచారణసంఘము (Royal Agricultural Commission) వారి రిపోర్టులో వ్యవసాయసమస్య సమగ్రముగ విచారింపబడలేదు. ప్రస్తుత వ్యవసాయపరిస్థితులను గ్రామ ఆర్థిక జీవితములనుగురించి మాత్రమే వారు విచారింప నియమింపబడిరి. అందుచే వారి రిపోర్టునందు పన్నులను గురించి చర్చింపలేదు. పన్నులవిషయమై సమగ్రముగ చర్చింపబడినగాని, వ్యవసాయవిషయచర్చ పూర్తికాజాలదు. అయినప్పటికి వారి రిపోర్టునందు గ్రామజీవనముపై వ్రాసిన విషయములు గమనింపదగి యున్నవి.

"రోగపీడనమువలన కలుగుచున్న ఆర్థికనష్టమింతయని వ్రాయజాలము. సంరక్షణలేని మంచినీళ్ళనూతులు, చెరువులు, ఊడ్చుటలేని గ్రామవీధులు, గాలివచ్చుటకు వీలులేని గుడిసెలు సగటున ప్రతి

గ్రామమునందున గలవు. గ్రామజీవిత మిట్టిమిడియున్నది. అయినను గ్రామస్థులు (చిరకాలానుగత ఆచారములనుబట్టి) స్వయముగ పరిశుభ్రతయందు, ఆరోగ్యమునందు శ్రద్ధవహించుచున్నారు." దీని ననుసరించి భారతీయ చిత్తవృత్తియందుగాని, నాగరికమునందుగాని అనారోగ్యముగ, అపరిశుభ్రముగ నుండుటను ప్రోత్సహించు దుర్గుణములులేవని విస్పష్టము. ప్రస్తుత ఆర్థికదుస్థితియే గ్రామజీవనము రోగపూరితమొనరించి, అనారోగ్య అపరిశుభ్రముల పాలొనరించినదని తేలుచున్నది. ఈ ఆర్థికదుస్థితినుండి గ్రామవాసులు తెప్పరిలినగాని వ్యవసాయాభివృద్ధి కాజాలదు.

ఈ కమిషనువారు వ్యవసాయాభివృద్ధికి అఖిలభారతవ్యవసాయకమండలి అనునొక సంస్థ నేర్పఱచుట యవసరమని సూచించిరి. ఈసూచన ననుసరించి ప్రభుత్వమువారా సంస్థ నేర్పఱచిరి. ఈసంస్థకధికారముగాని, ఆర్థికముగాని లేదు. దీనివలన అందలిసభ్యులకు రాకపోకలఖర్చు లత్యధికముగ నగుచున్నవి. ఈమూలముగ ఫలితము లేకపోవుటయేగాక నష్టముగూడ సంభవించినది. ఈకమీషనువారు మరికొన్ని సూచనలను గావించిరి.

1. వ్యవసాయపరికరములు, కలప, వంటచెరుకు, ఆహారపదార్థముల ఎగుమతి దిగుమతులపై విధింపబడుచున్న రైలురేట్లను గురించి యోచింపవలెననిరి.

2. వ్యవసాయమును పాడుచేయు పురుగులు, పశువులనుండి వ్యవసాయమును సంరక్షించుటకు మార్గముల నరయవలెను.

3. విఖండభూములను కలుపు యేకమళ్ళ గ మ నిం చు ట కు వలయు శాసనములు గావింపవలెను.

4. పశురోగములు వ్యాపించకుండ నిరోధమార్గముల నరయ వలెను.

5. పల్లెలయందు స్త్రీసంఘములు (ప్రబోధమునకు వీలుగ నుండునట్లు) ఏర్పరచవలెను.

6. వ్యవసాయోత్పత్తి పదార్థముల అమ్మకమునకై నియమముల ననుసరించిన సంతల నేర్పరచవలెను.

7. ఇట్లు సంతలనేర్పరుచుటకు ప్రతిరాష్ట్రప్రభుత్వము వ్యవసాయశాఖకు చేర్చి యొక యుద్యోగిని నియమింపవలెను. ఇందే సూచనగాని ఆచరణయందింతవఱకు నుంచబడలేదు.

ఇట్టి అనేకసంస్కరణములు వ్యవసాయాభివృద్ధికి వెనువెంటనే ఆచరింపవలసియున్నవి. ఇన్ని యేల ? మరల గ్రామజీవనము సర్వతోముఖముగ నభివృద్ధి పొందినగాని ప్రజల ఆర్థికస్థితి చక్కబడజాలదు. నిర్జీవమైయున్న గ్రామజీవనము సజీవముగ నెంతత్వరితముగ చేయగలుగుదుమో అంత శీఘ్రముగ దేశము సిరిసంపదలతో నోలలాడగలదు.



# భారతదేశము-ఆర్థికచరిత్ర

## రైతులఋణము—సహకారోద్యమము.

### 6 వ అధ్యాయము.

సాంకేతికపదములు_GLOSSARY.

| | |
|---|---|
| సహకారము | = Co-operation |
| సహకారపరపతిసంఘములు | = Co.operative Credit Societies |
| అపరిమితబాధ్యత లేక సముష్టి బాధ్యత | = Unlimited liability |
| బాధ్యత లేక పూచీ | = Liability |
| పరిమితబాధ్యత లేక వ్యష్టిబాధ్యత | = Limited Liability |
| వాటాసొమ్ము లేక వాటాధనము | = Share Capital |
| ఉత్పత్తిసంఘములు | = Production Societies |
| గృహనిర్మాణసంఘములు | = Housing Societies |
| వినియోగసంఘములు | = Consumers Stores |
| క్రయవిక్రయసంఘములు | = Purchase and Sale Societies. |
| క్రయోత్పత్తిసంఘములు | = Production and Sale Societies. |
| వ్యవసాయ ప్రాథమిక పరపతి సంఘములు | = Primary Agricultural Credit Societies |
| వ్యవసాయేతర ప్రాథమిక పరపతి సంఘములు | = Primary Non-Agricultural Credit Societies |

ఋణేతర వ్యవసాయ సహకార సంఘములు = Non-Credit Agricultural Societies

ఋణేతర వ్యవసాయేతర సహకార సంఘములు = Non-Credit Non-Agricultural Societies.

సార్థకము = Productive

నిరర్థకము = Unproductive

పరిశీలన = Supervision

డిపాజిట్టు లేక నిక్షేపము = Deposit

వ్యాపారపుపెట్టుబడి = Working Capital

మూలధనము = Reserve Fund

పరోపకారనిధి = Common Good Fund

ఋణములు = Loans

సాధారణసభ = General Body

కార్యనిర్వాహకవర్గము = Working Committee or Board of Directors

కేంద్రసంఘములు = Central Societies

విచారణ = Inspection

లెక్కలతనిఖీ = Audit

ఎత్తివేయుట = Dissolution

సాదాతనము = Simplicity

సంయోగ్యము = Elasticity

% ఈగుఱుతు 100 కి

రోజువారీకాతా = Current Account

దూరపువాయిదా అప్పులు = Long Term Loans

| | |
|---|---|
| దగ్గిరవాయిదా అప్పులు | =Short Term Loans |
| వినియోగము | =Consumption |
| సామ్యవాదము | =Bolshevism |
| సెంట్రిలుబ్యాంకు | =Central Bank |
| రాష్ట్రీయబ్యాంకు | =Provincial Bank |
| సిబ్బంది | =Staff |
| నికరము లేక శిష్టము | =Net |

హిందూదేశము నందలి సహకారోద్యమ పరిణామమునందు గమనింపదగిన ఘట్టములు.

(1) 1904 వ సంవత్సర సహకార పరపతిసంఘముల శాసనము.

(2) 1912 వ సంవత్సర సహకార పరపతిసంఘముల శాసనము.

(3) 1915 మెక్లాగను కమిటీవారి నివేదిక.

(4) 1919 సహకారశాఖ రాష్ట్రీయ ప్రభుత్వముల వశమగుట.

(5) సహకారోద్యమ ప్రచారమునకై పాఠశాలలు, యూనియనులు, ఫెడరేషనులు నెలకొల్పబడుట.

(6) వివిధ రాష్ట్రములయందు సహకారోద్యమ విచారణసంఘములను నియమించుట—ఆసంఘముల నివేదికలు.

(7) వివిధ రాష్ట్రముల యందలి ప్రత్యేక శాసనములు.

(8) 1928 వ్యవసాయ విచారణసంఘు నివేదిక- సహకారోద్యమమును గుఱించిన సూచనలు.

(9) 1931 వ సంవత్సరము నందలి బ్యాంకింగు విచారణసంఘముల నివేదికలు- అందు సహకారోద్యమమును గురించి కావించిన సూచనలు.

# రైతుల ఋణము-సహకారోద్యమము.

## 1. రైతుల ఋణబాధ.

భారతదేశమునందు వ్యవసాయమే ముఖ్యవృత్తి, కర్షకులే సంఘపోషకులు. వీరు ఋణబాధచే క్రుంగదీయబడుచున్నారు. ఈఋణబాధయే వ్యవసాయాభివృద్ధి నరికట్టుచున్నది. ఈఋణసమస్య శీఘ్రముగ బరిష్కరింపబడనిచో వ్యవసాయ మభివృద్ధికాదు.

## 2. రైతుల ఋణమెంత (1875) ?

1875 వ సంవత్సరమున దక్కను రైతుల కమీషను అహమ్మదునగర జిల్లాయందలి (బొంబాయిరాజధాని) 12 గ్రామముల స్థితిని బరీక్షించెను. ప్రభుత్వమువారి రైతువారీపద్ధతి క్రిందనున్న రైతులలో 3 వ వంతు రైతులు ఋణగ్రస్తులై యుండిరనెను. ఈరైతుల యప్పు ప్రభుత్వమునకిచ్చు పన్నుకంటె 18 రెట్లు గలదనియు, నిందు మూడింట రెండువంతులు తణఖాపై చేయబడిన అప్పుగలదనియు, కమీషనువారు నిర్ణయించిరి. ఈయప్పు తల ఒక్కంటికి సగటున రు 371 లు కలదని యీకమీషనువారి నిర్ణయము.

1880-1895 లో గల ఋణము.

1880 వ సంవత్సరమున ప్రభుత్వమువారిచే నియమింపబడిన కఱవులకమీషనువారు హిందూదేశమునందలి రైతులలో మూడవవంతు రైతులు అమితముగ ఋణబాధచే కూడదీసుకొనుటకు వీలులేనంతగ కృంగదీయబడిరని వ్రాసిరి. మరొక మూడవవంతు రైతులు ఋణబాధచే బీడింపబడుచున్నారనియు, వీరు కూడదీసికొనగలరనియు వ్రాసిరి. 1895 లో సర్ ఫ్రెడరిక్ నిఖల్సన్‌గారు మదరాసు రాజధానియందు రైతుల ఋణము 45 కోట్లుండెనని నిర్ణయించెను.

1901 లో గల ఋణము.

1901 వ సంవత్సరమున కఱవుల కమీషను 5వ వంతు రైతులకు మాత్రమే యప్పులులేవని వ్రాసెను.

1911 లో గల ఋణము.

సర్ ఎడ్వర్డు మాక్లగన్‌గారు 1911 వ సంవత్సరమున (స్వదేశ సంస్థానములు మినహాయించి) హిందూదేశమున రైతులకు 300 కోట్లు అప్పుకలదని అంచన వేసిరి. వీరి యంచన మదరాసు రాజధానియందలి యప్పుననుసరించి యున్నది. (M. L. Darling) డార్లింగుగారు పంజాబురాష్ట్రమునందలి ఋణమునననుసరించి హిందూదేశము నందలి రైతులందఱకు 600 కోట్ల ఋణమున్నదనిరి. ఈ అంచనాలు బ్యాంకింగు విచారణసంఘము వారి మదింపులతో గొంచె మించుమించుగ సరిపోవుచునేయున్నవి.

బ్యాంకింగు విచారణసంఘములు-1930 లో గల ఋణము.

1930 వ సంవత్సరమున బ్యాంకింగు విచారణ రాష్ట్రసంఘములు ప్రతిరాష్ట్రమునందును రైతుల ఋణబాధనుగురించి విచారించెను. వారి మదింపులిట్లున్నవి.

మదరాసు.

మదరాసు రాష్ట్రమునందా సంవత్సరమునందు రైతుల మొత్తపు అప్పు 150 కోట్లు. ఇందు 70 కోట్లు ఒక సాలునుండి మరొకసాలునకు పెరుగుచున్నది. రాష్ట్ర

మొత్తమున ప్రభుత్వమున కిచ్చుచున్న భూమిపన్నుతో పోల్చిన నీఅప్పు రూపాయకు 19 రూపాయల వంతున గలదు.[1]

బొంబాయి.

బొంబాయి రాష్ట్ర మొత్తమున సింధురాష్ట్రముతో గూడ కలిపి, 81 కోట్లు అప్పు కలదు. మొత్తపు భూమిపన్ను కంటె అప్పు 15 రెట్లధికము.[2]

వంగదేశము.

వంగదేశమున రైతుల అందఱకు రు 100 కోట్ల అప్పు కలదు. ప్రతి వ్యవసాయదారుని కుటుంబమునకు సగటున రు 160 ల అప్పు తేలును.[3]

సంయుక్త రాష్ట్రములు.

సంయుక్తరాష్ట్రముల రైతుల ఋణము 124 కోట్లు. ఇందు భూకామందుల అప్పు గూడ మదింపు వేయబడెను.[4]

పంజాబు.

ఈ రాష్ట్రమునందు 1921 వ సంవత్సరమున రైతుల అప్పు 90 కోట్లు. 1929 లో 135 కోట్లు. అనగా, 8 సంవత్సరములలో చాల పెరిగిపోయెను. భూమి సిస్తుతో పోల్చిన 1921 లో రూపాయ 1 కి 19 రూపాయలును, 1927 లో 27 రు॥ లును అప్పు కలదు. 1921 లో తల ఒక్కంటికి రైతుల అప్పు 76 రూపాయలు. 1929 లో 104 రూపాయలు. ఎకరము ఒక్కంటికి 1921 లో రు 31 లును, 1929 లో రు 45 లును అప్పు కలదు.[5]

1. మదరాసు బ్యాంకింగు విచారణ సంఘ నివేదిక పేరా 96, 98
2. బొంబాయి బ్యాంకింగు విచారణ సంఘ నివేదిక పేరా 49, 50
3. వంగదేశపు బ్యాంకింగు విచారణ సంఘము, పేరా 90.
4. సంయుక్తరాష్ట్రముల బ్యాంకింగువిచారణసంఘ నివేదిక, *Appendex 2.*
5. పంజాబు బ్యాంకింగు విచారణ సంఘ నివేదిక పేరా. 22

మధ్యపరగణాలు, బీరారు.

ఈ రాష్ట్రమున రైతుల మొత్తపు అప్పు 36¾ కోట్లు. మొత్తపు పంటలో 100 కి 49 వంతులు. భూమిసిస్తు కంటె యిచ్చుకొనవలసిన వడ్డీ 2½ రెట్లధికము. అప్పు వ్యవసాయము వలన వచ్చు నికరాదాయములో 3 వ వంతు. రైతు కుటుంబము ఒక్కొంటికి సగటున రు 227 ల అప్పుకలదు.[1]

బీహారు, ఒరిస్సాలు.

ఈ రాష్ట్రమున మొత్తపు ఋణము 155 కోట్లు. ఇందు రైతుల అప్పు 129 కోట్లు. భూకామందులకు 24 కోట్లు. 2 కోట్లు చిల్లర కుటుంబములకు కలదన దగును.[2]

అస్సాము.

ఈ రాష్ట్రమున మొత్తపు అప్పు [కొండలు లేని జిల్లాల రైతులకు] 22 కోట్లు. భూమిసిస్తు కంటె అప్పు 22 రెట్లధికము. కుటుంబము ఒక్కొంటికి సగటున రు 242 ల అప్పు. 100 కి 15 కుటుంబములు మాత్రమే అప్పులేనివి కలవు.[3]

బర్మా.

ఈ దేశమున రైతుల అప్పు రు60 లేక రు50 కోట్లు.[4]

ఈ యంకెల ననుసరించి హిందూదేశమునందలి యీ 9 రాష్ట్రములలో రైతులకు సుమారు రు 800 కోట్ల అప్పు గలదని మదింపు వేయబడెను. ఈ అప్పంతయు ఫలశూన్యమైనదే. భూముల మరమ్మతుల క్రింద చేయబడిన ఋణము కాదు. ఆయేటికాయేడు పెరుగుచున్నది. 1901 లో మాక్లగనుగారి అంచనా ననుసరించిన

1. మధ్యపరగణాల బ్యాంకింగు విచారణ సంఘము పేరాలు 644-653-654

2. బ్యాంకింగు విచారణ సంఘము పేరా 90.

3. బ్యాంకింగు విచారణ సంఘము పేరా 33.

4. బ్యాంకింగు విచారణ సంఘము పేరా 108.

రు 300 కోట్ల అప్పును 1930 కి 800 కోట్ల వఱకు పెరిగెను. ఇందు వలన రైతు దినదినాభివృద్ధి యందు లేడనుట స్పష్టము. రైతులొక రోజుకంటె మరొకరోజున దరిద్రులగుచుండిరని అప్పుల పెరుగుదల వలన నిశ్చయింపగలము.

## 3. ఋణకారణము లేమి?

ఈ ఋణమునకు కారణములిట్లు కొందఱు నిరూపించు చున్నారు.

1. జనసంఖ్య పెఱిగి, వ్యవసాయముపై పలువురాధారపడుట.

2. భూమి విభాగములై విఖండములగుట.

3. వ్యవసాయమునకు దోడుగ నుండు పరిశ్రమలు లేకపోవుట.

4. రైతుల యనారోగ్యస్థితి వ్యవసాయకాలములయందు తరుచుగ జబ్బుపడుచుండుట.

5. ప్రతి సంవత్సరము సుభిక్షముగ నుండక పంటలు పండక తిండికై అప్పు జేసికొనవలసివచ్చుట.

6. పశురోగములవలన, కాటకములవలన పశువులు చచ్చిపోవుట. ఇందువలన మరలమరల క్రొత్త పశువులను కొనవలసివచ్చుచుండుటచే అప్పు జేయవలసివచ్చుట.

7. ఆదాయమునుండి రైతు నిలువజేసికొనకపోవుట. పశువుల మరణములవలన గలుగు నష్టమునకును, వ్యవసాయపు పనిముట్లు చెడుచుండుటవలన గలుగు నష్టమునకును వలయుసొమ్ము నిలువజేసికొనక పోవుట.

8. రైతునకు వ్యాజ్యములయందుగల ప్రీ

9. రైతుల దూబరా ఖర్చు. (వివాహములకు, మతవిషయము లకు అగు ఖర్చు.)

10. తాత ముత్తాతలనుండియు వచ్చుచున్న అప్పు.

11. నవనాగరిక జీవితము.

12. ఋణదాతలు వసూలుచేయుచున్న హెచ్చు వడ్డీలు.

13. రైతు లిచ్చుకొనుచున్న అధికపు భూమిసిస్తు.

పై నుదహరింపబడిన కారణములలో 1, 2, 3, 4 లు రైతుల యప్పునకు ప్రత్యక్షకారణములుగ జెప్ప వీలులేదు. పరోక్ష ముగ నీకారణములు ఆర్థికాభివృద్ధికి భంగకరములనుట నిశ్చ యము. కాని యీకారణములను నివారించుకొనుటకు వలయు నధికారము రైతులయందులేదు. దేశమునందు సర్వతోముఖార్థి కాభివృద్ధి లేకపోవుటయే పలువురు వ్యవసాయముపై బ్రతుక వలసివచ్చుటకు కారణము. పలువురు వ్యవసాయముపై బ్రతుక వలసి వచ్చుటవలనను వారసత్వపు హక్కులను మార్చుట మొదలగు సంస్కరణములను ప్రభుత్వము చేయకపోవుటవలనను ఆర్థికాభివృద్ధికి ప్రతిబంధకములుగ భూమి విభాగములై విఖండములైనది. వ్యవసా యమునకు దోడుగనుండు గృహపరిశ్రమలన్నియు విదేశపువస్తువుల దిగుమతి వలనను ఈస్టిండియా కంపెనీవారి వర్తకపు నీతివలనను నాశన మైనవి. దేశమునందు ఆర్థికాభివృద్ధిలేక, అత్యల్పమగు అంతస్తు ఏర్పడి రోగములను నిరోధించుకొను శక్తిని ప్రజలు కోల్పోయిరి. ఈనాలుగు కారణములకునుగూడ రైతు బాధ్యుడుకాదు. అధికముగ రోగములు వ్యాప్తిజెందుటను నిరోధించు బాధ్యత ప్రభుత్వమువారిపై నెట్లు గలదో పంటలు విఫలము కాకయుండునట్లు వ్యవసాయ సౌకర్యము లొనగూర్చు బాధ్యతయు ప్రభుత్వమువారి మీదనే కలదు. పండిన

సాలున, పండనిసాలునకై రైతు నిలవయుంచుకొనుట లేదనుటయు నపవాదమే. నిలవ యుంచుకొనుటకు పండిన సాలునందైన పన్నులు, ఖర్చులునుపోను జీవనాధారమునకు జాలినంతగ మిగులుట లేదే! ఇక పండని సాలునకై మిగుల్చుకొనుట యెట్లు? 8 వ కారణముగూడ నిట్లే నిరాధారమైనది. రైతు వ్యాజ్యములపాలై యున్నమాట నిజము. ఈవ్యాజ్యముల చిత్తవృత్తికి న్యాయశాఖయొక్క పరిపాలనయే కారణమనుట సాహసము కాదు. ప్రస్తుత మమలునందున్న "లా" వ్యాజ్యముల చిత్తవృత్తిని రగుల్కొల్పుట కనుకూలముగ నున్నది. తగ్గించుట కుపకరించుట లేదు. "ఈ న్యాయపరిపాలనా విధానమే భారతదేశమున కనుపయోగము. ఇంగ్లండునకు పనికివచ్చినదంతయు హిందూదేశమునకుగూడ బనికివచ్చునని తలంపరాదు." స్వల్పవ్యయమున న్యాయము లభించునట్లయిన లేదు. హిందూదేశమునందు లభింపవలసిన న్యాయమునకై ప్రీవీకౌన్సిలున కేల పోవలయును? ఈప్రీవీ కౌన్సిలు హిందూదేశమునందేల స్థాపింపరాదు? వ్యాజ్యములవలన రైతు కోల్పోవుచున్న డబ్బునకు రైతుపైకంటె ప్రభుత్వ న్యాయశాఖ వారి పరిపాలనపై హెచ్చుబాధ్యత గలదు. ఒక్కొక్క దావా పరిష్కారమగుట కెన్నియో సంవత్సరములు పట్టుచుండెను. వ్యాజ్యము పరిష్కారమగులోపల రైతు దివాళాస్థితికి వచ్చుచున్నాడు.

వ్యాజ్యములు తగ్గింపవలెననిన, నాల్గవ అధ్యాయమునందు వివరింపబడిన ప్రజాస్వామిక గ్రామప్రభుత్వములను నెలకొల్పుటయే కర్తవ్యము. ప్రభుత్వాదాయవ్యయముల అధ్యాయమున వివరించినటుల ప్రజాస్వామిక గ్రామ ప్రభుత్వములకు సివిలు, క్రిమినలు అధికారము లొసంగినయెడల, వ్యాజ్యముల ఖర్చు రైతునకు తగ్గును. అయిదవ అధ్యాయమునందు పేర్కొనబడినయట్లు, సమిష్టి వ్యవ

సాయమును రైతుల ప్రేరేపింప గలుగుచో, జాలవటకు చిల్లర వ్యాజ్యములు తగ్గగలవు. ప్రజాస్వామిక గ్రామప్రభుత్వములకు ఆయా గ్రామముల యందలి సాగుబడి భూమిని స్వాధీనపరచి ఫలసాయమును మాత్రమే రైతులకు పంచిపెట్టు పద్ధతిని అమలునందుంచుచో గూడ వ్యాజ్యములు తగ్గగలవు. భూమియందు గల హక్కుల నన్నింటిని వ్యక్తులకు తొలగించివేసి, భూమిని ప్రభుత్వమువారు వశపరచుకొని, ప్రభుత్వమే సేద్యము చేయించుకొనుట ప్రారంభించుచో [యితరులకు కూలి నిచ్చు పద్ధతిని] వ్యాజ్యములకు కారణములే తొలగిపోగలవు. భూమియందు గల హక్కుబేహక్కుల నిర్ణయమునకును వ్యవసాయమునందు వచ్చు చిల్లర కతులకును ముఖ్యముగ రైతులు కోర్టుల కెక్కుచున్నారు.

అందువలన భూమియందు గల వ్యక్తిహక్కులను తొలగించివేయుట వ్యాజ్యకారణములను సమూలచ్ఛేద మొనరించుటయే యగును.

వ్యాజ్యములను దొలగించుటకు రిజిష్టరీ చేయించు చట్టమును గూడ మార్చుట అవసరము. ఏవిధమగు వ్రాతప్రతినిగాని రిజిష్టరీ చేయించుటకు గడవు విశేషముగ నుండరాదు. వ్రాసిననాడు-లేక-మరునాడు రిజిష్టరీచేయించి తీరవలెనను నియమముండిన. కొన్నికొన్ని వ్యవహారములలో విశేషమగు కుట్రలు ఒన్నుటకు వీలు లభింపదు. మఱియు, ప్రజాస్వామిక గ్రామప్రభుత్వముననే రిజిష్టరీ చేయించు నట్లేర్పఱచుచోగూడ దగావ్రాతలకు వీలుండదు. లేనిపోని వ్రాతలను సృష్టించుటకు వీలుతగ్గును. గ్రామమునకు దూరముగనుండు మరొక తావునకుపోయి రిజిష్టరీ చేసికొనుటకు వీలుండుటవలనను, జిల్లా ముఖ్య స్థానములలోగూడ రిజిష్టరీ చేసికొనుటకు సదుపాయము లుండుటవల

ననుగూడ వ్యాజ్యకారణములగు వ్రాతలు వ్రాయబడి రిజిష్టరీ చేయ బడుచుండెను. ఏగ్రామమున కాగ్రామమునందే ఒకటి రెండు రోజుల గడువుమాత్రమే యొసంగి రిజిష్టరీచేయించుకొనుట విధిచేయుచో సత్య విరుద్ధములగు వ్రాతలకును వ్యాజ్యకారణములగు పనులకును సావ కాశము హెచ్చుగ లభింపదు. రైతులకు ఖర్చు తగ్గును. వ్యాజ్యములకు వెడలిన కేసులలో న్యాయము లభించుటకు సదుపాయములు లభించును.

9 వ కారణమగు రైతుల దుబారాఖర్చులను గుఱించి యొకింత చర్చింపదగును. వివాహాదులకు, పండుగలకు, వేడుకలకు, రైతులు విశేషముగ ఖర్చుపెట్టుటయే యప్పునకు కారణమని వ్యతిరేక వాదము. ఈవాదమును సమర్థింపవీలులేదని 1875 వ సంవత్సరమున నియమింపబడిన దక్కనురైతుల విచారణసంఘమువారిట్లు ఖడించిరి.

"రైతులయప్పునకు వివాహములకును, పండుగలకును జేయు ఖర్చే కారణమని యనవసర ప్రాముఖ్య మీవిషయమున కొసంగి చెప్పబడుచుండెను. ఈవివాహాదులకు పెట్టబడుచున్నఖర్చు రైతుల యార్థికస్థితినిబట్టి హెచ్చని చెప్పకతప్పదు. కాని, యట్టి ఖర్చులు ఎప్పుడోకాని రావు. ఎంతకాలమునకో ఒకప్పుడు వచ్చెడి యట్టి ఖర్చును గృహకృత్యములకై పెట్టుట తగినపనియే. ఇట్టిఖర్చే రైతుల యప్పునకు పునాది యనజాలము.......... ప్రతిసంవత్సరము రైతు జీవితాధారమునకై వలయు వ్యవసాయపుఖర్చును, (అనగా విత్తులు, గొడ్లు, పన్ను) పంట చాలనందున జేయు అప్పును రైతుల అప్పునకు మూలము. వివాహాది కర్మలకు జేయు అప్పుమాత్రము రైతుల అప్పునకు మూలముకాదు.

ఇట్లే వంగదేశపు బ్యాంకింగు విచారణసంఘమువారును నిర్ణ యించిరి. ఇదియే రైతుల అప్పునకు సరియగు కారణము.

వివాహములకు విశేషముగ రైతులు అప్పుజేయక కలదానితో చేయవలెనన్న, బాల్యవివాహనిషేధ శాసనమందలి వయస్సును హెచ్చింపదగును. తల్లిదండ్రులే వివాహమును గావింపవలెనను సంఘాచారమును తొలగించుటకు వలయు శాసనము లొనరించుచో, వివాహములపై ఖర్చు తగ్గగలదు. వివాహములను రిజిష్టరీచేసికొనుచో, శాస్త్రసమ్మతమను శాసనమును అన్ని కులమతములకును వర్తింపజేసినయెడల సంఘాచారము ననుసరించి చేయబడుచున్న అధిక వ్యయమును తొలగింపగలము. వివాహములను రిజిష్టరీచేయుట హిందూ ధర్మమునకు విరుద్ధమని తలంచువారు కలరు. వివాహము మతసంబంధమైనవిషయమని వీరివిశ్వాసము. నేడు వివాహములయందు జరుపబడుచున్న కర్మకాండ, లేక, తంతును తొలగించివేసినంతమాత్రమున వివాహమునందుగల మతభావము మట్టిపాలగునా? కాదు. కృత్రిమమగు తంతునందు మాత్రమే మతభావము పొంచియుండలేదు. నేడు వివాహములయందు జరుపబడుచున్న మంత్రతంత్రాదులన్నియు సంఘసాక్ష్యముకొఱకై ఏర్పడినవి. రిజిష్టరీచేయుటవలన సంఘము యొక్క సాక్ష్యమవసరములేదు. వివాహవయస్సును హెచ్చించి భార్యాభర్తలు తమ వివాహమును రిజిష్టరీచేసికొనవలెనను విధిని నిర్ణయించుశాసన మొనరించుచో, వివాహములకు పరిమితిలేని వ్యయము చేయబడదు. అందువలన హిందూవివాహ రిజిష్ట్రేషను శాసనము నొనరింపదగును. ఈశాసనమునందు స్త్రీలకు 16 సంవత్సరములును పురుషులకు 20 సంవత్సరములును వివాహకాలమునకు తక్కువగనుండ రాదని శాసింపవలెను. ఈవయస్సులకు మించినవారు రిజిష్టరీపూర్వకమగు వివాహమును చేసికొనుట కధికార మొసగవలెను. ఈవయస్సునకు లోబడిన స్త్రీపురుషుల వివాహములు చెల్లనేరవని నిషేధింప

వలెను. అట్టివారి సంతతికి వారసత్వపు హక్కులను తొలగింపవల యును. ఇతర విధములగు శిక్షలను విధించుటయు యోచింపదగును.

10 వ కారణమగు తండ్రి తాతలనాటి అప్పు ప్రస్తుతపుఅప్పు నకు కారణమగుట నిజమే. తండ్రి తాతలును నేటి యార్థికస్థితియందే యుండుటచే ఋణములపాలయిరి. ఇది సక్రమమైన ఋణమే. 11 వ కారణమగు నవనాగరికజీవనము బ్రిటిషుదీవుల సంపర్కమువలననే సంభవించినది. కృత్రిమమగు ఆడంబరముతో గూడిన జీవితము హెచ్చి నది. ఆర్థికోత్పత్తి యదనముగలేదు. సృష్టింపబడిన హెచ్చుధరలవలన రైతు తన్ను తాను మోసగించుకొనదొడగెను. ఆడంబరజీవితమునుండి ప్రజలను మరలించుటకై గాంధిమహాత్ముడు నేడు విశేషకృషి సల్పు చున్నాడు. నవనాగరికమని మురియుచుండిన పెనుభూతమునుండి రైతు మరలుటత్యవసరము. ధరల హెచ్చుతగ్గులనుబట్టి జీవితవిధానము నెగద్రోయుటయు దిగదీయుటయు తగనిపని.

12 వ కారణమగు ఋణదాతలు పుచ్చుకొనుచున్న వడ్డీ హెచ్చుగనుండుటచే రైతు అప్పులపాలగుచుండెననుట యందొకింత సత్యము కలదు. పురాతనకాలమందు గ్రామజీవనము సక్రమముగ నుండుటచే ఋణదాత హెచ్చువడ్డీలతో రైతులను పీడించుట కవకాశముండెడిది కాదు. ఆంగ్లేయ యుగమునందా యవకాశము తొలగినది. వేరుసంరక్షణలేదు. ఎంతవడ్డీయైనను పుచ్చు కొనగూడదను శాసనములేదు. ఇచ్చితీరవలెనను శాసనములున్నవి. పండినపంట చాలక క్షుద్బాధకై రైతు యెంతవడ్డీకైనను తలయొగ్గి షాహుకారుల నాశ్రయించుట విధియగుచున్నది. పన్నులభారము తగ్గి రైతునకు జీవించుటకైన వలయుపంట మిగులుచో షాహుకారుల నాశ్రయింపవలసిన పనియుండెడిదికాదు. స్వల్పవడ్డీలపై హెచ్చు

ఫాయిదాలమీద నప్పులనిచ్చు బ్యాంకులేర్పడియున్నను రైతునకింత దుస్థితి పట్టెడిదికాదు.

వడ్డీలకు వడ్డీనిచ్చియైన రైతు పెట్టుబడిని తెచ్చుకొనుట తప్పదు. సులువుగ వేరొకచోట పెట్టుబడి పుట్టుటకు వీళ్ళులేవు. దుక్కి దున్నుట ప్రారంభించినది మొదలు కుప్పనూర్చువఱకు రైతు పరుల పెట్టుబడిపై జీవించుచున్నాడు. పండినపంటలో పెట్టుబడి యంతయు గూడ తీరక మరుసాలునకు బెరుగుచున్నది. ఇట్లు రైతు జీవితపర్యంతము పెట్టుబడిదారులకు అమ్ముడుపోవుచున్నాడు. బస్తాధాన్యము నిచ్చుచో, అరబస్తా లేక గుండెత్తు నాములనిచ్చు షరతుమీద తిండికి ధాన్యమును అప్పు పుచ్చుకొనుచు రెండుమూడు మాసములలో పండు పంటయందు తిరిగి యిచ్చివేయుచున్నాడు. ఇట్లిచ్చివేయుటలో వడ్డీల కంటె మించిన నాము నిచ్చివేయుటయేకాక పంటను నిలవచేసికొని హెచ్చుధరలకు అమ్ముకొను సావకాశమునుగూడ కోల్పోవుచున్నాడు. రైతునకు పెట్టుబడి సుడిగుండమువలె నున్నది. ఈసుడిగుండమున బడి మునుగుచు దేలుచు జీవయాత్ర నెట్లో కొనసాగించుచున్నాడు. కొంత కాలమునకు భూమియే పెట్టుబడిదారుని వశమగుచున్నది. ఈస్థితి దుర్భరము. అయినను షాహుకార్లపై దాడివెడలుట తగదు. నేటి మన ఆర్థికసౌధమునకు షాహుకారే మూలముగ నున్నాడు. నేటికిని గ్రామజీవనమున షాహుకారే ప్రజోపయోగముగ నున్నాడు. డబ్బును సమకూర్చుటయందు, సంరక్షించుటయందు, వితరణమొనరించుట యందు షాహుకారునకే ప్రధానస్థానము నేటికిని గలదు. ఆర్థిక సౌధ మును నిర్మించగల దక్షతయును, శక్తియును, యుక్తియును, షాహు కారునందే కలవు. ఎట్టి పెట్టుబడివిధానమును మనము నెలకొల్పగలిగి నను షాహుకార్లను అట్టివిధానమునందిముడ్చుటకే యత్నింపదగును.

షాహుకార్లకు వంశపరంపరముగ లభించిన శక్తియుక్తి దక్షతలను సంఘము సక్రమముగ వినియోగించుకొనుటకై ప్రయత్నించుటయే సమంజసము. హెచ్చువడ్డీల బారినుండి రైతును సంరక్షించు బాధ్యత ప్రభుత్వముపైన గలదు. కాని షాహుకారుపై లేదు. కలిగిన అవకాశములను ధనార్జనకై వినియోగించుకొనుట ప్రకృతి లక్షణము. ఈసహజలక్షణమునకు ధనార్జనాపరుడగు షాహుకారు వ్యతిరేకముగ వర్తింపజాలడు.

13 వ కారణమగు నధికపుపన్నుభారమే రైతుల అప్పునకు ముఖ్యకారణము. రమేశచంద్రదత్తుగారు అధికపుపన్నుభారమును తప్పనిసరిగ నాపన్నును వసూలుచేయుచుండుటయు, రైతుల అప్పునకు మూలకారణమని నిర్ణయించిరి. "కఱవులు వచ్చుచున్నవి. పంటలు పోవుచున్నవి. ఉత్పత్తితగ్గుచున్నది. అయినను గత 50 సంవత్సరముల లోను భూమిసిస్తు వసూలు పెరిగినది." ఇట్లధికముగ భూమిసిస్తును పెంచుటయే రైతులఋణమునకు గారణమని దత్తుగారి నిర్ణయము. ఇట్లే 1901 వ సంవత్సరపు ప్రభుత్వమువారి కఱవులకమీషను గూడ నిర్ణయించెను.

"పంటలుపండిన సంవత్సరము తిండికి సరిపోవునంతగ లభింప వలెననుటకంటె రైతునకు మరొకఆశలేదు. పండనిసంవత్సరము ముష్టికి బోవలసినదే." కాని 1880 వ సంవత్సరపు కఱవుల కమీషను మాత్రమిందులకు వ్యతిరేకముగ వ్రాసెను. పండినపంట ఖర్చుపెట్టు కొని పన్నునకై అప్పుజేసినంతమాత్రమున పన్నువలన ఋణమైన దనుట తగదనిరి. పండినపంట కడుపునకైన చాలనపుడు పన్ను నకై అప్పుజేయుట తప్పనిసరిగాదా? పన్నులేకున్నచో నీయప్పుచేయవలసిన పనిలేనపుడు పన్నువలననే అప్పగుచున్నదనుటయే సరియగువాదము.

హెచ్చుపన్నులను తగ్గించునంతమాత్రమున రైతులయప్పు తీరిపోవునా యని (M. L. Darling) డార్లింగు వంటివారి కొందరిప్రశ్న. ఇట్లే 1933 వ సంవత్సరమున మదరాసుప్రభుత్వమువారు ప్రశ్నించిరి. హెచ్చుపన్నులను రైతులిచ్చుకొనలేకపోవుటచేత 100కి 12½ వంతున నైనను పన్నులను తగ్గించవలెనని మదరాసు శాసనసభవారు తీర్మానించిరి.

ఇట్లు పన్నుతగ్గించలేదు. చిన్నపట్టాదారులే హెచ్చుగనున్నారనియు రూపాయికి 0-2-0 వంతున తగ్గించుటవలన రైతుల యార్థికస్థితి చక్కబడదనియు, మదరాసుప్రభుత్వ సమాధానము. ఇది హాస్యాస్పదమగు వాదము. చిన్నపట్టాదారుడై రూపాయయే పన్నుగ నిచ్చుకొనవలసిన యార్థికస్థితియందున్న రైతునకు 2 అణాలు తగ్గినను, కొంతభారముతగ్గదా? రూపాయివిలువగల రైతునకు 2 అణాలు అప్పుజేయుటయే భారముగాదా? డార్లింగువంటివారు అధికపన్ను భారము ఋణములకు గారణముకాదని వాదించుచున్నను పీడాకరమగు హెచ్చుపన్నును తగినంతగ మొట్టమొదటనుండియు దగ్గించలేదని యంగీకరించుచున్నారు. జనసంఖ్య హెచ్చుచున్నందున పన్నును తగ్గించినను, రైతు ఋణభారమునుండి కూడదీసికొనలేని స్థితియందుండుటచేత తగ్గించవలసిన పనిలేదని కొందఱివాదము. ఇది విపరీత వాదము. పన్నును తగ్గించవచ్చును. తగ్గించకపోవచ్చును. తగ్గించకపోవుటకు పై విషయ మొకకారణమైన గావచ్చును. కాని ఋణమునకు అధికపుపన్నులే కారణమను సిద్ధాంతమును కాదని రుజువుచేయజాలదు. కానికాలమున రిమిషనుల నిచ్చుటలోగూడ ప్రభుత్వము వెనుకాడుచునేయున్నది. పండినపడు మరికొంతపట్టుకొనిపోవుట ఋణకారణము కాకపోవచ్చునేమోకాని పండనిపడు పన్నును తగ్గించక

పోవుట లేక తీసివేయకుండుట ఋణకారణమగుట నిశ్చయము. ఏవిధముగ బరీక్షించినను, రైతుల అధికఋణమునకు భూమిసిస్తును భరింపలేకపోవుటయే కారణమని చెప్పుటకు వెనుకాడబనిలేదు.

## 4. ఋణవిముక్తికి ప్రభుత్వ శాసనములు.

రైతుల ఋణసమస్య 17 వ శతాబ్దమునుండియు గూడ ప్రజానాయకుల దృష్టి నాకర్షించెను. రైతులను అప్పులబారినుండి తొలగించుటకై వలయుశాసనము లొనరింపవలెనను ఆందోళనకలదు. 1880వ సంవత్సరమునందుదక్కనురైతులకమీషనువారును,1901వసంవత్సరమునందు కఱవుల కమీషనువారును రైతుల ఋణసమస్యను దర్కించిరి. 1878 వ సంవత్సరపు దక్కనురైతుల సంరక్షణ శాసనము (Daccan Agriculturists Relief Bill), 1882-83 వ సంవత్సరపు తకావీ అప్పుల శాసనము, 1884 వ సంవత్సరపు వ్యవసాయకుల బ్యాంకుస్కీము (Agricultural Bank Scheme), 1897 వ సంవత్సరపు నైకల్సనుగారి రిపోర్టు (Nicholson's Report), 1899 పంజాబునందలి భూవిక్రియ శాసనము (Punjab Land Alienation Bill), 1903 వ సంవత్సరపు సహాకారపరపతి శాసనములును గావించునపుడు రైతుల ఋణసమస్య విచారింపబడి తర్కింపబడెను.

వ్యవసాయదారుల ఋణసమస్యను విమర్శించుచు సర్ ఎడ్వర్డు మాక్లిగన్‌గారు (Sir Edward Maclagin), ఋణసమస్య పరిష్కరించుటకై ప్రభుత్వమువారొనరించిన కృషిని నాలుగు విధములుగ విభజించెను.

1. అనవసరపు అప్పులను చేయవలదని రైతులను హెచ్చరించుటకై సలిపిన ప్రబోధము.

2. వ్యవసాయదారుల ఋణమునకు సంబంధించినంతవఱకు సివిలు లాను సవరించుట.

3. భూమి అన్యాక్రాంతము కాకుండ గావించిన శాసనములు.

4. పెట్టుబడి లభించుటకును, ఋణమును తీర్చుకొనుటకును, గావించిన శాసనములు.

ఈనాలుగు విధములుగను ప్రభుత్వమువారొనరించిన కృషిని విమర్శింపదగును.

అనవసరపు అప్పులు చేయవలదను ప్రబోధము.

1. రైతులకు ప్రబోధముచేయుటకు వలయువిద్యయే గఱపబడలేదు. ఋణదాతచెప్పు లెక్కలను సరిచూచుకొనుటకు తగినంత విద్యయైనను పల్లెలయందు వ్యాపింపజేయలేదు. ఆదాయములో నిలువజేసికొని దాచుకొనుటకుగాను సేవింగ్సుబ్యాంకులు పెట్టబడెనని ప్రభుత్వమువారు చెప్పెదరు. ఈసేవింగ్సుబ్యాంకులసంగతి రైతులకు తెలియనే తెలియదనుట వింతకాదు. తపాలాకచేరీలు ఊరూర లేవు. రైతులకు సేవింగ్సుబ్యాంకులసంగతి తెలియజేసినను, ఊరూర నెలకొల్పినను గూడ ఫలితములేదు. నిలువజేసికొనుటకు ఆదాయము మిగులు ప్రయత్నములులేక ఆదాయము మిగులుచో అది దాచుకొనుటకు సేవింగ్సుబ్యాంకులు పెట్టుటవలన గలుగు లాభమేమి? ఇది ఎద్దు ముందర బండినిపెట్టుట వంటిది.

సివిలులాను సవరించుట.

2. 1879 వ సంవత్సరమున దక్కను వ్యవసాయదారుల సంరక్షణశాసనము గావింపబడెను. 1875 వ సంవత్సరమున నియమింపబడిన దక్కనురైతుల విచారణసంఘమువారి సూచన ననుసరించి యీశాసన మొనరింప

బడెను. ఈకమీషనువారి విచారణయందు ఋణపడినవారు ఋణదాతలను తీవ్రముగ విమర్శించిరి. ఈశాసనముననుసరించి ఒప్పుకొనిన వడ్డీ హెచ్చుగనున్నచో తగ్గించుటకు కోర్టులకధికారముకలదు. ఇట్లే యితరవిషయములయందుగూడ మార్పులను గావించిరి. కాని యీశాసనము రైతునకనుకూలించుటకుమారు అపకారమొనరించెను. దావాలనుపెంచెను. రైతునకును, పెట్టుబడిదారునకును మధ్య పరస్పరవైషమ్యములను వృద్ధిగావించెను. ఈశాసనము గావించినదిమొదలు భూమి అన్యాక్రాంతమగుట హెచ్చెనని 1901 వ సంవత్సరపు కఱవులకమీషను వ్రాసెను.

1899 లో కంట్రాక్టు చట్టము సవరింపబడెను. (Cotract Act). 1918 లో అప్పుల శాసనము సవరింపబడెను. (Usurious Loans Act). ఈశాసనము మరల 1926 లో సవరింపబడెను. కాని యీశాసనము అమలునందుంచబడలేదని వ్యవసాయ విచారణ సంఘమువారు వ్రాసిరి. ప్రతి రాష్ట్రమునందున యీశాసనము కాగితముమీద మాత్రమే కలదనియు, నిరుపయోగమైనదనియు వ్యవసాయవిచారణ సంఘమువారి నిర్ణయము. ఈశాసనమును గురించి వివిధరాష్ట్రముల యందలి బ్యాంకింగు విచారణసంఘములవారు వివిధరీతుల అభిప్రాయ మొసంగిరి. ఈశాసనము నమలులోనికి తెచ్చినను "యిచ్చిపుచ్చుకొను" వ్యాపారమునంతను యీశాసనము ననుసరించి నడుపుటకు వీలులేదు. ఇందువలన వడ్డీలను తగ్గించుటకు తగినంత సావకాశమును లేదు.

పంజాబునందు 1930 వ సంవత్సరమున గావింపబడిన లెక్కలను నిర్ణయించు శాసనమును (Punjab regulation of accounts bill), 1927 వ సంవత్సరపు బ్రిటిషు పెట్టుబడిదారుల శాసనమును (British

money lenders bill) భాగుగ నున్నవని వ్యవసాయ విచారణసంఘము వారు రాష్ట్రప్రభుత్వములకు సూచించిరి.

పంజాబు శాసనము ననుసరించి పెట్టుబడిదారులు తమలెక్కలను సరిగా వ్రాయవలెను. ప్రతి ఆరుమాసములకును అప్పుపుచ్చుకొనినవానికి ఎంతసొమ్ము ఆ ఆరుమాసములలోను అతడు వాడుకొనినదియు, ఆతడెంతమొత్తము నీయవలసియున్నదియు జమాఖర్చులను వేసి పంపుచుండవలెను. ఇట్టి లెక్కలు సరిగాలేనిచో కోర్టువారికి ఆసొమ్మును అంతయుగాని కొంతగాని డిక్రీ యీయకుండ నిరాకరించుట కధికారము కలదు.

ఇంగ్లీషు శాసనము ననుసరించి పెట్టుబడిదారుడు పెట్టుబడులు పెట్టుటకు లైసెన్సును పొందవలయును. వడ్డీకి వడ్డీనికట్టుట నిషేధింపబడెను. అప్పుపుచ్చుకొనినవాడు కోరినవెంటనే అతని అప్పునకు సంబంధించిన లెక్కలను ఋణదాత యొసంగవలెను. ఇట్లు పెట్టుబడిపెట్టుటపై విధినిషేధములను గల్పించు శాసనము లొనరించుచో పెట్టుబడి పెట్టుటయే తగ్గునను భయము వ్యవసాయ విచారణసంఘము వారికి కలుగలేదు. బొంబాయి బ్యాంకింగు విచారణసంఘమువారు విధినిషేధములతోగూడిన శాసనములవలన రైతునకును, పెట్టుబడిదారునకును గూడ చిక్కులుగలిగి పెట్టుబడియే లభించకపోవచ్చునని యభిప్రాయపడిరి. మరియు, అట్టిశాసనములను పెట్టుబడిదారులు సునాయాసముగ నిరుపయోగ మొనరింపగలరని బొంబాయి బ్యాంకింగు విచారణ సంఘమువారి నిర్ణయము.

పంజాబునందలి 1930 వ శాసనమును ఇతరరాష్ట్రములవారు అనుసరింపవలదని పంజాబుబ్యాంకింగు విచారణసంఘమువారు హెచ్చ

రించుచున్నారు. వేలకొలదిగనుండు పెట్టుబడిదారులు లక్షలకొలదిగ నున్న అప్పులవాండ్రకు ఆరుమాసములకొకమారు లెక్కలను పంప వలెనను విధిని నిర్వహింపజాలరేమోయని వీరిభయము. అస్సాము బ్యాంకింగు విచారణసంఘమువారు పంజాబుసంఘమువారితో నేకీభ వించుచున్నారు. ఇతరరాష్ట్రీముల బ్యాంకింగు విచారణసంఘములు పెట్టుబడిదారులు రిజిష్టరీచేయబడవలెనని సూచించినవి.

మదరాసురాజధానిలో పెట్టుబడిదారుల శాసనమును గావింప నున్నారు.[1] ఈశాసనము అమలులోనికి వచ్చుచో పెట్టుబడిదారులు రిజిష్టరీ చేయించుకొనవలసివచ్చును. లెక్కలను సక్రమముగ వ్రాయ వలసివచ్చును.

ఈపైవిషయములవలన తెలియుచున్నదేమి? అప్పులను చేసిన వారు ఋణదాతబారినుండి సంరక్షింపబడుటకు ఎన్నియోసూచనలను పలువురు పలురీతుల గావించుచున్నను, నిందొక్కపద్ధతియు ఋణ బాధనుండి రైతులను విముక్తినిజేయుటకై తోడ్పడజాలదు.

భూముల అన్యాక్రాంతము.

నాణెముల చలామణి విధానమువలన గతించిన అర శతాబ్దమునుండియు ధరలు కృత్రిమముగ హెచ్చింప బడెను. ఈపెరుగుదల అభివృద్ధియేయని భ్రమపడుచు రైతులు మితిమీరినఅప్పులనుజేసిరి. ఈఅప్పులక్రింద పొలములు వ్యవసాయేతరులకు అమ్ముడుపోయినవి. తణఖాలకు లోనయి నవి. సేద్యగానిచేతినుండి పీడబడినపొలము తిరిగి సేద్యగానికి రాక పోవుటయేకాక వ్యవసాయాభివృద్ధికిగూడ వ్యవసాయముచేయనివారి

1. *Madras Money-lenders Bill No 21 of 1932.*

స్వాధీనమున పొలములుండుట ప్రతిబంధకము. అందుచేత వ్యవసాయము చేయనివారికి పొలములుండరాదను సిద్ధాంతము నాధారముగ జేసికొని పంజాబులో 1901 వ సంవత్సరమున భూమిని అన్యాక్రాంతముచేయుట నిషేధించుశాసనము గావింపబడెను.[1] ఈశాసనము ననుసరించి వ్యవసాయము చేయనివారు భూములను కొనరాదు. 20 సంవత్సరములకంటె అదనముగ తణఖాకూడ పట్టరాదు. ఈశాసనమువలన షాహుకార్లకు భూమి వశముకాలేదు. కాని ధనవంతులగు వ్యవసాయదారులే తోటివ్యవసాయదారులకు పెట్టుబడిపెట్టుచు వారిభూములను స్వాధీనపరచుకొనుచున్నారు. వ్యవసాయేతరులకు భూమి స్వాధీనము కాకపోయినను, రైతులఋణసమస్యను ఈశాసనముకూడ పరిష్కరింపజాలకపోయెను.

పెట్టుబడి లభింపజేయుట. మొగలుచక్రవర్తుల కాలమున ప్రభుత్వమే రైతులకు అప్పులనొసంగుచుండెడిది. వీటిని తకావీఅప్పులందురు. (Takkavi). ఆంగ్లేయయుగమునకూడ 1871, 1876, 1879 వ సంవత్సరములలో తకావీఅప్పుల శాసనము లొనరింపబడెను. కాని రైతులకు విశేషసహాయ మీశాసనములవలన జరుగలేదు. 1880వ సంవత్సరపు కఱవులకమీషనువారి సూచన ననుసరించి 1883 లో భూమినభివృద్ధిచేయు ఋణశాసనము (Land Improvement Loans Act) కావింపబడెను. ఈశాసనముననుసరించి భూమినభివృద్ధిచేయుటకు అనగా నూతులు మొదలగునవి వ్యవసాయాభివృద్ధికరముగ త్రవ్వించుకొనుటకు రైతులకు దూరపువాయిదా అప్పులను ప్రభుత్వమువారొసంగవచ్చును. 1884 వ సంవత్సరమున వ్యవసాయదారుల ఋణశాసనమనుపేర మరొకశాసనము గావింపబడెను.

---

1. *Punjab Land Alienation Act of 1901.*

(Agriculturist Loans Act). ఈశాసనమననుసరించి దగ్గిరవాయిదా అప్పులను విత్తనములు, పశువులు, ఎరువులు, పనిముట్లు మొదలగు నవి కొనుటకు ప్రభుత్వమువారు రైతులకొసంగవచ్చును. కాని ఈ శాసనముల ననుసరించియైనను రైతులు ఋణబాధనుండియు అధికపు వడ్డీల బారినుండియు పెట్టుబడిదారుల పీడనుండియు తప్పించుకొనజాలక పోయిరి. ఇట్టిశాసనములు కలవనియైన రైతులందఱకు తెలియదు. ప్రభుత్వమువారెప్పుడును తెలియజెప్పుటకై ప్రయత్నింపలేదు. తెలియ జెప్పినను, అప్పుపుట్టుటకై రివిన్యూశాఖవారు జరుపు తంతుతో కాలయాపనమగును. ఇంతలో రైతునకవసరమే తీరును. మరియు హామీలొసంగుట కూడ గలదు. హామీలనుగూడ చిన్నరైతులొసంగ లేరు. కొంతమంది రైతులేకమైనగాని యీఅప్పుపుట్టదు. ఏకమగుటకు ఈఅప్పులను తెచ్చికొనుటకుపోవు కాలములోపుగ వ్యవసాయపు అదను పోవును. అందుచే రైతు వీటిని వినియోగించుకొనలేదనుటకంటె నీశా సనములు వినియోగపడునట్లు లేవనదగును. ప్రభుత్వమువారు ఉదార ముగ నీశాసనములను వినియోగింపలేదనికూడ చెప్పవచ్చును. 1901-3 వ సంవత్సరమున పల్లపుసాగుకమీషను తకావీఅప్పులక్రింద 6 కోట్లుమాత్రమే యొసంగబడెనని వ్రాసెను. ఈమొత్తము సముద్ర ములోవేసిన నీటిబిందువే యగును.

ఈదిగువపట్టికవలన మదరాసురాజధానియందొసంగిన తకావీ అప్పుల వివరములను తెలిసికొనగలము.

మఱియు నీ దిగువపట్టిక ననుసరించి ఎంత స్వల్పముగ తకావీ ఋణము రైతుల కొసగబడినదియు సుబోధకమగుచున్నది. ఈదిగువ 1,2 పట్టికలవలన తకావీ అప్పులను కోరిన రైతులందఱకు కూడ ప్రభుత్వమువా రొసంగుటలేదని తెలియగలదు.

| ఫసలీ. | తకావీఅప్పులు-రైతులకిచ్చిన మొత్తము | | | రైతువారీ పట్టాదారుల సంఖ్య. |
|---|---|---|---|---|
| | భూమి అభివృద్ధి శాసనము ననుసరించి 1883 | వ్యవసాయదారుల ఋణ శాసనము ననుసరించి 1884 | మొత్తము. | |
| | రు. | రు. | రు. | |
| 1334 | 1715856 | 2003807 | 3719663 | 4861148 |
| 1333 | 1724680 | 1837781 | 3562461 | 4861148 |
| 1332 | 760647 | 720480 | 1481127 | 4869378 |
| 1331 | 822255 | 1315956 | 2138211 | 4869378 |
| 1330 | 745903 | 881686 | 1627589 | 4862005 |
| 1329 | 589543 | 866708 | 1456251 | 4222548 |
| 1328 | 283811 | 755551 | 1039362 | 4222548 |
| 1327 | 198179 | 626393 | 824572 | 4222548 |
| 1326 | 215859 | 528428 | 744282 | 4222548 |
| 1325 | 239721 | 511530 | 751251 | 4222548 |
| మొత్తము | | | 17344769 | 45435762 |
| 10 సంవత్సరములకు కలిసినసగటు | | | 1734477 | 4543576 |

పట్టాదారు 1కి ఎంత సగటున } $\frac{1734477}{4543576}$వ వంతు రూపాయి=సుమారు రు. 0—6—1 మాత్రమే.

*From Mr. N. Macmichael's evidence P. 263 Vol III, Royal Commission on Agriculture.*

భూమి కిమ్మతు కట్టెదరు. ఆతనికి భూమియందుగల హక్కును విమ ర్శించెదరు. ఆతని దస్తావేజులకు ఋజువుపడెదరు. పిమ్మట ఆరైతునకు అప్పు అవసరమైనదియు లేనిదియు పరీక్షించెదరు. ఈపరీక్షల ఫలితమును రివిన్యూ ఇనస్పెక్టరు తహశీలుదారునకు పంపును. ఆయన చిన్న మొత్తములైనచో ఆర్డరు వేయుచుండును. పెద్ద మొత్తములైనచో డిప్యూటీ కలెక్టరుగారికి ఉత్తరువుల నిమిత్తము పంపుచుండును."

ప్రశ్న:—ఈతంతున కెంతకాలము పట్టును?

సమాధానము:—ఈవిషయము సిబ్బందీననుసరించి యుండును. ఇందులకై ప్రత్యేకముగ గొంతసిబ్బందీని నియమించుచో వారము లేక పదిరోజులలో నిర్ణయించుటకు వీలుండును. లేక మామూలుగ నుండు పరివారమే పనిచేయవలసివచ్చి వారికి యితరపనులు గూడ నున్నచో చాల ఆలస్యమగును."[1]

మదరాసు ప్రభుత్వమువారి వ్యవసాయశాఖ డైరక్టరుగారి పై సమాధానముల ననుసరించియే తకావీఅప్పులు రైతులకు సులువుగ లభించుటలేదనియు నీశాసనముల ననుసరించి ఋణసమస్య పరిష్కరింప బడుటకు సావకాశము లేదనియు స్పష్టపడుచున్నది.

మరియు తకావీఅప్పులు రైతులకు వ్యవసాయము నిమిత్తము మాత్రమే యొసగబడును. రైతులకు జీవితమునం దడుగడుగునకు అప్పుకావలసిన స్థితిగలదు. షాహుకార్లయొద్ద అప్పుఏపనికైనపుట్టును. వసూలునందుగూడ తకావీఅప్పులవలె షాహుకారులఅప్పు కంఠమున కురివలె ఆయేడే బాధించదు. 1917 వ సంవత్సరమున వ్యవసాయ సంఘమువారు తకావీఅప్పులను సులువుగ రైతులకొసంగుట కేర్పాటు లొనరింపవలెనని తీర్మానించిరి. 1922 వ సంవత్సరమునుంచియు

1. *From Vol III Agricultural Commission's Report P 290*

బొంబాయియందు రాష్ట్రీయకోఆపరేటివు బ్యాంకుపరముగ తకావీ అప్పులను రైతులకిప్పించుచున్నారు. 1929-30 వ సంవత్సరమునుంచియు తకావీఅప్పులను విరివిగ రైతులకులభింపజేయవలెనను ప్రయత్నములుకలవు. కాని నిష్ఫలములైనవి.

ఈశాసనముల మూలముగ రైతులకొసంగిన అప్పులుమాత్రమే కాక కొన్నికొన్ని కుటుంబములకుకూడ అప్పుడప్పుడు అప్పులొసంగబడినవి. (టాగూరు కుటుంబమువంటి కుటుంబములకు). జమీందారులు అప్పులపాలైనపుడు వారిజమీలను స్వాధీనపరచుకొని జమీలు పోకుండ అప్పులను తీర్చుచున్నారు.

రైతులఋణసమస్యకు ప్రభుత్వమువారొనరించుచున్న కృషి యిదియే. ఈకృషివలన రైతులఋణసమస్య ఆవగింజలో అరభాగమైన పరిష్కరింపబడలేదు. ఒకసంవత్సరమునకంటె మరొకసంవత్సరము వృద్ధియగుచున్నది. బ్యాంకింగు విచారణసంఘములు మదింపు వేసినట్లుగ 800 కోట్లుమాత్రమే రైతులఋణమని చెప్పవీలులేదు. ఇది కనిష్టప్రమాణమై యుండును. రైతులు తమఋణమును వెలిపుచ్చక దాచుకొనుట కలవాటుపడిరి. రైతులు తమకుగల ఋణమునంతను సిగ్గువిడిచిచెప్పుచో కనీసము రైతులఋణము రు 1200 కోట్లు గలదని తేలును. ఇందులకు సంశయింపబనిలేదు.

రాష్ట్రీయ బ్యాంకింగు విచారణసంఘములే ఋణములను మదింపువేయుటలో గల లోపముల నిట్లు నిరూపించెను.

1. చాలమంది రైతులకు తమకుగల అప్పుల వివరములే తెలియవు. చాలమంది తమకుగల అప్పుల వివరములను తెలుపుట కిష్టపడలేదు.[1]

1. బొంబాయి నివేదిక, 45 వ పేరా.

2. రిజిష్టరీ అయిన దస్తావేజులలో వేయబడిన మొత్తములు కూడ నిజమైనవికావని తేలెను. కొంతమంది తణఖాలను పెట్టియు, తణఖాపత్రములను వ్రాయక క్రయపత్రములవలె మరుగుపెట్టి వ్రాసిరి.[1]

3. షావుకార్ల ఖాతాపుస్తకములు లభింపలేదు. లభించినను నమ్మదగినవిగ నుండవు.[2]

4. వ్యవసాయేతరులుకూడ చాలమంది ఋణస్థులలోనుండుటచే రిజిష్టరీ అయిన దస్తావేజుల ననుసరించి రైతుల ఋణమింతయని నిర్ణయింపజాలము.[3]

5. ఋణముల అంకెలను మదింపువేయుచున్న నెలలననుసరించి మదింపు సరిగ నుండజాలదు.[4]

6. సొములకు పుచ్చుకొనిన ధాన్యరూపమగు ఋణమెంత కలదో మదింపువేయుటకు వీలులేదు.[5]

7. అప్పులను మదింపువేయుటకై పంపబడినవారు ప్రజల విశ్వాసమును జూరగొనినవారు కారు. అప్పులను గుఱించి తెలిపిన వారును విశ్వసింపదగినవారు కారు.[6]

మఱియు, నీఋణముల మొత్తములో ఋణదాత చిట్టచివరకు వసూలుచేయు మొత్తము చేరియుండదు. పుచ్చుకొనిన అప్పు మొత్తమునకును, ఋణమునుతీర్చెడి కాలమునకు చెల్లింపవలసిన మొత్తమునకును నెంతయో వ్యత్యాసముండును. ఒకప్పుడు తెచ్చిన మొత్తము

1. బొంబాయి నివేదిక, 45వ పేరా.
2. బొంబాయి నివేదిక, పేరా 45.
3. బెంగాలు నివేదిక, పేరా 92.
4. మదరాసు నివేదిక, పేరా 92.
5. మదరాసు నివేదిక, పేరా 103.
6. బీహారు-ఒరిస్సాల నివేదిక. పేరా 81.

నకు రెట్టింపుకూడ నిచ్చుట తటస్థించును. ఏవిధముగ జూచినను రైతుల ఋణసమస్య పరిష్కరింపబడుటకు మారుగ క్రమక్రమముగ వృద్ధియగుచున్నది. క్లిష్టపరిస్థితు లేర్పడినవి.

## 5. 1930 వ సం॥ నుంచియు గలిగినమార్పు.

బ్యాంకింగు విచారణసంఘములు దేశమునందుగల అప్పును మదింపువేయుకాలమునకీ పరిస్థితులు తీవ్రముగ విజృంభింపలేదు. బ్యాంకింగు విచారణసంఘములు మదింపువేసినట్లుగ దేశమునందుగల రైతులకు రు 800 కోట్లుమాత్రమే ఆనాటికి అప్పుగలదని తలంచినను ఆమొత్తము నేడు రెండింతలయినదని చెప్పదగును.

పంటలధరలు 100 కి 50 వంతులు పడిపోయినవి. దీనివలన రైతుల భూములకిమ్మతు సగమునకు తక్కువయైనది. 1930 వ సంవత్సరమునకు పూర్వము ఎ 1 కి రు 1200 లకు అమ్ముడుపోయినపొలము నేడు రు 600 లకుగూడ అమ్ముడుపోవుటలేదు. అనగా 1930 వ సంవత్సరమున 2 ఎకరముల పొలము గలిగి రు 600 ల అప్పునుమాత్రమే కలిగియున్నరైతు నాడు ఒకఎకరము నమ్మివేసినచో నాతనిఅప్పు తీరిపోయెడిది. నేడు అతనికిగల రెండుఎకరములభూమిని అమ్మివేసినను అప్పుతీరుటలేదు. ఇంకను అప్పుమిగులుచున్నది. దీనియర్థమేమి? 1930 వ సంవత్సరమున ఆరైతునకుగల రు 600 అప్పును 1931, 32, 33 సంవత్సరములలో రెట్టింపునకుపైగ పెరిగినది. ఇట్లీదేశమునందు రైతులకుగల రు 800 కోట్లరూపాయిల అప్పును నేడు 1600 కోట్లరూపాయలైనది. ఈ 1600 కోట్లరూపాయలను తీర్చుటకు ఆతనియొద్ద హెచ్చు ఆస్తి ఏమియులేదు. 1900 వ సంవత్సరమునకుగాని, అంతకుపూర్వముగాని రైతులయొద్ద చిరస్థిరాస్తు లెట్లున్నవో నేడును అట్లేయున్నవి. సామాన్యముగ రైతునకు పొలము హెచ్చులేదు. పొలమునందు పండు

పంటయు హెచ్చలేదు. వెండిబంగారములు కొలదిగనుండినను, అవియు అమ్మివేయబడెను. అప్పుమాత్రమే హెచ్చినది. అయినను ఆస్తి హెచ్చకపోయినను 1930 వ సంవత్సరమువఱకు పరపతి హెచ్చుగ గలదు. ఈపరపతి సహజముగ పెరిగియుండిన (అనగా ఆస్తి హెచ్చి పరపతి పెరిగియుండిన) నేడు ధరలు పడిపోయినను, అప్పు బాధకరముగ నుండెడిదికాదు. కనీసము అప్పుఆస్తులురెండును సరిపోయెడివి. ఇట్లు పరపతి సహజముగ పెఱుగక కృత్రిమముగ ప్రభుత్వమువారి నాణెముల చెలామణివిధానమువలన నొకప్పుడు ధరలు పెంచబడి మరొకప్పుడు తగ్గింపబడినవి. అధికపుపరపతి కృత్రిమముగ సృష్టింపబడెను. నాణెముల చెలామణివిధానమువలన గలిగిన యీకృత్రిమావస్థయే రైతుల నేటి దుస్థితికి ముఖ్యకారణము.

"లక్ష్యములేక నాణెములను చెలామణియందు హెచ్చించుట వలన చెలామణివిధానము నశించిపోవును. కాని గతించిన పదిసంవత్సరములనుండియు హిందూదేశమునం దవలంబించినట్లుగ నాణెములను చెలామణినుండి తీసివేయుపద్ధతి రైతుపట్ల నిర్దాక్షిణ్యముగ ప్రవర్తించుటయే యగును. ప్రపంచమునం దంతటికంటె హిందూదేశమున వ్యవసాయదారుల ఋణభారము హెచ్చుగనున్నది. గతించిన మూడుసంవత్సరములయందును దిగజారిన ధరలీ ఋణభారమున అత్యధిక మొనరించెను. రైతునకీవిషయమున గావింపబడిన అన్యాయమునకు పరిమితిలేదు. రూపాయవిలువను తగ్గించుటయే యీదుస్థితి నుండి రైతునుసంరక్షించుటకు తరుణోపాయము" అని గావినుజోన్సుగారు నాణెముల చెలామణి విధానమువలననే రైతులఋణభారము మితిమీరినదని ధృవపరచుచున్నారు.[1]

---

*1. From the Note of Mr. Gavin Jones on Economic Situation submitted to the Upper India Chamber of Commerce. See Hindu 9—1—34.*

అయిననేమి? ఈబాధ్యతను ప్రభుత్వమువారు గుర్తింపలేదు. పంటలధరలు పడిపోవుటవలన గలిగిన ప్రస్తుతార్థిక దుస్థితినుండి రైతును సంరక్షించుటకై విదేశములయందలి ప్రభుత్వములు వివిధ రీతుల ప్రయత్నించుచున్నవి.

“ఆస్ట్రేలియా ప్రభుత్వమువారు తమరైతులదుస్థితిని గుర్తించిరి. ఆస్ట్రేలియాయందు రైళ్ళపై రెండుసంవత్సరములలోను 20 మిలియను పౌనులు (27 కోట్లరూపాయలు) నష్టపడినను, వ్యవసాయపుదినుసులపై రైళ్ళచార్జీలను తగ్గించివేసి, రైతులకు తోడ్పడుచున్నారు. తమ ఓడకేవులనుగూడ తగ్గించుట కేర్పాటులొనరించిరి.

న్యూజిలాండుదేశమున రైతు ఆర్థికదుస్థితినుండి సంరక్షింపబడుటకు రైతునకగు ఖర్చులను తగ్గింపవలెనని గుర్తింపబడెను. ఆస్ట్రేలియా దేశమునందు వలెనే న్యూజిలాండుదేశమున గూడ జేసిరి.

దీనితో బోల్చిచూచినయెడల హిందూదేశ ప్రభుత్వమువారు ఎప్పుడును అట్టిసహాయమును జేయక నిరాకరించుచున్నారు. ఆస్ట్రేలియా దేశమందలి రైళ్ళ ఆదాయవ్యయముతో బోల్చిచూచిన హిందూదేశమందలి రైళ్ళ ఆర్థికస్థితి చాలబాగుగ నుండినను, వ్యవసాయపు దినుసులపై రైళ్ళ రేట్లను తగ్గింపవలయునని దేశమంతయు ఘోషించుచున్నను, ఈఆందోళమునంతయు ప్రభుత్వమువారు వినిపించుకొనుటలేదు. చెవిటివానివద్ద శంఖమూదినట్లుగ నున్నది.

వ్యవసాయపు దినుసుల ఎగుమతులపై రైళ్ళరేట్లను తగ్గించుటయేకాక కొన్ని దేశముల ప్రభుత్వములు వ్యవసాయపు దినుసుల ఎగుమతిని పోషించుటకై విరాళములనుగూడ నొసంగుచున్నవి.

అమెరికా దేశమున అతిస్వల్పవడ్డీలకు ప్రభుత్వమే రైతులకు అప్పులనిచ్చుచున్నది. రైతుల తణఖాలను ప్రభుత్వమువారే తీర్చుట కంగీకరించుచున్నారు.

అమెరికాయందు వ్యవసాయపు భూముల తణఖాదారులు తమ తణఖాపత్రములను ప్రభుత్వమువారి కొసంగవలెను. ఇందులకుమారుగ ప్రభుత్వమువారు 100 కి సంవత్సరమునకు 4 వంతుల వడ్డీతో నిచ్చు ప్రభుత్వ ఋణపత్రముల నొసంగెదరు. ఈపద్ధతివలన వ్యవసాయదారుల ఋణభారము చాలవఱకు తగ్గినది. వ్యవసాయపు దినుసులను పండిం చుటకగు ఖర్చు యిందువలన తగ్గినది. (అనగా పంటలు తక్కువవెలకు అమ్మినను ఖర్చులు తక్కువ అగుటవలన రైతులకు లాభమువచ్చును.)

ఇటలీదేశమున హెచ్చువడ్డీల బారినుండి రైతు సంరక్షింపబడెను. ఈరైతుల ఋణములన్నియు 25 సంవత్సరముల తణఖాపత్రములుగ మార్చివేయబడెను. ప్రతిసంవత్సరము వడ్డీక్రింద కొంత యిచ్చుకొనుచుండవలెను. మొత్తము 100 కి 7½ మాత్ర మొసగబడును. ఇందుగల వ్యత్యాసమును ప్రభుత్వమువారు భరించెదరు. వ్యవసాయమే మన ముఖ్య పరిశ్రమ. ఇతరదేశములయందున, అధినివేశరాజ్యముల యందున, అమెరికాయందున, రైతుల సంరక్షణకై చేసిన ప్రయత్నములతో మనదేశమునందు ప్రభుత్వమువారొనరించిన ప్రయత్నములను పోల్చిన అత్యల్పముగ నుండుట విచారకారణము................హిందూదేశ ప్రభుత్వమును స్వదేసంస్థానములునుగూడ మన ముఖ్యపరిశ్రమకు దోహద మొసంగుటకు చేయవలసినదంతయు జేయలేదు."[1]

1. *From Dewan Bahaddur M. Ramachandrarao's Presidential Address, Mysore Provincial Co-operative Conference 29 September 1933.*

# 6. ప్రపంచార్థికదుస్థితి, రూసువెల్టుగారి కార్యక్రమము.

ప్రపంచార్థికదుస్థితి అమెరికాయందునగూడ నలుముకొనినది. అమెరికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వాధ్యక్షుడగు రూసువెల్టుగారీ దుస్థితినుండి అమెరికాదేశపు ప్రజలను సంరక్షించుటకై గావించు చుండిన కార్యక్రమము ప్రపంచమునంతను సమ్మోహింపజేయు చున్నది. రూసువెల్టుగారి కార్యక్రమమందలి ముఖ్యవిషయములను పరిశీలించెదము.

1. రైతులపైగల వడ్డీభారమును దొలగించుటయే మొట్టమొదటి పని. రైతులతనఖాపత్రములను ప్రభుత్వమువారు చెల్లింప నంగీకరించుటవలన నీఫలితము లభించెను.

2. వ్యవసాయదారుల పంటల ధరలు హెచ్చించుటకు ప్రయత్నించుట రెండవపని. ఉత్పత్తిని తగ్గించుటకై శాసన మొనరింపబడెను.(Under the Agricultural Adjustment Act.) ఇందువలన ధరలు కొలదిగ హెచ్చినవి. వ్యవసాయదారుడు కొనవలసిన ఎరువులు మొదలగువాటి ధరలు నిలకడగనుండి, పంటల ధరలు కొంచెము హెచ్చినవి. ఇందువలన రైతులకు ఆదాయము కొంచెము హెచ్చుగ మిగిలినది.

3. వ్యవసాయదారునివలె కార్మికునికిగూడ సదుపాయము లొనరించుటకై ప్రయత్నించుటయే మూడవపని. కార్మికుని సంపాదనయందు ఖర్చులుపోను నిలవయుండినగాని దేశమునందలి పంటలను లేక ఇతరవస్తువులను విరివిగ గొనజాలడు. ప్రజాసామాన్యము విరివిగ

వస్తుసముదాయమును గొనుచుండినగాని ఉత్పత్తికి ప్రోత్సాహము లభించదు. ఇందువలన ప్రజాసామాన్యమునందు కొనుగోలు శక్తిని హెచ్చించుట అత్యవసరము. ఈ ఫలితమునకై పరిశ్రమలయందు నిరర్థకముగనుండు పోటీని తొలగించుటకు యత్నించెను. నిరర్థకపు పోటీ తీసివేయుటవలన గలుగు లాభములను కార్మికులకు పంచుటకు బూనెను. కార్మికుల కూలిని హెచ్చించియు, పనిచేయు కాలమును తగ్గించియు కార్మికుల కాదాయమును హెచ్చుగ లభింపజేయ బూనెను. కాని యీపని సంపూర్ణముగ గొనసాగలేదు.

4. దేశమునకవసరమగు కట్టడములను, యితర నిర్మాణకార్యములను చేయుచు కార్మికులకు వృత్తిగల్పించుచు నిరుద్యోగమును మాపుట నాల్గవపని. ఈనిర్మాణ కార్యవిధానముకొఱకు అమెరికా ప్రభుత్వము 3300000000 డాలర్లను వెచ్చింప నిర్ణయించెను. వర్తక సంఘములకు కంట్రాక్టులనిచ్చెను. వారు కార్మికులు మొదలగు వారితో కంట్రాక్టుల నొనరించిరి.

ఈ కార్యక్రమమువలన వ్యవసాయదారుల పంటదినుసుల ధరలకును, వారుకొనవలసిన యితరవస్తువుల ధరలకును, పరస్పరసంబంధము కలిగెను. కార్మికుల కూలికిని జీవయాత్రను గడుపుటకువలయు నార్థిక స్థితికిని మధ్యగల వ్యత్యాసము తగ్గినది. పరస్పరమైత్రి యొనగూడెను. ఇట్లే ఉత్పత్తి వినియోగములకు సామీప్యము సంభవించెను.

5. అమెరికాయందలి చెలామణియగు డాలరుయొక్క విలువనుగూడ తగ్గించెను. ఇందువలన విదేశవర్తకవ్యాపారము హెచ్చును. అమెరికావారి వస్తువులు విదేశములకు విరివిగ నెగుమతియగుటకు వీలుండును. వెండిని చెలామణికి దెచ్చెను. ఇందువలన నాణెముల చెలామణిపెరిగి ధరలులేచును. (ఈవిషయమై "ధరలపెరుగుదల-విఱుగుదల" అధ్యాయమున విపులముగ చర్చింపబడును.)

ఇట్టి తీవ్రతరకార్యక్రమమును రూసువెల్టుగారు ప్రారంభించి అమెరికాయందలి ఆర్థికదుస్థితిని పారద్రోల దీక్షబూనిరి. ఈప్రయత్నమున రూసువెల్టుగారు జయముగాంచెదరా? అపజయముగాంచెదరా? ఈప్రశ్నకు కాలగర్భమునందెట్టి ప్రత్యుత్తరము దాగియున్నదో నేడు చెప్పజాలము. రూసువెల్టుగారు తమదేశదుస్థితిని పారద్రోలుటకై సర్వవిధముల జేయుచుండిన కృషియు, నాపద్ధతులునుమాత్రమే గమనింపవలెను.

## 7. హిందూదేశ ప్రభుత్వకృషి.

భారతదేశమునందిట్టి తీవ్రప్రయత్నములైనను జేయబడుట లేదు. హిందూదేశప్రభుత్వమువారొనరించిన దేమి? గోధుమల దిగుమతిపై దిగుమతిసుంకమును విధించిరి. ఇది నిష్ప్రయోజనమైనది. ఆస్ట్రేలియానుండి దిగుమతియగు గోధుమలతో హిందూదేశపు గోధుమలు పోటీచేయజాలకపోవుచున్నవి. రూపాయ మారకమువలన విదేశములయందు పోటీచేయుటకు సావకాశమే తొలగిపోయెను.

ప్రత్తిపై దిగుమతి సుంకమును విధించిరి. ఇది అత్యల్పముగనున్నది. నిరుపయోగమైనది. ఈ దిగుమతిసుంకము విధించిననాటినుండియు హిందూదేశపు మిల్లుల విదేశపు దూది వాడకము హెచ్చినది.

పంచదారపై దిగుమతిసుంకము విధింపబడెను. ఇందువలన పంచదార పరిశ్రమ మాత్రము సంరక్షింపబడెనని అంగీకరింపక తప్పదు. కొన్ని రాష్ట్రప్రభుత్వములు, స్వదేశ సంస్థానములును గూడ భూమిసిస్తును నీటితీరువాయిని కొలదిగ తగ్గించెను. కాని ఈతగ్గింపు బహుస్వల్పము. ఇందువలన రైతు అప్పుల సముద్రమునుండి గట్టునకు రాజాలడు. అప్పుల నిచ్చినవానికిని పుచ్చుకొనినవానికిని మధ్య సామ

రస్యము కుదుర్చుటకై శాసనరూపముగ సంఘములను నియమించుటకు గొన్ని రాష్ట్రములయందు ప్రియత్నింపబడుచుండెను. కొన్ని రాష్ట్రములయందు వడ్డీలను తగ్గించుటకై శాసనరూపముగ బ్రియత్నింపబడుచుండెను. వడ్డీలను నిర్ణయించుటకు మరికొన్ని రాష్ట్రములయందు ప్రియత్నములు జరుగుచున్నవి.

ఈప్రియత్నములన్నియు మూలసమస్యయగు ఋణభారమును తొలగింపజాలవు. రైతుల రక్తమాంసాదులను భక్షించుచు ఋణసమస్య దీర్ఘజాడ్యముగ నున్నది. ఈజాడ్యమును సమూలముగ నివారించుటకై ప్రియత్నింపవలెను. జాడ్యలక్షణములను నివారించుటకై చేయు ప్రియత్నములు నిష్ఫలములగును. అందులకై పడు పాటు నిరుపయోగమగును.

## 8. ఋణసమస్యా-పరిష్కార మార్గములు.

వ్యవసాయాభివృద్ధి సమస్యలో ఋణసమస్య ప్రాముఖ్యస్థానము వహించును. ఋణసమస్య పరిష్కారము కానియెడల, వ్యవసాయాభివృద్ధి సమస్య పరిష్కారముకాదు. సంపూర్ణముగ రైతులకుగల ఋణము నంతయు రద్దుపరచు మార్గముల నన్వేషించుటయే కర్తవ్యము. ఆస్తియేకాని, ఏవిధమగు అప్పును లేక రైతుల జీవితము మరల ప్రారంభమగు పద్ధతి నన్వేషింపవలెను.

1. అప్పులను రద్దుచేయుటవలన జీవనోపాధికి భంగమురాని వారికి రైతులనుండి రావలసిన అప్పులను రద్దుచేయవలయును. అనాథలు, వృద్ధులు, వికలాంగులు మొదలగువారు రైతులకు అప్పులనిచ్చియుండి ఆఅప్పులను రైతులు తిరిగి తీర్చకపోయినయెడల వారు కనిష్ట ప్రిమాణమున కూడ జీవయాత్రను చేయలేని స్థితియందుండినయెడల

అట్టివారికి రైతులొసంగవలసిన అప్పులను రైతులకుమారుగ ప్రభుత్వమువారే ఋణమును తీర్మానింపవలెను.

2. ఇట్లు సంపూర్ణముగ ప్రభుత్వము రైతులఋణమును తుడిచి వేయుటకు సాహసింపకపోయినయెడల ప్రభుత్వమువారే రైతులొసంగ వలసిన ఋణమునకంతకును బాధ్యత వహింపవలయును. ఋణ దాతలయొద్దనుంచి ఋణపత్రములను కొనివేయవలయును. ప్రభుత్వ ఋణపత్రములను వారికొసంగదగును. కనీసము 50 సంవత్సరములలో ప్రభుత్వ ఋణపత్రములు తీర్చివేయుటకు నియమముండవలెను. ప్రభుత్వమువారిట్టి ఋణపత్రముల కొసంగువడ్డీ వ్యవసాయపుభూములపై గిట్టు వరుమానముకంటె అదనముగనుండరాదు.

3. రైతులఋణమునకై ప్రభుత్వమువారు సంపూర్ణముగ బాధ్యతగూడ వహింపజాలనియెడల వెంటనే రైతులకు పరపతి హెచ్చించుటకైన బూనవలెను. పరపతి హెచ్చించుటకు వడ్డీరేటును తగ్గించుట యొకమార్గము. రు 100 కి రు 3-0-0 లకంటె వడ్డీ చెల్లనేరదను శాసన మొనరింపదగును. బ్యాంకుల వడ్డీలనుగూడ నూటికి మూడురూపాయలకు తగ్గింపవలెను. ఇట్లు తగ్గించినయెడల భూమిమీదవచ్చు రాబడి కంటె వడ్డీరేటు హెచ్చుగనుండదు. అప్పుడు ఋణదాతలు భూములను కట్టుకొనుటకు సునాయాసముగ నంగీకరించెదరు. బ్యాంకులలో స్వల్ప వడ్డీలపైన విశేషధనము దాచుకొనబడును. ఆసొమ్మును బ్యాంకులు రైతులకు తిరిగి యిచ్చుటకు వీలగును. వడ్డీపైన భూమికంటె అదనముగ ఆదాయము వచ్చుచుండుట కూడ భూములపరపతి తగ్గుటకొక కారణము. భూములరాబడికిని, వడ్డీకిని సమానస్థాన మొసంగినయెడల భూమిపరపతి హెచ్చును. మరియు పరిశ్రమాభివృద్ధికి సులువుగ పెట్టుబడికూడ లభించును. పరిశ్రమాభివృద్ధికి పెట్టుబడి లభించుటకును

భూమిపరపతి హెచ్చుటకును వడ్డీరేటు తగ్గించుటతోపాటు భారత దేశమునందుండి ఎవరును విదేశములలో పెట్టుబడి పెట్టరాదని కూడ శాసింపవలెను. నేడుగల అప్పులను తీర్చుటకు సుమారు 25 సంవత్సరములకు తక్కువకాని కాలపరిమితి నేర్పరచవలయును.

ఈవిధముగ జేసినయెడల రైతుల ఋణబాధ యొకింత తొలగును. కాని ఋణభారము తొలగదు. వ్యవసాయాభివృద్ధికి మార్గమేర్పడదు. సంపూర్ణముగ ఋణమును రద్దుచేసి వ్యవసాయపు భూమిని ఉమ్మడి వ్యవసాయమునకై ప్రజాస్వామిక గ్రామ ప్రభుత్వములకు స్వాధీన మొనరించిననాడే వ్యవసాయసమస్యయు, ఋణసమస్యయు గూడ పరిష్కరింపబడును. అంతవరకును పరిష్కరింపబడవు.

## 9. సహకార పరపతి సంఘములు-ఋణసమస్య.

నేటి సహకార పరపతి సంఘముల మూలమున ఋణసమస్య పరిష్కారము కాదు. గత ముప్పది సంవత్సరములనుండియు సహకారోద్యమము తలపెట్టబడినను నేటివఱకు సహకారోద్యమము జయము గాంచలేదు. ఋణసమస్యను పరిష్కరింపలేకపోయెను. సహకారోద్యమ పరివర్తనమంతయు దెలిసికొనినయెడల నీ సత్యము నెఱుంగగలుగుదుము.

## 10. సహకారోద్యమ తత్వము.

సహకారభావము ప్రకృతిసిద్ధము. మానవుల నైసర్గిక లక్షణము. ఏమానవుడును తనకు తానే జీవింపజాలడు. పుట్టినది మొదలు గిట్టువఱకు తానొరులకు సహాయము జేయుచు తానొరుల సహాయమును బొందుచు తానొరులతో గలిసి చరించుచు జీవయాత్ర గడుపు

చున్నాడు. మత సాంఘిక రాజకీయార్థిక జీవిత విభాగములయం దేజీవిత విజయమునకైనను సహకారతత్త్వమే మూలము. వ్యక్తికి, సంఘమునకు, జాతికి, దేశమునకు మొదలగు అన్నింటి జీవిత విజయమునకును సహకారతత్త్వమే ప్రధానాంగము. వ్యక్తులమధ్య, సంఘముల మధ్య, కులములమధ్య, మతములమధ్య, దేశములమధ్య పరస్పరద్వేషాసూయ భావములు పెంపొంది ప్రజలను సంక్షోభింపజేయుచున్నవి. అయినను మానవ ప్రపంచమంతయు అశాంతిమయము కాలేదు. కంటికి గోచరించుచుండిన ద్వేషాసూయ భావముల వెనుక ప్రకృతిసహజమును, ప్రేమమయమునునగు సహకారతత్త్వముండుటవలననే ప్రపంచమంతయు భీభత్సమయమగుటలేదు. పశువులన్నియు నేకముగ మందగ పోవుటకే యభిలషించుచుండును. ఒంటరిగపోవుట కిచ్ఛగింపవు. పక్షులన్నియు గగనమార్గమున బారులు తీర్చిపోవుచుండును. ఒంటరిగబోవు. పిపీలికలు సహితము కలిసి వసించుచుండును. ఆహారమార్జించుటకు ఏక ప్రయత్నమునే చేయుచుండును. పశుపక్షి పిపీలికలయందు గోచరించుచుండిన ప్రేమమయమగు సహకారభావము మానవ ప్రపంచమున మాసిపోయినదా? పశువుల మందయందు కొన్ని పోట్లగొడ్లుండినంత మాత్రమున మందయంతయు సహాయనిరాకరణభావమునజీవించుచుండెనని చెప్పదగునా? ఇట్లే అధికార అహంకారమున స్వార్థపరత్వమున సంకుచిత జాతీయభావమున వ్యక్తులమధ్య పోటీ పెరుగుచుండినమాట నిజమే. మతములమధ్య ద్వేషము పెంపొందుచుండినదనుటయు సత్యమే. దేశదేశములు పోరాటములకు డీకొనుచుండుటయు నిర్వివాదాంశమే. ఇంతమాత్రమున మానవ లోకమునందు సహకారతత్త్వము సమసిపోయిన దనజాలము. మరుగుపడి యుండినదని చెప్పదగును. దీనిపై బడిన ఆచ్ఛాదనమును దొలగించి రత్నమును సానబట్టినయట్లు ప్రదీపింప జేయుటయే నేటి ప్రపంచ కర్తవ్యము. ముఖ్యముగ పసచెడి వన్నెతరిగి

సర్వతోముఖవికాసమును గోల్పోయిన భారతభూమి సహకారతత్వ మును నిత్యజీవనమునందు మరల ప్రతిష్ఠించుకొనిన గాని ప్రపంచమున తలయెత్త జాలదు. భారతీయ సంఘనిర్మాణమునకు సహకార తత్వమే మూలము. రానురాను సంఘనిర్మాణము న్యూనాధిక భావముల పాలై కలుషపూరితమై ప్రాణములేని శవమువలె నేడు మిగిలియున్నది. సహకార సూత్రములపై నిర్మింపబడిన ఆర్థికసంస్థయగు వర్ణవిభాగముతో గూడిన సంఘనిర్మాణము నేడు తారుమారై ఆర్థికదృక్పథమునువీడి మూర్ఖమత విశ్వాసములకు గురియైనది. దీనిఫలితముగనే భారతీయు లస్వాతంత్ర్యమునకు గురియైరి. దీనిఫలితముగనే భారతీయ వ్యవసాయాభివృద్ధి క్షీణగతియందున్నది. దీనిఫలితముగనే భారతీయ పరిశ్రమ లడుగంటినవి. దీనిఫలితముగనే భారతీయ నిత్యజీవనము విషాద భూయిష్టమైనది. ఈ దుస్థితి తొలగు టకు సహకార తత్వమును సర్వతోముఖముగ మరల వ్యాపింపజేయు టయే కర్తవ్యము. నేడు ప్రపంచము నందంతట సహకారోద్యమము సువ్యాప్తమగుచున్నది. ధనాఢ్యుల బారినుండి కార్మికుని సహకారో ద్యమమే సంరక్షింపగలదని ప్రపంచకమునందు విశ్వసింపబడుచున్నది. పండించువానికిని వినియోగించువానికిని మధ్యగనుండిన దళారీవర్త కుల మోసమునుండి రైతులను సహకారోద్యమమే సంరక్షింపగలదని రుజువు చేయబడుచుండెను. పెట్టుబడిదారుల ధనతృష్ణకు రైతులు బలియై నశింపక సుఖజీవనము చేయుటకు సహకారోద్యమమే అండ యగునని తలంపబడుచుండెను. వర్తక పారిశ్రామిక వ్యవసాయ సమస్య లన్నియు సహకారోద్యమమువలన సంఘ శ్రేయోదాయకముగ పరి ష్కరింపబడగలవని విదేశములయందలి సహకారోద్యమ పరివర్త నము ప్రత్యక్ష ప్రమాణముగ నున్నది. ఇన్నియేల? నేడు ప్రపంచ మునందంతట తీవ్రగతిని వ్యాప్తిజెందుచుండిన సామ్యవాదమునకు

సహకారోద్యమమే శిక్షాశిబిరము. సామ్యవాద సిద్ధాంతములకు నిలయమైన రష్యాదేశమునందు గూడ సహకారోద్యమమే వ్యవసాయ వర్తక పారిశ్రామిక విషయములయందు సామ్యవాదమునకు శిక్షణ మొసంగుచుండెను. ధనాఢ్యులకును సామ్యవాదులకును సహకారవాదులు మధ్యగ నుందురు. సహకారోద్యమమువలన సంఘాదాయము నంతను ఏ కొలదిమంది ధనాఢ్యులో గుట్టపెట్టుకొని అనుభవించుటకు వీలుండదు. సామ్యవాదమువలె నేటి సంఘార్థిక వ్యవస్థ తారుమారుగ పరివర్తనము జెందుటకు ముందుగనే సంఘాదాయమును సాంఘికుల కందఱకు పంచిపెట్టగలశక్తి సహకారోద్యమమునకు గలదు. ఏవిధముగ పరీక్షించినను నేటి భారతదేశ పరివర్తనమునకును ప్రపంచ పరివర్తనమునకును గూడ మహోపకార మొనరింపగల సహజశక్తి సహకారోద్యమమునకు గలదు. సహకారోద్యమ మిట్లు నిర్వచింపబడుచుండెను. "వ్యక్తిగతముగ శక్తిహీనుడై యుండు వ్యక్తి కొంతమందితో జేరి పరస్పర నైతికాభివృద్ధి వలనను, పరస్పర సహకారమువలనను, బలవంతుడై ధనాఢ్యునకును శక్తివంతునకును గల సౌకర్యములను తాను గూడ బడయగలడు. ఇందువలన అతనియందలి సహజశక్తులన్నియు నప్రతిహతముగ సక్రమ పరివర్తనమును బొందగలవు. వ్యక్తిగతశక్తుల నేక మొనరించుటవలన నైశ్వర్యమును సంపాదింపగలుగుచున్నాడు. సంఘీభావముతో గూడిన కృషివలన స్వయం సహాయశక్తిని పొందుచున్నాడు. ఈఫలితముల పరస్పర సంపర్కమువలన ఉత్తమమగు అంతస్తుతో కూడిన జీవితము సిద్ధింపగలదు. అనగా ఉత్తమ వర్తకము, ఉత్తమకృషి ఉత్తమజీవితవిధానము లభింపగలవు"[1] అని మెక్లాగను కమిటీవారు నిర్వచించిరి.

---

1 *From Maclagan Committee Report, P. 2*

"కొంతమంది వ్యక్తులు ఏకాదర్శ సిద్ధిని సమిష్టికృషివలన బడ యుట్లకై సమ్మేళన మగుటయే సహకార మనదగును. బంతిఆటను ఆడువారిజట్లు లేక దొంగలగుంపు లేక ఇతరులను మోసముచేయుటకై కొంతమందిచేరి ఏర్పరచుకొను దళారీకంపెనీలు మొదలగునవి కూడ సహకారముమీదనే ఆధారపడినవి. కాని ఒక శతాబ్దము నుండియు గల సహకారోద్యమచరిత్ర సహకారోద్యమమునకు మరొక అర్థ మును జెప్పుచున్నది. ఋజువర్తనమున ఏకాదర్శముపై ఆర్థికలాభ మును సమిష్టి కృషితో సముపార్జన చేయుటయే సహకారోద్యమ మున కర్థము. సహకారోద్యమమునకు బూనిన వ్యక్తులు తమలో తాము పరస్పర మెరుంగుట కూడ ముఖ్యావసరమే" అని సి. యఫ్. స్ట్రిక్లాండు గారు సహకారోద్యమమును నిర్వచించిరి.[1]

"ఉత్పత్తియందును, పంపకమునందును గల పోటీలను దొల గించివేయుటయును ఉత్పత్తి చేయువారికిని వినియోగించుకొనువారికిని మధ్యగనుండు దళారీలను దప్పించివేయుటయును సహకారోద్యమము నకు సాంకేతికార్థ మనదగును." అని సెల్జిమానుగారు వ్రాసిరి.[2] "సహకారోద్యమము పరస్పర సహాయమునకై ప్రారంభింపబడుచు అందఱకు సమాన సామర్థ్యము నొసంగుచుండును." అని మిరిక్కు గారు నుడివిరి.[3]

"సహకారోద్యమమొక ప్రత్యేక ఆర్థిక సంస్థ. నిర్ణీతమగు వర్తక కార్యములకై నిర్ణీతమగు నియమములతోగూడి సమిష్టికృషి చేయబడును. ప్రస్తుత పారిశ్రామిక వ్యవస్థల కవసరమగు రుజువర్తనము కంటె నుత్తమమగు వర్తకమునకును ధర్మమునకును పరస్పర సమ

1 *See C. F Strickland Cooperation in India P 12*
2 *Principles of Economics. By Seligman.*
3 *Federal Farm Loan System P* 18 *by Myric.*

న్వయ మొనరించు భావమే సహకారోద్యమ మూలము.'' అని గార్డను గారును, ఓబ్రీనుగారును సహకారోద్యమమును గురించి నిర్వచించిరి.[1]

"స్వేచ్ఛతో తమంతతా మొక సంఘముగా నేర్పడి పరస్పరము తమ శక్తియుక్తులను, ధనమును వినియోగించుచు తమ సంఘమును తామే స్వయముగ పరిపాలించుకొనుచు ఉమ్మడిగ లాభనష్టముల ననుభవించుటయే సహకారోద్యమము''అని హెరిక్కుగారు వ్రాసిరి.[2]

"సహకారసంఘమనగా వ్యక్తులు తమంతటతామే ఏర్పరచుకొనిన సంఘ మనదగును. తమ సాంఘికార్థిక స్థితులను జక్కజేసికొనుటకుగాను సమానమగు హక్కులతో ప్రజాస్వామికముగ ఐశ్వర్యసాధనముల నేర్పరచుకొనుటయనియు జెప్పదగును.''[3]

"సహకార సంఘములకును, జాయింటుస్టాకు కంపెనీలకును గల వ్యత్యాసమేమి యని ఆలోచనాపరులకు దోచవచ్చును. స్థూలముగ నిర్వచింపవలెననిన రెండుముఖ్యభేదములు కలవు. ఆదర్శముల యందును, అధికారములయందును గూడ భేదమున్నది. జాయింటుస్టాకు కంపెనీలలో వాటాదారునకు తనకుగల వాటాలననుసరించి అధికారము సంభవించును. 10 వాటాలుగల వాటాదారునకు 1 వాటాయుండిన వాటాదారునకంటె పదిరెట్లు అదనముగ నుండును. (పదిరెట్లు అదనముగ అధికారము కలదని యర్థము.) అందువలన పెట్టుబడి పెట్టిన ధనమే ప్రాముఖ్యస్థానము వహించుచున్నది. "సహకార సంఘములకు 'ఒకమనిషికి ఒక ఓటు' అనునదియే పరమధర్మము. భాగ్యవంతుడును, బీదవాడును, సహకారసంఘమునందిందువలన సమానులే. కంపెనీలకు లాభములను సంపాదించుటయే ముఖ్యాదర్శము. ఈలాభములు

1 *From Gordon O Brin Cooperation in Denmark.*

2 *Rural Credits by Mr. Herricks-quoted by Mr P. Mukherji Cooperative movement in India P 2.*

3 *Rural Reconstruction in Ireland.*

వాటాలవారికి పంచిపెట్టబడును. సహకారసంఘముల ఆదర్శము లాభముల నార్జించుట కాదు. సహకారసంఘ సభ్యులకు చేయగలిగినంత ప్రత్యేక సేవ జేయుటయే సహకారసంఘమున కాదర్శము. అందువలన జాయింటుస్టాకు కంపెనీలకు "లాభము, హెచ్చులాభము, అందరికంటె హెచ్చులాభము" సంపాదించుటయే ఆదర్శము లేక ఏకంపెనీకి ఆకంపెనీయే లాభములకై ప్రయత్నించును. వెనకబడిన కంపెనీలు దయ్యమునకే గురియగును. "వ్యష్టికృషి సమిష్టికృషికొఱకును, సమిష్టికృషి వ్యష్టికృషికొఱకును" చేయుటయే సహకారోద్యమ ఆదర్శము. అందువలన జాయింటుస్టాకు కంపెనీలకును సహకారోద్యమమునకును మూల సిద్ధాంతములయందే విభేదము కలదు.* [1]

## 11. సహకారోద్యమ చరిత్ర.

ఈనిర్వచనముల ననుసరించి సహకారోద్యమము సజీవమైన దనియు జాతీయజీవితమునందు ప్రాముఖ్యస్థానము వహింపగలదనియు గ్రహించుట సులభము. సహకారోద్యమపు పుట్టుకయు, వ్యాప్తియు, నింక గమనింపదగును. వివిధ దేశములయందు ఆయాకాలములలో గల ఆర్థిక పరిస్థితుల ననుసరించి సహకారోద్యమము వివిధదేశములయందు వివిధరీతుల వ్యాప్తిగాంచెను. హిందూదేశమందలి సహకారోద్యమము జర్మనీ, డెన్మార్కు దేశములయందలి సహకారోద్యమములవలె ప్రారంభింపబడెను. నేడు హిందూదేశమునందు గల రైతుల స్థితికిని పారిశ్రామికుల స్థితికిని 1850 వ సంవత్సరప్రాంతమున జర్మనీయందలి రైతుల యొక్కయు, పారిశ్రామికుల యొక్కయు, ఆర్థికస్థితికిని చాలపోలిక కలదు. జర్మనీదేశమునందు నాడుగల యిరువురు మానవసేవకులా

1. *The Co-operative Movement in India P. 5 By Mr. P. Mukherji.*

దుస్థితిని సహింపజాలకపోయిరి. ఎవరికివారు వీటి దుస్థితి నెదుర్కొనుట యెట్లని యూహింపసాగిరి. (Schulze Delitsch) స్కుల్జుడెలిట్షుగారు న్యాయమూర్తి. ఈయనచేతిపనివాండ్రతోను,చిన్న చిన్న వర్తకులతోను కలసిమెలసి వర్తించుచు వారి దీనస్థితిని నివారింప దలపెట్టెను. పరపతి సంఘములను స్థాపింపప్రారంభించెను. (Raiffeisen) రేఫీసనుగారు స్థానిక పారిపాలనయందుద్యోగిగ (Burgomaster) ప్రూసియాయందొక బీద జిల్లాలోపనిచేయుచుండెను. ఈజిల్లాయందలి రైతులు అర్ధాకలితోపీడింప బడుచు పెట్టుబడిదారుల బారికి గురియైయుండిరి. ఈస్థితి నీయన సహింప జాలక పరపతిసంఘములను నితరవిధములగు సంఘములనుగూడ సేద్యగాండ్రకొఱకు స్థాపించెను. ఈయిరువుర మానవసేవకుల కృషియు, ప్రభుత్వపు మన్ననకు పాత్రముకాలేదు. ప్రభుత్వమువారిచే వ్యాప్తి నిరోధింపబడెను. కాని, అనతికాలములోనే ప్రభుత్వ ప్రతిఘటనను జయించి విదేశముల కాదర్శప్రాయముగ జర్మనీయందు సహకారోద్యమము శాఖోపశాఖలుగ విజృంభించెను. డెన్మార్కు, ఇటలీ, అయిర్లెండు దేశముల కాదర్శప్రాయముగ నుండెను. ఇంగ్లండులో కార్మికుల దుస్థితిని తొలగించుటకు చౌకగ వస్తువులను కొని కార్మికులకు విక్రయించుటకుగాను, క్రియవిక్రియ సంఘములు వ్యాప్తియందున్నవి. ఇందులభించు లాభములను కొనుగోలు మొత్తము ననుసరించి పంచి పెట్టబడుచుండెను. గృహనిర్మాణ సంఘములు, ఉత్పత్తి సంఘములు మొదలగునవికూడ ప్రారంభింపబడెను. కార్మికుల నైతికార్థికాభివృద్ధియే యీసంఘముల ముఖ్యోద్దేశము. అయిర్లెండు, డెన్మార్కు, హాలెండు, స్విజర్లాండు దేశములలో వ్యవసాయ మభివృద్ధిపరచుటకై సహకారోద్యమము పనిచేయుచున్నది. అనగా పశుసంతతి నభివృద్ధి చేయుట వ్యవసాయపు దినుసులను సరియగు ధరలకు వలయుచోట్లకు పంపి అమ్ముట, పాలను, వెన్నను, మొదలగువాటినిగూడ సరియగు

ధరలకు అమ్ముటు, మొదలగు పనులకై సహకారోద్యమము కృషిసల్పు చుండెను. ఇటలీయందు సమిష్టి వ్యవసాయమునకు సమిష్టిగ పనిచేసి కొనుటకును సహకారసంఘములు గలవు. ఫ్రాన్సునందు పరిశ్రమ లకై ఉత్పత్తిసంఘములును, ఉత్పత్తిచేయువారి సహకారసంఘములును బయలువెడలినవి. ఆయాదేశములయందుగల ముఖ్యసమస్యల ననుస రించియే ఆయారీతుల సంఘములు మొలకలెత్తెను. హిందూదేశము నందు రైతుల ఋణసమస్య జర్మనీయందువలె తీవ్రముగ నుండుటచే ఋణసమస్య వలన సహకార పరపతిసంఘములు ప్రారంభింపబడెను. హిందూదేశము నందలి పరపతి సంఘములును, పరపతిలేని సంఘము లును, జర్మనీదేశమునందుగల రేఫీసను స్కల్జుడెనిట్జుసంఘముల వలెనే యున్నవి.

రెఫిసను పద్ధతి సంఘముల ముఖ్యలక్షణములు.

1. సంఘసభ్యులందఱు ఒకరినొకరు బాగుగ నెఱుంగుటకు వీలుగ సంఘము పనిచేయవలసిన ప్రదేశము స్వల్పముగ నుండుట. (అనగా సామాన్యముగ నొకగ్రామము).

2. తక్కువ వాటాధనము.

3. పంచుకొనుటకు వీలులేని శాశ్వతమూలనిధి నేర్పరచుట.

4. సంఘసభ్యులకు అపరిమితబాధ్యత యుండుట. (Unlimited Liability)

5. లాభకరమగు ఉత్పత్తికి సంబంధించిన పనులకే అప్పుల నొసంగుట.

6. సంఘసభ్యులకు మాత్రమే అప్పుల నొసంగుట.

7. దూరపువాయిదా అప్పులను తభాలవారీగా చెల్లించు సదు పాయములతో నొసంగుట.

8. ఏసంవత్సరమున ఏసభ్యుడు ఎంతఋణమును తీసికొనుట కర్హుడో నిర్ణయించుట. ఏసంఘము ఎంతఋణము తీసికొనవలెనో నిర్ణయించుట.

9. లాభములను సంపాదించుటకై యత్నింపకపోవుట. లాభములు పంచిపెట్టబడినయెడల అప్పులనిచ్చువారి యొద్దనుండి వసూలు చేయు వడ్డీకంటె హెచ్చుగ పంచిపెట్టకపోవుట.

10. సంఘోద్యోగులు జీతములను దీసికొనరాదు. కార్యదర్శి మాత్రము గైకొనవచ్చును.

11. సంఘసభ్యుల నైతికార్థికాభివృద్ధులకై కృషిసలుపుట. వ్యవసాయమునకు వలయు పరికరములను కొని సంఘసభ్యులకు సకాలమున అమ్ముచుండుట. వ్యవసాయయంత్రములను, పనిముట్లను కొని సంఘసభ్యులకు అద్దెకిచ్చుచుండుట.

స్కల్జుడెలిట్జుగారి సంఘముల ముఖ్యలక్షణములు.

1. సంఘములు పనిచేయుప్రదేశము విస్తారముగ నుండుట.

2. వాటాసొమ్మునకు ఎక్కువప్రాముఖ్యత నొసంగుట.

3. పరిమితిగల బాధ్యత.

4. దగ్గరవాయిదా అప్పు.

5. లాభములనుండి స్వల్పముగ కొంతమూలధనమునేర్పరచుట.

6. లాభములను విరివిగ పంచిపెట్టుట.

7. జీత బత్తెముల నొసంగుచు సంఘోద్యోగులను నియమించుట.

8. నైతిక విషయమునకంటె లాభముల నార్జించుటకై ఎక్కువ ప్రయత్నముల గావించుట.

ఈవిధముగ జర్మనీయందు బయలువెడలిన సహకారోద్యమము నేడు అంతర్జాతీయోద్యమముగ నున్నది. అంతర్జాతీయ సహకారోద్యమ దినముగ నొకరోజున సహకారవాదులందఱు సమావేశమగుచున్నారు. సహకారోద్యమమునకు మానవసేవ మూల సిద్ధాంతముగ నుండుటయే సహకారోద్యమ వ్యాప్తికి ప్రాణము.

## 12. హిందూదేశము-సహకారోద్యమ చరిత్ర.

హిందూదేశమున మొట్టమొదట సహకారోద్యమమును ఫ్రెడరిక్ నైకల్సన్‌గారు (Frederick Nicholson) తలపెట్టిరి. ఈయన మదరాసు రాజధానియందొక సివిలు సర్వీసు యుద్యోగి. సహకారోద్యమము రైతుల ఋణసమస్యను పరిష్కరింపగలదని యీయన విశ్వసించెను. ఐరోపాఖండమందుగల బ్యాంకులను గురించి యీయనకు విపులముగ దెలియును. మదరాసు ప్రభుత్వమువారు నైకల్సనుగారిని వ్యవసాయకులకు సంబంధించిన బ్యాంకులను గుఱించి విచారించుటకు నియమించిరి. నైకల్సనుగారు (1895-7 వ సంవత్సరము) తమ నివేదికను ప్రకటించిరి. ఈ నివేదికయందు సహకార పరపతిసంఘములను నెలకొల్పవలయునని నైకల్సనుగారు సూచించిరి. "హిందూదేశమునందు రైతునకు ఎల్లవేళల అప్పు కావలసియుండుటచే సహకారపరపతి సంఘములను నెలకొల్పుటయే తగిన పని" యని నైకల్సనగారి నిర్ణయము. యూరపుఖండమునందుగల సహకార పరపతిసంఘముల వలెనే మదరాసు రాజధానియందు సహకార సిద్ధాంతమునకు జెందిన "నిధులు" పనిచేయుచున్నవనియు, అందుచేత సహకారపరపతి సంఘములను స్థాపించుటకు వలయు వాతావరణము మదరాసు రాజధానియందు గలదనియు నైకల్సనుగారు ధృవపరచిరి. జర్మనీ దేశమందుగల

రిఫీసను సంఘములవంటి సంఘములను పెట్టుట అత్యవసరమనియు, నైకల్ సనుగారు వ్రాసిరి. అయిననేమి? ఈయన నివేదికను మదరాసు ప్రభుత్వమువారు చిత్తుకాగితముల బుట్టలో పడవేసిరి. 1899 వ సంవత్సరమున నైకల్సనుగారి నివేదికను విమర్శించుచు తీర్మానించిరి. "రైతుల కప్పునిచ్చు సమస్య అత్యవసర విషయము కా"దని మదరాసు ప్రభుత్వము ప్రకటించెను.[1]

ఇంతలో సంయుక్తరాష్ట్రములయందలి సివిలుసర్వీసు యుద్యోగియగు డూపెర్నెక్సుగారు (Mr. Dupernex) హిందూదేశపు ప్రజల బ్యాంకు అనుపుస్తకమును వ్రాసి ప్రకట్రించిరి. (People's Bank of India) ఈపుస్తకమున సహకారోద్యమ విషయములు విపులముగ గలవు. నైకల్సనుగారి నివేదికయు, డూపెర్నెక్సుగారి పుస్తకమును సహకారోద్యమ భావవ్యాప్తికి దోడ్పడెను.

సంయుక్తరాష్ట్రములయందును, పంజాబు, బెంగాలు దేశములయందును కొందఱు జిల్లాఅధికారులు తమస్వంతబాధ్యతపైన సహకార పరపతిసంఘములను స్థాపించిరి. ఈసంఘములు విజయమునొందలేదు. ఇందులకు ప్రభుత్వసహాయము లభింపకపోవుటయే కారణము. సహకారోద్యమము జయప్రదముగ కొనసాగుటకు ప్రభుత్వశాసనములుండుట అత్యవసరమని తలంపబడెను. జాయింటుస్టాకు కంపెనీల శాసనము సహకార పరపతిసంఘములను స్థాపించుటకు నిరుపయోగమని గ్రహింపబడెను.

1901 వ సంవత్సరమున నియమింపబడిన కఱవులకమీషను వారుకూడ సహకార పరపతిసంఘములను వ్యాప్తిచేయవలెనని సూచిం

1. *See Govt. of India's Memorandum accompanying the Cooperative Credit Societies Act of 1904.*

2. *See Maclagan Committee Report, Para 4.*

చిరి. ఈసంవత్సరమునందుననే లార్డుకర్జనుగారి ప్రభుత్వమొక విచారణసంఘమును నియమించెను. ఈసంఘమునకు సర్. ఎడ్వర్డులా (Sir. Edward Law) గారు అధ్యక్షుడు. నైకల్సనుగారి నివేదికపై వివిధరాష్ట్రప్రభుత్వములొసంగిన అభిప్రాయములననుసరించి ఎడ్వర్డులా సంఘము నియమింపబడెను. ఈసంఘమువారికి హెనీవుల్ఫ్‌గారి సలహాకూడ లభించెను. ఈయన ఆనాటి సహకారవాదులలో ఘనుడు. ఈసంఘమువారి సూచనల ననుసరించియే 1903 వ సంవత్సరమున భారతశాసనసభలో (Imperial Legislative Council) సర్. డెన్జిల్ ఇబట్సనుగారు సహకార పరపతిసంఘముల బిల్లును ప్రవేశపెట్టిరి. ఈసందర్భమున సర్. విలియమ్ వెడ్డర్‌బర్న్‌గారి నామము జ్ఞప్తికిరాకమానదు. సహకారోద్యమ భావములకు బీజములను వెడ్డర్‌బర్న్‌గారే నాటిరి. (Sir William Wedderbuın). ఈయన పూనాజిల్లాజడ్జిగ నుండెడివాడు. 1882 వ సంవత్సరప్రాంతమునందే ఈయన హిందూదేశప్రభుత్వము వారిని రైతులఋణసమస్యను నివారించుటకై వ్యవసాయబ్యాంకును స్థాపింపవలెనని ప్రోత్సహించెను. హిందూదేశ ప్రభుత్వమువారుకూడ పురంధరుతాలూకాయందు బ్యాంకును నెలకొల్పుట కంగీకరించిరి. నాడు ప్రభుత్వమువారంగీకరించిన ఈషరతులుకూడ బాగుగనున్నవి.

1. ఈ పురందరుతాలూకాయందలి రైతులఅప్పులను గవర్నమెంటువారే తీర్చివేయుట. ఈతాలూకాయందు వ్యవసాయదారుల బ్యాంకును స్థాపించినవెంటనే ప్రభుత్వమువారు తీర్చిన ఋణములను బ్యాంకువారు తీసికొనుట.

2. బ్యాంకువారు తామొసంగిన ఋణములను గొంతకాలము వఱకు రివిన్యూకోర్టుల మూలముగ వసూలుచేసికొనుట కధికార ముండుట.

3. కొందఱు అప్పుదారుల కొసంగిన ఋణమును ఆ అప్పుదారులు ముందుగ బ్యాంకుఋణమును తీర్చవలెనను నియమముండుట.

4. స్టాంపుపన్ను మొదలగునవి బ్యాంకువారికి కొంతకాలము వఱకు లేకపోవుట.

5. ఈ బ్యాంకువారీ తాలూకాయం దెవరికైనను ఏపనికైనను ఋణముల నిచ్చుటకు స్వాతంత్ర్యము గలిగియుండుట. అప్పులను తీసి కొనువారికి భూమి యుండవలయును.

6. అప్పులమీదవడ్డీ 100కి రు 12—0—0లకు మించరాదు.

7. ప్రభుత్వమువారు చేయు ఇతరనియమములకు బ్యాంకు లోబడి యుండవలెను.

ఈషరతులకు లోబడి వెడ్డర్ బరన్ గారు బ్యాంకును స్థాపింపనుం డిరి. కాని హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి హిందూదేశ ప్రభు త్వమువారికి సూచనకు అంగీకారమును నిరాకరించెను. ప్రజల ఋణ మును ప్రభుత్వమువారు తీర్చివేసి ఆ ఋణమునకు బాధ్యత వహింప వలెనను సిద్ధాంతమునే అంగీకరింప వీలులేదని హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి నిరాకరించెను.

ఇట్లు తొలుదొల్త వెడ్డర్ బరన్ గారు కావించిన సత్ప్రయ త్నములు కొనసాగకపోయినను రైతుల ఋణసమస్య వంకకు వెడ్డర్ బరన్ గారే దేశీయుల దృష్టిని మరల్పగలిగెను. 1904వ సంవత్సరపు సహకార పరపతి సంఘముల శాసనమునకు వెడ్డర్ బరన్ గారి భావ ప్రచారమే మూలము.

# 13. 1904 సహకార పరపతి సంఘముల శాసనము.

1904వ సంవత్సరపు సహకార శాసనము ననుసరించి పరపతిసంఘములను స్థాపించుటకుమాత్రమే వీలుకలదు.

ఈ శాసనము ననుసరించి పదిమంది మెజారిటీ వచ్చినవారు కలసి సంఘముగ నేర్పడి రిజిష్టరీచేయించుకొనవచ్చును. ఈరిజిష్టరీని కోరు ధరఖాస్తుదారులును ముందు సంఘమునందుచేరు సభ్యులును ఏక గ్రామమునకు లేక ఏకపట్టణమునకు లేక ఏకకులమునకు లేక ఏకసంఘమునకు చెందియుండవలెను.

2. అయిదింట నాలుగువంతులుసభ్యులు వ్యవసాయదారులుండు సంఘము గ్రామపరపతి సంఘముగను; అయిదింట నాలుగువంతులు వ్యవసాయదారులు లేక యితరులుండు సంఘము పట్టణసంఘముగను గుర్తింపబడును.

3. గ్రామ పరపతిసంఘములకు అపరిమిత బాధ్యత తప్పనిసరి. పట్టణ పరపతిసంఘములకు అపరిమిత బాధ్యతతోను లేక పరిమితిగల బాధ్యతతోను ఈరెండింట నేవిధముగనైన నేర్పరచుకొనుటకు స్వాతంత్ర్యము కలదు.

4. గ్రామ పరపతిసంఘమునకు వచ్చు లాభమునంతయు మూలధనముగ నుంచవలెను. రాష్ట్రీయ ప్రభుత్వమువారియొక్క ప్రత్యేకపు అనుమతిని పొందినగాని, యీమూలధనము నేవిధముగను వినియోగించుకొనరాదు. పట్టణ సంఘములకు వచ్చు లాభమునందు నాల్గవ వంతు మాత్రమే మూలధనముగ తీయవలయును.

5. వాటాలమూలముగ పెట్టుబడిని వసూలుచేయుటలో కొన్ని నిబంధనలు కలవు. ఏఒక సభ్యుడుగాని మొత్తపువాటాలలో ౕవ వంతు

కంటె హెచ్చువాటాలను తీసికొనరాదు. ఏఒక సభ్యుని వాటాల మొత్తపు సొమ్మును రు 1000 లకు మించియుండరాదు. ఏసభ్యుడు ఎన్ని వాటాలను తీసికొని యుండినను ఆతనికి ఒక్కఓటు మాత్రమే యుండవలెను.

6. ప్రవేశరుసుము వలనను, వాటాల నమ్మకటవలనను, డిపోజిట్లు వలనను సంఘములు పెట్టుబడిని సంపాదింపవలెను. సంఘసభ్యులకే అప్పుల నిచ్చుచుండవలెను.

7. ఒక సంఘము మరొక సంఘమునకు అప్పు నొసంగుటకు రిజిష్ట్రారుగారి అనుమతి పొందవలెను.

8. సంఘములయందుగల వాటాలసొమ్మును యితర ఋణదాతలు జప్తుచేయించుట, వేలము వేయించుట మొదలగు పనులను చేయించి తీసికొనుటకు వీలులేదు.

9. సంఘమునకు ఋణపడిన సంఘసభ్యుని ఆస్తిపైన సంఘమునకు రావలసిన సొమ్ము వసూలయినగాని యితరఋణదాతలు జప్తు మొదలగుచర్యలు జరుపుటకు వీలులేదు. (ఆస్తి అనగా పంటలు, గొడ్లు, మొదలగునవి. గవర్నమెంటు పన్నువసూళ్ళకై చర్య జరుపవచ్చును.)

10. ఆదాయపుపన్నును విధించకపోవుటకు ఇండియాప్రభుత్వమునకు స్వాతంత్ర్య మొసంగబడెను. స్టాంపుఖర్చులను, రిజిష్టరీఫీజులను మానుటకుగూడ ఇండియాప్రభుత్వమునకు స్వాతంత్ర్య మొసంగబడెను.

11. ప్రభుత్వమువారు తమకు నిరంకుశాధికారము లన్నింటిని ఏర్పరచుకొనిరి. (1) విచారణాధికారము. (2) లెక్కలను తనిఖీ చేయుట. (3) రిజిష్ట్రారుగారు ఏసంఘమునైనను ఎత్తివేయుట కధికారము (ఇట్లు ఎత్తివేసిన సంఘము ఎత్తివేయరాదని రాష్ట్రప్రభుత్వ

మునకు అప్పీలుచేసికొనుటకు సంఘమునకు సావకాశము కలదు.)
(4) రాష్ట్రప్రభుత్వములు తమయిష్టమువచ్చిన నియమములను గావించు
చుండవచ్చును.

12. గవర్నమెంటువారు మొదటి మూడుసంవత్సరములును
వడ్డీలేక రు 2000 లవరకు సంఘము కూడదీసికొను పెట్టుబడికి సమాన
మొత్తము నిచ్చుటకు వాగ్దానముచేసిరి.

పరపతిసంఘములన్నియు సాదాతనముగలిగి సంయోగ్యముగ
నుండవలెననియే యీశాసనమును గావించుటయందు ప్రభుత్వము
వారికిగల ముఖ్యోద్దేశములని ఇబెట్సనుగారు వ్రాసిరి.[1]

ఈశాసనము నమలునందుంచుటకు ప్రతిరాష్ట్రమున రిజిష్ట్రా
రులు నియమింపబడిరి.

## 14. 1904-1912 వఱకును జరిగిన పని.

ఈశాసనము ననుసరించి ఆశించినంతపని జరుగలేదు. పరపతి
సంఘము లేర్పరచుటకే యీశాసనమునం దధికారము కలదు. ఇతర
విధములగు సహకారసంఘము లీశాసనము ననుసరించి స్థాపించుట కవ
కాశము లేదు. పరపతిఅయినను హామీయొసంగువారు లేనిచో పుట్టదు.
హామీ యొసంగగలిగినవారే గ్రామములయందు పెట్టుబడిదారులుగ
నుండుటయు సహజము. స్వయముగ కొంతయైనను పెట్టుబడిలేని రైతు
నకు హామీ లభింపదు. హామీ లభింపనందున అప్పు లభింపదు.
భాగ్యవంతులకును, మధ్యతరగతి ప్రజలకును మాత్రమే హామీ లభిం

1, *See Sir Denzil Ebbetson's Explanatory Memorandum With 1904 Act.*

నుచు అప్పు పుట్టగలదు. బీదవానికి పైరు హామీమీదగాని మాట పలుకుబడిమీదగాని అప్పు దొరకదు. సంఘములనుండి స్వల్పమగు వడ్డీలకు మధ్యతరగతి రైతులు అప్పులను దెచ్చికొనుచు బీదవారికి హెచ్చు వడ్డీలమీద నొసంగుటయు గలదు. బీదవారికిని మధ్యతరగతి రైతులకును మధ్య వడ్డీవ్యాపారము నడుచుటకీ సంఘములు తోడ్పడి నవి. అందుచేత బీదవారిబాధలు గట్టెక్కలేదు. ఇందులకు తోడుగ అపరిమితబాధ్యత యుండుటచే సాహసించి సంఘము లేర్పరచుటకు ప్రజలు పూనలేదు. పరిమితిగల బాధ్యతతో సంఘములు పట్టణముల యందైనను స్థాపింపబడలేదు. మఱియు, రిజిష్ట్రారుగారును ఆయనతాబే దార్లును సంఘములు స్వేచ్ఛగ వ్యవహరించుటకు ప్రతిబంధకముల గల్పించుచున్నారు. ఈకారణముల వలన ప్రజలు భయభ్రాంతులై విశేషముగ సహకారమునకు బూనలేదు.

ఈ దిగువపట్టిక 1904-12 సంవత్సరముల మధ్యగల సహకా రోద్యమ వ్యాప్తిని దెలియజేయును.

| సంవత్సరము | సంఘముల సంఖ్య | ప్రాథమిక సంఘ సభ్యుల సంఖ్య | Working Capital వ్యాపారపు పెట్టుబడి |
|---|---|---|---|
| 1906-7 | 843 | 90844 | 2371683 |
| 1907-8 | 1357 | 149160 | 4414086 |
| 1908-9 | 1963 | 180338 | 8232225 |
| 1909-10 | 3428 | 224397 | 12468312 |
| 1910-11 | 5321 | 305058 | 20305800 |
| 1911-12 | 8177 | 403318 | 33574162 |

*See Maclagan Committee Report, para 5.*

1904 వ సంవత్సరపు శాసనమునందు పల్లెల సంఘములనియు, పట్టణముల సంఘములనియు గావించిన విభాగము అసహజముగ నుండెను. పల్లెల సంఘములకు వచ్చు లాభములను పంచుకొనరాదను నిషేధము సంఘములవ్యాప్తికి ప్రోత్సాహకరముగ లేదు. మదరాసు, పంజాబు రాష్ట్రములలో పెట్టుబడి సొమ్ము హెచ్చుగ గలదు. అందుచేత లాభములను పంచుకొనరాదను నిషేధమీ రాష్ట్రములయందుద్యమవ్యాప్తికి నష్టము కలిగించెను. ఈ పరిస్థితు లన్నియు గమనించి, 1904 వ శాసనమునందు గల లోటులను మాపుజేయుటకు మరొక నూతన శాసనమును 1912 వ సంవత్సరమునందు గావించిరి.

## 15. 1912 వ సంవత్సర శాసనము.

1912 వ సంవత్సరపు శాసనము ననుసరించి పరపతి సంఘములు మాత్రమే కాక, ఇతర విధములగు సహకారసంఘములను గూడ స్థాపింపవచ్చును. క్రియ విక్రియసంఘములు, ఉత్పత్తి సంఘములు, సహకారభీమా సంఘములు, గృహనిర్మాణ సంఘములు, మొదలగు సంఘములను స్థాపించుట కధికారము కలదు. ప్రాథమిక సంఘములు కాక, మూడు విధములగు కేంద్రసంఘములను స్థాపించుట కధికారముండెను.

1. యూనియనులు. ప్రాథమిక సంఘములు కొన్ని కలిసి, ఏర్పరచుకొనును.

2. కేంద్రబ్యాంకులు. సహకార సంఘములును ఇతర వ్యక్తులును కూడ నీ బ్యాంకులలో సభ్యులుగ నుందురు.

3. రాష్ట్రీయ బ్యాంకులు. వ్యక్తులతో మాత్రమే ఏర్పడును.

ఈ శాసనము ననుసరించి యితర విషయములయందు గూడ కొన్ని ముఖ్యమగు మార్పులు జరిగెను.

1. ఈ శాసనము ననుసరించి పల్లెల సంఘములనియు, పట్టణ సంఘము లనియు గావింపబడిన విభేదము రద్దుకాబడెను. అపరిమిత బాధ్యత గల సంఘములనియు, పరిమిత బాధ్యత గల సంఘము లనియు విభాగింపబడెను.

2. మదరాను, పంజాబు, బర్మా రాష్ట్రములలో వాటాల మూలమునపెట్టు పెట్టుబడికి ప్రాముఖ్యత హెచ్చుగ గలదు. అందు చేత అపరిమితబాధ్యతగల సంఘములవారు కూడ రాష్ట్రప్రభుత్వము వారి అనుమతినిబడసి లాభములను పంచుకొనుట కధికారమొసంగ బడెను.

3. నాల్గవవంతు లాభమును మూలధనమునకు ప్రత్యేకించిన పిమ్మట ప్రతిసంఘమును తమకువచ్చిన లాభమునుండి నూటికి పది గూపాయలకు మించని మొత్తమును విద్యావ్యాప్తికి, బీదలసహాయము నకు మొదలగు దానములొనరించుటకై ప్రత్యేకించుకొనవచ్చును.

4. ఏసంఘమునకైనను రిజిష్టరీచేయబడిన మరొక సంఘము సభ్యునిగ నుండినయెడల అట్టిసంఘమునకు పరిమితిగల బాధ్యత మాత్రమే కలదు.

5. అప్పులనిచ్చుటయే ముఖ్యోద్దేశమైయుండి ఆసంఘసభ్యులు అధికసంఖ్యాకులు వ్యవసాయదారులుగ నుండినయెడల అట్టిసంఘముల యొక్క బాధ్యతకు పరిమితిలేదు.

6. ఇతరసంఘములు బాధ్యతను తమయిష్టము ననుసరించి నిర్ణయించుకొనుట కధికారముకలదు. ఈశాసన మాచరణకు వచ్చిన పిమ్మట గలిగిన సహకారోద్యమవ్యాప్తి నీదిగువపట్టికలవలన తెలిసికొనగలము.

## ప్రాథమిక సంఘములు.

1వ పట్టిక.

| 1 దామాషా | సంఘముల మొత్తపు సంఖ్య | మొత్తము సభ్యుల సంఖ్య | ♦ వ్యాపారపు పెట్టుబడి (Working Capital) |
|---|---|---|---|
| 1906-10 | 1926 | 161910 | 6812000 |
| 1910-15 | 11786 | 548253 | 54842000 |
| 1915-20 | 28477 | 1128961 | 151847000 |
| 1920-25 | 57707 | 2154607 | 363626000 |
| 1925-30 | 93936 | 3688841 | 748913000 |
| 1930-31 | 106166 | 4308262 | 919122000 |
| 1931-32 | 106050 | 4294339 | 926915000 |

♦ వ్యాపారపు పెట్టుబడి అనగా షేరుధనము, అప్పులు, ధరావతులు, సెక్యూరిటీలు, మూలధనము, ఇతర ఫండ్లు కలిసిన వ్యాపారపు పెట్టుబడి.

1. *From Statistical Statements Co-operative Movement in India, 1931—32.*

## 1930-31 వ సంవత్సరమున సహకారసంఘముల సంఖ్య, సభ్యులసంఖ్య, వ్యాపారపు పెట్టుబడి ఈ పట్టికవలన దెలియును.

2 వ పట్టిక.

| రాష్ట్రములు-సంస్థానములు. | ప్రాథమిక సంఘముల సంఖ్య. | నూరు చ॥మై॥ ల విస్తీర్ణము 1కి గల ప్రాథమిక సంఘముల సంఖ్య. | 100000 మంది జనసంఖ్య 1కి గల ప్రాథమిక సంఘముల సంఖ్య. | ప్రాథమిక సంఘముల సభ్యుల సంఖ్య | 1000 మంది జనసంఖ్య 1కి గల సభ్యుల సంఖ్య. | ప్రాథమిక సంఘము 1కి గల ప్రాథమిక సంఘ సభ్యులు | వ్యాపారపు పెట్టుబడి రు 1000 లలో | సంఘము 1కి గల వ్యాపారపు పెట్టుబడి రు 1000 లలో | తల 1కి గల వ్యాపారపు పెట్టుబడి అణాలు | ప్రాథమిక సంఘ సభ్యుని 1కి గల వ్యాపారపు పెట్టుబడి. |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మదరాసు | 14552 | 102.5 | 31.3 | 977108 | 20.9 | 67.1 | 100038 | 6.9 | 33.6 | 102.4 |
| బొంబాయి | 5768 | 46.6 | 25.9 | 572676 | 25.6 | 99.2 | 93611 | 16.2 | 72.0 | 163.4 |
| బెంగాలు | 23490 | 308.7 | 51.0 | 760184 | 16.3 | 33.4 | 157921 | 6.7 | 54.0 | 207.7 |
| బీహారు, ఒరిస్సాలు | 9150 | 110.0 | 24.3 | 254462 | 6.8 | 27.8 | 27900 | 8.0 | 12.0 | 109.5 |
| సంయుక్తరాష్ట్రములు | 5551 | 52 1 | 12.5 | 147736 | 3.2 | 26.6 | 22364 | 4.2 | 8.2 | 151.4 |
| పంజాబు | 20578 | 206.0 | 87.3 | 679616 | 28.6 | 33.0 | 181060 | 8.7 | 122.0 | 226.4 |
| బర్మా ♦ | 2755 | 11.7 | 27.5 | 88037 | 6.6 | 31.9 | 27656 | 10.0 | 38.0 | 314.1 |
| మధ్యరాష్ట్రములు.బీరారు | 4056 | 40.5 | 29.5 | 76615 | 5.4 | 18.8 | 53172 | 13.1 | 60.8 | 694.0 |
| అస్సాము | 1894 | 26.3 | 17.0 | 69569 | 8.4 | 49.9 | 7804 | 5.5 | 15.0 | 112.2 |
| పశ్చిమోత్తరపరగణాలు | 256 | 19.0 | 10.5 | 7722 | 3.1 | 30.1 | 1296 | 5.0 | 8 | 167.8 |
| కూర్గు | 239 | 151.0 | 146 5 | 14037 | 86.0 | 58.7 | 816 | 3.4 | 80 | 58.0 |
| అజ్మీరు మార్వారా | 645 | 137.9 | 115.0 | 18608 | 33.2 | 28.8 | 2640 | 4.0 | 75 | 142.9 |

♦ ఈ గుఱుతుగల అంకెలు 1929-30 వ సంవత్సరము తాలూకు.

| రాష్ట్రములు: సంస్థానములు | ప్రాథమిక సంఘముల సంఖ్య. | వేయి చ॥మైళ్ల విస్తీర్ణము 1 కి గల ప్రాథమిక సంఘముల సంఖ్య | 100000 మంది జనాభాకు గల ప్రాథమిక సంఘముల సంఖ్య | ప్రాథమిక సంఘముల సభ్యుల సంఖ్య | 1000 మంది జనాభాకు గల సభ్యుల సంఖ్య. | ప్రాథమిక సంఘము 1 కి గల సభ్యుల సంఖ్య | చలామణి మూలధనము రూ 1000 లో | సంఘము 1 కి గల చలామణి మూలధనము రూ 1000 లో | తల 1 కి గల చలామణి మూలధనము | ప్రాథమిక సంఘ సభ్యుని 1 కి గల చలామణి మూలధనము |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదునందలి బ్రిటిషుభాగము- | 13 | ...... | 18.0 | 6178 | 61.7 | 475.0 | 518 | 39.8 | 83 | 83.9 |
| ఢిల్లీ | 274 | 462.0 | 40.2 | 7795 | 12.2 | 26.4 | 2507 | 9.1 | 62 | 321.6 |
| మైసూరు | 2197 | 174.5 | 33.5 | 184428 | 20.5 | 61.3 | 189.64 | 8.6 | 45 | 141.0 |
| బరోడా | 1040 | 127.8 | 42.5 | 37321 | 15.2 | 35.8 | 79.94 | 7.1 | 57 | 201.0 |
| హైదరాబాదు | 2123 | 25.6 | 14.7 | 53120 | 8.6 | 25 | 106.49 | 5.0 | 71 | 200.4 |
| భూపాలు | 1160 | 168.0 | 159.1 | 20611 | 28.2 | 17.6 | 14.65 | 1.7 | 18 | 70.2 |
| గ్వాలియరు ♦ | 3864 | 146.6 | 120.8 | 68724 | 21.4 | 17.7 | 85.52 | 2.2 | 43 | 124.4 |
| ఇండూరు ♦ | 482 | 45.3 | 39.3 | 11124 | 10.1 | 24.1 | 49.88 | 11.3 | 73 | 439.4 |
| కాశ్మీరము ♦ | 2746 | 32.5 | 83.3 | 51430 | 15.5 | 18.7 | 89.40 | 3.2 | 43 | 173.8 |
| తిరువాన్కూరు | 1778 | 233.2 | 34.9 | 219159 | 43.0 | 123.3 | 55.92 | 3.2 | 17 | 25.5 |
| కొచ్చిను | 227 | 158.5 | 18.9 | 23328 | 20 4 | 107.1 | 21.22 | 9.4 | 28 | 87.3 |
| పుదుకోట్టై ♦ | 150 | 127.2 | 37.4 | 15335 | 38.2 | 100.2 | 18.18 | 12.0 | 72 | 118.2 |

♦ ఈగురుతుగల అంకెలు 1929-30 వ సంవత్సరము నాటివి.

(*From Co-cperation in India.*)

పైన వేయబడిన పట్టికల ననుసరించి సహకారోద్యమము రైతులలో అత్యల్పముగ వ్యాప్తిజెందినట్లు సుబోధకమగుచున్నది. అన్నిరాష్ట్రములకంటె పంజాబు, మదరాసు, బొంబాయి రాష్ట్రముల యందొకింత హెచ్చుగ వ్యాప్తిగాంచెను. సహకారసంఘము లెంత స్వల్పముగ వ్యాప్తిజెందినదియు నీ దిగువపట్టికవలన నెక్కువగ రుజువగుచున్నది.

| 1రాష్ట్రము | గ్రామములయందు గల కుటుంబముల సంఖ్య (మదింపు) 000 లో (వేలు) | గ్రామములయందలి కుటుంబములు 100 కి గల సంఘములసంఖ్య | |
|---|---|---|---|
| | | అన్ని విధములగు సంఘములు | పరపతి సంఘములు |
| అజ్మీరు-మార్వారా | 66 | 15.4 | 15.0 |
| అస్సాము | 1486 | 2.9 | 2.9 |
| బెంగాలు | 8702 | 4.4 | 3.8 |
| బీహారు, ఒరిస్సాలు | 6525 | 3.2 | 3.1 |
| బొంబాయి | 2981 | 10.0 | 8.7 |
| బర్మా | 2384 | 3.9 | 3.7 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 2504 | 2.4 | 2.3 |
| కూర్గు | 31 | 36.2 | 36.2 |
| ఢిల్లీ | 37 | 11.5 | 11.5 |
| మదరాసు | 7408 | 8.3 | 7.9 |
| పశ్చిమోత్తర పరగణాలు | 383 | 0.2 | 0.2 |
| పంజాబు | 3694 | 10.9 | 10.2 |
| సంయుక్తరాష్ట్రములు | 8114 | 1.8 | 1.8 |

ఈపట్టిక ననుసరించి సహకారోద్యమము నేటివఱకు ప్రజలకెంత స్వల్పముగ నుపకారమొనరించినదియు తేటతెల్లమగుచున్నది. ఈపట్టికపై వ్యవసాయవిచారణసంఘమువారిట్లు వ్యాఖ్యానమునుగావించిరి.

"ఈ పై పట్టికవలన పంజాబు, మదరాసు, బొంబాయి రాజధానులలోగాక, ఇతర ముఖ్యరాష్ట్రములయం దత్యల్పసంఖ్యాకులగు పల్లెటూరివారీ యుద్యమమునందుండినట్లుగ దెలియుచున్నది."

1. *From Agricultural Commission's Report P. 447*

మదరాసు, పంజాబు, బొంబాయి రాజధానులలో కొంచెము హెచ్చుగ వ్యాప్తి జెందుటకీ రాష్ట్రములలోగల రైతువారీ భూస్వామ్యమే కారణమనదగును. రైతువారీ పద్ధతిగల రాష్ట్రములలో హామీనిచ్చుటకు రైతులకు భూములుండును. అందువలన అప్పులను పుచ్చుకొనుటకు వీలుకలిగి, సహకారోద్యమమెుకింత వ్యాప్తిజెందెను.

విదేశములతో పోల్చిచూచిన, భారతదేశమున సహకారోద్యమము అణుమాత్రముగ నున్నదని యీదిగువపట్టిక తెలియజేయుచున్నది.

| 1 దేశము | విస్తీర్ణము చ॥ మైళ్లు | జనసంఖ్య | 1927-28వ సం॥ అంచనా జనసంఖ్యలో ఎంతమందికొక్క సహకారసభ్యుడుండును? |
|---|---|---|---|
| బెల్జియం | 32175 | 6678527 | 26 |
| జెకోస్లావకియా | 54877 | 14726158 | 21 |
| డెన్మార్కు | 15042 | 3500000 | 4 |
| ఫిన్లాండు | 149926 | 3634047 | 6 |
| ఫ్రాన్సు | 207076 | 40745874 | 17 |
| జర్మనీ | 182200 | 62592575 | 22 |
| ఇంగ్లాండు | 50327 | 37354917 | 8 |
| వేల్సు | 8016 | 2593014 | |
| స్కాట్లాండు | 30405 | 4842554 | |
| హాలెండు | 12761 | 7938114 | 41 |
| నార్వే | 124964 | 2809564 | 27 |
| స్వీడను | 173157 | 6141571 | 14 |
| స్విజర్లాండు | 15976 | 4066400 | 10 |
| సోవియట్ రష్యా | 8241673 | 14 కోట్ల 70 లక్షలు | 3 |
| భారతదేశము | 1805332 | 352986876 | 70 |

ఈఅంకెలు అన్నిరకములసంఘములలోని సభ్యులకును సంబంధించియున్నవి.

1. *From Economic Advance of British Co-operation—Quoted in* భారతదేశ స్థితిగతులు-లోకస్థితి గణితము. పే. 50.

ప్రపంచమునం దన్ని దేశములకంటె భారతదేశమున సహకారోద్యమము ప్రాథమికదశయందున్నదని పైపట్టిక విశదము చేయుచున్నది. 70 మందికొక సహకారసభ్యుడు మాత్రమే భారతదేశమున గలడు. రష్యాయందు ముగ్గురు మనుష్యులకు ఒక సహకారసభ్యుడు వంతున గలడు. పిమ్మట డెన్మార్కునందును, ఫిన్లాండునందును, బ్రిటిషుదీవులయందును, 4 గురికి, 6 గురికి, 8 గురికి 1 సహకారసభ్యుడు వంతున గలడు.

## 16. మెక్లాగన్ కమిటీ.

1914 వ సంవత్సరం అక్టోబరు 8 వ తేదీని హిందూదేశ ప్రభుత్వము సహకారోద్యమ సమస్యలను గురించి విచారణ సంఘమును నియమించుటకు తీర్మానించుకొనెను. సర్ ఎడ్వర్డు మాక్లగన్‌గారి అధ్యక్షతక్రింద నొకసంఘము నియమింపబడెను. సహకారోద్యమమున పెట్టుబడి హెచ్చుచున్నదనియు ప్రాథమిక సంఘములపై గల సంఘముల ఆర్థిక వ్యవహారములు క్లిష్టముగ నున్నవనియు తనిఖీ విచారణాధికారములు విస్పష్టముగ లేవనియు నందుచేత సక్రమపద్ధతుల నరయుటకై విచారణసంఘ మవసరమనియు ప్రభుత్వమువారు ప్రకటించిరి.

"ఈసంఘమువారు ప్రాథమికసంఘములపైన స్థాపింపబడుచుండిన ఆర్థికసంస్థలు సక్రమపద్ధతులపై వ్యవహరింపబడుచున్నదియు, లేనిదియు, తెలిసికొని అవసరమగు మార్పులను సూచింపవలెను. సెంట్రలు బ్యాంకులు, రాష్ట్రీయ బ్యాంకులు పరిపాలనా విధానమును, నియమావళియును పరీక్షించుటయు సహకార సంఘములమధ్య ఆర్థికసంబంధము సక్రమముగ నుండినదియు లేనిదియు విచారింపవలెను. లెక్కలతనిఖీ, పరిపాలనాపరీక్ష, మొదలగు కార్యనిర్వహణమును, మూలనిధుల వినియోగమును, మూలనిధులను లెక్కలలో వేయు పద్ధతియును గమనింప

వలెను. ఈవిషయములను గుఱించి మాత్రమేకాక ఇతర సహకారోద్యమ విషయములను గురించికూడ కమిటీవారు విచారించి విమర్శింపవచ్చును." ఈఅధికారములతో మెక్లాగను కమిటీవారిని హిందూదేశ ప్రభుత్వము నియోగించెను. ఈకమిటీవారు సహకార పరపతిసంఘములను గుఱించియే ముఖ్యముగ విమర్శించిరి. వీరి నివేదిక 1915 వ సంవత్సరము సెప్టెంబరు మాసమున ప్రకటింపబడెను. ఈనివేదికయందుగల ముఖ్యసూచన లీదిగువ పేర్కొనబడెను.

1. సహకారోద్యమ సిద్ధాంతములు తెలిసియుండవలెను. సంఘములయందు సరియగుసభ్యులుండవలెను.

2. పరపతికి ఋజువర్తనము ప్రధానముగ నుండవలెను.

3. సంఘసభ్యులతో మాత్రమే వ్యవహరింపవలెను.

4. లాభములను సంపాదింపవలెనను ఆశపై చేయు పనులకై అప్పుల నొసంగకపోవుట.

5. అప్పునిచ్చుటకు పూర్వము జాకరూకతతో ఆస్తి అప్పులను పరీక్షించుట; అప్పునిచ్చినపిమ్మట ఆతనిపరిస్థితులను శ్రద్ధతో గమనించుచుండుట.

6. సంఘవ్యవహారములపై సంఘసభ్యులకే కడపటి నిర్ణయాధికారముండవలెను. సంఘఉద్యోగుల కుండరాదు.

7. మితవ్యయమును ప్రోత్సహించుట; మూలధనమునువలయునంతగ సమకూర్చుట.

8. సభ్యుని 1 కి ఒక్కఓటుమాత్రమే యుండుట; సభలసంగతి సభ్యులకందఱకు తెలియజేయుచుండుట.

9. సంఘసభ్యులు నిలవజేసికొను సొమ్మునుండియే మూలధనమును సమకూర్చుట; లేక చుట్టుపట్ల నుండువారియొద్దనుండియే గైకొనుట.

10. నిర్ణీతకాలమునకు అప్పులను తిరిగి యిచ్చివేయుచుండుట.

ఈనియమముల గమనించుచు మొట్టమొదటగ సహకార సంఘములు నిజమగు సహకారసంఘములుగ నుండవలెననియు పిమ్మట వ్యాపారదృష్టిని గలిగియుండవలెననియు నీసంఘమువారు వ్రాసిరి.

ఈసంఘమువారు సహకారోద్యమాభివృద్ధికి వ్యాపారదృష్టితో నిర్వచించిన కొన్ని ముఖ్యసూత్రముల నిట గమనింపదగును.

1. క్రొత్త సంఘములను ప్రబోధ మొనరించి నెలకొల్పుట సమంజసము కాదు. సహజముగ ఎవరికి వారు సహకారోద్యమమున కభిముఖులు కావలెను.

2. తక్కువ వడ్డీలతో హెచ్చు పరపతిని గలిగించుట అపాయ కరము.

3. స్థానికముగ లభించు డిపోజిట్లే వ్యాపారపు పెట్టుబడిగ నుండుటకై ప్రయత్నించవలెను. లభించిన డిపోజిట్ల మొత్తము నను సరించి ఉద్యమ జయాపజయములు నిర్ణయింపవలెను.

4. సంఘసభ్యులు వేసికొను డిపోజిట్లపై వడ్డీ కొంచెము హెచ్చుగ నిచ్చుచు, మితవ్యయమును బోత్సహింపవలెను. స్థానిక ముగ డిపోజిట్లకై సర్వప్రయత్నములను గావింపవలెను.

5. Current Account రోజువారీకాతా పైన డిపోజిట్లను తీసి కొనరాదు. ఇట్టిమొత్తమును అప్పుగ నిచ్చుటయందు ప్రమాద ముండుటయే యిందులకు కారణము.

6. హెచ్చు వడ్డీల నిచ్చుచు దూరపు వాయిదా డిపోజిట్లను పోత్సహింపవలెను.

7. నెలరోజుల కంటె హెచ్చువాయిదా లేని దగ్గిర వాయిదా డిపోజిట్లను దగ్గిరవాయిదా అప్పుల నిచ్చుటకై అంగీకరింపవచ్చును.

8. మితవ్యయమును ప్రోత్సహించుటకై సేవింగ్సు బ్యాంకు, ఖాతాను పెట్టవచ్చును.

9. పరపతి సంఘములకు సెంట్రలు బ్యాంకులపై నాధార పడుటను తగ్గించి స్వయంసహాయమును అభివృద్ధిపరచుకొనుటయే ఆదర్శముగ నుండవలెను.

10. లెక్కలను తనిఖీ చేయుచుండుటయు, సంఘవ్యవహారము లను పరీక్షించుచుండుటయు ఉద్యమాభివృద్ధికి అత్యవసరములు.

ప్రభుత్వమువారు రెండుమూడు సంవత్సరముల కొకపర్యా యము తనిఖీచేసిన లెక్కలను తిరిగి తనిఖీచేయుచుండుటయు ప్రతి సంవత్సరమును సంఘములన్నియు గలసి తమలో తాము ఉద్యోగేతరుల చేత లెక్కలను తనిఖీచేయించుచుండుటయు నత్యవసరము.

11. అప్పులను తిరిగి వసూలు చేయుటలోగల విపరీతాధికారము తగదు. పంచాయితీ చేయించుచుండుట సమంజసము.

భారతదేశమున కంతకును గలిపి, యొక యుద్యోగిని సహకా రోద్యమమును గురించి సలహా నొసంగుటకు హిందూదేశప్రభు త్వము నియమింపవలెనని మెక్లాగను కమిటీవారు సూచించిరి. ఈసూ చనను ప్రభుత్వమువా రంగీకరింపలేదు. ఈ సంఘసూచనల ననుసరించి సహకారపరపతిసంఘములపై ప్రభుత్వమువారి హయాము హెచ్చి నది. దీనిఫలితముగ 1918-19 వచ్చుసరికి అభివృద్ధి వెనుకాడసాగెను. 1919వ సంవత్సరపు మాంటేగు సంస్కరణముల నాటనుండియు సహకారోద్యమము రాష్ట్రప్రభుత్వముల పరిపాలనయందున్నది. ప్రజాయత్తశాఖలలో నొకశాఖగ నున్నది. ఆయారాష్ట్రముల అవస రముల ననుసరించి కొన్నిరాష్ట్రములు ప్రత్యేక శాసనములను గావించు కొనెను. 1925వ సంవత్సరమున బొంబాయిరాజధానియందు ప్రత్యేక శాసనము గావింపబడెను. సంయుక్తరాష్ట్ర ప్రభుత్వమును, మధ్యరాష్ట్ర

ప్రభుత్వమును బొంబాయిప్రభుత్వ శాసనము ననుసరింపనున్నారు. బర్మాయందు 1927లో ప్రత్యేకశాసనము గావింపబడెను. బొంబాయి ప్రభుత్వమువారు ప్రత్యేక శాసనమునందు ఆయా సహకారసంఘము లను వాటి ఆదర్శముల ననుసరించియు, ఆర్థికము ననుసరించియు, పని చేయు పద్ధతుల ననుసరించియు ప్రత్యేక తరగతులుగ విభజించిరి. రద్దుపరచిన సంఘముల నెత్తివేయుటకు వలయు మార్గములను చక్కజేసిరి. పంచాయితీదార్ల మూలముగ సొమ్ము వసూలుచేయు నధికారమును హెచ్చించిరి. మదరాసునందు 1932 వ సంవత్సరమున ప్రత్యేక సహకారశాసనము గావింపబడెను. (Madras Act No. VI of 1932.) ఈశాసనమువలన సభ్యుల సమిష్టిబాధ్యతయందుగల సందిగ్ధ నిర్వచనము కొంతతొలగింపబడెను. సంఘముల నెత్తివేయుటకు సంఘ ములపై పెత్తనము చెలాయించుటకు ప్రభుత్వోద్యోగుల అధికారము హెచ్చింపబడెను. సహకారశాఖ రాష్ట్రీయప్రభుత్వముల వశమై ప్రజాయత్తశాఖలలో నొకశాఖగ నుండినను నూతనవికాస మిసు మంతయు బొందలేదు.

1926 వ సంవత్సరమున వ్యవసాయ విచారణసంఘమువారు వ్యవసాయసమస్యలను గురించి విచారించుటకు నియమింపబడినను వ్యవసాయసమస్యలలో సహకారోద్యమమొక ముఖ్యవిషయముగ పరిగణించి విమర్శించిరి. దానిసూచన లింతవఱకు ఆచరింపబడలేదు. పిమ్మట బ్యాంకింగు విచారణసంఘములు, వివిధరాష్ట్రములలో సహ కారోద్యమవ్యాప్తిని విచారించినవి. రాష్ట్రసంఘములు వ్యవసాయ దారులకుగల బ్యాంకుల సౌకర్యములను గుఱించియే విమర్శించినవి. మధ్యరాష్ట్రములయందును, సంయుక్త రాష్ట్రములయందును, మద రాసురాజధానియందును జరిపిన విచారణలవంటి విచారణను భారత వర్షమునకంతకు సమగ్రముగ జరుపుట సమంజసము.

# 17. సహకారసంఘముల తరగతులు.



పైన చిత్రించిన పటమును పరీక్షించినయెడల భారతదేశము నందు నిర్మింపబడిన సహకారోద్యమ అంగనిర్మాణమును గ్రహింప గలము.

ఈ దిగువ పట్టికల ననుసరించి ఆయా తరగతుల సహకార సంఘముల ప్రాముఖ్యస్థితిని గ్రహింపగలము.

హిందూదేశమునందుగల సహకార సంఘముల సంఖ్య.

| 1 | 1925-26 | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 |
|---|---|---|---|---|---|
| కేంద్రసంస్థలు(సెంట్రలు బ్యాంకులు- రాష్ట్రీయ బ్యాంకులు-బ్యాంకింగు యూనియనులు) | 567 | 577 | 598 | 593 | 598 |
| సూపరువైజింగు గారంటీయింగుయూనియనులు తిరిగి ఇన్సూరుచేయు సంఘములు. | 1406 | 1421 | 1442 | 1419 | 1282 |
| వ్యవసాయ సంఘములు (పశువుల ఇన్సూరెన్సు సంఘములతో సహా) | 71140 | 78940 | 84959 | 88377 | 92051 |
| వ్యవసాయేతర సంఘములు | 7069 | 8133 | 9052 | 9761 | 10256 |
| మొత్తము | 80182 | 89071 | 96091 | 100150 | 104187 |

1. *From Cooperation in India*

| 1 | 1906-7 మొదలు 1909-10 వరకు 4 సం॥ సగటు | 1910-11 మొదలు 1914-15 వరకు 5 సం॥ సగటు | 1915-16 మొదలు 1919-20 వరకు 5 సం॥ సగటు | 1920-21 మొదలు 1924-25 వరకు 5 సం॥ సగటు | 1925-26 మొదలు 1929-30 వరకు 5 సం॥ సగటు | 1930-31 | 1931-32 | 1932-33 | 1933-34 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| కేంద్రసంస్థలు-(సెంట్రలు బ్యాంకులు-బ్యాంకింగు యూనియనులు) | 17 | 231 | 304 | 506 | 587 | 607 | 605 | | |
| సూపర్ వైజింగు, గ్యారంటీయింగు యూనియనులు-తిరిగి ఇన్సూరు చేయు సంఘములతో కలిసి | 17 | 231 | 638 | 1302 | 1394 | 1256 | 1091 | | |
| వ్యవసాయ సంఘములు పశువుల భీమాసంఘములతో కలిసి | 1713 | 10891 | 25873 | 51716 | 83093 | 93773 | 93598 | | |
| వ్యవసాయేతర సంఘములు | 196 | 664 | 1662 | 4183 | 8862 | 10530 ♦ ఇందులో రెండు భీమాసంఘములు కూడ కలవు. | 10756 ఇందు 3 భీమా సంఘములు కూడ కలవు. | | |
| మొత్తము. | 1926 | 11786 | 28477 | 57707 | 93936 | 106166 | 106050 | | |

1. *From Statistical Statements relating to Cooperative Movement.*

రాష్ట్రప్రభుత్వములు రోమునందుగల అంతర్జాతీయ వ్యవసాయ సంస్థవారి సూచనల ననుసరించి సహకారసంస్థల నిట్లు విభజించిరి.

1. పరపతి సంఘములు.
2. క్రియ సంఘములు లేక- క్రియ విక్రియ సంఘములు.
3. ఉత్పత్తి సంఘములు.
4. విక్రయోత్పత్తి సంఘములు.
5. భీమా సంఘములు.
6. ఇతరములు.

ఈ విభాగము ననుసరించి 1931-32 వ సంవత్సరమునందుగల వివిధసంఘముల ప్రాముఖ్యస్థితి నీ దిగువపట్టిక తెలుపగలదు.[1]

| పరపతి సంఘములు | క్రయసంఘములు క్రయ విక్రయ సంఘములు | ఉత్పత్తి సంఘములు | విక్రయోత్పత్తి సంఘములు. | ఇతరములు | మొత్తపు సంఘములు | మొత్తపు సంఘ సభ్యులు | వ్యాపారపు పెట్టుబడి |
|---|---|---|---|---|---|---|---|
| వ్యవసాయ సంఘములు. | | | | | | | |
| 83164 | 347 | 1140 | 1565 | 1055 | 98349 | 3105584 | 350924848 |
| వ్యవసాయేతర సంఘములు. | | | | | | | |
| 5252 | 615 | 13 | 1201 | 3264 | 10753 | 1181989 | 170886812 |

ఈ పట్టిక ననుసరించి వ్యవసాయ పరపతి సంఘముల సంఖ్య హెచ్చుగ నున్నది. ఇతర సంఘముల కంటె పరపతి సంఘములును, పరపతి సంఘముల కంటె వ్యవసాయ పరపతి సంఘములును ప్రాముఖ్యస్థానము వహించుచున్నవి. ఇతర విధములగు సంఘము లత్యల్పముగ నున్నవి. అభివృద్ధియందు లేవు. ఈ విభాగము

1. *From Statistical Statements relating to Co-operative Movement 1933.*

ననుసరించి సహకారోద్యమము యొక్క సర్వతోముఖాభివృద్ధిని గ్రహింపజాలము. "కొన్ని పరపతి సంఘములు క్రయ, విక్రయ సంఘముల లెక్కలలోను, క్రియోత్పత్తి సంఘముల లెక్కలలోను గణింపబడుచున్నవి"[1]

## 18. వ్యవసాయ ప్రాథమిక పరపతిసంఘములు.

వివిధములగు సహకారసంఘములను గుఱించి విపులముగ పరిశీలించెదము. సహకారసంఘములలో 100కి 90 వంతులు వ్యవసాయపరపతిసంఘములున్నవి. వ్యవసాయ పరపతిసంఘముల కార్యనిర్వహణమునుగురించి గమనింపదగును.

1. సంఘసంఖ్య (Size). పదిమంది గ్రామస్థులుకలిసి పరపతిసంఘమును రిజిష్టరీ చేయించుకొనవచ్చును. ఇందు సభ్యు లత్యధికసంఖ్యాకులుగ నుండుటకంటె తగుమాత్రముగ నుండుట సమంజసము.

2. పనిచేయు ప్రదేశము. (Area of operation) గ్రామమునకొక సంఘమువంతున నుండుట మంచిది. గ్రామమునకొక సంఘమువంతుననే పనిజరుగుచున్నది. ఇందువలన సంఘసభ్యులు పరస్పర మెరుంగుటకు వీలుండును. ఒకరినొకరు తెలిసికొనియుండుటవలన అప్పులనిచ్చి పుచ్చుకొనుటలో జాగరూకతయు, శ్రద్ధయు వహించుటకు వీలుండును. కొన్నికొన్ని కులములకును, తెగలకును, ప్రత్యేకసదుపాయము లవసరమనియు ఏకులమున కాకులము సంఘములను స్థాపించుకొనవచ్చుననియు గొందఱు తలంచుచున్నారు.

---

1. *See B. G. Bhatnagar. The Co-operative Organization in British India p. 41.*

ఈపద్ధతిని అనుసరించినయెడల ఒకగ్రామమునందే మూడు నాలుగుసంఘములు పనిచేయవలసివచ్చును. శాసనమునందు సంఘము 1 కి ఉండవలసిన సభ్యులసంఖ్య నిర్ణయింపబడలేదు. పనిచేయవలసిన ప్రదేశము నిర్దేశింపబడలేదు. కొన్నిచోట్ల ఒకగ్రామమునందు ఒకటి రెండు సంఘములు పనిచేయుచున్నను, సామాన్యముగ గ్రామము 1 కి 1 సంఘమే పనిచేయుచున్నది. ఇట్లు అన్నికులములవారు కలిసి యొక సంఘముగ పనిచేయుటయే ప్రోత్సహింపదగును. కులములననుసరించి సంఘముల నేర్పరచుట దేశమున కరిష్టము. "ప్రాథమిక సహకార పరపతిసంఘముల సభ్యత్వము ఒకకులమునకు, ఒకమతమునకు, ఒక వృత్తికి, లేక గ్రామమునందలి కొందఱవ్యక్తులకు మాత్రమే ప్రత్యేకించుట తగదు." అని బ్యాంకింగు విచారణసంఘమువారికి సలహాదారులుగ నుండిన విదేశప్రముఖులు సూచించిరి. ఈసూచనను బ్యాంకింగు విచారణసంఘమువారుకూడ నంగీకరించిరి. "ఇట్లు వివిధ వృత్తులవారిని, వివిధకులములవారిని ఒకసంఘమునందు చేర్చుటవలన సోదరభావము, సహకారభావము పెంపొందును." అని బ్యాంకింగు విచారణసంఘమువారు వ్రాసిరి.[1]

3. బాధ్యత లేక పూచీ (Liability) బాధ్యతకు పరిమితిలేదు. గవర్నమెంటువారికి అపరిమిత బాధ్యతను దొలగించుట కధికారము కలదు. బాధ్యతనుగురించి మెక్లాగనుకమిటీవారిట్లు వ్రాసిరి. "అపరిమిత బాధ్యత యనగా, సంఘసభ్యులందరు తగిలిన లోటును సమానముగ భరించుట. వాటాసొమ్ము ఉన్నయెడల లోటును భర్తీ చేసెదరు. వాటాసొమ్ము చెల్లించినను లోటుపూడని యెడల సంఘసభ్యులందఱి యొద్దనుంచి సమానముగ వసూలుచేసి

1. *Indian Central Banking Enquiry Committee Report P. 117.*

లోటును పూడ్చెదరు. సంఘమునకు ఋణముపెట్టినదాత యిష్టము వచ్చిన సంఘసభ్యునిమీద చర్యదీసికొనుటకు వీలులేదు.[1]

ఇట్టి అపరిమితబాధ్యత నుంచుటవలన రెండు లాభము లున్న వని దీనిని సమర్థించువారు చెప్పుచున్నారు. సంఘసభ్యు లందఱకును సమానబాధ్యత పరస్పరశ్రద్ధ కలిగించుననియు నిట్టి బాధ్యతవలన సంఘమునందు పెట్టుబడిదారులకు విశ్వాసము జనించుననియు జెప్ప బడుచుండెను. అపరిమితబాధ్యత పలువిధములుగ నిర్వచింపబడుచుం డెను. అపరిమితబాధ్యత ఎప్పుడు ఆలోచింపవలసివచ్చును? కొనసాగిం చుట యెట్లు? ఈప్రశ్నలపై మదరాసు హైకోర్టువారును, పాట్నా హైకోర్టువారును భేదాభిప్రాయముల బ్రకటించిరి.[2]

ఈవిషయముపై కాల్వర్టుగారు విపులముగ చర్చించిరి. "సంఘ మునకు వచ్చిన నష్టము మొదట సంఘసభ్యునిపై బడును. తర్వాత అతనిహామీమీదపడును. తర్వాత మూలధనముమీదబడును. తర్వాత వాటాధనముపై బడును. తర్వాత సభ్యుల అపరిమితబాధ్యతపై బడును. కట్టకడపటకు పెట్టుబడిదారులపై బడును." అని కాల్వర్టుగారభిప్రాయ పడిరి.[3]

---

*1. Maclagan Committee Report Para 47.*

*2. Vide decisions of the Full Bench of the Patna High Court, 12 Patna Law Times p. 619, extracted at p. 478 of the Bihar and Orissa Co-operative Journal October 1931 and the decision of the Division Bench of the Madras High Court, a summary of which was published at p. 182 September 1931 issue of the Madras Journal of Co-operation and which was reffered to at p. 338-39 of the same Journal for December 1931. See the issue of the Madras Journal for January 1932 for the full Judgment of the Madras High Court.*

*3. See Mr. Calvert's Law and Principles of Co-operation P. 40.*

1925వ సంవత్సరమున బొంబాయిప్రభుత్వమువారు గావించిన ప్రత్యేక సహకారసంఘముల శాసనమునందీ విషయమును విపులముగ వ్రాసిరి. "ఎత్తివేయబడిన సంఘమునకుగల బాధ్యతకు ఆసంఘసభ్యులందరు వ్యష్టిగను సమిష్టిగనుగూడ బాధ్యత వహించెదరు."[1]

సమిష్టి బాధ్యతను గురించి బ్యాంకింగు విచారణసంఘమువారి అల్ప సంఖ్యాకుల నివేదికయందు మనూసుబేదారు గారిట్లు వ్రాసిరి.

"విద్యావ్యాప్తి యైనకొలదియు, సమిష్టిబాధ్యత సిద్ధాంతమును పలువురామోదించెదరని తలంపజాలను. వ్యవసాయేతర విషయముల యందు వ్యక్తిజీవితములలో దగ్గిరబంధువులకును ప్రాణస్నేహితులకును గూడ అత్యవసర సమయములయందైనను అప్పులకు హామీయుండుట కెవరును నుద్యుక్తులుకారు. కొన్ని పరిస్థితులయం దితరులకు హామీగ నుండినయెడల తనకుగల ఆస్తి అంతయును పోవుటకలదు. ఇతరులఋణ మునకై తన ఆస్తినిగూడ కోల్పోవుటకు సిద్ధముగ హామీయొసంగు మని కోరుట చాల విపరీతమైనపని."[2]

పరిపాలన. (Management) సంఘోద్యోగులు, గౌరవసేవకులు, సంఘ పరిపాలన, ప్రజాస్వామికము- సాధారణసంఘము, కార్యనిర్వాహకసంఘము అని రెండువిధముల పరిపాలకవర్గములు కలవు. సాధారణసంఘమున సంఘ సభ్యులందఱు సభ్యులుగనుందురు. కార్యనిర్వాహకవర్గము లేక పంచాయితీసంఘమును సాధారణసభ సాలుసరిసభయం దెన్నుకొనుచుండును. ఇందు 5 మంది లేక 9 మంది సభ్యులుందురు.

1. *The Bombay Act VII of 1925 Section 5 (2.)*
2. *See Banking Enquiry Committee Report Part 11, P. 89*

సాధారణసభవారి అధికారములు:—పంచాయితీసభ్యుల నెన్ను కొనుచుండును. కార్యనిర్వాహకవర్గమువారిచే తయారుచేయబడిన ఆదాయవ్యయ నివేదిక నామోదించుట. (ఆడిటరు) లెక్కలతనిఖీదారుడును, రిజిష్ట్రారును పంపిన ఆజ్ఞలను, విమర్శనలను పరిశీలించుట. తొలగించివేయవలసిన సభ్యులను తొలగించుట. సంఘమునకంతకును కలిసి ఎంతఋణము అవసరమైనదియు నిర్ణయించుట. సంఘసభ్యులకు వలయు ఋణమును నిర్ణయించుట.

కార్యనిర్వాహకవర్గము లేక పంచాయితీల అధికారములు:— సంఘముయొక్క కార్యనిర్వహణము నంతయు పంచాయితీలు గావించుచుండును. క్రొత్తసభ్యులను జేర్చుకొనుచుండును. సభ్యుల అప్పుల దరఖాస్తులను మంజూరుచేయును. రావలసిన బాకీలను వసూలుచేయును. సంఘసభ్యులపై పరీక్షాధికారమును వినియోగించుచుండును. సంఘమునకు పెట్టుబడిని సంపాదించును. కార్యదర్శి వేయు జమాఖర్చులెక్కలను పరీక్షించుచుండును. పంచాయితీలు అధ్యక్షుని, కార్యదర్శిని ఎన్నుకొనును. ఆస్తులకన్నింటికిని అధ్యక్షుడు బాధ్యుడు. కార్యదర్శి లెక్కలను వ్రాయును.

5. వ్యాపారపు పెట్టుబడి. (Working Capital).

వ్యాపారపు పెట్టుబడి రెండువిధములుగ సంపాదింపబడుచున్నది. (1) సభ్యులప్రవేశరుసుము; సభ్యులువేసికొను డిపాజిట్లు; ఖాటాలసొమ్ము; మూలధనము; కలిసి సంఘము స్వయముగ సంపాదించుకొను వ్యాపారపు పెట్టుబడిగ నున్నది. (2) ఇతరసంఘముల తాలూకు డిపాజిట్లు, ఇతరసంఘములనుండి తెచ్చుకొను అప్పులు గవర్నమెంటు లేక సెంట్రలుబ్యాంకులు, లేక రాష్ట్రీయబ్యాంకులనుండి తెచ్చుకొనుఅప్పు కలిసి పైనుండివచ్చు రెండవరకపు వ్యాపారపుపెట్టుబడి.

సభ్యులప్రవేశరుసుము మొట్టమొదటగనగు చిల్లరఖర్చుల కొఱకు అవసరము. సంఘసభ్యుడుగనుండుట స్వప్రయోజనము కొఱకు మాత్రమేకాదు. సంఘసభ్యునిగ కొన్నివిధులను నిర్వహించవలయు నను విధిసూచనను ప్రవేశరుసుము తెలియజేయగలదు.

వాటాలమూలమున పెట్టుబడిని సమకూర్చుట మదరాసు, పంజాబు, సంయుక్తరాష్ట్రములు, బర్మాలయందున గలదు. ఇతర రాష్ట్రములలో విశేషముగ నీపద్ధతిలేదు. బొంబాయిరాజధానియందు క్రొత్తగ తభాలవారీగా వాటాలసొమ్మును వసూలుచేయుపద్ధతి ప్రవేశ పెట్టబడెను. సహకారసంఘములు తాము స్వంతముగ వ్యాపారపు పెట్టుబడిని సంపాదించుటకు వాటాలసొమ్ము వసూలుచేయుట అత్యా వసరమని కొందఱి విశ్వాసము. వాటాలసొమ్మును వసూలుచేయు టకు మారుగ అప్పుపుచ్చుకొను వడ్డీరేటునకును, అప్పులనిచ్చు వడ్డీ రేటునకును విశేషమగు తేడాయుంచి అందువలన వచ్చులాభములతో మూలధనమును వ్యాపారపు పెట్టుబడికై హెచ్చుగ జేర్చుట సమంజస మని కొందఱివిశ్వాసము. తక్కువవడ్డీలకు అప్పునిచ్చుటవలన సంఘ సభ్యులే మారువర్తకముగ హెచ్చువడ్డీల కిచ్చుటకు వీలుగనున్నందున హెచ్చువడ్డీరేట్లకు సభ్యులకిచ్చుటకు వీలుండుననియు, షావుకారు వడ్డీకంటె తక్కువగ నిచ్చుటకే ప్రయత్నింపదగును కాని, అత్యల్ప రేటునకిచ్చుటకై ప్రయత్నింప నవసరములేదనియు, అందువలన వడ్డీ రేటులోగల తేడాతో మూలధనమును చేర్చుటకు వీలుండుననియు నీతెగవారి వాదము. వాటాలను పెట్టుటవలన బీదవాడు సంఘసభ్యు డుగ నుండుటకు సావకాశము తొలగింపబడుననియు, వాటాలమూల మున సహకారసిద్ధాంతములు తొలగిపోయి లాభములను సంపాదింప వలెనను ప్రయత్నమే మితిమీరుననియు, జాయింటుస్టాకు కంపెనీల

వలె సహకారసంఘములుకూడ తారుమారగుటకు వీలుండుననియు వీరిభావము. సంఘసభ్యులయొద్దనుండి డిపోజిట్లను తీసికొనుచు వ్యాపారపు పెట్టుబడిని వృద్ధిచేసికొనదగునని కొందఱి సూచన. ఇందువలన సంఘసభ్యులయందు మితవ్యయము కూడ ప్రోత్సహింపబడునని వీరి యాశ. ఈసిద్ధాంతమునకు ఆక్షేపణలేదు. కాని ఆచరణీయముకాదు.

సంఘసభ్యులు అప్పులను పుచ్చుకొను అవసరమునందే విశేషముగ నుందురు. అప్పులనుతీర్చి రాబడిలో నిలవజేసికొనుటకు తగిన ఆదాయము వచ్చుట దుర్లభము. అందుచేతనే డిపోజిట్ల మూలమున సమకూర్చబడుచుండిన వ్యాపారపు పెట్టుబడి హిందూదేశమునందత్యల్పముగ నున్నది. జర్మనీ దేశమునందు 100 కి 87 వంతుల వ్యాపారపు పెట్టుబడి డిపోజిట్లవలన లభించుచున్నది. హిందూదేశమునందు 100 కి 18 వంతుల వ్యాపారపు పెట్టుబడి మాత్రమే డిపోజిట్లవలన లభించుచున్నది. ఐరోపా ఖండమునందున గూడ ప్రారంభదశయందు డిపోజిట్లు అధికముగా రాలేదనియు, రానురాను పెరిగినవనియు, హిందూదేశమునందుగూడ నట్లే రానురాను వృద్ధియగుననియు నేడు ప్రారంభదశయగుటచే వచ్చుటలేదనియు కొందఱు చెప్పుచున్నారు.

హిందూదేశమునందు వ్యవసాయాభివృద్ధిలేక రైతులు అప్పుపుచ్చుకొను స్థితియందే యుండునంతకాలము డిపోజిట్లు వృద్ధియగునని తలంచుటభ్రమ. రైతులకాదాయము మిగలకపోవుటచే డిపోజిట్లు పెరుగుటలేదు. కాని ప్రారంభదశ యగుటవలనకాదు. పరపతిసంఘములలో డిపోజిట్లు వేసికొనుటవలన తక్కువవడ్డీ లభించును. ఇతరులకు వడ్డీకి నొసంగుచో హెచ్చువడ్డీ లభించుచున్నది. సహకారసంఘములు లేక బ్యాంకులు ఇచ్చు వడ్డీరేటునకంటె హెచ్చువడ్డీరేటును ఇతరచోట్ల

పుచ్చుకొనుటకు సావకాశము లభించుచున్నంతకాలము హెచ్చువడ్డీ న్యాయసమ్మతముగ నున్నంతకాలము సహకార సభ్యులుకూడ తమ సొమ్మును డిపోజిట్లుగ వేసికొనరు. మఱియు కొలదిగ ఆదాయము మిగిలినను రైతులు భూములను కొనుటకును లేక వెండి బంగారములను కొనుటకును అలవాటుపడియుండిరి. అన్ని కారణములకంటె రైతుల దరిద్రస్థితియే డిపోజిట్లు పెరుగకపోవుటకు ముఖ్యకారణము. వాటాల నేర్పరచి ఆవాటాసొమ్మును దఫాలవారీగా చెల్లించుపద్ధతి పెట్టిన యెడల కొలదికొలదిగనైన రైతులు మితవ్యయమున కలవాటు పడెద రని కొందఱి యూహ.

ఈపద్ధతివలన వాటాసొమ్మునుగూడ సంఘమునుండి తీసికొను ఋణమునుండియే యొసంగవలసివచ్చును. మితవ్యయమున లేక అధిక ఆదాయమున చెల్లించుననుకొనుట భ్రమ. సంఘములు పైనుండి తెచ్చుకొను ఋణముమీదనే ఆధారపడుచున్నవి. గవర్నమెంటువారు విశేషముగ ఋణమునొసంగుట మానివేసిరి. సెంట్రలు బ్యాంకుల ఋణముపైననే వ్యవసాయ పరపతిసంఘములు జీవించుచున్నవి. వాటాసొమ్ము, డిపోజిట్లు సంఘములవ్యాపారపు పెట్టుబడియందత్యల్పముగ నున్నవి.

ఈ దిగువనుదహరించిన పట్టికవలన 1930-31 వ సంవత్సరమునందు సహకారసంఘములకును, సెంట్రలుబ్యాంకులకును గల డిపోజిట్ల మొత్తమును దెలిసికొనగలము. రాష్ట్రీయబ్యాంకులకును సెంట్రలు బ్యాంకులకును డిపోజిట్లమొత్తము హెచ్చుగగలదు. ప్రాథమిక సంఘములకు అత్యల్పముగ నున్నదని యీపట్టికవలన గ్రహింపగలము.

## ఈ పట్టిక సహకారసంఘములయందలి డిపోజిట్ల మొత్తమును దెలుపును 1930-31.

| రాష్ట్రములు-సంస్థానములు. | రాష్ట్రీయ బ్యాంకులు † | | సెంట్రలు బ్యాంకులు † | | ప్రాథమిక సంఘములు ‡ | | వ్యవసాయేతర ప్రాథమిక సంఘములు ‡ | |
|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తము రు. | వ్యాపారపు పెట్టుబడి యందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపారపు పెట్టుబడి యందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపారపు పెట్టుబడి యందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపారపు పెట్టుబడి యందు 100 కి ఎంత; |
| మదరాసు | 16140992 | 90.6 | 58016522 | 86.1 | 3651619 | 5.0 | 15710970 | 47.4 |
| బొంబాయి | 11825099 | 76.2 | 25147031 | 82.4 | 11958182 | 26.6 | 29606402 | 61.3 |
| బెంగాలు ♦ | 17762674 | 112.4 | 40483732 | 120.7 | 4085286 | 7.1 | 20519294 | 65.3 |
| బీహారు, ఒరిస్సాలు | 6748276 | 86.9 | 15301387 | 65.8 | 880590 | 3.6 | 1523816 | 40.5 |
| సంయుక్తరాష్ట్రములు | | | 5665767 | 61.6 | 272926 | 2.6 | 1041943 | 40.9 |
| పంజాబు | 8068184 | 75.0 | 5667085 | 79.9 | 7532948 | 8.8 | 5176143 | 37.4 |
| బర్మా ♦ | దొరకలేదు | | 3280720 | 64.0 | 1031788 | 6.3 | 1032541 | 15.9 |
| మధ్యరాష్ట్రములు,బీరారు | 9218616 | 91.3 | 19508624 | 79.4 | 763750 | 4.4 | 486876 | 34.1 |
| అస్సాము | 264564 | 68.5 | 1752626 | 85.1 | 496958 | 16.1 | 1623328 | 71.6 |
| పశ్చిమోత్తరపరగణాలు | | | 469642 | 94.7 | 7426 | 1.3 | 133085 | 51.1 |
| కూర్గు | | | 250302 | 86.8 | 56584 | 8.8 | 40107 | 21.7 |
| అజ్మీరు,మార్వారా | | | 1592742 | 60.3 | 45581 | 2.6 | 437467 | 47.4 |
| హైదరాబాదునందలి బ్రిటిషుభాగము- | | | | | | | 307408 | 59.3 |

| రాష్ట్రములు-సంస్థానములు | రాష్ట్రీయ బ్యాంకులు † | | సెంట్రలు బ్యాంకులు † | | ప్రాథమిక సంఘములు ‡ | | వ్యవసాయేతర ప్రాథమిక సంఘములు ‡ | |
|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తము రు. | వ్యాపార పుపెట్టుబడి యందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పుపెట్టుబడి యందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పుపెట్టుబడి యందు 100 కి ఎంత? | మొత్తము రు. | వ్యాపార పుపెట్టుబడి యందు 100 కి ఎంత? |
| ఢిల్లీ | | | 1207293 | 89.2 | 31028 | 3.5 | 165695 | 59.1 |
| మైసూరు | 4209666 | 80 | 116022 | 60.7 | 507950 | 9.9 | 3970947 | 47.1 |
| బరోడా | | | 1572426 | 73.4 | 1137769 | 31.2 | 1057937 | 61.8 |
| హైదరాబాదు ♦ | 3238098 | 81.6 | 3785416 | 75.1 | 567460 | 7.4 | 288285 | 11.9 |
| భూపాలు | | | 165944 | 16.7 | 1609 | 0.1 | 22 | 0.1 |
| గ్వాలియరు ♦ | | | 1640701 | 26.5 | 137970 | 6.8 | 3968 | 6.7 |
| ఇందూరు ♦ | | | 1539623 | 71.6 | 65076 | 2.9 | 366311 | 58.1 |
| కాశ్మీరము ♦ | | | 2358124 | 68.3 | 16720 | 0.3 | 10628 | 1.9 |
| తిరువాన్కూరు | | | 962032 | 71.7 | 1094311 | 19.6 | 832000 | 36.9 |
| కొచ్చిను | | | 546226 | 85.2 | 981568 | 46.2 | 428345 | 20.2 |
| పుదుక్కోట ♦ | | | 455610 | 86.2 | 410440 | 73.2 | 619801 | 85.1 |

† సంఘములు, రాష్ట్రీయ బ్యాంకులు, సెంట్రలు బ్యాంకులు, వ్యక్తులు, యితర విధముల నుండియు గల సంవత్సరాంతపు డిపాజిట్ల మొత్తము.

‡ సభ్యుల, సభ్యేతరుల, సంఘముల తాలూకు అప్పులు, డిపాజిట్లు కలిసి సంవత్సరాంతమునకు గల డిపాజిట్లు.

♦ ఈ గుఱుతున కెదురుగ నున్న అంకెలు 1929-30 వ సంవత్సరము తాలూకు.

(*From Cooperation in India*)

అప్పులు సంఘసభ్యులకుమాత్రమే యొసంగబడును.

**6. అప్పులు (Object of Loans.)** వివిధరాష్ట్రములయం దొసంగబడుచుండిన అప్పులను ఆరువిధములుగ విభజింపవచ్చును. (1) వ్యవసాయపుఖర్చులకు, భూమిసిస్తు చెల్లించుటకు, భూకామందున కొసంగవలసిన దానికి (2) భూమి మరమ్మతునకు (3) పాతబాకీలను తీర్చుటకు (4) గృహకృత్యములకు (5) వర్తకమునకు (6) భూమినికొనుటకు ఈ ఆరింటిని మూడు భాగములుగ విభజింపదగును. (1) సార్థకకృషికి. (2) నిరర్థకకృషికి. (3) ఋణముల తీర్మానమునకు. వ్యవసాయపు ఖర్చునకును, గవర్నమెంటునకు పన్నులను చెల్లించుటకును నిచ్చు దగ్గిరవాయిదా అప్పులును, భూమిని మరమ్మతుచేయుటకై యొసంగు దూరపువాయిదా అప్పులును సార్థకకృషికై యొసంగబడు ఋణములని చెప్పనగును. గృహకృత్యములకు అనగ వివాహాదికార్యముల కొసంగు ఋణమును నిరర్థకఋణమనదగును. కాని రైతు షాహుకారుల కాతాపుస్తకమునందు చేరబడుట నివారింపవలెననిన నిరర్థకకృషికైకూడ ఋణముల నొసంగకతీరదు. పాతబాకీలను తీర్చివేసి సంఘములకు మాత్రమే బాకీయుండు పద్ధతి నవలంబించుట యుక్తము. కాని మొత్తము వ్యవసాయపరపతిసంఘములకన్నింటికి కలిసి భారతదేశమునందంతటను సుమారు 30 కోట్లు మాత్రమే వ్యాపారపు పెట్టుబడి కలదు. ఎనిమిదివందల కోట్లకు పైగగల రైతుల ఋణము నీ 30 కోట్లు తీర్చివేయజాలవు. రైతుల ఋణపు మొత్తముతో నీమొత్తమును పోల్చిన రైతుల ఋణసమస్య నీపరపతిసంఘములు పరిష్కరించునని తలంచుట పరిహాసాస్పదమని స్పష్టపడును. ఈపెట్టుబడితో సహకారపరపతిసంఘములు పనిచేయుటకు సుమారు 25 సంవత్సరములు పట్టెను. 800 కోట్ల ఋణసమస్యను పరిష్కరించి షాహుకారుల బారినుండి రైతు సంరక్షింపబడుట

కెన్నియో వందల సంవత్సరములు పట్టును. ఈ అప్పులనిచ్చు కాలపరి మాణము మూడుభాగములుగ పేర్కొనబడుచున్నది. (1) దగ్గిర వాయిదాఅప్పులు. (2) దూరపువాయిదాఅప్పులు. (3) దగ్గిరవాయిదా దూరపువాయిదాలు రెండునుగాక మధ్యగనుండువాయిదా. వ్యవసాయ పరపతి సంఘములు సంఘసభ్యులకు మూడుసంవత్సరములకు పైగడు వుతో ఋణముల నీయరాదని బ్యాంకింగు విచారణ సంఘమువారు సూచించిరి. ఇంతకంటె దూరపువాయిదా అప్పులను భూమితణాఖా బ్యాంకు లొసంగదగుననిరి.

ఋణతీర్మానము. (Repayment of Debts.) ఋణతీర్మానము వాయిదాలప్రకారము ఏసాలునకా సాలున చేయుచుండుటయే సహకార సిద్ధాంతము. వ్యవసాయమునకై చేయబడిన ఋణము పంటలలో తిరిగి యిచ్చివేయనియెడల ఋణము పెరుగుచునే యుండును. ఏసభ్యుడెంతఋణమున కర్హుడయినదియు నిర్ణయించుట యందీ విషయము బాగుగ గమనింపవలసియున్నది. కాని ఈవిష యముపై శ్రద్ధవహించిన రైతులు తమ ఆదాయముతో ఋణతీర్మా నము చేయగలుగునని తలంచుట భ్రమ. పరపతిసంఘములు ఆదాయ మును గమనించి ఆతని ఖర్చులను గమనించి మిగులుసొమ్మును బట్టి అప్పుల నొసంగదలంచినయెడల ఒక్కరైతును అప్పును పుచ్చుకొను టకు అర్హతగలిగియుండడు. ఎక్కువమంది రైతులు చిన్న పట్టాదారు లుగ నుండుటవలన ఎప్పటికైనను మూలధనమునగు భూమిని అమ్మియే ఆతడు ఋణవిముక్తుడు కావలసియున్నది. ఆదాయము ననుసరించి ఋణమును తీర్చనోపడు. ఋణమునుతీర్చు కాలపరిమాణమును ప్రత్యేక పరిస్థితులయందు మాత్రమే హెచ్చింపదగునని మెక్లాగను కమిటీవారు వ్రాసిరి.[1]

1. *See Maclagan Committee Report para 63 and V. L. Mehata Studies in Co-operative Finance p. p. 84-6.*

హిందూదేశమందలి రైతులస్థితి సర్వకాల సర్వావస్థలయందు నను నొక్కరీతిగనే యుండును. రైతుల ఋణస్థితి సంపూర్ణముగ మార్పుజెంది వ్యవసాయ మభివృద్ధియైనగాని, సహకారోద్యమ సిద్ధాంతములను సక్రమముగ నడుపుటకు గూడ సావకాశము లేదు.

7. హామీ. (Security.) సహకారసంఘములయందు ఋణముసుదీసికొను సభ్యుల యొద్దనుండి "ఋజువర్తన"మను హామీమాత్రమే పుచ్చుకొనుట ఆదర్శము. సంఘసభ్యులయందు ఋజువర్తనమును పెంపొందించుటయే సహకారసంఘముల ముఖ్యకర్తవ్యము. ఆస్తిని హామీగాతీసికొనుట సహకార సిద్ధాంతములకు విరుద్ధము. అప్పును తీసికొనువాడు తనస్థిరచరాస్తులను, తోటిసభ్యులను హామీగానిచ్చిన మంచివ్యాపారము జరుగును. సంఘద్రవ్యము తిరిగి వసూలగుటకును సావకాశములు హెచ్చుగనుండును. అయిన నీపద్ధతి మంచివర్తకమగునుగాని, సహకారసిద్ధాంతముల నాచరించుట కాజాలదు. సహకారసంఘములు సభ్యుల ఆస్తులను హామీగాతీసికొనని యెడల షాహుకారులకు మరొక అదనువచ్చినపుడు సభ్యులు తనఖా పెట్టివేయవచ్చును. సంఘములు హామీ పుచ్చుకొనకపోయిన మాత్రమున ఆస్తి పరాధీనముగాదని తలంచుటకు వీలులేదు. "లా" ననుసరించి తణఖాలను పట్టుటకు సంఘముల కధికారము కలదు. రాష్ట్రప్రభుత్వములకీ నియమము ననులుజరుపుటయందు స్వాతంత్ర్యము కలదు. సంఘముల కపరిమితబాధ్యతను చొలగించి, వ్యక్తులయొద్దనుంచి స్థిరాస్తి హామీపుచ్చుకొనవలెనను నియమమేర్పఱచుకొనుట మంచిది. దగ్గిరవాయిదా అప్పులనైనను వేరు పేచీపూచీలులేని స్థిరాస్తిని హామీ తీసికొనిరయే యొసంగదగును.

8. లాభములను పంచుకొనుట. (Division of profits.)

వ్యవసాయ పరపతిసంఘములలో జాయింటుస్టాకు కంపెనీలలోవలె పంచుకొనుటకు విశేష లాభము లుండవు. వాటాల మూలముగ పెట్టుబడిలేని సంఘములకు లాభములను పంచుకొనుటయే యుండదు. లాభమంతయు మూలధనముగ ప్రత్యేకింపబడును. 1912 వ సంవత్సర శాసనము ననుసరించి కొంతసొమ్మును విద్యాభివృద్ధికి, దానమునకును వినియోగింపవచ్చును. దీనినే ప్రజోపయోగనిధి యని అందురు. (Common Good Fund). వాటాలమూలముగ పెట్టుబడి వసూలు చేయబడిన సంఘములయందైనను నిర్ణీతమగు లాభములనే పంచెదరు. లాభములను పంచుకొనుటయే ముఖ్యోద్దేశముగ వ్యవసాయ పరపతి సంఘములయందు తలంపబడినయెడల సహకారోద్యమము క్రొత్త రకపు వర్తకముగ పరిణమించును. లాభముల పంపకమును బ్రోత్సహించుటకు మారుగ ప్రజోపయోగనిధిని వృద్ధిపరచుటకై ప్రోత్సహింపదగును. సమిష్టిదానము వలన నెన్నియో ప్రజోపయోగ కార్యముల నొనరించుటకు సులువుగ నుండును. ఈనిధిని వినియోగించుటయందు వివేకము వహింపదగును. జాతి మత కుల తత్వముల ప్రత్యేకప్రేరణ ననుసరించికూడ నీనిధి వినియోగింపబడుచున్నది. ఇది దుర్వినియోగము. జాతీయభావమున సంఘలాభమునకై వినియోగింపదగును. ముఖ్యముగ సహకారోద్యమ భావ ప్రచారమునకును, గ్రామ పునర్నిర్మాణమునకును వినియోగింపవలెను. పుస్తకముల నచ్చువేయించుట, మ్యాజికులాంతరు ప్రచారము, ఉపన్యాసములు, ప్రదర్శనములు మొదలగువాటి మూలముగ సహకారోద్యమ ప్రచారము సలుపవలెను.

9. పంచాయితీ. (Arbitration.)

పరపతిసంఘములకును, సంఘసభ్యులకును మధ్యగ వచ్చుచుండు తగవులను పంచాయితీల మూలముగ పరిష్కరించుకొనవలెను. సివిలుకోర్టులకు పరపతిసంఘముల తగవులను దీర్చుటకై అధికారము తొలగించి వేయవలెను. లేనియెడల కాలవ్యాపనము, ధననష్టము సంభవించును. అనవసరమగు కక్షలు ప్రబలిపోవును. గ్రామములయందు సహకార సంఘములు సహకారమునకు తోడ్పడుటకు మారుగ విరోధములను, కక్షలను పెంచును. బొంబాయియందు, మఱికొన్ని యితరరాష్ట్రములయందు పంచాయితీల మూలముగ తగవులను పరిష్కరించుకొనుటకు సావకాశములు కలవు.

10. అప్పులను వసూలు చేయుటకుగల అమితఅధికారము. (Summary Powers)

బకాయీపడిన సొమ్మును వసూలుచేయుటకై సంఘముల కమితమగు నధికార మొసంగబడెను. ఈ అపరిమితాధికారము వలన మొదటినుండియు వహింపవలసిన శ్రద్ధ సంఘములు వహింపకపోవుట సహజము. సంఘసభ్యులందఱిపైనను గల ఉమ్మడిబాధ్యతయు, సివిలుకోర్టుల మూలముగ వసూలుచేయుటకు గల అధికారమును చాలును.

11. సంఘముల నెత్తివేయుట. (Dissolution.)

“సంఘముల నెత్తివేయవలసివచ్చుటకు వివిధకారణములు చెప్పబడుచున్నవి. జాగరూకతగలిగి పరిశీలింపకపోవుట, విచక్షణలేక అప్పులనిచ్చుట, ఋణమును దీసికొనినవారి అవిధేయత, వాయిదాలవెంబడిని తిరిగి సకాలమున ఋణముల నిచ్చివేయకపోవుట, కొంతమంది వ్యక్తులకు మాత్రమే అప్పులనిచ్చుచుండుట, సంఘఉద్యోగులు అసమర్థులుగ నుండుట లేక వారియందు ఋజువర్తనము లేకపోవుట, విచక్షణలేక సభ్యులను జేర్చుకొనుచుండుట, సంఘము పనిచేయుటకు వీలులేని

యంతగ పెద్దదిగనుండుట, సంఘసభ్యులు పాతఋణములను జెప్పక రహస్యముగ నుంచుట, పరిపాలనాప్రణాళిక దోషముగ నుండుట, సంఘ సభ్యులయందు అంతఃకలహములుపుట్టుట, తగినంతమంది సభ్యులు లేక పోవుట, లేక, వలయునంతపెట్టుబడి లేకపోవుట, ఏఒక్కసంఘసభ్యుడో అధికారమునంతను చెలాయించుచుండుట, సంఘవ్యవహారములయందు సభ్యులందఱును దగుశ్రద్ధను వహింపకపోవుట సంఘముల నెత్తివేయ వలసివచ్చుచుండుటకు గల ముఖ్యకారణములు." అని మెక్లాగను కమిటీవారు వ్రాసిరి.[1]

ఈ కారణము లన్నియు సత్యములు. ఇందులకు దోడుగ సహకారోద్యమముపై సర్వాధికారము వహించుచున్న ప్రభుత్వో ద్యోగుల నిరంకుశవర్తనముకూడ సంఘముల నెత్తివేయుటకొక ముఖ్య కారణము. ఏడుగురు కొడండ్ల కథవలె ఉద్యోగేతరులు సంఘముల నొకవంక పెట్టుచుండుటయు, ఉద్యోగులు మరొకవంకనుంచి సంఘ ములనెత్తివేయుటయుగూడ జరుగుచున్నది. ఎత్తివేయు నధికారమును తప్పనిసరిగ నెప్పుడైనను వినియోగించుచుండవలెను. చట్టమునను సరించి విచారణ సలిపినపిమ్మట సంఘము నెత్తివేయుటకు రిజిష్ట్రారునకు అధికార మొసంగబడెను. సంఘములు బాగుగ పనిచేయుట కన్నింటి కంటె ముఖ్యముగ సహకారసభ్యులయందు ఋజువర్తనము పెంపొంద వలయును. సహకారసంఘములుకూడ వ్యక్తికక్షులకు, కులకక్షులకు, స్వార్థపరులకు, మోసమునకు నిలయములగుచున్నవి. కార్యనిర్వాహక వర్గమునకు, సంఘోద్యోగులకు సమర్థులగువారెన్నుకొనబడుటలేదు. వివిధములగు కక్షులననుసరించి కులంతరముల ననుసరించి యెన్నికలు జరుగుచున్నవి. ఈకక్షులబారినుండి సహకారోద్యమము సంరక్షింప

1. *Maclagan Committee Report, Para 86*

బడినగాని చిరకాల మీయుద్యమము జీవింపజాలదు. జీవించినను సౌకుమార్యలావణ్యములతో దులదూగదు. జీవచ్ఛవమువలె కాల మునుగడుపుచుండును. స్వార్థరహితులగు దేశసేవకు లీయుద్యమమునందు బాల్గొనుటకు నేడే తరుణము. స్వార్థరహితమును,నాదర్శప్రాయమును నగు జీవితమును గడుపుచుండిన దేశసేవకులు పలువురు కలరు. వారి దృష్టి సహకారోద్యమమువంకకు మరలలేదు. స్వార్థత్యాగులగు దేశ భక్తులు తమదృష్టిని సహకారోద్యమమువంకకు మరల్చి సహకారో ద్యమమునకు ప్రాణప్రతిష్ఠ జేయవలయును. జీవితయాత్రయంతయు ముగియనున్న ముదుసలుల చేతినుండియు, జీవితయాత్రకై వేఱువృత్తి యందు మునిగితేలుచుండినవారి చేతినుండియు, అధికారప్రియులై వేడుకకొఱకు పనిచేయుచుండినవారి చేతినుండియు సహకారోద్యమ మును దొలగింపవలయును.

# 19. వ్యవసాయేతర పరపతిసంఘములు.

పట్టణములయందు సహకారపరపతిసంఘములను స్థాపించుట అత్యవసరము. పట్టణములయందే వివిధములగు బ్యాంకులు కలవు. కాని, యీబ్యాంకులు భాగ్యవంతులకే ఎక్కువ యుపయోగకరము. చిన్నవర్తకునికి, కూలివానికి, గుమాస్తాలకు, చేతిపనివాండ్రకు పెట్టు బడి లభించుటకొఱకు పట్టణములయందు పరపతిసంఘములు సహాయ మొనరింపగలవు. పరిశ్రమలకు బ్యాంకులు నెలకొల్పబడని మన దేశ మున గృహపరిశ్రమల నభివృద్ధిపఱచుటకు పట్టణ సహకార పరపతి సంఘము లుపయోగించును. పల్లెలయందలి వ్యవసాయదారుల ఫల సాయమును సక్రమమగు ధరలకు అమ్మించి వ్యవసాయదారులకు పట్టణ సహకార సంఘములు తోడ్పడగలవు. ఈ కృత్యముల నన్నిం

టిని పట్టణసంఘములు నెరవేర్చుటలేదు. డిపోజిట్లను పుచ్చుకొనుట, అప్పులనిచ్చుట యీ రెండుపనులను మాత్రమే చేయుచున్నవి. బొంబాయి, బెంగాలు రాష్ట్రములయందు కొన్ని సంఘములు బాగుగ పనిచేయుచున్నవి.

మదరాసు రాజధానియందు "వ్యవసాయేతర ప్రజలబ్యాంకులు. పరపతిసంఘములు 1144 గలవు. ఇందు 209682 (People'sBanks)మంది సభ్యులుగలరు. వాటాలపెట్టుబడి రు 38 లక్షలున్నది. 16 లక్షల మూలధనము గలదు. రు 2½ లక్షల వ్యాపారపు పెట్టుబడి గలదు. ఈసంఘములలో చాలసంఘములు ప్రజలబ్యాంకులనుటకు వీలులేదు. సంఘము 1కి రు 20000 ల పెట్టుబడి గలిగినవి 107 సంఘములున్నవి."[1]

పంజాబు దేశమునందు 944 వ్యవసాయేతరమగు సమిష్టి బాధ్యతగల సంఘములుకలవు. 69 సంఘములుమాత్రమే సమిష్టిబాధ్యత లేని సంఘములు. ఇందులో 329 ప్రత్యేక కులవృత్తులకు సంబంధించిన సంఘములును, 105 క్రైస్తవ సంఘములును గలవు. ఈసంఘములలో 45170 మంది సభ్యులుగలరు. వీటి వ్యాపారపు పెట్టుబడి రు 81 లక్షలు. అయినను ప్రజలబ్యాంకులు అభివృద్ధియందు లేవు. ఈరాష్ట్రమున దుకాణదారులు సభ్యులుగనున్న కొన్ని సంఘములు కలవు. ఈదుకాణదారులు అప్పులమీద జీవించుచున్నారు. వీరికిగల పరపతిలో చాల వఱకు పెట్టుబడికింద వినియోగించుకొనిరి. తిరిగి తీర్మానించుటలేదు. అస్సామునందు 63 వ్యవసాయేతరసంఘములు రు 20 లక్షల పెట్టుబడితో పనిచేయుచున్నవి. బీహారు, ఒరిస్సాలయందు 79 సంఘములు 25½ లక్షల వ్యాపారపు పెట్టుబడితో పనిచేయుచున్నవి. వంగదేశము

---

1. *From Cooperation in India.*

నందు 340 సమిష్టిబాధ్యతలేని సంఘములుకలవు. వీటియందు 119918 సంఘసభ్యులు గలరు. రు 46 లక్షల వాటాధనము కలదు. రు 11 లక్షల మూలధనము కలదు. 130 కోట్ల డిపోజిట్లు కలవు. ఈసంఘములు ప్రజావిశ్వాసమును చూరగొనినవి. స్థానికముగ డిపోజిట్లను విరివిగ సంపాదించుచున్నవి. ఈసంఘములలో ఎక్కువ సంఘములు నెల జీతములమీాద జీవించు గుమాస్తాల పరపతి సంఘములు. ఇదియే గమనింపదగిన విషయము. కలకత్తాయందలి ముఖ్యమగు ప్రభుత్వ కార్యాలయములకును, వర్తకశాలలకును గుమాస్తాల పరపతిసంఘములు కలవు. వీధులను తుడుచువారి సంఘములుకూడ గలవు. ఈసంఘములు సభ్యులలో మద్యపాననిషేధ ప్రచారమును జయప్రదముగ కొనసాగింపగలిగెను. అందువలన సంఘసభ్యులు ఆర్థికముగ నభివృద్ధి జెందిరి.

మధ్యరాష్ట్రములయందు ప్రజలబ్యాంకులను వృద్ధిచేయుటకు అవకాశము హెచ్చుగగలదు. ఇచ్చట వడుకుట, నేయుట, రంగులు వేయుట, గాజులుచేయుట, నూనెతీయుట మొదలగు పరిశ్రమలన్నియు గూడ నశించినవి. ఈరాష్ట్రమున 26 వ్యవసాయేతర పరపతిసంఘములుమాత్రమే కలవు. రు 10 లక్షల వ్యాపారపుపెట్టుబడి యున్నది. ఈసంఘములు ఆధునికపద్ధతులపై బ్యాంకులవ్యాపార మొనరించుటలేదు.

బొంబాయిరాష్ట్రము రు 50000 ల వ్యాపారపు పెట్టుబడితో పనిచేయుసంఘములు అర్బను బ్యాంకులక్రింద పరిగణింపబడుచున్నవి. ఈబ్యాంకులు నాలుగుమాసముల కొకసారి అప్పుఆస్తుల లెక్కలను ప్రభుత్వమువారికి పంపవలెను. 1925 వ సంవత్సరమునుంచియు బొంబాయిరాష్ట్రమునందు తాలూకా 1 కి ఒక ప్రజలబ్యాంకును నెలకొల్పుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. (1930 మార్చి).

బొంబాయి రాజధానియందు 76 అర్బనుబ్యాంకులు దిగ్విజయముగ పనిచేయుచున్నవి. వీటియందు 174820 మందిసభ్యులు కలరు. వ్యాపారపుపెట్టుబడి రు 282 లక్షలు. మూలధనము 194 లక్షలు. అర్బను సహకారసంఘములు బొంబాయిరాష్ట్రమునందు పనిచేసిన రీతిని యితరరాష్ట్రములయందు పనిచేయుటలేదు. వ్యవసాయేతర పరపతి సంఘములను విరివిగ నెలకొల్పి సక్రమముగ పనిచేసినయెడల పట్టణముల యందు చిన్నవర్తకులు సంరక్షింపబడుదురు. గృహపరిశ్రమ లభివృద్ధి పరుపవచ్చును. కూలివాండ్రకు తోడ్పడుచు, వారియందు నైతిక జీవనమును పెంపొందింపవచ్చును. మధ్యతరగతి పారిశ్రామికులకు అపారముగ నీబ్యాంకు లుపయోగపడును. ఈబ్యాంకులు స్థానికముగ నుండు వర్తకమునకు, పరిశ్రమలకు అప్పుల నిచ్చినయెడల వారివిశ్వాసమును జూరగొనును. అందువలన స్థానికాభిమానము హెచ్చును. బ్యాంకు లభివృద్ధియగును. ఈబ్యాంకులు విశేషముగ డిపోజిట్లను కూడ నాడే రాబట్టగలవు. 1901 వ సంవత్సరమున సహకారోద్యమమును గుఱించి విచారణజేసిన సంఘమువారు వ్యవసాయేతర పరపతి సంఘములను గుఱించి యిట్లు వ్రాసెను.

"వ్యవసాయ పరపతిసంఘములను స్థాపించుటతో ప్రభుత్వము ప్రయత్నములు సఫలములైనవని తలంపరాదని మాయభిప్రాయము. ఇటలీయందు సహకార వ్యవసాయేతర పరపతి సంఘములు మొట్టమొదట పట్టణములయందు స్థాపింపబడెను. ఈసంఘములు విజయము పొందినవి. ఈయుదాహరణ ననుసరించి పట్టణములయందు సహకార పద్ధతిని పరపతిసంఘములను స్థాపింపదగునని తలంచుచున్నాము. ఈసంఘములు రెండువిధములుగ నుపయోగించును. గుమాస్తాలు, చేతి పనివాండ్రు మొదలగువారు తమ నిల్వసొమ్మును దాచుకొనుటకై

సేవింగ్సుబ్యాంకులకంటె లాభకరమగు సంస్థయొకటి కావలసి యున్నది. ఇందులకు తగునేర్పాటు లొనరించినయెడల వారియందు మితవ్యయమును ప్రోత్సహింపగలము. ఇటలీయందు పట్టణబ్యాంకులు గ్రామ పరపతిసంఘములకుగూడ ఋణము నొసంగును. ఇట్లే హిందూ దేశమునందుగూడ పట్టణసంఘములు గ్రామసంఘములకు ఋణముల నేల యొసంగరాదో తెలియుట లేదు." మెక్లాగను కమిటీవారు వ్యవ సాయేతర పరపతిసంఘముల అవసరమును గుఱించి యిట్లు వ్రాసిరి.

"వ్యవసాయదారులు చెల్లించుచుండిన వడ్డీకంటె తక్కువవడ్డీకి పట్టణములయందుండిన పారిశ్రామికులకు పెట్టుబడి లభించుటలేదు. ధరలు హెచ్చుచుండుటయు, చిన్నచిన్న అనారోగ్యకరమగు ఇండ్లును, జీతములు తరుచుగ సకాలములయందొసంగకపోవుటయు అధికమగు అంతస్తుతో జీవింపవలెనను సంకల్పమును పరిశ్రమలయందు క్లిష్టపరి స్థితుల ప్రవేశపెట్టును. ఈకష్టములను రవంతయైన దొలగింపగలిగిన ఏవిధ మగు సహకారసంస్థనైనను ప్రోద్బలపరచుట తగుపని. ఇతరవిధమగు ప్రజలమాట మరచిపోయి వ్యవసాయ పరపతిసంఘములనే విరివిగ స్థాపించుటవలన సెంట్రలుబ్యాంకులు తమడబ్బును సంవత్సరముపొడుగు నను పెట్టుబడిమీాద వినియోగింపజాలకపోవుచున్నవి. సంవత్సరము నందు కొన్ని నెలలు మాత్రమే వినియోగింపగలుగుచున్నవి...... ఈకారణముల వలన వ్యవసాయేతర పరపతి సంఘములను నెలకొల్పుట అత్యవసరమని మాసూచన."[1]

వ్యవసాయేతర పరపతిసంఘముల యవసరమును గుఱించి పరి శ్రమల విచారణసంఘమువారిట్లు వ్రాసిరి.

1. *Maclagan Committee Report.*
2. *Industrial Commission of 1916—18.*

"భారతదేశమున పరిశ్రమ లభివృద్ధి జెందకపోవుటకు తగు పెట్టుబడి లభింపకపోవుటయే కారణమని నిరూపించితిమి. మేము సూచించినవిధమగు పరిశ్రమలబ్యాంకులు స్థాపింపబడినయెడల పారిశ్రామికులకు దోడ్పడగలవు. టాటాకంపెనీవారు ప్రభుత్వమువారి సహాయము నపేక్షింపకయే పరిశ్రమలబ్యాంకును స్థాపించిరి. చిన్న చిన్న పరిశ్రమలకు సహాయమొనరించుటకు తగు బ్యాంకులను స్థాపించుటకు అమిత సావకాశము కలదు.......... మధ్యతరగతి పారిశ్రామికులు నగరములయందును, పట్టణములయందును పెట్టుబడి లభింపక చిక్కులు పడుచుండిరని పలువురు సాక్ష్యులు చెప్పిరి. ఈపారిశ్రామికులు కోరబడిన హామీదారుల నొసంగజాలరు. శ్రమలేక విడుదలయగు సరకునుగూడ హామీ యొసంగజాలరు. ఈవిధముగ భారతీయులు ప్రత్యేక అసౌకర్యముల పాలగుచున్నారు. ఆంగ్లేయులే డైరక్టరులుగ నుండుటవలనను పెద్ద యుద్యోగులందరు ఆంగ్లేయులుగ నుండుటవలనను పారిశ్రామికులు బ్యాంకులను తృప్తిపఱచుట కష్టతమముగ నున్నది............. పరిశ్రమలకు పెట్టుబడిని పెట్టుటకై కొన్ని బ్యాంకులు కలవు. ఈబ్యాంకులు యంత్రముల హామీమీదగాని, యంత్రాలయముల హామీమీదగాని పెట్టుబడి నిచ్చుటలేదు. మధ్యతరగతి పారిశ్రామికులకు సహాయమొనరించుట అత్యవసరము."

" ధైర్యముగలిగి కొనసాగింపబడిన వ్యవసాయేతర సహకార పరపతి సంఘములు-అయిరోపాఖండమునందు-ముఖ్యముగ జర్మనీ, ఆస్ట్రియా, ఇటలీ దేశములయందు అత్యుత్తమఫలితముల నొసంగెను. లార్డు కార్మయికేల్ (Lord Carmichael) గారు ప్రకటించినటుల బ్యాంకులు విస్తారముగ స్థాపింపబడక పరిశ్రమాభివృద్ధి యభిలాష హెచ్చుగ నుండీ బంధముల త్రెంచికొని జాతీయశక్తి నుద్భవింపజేయదలంచుచు

చిన్న చిన్న వర్తకవ్యాపారమును నేడో రేపో ప్రోత్సహింపనుండిన హిందూదేశమువంటి దేశమున వ్యవసాయేతర పరపతిసంఘముల సహాయము లభించునట్లుగ ప్రయత్నింపకతీరదు. శ్రమలకోర్చి పాటు పడుచున్న కార్మికులకిట్టి పెట్టుబడి అందుబాటుగ నుండవలెను." అని వుల్ఫ్ గారువ్రాసిరి.[1]

పై అభిప్రాయముల ననుసరించి పట్టణములయందు వ్యవసాయేతర పరపతిసంఘములను స్థాపించు ఆవశ్యకతయు, నుపయోగములును సుబోధకముగ నున్నవి.

జీతగాండ్రసంఘములు.

వ్యవసాయ పరపతిసంఘములను స్థాపించుటకు వ్యవసాయదారులకు స్థిరాస్తియుండుటవలన సౌకర్యములు హెచ్చుగనున్నవి. భూమిని, పశువులను, పంటలను, లేక ఇండ్లను హామీనొసంగుటకు వీలుకలదు. కాని బస్తీలయందు జీతగాండ్రకు స్థిరాస్తియుండుట అరుదు. ఒకరినొకరి గ్రామములలోవలె తెలిసికొనియుండుటయు, పరస్పర సహకారమునకు దోడ్పడుటయుగూడ నరుదు. అందువలన సమిష్టిబాధ్యతలేని సంఘములు పట్టణములయందు స్థాపింపబడుచున్నవి. వాటాలను కొనువారు సభ్యులుగనుందురు. ఈ వాటాలధనమే ప్రజలయొద్దనుండి వసూలు చేయు డిపోజిట్లకును, ఇతరఋణములకును హామీగ నుండును. పనివాండ్రకు, చిన్నవర్తకులకు, మొదలగువారికి కొన్నివాటాలను కొనుట కష్టతమముకాదు. కాని, జీతగాండ్రు నెలసరిజీతములతో కుటుంబ వ్యయమునకుపోను మిగుల్చుకొని వాటాలను కొనజాలరు. కనీస మొకవాటాయైనను రు 10 కు కొనవలెనన్న చాలనెలలు పట్టును. మరియు, ఆతనియుద్యోగమే సంఘమునకు హామీయగును కాని

---

1 *Co-operation in India*, p. 211, 212.

వేరు హామీాయుండదు. బదిలీఅయినను, హఠాత్తుగ చనిపోయినను, అతనిఅప్పు రాబట్టుటకష్టము. ఈకారణములవలన జీతగాండ్రకుపెట్టు సంఘముల స్వరూపనియమములు మారును. బొంబాయియందు జీతగాండ్ర సంఘముల కేర్పరుపబడిన నియమముల గమనింపదగును. ప్రతిసభ్యుడును నెలసరిజీతములనుంచి సంఘమునకిట్లు చందానొసంగ వలయును.

| జీతము | | చందా |
|---|---|---|
| రు 1 మొదలు | 15 | రు 0-8 |
| 16 | 40 | 1-0 |
| 41 | 80 | 3-0 |
| 80 | 100 | 4-0 |

ఇట్లే జీతము హెచ్చినకొలదియు చందా హెచ్చును. చందా పదిరూపాయలవఱకు పెరిగినవెంటనే వాటాక్రింద నాసొమ్ము మార్చ బడును. ఇట్టిసంఘములు పెద్దపెద్ద ప్రభుత్వ కార్యాలయములయం దును, దుకాణములయందును పెట్టదగును. వాటాధనము పెరిగినకొల దియు, సభ్యులకు ఋణములిచ్చుటకు సావకాశము హెచ్చుచుండును. రైల్వేకంపెనీల ఉద్యోగస్థులుకూడ నిట్టిసంఘముల నేర్పఱచుకొను చున్నారు. ఇందు సామాన్యముగ విద్యావంతులు సభ్యులుగ నుండుట వలన సంఘములు జయప్రదముగ జరుగుచున్నవి. బొంబాయివంటి నగరములయందు క్రయవిక్రయ సహకారసంఘములనుగూడ నిట్టి సంఘములకు శాఖలుగ నెలకొల్పుచున్నారు.

చేతపనివాండ్ర సంఘములు.

చేమగ్గముల నేతగాండ్రు, కంసాలులు చెప్పులుకుట్టు వారు, బుట్టల నల్లువారు, వడ్రంగులు మొదలగు చేతిపనివాండ్ర సంఘములను స్థాపింపదగును. ప్రత్యే కముగ వృత్తి ననుసరించి సంఘములు స్థాపింపబడుచున్నవి. ఈసంఘ

ములు వ్యవసాయ పరపతిసంఘములవలె పనిచేయుచున్నవి. సభ్యులు స్వల్పసంఖ్యాకులుందురు. అందరు ఒకేవృత్తికి సంబంధించినవారుగ నుందురు. వాటాల ధనము తక్కువగనుండును. కేంద్రసంస్థలనుండి వలయు సొమ్మును అప్పు తెచ్చుకొనుచుండవలెను. అందువలన సమిష్టి బాధ్యతకలదు. శాసనముననుసరించి సమిష్టిబాధ్యతయే యుండవలెనను నియమములేదు. నేతపరిశ్రమ భారతదేశమునందు విశేషాభివృద్ధినొందుటకు నేతగాండ్రకు పరపతిసంఘములను స్థాపించి వలయు పెట్టుబడిని సకాలమున స్వల్పవడ్డీతో లభింపజేయుట అత్యవసరము. ప్రభుత్వము వారు స్వయముగ నేతసంఘములకు ఋణముల నీయదగును. బొంబాయి రాష్ట్రమునందీ సంఘము లభివృద్ధియందున్నవి. చిన్న చిన్న రైతులు పెట్టుబడికై శ్రమపడుచున్న రీతిగనే చిన్నచిన్న చేతి పనివాండ్రుగూడ శ్రమపడుచున్నారు. వీరికి తక్కువవడ్డీలతో పెట్టుబడిలభించునట్లొనరించి చేతిపనులయభివృద్ధికిపాటుపడుటయే కర్తవ్యము.

మిల్లుకూలీల సంఘములు.

నగరములయందు, పట్టణములయందు, మిల్లులయందు పనిచేయుచుండిన కూలీలకు పరపతి సంఘములను నెలకొల్పవలయును. కూలీల నైతికార్థిక పరిస్థితులు దుర్భరముగ నున్నవి. తక్కువ జీతములు, గాలి-వెలుతురు రానిఇండ్లు, దళారీలు చేయుచుండిన మోసము, అజ్ఞానము, విద్యావిహీనత, అమితమగు ఋణబాధ, త్రాగుడు మొదలగు కష్టములకు గురియగుచు దుర్భర జీవితమును గడుపుచున్నారు. రోజుకూలి, లేక వారపుకూలి సంపాదించు కార్మికులను సహాకార పరపతి సంఘములయందు చేర్చినయెడల కొంతవఱకు వీరి యార్థికస్థితిని చక్కబెట్టగలము. కార్మికాభిమానులు మిల్లు 1కి ఒక సహాకార పరపతి సంఘమును స్థాపించి కార్మికులనైతికార్థికాభివృద్ధులకు తోడ్పడదగును.

కార్మికసంఘములు అచ్చటచ్చట గలవు. విరివిగ వ్యాపించుటలేదు. కార్మికులయందుగల విద్యావిహీనతయు, వలసబోవు తత్వమును సహకారోద్యమమునకు ప్రతిబంధకములు. అయినను రైతులతోపాటు కార్మికులుగూడ నభివృద్ధిజెందినగాని భారతదేశమునందార్థికాభివృద్ధి కలలోని మాటయగును. సహకారోద్యమాభిలాషులు తమశక్తి సామర్థ్యములను కార్మికులవంకకు ప్రసరింపజేయుట అత్యవసర విషయము.

నిమ్నజాతుల సంఘములు. మిల్లుకూలీలవలెనే నిమ్నజాతుల స్థితియు గలదు. పట్టణములయందు, నగరములయందు అంటరానివారని చెప్పబడు పంచముల ఆర్థికస్థితిని వృద్ధిచేయుటకు మాలపల్లెలయందు సహకార పరపతిసంఘములను స్థాపించుట అవసరము. మిల్లుకూలీల సంఘములవలెనే వీరికిని స్థాపింపదగును. బొంబాయి, మదరాసు రాష్ట్రములయందు నిమ్నజాతుల సంఘములు గలవు. ప్రభుత్వమువారు, నిమ్నజాతుల సంఘములకు గూడ స్వయముగ ఋణములనొసంగి పెట్టుబడి పెట్టుట అవసరము.

మదరాసు రాజధానియందు వ్యవసాయేతర సంఘములిట్లున్నవి. [1]

| సంఘములు. | సభ్యులు. |
|---|---|
| 1512 | 263381 |

ఇందు వ్యవసాయేతర పరపతిసంఘములు 1107.

| | |
|---|---|
| వీటిలో:—గవర్నమెంటు ఉద్యోగుల సంఘములు | 224 |
| మునిసిపలు, రైల్వే ఉన్నతోద్యోగుల సంఘములు | 73 |
| సాధారణోద్యోగులవి | 43 |
| ఫ్యాక్టరీపనివాండ్ర సంఘములు | 8 |
| మితవ్యయసంఘములు | 7 |
| ఇతర పట్టణ సంఘములు | 752 |
| మొత్తము | 1107 |

1. *Administration Reports of Government of Madras for 1931-33 on Co-operative Societies.*

# 20. ఋణేతర సహకారోద్యమము.

"ఇంగ్లండునందు క్రయవిక్రయోత్పత్తి సంఘములే ప్రజా విశ్వాసమునకు పాత్రములుగ నున్నవి. బాగుగా పనిచేయుచున్నవి. కాని ఇతర ఐరోపాఖండములయందు పరపతిసంఘములు బాగుగ పని చేయుట ప్రారంభించువఱకు క్రయవిక్రయోత్పత్తి మొదలగు కార్యములకై సహకారోద్యమము ప్రారంభింపబడలేదు. హిందూదేశము నందు గూడ ఐరోపాఖండమునందువలెనే పరపతిసంఘములు మొట్ట మొదట ప్రారంభింపబడెను."[1]

1912 వ సంవత్సరపు సహకారశాసనము ననుసరించి క్రయ విక్రయోత్పత్తి మొదలగు పరపతిలేని సంఘములను స్థాపించుటకు వీలుగలదు. అయినను పరపతిలేని సహకారోద్యమము నేటివఱకు తప్పటడుగులను వేయుచునే యున్నది. దినదినాభివృద్ధి గాంచుటలేదు. అన్నిరాష్ట్రములయందును సమానాభివృద్ధి జరుగుటలేదు. వ్యవసాయ మభివృద్ధియగుటకు రైతు సంపన్నుడగుటకు పరపతిసంఘములను నెల కొల్పుట మాత్రమే చాలదు.

రైతుల అప్పు తీర్చివేయబడినదని తలంచెదము. రైతులు విద్యావంతులైరని కూడ నూహించెదము. అంతమాత్రమున భూమి బలవంతమగునా? అధికముగ పంటలు పండునా? కృశించిన శరీరము లతో, పూర్వకాలపు పనిముట్లతో, నీటిపారుదలకు వలయునన్ని సౌకర్యములు లేని స్థితిలో, క్షుద్బాధచే ఎండి, నీరసించిన పశుసంత తితో, విభాగ విఖండములయిన భూమితో, మంచిరకపు విత్తులు లభింపక, పండిన పంటను అమ్ముకొనుటకు వలయు సదుపాయములు లేక, దళారీలు, మార్వాడీలు లాభముల నన్నింటిని తీసివేసికొనుచుండ

1. *Maclagan Committee Report, P. 107*

వారి బారినుండి తప్పించుకొనుటకు మార్గములు గోచరింపక రైతు వ్యవసాయమును లాభకరమగు వర్తకముగ నొనరింపజాలడు. రైతుల యభివృద్ధికి వలయు సర్వవిధములగు కృషియందునను పరపతి సంఘములకంటె పరపతిలేని యితరవిధములగు సహకారోద్యమమే పాశ్చాత్య ఖండములయందు మహోపకార మొనరించెను. హిందూ దేశమునందు గూడ నొనరింపగలదు. పండించువానికిని, వినియోగించువానికిని మధ్యగల దళారీ, లేక కమీషనువర్తకుడు తొలగింపబడుటకు డెన్మార్కు దేశమునందువలె ఋణేతర సహకారసంఘములను స్థాపించుటయే కర్తవ్యము.

# 21. ఋణేతర సహకారోద్యమ సమస్యలు.

ఋణేతర సహకారసంఘములను రెండు విధములుగ విభజింపవచ్చును. (1) ఋణేతర వ్యవసాయ సహకారసంఘములు. (2) ఋణేతర వ్యవసాయేతర సహకారసంఘములు. ఈ రెండు రకముల సంఘములను వివిధసంఘములుగ విభజింపవచ్చును. ముడిదినుసులను కొనుటకు, పనిముట్లను కొనుటకు, పంటలనమ్ముటకు, పండించుటకు, భీమా, ఇండ్లు కట్టుట, స్థలములుకొనుట మొదలగు వివిధసంఘములు కలవు.

1. బాధ్యత. శాసనము ననుసరించి ఋణేతర సంఘములకు సమిష్టి బాధ్యత యుండవలెనను నియమములేదు. సభ్యుల యిష్టము ననుసరించి వ్యష్టిబాధ్యతమీద లేక సమిష్టి బాధ్యతమీద నేవిధముగనైనను సంఘముల నెలకొల్పవచ్చును. ఆయాసంఘముల అవసరముల ననుసరించియు పరిస్థితుల ననుసరించియు బాధ్యత నిర్ణయింపబడుచున్నది. ఋణేతర వ్యవసాయ సహకారసంఘములు తఱుచుగ సమిష్టి బాధ్యతపై నెలకొల్పబడుటలేదు. పాలసంఘ

ములు, నేతపనివాండ్రి సంఘములు మొదలగునవి సామాన్యముగ సమిష్టిబాధ్యతపై నెలకొల్పబడుచున్నవి. ఇట్టిసంఘములకు ఇతరసంఘములనుండి ఋణము దెచ్చుకొనవలసిన అగత్యముండుటయే సమిష్టిబాధ్యతను నిర్ణయించుకొనుటకుగల కారణము.

2. సభ్యులు కాని వారితో వ్యవహరించుట.

సంఘసభ్యులు కానివారితో వ్యవహరించుట మంచి పని కాదు. పనివాండ్ర సంఘములు, భీమాసంఘములు, గృహ నిర్మాణ సంఘములు, మొదలగు సంఘములలో వ్యవహారము సంఘసభ్యులతో మాత్రమే చేయుట విధి. క్రయ విక్రయోత్పత్తి సంఘములే సభ్యులు కాని వారితో గూడ వ్యవహరించుచున్నవి. వ్యవహరింపగలవు. "ఇట్లు వ్యవహరించుటవలన సంఘసభ్యుల సంఖ్య హెచ్చదు. లాభములను సంపాదింపవలెనను వర్తకదృష్టి హెచ్చును. సహకార శాసనము ననుసరించి లభించిన ప్రత్యేక సౌకర్యములను దుర్వినియోగముచేయుట యగును. మామూలు వర్తకులకుతో పోటీకి డీకొనుట యగు" నని కొందఱివాదము. కాని, మంచిసరకును చౌకధరలకు విక్రయించుచు నష్టములేక పనిజేయుట వలన, సహకారోద్యమ సిద్ధాంతములను వ్యాప్తిచేయుట యగును. ఇతరు లందఱు సభ్యులగుటకు ప్రోత్సాహము కూడ జనింపగలదు.

## 22. వృత్తుల సంఘములు.

వృత్తుల ననుసరించి సంఘముల నేర్పరచుట సమంజసమని కొందఱి మతము. ఒక్క గ్రామమున వివిధసంఘములుండుట వలన అన్ని సంఘములను సక్రమముగ నడుపగలిగిన గౌరవోద్యోగులు లభించుట కష్టము. మరియు, గ్రామస్థుల శక్తి సామర్థ్యములు కేంద్రీక

రింపబడుటకు మారుగ, అనవసరముగ వ్యయమగును. సహకార పరపతి సంఘమునకే క్రయ విక్రయోత్పత్తి మొదలగు ఋణేతర సంఘములను గూడ శాఖలుగ నేర్పఱచుట సమంజము. ఉపయోగ కరము. అని డార్లింగు గారి నిశ్చయము. బవేరియా, శాక్సనీ, బెల్జియమ్ము, ఆస్ట్రియా మొదలగు దేశములలో సహకారపరపతిసంఘములే ఋణేతర సంఘములను గూడ నడుపుచున్నవని కాల్వర్టుగారు వ్రాసిరి. "జపాను దేశమునందు గ్రామములలో సహకార పరపతి సంఘములే. క్రయ విక్రయోత్పత్తి మొదలగు సహకార సంఘముల పనిని గూడ కొనసాగించుచున్నవి. ఇట్లన్నివిధములగు సహకార కార్యములను ఒక్క గ్రామ పరపతి సంఘము నడుపుచుండుటయే జపానుదేశము నందలి సహకారోద్యమ ప్రత్యేక విషయము." అని కాల్వర్టు గారు వ్రాసిరి.[1]

హిందూదేశమునందీసమస్య నెట్టి ప్రత్యేకరీతిగగాని ఆచరణ యందుంచుచు పరిష్కరింపలేదు. వ్యవసాయ సహకారోద్యమము బాగుగ వ్యాప్తిజెందిన డెన్మార్కునందు ఒక్కొక్కరైతు వివిధము లగు సహకార సంఘములయందు సభ్యుడగుచున్నాడు. పరపతిసంఘములే వివిధములగు సహకారసంఘములను నడుపుటలో 'ప్రమాదము కల'దని వ్యవసాయ విచారణసంఘమువారు వ్రాసిరి.[2]

కాని హిందూదేశమునందు నేటి స్థితిలో పరపతిసంఘములే గ్రామములయందు వివిధములగు నితర సహకారసంఘముల శాఖలను బెట్టదగును. ఇదియే ఆచరణీయము. పరపతి యుద్యమమునకంటె ఋణేతర సహకారోద్యమమే జయప్రదముగ కొనసాగించుటకు సావకాశము కలదు.

---

1. *Calvert-Law and Principles of Cooperation, p. p. 29-30*
2. *Agricultural Commission Report, para 375.*

# 23. బుుణేతర వ్యవసాయ సహకార సంఘములు.

బుుణేతర వ్యవసాయసహకార సంఘముల యుపయోగము వివరింపబడెను. నేటివఱకునీయుద్యమము వ్యాప్తి జెందలేదనుటనిశ్చయము. క్రయవిక్రయోత్పత్తి సంఘములు, విత్తులనమ్ము సంఘములు, పనిముట్ల నమ్ము సంఘములు, ఎరువులనమ్ము సంఘములు స్వల్పముగ గలవు. సహకారభీమాసంఘముల సిద్ధాంతములుగూడ వ్యాపించలేదు. పశువులను మాత్రమే కొన్ని తావులయందు భీమా చేయించుచున్నారు. వ్యవసాయ క్షేత్రములయందుండు ఇండ్లను, పంటలను, గడ్డిమేటులను భీమా చేయించుట ప్రారంభింపబడలేదు. పశువుల సహకారభీమా జయమగుచుండెనని తలంపబడెను. పశువులకువచ్చు పెద్దరోగము మొదలగు జబ్బుల విశేషవ్యాప్తి వలన ధనాభావముల చాల సంఘములెత్తివేయబడుచుండెను. వ్యవసాయసంస్థ యందలి వివిధకార్యములకును, ఫలసాయమునకును పరికరములకును గూడ సహకారభీమా పద్ధతి వ్యాప్తి జేయవలయును. పశువులను పోషించుటకును, పశువుల మేతకును సహకారభీమా పద్ధతి నవలంబింపదగును. పొలములకు కంచెలనువేయుసంఘములు కొన్ని కలవు. పల్లపుసాగు సహకార సంఘములు కొలదిగ స్థాపింపబడినవి. వీటివలన మెరకపొలములకు నీరు తెచ్చుకొనుటకు వీలుగనున్నది. ఇట్టి పల్లపుసాగు సహకారసంఘములు మదరాసు, బెంగాలు రాజధానులయందు బాగుగ పనిచేయుచున్నవి. పంజాబునందు భూమి విఖండములను కలుపుటకు సహకారసంఘములు కలవు. ఉమ్మడి వ్యవసాయము చేయుటకు సహకార సంఘము లత్యావసరము. ఇటలీదేశమునందిట్టి సంఘములున్నవి.

వ్యవసాయదారులకు నిత్యకృత్యములకై వలయు పరికరముల సంఘములు ఇంగ్లండునందు బాగుగ నభివృద్ధి జెందినవి. హిందూ దేశమునందు వ్యవసాయదారుల అంతస్తు అత్యల్పమగుటచే గ్రామములయందు గల చిల్లర దుకాణములే వీరి అవసరముల గడతేర్చుచున్నవి. మంచిపాలను లభింపజేయుటకై సహకారసంఘము లత్యావసరము. పాలసంఘములు దేశమునం దచ్చటచ్చట గలవు. మొత్తము మీద ఋణేతర వ్యవసాయ సహకారోద్యమము అతిబాల్యావస్థయందున్నదనుట నిశ్చయము.

"బొంబాయియందుగల ప్రత్తి విక్రయసంఘములు (Cotton Sale Societies) ను; వంగదేశమునందుగల పల్లపుసాగుసంఘములు, పాలసంఘములును; మధ్యరాష్ట్రమునందుగల విత్తనములనమ్ము సహకారసంఘములు, గోశాల సంఘములును; పంజాబునందుగల భూమి విఖండములను గలుపు సహకారసంఘములు, కాలువలయందు మేటలు వేసిన ఒండ్రును తీసివేయు సంఘములు, వ్యవసాయ ఫలసాయము నమ్ము సంఘములును; హిందూదేశమునందు సరియగు నిర్మాణశాఖ యుండినచో సహకారోద్యమము కొలదికాలములోనే రైతులకు రావలసిన సర్వవిధములగు లాభములను రాబట్టగలుగునను విశ్వాసమును పురికొల్పుచుండెను." అని డాక్టరు క్లౌస్టనుగారు వ్రాసిరి.[1]

ఈ పరివర్తనమునకు ప్రభుత్వమువారి వ్యవసాయ శాఖయు, పశురోగవైద్యశాఖయు, సహకారసంఘముల ప్రభుత్వశాఖయు మూడును పరస్పరమైత్రితో సహకారమున తమశక్తినంతయు కేంద్రీకరించుట అవసరమని కొందఱి సూచన. "ఋణేతర సహకారోద్యమ

1 *Reiew of Agricultural operations in India* (1926 7)

మూలముగనే ప్రజాసామాన్యమునకు నిపుణుల యుపదేశములు వినిపించగలవు. ప్రభుత్వమువారి ఏప్రత్యేకశాఖయందలి ఉద్యోగస్థులైనను వ్యక్తిగతముగ రైతులను కలిసికొనజాలరు." అని వ్యవసాయ విచారణసంఘమువారి నిర్ణయము.[1]

బొంబాయియందు డివిజనులు, సంఘము లేర్పరుపబడినవి. ఈసంఘములయందు సహకార సంఘముల అసిస్టెంటు రిజిష్ట్రారును, వ్యవసాయశాఖవారి డిప్యూటీ డైరెక్టరును, కొంతమంది ఉద్యోగేతరులగు గౌరవసభ్యులును, సభ్యులుగనుందురు. తాలూకా పునర్నిర్మాణ సంఘములను పేరున (Taluq Development Association) కొన్ని సంఘములు సహకారశాసనము ననుసరించి రిజిష్టరీచేయబడినవి. ఈసంఘములును ప్రత్యేక వ్యవసాయ నిర్మాణికులను పేరున నియోగింపబడుచుండిన (Special Agricultural Organizers)ఉద్యోగస్థులును గ్రామముల వెంట పనిచేయుదురు."[2]

ప్రతి రాష్ట్రమునందును వ్యవసాయశాఖ డిప్యూటీకలెక్టరు హోదా కలిగిన ప్రత్యేకోద్యోగిని సహకారశాఖ రిజిస్ట్రారునకు లోబడి పనిచేయునట్లుగ నియమింపవలయుననియు, నీయుద్యోగి ఋణేతర వ్యవసాయ సహకారోద్యమమును ప్రోత్సహించుచుండవలయుననియు, ఋణేతర సహకార సంఘములను స్థాపించుచుండవలయుననియు, అట్టి సంఘములు సక్రమముగ నడుచునట్లు చూడవలయుననియు వ్యవసాయ విచారణ సంఘమువారు సూచించిరి.[3]

---

1. *Agricultural Commission's Report, para 386.*
1. *Indian Economics-Jathar and Beri, p. 318.*
3. *Agricultural Commission's Report, para 388.*

"పెట్టుబడిదారుడును పంటలను కొనువాడును ఒక్కడే. పంటలను అమ్మి వీని చేతినుండి రైతు తప్పించుకొనజాలడు. పంటలను సహకార సంఘ ఖరీదుచేయువాడు తఱుచుగ సరియగుధరలను దెలియ ములు, క్రయ విక్రయ సీయడు. తెలిసినను రావలసినంత ధరను తానీయడు. యు పంఘములు. పంటలు పండినవెంటనే ధరలు సహజముగ పడిపోవును. వ్యవసాయదారునకు తగు పెట్టుబడి లేనందున ధరలు హెచ్చువరకు పంటను నిలవచేసి యుంచజాలడు. పంటల హామీ మీదనే ఋణమునుగూడ తెచ్చియుండినయెడల వడ్డీ మితముగ నుండును. పెట్టుబడిదారుని పరముగ పంటలను అమ్మివేయు షరతు నకు రైతు లోబడియేయుండును. అందువలన కమీషను ఏజెంటు, లేక దళారీ, లేక మధ్యవర్తకుడు ఏదోయొక నెపమున ధరను కోసివేయుచునే యుండును. ...... మధ్యవాడు సరకులో కల్తీ కలుపుటయు, తడిపివేయుటయు మొదలగు పనులొనరించుచుండును. ఇందువలన కొనువాడు ధర తగ్గించుచుండును. ఈనష్టమును రైతులేభరింపవలెను." అని కెటెంజీగారు వ్రాసిరి. ఈస్థితితొలగి సరియగు ధర రైతునకు లభించుటకు గ్రామములయందు పంటలనమ్ము సహ కారసంఘములను నెలకొల్పదగును. లేక పరపతిసంఘములే క్రయ విక్రయ సంఘములను నెలకొల్పి, రైతుల పంటలను అవసరమగు చోట్లకు పంపి ఉమ్మడిగ నమ్ముచుండవలెను. ఇట్టి సంఘములు కాలి ఫోర్నియాయందు బాగుగ పనిచేయుచున్నవి. ఇట్టిసంఘముల అను భవము ననుసరించి యీసంఘములు పనిచేయుటకు వలయు సూత్ర ముల నిట్లు జె. డబ్ల్యు. లాయిడుగారు క్లుప్తముగజెప్పిరి. (J. W. Lloyd)

1. పంటలను సరియగు మార్కెట్టులకు పంపుప్రయత్నములు పండించువారికట్టి ఆవశ్యకత బాగుగ తెలిసినయెడల విజయము గాంచును,

2. పంటలనుఅమ్ము సంఘములను నిర్మించునపుడు ధృఢతమ మగు పునాదిలేనియెడల స్వార్థపరులగు నితరుల యొత్తిడికి నోపజాలక సంఘములు పనిచేయజాలవు.

3. సామాన్యముగ నొకవిధమగు పంట లేక దానితో జత చేర్పదగిన పంటలను మాత్రమే అమ్ముటకు ప్రయత్నింపవలయును. హెచ్చుసరకును అమ్ముచుండినగాని ఖర్చులు కలిసిరావు.

4. సంఘసభ్యులందరు పంటల నమ్మువారుగ నుండవలెను.

5. సంఘవ్యవహారములు నడుచుటకు వలయు ధనము ను ప్రత్యేకించుచుండవలయును. పెట్టుబడికి నిర్ణీతమగు మార్గముల నవలంబింపవలయును.

6. సంఘమునకువచ్చు లాభములను ఆయాసభ్యుల సరకు యొక్క అమ్మకపుకిమ్మతు ననుసరించి పంచిపెట్టదగును.

7. పండించువారి సంఘమునందు సభ్యుని 1 కి ఒకఓటువంతున లేక సరకు నిలవజేయువానికి ఓటుహక్కునిచ్చుట ఏవిధముగనైన నుండవచ్చును.

8. సంఘసభ్యులలో పరస్పరవిశ్వాసము, సహకారము అత్యావసరము.[1]

ఇట్టిసంఘములు భారతవర్షమునందు స్థాపించుటకు బాగుగ వీలుకలదు. మదరాసు రాజధానియందు వరిపంట, కలకత్తాయందు నారపంట, బొంబాయి రాజధానియందు ప్రత్తిపంట, పంజాబునందు గోధుమ, నారింజపండ్లు, మొదలగు పంటలను ఉమ్మడిగ అమ్మించుకొను సంఘములను నెలకొల్పవచ్చును. ఇట్లే క్రయవిక్రయ సంఘములనుగూడ గ్రామములయందు నెలకొల్పినయెడల రైతులకు విశేష

1. *From an Article "Principles of Co-operative Marketing as illustrated by California experience"—International Review of Agricultural Economics 1920, June.*

లాభమువచ్చును. పరపతిసంఘములే యీపనినిగూడ నిర్వహింప వచ్చును. పంచాయితీలు తమసంఘసభ్యులకు ఏసరకు ఎంతకావలసి నదియు ముందుగ తెలిసికొనదగును. అందులకు సొమ్మును రొక్క ముగ వసూలుచేయదగును. లేక సంఘమే ఋణమునొసంగి వసూలు చేయవలయును. ఇట్లు వివిధసంఘములుకలిసి ఒక్కపర్యాయమే తెప్పిం చినయెడల కొంతకలిసివచ్చును. కోఆపరేటివు యూనియనులు సంఘ ములపక్షమున ఉమ్మడిగ సరకును తెప్పించుకొనవచ్చును. ఈకొను గోలును సంఘములపక్షమున, యూనియనులపక్షమున సెంట్రలు బ్యాంకు లొనరింపదగును. నగరములయందు సులువుగదొరుకు సర కును సెంట్రలుబ్యాంకుల పక్షమున రాష్ట్రీయబ్యాంకు లొనరింప దగును. రాష్ట్రీయబ్యాంకు సెంట్రలుబ్యాంకు కాతాకును, సెంట్రలు బ్యాంకు గ్రామపరపతిసంఘముల కాతాకును ఖర్చువ్రాయుచు, గ్రామములనుండివచ్చు సరకునుగూడ నిక్లేఅమ్ముచు ఆయాసంఘ ముల కాతాకు జమవ్రాయదగును. ఇట్లొనరించినయెడల పంటలకు సరియగుధరలు వచ్చుటయేకాక, రైతులకువలయు సరకుకూడ మేలై నది చౌకగ లభించును.

సెంట్రలుబ్యాంకులు పట్టణములయందున లేక ఎగుమతియగు రేవులయందున తమ మూలధనముతో సరకును నిలవ జేయుటకు కొట్లను కట్టించవలయును. రాష్ట్రీయబ్యాంకునందున లేక గవర్న మెంటు ఋణపత్రముల యందున సొమ్ము దాచుకొనుటకంటె నిట్టి పెట్టుబడి రైతునకు, బ్యాంకులకును గూడ లాభకరము.

"మదరాసు రాజధానియందుగల సంఘములలో 170000 మంది సభ్యులు కలరు. సగటున సభ్యుని 1 కి సాలుసరి రు 200 కిమ్మతు గల సరకును వినియోగించును. ఇందులో 100 కి 10 వంతులు మధ్యగ

వర్తకము చేయువానికి పోవుచున్నది. సహకార సంఘముల మూలముగ నీపని చేసినయెడల నీలాభమంతయు మరల సభ్యులకే చెందును. అనగా సుమారు సాలుసరి 34 లక్షలు తిరిగి వచ్చును. ఈవిధముగ పరపతి సంఘములన్నియు వర్తక సంఘములై యూనియనులక్రింద విభజింపబడి ఆయూనియనులన్నియు నొక కేంద్రవర్తకసంఘముగ నేర్పడినయెడల త్వరితగతిని జయము బడయగలుగుదుము.'' అని హెన్నింగువేగారు వ్రాసిరి. (Mr. Henningway). "ఈవిధముగ భారతదేశమంతయు 325000 పరపతిసంఘములును, రాష్ట్రీయ సహకార వర్తకసంఘములుగను; రాష్ట్రీయ వర్తకసంఘములు అఖిలభారత సహకార వర్తకసంఘముగను నేర్పడినయెడల కనీసము 200 లక్షల రూపాయలు తిరిగి రైతున కొసంగగలుగుదు'' మని హెన్నింగువే గారి మతింపు.[1]

"రాష్ట్రీయ వ్యవసాయ క్రయవిక్రయ సంఘములను స్థాపించి (Provincial Agricultural whole-sale Societies) వ్యవసాయమున కవసరమగు పరికరములను రైతులకు అందుబాటునందుంచుటయేకాక రైతుల పంటలను బజారులవెంట గొనిపోయి సరియగుధరలకు విక్రయ మొనరించుటయే కాక, వ్యవసాయమునకు అవసరమగు వస్తుసముదాయమంతయు నుత్పత్తిచేయగల మిల్లులను; ధాన్యము, నార, నూనె మిల్లులను స్వయముగ గలిగియుండెడిరోజు వచ్చును. హిందూదేశమందంతట రాష్ట్రీయ వ్యవసాయ క్రయవిక్రయసంఘములు నెలకొల్పబడి, యాశాఖలతో గూడిన అఖిలభారత వ్యవసాయ క్రయవిక్రయసంఘమును నెలకొల్పవలెనను ఆదర్శము మాదృక్పథమునందు విస్పష్టముగ గోచరించుచున్నది. ఇట్టి పరిణామము ప్రపంచమునంతను విభ్రమజెందించును. నాడే ప్రపంచమునందంతట క్రమాభి

1. *From the Co-operative Movement in India.*

వృద్ధి జెందుచున్న సహకారవర్తకమునందు భారతవర్షముకూడ నగ్రస్థానమును బొందగలదు." [1]

సహకారోద్యమసహాయమున రైతునకు మంచివిత్తులనొసంగుటయు, నూతనపరికరముల నందిచ్చుటయు, ఎరువులనిచ్చుటయు, రైతున్నకు వలయు సర్వవిధములగు వస్తుసముదాయమునకును క్రయ విక్రయశాలల నేర్పరచుటయు గావించిననాడు వ్యవసాయము భారత భూమియందు నూతన తేజమున పునర్జన్మము నొందగలదు.

భూమి విఖండములను గలుపు సహకార సంఘములు.

భూముల విభాగ విఖండములను గురించి అయిదవ అధ్యాయమునందు వ్రాయబడెను. ఈవిఖండములను గలుపుటకు సహకారోద్యమము మూలముగ నెట్లు పనిచేయబడుచున్నదియుగూడ నొకింత 5 వ అధ్యాయమునందు వివరింపబడెను. విఖండములను గలుపుటకై సహకార సంఘములను స్థాపింపవలయు ననెడి ప్రయత్నము 1920 వ సంవత్సరమునందు పంజాబులో ప్రారంభింపబడెను. పంజాబునందు చిన్నచిన్న రైతులు హెచ్చుమంది కలరు. అందువలన విఖండములు కలుపనియెడల వ్యవసాయాభివృద్ధికి భంగకరము. మొట్టమొదట మార్చుకొనబడిన విఖండములు 4 సంవత్సరముల పిమ్మట వలదనినను మరల నిచ్చివేయుచుండెడివారు. ఇప్పుడీ పద్ధతి రద్దుకాబడెను. ఒక పర్యాయము మార్చుకొనిన భూమి శాశ్వతముగ ననుభవించుట కధికారము కలదు.

ఇట్టి మార్పుదలచేయు సహకార సంఘములలో భూకామందు లేక జిరాయితీ హక్కుదారుడు లేక మరెట్టి హక్కుగాని భూమి యందుగలవారు మాత్రమే సభ్యులుగ నుండవలెను. సంఘసభ్యు లందరిట్టి అంగీకార పత్రముపై సంతకము చేయవలెను.

---

1. *From the Co-operative Movement in India, P. 186.*

| సంవత్సరములు | గ్రామముల సంఖ్య | కలుపుటకు పూర్వము సంఖ్య | | | కలిపిన పిమ్మట సంఖ్య | | | మొత్తం తగ్గిన విఖండములు | కలుపుటకు పూర్వము విఖండము 1కి సగటు సర్వే నెంబర్లు | కలిపిన పిమ్మట విఖండము 1కి సగటు సర్వే నెంబర్లు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | పట్టా దారులు | సర్వే నెంబర్లు | విఖండ ములు | పట్టా దారులు | సర్వే నెంబర్లు | విఖండ ములు | | | |
| 1924 ఏప్రియలు మొదలు 1925 మార్చి వఱకు | 1 | 53 | 267 | 214 | 53 | 272 | 149 | 31 | 1-2 | 1-8 |
| 1925 ఏప్రియలు మొదలు 1926 మార్చి వఱకు | 1 | 5 | 81 | 47 | 5 | 81 | 48 | 9 | 1-7 | 1-9 |
| 1926 ఏప్రియలు మొదలు 1927 మార్చి వఱకు | 2 | 13 | 184 | 43 | 13 | 188 | 37 | 30 | 7-3 | 7-7 |
| 1927 ఏప్రియలు మొదలు 1928 మార్చి వఱకు | 5 | 91 | 1007 | 1597 | 91 | 1990 | 1373 | 96 | 14-9 | 18-6 |
| 1928 ఏప్రియలు మొదలు 1928 డిశంబరు వఱకు | 5 | 39 | 471 | 358 | 39 | 453 | 309 | 45 | 5-7 | 6-3 |

(*From Co-operation in India P. 185.*)

బరోడాసంస్థాన ము-విఖండములను గలుపుసంఘములు.

బరోడాసంస్థానమునందు గూడ విఖండములను గలుపుటకు సహాకారసంఘములు గలవు. 1928 వ సంవత్సరాంతమునకు 11 సంఘములున్నవి. ఈ పైపట్టిక ననుసరించి బరోడారాజ్యమున గల యభివృద్ధిని తెలిసికొనగలము.

"ఇట్లు విఖండములను గలుపుటవలన గ్రొత్తగ బావులను త్రవ్వించుటకును, బీడుభూములను సాగుబడిలోనికి దెచ్చుటకును, సౌకర్యములు హెచ్చినవి. గతసంవత్సరము 933 బావులు త్రవ్వబడెను. 5206 ఎకరములు సాగుబడిలోనికి వచ్చెను. ఎ 3193 లు పల్లపుసాగు చేయుటకుకూడ ప్రారంభింపబడెను. గురుడసపురమున (Gurdaspur) 2000 చెట్లు వేయబడినవి. ఇందు 400 ఫలవృక్షములు. 49 గోతులు ఎరువులకై పొలములయందు రైతులు త్రవ్వుకొనగలిగిరి. 600 పాత నూతులు బాగుచేయబడినవి." అని పంజాబు దేశమునందు గలిగిన లాభములు ప్రభుత్వని వేదికయందు వివరింపబడెను.[1]

విఖండములను కలుపులవలన రైతునకు సేద్యముచేయు సౌకర్యములు హెచ్చినవి. ఫలసాయము హెచ్చెను. మక్తాలు హెచ్చెను. "గురుడసపురమునందొక రైతు 5 ఎకరములకు రు 100 ల నిచ్చువాడు. అతడు విఖండములను గలిపినపిమ్మట రు 150 ల నిచ్చుచుండెను. ఇట్లే 855 మణుగులగోధుమ ముట్టుచుండిన భూకామందునకు 80 మణుగుల గోధుమ ముట్టుచున్నది." ఒకగ్రామమున 3040 విఖండములుగల యొకరైతునకు అన్నివిఖండములు కలిపివేయుటవలన ఒకతావుననే పెద్దకమత మేర్పడినది. మరొకరైతునకు 200 విఖండములుగ నుండెడి భూమి ఒకపెద్దకమతమైనది. మరొకరైతునకు ఎ 10 లు 84 విఖం

1. *Annual Report 1930.*

డములుగ నుండెడిది. కలిపినపిమ్మట రెండుఖండములుగ ఖండము 1 కి 5 ఎకరములవంతున లభించెను. ఒకనికి విఖండములను గలుపుట వలన లభించిన ఎ 200 ల పెద్దకమతమునకు చుట్టును ఆతడు మట్టి గోడను కట్టించుకొనెను. మరొకడు ముండ్లపొదను వేసి కట్ట పోసెను. ఈపెద్దకమతములయందే ఇండ్లనుగూడ కట్టుకొనుచున్నారు. ఒక భూకామందు తన కమతములో 400 అడుగుల పొడుగున ఒక్కటే పిల్లకాలువను త్రవ్వుకొనెను. మరొకడు 1000 గ॥ పొడుగున మురుగు కాలువను త్రవ్వుకొనెను......

"ఇట్లు కలుపుటయందొక గ్రామము (జులుందరు జిల్లాలో) ఎ 3 లు శ్మశానమునకు విడిచిపెట్టెను. మరొక గ్రామము అర ఎకరము బడిని కట్టుటకు వదలెను. మరొక గ్రామము ఎ 2 లు ఆట భూమిగను, 4 ఎకరములు పశువులమేతకును, 2½ ఎకరములు ఎరువుల బోసికొనుటకు వలయు గోతులను దవ్వుకొనుటకును వదలెను."[1]

"భూముల విఖండములను గలిపివేయుటకు చాల పల్లెటూళ్ళ నుంచి ధరఖాస్తులు వచ్చుచున్నవి. అందులకు ఖర్చును మాత్రము రైతులు భరింప నంగీకరించుటలేదు. గతసంవత్సరము (1929లో) 1 లక్ష 52 వేల రూపాయల ఖర్చును ప్రభుత్వమువారే భరింపవలసివచ్చినది" అని పంజాబు ప్రభుత్వ నివేదికయందు గలదు.[2]

"బొలక్ అను గ్రామమున 1912 ఎకరములు కలుపబడినవి. ఇందులకు ప్రభుత్వమువారికి రు 2390 లు వ్యయమయ్యెను. మరల సెటిలుమెంటు జరుగువరకు అనగ 21 సంవత్సరములకు పై సొమ్మునకు

---

1. *From Co-operation in India P. 125.*
2. *Annual Report for 1930.*

వడ్డీ కట్టినయెడల రు 5401 లు అగును. వ్యవసాయదారులు 13 బావులను త్రవ్విరి. ఇందువలన 130 ఎకరముల పల్లపుసాగు చేయబడును. మరి 84 ఎకరముల పల్లపుసాగుభూమి యీఖండికకు చేరినది. ఈ 214 ఎకరములును గాక 470 ఎకరముల బీళ్ళుకూడ పల్లపుసాగునకు వచ్చెను. ఈభూమికంతకు నేడుగల రేటుప్రకారమే పన్ను గట్టినను రు 1152-12-0 లు రివిన్యూ వసూలగును. అనగ ప్రభుత్వమువారు పెట్టిన పెట్టుబడి 3½ సంవత్సరములలోనే తీరును. పంజాబు దేశమున సగటున ఎ 1 కి రు 2-5-0 లు మాత్రమే ఖర్చు. జపానునందు ఎ 1కి రు 176 లును, స్వీడనునందు ఎ 1 కి రు 5 లును, నార్వేయందు ఎ 1 కి రు 3-12-0 లును విఖండములను గలుపుటకు వ్యయమగుచుండెను."[1]

"సాధ్యమగునంతవఱకు స్థానికపరిస్థితుల ననుసరించి భూవిఖండములను సహకారోద్యమమువలన గలుపవలెను. కాని సహకారోద్యమము మాత్రమే ప్రత్యేకశాసనము లొనరింపక విఖండములను గలుపజాలదు." అని రిజిష్ట్రారులు తీర్మానించిరి.[2]

# 24. ఋణేతర, వ్యవసాయేతర సహకారసంఘములు.

ఋణేతర, వ్యవసాయేతర సహకారసంఘములు కూడ విరివిగ వ్యాప్తిగాంచలేదు. అక్కడక్కడ మాత్రమే కలవు. "నేతపనివాండ్రకు నూలు, పట్టు కొనియిచ్చుటకును, బుట్టలనల్లువారికి వేము

1. *From Co-operation in India P. 123.*
2. *Resolution at the Registrar's Conference 1928.*

కొనియిచ్చుటకును, వడ్రంగులకు కలప కొనియిచ్చుటకును, వివిధములగు పరిశ్రమలకు పనిముట్లను గొనియిచ్చుటకును, బట్టలను, పట్టుబట్టలను ఉత్పత్తిచేయుచు నమ్ముటకును, ఇండ్లుకట్టుటకును సంఘములేర్పరుపబడినవి. సహకారస్టోర్సులలో నిత్యకృత్యములకు కావలసిన చిల్లరసరకు కొనుచు అమ్మబడుచుండెను." అని మెక్లాగను కమిటీ వారు వ్రాసిరి.[1]

అక్కడక్కడ ఎక్కడో నొకమూల నిట్టిసంఘములు స్థాపింపబడినమాట నిజమేకాని ఋణేతర, వ్యవసాయేతర సహకారోద్యమము గమనింపదగినట్లుగ వ్యాప్తిజెందలేదు.

చేతిపనివాండ్రు-క్రయవిక్రయోత్పత్తి సంఘములు.

రైతుల స్థితివలెనే చేతిపనివాండ్రస్థితియు నార్థికముగ నభివృద్ధి జెందవలసియున్నది. పరపతిసంఘముల నెలకొల్పుటయేకాక యితరవిధములగు సహకార సంఘములను గూడ నెలకొల్పినగాని చేతిపతివాండ్ర ఆర్థికస్థితి చక్కబడదు. చేతిమగ్గముల పరిశ్రమ సహకారసంఘములవలన అమితాభివృద్ధినొందుటకు సావకాశములున్నవి. ముడిసరకును చిల్లరగ హెచ్చుధరకు కొనక చౌకగ మొత్తముగ గొనవచ్చును. మరమగ్గములను కొని యుపయోగింపవచ్చును. నేతగాండ్రే కట్టుకొనువారికి నేతబట్టలనమ్మి అందలి లాభములను పొందవచ్చును. వర్తకుల పెట్టుబడికి లోబడి, బట్టలునేసి, తిరిగి చౌకధరలకు వర్తకులకు అమ్మివేయ నవసరముండదు.

సహకారసంఘములవలన ఉత్పత్తియగు పరిశ్రమల ప్రదర్శనముల నేర్పరుపదగును. అట్టిప్రదర్శనములు సహకారోద్యమవ్యాప్తికి తోడ్పడగలవు. బొంబాయిరాజధానియందు సహకారవిధానము నను

1. *Maclagan Committee Report, para 10.*

సరించిన చేమగ్గముల పరిశ్రమయొక్క ప్రాముఖ్యస్థితిని ప్రభుత్వము వారు గ్రహించిరి. సహకారశాఖవారు నేతవిద్యను గఱపుటకై కొన్ని విద్యాలయముల నెలకొల్పిరి. శిల్పకారులనదగు చెప్పులుకుట్టువారు, కంసాలులు, బుట్టలనేయువారు, వడ్రంగులు కమ్మరులు, మొదలగు వారి యభివృద్ధికై కూడ సహకారసంఘముల నేర్పరుపదగును.

కార్మికుల సంఘములు. (Unskilled Labourers' Societies)

మదరాసు రాజధానియందు కార్మికులకు సహకార సంఘములు కలవు. ఈసంఘములు రోడ్లమరమ్మతులను జేయుటకును, నేలనుత్రవ్వుటకును కంట్రాక్టులను బుచ్చుకొనుచుండును. ఈసంఘములయందు చిన్న చిన్న రైతులుకూడ సభ్యులుగనుండిరి. ఈసంఘములు బాగుగ పనిచేయకపోవుటకు కంట్రాక్టరుల ప్రతిఘటన హెచ్చుగనున్నది. కార్యనిర్వహణముకూడ లోటుగనున్నదని ప్రభుత్వోద్యోగు లనుచున్నారు.[1]

పట్టణములయందలి వినియోగ సంఘములు. (Consumers Societies in Urban areas)

గ్రామములయందు వినియోగ సంఘములు నెలకొల్పబడుట లేదని యిదివరలో గుర్తించితిమి. పట్టణములయందు గూడ వినియోగ సంఘములు నెలకొల్పబడుట లేదనియే చెప్పదగును. అక్కడక్కడ కొన్నిసంఘము లుండుటవలన కొలదిగ పల్లెలకంటె పట్టణములయందీ యుద్యమము వ్యాపించినట్లుగ తలంపవలయును. సహకార వినియోగ సంఘములు మదరాసు, బొంబాయి, సంయుక్త రాష్ట్రముల యందు గలవు.

1. *See Agricultural Commission's Report. Minutes of Evidence. Vol. III. Evidence of the Registrar Madras; also his Annual Report 1927-8. Para 82*

మదరాసునందు గల టిప్లికేనులో సాగింపబడుచుండిన సహకార విక్రయశాల హిందూదేశమున కంతకు నుదాహరణముగ నున్నదని చెప్పవచ్చును. బొంబాయియందు, సంయుక్తరాష్ట్రములయందు కళాశాలల యందుగల భోజనశాలలకు (స్టోర్సు) సహకార వినియోగ సంఘములు కలవు. ఇవియు బాగుగ పనిచేయుచున్నవి. రైళ్ళఉద్యోగస్థులు కార్మికులుకూడ వినియోగ సంఘములను నెలకొల్పుకొనిరి. కాని వినియోగసంఘముల ఉద్యమవ్యాప్తిని మొత్తముగ పరిశీలించిన యెడల గమనింపదగిన యభివృద్ధి రవంతయు లేదనుట నిర్వివాదము. పాశ్చాత్య ఖండములతో ముఖ్యముగ ఇంగ్లండుతో బోల్చి చూచుకొనిన మన దేశమునం దభివృద్ధిలేదని స్పష్టపడును. "తగిన పరిశీలనాధికారము, వర్తకశక్తి, సభ్యులు సంఘముపట్ల చూపదగిన విశ్వాసమును కొఱవడి యుండుటయే" ఈయుద్యమవ్యాప్తి నిరోధమునకు కారణములని సహకారశాఖోద్యోగులు చెప్పుచున్నారు.[1]

బజారు ధరలకును వినియోగసంఘముల ధరలకును గల స్వల్ప వ్యత్యాసమును, నిర్ణీతమగు జీతములువచ్చు సభ్యులు విశేషముగ లేకపోవుటయు, నగదునకు మాత్రమే అమ్మక అరువులు పెట్టుచుండుటయు, సభ్యులు కానివారితోకూడ వ్యవహరించుచుండుటయు వినియోగసంఘములు విజయము బడయకపోవుటకు కారణములని కొందఱు నిరూపించుచున్నారు. వస్తువుల మంచిచెడ్డలను గమనింపగల శక్తి వ్యాప్తియగుట వినియోగ సంఘముల విజయమునకు మూలముగ నుండును. కార్మికులకును మధ్యతరగతి ప్రజలకును వినియోగసంఘముల వ్యాప్తి మహోపకార మొనరించును.

---

1. *See Annual Reports 1923—4; 1927—8 of Co-operative Registrar, Bombay.*

గృహనిర్మాణ సంఘములు.

ఇంగ్లండునందు సందుగొందులు బాగుచేసి బీదవారికి సరియగునిండ్లను గట్టించుటకై జేసినప్రయత్నములలో సహకార గృహనిర్మాణసంఘములు ప్రధానస్థానము వహించును. ఈసంఘములజయమే హిందూదేశమునకు సదుదహరణము. పల్లెపల్లెలయందునను గృహనిర్మాణసమస్య కలదు. కలకత్తా, బొంబాయి, మదరాసులవంటి నగరములలో కార్మికుల బాగునకై గమనింపవలసిన ముఖ్యవిషయములలో గృహనిర్మాణసమస్య యొకటి. ఈసమస్య పట్టణములయందు తక్కువగ లేదు. మదరాసు, మైసూరు, బొంబాయి రాజధానులయందలి పట్టణములలో కొన్ని గృహనిర్మాణసంఘములు కలవు. బొంబాయిప్రభుత్వమువారు గృహనిర్మాణ సంఘములకు ధనసహాయము చేయుటకు నిర్ణయించుకొనిరి. మదరాసుప్రభుత్వముకూడ ధనసహాయము కొలదిగ గావించుచున్నది. గృహనిర్మాణ సంఘములను నాలుగువిధములుగ విభజింపవచ్చును.

1. గృహనిర్మాణమునకై సంఘసభ్యులకొఱకు స్థలములను మాత్రమే కొను సంఘములు. సంఘములు కొనియిచ్చు స్థలములలో సభ్యులు తమంతతామే ఇండ్లను కట్టుకొందురు.

2. సహకారపద్ధతిని ఇండ్లనుకట్టించు సంఘములు. ఈయిండ్లు చివఱకు సభ్యులస్వంతముగును. ఈరెండువిధములగు సంఘములును శాశ్వతముగ నుండవు. సభ్యులపట్ల విశేషసహకార ముండవలసినపని లేదు. ఇవి భాగ్యవంతుల సంఘములనదగును. వీటిని సంపూర్ణముగ సహకారసంఘము లనదగదు.

3. సమిష్టిగ ఇండ్లను కట్టుకొనుట, అందఱును అద్దెకు కాపురముండువారిగ నుండుట, అందఱకును అన్నిఇండ్లమీద హక్కుండుట,

| సంవత్సరము | సభ్యుల సంఖ్య | శాఖలు | వాటాల ధనము రు. | అమ్మబడిన వస్తువుల విలువ రు. | నికర లాభము రు. | మూల ధనము రు. | ప్రజోపయోగనిధి రు. | వాటాలపై పంచిపెట్టబడిన లాభము రు. | సిబ్బందియొక్క ప్రావిడెంటుఫండు | ఇండ్ల అద్దె క్రింద చెల్లించినది. రు. | సిబ్బందీ ఖర్చు | సిబ్బందీ సంఖ్య |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 31-3-1917 | 2798 | 14 | 42554 | 474049 | 15807 | 39484 | 20656 | 6748 | 5932 | 3841 | 14848 | |
| డిటో 1918 | 2899 | 14 | 48779 | 587073 | 20931 | 44932 | 23017 | 9879 | 7898 | 4026 | 15148 | 87 |
| డిటో 1919 | 3559 | 15 | 54566 | 934099 | 26601 | 51555 | 26484 | 11404 | 9681 | 4719 | 15287 | 106 |
| డిటో 1920 | 3902 | 15 | 64744 | 1078589 | 101 | 59583 | 31245 | | 12006 | 5335 | 25946 | |
| డిటో 1921 | 3875 | 16 | 57710 | 944698 | 360 | 59583 | 30424 | | 13007 | 5679 | 31098 | |
| డిటో 1922 | 3914 | 16 | 55808 | 893816 | 22661 | 61161 | 28480 | 10209 | 15050 | 7192 | 30298 | |
| డిటో 1923 | 3858 | 17 | 53458 | 782576 | 20448 | 62200 | 27288 | 11880 | 17715 | 7054 | 30800 | |
| డిటో 1924 | 3935 | 18 | 59325 | 872131 | 23268 | 64620 | 30614 | 14318 | 22479 | 8318 | 30192 | |
| డిటో 1925 | 4195 | 20 | 66702 | 1015912 | 21439 | 70044 | 31858 | | 29258 | 9219 | 31901 | 104 |
| డిటో 1926 | 4578 | | | 1142723 | | | | | | | | |
| డిటో 1927 | 5032 | | | 1138721 | | | | | | | | |
| డిటో 1928 | 5137 | | | 1109852 | | | | | | | | |
| డిటో 1929 | 5761 | | | 1115128 | | | | | | | | |

ఈసంఘమునకు సుమారు 25 వేల ఖర్చుతో స్వంతభవనమును గట్టుటకు 1930 జనవరి 25 వ తేదీని శంఖుస్థాపన జరుపబడెను. మదరాసు రాజధానియందు సహకారోద్యమమును గురించి విచారింప నియోగింపబడిన టవును సెండు కమిటీవారి నివేదికయందిట్లు వ్రాయబడెను.[1]

"యుద్ధానంతరము హెచ్చిన ధరలవలన స్టోరుసంఘములు విరివిగ స్థాపింపబడినవి. 1915 జూన్ 30 వ తేదీకి 11 సంఘములే గలవు. 1921 వ సంవత్సరమునకు 103 సంఘముల వఱకు పెరిగెను. పిమ్మట మరల ధరలు తగ్గుటచే లాభములు తగ్గినవి. ఇందువలనను జీతబత్తెములు హెచ్చుగ నుండుటవలనను సంఘసభ్యులు అవిశ్వాసపాత్రముగ వర్తించుట మొదలగు కారణములవలనను చాల సంఘములు పడిపోయినవి. 1923 వ సంవత్సరమునకు 85 సంఘములు మాత్రమే కలవు. 1926-27 వ సంవత్సరాంతమునకు 143 సంఘములు కలవు. ఇందులో 86 మాత్రమే స్టోర్సుసంఘములని పిలువదగినవి కలవు. ఈసంఘము లన్నింటియందునను ట్రిప్లికేనుస్టోర్సు మాత్రమే 21 శాఖలుగలిగి హిందూదేశమునందంతట ప్రఖ్యాతవంతమై పనిజేయుచున్నది."

## 25. యూనియనులు.

ఇంతవఱకును ప్రాథమిక సంఘములను గుఱించి విచారించితిమి. ప్రాథమిక సంఘములకు పైనగల యూనియనులు, సెంట్రలు బ్యాంకులు, రాష్ట్రీయబ్యాంకులను గుఱించి తెలిసికొనవలసియున్నది.

1. *Report of the Townsend Committee on Co-operation.*

ప్రాథమిక సంఘములకు మొదటి పై మెట్టు యూనియనులు. ప్రతి రాష్ట్రమునందున నేదోయొక విధమగు యూనియనులు పనిచేయు చున్నవి. ఈ యూనియనులను మూడువిధములుగ విభజింపవచ్చును. (1) బర్మాయందుగల పూచీపడు యూనియనులు (Guaranteeing Unions) (2) బొంబాయి మదరాసు రాజధానులయందుగల పెత్తనము చేయు యూనియనులు (Supervising Unions) (3) పంజాబునందు గల బ్యాంకింగు యూనియనులు. కొన్ని పరిసర గ్రామముల ప్రాథమిక సంఘములు కలిసి యొకయూనియనుగ నేర్పడుచున్నవి. ఈ యూని యనునందుగల సంఘప్రతినిధులు కలిసి యొక కమిటీని నియోగిం చెదరు. ఈకమిటీవారే యూనియను వ్యవహారములను చేయుచుం దురు. యూనియనునందుగల సంఘముల వ్యవహారముల బరిశీలించుచు సంఘములకు సలహా నొసంగుచుందురు. పూచీపడు యూనియను లున్నచోట ఆయూనియనునందుగల సంఘములు తీసికొనుట కర్హతగల ఋణమును యూనియనులే నిర్ణయించుచు కొన్ని షరతుల ననుసరించి ఆ అప్పు మొత్తమునకు హామీకూడ నొసంగెదరు. ఇట్టి యూని యనులుండుటవలన సంఘములపై పెత్తనము బాగుగ వహించుటయే కాక గ్రామ పరపతి సంఘములకును, సెంట్రలుబ్యాంకులకును మధ్యగ నీసంఘములు కొలికిపూసవలె నుండునని తలంపబడెను. మెక్లా గను కమిటీవారిట్టి యూనియనులను స్థాపింపవలెనని హెచ్చరించిరి.

సెంట్రలు బ్యాంకులు మాత్రమే యున్న రాష్ట్రములయం దిట్టి యూనియనులను స్థాపించుట తప్పనిసరియని మెక్లాగను కమిటీ వారు వ్రాసిరి. కాని బొంబాయియందు పెట్టబడిన హామీ యూని యనులు నిరర్థకములైనవి. పది సంవత్సరములకు పూర్వమే బొంబాయి

యందిట్టి హోమ్రియూనియనులు పని చాలించినవి. మధ్యరాష్ట్రముల యందుగూడ విరమింపబడినవి. బీహారు, ఒరిస్సాలయందింకను కొన్ని సంఘములు గలవు. ఇవి నామమాత్రముగ నున్నవి. బర్మాయందు మాత్రమే పూచీ యూనియనులు బాగుగ పనిచేయుచున్నవని తలంప బడెను. కాని "బర్మాయందుగూడ నిట్టి యూనియనులు నిరర్థకము లైనవి. కొలదికాలములో నెతి వేయబడును." 1

పూచీ యూనియనుల నెత్తివేసి వాటికి బదులుగ పెత్తనము వహించు యూనియనులను మాత్రమే నెలకొల్పవలెనని బర్మాసహా కారోద్యమ విచారణ సంఘమువారు వ్రాసిరి.

పెత్తనము వహించు యూనియనులను మొట్టమొదట మద రాసు రాజధానియందు విస్తారముగ స్థాపింపబడినవి. సహాకారోద్య మమునందొక ముఖ్యభాగముగ నున్నవి. బొంబాయి రాష్ట్రమున గూడ పిమ్మట స్థాపింపబడినవి. ఈయూనియనుల పక్షమున సూపరు వైజర్లు నియమింపబడుచున్నారు. వీరు సంఘములకుబోయి వారిలెక్క లను, అప్పు ఆస్తులను పరీక్షించుచు వారికి వలయు సలహాల నొసంగు చుందురు. బర్మాయందు జిల్లా యూనియనుబోర్డులుకూడ గలవు. మద రాసునందుగూడ జిల్లా ఫెడరేషనులు పుట్టినవి. అక్కడక్కడ గిట్టు చున్నవి. గిట్టినవి.

ఈదిగువ పట్టికవలన యూనియనుల వివరములను తెలిసికొన గలము. (బ్యాంకింగు యూనియనులు కాక).

1. *Committee on Co-operation in Burma 1928-29.*

| రాష్ట్రములు | యూనియనుల సంఖ్య. | యూనియనుల యందలి సంఘసంఖ్య | వ్యవసాయ పరపతి సంఘముల సంఖ్య | సిబ్బందీ సంఖ్య (Staff) | ఖర్చులు రు. |
|---|---|---|---|---|---|
| మద్రాసు | 440 | 12888 | 12947 | 542 | 528675 |
| బొంబాయి | 102 | 2079 | 4574 | 108 | 89733 |
| బెంగాలు | 3 | 268 | 17968 | 7 | 558 |
| బీహారు, ఒరిస్సా | 215 | 10794 ♦ | 8582 | 211 | 30126 |
| సంయుక్తరాష్ట్రములు | 3 | 108 | 5444 | 157† | 120689 |
| బర్మా | 584 | 3508 | 3370 | 17 | 289845 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 19 | 4575 | 3817 | 366‡ | 369097 |
| అజ్మీరు, మార్వారా | 2 | 141 | 1284 | 2 | 824 |
| కూర్గు | 12 | 160 | 214 | | 178 |
| భూపాలు | 10 | 251 | 1089 | | |
| బరోడా | 2 | 40 | 821 | 1 | 521 |
| తిరువాన్కూరు | 26 | 1468 | 1877 | 26 | 15918 |
| మొత్తము | 1418 | 35770 | 61387 | 1432 | 1438036 |

♦ ఈ అంకెలలో రాష్ట్రీయ ఫెడరేషను నందలి సభ్యత్వసంఖ్య కూడ కలిసియున్నది.

† సంయుక్తరాష్ట్రముల రాష్ట్రీయ యూనియను సంఖ్య.

‡ ఈ అంకెలు ఫెడరేషను యూనియనులు కలిపి.

*(From Co-operation in India)*

పంజాబు, బెంగాలు, మధ్యరాష్ట్రములు, బీరారు, సంయుక్త రాష్ట్రములలో పెత్తనము వహించు స్థానికముగనుండు యూనియనులు లేవు. బ్యాంకింగు యూనియనులుమాత్రమే కలవు. ఇవియే సెంట్రలుబ్యాంకులుగ పనిచేయుచున్నవి. యూనియనులు ప్రాథమికసంఘములపై పెత్తనము వహించుటలేదు గాక, క్రెడిట్టువిత్తరణోత్పత్తి వ్యవహారములలో సెంట్రలుబ్యాంకులకును, ప్రాథమికసంఘములకును మధ్యగనుండి విశేషకృషి సలుపవలెను.

# 26. సెంట్రలు బ్యాంకులు.

జిల్లా 1 కి ఒక సెంట్రలుబ్యాంకు ఉండుట అత్యవసరము. గ్రామపరపతిసంఘముల కవసరమగు ఋణమును సమకూర్చుచుండవలెను. సెంట్రలుబ్యాంకులను మెక్లాగనుకమిటీవారు మూడు విధములుగ విభజించిరి.

1. వ్యక్తులుమాత్రమే సభ్యులుగనుండు బ్యాంకులు.

2. సహకారసంఘములకు మాత్రమే సభ్యత్వముండు బ్యాంకులు.

3. సహకారసంఘములు, ఇతరవ్యక్తులును గూడ సభ్యులుగనుండు బ్యాంకులు.

మొదటితరగతి బ్యాంకులు వ్యక్తులకును, సంఘములకును మధ్య యెట్టి వ్యత్యాసమునుగాని చూపవు. పరిపాలనయందు, లాభములను పంచుటయందు, పెట్టుబడిని ప్రత్యేకించుటయందు వ్యక్తులకును, సంఘములకును (చేర్చుకొనినయెడల) సమానహక్కులే కలవు. ఇట్టి బ్యాంకులు నేడు పనిచేయుటలేదు. సహకారసంఘములవారి విచారణకు

పూర్వము పనిచేసెడివి. రెండవతరగతి బ్యాంకులలో సహకారసంఘములకు మాత్రమే సభ్యత్వము కలదు. సహకారసంఘములే యీ బ్యాంకుల పరిపాలనను సంపూర్ణముగ వహించుచున్నవి. ఇట్టి బ్యాంకులే దేశమునందంతట వ్యాపించవలెను. సహకారసంఘముల బ్యాంకులలో నితరులుండుటవలన సహకారోద్యమ వ్యాప్తికంటె స్వార్థమున కెక్కుడు ప్రాముఖ్యత సంభవించును.

మూడవతరగతి బ్యాంకులలో సహకారసంఘములును, వ్యక్తులును గూడ సభ్యులుగ నున్నారు. సహకారసంఘములకు గొంతపెట్టుబడి ప్రత్యేకింపబడుచున్నది. పరిపాలకవర్గమునం దధికసంఖ్యాకులుగ సహకారసంఘముల ప్రతినిధులే యుందురు. వ్యక్తి వాటాదారులకు గూడ పరిపాలకవర్గమునందు ప్రాతినిధ్యము కలదు. ఇట్టి కలగలపు బ్యాంకులే దేశమునందు నేడు వ్యాపించియున్నవి.

ఉత్తరహిందూస్థానమున కలగలుపుబ్యాంకులు అధికసంఖ్యాకముగ నున్నను, సహకారసంఘములతో గూడిన యూనియనులు విశేషముగనున్నవి. దక్షిణహిందూస్థానమున కలగలుపు సెంట్రలు బ్యాంకులే హెచ్చు. బ్యాంకింగు యూనియనులు చాల అరుదుగ నున్నవి. సంఘములకును, వ్యక్తులకునుగూడ సభ్యత్వముండుటవలన సహకారోద్యమవ్యాప్తి నిరోధింపబడుచున్నది. వ్యక్తిసభ్యులను హెచ్చుడివిడెండును పంచుకొనవలెనను తృష్ణయే పీడించుచుండును. సహకారసంఘముల యిబ్బందులు వీరిచెవులకెక్కవు. వేటకాడు మృగములవెంటబడునట్లుగ వ్యక్తిసభ్యులుగల సెంట్రలుబ్యాంకులు సంఘములవెంటబడి తరిమితరిమి సంఘముల నెత్తివేయించుటకైన నియ్యకొనుచున్నవి. కాని సంఘముల కష్టనిష్ఠూరములను గౌరవాదరములతో మన్నింపజాలకున్నవి. సెంట్రలుబ్యాంకుల ముఖ్యస్థానములు

పట్టణములయందుండుటవలనను, వ్యక్తిసభ్యులుగ నుండువారు సామాన్యముగ పెట్టుబడిదారులు లేక న్యాయవాదులు లేక ఫించనుపుచ్చుకొనిన ఉద్యోగులు మొదలగువారుగ నుండుటవలనను, వ్యక్తిసభ్యులే సెంట్రలుబ్యాంకులపై పలుకుబడిని గలిగియున్నారు. వీరే బ్యాంకులను పరోక్షముగను, అపరోక్షముగనుగూడ పరిపాలించుచున్నారు. అందువలన వ్యక్తిసభ్యులుతమలాభమునే ముందుగ గణించుచున్నారు. ఆంధ్రదేశమునందలి కొన్ని సెంట్రలుబ్యాంకులు వ్యక్తిసభ్యులకు హెచ్చుడివిడెండును, సంఘములకు తక్కువడివిడెండును పంచిపెట్టినవి. ఇందువలన వ్యక్తిసభ్యులకుగల, సంకుచితదృష్టిని స్వలాభమును గ్రహింపగలము. ఇదివఱకు పెట్టుబడిదారులుగ నుండినవారే నేడు వ్యక్తిసభ్యులుగ సెంట్రలుబ్యాంకులలో చేరి వారి మామూలు పలుకుబడిని పెట్టుబడివలన నిలబెట్టుకొనుచు రు 100 కి రు 9-0-0 వంతున లాభములను (లేక వడ్డీ) సంపాదింప గలుగుచున్నారు.

సెంట్రలుబ్యాంకులలో వ్యక్తిసభ్యులకు స్థానముండుటవలన పూర్వపు పెట్టుబడిదారులు దొడ్డిదారిని ప్రవేశించి రైతుల గృహకృత్యములపై పెత్తనము చలాయించుటయే యగుచున్నది. రైతునకు సహకారోద్యమమువలన ఆర్థికస్వాతంత్ర్యము లభించుచుండినటుల పైకి గోచరించుచున్నను అపరోక్షముగ రైతుల జుట్టు, పెట్టుబడిదారుల కాలిగ్రేళ్లకు ముడివేయబడుచున్నది. ఇట్లొనరించిన గాని పెట్టుబడి లభింపదని కొందఱివాదము. రైతులకు విద్యాధికులయొక్కయు భాగ్యవంతులయొక్కయు సంప్రదింపు నాయకత్వము అవసర మని కొందఱి నిర్ణయము. రైతులే బ్యాంకులను నడుపుచో బ్యాంకులు పడిపోవునని కొందఱి మతము. ఈవాద మంతయు భాగ్యవంతులయొక్కయు విద్యావంతులయొక్కయు అహంకారముకాని వేరుకాదు.

స్వార్థమేకాని సహకారోద్యమముపై ప్రేమకాదు. భాగ్యవంతుల యొక్కయు న్యాయవాదులు మొదలగు పట్టణములయందలి విద్యావంతులయొక్కయు సవతితల్లి ప్రేమను జూరగొనుట విరమించినగాని సహకారోద్యమ మభివృద్ధి జెందజాలదు. చెరువునందు దిగి యీత నీదుటకు మొదలుపెట్టినగాని యీత నెన్నటికిని ఎవ్వరును నేర్వజాలరు. అట్లే రైతులపై బ్యాంకులను నడుపుకొను బాధ్యత మోపినగాని వారి కెన్నడును స్వశక్తి జనింపదు. పెట్టుబడి వ్యక్తుల వాటాలమూలముగ గాక డిపోజిట్లమూలముగ సంపాదించుటకు ప్రయత్నింపవలెను. లేక వడ్డీరేటును శాసనరూపముగ తగ్గించివేసినయెడల పెట్టుబడిదారులు తమపెట్టుబడిని బ్యాంకులలో వేసికొనక తప్పదు. ఇట్లే పెట్టుబడి లభించుటకు, సక్రమపరిపాలనకు వేరు మార్గముల నరయవలయును. వ్యక్తిసభ్యులకు సెంట్రలుబ్యాంకులలో స్థానమును దొలగించివేయవలయును. నాడే సెంట్రలుబ్యాంకులు సహకార సిద్ధాంతము ననుసరించి పనిజేయగలవు.

సెంట్రలు బ్యాంకులు పనిచేయు స్థల నిర్ణయము. (Area of a Central Bank)

సెంట్రలుబ్యాంకు ఎంత ప్రదేశమునకు పని చేయవలసినదియు నిర్ణయింపబడుచుండును. సెంట్రలు బ్యాంకులు సంఘములకు ఋణమొసగు ప్రదేశములను నిర్ణయించుటయే కాక ఆప్రదేశమునందే సెంట్రలుబ్యాంకులు ఋణము దీసికొనవలెననికూడ కొన్ని రాష్ట్రముల యందు నిర్ణయము కలదు. దక్షిణ హిందూస్థానమున, మధ్య హిందూస్థానమున మొదలగు ప్రదేశముల యందు ఒక్కొక్క రివిన్యూజిల్లాయం దొకబ్యాంకు పనిచేయుచున్నది. కొన్నితావులయందు డివిజను 1 కి ఒక బ్యాంకు వంతున గలదు. బెంగాలు, బీహారు, ఒరిస్సా, సంయుక్త రాష్ట్రములు,

పంజాబు మొదలగు తావులయందు డివిజనుకంటెగూడ తక్కువ ప్రదేశమున కొకబ్యాంకు పనిచేయుచున్నది. ఇట్టి బ్యాంకులకు సంబంధించిన సంఘములసంఖ్యయు పెట్టుబడి మొత్తమునుగూడ స్వల్ప ముగనే యున్నది.

బ్యాంకుల సాధారణ సభ

బ్యాంకుల సాధారణసభలు సాలున కొకసారి జరుగును. సాలుమధ్య ప్రత్యేకసభలను జరుపవచ్చును. సభ్యుని 1 కి ఒక ఓటు గలదు. వాటాల ననుసరించి లేక పెట్టుబడి మొత్తము ననుసరించి ఓట్లు అదనముగ నుండవు. సాధారణసభలే కార్యనిర్వాహకవర్గసభ్యుల నెన్నుకొనును.

డైరెక్టరులు. (Board of Directors)

సాధారణ సభయందెన్నుకొనబడు డైరెక్టర్ల సంఘము వారు లేక కార్యనిర్వాహకవర్గము బ్యాంకువ్యాపారము నంతను నిర్వహించుచుండును. బ్యాంకుల డైరక్టర్ల సంఖ్య హెచ్చుగ నున్నది. ఇందులకు ప్రత్యేక ప్రాతినిధ్య సిద్ధాంతము నంగీకరించుటయే కారణము. సంఘముల పక్షమున గొంతమందియు, వ్యక్తులపక్షమున గొంతమందియు, నెన్నుకొనబడు చుండుటవలన డైరెక్టర్లసంఖ్య హెచ్చుగ నున్నది. ఇందువలన డైరెక్టర్ల మీటింగులు తరుచు జరుపుటకు వీలులేదు. జరుపబడినయెడల, రాకపోకలఖర్చులక్రింద అనవసరముగ నధిక వ్యయమగుచున్నది. ఒక్కొక్క బ్యాంకునకు 10 మంది మొదలు 24 గురువఱకు డైరెక్టరులు గలరు. వీరికొఱకగు ఖర్చును దగ్గించుటకు కార్యనిర్వాహకవర్గముల నేర్పరచుచున్నారు. డైరెక్టర్ల సంఘము; మరొకకార్య నిర్వాహకవర్గము; రెండుసంఘములు కార్యనిర్వహణమున పాల్గొనుచుండుట పరస్పర ప్రతిఘటనలకు కారణముగనున్నది. సాధారణ సభయందు, తక్కువమందిగల కార్యనిర్వాహకవర్గమునే ఎన్నుకొనుట

సమంజసము. తక్కువమంది నెన్నుకొనుటకుగాను ప్రత్యేక ప్రాతినిధ్యములను తీసివేయవలెను. ధనముతోగూడిన వ్యాపారమును నడుపవలసిన బ్యాంకులలో డైరెక్టర్లందరు నొక్క దృక్పథమున పరస్పరవిశ్వాసమున బనిజేయవలెను. ప్రత్యేక ప్రాతినిధ్యమున ప్రత్యేకపు హక్కుల సంరక్షణకై పాటుపడుట సహజమగుటవలన పరస్పర విశ్వాసము పెంపొందదు. పరస్పర విశ్వాసములేని డైరెక్టర్లతోగూడిన బ్యాంకు లెన్నటికిని అభివృద్ధి జెందనేరవు. కార్యదర్శి లేక అధ్యక్షుడు, బ్యాంకుమేనేజరు సహాయమున అనుదినవ్యాపారమును నిర్వహించుచుందురు. డైరెక్టరులు సామాన్యముగ జీతములను తీసికొనరు. కొన్ని సెంట్రిలుబ్యాంకుల డైరక్టర్లు ప్రతిసాలున కొందఱు మారుచుందురు. వ్యక్తిసభ్యులనుండియే కార్యదర్శియు ప్రెసిడెంటును, ఎన్నుకొనబడుచున్నారు. ఉత్తరహిందూస్థానమున ప్రభుత్వోద్యోగినే అధ్యక్షునిగ గొన్ని బ్యాంకు లెన్నుకొనవలెను. దక్షిణహిందూదేశమున ఉద్యోగేతరులే యెన్నుకొన బడుచున్నారు.

వ్యక్తిసభ్యులను పెన్షనుబుచ్చుకొనిన ఉద్యోగస్థులను, ఉద్యోగస్థులను, కార్యదర్శిగను, అధ్యక్షునిగను, నెన్నుకొనుట విరమింపబడవలెను. ఇందువలన సహకారోద్యమమున నిరంకుశపరిపాలన పెచ్చుపెరుగుచున్నది. సాధారణసభవారి తీర్మానములను, డైరెక్టర్ల తీర్మానములనుగూడ వీరు మన్నింపరు. బ్యాంకు కార్యదర్శి, ప్రెసిడెంటు, సాధారణసభవారి తీర్మానములను, డైరెక్టర్ల తీర్మానములను నిర్లక్ష్యముగ త్రోసిపుచ్చి, వ్యతిరేకముగ వర్తించుట కించుకయు జంకరు. ఇందువలన సాధారణసభవారికి, డైరెక్టరులకును, డైరెక్టరులకు, కార్యదర్శి, ప్రెసిడెంటులకును, పరస్పరవిశ్వాసము తొలగిపోవుచున్నది. ఈఅవిశ్వాసమే బ్యాంకులు పడిపోవుటకు ముఖ్యకారణముగనున్నది. ఈవిషయమై వ్యవసాయవిచారణసంఘమువా రిట్లు వ్రాసిరి.

"సభ్యులు సంఘవ్యాపారమునందు తగుశ్రద్ధవహింపరు. కార్యదర్శి ప్రెసిడెంటులచర్యను హద్దుపద్దులలో నుంచజాలరు. కార్యదర్శి ప్రెసిడెంటులవలన లోటులున్నను, వారిని ఆయుద్యోగములనుండి తొలగింపరు. సంఘోద్యోగులుకూడ జాగరూకతవహించి రావలసిన బాకీలను రాబట్టరు." ఈవాక్యములు పరపతిసంఘములకును, సెంట్రలు బ్యాంకులకును గూడ వర్తించును. వ్యక్తిసభ్యులకు వాటాలనొసంగుట కంగీకరించినను, పెట్టుబడికొఱకు నధికముగ లాభములను పంచిపెట్టుట కొడంబడినను, కొంతమందిని డైరెక్టరులుగ నెన్నుకొనుటకు దలయొగ్గినను, కార్యదర్శిగను అధ్యక్షునిగను, నెన్నుకొనరాదు. ఆచారము, నియమము, తొలగిననగాని, సహకారోద్యమ మభివృద్ధి జెందదు. సాధారణసభయు, డైరెక్టర్లసభయు, కార్యనిర్వాహక వర్గసభయు, తమసభలను వ్యాపార దృక్పథమున ముగించుకొనుట ముఖ్యావసరము. అనవసరముగ వ్యర్థ వాగ్వాదములతో రోజులకొలది సభలు జరుపుట వలన దుర్వ్యయ మగును. స్వల్పకాలమున హెచ్చు కార్యక్రమమును వ్యాపార దృష్టితో బ్యాంకుసభలను ముగింప గలిగిననాడు, సహకారోద్యమ విజయమునకు పునాది వేయబడెనని సంతసింప వచ్చును.

బ్యాంకుల సిబ్బందీ (Staff)

సెంట్రలు బ్యాంకులకు జీతమునిచ్చు మేనేజర్లు కలరు. వీరి విధులు ప్రతిరాష్ట్రమునందున నొకవిధముగ లేవు. కొన్ని రాష్ట్రములయందు ఆఫీసు ఉద్యోగస్థులపై మాత్రమే వీరికి అధికారము కలదు. మరికొన్ని రాష్ట్రములయందు బ్యాంకునకు సంబంధించిన సంఘములతాలూకు ఉద్యోగస్థు లందరిపైన అధికారము కలదు. మరికొన్ని రాష్ట్రములయందు మేనేజరులు సంచారము చేయుచుందురు. సంఘముల కార్యనిర్వహణమునకు బాధ్యత వహించెదరు. వీరికి ఆఫీసు పనితో నిమిత్తములేదు. కొన్ని రాష్ట్రములయందు రాష్ట్రీయ ఫెడ

లేమనువారు ఉద్యోగార్హతలను నిర్ణయించుచున్నారు. వీరి అర్హతల ననుసరించి నియమింపబడిన యుద్యోగులపై సెంట్రలుబ్యాంకులకు నిర్ణీతాధికారము మాత్రమే కలదు. మఱికొన్ని తావులయందుడైరక్టర్లు తమ యిష్టమువచ్చిన వారిని నియమించుచున్నారు. కొన్ని బ్యాంకులు తమ నిలువలను ట్రెజరీలయందు లేక జాయింటుస్టాకు బ్యాంకుల యందు దాచుచున్నవి. ప్రతిరాష్ట్రమునందున ఉద్యోగస్థుల కేదో విధమగు శిక్షణకలదు. ఈశిక్షణ విధానము అన్ని రాష్ట్రములయందున కొంచె మించుమించుగ సమానముగ నున్నది. ఈయుద్యోగస్థులకు సెంట్రలు బ్యాంకులలో ప్రావిడెంటుఫండు కలదు. వీరి జీతబత్తెములు అన్నిరాష్ట్రములయందున సమానముగ లేవు.

ఉద్యోగస్థులనియామకవిషయమున, శిక్షణ విషయమున, జీతముల విషయమున గల ఏర్పాటులు సంతృప్తికరముగలేవు. ఏబ్యాంకు నందుగాని సుశిక్షితులగు నుద్యోగస్థులులేరు. బ్యాంకింగు సమస్యల నెఱింగిన వారినైన మేనేజరులుగ వేయదగును. సహకార తరగతులలో నెలయో లేక రెండు నెలలో చదివినంత మాత్రమున బ్యాంకులయందు పనిచేయు నర్హత సిద్ధింపదు. సహకారరాష్ట్రీయ కళాశాలలను స్థాపింపదగును. అందు 2 సంవత్సరముల శిక్షణవిధానమును గఱుపదగును. సహకారోద్యమము, బ్యాంకింగు, మారకము, గ్రామ పునర్నిర్మాణసమస్యలు, లెక్కలనువేయుట, లెక్కలను పరీక్షించుట మొదలగు విద్యావిధానము నేర్పరుపవలెను. ఈవిద్య నభ్యసించుటకు ఆరవఫారమునం దుత్తీర్ణతగలిగిన జాలును. ఇట్టి విద్యాలయమునందు శిక్షణబొందినవారినే బ్యాంకులయందు నియమింపదగును. గ్రామపరపతి సంఘములకు ఋణేతర సహకారోద్యమ వ్యాపారములను గలిపి, అట్టి సంఘములకు సుశిక్షితులగువారిని జీతముల నొసంగి నియమింపదగును. ఈయుద్యోగసులందరు సహకారోద్యమ శాఖగ రాష్ట్రీయ బ్యాంకు

వారి అధికారమున నియమింపబడుటయు, తొలగింపబడుటయు, జరుగు చుండవలెను. వీరికి ప్రావిడెంటుఫండు నేర్పరుపవలయును. క్రమక్రమముగ జీతములభివృద్ధియగు పద్ధతియుండవలెను. రాష్ట్రీయబ్యాంకు వారి యధికారమున కట్టుదిట్టమగు నుద్యోగశాఖ నేర్పరుచుట ఉద్యమమునకు పునాదిగనుండును. అట్లు జరిగినయెడల పరపతిసంఘములు బ్యాంకులు సక్రమముగ బనిజేయును. సహకారోద్యమము విఫలము కాదు. ఉన్నత విద్యాలయములయందును, కళాశాలలయందును, విశ్వవిద్యాలయములయందును, సహకారోద్యమ విద్యాశాఖను స్థాపింపదగును. గ్రామసంఘములకు సెంట్రలు బ్యాంకులకు రాష్ట్రీయ బ్యాంకులకు పనికివచ్చునట్లుగ, మూడు తరగతులుగ విభజింపవచ్చును. అట్టి విద్యాప్రణాళికను గలుపదగును. ఇదియొక సాంకేతిక విద్యగనొనరించినయెడల సహకారోద్యమమునకు మేలుగలుగును. ఉద్యోగార్థులు ఉద్యోగశాఖ నేర్పరచినయెడల రాష్ట్రీయ బ్యాంకులు, ప్రాథమిక బ్యాంకులకును సెంట్రలుబ్యాంకులకును ప్రతినిధులుగ నుండునట్టి పరిపాలనా ప్రణాళికనుగూడ అమలునందుంచవలెను.

పెట్టుబడి. సెంట్రలుబ్యాంకుల పెట్టుబడిని నాలుగు విధములుగ విభజింప దగును.

(1) వాటాధనము. (2) మూలధనము. (3) డిపోజిట్లు. (4) ఋణములు. వాటాధనము వ్యక్తులవలనను, సంఘములవలనను, సమకూరుచున్నది. కొన్ని రాష్ట్రములయందు వ్యక్తుల వాటాసొమ్మునకు ప్రత్యేక సౌకర్యములుకూడ గలవు. ఇట్టి వాటాదారులకు డివిడెండు హెచ్చుగ పంచిపెట్టబడును. కాని మొత్తపు పెట్టుబడిపై ప్రత్యేకపు హక్కు లేదు. వాటా 1 కి సుమారు రు 50 లేక రు 100 ల వంతున నుండును.

ఈదిగువపట్టిక వివిధ రాష్ట్రములయందుగల సెంట్రలుబ్యాంకులకు బ్యాంకింగు యూనియనులకుగల వ్యాపారపు పెట్టుబడి వివరముల తెలియజేయుచున్నది. (1930 జూన్ వఱకు)

|  | సంఖ్య. | సభ్యులు |  | వేలలో |  |  |  |
|---|---|---|---|---|---|---|---|
|  |  | వ్యక్తులు | సంఘములు | మూలధనము పెట్టుబడి | డిపాజిట్లు | అప్పులు | మొత్తపువ్యాపారపు పెట్టుబడి |
|  |  |  |  | రు. | రు. | రు. | రు. |
| అజ్మీరు, మార్వారా | 7 | 800 | 780 | 417 | 1558 | 4 | 1974 |
| అస్సాము | 16 | 462 | 1118 | 268 | 1358 | 275 | 1896 |
| బంగాళము | 116 | 4652 | 19071 | 7808 | 26491 | 11276 | 45570 |
| బీహారు, ఒరిస్సా | 67 | 2742 | 9077 | 3631 | 15299 | 3948 | 22878 |
| బొంబాయి | 19 | 6535 | 4001 | 3624 | 19354 | 5488 | 28461 |
| బర్మా | 12 | 1072 | 992 | 1843 | 2805 | 475 | 5128 |
| మధ్యరాష్ట్రములు | 34 | 48848 | 3955 | 4800 | 17753 | 1502 | 24055 |
| ఢిల్లి | 1 | 66 | 426 | 150 | 1220 | 1 | 1371 |
| మదరాసు | 31 | 3484 | 12923 | 7660 | 35301 | 19757 | 62718 |
| పశ్చిమోత్తర పరగణాలు | 1 | 36 | 114 | 21 | 229 | 92 | 342 |
| పంజాబు | 118 | 3472 | 18928 | 6823 | 57537 | 6688 | 70548 |
| సంయుక్తరాష్ట్రములు | 69 | 5498 | 5168 | 3525 | 5876 | 404 | 9805 |
| మొత్తము. | 400 | 77667 | 76558 | 40060 | 184276 | 49905 | 274241 |

*(From Banking Enquiry Committee Report P. 114.)*

బ్యాంకుల పూచీనిర్ణీతము. వాటాలధనము మూలధనముల పోమీమీద మాత్రమే ఋణములను డిపోజిట్లను బ్యాంకులు తీసి కొనును. ఈదిగువ పట్టికవలన 1930-31 వసంవత్సరమునకు సహకార సంఘములకుగల మూలధనము తెలియుచున్నది. 1931-32 వ సంవత్సరమున రాష్ట్రములకు స్వదేశసంస్థానములకును మూలధనము ఇతర నిధులునుగలిసి రాష్ట్రీయబ్యాంకులకు రు 278453 ల మొత్తముకలదు. వేరొకచోట వేయబడిన సహకార సంఘముల డిపోజిట్లపట్టికయీదిగువ గ్రహింపవలసియున్నది.

ప్రతిరాష్ట్రమున పెట్టుబడి మూలధనమును కలిసిన మొత్తము ననుసరించి అప్పులను డిపోజిట్లను తీసికొనవలసిన పరిమితి నిర్ణయింప బడుచున్నది. పెట్టుబడి మూలధనముల మొత్తమునకంటె 8 రెట్లు అధికముగ ఋణములను డిపోజిట్లను తీసికొనవచ్చునని ప్రతిరాష్ట్రము నందున నిర్ణయింపబడుచున్నది. పట్టిక ననుసరించి పెట్టుబడియందు చాలభాగము ఋణములును డిపోజిట్లును గలిసి యున్నదని గ్రహింప గలము. ఈకారణమువలన నగదుగనుండు మూలధనమును చిట్టానిలవ యు హెచ్చుగనుండుట అవసరమని(Cash Reseves and fluid resources) మెక్లాగను కమిటీవారు నొక్కిచెప్పిరి. దూరపు వాయిదా డిపోజిట్లను పుచ్చుకొనుటవలన హెచ్చు మొత్తము, చిట్టా నిలవయుంచుట అవ సరముండదు. సంఘముల కొసంగుఋణముల వాయిదాలు సామాన్య ముగ డిపోజిట్లను తీసికొనిన వాయిదాకంటె హెచ్చుగ నుండరాదు.

ఈ పట్టిక 1930-31 సంవత్సరమున సహకారసంఘములకు గల మూలధనము తెలుపుచున్నది.

| రాష్ట్రములు-సంస్థానములు. | రాష్ట్రీయ బ్యాంకులు | | సెంట్రలు బ్యాంకులు | | వ్యవసాయ సంఘములు | | వ్యవసాయేతర సంఘములు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తము (వేలలో) | వ్యాపార పు పెట్టుబడి లో 100 కి ఎంత? | మొత్తము (వేలలో) | వ్యాపార పు పెట్టుబడి లో 100 కి ఎంత? | మొత్తము (వేలలో) | వ్యాపార పు పెట్టుబడి లో 100 కి ఎంత? | మొత్తము (వేలలో) | వ్యాపార పు పెట్టుబడి లో 100 కి ఎంత? |
| మదరాసు | 1023 | 5.7 | 2302 | 3.7 | 5496 | 8.2 | 2436 | 7.3 |
| బొంబాయి | 652 | 4.3 | 608 | 1.9 | 6643 | 14.7 | 2586 | 5.3 |
| బెంగాలు | 558 | 2.8 | 3053 | 6.1 | 10806 | 18.3 | 2014 | 6.2 |
| బీహారు, ఒరిస్సాలు | 420 | 5.4 | 843 | 3.6 | 3224 | 13.3 | 334 | 8.8 |
| సంయుక్తరాష్ట్రములు | | | 1288 | 18.9 | 2691 | 25.7 | 310 | 12.2 |
| పంజాబు | 108 | 1.0 | 3726 | 5.2 | 18648 | 21.9 | 2610 | 18.8 |
| బర్మా ♦ | లభించలేదు. | | 638 | 12.4 | 5928 | 36.9 | 603 | 9.3 |
| మధ్యరాష్ట్రములు,బీరారు | 295 | 2.9 | 3141 | 11.7 | 3065 | 17.9 | 115 | 3.05 |
| అస్సాము | 18 | 4.5 | 127 | 5.2 | 708 | 22.8 | 166 | 7.3 |
| పశ్చిమోత్తరపరగణాలు | | | 7 | 1.3 | 27 | 5.0 | 9 | 3.3 |
| కూర్గు | | | 10 | 3.4 | 215 | 34.0 | 21 | 11.3 |
| అజ్మీరు,మార్వారా | | | 290 | 11.3 | 536 | 31.1 | 140 | 15.2 |

| రాష్ట్రములు:-సంస్థానములు | రాష్ట్రీయ బ్యాంకులు | | సెంట్రలు బ్యాంకులు | | వ్యవసాయ సంఘములు | | వ్యవసాయేతర సంఘములు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | మొత్తము (వేలలో) | వ్యాపార పుపెట్టుబడి లో 100 కి ఎంత? | మొత్తము (వేలలో) | వ్యాపార పుపెట్టుబడి లో 100 కి ఎంత? | మొత్తము (వేలలో) | వ్యాపార పుపెట్టుబడి లో 100 కి ఎంత? | మొత్తము (వేలలో) | వ్యాపార పుపెట్టుబడి లో 100 కి ఎంత? |
| హైదరాబాదునందలి బ్రిటిషుభాగము ♦ | | | | | | | 21 | 4.5 |
| డెల్హీ | | | 60.3 | 4.4 | 144 | 16.5 | 6.2 | 2.2 |
| మైసూరు | 404 | 7.7 | 24.0 | 12.0 | 888 | 17.3 | 1158 | 13.7 |
| బరోడా | | | 125.0 | 5.8 | 766 | 21.0 | 77 | 4.5 |
| హైదరాబాదు ♦ | 174 | 4.6 | 201 | 3.9 | 1468 | 19.2 | 216 | 8.9 |
| భూపాలు | | | 842 | 23.3 | 487 | 33.5 | 6 | 33.3 |
| గ్వాలియరు ♦ | | | 574 | 8.8 | 1149 | 55.2 | 82 | 54.2 |
| ఇందూరు ♦ | | | 227 | 10.5 | 910 | 41.1 | 53 | 8.4 |
| కాశ్మీరము ♦ | | | 192 | 5.5 | 1084 | 21.9 | 60 | 10.8 |
| తిరువాన్కూరు | | | 40 | 2.9 | 405 | 12.1 | 140.5 | 6.8 |
| కొచ్చిను | | | 37.6 | 5.8 | 163.9 | 21.2 | 81.2 | 11.4 |
| పుదుక్కోట ♦ | | | 12.0 | 2.2 | 69 | 12.3 | 66. | 9.0 |

♦ ఈగుఱుతున కెదురుగ వేయబడిన అంకెలు 1929-30 వ సంవత్సరము తాలూకు.

ఋణములు. సెంట్రలు బ్యాంకులు ఇతర సెంట్రలు బ్యాంకులనుండియు ప్రభుత్వమువారివద్దనుండియు, రాష్ట్రబ్యాంకునుండియు ఋణములను తీసికొనుచున్నవి. బ్రిటిషు ఇండియాయందలి సెంట్రలుబ్యాంకులు తాము స్వయముగ ప్రభుత్వమువారినుండి ఋణమును గైకొనవు. పంజాబునందు ప్రభుత్వమువారినుండియే ఋణములను సెంట్రలుబ్యాంకులు తీసికొనును. మైసూరునందు తప్ప, ఇతర స్వదేశసంస్థానములలో సెంట్రలుబ్యాంకులు ప్రభుత్వములనుండియే ఋణములను గైకొనును. రాష్ట్రబ్యాంకులనుండియే ముఖ్యముగ, సెంట్రలుబ్యాంకులు ఋణములు దీసికొనుచున్నవి.

పెట్టుబడిని వినియోగించుట. సెంట్రలు బ్యాంకులు వ్యక్తులగుసభ్యులు గూడ ఋణమొసంగుచున్నవి. ఈపద్ధతి విరమింపబడవలెను. చాలవఱకు తగ్గినది. సెంట్రలుబ్యాంకులు పరపతి సంఘములకొఱకై పుట్టి బ్రతుకుచున్నవను మాటను మరువరాదు. సెంట్రలు బ్యాంకులు వ్యక్తులకుగాని, సంఘములకుగాని, ప్రామిసరీ నోటుమీద ఋణము నొసంగును. సెంట్రలు బ్యాంకులనుండి తీసికొను ఋణమునకు సంఘముల సమిష్టిబాధ్యత గలదు. సంఘముల యొక్కయు, సంఘసభ్యుల యొక్కయు, ఆస్తి అప్పుల పట్టికల ననుసరించి ఆయాసంఘముల కొసంగదగిన రుణమొత్తము నిర్ణయింప బడుచుండును. సంఘముల ఆస్తి విలువలో మూడవవంతు ఋణముగ నీయదగిన మొత్తముగ పరిగణింపబడుచున్నది. అప్పులకు 1 సంవత్సరము మొదలు 5 సంవత్సరముల వఱకు వివిధ రాష్ట్రములయందు వాయిదాలు గలవు. ఋణముల నిచ్చుటయందు ఆస్తులవిలువను గట్టుటలో జాగరూకత వహింపవలయును. 1930 వ సంవత్సరమునుంచియు ప్రారంభింపబడిన ఆర్థికదుస్థితివలన ధరలు పడిపోయినవి. ఇంతకుపూర్వము గట్టిన కిమ్మ

తులు నేడులేవు. నేటి కిమ్మతుల ననుసరించి, ఆస్తులను పుచ్చుకొనుటకైనను ఋణము దీసికొనినవాని ఆస్తి తణకాలయందుండినయెడల వీలు గలుగదు. లేక ఆతడు దివాళాతీసినను బ్యాంకులు నష్టపడవలసియే యున్నది. ఈ కారణములవలన నష్టము సంభవించుచునే యున్నది. సంఘసభ్యులకు గల ఋణమునంతయు, సంఘములే దీర్చి ఆతని ఆస్తి సంఘములకే తణఖాయుండు పద్ధతిలేనియెడల, 1930 సంవత్సరమునుంచియు సంభవించుచుండిన ప్రమాదముల నెదుర్కొనుటకు వీలులేదు. కాని సభ్యుల రుణమునంతను సంఘములు తీర్చివేయ జాలవు. అందువలన, రుణములేని రైతునకు వ్యవసాయపు పెట్టుబడికి మాత్రమే పరపతి సంఘములు ఋణముల నొసంగుట కర్తవ్య మగును. కాని ఋణము లేని రైతు లరుదు. ఈకారణములవలన రైతులఋణము నంతయు నేదోవిధముగ మొట్టమొదట తీర్చివేసిన గాని సహకార పరపతి సంఘముల పెట్టుబడికి జాగ్రతలేదు. సహకారపరపతి రైతుల కుపయోగము గాదు.

వడ్డీరేట్లు.

సెంట్రిలు బ్యాంకులు, సంఘముల కొసంగు చుండిన అప్పులపై 100 కి 7-8-0 మొదలు రు12-8-0 వఱకు వడ్డీలను వసూలు చేయుచున్నవి. ఈవడ్డీరేటు విశేషముగ పెట్టుబడి లభించుచుండిన కాలమునందుగూడ తగ్గింపబడుటలేదు. సెంట్రిలు బ్యాంకులు పుచ్చుకొను ఋణమున కొసంగువడ్డీకిని సంఘము లిచ్చు వడ్డీకిని సుమారు 100కి సాలుసరి రు 2 మొదలు రు 5 ల వఱకు వివిధ రాష్ట్రములయందు వ్యత్యాసము కలదు. బీహారు ఒరిస్సాల యందు, సంయుక్త రాష్ట్రములయందు, మధ్యరాష్ట్రములయందు, గ్వాలియరునందు, 100 కి సాలుసరి రు 4 మొదలు రు 5 ల వఱకు పుచ్చుకొను వడ్డీకిని యిచ్చెడి వడ్డీకిని వ్యత్యాసము కలదు. ఇతర రాష్ట్రముల యందు 100 కి రు 2 మొదలు 3 వఱకు మాత్రమే వ్యత్యాసముకలదు.

ఈదిగువపట్టికవలన సెంట్రలుబ్యాంకులు పుచ్చుకొను ఋణము మీాదను ఇతరులకిచ్చు ఋణముమీాదను వసూలుచేయుచుండిన వడ్డీ రేట్లు తెలియగలవు. (1931-32 వ సంవత్సరమున)

| రాష్ట్రములు-సంస్థానములు | చేసిన ఋణముపైగల వడ్డీ రు. 100 కి | ఇచ్చిన ఋణముపైగల వడ్డీ రు. 100 కి |
|---|---|---|
| మదరాసు | 2 మొదలు 7 వఱకు | 7 1/2 |
| బొంబాయి | 2 ,, 6 ,, | 8 |
| బెంగాలు | 3 ,, 8 ,, | 9 3/8-10 15/16 |
| బీహారు, ఒరిస్సాలు | 4 ,, 7 ,, | 12 1/2 |
| సంయుక్తరాష్ట్రములు | 6 | 12 |
| పంజాబు | | |
| బర్మా | 9 | 10 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 2 ,, 9 | 10 |
| అస్సాము | 8 1/2 | 10 1/2 |
| పశ్చిమోత్తర పరగణాలు | 6 1/2 | 9 |
| అజ్మీరు, మార్వారా | 5 ,, 6 1/2 | 9 |
| ఢిల్లీ | 2 1/2 8 | 9 |
| కూర్గు | 5 ,, 6 1/4 | 7 13/16- 7 1/4 |
| మైసూరు | 3 1/2 8 1/2 | |
| బరోడా | 4 ,, 6 ,, | 7- 7 1/2 |
| హైదరాబాదు | 7 1/2 | 10 |
| భూపాలు | 3 1/2 | 10 |
| గ్వాలియరు | 6 | 12 |
| ఇందూరు | 6 | 9 |
| కాశ్మీరు | | |
| తిరువాన్కూరు | 5 6 1/2 | 7 1/2- 8 3/4 |
| కొచ్చిను | 2 1/4 6 | 6 9 |

(*From Statistical Statements Co-operativement 1931—32.*)

ఈ హెచ్చువడ్డీలను తగ్గించివేయవలెను. భూమిమీదవచ్చు ఆదాయముకంటె 100 కి వడ్డీరేటు హెచ్చుగ నుండరాదు. నగదు రూపముగగాని, భూరూపముగగాని, ఏవిధముగ నున్నను రాబడి సమానముగ నున్నయెడల విశేషపుపెట్టుబడి లభించగలదు. సహకార సంఘము లైనను తమవడ్డీరేట్లను 100 కి రు 3 లకు తగ్గించి వేసిన యెడల ఉద్యమవ్యాప్తి యగును. రైతులకు గొంతవఱకు మేలుకలుగును. వడ్డీరేట్లు షావుకారుల రేటుకంటె చాలతక్కువగ లేకపోవుట వలన నుద్యమము వ్యాప్తియగుటలేదు.

ఈదిగువపట్టికవలన వివిధసంఘములు ఇచ్చిపుచ్చుకొను వడ్డీరేట్లు తెలియుచున్నవి.

సంవత్సర నివేదిక.

సెంట్రలు బ్యాంకులు ప్రభుత్వమువారి ఆడిటరులచే తణిఖీ చేయబడుచున్నవి. ఈ తణిఖీదారులు రిజిస్ట్రారు గారిక్రింద పనిచేయుచుందురు. లెక్కలను పరీక్షించుటయే గాక బ్యాంకుల ఆస్తి అప్పులనుగూడ పరీక్షించుచుందురు. ఈపరీక్షా ఫలితములను బ్యాంకులు సంవత్సరాంతమున ప్రకటించుచుండును.

# 27. రాష్ట్రీయ బ్యాంకులు.

సెంట్రలు బ్యాంకులకు ఋణము నిచ్చుటకును సెంట్రలు బ్యాంకుల సొమ్మును దాచుటకును రాష్ట్రీయ బ్యాంకులు పనిచేయుచున్నవి. మదరాసు, బొంబాయి, బెంగాలు, బీహారు, ఒరిస్సా, పంజాబు, బర్మా, మధ్య రాష్ట్రములు, బేరారు, అస్సాము రాష్ట్రములలో రాష్ట్రీయ బ్యాంకులు గలవు. సంయుక్తరాష్ట్రమున స్థాపింపవలయునని బ్యాంకింగు విచారణ సంఘమువారు వ్రాసిరి. సెంట్రలు బ్యాంకుల

వడ్డీ.

| | ప్రాథమిక సంఘములు, వ్యవసాయదారుల యొద్ద పుచ్చుకొను వడ్డీ % 100 కి ఎంత? | ప్రాథమిక సంఘములు | | సెంట్రల్ బ్యాంకులు | | రాష్ట్రపు బ్యాంకులు | |
|---|---|---|---|---|---|---|---|
| | | ఇతరులు దాచుకొన్న సొమ్ము మీద వడ్డీ % 100 కి ఎంత? | సెంట్రలుబ్యాంకులకిచ్చు కొనుచున్న వడ్డీ % 100 కి ఎంత? | ఇతరులు దాచుకొన్న సొమ్ము మీద వడ్డీ % 100 కి ఎంత? | రాష్ట్రపుబ్యాంకులకు ఇచ్చుకొనుచున్న వడ్డీ % 100 కి ఎంత? | ఇతరులు దాచుకొన్న సొమ్ముమీద వడ్డీ % 100 కి ఎంత? | ఇంపీరియల్ బ్యాంకున కివ్వవలసిన వడ్డీ % 100 కి ఎంత? |
| అజ్మీరు, మార్వారా | సాధారణముగ 9 to 12 | 4- 8 | 6- 9 | 1 1/2 to 7 1/2 | | | |
| అస్సామ్ | 15 5/8 లేక 18 3/4 (అస్సాములో పాత సంఘములకు సాధారణముగ 12 1/2) | 8 | ,, | 8 | 8 1/2 | 7 1/2 | 7 |
| బంగాళము | 7 1/2 15 5/8 | 4 11/16 9 3/8 | 9 3/8 12 1/2 | 2 8 1/4 | 7- 8 | 4- 6 1/2 | బ్యాంకు రేటు. |
| బీహారు, ఒరిస్సా | 12 1/2 15 3/8 | 7- 9 | 10 1/2 12 1/2 | 4 1/2 6 | 6 | 2- 5 | బ్యాంకు రేటు. |
| బొంబాయి | 9 3/8 12 1/2 | 2- 8 | 6- 8 | 1 1/2 7 1/4 | 5 1/2 8 | 2- 4 1/2 | బొంబాయిలో ఇంపీరియల్ బ్యాంకునుండి యివ్వబడుట లేదు. |

| | ప్రాథమిక సంఘములు | ప్రాథమిక సంఘములు | | సెంట్రల్ బ్యాంకులు | | రాష్ట్రపు బ్యాంకులు | |
|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయదారుల యొక్క పుచ్చుకొన్న వడ్డీ % 100 కి ఎంత? | ఇతరులు దాచుకొన్న సొమ్ము మీద వడ్డీ % 100 కి ఎంత? | సెంట్రలు బ్యాంకులకిచ్చుకొనుచున్న వడ్డీ % 100 కి ఎంత? | ఇతరులు దాచుకొన్న సొమ్ము మీద వడ్డీ % 100 కి ఎంత? | రాష్ట్రపు బ్యాంకులకు ఇచ్చుకొనుచున్న వడ్డీ % 100 కి ఎంత? | ఇతరులు దాచుకొన్న సొమ్ము మీద వడ్డీ % 100 కి ఎంత? | ఇంపీరియల్ బ్యాంకున కివ్వవలసినవడ్డీ % 100 కి ఎంత? |
| బర్మా | 15 | 6– 12 | 10 | 6– 9 | 10 | 5– 7 1/2 | |
| మధ్యరాష్ట్రములు | సాధారణముగ 12 | 8– 10 | 9– 10 | 8– 7 | 6– 6 1/2 | 2– 3 1/4 | 7 |
| ఢిల్లీ | | 6– 7 | 8– 9 | 4– 6 1/2 | | | |
| మదరాసు | 9 3/8 10 15/16 | 8– 6 1/2 | 7 1/2– 8 | 2– 5 1/2 | 6– 6 1/2 | 2– 4 1/2 | 6 1/2 అదనముగ తీసికొనుట. |
| పశ్చిమోత్తరపరగణాలు | | 6– 7 | 8 | 4 1/2 7 1/2 | | | |
| పంజాబు | 9 3/8 12 1/2 | 6– 7 | 8– 9 | 5– 6 1/2 | 6 1/2 | 3 1/2– 5 1/2 | బ్యాంకు రేటు. |
| సంయుక్తరాష్ట్రములు | 15 | 9 | 12 | 6– 7 | | | |

Banking Enquiry Committee Vol. I. Page. 129.

వలెనే రాష్ట్రీయ బ్యాంకులుకూడ, భాగ్యవంతుల పెట్టుబడిమీద నాధారపడి యున్నవి.

· వివిధ రాష్ట్రములయందలి రాష్ట్రీయబ్యాంకుల పరిపాలనా ప్రణాళిక వివిధరీతులుగ నున్నది. కాని రాష్ట్రీయ బ్యాంకుల కార్య క్రమమంతయు నొక్కరీతిగనే యున్నది. మైసూరు, హైదరాబాదు, రాజ్యములయందుగూడ రాష్ట్రీయ బ్యాంకులు గలవు. ఇతర సంస్థాన ములయందు రాష్ట్రీయబ్యాంకులు లేకపోయినను, రాష్ట్రీయ బ్యాంకుల వంటివి కలవు. పని చేయుచున్నవి. సెంట్రలు బ్యాంకుల వలెనే సాధారణసభయందు డైరెక్టరులయందునుగూడ వ్యక్తులును, సహకార సంఘముల ప్రతినిధులును, సెంట్రలు బ్యాంకుల ప్రతినిధులును, సభ్యు లుగ నున్నారు. మదరాసు, బొంబాయి, బర్మా రాష్ట్రీయ బ్యాంకు లలో వ్యక్తులును సంఘములును గూడ సభ్యులుగ నున్నారు. మొట్ట మొదటగ నీబ్యాంకులు వ్యక్తి సభ్యత్వముపైననే పనిజేసెను. పం జాబు, బెంగాలు బ్యాంకులయందు వ్యక్తులకు వాటాలు లేవు.

ప్రాథమికసంఘములకును సెంట్రలు బ్యాంకులకును మాత్రమే సభ్యత్వము కలదు. ఇతర రాష్ట్రముల యందలి బ్యాంకులలో వ్యక్తు లును సంఘములును గూడ సభ్యులుగ నున్నారు. పంజాబు బ్యాంకు, డైరెక్టరులలో నొక డైరెక్టరుగ,రిజిష్ట్రారును గైకొనుచున్నది. బెంగాలు బ్యాంకు, రాష్ట్రమునందలి ముఖ్యవర్ ప్రముఖులను డైరెక్టరులుగ గైకొనుచున్నది. మదరాసు బర్మాలయందు, ప్రాథమిక సంఘముల ప్రతినిధులకు స్థానము లేదు. హైదరాబాదు, మైసూరు, బ్యాంకులలో సెంట్రలు బ్యాంకులకు స్థానములేదు.

| రాష్ట్రము | వ్యక్తి డైరెక్టరులు | సంఘముల డైరెక్టరులు |
|---|---|---|
| బొంబాయి | 7 | 7 |
| మదరాసు | 5 | 31 |
| బీహారు,ఒరిస్సాలు | 6 (రిజిస్ట్రారు కలిసి) | 14 |
| హైదరాబాదు | 18 ,, | 8 |
| మైసూరు | 5 | 8 |

ప్రతిరాష్ట్రమునందున వ్యక్తులకు రాష్ట్రీయపు బ్యాంకులలో స్థానముండరాదు. సహకార సంఘములే పరిపాలించుకొనవలయును.

628 వ పుటలోని పట్టిక, రాష్ట్రీయపు బ్యాంకుల పెట్టుబడి వివరములను దెలుపగలదు.

మదరాసు, బొంబాయి, పంజాబు, రాష్ట్రీయబ్యాంకులు దూరపువాయిదా డిబెంచర్లనొసంగుచుండెను. బొంబాయిబ్యాంకు రు 9-8 లక్షులవిలువగల డిబెంచర్లను ప్రకటించెను. వీటికి బొంబాయి ప్రభుత్వము హామీనొసంగెను. (Trustee Security) మదరాసుబ్యాంకు రు 2-18 లక్షుల విలువగల డిబెంచర్లను ప్రకటించెను. ఈడిబెంచర్లకు బ్యాంకుయొక్క ఆస్తియే హామీ. పంజాబుబ్యాంకు రు 5 లక్షుల డిబెంచర్లను ప్రకటించెను. బొంబాయిబ్యాంకు, యితరరాష్ట్రీయ బ్యాంకులకుగూడ నప్పుల నిచ్చుచున్నది. మదరాసుబ్యాంకు బెంగాలు రాష్ట్రీయపుబ్యాంకునకు ఋణ మొసంగెను. రాష్ట్రీయబ్యాంకులను ప్రభుత్వమువారే రిజిష్ట్రారుగారిద్వారా తణిఖీ చేయించవలెను. కాని రిజిష్ట్రారుపరీక్షులయం దుత్తీర్ణులైన ఆడిటరులచే తణిఖీ చేయించు చుండెను. తణిఖీఫలితములను, ఆదాయవ్యయములను, లాభనష్టములను, సంవత్సరాంతమునందు లేక సంవత్సరమునకు రెండుపర్యాయములు బ్యాంకులు ప్రకటించుచుండును.

రాష్ట్రీయ బ్యాంకులు

| | సభ్యులు | | వేలు. | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | వ్యక్తులు | సంఘములు | పెట్టుబడి మూల ధనము | డెబెంచర్లు | డిపాజిట్లు | అప్పులు | మొత్తపు వ్యాపారపు పెట్టుబడి |
| | | | రు. | రు. | రు. | రు. | రు. |
| అజ్మీరు, మార్వారా | రాష్ట్రీయ బ్యాంకులు లేవు. | | | | | | |
| అస్సాము | 31 | 35 | 99 | ... | 237 | 12 | 348 |
| బంగాళము | ... | 168 | 2078 | ... | 16325 | ... | 18403 |
| బీహారు, ఒరిస్సా | 29 | 79 | 933 | ... | 6380 | 38 | 7351 |
| బొంబాయి | 808 | 1632 | 1883 | 980 | 12051 | 66 | 14980 |
| బర్మా | 188 | 1648 | 5841 | ... | 2729 | ... | 8570 |
| మధ్యరాష్ట్రములు | 40 | 2499 | 1048 | ... | 9599 | ... | 10647 |
| ఢిల్లీ | ... | రాష్ట్రీయ బ్యాంకులు లేవు. | | | | | |
| మదరాసు | 184 | 58 | 1581 | 215 | 7587 | 8548 | 17926 |
| పశ్చిమోత్తర పరగణాలు | రాష్ట్రీయ బ్యాంకులు లేవు. | | | | | | |
| పంజాబు | | 13008 | 1091 | 500 | 6313 | 1674 | 9578 |
| సంయుక్తరాష్ట్రములు | రాష్ట్రీయ బ్యాంకు లేదు. | | | | | | |
| మొత్తము | 1280 | 19127 | 14554 | 1695 | 61221 | 10333 | 87803 |

*Indian Central Banking Enq. Committee P. 116.*

ఈ దిగువపట్టిక రాష్ట్రీయపు బ్యాంకుల డిపాజిట్లను గురించిన వివరములను, అప్పుల నిచ్చుచున్న వాయిదాలను తెలుపగలదు.

| బ్యాంకుపేరు | డిపాజిట్లు | | డిపాజిట్లు ఉంచు వాయిదా | | అప్పుల కిచ్చిన వాయిదా | |
|---|---|---|---|---|---|---|
| | సహకార సంఘములనుండి లక్షలు | వ్యక్తుల నుండి లక్షలు | గరిష్టము సంవత్సరములు | కనిష్టము నెలలు | గరిష్టము సంవత్సరములు | కనిష్టము సంవత్సరములు |
| మధ్యరాష్ట్రములు, బీరారు కోఆపరేటీవు బ్యాంకు | 48.75 | 23.40 | 5 | 9 | 5 | 1 |
| | 2.82 | 2.62 | | | | |
| | 1.10 | 1.87 | | | | |
| మైసూరు కోఆపరేటీవు ఎపిక్సు బ్యాంకు | 7.87 | | 10 | 6 | 15 | 10 |
| హైదరాబాదు కోఆపరేటీవు బ్యాంకు | 0,92 | 25.78 | 2 | 12 | 3 | 1 1/2 |
| బెంగాలు ప్రోవిన్షియల్ కోఆపరేటీవు బ్యాంకు | 119 (మొత్తము) | | 3 | 12 | 3 (10 ప్రత్యేక సందర్భములలో) | |
| బొంబాయి కోఆపరేటీవు బ్యాంకు | 55.56 | 34. 22 | 5 | 1 | 10 | 1/2 |
| బీహారు, ఒరిస్సా కోఆపరేటీవు బ్యాంకు | 5 | 41.71 | 2 | 12 | 4 | |
| | 1.52 | 7.75 | | | | |
| పంజాబు కోఆపరేటీవు బ్యాంకు | 60.22 | 2.83 | 5 | 1 | 10 | 1 |
| మదరాసు సెంట్రలు అర్బను బ్యాంకు | 25.18 | 51.05 | 2 | 8 | 5 | 1 |

ఈ బ్యాంకు లన్నియు రాష్ట్రీయపు బ్యాంకులు.

*From Co-operation in India P. 69.*

# 28. అఖిలభారత సహకారబ్యాంకు

రాష్ట్రీయబ్యాంకుల కన్నింటికిని, సహాయకారిగ నుండునట్లుగ అన్ని రాష్ట్రీయ బ్యాంకులును గలిసిన ఒకఅఖిలభారత సహకార బ్యాంకును స్థాపింపవలయునని మెక్లాగను కమిటీవారు సూచించిరి.[1] నేటివఱకును స్థాపింపబడలేదు. అఖిలభారతసహకార రాష్ట్రీయ బ్యాంకుల సంఘమును గొలది సంవత్సరములక్రింద నుద్యోగేతరులు స్థాపించుకొనిరి. ఈసంఘము రెండేండ్ల కొకపర్యాయము సమావేశ మగుచున్నది. ఈసంఘమువారు సహకారోద్యమమునకు సంబంధించిన వివిధవిషయములను దర్కించెదరు

# 29. రిజర్వు బ్యాంకు-సహకారోద్యమము.

దారిలేక నట్టనడి సముద్రమునందు మునుగుచు దేలుచు నుండిన భారతీయార్థికనౌకకు రిజర్వుబ్యాంకు చుక్కానిగ నుండగలదని పలువు రాశించుచున్నారు. భారతీ యార్థికాభివృద్ధికి మూలమగు వ్యవసాయ మునకు వలయు పెట్టుబడిని రిజర్వుబ్యాంకు లభింప జేయజాలనియెడల రిజర్వుబ్యాంకు నిష్ఫలమే యగును. వ్యవసాయాభివృద్ధికై కృషిసలుపు చుండిన సహకారోద్యమమునకు రిజర్వుబ్యాంకు నందర్హస్థానము లభింపకపోయినయెడల రిజర్వుబ్యాంకు నిరర్థక మగుట నిశ్చయము. రిజర్వుబ్యాంకు స్థాపింపబడిన పిమ్మట గలుగు వ్యవసాయాభివృద్ధి ననుస రించియే రిజర్వుబ్యాంకుయొక్క జయాపజయముల గణింప దగును. 1927-28 వ సంవత్సరమునం దుపపాదింపబడి, రిజర్వు బ్యాంకుబిల్లు విర మింపబడిన పిమ్మట నియమింపబడిన బ్యాంకింగు విచారణసంఘములు

---

1- *See Report Paras 219—20.*

వ్యవసాయార్థిక స్థితిగతులను గురించి వివిధములగు సూచనల గావించెను. కాని ఫలిత మేమి? రిజర్వుబ్యాంకును స్థాపించుటకై యోచింప లండను నగరమేగిన ఇండియా ప్రభుత్వమువారి అతిథులు గాని, పిమ్మట ఇండియా ప్రభుత్వమువారు గాని బ్యాంకింగు విచారణసంఘముల సూచనలను గమనింపలేదు. సహకారోద్యమమును రిజర్వుబ్యాంకు వ్యవహారములలో నొకశాఖగ పరిగణింప నిరాకరించిరి. 1927 వ సంవత్సరపు రిజర్వుబ్యాంకు బిల్లునందు సహకారపు బ్యాంకులు భారతదేశమునందు గలవనియైన గుర్తింపలేదు. రిజర్వుబ్యాంకు వ్యవహరించు బ్యాంకుల జాబితాలో సహకార బ్యాంకులను జేర్పలేదు. ప్రభుత్వచర్యపై సహకారవాదులు గినిసిరి. ఆందోళన జేసిరి. పిమ్మట రాష్ట్రీయబ్యాంకులను రిజర్వుబ్యాంకు వ్యవహరించు జాబితాయందు జేర్చిరి. రాష్ట్రీయ బ్యాంకులు వ్యవసాయపు పనులకై పెట్టు పెట్టుబడి పత్రములను రిజర్వు బ్యాంకు పుచ్చుకొనుటకు సదుపాయములను గలిగించిరి.

ఈసదుపాయములు అసంతృప్తికరముగనున్నవి. 1933 వ సంవత్సరపు రిజర్వు బ్యాంకుబిల్లునందైనను వ్యవసాయార్థికముపట్ల సంతృప్తికరమగు మార్పుల నొనరింపలేదు. (See Mr. Ramadas Pantulu's Memorandum to the Reserve Bank Committee) రిజర్వుబ్యాంకు కమిటీవిచారణయందును పిమ్మట శాసనసభయందును ప్రజాప్రతినిధులగు కొందఱు శాసనసభ్యులు ప్రభుత్వ నిష్క్రియమును తీవ్రముగ విమర్శించిరి. భారత శాసనసభయందు రిజర్వుబ్యాంకు బిల్లునకు శీతారామరాజుగారు సవరణ నుపపాదించిరి. రిజర్వుబ్యాంకు స్థాపింపబడిన రెండు సంవత్సరములలోపుగ వ్యవసాయమునకును, సహకార శాఖకును సంబంధించి శాఖను స్థాపించవలెనని వీరి సవరణ. ఎట్టకేలకు ప్రభుత్వమువారే వీరి సవరణను సవరించుచు మూల సూత్రమును మాత్రమంగీ

కరించిరి. ప్రభుత్వమువా రంగీకరించిన సవరణ ననుసరించి వ్యవసాయదారుల పరపతికి సంబంధించి రిజర్వుబ్యాంకులో నొకశాఖను స్థాపించెదరు. కేంద్రరాష్ట్ర ప్రభుత్వములు వ్యవసాయదారుల పరపతికి సంబంధించిన సమస్యలపై వీరితో సంప్రదించుచుండెదరు. రాష్ట్రీయ సహకారబ్యాంకుల వ్యాపారముతో రిజర్వుబ్యాంకు వ్యాపారమును సమ్మేళన మొనరించెదరు. రిజర్వుబ్యాంకుయొక్క వ్యాపార మంతయు, సహకార బ్యాంకులమూలమున జేయబడు కాలము వచ్చిననాడే రిజర్వు బ్యాంకు వ్యవసాయాభివృద్ధికి బూర్తిగ దోడ్పడగలదు.

# 30. సహకారోద్యమము-ప్రభుత్వశాఖ.

రిజర్వుబ్యాంకునకు శాఖలుగ రాష్ట్రీయ సహకారబ్యాంకులును, వాటికి శాఖలుగ సెంట్రలుబ్యాంకలును, వీటికి శాఖలుగ ప్రాథమికసంఘములును, స్వయముగ బనిజేయగలిగినపుడే సహకారోద్యమము శాఖోపశాఖలై చిగురించి పుష్పించి ఫలింపగలదు. సహకారసంఘముల వ్యవహారములపై రాష్ట్రబ్యాంకు వారే సమస్తాధికారములను గలిగియుండవలెను. ప్రభుత్వమువారి సహకారశాఖ సహకారోద్యమమునకు ప్రతిబంధకముగ నున్నది. ప్రభుత్వయంత్రమును నడుపుదృష్టితో సహకారోద్యమమును నడిపినయెడల సహకారోద్యమ మెన్నటికిని వికసింపదు. సహకారశాఖపై ప్రభుత్వమువారు వినియోగించుచుండిన ధనమును రాష్ట్రీయబ్యాంకులకు విరాళముగ నొసంగదగును. నేడుప్రభుత్వశాఖ చేయుచున్న పనులన్నియు, రాష్ట్రీయ బ్యాంకులు నిర్వహింపగలవు.

సహకారశాఖను శాశ్వతముగ నుంచవలెనని మొదటినుండియు ప్రభుత్వమువారు సంకల్పింపలేదు. క్రమక్రమముగ నీశాఖవారి యధికారమును దొలగించుటయే ప్రభుత్వోద్దేశము. కాని ఆచరణయందు రాను రాను సహకార ప్రభుత్వశాఖవారి యధికారములను హెచ్చించిరి. సహకారశాఖ రిజిష్ట్రారుగారు సర్వాధికారిగ వర్తించుచున్నారు. సంఘములను రిజిష్టరు చేయుటమాత్రమే చేయవలసిన రిజిష్ట్రారు, సంఘములపై నిరంకుశాధికారము వహించి చెలాయించుచున్నాడు. సంఘములను బెట్టుటకు, దీసివేయుటకు, వడ్డీరేట్ల నామోదించుటకు, తణిఖీ చేయించుటకు, మొదలగు కృత్యముల కన్నింటికి రిజిష్ట్రారుగారికే పెత్తనము కలదు.

ప్రభుత్వమువారి సహకార శాఖోద్యోగుల సవతితల్లిప్రేమనుండి సహకారోద్యమము సంరక్షింపబడినగాని సహకారోద్యమము సజీవముగ నుండజాలదు. ఈ శాఖ నెత్తివేయవలయును. ఈశాఖకు నేడుగల అధికారములను రాష్ట్రీయ బ్యాంకులకును, సెంట్రలు బ్యాంకులకును సంక్రమింప జేయవలయును. రాష్ట్రీయ ప్రభుత్వములయందలి మంత్రులకును రిజర్వుబ్యాంకునకును, లోబడి రాష్ట్రీయ బ్యాంకులు పనిచేయదగును. ప్రభుత్వము, బ్యాంకులకు పరిపాలనయందు సంపూర్ణస్వాతంత్ర్య మొసంగవలెను—బాధ్యతాయుత రాష్ట్రప్రభుత్వములైనను సహకారశాఖపై నిరంకుశాధికారము గలిగి యుండరాదు. ఈదిగువపట్టిక సహకారశాఖపై ప్రభుత్వమువారు వెచ్చించుచున్న మొత్తమును దెలుపగలదు.

1930-31 సంవత్సరమున వివిధరాష్ట్రములయందు సహకార శాఖలపై వెచ్చింపబడిన మొత్తముల నీపట్టిక దెలుపుచున్నది.

| రాష్ట్రములు సంస్థానములు | ఖర్చు వేలలో రు. | 1000 సంఘముల 1కి ఖర్చు వేలలో రు. | 1000 చ\|\| మై 1కి ఖర్చు వేలలో రు. | రు. 1000 వ్యాపార పుపెట్టుబడి కినిగల ఖర్చు | సభ్యుని 1కి గల ఖర్చు రు. |
|---|---|---|---|---|---|
| మదరాసు | 1159 | 77.3 | 8.2 | 0.6 | 1.2 |
| బొంబాయి | 571 | 97.5 | 4.5 | 0.4 | 0.9 |
| బీహారు, ఒరిస్సాలు | 367 | 40.1 | 4.4 | 13.1 | 1.4 |
| సంయుక్తరాష్ట్రములు | 477 | 85.9 | 4.4 | 21.3 | 3.2 |
| పంజాబు | 1291 | 62.3 | 10.8 | 7.1 | 1.7 |
| మధ్యరాష్ట్రములు, బీరారు | 250 | 62.5 | 2.4 | 4.8 | 3.1 |
| కూర్గు ♦ | 4 | 16.1 | 2.5 | 4.4 | 0.3 |
| అజ్మీరు మార్వారా | 39 | 60.7 | 14.4 | 14.7 | 2.0 |
| ఢిల్లీ | 12 | 43.1 | 20.2 | 4.7 | 1.4 |
| మైసూరు | 165 | 82.0 | 5.6 | 12.2 | 1.2 |
| బరోడా ♦ | 46 | 43.8 | 5.6 | 8.5 | 1.2 |
| హైదరాబాదు ♦ | 319 | 156.1 | 3.0 | 17.3 | 5.7 |
| భూపాలు | 16 | 14.5 | 2.4 | 11.5 | 0.8 |
| గ్వాలియరు † | 122 | 33.5 | 4.6 | 14.6 | 1.9 |
| తిరువాన్కూరు | 58 | 32 4 | 7.5 | 10.3 | 0.3 |
| కొచ్చిను | 22 | 95 | 15.1 | 10.5 | 0.9 |
| పుదుకోట ♦ | 7 | 47.0 | 5.9 | 3.8 | 0.4 |

♦ ఈ అంకెలు 1929-30 సంవత్సరము తాలూకు.

† ఈ అంకెలు 1928-29 సంవత్సరము తాలూకు.

*From Co-operation in India.*

# 31. మదరాసురాజధాని-సహకారోద్యమస్థితి.

ఈ దిగువ పట్టికలవలన 1931-32 వ సంవత్సరమున మదరాసు రాజధానియందలి సహకారోద్యమవ్యాప్తిని దెలిసికొనగలము.

| | |
|---|---|
| వ్యవసాయ సంఘములు | 12568 |
| వీనియందుగల క్రియ విక్రియ సంఘములు | 89 |
| ప్రాథమిక పరపతి సంఘములు | 12080 |
| ఇతర సంఘములు | 394 |
| ఈసంఘముల సభ్యులు | 675448 |
| ఈసంఘములు, సంఘసభ్యులకు 97 లక్షల 43 వేల రూపాయలు ఋణ మొసంగెను. | |
| పరపతి సంఘములయందునను | 12080 |
| పని ప్రారంభింపలేదు | 81 |
| పరిమితి బాధ్యతగల సంఘములు | 64 |
| భూమి తనఖా బ్యాంకులు | 38 |
| ధాన్యపు బ్యాంకులు | 15 |
| విత్తుల సంఘములు | 8 |
| వ్యవసాయ బ్యాంకులు | 3 |
| క్రియవిక్రియ సంఘములలోను | 89 |
| పరపతి విక్రియ సంఘములు | 50 |
| వ్యాపార సమితులు | 19 |
| వ్యవసాయాభివృద్ధి సంఘములు | 3 |
| వస్తునిలయములు | 3 |
| వివిధములగు సంఘములు | 14 |

ఈ సంఘములు రు. 198424 ల విలువగల సరకులను కొనెను. రు. 1158012ల విలువగల సరకుల నమ్మెను. ఉత్పత్తిమాత్రమే చేయు సంఘములు లేవు. ఈ వ్యాపారము చాలవఱకు మధురజిల్లా యందలి ఏలకుల సంఘము లొనరించెను. ఇతర సంఘములు, ధాన్యము, రాగి, కొఱ్ఱ, వేరుశెనగ, పత్తి, మిరపకాయ, బెల్లము, జొన్న, పొగాకు మొదలగు సరకులను పట్టుబడి చేసెను.

చెంగల్పట్టు జిల్లాయందు ఉత్పత్తి విక్రియ సంఘములు కలవు.

| | |
|---|---|
| పాలసరఫరా సంఘములు | 18 |
| కోడిగుడ్ల సంఘములు | 1 |
| పారిశ్రామిక కృషిసంఘములు | 8 |
| పశువుల భీమాసంఘములు | 8 |
| ఇతరవిధములగు సంఘములలోను | 370 |
| భూమి మరమ్మతు సంఘములు 1 మాత్రమే ఆంధ్రదేశమున కృష్ణాజిల్లాలో గలదు. | 11 |
| కృషి ప్రదర్శక సంఘములు, ఆంధ్రమున లేవు. | 10 |
| భూమిని కలుపుకొను సంఘములు. ఆంధ్రమున లేవు. | 12 |
| కార్మికవృత్తి సంఘములు | 2 |
| భూస్వాముల కౌళ్ళ సంఘములు | 12 |
| మధ్యవర్తిసంఘములు | 1 |
| రైతులు కూలీలు సంఘములు | 808 |
| వ్యవసాయాభివృద్ధి సంఘములు | 14 |
| క్రయవిక్రయోత్పత్తి సంఘములు | 211 |
| వస్తునిలయములు, వ్యాపారసమితులు | 62 |
| కళాశాలల, పాఠశాలల వస్తునిలయములు | 80 |
| నేతగాండ్ర సంఘములు | 29 |
| కొబ్బరితోడు పేనువారి సంఘములు | 8 |
| చేపలు పట్టువారి సంఘములు | 6 |

| | |
|---|---|
| పాలసరఫరా సంఘములు | 3 |
| ఖద్దరు వస్తు నిలయములు | 6 |
| వివిధములు | 12 |

సంఘసభ్యులు 21419 రు. 281561 లు మూలధనము

| | సభ్యులు |
|---|---|
| 193 ఇతరవిధ సహకార సంఘములలో | |
| 124 గృహనిర్మాణ సంఘములు | 3765 |
| 2 కార్మికవృత్తి సంఘములు | 30 |
| 3 నివేశన స్థలములకొనుగోలు సంఘములు | 4 |
| 4 ముద్రాక్షరశాలా సంఘములు | 4 |
| 5 చేపలుపట్టువారి సంఘములు | 23 |
| 6 దానసంఘములు (బెనిఫిట్ ఫండు) | 3 |
| 7 కంచు, ఇత్తడి పనివారివి | 2 |
| 8 వివిధములు | 3 |
| నిమ్న జాతులవారి సంఘములు | 3133 |
| కొండజాతులవారి సంఘములు | 94 |
| సమిష్టి సాగుబడి సంఘములు-నివేశనస్థలముల కొనుగోలు సంఘములు | 967 |
| వీని సభ్యుల సంఖ్య | 49108 |
| వీరు సంపాదించిన భూమి | ఎ 44300 |
| విడుదలచేసిన భూమి | ఎ 1337 |
| నివేశన స్థలములు | 13309 |
| కట్టబడిన ఇండ్లు | 9303 |
| ఇయ్యబడిన ఋణము | రు. 150920 |

13 జిల్లా సహకార సమ్మేళనములు గలవు

6 పాఠశాలలు గలవు

32 కేంద్ర బ్యాంకులు గలవు (సెంట్రలు)

33 భూమితణఖా బ్యాంకులు కలవు

ఆంధ్రదేశమునందుగల సహకారసంఘములు. (1930—31)

| జిల్లా | జిల్లాయందు గల గ్రామముల సంఖ్య | వ్యవసాయ సంఘములు | ఎన్ని గ్రామముల కుపయోగము? | వ్యవసాయేతర సంఘములు | ఎన్ని గ్రామముల కుపయోగము? | వ్యవసాయ క్రయవిక్రయోత్పత్తి సంఘములు | వ్యవసాయేతర క్రయ విక్రయోత్పత్తి సంఘములు. |
|---|---|---|---|---|---|---|---|
| అనంతపురం | 850 | 474 | 682 | 30 | 115 | 5 | 6 |
| బళ్లారి | 921 | 308 | 391 | 45 | 28 | 7 | 8 |
| చిత్తూరు | 1996 | 261 | 524 | 27 | 28 | 1 | 3 |
| కడప | 894 | 250 | 421 | 55 | 86 | 3 | 2 |
| గంజాము | 4074 | 629 | 866 | 52 | 46 | 1 | 12 |
| ఏజన్సీ 1 | 2056 | 3 | ... | ... | ... | 3 | ... |
| తూర్పుగోదావరి | 829 | 641 | 738 | 69 | 45 | 2 | 13 |
| ఏజన్సీ 1 | 1102 | 11 | 73 | 1 | 2 | ... | ... |
| పశ్చిమగోదావరి | 757 | 394 | 441 | 38 | 25 | ... | 8 |
| గుంటూరు | 944 | 617 | 508 | 60 | 49 | ... | 5 |
| కృష్ణా | 1065 | 491 | 628 | 66 | 40 | | 9 |
| కర్నూలు | 781 | 309 | 340 | 53 | 41 | 2 | 7 |
| నెల్లూరు | 1624 | 428 | 610 | 42 | 20 | 1 | 6 |
| విశాఖపట్నం | 2599 | 409 | 741 | 67 | 56 | 2 | 8 |
| ఏజన్సీ | 10071 | 15 | 16 | 3 | 1 | 10 | 2 |
| మదరాసురాష్ట్రము | 53025 | 12967 | 21688 | 1585 | 23262 | 106 | 226 |

ఏజన్సీ అంకెలలో నేతగాండ్ర సంఘములు చేరినవి.

*Administration Reports of Govt. of Madras 1931—33. Co-operative Department.*

1930 వ సంవత్సరమునుండియు ప్రబలిన ఆర్థికదుస్థితివలన నితర రాష్ట్రములయందు వలెనే మదరాసు రాష్ట్రమునందుగూడ పరపతి సంఘముల పనిస్థంభించినది. "మన ప్రాథమిక సంఘములును వాటికి ఋణము లొసగు పై సంస్థలును జవసత్వము లుడిగి యున్నవి. అధిక సంఖ్యాకములగు ప్రాథమిక సంఘములు నిజముగ బనిజేయుట లేదు. రావలసినసొమ్ము పెచ్చుపెఱిగినది. సంఘముల ఆస్తి ఘనీభవించినది. ఇందువలన పరపతి సంకుచితమైనది............సగటున రోజు 1 కి మూడుసంఘములు ఎత్తివేయబడు చున్నవి. నూతన సంఘముల నిర్మాణము విరమింప బడెను."[1]

బ్యాంకులలో డిపోజిట్లను వేసికొనినవారును వ్యక్తి వాటాదారులును అలజడి పడుచున్నారు. "ఈక్రింది పట్టికవలన ఆయేటికి ఆయేడు రావలసిన బాకీలు పెచ్చు పెరుగుచున్నటుల తెలియుచున్నది. రావలసిన వడ్డీమొత్తమును పరీక్షించియే పరపతిసంఘముల ప్రస్తుతస్థితి భయమును గలిగించుచున్నదని నిశ్చయముగ జెప్పవచ్చును.

వ్యవసాయ పరపతిసంఘములయొక్క ఋణవ్యాపారము నీపట్టిక దెలుపుచున్నది.

| | 1929-30 | 1930-31 | 1931-32 | 1932-33 |
|---|---|---|---|---|
| | (లక్షల రూపాయలు) | | | |
| సంఘసభ్యులనుంచి రావలసిన ఋణము | 591.43 | 575.68 | 500.47 | 449.36 |
| సంవత్సరాంతమునకు రావలసిన ఋణముల మొత్తము | 177.53 | 256.09 | 277.21 | 265.78 |
| రావలసిన వడ్డీ | 45.00 | 61.00 | 69.00 | 77.00 |

1 *From Mr. Ramadas Pantulu's Presidential Address at Bhimavaram. President of the Madras Co-operative Bank.*

ఒక్క సంవత్సరమునందే (31-32) ఎత్తివేయబడిన సంఘసభ్యుల నుండి రావలసిన ఋణము రు 243604 లు రానిబాకీక్రింద తీసివేయ వలసి వచ్చెను. ఎత్తివేసినవారు రావలసిన రు 98041 లకు మింజుమతె రు 45851 ల విలువగల ఆస్తిని కొనవలసివచ్చెను. ఈవిషయము ననుస రించియే సహాకారసంఘముల స్థితిని గ్రహింపగలము....భూమితణకా బ్యాంకువారు తంజావూరు, బళ్ళారి, తూర్పుగోదావరి జిల్లాలయందు ప్రత్యేకవిచారణను సలిపి 100 కి 13.32 వంతుల పరపతిసంఘముల ఋణముగాక రావలసిన రు 1142053 ల ఋణములోను, రు 152181ల ఋణము మాత్రమే బాధ్యత వహించుట కర్తవ్యముగ నున్నదనిరి. అయినను సహాకారబ్యాంకులస్థితి ప్రమాదకరముగ లేదని విశ్వ సించుట యెట్లు?"[1]

అయినను, రాష్ట్రీయబ్యాంకు అధ్యక్షులు సహాకారబ్యాంకుల స్థితి ప్రమాదకరముగ లేదని ప్రకటించుచున్నారు.

"1932-33 వ సంవత్సరమునకు అనగా 1933 జూన్ 30 వ తేదీకి వ్యవసాయ పరపతిసంఘములకు రు 54540 లక్షలు వ్యాపారపుపెట్టుబడి కలదు. ఇందు రు 35795 లక్షలు సెంట్రలుబ్యాంకులనుండి తీసికొనిన అప్పు. రు 37.67 లక్షలు సభ్యులయొద్దనుంచియు, సభ్యేతరులయొద్ద నుంచియు, తీసికొనబడిన డిపోజిట్లు. వీరు సంఘసభ్యులకొసంగిన ఋణ ములు రు 449.36 లక్షలు. ఈఅంకెల ననుసరించి డిపోజిటర్లకు జూప వలసిన హామీని గమనించెదము. వ్యవసాయసంఘములకు వాటా ధనమును, మూలధనమును గలిసి సుమారు 140 లక్షలు కలదు. ఇందులకుదోడుగ సెంట్రలుబ్యాంకులు, రాష్ట్రీయబ్యాంకులో వేసి కొనిన మూలధనము రు 27 లక్షలు కలదు. మరి రు 7 లక్షలు పారు

1. *By an Individual Share-holder and Depositor published in Hindu.*

బాకీలక్రింద మూలధనముకలదు. ఈ రు 175 లక్షల పెట్టుబడిధనమును, పోయినగాని డిపోజిటర్లకు ప్రమాదముకలుగదు. ఏసెంట్రలుబ్యాంకు నకు ఆసెంట్రలుబ్యాంకునే పరీక్షించినను, డిపోజిటర్లు ఆందోళనపడ వలసిన పనిలేదు.''[1] కాని ప్రస్తుతార్థికదుస్థితి యింకను వృద్ధియయిన యెడల, ఆందోళనస్థితి రాదనిచెప్పుట సాహసమగును. అమెరికాదేశము నందువలె రైతులఅప్పునకు ప్రభుత్వమువారు బాధ్యత వహింపని యెడల సహకారోద్యమము సురక్షితముగ నుండజాలదు.

ప్రస్తుతార్థికదుస్థితియు,సహకారోద్యమమును సుడిగుండమువలె తిరుగుచున్నవి. పరపతి పుట్టినగాని పంటలధరలు హెచ్చుటకు సావకాశములేదు. పంటలధరలు హెచ్చినగాని భూములధరలు హెచ్చవు. భూముల ధరలును, పంటలధరలును హెచ్చినగాని పరపతి పుట్టదు. పరపతి సంఘములయందు అప్పు లభించినంత కాలము ఈ అసలీఫాయి దాలను ఆ అప్పులనుండియే సంఘసభ్యులు చెల్లింపగలిగిరి. నేడాపరపతి స్థంభించుటవలన బకాయి పెరిగినది. బకాయి పెరుగుటవలన సెంట్రలు బ్యాంకులు, సాహసించి విరివిగ నప్పుల నిచ్చుట లేదు. లక్షల కొలదిగ సొమ్మును ప్రభుత్వఋణపత్రములయందు దాచుకొనుచున్నవి. సహకారోద్యమమున పరస్పరవిశ్వాసమునకు మారుగ అవిశ్వాసము, భయము ప్రబలినవి. సాహసించి సెంట్రలు బ్యాంకులు పరపతిని విస్త రింపజేసినయెడల కొంత ఆర్థికదుస్థితి తగ్గుటకు సావకాశము కలదు. (కొన్ని ఆంధ్రజిల్లాలయందు) ఇందులకు వ్యక్తివాటాదారులు సమ్మతింపరు. ఈపరిస్థితులలో సహకారోద్యమము రైతున కత్యవసరకాలమున

1. *From Mr. Ramadas Pantulu's Presidential Address at Bhimavaram. 1933 Nov 18.*

నిరర్థకమైనదనుట సాహసముకాదు. సుడిగుండమునందు తిరుగుచు మునుగుచు దేలుచునున్నది.

## 32. సహాకారోద్యమ జయాపజయములు.

సహాకారోద్యమము సహజముగ శక్తిమంతమైనది. విదేశముల యందువలె హిందూదేశమునకుగూడ నపారమగు మేలొనరింపగలదు. కాని సహాకారోద్యమ ముద్ధరింపజాలని దుస్థితికి భారతదేశార్థికస్థితి దిగజారినది. సహాకారోద్యమము వివిధశాఖలుగ భారతదేశమున పెంపొందలేదు. పరపతిశాఖయే పుట్టినది. ఇదియు విజయము బడయ లేదు. "పైపైన గీకుటవలె నేటివఱకు పనిజరిగెను."[1]

"సహాకారపరపతి యుద్యమము వలన, చిరకాలమునుండియు నుండిన రైతుల ఋణసమస్యను పరిష్కరింప జాలము......ఒకానొక ప్పుడు గ్రామ పరపతిసంఘముల మూలమున ప్రాత అప్పులను దీర్చి వేయగలమని యూహించితిమి. నేడా యభిప్రాయము సమసిపోవుట సంతోషకరము." అని అఖిలభారత సహాకారోద్యమ, సంఘమున కధ్యక్షులగు శ్రీయుత వేమవరపు రామదాసు పంతులుగా రుపన్య సించిరి.

సహాకారోద్యమము రైతుల ఋణసమస్యను పరిష్కరింపజాలకపోవుటవలన, పరిష్కరింప శక్తిలేకపోవుటవలన రైతుల ఋణ సమస్యను బరిష్కరించుటకై శక్తిమంతమగు మఱియొక మార్గము నవలంబించుటవిధి. ప్రజ లీమార్గమునరయజాలరు. నూతనమార్గముల నరసి, రైతుల ఋణసమస్యను బరిష్కరించుట ప్రభుత్వకర్తవ్యము.

---

1 *Sir. M. Visvesvaraya. Quoted by Zathar and Beri. p. 327.*

2 *From Mr. Ramadas Pantulu's Presidential Address at Bhimavaram.*

| | మూలధనము | వాటాధనము | వ్యాపారపు పెట్టుబడి |
|---|---|---|---|
| | రు. | రు. | రు. |
| ప్రాథమిక సంఘములు | 114351000 | 126560000 | 926915000 |
| సెంట్రలు బ్యాంకులు | 4793821 | 29177207 | 306201724 |
| రాష్ట్రీయ బ్యాంకులు | 22841646 | 6699459 | 98902020 |
| మొత్తము | 141986467 | 162436666 | |

రాష్ట్రములకును సంస్థానములకును గలసి 1931-32 వ సంవత్సరము నకు నన్నివిధములగు సహకారసంఘముల వ్యాపారపు పెట్టుబడియు, పై పట్టికవలన దెలియుచున్నది. అన్ని సంఘములకును గలిసియుండిన రు 30,4423133 (అనగా సుమారు 30 కోట్లు)తోను, రైతుల ఋణ సమస్య పరిష్కరింప బడునని తలంచుట హాస్యాస్పదము.

# 33. భూమితణఖా బ్యాంకులు.

సహకారోద్యమము, రైతులఋణభారమును గొలదిగనైన నివారింప జాలకపోయినను, భూమితణఖా బ్యాంకులవలన నివారింప వచ్చునని విశ్వసించువారింకను గలరు. భూమితణఖా బ్యాంకులు పెట్టుబడిదారుల బ్యాంకులగును. ఇందు సహకారసిద్ధాంతమునకు తావులేదు. అయినను, సహకారసిద్ధాంతముల ననుసరించి భూమితణఖా బ్యాంకుల నెలకొల్పుటకు వీలుకలదని స్ట్రిక్లాండుగారి విశ్వాసము.[1]

1. *See Strickland Studies in European Co-operation p. p. 2-4*

# 34. భూమితణఖా బ్యాంకుల చరిత్ర.

1863 వ సంవత్సరమున హిందూదేశపు భూమితణాఖాబ్యాంకు అనుపేర (Land Mortgage Bank of India Limited) లండనునగరమున నొకభూమి తణాఖాబ్యాంకు రిజిష్టరు చేయబడెను. ఈకంపెనీవారి ఏజెంట్లు కలకత్తా, మదరాసు, బొంబాయి, నగరములయందును, ఈరాజధానులయందలి ఇతర ముఖ్యపట్టణములయందును, నుండెడి వారు. ఈబ్యాంకువారు 100 కి రు 7 లేక 8 వడ్డీకి 7 సంవత్సరముల వాయిదాపైన అప్పుల నిచ్చుచుండెడివారు. ఇట్లు 20 సంవత్సరములు బాగుగ పనిజేసెను. పిమ్మట అంతరించెను. "(1) వీరు తేయాకు తోటలపై హెచ్చుగ పెట్టుబడిపెట్టిరి. తేయాకుధరలు పడిపోయినవి. (2) వంగదేశమున ఋణసంఘములు స్థాపింపబడినవి. (3) దేశమునం దంతట భూమిసిస్తు శాశ్వతనిర్ణయము చేయబడలేదు. ఈకారణముల వలన నీబ్యాంకు పడిపోయినది."[1]

1908 వ సంవత్సరమున పంజాబు ప్రభుత్వమువారు లండను బ్యాంకు పడిపోవుటవలన విచారింప బనిలేదనిరి. "ముఖ్యస్థానము లండను నగరమునందుండి హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిని తమవైపునకు త్రిప్పుకొనుటకు సావకాశముగల బ్యాంకులచేతియందు ప్రజల సంరక్షణనుంచుట సక్రమమైన పనికాదు."[2] సర్. విలియమ్. వెడ్డర్‌బర్న్‌గారు 1883 సందు స్థాపింపసంకల్పించిన బ్యాంకు పుట్టకమునుపే త్రుంపివేయబడినది. 1895 లో నికల్సనుగారు (Sir Fredirick Nicholson) మదరాసురాజధానికి భూమితణాఖాబ్యాంకు అవసరము లేదనెను. డూపెర్‌నాక్సుగారు సంయుక్తరాష్ట్రముల

---

*(1. Jathar and Beri P. 330.)*

*2. See B. G. Spare Essentials of Indian Economics p. 226*

జమీందారుల సహాయమునకు భూమితణఖాబ్యాంకు అవసరమనెను. సర్. డిన్షావాచాగారు రైతులఋణసమస్యను బరిష్కరించుటకు ఈజప్టుదేశము నందువలె భూమితణఖాబ్యాంకుల నేర్పరుచుటయే కర్తవ్యమని విశ్వసించిరి.[1]

1919 వ సంవత్సరమున సర్. జేమ్సు మెస్టనుగారు భూమితణఖాబ్యాంకులను స్థాపించుట కనుకూలముగ నుండెను. కాని ప్రభుత్వము ఎట్టిజోక్యమును గలిగించుకొన రాదనెను. ఈ ప్రారంభదశ నుండియు, జమీందారులకు లేక పెద్ద భూఖామందులకు మాత్రమే భూమితణఖాబ్యాంకులు వినియోగింపబడుట కుద్దేశింపబడెను. రాను రాను చిన్నరైతులకుగూడ వినియోగింపదగునను అభిప్రాయము గలుగుచున్నది. మొట్టమొదట పంజాబునందు 1920 వ సంవత్సరమున జాంగు (Jhang) లో భూమితణఖాబ్యాంకు స్థాపింపబడెను. నేడు మదరాసు, బొంబాయి, బర్మా, బెంగాలు, రాష్ట్రములయందు భూమితణఖాబ్యాంకులు కలవు. హిందూదేశమునందలి భూమితణఖా బ్యాంకులు జర్మనీ భూమితణఖాబ్యాంకుల ననుసరించి యేర్పరుపబడుచున్నవి. బొంబాయి రాష్ట్రమందలి భూమితణఖాబ్యాంకులు అమెరికాయందలి వ్యవసాయ ఋణసంఘముల ననుసరించి స్థాపింపబడెను.[2]

ఈ దిగువపట్టికవలన హిందూదేశమునందుగల భూమితణఖా బ్యాంకుల వివరములు తెలియగలవు.

1. *For the earlier history of Land Mortgage Banks see J.C. Sinha's paper on Land Mortgage Banks read before the Indian Economic Conference Lucknow 1928.*

2. *National Farm Loan Associations.*

1930 జూలై 30 కి గల భూమి తణఖాబ్యాంకుల వివరము,

| | సంఘములు సంఖ్య | సభ్యులు | వేలలో | | | |
|---|---|---|---|---|---|---|
| | | | వాటాధనము, మూలధనము | డిపాజిట్లు | అప్పులు | మొత్తపు వ్యాపారపు పెట్టుబడి |
| | | | రు. | రు. | రు. | రు. |
| అజ్మీర్, మార్వారా | 13 | 757 | 8 | | 60 | 68 |
| అస్సాము | 5 | 1593 | 88 | 300 | 74 | 462 |
| బెంగాలు | 4 | 2099 | 78 | 2 | 330 | 410 |
| బీహారు, ఒరిస్సా | ... | ... | రాష్ట్రీయబ్యాంకులు లేవు | | | |
| బొంబాయి | 3 | 749 | 51 | 24 | 75 | 150 |
| బర్మా | 2 | 281 | 4 | 47 | | 51 |
| మధ్యరాష్ట్రములు | ... | ... | రాష్ట్రీయబ్యాంకులు లేవు | | | |
| ఢిల్లీ | ... | ... | రాష్ట్రీయబ్యాంకులు లేవు | | | |
| మదరాసు | 28 | 3004 | 228 | 243 | 797 | 1268 |
| పశ్చిమోత్తర పరగణాలు | ... | ... | రాష్ట్రీయబ్యాంకులు లేవు | | | |
| పంజాబు | 12 | 5625 | 175 | 1419 | 684 | 2278 |
| సంయుక్తరాష్ట్రములు | 1 | 34 | 1 | | 8 | 9 |
| మొత్తము | 68 | 14142 | 638 | 2035 | 2028 | 4696 |

*Indian Central Banking Enq. Committee P. 33.*

# 35. భూమితణఖా బ్యాంకులు ప్రభుత్వ సహాయము.

. భూమితణఖా బ్యాంకులు ప్రభుత్వ సహాయము సంపూర్ణముగ లేనియెడల కొనసాగవు. భూమితణఖా బ్యాంకుల తాలూకు డిబెంచర్లను లేక ఋణపత్రములను ప్రభుత్వమువారుకూడ కొనవలెను. డిబెంచర్ల తాలూకు అసలీఫాయిదాలకు, ప్రభుత్వమువారు హామీ యొసంగవలెను. బ్యాంకుల హామీ పత్రములకు ప్రభుత్వమువారు ట్రస్టు సెక్యూరిటీ నొసంగవలయును. జర్మనీయందువలె తనఖాదారుగ బ్యాంకులకు ప్రత్యేక సౌకర్యము లొనగూర్చవలయును. సహకార సంఘముల కొసంగిన ప్రత్యేక సౌకర్యము లన్నియు భూమితణఖాబ్యాంకునకుగూడ నొసంగవలయును. ఇట్టి ప్రభుత్వ సహాయము లేనియెడల తణఖాబ్యాంకులు బాగుగ పనిచేయ జాలవు. బ్యాంకుల ఋణపత్రములు అమ్ముడు కావు. బొంబాయి సహకార బ్యాంకు 10½ లక్షల డిబెంచర్లను విక్రయించెను. హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శి ఈడిబెంచర్లకు 100 కి రు 4 వంతున వడ్డీ నిచ్చుటకు హామీ నొసంగెను. ఇది సదుదాహరణము. వ్యవసాయ విచారణసంఘమువారు ప్రభుత్వమువారి హామీపొందిన బ్యాంకుల పరిపాలకవర్గమునందు ప్రభుత్వనియమితుడగు సభ్యుడొక డుండదగునని సూచించిరి.[1] ప్రభుత్వనియమిత సభ్యుడుండుట అనవసరము, అప్రశస్తము. సరియగు పరిపాలకవర్గముండి సక్రమముగ వ్యవహరించు భూమితణఖాబ్యాంకుల డింబెచర్లకే రాష్ట్రప్రభుత్వములు హామీనొసంగదగును. కాని హామీ నొసంగుచున్నందులకు మారుగ తమసభ్యుడు కార్యనిర్వాహకవర్గమునం దుండవలెననుట

1. *Agricultural Commission's Report para 388.*

అనుచితము. భూమితనఖాబ్యాంకులు గమనింపవలసిన మరొక ముఖ్యవిషయము కలదు. భూమితనఖాబ్యాంకులు సాధ్యమగునంత వఱకు రైతులఋణబాధను నివారించుటకై యత్నింపవలయునేకాని పెట్టుబడిదారునివలె తనఖాఆస్తిని స్వాధీనపరచుకొనుటకై ప్రయత్నింపరాదు. అప్పుడప్పుడు తనఖాభూములకు ధరలు కట్టించుచు, అవసరమగుచో హామీని హెచ్చించుకొనుచుండ వలయును.

## 36. మదరాసు భూమి తనఖాబ్యాంకులు.

ఈతనఖాబ్యాంకులు రైతులతాలూకు ఋణమును తీర్చి, వారి ఆస్తిని తనఖాపట్టి దూరపువాయిదాలలో ఋణమును రైతులు తీర్చికొనుటకు సదుపాయములను గలిగించుటకై స్థాపింపబడుచున్నవి. వ్యవసాయాభివృద్ధికి గూడ నీతనఖాబ్యాంకులు ఋణము నొసంగ వచ్చును. ఈబ్యాంకుల సభ్యులకు వారి ఆస్తులను తనఖాపట్టి ఋణ మొసంగబడును. ఈతనఖా ఆస్తిహామీమీద బ్యాంకులు ఋణపత్రముల నమ్మును. (Debentures) ప్రజల యొద్దనుంచి డిపాజిట్లను గూడ నీబ్యాంకులు పుచ్చుకొనుచుండును. [మూడుసంవత్సరములకు తక్కువ లేని వాయిదాపైన,]ఋణపత్రములమీదను డిపాజిట్లమీదను లభించు సొమ్మునకుదోడుగసభ్యులవాటాధనముకూడనుండును. ఈమూడురకము లసొమ్మును భూమితనఖా బ్యాంకునకు వ్యాపారపు పెట్టుబడి యగుచున్నది. 7, 8. మైళ్లదూరమునందు గల కొన్ని గ్రామములవారు కలిసి యొక భూమితనఖా బ్యాంకును స్థాపించుకొనవచ్చును. సమీప గ్రామములయందుండువారు కలిసి స్థాపించుకొనిన యెడల భూములకు ధరలు కట్టుకొనుటకును పరస్పర మెఱుక గలిగి యుండుటకును వీలుగ నుండును. మొత్తముమీద తాలూకా 1 కి ఒక భూమితనఖా

బ్యాంకును స్థాపింపవలెను. సంఘసభ్యు లొసంగు తణఖాభూమికిగల ధర మొత్తముకంటె హెచ్చు ఋణపత్రములను బ్యాంకు అమ్మరాదు. ఈఋణపత్రములకు 12 సంవత్సరముల వాయిదాకు తక్కువయుండదు. 20 సంవత్సరముల వాయిదాకు ఎక్కువయుండదు. ఈ ఋణపత్రములపై 100 కి రు 7 వఱకు వడ్డీ నొసంగబడుచుండెను. ఈబ్యాంకు డైరెక్టరులు ఋణపత్రములను కొనినవారిపట్ల తమధర్మమును నిర్వర్తించుటకొక ధర్మకర్తను నియమించెదరు. ఈబ్యాంకుల సభ్యులకు సమిష్టి-బాధ్యత లేదు. పరిమితిగల బాధ్యతయే కలదు. సంఘసభ్యుడు కోరు ఋణమునకంటె నీత డొసంగు తణఖా భూమి రెండింతలు విలువయుండవలెను.

"1920 వ సంవత్సర ప్రాంతము 'ందే, సహకార పరపతిసంఘములు రైతుల పాతబాకీలను దీర్పజాలవని గ్రహింపబడెను. దూరపు వాయిదా అప్పుల నొసంగుటకు భూమితనఖాబ్యాంకులు స్థాపించుట అవసరమని తలంవబడెను."[1]

1925వ సంవత్సరమున ప్రభుత్వమువారి ఆమోదముబడసి నాలుగు ప్రాథమికభూమితణఖా బ్యాంకులు స్థాపింపబడినవి. ఇందు గుడ్లవల్లేరు, కంజీవరము, అంబూరుబ్యాంకులు బాగుగ పనిచేయుచున్నవి. ఈబ్యాంకులలో బ్యాంకి 1కి ప్రజలు రు.50,000ల ఋణపత్రములను గొనినయెడల ప్రభుత్వముకూడ బ్యాంకు1కి 50,000ల ఋణపత్రములను గొనుటకు నిశ్చయించెను. ప్రభుత్వము కొను ఋణపత్రములపై 100కి రు. 6–8–0లును, ప్రజలుకొను పత్రములపై 100కి 7–0 0లును (సాలుసరి) వడ్డీ ఏర్పాటు చేయబడెను. సంఘసభ్యుని 1కి రు, 1000ల

1 *From Mr P. T. Rajan's Opening Speech at the Land Mortgage Banks Annual Conference. Oct 7-1938*

కంటె 100కి రు.9—0—0ల వడ్డీమీాద హెచ్చు మొత్తమును ఋణముగ నీయరాదను షరతుకలదు. ఈషరతుల ననుసరించి 1925 సంవత్సరమున 4 బ్యాంకులుమాత్రమే స్థాపింపబడినను, 1929వ సంవత్సరమునకు 20 భూమితణఖాబ్యాంకులు స్థాపింపబడినవి. సంఘసభ్యుని 1కి నీయదగిన ఋణపుమొత్తమును రు. 1000ల నుండి రు. 5000ల వఱకు పెంచబడెను. 1929వ సంవత్సరాంతమునకు స్థాపింపబడియుండిన 20 బ్యాంకులకు 5 బ్యాంకులుమాత్రమే ఋణపత్రములనమ్మెను. ఋణపత్రములను విశేషముగ ప్రజలు కొనకపోవుటయే యిందులకుకారణము. ఇంతలో సహకారోద్యమ వ్యాప్తిని బరిశీలింప నియమింపబడిన టవునుసెండుకమిటీవారు (Townsend Committe) భూమితణఖాబ్యాంకుల యభివృద్ధినిగూడ బరిశీలించి కేంద్రభూమితణఖాబ్యాంకును స్థాపింపవలెనని వీరుసూచించిరి.వ్యవసాయవిచారణ సంఘమువారుకూడ, కేంద్ర భూమి తణఖాబ్యాంకును స్థాపింపవలెననిసూచించిరి. ఈసూచనల ననుసరించియు అనుభవము ననుసరించియు 1929వ సంవత్సరమున మదరాసు కేంద్రభూమితణఖాబ్యాంకు స్థాపింపబడెగ.

ఈబ్యాంకునందు వ్యక్తులును, సంఘములునుగూడ సభ్యులుగనున్నారు. ఋణములను తీసికొనని వ్యక్తులపక్షమునను, ప్రాథమిక భూమితణఖాబ్యాంకుల పక్షమునను, పాలకవర్గమునందు డైరెక్టరులు కలరు. సహకారోద్యమ రిజిష్ట్రారును ఈయనసలహా ననుసరించి ప్రభుత్వమువారిచే నియోగింపబడిన మరియొకరును గూడ పాలక వర్గమునందు డైరెక్టరులుగ నుందురు. ఈకేంద్రసంస్థయే ప్రాథమిక తణఖాబ్యాంకులలో తణఖాపట్టబడిన భూములహామీాపై ఋణపత్రముల నమ్ముచుండెను. ఇట్లే అమెరికాదేశమునందును, అయిరోపా ఖండమునందునుగూడ కేంద్రసంస్థలే ఋణపత్రముల నమ్ము చున్నవి.

ఈమదరాసురాష్ట్రీయ భూమితనఖాబ్యాంకువారి ఋణపత్రము లకు ప్రభుత్వమువారు పూచీపడవలయు నని కోరబడుచుండెను. (Trustee Security) టవునుసెండు కమిటీవారును, వ్యవసాయ విచారణ సంఘమువారును, బ్యాంకింగు విచారణసంఘమువారునుగూడ నిట్లే సూచించిరి. అయినను ప్రభుత్వమువా రింతవఱ కీసూచన నంగీక రింపలేదు. ఇందులకు హిందూదేశప్రభుత్వమే కారణము. మదరాసు ప్రభుత్వమువారు మూడుసారులు ఇండియాప్రభుత్వమువారిని కోరిరి. ఒకసారి బ్యాంకింగువిచారణసంఘమువారి నివేదిక వెలువడవలె ననిరి. వేరొకసారి నూతనసంస్కరణములు రావలె ననిరి. మూడవసారి మదరాసు ప్రభుత్వమువారు ఋణపత్రముల అసలీఫాయిదాలకు హామీ వహించినయెడల అవసరమగు మార్పులను శాసనమునందు గావించుటకు కేంద్రప్రభుత్వమువా రంగీకరించిరి. భూమితనఖా బ్యాంకులను గుఱించిన శాసనముపై నియమింపబడిన మదరాసు శాసనసభవారి సెలక్టుకమిటీకూడ ప్రభుత్వమువారు హామీపడవలె నని తీర్మానించెను. మదరాసు ప్రభుత్వమువారు ఋణపత్రములకు పూచీపడినగాని ఋణపత్రములు విరివిగ చెలామణీకిరావు. ఋణపత్ర ములు సులువుగ చెలామణియగుచుండినగాని వీటిని ప్రజలు విరివిగ కొనరు. ఋణపత్రముల చెలామణిమీదనే భూమితనఖాబ్యాంకుల జయాపజయము లాధారపడును.

"ప్రభుత్వమువారు ఋణపత్రములకు పూచీపడక పోయినను ప్రజ లీఋణపత్రములను విరివిగ గొనుచున్నారు. బ్యాంకువారు తమ ఋణపత్రములపై నొసంగు వడ్డీని 100 కి సాలుసరి రు 6-8-0 నుండి రు 5 ల వఱకు తగ్గింపగలిగిరి. నేటివఱకు 29 లక్షల విలువగల ఋణ పత్రములు అమ్మబడెను. రు 10, 73, 200 లు సహకారసంఘములును

రు 606,100 లు జిల్లాబోర్డులు, పురపాలకసంఘములును, రు 197500లు భీమాకంపెనీలును, రు 919300 లు వ్యక్తులును, రు 114.500 లు ఇతర సంస్థలును ఋణపత్రములమూలముగ మదరాసు భూమితణఖా బ్యాంకు నందు వేసికొనిరి.*[1] నేడు మదరాసు రాష్ట్రమున 60 ప్రాథమికభూమి తణఖాబ్యాంకులు కలవు. 1933 వ సంవత్సరాంతమునకు 80 బ్యాంకు లుండునని తలంపబడుచుండెను. "మదరాసు రాష్ట్రమునందలి ప్రాథమిక భూమితణఖా బ్యాంకులలో పెద్దబ్యాంకునకు గల వ్యాపారపు పెట్టుబడి 3½ లక్షలకంటె హెచ్చుగ లేదు. సగటున బ్యాంకు 1 కి వ్యాపారపు పెట్టుబడి రు 67000 లు కలదు. మొత్తపు 60 బ్యాంకు లలోను 34 బ్యాంకులు నష్టముమీద పనిచేసినవి. (1933 జూన్ నెలాఖరునకు)...1933 జూన్ నెలాఖరునకు 19 బ్యాంకులలో సభ్యులు, రు 81,000 లు అసలు క్రిందను రు 23,000 లు ఫాయిదా క్రిందను బకాయిపడిరి.*[2] ఇట్లు బకాయి పెరిగిన యెడల సహకారోద్యమము వలెనే నీయుద్యమము కూడ స్థంభించును.

## 37. మదరాసుప్రభుత్వ సహాయము.

"మదరాసుప్రభుత్వమువారు రాష్ట్రాదాయమునుండి మొదటి 5 సంవత్సరములయందునను, తణఖాబ్యాంకువారి ఋణపత్రములపై వడ్డీకి పూచీపడిరి. (50లక్షలవఱకు) ధర్మకర్తపక్షముననను, సెంట్రలు భూమితణఖాబ్యాంకుపక్షముననను, ప్రాథమిక భూమితణఖాబ్యాంకు

---

*1 From Dewan Bahadur M. Ramachandra Rao's address at the Land Mortgage Banks Annual Conference as President of the Madras Land Mortgage Bank on Oct 7—1933.*

*2 From Hon'ble Mr. P. T. Ragan's Speech at Madras Land Mortgage Banks Annual Conference on 7 October 1933.*

లను పరీక్షించుచుండుటకు ఇరువుర డిప్యూటీ రిజిష్ట్రారులను నియమించిరి. 10 మంది సబుడిప్యూటీరిజిష్ట్రారులను గూడ నియమించిరి. వీరే అప్పుల ధరఖాస్తులను పరీక్షించుచుందురు. కేంద్రభూమితణఖాబ్యాంకు స్థాపింపబడిన మొదటియేడు రు. 15,000లును రెండవయేడు 14,000 వేలును, ఖర్చులక్రింద బ్యాంకునకు విరాళమొసగిరి. 1930-31వ సంవత్సరమున, బ్యాంకు గవర్నమెంటువా రొసగిన 1 లక్షలరూపాయల పరపతిమీదనే పనిజేసెను"[1]

"విదేశములయందు భూమితణఖాబ్యాంకులకు ఆయాదేశప్రభుత్వము లొనరించిన విశేషసహాయమువలననే అవి బాగుగ పనిజేయ గలుగుచున్నవి. దూరపు వాయిదాఅప్పుల నిచ్చుటకై బ్రిటీషుదీవులయందు 1928వ సంవత్సరమున తణఖాబ్యాంకు స్థాపింపబడెను. ఈబ్యాంకునకు బ్రిటిషుప్రభుత్వము పౌ. 10,000లు (లేక సుమారు రు. 14,0000లును) పదిసంవత్సరముల ఖర్చులకొఱకు విరాళముగ నొసగిరి. ఈబ్యాంకుపని ప్రారంభించునపుడు, 60 సంవత్సరములవఱకు, వడ్డీలేనిపద్ధతిని వ్యాపారపు పెట్టుబడికొఱకు, పదిలక్షల రెండువందల ఏబదివేలపౌనుల నొసగుటకు శాసనమొనరించిరి. ఈబ్యాంకువారు, అమ్మ ఋణపత్రములలో, ఋణపత్రములను వేసెడి సారెసారెకు అందులో నాల్గవవంతు పత్రములను మొత్తముమీద పదిలక్షల రెండువందల ఏబదివేలపౌనులవఱకు కొనుట కంగీకరించిరి. ప్రభుత్వమొసంగిన యిట్టి అత్యధికసహాయమువలన బ్రిటిషుదీవులయందలి బ్యాంకు త్వరితగతిని ప్రజావిశ్వాసమునకు పాత్రముకాగలిగెను....ఇట్లే అమెరికా

1. *From the Presidential adress of Mr Hon'ble Mr P. T. Rajan at the Land Mortgage Bank's Conference on-Oct7 1933*

యందు భూమితణఖా బ్యాంకుల వ్యాపారపుపెట్టుబడి మూలధనము లాభములపై ఆదాయపుపన్నును విధించుటలేదు.''[1]

బ్రిటిషు ప్రభుత్వమువారును అమెరికా ప్రభుత్వమువారును గావించిన సహాయమునకును, మదరాసు ప్రభుత్వమువా రొసరించిన సహాయమునకును పోలికయేలేదు.

## 38. బొంబాయి రాజధాని-భూమితణఖా బ్యాంకులు.

బొంబాయియందు వ్యవసాయాభివృద్ధికర విషయముల కన్నింటికి దూరపువాయిదా అప్పుల నొసంగుచున్నారు. (1) వ్యవసాయదారుల భూములు, ఇండ్లు, తాకట్టునుంచి విడిపించుకొనుటకు (2) భూమిని బాగుచేయుటకు వ్యవసాయముచేయువిధము నభివృద్ధి పఱచుటకు. (3) వ్యవసాయాభివృద్ధికి వలయు నూతనయంత్రములను తెప్పించుటకు, వాటిని నెలకొల్పుటకు, వాటిచే వ్యవసాయముచేయుటకు. (4) బంజరులు, బీడులు, అడవులు, మొదలగు భూములనుగొని వ్యవసాయపుభూమిగ మార్చుటకు; దూరపువాయిదా అప్పులను భూమితణఖా బ్యాంకు బొంబాయియం దొసంగుచుండెను. ప్రాథమిక భూమితణఖా బ్యాంకులు కలవు. ఈబ్యాంకులకు రాష్ట్రీయసహకార బ్యాంకే కేంద్ర భూమి తణఖా బ్యాంకువలె పనిజేయుచున్నది. మదరాసునందువలె ప్రత్యేకించి కేంద్రభూమి తణఖా బ్యాంకు లేదు. సహకారబ్యాంకే 9½ లక్షలరూపాయల ఋణపత్రములను 100 కి సాలుసరి రు 4-0-0 వడ్డీపైన అమ్మి వ్యాపారపుపెట్టుబడిని సంపా

1. *From the address of Mr M Ramachandrarao' President-Land Mortgage Bank. Annual Conference of the Land Mortgage Banks Oct 7-1938.*

దించుచున్నది. బొంబాయిప్రభుత్వము తమకు నష్టములేని షరతిని 5 లక్షల విలువగల ఋణపత్రములను గైకొనును. 2 లక్షల విలువగల ఋణపత్రములను కొనెను. భూమితణఖా బ్యాంకు ఒకరివిన్యాజిల్లాయం దంతట పనిజేయవచ్చును. ఒకజిల్లాదాటికూడ పనిజేయవచ్చును. ప్రాథమిక బ్యాంకుల సభ్యులు భూమినిగలిగియుండిన వ్యవసాయదారులుగ నుండవలెను. కొంతమందిసభ్యులను ప్రభుత్వమువారుగూడ నియమించుచుందురు. ప్రతిసభ్యుడును దానుతీసికొను ఋణమొత్తములో ఇరువదియవవంతు మొత్తమునకు సరియగువాటాలను గొనవలెను. భూమియొక్క విలువలో సగమువంతు ఋణముగ నొసంగబడును. ప్రాథమిక బ్యాంకులు రాష్ట్రీయ సహాకార బ్యాంకునకును, ఋణమునుగోరు సంఘసభ్యులకును, మధ్యవర్తులుగ నుండును. ధనముతోగూడిన వ్యాపారమునంతయు, రాష్ట్రీయసహకార బ్యాంకువారే చేసెదరు. ఈవిధముగ కొంతకాలము గడిచినపిమ్మట మదరాసునందువలె భూమితణఖా బ్యాంకులకు కేంద్రబ్యాంకు స్థాపింపబడును. భూములకు ఖరీదుగట్టుటకు వలయునుద్యోగులను ప్రభుత్వమువారే నియమించుచు వారిజీతబత్తెములను భరించుచున్నారు.

## 39. భూమితణఖా బ్యాంకుల జయాపజయములు.

భూమితణఖా బ్యాంకుల జయాపజయములను నిర్ణయించుటకు దగిన వయసు వీటికింకను రాలేదు. ఇవి బాల్యావస్థయందున్నవి. వలయు ప్రభుత్వపోషణయు లభించుటలేదు. ఈబ్యాంకులు పెరిగి పెద్దవి కావలెననిన ప్రభుత్వము సర్వవిధముల సహాయ మొనరింపవలసియున్నది. ఈ బ్యాంకులపై ఆదాయపు పన్నునగాని రిజిస్ట్రేషను పన్నునగాని, ప్రభుత్వమువారు వసూలుచేయరాదు. మదరాసు ప్రభు

త్వము వారివలె మూడుసంవత్సరములు రిజిస్ట్రేషను పన్నునుదొలగించి పిమ్మట యోచింప మొదలిడరాదు. మదరాసు ప్రభుత్వమువారివలె వలయు సిబ్బందీని వేయుటకు గూడ మదింపులు వేయరాదు. రిజిస్ట్రేషను పన్నును దొలగించి వలయు సిబ్బందీని వేసి ఋణపత్రముల అసలీఫాయిదాలకు పూచీపడి ఋణపత్రములను గొనుచు సర్వ విధముల ప్రభుత్వము సహాయ మొనరించిన గాని, ప్రస్తుతార్థిక దుస్థితియందు బ్యాంకులు బ్రతుకుటయే కష్టమగును. సిబ్బందీని ప్రభుత్వమువారు నియమించుటకంటె అందులకగు ఖర్చును కేంద్రబ్యాంకునకు విరాళముగ నొసంగదగును. కేంద్రభూమితణఖా బ్యాంకువారే వలయు సిబ్బందీని వేసికొనుట సమంజసము. సహకారోద్యమమునందువలె ప్రభుత్వోద్యోగుల హాయాంమునకు తణఖా బ్యాంకులనుగూడ లోబరుపక పనిచేయుటకు నేటినుండియు ప్రయత్నింప దగును. మదరాసునందలి భూమితణఖా బ్యాంకులబిల్లు శాసనమగునపుడు ప్రభుత్వహాయాము తగ్గించి, ఉద్యోగేతరులు స్వతంత్రముగ, వ్యాపారము నడుపుటకనువుగ కేంద్రబ్యాంకునకే అధికారమొసంగ దగును. భూముల విలువ కట్టుట, లెక్కలనుపరీక్షించుట, అప్పులను మంజూరు చేయుట మొదలగు, అధికారములు కేంద్రబ్యాంకున కుండదగును. ప్రభుత్వమువారికిని కేంద్రబ్యాంకువారికిని మాత్రమే సంబంధ ముండవలయును. ఇట్టి మార్పులతో, భూమితణఖా బ్యాంకులు విరివిగ స్థాపింపబడి పనిజేసినను రైతుల ఋణసమస్య పరిష్కరింపబడునని విశ్వసింపరాదు. ఈభూమితణఖా బ్యాంకులు పెద్ద భూఖామందునకే కొంతవఱ కుపయోగించును. చిన్నచిన్న కమతములుగల రైతులే హెచ్చుగ నున్నారు. 20 సంవత్సరముల వాయిదా యిచ్చినను ఆదాయముపై ఋణమునుదీర్పగలిగిన రైతులు చాలతక్కువమంది గలరు.

ఫిన్లాండులోవలె 30, న్యూజిలాండులోవలె 36న్నర, ఆస్ట్రేలియాలోవలె 54 న్నర, స్విజర్లాండులోవలె 55న్నర, డెన్మార్కులోవలె 60, హంగేరీలోవలె 63, ఐర్లాండులోవలె 63 న్నర, ఫ్రాన్సులోవలె 75, సంవత్సరములవఱకు ఋణమును దీర్చికొనుటకు దీర్ఘమగు వాయిదాల నొసంగినను రైతులఋణబాధ దొలగిపోదు. ఎప్పుడైనను భూములనమ్మియేతీర్చవలెను. వేరొకమార్గములేదు. వ్యవసాయదారుడు భూమినిగోల్పోవుటతప్పదు. వ్యవసాయాభివృద్ధి నేలగూలుటయు నిశ్చయము. ఆస్తినంతను గోల్పోయి ఋణమునుదీర్చుటయులేక కడుపునిండతినుటకు గంజియైనలేక అసలీఫాయిదాలక్రింద, సాలుసరి ఆదాయమునంతను,సంవత్సరములకొలదిగ తీర్చుచుండుటయు నిందేపద్ధతిని రైతులఋణముపోయినను అది ఋణవిముక్తి యనిపించుకొనదు. రైతులను చిత్రవధ చేయుటయే యగును. సంసారపోషణకు వలయు నాదాయము సాలుసరి మిగులుటయే లేనపుడు ఋణవిముక్తికి పై రెండుమార్గములును నిరుపయోగములే.

"భూమితనఖా బ్యాంకుల యుపయోగము నీసడించుటలేదు. రైతుల ఆర్థికాభివృద్ధికి వీటియందు శక్తి కలదు. కాని ఈభూమితనఖా బ్యాంకులుకూడ రైతులఋణసమస్యను ఆవగింజయంత భాగమైన పరిష్కరింపజాలవు.'[1]

## కర్తవ్యము.

సహకారోద్యమము భూమితనఖాబ్యాంకులు గూడ రైతుల ఋణసమస్యను పరిష్కరింపజాలవనుట నిశ్చయము. రైతులఋణము

1. *From the Presidential address of Mr. V Ramadasu Pantulu, President Provincial Co-operative Bank, Madras, at Bhimavaram Conference Nov. 18, 1933*

నంతను నొక్కసారిగ ప్రభుత్వమువారు తామేతీర్చుట కంగీకరించ వలయును లేక శాసనరూపముగ రద్దుచేయవలయును. సహకారోద్యమ సహాయమున భూమితనఖా బ్యాంకుల సహాయమున ఋణసమస్య నెదుర్కొనుటకు సహకారోద్యమము నూతనజన్మము నొందవలయును.

1. సహకారోద్యమము భూమితనఖా బ్యాంకులు కలిసిపోవల యును. ఈ రెండువిధములగు పరపతియు, రాష్ట్రీయబ్యాంకు మూల ముగనే లభించుచుండవలయును. రెండు రాష్ట్రీయబ్యాంకులు అనవ సరము. కలిపివేయుటవలన ఖర్చులుకూడ తగ్గును.

2. ఇట్లే సెంట్రలుబ్యాంకులు, ప్రాథమికసంఘములు, భూమి తనఖాశాఖల నేర్పరుపవలయును.

3. ప్రాథమికసంఘసభ్యుల ఆస్తిని తనఖాపట్టి వారిఋణము నంతయు మొట్టమొదటగ దీర్చివేయవలయును. పిమ్మట వారిపంటల హామీమీద, గొడ్ల హామీమీద, సాలుసరి వ్యవసాయమునకు వలయు పెట్టుబడిని దగ్గిరవాయిదాఅప్పుగ నొసంగవలయును.

4. పరపతిసంఘము క్రయవిక్రయ శాఖనుగూడ నెలకొల్ప వలయును. ఈశాఖ దగ్గిరవాయిదా అప్పులను బుచ్చుకొనిన రైతుల పంటలను సరియగుధరలకు అమ్మించుటయు, వారికివలయు వస్తుసము దాయమును తిరిగియిచ్చుటయు జేయుచుండవలయును. ఇందువలన రైతు ధనరూపమగు పెట్టుబడిని విశేషముగ గోరవలసిన అవసర ముండదు. పెట్టినపెట్టుబడిని ఏసాలున కాసాలే తిరిగితీసికొనుటకు వీలుగ నుండును.

5. ఇట్లు దూరపువాయిదాఅప్పునిచ్చి భూమినంతయు తాకట్టు బట్టి వలయు సాలుసరిపెట్టుబడిని సాధ్యమగునంతవఱకు వస్తురూపముగ

నిచ్చుచుండుటవలనను, పంటలకు సరియగుధరలు సకాలమున రాబట్టుటవలనను, ఖర్చులుపోను ఆదాయము మిగులగల పెద్దరైతులకొకింత సహాయము లభించును. మూలధనమగు స్థిరచరాస్తులమీద అప్పు దెచ్చికొనుచు జీవించుచుండిన అధికసంఖ్యాకులగు చిన్నచిన్నరైతులకు సాలుసరిఆదాయము మిగులదు. మిగిలినఆదాయము పరపతి సంఘమునకు వాయిదాలక్రింద చెల్లించివేయుచో నీచిల్లరరైతులు నిరాహారులై యుండవలసివచ్చును. అందువలన అధికాదాయము రాబట్టుటకుగూడ సహకారసంఘములు ప్రయత్నింపవలయును.

6. పరపతిసంఘములు దూరపు వాయిదా దగ్గర వాయిదా ఋణముల నొసంగుటయే గాక క్రయవిక్రయశాలల పనిచేయుటయే గాక సమిష్టి వ్యవసాయమును చేయించు నుత్పత్తి శాఖను గూడ గలిగియుండవలెను. నూతనయంత్రములను దెప్పించుచు సమిష్టి వ్యవసాయమును చేయించి పంటల నెక్కువగ బండింపవలయును. రైతు దగ్గిదవాయిదా అప్పులకును దూరపువాయిదా అప్పులకును జెల్లించవలసిన సాలుసరి మొత్తముపోను జీవనోపాధికి సరిపడు ఫలసాయము మిగులునట్లొనరింప వలయును.

అనగా చిరకాలమునుండివచ్చుచుండిన ఋణబోధనుండిదూరపువాయిదా అప్పునఆస్తిని తణఖా పట్టియిచ్చుచు (వాయిదా కనీసము75 సంవత్సరము లుండవలెను) అవసరము ననుసరించి దగ్గిరవాయిదాఅప్పుల మూలముగ పెట్టుబడిని లభింపజేయుచు సమిష్టివ్యవసాయోత్పత్తిశాఖ మూలముగ నూతనయంత్రముల నుపయోగించి అధికోత్పత్తిజేయుచు, క్రయవిక్రయశాఖ మూలముగ సరియగు ధరలు రాబట్టుచు, గ్రామ

మునకొక సంఘమువంతున పనిచేసిన యెడల నొకశతాబ్దమునకు రైతు కోలుకొనవచ్చును. ఇందే భాగమును వీడి ప్రత్యేకవిషయములకై సహకారోద్యమము పాటుపడినను ఆపాటంతయు బూడిదలోబోసిన పన్నీరగును. ఈకార్యక్రమ మాచరణకు వచ్చుటకు చాలకాలము పట్టును. ఇంతలో రైతు నామావశిష్టుడగును. రైతుల అప్పును ప్రభుత్వము వారు స్వీకరించి ఋణదాతలకు సమాధానము చెప్పుట లేక ఋణమును రద్దుచేయుట కంటె రైతుల ఋణసమస్యను బరిష్కరింపగల తరణోపాయము వేరు గోచరించుటలేదు.



ఈ పట్టిక 1930-31 సంవత్సరము కార్యనిర్వహణమున కగు ఖర్చులను దెలుపుచున్నది.

| రాష్ట్రములు-సంస్థానములు. | రాష్ట్రీయ బ్యాంకులు | | సెంట్రలు బ్యాంకులు | | ప్రాథమిక సంఘములు | | వ్యవసాయేతర ప్రాథమిక సంఘములు | |
|---|---|---|---|---|---|---|---|---|
| | కార్యనిర్వహణమునకగు ఖర్చు (వేలలో) | వ్యాపారపు పెట్టుబడిలో 100 కి ఎంత? | కార్యనిర్వహణమునకగు ఖర్చు (వేలలో) | వ్యాపారపు పెట్టుబడిలో 100 కి ఎంత? | కార్యనిర్వహణమునకగు ఖర్చు | వ్యాపారపు పెట్టుబడిలో 100 కి ఎంత? | కార్యనిర్వహణమునకగు ఖర్చు | వ్యాపారపు పెట్టుబడిలో 100 కి ఎంత ? |
| మదరాసు | 106 | 0.59 | 518 | 0.84 | 576 | 0.86 | 599 | 1.81 |
| బొంబాయి | 254 | 1.70 | 322 | 1.05 | 865 | 1.92 | 765 | 1.57 |
| బెంగాలు | 84 | 0.18 | 711 | 1.48 | 516 | 2.08 | 381 | 1.25 |
| బీహారు, ఒరిస్సాలు | 81 | 0.39 | 638 | 2.94 | 143 | 0.59 | 93 | 2.46 |
| సంయుక్తరాష్ట్రములు | ... | ... | 284 | 2.52 | 112 | 1.07 | 58 | 2.08 |
| పంజాబు | 42 | 0.38 | 434 | 0.61 | 665 | 0.78 | 175 | 1.26 |
| బర్మా ♦ | లభించలేదు, | ... | 39 | 0.76 | 300 | 1.86 | 147 | 2.26 |
| మధ్యరాష్ట్రములు,బీరారు | 84 | 0.32 | 203 | 0.82 | 81 | 0.24 | 80 | 2.10 |
| అస్సాము | 2 | 0.58 | 82 | 1. 5 | 28 | 0.88 | 33 | 1.41 |
| పశ్చిమోత్తరపరగణాలు | ... | ... | 2 | 0.40 | 1.5 | 0.27 | 1.5 | 0.58 |
| కూర్గు | ... | ... | 1.5 | 0.52 | 20 | 3.15 | 10 | |
| అజ్మీరు,మార్వారా | ... | ... | 18 | 1. 1 | 16 | 0.98 | 25 | 2.71 |

| రాష్ట్రములు.-సంస్థానములు | రాష్ట్రీయబ్యాంకులు. కార్యనిర్వహణమునకగు ఖర్చు (వేలలో) | రాష్ట్రీయబ్యాంకులు. వ్యాపార పుపెట్టుబడిలో 100 కి ఎంత? | సెంట్రలుబ్యాంకులు. కార్యనిర్వహణమునకగు ఖర్చు (వేలలో) | సెంట్రలుబ్యాంకులు. వ్యాపార పుపెట్టుబడిలో 100 కి ఎంత? | ప్రాథమికసంఘములు. కార్యనిర్వహణమునకగు ఖర్చు | ప్రాథమికసంఘములు. వ్యాపార పుపెట్టుబడిలో 100 కి ఎంత? | వ్యవసాయేతర ప్రాథమిక సంఘము. కార్యనిర్వహణమునకగు ఖర్చు | వ్యవసాయేతర ప్రాథమిక సంఘము. వ్యాపార పుపెట్టుబడిలో 100 కి ఎంత? |
|---|---|---|---|---|---|---|---|---|
| హైదరాబాదునందలి బ్రిటిషుభాగము | ... | ... | ... | ... | ... | ... | 9 | 1. 8 |
| ఢిల్లీ | ... | ... | 8.1 | 0.59 | 4.2 | 0.49 | 1.2 | 0.44 |
| మైసూరు | 37 | 0.70 | 1. | 0. 5 | 31 0 | 0.61 | 102 | 1. 2 |
| బరోడా | ... | ... | 16. | 0.75 | 72.0 | 1. 9 | 25 | 1.44 |
| హైదరాబాదు ♦ | 15 | 0.40 | 46. | 0.91 | 46.0 | 0.60 | 22 | 0.91 |
| భూపాలు♦ | ... | ... | | | | | | |
| గ్వాలియరు ♦ | ... | ... | 184 | 2.83 | 31 | 1.54 | 8.2 | 0.44 |
| ఇందూరు ♦ | ... | ... | 28 | 1.37 | 14 | 0.63 | 9 | 1.48 |
| కాశ్మీరము ♦ | ... | ... | 21 | 0.61 | 50 | 1. 0 | 8.5 | 0.68 |
| తిరువాన్కూరు | ... | ... | 7.7 | 0.57 | 124.2 | 2.04 | 51 | 2.27 |
| కొచ్చిను | ... | ... | 6.0 | 1. 4 | 31.8 | 2. 1 | 17.4 | 2. 4 |
| పుదుక్కోట | ... | ... | 1.0 | 0. 2 | ... | ... | 1 | 0.14 |

♦ ఈగుఱుతున కెదురుగ నున్న అంకెలు 1929-30 వ సంవత్సరము తాలూకు. ‡ గుర్తింపదగినంతగ లేదు.

# భారతదేశము-ఆర్థికచరిత్ర

## రాకపోకలవీళ్లు.

### 7 వ అధ్యాయము.

సాంకేతిక పదములు = Glossary.

| | | |
|---|---|---|
| ఆదాయవ్యయశాసనము | = | Budge |
| సమంత్రియుతుడగు గవర్నరుజనరలు | = | Governor General-in Council |
| విరాళము | = | Bounty |
| రాకపోకలు-యానము-లేక ఆనయము | = | Transportation |
| కోశోపసంఘము | = | Finance Sub-committee |
| రేట్లు | = | Rates |
| చార్జీలు | = | Fares |
| ఒట్టపునిధి | = | Depreciation fund |
| పెట్టుబడి లేక పరిపణము | = | Capital |
| పరిపణవ్యయము లేక పెట్టుబడిఖర్చు | = | Capital expenditure |
| ఆనయమంత్రి | = | Minister for transportation |
| నీతి | = | Policy |
| కోస్తావ్యాపారము | = | Coastal trade |
| నౌకాశక్తి | = | Shipping capacity |
| అంతర్వ్యాపారము | = | Internal trade |
| రైళ్ళు-అయోమార్గము-ఇనుపదారి | = | Railways |

# 1. బాటల ఆవశ్యకత.

భారతదేశ నాగరికతయొక్క సహజపరివర్తనము దాస్యశృంఖల ములచే బంధింపబడినది. ప్రపంచమంతయు నార్థికాభివృద్ధికి నూతన మార్గముల నవలంభించుచున్న తరుణమున, భారతజాతి ఆర్థికస్వాతం త్ర్యమును గోలుపోవుటచే రాకపోకలసౌకర్యముల యందుగూడ నభి వృద్ధి కుంటువడియున్నది. ఆధునిక వర్తక పారిశ్రామికాభివృద్ధులకు దేశమందు నలుమూలల రైళ్ళు రోడ్లు కాలువలు వ్యాపించియుండుట అత్యవసరము. సనాతనకాలమునం దేజనపదమున కాజనపదము తన్ను తాను సర్వవిధముల బోషించుకొను స్థితియం దుండెడిది. వ్యక్తులు సంఘ ములు జనపదములు స్వయంసహాయము గ నాడు జీవయాత్ర గడుప గలుగుచుండెను. నే డాస్వయంసహాయము రూపుమాసిపోయినది. వ్యక్తులమధ్య సంఘములమధ్య జనపదములమధ్య పరస్పరాధారస్థితి పెచ్చుపెరిగినది. ఈపరస్పరాధారస్థితియందు రాకపోకలకు వలయు సౌకర్యములు లేకపోయినచో సర్వవిధముల జీవయాత్ర సంక్షోభము గలిగించును. వర్తక పారిశ్రామికాభివృద్ధియు నుండజాలదు. ఈస్థితియే నేడు ప్రబలియున్నది.

"రోడ్లు బాగుగ వ్యాపించియుండినయెడల వర్తకవ్యాప్తియు భావవ్యాప్తియు గూడ జరుగును. రోడ్లవ్యాప్తి వ్యవసాయదారున కెల్ల లాభదాయకమైనదియు నిట గనునింపగును. మంచిరోడ్లుండి, నిర్ణీ తములగు అమ్ముడుపోవుబజారు లేర్పడియుండిన, చౌకగను త్వరితము గను పంటల నమ్ముడుపోవు తావులకు బంపగలుగుదుము. ఇందు వలన దేశమునందుగల వివిధప్రదేశములలో ఆయాపంటలధరలు సమానముగ నుండును. ఏ అమ్ముడుపోవుతావునందు ధర లభించునో

ఆతావునకే త్వరితగతిని పండించువాడు తనపంటను దీసికొని పోగలు గుటవలన పండించువాడే ధరలయందుండుపోటీలచే గలుగులాభములను బొందగలడు. ఉత్పత్తియగు తావులకును విడుదలయగు తావులకును రాకపోకలవీళ్ళు సరిగ లేనియెడల వర్తకము నిరోధింపబడును. ఖర్చులు హెచ్చును. ఈనష్టమును రైతే భరించుచుండును. కొన్నితావుల యందు రాకపోకలవీళ్ళు లేక, స్థానికముగనుండు దళారీ వర్తకులే రైతునకు శరణ్యా మగుచున్నారు. దూరపుసంతకు దీసికొని పోయిన సరకును కొనుటయందుగల హెచ్చుధరను వినియో గించువాడు పాటింపకపోవచ్చును. కాని, దూరపుసంతలకు దీసికొని పోవుటవల్ల నగుఖర్చును పండించువాని పంట మొత్తముమీద గణించిన యెడల వానికిరావలసిన రాబడియం దెంతయో భాగము తగ్గిపోవును. రాకపోకలకగుఖర్చు దూరమునననుసరించియే హెచ్చదు. దూరము ననుసరించియే ఖర్చు హెచ్చుటయు దగ్గుటయు గూడ నుండదు. ఉత్పత్తియగు తావులకును విడుదలయగు తావులకును మధ్యగల దూరముననుసరించిన కష్టములను రాకపోకల సౌకర్యము లను హెచ్చించి నివారింపగలము. రాకపోకలఖర్చును తగ్గించి ముదరా చూపించగలము. మంచిరాకపోకలవీళ్లు కాలమునకు సంబంధించిన లాభములను గూడ నిర్ణయింపగలవు. కాలము (Time) గూడ ధరలను నిర్ణయించుటయందు ప్రాముఖ్యస్థానము వహించగలదు. వస్తువులు సకాలమున విడుదల యగుచోమాత్రమే సరియగుధర లభించుట కలదు. ధరలు తారుమా రగుచున్నసమయమున సకాలమున విడుదల

చేయుటయే ప్రాముఖ్యవిషయ మగును. సకాలమున విడుదల చేయ జాలనియెడల నష్టము సంభవించును. సకాలమున విడుదల చేయని యెడల సరకు చెడిపోవుటయు సహజము. సరియగురాకపోకలవీ ళ్ళున్న యెడల దూరమునకు సంబంధించినఖర్చును కాలమునకు సంబంధించిన వ్యయమును గూడ, కూడదీసికొనుట కనువుగ నుండును. రాకలపోకల వీళ్ళవల్ల క్రొత్తపంటలను వర్తకమునకై పండించుటకు రైతునకు బ్రోత్సాహము గలుగును. ప్రత్తి, నార, వేరుసెనగ, పొగాకు పంటలు గతించిన అరశతాబ్దమునుండియు గలిగినకొలది రాకపోకలవీళ్ల మూలముగనే విరివిగ పండింపబడుచున్నవి. మఱియు, రాకపోకలవీళ్ళు సులువుగ లేనియెడల, దిగుమతియగుసరకు పల్లెలకుజేరి రైతున కందు బాటులోనికి వచ్చునప్పటికి ఖరీదు హెచ్చగును. ఇన్ని యేల? యాన సౌకర్య మెంత విస్తరించి సులువుగనుండునో, అంత అధికాదాయము రైతునకు లభించగలదు.*[1]

ప్రపంచమునందు రాకపోకల కధికసౌకర్యము లుండవలసిన దేశములలో భారతదేశమే యగ్రస్థానము వహింపగలదు. ఇది యొక చిన్న దేశము కాదు. ఇది యొకమహాఖండము. ఇరువదిలక్షల చతురపు మైళ్ళ విస్తీర్ణముగల భారతదేశమున, మహాసహజసంపదగల భారత దేశమున, అత్యధికముగ ముడిదినుసులనే పండించు భారతదేశమున, రాకపోకలసౌకర్యము లెట్లున్నవి?

---

1. *From the Agricultural Commission's Report p. 368*

| | హిందూదేశము నందలి 9 ముఖ్య రాష్ట్రములు | | అమెరికా సంయుక్త రాష్ట్రములు | |
|---|---|---|---|---|
| చదరపు మైలు 1కి జనసాంద్రత | 240 | | 31.5 | |
| | ప్రతినూరు చ॥ మై॥ వైశాల్యమునకు | ప్రతి100000 జన సంఖ్యకు | ప్రతినూరు చ॥ మై॥ వైశాల్యమునకు | ప్రతి100000 జన సంఖ్యకు |
| అన్ని విధములగు రోడ్లు పొడుగు మైళ్ళు | 20.18 | 84 | 80.00 | 2.500 |
| Surfaced Roads కంకర రోడ్ల పొడుగు | 5.38 | 22 | 12.05 | 383 |
| 100 కి చ॥ మై॥ కంకరవేసిన రోడ్ల పరిమితి | 26.5 | ... | 15.0 | ... |

ఈపై పట్టిక ననుసరించి హిందూదేశమందలి రోడ్లవ్యాప్తి యెట్టిహైన్యస్థితియం దున్నదియు సుబోధక మగుచున్నది. అమెరికా దేశమువలెనే హిందూదేశముగూడ వ్యవసాయ మధికముగ గల దేశము. అమెరికాదేశముతో నీవిషయమున బోల్చుట కిదియే కారణము. జనపదములనుండి ట్రంకురోడ్లకు వచ్చుటకు గాని, రైలుస్టేషనులకు పోవుటకు గాని, చిన్నరోడ్లు నామమాత్రముగ నున్నవి. చాల పల్లెలకు రాకపోకలసౌకర్యములు లేనేలేవు. ప్రస్తుతము కంకరరోడ్లు, మట్టిరోడ్లు కలసి సుమారు 220,000 మైళ్ళపొడుగు గలవు. ఈరోడ్లు అత్యల్పమని హిందూదేశ విస్తీర్ణము ననుసరించియు జనపదముల సంఖ్య ననుసరించియు జెప్పదగును.

## 2. పూర్వ వృత్తాంతము.

లార్డు బెంటిక్ కాలమున రోడ్లను వ్యాపింపజేయవలె నని సంకల్పింపబడెను. లార్డు డల్‌హౌసీగారి కాలమువఱకు (1848-54) రాక

1 *From the Agricultural Commission's Report. para 299.*

పోకలసౌకర్యము లొనగూర్చుటకై ప్రయత్నింప బడలేదు. ఈయన కాలముననే అరోమార్గముల నిర్మాణమును గుఱించి యొక కార్య క్రమము వ్రాయబడెను. పోస్టాఫీసు లేర్పరుపబడి కొంతవఱకు తంతిమార్గములు వేయబడెను. 25000 మైళ్లు మాత్రమే రైలు మార్గమును, 37,000 మైళ్లు కంకరరోడ్లును, 136000 మైళ్ల మట్టిరోడ్లును వేయబడెను. ప్రథమతరగతిరో డ్లనబడురోడ్లు కేంద్ర ప్రభుత్వాధికారమునం దున్నవి. ఈరోడ్లు ప్రజాసామాన్యపువాడుక కంతగ నుపయుక్తములు కావు. ముఖ్యముగ ప్రభుత్వమువారి సేనల నొకచోటనుండి మఱియొకచోటునకు గొనిపోవుటకే ప్రథమతరగతిరో డ్లేర్పరుపబడినవి. ప్రభుత్వ మీప్రథమతరగతి రోడ్లయం దమితశ్రద్ధ వహించుట కిదియే కారణము. 1900 ల సంవత్సరము మొదలు 37000 మైళ్ళనుండి 59000 వఱకు విస్తరింప బడినవి. సుమారు 200,000 మైళ్ళపొడుగుగల రోడ్లలో సుమారు 60,000 మైళ్ళు మాత్రమే కంకర చేయుబడెను. మిగిలినరోడ్లు మట్టిరోడ్లుగ నున్నవి. ఈమట్టిరోడ్లయినను మెట్టపల్లములను తీసివేసి సరిచేయబడుట లేదు. 7 లక్షల గ్రామములుగల భారతదేశమున జనపదములకు బోవుటకు బాట లింతవఱకు వేయబడలేదు. సైనికుల రాకపోకలకై వలయు బాటలపైననే దృష్టి నిగుడింపబడెను. నగరములయందలి రోడ్లకును ప్రథమతరగతి యనురోడ్లకును గూడ బోలికయే లేదు. వర్షకాలము నందు బురదయు, వేసవికాలమునందు దుమ్మును లేని కంకరరోడ్లు గూడ లేవు. ఇందులకు దోడు 1914 వ సంవత్సరమునుంచియు మోటార్లు ప్రతిసంవత్సరము హెచ్చుచున్నవి.

# 3. రోడ్ల యభివృద్ధిసంఘము.

ఈపట్టిక మోటార్ల అభివృద్ధిని దెలుపుచున్నది.

| | | | |
|---|---|---|---|
| 1913—14 వ సంవత్సరమున | 2880 కార్లు | 75 లారీలు | 146 సైకిళ్ళు |
| 1928—29 ,, | 19567 ,, | 12790 ,, | 1802 ,, |

ఈ మోటార్ల తిరుగుడువలన రోడ్లమితముగ పాడగుచున్నవి. అందుచేత రాకపోకలసౌకర్యములను సక్రమముగ పరస్పరవైరుధ్యము లేక జూచు టత్యవసర మని ప్రభుత్వము గ్రహించెను. బొంబాయి, బర్మా, మదరాసు, పంజాబు, సంయుక్తరాష్ట్రములలో రోడ్డుబోర్డులు ఏర్పడుపబడెను. ఈబోర్డులు సలహాసంఘములు మాత్రమే. వీటి కెట్టి యధికారమును లేదు. బర్మా, పంజాబు బోర్డులకు మాత్రము రాష్ట్ర ప్రభుత్వనిధినుండి రోడ్లవిరాళములను బంచుట కధికారము గలదు. సం॥ 1927 నవంబరు మాసమున హిందూదేశప్రభుత్వము రోడ్లయభి వృద్ధిసంఘమును (Roads Development Committee) నియమించెను. 14 గురు భారతశాసనసభ్యు లీసంఘమున సభ్యులు. ఎమ్. ఆర్. జయ కరుగా రీసంఘమున కధ్యక్షులు. ఈసంఘమువారిని (1) రోడ్లయభి వృద్ధియొక్క యావశ్యకమును గుఱించియు (2) రోడ్ల యభివృద్ధికి వలయుధనమును సేకరించుమార్గమునుగుఱించియు (3) హిందూదేశ మందలి రోడ్లయభివృద్ధిని సమన్వయపఱుచుట కొక రోడ్ల కేంద్రసంఘ మును (Central Road Board) స్థాపించుటనుగుఱించియు నివేదింప వలె నని ప్రభుత్వమువారు కోరిరి.

# 4. రోడ్ల యభివృద్ధికగుఖర్చు.

రోడ్లయభివృద్ధికై యెట్లు ఖర్చుపెట్టబడుచున్నదియు ఈక్రింది పట్టికవలన[1] గ్రహింప గలము.

---

1. *Expenditure in recent years from provincial and local revenues on the construction and maintenance of roads.*

లక్షలలో

| రాష్ట్రములు | 1913—14 | | | 1926—27 | | | 1927—28 | | | 1928—29 | | | 1929—30 | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | కొత్తరోడ్లకు సంబంధించిన పని | మరమ్మతులు. | మొత్తము. | కొత్తరోడ్లకు సంబంధించిన పని | మరమ్మతులు. | మొత్తము. | కొత్తరోడ్లకు సంబంధించిన పని | మరమ్మతులు. | మొత్తము, | కొత్తరోడ్లకు సంబంధించిన పని | మరమ్మతులు. | మొత్తము. | కొత్తరోడ్లకు సంబంధించిన పని | మరమ్మతులు. | మొత్తము. |
| చెన్నపట్టణము | 19.9 | 48.5 | 69.7 | 22.9 | 83.8 | 106.7 | 46.3 | 95.9 | 142.2 | 45.8 | 104.9 | 150.7 | 53.7 | 111.3 | 165.0 |
| బొంబాయి | 19.0 | 19.8 | 39.4 | 22.7 | 56.0 | 78.7 | 20.3 | 58.6 | 78.9 | 19.4 | 56.3 | 75.7 | 15.8 | 55.8 | 71.6 |
| బెంగాలు | 17.7 | 28.8 | 46.5 | 18.4 | 47.8 | 66.2 | 16.5 | 51.6 | 68.1 | 13.8 | 50.3 | 64.1 | 9.5 | 49.3 | 58.8 |
| సంయుక్తరాష్ట్రములు | 12.9 | 30.4 | 43.5 | 14.1 | 59.0 | 73.1 | 7.7 | 59.5 | 67.2 | 6.6 | 58.8 | 65.4 | 11.9 | 53.9 | 65.8 |
| పంజాబు | 12.5 | 23.5 | 36.0 | 35.9 | 60.2 | 96.1 | 70.4 | 64.2 | 134.6 | 65.5 | 66.6 | 132.1 | 39.9 | 69.7 | 109.6 |
| బర్మా | 14.8 | 41.4 | 56.2 | 61.6 | 67.3 | 128.9 | 94.0 | 65.5 | 159.5 | 99.6 | 72.4 | 172.0 | 80.7 | 73.3 | 154.0 |
| బీహార్, ఒరిస్సా | 21.5 | 19.2 | 40.7 | 16.2 | 36.9 | 53.1 | 18.3 | 33.9 | 52.2 | 14.9 | 34.0 | 48.9 | 18.9 | 32.8 | 51.7 |
| మధ్యరాష్ట్రములు | 13.4 | 18.7 | 32.1 | 21.9 | 37.3 | 59.2 | 29.7 | 39.8 | 69.5 | 25.3 | 34.7 | 60.0 | 15.6 | 34.7 | 50.3 |
| అస్సాం | 42.1 | 15.1 | 57.2 | 6.8 | 23.3 | 30.1 | 9.8 | 25.5 | 35.3 | 11.2 | 23.2 | 34.4 | 9.5 | 27.2 | 36.7 |
| మొత్తము | 174.4 | 246.7 | 421.1 | 220.5 | 471.8 | 692.3 | 318.0 | 494.5 | 807.5 | 302.1 | 501.2 | 803.3 | 255.5 | 508.0 | 763.5 |
| Index-figure 1913-14 సగటుసూచిక | 100 | 100 | 100 | 126 | 191 | 164 | 180 | 201 | 192 | 173 | 203 | 191 | 146 | 206 | 181 |

*From Indian Roads, July 1931 Issue.*

రోడ్లను వేయుటకు పోషించుటకు లేక మరమ్మతుచేయుటకు రాష్ట్రప్రభుత్వపు నిధులనుండియు లోకల్‌బోర్డుల నిధులనుండియు వినియోగింప బడుచుండినసొమ్ము నీపట్టిక దెలుపును.

ఈపట్టికను బరీక్షించినయెడల,బ్రిత్యేకించి రోడ్లకొఱకధికముగ ఖర్చుపెట్టుటకై రాష్ట్రప్రభుత్వములకును, స్థానికప్రభుత్వములకును,శక్తి చాలదని తెలియును. రోడ్లయభివృద్ధిసంఘమువారిట్లే యభిప్రాయపడిరి. కేంద్రప్రభుత్వము కొంత బాధ్యత వహింపవలెనని నిరి. రోడ్లపై పోవు మోటార్లుపయోగించుపెట్రోలుమీదను, మోటార్ల దిగుమతి మీదను, కేంద్రప్రభుత్వము సుంకములను విధించి యాదాయము రాబట్టుకొనుచున్నది. అందుచేత రోడ్లయభివృద్ధికై కేంద్రప్రభుత్వము గూడ ఖర్చుపెట్టుట సబబని జయకరుసంఘమువారనిరి. ఇందుల కవసరమగుచో మోటారు స్పిరిటుపైన, మోటార్లదిగుమతిపైన సుంకములను హెచ్చించుటయే కాక, అద్దెకుతిరుగు మోటార్లలై సెన్సులను గూడ హెచ్చింపవలె ననిరి. మోటారుస్పిరుటుపైన గేలను ఒక్కింటికి 4 అణాలనుండి 6 అణాలకు సుంకమును హెచ్చింప వలె ననిరి. ఈ హెచ్చించిన 2 అణాలను రోడ్లయభివృద్ధికై ఖర్చుపెట్టవలె ననిరి. ప్రస్తుతము రాష్ట్రప్రభుత్వములు, స్థానికప్రభుత్వములు రోడ్లకై పెట్టుచుండిన ఖర్చును గ్రామములవెంట రోడ్లువేయుటకై వినియోగపడున ట్లొనరించుటకుగాను ప్రస్తుతపురోడ్లతరగతులను పునర్విభాగ మొనరింప వలె ననిరి. రైల్వేశాఖగూడ రోడ్లయభివృద్ధికై విరాళ మొసంగవలె ననిరి. టోలుగేటులను తీసివేయవలె ననిరి. వ్యవసాయవిచారణసంఘమువారు ఋణములను చేసి రోడ్ల నభివృద్ధిచేయవలె ననిరి. జయకరుసంఘము వారు అప్పులనుపుచ్చుకొని రోడ్ల నభివృద్ధిపఱచుట రాష్ట్రప్రభుత్వములు యోచింపవలసినవిషయ మనిరి. రాష్ట్రప్రభుత్వాదాయముల

హామీూపై ఋణముచేసి రోడ్ల నభివృద్ధిపఱచుట తగుపని యని జయకరుసంఘమువారు సూచింపలేదు.

## 5. ప్రస్తుతస్థితి.

రోడ్లయభివృద్ధిసంఘమువారి సూచనల ననుసరించి 1929 వ సంవత్సరపు ప్రభుత్వాదాయ వ్యయశాసనమున మార్పు కలిగెను. పెట్రోలుపై దిగుమతిసుంకము అంతరవ్యాపారశుల్కములు గేలన్ 1 కి 4 అణాలనుండి 6 అణాలకు పెంచబడెను. ఇట్లు పెంచుటవలన సాలుసరి 8కె లక్షల ఆదాయము పెచ్చు వచ్చునని అంచనా వేయబడెను. సం॥ 1929 సెప్టెంబరు 11 వ తేదీని, సర్. బి. యన్. మిత్రిగారు జయకరుసంఘసూచనల ననుసరించి భారత శాసనసభయం దిట్లు తీర్మాన ముపపాదించిరి.

1. మోటారుస్పిరుటుపై అధికపుపన్ను 5 సం॥లవఱకు వేసి రోడ్డ కార్యక్రమము కొనసాగింపవలెను.

2. ఈ అదనపుపన్నులవలన వచ్చురాబడిని రోడ్లయభివృద్ధికై ప్రత్యేకింప వలయును. ఈసొమ్మునకు జమాఖర్చులెక్కలు ప్రత్యేకముగ వ్రాయవలయును. సంవత్సరాంతపునిలువలు మఱుసటిఏటిజమలో చూపవలెనే కాని మొత్తపు ప్రభుత్వాదాయవ్యయముల లెక్కలయందు జేర్చరాదు.

3. ఈసొమ్ము నిట్లు పంచవలెను. 1931 వ మార్చివఱకు గల రెండుసంవత్సరములలోను కేంద్రప్రభుత్వము నూటికి 10 వంతులు నిలవచేయవలెను. ఈనిలవనుంచి ప్రత్యేకపువిరాళముల నీయవచ్చును. రాష్ట్రప్రభుత్వములశక్తికి మించినపనులయందును, లేక ఏకరాష్ట్రమునకును సంబంధించినపని కానప్పుడును, రాష్ట్రప్రభుత్వమునకు సంస్థాన

ప్రభుత్వమునకు సరిహద్దులలో చేయవలసిన పనులకును, మొదలగు ప్రత్యేక పరిస్థితులలో ప్రత్యేకవిరాళముల నీయవచ్చును. మిగిలిన మొత్తమును రాష్ట్రప్రభుత్వములకు పంచిపెట్ట వలయును. ఆయా రాష్ట్రమునందు ఖర్చుపడిన పెట్రోలులెక్కల ననుసరించి రాష్ట్రముల మధ్య రాబడిని పంచిపెట్ట వలయును. చిన్న చిన్న రాష్ట్రములలోను స్వదేశసంస్థానములలోను ఖర్చగు పెట్రోలుపై వచ్చునాదాయము కేంద్రప్రభుత్వమునకే ప్రత్యేకింప బడవలెను.

4. భారతశాసనసభవారి రోడ్లకమిటీసలహా ననుసరించి గవర్నరుజనరలుగారు మంత్రియుతుడై రాష్ట్రములకు విరాళముల నొసంగవలయును. (బర్మాలేదు)

5. ప్రతిసంవత్సరము భారతశాసనసభయు, స్టేటుకౌన్సిలుసభయు సభ్యులతోగూడిన రోడ్లసంఘమును నియమించుచుండవలెను. ఈసంఘమునకు రోడ్లశాఖను పరిపాలించు ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గసభ్యుడధ్యక్షుడుగా నుండవలెను. (Executive Councillor) ఈసంఘమువారు రోడ్లయభివృద్ధినిగురించిగవర్నరుజనరలుగారికిసలహానిచ్చుచుండవలెను.

6. రోడ్లనిధినుండి ఖర్చుపెట్టుసొమ్మునకు శాసనసభవారి కోశోపసంఘముయొక్కయు, రోడ్లసంఘముయొక్కయు, ననుమతి యుండవలయును. ఈతీర్మాన మామోదింపబడెను.

కేంద్రరోడ్లబోర్డు నియమింపబడ నవసరము లేదనియు, ప్రత్యేకించి కేంద్రప్రభుత్వమున రోడ్లపరిపాలనశాఖను స్థాపింప నగత్యములేదనియు, జయకరుసంఘమువారు సూచించిరి. రాష్ట్రప్రభుత్వప్రతినిధులు కేంద్రప్రభుత్వప్రతినిధులతో గలియుచు రోడ్లయభివృద్ధినిగురించియు, అభివృద్ధిమార్గముల గురించియు, అభివృద్ధిపరిశోధనలగురించియు, నప్పుడప్పుడు సభలొనరించు టవసరమనిరి. ఇట్టిసభలవలననే వివిధప్రాంతములయందలి యభివృద్ధి నేకోన్ముఖముగ నడుపుటకు

పీలుండునని సూచించిరి. కేంద్రప్రభుత్వమునకు రోడ్లయింజనీరును నియమింపవలె ననిరి. ఇతడే రోడ్లసభకు కార్యదర్శిగ నుండవలె ననిరి.

ఈ సూచనల ననుసరించి 1930 వ సంవత్సరమున ఏప్రిల్ మాసమున రోడ్లను గుఱించి అఖిలభారతసభ జఱుపబడెను.[1] ఈ సభయందు అదనముగ విధించిన పెట్రోలు పన్ను నిట్లు విభజించిరి.

| | | | |
|---|---|---|---|
| బొంబాయి | 17.20 | లక్షల | రూపాయలు |
| బెంగాలు | 13.20 | ,, | ,, |
| మదరాసు | 12.78 | ,, | ,, |
| స్వదేశ సంస్థానములు | 10.00 | ,, | ,, |
| పంజాబు | 8.15 | ,, | ,, |
| సంయుక్తరాష్ట్రములు | 4.64 | ,, | ,, |
| మధ్యరాష్ట్రములు | 3.75 | ,, | ,, |
| బీహారు, ఒరిస్సాలు | 2.88 | ,, | ,, |

ఈ మొత్తములు 1930–31 వ సంవత్సరమున ఖర్చుపెట్టవలెను. ఈసభవారు కేంద్రప్రభుత్వపు రోడ్లనిధినుండి విరాళముల బొందుట కర్హమగురోడ్ల నిట్లు విభజించిరి:—

1. మొదటితరగతి:—ఒకకమీషనరు డివిజనునకు గాని, ఒక సంస్థానమునకుగాని, ఒకరాష్ట్రప్రభుత్వమునకుగాని మించిన ప్రాముఖ్య స్థితిగలరోడ్లు.

2. రెండవతరగతి:—ఒక జిల్లా కలక్టరు జిల్లా ప్రాముఖ్యతకు మించినరోడ్లు. రైలుస్టేషనులకు వేయబడినరోడ్లు. కాలువలు నదులు మొదలగువానికి వేయబడినరోడ్లు, మొదటితరగతిరోడ్లకు కలిపేరోడ్లు. రోడ్లయభివృద్ధికై జరిగినకృషి ఈమాత్రమే.

"గతించిన అరశతాబ్దమునుండియు గలిగినయభివృద్ధిని గమనించియే రైళ్లవిషయమున, రోడ్లవిషయమున హిందూదేశము నిప్పు

1. *All India Roads Conference.*

స్థితియం దున్నదనక తప్పదు." అని వ్యవసాయ విచారణసంఘము వారు వ్రాసిరి.[1]

వ్యవసాయసంఘుని వేదిక రోడ్లయావశ్యకతనుగుఱించి విపులముగ చర్చించి యున్నది. పంటలు విరివిగ నమ్ముడుపోవుటకు అరణ్యముల యందు దొరుకుపదార్థములు జనపదములవెంట విశేషముగ లభించు టకు రోడ్లు వలవలె అల్లుకొనవలయును. అమెరికాసంయుక్తరాష్ట్ర ముల యభివృద్ధికి ఆదేశమునందు రోడ్లధికముగ వ్యాప్తియగుటయే కారణము. పారిశ్రామికాభివృద్ధి యగుటకు రోడ్లవ్యాప్తి అత్యవసరము. ముడిదినుసులు పారిశ్రామిక కేంద్రస్థానమునకు స్వల్పవ్యయమున సకా లమున బోవుటకు రోడ్లే ముఖ్యసాధనము. సాలుఒక్కంటికి భారత దేశపు విదేశవర్తకమే రు 600 కోట్లకు పైగ నున్నపుడు రోడ్లెట్లు వ్యాప్తి చెందియుండవలయునో వేఱుగ వ్రాయబనిలేదు.

కె. జి. మిచ్చన్; ఎల్. హెచ్. కర్కునెస్‌గార్లు, (Messrs K. G. Mitchenn, Road Engineer with the Government of India, L. H. Kirkness Officer on Special duty to the Railway Board) హిందూదేశపు ప్రభుత్వమువారిచే నియోగింపబడి, రోడ్ల యు రైళ్ళయు ప్రస్తుతస్థితినిగుఱించి విచారించి నివేదికను ప్రకటించిరి. వీరినివేదికయందు రోడ్లనుగుఱించి యిట్లు విమర్శించిరి. "ప్రభుత్వము వారిచే నవలంబింపబడిన రోడ్లవిధానమున ట్రంకురోడ్లకే ప్రాముఖ్యత యొసంగబడెను. చిన్నరోడ్లు నిర్లక్ష్యము చేయబడినవి.''......... "హిందూదేశమందలి రోడ్లనిర్మాణమునుగుఱించి సింహావలోకన మొనరించుచో ముఖ్యమైన రోడ్లుకంటెను చిన్నరోడ్లు, లేక జిల్లాల యందలి రోడ్లకంటెను ట్రంకురోడ్లు, అత్యుత్తమస్థితియం దున్నవి. వీటిమధ్య పోలికయే లేదు.''......"రోడ్లయభివృద్ధినిగుఱించి యొక విస్పష్టమగు కార్యక్రమ మేమియునులేదు. ప్రస్తుతమున్న కార్యక్రమ

1. *Agricultural Commission's Report p. 369.*

వీలుండునని సూచించిరి. కేంద్రప్రభుత్వమునకు రోడ్లయింజనీరును నియమింపవలె ననిరి. ఇతడే రోడ్లసభకు కార్యదర్శిగ నుండవలె ననిరి.

ఈ సూచనల ననుసరించి 1930 వ సంవత్సరమున ఏప్రిల్ మాసమున రోడ్లను గురించి అఖిలభారతసభ జరుపబడెను.[1] ఈ సభ యందు అదనముగ విధించిన పెట్రోలు పన్ను నిట్లు విభజించిరి.

| | | | |
|---|---|---|---|
| బొంబాయి | 17.20 | లక్షల | రూపాయలు |
| బెంగాలు | 13.20 | ,, | ,, |
| మదరాసు | 12.73 | ,, | ,, |
| స్వదేశ సంస్థానములు | 10.00 | ,, | ,, |
| పంజాబు | 8.15 | ,, | ,, |
| సంయుక్తరాష్ట్రములు | 4.64 | ,, | ,, |
| మధ్యరాష్ట్రములు | 3.75 | ,, | ,, |
| బీహారు, ఒరిస్సాలు | 2.88 | ,, | ,, |

ఈమొత్తములు 1930–31 వ సంవత్సరమున ఖర్చుపెట్టవలెను. ఈసభవారు కేంద్రప్రభుత్వపు రోడ్లనిధినుండి విరాళముల బొందుట కర్హమగురోడ్ల నిట్లు విభజించిరి:—

1. మొదటితరగతి:—ఒకకమీషనరు డివిజనునకు గాని, ఒక సంస్థానమునకుగాని, ఒకరాష్ట్రప్రభుత్వమునకుగాని మించిన ప్రాముఖ్య స్థితిగలరోడ్లు.

2. రెండవతరగతి:—ఒక జిల్లా కలక్టరు జిల్లా ప్రాముఖ్యతకు మించినరోడ్లు. రైలుస్టేషనులకు వేయబడినరోడ్లు. కాలువలు నదులు మొదలగువానికి వేయబడినరోడ్లు, మొదటితరగతిరోడ్లకు కలిపేరోడ్లు. రోడ్లయభివృద్ధికై జరిగినకృషి ఈమాత్రమే.

"గతించిన అరశతాబ్దమునుండియు గలిగినయభివృద్ధిని గమనించియే రైళ్ళవిషయమున, రోడ్లవిషయమున హిందూదేశము నిమ్న

1. *All India Roads Conference.*

స్థితియం దున్నదనక తప్పదు." అని వ్యవసాయ విచారణాసంఘము వారు వ్రాసిరి.[1]

వ్యవసాయసంఘుని వేదిక రోడ్లయావశ్యకతనుగుఱించి విపులముగ చర్చించి యున్నది. పంటలు విరివిగ నమ్ముడుపోవుటకు అరణ్యముల యందు దొరుకుపదార్థములు జనపదములవెంట విశేషముగ లభించు టకు రోడ్లు వలవలె అల్లుకొనవలయును. అమెరికాసంయుక్త రాష్ట్ర ముల యభివృద్ధికి ఆదేశమునందు రోడ్లధికముగ వ్యాప్తియగుటయే కారణము. పారిశ్రామికాభివృద్ధి యగుటకు రోడ్ల వ్యాప్తి అత్యవసరము. ముడిదినుసులు పారిశ్రామిక కేంద్రస్థానమునకు స్వల్పవ్యయమున సకా లమున బోవుటకు రోడ్లే ముఖ్యసాధనము. సాలుఒక్కంటికి భారత దేశపు విదేశవర్తకమే రు 600 కోట్లకు పైగ నున్నపుడు రోడ్లెట్లు వ్యాప్తి చెందియుండవలయునో వేఱుగ వ్రాయబనిలేదు.

కె. జి. మిచ్చెన్; ఎల్. హెచ్. కర్క్‌నెస్‌గార్లు, (Messrs K. G. Mitchenn, Road Engineer with the Government of India, L. H. Kirkness Officer on Special duty to the Railway Board) హిందూదేశపు ప్రభుత్వమువారిచే నియోగింపబడి, రోడ్ల యు రైళ్ళయు ప్రస్తుతస్థితినిగుఱించి విచారించి నివేదికను ప్రకటించిరి. వీరినివేదికయందు రోడ్లనుగుఱించి యిట్లు విమర్శించిరి. "ప్రభుత్వము వారిచే నవలంబింపబడిన రోడ్లవిధానమున ట్రంకురోడ్లకే ప్రాముఖ్యత యొసంగబడెను. చిన్నరోడ్లు నిర్లక్ష్యము చేయబడినవి."........ "హిందూదేశమందలి రోడ్లనిర్మాణమునుగుఱించి సింహావలోకన మొనరించుచో ముఖ్యమైన రోడ్లుకంటెను చిన్నరోడ్లు, లేక జిల్లాల యందలి రోడ్లకంటెను ట్రింకురోడ్లు, అత్యుత్తమస్థితియం దున్నవి. వీటిమధ్య పోలికయే లేదు."......"రోడ్లయభివృద్ధినిగుఱించి యొక విస్పష్టమగు కార్యక్రమ మేమియునులేదు. ప్రస్తుతమున్న కార్యక్రమ

1. *Agricultural Commision's Report p. 369.*

మునకు రు 18.43 కోట్లు మాత్రమే యగును. అన్ని రాష్ట్రములలోను రోడ్లు అభివృద్ధియగుటకై మొత్తమెంతమాత్రము చాలదు. రోడ్లయభివృద్ధిఋణమను పేర అప్పులను జేసి రోడ్లయభివృద్ధిని జేయుట సమంజసము. రోడ్లవ్యాప్తికై అత్యధికముగ ధనము కావలసియున్నది."

మదరాసు రాజధాని

మదరాసు రాజధానియందలి రోడ్లస్థితినిగుఱించి ఈ నివేదికయం దిట్లు వ్రాయబడెను:—

1. రాష్ట్రప్రభుత్వమువారివలన విరాళములను బొందుచు, జిల్లాబోర్డులచే పోషింపబడుచు, కంకర చేయబడినరోడ్లు మదరాసురాజధానియందు జాలమైళ్ళవిస్తీర్ణముగ నున్నవి.

2. ఈమధ్యనే గ్రామాభివృద్ధినిధిని (Village Development Fund) నెలకొల్పిరి. ఈనిధిచే గ్రామమునకు రాకపోకలసౌకర్యముల నభివృద్ధి చేయవలెనని ప్రభుత్వసంకల్పము.

3. 3000 మైళ్ళపొడుగుగల కంకరచేయబడని మట్టిరోడ్లు మదరాసురాజధానియందు గలవు.

4. రోడ్లకై యగుచుండిన ఖర్చునందు జాలభాగము స్థానిక ప్రభుత్వములే (Local Boards) పెట్టుచున్నవి. కంకరజేయబడినరోడ్లలో నూటికి 95 వంతులు జిల్లాబోర్డులపోషణయం దున్నవి.

5. మొత్తముమీద ఈరాష్ట్రమునందు రోడ్లవ్యాప్తి బాగుగనే యున్నది.

6. డబ్బులేక మరమ్మతులు కొదువవై కంకరరోడ్లు క్షీణించిపోవుచున్నవి. మోటార్లవలన చాలరోడ్ల మరమ్మతు ముఖ్యావసరము. ముఖ్యముగ పట్టణములయందును గ్రామములయందును గూడ మట్టిరోడ్లకు కంకరజేయుట అవసరము.

7. రోడ్లను ప్రయాణములకు సౌకర్యముగ కలుపుటకై వంతెనలును, మురుగుబోవుతూములును లేవు. వంతెనలను తూములను గట్టుట ప్రాముఖ్యవిషయము.

8. మంచిరోడ్డుమీద ఎడ్లబండి పోవుటకగుఖర్చు, చెడ్డరోడ్డు మీద ఎడ్లబండి పోవుటకగుఖర్చుకంటె చాల తక్కువ. ఖర్చులోగల యీవ్యత్యాసము గమనింప దగియున్నది. చాలపెద్దగ్రామము లెన్నియో రోడ్డుమీద లేవు. ఇట్టిగ్రామములను చిన్నరోడ్లు వేసి పెద్దరోడ్లతో కలుపుట కమితధనము కావలసియున్నది. అయిన నీవిషయము యోచింప దగును. ఈనివేదికయందే మదరాసురాజధానియందలి కొన్నిజిల్లాల నుదాహరణముగ గొని ఆయాజిల్లాలయం దొనరింపవలసినపని నిట్లు నిర్వచించిరి. అందు చిత్తూరు, కృష్ణా, పశ్చిమగోదావరి, గుంటూరు జిల్లాలనుగుఱించి యిటుల వ్రాసిరి:—

చిత్తూరు. చిత్తూరుజిల్లాయందు రహదారిరోడ్లతో గ్రామములకు కలియు చిన్నరోడ్లను వేయుచున్నారు. 1920 వ సంవత్సరమున జిల్లాబోర్డువారు ఏడులక్షలరూపాయలతో 350 మైళ్లరోడ్లను 20 అడుగులయెత్తున గ్రామములకు వేయ సంకల్పించిరి. ఈస్కీము పూర్తిగావలెనన్న చాలధనము కావలసి యున్నది. ప్రభుత్వమువారి యొద్దనుంచి 43000 రూపాయల విరాళము పొంది, రెండవతరగతిరోడ్లను పోషించుటకుగాను జిల్లాబోర్డు యింత మొత్తము తిరిగి ఖర్చుపెట్టవలసి వచ్చుచున్నది. జిల్లాబోర్డు మొత్తము 86000 రూపాయలు ఖర్చుపెట్టుచున్నది. ప్రస్తుతార్థికదుస్థితి రాకపూర్వము సాలుసరి చిత్తూరుజిల్లాబోర్డు 120000 రూపాయలనుఖర్చుపెట్టుచుండెడిది.

కృష్ణాజిల్లా. ఈజిల్లాయందు రోడ్లయభివృద్ధి చాల అత్యావసరము. కాని యేరోడ్లయభివృద్ధి ముఖ్యావసరమో, జిల్లాబోర్డువారు నిర్ణయింప జాలకున్నారు. ఈజిల్లా రెండుభాగములుగ విభజింపవచ్చును. (1) పల్లపుసాగుగల పల్లెలు, (2) మెరకపంటగల పల్లెలు. పల్లపుసాగుగల పల్లెలలో రోడ్లయభివృద్ధినిగుఱించి

విస్తారముగ మాకు జెప్పిరి. కాని మెరక గ్రామములలో రోడ్లయభివృద్ధి యత్యవసరమని మాకు తోచినది. పల్లపు గ్రామములలోకంటె మెరక గ్రామములయందు గల మట్టిరోడ్లను తక్కువఖర్చుతో కంకరచేయించుటకు వీలున్నది. గ్రామాదులకు పోవుటకు వలయుబాటలు లేవు. వంతెనలులేవు. ఈజిల్లా రోడ్లయభివృద్ధినిగుఱించి సవిస్తరముగ యోచింపదగును.

పశ్చిమగోదావరి

ఈజిల్లాయందు మట్టిరోడ్లను కంకరజేయుట ప్రాముఖ్యసమస్య. వంతెనలను గట్టుటయు గ్రామములకు క్రొత్తబాటలను వేయుటయు గూడ ప్రాముఖ్యసమస్యలే. 19½ లక్షల రూపాయలతో కట్టవలసియున్న క్రొత్తవంతెనలజాబితా మా కొసంగబడెను. సుమారు 20 గ్రామములు, గ్రామమొక్కంటికి 1000 మంది జనాభాగలిగి యేరోడ్డుతోగాని సంబంధములేక రాకపోకలసౌకర్యములు లేక యున్నవి. ఈగ్రామములను రోడ్లతో కలుపవలెనన్న 57 మైళ్ల పొడుగుగలరోడ్లను వేయవలెను. వలయుడబ్బున్నయెడల క్రొత్తరోడ్లను వేయుటకు, పాతరోడ్లను మరమ్మతుచేయుటకు నవకాశము కలదు.

గుంటూరు.

గుంటూరు జిల్లాబోర్డుప్రెసిడెంటు సవిస్తరముగ నాజిల్లాయందలి రోడ్లపరిస్థితిని గుఱించి వివరించెను. ఈజిల్లాయందు మూడువందలమైళ్ల మట్టిరోడ్లను కంకరజేయుట ముఖ్యావసరము. గ్రామమొక్కంటికి 1000 మంది జనాభాగల 679 గ్రామములలోను 417 గ్రామములే రహదారిరోడ్డుమీదగాని లేవు. ఈగ్రామములకు చిన్నరోడ్లు వేయుటకు 1250 మైళ్లుగల క్రొత్తరోడ్లు వేయవలెను.

# 6. రైలుస్టేషనులకుపోవు చిన్నరోడ్లు.

రైల్వేస్టేషనులకు రహదారిరోడ్లనుంచి పోవు చిన్నరోడ్లను గుఱించి మదరాసుప్రభుత్వమువా రిట్లు వ్రాసిరి. "రైల్వేస్టేషనులకు రహదారిరోడ్లనుంచి చిన్నరోడ్లను వేయవలసినబాధ్యత యెవరిది? ఈబాధ్యత రైల్వేకంపెనీవారు వహింపవలెనా? లేక స్థానికప్రభుత్వములు వహింపవలెనా? ప్రస్తుతనియమముల ననుసరించి స్థానికప్రభుత్వముల నీరోడ్లు వేయవలెనని నిర్బంధించుటకు వీలు లేదు. లోకలుబోర్డు లిట్టి రోడ్లను వేయ నిరాకరించినవి. రైల్వేకంపెనీవారే యీరోడ్లను వేసుకొనవలెనని తెలిపినవి? రైల్వేకంపెనీవారు రోడ్లను వేయుటయు,పిమ్మట స్థానికప్రభుత్వము లారోడ్లను పోషించుటయు, జేసినయెడల రైల్వేకంపెనీలకును స్థానికప్రభుత్వములకును నీవిధముగ రాజీ కుదురగలదు. కాని రైల్వేబోర్డువారు రైలుస్టేషనులయొక్క ఆవరణయందు మాత్రమే రోడ్లను వేయుటకు తీర్మానించిరి. అందుచేత ప్రయాణీకుల కసౌకర్యముగ నున్నది. ఈవిషయమై మఱల విమర్శింపవలసి యున్నది."

మదరాసు రాజధానియందలి రోడ్లస్థితినిగుఱించి ప్రత్యేకోద్యోగులు వ్రాసిన కడపటిమాటలు గమనింప దగినవి. "మదరాసు రాజధానియందలి రోడ్లవిస్తీర్ణము బాగుగనే యున్నను అభివృద్ధి కావలసియేయున్నది. సక్రమమైనపద్ధతిని యభివృద్ధికి బూనుచో ఆపని యొకరాష్ట్రీయ రాకపోకలసంఘము నేర్పఱచి, ఆసంఘమువారి యాజమాన్యమున జేయుట సమంజసము. ఈసంఘమునందు రైల్వేకంపెనీలకుగూడ తగు ప్రాతినిధ్య ముండవలెను.

# 7. ముగింపు.

ఎంతత్వరితముగ భారతావనియందు గ్రామగ్రామమునకు రోడ్లే ర్పడునో, అంతత్వరితముగ భారతదేశమునం దార్థికాభివృద్ధి కాగలదు. గ్రామములకు బాటలేర్పడకపోయినచో నితరప్రయత్నము లెన్ని చేసి నను నిరర్థకము. నేటివఱకు ప్రభుత్వ మీవిషయమై యుదాసీనత వహిం చినదనుట నిశ్చయము. కేంద్రరాష్ట్రప్రభుత్వము లీవిషయమై అత్య ల్పముగ ధనము నుపయోగించుచున్నా రనుటయు సత్యము. మోటార్ల దిగుమతిపైన పెట్రోలు దిగుమతిపైన పెట్రోలుపై విధించు అంతర వ్యాపార శుల్కములపైన వచ్చు డబ్బంతయునైన రోడ్లపై వినియో గింప బడలేదు. ప్రస్తుతము విధించుచున్న రోడ్ల పెట్రోలుపన్ను రెండ ణాలవలన సుమారు సాలు కొకకోటిరూపాయల ఆదాయము వచ్చు చున్నది. ఈఆదాయము రోడ్లయభివృద్ధికి సరిపడదు. ఏసంవత్సరమున కాసంవత్సరము మరమ్మత్తులక్రిందనే చాల సొమ్ము వ్యయమగు చున్నది. నూతనాభివృద్ధి త్వరితగతిని జరుగుట కీసొమ్మునందు వలయు నంతగ మిగులుటలేదు. ఈసొమ్ము సక్రమముగ నుపయోగపడుట కొకటే మార్గము గలదు. ఈ రెండణాలపన్నును కనీసము 20 సంవత్స రములవఱకు వసూలు చేయునట్లు శాసన మొనరింపవలెను. ఈపన్ను వలన వచ్చు ఆదాయమును అసలుపాయిదాలలో తీర్మానముపెట్టు నట్లు విభజించి, సుమారు 20 సంవత్సరములలో తీర్చివేయుపద్ధతిని ఋణము చేయుట సమంజసము. అట్లు చేయుచో నీకోటిరూపాయల హామిమీదను సుమారు 12న్నర కోట్ల రూపాయ లప్పు లభింపగలదు. ఈమొత్తముతో దేశమందంతట నొక్కపట్టున రోడ్లను వ్యాప్తి చేయుట కనువగును. ఇట్లొనరించుటవలన రోడ్ల యభివృద్ధికొఱకు ప్రజ లపై క్రొత్తపన్నులు విధింపవలసినపని యుండదు. ఇట్టి కార్యక్రమ మేదియైన కొనసాగింపబడక పోయినయెడల భారతార్థికాభి వృద్ధికి పునాదు లేర్పడవు.

# 8. రైల్వేలు

1 వ ఘట్టము మొదలు 1840-70 వఱకుగల హామీ పద్ధతి

రైల్వేచరిత్ర మఱియొక విషాదవృత్తాంతము. రైల్వేలు వ్యాప్తిచెందినకొలదియు నార్థికాభివృద్ధి పెంపొందుటకు మాఱుగ కుంగిపోవుట ప్రారంభించెను. 1840 వ సంవత్సర ప్రాంతమునం దయోమార్గములను వేయుట ప్రారంభించిరి. 1848 వ సంవత్సరమున డల్‌హౌసీ ప్రభువు పరిపాలకుడుగ వచ్చువఱకు గమనార్హమగు కృషి జరుగ లేదు. 1849 వ సంవత్సరమున మొట్టమొదట ఈస్టిండియా రైల్వేకంపెనీవారితోను (East Indian Railway Company) గ్రేటు ఇండియన్ పెనిన్సులర్ రైల్వేకంపెనీవారితోను (Great Indian Peninsular Railway Company) కంట్రాక్టు వ్రాయించుకొనిరి. ప్రథమమున 1853 వ సంవత్సరమునందు బొంబాయినుండి థానావఱకు 20 మైళ్లపొడవున గ్రేటు ఇండియన్ పెనిన్సులర్ రైల్వేకంపెనీవారు తమ రైలును నడపిరి. 1854 వ సంవత్సరమున కలకత్తానుండి రాణీగంజికిని, 1856 వ సంవత్సరమున మదరాసునుండి అర్కోణమునకును, ఈస్టు ఇండియన్ రైల్వేకంపెనీవారు తమ రైళ్లను నడపిరి. 1853 వ సంవత్సరమున డల్‌హౌసీగారు భారతదేశమం దంతట నయోమార్గముల నిర్మించు ప్రణాళికను వ్రాసిరి. కాని యీ ప్రణాళిక యమలునం దుంచబడ లేదు. ప్రథమభారత స్వాతంత్ర్య సంగ్రామ మాకాలముననే సంభవించెను. (The Great Indian Mutiny of 1857 ఆసంగ్రామ రంగము ముగిసినది. భారత దేశమునందు నలుమూలల రైలుమార్గము లుండి సైన్యనివహంబుల గొనిపోవుటకు వీలుండినగాని ఆంగ్లేయప్రభుత్వాధికారము శాశ్వతముగ బ్రతిష్ఠించుటకు వీలుండ దని నాటిపరిపాలకులు తలంచిరి. 1859 వ సంవత్సరములో డల్‌హౌసీగారి రైళ్ల

నిర్మాణవిధాన మాచరణయందుంచ మొదలిడిరి.ఎనిమిది రైలుకంపెనీ లతో కంట్రాక్టుల గావించుకొనిరి. 5000 మైళ్ల రైలురోడ్డును వేయిం చిరి. ఈకంపెనీ లీరైలుమార్గముల వేయుటకొఱకే యేర్పడినవి. ఈకంపెనీ లన్నియు నాంగ్లేయులచే నాంగ్లేయుల పెట్టుబడితో ప్రారం భింపబడెను. ఈకంపెనీలతో గావించుకొనిన కంట్రాక్టులయందు 10 ముఖ్య షరతులు గలవు.

1. పెట్టుబడి పెట్టబడిన సొమ్ముపై కంపెనీలకు నూటికి 4½ లేక 4¾ మొదలు 5 రూపాయలవఱకు వడ్డీని ఇంగ్లండులో.....ఇచ్చు నట్లుగ ప్రభుత్వము బాధ్యత వహించుట.

2. ఈబాధ్యత వహించినందులకుగాను కంపెనీల జమాఖర్చు లను, పనిని బరీక్షించుటకు ప్రభుత్వమున కధికారము కలదు.

3. కంట్రాక్టులు ముగిసినపిమ్మట నీకంపెనీలను గొని వేయుటకు ప్రభుత్వమున కధికారము కలదు.

4. గవర్నమెంటు అవసరమగు భూములను ఉచితముగ 99 సం వత్సరముల పర్యంతము కంపెనీలకు ఒసంగవలెను.

5. ఈకంపెనీలు గవర్నమెంటువారి తపాలాల నుచితముగ గొనిపోవలెను. ప్రభుత్వమువారి సైన్యమును తక్కువరేటుమీద ప్రయాణము చేయనీయవలెను.

6. ప్రభుత్వము బాధ్యత వహించిన వడ్డీలకుపైగా లాభము వచ్చుచో కంపెనీలును గవర్నమెంటును చెఱిసగముగ పంచుకొన వలెను.

7. కంపెనీలు తమ పెట్టుబడిసొమ్మును ఇంగ్లండులో గాని ఇండియాలో గాని ప్రభుత్వకోశాగారమం దుంచవలెను. అవసరమగు డబ్బును అడిగినపుడెల్ల ప్రభుత్వమువారు కంపెనీల కిచ్చుచుండవలెను.

హిందూ దేశమున బుచ్చుకొనుడబ్బు 22 పెన్నీల మారకపు రేటు చొప్పున పుచ్చుకొనునిర్ణయము. రైళ్ళమీదవచ్చు ఖర్చులు పోను మిగులురాబడి నూటికి సుమారు 5 రూపాయలుచొప్పున పెట్టుబడి కొసంగవలసిన వడ్డీకి చాలనపుడు, ప్రభుత్వ మీయవలసిన లోతక్కువ వడ్డీ 22 పెన్నీల మారకపు రేటు చొప్పుననే ఇంగ్లండులో నీయవలెను.

8. ప్రభుత్వమువారి యామోదమునుపొందిన రేట్లప్రకారము రైళ్ళను ప్రజలప్రయాణమున కుపయోగింపవలెను.

9. మొట్టమొదట 25 సంవత్సరములు లేక 50 సంవత్సరములు ముగిసినపిమ్మట రైల్వేకంపెనీల పెట్టుబడి యంతయు నిచ్చివేసి, కంపెనీలను కొనుటకు ప్రభుత్వమున కధికారము గలదు. ఇట్లు కొనునప్పుడు ఆకాలమునకు ముందు మూడుసంవత్సరములనుండియు లండనునందు గల సగటుధరల ననుసరించి కొనుటకు నిర్ణయము.

10. రైళ్ళు నడుపుట ప్రారంభింపబడిన మూడుమాసముల పిమ్మట రైల్వేకంపెనీలు ప్రభుత్వమువారికి మూలధనమును పుచ్చుకొని యిచ్చివేయుటకు కంపెనీల కధికారము గలదు.

ఈపదిషరతుల ననుసరించి విదేశీకంపెనీలను, వారిపెట్టుబడులను భారతదేశమునకు దిగుమతి యొనరించిరి. ఈకంట్రాక్టుల ననుసరించి యేటేట కోట్లకొలది ప్రజలసొమ్ము కంపెనీలకు లభించుచుండెడిది. రైలుమార్గములను వేయుటకు వలయుపరికరము లన్నియు ఇంగ్లండు నుంచియే తెప్పింపబడెను. డల్‌హౌసీకాలమున మైలు 1 కి పౌ॥ 8000 లు మాత్రమే ఖర్చుఅగు నని అంచనా వేయబడెను. కాని 1868 వ సంవత్సరములో మైలు 1 కి 18000 పౌనులు ఖర్చుపెట్టబడెను. ఇంతటి యదనపు ఖర్చుపెట్టుటకు గారణమేమి? ఇందులో పరికరములకై పెట్టబడిన ఖర్చును, పెద్ద తెల్లఉద్యోగుల జీతబత్తెములకై పెట్టబడినఖర్చును

నపరోక్షముగ మరల కంపెనీలకే చెల్లినది. ఎంతసొమ్ము వ్యయపుచ్చిననూ నష్టమువచ్చునను భయము లేదు. వడ్డీకి ప్రభుత్వము బాధ్యత వహించియుండుటచే ఖర్చుపెట్టిన సొమ్మునకు ప్రత్యక్షముగ వడ్డీ గిట్టుచుండెను. అందుచే కంపెనీ లెట్లధికముగ దుర్వ్యయ మొనరించినను కంపెనీలకు నష్టము లేకపోవుటయే గాక, ఆనాడు బజారులలో లభించుచున్న 3% వడ్డీకంటె హెచ్చువడ్డీ ప్రభుత్వపుహామీమీద లభించెను.[1] హిందూదేశప్రభుత్వము సాలుసరి వడ్డీలక్రింద 58 కోట్లు ఈకంపెనీల కొసంగవలసి వచ్చినది. ఆనాడు హిందూదేశప్రభుత్వమే నూటికి 3న్నర వంతున లండనునందు ఇండియాయందునగూడ అప్పులను పుచ్చుకొనగలిగెను. ఆకాలముననే భారతవర్షమంతయు క్షామదేవత కాకరమై ప్రజలు "అన్నమో రామచంద్రా" యనునార్తిని గుందుచున్నారు. రైల్వేకంపెనీలపేరుగ జేయబడెడి ధనశోషణముగూడ బ్రిజాసంక్షోభమున కొకకారణము. అందువలన తాత్కాలికముగ క్రొత్తకంపెనీలను బయలుదేఱదీసి కంట్రాక్టులనిచ్చుట మానివేసిరి. 1860 లో క్రొత్తకంపెనీలను బాధ్యత వహించకుండ సృష్టింప బ్రియత్నములు జరిగెను. విఫలములైనవి. ప్రభుత్వము క్రొత్తకంపెనీలకు గూడ సహాయము చేసెను.

*1870—1880. రెండవఘట్టము. ప్రభుత్వమే రైళ్లను వేయుట.*

అయోమార్గనిర్మాణమున 1870 మొదలు 1880 వఱకు రెండవఘట్టముగ పరిగణింప దగును. ఈ కాలమున ప్రభుత్వమే అయోమార్గములను వేయించుచు ప్రభుత్వమే స్వయముగ పరిపాలించుట ప్రారంభించెను. ఈఘట్టమునందు ప్రత్యక్షముగ కంపెనీలు పెట్టుబడిపెట్టుట, వాటికి ప్రభుత్వము వడ్డీలిచ్చుట మానిరి. కాని యప

1. *Cf. Railway Policy in India by H. Ball 1894 p. 2*

రోకముగ ఇంగ్లండునందలి వర్తకులకు వడ్డీ ముట్టుపద్ధతి ప్రారంభింప బడెను. భారతరాజ్యాంగ కార్యదర్శి ఇంగ్లండులో భారతదేశపు పన్ను లరాబడి తాకట్టుపైన 100 కి నాలుగురూపాయల వడ్డీ నిచ్చుచు అప్పులచేయుట ప్రారంభించెను. సాలుసరి రెండుమిలియనుల పౌనులు అప్పుచేయ నిర్ణయించిరి. డల్‌హౌసీకాలమందలి 5 అడుగుల 6 అంగుళముల వెడల్పుగల యినుపదారులను వేయుటకు మాఱుగ, 3 అడుగుల 3 అంగుళముల వెడల్పుగల అయోమార్గములను వేయ ప్రారంభించిరి. ఇండస్‌లోయయందు (సింధునదిలోయ) పంజాబులో అంతవఱకును గల చిన్నమార్గములను తీసివేసి, 1870 సం॥ పిమ్మట పెద్దరైలుమార్గముల మరల నిర్మించిరి. ఇందులకు రెండింతలధన మదనముగ వ్యయమైనది. ఈనూతన రైలుమార్గములుప్రభుత్వాధికారము సుస్థిరముగా స్థాపించుటకై వేయబడినవే కాని ప్రజాసౌకర్యము కొఱకై నిర్మింపబడలేదు. ఈకాలమునందే మారకపురేటుయొక్క తారుమారు సంభవించెను. ఇంగ్లండునందు చేయబడిన అప్పులపై సాలుసరి చెల్లించవలసిన వడ్డీ మారకపు రేటువలన హెచ్చినది. ఇంతలో ఆఫ్గనిస్థానముతో యుద్ధము ప్రారంభించిరి. 1874-79 సంవత్సరములలో కఱవులు వచ్చినవి. 1881 వ సం॥ పు కఱవుల కమీషను 5000 మైళ్ళ పొడుగుగల అయోమార్గములను వెంటనే వేయవలె ననిరి. 20000 మైళ్ళ రైలు మార్గము వేసినగాని హిందూదేశమున కాటకము నశింపదని ఈకమీషనువారు సూచించిరి. ఈసూచన ననుసరించి ప్రభుత్వామే స్వాయముగ రైళ్ళను వేయుటకంటె మరల కంపెనీలచే వేయించుట ప్రశస్తమని ప్రభుత్వమువారు దలంచిరి. 1879 వ సంవత్సరమునకు అనగా సుమారు 25 సంవత్సరములలో కంపెనీలు 6028 మైళ్ళ పొడుగుగల అయోమార్గములను 97.87 మిలియనుపౌనులు ఖర్చుపెట్టి నిర్మించెను.

ప్రభుత్వమువారు 2179 మైళ్ళపొడుగుగల అయోమార్గములను 23,09 మిలియనుపౌనులు మాత్రమే ఖర్చుపెట్టి నిర్మింపగలిగిరి.

1869 మొదలు 1881 టవ సంవత్సరమువఱకు ప్రభుత్వము వారిచే నిర్మింపబడిన రైళ్లకై 26689000 పౌనులు ఖర్చు పెట్టబడెనని సర్ జాన్ స్ట్రేచీగారు వ్రాసిరి.[1]

ఈమొత్తములో సాలుసరి ప్రభుత్వాదాయమునుండి ఖర్చు పెట్టిన మొత్తముగాని క్షామనిధినుండి ఖర్చుపెట్టిన మొత్తముగాని చేరి యుండ లేదు.

1880-1900 3 వ ఘట్టము. క్రొత్త హామీ పద్ధతి.

1880 వ సంవత్సరము పిమ్మట మూడవఘట్టము ప్రారంభించెను. మొట్టమొదట కంట్రాక్టులయందు వహించినంత బాధ్యత వహింపలేదు. బెంగాల్ నాగపూరురైల్వేకంపెనీ, మదరాసు సదరన్ మహారట్టారైల్వే కంపెనీ మొదలగువాటితో కంట్రాక్టులను గావించుకొనిరి. కంపెనీలు పనిప్రారంభించిన 25 సంవత్సరములు ముగిసిన పిమ్మట గాని, లేక పదిపది సంవత్సరముల కాలమధ్యమున గాని కంట్రాక్టులను రాజ్యాంగ కార్యదర్శి విరమించుకొన వచ్చును. పెట్టుబడిధనము అప్పటిధరల ననుసరించి యిచ్చివేయవలెను. ఆ స్తియందలి హక్కు భారతరాజ్యాంగ కార్యదర్శికే కలదు. పెట్టుబడిపై నూటికి 3న్నర వంతున వడ్డి యొసంగవలెను. వడ్డిపోను మిగిలిన లాభములు ఐదింట మూడువంతులు ప్రభుత్వమునకు చెందవలెను. ఈషరతుల ననుసరించి క్రొత్తకంపెనీలు బయలుదేరినవి. ఇంతలో మొట్టమొదట కంట్రాక్టు లీయబడిన కంపెనీలకు 25 సంవత్సరములు ముగిసినవి. 1880 సంవత్సరములో ఈస్టిండియన్ రైల్వేకంపెనీని, 1884 లో ఈస్టుబెంగాల్

---

1. *Sir John Stratchey's Finance and Public Works of India.*

రైల్వేకంపెనీని, 1885 లో సింధు పంజాబు ఢిల్లీకంపెనీని, 1886 లో అయోధ్యా రోహిల్ ఖండ్ రైల్వేకంపెనీని, 1890 లో సౌతు ఇండియన్ రైల్వేకంపెనీని, 1900 లో గ్రేటుఇండియన్ పెనిన్సులర్ రైల్వే కంపెనీని ప్రభుత్వమువారు కొనిరి. కొంతకాల మీరైలుమార్గములను గవర్నమెంటువారే స్వయముగ పరిపాలించిరి.

4. వ ఘట్టము రైళ్లనుతిరిగి కంపెనీలకిచ్చుట

ఈనాల్గవ ఘట్టమున మరల కంపెనీలకు కొన్నిరైలు మార్గము లిచ్చివేయ బడెను. ఈమార్గములయందు ప్రభుత్వమునకు సర్వాధికారము గలదు. కంపెనీలకు పెట్టుబడిసొమ్ము నిచ్చి ప్రభుత్వము కొనెను. ఇట్లు పెట్టుబడిసొమ్ము నిచ్చుటలో అమితధర లిచ్చెను. ఇట్లమితధర లిచ్చి కొనిన అయోమార్గములు నడుపుటకై మరల కంపెనీల కిచ్చుటేల? నడుపుటలో గూడ పెట్టుబడికి వడ్డీ భరించుబాధ్యత ప్రభుత్వమే వహించెను. ఇట్లు బాధ్యత వహించుచు పెట్టుబడిసొమ్ము నిచ్చివేసి కొని మరల నడుపుట కింకొకరి కొసంగవలసినపని లేదు. అట్లిచ్చునప్పుడైన భారతీయుల కొసంగలేదు. సీమవర్తకులకే యొసంగెను. ఈవిధముగ గొన్నిరైలుమార్గములు ప్రభుత్వమువారి స్వాధీనమున నుండెను. ప్రభుత్వమువారిచేతనే పరిపాలింపబడు చున్నవి. కొన్ని రైలుమార్గములు ప్రభుత్వమువారి స్వాధీనమై యితరకంపెనీలచే ప్రభుత్వపు బాధ్యతపై నడుపబడుచున్నవి.

స్వదేశ సంస్థానములయందలి రైలుమార్గములు చాలవఱకు సంస్థానములచేతనే వేయబడి, నడుపుట కితరకంపెనీలకు కంట్రాక్టు లీయబడెను. హైదరాబాదుసంస్థానము మొట్టమొదట రైలుమార్గమును నిర్మించుటకు ప్రారంభించెను. ఈవిధముగ స్వదేశ సంస్థానము

లలో 5000 మైళ్ల పొడుగుగల యినుపదారులు గలవు. 1900 సంవత్సరమున రైలుమార్గములను నడుపుటకు 33 కంపెనీ లున్నవి.

1900—14 వ ఘట్టము: రైళ్ళపరిపాలన లాభనష్టములు.

1896 వ సంవత్సరమున కంపెనీలు హిందూదేశములో ఋణ మొనరింప రాదని శాసింపబడెను. వలయు ఋణమును, ప్రభుత్వమువారే చేయుచు కంపెనీల కొసంగ బ్రారంభించిరి. 1900 మొదలు 1914 లోపుగ 10,000 మైళ్ల పొడుగుగల రైలుమార్గములు వేయబడెను. ఇవి చిన్నమార్గములు. ఈచిన్నమార్గములు ముఖ్యమార్గములకు చేర్చుచు వేయబడెను. 1909 లో నాగడ-మధుర మార్గమును, 1905 లో క్వెట్టామార్గమును, 1907 లో దక్ఖాబాదు-ముప్పారుమార్గమును, 1908 లో రామేశ్వరము-ధనుష్కోటి మార్గమును నిర్మింపబడెను.

"1850 1898 వ సంవత్సరము వఱకు నీరైలుమార్గములపై నష్టమే సంభవించెను. ఈనష్టమునకు కాంపౌండువడ్డీతో గట్టిమదింపు వేసిన, 1919-20 వ సంవత్సరము వఱకు రు 3460622128 ల నష్టము సంభవించెనని తివారీగారు వ్రాసిరి"[1] అనగా హిందూదేశప్రభుత్వము నష్టముల రూపముగ ఇంగ్లండునందలి వర్తకులకు 346 కోట్ల రూపాయలలోను హెచ్చుభాగము ముట్టజెప్పెను. 1899-1900 సంవత్సరమందే ప్రప్రథమమున 11 లక్షలు రైళ్ళశాఖలో లాభము సూచింపబడెను. నేటివఱకు రైళ్ళవలన ప్రభుత్వాదాయమున గలిగిన లాభనష్టముల నిట్లు ప్రభుత్వమువారు చూపుచున్నారు.

---

1 *See Vera Anstey's Economic Development of India p. 146*

“+ ఈ గుఱుతు లాభము.” “— ఈ గుఱుతు నష్టము” లను తెలియ జేయును.

| సంవత్సరము | లక్షలు | సంవత్సరము | లక్షలు |
|---|---|---|---|
| 1858 | — 65 | 1886 | — 119 |
| 1859 | — 110 | 1887 | — 212 |
| 1860 | — 120 | 1888 | — 223 |
| 1861 | — 151 | 1889 | — 185 |
| 1862 | — 167 | 1890 | — 69 |
| 1863 | — 184 | 1891 | — 32 |
| 1864 | — 193 | 1892 | — 185 |
| 1865 | — 24 | 1893 | — 154 |
| 1866 | — 94 | 1894 | — 235 |
| 1867 | — 165 | 1895 | — 162 |
| 1868 | — 193 | 1896 | — 266 |
| 1869 | — 162 | 1897 | — 143 |
| 1870 | — 193 | 1898 | — 94 |
| 1871 | — 182 | 1858-1898 Total | — 5775 |
| 1872 | — 286 | 1899 | + 11 |
| 1873 | — 179 | 1900 | + 49 |
| 1874 | — 161 | 1901 | + 127 |
| 1875 | — 156 | 1902 | + 34 |
| 1876 | — 115 | 1903 | + 129 |
| 1877 | — 15 | 1904 | + 316 |
| 1878 | — 207 | 1905 | + 300 |
| 1879 | — 157 | 1906 | + 347 |
| 1880 | — 104 | 1907 | + 286 |
| 1881 | — 29 | 1908 | — 186 |
| 1882 | — 131 | 1909 | + 124 |
| 1883 | — 30 | 1910 | + 303 |
| 1884 | — 105 | 1911 | + 568 |
| 1885 | — 73 | 1912 | + 721 |

| సంవత్సరము | లక్షలు | సంవత్సరము | లక్షలు |
|---|---|---|---|
| 1913 | + 718 | 1925 | + 1301 |
| 1914 | + 324 | 1926 | + 883 |
| 1915 | + 611 | 1927 | + 736 |
| 1916 | + 1122 | 1928 | + 1004 |
| 1917 | + 1487 | 1929 | + 643 |
| 1918 | + 1585 | 1930 | + 245 |
| 1919 | + 935 | 1930-1931 | — 624 |
| 1920 | + 564 | 1931-1932 | — 986 |
| 1921 | — 910 | 1932-1933 | — 934 |
| 1922 | + 117 | 1933-1934 | |
| 1923 | + 121 | Budget, estimate | — 777 |
| 1924 | + 652 | | |

1908–1909 వ సంవత్సరమున, 1921 వ సంవత్సరమున లాభము రాలేదు. 1930–31 నుండియు మరల నష్టము వచ్చుచున్నది. 1900 సం॥ వఱకు రైళ్లపరిపాలనలో 57.80 కోట్లు నష్టము చూపబడెను.

ప్రస్తుతము భారతదేశమున 39048 మైళ్ల అయోమార్గము కలదు. స్వదేశసంస్థానములయందలి 5000 మైళ్ల రైలుమార్గముపై ప్రభుత్వమున కెట్టి అధికారమును లేదు. బ్రిటిష్ ఇండియాయందలి రైలుమార్గములపై పెట్టినపెట్టుబడులలో నూటికి 80 వంతులు ప్రభుత్వమువలన గాని ప్రభుత్వపుబాధ్యతమీఁది గాని అప్పులమూలకముగ నున్నది. గవర్నమెంటువారి యధికారమునందున్న అయోమార్గములు ప్రభుత్వశాఖలక్రిందనే పరిపాలింప బడుచున్నవి. గవర్నమెంటువలన కంట్రాక్టులుపొందిన కంపెనీలపై భారతదేశ రాజ్యాంగకార్యదర్శికే అధికారము గలదు. ఇండియాప్రభుత్వమున కధికారములేదు. కంపెనీల

డైరెక్టరులలో నొకడైరెక్టరును భారతదేశ రాజ్యాంగకార్యదర్శి నియమించు చున్నాడు. ఆడైరెక్టరునకు (వీటో) రద్దుపఱచు అధికారము కలదు. హిందూదేశ ప్రభుత్వమునకు పరిపాలనవిధానమును, ఖర్చును (Management and Expenditure) నిరూపించి నిర్ణయించుట కధికారము గలదు. కంపెనీవారి ఉద్యోగస్థులపై ఎట్టిఅధికారమును లేదు. పరిపాలనావిధానమును ఖర్చును నిరూపించి నిర్ణయించుఅధికారము కూడ భారతదేశ రాజ్యాంగకార్యదర్శి యధికారమునకు లోబడియే చెలాయించవలెను. ఈ కంపెనీలన్నియు సీమలో రిజిష్టరుచేయబడి యున్నవి. డైరెక్టరులందఱు అచ్చటనే యుందురు. వీరి ఏజంటులు మాత్రమే ఇండియాలో పరిపాలించుచున్నారు. గవర్నమెంటునకు సలహానిచ్చు ఇంజనీరుఉద్యోగియే ఏజంట్లకు సలహానిచ్చు ఇంజనీరుగా నుండుట అలవాటుగ నున్నది. సం॥ 1900 మొదలు సం॥ 1914 వఱకు రైల్వేశాఖను గుఱించి విచారణలు జరుపబడెను. దీనిఫలితముగ (పబ్లిక్ వర్క్సు డిపార్టుమెంటువారి) కట్టడములశాఖ పరిపాలననుండి రైళ్లపరిపాలన 1905 లో స్థాపింపబడిన రైల్వేబోర్డువారికి బదిలీ చేయబడెను. ఈబదిలీవలన గలిగినఫలిత మిసుమంతయు లేదు.

6 వ ఘట్టము, యుద్ధకాలము ఓమ్మట

ఇంక 6 వ ఘట్టమున జొరబడెదము. రైలుమార్గములు ప్రజోపయోగముకొఱకై వేయబడె ననుమాట కల్ల యని యీఘట్టమునందు ఋజువైనది. ఐరోపామహాసంగ్రామము సాగినది. రైళ్లన్నియు ప్రజోపయోగము నుండి యుద్ధోపయోగమునకు తారుమారు చేయబడెను. క్రొత్త రైలుమార్గములు వేయబడలేదు. పాతవి బాగుచేయబడలేదు. సగముసగము పూర్తియైనమార్గములు సంపూర్ణ మొనరింపబడలేదు. ఉన్న అయోమార్గములే యూడదీయబడి మెసపటోమియా

యుద్ధభూమికి పంపబడెను. నాడు హిందూదేశమందలి ప్రయాణీకులు బండెలదొడ్లయందలి పశువులవలె ప్రయాణము చేయవలసి వచ్చెను. యుద్ధభయమున ఓడలరాకపోకలు తగ్గినవి. వర్తకవ్యాపార మంతయు రైల్లుమార్గముననే జరుగుట విధియయ్యెను. సమయము జూచి రేట్లను హెచ్చించిరి. అమితముగ లాభము వచ్చుట ప్రారంభించెను. లాభము వచ్చుటయన నేమి? ప్రభుత్వము బాధ్యతవహించిన వడ్డీసొమ్మును కంపెనీల కిచ్చుటయే కాక, యీలాభమునందు కొంతభాగముకూడ కంపెనీలకు జెందును. అందుచే కంపెనీలు లాభదృష్టితో రేట్లను హెచ్చించినవి. ప్రజలపై భరింపరాని భారము పడెను. సామానుల యెగుమతి దిగుమతులపై గూడ రేట్లను హెచ్చించిరి. ఆహారపదార్థములధరలు జీవనాధారములగు పదార్థములధరలు కూడ హెచ్చినవి. ప్రజలజీవితము దుర్భరమైనది. వర్తక మవరోధింపబడినది. కంపెనీలకు నష్టమువచ్చినపుడు ప్రజలయొద్ద వసూలుచేయబడిన పన్నులనుండి నష్టపరిహారము లొసంగబడెను. లేక ప్రజలపన్నులను తాకట్టుపెట్టి ఇంగ్లండులో ఋణము లొనరించి, నష్టపరిహారములక్రింద నొసంగబడెను. ఇంతతో తృప్తిలేదు. 1917 వ సంవత్సరమున ప్రయాణీకులరేట్లను వర్తకసామానుపై రేట్లను హెచ్చించి లాభము సంపాదించి యీలాభమును కంపెనీలకుగూడ పంచిపెట్టిరి. రైల్వేకంపెనీల లాభనష్టములను ప్రజాదృక్పథమున జూచుచో లాభనష్టములు రెండును ప్రజలకు సమానోపయోగములే. ఏరాయి యైనను పళ్లూడగొట్టుకొనుట కొకటే, యనుసామెతగ లాభనష్టములవలన ప్రజలకేమియు ఫలితము లేదు. ఆంగ్లేయకంపెనీలకు ఆంగ్లేయవర్తకులకు ఆంగ్లేయ ఋణదాతలకు ఆంగ్లేయోద్యోగస్థులకు మాత్రమే భారతదేశమందలి అయోమార్గము లుపయోగముగ నున్నవి. వీరి మత సాంఘికార్థిక రాజకీయాది సర్వ

తోముఖ సౌఖ్యముల బాటించుటయే రైల్వేపరిపాలనయందలి మొద టిపని. భారతీయార్థికాభివృద్ధి వర్తకాభివృద్ధి ప్రయాణీకుల సౌకర్య ములను గణించుట రెండవపని. జాతీయదృక్పథ మీపరిపాలన లో జొప్పింపవలె నని ప్రజానాయకు లనేకమాఱులు మొఱబెట్టిరి. ప్రభుత్వనిర్లక్ష్యమును ఖండించిరి. రైల్వేపరిపాలనయందు జాతిద్వేష మపారముగ జూపింపబడుచున్నది. నల్లప్రయాణీకుల మొఱ వినువారు లేరు. మూడవతరగతి ప్రయాణీకులగతి దుర్భరము! దుర్భరము!! అయిననేమి!!! ప్రజాభిప్రాయమును పెడచెవిని బెట్టుటయందు మన ప్రభుత్వ మారితేరినబంటు. యుద్ధానంతర మైనను సవరించుకొన నుద్యు క్తులు కాలేదు. 1919 వ సంవత్సరమున ఈస్టిండియన్ రైల్వేకంపె నీతో గావించుకొనిన కంట్రాక్టు ముగిసినది. కంట్రాక్టు ముగియుట తోడనే ప్రభుత్వ మారైలుమార్గమును స్వాధీన మొనరించుకొన వలెను. అందులకు మాఱుగ మరల కంట్రాక్టునకిచ్చెను. షరతులను గూడ మార్చలేదు. 1926 వ సంవత్సరమువఱకు నీకంట్రాక్టు గావింప బడెను. ఈప్రభుత్వచర్య ప్రజాకంటక మయ్యెను.

## 9. ఆక్వర్తు కమిటీ.

### ACWORTH COMMITTEE.

భారతదేశ ప్రభుత్వాధికారమందలి అయోమార్గములు గూడ సీమవారు శాశ్వత బ్రహ్మకల్పముగ పరిపాలించుట భారతీయులు భరింప జాలకపోయిరి. ప్రజాందోళన పెచ్చుపెరిగెను. తత్ఫలితముగ 1920 వ సంవత్సరము నవంబరున సర్ విలియమ్ ఆక్వర్తుగారి అధ్యక్షత క్రింద నొకవిచారణ సంఘమును నియమించిరి. ఈ ఆక్వర్తుగారు రైల్వేపరిపాలనమం దనుభవజ్ఞు లందురు. ఈఆక్వర్తు కమిటీయందు

9 మంది సభ్యులు గలరు. ఈకమిటీవారంద రొక్కుమ్మడిగ నాటి రైల్వేపరిపాలనమును ఖండించిరి. సీమలో నివసించు దొరలచేత సీమ లోనుండు కంపెనీలచేత ఇండియాలోని రైలుమార్గములు పరిపాలింప బడుట పరిహాసాస్పద మనిరి. ఆదుస్థితి తొలగు టత్యవసర మనిరి. కంట్రాక్టులు ముగిసినవెంటనే రైలుకంపెనీల నన్నింటిని ప్రభుత్వము స్వాధీనపఱచుకొనవచ్చును.

ఈసంఘము వారియెదుట నొసంగబడిన సాక్ష్యము రైళ్ళపరి పాలనయందలి విషాదవృత్తాంతము నంతను సుబోధక మొనరించు చున్నది.

1. "హిందూదేశమందలి రైలుమార్గముల వ్యాప్తి చాల యసంతృప్తిగ నున్నది.

2. రైలులో ప్రయాణీకులకు ఊపిరిసలుపకుండ ప్రయాణము చేయవలసి వచ్చుచుండును. స్థలము చాలదు. క్రిక్కిరిసి ప్రయాణము చేయవలసినస్థితి నిత్యకృత్యముగనే యున్నది.

3. ప్రజలు రైళ్ళలో పడుబాధలన్నియు ప్రభుత్వమునకు నివే దించుకొనుచున్నారు. కంపెనీ ఏజంట్లకు విన్నవించుచున్నారు. అయి నను బాధ నివారణ యగుటలేదు.

4. సీమవర్తకులకు గల వర్తక సౌకర్యములు భారతీయ వర్తకు లకు లేవు. ఇందులకు జాత్యభిమానమే కారణము.

5. రైల్వేఉద్యోగస్థులకు వర్తకులొసంగుచున్న లంచములు దిన దినాభివృద్ధి జెందుచున్నవి."

ఇట్టి వివిధకష్టములు వివరింపబడినవి. మూడవతరగతి ప్రయా ణీకుల కష్టములను సత్యసంధుడగు గాంధీమహాత్ము డిట్లు వివరించెను.

"బొంబాయినుండి మదరాసునకు బయలుదేరు రైలునందొక

పెట్టెలో 35 గురుఉండిరి. ఇందులో 23 రకుమాత్రమే క్రిక్కిరిసికూర్చుండు టకు స్థలముకలదు. అది రాత్రికాలము. ఈపెట్టె ప్రయాణకాలమం దెపుడును తుడువబడలేదు. పాయిఖానాదొడ్డియందు నీళ్ళు లేవు. దొడ్డి తుడువబడలేదు. అపరిశుభ్రముగ నున్నది. ఆహారపదార్థములు అపరి శుభ్రములైనవి మాత్రమే స్టేషనులయందు ప్రయాణీకులకు లభింప గలవు. మఱియు చిన్నరైల్వేయుద్యోగులు వీరివద్దనుండి చాల హెచ్చు రేట్లను వసూలుచేయుచున్నారు." లోకైకపూజ్యుడగు మహాత్ముని వాక్యములపై వ్యాఖ్యాన మనవసరము. వివిధకష్టములను గుఱించి ఆక్వర్తు కమిటీవారు కొన్ని సూచనల నొనరించిరి.

1. "ఎగుమతుల దిగుమతుల విషయము, ప్రయాణీకుల విష యము సక్రమముగ పరిశీలించి కష్టముల నివారించుట కొకప్రత్యేక శాఖ నేర్పఱుపవలెను.

2. రైళ్ల ఆదాయవ్యయనిర్ణయ శాసనము ప్రత్యేకింప బడ వలెను.

3. రైల్వేబోర్డును సక్రమమగు నియమముల ననుసరించి పునర్నిర్మాణ మొనరింపవలయును.

4. ప్రజలకు, వర్తకులకు ప్రాతినిధ్యము వహించుచు వారికష్ట ముల దొలగింపవలెను.

5. రేట్లను నిర్ణయింపగలిగి ప్రయాణీకుల సౌఖ్యముల గమనిం చుట కొకసంఘ ముండవలెను." అని యీకమిటీవారు సూచించిరి. ఈసూచనలయందు ముఖ్యమైనవియు, ప్రజోపయోగకర మైనవియు, నింతవఱ కాచరింపబడలేదు.

# 10. రైల్వేబోర్డు.

1922 వ సంవత్సరములో రైల్వేబోర్డును మరల నిర్మించిరి. ఇం దయిదుగురు సభ్యులుండిరి. ముఖ్యు లిద్దరు. ప్రధానకమీషనరు. ఆర్థిక కమీషనరు (Chief Commissioner and Financial Commissioner) ఇందు ప్రధాన కమీషనరుగారు సాంకేతిక విషయములపై అధికారము వహించుచున్నారు. రెండవవారు పరిపాలనావిషయములను ఆర్థికవిష యములను జూచుచున్నారు. ఈయన ప్రభుత్వార్థికశాఖకు ప్రతినిధి. ఈబోర్డువారుఅయిదుగురుడైరక్టర్ల సహాయముగూడబొందుచున్నారు. ఈబోర్డువారుచేసినపని బోర్డువారి నివేదికయం దిట్లు వివరింపబడెను.

1. "తక్కువ జీతగాండ్రకష్టముల నివారించుటకు ప్రయత్నములు.

2. జాతిద్వేషమును దొలగించి భారతీయుల కధికముగ నుద్యోగము లిచ్చుట.

3. అల్పసంఖ్యాకులగు కులములవారికి ఉద్యోగములను లభింపజేయుట.

4. ఉద్యోగములయందు తరగతులను సక్రమముగనిరూపించుట

5. ఉద్యోగస్థుల విషయమై క్రొత్తనియమముల నేర్పఱచుట.

6. కార్మికులవిషయమై విచారింప నియమింపబడిన కమీషను వారికి రైల్వేకార్మికులగుఱించి సాక్ష్యము తయారుచేయుట.

7. రైల్వేకార్మికుల సంఘముతో రైల్వేశాఖకుగల సంబంధమును దిట్టపఱచుట.

8. జి. ఐ. పి. రైల్వేయందు సమ్మెకట్టిన పనివాండ్రను తిరిగి యుద్యోగములలో చేర్చుకొనుటకై ప్రయత్నములు చేయుట,

9. ఇట్టి యితరముఖ్యవిషయములు." ఇది 1929 వ సంవత్సరము ఏప్రిలునుండి 1931 వ సంవత్సరము జనవరివఱకు గల 18 మాసముల లోను జేసినపనియని నివేదిక తెలుపుచున్నది.[1]

ఈబోర్డువారు చేయవలసినపని చాల గలదని వారే వ్రాసిరి. వీరిసూచనల ననుసరించి సాలుఒక్కంటికి సుమారు 13120000 కోట్ల న్నర రూపాయలు అగునని తెలిపిరి. ఈసొమ్ము నిట్లు వినియోగింప దలంచిరి.

ఈపట్టికవలన వినియోగవిధానము తెలియును.

000 ఈ సున్నలు కలుపు కొనవలెను.

| | 1930-31 | 1931-32 | ఏటేటనగుఖర్చు |
|---|---|---|---|
| జీతముల యభివృద్ధి | 2476 | 3700 | 4000 |
| పనిచేయవలసిన కాల పరిమితి | | | |
| నియమముల ననుసరించి | 1832 | 2846 | 4520 |
| క్రొత్తసెలవుల నియమములకు | 219 | 650 | 2000 |
| | | | ప్రభుత్వము వారిచే పరిపాలింపబడుచున్న రైళ్ళకు మాత్రమే |
| విద్యాభివృద్ధి | ... | ... | 1500 |
| Staff Benefit Funds (ఉద్యోగస్థుల సహాయ నిధులు) | 400 | ... | 400 |
| చిల్లరలు | 267 | 700 | 700 |
| | 4294 | 8296 | 13120 |

1. *From Railway Board's Memorandum April 1929 to January 1931.*

ఈబోర్డువారి కార్యక్రమ మిట్లున్నది.

1. కంపెనీల పరిపాలనక్రిందనున్న తక్కువజీతగాండ్ర జీతములను గుఱించియు, ప్రభుత్వపరిపాలనక్రిందనున్న రైళ్లలోగల తక్కువ జీతగాండ్ర జీతములను గుఱించియు విచారించుట.

2. రైల్వేఉద్యోగస్థుల యిండ్లనుగుఱించియు వసతిసౌకర్యములు లేని చిన్నయుద్యోగస్థులకిచ్చు బత్తెములగుఱించియు విచారించుట.

3. రైళ్లశాఖయందు పనిచేయుటకు నిర్ణయింపబడిన నియమిత కాలవిధాన మాచరణయం దుంచుట.

4. కంపెనీరైళ్లయుద్యోగస్థుల సెలవునియమములను మార్చుట, కంపెనీపరిపాలనయందు ప్రభుత్వపరిపాలనయందుగల యుద్యోగస్థులకు సెలవు లేర్పఱచుట. (Leave Reserve)

5. ఈస్టిండియను రైల్వేకంపెనీ యుద్యోగస్థులకు జీతములు సకాలములో ముట్టునట్లు చేయుట. ఇట్లే యితరకంపెనీలయందు గూడ సౌకర్యము లొనరించుట.

6. హెచ్చుఖర్చులు పెట్టి తిరిగి రాబట్టుకొనుటను గుఱించి విచారించుట.

7. రైళయుద్యోగస్థుల పిల్లలకు విద్యాభివృద్ధినిమిత్త మే సహాయ మొనరించు నియమముల నేర్పఱచుట.

8. ఉద్యోగస్థుల అప్పులను తీర్చుటకై వలయు మార్గముల నరయుట.

9. ఉద్యోగస్థుల సహాయనిధివిధాన మేర్పఱచుట (Staff Benefit Fund)

10. అస్వస్థత ఇన్సూర్యెన్సు.

11. ప్రావిడెంటుఫండు నియమములను మార్చుట.

12. ప్రభుత్వ పరిపాలనక్రింద నున్న రైళ్లలో పెద్దయుద్యోగస్థుల తరగతులను మార్చుట.

13. చిన్నయుద్యోగస్థుల నియామకముల గుఱించియు, వారి (ట్రెయినింగు) కొరకు శిక్షను గుఱించియు క్రొత్త నియమములను వ్రాయుట.[1]

ఈసౌకర్యములు స్వల్పజీతగాండ్రకు కొనరించుటకై రైళ్లబోర్డు వారు ప్రయత్నించుట అత్యవసరము.

## 11. సలహాసంఘములు.

ప్రజాభిప్రాయము వ్యక్తపఱచుటకుగాను కేంద్రసలహాసంఘమును స్థానికసలహాసంఘములను స్థాపించిరి. కేంద్రసలహాసంఘమునందు భారతశాసనసభాసభ్యులు, స్టేటుకౌన్సిలుసభ్యులును గలరు. ఈసలహాసంఘములు నిరుపయోగములు. ఈసంఘముల కధికార మేమియును లేదు. ఇందు స్వతంత్రాభిప్రాయములు లేనివారు మాత్రమే సభ్యులుగ నియమింప బడుచున్నారు.

## 12. రేట్ల సలహా సంఘము.

RATES ADVISORY COMMITTEE.

భారతదేశమందలి రైల్వేరేట్లు, రైళ్లలాభనష్టముల ననుసరించియే నిర్ణయింపబడుచున్నవి. ఇట్లు నిర్ణయించుటయే కాక, భారతదేశ పరిశ్రమాభివృద్ధికి వ్యతిరేకముగ నుండునట్లుగ మొట్టమొదటినుండియు గూడ

1. *From the Memorandum of the Railway Board on Staff From April 1929 to January 1931.*

నిర్ణయింప బడుచున్నవి. ఆంగ్లేయ వర్తకాభివృద్ధియే రైళ్లరేట్ల నిర్ణయమునకు మూలసూత్రముగ నున్నది. భారతదేశ వర్తకాభివృద్ధిని పాటింపక, ఆంగ్లేయ వర్తకాభివృద్ధినే ప్రధానముగ గొని రేట్లను నిర్ణయించుట తగనిపని యని పలువురు పలుమాఱు ఘోషించిరి. 1915 వ సంవత్సరమున భారతశాసనసభయందు సర్. ఇబ్రిహీం రహింతుల్లా గారు ఈవిషయమై ప్రభుత్వాచర్యను విమర్శించిరి. (Industrial and Fiscal Commissions) పరిశ్రమల విచారణసంఘమువారి సముఖమునను, ఖజానావిచారణ సంఘమువారి సమక్షమునను, అక్వర్తు కమిటీవారి కట్టెదుటను సాక్ష్యము లొసంగిన భారతీయులు రైళ్లరేట్లను నిర్ణయించుటలో గల జాతిద్వేషమునుగుఱించి ఘోషించిరి. తెల్లనల్లవారిమధ్య చూపింపబడుచున్న విభేదములను ఖండించిరి. రేవుపట్టణములనుండి అంతర్వ్యాపారమునకు బోవుసరకులమీదను, రేవు పట్టణములకు వచ్చు సరకులమీదను తక్కువరేట్లు గలవు. ఇందువలన దేశమునందలి ముడిదినుసులు, సీమకు విరివిగను చౌకగను ఎగుమతి యగుటకు ప్రోత్సాహకరముగ నున్నది. విదేశములనుండి దిగుమతి యగుసరకులు దేశమందు నలుమూలల వ్యాపించుటకు వీలుగ నున్నది. దేశాంతర్గతవ్యాపారము నశింపుచేయబడు చున్నది. దేశమందు ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు గొనిపోవుసరకునకు చార్జీ లెక్కువ.

"జయపురమునుండి మదరాసునకువచ్చు పాలరాయికి కావలసినరైలుచార్జీ, ఇటలీనుండి హిందూదేశమునకు వచ్చుపాలరాయి కగు దానికంటె చాల హెచ్చు. తిరుపూరునుండి లాంకుషైరునకు పంపబడే ప్రత్తికి రైలునకును ఓడకును నగుచార్జీలమొత్తముకంటె, తిరుపూరు నుండి ఢిల్లీకి పంపుటకగుచార్జీ అధికముగ నుండును."[1]

---

1. *From Doctor B. Pattabhi Seetaramayya's Article in Andhrapatrica Annual.*

ఈవిధముగ దేశీయపరిశ్రమకు ప్రతిబంధక మగురీతిని విదేశ వస్తువులతో పోటీ చేయజాలనివిధమున రైలురేట్లు నిర్ణయింపబడు చున్నవి. ఈరేట్లవిషయములో రైళ్ళును, ఓడలును తోడిదొంగలుగ నున్నవి. రైల్వేకంపెనీలును స్టీమర్లకంపెనీలును బుద్ధిపూర్వకముగ నిటి యొడంబడిక లొనరించుకొనుచున్నవి. ఇందువలన రేవు పట్టణముల లోనే భారతీయపరిశ్రమ లభివృద్ధి కావలసివచ్చుచున్నవి. కె. టి. షా గారు రైలురేట్లనుగుఱించి యిట్లు వ్రాసిరి. "రైళ్లను వేయుటకే అధిక వ్యయ మైనది. నడుపుట కంతకంటెను దుర్వ్యయ మగుచున్నది. రైళ్లు భారతీయార్థికస్థితి ననుసరించి నిర్మింపబడలేదు. నడుపబడుటయు లేదు. అట్లే రైళ్లరేట్లుగూడ రైళ్లపై పోవు సరకుననుసరించి నిర్ణయింప బడుటలేదు. ఈరేట్లవలన హిందూదేశవర్తకమును పరిశ్రమయు నేస్థితి యం దుండుననువిషయముగూడ యోచించి రేట్లు నిర్ణయింపబడుట లేదు."[1]

1915 వ సంవత్సరమున రైల్వేబోర్డు, స్వదేశ పరిశ్రమలవిష యమై రేట్లను సక్రమముగ నిర్ణయింపవలసిన దని (సర్క్యులరు) సూచించెను. ఖజానావిచారణసంఘము (Fiscal Commission) స్వదేశ పరిశ్రమాభివృద్ధికి విరుద్ధముగ రైలురేట్లున్నవని అంగీకరించిరి. పరిశ్రమల కమీషనువా రీవిషయమై యోచించి, కొన్ని సూచనల గావించిరి. సమానదూరమునకు, సమానస్థానములకు, రాకపోకల చార్జి కొంచె మించుమించుగ సమానముగ నుండవలెనని సూచించిరి. వ్యవసాయ కమీషనువారు పంటల ఎగుమతి దిగుమతులకు సంబంధిం చినంతవఱకు రైలురేట్లను గుఱించి విమర్శించిరి.[2]

1. *Trade Tariff and Transport in India p. 397 by Mr. K. T. Shah.*

2. *Agriculture Commission Report 1928 pp. 377—379*

వంటచెఱకు, మేత, పశువులు, ఎగుమతి దిగుమతులపైన వ్యవసాయాభివృద్ధికి వలయు యంత్రసామగ్రుల ఎగుమతి దిగుమతులపైన రేట్లను తిరిగి యోచింపవలె నని వ్యవసాయ సంఘమువారు సూచించిరి. ఈసూచనలు కొన్ని 1930 ఏప్రెల్ మాసమున ప్రభుత్వమువారిచే నంగీకరింప బడినవి. పశువుల ఎగుమతి దిగుమతి రేట్లను కొద్దిగ తగ్గించిరి.

ఆక్వర్తుకమిటీవారి సూచనల ననుసరించి, సం॥ 1926 ఏప్రెల్ 1 తేదీనుండి రేట్ల సలహాసంఘమును నియమించిరి. ఈకమిటీకి సర్. బయ్యా నరసింహాశర్మగా రధ్యక్షులు. ఈసంఘమునందు మఱి యిరువురు సభ్యులు గలరు. ఒకరు రైల్వేలప్రతినిధిగను, మఱియొకరు వర్తకసంఘప్రతినిధిగను, నియమింప బడుచున్నారు. రేట్లయొక్క వ్యత్యాసములను గుఱించియు, వర్తకసదుపాయములను గుఱించియు, నితర తగవులను గుఱించియు విచారించుట కీసంఘమువారి కధికారము కలదు. ఈసంఘము, సలహాసంఘము మాత్రమే యగుటచే దీనిసలహాలు ప్రభుత్వమువారిచే పాటింపబడవలె ననువిధి లేదు. సం 1917 లో మొట్టమొదట రేట్లు హెచ్చింపబడినవి. సం॥ 1921 లో అంతకన్నను హెచ్చింపబడివి. సం॥ 1922 లో రేట్లను శాశ్వతముగ హెచ్చించిరి. 1925-26 వ సంవత్సరమునందు 3 వ తరగతి ప్రయాణికులకు మైలు 1 కి 9న్నర పైసలును, ఒకటవ తరగతికి 20.8 పైసలును రేటు కలదు. (fare) ఎగుమతి దిగుమతి సరకు పదితరగతులుగా విభజింపబడి రేటు నిర్ణయింప బడుచున్నది. ఇంగ్లండునందు హిందూదేశమునందు రైల్వే రేట్లెట్లున్నదియు నీపట్టికవలన దెలిసికొనగలము.

## New English Classification.

### ఇంగ్లండు నందలి తరగతుల వివరము.

మైలు 1కి 1 మణుగు బరువునకు చేయు రేటు.

| తరగతి | మొదటి 20 మైళ్లు లేక లోపుగ (పైసలు) | 30 మైళ్ళు లేక లోపుగ (పైసలు) | 50 మైళ్ళు లేక లోపుగ (పైసలు) | పైదూరమునకు (పైసలు) |
|---|---|---|---|---|
| 1 | .74 | .37 | .21 | .20 |
| 2 | .84 | .41 | .27 | .25 |
| 3 | .88 | .43 | .31 | .27 |
| 4 | .90 | .47 | .35 | .30 |
| 5 | 1.01 | .49 | .37 | .30 |
| 6 | 1.03 | .53 | .47 | .31 |
| 7 | 1.13 | .62 | .47 | .37 |
| 8 | 1.19 | .68 | .53 | .39 |
| 9 | 1.25 | .74 | .59 | .41 |
| 10 | 1.37 | .90 | .68 | .43 |
| 11 | 1.47 | .99 | .82 | .57 |
| 12 | 1.52 | 1.05 | .88 | .62 |
| 13 | 1.66 | 1.13 | .98 | .68 |
| 14 | 1.77 | 1.25 | 1.03 | .82 |
| 15 | 1.87 | 1.35 | 1.15 | .90 |
| 16 | 1.97 | 1.44 | 2.25 | 1.03 |
| 17 | 2.14 | 1.62 | 1.31 | 1.13 |
| 18 | 2.28 | 1.76 | 1.44 | 1.25 |
| 19 | 2.65 | 2.07 | 1.72 | 1.50 |
| 20 | 3.12 | 2.44 | 2.24 | 1.72 |
| 21 | 4.68 | 3.65 | 3.37 | 2.53 |

Present Indian Classification.

[1]హిందూదేశ ప్రస్తుతపు తరగతులు.

| తరగతి | గరిష్ఠపు రేటు. పైసలు. |
|---|---|
| 1 | .38 |
| 2 | .42 |
| 3 | .58 |
| 4 | .62 |
| 5 | .77 |
| 6 | .83 |
| 7 | .96 |
| 8 | 1.04 |
| 9 | 1.25 |
| 10 | 1.87 |

"హిందూదేశమున ఒకటన్ను బరువుగలసరకు సుమారు 200 మైళ్లు రైలు 1కి ప్రయాణము చేయుచున్నట్లు గ్రహింపదగును. అన్ని రైళ్లమీాదను కలిసి సగటున 300 మైళ్లు పోవుచున్నటుల పరిగణింపవచ్చును. ఇంగ్లండులో సగటున 300 మైళ్లు ప్రయాణము చేయు 10 వ తరగతిసరకునకు మైలు 1 కి 0.58 పైస చార్జి. ఇట్లె 300 మైళ్ళు ప్రయాణముచేయు హిందూదేశపుసరకు నాల్గవతరగతియందుంచబడినది. హిందూదేశమందలి నాల్గవతరగతి, ఇంగ్లండునందలి పదియవతరగతికి సమానముగ నున్నది."[2]

ప్రయాణీకులచార్జీలు హిందూదేశమునందు తక్కువగ నున్నవి. ఇంగ్లండులో సగటుఆదాయము తల 1 కి సుమారు 50 పౌనులు. ఇండి

1. *From Indian Finance year-book 1938.*
2. *Finance year-book p. 287.*

యాలో తల 1 కి సగటుఆదాయము సుమారు 3 పౌనులు. అనగా హిందూదేశమునకంటె సీమలో 17 రెట్లెక్కువ సగటు ఆదాయము కలదు. ఈ హెచ్చుతగ్గుల ననుసరించి చూచుచో ఇంగ్లండునందలి ప్రయాణీకుల చార్జీలకంటె హిందూదేశమునందలి ప్రయాణీకుల చార్జీలు 12 రెట్లెచ్చుగా మదింపువచ్చును. ఇంగ్లండునందలి రేట్లకంటె ఇండియాలో 1/5 వంతు మాత్రమే హెచ్చగుటచే ఇండియాయందలి చార్జీలు 12 రెట్లు తగ్గింపవలసి యున్నవి. ఖర్చులు పోను మిగులుఆదాయములో నూటికి 30 వంతులు ప్రయాణీకులనుండి వచ్చుచున్నది. సర్. విలియమ్ ఆక్వర్తుగారు నుడివినటుల ప్రయాణీకులవలన లాభమును హిందూదేశమునందే సంపాదించుచున్నమాట నిజము.

## 13. ఆదాయవ్యయ శాసనము.

సం॥ 1924 రము లో రైల్వే ఆదాయవ్యయశాసనమును శాసనసభయందు ప్రభుత్వ ఆదాయవ్యయశాసనమునుండి ప్రత్యేకించు ప్రత్యేకించుట. టను గురించి భారతశాసన సభయందు చర్చింపబడెను.

సం॥ 1924 సెప్టెంబరు 20 వ తేదీని స్వరాజ్యవాదులును ప్రభుత్వమువారును రైళ్ల ఆదాయవ్యయశాసనమును ప్రత్యేకించుటనుగురించి రాజీపడిరి. ఈరాజీఫలితముగ రైళ్ళఆదాయవ్యయశాసనము ప్రత్యేకించుట కంగీకరించిరి. ఆనాడు గావింపబడిన తీర్మానాను సారము ప్రభుత్వ మాచరింపవలసినవిధాన మిట్లున్నది.

1. రైళ్ల ఆదాయవ్యయములను ప్రత్యేకించి లెక్కలుంచవలెను. రైళ్లశాఖవలన మిగులుడబ్బునుంచి సాలుసరి నిర్ణీతమగు మొత్తము నితరశాఖలఖర్చునకై ప్రభుత్వమున కొసంగవలెను.

2. మొత్తపు పెట్టుబడిమీాద నూటికి ఒకవంతు చొప్పున ప్రభుత్వమున కొసంగవలెను. ఏసంవత్సరమైన నిట్లిచ్చుటకు మిగులక పోయినయెడల మఱుసటి సంవత్సరము బాకీతోసహా యిచ్చివేయువఱకు వేఱువిధముగ ఖర్చుచేయరాదు. ఇట్లు నూటికి ఒకవంతు చొప్పున నొసంగినపిమ్మట మిగిలిన లాభమునుండి 5 వ వంతుకూడ నొసంగవలెను. పెట్టుబడి లెక్క పెట్టుటలో సంస్థానములును, కంపెనీలును పెట్టినపెట్టుబడిని మినహాయింప వలెను. ప్రభుత్వమువారు పై రాజకీయదృష్టితో వేయబడిన రైళ్లపై వచ్చు నష్టమును పెట్టుబడి నొసంగవలసిన వడ్డీయును నీమొత్తమునుండియే మినహాయించి లెక్క వ్రాయవలెను.

3. ఇట్లు ప్రభుత్వమునకు ప్రత్యేకింపగా మిగిలిన లాభము రైళ్ళప్రత్యేకనిధిగ నేర్పఱుపవలెను. ప్రత్యేకించుట కే సంవత్సరమైన 3 కోట్లకంటె అదనముగా మిగులుచో నందు రెండువంతులు రైళ్ళ ప్రత్యేకనిధికిని మిగిలినవంతు ప్రభుత్వమునకును చెందవలెను.

4. రైళ్లప్రత్యేకనిధి, సాలుసరి ప్రభుత్వమునకు రావలసిన సొమ్ము నిచ్చుటకును, వట్టపునిధి నేర్పఱచుటకును, పెట్టుబడిని తీర్చుటకును రైళ్లరేట్లను తగ్గించుటకును వినియోగింపవలెను.

5. అవసర మగునపుడు రైళ్లశాఖ మఱుసటిసాలున తిరిగి యిచ్చివేయుపద్ధతిని అప్పు పుచ్చుకొనవచ్చును.

6. రైళ్లను ప్రభుత్వమువారే పరిపాలించవలెనని కూడ నీరాజీయం దొకభాగము కలదు.

7. శాసనసభయందు రైళ్లఆదాయవ్యయమును విమర్శించుటకై (Standing finance Committee) ప్రత్యేకకోశసంఘమును నియమించవలె ననియు, రైళ్ల ఆదాయవ్యయశాసనము ప్రభుత్వఆదాయవ్యయశాసనముకంటె ముందుగ శాసనసభయందు ప్రవేశపెట్టవలె ననియు, రైల్వేబోర్డునందు భారతీయులనే నియమించ వలెననియు, రైళ్లఉద్యోగముల నన్నియు భారతీయులకే యొసంగవలె ననియు, రైళ్లసామగ్రులను హిందూదేశ ప్రభుత్వశాఖవారే (Stores Purchase Department) కొనవలె ననియు తీర్మానించిరి. ఈతీర్మానానుసారము రైళ్లఆదాయవ్యయశాసనము ప్రత్యేకింపబడెను.

రైళ్లశాఖ ప్రభుత్వము అప్పటినుండియు రైళ్లశాఖ ప్రభుత్వఆదాయము నకొసంగినవిరాళము నకు విరాళముల నిట్లొసంగెను.

| | | కోట్ల రూపాయలు. |
|---|---|---|
| 1924-25 | ... | 6.78 |
| 1925-26 | ... | 5.49 |
| 1926-27 | ... | 6.01 |
| 1927-28 | ... | 6.28 |
| 1928-29 | ... | 5.23 |
| 1929-30 | ... | 6.12 |
| 1930-31 | ... | 5.74 |
| 1931-32 | ... | 5.36 |

ఈఅంకెల ననుసరించి 1924-32 ఈ ఏడుసం॥లలోను సాలు 1 కి

సుమారు 6 కోట్లచొప్పున 47.01 కోట్లు రైళ్లశాఖ, ప్రభుత్వఆదాయ మున కొసంగెను. 1924-25 సం॥ మొదలు నేటివఱకుగల 10 సం॥ల లోను 33-34 వఱకు మొదటి 6 సంవత్సరములలోను 52 కోట్ల ఆదాయము వచ్చెను. పిమ్మట 4 సంవత్సరములలోను 31 కోటి లోటు వచ్చినది. అనగా 21 కోటి మిగిలినది.

మూలనిధి.

మూలనిధిలో 1924-1931 సంవత్సరములమధ్య 5.81 కోట్లు నిలువ యుంచిరి. 1929-30, 1930-31 సంవత్సరములలో (రెండుసంవత్సరములు) 13 కోట్లను నష్టముల క్రింద ఖర్చుపెట్టినపిమ్మట 5 కోట్ల 81 లక్షలు మిగిలెను. ఇదియు 1931-32 వ సంవత్సరమున నష్టమునకుగాను ఖర్చుపెట్టబడి తుడిచి వేయబడెను.

| | | కోట్ల రూపాయలు. |
|---|---|---|
| 1924-25 | ... | + 6.38 |
| 1925-26 | ... | + 3.79 |
| 1926-27 | ... | + 1.49 |
| 1927-28 | ... | + 4.57 |
| 1928-29 | ... | + 2.58 |
| 1929-30 | ... | — 2.08 |
| 1930-31 | ... | — 10.92 |
| 1931-32 | ... | — 4.95 ఖర్చు |
| | మొత్తము | 5.81 నిలువ |

వట్టపునిధి ఇట్లున్నది.

| | | కోట్లు రు. | |
|---|---|---|---|
| | | జమ. | ఖర్చు |
| 1924-25 | ... | 10.35 | 7.29 |
| 1925-26 | ... | 10.67 | 7.99 |
| 1926-27 | ... | 10.89 | 8.05 |
| 1927-28 | ... | 11.38 | 10.95 |
| 1928-29 | ... | 12.00 | 9.60 |
| 1929-30 | ... | 12.59 | 11.76 |
| 1930-31 | ... | 13.07 | 11.40 |
| 1931-32 | ... | 13.46 | 8.26 |
| 1932-33 | ( Revised ) | 13.75 | 5.60 |
| 1933-34 | అంచన ( Estimate ) | 13.75 | 5.95 |
| మొత్తము | ... | 121.91 | 86.87 |
| | | 86.87 | |
| నిలువ | ... | 35. 7 | |

1931-32, 1932-33, వ సంవత్సరములయందు గలిగిన నష్ట మును మూలనిధినుండియు, వట్టపునిధినుండియు దీసి భర్తీ చేయబడెను, పిమ్మట వట్టపునిధియందు రు 13.68 కోట్లుండును. 1933-34 వ సంవ

త్సరమున అంచనా వేయబడిన నష్టమునుగూడ తీసివేసినయెడల 13.71 కోట్లుమాత్రముండును. అనగా వట్టపునిధినుండి రు 21.36 కోట్లునష్టములకు ఋణముక్రింద తీసికొనబడెను. సుమారు 13-7 కోట్లుండును.

• 1924-25 మొదలు 1933-34 సం॥ వఱకు ప్రభుత్వాదాయమునకు రు 42 కోట్లు ఒసంగబడెను. 35.7 కోట్లు అప్పులతోకలుపుకొని వట్టపునిధియం దున్నది.

## 14 ప్రభుత్వపరిపాలన, కంపెనీపరిపాలన.

సం 1931 మార్చి 31వ తేదీకి ప్రభుత్వపరిపాలనక్రింద నున్న (State owned Railways) రైళ్ళపై 783.32 కోట రూపాయలపెట్టుబడి కలదు. ఇందు 497.91కోట్లరూపాయలు ప్రభుత్వమువారిచే నడుపబడుచున్న రైళ్ళమీదను, 281.97 కోట్లురూపాయలు ప్రభుత్వాధికారమునకు లోబడిన కంపెనీలచే నడుపబడుచున్న రైళ్ళపైనను పెట్టుబడి కలదు. మిగిలినమొత్తముచిల్లరపనులపై పెట్టబడెను. ప్రభుత్వమువారిచే నడుపబడుచున్న రైళ్ళపై నూటికి 2.85 వంతుల ఆదాయము వచ్చుచున్నది. వడ్డీ మొదలగుఖర్చులు పోను 6.5కోట్లు నష్టము వచ్చెను. కంపెనీలపరిపాలనక్రింద నున్న రైళ్ళపై నూటికి 4.76 వంతుల ఆదాయము వచ్చుచున్నది. వడ్డీ మొదలగుఖర్చులు పోను 31.64 లక్షలరూపాయలు లాభము తేలెను. ప్రభుత్వముచే నడుపబడుచున్న రైళ్ళమీదను ప్రభుత్వాధికారముక్రింద నడుపబడుచున్న కంపెనీలరైళ్ళవల్లను ప్రభుమునకుగల ఆదాయవ్యయముల నీపట్టిక దెలుపుచున్నది.

| నికరాదాయము నూటికి యెన్నివంతులు | 1923-24 | 1924-25 | 1925-26 | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 |
|---|---|---|---|---|---|---|---|---|
| 1. ప్రభుత్వము నడుపు రైళ్ళమీద పెట్టుబడికి | 3.64% | 5.33% | 4.54% | 4.49% | 4.81% | 4.59% | 3.81% | 2.85% |
| 2. కంపెనీల నడుపు రైళ్ళమీద పెట్టుబడికి | 5.92% | 6.29% | 6.29% | 5.70% | 6.07% | 5.98% | 5.07% | 4.76% |
| | | | | లక్షలు. | | | | |
| 3. ప్రభుత్వము నడుపురైళ్ళకు లాభము లేక నష్టము నికరము | —37 | 459 | 367 | 368 | 497 | 260 | —86 | —653 |
| 4. గవర్నమెంటువారి కంపెనీలు నడుపు రైళ్లకు లాభము లేక నష్టము నికరము | 690 | 842 | 516 | 373 | 508 | 383 | 325 | .32 |
| 5. నికరము, లాభము లేక నష్టము | 641 | 1287 | 869 | 721 | 1015 | 659 | 254 | —624 |

పై పట్టికవలన ప్రభుత్వమువారిచే నడుపబడు రైళ్లకంటె కంపెనీలచే నడుపబడుచున్న రైళ్లపై నాదాయ మధికముగ నున్నదని తేలుచున్నది. ప్రభుత్వమువారిచే నడుపబడుచున్న రైళ్లలో సరిహద్దుపరగణాలలో నష్టముమీద నడుప బడుచుండిన రైళ్ళుకూడ గలవు. ఈరైళ్లపై వచ్చుచుండిన నష్టము మినహాయించినను కంపెనీలచే నడుపబడుచున్న రైళ్లవలననే సక్రమమగు ఫలితములు కలవు.

ప్రభుత్వమువారి హక్కుభుక్తములలో నున్న రైళ్ల పెట్టుబడి రాబడి అన్నింటిమీదను ఫలితము లాయేటి కాయేడు దిగజారుచున్నవి. పెట్టుబడిమీద సాలుసరి నూటికి రాబడి యెట్లు వచ్చుచున్నదియు నీపట్టిక దెలుపగలదు.

| | | రు. |
|---|---|---|
| 1913-14 | ... | 5.01 |
| 1921-22 | ... | 2.64 |
| 1922-23 | ... | 4.38 |
| 1923-24 | ... | 5.24 |
| 1924-25 | ... | 5.84 |
| 1925-26 | ... | 5.31 |
| 1926-27 | ... | 5.05 |
| 1927-28 | ... | 5.41 |
| 1928-29 | ... | 5.22 |
| 1929-30 | ... | 4.65 |
| 1930-31 | ... | 3.70 |
| 1931-32 | ... | 3.16 |

## 15. వ్యయభారము; తగ్గించుట.

రైళ్ల ఆదాయ వ్యయమునందుగల వ్యత్యాసము తొలగించి రైళ్లపరిపాలనవలన లాభము పొందవలెనన్న రైళ్లపరిపాలనయందలి వ్యయభారము దగ్గించుటయే కర్తవ్యము. 1921-22 సంIIలో రాబడి యందు 76 వంతులు పరిపాలనాయంత్రమునకు ఖర్చైనది. ఈమొత్తము 1926-27 సంIIరమున 62.04 వంతులకు దగ్గింపబడెను. పెద్దయుద్యోగస్థుల జీతములు తగ్గించుటయు, అనవసరపు ఉద్యోగస్థులను తీసివేయుటయు, వంటకలప క్లుప్తముగ వాడుటయు, రైలుసామానులనిలువ దగ్గించుటయు, నెగుమతిదిగుమతులలో దొంగతనములవలన వస్తువులు పోకుండజూచుచు వాటి కీయవలసిన నష్టపరిహారములను దొలగించుకొనుటయు, నాధునికయంత్రముల నుపయోగించుచు ఖర్చును తగ్గించుటయు మొదలగు సంస్కరణముల నొనరించుచో విశేషవ్యయభారము తగ్గగలదు. ఖర్చును దగ్గించుసూచన లొనరించుటకై నియమింపబడిన మణ్ముఖంచెట్టిసంఘమువారు సుమారు 779.8 లక్షలు వెంటనే ఖర్చును దగ్గించుటకు వీలున్నదని సూచించిరి.[1]

కంపెనీల రైళ్లకంటె ప్రభుత్వముచే నడుపబడురైళ్లకు హెచ్చు ఖర్చగుట పరిపాలనయందుగల లోటును దెలుపుచున్నది. సం 1914 నకు పూర్వమున్న రేట్లవలె మరల రేట్లను దగ్గింపవలసి యున్నది. యుద్ధ ప్రారంభమునాటికి 3.2 కోట్లు మాత్రమే లాభము వచ్చుచున్నది. యుద్ధప్రారంభమునుండియు ప్రభుత్వమువా రొనరించుచున్న కఠోర విధానమువలన రేట్ల నధనముగ బెంచి 1918-19 వచ్చుసరికి 15.8 కోట్ల రూపాయలు లాభముచూపిరి. పిమ్మట హెచ్చుధరలలో సామా

1. *From the Railway Retrenchment Sub Committee of the Retrenchment Advisory Committee Oct. 1931 P. 67.*

నులు దెప్పించి పరిపాలనాయంత్రపు ఖర్చులను వృద్ధిచేసి 1921-22 లో 9.1 కోట్లరూపాయల నష్టము జూపిరి. రైళ్లకు గావలసిన సామగ్రి లను దొరకినంతవఱకు భారతవర్షమునందే గొనుచు మిగతసామానులను ప్రపంచమందెచ్చట చౌకగ లభించునో అచ్చటనుండి తెప్పించుచో ఖర్చు లింత హెచ్చుగ నుండెడివి కావు. అట్లు ప్రపంచమునందంతటనుం డియు టెండర్లు పిలుచుటకు మాఱుగ, ఇంగ్లండునుండియే తెప్పించుట వలన ఖర్చు లధికమగుచున్నవి. టాటాకంపెనీకిగూడ దగుప్రోత్సాహ మొసంగుటలేదు. ఇంగ్లండు ఇండియాలలో మాత్రమే టెండర్లను బిలు చుచున్నారు. సం 1929-30 రమున 30.06 కోట్ల విలువగలసామాను లను గొనిరి. సం॥ 1930-31 రమున 22.75 కోట్ల విలువగల సామా నులనుగొనిరి. ఇందు 11.57 కోట్లు విలువగల సామాను ఇంగ్లం డునుండి దిగుమతి యగుచున్నది. ఈమొత్తములో 5.90 కోట్ల విలువగల సామాను స్వయముగను, 5.67 కోట్ల విలువగలసామాను హిందూదేశమందలి యేజంట్లమూలముగను గొనుచున్నారు. ఈయం కెల ననుసరించి సాలుసరి సుమారు 30 కోట్ల విలువగల సామాను దెప్పించుచున్నారు. ఇందులో రాయి, పుడక, సున్నము మొదలగు వాటిఖరీదు సుమారు 4½ కోట్లు తీసివేయుచో సగమునకుపైగ విదేశీ సామానులను దెప్పించుచున్న ట్లగును. సం 1924 రాజీ ననుసరించి (Stores purchase department of the Government) సరకులను గొను ప్రభుత్వశాఖయే వలయుసామగ్రిని గొనవలెనను నియమమునకు ప్రభుత్వ మంగీకరించెను. ఇట్లంగీకరించుటవలన స్వదేశమందలి సామానులకు బ్రోత్సాహ మెక్కువకలుగునని విశ్వసింపబడెను. కాని యా యాశయము నేటివఱకు నెఱవేఱలేదు.

అనవసరముగ నదనపుసామానులను గూడ గొని నిలువ యుంచుచున్నారు. ఈదిగువపట్టిక యేయేట నెంతసామాను అనవసరముగ నిలువయున్నదియు తెలుపుచున్నది.

లక్షల రూపాయలలో

| సంవత్సరము | మిగిలినది | ఉపయోగించిన దానిలో నూటికి ఎన్నివంతులు మిగిలెను? |
|---|---|---|
| 1925-26. | 1437 | 35 |
| 1926-27 | 1426 | 34 |
| 1927-28 | 1679 | 36 |
| 1928-29 | 1673 | 36 |
| 1929-30 | 1654 | 40 |
| 1930-31 | 1433 | 43 |
| 1931-32 | 1365 | ... |
| 1932-33 | 1200 | ... |

## 16. రైళ్లను భారతీయులవశ మొనరించుట.

రైళ్ళయందలి పెద్దయుద్యోగములలో భారతీయు లధికసంఖ్యాకులుగనైన లేరు. 1925-26 వ సం॥ రమునుండియే కొలదిగ భారతీయుల కిచ్చుట ప్రారంభించిరి. మొత్తము రైళ్ళయందలి యుద్యోగస్థులకు జీతబత్తెములక్రింద నిట్లు ఖర్చగుచున్నది.

| † సంవత్సరము | ఆంగ్లేయులు | ఆంగ్లో ఇండియనులు | భారతీయులు | మొత్తం | మొత్తము జీతబత్తెముల క్రింద యిచ్చినది. |
|---|---|---|---|---|---|
| 1913-14 | 7986 | 10437 | 614882 | 633307 | 140051159 |
| 1920-21 | 7281 | 11940 | 729789 | 749010 | 266802862 |
| 1921-22 | 6858 | 11831 | 735789 | 754478 | 289020439 |
| 1922-23 | 6880 | 12201 | 734391 | 753472 | 289499305 |

ఈ మొత్తమునందు సగమునకు పైగ ఆంగ్లో ఇండియనులకును, యూరపియనులకును జెందుచున్నటుల దేలుచున్నది. భారతీయుల సంఖ్య హెచ్చుగనున్నను మొత్తము జీతబత్తెముల క్రింద నిచ్చు సొమ్ములో 20 కోట్లు మాత్రమే హిందూదేశమున మిగులుచున్నదని కె. టి. షాగారు మదింపు వేసిరి.

1923 సం॥నందులీకమీషను నూటికి 75 వంతులయుద్యోగములు భారతీయుల కొసంగవలె ననిరి. అక్వర్తుకమిటీవారుకూడ నిట్లే సూచించిరి. వీరిసూచనల ననుసరించి ప్రభుత్వముపారిచే నడుపబడుచున్న రైళ్లయందు ఖాళీస్థానములలో భారతీయులను నియమించుచున్నారు. "1929-30వ సం॥ రమున ప్రభుత్వమువారిచే పరిపాలింప బడుచున్న రైళ్లలో నూటికి 70.7వంతులు ఖాళీస్థానములలో భారతీయులను నియమించిరి. ప్రమోషనులతోగూడ కలుపుకొని నూటికి 75.5వంతులగును. కంపెనీలచే నడుపబడుచున్న రైళ్లలో ఖాళీస్థానములలో నూటికి 75వంతులుభారతీయుల కిచ్చుట కంగీకరించియునిచ్చుటలేదు."[1]

† *From Wealth and Taxable Capacity of India, page 280*

1. *From the memorandum of the Railway Board 31 January.*

ఈయంకెలు సం॥ 1923 డిశంబరు 31 తేదీవఱకు మాత్రమే తెలుపుచున్నవి.

ఈయంకెల ననుసరించి హిందూదేశమున రైలుమార్గము లెట్లు స్వల్పముగ నున్నవో సుబోధక మగుచున్నవి. ఇందుదాహరింపబడిన దేశములు వ్యవసాయదేశములు.

రాష్ట్రప్రభుత్వములు వడ్డీకి బాధ్యత వహించుచు ప్రైవేటు కంపెనీలచేత రైలుమార్గముల వేయించుటకు రాష్ట్రప్రభుత్వములకు హక్కు కలదు. దక్షిణహిందూదేశము 1857 వ సంవత్సరపు ప్రథమ భారతస్వాతంత్ర్య యుద్ధమునం దంతగ ప్రభుత్వముపై దిరుగబడలేదు. సహాయముగూడ గావించెను. ఉత్తరహిందూస్థానమునందు వివిధ ప్రదేశములు తిరుగుబాటు చేయుటచే ఉత్తరహిందూస్థానమునందు వల యల్లినరీతిగ రైలుమార్గములను వేసి, ముఖ్యపట్టణములలో సైన్యముల నుంచి కంటోనుమెంటులను విస్తారముగ బెట్టిరి. నాటినుండియు దక్షిణహిందూదేశమున రైలుమార్గము లభివృద్ధిపఱచుటకు తగు శ్రద్ధ వహింపబడలేదు. కాని మలబారునందు జరిగిన మాపలాతిరుగుబాటువలన దక్షిణ హిందూదేశమందలి పరిస్థితులు గూడ మాఱిన వని గ్రహించి సైన్యముల నటు నిటు గొంపోవుటకు వలయునట్లుగ రైలుమార్గములను వేయుట సమంజస మని తలంచిరి. కొచ్చిను పశ్చిమ భాగములయందు, తిరుచునాపల్లికి తూర్పుదిశయందు చిన్న రైలుమార్గమును పెద్దరైలుగా మార్చవలెనను ప్రయత్నములు జరుగుచున్నవి. కొచ్చినుస్టేటు రైలుమార్గము (మీటరుగేజి) చిన్నది. ఈచిన్నరైలుతో మాత్రమే కొచ్చినుపెద్దరైలుమార్గము కలుపబడెను. ఈచిన్నరైలుకూడ కొచ్చినునకు రెండుమైళ్లదూరములో ఎర్నాకులంవఱకు మాత్రమే పోవుచున్నది. కొచ్చిను ఓడరేవు తిరువాన్కూరుజిల్లా నుండి వచ్చు కాలువలతో మాత్రము సంబంధించి యున్నది. అందుచే

పెద్దరైలు వేయవలెనను ప్రయత్నము లాలోచనయం దున్నవి. ఈమార్గము దక్షిణమువఱకును వ్యాప్తి జేయువో టీ, కాఫీ, రబ్బరు, వేరుసెనగ, దూది, ధాన్యము పండుపంటల ప్రదేశ మగుటచేత వర్త కమునకు గూడ వీలుగ నుండును.

దిండిగల్లునుంచి పొలాచివఱకు గూడ క్రొత్తరైలుమార్గము వేయబడెను. ఈప్రదేశములయందు దూది, పంచదార, కాఫీ, టీ, సువాసన ద్రవ్యములు పండును. అందుచే వర్తకమునకుగూడ సదుపాయము కలిగించును. మదరాసునుంచి సింహళద్వీపమువఱకు బోవు (తంజావూరుడెల్టామీాదుగ) రైలుమార్గము చిన్నది. దీనినిగూడ పెద్దది చేయు నాలోచన లున్నవి. 1928 లో విద్యుచ్ఛక్తివలన రైళ్లు నడుప బడుచున్నవి. మదరాసు కలకత్తాలయందుగూడ యోచింపబడు చున్నవి. బర్మాదేశమందు పైభాగమున రైళ్ళులేవు. మధ్యరాష్ట్రము నందునను, దక్షిణహిందూదేశమందునను గూడ రైలుమార్గములు జిల్లాలలోనికి వ్యాపించిలేవు. పెద్దరైలుమార్గములకు జిల్లాలమధ్యనుంచి రైలుమార్గములు చిన్నవి వేసి కలుపవలె నని ప్రస్తుతప్రయత్నము. ప్రతిసంవత్సరము 1,000 మైళ్లు నూతన రైలుమార్గముల నిర్మింప తల పెట్టబడుచున్నది. ఇట్లు నిర్మించుటలో దృష్టి ప్రత్యేకముగ రైళ్ళనిర్మా ణమునందే కేంద్రీకరింపరాదు. ఇతర రాకపోకల సౌకర్యములగూడ నరసి రైళ్లి ప్రత్యేకావసరమును గమనించియే రైలుమార్గముల వేయవలెను. ఇందులకు వలయుపెట్టుబడి అవసర మగుచో భారతదేశ మందె ఋణము చేయవలెను.

# 18. పెట్టుబడిపెట్టు ఖర్చు.

Capital Expenditure.

రైళ్లఆదాయవ్యయశాసనమును, ప్రత్యేకించినపిమ్మట సంవత్సరము 1కి 25కోట్లవంతున పెట్టుబడి మొదటి ఆరుసంవత్సరములలోను క్రొత్తకట్టడములకొఱకు హెచ్చెను. పిమ్మట మూడు సంవత్సరముల లోను సాలు1కి సుమారు 7కోట్లవంతున ఖర్చు పెట్టబడెను. మొత్తము 1923-24 సంవత్సరము మొదలు 1932-33వ సంవత్సరమువఱకును గల 9 సంవత్సరములలోను 169కోట్లు క్రొత్తపెట్టుబడి పెట్టబడెను. ఇందులో క్రొత్తరైలుమార్గములకొఱకు రు 48 కోట్లును, కంపెనీరైళ్లను కొనుట కొఱకు 16 కోట్లును, మిగిలిన 100కోట్లును పనిచేయుచుండిన రైలు మార్గములలో సౌకర్యములకొఱకును ఖర్చు పడెను. 1930-31, 1931-1932, 1932-1933 సంవత్సరములలో, క్రొత్తపను లేమియు చేయించలేదు. ఇదివఱలో ప్రారంభింపబడిన పనులు మాత్రమే పూర్తి చేయింపబడుచున్నవి. 1930వ సంవత్సరమునుంచియు, 1932-33 సంవత్స రాంతమునకు రు. 20కోట్ల పెట్టుబడి హెచ్చెను. ఇందులో 7న్నర కోట్లు ప్రారంభింపబడిన నూతనమార్గముల బూర్తిచేయుటకును, 12న్నరకోట్లు మరమ్మతులు మొదలగువాటికిని ఖర్చుపెట్టబడెను. ఇట్లు పెట్టుబడి పెట్టి క్రొత్తపనులను జేయింపకపోవుటకు, ప్రస్తుతార్థిక దుస్థితియే కారణ మని ప్రభుత్వని వేదిక తెలుపుచున్నది.

# 19. వడ్డీలు.

రైళ్లపెట్టుబడి.

రైళ్లపైగల రాబడిలో తగ్గుదల గనిపించుటకు సాలుసరి పెట్టుబడిపై వడ్డీరూపముగ నొసంగవలసి వచ్చుచున్న మొత్తము హెచ్చుచుండుటయే కారణము.

1930—31 వ సంవత్సరమున 32.72కోట్ల వడ్డీ యొసంగ బడెను. ఇందు 20.74కోట్లు ప్రభుత్వమువారిచే నడుపబడు రైళ్లకును, 11.95 కోట్లు కంపెనీలచే నడుపబడు రైళ్లకొఱకును వడ్డీ చెల్లింపబడెను. మొత్తపువడ్డీలో 7.40కోట్లు స్టెర్లింగుఋణములకును, 25.32కోట్లు ప్రభుత్వము వారుచేసిన యన్నివిధములఋణములకును చెల్లింప బడుచున్నది. సం 1917 మార్చి 31 తేదివఱకు నూటికి 3.3252 వంతున నిర్ణీతపువడ్డీ మొత్తపుపెట్టుబడిమీద లెక్కగట్టబడెను. పిమ్మట సగటువడ్డీ కట్ట బడెను. ఆవడ్డీరేట్లు ఈపట్టికవలన దెలియగలవు.

| సంవత్సరము | | నూటికి |
|---|---|---|
| 1919-20 | ... | 5.9328 |
| 1920-21 | ... | 5.1971 |
| 1921-22 | ... | 6.1038 |
| 1922-23 | ... | 5.48 |
| 1923-24 | ... | 5.69 |
| 1924-25 | ... | 5.54 |
| 1925-26 | ... | 5.66 |
| 1926-27 | ... | 5.48 |
| 1927-28 | ... | 5.38 |
| 1928-29 | ... | 5.63 |
| 1929-30 | ... | 5.31 |

ఆక్వర్తుకమిటీవారీవడ్డీరేట్లను తీవ్రముగ విమర్శించిరి. తక్కువ వడ్డీలకు సొమ్ము లభించునప్పుడు ఋణములుచేసి రైళ్లనువేయక భారతదేశార్థికాభివృద్ధికి భంగము కలిగించెనని ఆక్వర్తుకమిటీవారు వ్రాసిరి. ముందు వేయబోవు రైళ్లపెట్టుబడివిషయమునందైన గతవిషాదచరిత్రను ప్రభుత్వమువారు చర్వితచర్వణ మొనరింపకుందురా? తక్కువ

వడ్డీపై భారతదేశమునందే ఋణము జేసి, అవసరమగు రైలు మార్గముల నవసరమగుచోట్లనే దుర్వ్యయముచేయక వేసెదరా?

పెట్టుబడిని క్రొత్త రైలుమార్గములను వేయుటకై వినియోగించక ఉద్యోగస్థులజీతములను హెచ్చించుటకును, వారికి దివ్యసౌధములను గట్టించుటకును, విశేష సౌకర్యము లొనగూర్చుటకును, గతించిన 14, 15 సంవత్సరములనుంచియు పెట్టుబడి దుర్వినియోగము చేయబడెను. అందువలన నీపెట్టుబడి సార్థకము కాలేదు. నిరర్థక మైనది. ఆదాయము రాకపోవుటయే గాక వడ్డీకిక్రింద గొంత ఆదాయమును గూడ చెల్లించి వేయవలసి వచ్చుటచే నష్టము వచ్చుచుండెను.

## 20. రైలు—మోటారు పోటీ.

మోటార్లపోటీవలన రైళ్లఆదాయము పడిపోవుచున్న దని రైలుకంపెనీలు గందరగోళము సాగించినవి. ప్రభుత్వ మలజడి జెందుచుండెను. మోటారు రైళ్లమధ్యగల సమస్యను విచారించుటకై కేంద్ర ప్రభుత్వము ప్రత్యేకోద్యోగుల నియమించినది. వీ రీసమస్యను సమగ్రముగ విచారించిరి. మొదటితరగతి రైళ్లు సాలు 1 కి రు 190000 లను మోటార్ల పోటీవలన గోల్పోవుచున్న వనిరి. మదరాసు రాజధానియందు గాక 100 కి 30 వంతుల కంకరరోడ్డు రైలుమార్గమున ప్రక్కనంచి వేయబడియున్న వనిరి. మదరాసులోనున్న 4377 మైళ్లపొడుగుగల రైలుమార్గమునకు 2681 మైళ్లపొడుగున రైలుమార్గమునకు ప్రక్కగనే రోడ్లు కలవు. ఈరోడ్లమీద మోటార్లుకూడ ప్రయాణీకుల నెక్కించుకొని పోవుచుండుటచే రైళ్ళకు నష్టము వచ్చుచున్నది. నష్టము లేక పనిచేయుట యెట్లనునదియే ప్రభుత్వమువారి ప్రస్తుతప్రశ్న.

| | | | |
|---|---|---|---|
| 1913-14 | 2880 కార్లు | 75 లారీలు | 146 సైకిళ్లు |
| 1928-29 | 19569 ,, | 12790 ,, | 1802 ,, |
| 1932-33 | 6000 ,, | 3000 ,, | 800 ,, |

మోటార్ల దిగుమతు లాయేటికాయేడు 1930 వఱకు పెరిగెను. మోటారు ప్రయాణము జనపదములకు రాకపోకల కత్యంతసులభముగ నున్నది. అందుచేతనే మోటార్లు హెచ్చుగ వాడుకలోనికి రాగలిగినవి. ఆర్థికముగ మోటారుప్రయాణము ప్రజలకు సులభసాధ్యముగ నుండుటవలననే ప్రజలు వీటి నుపయోగించుకొను చున్నారు. ప్రజోపయోగమున కనుకూలముగ రాకపోకల సౌకర్యము లొనగూర్చుట ప్రభుత్వ విధియా? రైళ్లమీదనే ప్రజలు ప్రయాణము చేయున ట్లొనరించి రైళ్లకు కలుగుచున్ననష్టము తొలగించుటయే ప్రభుత్వ కర్తవ్యమా?

కాలువలు త్రవ్వించి వ్యవసాయాభివృద్ధికరముగను రాకపోకల సౌకర్యములకుగూడ ననువుగను నుండున ట్లొనరించుటకు మాఱుగ రైళ్లనిర్మాణమునకై తొలినుండియు భారతీయార్థికాభివృద్ధి బలివేయబడెను. అట్లే నేడు రైళ్లకై మోటార్ల రాకపోకలసౌకర్యము లరికట్టబడునా?

రైళ్లప్రయాణము, మోటార్లప్రయాణము రెంటిని సమన్వయమొనరించితి మని ప్రభుత్వమువా రనుచున్నారు. అవసరమగుచోట్ల మోటార్లనుంచి, అనవసరమగుచోట్ల తీసివేయవలె నని కమిటీవారి సూచన. రైలుకంపెనీలే మోటార్లనుగూడ పోటీగా నుండు రోడ్లపై వేయవలెనని కమిటీవారు సూచించిరి. ఈపద్ధతిని ప్రజలచేనడుపబడు మోటార్లు నడుపుటకు వీలుండదు. ఈసమస్యల తర్కించుటకై సిమ్లాయందొక మహాసభ జరుపబడెను. రోడ్లసంఘమునకు ఉపాధ్యక్షు

డగు (H. E.) హోర్మ్సర్డుగారు, వర్తకశాఖకార్యనిర్వాహకసభ్యు డగు సర్. జోసప్ భోరుగారి ఉపన్యాసమును తీవ్రముగ ఖండించిరి. రైళ్ల వలన వచ్చుచున్న నష్టమును తొలగించుటకై మార్గముల నన్వేషించుటకు మాఱుగా, మోటారుల నరికట్టగలమార్గముల ప్రభుత్వమువా రరయుచున్నా రనెను. ఈమాటలే వాస్తవము. వ్యయభారము తగ్గించి నష్టమును తగ్గించుకొనుటకు మాఱుగ మోటార్లపై దండెత్తుట తగనిపని. రోడ్లు రైళ్లఆదాయమునకు భంగము గలుగజేయునని డల్‌హౌసీగారు మొదట ఊహింపజాలక పోయిరి. నాడు సైనికులను గొనిపోవు వసతికై అయోమార్గములను, రోడ్లను ఒకదాని ప్రక్కనొకటి వేసిరి. ఇప్పు డందులకై వగచుట పాడి గాదు. మోటార్లపైకి దండెత్తుట ప్రభుత్వము విరమించుటయే సమంజసము. మోటార్లపై హెచ్చుపన్నులను విధించుచు, మోటారుదిగుమతుల నిరోధమును గలిగింప జూచుచున్నట్లు ప్రజలయం దపోహలు ప్రబలుచున్నవి. 1926 సం॥ న దిగుమతిసుంకము 100 కి 30 వంతులు మాత్రమే కలదు. 1927 సం॥న దిగుమతి సుంకము 100కి 20 వంతులు మాత్రమే గలదు. ఇట్లు దిగుమతిసుంకము తగ్గించుటవలన 27-28 సం॥న 25,950 మోటార్లు దిగుమతి యైనవి. 26-27 సం॥ న 21,343 కార్లు మాత్రమే దిగుమతి యైనవి. 28-29 వ సం॥న దిగుమతి సుంకము 100 కి 20 వంతులే అయియుండుటచే 34,059 కార్లు దిగుమతి యైనవి. పిమ్మట 1930 సం॥ రము 100 కి 25 వంతులును, 1931 సం॥ న 100కి 30 వంతులును, ఆసంవత్సరమే తిరిగి 100 కి 37½ వంతులును దిగుమతిసుంకము హెచ్చింపబడెను. ఇట్లు హెచ్చించుటవలన మోటార్ల దిగుమతి తగ్గిపోయెను. 1931-32 సం॥ 12,448 కార్లు మాత్రమే దిగుమతియైనవి. ప్రభుత్వమువారు విధించుచున్న అంతర్వ్యాపారశుల్కము (Excise tax) హెచ్చుగ నున్నది. మదరాసు రాజధానియందు 20

మంది నెక్కించుటకు వీలైన మోటారుబస్సునకు సాలుసరి రూ.800లు పన్ను ఇచ్చుకొనవలెను. పెట్రోలుపైన గూడ సుంక మధికముగనే యున్నది.

# 21. ప్రస్తుతస్థితి.

వివిధరూపములుగ నున్న ఈపన్నులవలన మోటార్లప్రయాణ సౌకర్యము ప్రజలకు తగ్గిపోవుచున్నను, 1933-34 వ సం॥రపు రైళ్ల ఆదాయవ్యయశాసనముల ప్రసంగించుచు సర్. జోసఫ్ భోరుగారు ప్రస్తుతార్థిక పరిస్థితులలో రైళ్లపరిపాలనము సంతుష్టికరముగనే యున్న దనిరి. ఈయార్థికదుస్థితియందు గూడ రైళ్లపై పెట్టిన రూ 800 కోట్లు పెట్టుబడిమీాద 100కి రూ 3 లకు పైగా వడ్డీ గిట్టుచున్న దనిరి. ఇదియే వీరిసంతోష కారణము. రైళ్లపరిపాలనయందు సాలుసరి నష్టమువచ్చు చున్నను వీరిని చలింపజేయలేదు. రైళ్లవలన గలుగుచున్న నష్ట మెప్పు డుమాసునో ఎవరును చెప్పజాలరు. నష్టములక్రింద మూలధన మంత యు తుడిచివేయ బడెను. వట్టపునిధినుండి తోడుట మొదలుపెట్టిరి. మఱికొంతకాల మిట్లు నష్టములు సంభవించుచో వట్టపునిధి యంతయు హారించిపోవును. అయిన నేమి? భోరుగారు కంగారు లేదనుచున్నారు. విదేశములతో బోల్చిన సుఖనిద్ర బోవచ్చు ననుచున్నారు. ఎంతవింత?

విదేశములతో బోల్చిచూచిన భారతదేశమునందు ప్రయాణీ కుల సౌకర్యము లత్యల్పముగ నున్నవి. ముఖ్యముగ 3 వ తరగతి ప్రయాణీకులగతి దుర్భరము.

1 వ పట్టిక.

| నెం | తరగతి | ప్రయాణీకుల స్థానములు |
|---|---|---|
| 1 | 1 వ తరగతి | 4000 |
| 2 | 2 వ తరగతి | 6000 |
| 3 | 3 వ తరగతి | 8,700000 |

భారతదేశమందలి రైళ్లయందుగల స్థానములను పై పట్టిక తెలుపుచున్నది. ఈ దిగువపట్టికవలన ఆయాతరగతులయం దెంతమంది ప్రయాణమును జేసినదియు తెలియును.

2 వ పట్టిక.

| తరగతులు | ప్రయాణీకుల సంఖ్య |
|---|---|
| 1 వ తరగతి | 508000 |
| 2 వ తరగతి | 587000 |
| 3 వ తరగతి | 8700000 |

ఈ దిగువ పట్టికవలన ఆయాతరగతులవలన గల రాబడి తెలియును. రూపాయలు.

3 వ పట్టిక.

| తరగతి | రా బ డి | స్థానము 1కి సగటున రాబడి |
|---|---|---|
| 1 వ తరగతి | 8300000 | 208 రూ. |
| 2 వ తరగతి | 15300000 | 286 ,, |
| 3 వ తరగతి | 27000000 | 241 ,, |

అని ఎన్. ఎమ్ జోషీగారు 1933-34 సంవత్సరపు రైళ్ల ఆదాయవ్యయశాసనముపై ప్రసంగించుచు పైయంకెల 3 పట్టికల నుదాహరించిరి. ఈయంకెలవలన 3 వ తరగతి ప్రయాణీకులే హెచ్చుధన మిచ్చుచున్నట్లు ఋజువగుచున్నది. అయిన నేమి? ఆతనికష్టము లీడేరుటలేదు. ప్రపంచమునం దంతటికంటె హిందూదేశమందలి రైళ్లలో సామానులపై రేట్లధికముగ నున్నవి.

రైళ్లయందలి చిన్నయుద్యోగులజీతము లత్యల్పముగ నున్నవి. వీరిజీతములు హెచ్చింప వలయును. ఈపరిస్థితులలో జోషీగారు తమ రైల్వేపరిపాలనపై తామే చంకలుకొట్టుకొనుట యుచితముగ లేదు. రేట్లను తగ్గించి, 3 వ తరగతి ప్రయాణీకుల సౌకర్యముల హెచ్చించి, స్వల్పజీతముగల యుద్యోగస్థుల జీతము లభివృద్ధిచేసి, మూలనిధి వట్టపు నిధులను నగదురూపముగ చూపింప గల్గిననాడు జోషీగారు ప్రశంసాపాత్రులగుదురు. ఆనాడే ప్రపంచమందలి రైళ్ల ఆదాయవ్యయస్థితికంటె, మన స్థితి బాగుగ నున్నదనుకొన దగును. రైళ్లయందలి యుద్యోగము లన్నియు భారతీయుల కొసంగబడి పెద్దయుద్యోగులజీతముల తగ్గించుచు దుర్వ్యయమును మానివేయ గలిగిననాడే రైళ్లపరిపాలన సక్రమమగు నార్థికస్థితిపై నిలిచి యభివృద్ధి నొందగలదు.

## 22. ప్రయాణీకుల సౌకర్యములు.

రైళ్లపరిపాలన ప్రజామోదమును బొందవలె ననిన మూడవ తరగతిప్రయాణీకుల సౌకర్యములను ముందుగ గమనింపవలయును.

1. రైళ్లలో నేడుగల రెండవతరగతియు, మూడవ తరగతియు, మాత్రమే యుండవలెను. మొదటితరగతియు, మధ్యతరగతియు, అనవసరములు. రెండవతరగతిప్రయాణీకులకు, మొదటితరగతి సౌకర్యము

ఇది ఘోరమగుసూచన. టిక్కెట్లు లభించుటకు నాలుగైదు తావుల స్టేషనులయందైన సౌకర్యములను గలిగించుటయే కర్తవ్యము.

12. అన్నింటికంటె ముఖ్యముగ రైల్వే యుద్యోగస్థులు వర్తకుల ఏజంట్లవలె ప్రవర్తించుట ట్లొనరింపవలయును. తమటిక్కెట్లు విఱివిగ అమ్ముడువోయి తమరైళ్ళలో ఎక్కువమంది ప్రయాణీకులు ప్రయాణముచేయునట్లుగ ఉద్యోగస్థులు ప్రజల నాదరింప వలయును. ప్రయాణికులతో వర్తకవుసరళిగ ప్రవర్తింపవలయును. ప్రజల సేవకుల వలె మెలంగవలయును. ప్రయాణీకులపై నిరంకుశాధికారము వహించు నుద్యోగులుగ నుండరాదు. రైల్వేయుద్యోగస్థుల చిత్తవృత్తియందెంతయో మార్పు జనింపవలెను.

13. కొన్నిస్టేషనులయొద్ద గల ప్లాటుఫారము లెత్తుగ లేకపోవుటచే బ్రయాణీకులు రైళ్ళను దిగుటకును ఎక్కుటకును అమితముగ గష్టపడుచున్నారు. ప్రమాదములు కూడ సంభవించుచున్నవి. ఇట్టి ప్లాటుఫారములను ఎత్తుగ కట్టింప వలెను.

14. విద్యుచ్ఛక్తివలన రైళ్ళనడుపుటకై ప్రయత్నింపవలెను. అట్లొనరించుచో రాతిసిబొగ్గుపొగవలన ప్రజల యారోగ్యమునకు భంగము కలుగదు.

# 23. నూతన రాజ్యాంగ సంస్కరణములు, రైల్వేబోర్డు.

ఫెడరలు రాజ్యాంగవిధానమున రైళ్లపరిపాలన మొనరించుటకై యొకబోర్డును ప్రత్యేకముగ నేర్పఱుప వలయు నని బ్రిటిషు రాజకీయవేత్తలు తలంచు చున్నారు. ఈవిషయమై రౌండుటేబిలు

సభలయందైనను చర్చింపబడలేదు. ఇండియాయందు నియమింపబడిన ఆలోచనసంఘము (Consultative Committee) నందు మాత్రమే యీ విషయము తర్కింపబడెను. ఇండియానుండి గొందఱను భారతశాసన సభ్యులను బ్రిటిషు రాజకీయవేత్తలు ఇంగ్లండునకు తీసికొనిపోయిరి. వీరిచే, తాము నిర్ణయించుకొనిన విధానమును బ్రిటిషు రాజకీయవేత్తలామోదింపజేసిరి. ఈవిధానము నామోదించి రైల్వేబోర్డును నియమింపవలెననునియమమును సంస్కరణశాసనమునందే చేర్చినయెడల రైళ్లపరిపాలన ప్రజాప్రతినిధులచేతినుండి తొలగి పోవును. రాజకీయ కక్షులనుండి రైళ్లపరిపాలన దొలగించుటకే ప్రత్యేకపుబోర్డును నియమించుటకు కారణమ్ముగ హిందూదేశ రాజ్యాంగకార్యదర్శి తనసాక్ష్యమునందు చెప్పెను. "ఈబోర్డునందుండు సభ్యులను ఫెడరల్ గవర్నమెంటువారే నియమింపవలె నని కొందఱుసభ్యులు తలంచిరి. మఱి కొంతమంది 7 గురు సంఘసభ్యులలో నలుగురుని మాత్రమే ఫెడరలు గవర్నమెంటు నియమించుట భావ్యమని తలంచిరి. మిగిలినముగ్గురను గవర్నరుజనరలుగారు తమ యిష్టమువచ్చినవారిని నియమింప వలెననిరి. నేను మొట్టమొదటి సూచన నంగీకరింపజాలను. ఆసూచన నంగీకరించినయెడల రాజకీయ వాతావరణమునకు రైల్వేబోర్డు లోబడి యుండరాదనుసిద్ధాంతమే పోవును. మొత్తము 7 మంది సభ్యులయందును, 4 గురి కంటె హెచ్చుగ ఫెడరల్ గవర్నమెంటు నియమించుటకు నే నంగీకరింపను......ఏపరిస్థితులయందైనను నేడు హిందూదేశ రాజ్యాంగకార్యదర్శితో కంపెనీలు గావించుకొనిన కంట్రాక్టులన్నియు బదిలముగ నుండునట్లుగ నూతనసంస్కరణ శాసనమునందు నియమమును జేర్చుట అత్యవసరము.'' అని హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగారు రైల్వేబోర్డును స్థాపించుటనుగుఱించి తమసాక్ష్యమునందు జాయింటుకమిటీవారికి నివేదించెను.[1]

---

1. *See Secretary of State's Memorandum on Control of Indian Railways.*

నూతన సంస్కరణములనుగుఱించి ప్రకటించిన బ్రిటిషుప్రభుత్వమువారి పత్రమునందు రైల్వేబోర్డునుగుఱించి యిట్లు నిర్వచించిరి. "హిందూదేశమునందలి ప్రభుత్వమువారి రైళ్లయొక్కయు, కంపెనీల పరిపాలనయందుగల ప్రభుత్వపు రైళ్ళయొక్కయు, పరిపాలన,రాజకీయ మగు పలుకుబడికి లోబడక వర్తకసరళిగ పనిచేయుటకు శాసనరూపమగు నొకసంఘమును స్థాపింపవలయు నని చక్రవర్తిగారి ప్రభుత్వము తలంచుచున్నది. ఫెడరల్ప్రభుత్వమును ఫెడరల్శాసనసభయు, రైళ్ళ పరిపాలననీతిపై సామాన్యమగు నధికారమును గలిగి యుండును. ఇట్టి రైళ్లబోర్డును స్థాపించి నేడు కంపెనీలకుగల హక్కులను సంరక్షింపవలెను. తగవులను దీర్చుటకు హిందూదేశ రాజ్యాంగకార్యదర్శికే నేటివలె నధికార ముండవలెను."[1]

హిందూదేశ రాజ్యాంగకార్యదర్శివాదము గాని శ్వేతపత్రమునందలి వాదముగాని సహేతుకములు లేవు. సుబోధకములుగను లేవు. ఈబోర్డు స్థాపింపబడినయెడల, జాతీయశాసనసభవారికి రైళ్లపరిపాలనపై నెట్టి అధికారముండును? జాతీయప్రభుత్వమువారి కెట్టిఅధికారముండును? రైళ్లబోర్డున కెట్టిఅధికార ముండును? ఈముగ్గురఅధికారములను గూడ, తోసిరాజని గవర్నరుజనరలుగారు దేశసంరక్షణకొఱకు రైళ్లపరిపాలనను వారియిష్టమువచ్చినటుల శాసింపగలరు. ఇది తఱుచు సంభవింపదని తలంచినను జాతీయప్రభుత్వమంత్రిగారి అధికారమునకు లోబడి రైళ్లబోర్డు పనిచేయనియెడల, పన్నులనిచ్చుకొనువానికి రైళ్లబోర్డువారి పరిపాలనయం దెట్టిసంబంధము నుండదు. హోరుగారివిధానము ననుసరించి రైళ్లబోర్డువారి ఆదాయవ్యయ నిర్ణయపత్రమును యానమంత్రి శాసనసభవారికి విషయజ్ఞానముకొఱకు మాత్రమే నివేదించును. రైళ్లపెట్టుబడికొఱకు డబ్బు కావలసివచ్చినప్పుడును రైళ్ళ

1. *See Proposals For Indian Constitutional Reform Para 74.*

శాఖకు నష్టమువచ్చినప్పుడును మాత్రమే రైళ్లబోర్డువారు శాసన సభవారిని సమీపించెదరు. అనగా అవసరమగు డబ్బు శాసన సభవారే యొసంగ వలయును. వా రొసంగిన ధన మెట్లు వినియోగింప బడుచున్నదియు ప్రశ్నించుటకు మాత్రము వారికి అధికార ముండదు. ప్రజలసొమ్ము సక్రమముగ వినియోగింపబడునట్లుగ జూచుటకు ప్రజాప్రతినిధులగు శాసనసభ్యులకు అధికారమును దొలగించి వేయజూచుట విచిత్రవిషయము. శాసనసభయు, యానమంత్రియు, రైళ్లబోర్డును మూడును ఏకమైన గాని జాతీయకార్యక్రమమేమియు రైళ్లపరిపాలనయందు సాగించుటకు వీలుండదు. జాతీయప్రభుత్వపుయానమంత్రి రైళ్లబోర్డువారి ప్రత్యేకసభలను పిలువవచ్చును. ఆసభల కధ్యక్షత వహింపవచ్చును. వారితో రైళ్లపరిపాలననుగుఱించినసీతిని చర్చింప వచ్చును. కాని విషయనిర్ణయమునందు జోటిచ్చుటకు గూడ యానమంత్రి కధికారము లేదు. జాతీయప్రభుత్వము రైళ్లపరిపాలనసీతిని నిర్ణయించి రైళ్లబోర్డువారిని ఆచరింపుమనవచ్చును. ఈసూచనలను బోర్డువా రాచరించి తీరవలయును. ఈ సూచనలను రైళ్ళబోర్డువా రామోదించి ఆచరణయం దుంచకపోయిన యెడల వారిచే నాచరింపజేయుట కెట్టియధికారమును జాతీయప్రభుత్వమున కొసంగలేదు. పరిపాలనయందు రైళ్ళబోర్డువారికి నిరంకుశాధికార మొసంగబడెను. ఈపరిపాలనాధికారమునకు సరిహద్దులు నిర్ణయింపబడలేదు. పరిపాలనాధికార మిట్టిది యని నిర్వచింప బడలేదు. రైళ్ళబోర్డువారు తమకు దోచినట్లుగ నేకంపెనీవారితో నైనను కంట్రాక్టు గావించుకొనినయెడల ఆకంట్రాక్టు హానికరమైనది యగుచో దానిని విరమింపజేయుటకు జాతీయప్రభుత్వమున కధికారము గోచరింపదు. ఈరైళ్ళబోర్డును పార్లమెంటువారు లేక భారతశాసనసభ ఇం దేసభ నియమించునదియుగూడ విశదరింప బడలేదు. ఈబోర్డువారి

ఆదాయవ్యయశాసనమును భారతశాసనసభవారామోదింపవలయు ననునియమము లేదు. ఈబోర్డునుగుఱించిన నిర్ణయమును బరీక్షించిన యెడల భారతీయులకు, భారతీయ ప్రజాప్రతినిధులకు, భారతజాతీయ ప్రభుత్వమునకు అతీతమైన నిరంకుశాధికారముతో నీబోర్డు సృష్టింప బడనున్నట్టుల సుబోధక మగును. రైళ్ళపరిపాలనయందు ఏరాజకీయ పక్ష మధికారము వహించిన, ఆపక్షమువారు వారివ్యక్తి అభిమానము ను బ్రవేశపెట్టకుండ జూచుట అత్యవసరమే. ఇట్లు వ్యక్తి అభిమానమును పరిపాలనయందే శాఖయందునను బ్రవేశపెట్టరాదు. పరిపాలనాశక్తియు, చిత్తశుద్ధియు, దేశభక్తియు గలవారినే అధికారమునం దుంచినయెడల అధికారవ్యభిచారమునకు స్థాన ముండదు. ఇందులకు మాఱుగ ప్రజా ప్రతినిధులనుండి, జాతీయప్రభుత్వమునుండి 800కోట్ల రూపాయల పెట్టు బడి పెట్టిన నొక ప్రాముఖ్యశాఖ యగు రైళ్లపరిపాలనను, భారతీయ ఋణమున కంతకు ముఖ్యకారణమైన రైళ్ళపరిపాలనను తొలగింపవల యుననుట ప్రజాప్రభుత్వసిద్ధాంతములకు వ్యతిరేకము. ఇంటియందు గలఎలుకలను పోగొట్టుటకై ఇంటికి నిప్పుముట్టింపునుపటయే యీ రై ళ్లబోర్డు నిర్మాణమున కర్థము. "ఇంగ్లండునందు రైళ్లబోర్డునుగుఱించి విచారింప సమావేశపఱుపబడినసభ, రైళ్లపరిపాలనను రాజకీయవేత్త లబారినుండి తొలగించుటకై గావించినసూచన లాదోషమును నివా రించుటకు మాఱుగ నినుమడింప జేసెను. నేటిపద్ధతిని రైళ్లపరిపాలన భారతదేశరాజకీయకక్షులకు లోనగునను భయమున మఱొకక్రొత్తప ద్ధతి కనిపెట్టబడెను. ఈక్రొత్తపద్ధతిక్రింద ఆందోళన జేయగల కొందఱి బ్రిటిషురాజకీయవేత్తల అభివృద్ధికిని, వారిని అవసర మగునపుడెల్ల సంతృప్తి పఱుచుచుండుటకును, వీలుగనున్నది. ఇదియే క్రొత్తపద్ధతి యందుగల వ్యత్యాసము"[1]

---

1, *The Hindu of Madras*, 9 *August* 1933.

ఇట్టిబోర్డును స్థాపింపనీయరాదు. స్థాపించుటకు భారతదేశ మంగీకరించినయెడల భారతదేశార్థికాభివృద్ధికి వలయు ప్రధానాంగమే భారతీయులచేతినుండి తొలగి పోవును. అవసరమగుచో ఆంగ్లేయులవశమం దుండిన రైల్వేకంపెనీలను జాతీయప్రభుత్వము కొనివేయుటకును మార్చివేయుటకును గూడ నధికారము గలిగియుండవలెను. పరిపాలనాయంత్రమండలి ఖర్చులను, ఉద్యోగస్థుల జీతబత్తెములను తగ్గించివేయుటకు సంపూర్ణాధికారమును గలిగి యుండవలెను. క్రొత్త రైళ్లను వేయుటకును, అనవసరపు రైలుమార్గములను దీసివేయుటకును జాతీయప్రభుత్వము సర్వాధికారము గలిగి యుండవలయును. అనుదినపరిపాలనను గొనసాగించుటకు జాతీయప్రభుత్వ యానమంత్రిగారికి లోబడినబోర్డును మూడుసంవత్సరముల కొకసారి జాతీయప్రభుత్వమంత్రివర్గమువారు నియమింప దగును.

# 24. రైల్లు-ఆర్థికలాభాలాభములు.

రైల్వేచరిత్రమును, రైల్వేపరిపాలనయందలి లోపాలోపములను నింతవఱకు జర్చించితిమి. ఇక రైలుమార్గములు భారతవర్షమందు వేయుట ప్రారంభించినది మొదలుగ నార్థికముగ భారతభూమికి గలిగిన లాభనష్టములను గుఱించి తర్కించెదము. (1) "రైల్లు వేయుటవలన బరిశ్రమలు పరివర్తనము పొందినవి. (2) ఎగుమతికి వీలుండుటవలన ప్రత్యేకోత్పత్తికి ప్రోత్సాహకరముగ నున్నది. (3) కఱవులను ప్రతిఘటించినవి. (4) తోటలు మొదలగు పరిశ్రమలను విఱివిగ నుత్పత్తి చేయగల పరిశ్రమలకు లాభదాయకముగ నూతనోత్సాహ మొసగబడెను. (5) ఏగ్రామమున కాగ్రామమే జీవించునేకాకితనము పోగొట్టినవి. (6) ఇప్పుడు హిందూదేశపుసరకులకు ప్రపంచమునం దెల్ల

అమ్మకము కలదు. పూర్వము జిల్లాలమధ్యమం దుండెడియెగుమతి యిప్పుడు ప్రపంచమునం దంతట వ్యాపించుటచే ధర లధికమై ఆర్థి కాభివృద్ధి కలుగుచున్నది."[1]

అని రైళ్లవలన నుపయోగములు పేర్కొనబడుచున్నవి. ఈ ఆయులాభముల గ్రోడీకరించి చూచుచో వీటికి మూలాధారములగు సూత్రములు రెండే కలవు. యంత్రములవలన పారిశ్రామికవిప్లవము దెచ్చి యధికోత్పత్తి గావించుట, ఆయధికోత్పత్తి విడుదలకొఱకు విఱివిగ నెగు మతియగుటకు వలయురైలుమార్గము లుండుట, దేశాభివృద్ధికి కారణ ములనియు, అందుచే భారతవర్షమునకుగూడ రైలుమార్గములు లాభ దాయకములే యయినవనియు గొందఱవాదము. దేశపరిపాలన ప్రజా ప్రభుత్వమై యుండి, ఆర్థిక రాజకీయ పారిశ్రామిక వర్తకవిషయము లందు ప్రభుత్వయంత్రములు స్వదేశలాభముకొఱకై పాటుబడుచుండిన యెడల ప్రస్తుతప్రపంచ దృక్పథమున అధికోత్పత్తి విడుదలలకు రైలు మార్గములు లాభదాయకములే. అవసరమగు సరకులే ఎగుమతి జరు గక నిలిచియుండునట్లుగను, మనసరకులతో పోటీకివచ్చుసరకుల దిగుమతిని నిషేధించుకొనుటకును, వలయునధికార మున్ననాడే అధికోత్పత్తి యగుటకు గాని, అధికోత్పత్తి సక్రమముగ నెగుమతి యగుటకు గాని వీలుండును. మనదేశమునం దీయధికారము ప్రజలయందు లేదు. హిందూదేశప్రభుత్వము బ్రిటిషుప్రభుత్వశాఖగ మాత్రమే పనిచేయు చున్నది.

రాజకీయాధికారము ప్రజలయందు లేనందువలన రైలుమార్గ ములు భారతీయపరిశ్రమల నాశనమే యొనరించినవి. (1) చేతిపని చేసి

---

1. *See Mr. Chandrika Prasad's Monograph and Mr. K. C. Srinivasan's Law of Railway Rates to know in Detail The Economic Advantages of Railway Construction.*

కొని జీవించెడు పారిశ్రామికులపై విఱివిగ యంత్రములచే తయారు కాబడి, చౌకగ భారతదేశమందంతట దిగుమతి చేయబడుచుండిన విదేశపుసరకులు దాడివెడలి పారిశ్రామికుల పొట్టపై గొట్టినవి. (2) దేశమునం దత్యావసరముగ నుండి, జీవనోపాధి కత్యంతోపయోగకరము లగు ముడిపదార్థములు, ఆహారపదార్థములు విదేశముల కెగుమతి యగుట వలన ఆహారపదార్థముల ఖరీదు హెచ్చి జనసామాన్యమునకు జీవించుట దుర్భరమైనది.(3)ఆహారపదార్థములధర పెరిగి,రైతులకును బజారునకును మధ్య దళారీచేయు తరగతిప్రజలు (Middlemen) బయలుదేఱిరి. రైతు వద్దనుంచి కొని పై కెగుమతి చేయుట కీయనవసరపు దళారీలగుంపు బయలుదేఱినది. (4) రైళ్లనిర్మాణమునకై పెట్టబడిన కోట్లకొలది రూపాయలను వ్యవసాయాభివృద్ధికి, అనగ కాలువలు, మురుగుకాలువలు, క్రొత్తభూములను పల్లముచేయుట, పండించుట మొదలగు పనులకు వినియోగించియుండిన వ్యవసాయము క్షీణింపక అభివృద్ధియందుండెడిది. నిరాహారులు నిర్వ్యాపారులు నిస్సహాయులు బయలుదేఱకుండెడివారు. (5) రైళ్లపై పెట్టబడిన పెట్టుబడి అనేకసంవత్సరరములు వరుసగ లాభమువచ్చినను పూడదు. (6) భారతీయ పరిశ్రమలు విదేశయంత్రాగారములపా లగుటవలన మన వ్యక్తిగతోత్సాహము చచ్చిపోయినది. (7) జీవితమునందు భోగపరాయణత్వమునకు హద్దుదాటిన పాశ్చాత్యభూములలోవలె స్వార్థము వ్యాపించి సంతృప్తి నశించినది. అపరిమిత ధనార్జనాభావములచే నసంతృప్తి, యసౌఖ్యము ప్రబలినవి. (8) రోగములు విచ్చలవిడిగ వ్యాపించుచున్నవి. రైళ్లమూలమున మలేరియా వ్యాప్తి యగుచున్న దని పలువురు నిశ్చయించిరి. రైళ్లు కట్టుటకై ప్రక్కలను ద్రవ్వగోతులలో నీళ్ళు నిలువయుండుటవలనను, సహజముగ పోవలసినమురుగునీరు రైలుకట్టలవలన నిరోధింప

బడి చిన్నచిన్న వంతెనలక్రిందుగ బోవలసి వచ్చుటవలనను గూడ జాడ్యములు ప్రబలుచున్నవి. ముఱుగు తేఱుచుగవచ్చి పంటలు పాడగు చున్నవి. (9) వివిధ దేశములయందుగల చేతిపనులు 18 వ శతాబ్దమునందు ప్రపంచమునందు ప్రారంభించిన పారిశ్రామికవిప్లవము వలన నశించిన మాట నిజమే. కాని, ఆ దేశములయం దట్లు నశించిన వెనువెంటనే పరిశ్రమల ప్రస్తుతవిధానము (యంత్రములవలన ఉత్పత్తి) వాటివిడుదలకు వలయు రాకపోకల సౌకర్యములు కలిగినవి. ఎగుమతి దిగుమతుల రాజనీతి, స్వదేశాభివృద్ధికరదృష్టితో నిర్ణయించు కొనగలిగిన రాజ్యాధికార మున్నది. అందుచే చేతిపనుల నాశనమువలన గలిగిన ఆర్థికదుస్థితి ఉత్తరక్షణమందే తొలగిపోయినది. హిందూ దేశమున విదేశపు యంత్రసామగ్రుల దిగుమతివలన చేతిపనులు నశించిపోవుటయే కాని, యంత్రముల వలననైన అధికోత్పత్తి యగునట్లు పరిశ్రమలు పరివర్తన మొందలేదు. పొందినంత వఱకైన విడుదలకు వలయునట్లుగ రైలుమార్గములును లేవు. ఉన్నవని తలంచినను నెగుమతి దిగుమతుల రాజనీతిని, నిర్ణయించుకొనగలిగిన రాజ్యాధికారము లేదు. అందువలన చేతిపనులు చెడిపోవుటయు, పాశ్చాత్య పారిశ్రామిక పరివర్తనము లేక పోవుటయు జరిగి రెంటికిని చెడి ఉభయభ్రష్టత్వము దాపరించినది. క్షామదేవత తాండవమాడుచున్నది. (10) రాజ్యాధికారము లభించి ఎగుమతి దిగుమతుల రాజనీతి నిర్ణయించుకొన గలిగిన యధికారము బడసిన పిమ్మట గూడ క్రీస్తుశకము 2000 సం॥ లు అగుదాక, ఈరైళ్ళవలన గలిగిన నష్టమును పూర్తిచేసికొనుటకు గాని, ఆర్థికాభివృద్ధి పొందుటకు గాని, వీలు గోచరించుట లేదు. రైల్వే ఆదాయవ్యయనిర్ణయములో ప్రభుత్వము సం.. 1899—1900 లు వఱకువచ్చిన నష్టమును పూర్తిచేయవలసినబాధ్యతను గుర్తించుట లేదు. అంతవఱకు వచ్చిననష్టము దానిక్షాంపౌండువడ్డీ (Compound

Interest) తో సహా పూర్తి కావింపవలసినబాధ్యత గలదు. ఈబాధ్య తను నెఱవేర్పక, గత నష్టము వడ్డీని గుర్తింపక ప్రతిసంవత్సరము రైళ్లవలన లాభము వచ్చుచున్నట్లు 1900 సంవత్సరము మొదలు అంకెలు చూపబడుచున్నవి. ప్రభుత్వబాధ్యతపై 100 కి రూ 4లు మొదలు రు 5 లవఱకు వడ్డీ యిచ్చుపద్ధతిని నిర్మింపబడిన రైల్వేకంపె నీలవలన కలిగిననష్టము 1919-20 సం॥రము వఱకు వడ్డీతో సహా రు 3460622128 లని టివేరీగారు (Tiwari) మదింపు వేసిరి. ప్రభుత్వము కంపెనీలపెట్టుబడిమీాద రు 5½ వఱకు వడ్డీ యిచ్చుచు వచ్చినను టివేరీగారు భారతదేశపుపెట్టుబడిమీాద 100 కి రు 4/-లచొ॥ వడ్డీ గట్టిరి. రైళ్లనిర్మాణమువలన గలిగిన ధననష్టమును, అందులకుగల కారణము లను కాంగ్రెసు ఋణోపసంఘమువారు విపులముగ వివరించిరి. రైళ్ల నిర్మాణమువలన గలిగిన నష్టము కనీసము 83 కోట్లు బ్రిటిషుప్రభుత్వ మువారు హిందూదేశమునకు తిరిగి యొసంగవలయు నని నిరూపించిరి.[1]

ఆక్వర్తుకమిటీవారు వడ్డీగాక 1858 మొదలు 1918-19 వఱకు వచ్చిననష్టము పౌ 51527307 లు, లేక 7729 లక్షలని మదింపువేసిరి. ఈలెక్కల ననుసరించి చూచినను నింతవఱకు లాభము లనుపేరున పౌ 44742276 లు లేక 6711 లక్షలరూపాయలు మాత్రమే వచ్చినది. అనగ నింకను 1010 లక్షలు నష్ట మున్నది. పైగ కంపెనీలవద్దనుంచి ప్రభుత్వము స్వాధీనపఱచుకొనిన రైలుమార్గములకు ప్రతిసంవత్సరము కొంత ముదరా (Annuities) నీయవలసి యున్నది. ఈసంవత్సరపుము దరా లింతలో వదలిపోవు. ఈస్టిండియన్ (East Indian Railway) కంపె నీవారికి ప్రతిసంవత్సర మీయబడిన ముదరా 1980 సం॥ వఱకుగూడ నున్నది. అనగ నీశతాబ్దాంతమువఱకును, 1858 మొదలు 150 సం॥లు

1. *See Congress Debts Enquiry Committee Report.*

హిందూదేశమందలి రైలుమార్గములవలన బ్రిటిషుదీవుల కార్థికాభి వృద్ధియు, భారతదేశమున కార్థికానర్థకమును గలిగినవనుట నిశ్చయము. అచ్చట సిరిసంపదలును ఇచ్చట కాటకరోగములును ప్రబలినవి.[1]

## 25. ఓడలు-ఓడరేవులు, నదులు-కాలువలు.

ఓడరేవులు.

ఏనాడో క్రీస్తుశకమునకు పూర్వమే భారతీయులు సముద్రయానమునం దాఱితేఱి యుండిరని చరిత్రకారుల నిర్ణయము. "ఆర్యవర్తకులు సింధునదీముఖద్వారమునుండి మలబారుసముద్రతీరమునకు వర్తకమునకై పోయెడివారని యూహింపవచ్చును. వేదములయందలివ్రాతల ననుసరించి ఆర్యులు సోలమను కాలమున విదేశసముద్రవర్తకవ్యాపారమును సలిపిరని రూఢి యగుచున్నది."[2]

క్రీస్తుశకమునందుగూడ భారతీయులు విదేశములకు బోయి వర్తకము చేయుచుండిరనుట కనేక నిదర్శనము లున్నవి. గతజల సేతుబంధన మేల? ఆంగ్లేయయుగమున మన సముద్రయాన మెట్లున్నది? ప్రాక్పశ్చిమదక్షిణదిశలయందు సముద్రపరివృతమై యున్న భారతభూమియందు నేడు వ్రేళ్లపై లెక్కింపవలసినన్ని యోడరేవులు మాత్రమే కలవు. విఱివిగ ధన ముపయోగించిన గాని భారతసముద్రతీరమందలి రేవుస్థలములను బాగుచేయుటయు నౌకాశ్రయము (Harbours)లను గట్టించుటయు గొనసాగదు. అందుచే ప్రభుత్వము ఓడరేవులయభివృద్ధికై శ్రద్ధ వహింపలేదు. ఎంతవఱకు ఆంగ్లేయుల

1. ప్రభుత్వాదాయ వ్యయశాసనమున రైళ్లపరిపాలననుగుఱించి మఱికొంత వ్రాయబడెను.

2. *From the Splendour that was I. K. A. p. 176.*

వర్తకమునకును రాజ్యస్థాపనమునకును రాజ్యసంరక్షణమునకును అవసరమో అంతవఱకు ఓడరేవులను సమీపించిరి. అందువలన 100కి 90వంతులు వర్తకము అయిదు రేవుపట్టణములయందు మాత్రమే జరుగుచున్నది. అచ్చటనుండియే ఎగుమతిదిగుమతులు జరుగుచున్నవి. కలకత్తా, బొంబాయి, కరాచి, రంగూన్, మదరాసు లను నీఅయిదు ఓడరేవులే పేర్కొనదగినవి. ఈఓడరేవులు ప్రభుత్వాధికారమునకు లోబడినపోర్టుట్రస్టు లనసంఘములచే పాలింప బడుచున్నవి. 1928లో చిటకాంగుగూడ ఓడరేవుక్రింద గ్రహింపబడి పోర్టుట్రస్టు యేర్పఱుప బడెను. పశ్చిమసముద్రతీరమున బొంబాయి, కరాచీ, మార్మగోవా రేవు లున్నవి. ఈరేవులు జూను, జూలై, అగష్టు, సెప్టెంబరు మాసములలో వర్షకాలమందు గూడ నుపయోగకరములు. సూరతు, కుంఫిణీ వారు వచ్చుసరికి ప్రాముఖ్యమైన రేవుపట్టణము. 19దవ శతాబ్దమునందే దానిప్రాముఖ్యత నశింపు చేయబడినది. ఇది నదీముఖద్వారమునకు 14మైళ్లదూరమున గలదు. మార్మగోవా కూడ సనాతనరేవుపట్టణమే. ఆరేవుపట్టణమునకు భూభాగమునుండి సరియగు రాకపోకల సౌకర్యము లేర్పఱుపబడలేదు. ఈకారణమున ప్రాముఖ్యత గోలోవ్వవలసివచ్చెను. కొచ్చిఓడరేవు ఒండ్రు తీయించి బాగుచేయించినయెడల వినియోగపడును. ఆపని యింతవఱకు చేయింపబడలేదు. మంగుళూరు, పెలిచ్చెరి (Pellicherry), కాలికట్టు, ఎల్లెప్పి (Alleppey) రేవుపట్టణములు. వీటియందు చిన్నచిన్నఓడలు మాత్రము తిరుగుచున్నవి. కోస్తావ్యాపారమే జరుగుచున్నది. ఇవి పెద్దయోడరేవులుగ జేయబడుటకు మార్గములు కలవు. కాని ప్రయత్నములు జరుగలేదు.

తూర్పుసముద్రతీరమునం దినుకతిన్నె లధికముగ నేర్పడుచుండుటవలన కృత్రిమముగ రేవుల నేర్పఱుపవలసి యున్నది. మదరాసు

సముద్రతీరమున గోడలుకట్టబడి సురక్షితమైన రేవుపట్టణముగ మార్చ బడెను. కలకత్తా, చిటగాంగ్ రేవులలో ప్రతిసంవత్సరము ఇసుక తీయించివేయవలసి వచ్చుచున్నది. టుటికోరను, ధనుష్కోటి, నాగపట్టణము, పాండుచ్చేరి, మచిలీపట్టణము, కాకినాడ, విశాఖపట్టణము లుగూడ సముద్రతీరములే. ఓడ రేవులు గలవు.

బర్మాదేశమునందు రంగూను, మోల్మేను, బాసీను, టావరేవు పట్టణములు కలవు. ఇవన్నియు సముద్రతీరమునకు కొలదిదూరముగ నున్నవి.

బొంబాయి:—బొంబాయినగర మాధునికవర్తక పారిశ్రామిక ప్రాముఖ్యము వహించి యున్నది. గ్రేటుఇండియన్ పెనన్సులర్ రైలు మార్గమును, బరోడా సెంట్రలు ఇండియారైలుమార్గమును (Railway) ఇచ్చటినుండి పోవుచున్నవి. దక్కనునందు సంయుక్తరాష్ట్రమున గల దూదిపంట, పంజాబునందుగల దూది, గోధుమపంట లీరేవుపట్టణము నకు విశేషముగ జేరుచున్నవి. అమెరికా స్వాతంత్ర్యయుద్ధకాలమున అమెరికావారు ఇంగ్లండునందలి లాంకషైరు దూదిమిల్లులకు దూదిని పంప నిరాకరించిరి. అప్పుడీ రేవుపట్టణమునుండియే ఇండియాయందలి దూది, లంకషైరుమిల్లులకు కెగుమతి చేయబడెను. ఐరోపా యుద్ధ మునకు పూర్వ మీరేవుపట్టణ ముభివృద్ధిపఱచు మార్గములు యోచింపబడినవి. యుద్ధప్రారంభములో నాయోచనలు నిరమింప బడెను. 1919 సం॥ నాటికి 10 కోట్ల విలువగలపని చేయబడినటుల జూపబడెను. సముద్రమును పూడ్చి, డాకులకు ఉత్తరదిశగ భూమిక్రింద చేయబడెను. ఇట్లుచేయుటలో తెల్లయుద్యోగు లపహరించిన సొమ్ము నకు పరిమితి లేదు. (ఈసత్యము నారిమనుగారి కేసులో బుజువైనది.) ఇప్పుడు హార్బరు ఉత్తరదక్షిణములుగ 10 మైళ్లపొడుగును, 4 మైళ్ళు

లేక 6 మైళ్ళ వెడల్పును గలిగియున్నది. ఈ రేవుపట్టణమునుండియే దక్కను, పంజాబు, మధ్యహిందూస్థానములయందు పండు ప్రత్తియు, నితర ముడిపదార్థములును నితరదేశములవారు తీసికొని పోవు చున్నారు. నూనెవిత్తులు, ఊలు, లేక, బొచ్చు, చర్మములు, మాంగనీసు, ఇతరఆహారపదార్థములు అన్నియు, కరాచీ, పంజాబునకు సమీపముగ నుండుటవలన కరాచీమీదుగ నెగుమతి కావలసియున్నను పంజాబు నుంచి బొంబాయికిగల పెద్దరైలు మార్గములవలన బొంబాయి మీదుగ నెగుమతి యగుచున్నవి. ఈ రేవుపట్టణము సూయజుకాలు వకు అన్నిటికంటె సమీపమునందున్న రేవుపట్టణ మగుటచే, విదేశపు వస్తువు లన్నియు గూడ నీ రేవుపట్టణము నుంచియే దిగుమతి యగు చున్నవి. దక్షిణమున కన్యాకుమారి అగ్రమునుండి వచ్చుఓడలకు గూడ నిదియే సౌకర్యమైన రేవుపట్టణము. విదేశవస్త్రములు, యంత్ర ములు, యంత్రసామగ్రులు,. రైళ్లయినుపపట్టాలు, ఇనుము, ఉక్కు లతో చేయబడిన ఇతరవస్తువులు, పంచదార, కిరసనాయిలు, ఇతర పెట్రోలు, మొదలగు వంటచెఱకు, రంగులు, రాక్షసిబొగ్గు, ఇతర చిల్లరవస్తువులు, ధనము, వెండిబంగారములు నిచ్చటనుండియే దిగుమతి యగుచున్నవి.

కలకత్తా:—ఇచ్చటనుండి భారతవర్షమందలి మహాఫలవంత మైన గంగానదీప్రాంతమున పండు పంట లన్నియు నెగుమతి యగు చున్నవి. గోగునార, నారసంచులు, అస్సాము తేయాకు, మాంగనీసు (Manganese) ఇనుము, ఉక్కు, రాక్షసిబొగ్గు, నూనెవిత్తులు, ధాన్యము, చర్మములు, నల్లమందు మొదలగుసరకు లెగుమతి యగుచున్నవి. బొంబాయివలెనే విదేశవస్త్రములు, ఇనుపఉక్కుసామానులు, పంచ దార, మొదలగు నితరవస్తువులు దిగుమతి యగుచున్నవి. బర్మానుండి యెగుమతియగుధాన్య మిచ్చటనే దిగబోయుచుందురు. ఈకలకత్తా

నదీముఖద్వారమునుండి సముద్రతీరమునకు 80 మైళ్లదూరమున గలదు. ఈరేవుపట్టణమునందు దిగుమతులకంటె నెగుమతులు హెచ్చుగ నున్నవి. బొంబాయివలెనే, కలకత్తారేవుగూడ అభివృద్ధిపఱచుటకు సావకాశము లున్నవి. 1913 లో అభివృద్ధిచేయవలె నని గావింప బడిన సంకల్పము లింకను పూర్తి కాలేదు.

కరాచీ:—అమెరికాస్వాతంత్ర్య యుద్ధమునాటనుండియు నీరేవు స్థలము ప్రఖ్యాతవంతముగనే యున్నది. సూయజుకాల్వ త్రవ్వుటవల నను,సం॥ 1878లో పంజాబునుండి రైలుమార్గములు వేయబడుటవలనను, ప్రాముఖ్యమునం దున్నది. నీటిసదుపాయము తక్కువ. ఓడరేవు సరిగ విశాలపఱుపబడలేదు. ఇచ్చట పరిశ్రమల యంత్రాగారములు లేవు. ఈపోర్టును గవర్నమెంటువారే పాలించుచున్నారు. అందుచే అంత ప్రాముఖ్యస్థితియందు లేదు. అయిన నిచ్చటనుంచి గోధుమలు విస్తారముగ నెగుమతియగుచున్నవి. గోధుమలు నిలువజేయుట కీశీతోష్ణ స్థితి మంచిది. ప్రత్తి, నూనెవిత్తుల యెగుమతి యధికముగ నున్నది. 1921 వ సం. రము నుంచియు నీరేవుపట్టణము నభివృద్ధిచేయ ప్రయత్న ములు జరుగుచున్నవి.

రంగూన్:—సముద్రమున కీరేవుపట్టణము 24 మైళ్ళదూరమున నున్నది. కాని లోతైన సముద్రపుపాయ లున్నవి. బర్మాయందు కాబడు యెగుమతిదిగుమతులలో నూటికి 80 వంతులు రంగూను నుండియే జరుగుచున్నవి. ధాన్యము, కలప, నూనెవిత్తులు, ద్రావక ములు, ఖనిజములు, చర్మములు ఇచ్చటనుండి దిగుమతి యగుచున్నవి.

మదరాసు:—నూనెవిత్తులు, చర్మములు నునుపుచేయు పదార్థ ములు, తేయాకు, కాఫీ, కాయధాన్యములు ఎగుమతి యగుచున్నవి. విదేశవస్త్రములు, ఖనిజములు, పంచదార, సోపుదినుసులు ఖనిజద్రావ కములు, అనేకవిధములైన చిల్లరసరకులు దిగుమతి యగుచున్నవి.

చిటగాంగ్:—1895 సం॥ రము నుండియు ధాన్యము, నార, తేయాకు, ఎగుమతుల కిది ప్రాముఖ్యము వహించెను.

టుటికోరను:—మదరాసు రాజధానిలో పేర్కొనవలసిన రెండవ ఓడరేవిదియే. సింహళద్వీపముతో నిచ్చటినుంచి వర్తకము విశేషముగ జరుగుచున్నది. ధనుష్కోటిమార్గము బయలుదేఱి నప్పటినుండియు, నీవర్తకము తగ్గుచున్నది,

కొచ్చిను:—బొంబాయి సింహళద్వీపముల మధ్యనున్న ప్రాముఖ్యమైన యోడలరేవు. కాని దీని నభివృద్ధి పఱచుట కెట్టి ప్రయత్నములు జరుగలేదు.

ఇతర రేవుపట్టణములు నామమాత్రములుగ నున్నవి. ఆంధ్ర దేశమందలి విశాఖపట్టణ మభివృద్ధి పఱచుటకు సదుపాయములు చాల గలవు. ఇచ్చటినుండి బర్మాకు కూలీలు విశేషముగ నెగుమతి చేయబడుచున్నారు.

విశాఘపట్టణము:—నౌకాశ్రయము కట్టుట పూర్తియైనది. 1933సంవత్సరమునందే హార్బరు ఓడలరాకపోకలకు తెరువబడెను. మూడునౌకలు ఒక్కమాఱుగ సరకును, జనమును రేవులో నిల్చి ఎక్కించుకొనుటకును, మూడుఓడలు ఒక్కమాఱుగ సరకును, జనమును దింపుటకును అవకాశములు కలవు. 26అడుగులు మించక నీటిలో మునిగినభాగముగల నౌకలకు అనుమతి యొసంగబడును. సూర్యోదయమునకు అరగంటముందుగ ఓడరేవుద్వారములు తెరువబడును. సూర్యాస్తమయమునకు అరగంట దాటినపిమ్మట రేవు మూసి వేయబడును. రేవుద్వారము తెరువబడినపిమ్మట రేవును సమీపించెడి నౌకలు రేవులోనికి, అవివచ్చుటకై నడిపింపగలమార్గదర్శి వచ్చువఱకును ఆఓడ డాల్ఫిననోసు అనుఅగ్రమువద్ద నిలిచి వేచియుండవ

లెను. ఈ ఓడరేవు అభివృద్ధియయినకొలదియు ఆంధ్రదేశమున వర్తక మభివృద్ధిజెందును. సం1933 అక్టోబరు 7వ తేదీనుండియు వర్తకపు నౌకలు పోర్బురునందు ప్రవేశించుచున్నవి.

## 26. నౌకాపరిశ్రమ.

నాలుగువేలమైళ్ల సముద్రతీరము గలిగి, వివిధవస్తుపదార్థోత్పాదకశక్తి కలిగి, నిరుపమానమై ప్రకృతిసిద్ధముగ భారతదేశము సముద్రవర్తకమునం దారితేరవలసి యున్నది. వలయునన్ని రేవుపట్టణములు కలవు.[1]

హిందూదేశ సముద్రతీరవ్యాప్తి ననుసరించి సముద్రవర్తకమునకు, నౌకాపరిశ్రమాభివృద్ధికి, భారతదేశమునకు ప్రకృతి విరుద్ధమగు పరిస్థితులు లేవు. 19 దవ శతాబ్దారంభమువఱకు నౌకాపరిశ్రమయందు విశ్వమునందెల్ల భారతవర్ష మగ్రస్థానము వహించెను. 1800 సం॥రమున గవర్నరుజనరలుగారు ఇంగ్లండునందలి తనప్రభువుల కిట్లు వ్రాసిరి. "కలకత్తా రేవుపట్టణమున 10000 టన్నుల ఓడలు గలవు. ఇవి హిందూదేశమునందే నిర్మింపబడినవి. ఈయోడ లింగ్లండునకు సరకును తీసికొని పోవుచున్నవి. బొంబాయియందుగల టేకుచెక్కతో చేయబడినఓడలు ఇంగ్లండునందలి పురాతనపుఓకు ఓడలకంటె బలిష్టముగ నున్నవి.[2]

"హిందూదేశమందు నౌకాపరిశ్రమ సుప్రసిద్ధముగ నున్నది. సీమవారిఓడలతో గలిసి తేమ్సునదిలోనికి ప్రవేశించుచు వర్తకము చేయుచున్నది.[3]

---

1. *Quoted from S. N. Haje's Economics of Shipping, pp. 365-6.*

2 *Digby's Prosperous British India p. p. 85-6*

3. *Digby's Prosperous British India*

అక్బరుచక్రవర్తి అనంతరపరిస్థితులగుఱించి మోర్ లాండుగారు వ్రాసినగ్రంథమున హిందూదేశ విదేశవర్తక మంతయు హిందూదేశ మందు నిర్మింపబడిన నౌకలవలననే జరిగియుండె నని వ్రాయబడెను. ఐరోపాఖండమం దెచ్చటగాని సరిలేని మహా విశాలనౌకలు ప్రయాణీకులను గొంపోవుచుండెడివి. ఇవి హిందూదేశమునందే నిర్మింపబడుచుండెడివి. పోర్చుగీసువారినావలు మాత్రమే హిందూదేశపునౌకలతో పోల్పదగియుండెడివి. ఇది మోర్ లాండుగారు వ్రాసిన చరిత్ర ప్రసిద్ధ సత్యము.

"సనాతనకాలమున నౌకానిర్మాణమునందు భారతీయు లత్యున్నత నైపుణ్యమును బడసిరి. ప్రస్తుతకాలమందలి భారతీయులుగూడ అయిరోపా ఖండమునకు నమోనాలను జూపగలరు. అందుచేత నౌకానిర్మాణ విషయమునం దత్యంతశ్రద్ధ వహించు నాంగ్లేయులు, భారతీయులను జూచి నౌకానిర్మాణమునందు విశేషమగు మార్పులను గావించుకొనిరి.[1]

నేడీస్థితి తలక్రిందులైనది. కారణ మేమి?

"ఉక్కుతో చేయబడిన విదేశపు పొగయోడలు భారతీయ సముద్రతీరముల జొచ్చుటప్రారంభించినవి. ఆంగ్లేయనౌకాపరిశ్రమాధికారుల తీవ్రాసూయకు భారతీయనౌకాపరిశ్రమ గుఱి యయ్యెను. ఆంగ్లేయుల (నావిగేషన్) సముద్రియాన శాసనము (English Navigation Laws) భారతదేశముపై ప్రయోగింప బడెను. బ్రిటిషు ప్రభుత్వాధికారము హిందూదేశమున సుస్థిర మగుట ప్రారంభించిన కొలదియు ఆంగ్లేయుల పొగయోడలు మన నౌకాపరిశ్రమను తనగర్భము

1. *A French writer quoted by Radhakrishna Mukerjee in History of Indian Shipping and Maritime Activity.*

నం దిముడ్చుకొనినవి. భారతీయనౌకాపరిశ్రమ నామరూపములు లేక నశించిపోవుట కివియే కారణములు."[1]

ప్రస్తుతము కోస్తావ్యాపారము (సముద్రతీర ప్రాంతములయందలి వర్తకము) నూటికి 12 వంతులును, విదేశనావికావర్తకము నూటికి 2 వంతులును మాత్రమే భారతీయుల యధీనమునం దున్నది. ఫ్రెంచి, ఇటలీ, జర్మనీ, ఆస్ట్రేలియా, పొగయోడలు కూడ మనవర్తకమునందు పాల్గొనుచుండుటచే నాంగ్లేయులే కోస్తావ్యాపారమును విదేశనావికావర్తకమును సంపూర్ణముగ వశపఱచుకొన లేకపోయిరి.

ఈదిగువ పట్టిక హిందూదేశపు ఓడరేవులయందు వర్తకము సలిపిన వివిధదేశముల నౌకలసంఖ్యయు, మోయగల బరువును దెలుపును.

| దేశము | నౌకల సంఖ్య | మోయగల బరువు. టన్నులు |
|---|---|---|
| 1. బ్రిటన్ | 4556 | 12986725 |
| 2. జపాన్ | 397 | 1300833 |
| 3. జర్మనీ | 314 | 1380680 |
| 4. ఇటలీ | 275 | 1154651 |
| 5. డచ్చి | 252 | 846291 |
| 6. అమెరికా | 139 | 497418 |
| 7. నార్వే | 185 | 403557 |
| 8. ఫ్రాన్సు | 64 | 316433 |
| 9. బ్రిటిషు యిండియా | 490 | 176923 |
| 10. స్వీడను | 85 | 106847 |

1. *See Digby's Prosperous. British India p. 87—9 and Malavya's minute of Dissent to the Industrial Commission Report pp. 299—300.*

ఈ దిగువపట్టిక హిందూదేశపు ముఖ్య ఓడరేవులయందు జరిగిన కోస్తావ్యాపార వివరములను దెలుపును.

| రేవు స్థలము | సంఖ్య | టన్నులు |
|---|---|---|
| 1. బొంబాయి | 62567 | 11627000 |
| 2. కలకత్తా | 3064 | 9962000 |
| 3. రంగూన్ | 3609 | 8995000 |
| 4. కరాచి | 5301 | 5095000 |
| 5. మద్రాసు | 1690 | 5981000 |
| 6. తుత్తుకుడి (Tuiticorn) | 1754 | 2464000 |
| 7. కొచ్చిన్ | 2136 | 2453000 |
| 8. చిటగాంగు | 2205 | 1288000 |

హిందూదేశమందు రిజిష్టరు చేయబడిన నూరుటన్నుల బరువు మోయగలవి, అంతకు మించినవి సం॥ 1930 మార్చి 31 తేదీకి ఈ దిగువ విధముగ నున్నవి.

| 1<br>ఓడ రకములు | 2<br>స్టీమర్లు మోటారుపడవలు | | 3<br>నౌకాయాన పరిమితి | | 4<br>మొత్తము | |
|---|---|---|---|---|---|---|
| | సంఖ్య | టన్నులు | సంఖ్య | టన్నులు | సంఖ్య | టన్నులు |
| 1. ఇనుము | 9 | 34062 | 1 | 161 | 10 | 34233 |
| 2. ఉక్కు | 145 | 178485 | 3 | 1081 | 148 | 179565 |
| 3. కఱ్ఱ వివిధరకముల కలయిక. | 4 | 1116 | 242 | 46305 | 246 | 47421 |
| | 158 | 213663 | 246 | 47547 | 404 | 261210 |

ఈదిగువపట్టికయందు 1929-30 సంవత్సరమున 29 నౌకలు 1017 టన్నులబరువుమోయగలిగినవి హిందూదేశమునందు నిర్మింపబడినవి.

| † నౌకల జాతీయత | యుద్ధమునకు పూర్వపు సగటు | | యుద్ధపు సగటు | | 1928-29 | | 1928-29 సం॥లో ప్రతి దేశముయొక్క మొత్తపు టన్నేజిలో భాగము |
|---|---|---|---|---|---|---|---|
| | సంఖ్య | టన్నులు | సంఖ్య | టన్నులు | సంఖ్య | టన్నులు | |
| 1. రాక (Entered) | | | | | | | |
| బ్రిటిషు | 2478 | 6140000 | 2272 | 4249000 | 2875 | 6605000 | 69.4 |
| బ్రిటిషు యిండియన్ | 312 | 171000 | 320 | 42000 | 273 | 122000 | 1.8 |
| విజాతీయము | 636 | 1738000 | 592 | 1269000 | 776 | 2739000 | 28.8 |
| స్వదేశి | 890 | 1476000 | 1476 | 119000 | 51 | 51000 | .5 |
| ప్రవేశించిన ఓడల మొత్తము | 4316 | 8116000 | 4660 | 5749000 | 4046 | 9517000 | 100. |
| 2. పోక (Cleared) | | | | | | | |
| బ్రిటిషు | 2456 | 6182000 | 2309 | 4432000 | 2823 | 6521000 | 69.7 |
| బ్రిటిషు యిండియన్ | 322 | 183000 | 298 | 70000 | 317 | 116000 | 1.2 |
| విజాతీయము | 615 | 1672000 | 594 | 1277000 | 757 | 2661000 | 28.5 |
| స్వదేశి | 858 | 63000 | 1728 | 146000 | 677 | 57000 | .6 |
| వెడలిన ఓడల మొత్తము | 4251 | 8100000 | 4929 | 5925000 | 4074 | 9355000 | 100. |
| మొత్తము | 8567 | 16216000 | 9589 | 11674000 | 8120 | 18872000 | 100. |

*From a Review of the Trade of India in 1928—29, Table No. 56.*

పైన వివరింపబడిన యంకెల ననుసరించి భారతీయులపరముగ నున్న సుమారు 100కి రెండువంతుల సముద్రవర్తకమున కివ వంతు, కోస్తాయందు తిరుగు చిన్న చిన్న నౌకలవలన జరుగుచున్నది. ఒకసంవత్సరమునకంటె మఱియొకసంవత్సరమున కభివృద్ధి యైన గోచరించుట లేదు. నౌకా "వర్తకమువలన సుమారు 57కోట్లరూపాయ లార్జింపబడుచున్న వని అంచనా వేయబడుచున్నది. ఇందు 50కోట్ల రూపాయలు విదేశపుకంపెనీలచే దోచుకొనబడుచున్నవి. రూ9కోట్లు వ్యాపారమున, రూ38కోట్లు సముద్రవర్తకమున, రూ3కోట్లు సముద్రప్రయాణీకులవలన విదేశస్థులకు లభించుచుండెను"[1]

యుద్ధకాలమున బ్రిటిషుపొగయోడలు తగ్గినవి. విదేశపుపొగయోడలు గూడ తగ్గినవి. అప్పుడే భారతీయనౌకాపరిశ్రమ యొకఅడుగు ముందునకు బోగలిగెను. జర్మనీ ఆస్ట్రేలియా దేశపునౌకలు విరమించినవి. అమెరికా జపానుల పొగయోడ లధిక మైనవి. యుద్ధమునకు పూర్వము అమెరికాయోడలు భారతదేశవర్తకమునందు పాల్గొనియుండలేదు. యుద్ధకాలమున ఫ్రెంచివారి పొగయోడలు తగ్గినవి. జపానువారిపొగయోడలు రెండింతలు పెచ్చుపెరిగినవి. అమెరికావారికప్పుడే స్థానము లభించినది. డచ్చి, ఇటలీ, నార్వే, గ్రీకు, స్వీడను యోడలు వృద్ధిపొందినవి. చైనా, స్పెయిను దేశములయోడ లప్పుడే మొట్టమొదటగ వచ్చుటకు ప్రారంభించినవి. యుద్ధము ముగిసినది. విదేశపు పొగయోడలవర్తక మధికముగ మరల పెరిగెను. స్వదేశనౌకాపరిశ్రమ యుద్ధమునకు పూర్వముగల స్థితికి మరల దిగజారినది. స్పెయిను, రష్యా, ఆస్ట్రేలియాయోడలు మనరేవులయందు వర్తక

1, Economics of Shipping by S. N. Haji P. 375.

మునే విరమించినవి. జర్మనీ దేశపుటోడలు మాత్రము పూర్వమున్న ఉచ్ఛస్థితిని మరల పొందగలిగినవి. అమెరికా, ఇటలీ దేశములఓడలు ప్రాముఖ్యతను వహించినవి. సీమవారి ఓడలతరువాత జపాను, ఇటలీ, జర్మనీ, డచ్చి, అమెరికావారియోడలే విశేషవర్తకమును జేయుచున్నవి.

కోస్తావ్యాపార మంతయు సీమవారి ఓడలకంపెనీలచేత నాక్రమింపబడి యున్నది. భారతీయ నౌకాపారిశ్రామికులకు, నౌకావర్తకులకు సీమకంపెనీలు మితిమీరిన ప్రతిబంధకముల కల్పించుచున్నవి. 1901-25 సం॥ రముల మధ్య పెట్టుబడిమీద 100 కి 20 వంతులు లాభములను సీమకంపెనీలు పంచిపెట్ట గలిగెను. దీనియర్థ మేమి? "అత్యధికపు రేట్లను వసూలు చేయుచున్నారు." (Fiscal Commission) ఖజానాసంఘమువారు "ఓడరేవులలో చాల వ్యత్యాసము కలదని వ్రాసిరి. ఒక ఓడరేవునుండి మఱొక ఓడరేవునకు ఎగుమతి చేయబడు స్వదేశవస్తువులపై వసూలు చేయబడుచున్న రేవులకును, హిందూదేశమునుండి విదేశములకును, విదేశములనుండి హిందూదేశమునకును జరుగు నెగుమతి దిగుమతులపై వసూలు చేయబడుచున్న రేవులకును బహువ్యత్యాస ముండుటచే స్వదేశవస్తువులకు ధరలు హెచ్చి, విదేశ వస్తువులతో పోటీకి తాళజాలక పడిపోవుచున్నవి."[1]

ఇంతకంటెను మఱియొక ఘోరము కలదు. బ్రిటిషునావిగేషను కంపెనీ లన్నియు గుమిగూడి కుట్రచేసి స్వదేశ నౌకాపరిశ్రమను మొలకెత్తుటకు ముందుగనే తుంచివేయ ప్రయత్నించుచున్నవి.

1. *Fiscal Commission's Report Para 31.*

# 27. మినహాయింపు పద్ధతి, రేట్లపోటీ.

## DEFERRED REBATE SYSTEM AND RATE WARS.

ఈకంపెనీ లన్నియు "మినహాయింపుపద్ధతి" ని ఏర్పఱచినవి. మినహాయింపుపద్ధతి:—యనగా ఓడలకు సామానులనెక్కించువర్తకుల కీ కంపెనీలగుంపు పొకనోటీసును పంపును. 4 లేక 6 మాసములలోపుగా నీకంపెనీవారి ఓడలకే సరకు నెక్కించుచో, ఆసరకుపై వచ్చు కేవులో సుమారు 100 కి 10 వంతులు సరకు నెక్కించిన వర్తకులకు మినహాయించెద మని తెలిపెదరు. ఈమినహాయించిన మొత్త మును మఱి నాలుగు లేక ఆఱుమాసముల వఱకు ఆకంపెనీల ఓడలకే సరకు నెక్కించిన గాని ముజరా యియ్యరు. ఈమినహా యింపుపద్ధతివలన తమ కాతాలను నిరంతరాయముగ కొనసాగించు కొనుచున్నారు. ఎగుమతిదారు డీకంపెనీలకు శాశ్వతముగా దీక్రింద నుం డుట తటస్థించుచున్నది. ఇట్లే రేట్లయందుగూడ ఘోరముగ నీకంపె నీలు ప్రయత్నించుచున్నవి. బెంగాలులో గోగునార నమ్మదలచు కొన్నరైతు, తనసరకును నిర్ణీతమగు స్టీమరుకంపెనీవారికే పంపవలసి యుండును. అట్లు పంపనియెడల రైల్వేకంపెనీవా రాసరకును తీసి కొనరు. గోగునారమిల్లులకును, గోగునారపండించు రైతులకును నార సరఫరానుగుఱించి ఒడంబడిక జరిగినపుడు ఆముడిసరకుయొక్క అమ్మ కమునుగుఱించి యొడంబడిక జరుగుటయే. కాక, ఆసరకు కలకత్తాకు ఇంగ్లీషువర్తకుల లాభమునకు సంబంధించిన నిర్ణీతమగు స్టీమరుకంపె నీలద్వారా చేర్పబడవలె నను షరతుగూడ నుండును. నార పండిం చువా రీవిధముగ కంపెనీకి సహాయపడక పోయినచో, నార కొను వారు పండించువారికి సహాయము చేయుటలేదు. ఇట్టి మినహాయింపు పద్ధతులను తొలగించుచు విదేశములలోవలె శాసన మొనరింపవలె

నని ఖజానావిచారణసంఘము సూచించెను. మినహాయింపు పద్ధతివలన భారతదేశ నౌకాపరిశ్రమకే కాక, విదేశనౌకాపరిశ్రమకు గూడ నష్టము గలిగి బ్రిటిషునౌకాపరిశ్రమ సంరక్షింపబడు చున్నది. విదేశస్థుల నౌకాపరిశ్రమ భారతీయుల నౌకాపరిశ్రమకంటె నధికముగ నుండుటచే విదేశస్థులనుండి సంరక్షించుకొనుటకే మినహాయింపుల-పద్ధతి ఏర్పఱుపబడెనని బ్రిటిషువర్తకులవాదము.

మినహాయింపుపద్ధతివలన విదేశస్థులు నష్టపడరు. ఆయాదేశపు ప్రభుత్వములు తమతమ నౌకాపరిశ్రమను సర్వవిధముల పోషించుకొనుచున్నారు. భారతదేశప్రభుత్వము నౌకాపరిశ్రమకు ప్రోత్సాహ మొసంగుట లేదు. బ్రిటిషుకంపెనీలనే ప్రోత్సహించుచున్నది. సాలుసరి 6.7 లక్షలరూపాయలను ఓరియంటల్ స్టీమ్ నావిగేషన్ కంపెనీకి ప్రభుత్వమువారు తమతపాలను గొంపోవుట కొసంగుచున్నారు. బ్రిటిషు ఇండియన్ స్టీమ్ నావిగేషన్ కంపెనీవారికి రు 1518000 ల నిచ్చుచున్నారు. ఆర్. ఎస్. ఎన్. కంపెనీ, ఐ. జి. ఎస్. ఎన్. కంపెనీ లకు సాలుసరి రు 67.320 లు విరాళమును, ఐరావతీ ఫ్లొటోమియా కంపెనీకి సాలుసరి రు 2 లక్షలను నొసంగుచున్నారు.

ఇట్లు సర్వవిధముల బ్రిటిషుకంపెనీలు ప్రభుత్వసాహాయమును పొందుచు భారతదేశపు నౌకాపరిశ్రమను నాశన మొనరించుచున్నవి. స్వదేశపుఓడలు పోటీ చేయజాలనంత తక్కువగా రేట్లను తగ్గించుచు, రేట్లపోటీ కాగలేక మనయోడలు కూలిపోయినపిమ్మట మరల రేట్లను హెచ్చించి, ధనమును సంపాదించు చున్నారు. కోస్తాయందుతిరుగు ఓడలలో, 3 వ తరగతి ప్రయాణీకుల కష్టములకు పరిమితిలేదు. స్వదేశపుఓడలు నల్లవారిఓడలగుటచే, విదేశపు ఇన్స్యూరెన్సుకంపెనీలు మొదటితరగతిఓడలను గూడ రెండవతరగతి ఓడలక్రింద భీమా చేయు

చున్నారు. విదేశపుఓడకంపెనీలు కోస్తాయందు తీరుగుచుండలయు నైన పెద్దయుద్యోగములు భారతీయుల కొసంగుటలేదు. పెద్దయుద్యోగము లకు భారతీయుల కర్హత కలుగుటకు సదుపాయము లొసగుట్టు లేదు.

# 28. వర్తక నౌకాదళ విచారణసంఘము.

## THE MERCANTILE MARINE COMMITTEE. 1923

భారతీయ వర్తక నౌకాదళసమస్యను విచారించుటకై 1923 సంవత్సరము ఫిబ్రవరియందు ప్రభుత్వమువారొకసంఘమును నియ మించిరి. ఈసంఘమువారీదిగువసూచనల గావించిరి.

1. భారతీయులను నౌకాయానమునకు తర్ఫీతుచేయుట కొక యోడను బొంబాయియం దేర్పఱుపవలెను. ఈసూచన ప్రభుత్వము వారిచే నంగీకరింపబడి డఫెరిన్ అను ఓడయందు ఉద్యోగస్థులను ఇంజ నీరులను తయారుచేయుట కేర్పఱిచిరి.

2. ఇంజనేరింగు కళాశాలలలో నౌకాదళమునకు వలయు ఇంజనేరులనుగూడ తయారుచేయవలెను. వారికి స్వానుభము కలుగు టకుగూడ శిక్షణ నేర్పాటు చేయవలెను. వసతు లొనగూర్పవలెను.

3. కోస్తావ్యాపారము భారతీయులయాధీనమై, భారతీయులచే నడుపబడునోడలకు మాత్రమే ప్రత్యేకింప బడవలెను. ఆస్ట్రేలియాదేశ మునందువలె లైసెన్సులపద్ధతి నేర్పఱుపదగును. లైసెన్సులిచ్చుట యం దీనియమముల గమనింపవలెను. (1) ఈయోడలు హిందూదేశ మందు రిజిష్టరు చేయబడవలెను. (2) ఓడలయధికారి భారతీయుడై యుండి భారతీయునియధికారముక్రింద నడుపబడవలెను. లేక, అధిక సంఖ్యాకులగు భారతీయులు వాటాదారులుగను, కార్యనిర్వాహకులు

గను నుండి, రూపాయలపెట్టుబడితో హిందూదేశమందు రిజిష్టరుచేయ బడిన జాయింటుస్టాకుకంపెనీలుగా నుండవలెను. (3) ఇట్టి కంపెనీల మేనేజిమెంటు అత్యధికముగ భారతీయులహస్తగతమై యుండవలెను.

4. కాలానుగతముగ నీయోడలయందలి ఉద్యోగస్థులందఱు భారతీయులై యుండవలయు ననియు, నీఓడలు భారతదేశమునందే నిర్మింపబడవలె ననియు, నియమము లొనరింపవలెను. ఓడలయందలి ఇంజనీర్లు, ఇతరఉద్యోగస్థులు, భారతీయులుగ నుండున ట్లొనరించుటకు ప్రభుత్వము కొంతకాలపరిమితిని నిర్ణయించి, యట్లు చేయుటకై ప్రస్తుతపుఓడలయధికార్లనుండి హామీ తీసికొనవలెను. మినహాయింపుపద్ధతి రేట్లుపోటీలపై ప్రభుత్వామోదముతో తగుచర్య తీసికొనుటకు లైసెన్సులనిచ్చు అధికారికి స్వాతంత్ర్య మీయవలెను.

5. ప్రస్తుతమున్న బ్రిటిషుకంపెనీలలో కోస్తావ్యాపారముచేయుచున్న యొకకంపెనీని హిందూదేశప్రభుత్వము కొనవలెను. ఆకంపెనీ నడుపుటకై డైరక్టర్లను నియమింపవలెను. ఈడైరక్టర్లలో నధికసంఖ్యాకులు భారతీయులై యుండవలెను. క్రమముగ నీకంపెనీని భారతీయులవశ మొనరించుటకై ప్రయత్నింపవలెను.

6. వలయునంతమంది సమర్థులగుభారతీయులు విదేశవర్తకమును, కోస్తావర్తకమును కొనసాగింప గలిగినపుడు భారతీయనౌకాపరిశ్రమకు విరాళముల నొసంగుటనుగుఱించి ప్రభుత్వము యోచింపనగును.

7. 1884 సంవత్సరపు బ్రిటీషువర్తకులు, నౌకాశాసనము (British Merchant Shipping Act of 1884) కమిటీవారు సూచించిన లైసెన్సు నియమములు వ్యతిరేకముగ నుండి, ఆచరించుటకు వీలులేకున్నచో భారతీయుల పెట్టుబడితో నిర్మింపబడి భారతీయులచే నడుప

బడుచున్న ఓడలకు విరాళములనిచ్చు పద్ధతిని పెద్దయుపరచవలెను. (Bounties) ప్రభుత్వమువారి తపాలాను మోసికొనిపోవుటకు భారతీయ నౌకలతోనే కంట్రాక్టు చేసికొనవలెను. ప్రభుత్వమువారు తెప్పించు సామానును భారతీయనౌకల మూలమునగనే తెప్పించుటకై యత్నింపవలెను.

8. ఓడలను నిర్మించుటకై కలకత్తా ముఖ్యస్థానము చేసి, నౌకాపరిశ్రమకు విరాళము నొసంగవలెను. విదేశముల ఖరీదులలో 100 కి 25 వంతులకు మించనివిరాళము వేయవలెను.

9. నౌకానిర్మాణశాలలను (Ship building yard) స్థాపించుటకై ప్రభుత్వము స్వల్పవడ్డీపై అప్పుల నొసంగ వలయును. సక్రమముగ స్థలములను సంపాదించుటకు ప్రభుత్వము తోడ్పడవలెను.

10. మొట్టమొదట సాంకేతిక విద్యాభ్యాసకుల సహాయమును పొందదగును కాని, ఇంగ్లండులోవలె దేశమంతటను నౌకాశాస్త్ర విద్యాభ్యాసమునకు వలయు బడులను, కళాశాలలను, స్థాపింపవలెను. ఈవిషయమున జపానువారిని అమెరికావారిని మనము అనుసరింప వలెను. ఇంగ్లండునకు నౌకానిర్మాణశాలలయందును, కళాశాలల యందును విద్య నభ్యసించుటకై భారతీయవిద్యార్థుల బంపవలెను. వలయునంతమంది ఇంగ్లండునకు బోయి, విద్య నభ్యసించి,వచ్చులోపుగ, ఇంజనీరింగు కళాశాలలయందునను నౌకానిర్మాణశాస్త్రవిద్యాభ్యాస మునకు సదుపాయము లొనగూర్పవలెను.

## 29. హాజీగారిబిల్లులు, కోస్తావ్యాపార సమస్య.

డఫెరిన్ ఓడను స్థాపించుటతప్ప పైకమిటీవారి సూచనలేమియు ప్రభుత్వమువా రంగీకరింపలేదు. 1931 సంవత్సరమునుండియు మాత్రము ముగ్గురికి తల 1కి 240 పౌ॥ల చొప్పున ఉపకారవిద్యార్థివేతనముల నిచ్చు

చున్నారు. వీరు ఇంగ్లండులో నౌకానిర్మాణశాస్త్రమును చదువ వలెను. నౌకాదళసంఘమువారిసూచన లన్నియు ప్రభుత్వమువారు తిరస్కరించుటచే, 1928సం॥రము, సెప్టెంబరునందు జరిగినభారతశాసనసభ యందు కోస్తావ్యాపారమును భారతీయులకు ప్రత్యేకింపవలె ననుబిల్లు ప్రవేశపెట్టబడెను. ఈహాజీగారిబిల్లును ప్రతిఘటింపని ఆంగ్లేయుడు లేడు. ప్రభుత్వసభ్యు లందఱు ప్రతిఘటించిరి. కోస్తావ్యాపారమును భారతీయులకే ప్రత్యేకించుటలో గలదోష మేమి? ఇతరదేశము లన్నియు తమ కోస్తావ్యాపారములు తాము సంరక్షించుకొనుచుండుట లేదా? హాజీగారిబిల్లునందు జాతిద్వేష మున్న దని ఆంగ్లేయవర్తకులు వాదింపసాగిరి. ఆంగ్లేయవర్తకులస్వార్థమునకు కష్టమగులు ప్రతివిషయ మున వారికి జాతిద్వేషము గోచరించుచునే యున్నది. స్వయంసంరక్ష ణము పరద్వేషము కాజాలదు. పరద్వేషమే యున్నదని తలంచినను, క్షుద్బాధతో గ్రుస్కుచున్న భారతదేశము సేవకుమాలినధర్మమును బుద్ధిపూర్వకముగ నాచరింపజాలదు. భారతీయనౌకాపరిశ్రమాభివృ ద్ధికై విజాతీయనౌకలను భారతసముద్రతీరప్రాంతములనుండి తరిమివే యుట కెట్టిప్రయత్నము లొనరించినను దోషము లేదు. భారతీయులు కోస్తావ్యాపారమునంతను ప్రత్యేకించుకొని సమర్థించుకొనగలరని హాజీ గారు ధృఢపఱచిరి. కోస్తావ్యాపారమునకు స్టీమరు1కి 6 వేలటన్నులబరువు మోయగలిగిన 100స్టీమరులున్నచో చాలుననిరి. ఇందులకు 16.50 కోట్లరూపాయలు మాత్రమేచాలుననిరి. హాజీగారిబిల్లు ననుసరించి 5సంవ త్సరములలో కోస్తావ్యాపారము ప్రత్యేకింప వలెనన్న సాలుసరి 20 స్టీమర్లు కొనిన చాలును. "ఈమధ్యనే 150 కోట్లు రైళ్లనిర్మాణము నకై పెట్టుబడి పెట్టిన ప్రభుత్వము పైమొత్తమున పదియవవంతగు పెట్టుబడిని కోస్తావ్యాపారమును భారతీయులకు ప్రత్యేకించుటకై పెట్ట జాలదా?" అని హాజీగారు ప్రశ్నించుచున్నారు. ఇట్లుచేయుట ఇతరుల

హక్కుల నన్యాయముగ నూడబెరకుకొనుటయే యని ప్రభుత్వవాదము. హిందూదేశపు కోస్తావ్యాపారము నంతను నిగ్రమింగ గలిగిన హక్కును విదేశవర్తకుల కెవ రిచ్చిరని ప్రజలప్రశ్న. ఈవర్తకు లింతవఱకు జేసినదోపిడితో నేటికైన సంతృప్తి పొందుట సమంజస మని ప్రజలవాదము. ఈవాదము పాలకించువా రెవరు? సం॥ 1929 ఏప్రెలు నందు హాజీగారిబిల్లు సెలెక్టుకమిటీవారిచే సవరింపబడి ప్రకటింపబడెను. సం॥ 1930 జనవరి 3-4 తేదీలలో ఢిల్లీయందు ఆంగ్లేయఓడకంపెనీల అధికారులును, భారతీయఓడల అధికారులును గలిసి సభచేసిరి. ఈసభకు నాడు వైస్రాయిగనున్న ఇర్విన్ప్రభువు అధ్యక్షుడు. ఈసభయందాంగ్లేయులకు, భారతీయులకు రాజీ కుదురలేదు. ఎట్లు కుదురును? వైస్రాయియు, నధ్యక్షుడు నగు ఇర్విన్ప్రభువు గూడ కోస్తావ్యాపారము భారతీయులకు ప్రత్యేకించుట దోపిడి యనియు, బలాత్కారమనియు అధికారహరణ మనియు ప్రసంగించెను. స్వార్థపరులకు న్యాయము గోచరించుట దుస్తరము కదా! హాజీగారిబిల్లును ప్రజాభిప్రాయమును గనుగొనుటకై తిరిగి గెజెట్ నందు ప్రకటింపవలెనని సం॥ 1930 జనవరి 23 తేదీని భారతశాసనసభ తీర్మానించెను. హాజీగారు సం॥ 1929 ఫిబ్రవరిలో "మినహాయింపుపద్ధతిని" తొలగించివేయుటకు మఱియొకబిల్లు ప్రవేశపెట్టిరి. ఈబిల్లు సెలెక్టుకమిటీకి పంపబడెను. పరిభుత్వసభ్యుడగు సర్. వారి రెయినీగా రీబిల్లునుగూడ పరిశీలించిరి. హాజీగారి రెండుబిల్లులును శాసనములు కాలేదు. ప్రభుత్వము వారిచే పరిత్యజింపబడినవి.

జపాను, అమెరికా, జర్మనీ మొదలగు దేశములలో నౌకావ్యాపారము సుప్రసిద్ధముగ నుండుటకు ఆప్రభుత్వములు నౌకాపరిశ్రమకొసంగిన సహాయమే కారణము. ఇంగ్లండునందు గూడ నౌకానిర్మాణస్థితియు, వర్తకస్థితియు నుచ్ఛ్రయమందుండుటకు సీమవారు గావించిన

ప్రత్యేకనౌకాశాసనములే కారణము. 2 శతాబ్దములు నౌకాశాసనముల మూలమున (Navigation Acts) నౌకాపరిశ్రమ సంరక్షింపబడినది. అయినను హిందూదేశ ప్రభుత్వము భారతీయ నౌకాపరిశ్రమ వృద్ధిపొందించుటకు గాని, సంరక్షించుటకు గాని పూనుటలేదు. విదేశపుకంపెనీల పోటీలవలన నశించి పోవుచున్నను జేయూత నొసంగుట లేదు. రాజకీయ దృక్పథమున బరీక్షించినను వర్తకదృక్పథమున బరీక్షించినను గూడ భారతీయ నౌకాపరిశ్రమ నభివృద్ధిపఱచుట విధి. యుద్ధకాలమున దేశసంరక్షణకై నావికాదళ మత్యవసరము విదేశ వ్యాపారము విస్తారముగ గలిగియున్న హిందూదేశము తనవ్యాపారమునకై విదేశనౌకలపై ఆధారపడుట ప్రమాదకరము; ఆత్మవంచనము. విదేశనౌకలపై ఆధారపడవలసిన పరాధీనస్థితివలన యుద్ధకాలమున భారతవర్షము పడిన బాధలు నుడువునకు రావు. భారతీయులు సముద్రయానమున కనర్హులనుటయు, నీప్సితము లేనివారనుటయు స్వార్థపరులాడెడి కల్లబొల్లిమాటలు. ఈమాట లనృతములని భారత దేశచరిత్రయే చాటగలదు.

నూతనసంస్కరణ కోస్తావ్యాపారము. నూతనరాజ్యాంగ సంస్కరణవిధానమున (ఫెడరల్ రాజ్యాంగమున) గూడ, భారతీయులు కోస్తావ్యాపారమును- కోస్తావ్యాపారమున ప్రత్యేకించికొనుటకు హక్కులనొసగక బ్రిటిషు రాజకీయవేత్తలు ప్రత్యేక సంరక్షణలను గోరుచున్నారు. బ్రిటిషుప్రభుత్వమువారు ప్రకటించిన శ్వేతపత్రమునందలి 122వ నియమము ననుసరించి కోస్తావ్యాపారమునైనను భారతీయులు ప్రత్యేకించుకొనజాలరు. బ్రిటిషుపౌరునిపై, ఏరంగు, ఏజాతి, ఏమతమునకు సంబంధించినవానిపైనైనను (అనగా బ్రిటిషుకంపెనీలు, సంఘములు, వాటాదారుగనుండుట మొదలగునవి కూడ)

పన్నులను విధించుటయందు ఏవిధమగు ఆస్తినైన గలిగియుండుట యందు, ఏవిధమైనవృత్తి లేక వర్తకముఁగాని చేసికొనుటయందు, నివాసముగనుండుటయందు, ఏజెంట్లను నియమించుటయందు విచక్షణ తోఁగూడిన ప్రత్యేకశాసనములను గావించుటకు భారతశాసనసభకు గాని రాష్ట్రీయశాసనసభలకు గాని హక్కులేదని 122వ నియమ మున గలదు. ఈనియమము రాజ్యాంగవిధానమునందుండుటకు భారతదేశ మంగీకరించినయెడల కోస్తావ్యాపారము నేటివలె ఆంగ్లేయవర్త కులస్వాధీనమునందే యుండును. భారతదేశరాజకీయవేత్త లందఱు నీనియమము నంగీకరించుట లేదు. ఈనియమమున భారతదేశమును బంధించుటయం దర్థమేమి? బ్రిటిషుసామ్రాజ్యమునం దేదేశము కోస్తా వ్యాపారమును తాను ప్రత్యేకించుకొనలేదు? ప్రపంచమునం దేదేశము కోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొనలేదు?

ఏదేశకోస్తావ్యాపారము నాదేశము ప్రత్యేకించుకొనుట జాతీ యార్థిక కార్యక్రమము. బ్రిటిషుదీవులు తమ కోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొనలేదా? ఇండియాదేశపు వర్తకపుఓడలు బ్రిటిషుతీరము నకు జేరకుండ నిషేధింపలేదా? హిందూదేశపుఓడలు బ్రిటిషుపతా కము నెగురవేయుచున్నను గూడ బ్రిటిషుఓడలకు గలసౌకర్యములు హిందూదేశపుఓడల కొసంగబడెనా? "బ్రిటిషుదీవులు గావించిన సముద్రయాన శాసనముల ననుసరించి హిందూదేశనౌకలపై విధిం చిన విచక్షణతోఁగూడిన ప్రత్యేకశిక్షలవలననే భారతీయనౌకాపరిశ్రమ అంతర్థాన మైనది."[1]

---

1. *From Indian Chamber of Commerce in Great Britain. Statement p. 19—20.*

1840 వ సంవత్సరమున పార్లమెంటువారిచే నియమింపబడిన ఉపసంఘమువారి యెదుట సాక్ష్య మొసగుచు మెల్వాయిలుగా రిట్లు చెప్పిరి. (Mr. Melville)

"హిందూదేశమే విదేశమై యుండినచో ఆదేశమునందే నిర్మింపబడిన నౌక ఆదేశస్థులచేతనే నడుపబడుచు ఆదేశపుసరకును సీమకు దీసికొనివచ్చి మరల సీమసరకును ఆదేశమునకు దీసికొనిపోవుటకు స్వాతంత్ర్య ముండెడిది. కాని హిందూదేశము సీమవారిచే పరిపాలింపబడుచుండినను హిందూదేశస్థులచే నిర్మింపబడి హిందూ దేశస్థులచే నడుపబడునట్టినౌకలకు అట్టిహక్కు నిరాకరింపబడుచున్నది. ఇతరదేశములవారికి నొసగిన యిట్టి హక్కులను హిందూదేశస్థుల కొసంగ నిరాకరింపబడెను. సీమఓడలకు గల హక్కులను హిందూదేశపు ఓడలకు లభింపజేయకపోవుటయే కాక, సీమరేవులయందు విదేస్థులకుగలహక్కులనుగూడ నొసంగలేదు."

హిందూదేశపు నౌకాపరిశ్రమను నాశనమొనరించుటయే కాక హిందూదేశమందలి కోస్తావ్యాపారమునకై ప్రారంభింపబడిన నౌకలు హిందూదేశస్థులయొద్ద వసూలుచేసిన కోశమునుండి విరాళములను గూడ హిందూదేశప్రభుత్వమువలన సంపాదింపగలిగెను. యుద్ధానంతరము హిందూదేశ కోస్తావ్యాపార మంతయు సీమనౌకలకే ప్రత్యేకింప వలయునని సీమనౌకా పరిశ్రమకంపెనీలు వర్తకసంఘమువారికి నివేదించెను.[2]

---

1. *From the statement of Indian Chamber of Commerce in Great Britain p. 20.*

2. *Board of trade committee on shipping and ship-building Industries after the war.*

జపానువారిపోటీని నిరోధించుటకే సీమకంపెనీలు కోస్తావ్యాపారమును ప్రత్యేకింపవలెనని కోరినవి. జపానువారి కోస్తావ్యాపారము హిందూదేశమున స్వల్పముగనున్నందున అవసరములేదని వర్తకసంఘమువారు సీమకంపెనీలకోరికను నిరాకరించిరి. జపానువారి కోస్తావ్యాపారమే గమనింపదగినట్లుగ నుండినయెడల నాడే భారతదేశకోస్తావ్యాపారము సీమకంపెనీలకు ప్రత్యేకింపబడి యుండెడిది. కాని భారతీయులు భారతదేశ కోస్తావ్యాపారమును ప్రత్యేకింపవలెనని కోరుచుండగా నీకోరిక జాతిద్వేషమనుచున్నారు. ఈజాతిద్వేషము సీమరాజకీయవేత్తలకు భారతీయ నౌకాపరిశ్రమను సీమరేవునకు రా వీలులేదని నిషేధించిననాడు గోచరింపలేదు. నేటికిని అమెరికా, జపాను, ఫ్రాన్సు దేశములు తమకోస్తావ్యాపారమును తమదేశపునౌకలకే ప్రత్యేకించుకొనినవి. ఈప్రత్యేకించుకొను సిద్ధాంతమును బ్రిటిషుప్రభుత్వమువారుగూడ నంగీకరించిరి. కోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొను హక్కును ప్రశ్నింప వీలులేదని బ్రిటిషుప్రభుత్వమువా రంగీకరించిరి.

1924 వ సంవత్సరమునందు సమావేశమైన నౌకావ్యాపారముగల దేశము సభానిర్ణయమునకు నౌకావ్యాపారముగల 31 దేశములంగీకరించినవి. ఈదేశములలో సీమవారు గూడ నొకరు. ఈనిర్ణయమందలి 9 వ నియమము ననుసరించి కోస్తావ్యాపారమును, ఏదేశమున కాదేశము ప్రత్యేకించుకొనుటకు హక్కుకలదు.[1]

1926 వ సంవత్సరమున లండను నగరమున సమావేశమైన అంతర్జాతీయ నౌకాసభ (International Shipping Conference) యందు ఏదేశనౌకావ్యాపారముపై విధ నిషేధములను గల్పించుటను గుఱించి

1. *Maritime ports convention of 1924. Article 9. Statement of Indian Chamber of Commerce in Great Britain on Round Table Conference.*

చర్చింపబడెను. ఈచర్చయందు కోస్తావ్యాపారమున విదేశనౌకలకు హక్కులేదనియు, స్వదేశనౌకలకు కోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొనుటకు, ఆయాదేశప్రభుత్వములకు హక్కుగలదనియు వివరింపబడెను. ఈసభకు సీమవర్తక నౌకాసంఘాధ్యక్షుడగు రైటు ఆనరబుల్ వాల్టరు రన్సిమానుగారు (Rt. Hon. Walter Runciman) అధ్యక్షత వహించి యుండిరి. ఈయనగూడ, విదేశవర్తక వ్యాపార నిర్వచనమునందు కోస్తావ్యాపారము చేరదని ప్రకటించెను. కోస్తావ్యాపారము గృహకృత్యములవంటిదని నుడివెను. ఇట్లే జూలై 1929 వ సం॥ రమున అమేస్టెర్‌డామునందు సమావేశమైన అంతర్జాతీయ వర్తక సంఘముల కాంగ్రెసు (Congress of the International Chamber of Commerce) లో విదేశనౌకావర్తకసమస్య చర్చింపబడెను. ఈచర్చకు సమాధాన మొసంగుచు సర్. జాన్ సాండుమాన్ ఎల్లన్ (Sir John Sandeman Allan) గారు, కోస్తావ్యాపారమును అంతర్జాతీయ వర్తకమనుటకు వీలులేదనియు, అంతర్జాతీయ వర్తకనియమములు కోస్తావ్యాపారమునకు వర్తింపవనియు ప్రకటించిరి. కోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొనుటకు ప్రతిదేశమునకును హక్కుకలదని నుడివెను.[1]

ఇట్లు కోస్తావ్యాపారమును ఏదేశమునకాదేశము జాతీయనౌకలకు ప్రత్యేకించుకొనుట ప్రపంచము నందంతట గోచరించుచుండినను అంతర్జాతీయవర్తకనియమములు సభలు కోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొనుహక్కునకు అంగీకరించి యున్నను అంతర్జాతీయ సభలలో సీమ నౌకావర్తకసంఘ ప్రతినిధులే కోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొను సిద్ధాంతమునకు చేయూత నొసగియుండియు, భారతీయులు భారతదేశకోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొనరాదని బ్రిటిషురాజకీయ

1 *From the Statement of the Indian Chamber of Commerce in London.*

వేత్తలు నిరూపించుచుండుటయం దర్థమేమి? ఈనిరూపణము భారత దేశ సౌభాగ్యముకొఱ కని భారతీయులు విశ్వసింపజాలరు, కోస్తా వ్యాపారము నభివృద్ధి పఱచినవారు సీనువర్తకులనియు అందుచేత వారిపై నెట్టి విధి నిషేధములను గల్పింపరాదనియు దలంపరాదు. మొట్టమొదటినుండియు వర్తకలాభమునకై కోస్తావ్యాపారము చేయబడెను. బ్రిటిషు ఇండియను స్టీమునావిగేషను కంపెనీవారి సాలుసరి లాభములను గమనించినయెడల కోస్తావ్యాపారమువలన సీమస్వాకా కంపెనీ యెట్లు లాభములను పొందినదియు తెల్లమగుచున్నది.

"1902 ఫిబ్రవరి 28 మొదలు 1924 సెప్టెంబరు 30వ తేదీవఱకు గల 10 సంవత్సరముల ఆఱునూసములకొఱకు బ్రిటిషు ఇండియాస్టీము నావిగేషను కంపెనీవారు పంచుకొనినలాభము ఈవిధముగ నున్నవి. (సం. 1905 మొదలు 1907 వఱకు లెక్కలు తెలియవు. ఆసంవత్సరముల లాభము దీందుచేరియుండలేదు.)

| వివరము | రూ |
|---|---|
| పంచుకొనవలసిన లాభము ... ... | 867949 |
| లాభములను ప్రత్యేకించుటకు ముందు మొత్తము లాభముల నుండి ప్రత్యేకించిన రిజర్వునిధి ... ... | 720294 |
| మొత్తము లాభములనుంచి తీసిన మూలనిధి ... | 350300 |
| మొత్తములాభములనుంచి తీసిన ప్రత్యేక 100కి నవరత్నలరంతున | 17[illegible]7[illegible]21 |
| మొత్తము | 3700064 |
| రూ॥ 700000 ల ప్రత్యేకపు వాటాలపై [illegible] 100 కి 5 వంతున తీసివేయవలెను. ... | [illegible] |
| అందుచేత మామూలు పెట్టుబడిమీద కంపెనివారు సంపాదించిన మొత్తపు లాభము ... ... | 3321064 |

మొదటి రెండుసంవత్సరముల యందుగల మామూలుపెట్టుబడి పౌ 700,000లమీదను పిమ్మటగల పౌ 957200 ల మీదనుపై లాభములను సంపాదింపగలిగిరి. అనగా సాలుసరి 100కి 33వంతుల చొప్పున లాభములను సంపాదించిరి."[1]

ఈలాభములనుజూచి ఆశ్చర్యపడ నవసరములేదు. ఇట్లే యెన్నియో దశలనుండి సీమకంపెనీలు లాభముల నార్జించుచున్నవి. మొన్న మొన్నటివఱకు నీలాభములపై ఆదాయపుపన్ను గూడ విధింపబడలేదు. అయిననేమి? నేటికిగూడ బ్రిటిషు రాజకీయవేత్తలు హిందూదేశపుకోస్తావ్యాపారమును హిందూదేశము ప్రత్యేకించుకొనుట దోష మనుచున్నారు. అంగీకరించుట లేదు. నూతనసంస్కరణములయందైన భారతదేశము కోస్తావ్యాపారమును ప్రత్యేకించుకొనుహక్కును సంపాదింపవలయును.

## 30. ప్రపంచ నౌకాపరిశ్రమ, ఆర్థికదుస్థితి.

1930 వ సంవత్సరమునుండియు ప్రారంభమైన ప్రపంచార్థిక దుస్థితివలన ప్రపంచమం దంతటను నౌకాపరిశ్రమ నేడు వెనుకపట్టెను. ప్రపంచవర్తకవ్యాపారము 100 కి 30 వంతులు తగ్గిపోయెను. వర్తకపు విలువ 100 కి 60 వంతులు తగ్గెను. 1929 వ సం॥రమునందే ప్రపంచ వర్తకమున కవసరమగు ఓడలకంటె హెచ్చుగ ఓడలు కలవు. అంత ర్దేశీయవ్యాపారము తగ్గుటవలన 1930 వ సం॥రమునుంచియు నిరుపయోగముగ నుండినఓడలసంఖ్య పెరిగెను. అయినను, విదేశములు నూతననౌకలను నిర్మించుట మానలేదు. ఏదేశమున కాదేశమే నౌకాపరిశ్రమకు విరాళముల నొసంగుట ప్రారంభించెను. రేట్లతగ్గింపు యుద్ధము ప్రారంభింపబడెను.

---

1. *From the Statment of Indian Chamber of Commerce in London P. 23.*

100 టన్నులబరువును మోయగలిగిన ఓడలను మినహాయించి మదింపువేసినయెడల

| | |
|---|---|
| 1932 జూన్ లో | 68368000 టన్నులు |
| 1933 జూన్ లో | 66628000 టన్నులు |

బరువును మోయగల నౌకాశక్తి గలదు. సం॥ 1932 రము కంటె సం॥ 1933 లో చాలవఱకు తగ్గెను. అయినను 1740000 టన్నులశక్తి తగ్గుట ఆవగింజలో అరభాగముకూడ కాదు. అవసరమగునంతవఱకు మాత్రమే నౌకాశక్తి పోషింపబడుటలేదు.

ఈదిగువపట్టిక ప్రపంచమునందు వివిధదేశములకుగల నౌకాశక్తిని దెలుపుచున్నది.[1]

మొత్తము టన్నులు వేలలో

| † దేశము | 1929 | 1932 | 1933 |
|---|---|---|---|
| బ్రిటిషు దీవులు, ఐర్లెండు | 20046 | 19562 | 18592 |
| అమెరికా (సముద్రపు ఓడలు) | 11036 | 10270 | 10088 |
| ఇటలీ | 3215 | 3331 | 3039 |
| జర్మని | 4058 | 4143 | 3888 |
| ఫ్రాన్సు | 3303 | 3508 | 3470 |
| హాలెండు | 2932 | 2957 | 2759 |
| స్వీడను | 1480 | 1691 | 1658 |
| నార్వే | 3218 | 4164 | 4078 |
| జపాను | 4187 | 4255 | 4258 |
| మొత్తము | 66407 | 68368 | 66628 |

1. *World's Steam and Motor Tonnage.*

† *From Indian Finance Year Book*

ఈఅంకెలవలన జపానుదేశమునతప్ప మిగిలిన దేశములయందలి నౌకాశక్తి 1932 వ సంవత్సరమునకంటె 1933 వ సంవత్సరమున తగ్గినదని తెలిసికొనగలము. బ్రిటిషుదీవులలో హెచ్చుతగ్గుదల గోచరించుచున్నది. 1929 లో ప్రపంచనౌకాశక్తియందు 100 కి 30.2 వంతులు బ్రిటిషుదీవులకు గలదు. 1932 లో 28.6 వంతులకు తగ్గెను. 1933 లో 27.9 వంతులకు తగ్గెను.

ఈనౌకాశక్తియందు వర్తకపుదినుసులను, ప్రయాణీకులను మోసికొనిపోవుటకు కొలదిశక్తి మాత్రమే వినియోగింప బడుచున్నది. హెచ్చుశక్తిని సూనెను మోసికొనిపోవుటకు వినియోగింపబడుచున్నది.

ఇట్లు ప్రపంచవర్తకము సన్నగిలి, నేడుగల నౌకాశక్తియే అనవసరముగ నుండినను, విదేశములయందు నౌకాపరిశ్రమ ప్రభుత్వసహాయమున బోషింపబడుచున్నది. ప్రపంచార్థిక మహాసభలో నౌకాపరిశ్రమను ప్రభుత్వములు పోషింపరాదని బ్రిటిషుప్రభుత్వము వాదించెను. ఈవాదము స్వార్థమునే తెలియజేసెను. యుద్ధానంతరము హెచ్చునౌకాశక్తి బ్రిటిషుప్రభుత్వము గలిగియుండెను. ఆశక్తి నేడు తగ్గిపోవుటచే కోలుకొనుటకై వేసినపన్నగడ యని బ్రిటిషువారి వాదమును విదేశములు గ్రహించినవి. ప్రపంచనౌకాశక్తిలో అగ్రస్థానమును సంపాదించుటకై ప్రతిదేశము తత్తఱపాటు పడుచున్నది. భారతదేశమో నౌకాపరిశ్రమయంతయు విదేశీయులపర మొనరించి దీనాలాపములతో గాలము గడుపుచున్నది. భారతీయనౌకాపరిశ్రమ నభివృద్ధి చేయుటనుగుఱించి హిందూదేశప్రభుత్వ మింకను ఆలోచించుచునే యున్నది. వీరియాలోచన యింతలో తేలదు.

# 31. నదులు-కాలువలు.

భారతదేశ అంతర్వ్యాపారమునకు కాలువలు బాగుగ నుప యోగపడును. హెచ్చుగ కాలువలుత్రవ్వించుటవలన వ్యవసాయోప కరణముగ నుండుటయేకాక రాకపోకల సౌకర్యములగూడ నొన గూర్చును. రైల్వేనిర్మాణమునకంటె కాలువలు త్రవ్వించుటకు పోషిం చుటకు ఖర్చుకూడ తక్కువయగును. అయినను, ప్రభుత్వమువారిదృష్టి రైలుమార్గ నిర్మాణమువంకకు పరుగెత్తునటుల కాలువలను త్రవ్విం చుటపై ప్రసరింపలేదు. ఫ్రాన్సు, బెల్జియము, అమెరికా దేశములలో కాలువలస్థితి ప్రభుత్వ సంరక్షణక్రింద రాకపోకల సౌకర్యములలో ప్రాముఖ్యస్థానము వహించుచున్నది. భారతదేశమున 26 వేల మైళ్ల పొడవున ఉత్తర హిందూస్థానమందలి నదులయు ఉపనదులయు ప్రయాణ సౌకర్యములకు వీలగు నీటిమార్గములు కలవు. సింధునది, గంగానది, బ్రహ్మపుత్ర, ఐరావతీనదులలో సర్వకాలములయందు స్టీమర్లు సంచారము చేయగలవు. సింధునది పశ్చిమోత్తర పరగణాలలో డేరాఇస్మాయిల్ఖానువఱకు సుమారు 800 మైళ్ళు ప్రయాణమున కనుకూలముగనే యుండును. సింధునది ఉపనదులుకూడ నావల రాక పోకలకు వీలుగనే ఉండును. గంగానది కాన్పూరువఱకును స్టీమర్లు నడచుటకు వీలుగనే యున్నవి. స్టీమర్లు గోగ్రాను దాటి, ఫైజాబాదువఱకును పోగలవు. రైలుమార్గములు వేయుటవలన గంగా సింధు నదులలో స్టీమర్ల అవసరము చాలవఱకు తగ్గిపోయెను. బ్రహ్మపుత్రా నదిలో స్టీమర్లు నడచుటకు వీలున్నది. సుర్మానదియందు గూడ సిల్

హెంట్ వఱకును స్టీమర్లు పోగలవు. హుగ్లీనదియందు నాడియావఱకును సర్వకాలములయందు స్టీమర్లు పోగలవు. బర్మాయందు స్టీమర్ల సంచార మున కమితసౌకర్యములు గలవు. ఐరావతీనది, దాని ఉపనదులు, స్టీమర్ల సంచారమున కనుకూలముగ నుండును. ఐరావతి నదియందు నదీముఖమునుండి 500 మైళ్లవఱకు స్టీమర్లు ప్రయాణము చేయగలవు. స్టీములాంచీలు, పడవలు ఇంకను పైకిపోగలవు. నర్మదా తపతీనదు లలో స్టీమరు నడచుటకు వీలులేదు. మహానదీ, గోదావరీ, కృష్ణానదు లలో కొంతవఱకు స్టీమర్లు నడువవచ్చును. ఇవిగాక చిన్న చిన్న నదులు దేశమందంతట పడవలు నడచుటకు వీలుగనున్నవి. డెల్టాలయందుగల కాలువలలో పడవలు పోవుచున్నవి. సనాతనకాలమునుండియు భారత దేశమున నదులమూలమున ఏళ్లమూలమున వర్తక వ్యాపారము రాకపోకలు జరుగుచుండెడివి. రైళ్లు వేయుట ప్రారంభించినది మొదలు నదులయందలి ప్రయాణసౌకర్యములు వెనుకబట్టినవి. "భారతదేశ మందలి నదీమార్గము లన్నియు శ్రద్ధవహింపక పోవుటచేతను, రైళ్ల యందే ప్రభుత్వము ప్రత్యేకాభిమానము వహించుటచేతను ఇతరదేశ ములలో వలె సంరక్షింపబడలేదు."[1]

ఆక్వర్తుకమిటీవారు కూడ రైళ్లపోటీవలననే నదీమార్గములు సక్రమస్థితియందు లేవనియు పడిపోయినవనియు వ్రాసిరి. బ్రోచీ, బకింగు హాము కాలువలను ఉదాహరణముగ జూపిరి.

---

1. *Industrial Commission Report para 279.*

ఒకానొకకాలమున స్టీమర్లు నడుచుటకు వీలైన కాలువలను త్రవ్వింపవలసినదని ప్రజానాయకులు ప్రభుత్వమును కోరి యుండిరి. కావేరీ గోదావరీ నదుల ఆనకట్టలు గట్టిన సర్. ఆర్థర్ కాటన్‌గారు (Sir Arthur Cotton) స్టీమర్లునడచుటకు వీలుగ కాలువ లెచ్చటెచ్చట త్రవ్వుటకు వీలున్నదియు, నిశ్చయించి, 1872వ సంవత్సరమున పార్లమెంటుసంఘమువారియెదుట నివేదించెను. ఇట్టికాలువలను త్రవ్వుట రైళ్లకంటె లాభదాయక మనియు, వ్యవసాయాభివృద్ధికి గూడ దోడ్పడు ననియు కాటనుగారి విశ్వాసము. కాటనుగారు కలకత్తానుంచి కరాచీ వఱకును, కాకినాడనుంచి సూఱతువఱకును, తుంగభద్రనుండి కారువారువఱకును, ఓనాంగునదినుండి పాలఘాట్ కోయంబత్తూరు వఱకును కాలువల త్రవ్వవలె నని సూచించిరి. ఇందులకు మొత్తము పెట్టుబడి 30 మిలియను పౌనులని నిశ్చయించిరి. అయిన నేమి? కాటనుగారి సూచన సీమదొరలకు బోధపడలేదు. బోధపడినను రైళ్లను నిర్మించుటలో వారికిగల స్వార్థము కాలువలను త్రవ్వించుటలో నీడేరదు. నేటికిని కాలువలను త్రవ్వించుటకై పెట్టినపెట్టుబడి యుత్పాదకముగగాని సంరక్షకముగగాని యుండవలెననియే ప్రభుత్వ నిశ్చయము. (Productive and Protective) రైళ్లమీద పెట్టుపెట్టుబడికి మాత్ర మెట్టినియమములతోను ప్రభుత్వమునకు సంబంధములేదు. పరిశ్రమవిచారణసంఘము, నీటిమార్గములపై ప్రభుత్వము సవతితల్లి ప్రేమజూపించుట మానివేయవలెనని వ్రాసెను.

# 32. తంతి తపాలాలు.

భారతదేశమున పోస్టాఫీసులనుబెట్టుటనుగుఱించి కూడ ప్రభుత్వ మువారు లాభాలాభములను తర్కించుచున్నారు. ప్రజాసౌకర్యముల గమనించి తంతితపాలాఆఫీసులను పెట్టుటకు మాఱుగ వాటిపై వచ్చు నాదాయము ననసరించి పెట్టుట సమంజసమని తలంచుచున్నారు. గ్రామములమయమైన భారతదేశమున ప్రతిగ్రామమునకు వారమునకు రెండుపర్యాయములు తపాలా పోవుట దుర్భరముగనున్నది. బీదవారు వ్రాసికొనుకానీకార్డు ముక్కానియు, అర్ధణాకవరు 15 పైసలును చేయబడెను. ఇంతలో తగ్గించుసూచనలు గోచరించుటలేదు. తంతితపా లవలన వచ్చుఆదాయవ్యయములు సరిపోవుట లేదు. ఇందులకు దుర్వ్యయమే కారణము. వ్యయభారమును తగ్గించుటకై నియమింపబడినసంఘమువారు రూ 1,21,39000లు వ్యయమును తగ్గించుటకు వీలున్న దని సూచించిరి. ఇట్లు వ్యయభారమును దగ్గించి ప్రజోపయోగదృష్టితో నూరూర పోస్టాఫీసులను నెలకొల్పుటయే ప్రభుత్వవిధి. వ్యయభారమును దగ్గించుటకై 1934సం॥రమున ప్రభుత్వమువారొకవిచారణసంఘమును నియమింపనున్నటుల తెలియుచున్నది. ఈశాఖలయందు వర్తకపుదృష్టి పనికిరాదు. ఈదిగువపట్టికలవలన తంతితపాలాశాఖ యొక్క ప్రస్తుతస్థితిని దెలిసికొనగలము.

## తంతితపాలలకగు ఖర్చుల వివరము.

1 వ పట్టిక.

(వేలలో) మూడు సున్నలు చేర్చవలెను.

| | 1925-26 | 1929-30 | ఆదాయవ్యయముల అంచనా 1931-32 |
|---|---|---|---|
| 1. ఉద్యోగుల జీతములు | 4988 | 5236 | 5223 |
| 2. ఖాయపు ఉద్యోగుల జీతములు | 57862 | 70701 | 74720 |
| 3. ఖాయముగానివారి జీతములు | 467 | 698 | 424 |
| 4. బత్తెములు; గౌరవవృత్తులు | 5499 | 7[illegible]29 | 6978 |
| 5. మరమ్మతులు | 3058 | 3110 | 3835 |
| 6. చిల్లర ఖర్చులు | 5164 | 5[illegible]63 | 5765 |
| 7. రైల్వేకంపెనీల కిచ్చు విరాళములు | 9419 | 10364 | 10116 |
| 8. తపాల ఖర్చులు | 507 | 2047 | 1940 |
| 9. అచ్చు వగైరా | 1652 | 2782 | 2382 |
| 10. ఇతర చిల్లర ఖర్చు | 815 | 10[illegible]7 | 7[illegible]6 |
| మొత్తము | 89411 | 105372 | 112119 |

(వేలలో) మూడు సున్నలు చేర్చవలెను.

| | 1925-26 | 1929-30 | 1931-32 |
|---|---|---|---|
| క్రిసివేత— | [illegible] | 5551 | 5965 |
| కలపుట— | [illegible] | 3163 | 2450 |
| పంచనులు | [illegible] | 6095 | 6422 |
| అసలుమీద వడ్డీ | 4088[illegible] | 6578 | 8698 |
| మొత్తము ఖర్చు | 98441 | 119294 | 123724 |
| మొత్తపు ఆదాయము | 102138 | 112[illegible] | 109605 |
| లాభము (+) లేక నష్టము (—) | 3697 | — 6840 | —14119 |

ఈ దిగువపట్టిక నష్టముమీద నడుపుచున్న తపాలా ఆఫీసుల సంఖ్య దెలుపును. ఆగష్టు 1931.

2 వ పట్టిక.

| | నెంబరు సంఖ్య | నెలకు రాబడి | నెలసరి ఖర్చు | నెలసరి నష్టము | సాలుసరి విరాళము |
|---|---|---|---|---|---|
| | | రు. | రు. | రు. | రు. |
| 1. బ్రిటిష్ఇండియాలో నష్టముపై నడుపబడుచున్న ఖాయము గాని ఆఫీసులు | 1270 | 79425 | 116493 | 37068 | 316 |
| 2. బ్రిటిష్ఇండియాలో నష్టముపై నడుపబడుచున్న ఖాయపు ఆఫీసులు | 1059 | 62508 | 114347 | 51839 | 12779 |
| 3. హిందూ సంస్థానములలో నష్టముపై నడుపబడుచున్న ఖాయముగానివి. | 334 | 21686 | 29828 | 8142 | 352 |
| 4. హిందూ సంస్థానములలో నష్టముపై నడుపబడుచున్న ఖాయపు ఆఫీసులు | 376 | 17634 | 30544 | 12910 | 4768 |
| మొత్తము | 3039 | 181253 | 291812 | 109959 | 18215 |

3 వ పట్టిక.

తంతి తపాలాల ఆదాయము నీ పట్టిక ధెలుపును.

| | 1924-25 | 1925-26 | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1924-25 ఆదాయముకంటె ఎక్కువైన మొత్తం నూటికి |
|---|---|---|---|---|---|---|---|
| 1. మొత్తము రాబడి రూ॥లు | 99698000 | 102138000 | 105304000 | 108271000 | 110365000 | 112950000 | 13. 3 |
| 2. నౌకరుల మొత్తము | 120418 | 122079 | 124154 | 125724 | 129902 | 131917 | 9. 5 |
| 3. పోస్టాఫీసుల రాబడి | 1278570756 | 1303898915 | 1380728056 | 1387180039 | 1426305783 | 1433372358 | 12.03 |
| 4. టెలిగ్రాములవలన రాబడి | 19842600 | 18768178 | 19022602 | 19974084 | 20241004 | 19476184 | — 1.08 |
| 5. రేడియో టెలిగ్రాముల వలన రాబడి | 19551 | 21072 | 23476 | 25245 | 26885 | 26896 | 37. 5 |
| 6. టెలిఫోనులవలన రాబడి | 14785 | 15926 | 17115 | 20042 | 19935 | 21810 | 47. 6 |

4 వ పట్టిక.

నష్టమువచ్చుచున్న పోస్టాఫీసుల సంఖ్య, నెలసరి ఆదాయవ్యయములు, ప్రభుత్వమువారొసంగు విరాళములు ఈపట్టిక దెలుపును.

| | సంఖ్య | నెలసరి రాబడి | నెలసరి కర్చు | నెలసరి నష్టము | సాలుసరి విరాళము |
|---|---|---|---|---|---|
| 1. బ్రిటిషు ఇండియాయందు తాత్కాలికముగ నష్టము వచ్చుచున్నవి. | 1270 | 79425 | 116493 | 37068 | 316 |
| 2. ఎప్పటికిని బ్రిటిషు ఇండియాయందు నష్టము వచ్చుచున్నవి. | 1059 | 62508 | 114347 | 51839 | 12779 |
| 3. సంస్థానములయందు తాత్కాలికముగ నష్టము వచ్చుచున్నవి. | 384 | 21686 | 29828 | 8142 | 352 |
| 4. సంస్థానములయందు శాశ్వతముగ నష్టము వచ్చుచున్నవి. | 376 | 17634 | 30544 | 12910 | 4768 |
| మొత్తము | 3089 | 181253 | 291812 | 109959 | 18215 |

. 5 వ పట్టిక.

ఈపట్టిక 1931 జూలై లోగల పోస్టలు డివిజనులసంఖ్య, విస్తీర్ణము, ప్రదేశములను తెలుపును.

| సర్కిలు పేరు | డివిజన్లు | డివిజను 1కి సగటన చ॥ మైళ్ళ సంఖ్య | చిన్న డివిజనుల చతురము | పెద్ద డివిజనుల చతురము | ఒక్కొక్క సూపరింటెండెంటు క్రింద నున్న పోస్టాఫీసుల సగటు సంఖ్య | | | ఒక్కొక్క సూపరింటెండెంటు క్రిందనున్న సగటు ఉద్యోగస్థుల సంఖ్య | | తగ్గినవి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | హెడ్ ఆఫీసులు | సబ్ ఆఫీసులు | బ్రాంచి ఆఫీసులు | పెద్దఉద్యోగస్థులు | చిన్న ఉద్యోగస్థులు | |
| 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| బెంగాలు, అస్సాము | 23 | 6571 | 1012 | 22654 | 1.3 | 42 | 147 | 351 | 220 | 3 |
| బీహారు, ఒరిస్సా | 9 | 9240 | 6214 | 14926 | 2.2 | 50 | 138 | 418 | 286 | 1 |
| బర్మా | 9 | 19887 | 12614 | 30595 | 2.5 | 38 | 82 | 266 | 77 | 1 |
| మధ్యరాష్ట్రాలు | 10 | 33265 | 12071 | 76300 | 2.1 | 46 | 170 | 351 | 398 | 1 |
| మదరాసు | 18 | 10684 | 3730 | 22570 | 2.0 | 54 | 198 | 397 | 200 | 2 |
| పంజాబు, పశ్చిమోత్తర పరగణాలు | 18 | 14223 | 2803 | 68049 | 1.8 | 37 | 194 | 323 | 186 | 2 |
| సంయుక్తరాష్ట్రములు | 15 | 6833 | 3335 | 8878 | 2.7 | 45 | 127 | 421 | 219 | 2 |
| సింధు, బెలూచిస్థానము | 3 | 60666 | 20000 | 85000 | .6 | 43 | 104 | 234 | 221 | ... |
| బొంబాయి | 13 | 12321 | 4600 | 17000 | 1.6 | 43 | 200 | 890 | | 1 |
| మొత్తము | 118 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 13 |

6 వ పట్టిక.

| † మార్చి 31 తో నంతమగు సంవత్సరము | ఖాయమైన, ఖాయముగాని మొత్తపు పోస్టాఫీసులసంఖ్య | లోగడ సం॥ కంటె హెచ్చినవా? తగ్గినవా? | ఖాయముగాని పోస్టాఫీసుల సంఖ్య. | రిమార్కులు. |
|---|---|---|---|---|
| 1924 | 19619 | 237 | 123 | |
| 1925 | 20333 | 714 | 692 | పోస్టాఫీసుల నభివృద్ధి పఱచిన కాలము |
| 1926 | 20836 | 503 | 739 | |
| 1927 | 21699 | 863 | 973 | |
| 1928 | 22885 | 1186 | 1233 | |
| 1929 | 24137 | 1252 | 1117 | |
| 1930 | 24146 | 9 | 253 | అభివృద్ధి మాని వేసిన కాలము. |
| 1931 | 24291 | 145 | 106 | |

# 33. టెలిఫోనులు.

హిందూదేశమునందు గ్రామములకుగూడ టెలిఫోనులు వ్యాప్తి గాంచవలయును. ఇంగ్లండునుంచి ఇండియాకు టెలిఫోను వేయబడెను. ఈటెలిఫోను మూలముగ సందేశములు పంపబడుచున్నవి. ఇంగ్లండు-ఇండియాలమధ్య టెలిఫోను వేయుటకంటె, హిందూదేశమునందు తాలూకాముఖ్యగ్రామములనుండి కొంచె మించుమించుగ నన్ని గ్రామములకు టెలిఫోనులు. వేసినయెడల బాటలు సరిగా వ్యాప్తియందులేని భారతదేశమున అత్యంతోపయోగకరముగ నుండును. ముఖ్యముగ వర్షపాతమునుగుఱించియు, పంటలధరలనుగుఱించియు, రైతుల కనుదినము తెలుపుటకు వీలుగనుండును. గ్రామములయందు

† *For Tables 1, 2, 3, 4, 5 & 6 See Posts and Telegraph Sub Committee's Report of the Retrenchment advisory Committee*

ప్రజాస్వామిక గ్రామప్రభుత్వములను నెలకొల్పి, ఆప్రభుత్వముల యాధీనమున చెఱువులవల త్రవ్వినట్లుల చెఱువులు పెట్టబడినచో రాకపోకలకగు వ్యయమునందు చాలభాగము రైతులకు కూడివచ్చును.

## 34. దూరశ్రవణయంత్రము.

— ప్రజాస్వామిక గ్రామపరిపాలనములను నెలకొల్పి, వాటియాధీనమున ప్రతిగ్రామమునందు దూరశ్రవణయంత్రము స్థాపించుట అత్యవసరమని నాల్గవఅధ్యాయమునందు వ్రాయబడెను. దూరశ్రవణ యంత్రముల యుపయోగము భారతదేశమునం దంతటను నేడు గ్రహింపబడుచున్నది. మదరాసురాజధానియందు దూరశ్రవణయంత్రముల నెలకొల్పుటనుగుఱించి మదరాసుప్రభుత్వము పరిశోధనలు సలుప నిశ్చయించుకొనెను. మదరాసు శాసనసభవారు, ప్రభుత్వమువారు నీవిషయమై తగుకృషిని సలుపవలె నని తీర్మానించిరి. ప్రభుత్వపరిశోధనకై రు 47600 లు వ్యయమగునని అంచనా వేయబడెను. పంజాబురాష్ట్రమునగూడ దూరశ్రవణయంత్రములను స్థాపించుటకై విశేష కృషి సలుపబడుచున్నది. హిందూదేశమున దూరశ్రవణయంత్రములకు 1929 లో "7775 లైసెన్సు లొసంగబడెను. 1930 లో 7711 లైసెన్సులు మాత్రమే యొసంగబడినను, 1931 లో 8056 లైసెన్సులును, 1932 లో 8557 లైసెన్సులును నొసంగబడెను. 1933 లో మొదటి ఆఱుమాసములయందే 6276 లైసెన్సులు తీసికొనబడెను. ఈయంకెల ననుసరించి దూరశ్రవణయంత్రముల యుపయోగ మభివృద్ధి యందున్నటుల తోచుచున్నది. దిగుమతిసుంకముల ననుసరించి యుపయోగమునందుండిన యంత్రములసంఖ్య యింకను హెచ్చుగ నున్నటుల దలంపవచ్చునని ప్రభుత్వసభ్యుడు తలపోయుచుండెను.

| | | |
|---|---|---|
| 1930-31వ సంవత్సరమున | ... | రు 56000లు |
| 1931-32 | ... | రు 104000లు |
| 1932-33 | ... | రు 255000లు |

దిగుమతి సుంకములను ప్రభుత్వమువారు వసూలు చేసిరి. 1933-34వ సంవత్సరమున కనీస మొకలక్షరూపాయలైనను సుంకము లక్రింద వసూలగునని అంచనా వేయబడెను. ఈ పెరుగుదల, యంత్రములు హెచ్చుటచే నని తలంచుటకంటె దిగుమతిసుంకములు హెచ్చించుటచే ఆదాయముకూడ హెచ్చెనని తలంచుట సమంజసము. దూరశ్రవణయంత్రముల నభివృద్ధిపఱుచుటకు దిగుమతిసుంకములను దగ్గింపవలెను.

ఇంగ్లండుఇండియాలమధ్య దూరశ్రవణయంత్రములు నెలకొలుపబడెను. ఇందువలన ప్రపంచమునం దంతటితోను శీఘ్రగతిని సంభాషించుటకు సావకాశ మేర్పడినది. నేడు వివిధదేశములమధ్య భావప్రచారము శీఘ్రముగ జరుగుట ప్రపంచావసరములలో నొకముఖ్యవిషయమే. కాని ప్రపంచమునందలి యితరదేశములతో కలిసి, పరస్పరభావప్రచారమునకు బూనుటకు, ముందుగ హిందూదేశమునందలి వివిధరాష్ట్రములలో శీఘ్రగతిని భావవ్యాప్తి జరుపుటకు దూరశ్రవణయంత్రముల నెలకొల్పుట ప్రథమకర్తవ్యము. రాజకీ యార్థిక సాంఘిక వ్యవసాయ ఆరోగ్య విజ్ఞానము, పల్లెపల్లెకు దూరశ్రవణయంత్రముల మూలమున వెదజల్లుటకై విశేషకృషి చేయవలెను.

## 35. వాయువిమానములు.

పిట్టలవలె వాయువిమానములు వినువీధియం దెగురుచున్నవి. గగనమండలమున సంచార మొనరించుచు, వివిధదేశములకు, ప్రయా

ణీకులను గొనిపోవుచున్నవి; ఉత్తర ప్రత్యుత్తరములను, తపాలామూలముగ పోవు సరకును గూడ, మోసికొని పోవుచున్నవి. వాయుప్రచారమే, భావముల శీఘ్రగమనమునకు మూలము. వాయుప్రచారమే శరీరముల శీఘ్రగమనమునకు గూడ, ముఖ్యసాధనముగ కోసరింపబడెను. మానవపరిశోధితమగు ఈ నూతన విజ్ఞానమును, మానవసంరక్షణకై వినియోగింపబడుట సముచితమే. కాని, మానవభక్షణకై వినియోగింపబడుచున్నది. మొట్టమొదట 1903 వ సం॥ రము డిసెంబరునందు రైటుబ్రదర్సు (Wright Brothers) 12 సెకండులు కాలము మాత్రమే వాయువిమానమును తేలఁ గలిగిరి. పిమ్మట 58 సెకండుల వఱకు గాలిలో నుండగలిగిరి.

"23 సంవత్సరములకు పూర్వము మాత్రమే ఇంగ్లీషుఛానలును మొట్టమొదట వాయువిమానముతో దాటగలిగిరి. 1909 జూలై 12వ తేదీని బ్లిరిటుగారు (Blirot) దాటిరి. అయినను గత సంవత్సరమున ఇంపీరియల్ వాయువిమాన కంపెనీవారి విమానములలోనే 34500 గురు ప్రయాణీకులు ఇంగ్లీషుఛానలును దాటిరి."[1]

బ్రిటిషుసామ్రాజ్యమునందంతట వాయువిమానముల ప్రయాణమును [illegible] ముడివేయుటకై [illegible] ప్రయత్నములు జరుగుచున్నవి. ఇంగ్లండు-ఇండియాల మధ్య వాయువిమానములు ప్రయాణీకులను తపాలా మోసికొని పోవుచున్నవి. వివిధ దేశముల మధ్య తపాలు వాయువిమానముల మూలముగ పోవుచున్నవి. [illegible], యుగోస్లేవియా, [illegible], ఆస్ట్రియా, చెకోస్లావేకియా, జర్మనీ, [illegible], [illegible], [illegible], [illegible], ఫిన్లాండు, నార్వే, స్వీడెను మొదలగు ప్రాంతములలో ఇంపీరియలు

1. From the Speech of Mr. L. E. Webb, Traffic Superintendent of the Imperial Air Ways Limited.

వాయువిమానముల కంపెనీవారు తపాలను వాయువిమానముల మూల ముగ పంపుచున్నారు. హిందూదేశమునందు తాతాకంపెనీవారు వాయువిమానములను నడుపుచున్నారు. కరాచీ, మదరాసు, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ, రంగూను, మొదలగు ముఖ్యనగరములకు వాయువిమానములు తపాలను తీసికొనిపోవుచున్నవి. ప్రయాణీకుల సంచారముకూడ ప్రారంభింపబడును. బ్రిటిషుదీవులనుండిహిందూదేశము నకువచ్చుతపాలాకు 8 పెన్నీలబిళ్లలు అంటించబడినయెడల కరాచీవఱకును వాయువిమానము మోసికొనివచ్చును. ఇట్లే, హిందూదేశమునుండి బ్రిటిషుదీవులకు పోవలసిన తపాకు మామూలుగ నంటించ వలసిన బిళ్లలు కాక ½ బరువు 1కి 0-6-0 ల వంతున అధికముగ నంటించిన యెడల వాయువిమానములు గొంపోవును. ఇంపీరియలు వాయు విమానముల కంపెనీవారి విమానములు గంట 1 కి 95 మైళ్లు మొదలు 120 మైళ్ళవఱకు గాలిలో పోవుచున్నవి. ఇంతకంటెను శీఘ్రగతిని పోవలయుననిన ఖర్చులు విస్తారమగును. వాయువిమానములను నడుపుటకు వలయు శిక్షణను గఱపుటకు ఇంగ్లండునందొక పాఠశాల కలదు. ఈపాఠశాలయందు మూడుసంవత్సరములు ముగిసిన పిమ్మట వాయువిమానమును నడుపగల విద్య, అనుభవము, రెండును లభించును. భారతదేశమునందు వాయువిమానముల ప్రయాణ మభివృద్ధి యగుటకు పూర్వము, ఇందులకువలయుశిక్షణను గఱపుటకు పాఠశాలలనుస్థాపించ వలయును. విశ్వవిద్యాలయము లీపనికి బూనవలయును. వాయు విమానములను, విదేశముల నుండి తెప్పించుటయు, వాటిని నడుపుటకు విదేశములవారిని పెద్దజీతములమీాద రప్పించుటయు, రెండును దేశమునందుండి ధనము విదేశములకు బోవుటకే సాధనమగును. వాయువిమానములను హిందూదేశమున నిర్మింపగలిగిననాడు, వాయు విమానములను హిందూదేశస్థులు నడుపగలిగిననాడు, వాయువిమాన

ప్రయాణము నభివృద్ధిచేయదగును. అంతవఱకు వాయువిమానములకంపెనీలను స్థాపించుట పాముతో చెలగాటమువంటిది. యుద్ధకాలమున వాయువిమానములవలన జరిగిన భీభత్సభయానకదృశ్యముల నింతలో ప్రపంచము మఱచిపోయినదా? వాయువిమానములు నేటివఱకు మానవసేవ కుపయోగపడలేదు. ప్రపంచమునం దార్థికాభివృద్ధికి తోడ్పడలేదు. మానవమారణమునకును పరరాజ్యాపహారణమునకును మాత్రమే యుపయోగింపబడెను. వాయువిమానములనుండి భూమిమీద సంచరించు ప్రజలపైన, ఊళ్లపైన బాంబులను మారణయంత్రములను ప్రయోగింపరాదని నానారాజ్యసమితివారు నిర్ణయించిరి. ఈనిర్ణయమునందు బ్రిటిషుప్రభుత్వమునకును హిందూదేశప్రభుత్వమునకును బాధ్యత కలదు. అయిననేమి? పశ్చిమోత్తరపరగణాలయందు హిందూదేశప్రభుత్వము వాయువిమానములనుండి బాంబులను ప్రజలపైకి 1933వ సంవత్సరమునందు విసరెను. వాయువిమానములు యానసౌకర్యమునకు మాత్రమే వినియోగింపవలెనను నిర్ణయమునకు ప్రపంచప్రభుత్వము లన్నియు నంగీకరించి ఆచరణయందుంచినగాని వాయువిమానముల నభివృద్ధిపఱచుట మానవులకు శ్రేయోదాయకము కాదు. యుద్ధములయందు, ప్రజావిప్లవములయందు, ప్రభుత్వములు పరస్పరముగాని, ప్రజలపై ప్రభుత్వములుగాని, మారణయంత్రముల నుపయోగించుటకై వాయువిమానములను మానివేయనియెడల వాయువిమానములు ప్రపంచశాంతికి ప్రబలశత్రువులు.



# భారతదేశము-ఆర్థికచరిత్ర

## ప రి శ్ర మ లు.

### 8వ అ ధ్యా య ము.

సాంకేతిక పదములు =Glossary.

| | | |
|---|---|---|
| పరిశ్రమలు | = | Industries |
| దిగుమతిసుంకము | = | Import duty |
| ఎగుమతిసుంకము | = | Export duty |
| ఉత్పత్తిశుల్కము | = | Excise duty |
| కిమ్మతుసుంకము | = | Advolorem |
| నిర్దేశశుల్కము లేక నిర్ణీతకరము | = | Specific duty |
| ఆవేశము లేక పరిశ్రమాలయము లేక యంత్రశాలలు | = | Factories or Mills |
| సంరక్షణము | = | Protection |
| విరాళము | = | Bounty or Subsidy |
| తయారైనవస్తువులు లేక సంస్కృతపదార్థములు | = | Finished Products or Manufactured goods |
| ముడిదినుసులు | = | Raw Products |
| ఉత్పత్తి | = | Production |
| నిరకునామాసంఘము | = | Tariff Board |
| వర్తకవస్తుప్రదర్శనశాల | = | Commercial Museum |
| నిల్వకొట్టము | = | Stores |

| | | |
|---|---|---|
| మూసఇనుము లేక మూసలోనుండి తీసినఇనుము | = | Pig Iron |
| సంయోజనవర్ణములు లేక కృత్రిమపురంగులు | = | Synthetic dyes |
| ఖజ్జానావిచారణసంఘము | = | Fisical Commission |
| స్పర్థ లేక పోటీ | = | Competition |

# పరిశ్రమలు

## 1. పూర్వౌన్నత్యము.

లోకబాంధవుడగు సూర్యభగవానుడు తనకిరణములను ప్రసరింపజేయగలవిశ్వమునం దెల్ల భారతభూమియే పరిశ్రమలయందు మహదౌన్నత్యస్థితి నోకానొకప్పుడు బడసెను. 1918 వ సంవత్సరములో ప్రభుత్వమువారిచే నియోగింపబడిన పరిశ్రమలకమీషనువారిట్లు (Industrial Commission) వ్రాసిరి.

“ఆధునిక పరిశ్రమల పుట్టుకస్థానమగు నైరోపాఖండమందుగల పశ్చిమభాగమునందలి ప్రజలు అనాగరికపు జాతులుగా నున్నకాలముననే భారతదేశము, తనచేతి పనివాండ్ర నేర్పరితనమునకును, పరిపాలకుల సంపదకును ప్రఖ్యాతిగణించి యున్నది. ఆపిమ్మట చాలకాలము గతింప పాశ్చాత్య వర్తకులు హిందూదేశమున మొట్టమొదట కాలుపెట్టినకాలమునగూడ భారతదేశపారిశ్రామికాభివృద్ధి అత్యధిక పారిశ్రామికాభివృద్ధి నొందిన పాశ్చాత్యఖండములకుఁ దీసిపోలేదు.”[1]

ప్రొఫెసర్ వెబర్ (Prof Weber) గారు, నేతపనులయందు, రంగులువేయుటయందు, లోహఖనిజ పరిశ్రమలయందు, హిందూదేశమునిపుణత విశ్వవిఖ్యాతవంతమైనదనిరి. క్రీస్తుపుట్టుటకు 2 వేల సంవత్సరములకు పూర్వమే ఈజిప్టుదేశమున శవములను భారతదేశమందలి సుప్రసిద్ధమగు మస్లిన్‌గుడ్డతో చుట్టబెట్టినట్లు పరిశోధకులు తెలుపుచున్నారు. డిల్లీయందుగల పోతబోసిన ఉక్కుస్తంభము, భారతదేశపరి

1. *Industrial Commission Report P. 1*

శ్రమ లెట్టిమహోత్కృష్టస్థితియందుండెడివో నేటికిని ఋజువు జేయు చున్నది. పట్టు, ఉన్ని పరిశ్రమలు, చందనపుపెట్టెపరిశ్రమలు, మృణ్మయ పరిశ్రమల యుచ్ఛ్రస్థితి విదేశసంచారులే వేనోళ్ల కొనియాడియుండిరి. తక్ష శిలయందలి స్థూపమునుగుఱించి కుమారస్వామిగా రిట్లు వ్రాసిరి.

"తక్షశిలయందు, ఇతరప్రదేశములయందు గనుగొనబడిన పురాతనవస్తువులు మౌర్యవంశరాజులకాలమునకు పూర్వమే గ్లాసుపరిశ్రమ యుచ్ఛ్రస్థితియం దుండెడిదని ఋజువుచేయు చుండెను. క్రీస్తుపూర్వము 4, 5 శతాబ్దములకు ముందుగనే శిల్పములను కోయుటయందును, నునుపుజేయుటయందును గలిగిన సాంకేతిక నైపుణ్యస్థితి మౌర్యవంశ రాజుల కాలమునందు మాత్రమే అత్యున్నతస్థితియం దున్నది. పిమ్మట నెన్నడుగాని ఆయుచ్ఛ్రస్థితిని మించలేదు.[1]

"సిల్కులు, మస్లినులు, అతినాణ్యమగు సన్నని బట్టలు, వంట పనిముట్లు, ఆయుధసామగ్రి, జరీపట్టుబట్టలు, కుట్టుపనితోగూడిన సరకు, కంబళీలు, అత్తరువులు, ఔషధములు, దంతము, దంతపుపనిముట్లు, నగలు, బంగారము మొదలగుసరకులతో వర్తకుడు వర్తకము చేయు చుండెడివాడు."

మౌర్యసామ్రాజ్య ముచ్ఛ్రస్థితియం దున్నపుడు భారతీయ వర్తకస్థితి యిట్లుండెను."[2]

"హిందూదేశము పారిశ్రామిక దేశము మాత్రమే యని నే నంగీకరింపను. హిందూదేశమువ్యవసాయదేశమేగాక,పారిశ్రామికముగ గూడ నభివృద్ధిపొందిన దేశమే. ఆమెను వ్యవసాయదేశమే యనుట

---

*1 Kumaraswami's, History of Indian and Indo-Persian Art p. 10, quoted by Mr. K. T. Shaw "The splendour that was Ind" p. 138.*

*2. The Splendour that was Ind p. 177.*

ఆమెనాగరిక స్థితిని తగ్గింపజూచుటయే యగును. హిందూదేశము ఇంగ్లండు యొక్క వ్యవసాయక్షేత్రమని తలంపరాదు. హిందూదేశము పరిష్కృత పదార్థములుగల పారిశ్రామిక దేశము. హిందూదేశము నందు తయారుచేయబడిన వస్తువులు తరతరములుగ విఖ్యాతవంత ములైనవి. సక్రమముగ వ్యవహరించినయే దేశము గాని, వాటితో పోటీ చేయజాలక పోయెడిది. నేను హిందూదేశపు ఢక్కామజిలినుల సంగతిగాని, కాశ్మీరశాలువలను గుఱించికాని, ప్రశంసించుటలేదు. హిందూదేశమున తయారైన వివిధములగు నితర వస్తువులను గుఱించియు, ప్రపంచమునం దేభాగముగాని పోటీచేయజాలని యితర వస్తువులను గుఱించియు మాత్రమే నేను ప్రసంగించుచున్నాను. హిందూదేశమును వ్యవసాయ దేశమని నేడు చెప్పసాహసించుట దురన్యాయము."[1]

1770 వ సంవత్సరమున ఇంగ్లండు వ్యవసాయదేశము. ఇతర వృత్తులమీద కంటె, వ్యవసాయము మీదనే, ఆమెకు ఎక్కువ ఆదాయము వచ్చెనని ఆర్థరు ఎంగుగారు మదింపువేసిరి."[2]

## 2. మహమ్మదీయ యుగము.

11 వ శతాబ్దమునుండియు భారతదేశము విదేశదండయాత్రలకులోనై పారిశ్రామికాభివృద్ధియం దొకింతవన్నె తఱిగినను, వాసి తప్పలేదు. అక్బరుచక్రవర్తి కాలమున పరిశ్రమలన్నియు నూతనవికాసము నొందినవి. పర్షియా, సిరియా, అరేబియాలకు భారతదేశ వస్త్రములు, పట్టుబట్టలు విరివిగ నెగుమతి యగుచుండెడివి. మొగల్ దర్బా

1. *Mr. Montogomery Martin quoted in "India in the Victorian Age" by R. C. Dutt.*

2. *Gibbins Industrial History of Englnd.*

రులయందు చిత్రవిచిత్రములగు చేతిపను లుంచుచుండెడివారు. ఆరీతిగ చేతిపనుల కత్యద్భుతముగ బ్రోత్సాహ మొసంగబడెడిది. స్వదేశార్థిక స్థితి యభివృద్ధి పొందుటయే మొగలాయి చక్రవర్తుల దృష్టి. విదేశార్థికాభివృద్ధి యనునది మొగలాయిచక్రవర్తుల దృష్టియం దెన్నడును బ్రవేశింపలేదు. దేశస్థులలో తాముగూడ కలసిమెలసి, దేశస్థులై, దేశాభివృద్ధికై దేశమును పరిపాలించుటవలన దేశమందలి పరిశ్రమలకుగాని, వర్తకమునకుగాని యెట్టి భంగపాటును గలుగలేదు. ఈమహోత్కృష్ట పారిశ్రామికస్థితియే ఆంగ్లేయవర్తకు లాకర్షింపబడుటకు కారణము. ఆనాడు ఆంగ్లేయవర్తకులు, ముడిపదార్థములకై భారతదేశమున గాలు బెట్టలేదు.

## 3. ఆంగ్లేయ యుగము.

ఐరోపాఖండమున పారిశ్రామిక విప్లవము సంభవించిన కాలమున భారతదేశముగూడ స్వాతంత్ర్యము గలిగియున్నచో బ్రిటిషుదీవులయందు గలిగిన పారిశ్రామికవిప్లవము భారతదేశమునందుగూడ గలిగియే యుండెడిది. నాడు, అస్వాతంత్ర్యస్థితియందులేని జపానుదేశము నేడు బ్రిటిషుదీవులతో పారిశ్రామికసంగ్రామ రంగమున విజయవంతముగ మార్కొనుటలేదా? నాడు ప్రపంచమునందంతటను గలిగిన పారిశ్రామిక పరివర్తనము భారతదేశమున గలుగకపోవుటయేకాక, భారతదేశమందలి పరిశ్రమలన్నియు నశింపుచేయబడినవి. నాడు బ్రిటిషుదీవులు హిందూదేశము నాక్రమించుకొని తమపరిపాలనము ప్రతిష్ఠింపకపోయినచో బ్రిటిషుదీవుల పరిశ్రమాభివృద్ధికి పునాదియే లభించెడిదికాదు. బ్రిటిషుదీవులయందలి యంత్రాగారములకు వలయు ముడిపదార్థములు లభించెడివి కావు, ఆంగ్లేయయుగ ప్రారంభమున తయారైన వస్తువులతో ఆంగ్లే

యువర్తకులు వర్తకమునుసాగించిరి. కొంతకాలము జరిగినపిమ్మట బ్రిటిషుప్రభుత్వము ఆంగ్లేయవర్తకులనే నిషేధింప ప్రారంభించెను. కంపెనీ పరిపాలనయందు 17వ శతాబ్దాంతము నుండియు, సం. 1700 మొదలు 1824 వఱకును హిందూదేశమునుండి దిగుమతియగు తయారైన సరకులపై బ్రిటిషుప్రభుత్వ మవలంబించినచర్య ఎగుమతి దిగుమతి ప్రకరణమున విపులముగ చర్చింపబడెను. ఆకాలమునందలి బ్రిటీషుప్రభుత్వ మవలంబించిన చర్యవలన భారతదేశపరిశ్రమలన్నియు నాశనమై పోయినవనుట చరిత్రప్రసిద్ధము. కీర్తిశేషుడగు రమేశచంద్రదత్తుగారు భారతీయపరిశ్రమ లేవిధముగ నడుగంటినవో విపులపఱచిరి.

"18 వ శతాబ్దమున, భారత భూమియందు, పరిశ్రమలు, వ్యవసాయము, మహోత్కృష్ట స్థితియందున్నవి. భారతదేశపుచేతిమగ్గములే ఆసియాఖండమునకును, ఐరోపాఖండమునకును గూడ, బట్టలను సమకూర్పగలిగినవి. మహాస్వార్థపరులై, ఈస్టిండియా కంపెనీ వారును, బ్రిటీషు పార్లమెంటువారును, స్వార్థపరులై బ్రిటిషుపరిపాలనా ప్రారంభదశయందు, హిందూదేశమునందలి పారిశ్రామికులను నిరుత్సాహవంతులగునట్లు వ్యవహరించిరి. అప్పుడప్పుడే ఇంగ్లండునందు మొలకెత్త ప్రారంభించిన పరిశ్రమలకు ప్రోత్సాహము గలుగునట్లుగ వర్తించిరి. 18 వ శతాబ్దాంత్య దశలయందునను, 19 వ శతాబ్ద ప్రారంభ దశలయందునను, హిందూదేశము, బ్రిటిషుదీవుల పరిశ్రమలకు తల యొగ్గునట్లుగ జేయుటయే, వారవలంబించిన నిర్ణీతవిధానము. భారతీయులు ముడిపదార్థములను మాత్రమే పండించి, బ్రిటిషుదీవుల యందలి యంత్రములకును, మరమగ్గములకును, వాటినందించునట్లు చేయుటయే వారి కృతనిశ్చయము. అచంచలులై విజయము నొందువఱకు నీపనిని గొనసాగించుకొనిరి. కంపెనీవారి ఫ్యాక్టరీల యందుననే, శిల్పులనందఱను

పనిజేయునట్లు నిర్బంధింపవలెనని ఫర్మానా లీయబడెను. హిందూదే శపు నేతపనివాండ్ర పయిన జులుం చలాయించుటకు, వర్తకుల కత్యధి కార మొసంగబడెను. హిందూదేశపు పట్టువస్త్రములు, దూదివస్త్రము లపై అధికపు దిగుమతి సుంకములను, విధించి, ఇంగ్లండునందుండి భారతీయవస్త్రములు తరిమివేయబడెను. బ్రిటిషుదీవుల వస్తు వస్త్రము లన్నినో సుంకములు లేకయో లేక అత్యల్పసుంకముల మీాదనో హిందూదేశమునకు దిగుమతి చేయబడినవి."[1]

"హిందూదేశపు వస్తు వస్త్రములు ఇంగ్లండునకు దిగుమతి యగుట నిషేధించుటయు, నిషేధింపనివాటిపై 100 కి 30 మొదలు 80 వంతులువఱకు దిగుమతిసుంకమును విధించుటయు జేసి, హిందూ దేశమునుండి ఇంగ్లండునకు సరకు ఎగుమతియగుటను నశింపుచేసెను." (Moreland) మఱియు హిందూదేశమునకు బ్రిటిషుదీవులనుండి దిగుమతి యగుచున్న దిగుమతి సరకులపోటీకి నిలబడజాలక భారతీయపరిశ్రమ లడుగంటినవి."[2]

బ్రిటిషుదీవులకు దిగుమతియగు భారతీయ వస్తువస్త్రములపై అత్యధికముగ దిగుమతి సుంకములను విధించియు, నిషేధశాసనము లను గావించియు, భారతదేశపు దిగుమతుల నడ్డుకొనకపోయినచో మాంచెష్టర్, పెయిజ్లీలయందున్న మిల్లులు ప్రారంభదశయందే ఆగి పోయియుండెడివి. ఆవిరియంత్రములశక్తివలన గూడ యంత్రములు నడువజాలక పోయెడివి. ఈయంత్రములు. భారతదేశమునందలి పారి శ్రామికుల స్వార్థత్యాగముపై నిర్మింపబడినవి...........ఆం గ్లేయ పారిశ్రామికులు తోడి భారతీయపారిశ్రామికులతో సమానస్థితి

1 *R. C Dutt : Economic History of India under early British Rule.*

2 *C. J. Hamilton : Trade relations between England and India p. 163.*

యందు పోటీచేయజాలక, రాజకీయాధికారమును వినియోగించి భారతీయ పారిశ్రామికుల నణగద్రొక్కి వేసిరి.” (H. H. Wilson)

ఇది విచిత్రవృత్తికాదని హామండుగారు వ్రాసిరి. “అమెరికా దేశమందలి బ్రిటిషు కాలనీల యెడలనే బ్రిటిషుప్రభుత్వ మిట్టి చిత్తవృత్తి ప్రదర్శించియుండగా, చాలదూరమునందుండి తమచే పరిపాలింపబడు చున్న వేఱొకసంఘముపై స్వార్థములేని దృష్టిని ప్రదర్శింపకపోవుట యసహాజముగాదు.” J. L. Hammand.

ఈచిత్తవృత్తి ఫలితముగ భారతభూమి, విదేశయంత్రములకు ముడిదినుసుల నిచ్చుటకును, ఆముడిదినుసులచే తయారుచేయబడిన వస్తుసముదాయమును తిరిగి కొనుటకే బజారైనది. ముడిదినుసులను చౌకధరల కిచ్చి వేయుచు, తయారైనవస్తువులను రాకపోకల ఖర్చుల తోన, లాభములతోను, మరల కొనుటయే మనవిధియైనది. రాజకీయ దాస్యముతో పారిశ్రామిక పరాధీనవర్తకస్థితి దాపరించినది. మహావృక్షచ్ఛాయను నాటినబీజ మెట్లు త్వరితముగ మొలకెత్తనేరదో, మొలకెత్తినను చిగురించి త్వరితముగ శాఖోపశాఖలు కాజాలదో యట్లే స్వదేశపరిశ్రమలు ప్రారంభింప మొదలుపెట్టినను నేటివఱకు వృద్ధిపొంద జాలకున్నవి.

ఆంగ్లేయయుగమున భారతీయపరిశ్రమలు లయమగుటకు కారణము లీవిధముగ పేర్కొనవచ్చును.

1. మొగల్ దర్బారులును, మొగలుచక్రవర్తుల ప్రోత్సాహము లేక చేతిపనుల కుత్సాహము తగ్గిపోయినది.

2. బ్రిటిషుప్రభుత్వము ప్రతిష్ఠింప బడుటవలన సంభవించిన నిరాయుధస్థితిచే ఆయుధ పరిశ్రమలు మొదలగునవి తొలగిపోయినవి. ఆంగ్లేయోద్యోగ భారతీయోద్యోగులు, భారతీయ విద్యాధికులు వీరందఱు పాశ్చాత్యవేషభాషల ననుకరింప మొదలుపెట్టి విదేశవస్తు

వుల వెంటబడిరి. వీరిని ప్రజాసామాన్య మనుసరించుట సహజము. అందుచే చేతిపనులకు ప్రోత్సాహము నశించిపోయినది. భారతీయ విద్యాధికులందఱు ఈశతాబ్దారంభమువఱకు ఆంగ్లమానసపుత్రు లగుటచే విదేశవస్తువులు రుచించునట్లు వీరికి స్వదేశపువస్తువులు రుచింపలేదు.

3. పైన వివరించిన ఈస్టిండియాకంపెనీవారి పరిపాలనావిధానము బ్రిటిషుపార్లమెంటువారి నిషేధశాసనములు.

4. యంత్రములచే విరివిగ చౌకగ తయారగు వస్తువులు భారతదేశమున కధికముగ దిగుమతి యగుటవలన చేతిపనులు వాటిపోటీకి నోపజాలక పోయినవి.

5. హిందూదేశ ప్రభుత్వవిధానమున భారతీయ పరిశ్రమలకు సంరక్షణ లభింపలేదు. భారతీయ పరిశ్రమలు సంరక్షింపబడకపోవుటయే కాక, బ్రిటిషుపరిశ్రమలకు ప్రత్యక్షముగనో పరోక్షముగనో సహాయ మొసంగబడెను.

## 4. విదేశపు పెట్టుబడి-జాయింటు స్టాకుకంపెనీలు.

భారతదేశమున ప్రారంభింపబడిన పరిశ్రమలుగూడ విదేశస్థుల హస్తగతమైయున్నవి. 19వశతాబ్దమునందు జాయింటుస్టాకుకంపెనీలు స్థాపింప ప్రారంభింపబడెను. ఈకంపెనీలన్నియు విదేశములయందే రిజిష్టరు చేయింపబడెను. వాటిమూలధన మంతయు బ్రిటిషువర్తకులదే. ఇంచుమించుగ సీమయందే యీకంపెనీ లన్నియు రిజిష్టరు చేయబడి యున్నవి. ఇతరదేశములలో రిజిష్టరుచేయబడి, భారతదేశమందు (సంస్థానములతోగూడకలసి) పనిచేయుచున్న జాయింటుస్టాకు కంపెనీల సంఖ్యయు, పెట్టుబడియు నీపట్టికవలన దెలియును.

| కంపెనీలు | 1914 | | 1928-29 | | 1930-31 | |
|---|---|---|---|---|---|---|
| | సంఖ్య | చెల్లింపబడిన పెటుబడి | సంఖ్య | చెల్లింపబడిన పెటుబడి | సంఖ్య | చెల్లింపబడిన పెట్టుబడి |
| | | పౌనులు | | పౌనులు | | పౌనులు |
| బ్యాంకులు, అప్పులు | 18 | 24551108 | 26 | 90092918 | 29 | 95787228 |
| భీమా (Insurance) | 89 | 28065738 | 134 | 65036004 | 137 | 69029222 |
| ఓడలు (Navigation) | 12 | 15001865 | 16 | 39300525 | 19 | 41473922 |
| రైళ్లు, ట్రాములు | 18 | 30811915 | 21 | 32959066 | 19 | 27659066 |
| ఇతర రాకపోకలమార్గములు | ... | ... | 9 | 1273787 | 10 | 1475813 |
| వర్తక పారిశ్రామికపు కంపెనీలు | 113 | 114254833 | 329 | 277868482 | 853 | 282925328 |
| టీ (తేయాకు) | 166 | 17573284 | 179 | 25933818 | 174 | 26648714 |
| ఇతర తోటల కంపెనీలు | 22 | 1165844 | 28 | 3239475 | 29 | 3271840 |
| బొగ్గుగనుల పరిశ్రమ | 6 | 139134 | 4 | 150000 | 4 | 240000 |
| బంగారపు గనుల పరిశ్రమ | 8 | 889830 | 1 | 90461 | ... | ... |
| ఇతరగనుల పరిశ్రమలు, కంకర | 13 | 5030999 | 31 | 168998310 | 32 | 111131499 |
| బట్టల పరిశ్రమలు | 3 | 400000 | 5 | 208000 | 5 | 208000 |
| నారపరిశ్రమలు | 9 | 2428894 | 5 | 2752450 | 5 | 2752450 |

| కంపెనీలు | 1914 | | 1928-29 | | 1930-31 | |
|---|---|---|---|---|---|---|
| | సంఖ్య | చెల్లింపబడిన పెట్టుబడి | సంఖ్య | చెల్లింపబడిన పెట్టుబడి | సంఖ్య | చెల్లింపబడిన పెట్టుబడి |
| | | పౌనులు | | పౌనులు | | పౌనులు |
| ప్రత్తిపరిశ్రమలు | 1 | 100000 | 2 | 150000 | ... | ... |
| ఎస్టేట్లు, భవనములు | ... | ... | 6 | 347740 | 2 | 150000 |
| పంచదార, బెల్లం | 2 | 306656 | 1 | 280000 | ... | ... |
| ఇతర పరిశ్రమలు | 9 | 554451 | 25 | 6088167 | ... | ... |
| | | | | | 6 | 364772 |
| | | | | | 1 | 21000 |
| | | | | | 28 | 65608143 |
| మొత్తము (బ్రిటిషుహిందూదేశము) | 479 | 290773871 | 822 | 715664148 | 853 | 728691492 |
| ,, (సంస్థానములు) | 38 | 7627326 | 45 | 18000636 | 44 | 13656806 |
| మొత్తము | 517 | 298401197 | 867 | 733664784 | 897 | 742348298 |

† *See Statistical Abstract for British India. 1923—4; 1928—9.*

హిందూదేశమునందు రిజిష్టరు చేయబడిన జాయింటుస్టాకు కంపెనీల సంఖ్యను పెట్టుబడిని ఈదిగువపట్టిక దెలుపును. (సంస్థానములతో కలసి)

| 1914—5 | | 1930—31 | |
|---|---|---|---|
| సంఖ్య | చెల్లింపబడిన పెట్టుబడి | సంఖ్య | చెల్లింపబడిన పెట్టుబడి |
| | రూ. | | రూ. |
| 2545 | 807881572 | 7328 | 28255196939 |

హిందూదేశమునందు వర్తక పారిశ్రామిక వ్యాపారములకై జాయింటుస్టాకు కంపెనీలు బయలుదేరెను. ఇవి నామమాత్రముగ నున్నవి. వీటిపెట్టుబడియు, పలుకుబడియుగూడ నత్యల్పము. ఈస్థితి 20 వ శతాబ్దప్రారంభమువఱకు నట్లే యున్నది. 1900 సంవత్సరము మొదలు జాయింటుస్టాకు కంపెనీలు 5 రెట్లు పెరిగెను.

హిందూదేశమున రిజిష్టరుచేయబడిన కంపెనీలయందుగూడ, నాంగ్లేయుల పెట్టుబడియే యధికము. భారతీయుల పెట్టుబడిగూడ నున్నను, పెత్తనమంతయు నాంగ్లేయులదే. ప్రత్తిపరిశ్రమకు సంబంధించినంతవఱకు మాత్రము భారతీయులపెట్టుబడి హెచ్చుగ గలదు. కలకత్తా నారపరిశ్రమయందు, మదరాసు బకింగుహాము కర్నాటక బట్టలమిల్లులయందు, కానుపూరు ఉన్ని మిల్లులయందు, భారతీయుల పెట్టుబడి స్వల్పముగనే యున్నది. పెత్తనముగూడ విదేశస్థులదే. విదేశములలో రిజిష్టరుచేయబడిన కంపెనీలయందు భారతీయుల పెట్టుబడికూడ కొలదిగ గలదు. తేయాకు, కాఫీ మొదలగుతోట లన్నియు నాంగ్లేయుల పెట్టుబడితో నాంగ్లేయాధికారమున వారి యధీనమునందే

యున్నవి. ఆంగ్లేయ యుగప్రారంభమున ప్రభుత్వాధికారము నూతగ గాని ఆంగ్లేయులే తమపెట్టుబడితో మనపరిశ్రమల నన్నింటిని ముట్టడింప గలిగిరి.

## 5. ఇతరవర్తక పారిశ్రామికసంస్థలు.

పారిశ్రామికాభివృద్ధికిని వర్తకాభివృద్ధికిని దేశమునందు కొన్ని సంఘములు లేర్పఱుపబడినవి. 1920సం॥రములో, 1. (Associated Chambers of Commerce of India and Ceylone) అసోసియేటెడ్ చేంబర్సు ఆఫ్ కామర్సు ఆఫ్ ఇండియా అండు, సిలోన్ 2. (Indian Jute Mills Association) హిందూదేశపు నారమిల్లులసంఘము,

1884 వ సంవత్సరమునను, 1921లో హిందూదేశపు ప్రత్తి సంఘము(East Indian Cotton Association), 1881 లో హిందూదేశపు తేయాకుసంఘము (The Indian Tea Association), 1892లో హిందూ దేశపు గనులసంఘము, (The Indian Mining Association) 1921 లో హిందూదేశపు ప్రత్తికమిటీ, (The Indian Cotton Committee) 1913లో హిందూదేశపు గనుల ఫెడరేషన్ (The Indian Mining Federation), 1906లో మైనింగు అండు జిగ్రాఫికల్, (The mining and geographical), (Institute of India), ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇండియా 1892లో (The Wines, Spirits, and Beer Association of India) సారాసంఘములు స్థాపింపబడినవి. ఈసంఘము లన్నిటియందు నధికసంఖ్యాకులుగా నాంగ్లేయులే కలరు. వారిస్వాధీనాధికారములయందే యున్నవి. కొలదిగ మాత్రము భారతీయులు గలరు. గనులఫెడరేషనులో మాత్రమే భారతీయులపెట్టుబడిగలదు. హిందూదేశపుతేయాకుసంఘమునకును హిందూదేశ కేంద్రపత్తిసంఘమునకును ప్రభుత్వము ధనసహాయము జేయుచున్నది. సుమారు 20 వర్తకసంఘములు హిందూదేశమునందు గలవు.

ఇవి యన్నియు ఆంగ్లేయులవశమందే యున్నవి. ఈవర్తకసంఘములు ప్రాముఖ్యమగు వర్తకస్థలములందెల్ల గలవు.

(The Calcutta Wheat, Jute Baler's Association; The Calcutta wheat and Trade Association; The Calcutta Hide and Skins Shippers Association; The Bombay Mill Owners Association 1873; The Bombay Cotton Trade Association 1876; The Bombay Native Piece Goods Merchants Association; The Ahmedabad Mill owner's Association; The Indian Sugar Producers Association Cawnpoor; The Employer's Federation of South India.)

చిల్లరవర్తకములుకూడ కలకత్తా, బొంబాయి, మదరాసు, రంగూనులందు గలవు. 1921 సం॥రములో ఫ్రాన్సుదేశమునకును, హిందూదేశమునకును మధ్య వర్తక మభివృద్ధి చేయవలెనను వర్తక సంఘ మేర్పడెను. 1912 సం॥రములో బ్రిటిషుదీవుల వర్తకవ్యాప్తికి హిందూదేశమునం దొకసంఘ మేర్పడెను.

మారకపువర్తకము (Stock Exchange) బొంబాయి, కలకత్తా, మదరాసులలో గలదు. 1912 వ సం. రమునుండియు మిల్లుల వాటా లయం దీవర్తకము జరుగుచున్నది. కలకత్తాయందు మారకపు సంఘము 1893 వ సం॥రములో స్థాపింపబడెను.

1908 వ సం॥రమునందు కలకత్తాలో మారకపువర్తకపు (Stock Exchange) సంఘ మేర్పాటుపబడెను. ఈసంఘమునందు 150 మంది సభ్యులు గలరు. ఇందు మార్వాడీ లధికము.

బొంబాయియందు వాటాలబజారు (Share Market) గలదు. ఈవాటాలబజారు 1899 సం॥రములో స్థాపింపబడెను. ఇందు నాలు గైదువందలమంది ఆంగ్లేయవర్తకులే కలరు. ఇందు సభ్యత్వపురుసుము మొదట 5 రూపాయలుండెను. నేడు రూ 7000 ల వఱకు పెరిగెను. 1925 వ సంవత్సరమున నీసంఘమువారు నూతన నియమములను

గావించుకొనిరి. ఈనూతన నియమములవలన వాటాదారులకు పూర్వపు సౌకర్యములు తగ్గినవి.

ఇట్లు ఈస్టిండియాకంపెనీనాటనుండియు వర్తక పారిశ్రామికపు సంస్థలు విదేశీయుల పరమై యున్నవి. మహమ్మదీయ యుగమున రాజ్యాధికారమున మతాభివృద్ధి గావింప, రాజ్యస్థాపనకై నాటిరాజులు ప్రయత్నించు చుండెడివారు. అందుచే వర్తక పారిశ్రామి కార్థికశోష ణమును కెన్నడును బూనలేదు. ఈస్టిండియాకంపెనీ డబ్బుకొఱకు రాజ్యాధికారము స్థాపించినది. రాజ్యముకొఱకై రాజ్యస్థాపన మొన రింపలేదు. ప్రప్రథమమునుంచియు, పరిశ్రమలను ముట్టడించుటకై కోటలను ముట్టడించెను. కంపెనీవారు, కంపెనీపిమ్మట వర్తకులు, వారి పిమ్మట స్థాపింపబడిన సంఘములు అన్నియు నొకేబీజోత్పత్తి గలిగి వేలు వేలు పేర్ల వ్యవహరింప బడుచున్నవియే కాని మొట్టమొదట నుండియు నొక్కవిధమగు నీతితోనే వర్తకము సలుపుచున్నవి.

## 6. 1858-1954 పరిశ్రమనీతి.

విదేశపరిపాలనా ప్రారంభదశయందే, నాశన మొనరింపబడిన పరిశ్రమలలో వస్త్రపరిశ్రమ మొదటిది. లోహ ఖనిజ పరిశ్రమలు, అద్దకము, నునుపుచేయు పరిశ్రమలు కూడ, వస్త్రపరిశ్రమతో బాటు రూపుమాపబడినవి. 19 దవ శతాబ్ద ప్రారంభమునందు కొంతకాలము వఱకు భారతదేశమునుండియే ఐరోపా మొదలగు ఖండములకు వస్త్రము లెగుమతి చేయబడు చుండెడివి. పిమ్మట లాంకషైరు మిల్లు బట్టల వ్యాప్తికొఱకై భారతదేశమందలి వడుకు నేయుటలపై ధ్వజ మెత్తబడెను. వడుకువారి వ్రేళ్లు తెగగొట్ట బడినవి. నేయువారిపై విధివిరామములేని పన్ను భారము వేసి, విదేశవస్త్రములకన్న హెచ్చు

ధరలగునట్లు వాటి నొనరించిరి. ఈవిధముగ వస్త్రపరిశ్రమను ధ్వంస ముచేసి, లాంకషైరుమిల్లులు హిందూదేశపు బజారులవెంట, ప్రాచ్య భూభాగమునందు విహరింప ప్రారంభించినవి. ఇట్లే పట్టుబట్టల పరిశ్రమ గూడ, అంత మొందింపబడెను. వడుకుటయు, పట్టుబట్టల నేతయు రెండును నొక్కవిధముగ సమాప్తి చెందినవి. ఇప్పుడిప్పుడే మరల నేత పరిశ్రమ తలయెత్తుచున్నది. మహాత్మాగాంధీ భారతరాజకీయరంగ మున ప్రవేశించిన నాటనుండియు మరల నూలువడుకుట కూడ పును రుద్ధరింపబడుచున్నది. కొలదిగ రంగులువేయుటయు, కాలికోప్రింటింగు, నునుపుజేయు పనులు మొదలగు వాటి నుపయోగించి రంగులు వేయుట, దేశమునం దచ్చటచ్చట గలదు. కాని, యీరంగులు తయారుచేయుటయు, వేయుటయు గూడ 19 దవ శతాబ్దాంతమునుం డియు, విదేశమునుండి దిగుమతి యగుచున్న రంగులవలన వెనుక బట్టెను. చాలవఱకీపరిశ్రమ గూడ తగ్గిపోయెను. బట్టలనలుపురంగులు మొదలగుఅద్దకములు వేయుటగూడ మిల్లులలో రంగులువేయబడి దిగుమతియగుచున్న సరకువలనను తగ్గిపోయెను. కాఫీ తేయాకు తోట లువేయుట 1830 సం.రమునుండియు ప్రారంభింపబడెను. పరిశ్రమలలో భారతీయులపెట్టుబడి లేదు. పరిశ్రమలకు వలసినశాస్త్రజ్ఞులు కూడ హిందూదేశమునందు లేరు. అట్టిశాస్త్రజ్ఞు లుండుటకు వలయు శాస్త్ర విద్యాభ్యాసమునకు తగుసదుపాయములు ప్రభుత్వమువారు గావించి యుండలేదు. అందుచే బ్రిటిషువర్తకుల పెట్టుబడితో బ్రిటిషువర్తకుల దృష్టి నాకర్షింపగలపరిశ్రమలను మాత్రమే బ్రిటిషుప్రభుత్వసహాయ మున బ్రిటిషువర్తకులు స్థాపింప మొదలుపెట్టిరి. ఇచ్చట సంపాదింపబ డిన లాభములు ఇంగ్లండునకు పంపించబడెను. 19దవ శతాబ్ద ప్రారంభ ముననే గృహపరిశ్రమలు నశించినవి. వీనిస్థానే మరల నెట్టిపరిశ్రమాభి వృద్ధియు శతాబ్దాంతమువఱకు నెవరివలనను గావింపబడలేదు.

1900 సంవత్సరప్రారంభమునుండియే యంత్రపరిశ్రమ ప్రారంభము, గృహపరిశ్రమల పునరుద్ధారణప్రయత్నములు గావింప మొదలుపెట్టబడినవి. 1900-1914 సం.రములమధ్య వస్త్రపరిశ్రమ నారపరిశ్రమలు యంత్రములమూలమున మొలకలెత్తినవి. 1858వ సంవత్సరమునందు కంపెనీపరిపాలన తొలగిపోయినను ప్రభుత్వమువారు రాజనీతినే కొనసాగించుచు వచ్చిరి. ఇంగ్లీషు పరిశ్రమలతో పోటీకివచ్చు పరిశ్రమను ప్రోత్సహింపకపోవుటయేకాక నశింపుజేయుటకు ప్రయత్నించిరనదగును. 1880వ సంవత్సరమునందు వచ్చిన కాటకసమయమున నియమింపబడిన కమిటీవారు వేఱువేఱువృత్తులను గలిపించి, కాటకనివారణ మొనరింపవలెనని సలహా నొసంగిరి. వారిసలహా నొకదానినిగూడ ప్రభుత్వము పాటింపలేదు. పిమ్మట పరిశ్రమలను ప్రోత్సహించునట్లు నటింపప్రారంభించి వర్తకపారిశ్రామికములను గుఱించినవిషయములను వెల్లడికిరానిచ్చుచు వచ్చిరి. ఆర్థికవిచారణల నుపేరున హిందూదేశమునందు విదేశవర్తకమున కనువగువిషయముల నన్నింటిని గ్రహింప మొదలిడిరి. ఈనీతి కనుగుణముగనే కలకత్తాయందు వర్తకవస్తుప్రదర్శనము స్థాపింపబడెను. ముడిపదార్థములను గుఱించియు పరిశ్రమలకువలయు సహజసంపదను గుఱించియు, విపులముగ నెఱుంగుటకు విచారణసంఘములను నియమించిరి. దేశమందలి పనివానితనమును గ్రహించి యీపనితనమును తన పనిముట్లవలన నోడించుటకు వలయుజ్ఞానమును పొందుటకై 1886వ సంవత్సరమున లండనునగరమున భారతీయపరిశ్రమల వస్తుప్రదర్శనము జరుపబడెను. 1890 వ సంవత్సరము 1914వ సంవత్సరములమధ్య వివిధ రాష్ట్రములయందు వంగ, సంయుక్త, పంజాబు, మధ్యరాష్ట్రములలో ప్రత్యేకపరిశ్రమలవిచారణలు జరుపబడినవి. భూగర్భపరిశోధనలుగూడ నచ్చటచ్చట జరిగినవి. కలకత్తావర్తక వస్తుప్రదర్శనశాలవంటిశాల

1920సం.రములో మదరాసునందుగూడ స్థాపింపబడెను. రాష్ట్రముల యందు జరుపబడినవిచారణలు నిరుపయోగముగ నున్నవి.

సర్. ఆల్ఫ్రెడ్ చాటర్టన్ (Sir Alfred Chatterton) విద్య యందు వర్తకపారిశ్రామికవిద్య గఱపుటకును పరిశ్రమాభివృద్ధులను గుఱించి యోచించుటకును, వ్యక్తులపరిశ్రమలకు ధనరూపముగ బ్రోత్సహించుటకును, ప్రభుత్వమే పెట్టుబడిపెట్టి పరిశ్రమలను స్థాపించుటకును, మదరాసు గవర్నమెంటువారి నొప్పింపగలిగెను. 1898 సం॥రములో అల్యూమినియము తయారుచేయుటకు కొంతవిరాళమును బొందగలిగెను. తరువాత ఆల్ఫ్రెడ్ గారిని పరిశ్రమల యభివృద్ధిపేరున ప్రత్యేకోద్యోగిగా నియమించిరి. ఈయన అల్యూమినియమును అభివృద్ధిచేయుట మొదలిడిరి. అప్పటి వైస్రాయిగారయిన లార్డుకర్జను గారును, హిందూదేశ రాజ్యాంగకార్యదర్శియు నీవిధాన మంగీకరించిరి. ఈవర్తకమునందు నష్టములేక లాభమువచ్చుచో ఏవ్యక్తికైన నిచ్చివేయు పద్ధతిపై నామోదించిరి. (ఇంగ్లీషువర్తకులకు) కేంద్రప్రభుత్వములో వర్తకపారిశ్రామికశాఖను సృష్టించిరి. 1906 సం॥లో మదరాసునందు, పారిశ్రామికశాఖను నెలకొల్పిరి. దీనికి ఆల్ఫ్రెడ్ గారినే డైరక్టరుగా నియమించిరి. ఈపారిశ్రామిక నీతిని 1908 సంవత్సరములో సమావేశమైన యుదకమండల సభలో చర్చించిరి. ఇంతలో తెల్లవర్తకుల యాందోళనము శుృతిమించినది. వారు వర్తకమును, పరిశ్రమలును వ్యక్తిపరముగ నుండవలెననిరి. ప్రభుత్వము జోక్యము కలిగించుకొనరా దనిరి. నాటి హిందూదేశ రాజ్యాంగకార్యదర్శి యగులార్డు మార్లేగారు 29-జూలై 1910 వ సంవత్సరమున (Despatch No 50) తెల్లవర్తకుల యభిమతానుసారముగ మదరాసుప్రభుత్వ పారిశ్రామిక ప్రత్యేకశాఖ నామోదింపలేదు. ప్రభుత్వము ముఖ్యపరిశ్రమలలో

జోక్యముగూడ గలిగించుకొనరాదని నిషేధింపబడెను. చాటర్‌టన్‌గారి ఆయుద్యోగము పోయినది. విద్యాశాఖలో మరల నియమింపబడిరి. ప్రత్యేకశాఖ ఎత్తివేయబడెను. క్రోమిచర్మమును బాగుచేయు శాల అమ్మివేయబడెను. మరమగ్గముల పరిశోధనశాల లెత్తివేయబడినవి. పిమ్మట చాటర్‌టన్ గారు మైసూరు సంస్థానమునందుద్యోగిగా వెళ్ళిరి. ఇట్లే యితరరాష్ట్రముయందుగూడ పరిశ్రమలయభివృద్ధి ప్రయత్నము మొలకలోనే త్రుంపివేయబడెను. 1914 వ సంవత్సరమున మరలడైరక్టర్లను రాష్ట్రప్రభుత్వములు నియోగించినవి. మదరాసు రాజధానిలో మాత్రము తిరిగి ప్రత్యేకశాఖను స్థాపించిరి. మదరాసు రాజధానిలో తోళ్ళను బాగుచేయుటయు, రంగులు వేయుటయు, వంగదేశమున పట్టుపరిశ్రమయు, చెప్పులుకుట్టుటయు, నేయుటయును, మధ్యరాష్ట్రములలో నేతయు, పంచదారపరిశ్రమయును, సంయుక్తరాష్ట్రములయందు ప్రభుత్వము నిర్వహింప ప్రారంభించెను. ఈనిర్వహణమువలన పరిశ్రమాభివృద్ధి శతాంశమైనను జరుగలేదు. 1870-75 సం॥రములలో హిందూదేశమందలి కొన్నిసరకులు ప్రభుత్వోపయోగమునకు కొనరాదని ప్రభుత్వము నిర్ణయించుకొనెను. ఇంగ్లండులోని ఇండియా ఆఫీసువారే యట్టిసరకులను కొని పంపుచుండెడివారు. 1883 సం॥రములో నీనియమములు రవంత సడలింపబడినవి. హెచ్చుధరలుగలేని ప్రశస్తమైన సరకులను హిందూదేశమందు గూడ కొనవచ్చుననుకొనిరి. 1900 సంవత్సరాంతమున ఇనుపసామగ్రులు రైళ్ళకుపనికి వచ్చు పనిముట్లు హిందూదేశమున కొనవచ్చుననిరి. 1904-1909 సంవత్సరముల యుద్ధకాలమునందున స్టోర్సుసరకులను కొనునియమమును కొంతవఱకు మార్చిరి. కాని యీనియమావళి మార్పులు నేటివఱకు నాచరణలోనికి రాలేదు. తాతాకంపెనీవారి సరకులనే పూర్తిగ కొనక ఇంగ్లండునుండి యినుపసరకులను తెప్పించుచుండుటయే

పైనియమముల నాచరణయందుంచలేదని చెప్పుటకు హేతువు. తాతాకంపెనీవారి యినుపపట్టాలను 20,000 టన్నులే 10 సంవత్సరముల వఱకు మాత్రమే కొనుట కంగీకరించిరి. 1901 లో సిమ్లా యందు లార్డుకర్జనుగారి యధ్యక్షతక్రింద విద్యావిషయ చర్చసభ జరిగెను. అందు భారతదేశమందలి విద్యావిధానము బానిసగుంపునే సృష్టించుచున్నదని వివరింపబడెను. వర్తక పారిశ్రామిక సంబంధ విద్యావ్యాప్తి జరిగినగాని వర్తకపారిశ్రామిక అభివృద్ధి కలుగదని నాడు ఘంటాపథముగ వివరింపబడెను. అయిననేమి? విద్యావిధానము నందు మార్పు కలిగించలేదు. 1913 వ సంవత్సరము వర్తకార్థికవిద్యావ్యాప్తికై "సిడెన్హాము" కళాశాల నొకటి బొంబాయిలో నెలకొల్పిరి. తాతాకంపెనీవారు 1911 సంవత్సరములో బెంగుళూరునందు (Indian Institute of Science) ఇండియన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ సైన్సు భారతవిజ్ఞాన కళాశాలను స్థాపించిరి. 1854 సంవత్సరములో స్థాపింపబడిన విద్యావిధానము 1883 లో కొలదిగ మార్పులుచేయబడి నేటి వఱకు నొకేవిధముగ నున్నది. బానిసలను తయారుచేయు యంత్రాలయములవలె నీవిద్యాలయము లున్నవి. సత్పురుషులై స్వయంసహాయులుగ నుండగలిగిన వర్తకపారిశ్రామికవిద్యలకై తగుసదుపాయము లొనరింపవలెనని దేశీయనాయకులు పలుమార్లు మొఱబెట్టుచు వచ్చిరి. ఆమొఱ్ఱలు విఫలములైనవి. తాతాకంపెనీవారు మాత్రము జేమిషెడ్ పురమునందుసాంకేతికవిద్యాలయమును(Technical Institute) స్థాపించిరి. ఇచ్చటవిద్యార్థులు మూడుసంవత్సరములు విద్యనభ్యసించుచో పిమ్మట వారికి నెల 1కి 200 రూ జీతముమీద వారియంత్రాలయములయందే పనినిచ్చుచున్నారు. మదరాసునందలి బకింగుహాము కర్ణాటకమిల్లుల వారుగూడ అందులో పనిచేయువారికి సాంకేతిక విద్యాభ్యాసమున కొకింత సదుపాయము కలిగించుచున్నారు. కాని ప్రభుత్వముమాత్ర

మేవిధముగను పరోక్షముగ గాని యపరోక్షముగ గాని వర్తకపారి శ్రామికాభివృద్ధికి వలసినకృషి చేయలేదు. అందుల కనుగుణ్యముగ నుండు రాజనీతి నవలంభింపలేదు. ప్రభుత్వ వర్తకపారిశ్రామికరాజ నీతి ఇంగ్లండువైపునకే దృష్టి నిగిడ్చినది. భారతీయుల భాగ్యాభివృద్ధి వంకకు క్రీగంటి చూపులనైన బ్రసరింప చేయలేదు.

# 7. పారిశ్రామిక పరివర్తనము.

# 1914—1934

ఇంతలో నైరోపామహాసంగ్రామము వచ్చెను. పాశ్చాత్య దేశము లన్నియు సంగ్రామమహాగ్నికీలల దగుల్కొనినవి. యుద్ధము నకువలయు పరికరముల నేదేశమున కాదేశ ముత్పత్తి చేయజాలక పోయినవి. ఇక విదేశములకు తమసరకుల నెగుమతిచేయుట కెట్లుత్పత్తి చేయగలవు? పాశ్చాత్యదేశము లాహారపదార్థములకును, యుద్ధపరికర ములకును ప్రాచ్యదేశములపై నాధారపడుట విధియయినది. ఇంగ్లండున కానాడు బుద్ధిపూర్వకముగా హిందూదేశము సహాయమొనరింపకు న్నచో బ్రిటిషుసామ్రాజ్యమునకేగాక ఇంగ్లండుకు కూడ నెక్కువ నష్టము సంభవించియుండెను. హిందూదేశమునుండి మానవులు సిపాయిలుగ యుద్ధరంగమునకు బోయిరి. కోట్లరూపాయలు ధనసహా యమొసంగబడెను. ఇంతయే కాదు. అంతవఱకు ప్రభుత్వార్థికనీతివలన తలెత్తజాలక లేమొలకలవలెనున్న పరిశ్రమలే ఇంగ్లండును సంరక్షీం పగలిగినవి. భారతవర్షమందలి పరిశ్రమలపైన ఆకాలమున ప్ర మాధారపడవలసివచ్చుటచే మనపరిశ్రమల కొంకింత ప్రోత్సాహ మొస గుట తప్పనిసరి యయినది. అందువలన యుద్ధకాలమున భారతదేశ మందలి యంత్రపరిశ్రమలు చిగురించినవి. బొంబాయి, భారతదేశసింహ

ద్వారముగ నుండుటచే మెసపటోమియాకు సైన్యము నచ్చటనుంచియే పంపుచు వచ్చిరి. సైన్య మచ్చటనుండి పోవలసివచ్చుటచే సైన్యమున కువలయు పరికరములన్నియు బొంబాయియందు కూర్చుకొనుట విధి. అందుచేత బొంబాయియందలి వస్త్రపరిశ్రమయు ముద్రాక్షరశాలలును కాగితపుపరిశ్రమయు నూనెయంత్రములును నభివృద్ధిపొందినవి. వంగదేశమున నారపరిశ్రమయు రాతిసిబొగ్గు పరిశ్రమయు నూతనోత్సాహమును పొందినవి. మదరాసునందు జడలనిర్మాణమును, తోళ్లమరమ్మతును సబ్బుబిళ్ళల పరిశ్రమయు, చేపలపరిశ్రమలును తలలెత్తినవి. కాని యీయంత్రశాలలకు వలయుసామగ్రులు విదేశములనుండి రావలసి యుండుటచే నవి లభింపక పని మొండిపడుచు వచ్చినది. యంత్రములపై స్వదేశపరిశ్రమ లాధారపడుట యనగా విదేశములపై నాధారపడుటయే యని సామగ్రులు లభించక భారతీయులకు నాడు తెలిసి వచ్చినది. నేతపనివాండ్రకు విదేశపునంగులు జర్మనీనుండి దిగుమతి కాక నేతపరిశ్రమ వెనుకాడెను. అంతవఱకు జర్మనీ, ఆస్ట్రియా, దేశములనుండి ఇత్తడి, రాగి, ఇనుము, ఉక్కు, తగరము, రంగులు మొదలగునవి దిగుమతి యగుచుండెడివి. ఈసరకు లతిచౌకగ నుండుటచే స్వదేశపరిశ్రమ లడుగంటినవి. యుద్ధకాలమున వీటిదిగుమతి లేకపోవుటచే మరల భారతవర్షమునకు చేతిపనులయాధిక్యత జ్ఞప్తికి వచ్చినది. స్వదేశవస్తువులు కొనుట విధిగాను చేతిపనులకు గొంతప్రోత్సాహము కలిగినది. విదేశయంత్ర సామగ్రులపోటీ లేక తొలగుటవలన స్వదేశయంత్ర సామగ్రులకును చేతిపనులకును ప్రోత్సాహము గలుగుట సహజము. మఱియు యుద్ధభూమికి దుస్తులు మొదలగునవి హిందూదేశమే యొసగవలసి వచ్చినది. "మిత్రమండలివారు" నారసామానులను, అభ్రకమును, సూరేకారమును, కలపమొదలగు ననేక విధములగు పదార్థములను, ముడిసరకులను భారతభూమినుండి కొని

పోయిరి. యుద్ధరంగములకు 1918 వ సంవత్సరము నాటికి పౌ 80,000,000 లు విలువగల యుద్ధపరికరముల నొసంగితిమి. కాని, యీయభివృద్ధి శాశ్వతము కాజాలకపోయెను. అగుట కవకాశములేదు. ఈయభివృద్ధి సుస్థిరమైన పునాదులపై లేదు. బుద్బుదప్రాయముగ వచ్చినది. యుద్ధానంతరమునుండియు మఱల బ్రిటిషుప్రభుత్వము ఏరుదాటిన వెంటనే తెప్ప తగులవేయునని భారతీయుల భయము. యంత్రశాలల నభివృద్ధి చేయవలెనని ఈయపాయ భయము పెనుభూతముగ నున్నది. ఈఅపాయమునకు తల యొగ్గదలంచినను యంత్రసామగ్రు లెంతధర పెట్టినను లభించుట లేదు. అందుచే యంత్రాలయముల శాశ్వతాభివృద్ధికి గాని పరిశ్రమలస్థాపనకు గాని వీలు లభింపలేదు. ఇట్టి వీలు లేనందువలన ప్రభుత్వమునకే యనర్థకమైనది. యుద్ధమునకు కావలసిన వస్తుసంతతి సునాయాసముగా లభించుట లేదు. ఈదుర్భరపరిస్థితులలో యుద్ధ మెంతకాల మిట్లు జరుగునో తెలియనికాలమున హిందూదేశమునందు పరిశ్రమలు తమకు వలయునంతవఱకైనను నెలకొల్పుకొనుట అత్యవసర మని ఇండియాప్రభుత్వము విశ్వసించి 1915 వ సంవత్సరము నవంబరు 26 వ తేదీని భారతరాజ్యాంగకార్యదర్శికి లేఖను వ్రాసెను. ఈలేఖననుసరించి (Indian Industrial Commission) భారత పారిశ్రామిక విచారణసంఘమును 1916 వ సంవత్సరమునందు నియమించిరి. ఈ కమీషనువారు భారతదేశములో, పరిశ్రమల నభివృద్ధిజేసి, శాశ్వతముగ నెలకొల్పుటకు వలయు సూచనల గావింపవలెనని కోరబడిరి. ఎగుమతి, దిగుమతుల సుంకముపద్ధతిని గమనింపకపోయినచో పారిశ్రామికాభివృద్ధి కాజాలదు. అయినను, ఈ కమీషనువారి నాయెగుమతి దిగుమతులనుగుఱించిన సమస్యనుగూడ విచారింపుడని బుద్ధిపూర్వకముగా ప్రభుత్వము కోరలేదు. ఈ కమీషనురిపోర్టు వచ్చునంతవఱకు గూడ ప్రభుత్వమునకు, యుద్ధ

కాలమున శాంతి యెచ్చటిది? హిందూదేశ సంరక్షణనియమము లని (Defence of India Rules) ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గము వారే గావించిరి. ఈ నియమముల ననుసరించి యెగుమతులనన్నింటిని తమ యిష్టానుసారము జరిగించుట కధికారము గల్పించుకొనిరి. అచ్చటచ్చట దొరకు పదార్థములన్నియు తా మొకచోటుకు చేర్చుట కధికారము సృష్టించుకొనిరి. గవర్నమెంటునకు కావలసిన యాహారపదార్థములను, సామానులను కొని నిల్వయుంచుటకు మ్యూనిషన్సుబోర్డును (Munitions Board) నియమించిరి. ఆహారపదార్థముల సరఫరా యెగుమతులమీద నధికారము వహించుటకు (Central Transport and food Stuffs Board) కేంద్రసరఫరా బోర్డును నియమించిరి. ఈ బోర్డువారు హిందూదేశమందలి సైన్యమునకు, హిందూదేశముపై ఆధారపడియున్న సైన్యములకు నాహారపదార్థములను, నితర పరికరములను నొనగూర్చుటకు బాధ్యత వహించియుండిరి. ఈబోర్డువారి పరిపాలనక్రింద సైన్యమునకు కావలసినదుస్తులు మొదలగు పరికరములను తయారుచేయుటకై ప్రత్యేక యంత్రశాలలను నిర్మించిరి. సైన్యపు దుస్తులు తోలువస్తువులు బూడ్సులు మొదలగునవి తయారుచేయింపబడినవి. ఇదివఱలో తయారుచేయుచున్న కంపెనీలతో తామే కంట్రాక్టును గావించుకొనిరి. గుడ్డలు, కలప, బాగుచేసిన చర్మములు, తోలు పనిముట్లు, యినుము, ఉక్కుసామానులు, తామే కొనుటకు కంట్రాక్టులు వ్రాసిరి. బట్టలమిల్లులలో తయారగు బట్టలన్నియు, తామే కంట్రాక్టు జేసిరి. ఈకంట్రాక్టులలో మిల్లుయజమానులకు తమయిష్టము ననుసరించి వర్తకము చేయనీయలేదు. ధరల నీబోర్డువారే నిర్ణయించిరి. సైన్యమునకు కావలసిన బూడ్సులు కాన్పూరు తోళ్ళమిల్లులనుండి సరఫరా జరిగెను. హిందూదేశపు తోళ్ళమిల్లులే వీటి నొనగూర్చెను. కాని వాటిధర లితరచోట్లకంటె చౌకగ నిర్ణయింపబడినవి. హిందూ

దేశమందుగల 5 మిల్లుల యుత్పత్తిని ప్రభుత్వమే కొనెను. ఇనుప సామానునకు తాతాకంపెనీవారితో ప్రభుత్వము కంట్రాక్టు జేసికొనెను. మిల్లులకు కావలసిన యంత్రసామగ్రులను దిగుమతికూడ జేసి మిల్లుల యధికారులకు సహాయపడుచుండెడివారు. ఇంతలో 1918 వ సంవత్సర మునందు విచారణసంఘమువారు తమనివేదికను ప్రభుత్వమునకు సమర్పించిరి. "భవిష్యత్కాలమునందుప్రభుత్వమువారు హిందూదేశమును స్వాయంసహాయపద్ధతిపై పరిశ్రమలయం దొనరింపవలెను. అందులకు వల్లయుమనుష్యులను పరికరములనుగూడ స్వాయంసహాయ సిద్ధాంతము మీదనే యొనగూర్పవలెను." అని యీకమీషనువారు వ్రాసిరి. "అట్లు చేయవలెనన్న సాంకేతిక విద్యాభ్యాసకులును, వారిసలహాయును అత్యావసరము." అని నివేదించిరి. జీవితమునకు వలయు పరికరములకై యితరదేశములపై నాధారపడియుండుటయు, తనదేశమునందు వలయునన్ని ముడిపదార్థముల గలిగియుండియు, నవి యెగుమతిచేయుచు, వాటిస్థానే విదేశపుసరకులను తెప్పించుకొనుటయు నాగరికసంఘమునకు దగనిపనియని గర్హించి ఖండించిరి. విద్యావిహీనతయు, కార్మికులకష్టములును, అల్పఅంతస్థును, అంటురోగముల వ్యాప్తియు, పరిశ్రమాభివృద్ధికి భంగముగనున్నవని నిశ్చితాభిప్రాయము నొసంగిరి. ఈలోటులనన్నియు ప్రభుత్వము నివారింప దలంచినయెడల నివారింపగలిగినదియే యని వ్రాసిరి. హిందూదేశమున ముడిదినుసులకు లోటు లేదనియు పరిశ్రమలను ప్రారంభించుటకు వలయు యంత్రసామగ్రులను వాటిని తయారుజేయుటకు వలయు శక్తియు లోటుగనున్నవని నుడివిరి. ఈకమీషనువారి సూచనలను నాలుగుభాగములక్రింద విభజింపవచ్చును. (1) ప్రభుత్వము పారిశ్రామికశాఖలను నిర్మించి వాటిమూలమున పరిశ్రమలను ప్రోత్సహించి సంరక్షించుచుండుట. కలకత్తాలో ప్రభుత్వ సామానుల నిల్వకొట్టమును స్థాపించుట. ప్రభుత్వమునకు వలయుసామానుల నీశాఖలమూలమున దెప్పించుచుండుట, (2) సాంకేతిక విద్యాభ్యాసమునకు పాఠశాలలు నెలకొల్పుట.

మిల్లులయందలి కూలివాండ్రకు ఇండ్లు, ఆరోగ్యము, పరిశుభ్రము, మొదలగు సౌకర్యము లొనగూర్చుట, (3) పారిశ్రామిక శాఖయందుగల సాంకేతికవిద్య నభ్యసింపని యుద్యోగస్థులను దీసివేసి సాంకేతికశాస్త్ర నిపుణులను మాత్రమే వేయుట, (4) పరిశ్రమలకు సాంకేతిక ధనసహాయములను జేయుట, ఎగుమతులకు సౌకర్యములను గల్పించుట, రైల్వేలలో తక్కువరేట్ల సౌకర్యము లొనగూర్చుట. ఈసూచనలను ప్రభుత్వమువా రంగీకరింపలేదు. మూలసిద్ధాంతముల నొప్పుకొనిరి. ఆచరణయందు బెట్టలేదు. ఇంతలో యుద్ధము ముగిసినది బ్రిటిషు ప్రభుత్వమును మిత్రమండలియును పరుదాటిరి. సెప్పు తగులబెట్టుట ప్రారంభించిరి. వర్తకులు బిక్కమొగము వేయ ప్రారంభించిరి. విదేశములపోటీ మరల మొదలుబెట్టినది. విదేశములపోటీబారినుండి సంరక్షించుటకు వలయు ప్రయత్నములు ప్రభుత్వ మొనరింపలేదు. యుద్ధకాలమందలి యాతురత తగ్గినది. అంతవఱకు హిందూదేశమునందున్న దృష్టి మరల ఇంగ్లండువైపునకు మరలినది. యుద్ధకాలమునందు గావించిన ప్రోత్సాహము విరమింపఁబడినది. అనవసరమైనది. ఆ ప్రోత్సాహము యుద్ధములో బ్రిటిషు దేశసంరక్షణ కొఱకై మాత్రమే చేయబడెను. అనంతరము మరల బ్రిటిషుదీవులసంరక్షణకే విరమింపవలసివచ్చినది. 1920 వ సం॥రము పిమ్మట మరల పరిశ్రమలు అధోగతిని బట్టినవి. వస్త్ర పరిశ్రమ బ్రతుకే దుర్భరమైనది. ఇనుము, ఉక్కు పరిశ్రమలు సంరక్షింపుమని ప్రభుత్వమునకు రెండుచేతులు చాచినవి. దిగుమతులబారికి ఆగజాలక పోయినవి. 1921-23 సంవత్సరములయందు దీస్థితిని సంరక్షించుటకు ప్రభుత్వము డబ్బులేదనెను. పారిశ్రామికసంఘ సూచనల నాచరించుటకు గూడ దారిద్ర్యదశయే కారణమని ప్రభుత్వము చెప్పినది. కాని యుద్ధకాలమందలి మ్యూనిసిపల్బోర్డువారి లావాదేవీలను సరిజూచి యొప్పగించుకొనుటకును, కమీషనువారి

సూచనప్రకారము కేంద్రపారిశ్రామికశాఖ పనిజేయుటకును భారత పరిశ్రమలశాఖను 1921 లో సృష్టించిరి. రాష్ట్రములయందుకూడ శాఖలు గలవు. ఈ శాఖలు సృష్టింపబడిన పిమ్మట ఆంగ్లేయులకు మఱికొన్ని యుద్యోగములు లభించినవి. ఈశాఖలక్రింద జరిగిన పరిశ్రమల యభివృద్ధికిని, ఈ శాఖలకైన ఖర్చునకును బోల్చిచూచిన, వీటివలన ప్రయోజన మత్యల్పముగ గోచరించు చున్నది. దీనితోబాటు కేంద్రవస్తునిలయశాఖ (Central Stores Department) 1922లో స్థాపింపబడెను. ఈనిలయ మనవసర మనియు, అక్రమముగ ధనము దుర్వినియోగ మగుచున్నదనియు, "ఇంచికేప్ సంఘమువారు" వ్రాసినను దీనిని విరమింపలేదు. ఈవస్తునిలయము నకు సామానులు విరివిగ ఇంగ్లండునుంచియే తెప్పింపబడుచున్నవి. ఇండియాయందు విశేషముగ కొనుటలేదు. డబ్బు దుర్వినియోగ మగు సూచనల నన్నింటిని, ఆచరించి పరిశ్రమల యభివృద్ధికి వలయు ముఖ్యమగువాటిని వేటిని ఆచరణయం దుంచలేదు.

# 8. రాష్ట్రశాఖలు.

పరిశ్రమలకు కొంతధనసాహాయ్యము జేసియు, బరిశ్రమలను స్వాయముగ నడిపియు, నితరులకు మార్గదర్శకముగ నుండుటయే పారి శ్రామిక రాష్ట్రశాఖలను స్థాపించుటయందలి ప్రభుత్వాదర్శము. ఈయాదర్శ మెంతవఱకు కొనసాగినది? రాష్ట్రశాఖలపై కేంద్రశాఖ వారి పరిపాలనము లేదు. పరస్పరసహకారమున నీరెండుశాఖలును పనిచేయవలయును. రాష్ట్రములయందు డైరెక్టరు, డిప్యూటీడైరెక్టర మొదలగు పలువురుద్యోగు లున్నారు. వీరందఱు చాలకాలమువఱకు యుద్ధానంతరకార్యక్రముల నెఱవేర్చుటలోనే కాలము గడిపిరి. ఈశా ఖలయందలి పెద్దయుద్యోగులందఱు సాంకేతికవిద్య నభ్యసించినవార

గారు. ఆంగ్లేయులే పెద్దయుద్యోగములయం దున్నారు. ఈశాఖల వలన నల్పప్రయోజనమైన కలుగలే దనుట నిర్వివాదాంశము. నిత్య కృత్యముగ చేయవలసిన మిల్లులతనిఖీ, బాయిలర్ల పరీక్ష, మిల్లులపొగ బాధనుండి ప్రజలను సంరక్షించుట, కార్మికసమస్యలను గనుగొను చుండుట మొదలగు కార్యములనైన సక్రమముగ నెఱవేర్చుట లేదు. లంచగొండితనము ప్రబలినది. కొన్ని మిల్లులు రేయింబవళ్లు బస్త్రీల యందుగూడ కూలీలను మార్చకయే పనిజేయుచునే యున్నవి:—

## 9. పరిశ్రమల సహాయ శాసనములు.

పరిశ్రమల ప్రారంభించుటకు విరాళముల నొసగుటలోగూడ జాతి భేధములు పాటింపబడు చున్నవి. 1923 వ సంవత్సరమందు మదరాసు రాజధానిలో పరిశ్రమల సహాయశాసనము గావింప బడెను. (State Aid to Industries Act.) ఈశాసనము ననుసరించి పంజాబు, బొంబాయి, మధ్యరాష్ట్రములు, బీహారు, ఒరిస్సా, బెంగాలు, సంయుక్త రాష్ట్రములలో గూడ శాసనము లొనరింపబడెను. ఈశాసనములు సక్రమముగ పరిపాలింపబడలేదు. ఇందులకు మదరాసురాష్ట్రమే ప్రబల నిదర్శనము. ఈశాసనము ననుసరించి జాతీయపారిశ్రామికుల కొసంగబడిన సహాయ మత్యల్పము.

## 10. ప్రభుత్వ పరిశ్రమలు.

మదరాసులో ప్రభుత్వము స్వయముగ నడిపిన పరిశ్రమలకథయును విచిత్రముగనే యున్నది. మదరాసు శాసనసభవారి ప్రభుత్వ పరిశ్రమలవిమర్శన నీసందర్భమున జదువుట యుచితము. కూనూరులో పండ్లను నిలువయుంచు పరిశ్రమను స్థాపించిరి. ఈపరిశ్రమలో ప్రతియేట నష్టమునే చూపించుచు వచ్చిరి.

కూనూరుపండ్లపరిశ్రమయొక్క లాభనష్టములను దెలుపు పట్టిక.

| సంవత్సరము | పెట్టుబడి | పౌను ఒక్కింటికి యుత్పత్తికగు ధర | సగటు అమ్మకపు ధర | సంవత్సరము ఒక్కింటికి నికరపు టుత్పత్తి | నష్టము |
|---|---|---|---|---|---|
| | రూ. అ. పై. | అ. | అ. | పౌనులు. | రూ. అ. పై. |
| 16 సెప్టెంబరు 1921 మొదలు 31 మార్చి 1923 వఱకు | 109048—13—7 | ... | ... | 15728 1/4 | 16414—14—8 |
| 1923-24 | 137335—7—10 | 31.63 | 10 63 | 19052 3/8 | 23158—8—5 |
| 1924-25 | 154536—15—6 | 17.87 | 8.52 | 38276 | 30605—10—9 |
| 1925-26 | 158339—14—10 | 52.38 | 7.98 | 6441 | 26585—2—8 |

*From the Evidence of Khan Bahadur Bazalula Saheb Bahadur C. I. E. D. B. E. Director of Industries, Madras, before the Royal Commission on Agriculture in India Vol. 3. P. 469.*

కళ్ళికోటలో పెట్టబడిన సబ్బుబిళ్ళల పరిశ్రమగూడ నీస్థితియందే యున్నది. (Calicut of Malabar District) మదరాసునందలి చర్మములపరిశ్రమ సిరాపరిశ్రమలు అపారనష్టము ననుభవించి యెత్తివేయబడినవి. మరమగ్గముల పరిశ్రమయు నష్టములపాలు చేయబడెను. అధికవ్యయము అత్యల్పమగు జాగరూకతలతో నీపరిశ్రమలు నడుపబడి నష్టములపాలగుటవలన ప్రజలకు సదాదర్శము జూపించుటకు మాఱుగ వ్యతిరేకాదర్శమును జూపిరి. ఈపరిశ్రమలలో కృషిసల్పుట లాభకారికాదని ప్రభుత్వము తేల్చినందువలన పరిశ్రమలయం దభిలాష నశింపజేయుటకే పరిశ్రమశాఖవారికృషి సాహాయ్యపడెను. నేతపనివాండ్రకు సరకువిడుదలయగుటకు మార్గములు సూపించుట అత్యవసరము. ఈవిషయమున రవంతయు కృషిసలుపబడలేదు. నేతపనివాండ్రకు నూలు కొని నిలువయుంచుటకు పెట్టుబడి యావసరము. అట్టి పెట్టుబడికి సహాయముగావించుట లేదు. ఈవిషయమున పరిశ్రమల శాఖయు సహకారశాఖయు గలిసి పనిచేయవలసియున్నది.

ఏరాష్ట్రమునందునను, ఏపరిశ్రమయు, ప్రభుత్వపరిశోధనల వలనగాని, ప్రభుత్వసాహాయ్యమునగాని, ప్రభుత్వాదర్శమునగాని యభివృద్ధి యయినట్లెవరును జెప్ప సాహసింపలేరు. వ్యవసాయకులకు తీరుబడికాలమునందు మఱియేయుపవృత్తినైన గల్పించుటకేవిధమయిన ప్రయత్నము గావించియుండలేదు. అట్లు గావింపకపోవుటయే కాక ప్రజానాయకులు రాట్నపుపరిశ్రమ నభివృద్ధిసేయ బూనుచున్న ప్రయత్నములను ప్రభుత్వము నిరోధించుచున్నది. ఖద్దరుధారణమును రాజకీయచిహ్నముగ ప్రభుత్వము గ్రహించి నిషేధించుచున్నది.

ఈ పరిశ్రమశాఖ నిష్ప్రయోజనమని బొంబాయిప్రభుత్వమే యంగీకరించెను. ప్రత్యేకపారిశ్రామికశాఖ నెత్తివేసెను. బొంబాయి

యందు 1924 వ సంవత్సరముననే నిజ మంగీకరింపబడి, యీశాఖ ముగింపబడినను నితరరాష్ట్రములయం దింకను సాగించుచునే యున్నారు. ఇట్లు సాగించుటవలన నేదో యొకనెపమున ఇంగ్లండు నందుండి యంత్రసామగ్రులను తెప్పించుటకు వీలగుచున్నది. యంత్ర సామగ్రులమూలముగ ఇంగ్లండువర్తకులును, అందులో కమీషను మూలముగ నిచ్చటి పెద్దయుద్యోగులును ధనార్జనజేయుచున్నారు. రసూల్‌కొండ కల్పమిల్లుల వృత్తాంతమే యిందులకు నిదర్శనము. 2½ లక్షల రూపాయల యంత్రసామగ్రి యీమిల్లులకొఱకై కొనబడెను. ఇప్పు డీమిల్లు లెత్తివేయబడినవి.

## 11 పరిశ్రమల విచారణసంఘము.

భారతదేశమున పరిశ్రమ లభివృద్ధిపొందవలె నన్న, ప్రభుత్వ మాచరింపవలసిన పనుల నిట్లు పరిశ్రమల విచారణసంఘమువారు సూచించిరి.

1. సాంకేతిక విద్యాభ్యాసకులు, నిపుణులగు పనివాండ్రు.

2. నిపుణులగు కార్మికులు, సాంకేతిక విద్యాభ్యాసమునకు వలయుసౌకర్యములు.

3. యంత్రపోషణకు వలయు కలప, బొగ్గు, విద్యుచ్ఛక్తులను చౌకగ లభింపజేయుట.

4 పెట్టుబడి సమకూర్చుట.

5. పారిశ్రామిక యంత్రాలయముల నభివృద్ధిపఱచుటకు పూర్వము, గృహపరిశ్రములను, చేతిపనులను పునరుద్ధరించుట.

6. రాకపోకల సౌకర్యము లభివృద్ధిచేయుట

ఈ యీరింట నొకటయిన వలయునట్లుగ ప్రభుత్వమువా రొనరింపలేదు. ఇంతవఱకు పరిశ్రమశాఖ డైరెక్టర్లైనను సాంకేతిక విద్యాభ్యాసకులుకారు. అందుచే ప్రభుత్వయంత్రమును బెంచుచు నుద్యోగస్థుల పరంపరల నియమించుటవలనగాని, పారిశ్రామికశాసనములను గావించుటవలనగాని, పరిశ్రమ లభివృద్ధిపొందజాలవు. పరిశ్రమల నభివృద్ధిపొందింపవలెనను ధృడసంకల్పము, విశుద్ధచిత్తవృత్తి పరిపాలనావిధానమునం దుదయించిననాడే పరిశ్రమ లభివృద్ధి నొందగలవు.

## 12. పారిశ్రామిక సౌకర్యములు.

పరిశ్రమలకు వలయుముఖ్యసాధనములు నాలుగు. (1). పెట్టుబడి. (2). ముడిదినుసులు. (3). కార్మికులు. (4). అమ్మకపు బజారు. వీనితోబాటు అభిలాషకూడ జేరియున్నచో పరిశ్రమలభివృద్ధిచెందగలవు. భారతవర్షమున పరిశ్రమలకు వలయు ముడిపదార్థములు తండోపతండములుగ గలవు. జంతు, ఖనిజ, వృక్షసంబంధ నానావిధవస్తుపదార్థములు లభింపగలవు. తయారైనసరకు విక్రయింపుటకు భారతవర్షమే పెద్దబజారు. ఇచ్చటి ముడిపదార్థములే పాశ్చాత్యదేశముల యంత్రముల కాధారభూతములుగ నున్నవి. భారతవర్షపుబజారే సరకులనమ్మబజారుగ నున్నది. ముడిపదార్థములు, బజారు, ఈరెంటి యందునను భారతవర్షముతో తులతూగగలదేశము లేదు.

## 13. పెట్టుబడి.

ఇంతవఱకును విదేశస్థులపెట్టుబడితో నడుపబడుచున్న పరిశ్రమలను విదేశస్థులనుండి తిరిగి భారతీయులు స్వాధీనముగావించుకొ

నుట అత్యవసరము. విదేశపు కంపెనీలకు వారి పెట్టుబడులతోసహా న్యాయప్రకారము ధనమిచ్చివేసి భారతీయ ధనాఢ్యులచేత కొనిపించుటయు లేక ప్రభుత్వమే స్వయముగ కొనుటయు జేయవలసి యున్నది. ప్రభుత్వముకొనుటయే ప్రశస్తము. అంతవఱకు విదేశపుపెట్టుబడిపై తగురీతిని నిషేధశాసనము లొనరించుట విధి. విదేశపుపెట్టుబడి దేశాభివృద్ధికరము కాజాలదు. విదేశస్థులనుండి మనపరిశ్రమలకు వలయు ఋణమును దీసికొనుటయైన మేలుగాని విదేశస్థులచే పెట్టుబడిపెట్టించి పరిశ్రమలను వారి యాధిపత్యమున నభివృద్ధిచేయజూచుట ఆత్మహత్యవంటిది. విదేస్థుల పెట్టుబడికి పరిశ్రమలను గుఱిచేయుట యనగా భారతదేశమును విదేశస్థులకు తాకట్టుపెట్టుటయే యగును. భారతదేశమునందే భారతీయ పరిశ్రమలకు వలయు పెట్టుబడిని సంపాదించుట యుత్తమ పద్ధతి. ఇందులకు సరియగు బ్యాంకింగువిధాన మత్యవసరము. ప్రస్తుతము పెట్టుబడికి వలయుధనము లభించుటకు సరియగు మార్గములు లేవు. విదేశవర్తకునికే భారతదేశమందుగూడ నధికధనము లభించుట కేర్పాట్లు గలవు. మక్కా ఫకీరువేషమున ఇండియాకుదిగిన విదేశీయుడు, పెట్టుబడి కవసరమగునంతధనమును సంపాదింప గలుగుచున్నాడు. ఇండియాకు పంపబడిన ఎగుమతిసరకుల పట్టికను (Bill of Lading) చూపించి హిందూదేశపు బ్యాంకులలో అదనపుహుండీని సంపాదింప గలుగుచున్నాడు. అపరిమితమైన బాధ్యతపై (unlimited liability) ఏర్పఱుపబడిన 14,000 సంఘములను రు 1000 కోట్ల జామీనును గలిగియున్న సహకారోద్యమముయొక్క సెంట్రలు బ్యాంకులకును ఎపెక్సు బ్యాంకులకును కలిసి 54 లక్షల రూపాయల అదనపు హుండీని సంపాదించునప్పటికి కొండలు పిండియగుచున్నవి. ఈమొత్తమయినను స్వల్పవాయిదాలపై నొసంగుచుండుటచే అపారమగు నసౌకర్యమునకు కారణ మగుచున్నది. యూరోపియన్ వాణిజ్య సంస్థల

కన్ననో 9 మొదలు 120 లక్షల రూపాయలవఱకు అదనపు హామిలమూలముగ సౌకర్యములను గలిగించుచున్నారు."[1]

ఈరీతిగ పారిశ్రామిక వాణిజ్యమునకు బ్యాంకులనుండి ధనమును పెట్టుబడికి లభింపజేయుట లేదు. విదేశస్థుల పెట్టుబడిని గుఱించి విచారించిన కమిటీవారు (The External Capital Committee) సూచించినటుల హిందూదేశము స్వయంసహాయమున పెట్టుబడి నరయుటయే పరిశ్రమాభివృద్ధికి మార్గము.

విదేశపు పెట్టుబడివలన నష్టములు.

విదేశపుపెట్టుబడివలన గలుగునష్టముల నిట్లువివరింపవచ్చును. (1) విదేశస్థులు పెట్టుబడిపెట్టి పరిశ్రమలను నడుపుచో లాభములమూలముగ నెంతయోసొమ్ము భారతదేశమునుండి తొలగిపోవును. అసలుపెట్టుబడికి పరిశ్రమ తాకట్టుగ నుండును. దేశమునందుగల సహజసంపదను భారతీయులు భారతీయులపెట్టుబడితో వినియోగించుకొనగలుగువఱకు మఱియొకరిని తాకనీయరాదు. ముఖ్యముగ రసాయనపరిశ్రమలలోనికి విదేశీయులను జొరబడనీయరాదు. దేశసంరక్షణకు వలయు ఆయుధసామగ్రిని తయారుచేసికొనటకు రసాయనములే మూలము. ఖనిజములు విదేశీయులచే త్రవ్వి వేయబడినపిమ్మట భారతదేశమున గోతులుమాత్రమే మిగులును. అందువలన ఖనిజపరిశ్రమలలోనికి విదేశీయుని పోనీయరాదు. విదేశస్థుని పరిశ్రమలలోనికి జొరనిచ్చుట కంటె పరిశ్రమాభివృద్ధి లేకపోయినను మేలే. (2) విదేశపు కంపెనీలు డైరెక్టరులు పెద్దయుద్యోగులు మొదలగువారందఱుగూడ విదేశీయులే. కనీసము భారతీయులకు పరిశ్రమలయం దనుభవమైన

1. *Quoted from the article of Dr. B. Pattabhi Seetharamiah "Britain's Economic Policy in India"*

లభించుటలేదు. సహజసంపద క్షీణించు చున్నది. అనుభవము లభించుటలేదు. ధనక్షయమగుచున్నది. (3) ఈవిదేశపు పెట్టుబడిదారులే రాజ్యాధికారము వహించినటుల మెలంగుచున్నారు. రాజకీయ సంస్కరణములమాట దలపెట్టినపుడెల్ల వీరు తమపెట్టుబడి నొకమహాసమస్యగా జూపుచున్నారు. పెట్టుబడికి ప్రత్యేకసంరక్షణ మవసర మనుచున్నారు. భారతదేశపరిశ్రమలను వీరికి తాకట్టు పెట్టినందులకుగాను భారత స్వాతంత్ర్యమునుగూడ వీరికి దాకట్టుపెట్టవలెనని వీరిసంకల్పము. హిందూదేశపరిశ్రమల నాధారముగగొని ధనపుగుట్టలను పెట్టుకొనుచున్నను హిందూదేశస్థులలో దానుగూడ నొకడని తలంచుచిత్తవృత్తి విదేశపు పెట్టుబడిదారునికి నింతవఱకు గలుగలేదు. ముందుగలుగునను ఆశకైనను సావకాశము గోచరించుటలేదు.

విదేశపుపెట్టుబడివలన గలుగులాభముల నిట్లు విదేశపుపెట్టుబడి కావలయుననువారు చెప్పుచున్నారు.

విదేశపుపెట్టుబడి-లాభములు.

(1). విదేశపుపెట్టుబడి నుపయోగించి పరిశ్రమల నభివృద్ధిపఱుపజూచుటవలన కూలిరూపములైన జాతీయాదాయము నుఱికొంత హెచ్చును. పరిశ్రమలలో కార్మికుల కొసగుధనముకూడ గమనింపదగియే యుండును. ఆపరిశ్రమాభివృద్ధియే లేక, కూలిగూడ గిట్టనపుడు కూలియయిన గిట్టనటుల విదేశపుపెట్టుబడితో పరిశ్రమల నభివృద్ధిపఱుచుటయందు దోషములేదు.[1]

విదేశపుపెట్టుబడివలన పరిశ్రమాభివృద్ధికి బూనినయెడల పరిశ్రమల సాంకేతికవిద్యఅనుభవములు లభించునని ఖజానవిచారణసంఘమువారు వ్రాసిరి. వీరియాశ నేటివఱకు నేరాశగానేయున్నది. విదేశపుపెట్టుబడి చాలకాలమునుండి హిందూదేశమునందు పనిచేయుచున్నను సాంకేతి

1. *See Morison's Economic Transition in India P. 220.*

కవిద్యాప్రచారము జరుగకుండుటయే ఖజానాసంఘమువారు గాలిలో నిండ్లుకట్టిరని తేలుచున్నది. (2) విదేశపుపెట్టుబడివలన పరిశ్రమాభివృద్ధికిబూనినయెడల పరిశ్రమలయందు మొట్టమొదట అనుభవముచిక్కువఱకు నగుఖర్చులన్నియు విదేశస్థులు భరింపగలరనియు ఇందువలన వారిఅనుభవము ననుసరించి అధికఖర్చులు లేకుండ మనము ప్రారంభింపవచ్చుననియు కొందఱివాదము ఈవాదము రూపాయిని జారవిడిచి పైసాకై ప్రాకులాడురీతిగ నున్నది. సాలుసరి విదేశపుపెట్టుబడిదారులు 16మిలియనపౌనులు (అనగా సుమారు రు. 484000000లు పౌ॥ 1కి 13—5—4 వంతున)ను లాభములక్రింద తీసికొనిపోవుచున్నారు.[1]

ఈమొత్తమును గమనింపక ప్రారంభమునందలి నష్టములను గమనించి విదేశపుపెట్టుబడి లాభదాయకమని తలంచుట అవివేకము. మఱియు మనదేశపరిశ్రమాభివృద్ధికై యితరులపై నాధారపడుటకంటె చిన్నతనము వేఱొకటి లేదు.

విదేశపు పెట్టుబడివలన నష్టము లధికముగ నున్నను విదేశపుపెట్టుబడి- కొన్ని విధినిషేధములను గల్పించి విదేశపుపెట్టుబడిని విధినిషేధములు. వినియోగించుకొనవచ్చునని కొందఱి తలంపు. అవసరమగునంతవఱకు అవసరమగు సమయములయందు మాత్రమే విదేశపుపెట్టుబడిని వినియోగింప నగును. [illegible] విధినిషేధములను గల్పించవలెనని కొం[illegible] చున్నారు.

1. విదేశపుకంపెనీలు హిం. దూదేశమునందే [illegible]ష్టరుచేయబడవలయును. పెట్టుబడి రూపాయినాటాలలో నుండవలయును. పరిపాలన భారతజాతీయాభ్యుదయమున కనుకూలముగ నుండవలెను. జాయింటు స్టాకు కంపెనీలమూలముగ పరిశ్రమాభివృద్ధికి బూనక, పెద్దవర్తకులే చేయబూనుచో నిషేధించుచు శాసనములను గావింపవలయును.

---

1. *See External Capital Committee Report, Para 7*

2. కంపెనీల వాటాలలో, కొన్ని వాటాలు భారతీయులకు ప్రత్యేకింపవలయును. ప్రత్యేకించుటవలన భారతీయుల యాజమాన్యము సాగుటకు వీలుగనుండును. కాని, హెచ్చుఖరీదులను బెట్టి కొంతకాలమునకు భారతీయులవాటాలను విదేశీయులు కొనివేయ గలరు. కొనుటకు వీలుగలిగింపక నిషేధించినయెడల వాటాలవిలువ హెచ్చుటకు వీలుండదు. పెట్టుబడి స్తంభించును. అందువలన నీపద్ధతి సక్రమముగ బనిచేయదు.

3. కంపెనీల డైరెక్టరుల సంఖ్యలో కొంతమందిని భారతీయులగు వాటాదారులే ఎన్నకొనునట్లు నిర్ణయింపవలెను. ఈ నిషేధమువలన జాతివివక్షత జనించుననియు, జాతిద్వేషమునకు కారణమగుననియు కొందఱివాదము. విదేశపెట్టుబడిపై విధి నిషేధములను గల్పించుటయందే జాతిద్వేష మున్న దనువారు గలరు. ఇంగ్లండు దేశమే సంపూర్ణ స్వాతంత్ర్యము ననుభవించుచు గూడ, 1920 వ సం॥ రపు పెట్టుబడిచట్టమునందు (Credit and Insurance Act) బ్రిటిషు పెట్టుబడి హెచ్చుగానున్న కంపెనీలకే పెట్టుబడి లభించునట్లుగ విధినిషేధములను గల్పించెను.[1]

4. హిందూదేశపుకంపెనీలును విదేశపుకంపెనీలునుగూడ వీటి సిబ్బందికి పారిశ్రామికానుభవజ్ఞానము లభింపజేయవలె నని శాసింపవలెను. ఈశాసనమును మన్నింపని కంపెనీలను దండింపవలయును.

"ఇట్టి విధి నిషేధములను గల్పించుట అవసరమని కొంచెమించుమించుగ నందఱేకీభవించుచున్నారు. ఇందువలన విదేశపుపెట్టుబడి వలన నష్టములు తగ్గుననియు, లాభములు పెరుగుననియు తలంపబడుచుండెను."[2] కాని ఖజానా విచారణసంఘమువారును, విదేశపు

1 *External Capital Committee Report, paras 21-3.*

2 *Zathar and Beri, p. 434.*

పెట్టుబడి విచారణసంఘమువారును గూడ అధికసంఖ్యాకులు నిట్టివిధి నిషేధములను అన్నివిదేశపు కంపెనీలమీదను విధించుట కంగీకరించ లేదు. ప్రభుత్వసహాయమును గోరువాటిపై మాత్రమే విధింపవలె ననెను. ఈసంఘముల అల్పసంఖ్యాకుల నివేదిక లీసూత్రమును విమర్శించి ఖండించినవి. అన్నికంపెనీలమీదను ప్రభుత్వసహాయమును బొందినను బొందకపోయినను గూడ విధినిషేధములను గల్పింపవలెనని వాదించిరి.[1] పండిత మదనమోహన మాలవ్యాగారు విధినిషేధములను గల్పింపవలెననియే నిర్ణయించిరి.

## 14. నూతనరాజ్యాంగ సంస్కరణములు-విదేశపు పెట్టుబడి.

నూతనరాజ్యాంగ సంస్కరణములతోపాటు విదేశపు పెట్టుబడిదారుల సంరక్షణము బ్రిటిషు రాజకీయవేత్తల దృష్టియందు ప్రాముఖ్యస్థానము వహించెను. రౌండుటేబిలుసభయందు సక్రమమగు పద్ధతులపై హిందూదేశ పరిశ్రమ లభివృద్ధి పఱచుకొనుటకు హిందూదేశమునకు స్వాతంత్ర్యము కలదను సిద్ధాంత మంగీకరింప బడెను. కాని ఈసక్రమపద్ధతిలో హిందూదేశమందలి విదేశీయుల పెట్టుబడిపై ప్రత్యేకశాసనములను గావించుకొనుటకు భారతదేశమునకు స్వాతంత్ర్యములేదని బ్రిటిషు రాజకీయవేత్తలు ప్రకటించుచున్నారు. బ్రిటిషు ప్రభుత్వమువారు ప్రకటించిన నూతన రాజ్యాంగ ప్రణాళికయందు విదేశపు పెట్టుబడిపై అవసరమగు విధినిషేధములతో గూడినశాసనము లొనరింపరాదని వ్రాయబడెను.

---

1. *See Pandit Madan Mohan Malavya's Note of Dissent.*

"హిందూదేశమునందు ప్రవేశించుటకును ప్రయాణమును జేయుటకును కాపురముండుటకును ఏవిధమగు ఆస్తినైనను గలిగి యుండుటకును ఏవిధమగు వర్తకమునుగాని వ్యాపారమునుగాని చేసి కొనుటకును ఇష్టమువచ్చిన ఏజంట్లను వారి పక్షమున నియమించు కొనుటకును బ్రిటిషుపౌరుల కంపెనీలకును గాని బ్రిటిషురాజ్యమునగల కంపెనీలకు గాని సర్వాధికారము గలదు. వీటి అధికారమును దొలగించుచు రాష్ట్రీయసభలుగాని, ఫెడరల్ శాసనసభగాని ఎట్టిశాసనములను గావింపరాదు."[1]

ఈనియమములపై కాంగ్రెసు మహాజనసభవారి ప్రతినిధియగు మహాత్మాగాంధిగారు తమ అభిప్రాయ మిట్లు ప్రకటించిరి.

"బ్రిటిషు వాణిజ్యసంఘమునకును భారతదేశమున జన్మించిన పౌరులకును విచక్షణముండరాదట. దీనిని నేడు సరిగా అర్థముచేసిన యెడల నిది చాలదారుణమగువిషయ మనుకొనుచున్నాను. ఇట్టితీర్మానమునకు ముందురానున్న ఇండియాగవర్నమెంటు సంగతియటుంచి కాంగ్రెసును బద్ధముచేయజాలను.........ప్రస్తుత ప్రభుత్వమువలె గాక, రాబోవు భారతప్రభుత్వము సహజముగనో, లేక ప్రభుత్వము వారివలననో ఐశ్వర్యము ఇతరహక్కులును బడసి యనుభవించుచున్న వారికి గాక మలమల మాడిపోవుచున్న భారతీయుల క్షేమమునకు విచక్షణ జూపవలెనని మీరంగీకరింతు రనుకొందును. బహుశః భావి ప్రభుత్వము కార్మికులకు ఉచితముగ నివాససౌకర్యములను చేయవలసి వచ్చునేమో. అప్పుడు దేశమునందలి ధనవంతులు "వారికి నివాస సౌకర్యము లిచ్చినచో దానితోసమానమగు విరాళమును మాకును నీయవలెను—మా కటువంటి గృహము లక్కఱలేకపోయినను సరే"

1 *See Proposals for Indian constitutional Reform, Paras. 122, 123, 124*

అనవచ్చును. కాని ప్రభుత్వ మట్లు చేయజాలదు. అది తప్పక పేద లకు లాభకరమగునట్లు విచక్షణజూపుటయే యగును. అప్పుడు ధన వంతులు లీతీర్మానమును జూచి తమకు హానికరముగా విచక్షణము చూపుచున్నా రనవచ్చును. వర్ణజాతిభేదములపైననే ఆధారపడిన చట్టములతో తమశాసనపుస్తకములను పాడుచేసికొనిన బ్రిటిషుఇండియన్నను బ్రిటిషుకాలనీలను మేము గురించి గోరుటలేదు. స్వతంత్ర భారతదేశము ప్రపంచమున కొసంగుపాఠము ను ఉదాహరణమును వేఱుగ నుండుననుకొనుచున్నాను.........భారతదేశమునం దెంత లో అణగద్రొక్క వేయబడినవారును అధఃపతితులును గలరు. వీరందఱు భూస్వాములచేత ధనవంతులగు షాహుకారులచేత పైతర గతులని పిలువబడువారిచేత బురదలోనికి త్రోసివేయబడినారు. ఈసం కిలమునుండి వారిని లేవనెత్తుటకు అనేకసంవత్సరములవఱకు భారత దేశము శాసనములను గావించుకొనవలసి యుండును.

ఈప్రత్యేకహక్కులను నీలాభములును అన్నియు ప్రభుత్వము చేత పరీక్షింపబడరాదని మీరనువెడల ప్రభుత్వయంత్రమును ఏమియు లేని పేదప్రజల పక్షమున నడుపుట అసంభవమని తిరిగి చెప్పుచు న్నాను........ప్రతిహక్కును నిష్కల్మషముగ అనుమానమున కవకాశములేనియట్లుగ నుండవలెను. కనుక వీటినన్నిటిని పరిశీలింప నెంచెదము.[1]

మహాత్మునివలెనే విస్పష్టముగ నితరరౌండుటేబిలుప్రతినిధులు ప్రసంగింపజాలకపోయిరి. కాని మూడవరౌండుటేబిలు ప్రతినిధులంద రుకలిసి బ్రిటిషుప్రభుత్వమువారికి సమర్పించిన నివేదికయందీ ప్రత్యే కార్థికసంరక్షణలపై తీవ్రముగ వ్యతిరేకాభిప్రాయము వ్రాయబడెను. "సంస్కరణశాసనమునందు విచక్షణమును నిరోధించుచు నియమము

1. గాంధీమహాత్ముని లండను ఉపన్యాసములు. పె. 110నుండి 149వఱకు.

లను జేర్చినయెడల అట్టినియమములను నిరుపయోగమొనరించుటకై ప్రభుత్వమే సాంఘికవాదము (Socialism) నవలంభింపవలసివచ్చునని మూడవరౌండు టేబిలుసభ్యులువ్రాసిరి."[1]

ఈవాదమేమియు హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శిగారు వినిపించుకొనుటలేదు. వీరు నిర్వచించిన సిద్ధాంతములన్నియు హిందూదేశప్రభుత్వార్థికసభ్యుడుగ పనిజేసిన సర్. బేసిల్ బ్లాకెట్టుగారి అధ్యక్షత క్రింద విచారణసలిపిన విదేశపుపెట్టుబడి విచారణసంఘమువారు వ్రాసినసూత్రముల ననుసరించియే యున్నవని హోరుగారు నుడివిరి.[2]

"హిందూదేశపరిశ్రమలయందు, హిందూదేశస్థులు పెట్టుబడి పెట్టుకొనుటకు వలయునంత సావకాశమును గలిగింపవలయును. విదేశపు పెట్టుబడి హిందూదేశపు పెట్టుబడికి సహాయమును మాత్రమే చేయవలయును. ప్రభుత్వమువారు విరాళరూపముగగాని మరేవిధముగ గాని సహాయమొనరించినను లేక కంపెనీ పనిచేయుటకు లైసెన్సు నిచ్చినను అట్టి కంపెనీలకు కొన్ని విధినిషేధములను నిర్ణయింపవలయును. అట్టి కంపినీలు హిందూదేశపు కంపినీలవలె పని చేయునట్లుగ జూడవలయును" అని ఖజానా విచారణసంఘమువారు వ్రాసిరి.[3]

"హిందూదేశమునందు పెట్టుబడి లభించుచున్నంతకాలము హిందూదేశమునందే పెట్టుబడిని సంపాదించుట లాభకరము. విదేశములనుండి పెట్టుబడిని సంపాదించరాదు. విదేశపు పెట్టుబడి సమస్యకు హిందూదేశమునందు వలయుపెట్టుబడిని సంపాదించుటయే తగు పరిష్కారము. హిందూదేశమునందు పైకి గోచరించని మూలధన

*1. See Indian Delegates Memorandum to the Select Committee.*
*2. See Sir S. Hoare's evidence before the Joint Select Committee on Indian Constitutional reforms.*
*3 Fiscal Commission's Report para 292.*

మెంతయో కలదు. దీని నుపయోగించుకొనవచ్చును. హిందూదేశ పరిశ్రమలకు వలయుపెట్టుబడి హిందూదేశమునందే లభింపగలదని విచారణయందు తేలెను." అని విదేశపుపెట్టుబడి విచారణసంఘము వారు వ్రాసిరి.[1]

అయినను హోరుగారు హిందూదేశపు పెట్టుబడితో బ్రిటీషు పెట్టుబడికిగూడ సమానావకాశము లుండవలెననుట విచిత్రవాదము. స్వార్థవాదము భారతీయు లంగీకరింపజాలరు. హోరుగారు నిరూపించు చుండిన సంరక్షణము నంగీకరించుచో భారతదేశమున కార్థికస్వాతంత్ర్యము మఱికొన్ని శతాబ్దముల వఱకుగూడ లభించదు. పరిశ్రమాభివృద్ధియు నార్థికాభివృద్ధియుగూడ నంతేజాలవు.

విదేశీయుల చేతియందుగల పరిశ్రమలను కొనుటకై కర్తవ్యము. భారతదేశమునందు ప్రభుత్వము ఋణమును జేయదగును. భారతదేశమొత్తమున ఎవరును 100కి రు 3 ల కంటె అదనముగ వడ్డీని పుచ్చుకొనరాదని శాసించుచు భారతదేశము నుండి ధనము విదేశములయందు పెట్టుబడి పెట్టరాదనియు శాసించిన యెడల స్వల్పమగు వడ్డీకి భారతదేశమున పెట్టుబడి లభింపవచ్చును. ప్రభుత్వమునకు వలయుఋణము దొరకును. అట్టి ఋణమువలన ధనము సేకరించి విదేశస్థుల పెట్టుబడిని చెల్లించి పరిశ్రమలను ప్రభుత్వమువారు నడుపదగును. పెట్టుబడియు, వర్తకమును, రాజ్యసంపాదనకు గొప్ప పునాదులు. రాజ్యసంపాదన వలన మరల పెట్టుబడియు వర్తకమును బాగుగ విస్తరించును. ఈవిధముగ వర్తకమునకును పెట్టుబడికిని రాజ్యమునకును ఎడతెగని సంబంధము కలదు. ఈసత్యమును భారతభూమి కలయందైనను మఱువరాదు. పరదేశీయుల చేతినుండి భారతీయ పరిశ్రమలు తొలిగింపబడి భారతీయుల

---

1 *See External Capital Committee Report.*

పరమొనరించుటకు భారతదేశపు ప్రభుత్వము ఎన్ని విధినిషేధములను గల్పింపవలయునో అన్ని విధినిషేధములను గల్పించవలయును. నేడు భారతదేశమున కవసరమైన పరిశ్రమనీతి యిదియే. తురుష్కసామ్రాజ్యము విదేశీయుల బంధముల దెంచుకొనిపరిశ్రమాభివృద్ధికై యవలంభించిననీతి నిచ్చట గమనింప దగును.

## 15. తురుష్క సామ్రాజ్యము, వారి ఉదాహరణము.

తురుష్కులు విదేశస్థులపెట్టుబడికి తలయొగ్గుటవలననే రాజ్యమును గోల్పోవలసివచ్చెను. విదేశస్థుల పెట్టుబడిబారినుండి తొలగిపోయిన పిమ్మటనే జాతీయాభివృద్ధిని గావించుకొన గలుగుచున్నారు. "1914 వ సంవత్సరము యుద్ధమునకుపూర్వము తురుష్క మొసంగవలసిన ఋణమునందు నూటికి ఏబదివంతులు ఫ్రెంచివారికిని, పదిహేనువంతులు ఆంగ్లేయులకును, ఇరువదివంతులు జర్మనీవారికిని, బెల్జియము, హాలెండు, ఇటలీ, ఆస్ట్రియా దేశములకు మొత్తమున నూటికి 15 వంతులును విదేశముల కొసంగవలసియున్నారు.

యుద్ధమునకుపూర్వము తురుష్కదేశమునందు వ్యాపారము కొఱకు పెట్టుబడి పెట్టినదానిలో కూడ ప్రథమస్థానము ఫ్రెంచివారికిని రెండవస్థానము జర్మనీవారికిని మూడవస్థానము ఆంగ్లేయులకును గలదు. ప్రపంచయుద్ధమునకు పూర్వము తురుష్కప్రజల పెట్టుబడి వలన రెండుమూడు స్టీమరుకంపెనీలు మాత్రమే ఏర్పడినవి. తురుష్క ప్రభుత్వఋణములో బహుస్వల్పభాగమే తురుష్కప్రజల కొసంగవలసియుండెను."[1]

1. తురుష్కపరిశ్రామిక స్వామికము. పే. 262.

ఇన్లో రైల్లు గనులు బ్యాంకులు మొదలగునవి. విదేశస్థుల పెట్టుబడితో నిర్వహింపబడుచుండెను. తురుష్క దేశము స్వాతంత్ర్యమును సంపాదించినపిమ్మట విదేశస్థుల ప్రత్యేకపు హక్కులను నశింపుచేయుటయేకాక తురుష్కప్రభుత్వము స్వదేశాభివృద్ధికే వ్యతిరేకమగు విదేశసంస్థలను ఎత్తివేయునట్లు వివిధశాసనములను గావించెను. తురుష్కుల పెట్టుబడి తురుష్కుల యాజమాన్యము 100కి 51 వంతులకు తక్కువగ నున్న చోవర్తకసంఘములను స్థాపించుటకువీలులేదని తురుష్కప్రభుత్వము శాసించెను. ఈశాసనముల ననుసరించి గ్రీకులపధెన్సుబ్యాంకుమూసి వేయబడెను. ఆంగేయుల అట్టోమానుబ్యాంకు పేరు మార్చుకొనవలసి వచ్చెను. ఈ బ్యాంకు ప్రధానకార్య నిర్వాహకుడు తురుష్కుడై యుండవలెననిరి. సైలీపియాయందలి ఫ్రెంచి బ్యాంకులు తీసివేయబడెను. "ఏలయినపుడెల్ల వీలయినపద్ధతులనెల్ల విదేశీయుల పెట్టుబడిని విదేశవర్తక కంపెనీలను జాతీయప్రభుత్వమువారు నిరుత్సాహపఱచుచున్నారు."

ఉప్పు, పంచదార, పొగాకు, నిప్పుపెట్టెలు, సిగరెట్లు, కాగితములు తయారుచేయు పరిశ్రమల నన్నింటిని ప్రభుత్వమువారే స్వాధీనముచేసికొని సాగించుచున్నారు. 1928 వ సంవత్సరమున తురుష్కమునందు ఎనిమిదికోట్ల రూపాయలు విలువగల సరకులు పరిశ్రమల వలన తయారయ్యెను. 1931 వ సంవత్సరమున ఇరువదికోట్ల రూప్యముల విలువగల సరకులు తయారుకావలెనని అంచనా వేయబడెను. ఈ యంకెలననుసరించి తురుష్కదేశసంపద ఎంతత్వరితముగ నభివృద్ధియగుచున్నదియు గ్రహింపగలము.[2]

1 తురుష్క ప్రజాస్వామికము పే. 304.

2 *For details see Modren Turkey by Mears; Turkey by Togmber and Krikwood and Turkey to-day by Grace Ellison.*

టర్కీయందువలెనే హిందూదేశమునగూడ హిందూదేశప్రభుత్వము హిందూదేశస్థుల వశమగువఱకు భారతదేశమున పరిశ్రమాభివృద్ధి సక్రమముగ నుండదు.

# 16 కార్మికులు.

భారతదేశమున కార్మికులకు కొదువలేదు.

సాంకేతిక విద్యాభ్యాసకులులేరు. సాంకేతిక విద్యావంతు లుద్భవించుటకు వలయు విద్యాలయములు లేవు. ఇది స్వతస్సిద్ధమగు లోపములుగావు. స్వరాజ్యములభించుచో క్షణమాత్రమున నీలోటు తీర్చుటకవకాశము గలుగును. కార్మికులుగూడ లభించుట దుర్భరమనియు, లభించినను వారుపడు పాటు తక్కువయనియు కొందరు విదేశస్థు లనుచుందురు. ఇది సమర్థింపగలిగిన వాదము గాదు. భారతదేశమున కూలీలనుజేర్చగల కార్మికసంఘములు అభివృద్ధియందు లేవు. కార్మికసంఘములను బెట్ట ప్రారంభించుచో ప్రభుత్వమువా రాసంఘములను రాజకీయముగ వీక్షించి యభివృద్ధినిరోధమునకు వలయు మార్గముల నవలంబించుచున్నారు. కూలీలకు ఆకర్షణీయములగు వసతు లేర్పరుపబడుటలేదు. జీతబత్తెము లతిస్వల్పముగ నున్నవి. గ్రామములనువీడి యంత్రాగారములయందు, తోటలయందు, కార్మికులవలె ప్రవేశించిన వెంటనే కార్మికులు తమస్వాతంత్ర్యమును గోల్పోవుచున్నారు. అస్వాతంత్ర్యపు జీవనము గడుపుటకు కార్మికులు తలయొగ్గ నిచ్చగింపకపోవుట సహజమే. ఈలోపములు నివారింపబడుచో కార్మికులు భారతదేశమున కొఱవడుదురనుట కల్ల. అందుచే పరిశ్రమ లభివృద్ధి పొందుటకు ప్రస్తుతప్రభుత్వ విధానమే ప్రతిబంధకముగాని భారత

దేశమునందు పరిశ్రమాభివృద్ధికి వీలులేని యసహజస్థితి యేమి యును లేదు.

# 17. ప్రస్తుత పరిశ్రమలు.

భారతదేశమునందు ప్రస్తుత పరిస్థితులలో గృహపరిశ్రమలు-గాని, చేతిపనులుగాని, యంత్రపరిశ్రమలుగాని భారతీయులపెట్టుబడిపై భారతదేశాభివృద్ధి కనువుగ నభివృద్ధి పొందజాలవు. ఈవిపరీత పరిస్థితులయందే యింతవఱకు గొంతతల యెత్తగలిగిన పరిశ్రమల ప్రస్తుతస్థితి గమనింపదగును. వస్త్రపరిశ్రమ, నారపరిశ్రమ మొదలగు పరిశ్రమల చారిత్రిక వర్తమాన భావ్యభివృద్ధులను గూర్చి కొంతవఱకు యోచించెదము.

1921 వ సంవత్సరమున వేయబడిన పరిశ్రమల లెక్కలననుసరించి 15606 పరిశ్రమాలయములు గలవు. ఇందు 2,681,128 కార్మికులు పనిచేయుచున్నారు. 100 గురు పురుషులకు 36 గురు ఆడువాండ్రు గలరు.

8,015 పారిశ్రామికసంస్థలు యంత్రశక్తిని వినియోగించుకొనుచున్నవి. 5, 293 పరిశ్రమాలయములు ఆవిరిని 1335 పరిశ్రమాలయములు నూనెను 1137 పరిశ్రమాలయములు విద్యుచ్ఛక్తిని 165 పరిశ్రమాలయములు గాసును 85 పరిశ్రమలు నీటిని ఉపయోగించుచున్నవి. 1927 వ సంవత్సరమున హిందూదేశమునందుగల పరిశ్రమాలయము లిట్లున్నవి.

| పరిశ్రమాలయముల పేర్లు. | సంఖ్య | కార్మికులు |
|---|---|---|
| 1. నేతపరిశ్రమలు | 517 | 740323 |
| బట్టల మిల్లులు | 328 | 386198 |
| నార మిల్లులు | 91 | 334836 |
| పట్టు మిల్లులు | 14 | 2266 |
| ఊన్ని మిల్లులు | 14 | 8155 |
| 2. ఇంజనీరింగు (విద్యుచ్ఛక్తి) | 674 | 268380 |
| నౌకాయంత్రశాల | 11 | 7296 |
| ఎలక్ట్రికల్ ఇంజనీరింగు | 39 | 5786 |
| జనరల్ ఇంజనీరింగు | 252 | 45156 |
| రైల్వే కర్మాగారములు | 130 | 153294 |
| నౌకానిర్మాణము ఇంజనీరింగు | 19 | 24275 |
| 3. ఖనిజములు, లోహములు | 98 | 61002 |
| లోహములు పోతపోయు కార్ఖానాలు | 44 | 2424 |
| ఇనుము, ఉక్కు మిల్లులు | 6 | 39052 |
| పెట్రోలు తయారుచేయు యంత్రములు | 11 | 12837 |
| 4. ఆహారము, నీరు, పొగాకు | 2358 | 177369 |
| పిండిమిల్లులు | 79 | 6028 |
| బియ్యపు మిల్లులు | 1180 | 69025 |
| పంచదార మిల్లులు | 44 | 14487 |
| తేయాకు మిల్లులు | 326 | 62775 |
| పొగాకు మిల్లులు | 13 | 7494 |

| పరిశ్రమాలయముల పేర్లు | సంఖ్య | కార్మికులు |
|---|---|---|
| 5. రసాయనములు, రంగులు | 464 | 54817 |
| రంగువేయుట, తెలుపు చేయుట | 34 | 6158 |
| రసాయనములు | 14 | 2960 |
| అగ్గిపెట్టెలు | 43 | 15898 |
| నూనె మిల్లులు | 2[illegible]0 | 13983 |
| 6, కాగితపు పరిశ్రమలు- ముద్రణాలయములు | 331 | 44175 |
| కాగితపు మిల్లులు | 7 | 5061 |
| ముద్రణాలయములు | 318 | 38342 |
| కాగితమును తయారుచేయు గుంజు | 1 | 515 |
| 7. కర్ర, రాయి, గాజుపరిశ్రమలు | 434 | 66898 |
| పెంకు, ఇటుకబట్టీలు | 111 | 13130 |
| కోతమిల్లులు | 202 | 19039 |
| 8. తోళ్లు, చర్మముల మిల్లులు | 39 | 6262 |
| చెప్పులు | 11 | 2663 |
| తోళ్లు పదునుచేయు శాలలు | 25 | 3463 |
| 9. నొక్కుడు యంత్రములు | 2662 | 219017 |
| ప్రత్తి నొక్కుడు యంత్రములు | 2536 | 183381 |
| నార నొక్కుడు యంత్రములు | 120 | 35463 |
| 10. ఇతరములు | 127 | 41959 |
| మొత్తము | 7704 | 1680702 |

*From large Industrial Establishment in India 1927.*

1932వ సంవత్సరాంతమునకు హిందూదేశమున ఫ్యాక్టరీశాసనమునకనుసరించి పనిచేయుచుండిన ఫ్యాక్టరీలు 9431గలవు. అంతకుపూర్వము9233 మాత్రమేకలవు. ఇందులో 8241 ఫ్యాక్టరీలుమాత్రమే పనిచేయుచున్నవి. ఈసంఖ్యలో 3802 సంవత్సరమంతయు పనిచేయుచున్నవి. 4439 ఆయాపరిశ్రమలకు సంబంధించిన ఋతువులననుసరించి పనిచేయుచున్నవి. 5 క్రొత్తబట్టలమిల్లులు అహమ్మదాబాదునందు స్థాపింపబడెను. సంయుక్తరాష్ట్రములు బీహారుఒరిస్సాలయందు క్రొత్తపంచదారమిల్లులు స్థాపింపబడెను. 1931లో పంచదారమిల్లులు 119 గలవు. 1932 లో 166వఱకుగలవు. పంజాబునందు మేజోళ్లు, బనియనులునేయు మిల్లులు హెచ్చినవి. బొంబాయియందు సిగరెట్లపరిశ్రమ అగ్గిపెట్టెలపరిశ్రమయు కొంతవఱకు కూడదీసికొనెను. వంగదేశమునందు ధాన్యపుమిల్లులు, నారపట్టుమిల్లులును, బర్మాయందు కలపకోతమిల్లులును, ప్రత్తినిపట్టుమిల్లులును, ప్రత్తిపంటగల రాష్ట్రములయందునను చాలవఱకు మూసివేయబడెను.

సగటున రోజు1కి 1419815 మంది కార్మికులుపనిజేసిరి. 1931వ సంవత్సరమునకంటె రోజు1కి 11776మంది సగటునతగ్గిరి. ఈతగ్గుదలకు ముఖ్యకారణము వంగదేశమునందలి నారమిల్లులు. బెంగాలునారమిల్లులలో రోజు 1కి సగటున 13975 మంది తగ్గిరి. మొత్తము 263442 మంది నారపరిశ్రమలో కార్మికులు తగ్గింపబడిరి. వస్త్రపరిశ్రమయందు 1931లో రోజు1కి బ్రిటిషుఇండియాయందు 382525 మంది పనిచేయుచుండెడివారు. 1932 లో 397358 మంది పనిజేసిరి. అనగా సగటున రోజు 1కి పనిచేయు కార్మికులసంఖ్య హెచ్చెను. ఈపెరుగుదల అన్నిరాష్ట్రములయందునను గలదు. ముఖ్యముగ బొంబాయిరాష్ట్రమున సగటున రోజు 1కి 8000మంది హెచ్చిరి. సంయుక్తరాష్ట్రమున

పంచదారపరిశ్రమ యభివృద్ధియగుటవలన 10,000 మంది కార్మికులకు పనిగలిగించెను.

1931 లో స్త్రీలు 231183 మందియు, పిల్లలు 26932 మందియు ఫ్యాక్టరీలయందు పనిజేయుచుండిరి. 1932 లో స్త్రీలు 225632 మంది యు, పిల్లలు 21783 మందియు పనిజేసిరి. అనగా ఫ్యాక్టరీలయందుగల కార్మికులలో 100 కి స్త్రీలు 15.9 మందియు, పిల్లలు 1.9 మందియు గలరు. 1931 లో 100 కి స్త్రీలు 16.2 మందియు పిల్లలు 1.9 మందియు, గలరు. స్త్రీలును పిల్లలును పనిజేయుట కొలదిగ తగ్గినది. పిల్లలచే పని జేయించుట క్రమక్రమముగ తగ్గుచున్నది. నారమిల్లులలో వంగదేశ మున 1931 లో 3462 మందిగలరు. 1932 లో 1515 మందియేకలరు. 1926 లో 26474 మందిపిల్లలు గలరు. పిల్లలచేత పనిచేయించుట క్రమక్రమముగ తగ్గుచున్నను త్వరితగతిని తగ్గుటలేదు.[1]

## 18. రాక్షసిబొగ్గు-పెట్రోలు.

పరిశ్రమలను నడుపుటకు రాక్షసిబొగ్గు, పెట్రోలు అత్యావసర ములు. వీనిసమృద్ధిలేనిదే యేయంత్ర పరిశ్రమయు పెంపొంద జాలదు. రాక్షసిబొగ్గు యుత్పత్తి 1919 వ సంవత్సరము వఱకు నొక సంవత్స రముకంటె మఱొక సంవత్సర మధికమయినది. ఈబొగ్గు మనదేశము నందే విస్తారము ఖర్చగుచున్నది. హిందూదేశమునకు వలయుబొగ్గును హిందూదేశమే సమకూర్చుకొనగలదు. అయినను ఉత్తరహిందూ స్థానమునకు విదేశములనుండి దిగుమతి యగుచున్నది. హిందూదేశము నుండి యితరదేశములకు బొగ్గుఎగుమతి చాలతగ్గింపబడినది. యుద్ధము

1. *From Govt. of India's Review of Factories in India 1933*

నకు పూర్వపు ఎగుమతిలో నేడు మూడవవంతగు బొగ్గుగూడ నెగు మతియగుటలేదు. 1919 నుంచియు హెచ్చురాక్షసిబొగ్గు త్రివ్వబడక పోవుటయు, త్రివ్వినబొగ్గయిన నితరదేశముల కెగుమతికాక ఎగు మతులు తగ్గుటయు, రాక్షసిబొగ్గు కంపెనీలు లాభముల నతిస్వల్పముగ పంచిపెట్టుటయు నీమూడుకారణముల బట్టిచూడ రాక్షసిబొగ్గుపరి శ్రమ నానాటికి వెనుకంజ వేయుచున్న దనదగును. 1922 వ సంవత్స రమున 288 జాయింట్ స్టాక్ రాక్షసిబొగ్గు కంపెనీలు గలవు. 11,37 లక్షల మూలధనముతో పనిచేయుచున్నవి. ఇందులో వాటాలమీద 132 కంపెనీలు 889 లక్షల రూపాయల పెట్టుబడితో పనిచేయు చున్నవి. ఇందు 62 కంపెనీలు లాభముల బ్రకటింపలేదు. 7 క్రొత్త కంపెనీలులాభముల బ్రకటింపలేదు. 8 కంపెనీలుమాత్రమేలాభములను బాగుగ పంచిపెట్టినవి. 100కి రూ. 60 మొదలు 145 వఱకులాభమును పంచిపెట్టినవి. 7 కంపెనీలు 100కి 35 రు. మొదలు రు 50 వఱకును మిగత 48 కంపెనీలును 100 కి 1⅞ మొదలు 300 వఱకు మాత్రమే పంచిపెట్టినవి. 1928 లో 99 కంపెనీలలోను 45 కంపెనీలు లాభము పంచిపెట్టలేదు. 5 కంపెనీలు 100కి 60 రూ. లును 10 కంపెనీలు 100కి 35 రూ. మొదలు 50 ల వఱకును మిగతా 39 కంపెనీలు 100 కి 2½ మొదలు 22½ వఱకు మాత్రమే లాభముల నీయగలిగెను.

కూలి తక్కువగనున్ననుగూడ 1919 వలె విశేషలాభము లొసగకపోయినవి. యుద్ధకాలమున ఇగ్లండునుండి రాక్షసిబొగ్గు దిగు మతికాలేదు. యుద్ధమునకు పరిమితిలేని బొగ్గు కావలసియున్నది. వంగ దేశమునం దధికముగ బొగ్గు త్రవ్వబడెను. దక్షిణాఫ్రికానుండి విశేష ముగ నెగుమతియయినది. ఈ రెండురీతుల ప్రభుత్వ మానాడు బొగ్గు నకు కఱవులేకుండ గట్టెక్కెను. దిగుమతి బొగ్గుపై టన్ను 1కి 0-8-0

పన్ను విధింపబడెను. ఈ స్వల్పమగు పన్ను దిగుమతుల నాపజాలదు. మఱియు నెగుమతులపై ప్రభుత్వ మధికారము వహించినది. నిర్ణీత లాభములతో మనదేశమందలి బొగ్గు నంతయు ప్రభుత్వమునకే యీయవలసినదని శాసించెను. అందుచే విదేశముల కెగుమతిచేయు టకు వీలులేకపోయెను. యుద్ధము ముగిసినది. యుద్ధము ముగిసినవెం టనే యీ నిబంధన లెత్తివేసి యున్నయెడల మఱల యుద్ధమునకు పూర్వమువలెనే విదేశములతో విరివిగ వ్యాపారము చేయగలిగి యుం డెడివి. యుద్ధకాలములో ప్రభుత్వము కొనుచుండుటవలన విశేషముగ త్రవ్వవలసివచ్చెను. యుద్ధానంతరము ప్రభుత్వమున కవసరము లేక పోయెను. యుద్ధమునకు పూర్వమువలెనే విదేశముల కెగుమతిచేయ వలెనన్న చేయుటకు వీలులేకుండ నిబంధనలు గావింపబడెను. రైల్వె కంపెనీలు ఓడల కంపెనీలు ఒకదానితో నొకటి బ్రిటిషు వర్తకలాభ మునకై యొడంబడికల గావించుకొనుట సహజము. మరల బ్రిటిషువారి బొగ్గు దిగుమతులకు పలయుసాధనముల నరయవలసివచ్చెను. ఇంతలో 1920 సంవత్సరమున హిందూదేశప్రభుత్వము రాక్షసిబొగ్గు ఎగుమతిని శాసింప ప్రారంభించెను. ఎగుమతులకు ప్రభుత్వలైసెన్సు పొందుట విధి గావించిరి. అంతకుపూర్వము బెంగాలురైల్వేకంపెనీలు బొగ్గున కిచ్చు సౌకర్యముల నెత్తివేసిరి. రైల్వె కంపెనీలవారు ఎగుమతులకు కావలసిన సామానుపెట్టెలను (Wagons) సక్రమముగా సప్లయి చేయుట మానిరి. 1925 సం॥ నియమింపబడిన బొగ్గువిచారణసంఘము వారి రిపోర్టులో బెనర్జీగా రీయెగుమతుల నిషేధమును ఖండించిరి.[1]

వీరిమాటను ప్రభుత్వము లక్ష్యపెట్టలేదు. ఎగుమతు లతిస్వల్ప ములైనవి. కొలంబో, పడను, సాబాంగ్ (Sabang), సింగపూరులకు

---

[1] *See Report of the Indian Coal Committee 1925 Vol. 1, P. 8 Minute of Dissent by M. Benerjee.*

మాత్రము కొలది యెగుమతుల కనుజ్ఞనొసగిరి. అందుచే 1919 లో 21.7 మిలియనులబొగ్గు త్రవ్వబడెను. 1920 సం॥న 17 మిలియనుల టన్నులు మాత్రమే త్రవ్వబడెను. పిమ్మట ప్రభుత్వమువారు ఏడను, సింగపూరు, సాభాంగులకుగూడ నెగుమతిచేయ నిషేధించిరి. కొలంబోకు పోవుటకూడ నిషేధించిరి. సిలోనుగవర్నమెంటు రైళ్ళకు కావలసినంత మాత్రమే యెగుమతిచేయనిచ్చిరి. మఱియు ఓడరేవులలో నిలవయుంచుటగూడ నిషేధింపబడెను. ఈనిషేధమువలన విదేశవర్తకులు తమబొగ్గు దిగుమతిచేయుట వెనుకటివలె ప్రారంభించిరి. ఇంగ్లండు మొదలగు దేశములు యుద్ధమునకు పూర్వస్థితిని, మరల హిందూదేశమునందునను నితర దేశములయందునను, గూడ బొగ్గువర్తకమునందుపొందగలిగెను. హిందూదేశపు బొగ్గువర్తకులు తమ కాతాలనన్నింటిని గోల్పోయిరి. 1928 సం॥ వచ్చునరికి వంగదేశపుబొగ్గు విదేశపు బొగ్గుతో పోటీకినిలవజాలని స్థితికి తేబడెను. రంగూను మదరాసులలో గూడ విదేశపుబొగ్గు (ఇంగ్లండుబొగ్గు) చెలామణీయయినది. బొంబాయికరాచీల బజారులను ఇంగ్లండు దక్షిణాఫ్రికాలబొగ్గు విస్తారముగ నాక్రమించెను. తూర్పు దక్షిణాఫ్రికాలబొగ్గు ఇండియాబొగ్గుకంటె ప్రశస్తమైనదికాదు. నెటాల్, ట్రాన్సువాలు, జపానుల, బొగ్గుకంటె ఇండియాబొగ్గే ప్రశస్తమైనది. అయినను ప్రభుత్వమువారి బుద్ధిపూర్వకమగు చర్యవలన బొగ్గువర్తకము పాడయిపోయినది. ఇట్టివర్తకమును కోల్పోవుటకు ప్రభుత్వమువారు ఎగుమతిపై విధించిన నియమములే యనుట నిస్సంశయము. ప్రభుత్వము బుద్ధిపూర్వకమగు చర్యవలన బొగ్గుపరిశ్రమ నధోముఖము పట్టించియు దాని కెట్టిసహాయమును చేయలేదనుటకు మఱొక నిదర్శనముగలదు.

దక్షిణాఫ్రికానుంచి దిగుమతియగుచున్న బొగ్గుపై మామూలుగనున్న 0—8—0లును గాక మఱికొంతపన్ను విధింపవలె నని హిం

దూదేశవర్తకులు కోరిరి. 1924 లో నియమింపబడిన టారిఫ్‌బోర్డున (Tariff Board) కీవిషయము విచారణకు పంపబడవలెనని భారతశాసన సభవారుకోరిరి. కాని ప్రభుత్వ మందుల కంగీకరించలేదు. విచారణకు పంపలేదు. ఇండియాబొగ్గును సంరక్షించుటకు దిగుమతిబొగ్గుపై పన్ను విధింపలేదు. రాక్షసిబొగ్గువిచారణసంఘమును నియమించి వారినివిచారణ జేయుమనిరి. ఈసంఘమువారు 1925సం॥లో తమని వేదికను సమర్పించిరి. ఈసంఘమువారు ఎగుమతిఖర్చులను తగ్గించవలసినదని సూచించిరి. రైళ్లమీద ఓడలమీద ఎగుమతికగుఖర్చులయం దొసంగబడు మినహాయింపు 100కి 25 లనుంచి రు 37న్నరల వఱకు హెచ్చింపవలసిన దని సూచించిరి. ఓడరేవులయందలి నిలువఖర్చులను ఎగుమతిఖర్చులను గూడ తగ్గింపవలసినదని సూచించిరి. కలకత్తాసముద్రమునందున్న ఓడరేవు కాకపోవుటచే హుగ్లీ నదినుండి స్టీమర్లమీద గొంపోవలసియున్నది. ఈవిషయమున వారెట్టిసూచనలను గావించనేలేదు. బొగ్గుగనులను పరీక్షించి తరగతులక్రింద ప్రభుత్వము విడదీసి ఆయాతరగతులకు ధృవపత్రము నొసంగవలెననియు, అట్టిధృవపత్రములను పొందిన కంపెనీలకే పై మినహాయింపులు వర్తించు ననియు సూచించిరి. (Grading Board) ఈసూచనను ప్రభుత్వ మంగీకరించి, 1925లో శాసనము గావించి, 1926 సంవత్సరము లో గ్రేడింగ్ బోర్డును స్థాపించిరి. రైల్వేకంపెనీలు, పోర్టుట్రస్టులు గూడ నీసూచనల నంగీకరించెను. ఈఅంగీకారము రాక్షసిబొగ్గుపరిశ్రమాభివృద్ధికి గల దృష్టితోకంటె స్వలాభదృష్టితోనే చేయబడెను. ఇట్లు మినహాయింపు రేట్లకెగుమతిచేయుటవలన తగ్గుడబ్బుకంటె, రాక్షసిబొగ్గు ఎగుమతితగ్గుటవలన వచ్చు నష్ట మధికముగ నుండుటయే ప్రభుత్వమును రైల్వేకంపెనీలు తగ్గింపురేట్ల నంగీకరించుటకు కారణము. 1926వ సంవత్సరమునం దీవిషయమును నిరకునామాసంఘమువారు విచారించిరి.

బొగ్గుపరిశ్రమసంరక్షింపబడుటకై దిగుమతిబొగ్గుపై సుంకమును విధించుచో అధికోత్పత్తికి సహకారముగనే యుండునని యంగీకరించిరి. కాని దక్షిణాఫ్రికాబొగ్గుపైన దిగుమతిసుంకములను విధించుట అనవసరమనిరి. ఒకసభ్యుఁడుమాత్రము "విదేశపుబొగ్గుపై పన్నువిధించి భారతదేశమున బొగ్గుపరిశ్రమను సంరక్షించుట అత్యవసర"మని[1] వ్రాసెను.

ఈయనవ్రాతను ప్రభుత్వము పాటింపలేదు. రాక్షసిబొగ్గు కమిటీవారు బొగ్గుత్రవ్వుటలో నగుచున్న యదనపుఖర్చునుగూడ గుర్తించిరి. యుద్ధమునకు పూర్వమునకంటె 1924 లో ఖర్చులు 100 కి 50/-లు పెరిగెను. 1922 లో గావింపబడిన గనులచట్టము 1924 లో గావించబడిన బోయలరు చట్టములవలన పనివాండ్ర ముదరాచట్టముల వలనను జీతములు, కూలిబత్తెములు హెచ్చుచేయుటవలనను నితర ఆరోగ్య పారిశుద్ధ్యవిషయములవలనను ఖర్చులు పెరిగెను. ఈఖర్చుల యందు తగ్గించుటకు వీలులేదు. రాక్షసిబొగ్గును త్రవ్వుటయందునను త్రవ్వినదానిని రైళ్ళలోనికి మోసికొనిపోవుటయందునను నగుఖర్చులను తగ్గించుటకు సావకాశములున్న వని కమిటీవారు సూచించిరి. ఆధునికయంత్రములచే విశేషముగ త్రవ్వవచ్చును కాని యీత్రవ్విన బొగ్గు వెంటనే ఎగుమతికావలెనన్న రైలుపెట్టెలు సకాలమున సను కూర్చుచుండవలెను. మఱియు త్రవ్వినబొగ్గును భూగర్భమునుండి పైకి మోయుటయు నిల్వచేయుటయు ఆనిలవచోటనుంచి మఱల రైలు పెట్టెలలో నెత్తిపోయవలసి వచ్చుటయు నీకారణములచే కూలి యధికముగ నగుచున్నది. అగ్నిప్రమాదములు సంభవించుచున్నవి. ఇట్లు

---

1. *Report of the Tariff Board on Coal Industry, 1926.*

గాక రైలుపట్టాలు గనులవఱకు వేయబడుచో అదనపుకూలి, తరుగు, ప్రమాదములు నేమియునుండవు. కాని రైల్వేకంపెనీవారు ఆధునిక యంత్రముల నుపయోగించుటకువీలుగ సకాలమున పెట్టెలసరఫరా చేయుటలేదు. గనులవఱకు రైలుమార్గములను వేయుటలేదు. అందుచేత నీఅదనపుఖర్చు భరించుట తప్పనిసరి యగుచున్నది. అధికోత్పత్తికిని ఎగుమతికినిగూడ సౌకర్యములు లేవు. ఇందులకుతోడుగ వేఱువేఱు గనులు వేఱువేరుకంపెనీలచే నడుపబడుటకూడ నొకఅనర్థకమే. 1923 లో 827 ప్రత్యేకపుగనులు బెంగాలు బీహారులయందు గలవు. ఇందు సగటున 17.8 టన్నులబొగ్గును, లేక 21560 టన్నులు గని 1 కి త్రవ్వబడుచున్నది. దక్షిణాఫ్రికాలో 69 గనులలో 10.6 మిలియనుల టన్నులు లేక గని 1 కి 154000 టన్నులు త్రవ్వించుచున్నారు.

ఇందువలన రైలుపెట్టెలు [illegible] పోవుటయేకాక ఖర్చులు గూడ అధికమగుట సహజము. [illegible] కలసి పనిచేయుచో సక[illegible] [illegible]. కాని [illegible] సహకారము నంగీకరించవు. [illegible] కార్యములలోనికివెడలి స్త్రీపురుషులు [illegible] పనిచేయుచున్నారు. స్త్రీలను భూగర్భములలో [illegible] పనిచేయుట [illegible] నిషేధించు చట్టము భారతశాసనసభలో ప్రవేశపెట్టబడెను. [illegible] శాసనము గావింపబడలేదు. హిందూదేశమందలి కూలీలు ఇతరదేశములకంటె గనులలోపల తక్కువపని చేయుచున్నట్లీ క్రిందిన పట్టిక తెలుపుచున్నది.

| | తల 1కి ఉత్పత్తి టన్నులు | సంవత్సరములు |
|---|---|---|
| బ్రిటిషు దీవులు | 178 | 1921 |
| ఫ్రాన్సు | 208 | 1919 |
| బెల్జియము | 193 | 1921 |
| జపాను | 136 | 1921 |
| ఇండియా | 162 | 1921 |

"భూగర్భమున పనిచేయువారిని, పైన పనిచేయువారిని కూడ కలిపి మదింపువేయుచో, 1921 లో 94 టన్నులే తల 1 కి తీసినట్లు తేలును[1]

ఇట్లు తక్కువతీయుటకు కారణమేమి? కార్మికుని సోమరితనము కారణముగాదు. పనిచేయుటయందభీష్టము లేకగాదు అంతకంటె పని చేయుట కాతనికి శక్తిలేదు. అనారోగ్యము, రోగము, అర్ధాకలియు గలిగి పనిచేయవలసిన కార్మికు డంతకంటె హెచ్చుగ నెట్లు పనిచేయ గలడు? ముఖ్యముగ నీగనులపనివాండ్ర జీవితములు దుర్భరము! దుర్భరము! యజమానులు వీరి ఆహార విహార ఆరోగ్య విషయముల కెక్కుడు శ్రద్ధవహించినచో వీ రధికబలవంతులయి అదనపుపని చేయ గలుగుదురు. ఇట్టి సంస్కరణములను యజమాను లొనరించి, విదేశవర్తకపుదృష్టిని ప్రభుత్వమువీడి, ప్రతిఘటనల తొలగించి సంరక్షణవిధానము నవలంభించుచో బొగ్గుపరిశ్రమ అత్యధికాభివృద్ధి పొందగలదు. విదేశములనుండి యొక్కబొగ్గుకణమైన దిగుమతికా నవసరములేకయే భారతజాతి అనేకసంవత్సరములు స్వదేశపుబొగ్గుతో సంతృప్తులై పరిశ్రమల నభివృద్ధి పఱచుకొనుటకు వీళ్ళు గలవు.

1- *From Vera Anstey's Economic Development of India P. 240*

హిందూదేశమునండి జరుగుచున్న రాతిసిబొగ్గు ఎగుమతుల నీపట్టిక తెలుపును.

12 నెలలకు-1వ ఏప్రియలు మొదలు 31 మార్చి వఱకు.

టన్నులు

| 1932-33 | | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|
| 31529 | బ్రిటిషు దీవులు | 19550 | 8057 | 11955 |
| 169081 | సింహళము | 340730 | 295767 | 272680 |
| 20550 | స్ట్రెయిట్సు సెటిలుమెంటు | 59013 | 25158 | 22778 |
| 188571 | హాంకాంగు | 172658 | 55944 | 162265 |
| 8278 | ఫిలిపైను దీవులు | 57868 | 32985 | 37007 |
| 34064 | ఇతర దేశములు | 35440 | 10259 | 8432 |
| 452073 | మొత్తము | 685259 | 428170 | 515117 |
| 2136 | కాలిన బొగ్గు | 2372 | 1520 | 1870 |

హిందూదేశమునకు విదేశములనుండి దిగుమతి యగుచున్న రాతిసిబొగ్గుదిగుమతుల నీపట్టిక తెలుపును.

1 వ ఏప్రియలు 31 మార్చి వఱకు

టన్నులు

| 1932-33 | | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|
| 15994 | బ్రిటిషు దీవులు | 18812 | 23245 | 23760 |
| 13516 | దక్షిణాఫ్రికా | 197404 | 121533 | 23241 |
| ... | తూర్పుఆఫ్రికా. పోర్చుగీసు | 150 | 5061 | ... |
| 3015 | ఆస్ట్రేలియా | 1840 | 1455 | 3805 |
| 2275 | ఇతరదేశములు | 6020 | 4394 | 4813 |
| 34800 | మొత్తము | 224226 | 155688 | 55619 |
| 12678 | కాలినబొగ్గు | 12762 | 22866 | 12144 |

ప్రతిసంవత్సరమునగల రాక్షసిబొగ్గుఉత్పత్తిని ఈపట్టిక తెలుపును.

PRODUCTION YEAR BY YEAR.

| సంవత్సరము | | | టన్నులు |
|---|---|---|---|
| 1920 | ... | ... | 17962214 |
| 1921 | ... | ... | 19303947 |
| 1922 | ... | ... | 19010986 |
| 1923 | ... | ... | 19656883 |
| 1924 | ... | ... | 21176606 |
| 1925 | ... | ... | 20900088 |
| 1926 | ... | ... | 20999167 |
| 1927 | ... | ... | 21082336 |
| 1928 | ... | ... | 22542842 |
| 1929 | ... | ... | 23418734 |
| 1930 | ... | ... | 23803048 |
| 1931 | ... | ... | 21716435 |

ప్రతి దశకమునగల ఉత్పత్తిని ఈ పట్టిక తెలుపును.

PRODUCTION AT THE END OF EACH DECADE.

| సంవత్సరము | | | టన్నులు |
|---|---|---|---|
| 1880 | ... | ... | 1019793 |
| 1890 | ... | ... | 2168521 |
| 1900 | ... | ... | 6118692 |
| 1910 | ... | ... | 12047416 |
| 1920 | ... | ... | 17962214 |
| 1929 | ... | ... | 23418734 |
| 1930 | ... | ... | 23803048 |

*From Indian Finance year Book 1933.*

ఈ పట్టికలననుసరించి 1932-33 సంవత్సరమునకు ఎగుమతి విస్తారముగ దిగజారెనని తెలియుచున్నది. దక్షిణాఫ్రికానుండిదిగుమతి యగు రాక్షసిబొగ్గుతో హిందూదేశపు రాక్షసిబొగ్గు బొంబాయి యందు పోటీచేయవలసియుండెను. దక్షిణాఫ్రికాయందు రాక్షసిబొగ్గు పరిశ్రమయు, ఆప్రభుత్వమును కలిసిమెలసి పనిచేయుచున్నవి. దక్షిణా ఫ్రికాయందు రైళ్లు ప్రభుత్వమువారి ఆస్తి. రైల్వేరేట్లను తగ్గించి పరిశ్రమ సంరక్షింపబడుచున్నది. దేశాంతర్గతవ్యాపారమునకొక రీతి పద్ధతిగను, హిందూదేశము మొదలగు విదేశముల కెగుమతియగు రాక్షసిబొగ్గుపై నొకవిధముగను రేట్లను నిర్ణయించుట దక్షిణాఫ్రికా యందు పరిపాటిగనున్నది. ఇందువలన బొంబాయికి చౌకగ దిగుమతి యగుచుండుటచే, బొంబాయి మిల్లులు విదేశబొగ్గునే వాడుచున్నవి. కాని స్వదేశోద్యమమువలన బొంబాయివారుకూడ హిందూదేశపు రాక్షసిబొగ్గునే వాడుట ప్రారంభించిరి. కాని, ఆయా రైల్వే కంపెనీలు తమకు దగ్గఱగనుండు గనులనుండి రాక్షసిబొగ్గును తెప్పించుకొనుచుం డుటచేతను మధ్యఇండియా పశ్చిమహిందూదేశములలోని యంత్రాల యములుకూడ దగ్గఱగనుండు గనులనుండి తీసికొనుచుండుట వలనను బీహారు, ఒరిస్సా, బెంగాలు రాక్షసిబొగ్గును విదేశములకెగు మతి చేయుటయే కర్తవ్యమాయెను. 192[illegible] వ సంవత్సరమున రాక్షసి బొగ్గు కంపెనీల అధికారులు కలకత్తాయందొక సభను చేసిరి. ఈ సభయందు వివిధతరగతుల రాక్షసిబొగ్గు అమ్మవలసిన కనిష్ఠపు ధరను నిర్ణయించిరి. ఈ నిర్ణయము ననుసరించి దేశాభివృద్ధికి వ్యతి రేకములేక బొగ్గు ధరలు అన్నికంపెనీలకును లాభకరముగ హెచ్చి నవి కాని, యంతలో ఆర్థికదుస్థితి ప్రబలెను. ఈనిర్ణయమును ఆయా కంపెనీ లాచరింపక వీడెను. ఇందులకు తోడుగ 1932-33 వ సంవత్స రమున రాక్షసిబొగ్గు రైలురేట్లపై 100కి రు 15-0-0 లు అధికముగ

శుల్కము విధింపబడెను. ఇందువలన వంగదేశపు రాక్షసిబొగ్గునకు ధర పెరిగి ఎమ్. ఎస్. ఎమ్ రైల్వే కంపెనీవారును, జి.ఐ.పి., బీ. బి. పి. ఐ రైలు కంపెనీలును కొనుటకు వీలులేకపోయెను. హిందూదేశము నందుగల రాక్షసిబొగ్గు కంపెనీలన్నియు సమానముగ నభివృద్ధిపొందు మార్గముల నరయుటయే కర్తవ్యము.

## 19. బర్మాగనుల నూనెలు.

బర్మానుండియే గనులనూనె వింతగ తయారుచేయబడి ఎగుమతి యగుచున్నది. ఈ ఖనిజతైలములు బర్మాఆయిలు కంపెనీవారి స్వాధీనమందున్నవి. (Yongaung gang field) ఎంగు యంగ్ గాంగ్ నందలి నూనెగనులలో విద్యుద్దీపములు ప్రవేశపెట్టబడినవి. (Singu) నూనెగనులలో ప్రవేశపెట్టబడుచున్నది. బర్మాఆయిలుకంపెనీ ప్రాముఖ్యమగు ఓడరేవులయందు నూనెచెఱువులుకట్టి నూనె నిల్వచేయుచున్నది. రంగూనునందున్న బాగుచేయుచెఱువులలోనికి గనులనుండి (పయిపులు) గొట్టములున్నవి. నూనెచెఱువులున్న యోడలుగూడ గలవు. ఈకంపెనీవారు కిరసనాయిలురూపముగ నూనెనుపంపుచున్నారు. 1925-26లో 152,000,000 గాలనుల కిరసనాయిలు ఇండియాకు ఎగుమతిచేసిరి. (బర్మానుండి) ఇంగ్లండునకు 8,200,000 బెన్జిను, పెరాఫైను, ఇతర తేలికనూనెలు ఎగుమతిచేసిరి. ఈకంపెనీ ఆంగ్లేయులది. ఇష్టమువచ్చినట్లు రేట్లుహెచ్చించి లాభములనుపొందుట కలవాటుపడిరి. నేడుదేశమునందు కిరసనాయిలునూనె వాడకము హెచ్చినది. ఆకంపెనీధరలు సక్రమముగనుండునట్లు జూచుట ప్రభుత్వపువిధి. అట్లుచూడకపోవుటచే 1928లో రష్యాదేశపునూనె ఇండియాయందు వ్యాప్తిచెందినది. 1926-27 లో బర్మాకంపెనీవారినూనె 138,000,000 గాలనులుమాత్రమే ఇండియా

కుదిగుమతిజరిగెను. 1927–28 లో 127,000,000 గాలనులకుతగ్గినది. 1927-28 లో విదేశముల ఎగుమతికూడ 2,900 గాలనులకు జారినది. ఈస్థితి కంపెనీకిని ప్రభుత్వమునకునుగూడ కంగారుపుట్టించినది. విదేశములనుండి దిగుమతియగుసరానుపై పన్నువిధింపవలెనని ప్రయత్నించిరి. కంపెనీవారట్టి సంరక్షణనుకోరిరి. కాని ప్రజాప్రతినిధుల నిరంతరాందోళనమునకు వెఱచి నిరకునామాసంఘమువారాసలహా నొసగజాలకపోయిరి. ప్రభుత్వ మట్టిపన్ను విధింపసాహసింపలేదు.

## 20. ఇనుము-ఉక్కు-పరిశ్రమ.

1875 సం. లో వంగదేశమున రాణీగంజివద్ద బెంగాలు ఉక్కు-ఇనుముకంపెనీ స్థాపింపబడెను. ఈకంపెనీవారు 1903 లో ఉక్కును తయారుచేయవలెనని ప్రయత్నించిరి. కాని మఱుసంవత్సరమే ప్రయత్నమును విరమించుకొనవలసినవారైరి. భరింపజాలని నష్టమునకు పాత్రులైరి. సహాయము లభింపలేదు. 1919 లో నీకంపెనీవారు హెచ్చుపెట్టుబడితో బెంగాలు ఇనుముకంపెనీయను పెరనునల ప్రారంభించిరి. అయినను విజయము పొందజాలక పోయిరి. యుద్ధకాలమునుండియు నిట్లే కొన్నికంపెనీలు బయలుదేఱినవిగాని నిరుపయోగములైనవి. తాతా అయిరన్ (Iron) కంపెనీమాత్రమే వీనిలో పెద్దగానపనిగినది. బొంబాయికాపురస్థులైన జామ్‌షెడ్జీతాతా (Jamshedjee Tata) గారు బహు వ్యయప్రయాసములకు లోనై యీపరిశ్రమ రహస్యములను గ్రహించిరి. అమెరికాదేశమునుండియు, ఐరోపాఖండమునుండియు నిపుణులను రావించి బీహారు బెంగాలు దేశములయందలి ఇనుపపరిశ్రమకు వీలగు వివిధపరిస్థితులను బరీక్షచేయించిరి. ఈపరీక్షకు రు 550000 లు వ్యయ మొనరించిరి. 1903 లో తాతాగారు స్వర్గస్థులైరి. 1907 లో

తాతాగారికుమారులు తాతా ఐరన్ అండ్ స్టీల్ కంపెనీని స్థాపించిరి. (Tata Iron and Steel Company). ఈకంపెనీకి రు 23175000 లు మూలధనముగ నిర్ణయింపబడెను. ప్రత్యేకించి భారతీయులమూలధనముతో స్థాపింపబడిన ముఖ్యపరిశ్రమ యిదియే. కలకత్తాకు పశ్చిమ భాగమున 155 మైళ్ళదూరమునందుగల చోటానాగపూరులోని సకచి యను (Sakchi) పల్లెయందు యంత్రములు నిర్మింప మొదలుపెట్టిరి. ఉక్కు తయారుచేయుటకు వలయు ముడిపదార్థముల ప్రోగు జేయుటకీపల్లె సదుపాయముగనున్నదని యేర్పఱచుకొనిరి. ఇచ్చటకు 155 మైళ్ల దూరమునందుగల జెరియా బొగ్గుగనులనుంచి బొగ్గు తెప్పించుకొనుచు వచ్చిరి. ఇచ్చటకు 45 మైళ్ల దూరమునందున్న యీ కంపెనీవారి గురుమాయిషీయిని (Gurumaishini) ముడియినుము, యంత్రశాలలనుండి ముడిఇనుమును తెప్పించుకొనుచుండిరి. ఇట్లే చుట్టుప్రక్కలనుంచి ప్రశస్తమగు నితర సాధనసామగ్రులు సేకరింపబడినవి. 1911 లో ఇనుమును తయారు చేయుటయు, 1913 లో ఉక్కును తయారుచేయుటయు ప్రారంభించిరి. ఈ యూరినే తాతాగారి స్మారకచిహ్నముగ జెమిషదుపూరు అని మార్చి వ్యవహరించుచున్నారు. ఈ పల్లె క్రమక్రమముగ పెరిగి బస్తీ అయినది. ఈబస్తీఅంతయు కొంచె మించుమించుగ నీ కంపెనీవారికే చెందినది. ఈ పరిశ్రమకు సంబంధించిన అనుబంధ పరిశ్రమలుగూడ చుట్టుపట్ల నడుపబడుచున్నవి. ప్రప్రథమమునుండియు నీ కంపెనీవారు ప్రశస్తమగు ఇనుమును తయారుచేయుచున్నారు. ప్రభుత్వముచే నడుపబడు రైళ్లకు సాలు 1కి 10 సం॥లవఱకు 20,000 టన్నులు ఉక్కుపట్టాలను కొనుటకు ప్రభుత్వ మేర్పఱచుకొనెను. విదేశముల నుండి దిగుమతియగు ధరలకే తాతాకంపెనీవారుగూడ ఇచ్చునట్లుగ ప్రభుత్వ మేర్పఱచుకొనెను. ఈ యేర్పాటువలన చిరకాలమునుండియు

వాణిజ్యమునందున్న విదేశపుకంపెనీలతో మొదటినుంచియు సమాన ధరలతో పోటీచేయవలసినస్థితియందుండవలసి వచ్చినది. పరిశ్రమ శీఘ్రాభివృద్ధి పొందజాలకపోయినది. ఈ పరిశ్రమకు వలయు ముడిపదార్థములు రైళ్లమీద తెచ్చుకొనుటకై ప్రభుత్వమువారు మైలు 1కి అణాలో 1.5 వ వంతు చార్జి జహాజుప్రయాణమునకు తగ్గించిరి. కలకత్తా నుంచి ఓడలకు పంపు సరకులకైగూడ నిట్లే తగ్గించిరి. ఈ యంత్రాగారములు 120,000 టన్నుల మూసలోనుండి తీసిన ఇనుమును, ఇందులో 85,000 టన్నుల ఇనుమును, 72,000 టన్నుల ఉక్కుక్రింద తయారుచేయుటకును మాత్రమే ఏర్పాటుపడినది. ఆకాలమున ప్రతిసాలున 450,000 టన్నుల ఇనుప ఉక్కుసామానులు విదేశములనుండి దిగుమతియగుచుండెడివి. ఇందువలన ఉత్పత్తికంటె వినియోగ మధికముగనున్నదని తేలును. 1913వ సం॥ వఱకు యీకంపెనీవారు రూ 8,58,583 లు లాభము సంపాదింపగలిగిరి. 9,000 మంది కూలీలు పనిచేయుచుండెడివారు. ఇందులో 125 మంది తెల్ల ఇంజనీరులు, నిపుణులనబడు మేస్త్రీలు గలరు. యుద్ధకాలమున ఇనుము ఉక్కులకు కలిగిన యిబ్బంది వలన నీకంపెనీవారు విశేషలాభము పొందవలసినవారే. ఇంగ్లండునందలి కంపెనీ లాకాలమునందపరిమితలాభములను సంపాదించినవి. టాటాకంపెనీ తక్కువధరలమీద ముందట గవర్నమెంటుతో 10 సం.లకు గావించిన కంట్రాక్టువలన లాభములను సంపాదించుటకు వీలులేకపోయెను. 1916-17 సం॥లలో నీకంపెనీవార యంత్రములు పూర్తిగనుత్పత్తి చేయుచున్నను నీయంత్రముల నభివృద్ధి గావించుటకు వీలు చిక్కలేదు. 1920–21 సం॥న పూర్తిగావింపవలసిన యభివృద్ధులు 1925 సం॥ వఱకుకూడ పూర్తిగావింప లేకపోయిరి. ఇందులకు ప్రభుత్వ ఆర్థికనీతియే కారణము. మఱినాలుగు ఉక్కుతయారుచేయు యంత్రశాలలను నిర్మింపవలెనని ప్రయత్నించిరి. ఈనాలుగు యంత్రశాలలను

గూడ నిర్మించియున్నచో సం॥ 1కి 1,500,000 టన్నుల మూసనుండి తీసిన ఇనుమును 10,00,000 టన్నుల ఉక్కును తయారు చేయగలిగెడివి. ఆనాడు ఇనుము ఉక్కుసామానులకున్న వర్తకసరళి లాభదాయకముగ నున్నది. 1922 లో ప్రభుత్వము తన ఆదాయమును వృద్ధిచేసికొని ఆదాయవ్యయపట్టికను సరిచేసికొనుటకు గాను ఇనుపసామగ్రుల దిగుమతిపై సుంకమును 100 కి రూ 10 ల నుండి రూ 15 లకు హెచ్చించెను. "అయినను విదేశవర్తకుల కిది రవంతయు కష్ట మనిపించ లేదు."[1]

ఏలయన తాతాకంపెనీవారి సరకు తక్కువధరమీద ప్రభుత్వమునకే యిచ్చివేయవలసి యున్నది. క్రొత్త యంత్రాలయముల నిర్మించి అధికోత్పత్తిచేయుటకు వీలొసగబడలేదు. విదేశదిగుమతిని పోటీ చేయగల స్వదేశపుసరకు లేదు. దిగుమతులపై విధించిన యీఅదనపు సుంకమును స్వదేశపరిశ్రమ సంరక్షణకు వినియోగింపక ప్రభుత్వమే వినియోగించుకొనెను.

1921—22 వ సంవత్సరము వచ్చినది. ఈపరిశ్రమ నూతనాభివృద్ధిచెందుటకు మాఱుగ వెనుకపట్టుట ప్రారంభించెను. లోగడ నిర్మింపదలంచిన నూతన యంత్రాలయములయూహ లడుగంటినవి. యుద్ధమునకుపూర్వము దిగుమతిసరకుధరలు చాల తక్కువగనున్నవి. టన్ను 1కి రూ. 105లచొ॥ ఇనుపపట్టాలు ఇంగ్లండునుండి యిండియాలో దిగుమతి యగుచుండెడివి. ఇతర ఇనుపసరకులు రవంత హెచ్చుధరకు దిగుమతియయ్యెడివి. ఆకాలమున , తాతాకంపెనీవారిధరలతో పోటీకి ఆగగలిగిరి. అప్పుడు తయారుచేయుటకగుఖర్చులు తక్కువగనుండెడివి. కాని యుద్ధకాలమున ఖర్చులధికమైనవి. అయినను ప్రభుత్వమునకు టన్ను 1కి రూ. 150 ల

---

1 *See P. P. Pillai : Economic conditions in India P. 277.*

మీదనే కంట్రాక్టు ననుసరించి యమ్మవలసివచ్చెను. విదేశములనుండి దిగుమతియగుసరకు టన్ను 1కి రు. 3400 మొదలు రూ. 350- వఱకు అమ్మెను. ఇట్లు బొంబాయి, బరోడా, సెంట్రలుఇండియా రైల్వేకంపెనీలు కొనినవి. ఈహెచ్చురేట్లకు అమ్ముటకు టాటాకంపెనీవారికి పూర్వపుకంట్రాక్టులవలన సావకాశములేకయు, నుత్పత్తియం దధికముగ నగు ఖర్చులవలనను (యుద్ధకాలమున) విశేషలాభముల బొందజాలకపోయిరి. 1921సం॥రము వచ్చుసరికి హిందూదేశమునందలియుత్పత్తిఖర్చులత్యధికమైనవి. ఈవిదేశపుసరకులదిగుమతిఖరీదు తగ్గుగనున్నది. 1921-22 సం॥న టాటాకంపెనీవారిలాభములు 100కి రూ. 4—0—0లు మాత్రమే. 1922-23 లో లాభములు పంచిపెట్టుటకు వీలే లేకపోయెను. మొదటితరగతి వాటాదార్లకు మాత్రమే స్వల్పముగ నొసగబడెను. 1923-24 సం॥న మొదటితరగతివారికి కూడ చిల్లిగవ్వైన పంచిపెట్టజాలకపోయిరి.

అందువలన 1924 లో కంపెనీవారి ప్రతినిధులును యునైటెడ్ ట్రాలు. కార్పొరేషను ప్రతినిధులును నిరుకనామూసంఘమువారి సాక్ష్య మొసగుచు నీపరిశ్రమకు సంరక్షణ మొసగినగాని నిలువబెట్టబడజాలదని. సంపాదించజాలమని చెప్పిరి. ప్రభుత్వమువారిచే పరిశ్రమల పరిస్థితుల గనుగొనవలెనని నియమింపబడిన నిరుకనామూసంఘము ఉక్కుపరిశ్రమను గురించి విచారించిరి. టాటాకంపెనీ దిగుమతి ఇనుపఉక్కుసరకులపై 100 కి 33⅓ రూ. గుత్తసుంకమును విధించవలెనని కోరిరి. ఈబోర్డువారుకూడ అప్పటికి ఉక్కుపైయున్న దిగుమతికిమ్మత్తు సుంకము రూ 15-0-0 లను ఇనుపపట్టాలపైనున్న కిమ్మత్తుసుంకమును రూ 10-0-0 లను రెండింతలుగగాని అంతకంటెను అధికముగగాని హెచ్చుచేయవలె నని సూచించిరి. (A note on Steel

Industry of India by Dr. Slater) అప్పుడు టన్ను 1 కి రు 140/ల మీాద ఉక్కు దిగుమతి యగుచున్నది. ఈరేటు ననుసరించి తాతా కంపెనీవారు నష్టములనురాకుండ అతిస్వల్పలాభములకైన ఉక్కున తయారుచేయవలెనన్న కనీసము రు 180 లకు టన్ను అమ్మినగాని గిట్టదు. ఈమదింపు వేసిన బోర్డువారు దిగుమతిసుంకమును రెండింతలుగ పెంచవలసినదనిరి. ఇట్లు పెంచుటవలన ప్రభుత్వమున కధికమగు రాబడివచ్చుచుండుటచే ప్రభుత్వ మంగీకరించెను. కాని ఇనుపసామగ్రులనుకొను ప్రజలకు మాత్రము దుర్భరమగు భారమైనది. ఖరీదులు హెచ్చుటవలన ప్రజలకు బాధకలుగకుండ స్వదేశపరిశ్రమను పోషింపవలెనన్నచో దిగుమతిసుంకమును విధించుటకుమాఱుగ స్వదేశపరిశ్రమకువలయు విరాళమొసగుట సమంజసము. భారతశాసనసభయందలి చర్చలో ప్రజాప్రతినిధులగు స్వరాజ్యవాదు లిట్లే వాదించిరి. వీరివాద మంగీకరించియున్నచో ప్రజలకును పరిశ్రమకునుగూడ లాభదాయకముగ నుండెడిది. ప్రభుత్వమట్లంగీకరించలేదు. 1924 లో ఉక్కు సంరక్షణశాసనము గావింపబడెను. ఈశాసనము ననుసరించి అన్నిరకములైన ఉక్కు, ఇనుపసామానులపైనను సంరక్షణసుంకములను వివిధరీతులుగ విధించుటకు ప్రభుత్వమువా రధికారము పొందిరి. ఈసుంకములలో కొన్ని కిమ్మతుసుంకములును మఱికొన్ని తూకపు సుంకములును గలవు. (Specific Duty) ఈఅధికారము ననుసరించి సుమారు 33⅓ దిగుమతిసుంకము కిమ్మతుపై విధింపబడెను. కాని దిగుమతిసుంకములవలన ఇనుపపట్టాల నిర్మాణమున కెట్టిసహాకారమును కలుగలేదు. చాలకాలమువఱకు తక్కువధరలపై పట్టాలు ప్రభుత్వమున కొసగవలసిన కంట్రాక్టుండుటవలన పట్టాలనిర్మాణమునకు కొలదిగ విరాళము నిచ్చుటకు నిర్ణయించిరి. ఇట్లే

Wagons సామానులపెట్టెలకు (Loco-motives) ప్రయాణీకుల పెట్టెలు (Steel Castings) ఉక్కుపోతసామానులు (Enamelled ware) పింగాణీసామానులకు సంరక్షణ మొసంగబడలేదు. ఏలయన ఈసరకులు ఇంగ్లండునుంచి దిగుమతియగుచున్నవి. సరకులనిల్వ (Stores) పేరున ప్రభుత్వము అనవసరముగా ప్రతిసంవత్సరము రైల్వేసామానులకు కొట్లకొలది రూపాయలను వెచ్చించుచున్నది. (ఈవిషయమై వేఱొకచో వ్రాయబడెను.)

దిగుమతికానందుచే మొత్తమున 100 కి రు 7.05 లాభమును మాత్రమే అందఱు వాటాదారులకును పంచిపెట్ట గలిగిరి. (మొదటి 16 సం॥ల యందు సగటున) 1924 లో ప్రభుత్వముగావించిన ఉక్కు సంరక్షణ చట్టముననుసరించి 3 సం. ల వఱకు సహాకారము చేయుటకును దిగుమతిసుంకముల విధించుటకును విరాళముల నొసగుటకును నిర్ణయింపబడెను. కాని ఇంతలో మారకపురేటు తారుమారైనది. 1924 సం.రపు వేసవికాలమందే రు 1 విలువ, 1 షిల్లింగు 4 పెన్సుల నుండి 1 షి. 6 పె. లకు పెంచబడెను. ఇట్లు పెరుగుట యననేమి? రూపాయవిలువ పెరిగినపుడు దిగుమతులు మనదేశమున తక్కువధరల కమ్ముటకు వీలగును. అందుచే దిగుమతి ఇనుము ఉక్కుసరకులధరలింకను తగ్గినవి. ప్రభుత్వమువారు గావించిన ఏర్పాట్లు నిరర్థకములైనవి. మరల టాటాకంపెనీవారు అధికసంరక్షణకై ప్రభుత్వమును గోరవలసి వచ్చెను. నిరకునామాసంఘమువారు మరల దిగుమతి సుంకములను రెట్టింపుమని సూచించిరి. ఇట్లు రెట్టించియున్నచో కొనుబడిదార్ల భాధకు పరిమితి యుండెడిది కాదు. నిజమే. కాని దిగుమతులుకూడ తగ్గుట సహజము. దిగుమతులు తగ్గుటచే ప్రభుత్వాదాయము తగ్గును. ప్రభుత్వాదాయము తగ్గించుకొనుటకంటె వచ్చుచున్న ప్రభుత్వాదాయములో నేస్వల్పమో విరాళములక్రింద నిచ్చుట లాభసాటిబేర

మని ప్రభుత్వము నిర్ణయించుకొనెను. అందుచేత నిరకునామాసంఘము వారిసూచన లీమాలు నిరాకరింప బడెను. తయారైనఉక్కు టన్ను 1కి రూ 20 ల చొప్పున తయారైన ఉక్కులో 100 కి 70 వంతుల ఉక్కునకు విరాళ మొసంగిరి. ఈవిరాళము 1925 సం. సెప్టెంబరు 30 వ తేదీ వఱకే యొసంగెద మనిరి. 1925 జూనుమాసమునం దీసమస్య పునర్విమర్శింప బడెను. నిరకునామా సంఘమువారు టన్ను 1కి రు 20 నుండి 18 లకు సహాయమును తగ్గింపవలె ననిరి. ఇదియు 90 లక్షలకు మించని మొత్తము 1927 సం॥రము మార్చి నెల వఱకు నొసంగదగు నని సూచించిరి. ప్రభుత్వ మీసూచన నంగీకరింపలేదు. రూ 18 లకు మారుగా రూ 20 ల నుండి టన్ను 1కి రూ 12 లకు సహాయమున తగ్గించిరి. అదియు 60 లక్షల వఱకే బాధ్యత వహించెదమనిరి. ఇందు వలన కంపెనీ దివాలాతీయకుండ సంరక్షింప బడెను. కాని విదేశపు దిగుమతులతో పోటీచేయగలిగి లాభములను సంపాదించునట్లు సహాయము గావింపలేదు. ఎట్లు గావింతురు? అట్లు హిందూదేశపు పరిశ్రమకు సహాయము గావించుచో ఇంగ్లండునుండి ప్రతిసాలున దిగుమతి యగుచున్న ఇనుము ఉక్కుసామానులగతి యేమి కావలయును.'

1924 లో గావింపబడిన సంరక్షణశాసనము 1927 వ. సం. మార్చితో అంత మొందును. ఈశాసన మంతరించులోపుగ 1926 లో నిరకునామాసంఘమువారు మరల విమర్శించి వారినివేదికను 1927 వ. జనవరిలో ప్రభుత్వమునకు సమర్పించిరి. ఇందులో తాతాకంపెనీవారు ఉత్పత్తిఖర్చులను తగ్గించుట విధియయినది. పలువురు భారతీయోద్యోగుల జీతములును, కార్మికుల కూలియు తగ్గించివేయబడెను. అయినను తాతాకంపెనీవారు తమకాళ్లపై తాము నిలువజాలరనియే నిరకునామాసంఘమువారు వ్రాసిరి. ప్రభుత్వమీ పరిశ్రమ నింకను కొంతకాల

దురు. మొదటిభాగమునకు ప్రశస్తమైన ముడిదినుసులు విశేషముగ కావలయును. ఆముడిదినుసులకు కొదువలేదు. వీటినిసమకూర్చుటకగు ఖర్చుకూడ స్వల్పముగానే యగుచున్నది. 1916 వ సం॥ వఱకు మూస ఇనుమునుతయారుజేయుటకుచౌకగనుండెను. 1916-17—1921-22 వ సం॥లమధ్య మూసఇనుము తయారగుటకుఖర్చు 100 కి 86 వంతులు హెచ్చయినది. అనగా టన్ను 1 కి రు 18.54 లనుండి రు 34.47 ల వఱకు హెచ్చినది. ఈహెచ్చునకు రాక్షసిబొగ్గుధరలు 100 కి రు 50 లు హెచ్చుటయు జమ్షడుపురమునందు ఇనుపమట్టిగనుల యందు కూలిహెచ్చుటయు కారణములు. ముడిపదార్థముల ధరలు కూడ మఱియొకకారణము. 1923-24 లో టన్ను 1 కి రు 36 లవఱకు గూడ ఖర్చులుహెచ్చినవి. 1926 లో రు 25 లవఱకు తగ్గినవి. (ఈతగ్గింపులో తెల్లయుద్యోగుల జీతబత్తెములు తగ్గలేదు.) హెచ్చుఖర్చులో గూడ అమెరికాయందు టన్ననకగు ఖర్చులో సగమునకంటె తక్కువగ మూసఇనుమును తయారుచేయుట కగుచున్నదని 1921 లో మదింపువేయబడెను.[1]

వేల్సులోగాని పడమటి ఇంగ్లండులోగాని మూసఇనుమున తయారుజేయుటకగు ఖర్చునకంటె మనదేశమునందే తక్కువయగుచున్నది. బ్రిటిషుధరలకన్న సగమునకు కొంచెము హెచ్చుధరలపై మూసఇనుమును కలకత్తారేవునకుకూడ చేర్చవచ్చును. సగటున 200000 టన్నుల మూసఇనుము జపాను మొదలగు దేశముల కెగుమతి చేయబడుచున్నది. 1913-14 లో 42000 టన్నులే యెగుమతియయినది. కాని ఈమూసఇనుమును ఉక్కుగాచేయుటలో మొదటిభాగమందలి లాభములు తొలగిపోవుచున్నవి.

---

1. *Asiatic Review October 1921. Iron and Steel position in India by Glengeorge.*

1916 పిమ్మట దిగుమతి ఉక్కు, తాతాకంపెనీవారి యుక్కు కంటె చౌకగ నున్నది. ఈ చౌకధరలతో పోటీ చేయగలుగునట్లు ఉక్కు తయారగుమార్గము లేవి? 1925 సం|| వఱకు గావించిన కంట్రాక్టులవలన రాక్షసిబొగ్గునకు హెచ్చుధరపెట్టవలసివచ్చెను. కాని 1925 వ సం|| నుంచి అనగా 1926-27 సం||రము నందు టన్ను 1కి రూ 7-0-0 లకే బొగ్గును కొనిరి. ఇతరదేశములకంటె నీ ధరలు చౌకయే. కాని ఉక్కును తయారుచేయు నిపుణులకు సాంకేతిక విద్యావంతుల కిచ్చు జీతములు హెచ్చుగ నున్నవనియు, భారతీయులకే విద్య నేర్పుటకు సాంకేతికవిద్యాలయము లేర్పఱుపబడినవనియు,అందులకు వ్యయమగుచున్నదనియు వ్రాయబడెను. ఇందువలన ఉక్కు తయారగు ఖర్చులు మితిమీరుచున్నవి. ఈ ఖర్చు తగ్గుట కింతలో మార్గములేదు. విదేశములనుండి యంత్రములు తెప్పించుటవలన అగు అదనపుపెట్టుబడియు తగ్గించుటకు వీలులేదు. ప్రభుత్వమువా రేర్పఱచిన మారకపురేటువలన గలుగు నష్టమునుండి తప్పించుకొనుమార్గము లేదు. అందుచే ఉక్కును విదేశపు రేట్లకంటె చౌకగ తయారుచేయుట కింతలో సదుపాయములు లభించజాలవు. ఈ కష్టములే ప్రతి పరిశ్రమకు ఇండియాయందు తటస్థించుచున్నవి. ఇవి స్వపరిపాలన వచ్చినగాని తొలగవు. అంతవఱకు ప్రజ లాందోళనజేసి ప్రభుత్వము వారిచేత చేయింపగలిగినంత సదుపాయము జేయించుటయే గత్యంతరము. భారతీయుల పెట్టుబడితో భారతీయుల ఆధిపత్యమున నడుపబడుచుండిన నీ పరిశ్రమ సుస్థిరముగు నభివృద్ధిపొందునట్లుగ జూచుట భారతీయుల విధి.

హిందూదేశమునం దంతట ఇనుము, ఉక్కు పరిశ్రమలయందు మొత్తము రు 27 కోట్లు పెట్టుబడి కలదు. 1. తాతా అయిరన్

స్టీలుకంపెనీ, 2. ఇండియన్ అయిరన్ స్టీలుకంపెనీ, 3. మైసూరు అయిరన్ వర్క్సు, 4. బెంగాలు అయిరన్ వర్క్సు అను నాలుగు కంపెనీలు పనిచేయుచున్నవి. ఈ కంపెనీలయందు ప్రాముఖ్యమైనది తాతా కంపెనీమాత్రమే. ఈ కంపెనీవారే ఉక్కును విస్తారముగ తయారుచేయుచున్నారు. ఇండియన్ అయిరన్ అండ్ స్టీలుకంపెనీయు, బెంగాలు అయిరన్ కంపెనీయు, ఉక్కును తయారుచేయుటలేదు. మైసూరు అయిరన్ కంపెనీ కొలదిగ తయారుచేయుచుండెను. ఇది గమనింపదగినంతగ లేదు.

ప్రపంచార్థిక పరిస్థితులు ఇనుపపరిశ్రమకు గూడ వర్తించినవి. కాని అమెరికా ఇంగ్లండు జర్మనీ మొదలగు దేశములయందు తగినంతగ ఉత్పత్తి తగ్గలేదు. ప్రభుత్వమువారు రైళ్లపై పెట్టుబడి ఖర్చును తగ్గించివేయుటవలన ఇనుపపట్టాలు, పోతసామాను, రైలుపట్టాలక్రింద వేయు అడ్డకమ్ములు మొదలగువాటి కొనుగోలు తగ్గిపోయెను. ఒటావా యొడంబడికవలన ఇంగ్లండున కెగుమతి చేయబడుచుండిన మూసయినుము యొక్క ఎగుమతిని కంపెనీలు నిలబెట్టుకొనగలిగినవని కొందఱు తలంచుచున్నారు.

హిందూదేశమునందే ఇనుము ఉక్కు-సామానులు విరివిగ నుపయోగింపబడుటకై తాతాకంపెనీవారు ప్రయత్నించు చున్నారు. కాని రైలురేట్లును స్టీమరురేట్లును సహాయముగ లేవు. అయినను ధరలను తగ్గించి దిగుమతి సరకులతో పోటీచేయవలె నని తాతాకంపెనీవారు తలంచుచున్నారు. భారతీయులకు ఇనుము ఉక్కు-సామానులను విరివిగ వాడుట అలవాటుగ లేదు. కాని రానురాను నేడు కొంచెము కొంచెముగ అలవాటు పడుచున్నారు.

హిందూదేశపు ఇనుము కొంచె మించుమించుగ ప్రపంచము

నం దన్ని దేశములకు నెగుమతి యగుచున్నది. విదేశములతో పోటీ చేయుటకు డీకొనుచున్నది. ఇంగ్లండునందలి పార్లమెంటు సభలో హిందూదేశపు ఇనుము దిగుమతిని గుఱించి ప్రశ్నలపై ప్రశ్నలు వేయబడు చున్నవి.

ముఖ్యముగ జపాను బ్రిటిషుదీవులు అమెరికా దేశము ఈమూడు దేశములకు ఇనుమునెగుమతి యగుచున్నది.

ఈదిగువ పట్టిక హిందూదేశమునందుండి విదేశముల కెగుమతియగుచున్న ఇనుమును దెలుపును.

టన్నులు

| 1929-30 | 1930-31 | 1931-32 | 1932-33 |
|---|---|---|---|
| 568000 | 439000 | 350000 | 218000 |
| విలువ లక్షలు రు. | | | |
| 259 | 170 | 122 | 74 |

మనదేశమునకు దిగుమతి యగుచుండిన ఇనుము, ఉక్కులను, వాటి సామగ్రిలను గమనించినయెడల మన కెగుమతి అత్యల్పమని తేలును. బ్రిటిషుసామ్రాజ్యమునందు హిందూదేశము, ముడియినుము లభించు దేశములలో రెండవస్థానము నాక్రమించును.

హిందూదేశమునందు ఉత్పత్తియగుచున్న ముడిఇనుము నీ పట్టిక తెలుపును.

| | | టన్నులు |
|---|---|---|
| 1929 | ... | 1390000 |
| 1930 | ... | 1099000 |
| 1931 | ... | 1408000 |
| 1932 | ... | 1250000 |

ఈ దిగువపట్టికలు విదేశములనుండి హిందూదేశమునకు దిగుమతి యగుచుండిన ఇనుపసామానుల వివరములను దెలుపును.

విదేశములనుండి హిందూదేశమునకు దిగుమతి యగుచుండిన మూస ఇనుమును దెలుపు పట్టిక.

టన్నులు

| నుండి | యుద్ధమునకు పూర్వపు సగటు | యుద్ధపు సగటు | యుద్ధానంతరపు సగటు | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 | 1932-33 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రిటిషు దీవులు | 12471 | 2754 | 6578 | 999 | 4068 | 2373 | 2697 | 3082 | 380 | ... |
| ఐరోపా ఖండము | 32 | 9 | 3889 | 628 | 1036 | 787 | 564 | 1 | ... | ... |
| ఇతర దేశములు | 378 | 3 | 86 | ... | ... | ... | 1 | ... | ... | ... |
| మొత్తం | 12881 | 2766 | 10553 | 1627 | 5104 | 3160 | 3262 | 3083 | 380 | 746 |

*From the Indian Finance year Book page 210, 1933.*

విదేశములనుండి హిందూదేశమునకు దిగుమతి యగుచుండిన ఇనుము, ఉక్కు సామానుల విలువ నీపట్టిక తెలుపును.

IMPORTS OF MANUFACTURED IRON AND STEEL IN INDIA.

లక్షల రూ॥లు.

| నుండి | యుద్ధమునకు పూర్వపు సగటు | యుద్ధపు సగటు | యుద్ధానంతరమున సగటు | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రిటిషు దీవులు | 758 | 550 | 1316 | 1036 | 1449 | 1303 | 1016 | 567 | 339 |
| యూరోపా ఖండము | 291 | 56 | 414 | 536 | 628 | 651 | 642 | 462 | 277 |
| అమెరికా | 39 | 283 | 343 | 96 | 57 | 58 | 52 | 50 | 14 |
| ఇతర దేశములు | 20 | 68 | 11 | 2 | 3 | 7 | 7 | 7 | 2 |
| మొత్తం | 1108 | 957 | 2084 | 1670 | 2137 | 2019 | 1717 | 1086 | 632 |

*From the Indian Finance year Book page 210, 1933.*

వివిధదేశములనుండి హిందూదేశమునకు దిగుమతి యగుచుండిన యంత్రసామానుల విలువ నీపట్టిక తెలుపును.

## IMPORTS OF MACHINERY AND MILL WORK IN INDIA

లక్షల రూ॥లు,

| | యుద్ధమునకు పూర్వము | యుద్ధపు సగటు | యుద్ధాంతరమందు సగటు | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రిటిషు దీవులు | 497 | 420 | 1760 | 1065 | 1258 | 1409 | 1368 | 1072 | 773 |
| అమెరికా (సంయుక్త) | 24 | 66 | 310 | 139 | 157 | 206 | 175 | 164 | 122 |
| జపాను | .63 | 13 | 6 | 3 | 2 | 45 | 6.3 | 4.8 | 3.14 |
| ఇటలీ | 1.4 | 23 | 4 | 6 | 12 | 16 | 15 | 15 | ... |
| జెర్మనీ | 30 | 24 | 38 | 94 | 104 | 113 | 173 | 118 | 112 |
| ఇతరదేశములు | 6 | 8-3 | 44 | 54 | 63 | 84 | 82 | 60 | 81 |
| మొత్తం | 561 | 513 | 2164 | 1364 | 1598 | 1836 | 1821 | 1434 | 1092 |

*From the Indian Finance Year Book page 262.*

ఏ దేశములనుండి హిందూదేశమునకు 1926-27; 27-28; 28-29; 29-30; 30-31 సం॥లలో కళాయిరేకు దిగుమతులను దెలుపు పట్టిక.[1]

| సంవత్సరము | దిగుమతిచేసిన దేశములు | | | | సంరక్షణ గలవి | సంరక్షణ లేనివి | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|
| | బ్రిటిషు ద్వీపములు | బెల్జియము | అమెరికా | ఇతరదేశములు | | | |
| | టన్నులు | | | | | | |
| 1926—27 | 240024 | 10489 | 12088 | 3218 | 274238 | 581 | 274819 |
| 1927—28 | 297686 | 22022 | 4330 | 7466 | 329989 | 1515 | 331504 |
| 1928—29 | 286046 | 32063 | 2310 | 5818 | 324879 | 1358 | 326237 |
| 1929—30 | 200295 | 50974 | 1615 | 4668 | 256040 | 1512 | 257552 |
| 1930—31 5 మాసములు మాత్రమే | 57981 | 26827 | 778 | 3943 | 89219 | 310 | 89529 |

1 *From Indian Tariff Board on Galvanized Sheets Page 22.*

ఇట్లధికముగనున్న దిగుమతి సరకుతో తాతా కంపెనీసరకు పోటీ చేయజాలకున్నది.

1934 వ సంవత్సరము మార్చినెలాఖరునకు 1927 వ సంవత్సరమునందు గావింపబడిన ఉక్కుసంరక్షణశాసనము సమాప్తి యగును. నేడు ఉక్కుపరిశ్రమ 1927 వ సంరక్షణశాసనము ననుసరించియు[1] సం॥ 1932 వ. తీగెలు, మేకులు సంరక్షణ శాసనము ననుసరించియు[2] ఒటావా వర్తకసంధి శాసనముననుసరించియు[3] సంరక్షణమును పొందుచున్నది. ఈసంరక్షణము అవసరమా? అనవసరమా? ఎంతవఱకు ఏవస్తువునకు సంరక్షణ మవసరము? ఉక్కుపరిశ్రమకు అనుబంధపరిశ్రమల స్థితియెట్లున్నది? వీటికిసంరక్షణ అవసరమా? అనుప్రశ్నలపై ఆమూలాగ్రముగ ఉక్కుపరిశ్రమ సంరక్షణమునుగుఱించి విచారించుటకై హిందూదేశ ప్రభుత్వమువారొక నిపుణాభిప్రాయసంఘమును నియమించిరి. ఈసంఘమువారు 1933 వ సంవత్సరము సెప్టెంబరునుండియు విచారణ సలుపుచున్నారు. ఈసంఘమునకు తాతాకంపెనీవారు పంపిన నివేదిక యందు 1934 వ సంవత్సరము మొదలు నుండి 7 సంవత్సరములవఱకును సంరక్షణ మవసరమని వ్రాయబడెను.

“1927 వ సంవత్సరమునుండియు ప్రారంభింపబడిన సంరక్షణ కాలము ఉక్కుపరిశ్రమకు అలజడికాలము ప్రపంచమునందలి మూస ఇనుము 1932 వ సంవత్సరమున ఉక్కులో సగముమాత్రమే యుత్పత్తియైనది. 1913 వ సంవత్సరములో ఉత్పత్తియైనదానిలో రెండుభాగములుమాత్రమే యుత్పత్తియైనవి. ధరలుకూడ యుద్ధమునకు పూర్వస్థితికంటె తక్కువతగ్గినవి. ప్రపంచమునందు ప్రతిదేశమునను చెలామణి యగు నాణెములవిలువ తగ్గినది. ప్రతిదేశము స్వదేశపరిశ్రమ సంరక్షణమునకై అధికముగ దిగుమతిసుంకములను విధింపసాగినది. చిరకాలము

1. *Steel Industry Act of 1927.*
2. *The wire and wire Nail Protection Act of 1932.*
3. *The Indian Tariff Amendment Act of 1932.*

నుండి నడుపబడుచుండిన సీమవారి ఉక్కు పరిశ్రమకుగూడ బ్రిటిషుప్ర భుత్వము సంరక్షణ మొసగవలసివచ్చెను. ఇట్టి ప్రపంచపరిస్థితులవలన హిందూదేశపుఉక్కు పరిశ్రమాభివృద్ధి వెనుకపట్టుటయేకాక కార్మికు లసమ్మెకూడ తటస్థించి రెండుసంవత్సరముల యభివృద్ధి నిరోధింప డెను."[1]

తాతాకంపెనీవారు ఉత్పత్తిని నిలబెట్టుకొనుటకును, ఖర్చులను తగ్గించుకొనుటకును, సమర్థతను హెచ్చించుటకును, విశేషకృషి సల్పిరి. అయినను సంరక్షణ కోరుచున్న కారణమేమి? ప్రపంచమునందుగల పోటీ నెదుర్కొనుటకై చిరకాలముక్రింద స్థాపింపబడినపరిశ్రమ లెట్టి సంరక్షణమును ప్రపంచమునందు పొందుచున్నవో ఆపరిస్థితుల నెదు ర్కొనుటకే తాతాకంపెనీవారికిగూడ సంరక్షణ మవసరము. పరిశ్రమ లకు సంరక్షణ మొసంగునపుడు మూడువిషయములను గమనించుట ముఖ్యావసరము. (1) ఉత్పత్తికిఅగు ఖర్చులు. (2) ఉత్పత్తిపరిమా ణము. (3) సరకువిడుదల కాగలిగినధర. ఈమూడింటిలో మొదటి రెండువిషయములయందునను తాము చేయగలిగిన దంతయు చేసితి మని తాతాకంపెనీవారు నిరకునామాసంఘమువారికి నివేదించిరి. సరకువిడుదల విషయమున కంపెనీవారు చేయగలిగినది లేదు. గత మూడుసంవత్సరములనుండియుగల ప్రపంచపరిస్థితులకు తల నొగ్గవలసి వచ్చెను. ఈకారణములవలన మఱి 7 సంవత్సరములకు తాతాకంపెనీ వారు సంరక్షణమును గోరిరి. నిరకునామా సంఘమువారు తమనివే దిక లింకను ప్రకటించలేదు. (1934 ఫిబ్రవరిమాసమున) వారినిర్ణయ మున ప్రత్యేకసంరక్షణమును సూచించెదరనుటకు సంశయింపబనిలేదు.

1. *Messers Tatas Memorandum.*

# 21 ఇతర లోహ పరిశ్రమలు.

ఉక్కుతో చేయబడుచుండిన యితర లోహపు ఇంజనీరింగు పరిశ్రమలు గలవు. ఇందులో ప్రసిద్ధికెక్కినవి యేవియు లేవు. రైళ్ళ బాగుచేయుటలోనే ఇంజనీరింగ్ పరిశ్రమ నిలిచియున్నది. రైల్వేశాఖ వారిచే పెట్టబడిన రైళ్ళ కర్మాగారముకూడ నిందులోనే చేరుచున్నది. ఈ కర్మాగారములను తీసివేయుచో నీపరిశ్రమ యిసుమంతయు నుండదు. ఇప్పుడిప్పుడే టాటా కంపెనీవారు లోహపు సామానులను తయారు చేయించుచున్నారు. (యంత్రములకు వలయు చిన్నచిన్న భాగములు) 1921 సం లో రైల్వే వర్కుషాపులలో 112000 మంది కూలీలును, ఇతర లోహపు పనిముట్లు తయారుచేయు వర్కుషాపులలో 32,000 ల కూలీలును పనిచేయుచున్నారు. వీరందఱు కూలీలుగమాత్రమే యంత రించుచున్నారు. నిపుణులగు పనివాండ్రను తయారుచేయుటలేదు. అందులకు వలయు సావకాశములు సక్రమముగ కల్పించుటలేదు. 1903 లో 70 యంత్ర నిర్మాణశాలలే యుండి 52,000 కూలీలు పనిచేయుచుండెడివారు. ఇతర ప్రత్యేకవ్యక్తులే ఇంజనీరింగు పరిశ్రమలను స్థాపింపవలెనన్నచో అధికపు పెట్టుబడికి సాంకేతిక విద్యాభ్యాసములకు నిపుణుల కొఱకు మొదలగు ఖర్చులు భరింపగలవారుగా నుండి విదేశపరిశ్రములతో పోటిచేయజాలరు. అందుచే ఇంజనీరింగు పరిశ్రమ వ్యాప్తి కాలేదు. ఇది వ్యాప్తియగుటకు ప్రస్తుత విద్యావిధానము తారుమారుగావలసియున్నది. ప్రభుత్వసంరక్షణ పొందవలసియున్నది. ఈ రెండునుగూడ నేడు లభించుటలేదు. ప్రభుత్వమువారే స్వంత పెట్టుబడిమీద సర్వవిధములగు యంత్రములను నిర్మించుటకు వలయు కర్మాగారములను వివిధరాష్ట్రములయందు స్థాపింపవలయును. హిం

దూ దేశము విదేశములపై యంత్రముల కాధారపడునంతకాలము హిందూదేశమున పారిశ్రామికాభివృద్ధి జరుగదు.

## 22. రసాయన పరిశ్రమలు.

పరిశ్రమలు పరస్పరాధారములు. రసాయన పరిశ్రమలకు వలయు • సామగ్రి యితర పరిశ్రమలకు వలయుపరికరముల వలెనే కొదువ లేదు. వివిధఖనిజ ద్రావకములు, (Mineral acids) క్షార పదార్థములు (Alcholies) వాడకీలు దినుసులు (Coal tar products) శాఖాతైలములు, పరిమళతైలములు (Vegetable and Essential oils) సహజమగు రంగులు లేక తొజారంగులు (Natural Dyes) క్రిమినాశక పదార్థములు (Disinfectants) ఎరువులు మొదలగు రసాయన పరిశ్రమలకు వలయు దినుసులన్నియు లభింపగలవు. గవర్నమెంటు వారిచే నియమింపబడిన మ్యూనిషన్సు బోర్డువారే యీవిషయము నంగీకరించిరి. సహజసంపద గలిగియుండియు రసాయనపరిశ్రమ లభివృద్ధి జెందలేదు. రసాయన పరిశ్రమల కుటుంబమునందలి యితరపరిశ్రమ లభివృద్ధి జెందక పోవుటయే యిందులకు కారణము. రసాయనములను తయారు జేయగల సాంకేతిక విద్యాప్రవీణు లితరపరిశ్రమలకు వలెనే భారతదేశమున లభించుటలేదు. ఆవిద్యనుగఱపు విద్యాలయములు నెలకొల్పబడలేదు. అయినను పూర్వకాలమునుండి వచ్చుచున్న సాంప్రదాయముల ననుసరించి కొన్ని తావులయందును నవీనవిధానము ననుసరించి కొన్నితావులయందును కొన్నిద్రావకములు తయారు చేయబడుచున్నవి. యుద్ధకాలమునందీరసాయనములకు గలిగిన యిబ్బందియే స్వల్పముగనైన నీపరిశ్రమలను ప్రారంభించుటకు కారణము. గంధక అమ్లము (Sulphuric Acid) నత్రికామ్లము (Nitric Acid)

పటికారపు మిశ్రద్రవ్యములు (Alum compounds) మంగ్నము (Manganesium) పోటాసియము (Potassium) సోడియము (Sodium) యశదమిశ్రద్రవ్యములు (Zinc compounds) మొదలగు రసాయనములు చేయబడుచున్నవి. వర్తకము చేయగలిగినంతగ నివియు తయారగుటలేదు.

వీటిని ఉపయోగింపగలిగిన యితరపరిశ్రమలు యంత్రాలయములు మొదట ప్రారంభింపబడవలసి యున్నవి. రసాయనములను ముడిదినుసులవలె నుపయోగించుకొను పరిశ్రమలు ప్రారంభింపవలెను. గంధకఆమ్లము వివిధరసాయనవృత్తికి మూలాధారము. అనేకపరిశ్రమల ప్రారంభమునకు పునాది. "1919 లో 18000 టన్నులు ఇండియాలో తయారు చేయబడెను. 300 టన్నులు దిగుమతి గలదు. 1917 లో అమెరికాయందు 7000000 టన్నులు తయారుచేయబడెను."[1]

అమెరికాతోపోల్చిన మనదేశపరిశ్రమ యేస్థితియందున్నదో సుబోధకముకాగలదు. సోడియము కర్బనితము (Sodium Carbonate) యును దాహకసోడా (Caustic Soda) యును గంధకధృతితెరువాత రెండవస్థాన మాక్రమించును. ఇవి సబ్బు, గాజు, రంగులు, వాడకీలు (Coal Tar) తయారుచేయుటకును నూనెలను పరిశుభ్ర పలుచుటకును వినియోగింప బడుచున్నవి. ఇవి అభివృద్ధి పొందవలెనన్న ఈ కుటుంబమునకు జెందిన యితరపరిశ్రమ లభివృద్ధిపొందుటయు, విద్యుచ్ఛక్తి అభివృద్ధిపొందుటయు నత్యావసరములు. శాఖాతైలములవిలువ ప్రపంచమునందంతకంతకు హెచ్చుచున్నది. భారతవర్షమునుండి నూనెవిత్తు లెగుమతిచేయబడి వారిస్థానమున నూనెలను నూనెతీసి వేసిన పప్పులను దిగుమతి చేసికొనుచున్నామని యిదివరలోనే వ్రాయబడెను. విదేశములకు ముడిదినుసుల నెగుమతిచేయబడక నూనె

1. *Munitions hand Book p. 62.*

నిచ్చుటనే తయారుజేయుట ప్రారంభించుచో నూనెతీసివేసినపిప్పి దిగుమతికూడ నవసరముండదు.

ఎంతనూనె నుత్పత్తిచేయగలిగినను భారతవర్షమే భరింపగలదు. పిండిని ఎరువులక్రింద నుపయోగించుటకు వ్యవసాయపు భూములున్నవి. విదేశపు బజారులతో నిమిత్తములేదు. విదేశములయందు ముడిదినుసులకు దిగుమతిసుంకము లేకుండుటయు, తయారైన నూనెకు దిగుమతి సుంక మేర్పఱచుటయు ముడిదినుసుల యెగుమతిని ప్రోత్సహించుటకు కారణము. హిందూదేశమందు ముడిదినుసుల యెగుమతిమీదకూడ సుంకమేర్పఱుపబడి పరిశ్రమల యభివృద్ధిమార్గము లరసినగాని యీ నూనె పరిశ్రమ యభివృద్ధిపొందుసూచనలు గోచరించుటకు లేదు. ప్రత్తి విత్తులవలన 2,00,000 టన్నుల నూనెను తయారు చేయవచ్చునని అంచనా వేయబడెను. విరివిగ హిందూదేశమునందు ప్రత్తి పండింపబడుచున్నను విదేశముల కెగుమతి యగుచుండుటవలన విత్తులుగాని, విత్తులవలన నూనెగాని మనకు లభించుటయే లేదు. అమెరికా దేశమునందు ప్రత్తివిత్తులవల్ల పలురకముల నూనెలు, సబ్బుల కుపయోగించు నూనెలు, పశువుల ఆహారములు తయారు చేయబడుచున్నవి. శాఖాతైలములవలన ముఖ్యముగ సబ్బు పరిశ్రమ విస్తరింపజేయగలము. చిరకాలమునుండియు సబ్బులను తయారుచేయుట భారతీయులెఱింగిన పరిశ్రమయే. యుద్ధకాలమునాటినుండియు నీ పరిశ్రమ కొంచెము తలయెత్తజూచినది. విదేశముల దిగుమతి సబ్బుల పోటీకి నిలబడజాలకున్నది. ప్రతిపరిశ్రమాభివృద్ధికి విదేశపుదిగుమతులప్రతిరోధమే కలుగుచున్నవి. భారతదేశమునం దీపరిశ్రమకు వలయు సౌకర్యములొనగూర్పబడుచో భారతదేశమున కంతకు సరిపడునంత సరకును తయారుచేయగలము. అందులకు వలయు సహజసంపదగలదు. ఈ పరిశ్రమ యభివృద్ధితోపాటు ఎరువులకు పిండి లభించుటయే కాక వివిధ

ముతైన క్రొవ్వుపదార్థములు, నూనెలు, గ్లిసరైన్ మొదలగు పదార్థములుత్పత్తి కాగలవు. కాని యితర పరిశ్రమలతోపాటు సాంకేతికవిద్యానిపుణులు లేరు. పెట్టుబడికి లోటుగా నున్నది. దీనికి సంబంధించిన యితర పరిశ్రమలును లేవు.

భారతీయ పారిశ్రామికుడు యంత్రపరిశ్రమయందున కలనడులో వలనే ఆతని పరిశ్రమహృదయము, హస్తలాఘవము అలంకారచిత్తవృత్తులు నశింపజేయబడెను. భారతీయుడు విద్యావిహీనుడుగా చేయబడినాడు. ఇవి పునరుద్ధరింపబడిననాడే మరల భారతీయ పారిశ్రామికవిప్లవము రాగలదు. లోహరసాయనపరిశ్రమలువృద్ధికాగలవు. చేతిపనులవలనగాని, యంత్రసహాయములవలనగాని యేవిధముగ పరిశ్రమలు వృద్ధిపొందవలెనన్నను, భారతీయులలో నశింపచేయబడిన తొల్లింటి పరిశ్రమలయందలి సుహృదయము సంచలింపచేయబడిననాడే వీలగును. ఈ పరిశ్రమల ప్రారంభదశయందు ప్రభుత్వసంరక్షణము సంపూర్తిముగనుండవలెను.[1]

## 23. వస్త్రపరిశ్రమ: మిల్లులు.

బొంబాయియందు 1853 వ సంవత్సరమున ప్రారంభింపబడిన మిల్లు పనిచేయుటకు మొదలిడెను. కాని నాటి ప్రభుత్వ ఉద్దేశపూర్వకపు మిల్లులు విరివిగ నిర్మింపబడి విజయము పొందలేకపోయినవి. నాగపురమునందు 1887 వ సంవత్సరమందు (J. N. Tata) జె. యన్. తాతాగారు ఎమ్ప్రెస్‌మిల్లును (Empress) స్థాపించిరి. దీని ననుసరించి వివిధ ప్రాంతములలో మిల్లులు స్థాపించబడుచు వచ్చినవి. బొంబాయిరాజధానిలో బొంబాయి, అహమ్మదాబాదు, షోలాపూరులయందు

I See Veera Anstey P. 259.

ప్రత్యేకముగ బట్టలమిల్లులుగలవు. మదరాసులోగూడ నున్నవి. ప్రత్తి సులభముగ లభించుప్రదేశములయం దీమిల్లులు స్థాపించ బడినవి. హిందూదేశములో తయారగుచున్న నూలుబట్టలో మూడువంతులు బొంబాయిమిల్లులలోనే తయారగుచున్నది. ప్రప్రథమమునుండియు నీపరిశ్రమ భారతీయులపెట్టుబడితో భారతీయుల యాజమాన్యము నందే యున్నది. తెల్లవారుమాత్రము పెద్దయుద్యోగములలో మేనేజర్లుగ నుండిరి. పెట్టుబడిలో పార్సీవారిపెట్టుబడి అదనముగ నున్నది. మొదటినుండియు నీపరిశ్రమకు ప్రతిబంధకములు కలుగకున్నచో నేటికి దేశమునం దల్లుకొని యుండెడిది.

1859-82 సం॥ ల మధ్య దిగుమతియగు వస్త్రములమీద 100 కి రూ 5 లు దిగుమతిసుంక ముండెడిది. నూలుమీద రు 3-8-0 లు సుంకముండెడిది. హిందూదేశమునం దేనాడు మిల్లులు పెట్టుట ప్రారంభింపబడెనో, నాటినుండియు లాంకషైరులో ఆందోళన ప్రారంభింపబడెను. ఈమిల్లులు వారిమిల్లులపై పోటీచేయు నను గందరగోళము కృతిమించినది. లాంక్ షైరువారి ఆందోళన ఫలితముగ 1882-సం॥ 1894 ల మధ్య దిగుమతిసుంకములు తీసివేయబడినవి.

అందుచే సహజముగ భారతీయుల మిల్లుపరిశ్రమ యభివృద్ధి జెందలేదు. ఇంతలో మారకపురేట్ల తబ్బిబ్బులుగూడ వచ్చినవి. ఇందునకుతోడు జపాను చీనాదేశములవారు స్వయముగ మిల్లులను నెలకొల్పుకొనచుండుటచే మనమిల్లుల నూలును వారు దిగుమతి చేసుకొనట విరమించిరి. 1867 లో జపానుదేశమున మొదట బట్టలమిల్లు స్థాపింపబడెను. 1881 సం.లో ఇండియానుండి జపానుకు ప్రత్తి ఎగుమతి చేయబడెను. జపానువారి వస్త్రపరిశ్రమ 1894వ సం॥రము నుండియు నుత్తమ స్థితికి వచ్చినది. భారతీయులకంటె 14 సం॥ల వెనుక మిల్లు

లను స్థాపించినకు జపానువారు స్వపరిపాలనము ననుభవించుచుండుటచే త్వరితగతిని తమపరిశ్రమ నభివృద్ధిపఱచుకొనగలిగిరి. విదేశవస్త్రముల దిగుమతి నగాలుదిగుమతుల నాపుకొనగలిగిరి. భారతీయులు అస్వాతంత్ర్యులగుటచే విదేశపుదిగుమతుల నాపుకొన జాలక పోయిరి. సీమదేశపు పోటీ నిత్యకృత్య మైనది. సీమకొఱకు హిందూదేశము సజీవముగా నుండవలసి వచ్చినది. హిందూదేశముకొఱకు హిందూదేశము బ్రతికియుండవలసినస్థితి దప్పినది. కాలగతిననుసరించి తాబేలువలె ప్రాకుచు వస్త్రపరిశ్రమ 1914 వ సం॥రమునకు కొలదిగ పునాదులను వేసికొనగలిగెను. వస్త్రపరిశ్రమయందు ప్రపంచమున నాల్గవదేశముగ నుండగలిగెను. ఇంతలో యూరోపా మహాసంగ్రామము వచ్చెను. బ్రిటిషుప్రజలకును, ప్రభుత్వమునకును వస్త్రకవ్యాప్తి గావించుకొనుటకంటె దేశస్వాతంత్ర్యసంరక్షణ గావించుకొనుటకై సర్వస్వము ధారపోయవలసినస్థితి పట్టినది. ఈకాలమున లాంకషైరు వారు తమబట్టలదిగుమతిని తగ్గించుకొనుట తప్పనిసరి యైనది. ఈపోటీ కొంత తొలగుటవలన భారతదేశపుమిల్లులు తలలెత్తగలిగినవి. కాని మిల్లులు కట్టుటకు యంత్రములకొఱకు విదేశములమీఁదనే యాధారపడవలసి యుండుటచే క్రొత్తమిల్లులను విరివిగ కట్టుటకు వీలులేకపోయెను. అప్పటికున్న మిల్లులుమాత్రమే బాగుగ పనిచేసి లాభములను బొందగలిగినవి. ఈలాభముల్తైనను మిల్లులు పొందవలసినట్లుగ పొందలేదు. ఇతరపరిశ్రముల నదమాయించి పట్టినట్లే ప్రభుత్వ మీపరిశ్రమనుగూడ (Indian Cotton Contracts Board) ప్రత్తి కొనుగోలు సంఘమును నియమించి అదమాయించెను. మిల్లులలో తయారయిన బట్ట నిర్ణీతలాభములకు ప్రభుత్వమే కొనసాగెను. సం 1918 మొదలు 1920 వఱకునుగూడ దుస్థితి రాలేదు. 100 కి సగటున రు 30 లు లాభమును మిల్లులవారు పంచిపెట్టిరి. 100 కి రు 13 లు మొదలు రు 180 ల

వఱకు మిల్లులకు లాభము లున్నవి. ఇంతలో మారకము తారుమారైనది. విదేశపు దిగుమతిసరకుఖరీదు తక్కువ చేయబడెను. మిల్లులు విదేశపుపోటీలకు నిలువజాలకున్నవి. జీతబత్తెములు యుద్ధకాలమునాట నుండియు పెరుగుచు వచ్చినవి. ఉత్పత్తిఖరీదు పెరిగినది. జపానువారి పోటీకూడ నిందులకు జతగూడెను. 1913 వ సం॥రము మొదలు జపాను వారి వస్త్రపరిశ్రమయొక్క పెట్టుబడి 100 కి 270 వంతులు పెరిగినవి. జపానువారి వడుకుకదుళ్ళు (Spindles) 100 కి 55 నేతమగ్గములు 100 కి 100 ను హెచ్చినవి. తప్పనిసరిగ నున్న లాంక్షైరుపోటీకి జపానువారి పోటీకూడ తోడయినది. మిల్లులలాభము లందువలన చాలవఱకు తగ్గిపోయెను. మిల్లులను పోషించుటయే దుష్కరమైనది.

యుద్ధకాలమునం దేర్పఱుపబడిన సాలుసరి విరాళము (బోనసు Bonus) కార్మికులకీయ నిరాకరించిరి. 1924 లో 2 మాసములు కార్మికులు గట్టినసమ్మెకిదియే కారణము. 1925 లో కార్మికుల జీతములు 100 కి రూ 11½ వంతున తగ్గించెద మనిరి. సెప్టెంబరు 1 వ తేదిని మిల్లుయజమానుల సంఘమువారిట్లు ప్రకటించిరి. దీనివలన కార్మికులు దీర్ఘకాలము తీవ్రమైన సమ్మెగట్టిరి. మిల్లుల కపారనష్టము వచ్చెను. ప్రభుత్వమువారు 1920 సం॥రము మొదలు ప్రత్తిపై ఉత్పత్తిశుల్కమును, (Excise duty) తీసివేసి యున్నచో మిల్లుయజమానులీసంధిగ్ధస్థితికి వచ్చెడివారు కారు. విదేశపు దిగుమతులవారినుండి, కనీసము జపానువారివారినుండి సంరక్షింపబడుచో సంధిగ్ధస్థితికి వచ్చెడు వారుకారు. ముందుముయ్యి వెనుకగొయ్యి గోచరించినవి. జీతబత్తెములు తగ్గించుచో కార్మికుల జీవితము దుష్కరమగుచుండుటవలన వారు సమ్మెకట్టుచున్నారు. తగ్గించకపోవుచో మిల్లులు నష్టము పొందుచున్నవి. ప్రత్తిపై ఉత్పత్తిశుల్కము తొలగింపవలసిన దని ప్రారం

భము నుండియు కోరబడు చుండెను. ఈ మొఱ ప్రభుత్వపు చెవికెక్కుట లేదు. 1916 లో లార్డుహార్డింజిగారు యుద్ధానంతరమునం దీశుల్కము తొలగింప బడునని ప్రకటించిరి. ఆవాగ్దానము ననుసరించి తొలగింప లేదు. 1924 వ సం॥ నందు భారతశాసనసభవారీ శుల్కమును తీసి వేయవలెనని తీర్మానించిరి. నాటి ప్రభుత్వార్థికసభ్యుఁ డీసుల్కము వస్త్రపరిశ్రమ కపకార మొనరించు చున్నదని యంగీకరించెను. తీసి వేయుటకు మాత్రమంగీకరింప లేదు. బొంబాయి, అహమ్మదాబాదు మిల్లుల యజమానుల సంఘము వారు ప్రభుత్వమువా రీసుల్కమును తీసివేయవలె నని కోరిరి. ఎట్టకేలకు 1925 వ సం॥ నందీశుల్కము నావత్సరమునకు దొలగించిరి. కాని 1926 లో పూర్తిగ తీసివేయుట తప్పనిసరి యయినది.

ఈశుల్కము తొలగింపబడిన పిమ్మట కార్మికుల జీతములు తగ్గించుటమానిరి. సమ్మె అంతరించినది. అయినసేమి? పరిశ్రమ యభివృద్ధిపొందు సూచనలు గోచరింపలేదు. మారకపురేటు 1 షి. 4 పెన్నీల నుండి 1 షి. 6 పెన్నీలకు హెచ్చినది. విదేశపుసరుకులు చౌకగ దిగుమతి యగుచున్నవి. దిగుమతిసుంకము మన పరిశ్రమను సంరక్షించు నంతగ లేదు. ఈమూడుకారణములు పరిశ్రమాభివృద్ధికి శాశ్వత ప్రతిఘటనములక్రింద నిలిచి యున్నవి. ఈప్రతిష్టంభనము తొలగించిన గాని పరిశ్రమ నిలువ జాలదు. బొంబాయిమిల్లు యజమానుల సంఘము రూపాయి మారకపు రేటును 1 షి. 4 పె. ల క్రింద నిశ్చయ మొనరింపవలసి యున్నదనియు, దిగుమతియగునూలు వస్త్రములపైన 100 కి రూ 17½ అదనముగ రక్షణసుంకము విధింపవలె ననియు ప్రభుత్వమును కోరిరి. నిరకునామాసంఘము పరిశ్రమను గుఱించి విచారించి 192; వ జూనుమాసమునందు తమ నివేదికను సమర్పించిరి.

వీరి నివేదికయందలి సూచనలను విమర్శించుటకు ముందు మిల్లునూలు వస్త్రములవర్తక మేవిధముగ దిగజారినతో గ్రహింప వలసి యున్నది. నూలు అమ్మకము హిందూదేశమున కొలదిగ యుద్ధము నకు పూర్వమునకంటె హెచ్చినది. విదేశములకు నూలుఎగుతి విశే ముగ తగ్గిపోయినది. యుద్ధమునకు పూర్వము హిందూదేశమునుండి సాలుసరి సగటున 129 మిలియనుల పౌనుల నూలు ఎగుమతి యగు చుండెడిది. 1925-26 సం 31 9 మిలియనుల వఱకు దిగజారినది. 1926_27 సం॥ 41 మిలియన్ల పౌనులును, 1927-28 సం॥న 24 మిలియ నుల పౌనులనూలు మాత్రమే ఎగుమతి చేయబడెను. చైనాకు 1913-14 సం॥న పౌ 170 మిలియనుల నూలు పంపబడెను. 1925-26 లో 9. 7 మిలియనులకు తగ్గినది. 1927-28 లో పౌ 0. 7 మిలియనులకు తగ్గిపోయినది. అనగా పూర్తిగ నెగుమతులు తగ్గిపోయెను.

"1925 లో చైనాదేశమందు 3. 4. మిలియనులనూలు తయా రుచేయుకదుల్లు గలవు. జపానునందు 5.4 మిలియనులును, ఇండియా యందు 8.5, మిలియనులును కదుల్లుగలవు. ఇండియాయందు కదుల్లు హెచ్చుగ నున్నను, పౌ 686.4 ల మిలియనులనూలు మాత్రమే తీయ బడెను. చైనాదేశమునందు 719.2 మిలియను పౌనులనూలు తయారు చేయబడెను."[1]

హిందూదేశమందు హెచ్చుగ నూలుతీయబడిన విడుదలయగు మార్గములేక తక్కువ తీయవలసివచ్చినది. మఱియు నాయేటికార్మికస మ్మెలవలన గూడ కొంతయుత్పత్తి తగ్గినది. హిందూదేశమందలిమి ల్లులు 30 నెంబరువఱకు నూలు నుత్పత్తిచేయుచున్నవి. నెంబరనగా 1 పౌను బరువునకు తూగుపిడులసంఖ్య. పిడి 1కి 840 గజము లుండును.

1. Tariff Report on Cotton Industry. P. 97.

ఉదాహరణము 20వ. నెంబరునూలనగా 20 పిడులు, 1 పౌనుబరువు తూగునవి యని యర్థము. 1 వ. నంబరు మొదలు 20 నంబరువఱకు తీయబడునూలు ముతుకయందురు. 20 మొదలు 40 వఱకు నెంబరుగల నూలును మధ్యరకమందురు. 40 వ. నెంబరుపై నూలు సన్ననినూ లందురు. 31 మొదలు 40 వఱకు నెంబరులనూలు వెనుకటికంటె అధనముగ నుత్పత్తియగుచుండెను. 40 వ నెంబరు దాటినపిమ్మట వెనుకటికంటె అధనముగ నత్పత్తి చేయబడుచున్నను, నీయుత్పత్తియంతయు గూడ దిగుమతి యగుదానికంటె చాలతక్కువ. సన్ననినూలు నుత్పత్తిచేయుటకు వలయు సౌకర్యము లొనగూర్పబడుట లేదు. యుద్ధమునకుపూర్వము సన్ననూలు దిగుమతులు భారతదేశపుమిల్లులలో నుత్పత్తియగునూలును దిగుమతియగునూలును కలిసిన మొత్తములో 100కి దిగుమతులు 6 వంతులు గలదు. 1925-26 లో 7 వంతులైనది. 1926-27 లో 5. 7 వంతులును 1927-28 లో 6. 2 వంతులును దిగుమతులు గలవు. 40 వ నెంబరునూలు దిగుమతికంటె మనదేశమునందుగల యుత్పత్తి అత్యల్పముగ నున్నది. 40 వ నెంబరు 30 వ. నెంబరువఱకుగల నూలుకూడ దిగుమతులకంటె స్వల్పముగనే యుత్పత్తియగుచున్నది. దిగుమతులలో సం. 1913-14లో లాంకెషైరునుండి 100కి 80 వంతులును, జపాను 100కి 2 వంతులును దిగుమతి చేసినవి. 1925-26 లో లాంకెషైరు 31 వంతును, జపాను 65 వంతులును దిగుమతి చేసినవి. 1926-27 లో లాంకెషైరు 41 వంతులును, జపాను 54 వంతులును నూలు దిగుమతిచేసినవి. 1927-28 లో లాంకెషైరు 39 వంతులును, జపాను 32 వంతులును, చైనా 25 వంతులును నూలు దిగుమతిచేసినవి. ఈయంకెలనుబట్టి చూచువో జపానువారు నూలును తీయుటయందు ముఖ్యముగా పోటీనెంబర్లనూలు అనగా నెం.30 మొదలు40వఱకును, ఆపై నెంబర్లసన్ననూలును తీయుటయందును అమితశ్రద్ధ వహిం

చుచున్నట్లు తేలుచున్నది. 31-40 నెంబర్ల మధ్యనూలును లాంక్ షైరువారే దిగుమతిచేయుచుండిరి. సం. 1925-26లో మధ్యరకమునూలును జపానువారు 20 మిలియనుపౌనులను, లాంక్ షైరువారు పౌ 4 మిలియనలును దిగుమతిచేసిరి. లాంక్ షైరువారిగుత్త ఆచంద్రార్కము కొనసాగించుకొనుటకు కొంతకాలము దిగుమతిసుంకముల నెత్తివేసిరి. మఱికొంతకాలము హెచ్చింప నిరాకరించిరి. హిందూదేశమున సన్ననూలు తీయుటకు సౌకర్యములను ప్రభుత్వము కలిగింపలేదు. ఇంతలో జపాను తలయెత్తి లాంక్ షైరుతో పోటీ చేయగలుగుచున్నది. జపానువారిదిగుమతులమీద లాంక్ షైరువారి దిగుమతులమీద దిగుమతిసుంకము హెచ్చించుచో భారతదేశమున ముతకనూలుతోపాటు సన్నని నూలుగూడ తీయబడి ఖర్చుఅగుటకు మార్గ మేర్పడెడిది. కాని, దిగుమతిసుంకము హెచ్చువిధించుచో జపానువారిదిగుమతులతోపాటు లాంక్ షైరుదిగుమతులమీద కూడ విధింపవలసి వచ్చును గదా! అట్లు విధించుచో లాంక్ షైరుదిగుమతి యింకను తగ్గునేమో యనుభయమున అసలే విధింపలేదు. ఇందువలన హిందూదేశపరిశ్రమ యభివృద్ధి యగుట లేదు.

ఈనూలువలెనే చేతిమగ్గములవా రుపయోగించుపట్టునూలు గతికూడ కొలదికాలములో పట్టగలదు. ఇటలీదేశమునుండియు బ్రిటీషుదీవులనుండియు కృత్రిమపు (Artificial Silk) పట్టునూలు అత్యధికముగ దిగుమతి యగుచున్నది. సం. 1922-23 లో యీకృత్రిమపు పట్టునూలు 225,000 పౌనులు దిగుమతి. 1927-28 సం॥ వచ్చుసరికి 7,510,000 పౌనులదిగుమతివఱకు పెరిగినది. దిగుమతియగు కృత్రిమపు నూలుపై దిగుమతిసుంకము 100 కి రు 7 న్నర లకు తగ్గించి వేయబడెను. బ్రిటీషుదీవులనుండి అధనముగ నీకృత్రిమపు పట్టునూలు దిగు

మతియగుచుండుటయే యీతగ్గింపునకు కారణము. ఇట్లు విదేశముల కెగుమతి తగ్గుటయు స్వదేశమునందు విదేశములసరకుతో మారకపు హేటువలన పోటీ చేయకుండుటవలనను వస్త్రపరిశ్రమాభివృద్ధి వెనుకంజవేసెను. బొంబాయిపట్టణమందలి మిల్లులు యుద్ధమునకు పూర్వము ఉత్పత్తి చేయునూలులో 100 కి 53 వంతులు ఎగుమతి చేయుచుండెడివి. 1924-25 లో 11 వంతులు మాత్రమే ఎగుమతి చేయగలిగెను. వస్త్రములలో వెనుకటికంటె ఎగుమతులు అధికమైనను నూలుఎగుమతి తగ్గుటవలన గలిగిననష్టమునకు ముదరా రాలేదు. అందుచే 300, 000, 000 ల గజములగుడ్డను అదనముగ బొంబాయిమిల్లులు హిందూదేశమునందమ్మవలసివచ్చెను. గుడ్డయుత్పత్తి అధికమొనరించి గుడ్డయే అమ్ముకొనవలసివచ్చినందున గుడ్డనే అధికముగ ఉత్పత్తి చేయుట ప్రారంభించిరి. స్వదేశోద్యమము దేశమునందు ప్రబలుటచే అమ్మకముగూడ పెరిగినది. 1925-26 లో హిందూదేశపుమిల్లులు 100 కి 43-5 వంతుల గుడ్డను చేనగ్గములు 100. 22. 3 వంతుల గుడ్డను 100 కి 34- 2 వంతులు దిగుమతిగుడ్డయు హిందూదేశమున వాడబడెను. ఈఅంకెల ననుసరించి 100 కి 65.8 వంతులగుడ్డ దేశమున తయారగుచున్నది.

యుద్ధమునకుపూర్వముకంటె కొలదిగ హెచ్చుగనున్నను గుడ్డ దిగుమతి యుద్ధమునకుపూర్వమునందియు నించుమించుగ నొక్క విధముగనే యున్నది. నూలుదిగుమతిలో కొంతతేడా గలదు. 1913-14 లో బ్రిటిషుదీవులు నూలు దిగుమతులలో 100 కి 97_1 వంతులను, దిగుమతి చేయుచుండెడివి. ఏయితరదేశముగాని, 100 కి 1 న వంతు గూడ పూర్తిగ దిగుమతిచేసి యుండలేదు. 1927—28 లో బ్రిటిషు దీవులు 100 కి 78-2 వంతులు మాత్రమే దిగుమతి చేయగలిగెను. జపాను 16-4 వంతులు దిగుమతిచేసెను. అమెరికా 1-4 వంతును

100 కి 1 వంతు నీదర్లాండ్సు (Netherlands) దిగుమతి చేయగలిగి నవి. జపానునుండి యగుదిగుమతులలో రంగులబట్ట లధికముగా నున్నవి. ఇందు ముఖ్యముగ సన్నరకములు 1925-26 లో గల దిగుమతులను ఇండియాయందు తయారైనబట్టతో కలిపి లెక్కించుచో జపానువారి దిగుమతి 100 కి 4.7 వంతులు గలదు. హిందూదేశపుమిల్లుల బట్ట 43-5 వంతులును, బ్రిటిషుదీవులనుండి 29.5 వంతులును గలదు. హిందూదేశమునుండి గుడ్డ యుద్ధమునకుపూర్వముకంటె క్రొలదిగ నెగు మతి హెచ్చినది. సగటున యుద్ధకాలమునకు పూర్వము 89.7 మిలి యనులగజము లెగుమతి అయ్యెడివి. 1927-28 లో 167 మిలియను గజము లెగుమతి అయ్యెను. ఈయెగుమతి పెర్షియా, మెసపొటేమియా, తూర్పుఆఫ్రికా దేశములకు జరుగుచున్నది. భారతదేశమున దినదినా భివృద్ధి పొందుచున్న స్వదేశాభిమానమువలన ఈ మిల్లుగుడ్డకూడ వెనుకటికంటె విశేషముగ ఇండియాయందే ఖర్చుపడుచున్నది. ఇట్లు ఖర్చుపడకపోవుచో ఈపరిశ్రమ యిదివఱకే ఆవిదేశవర్తకులపోటీకి అడు గంటి యుండెడిది. యుద్ధమునకుపూర్వమునకంటె నేడు దిగుమతులు హెచ్చలేదు. వాడుక హెచ్చిన ట్లీ పైయంకెలవలన గోచరింపగలదు. మహాత్మాగాంధిగారి ఖద్దరుద్యమమువలన దేశములో 30వ సం॥రమున సుమారు కోటి (1/2 కోటిరూపాయలు) గజములగుడ్డ యుత్పత్తి యగుచున్నది. ఈయుత్పత్తి ననుసరించి, విదేశపుగుడ్డదిగుమతి తగ్గినది. మఱియు, రానురాను ప్రజలకొనుగోలుశక్తికూడ క్షీణించుచున్నది. ఈకారణమువలనగూడ దిగుమతి తగ్గినది. కాని ప్రభుత్వము, స్వదేశపరి శ్రమలకొసగిన సంరక్షణవలనగాని, సహాయమువలనగాని, ప్రతిబంధ కములను తొలగించుటవలనగాని, దిగుమతులు తగ్గలేదు. 1925 వ సం॥ బొంబాయియందు 77 మిల్లులు పనిచేయుచున్నవి. 58 అహమ్మదాబా దునందు, 24 బొంబాయి రాజధానియందలి యితరప్రాంతముల

యందు, 20 సంయుక్తరాష్ట్రములలోను, 16 మదరాసురాజధాని యందు 7 మధ్యరాష్ట్రములయందు మొత్తము 202 మిల్లులున్నవి. బొంబాయియందున్న 77 మిల్లులలో 13 మిల్లులు 1918-23 సం॥ల మధ్య అభివృద్ధియైనవి. కదుళ్లను 100కి 36.8 వంతులును; మగ్గములను 100 కి 61. 9 వంతులును ఈమిల్లులు వృద్ధిజేసెను. పెట్టుబడి 196 వంతులు హెచ్చినది. బొంబాయియందలి 83 మిల్లులలో 30 మిల్లులు పెట్టుబడిని హెచ్చించెను.[1]

ఉత్పత్తి నధికము చేయుచున్నవి. అందుచే పైయంకెలనుబట్టి 1913-14 సం॥ల కంటె నుత్పత్తి హెచ్చు కనిపించుచున్నది. ఇట్లు అధికోత్పత్తియు అమ్మకముగూడ కనిపించుచున్నను,మిల్లు లార్థికముగ నష్టమునే పొందుచున్నవి. లాభము అధికోత్పత్తి విడుదలమీద గాక, ఉత్పత్తికగుఖర్చుల ననుసరించియు,ధరల ననుసరించియుగూడ నుండును. ధరలు హెచ్చుగా నున్నపుడు అధికోత్పత్తి విడుదలలు లాభదాయకము. " 1922 వ సం॥న బొంబాయిమిల్లులకు, 383 లక్షలు లాభము వచ్చెను. 1923 లో 33 లక్షలవఱకు తగ్గిపోయెను. 1924 వచ్చునరికి 92 లక్షలు నష్టము వచ్చెను. 1925 లో 134 లక్షలవఱకు నష్టము హెచ్చెను. "[2]

1925 లో మూలధనమునుండి 63.4 లక్షలు ఖర్చులక్రింద తీసికొనవలసి వచ్చెను. యంత్రముల అరుగుదలలు మొదలగుతరుగులక్రింద తీయబడుసొమ్ము మామూలుకంటె 154 లక్షలు తగ్గినది.

ఈ అంకెలననుసరించి వస్త్రపరిశ్రమ యెంతదుస్థితియం దున్నదియు సుబోధకము కాగలదు.[3]

1. *From Tariff Board Report on Cotton Industry P. 77.*
2. *Tariff Board Report P. 24*
3. *Tariff Board Report P. 25*

"1905-14 లమధ్య 6న్నర కోట్లపెట్టుబడిపై బొంబాయిమిల్లులు 100 కి రు 10న్నర లాభమును పంచిపెట్టినవి. 1915-22 సం॥లమధ్య సగటున 12న్నర కోట్ల రూపాయలను పెట్టుబడిమీాద 100 కి రు 53 ల వంతున లాభములను పంచిపెట్టినవి.[1]

1923 సం॥నుంచి మిల్లులయభివృద్ధి యెంతవెనుక పట్టినదియు 22 సం॥ వఱకునుగల లాభములనుబట్టి సువ్యక్తమగుచున్నది. ఈదుస్థితి అన్నిమిల్లులకును గలదు. ముఖ్యముగా బొంబాయిమిల్లులకు హెచ్చుగనున్నది. "నూలువడుకుట మాత్రమే చేయుమిల్లులు అధికనష్టము పాలైనవి. వడుకుట, నేయుట కూడ గలమిల్లులు అంతఅధికనష్టములకు గురికాలేదు."[2]

ఈనష్టములవలన బొంబాయిమిల్లులయం దుత్పత్తికూడ తగ్గినది. బొంబాయిమిల్లులు ఉత్పత్తిజేసిననూలు హిందూదేశపుమొత్తపు ఉత్పత్తిలో 1912-13 వ సం॥ 52% లనుంచి 1924-25 నకు 38% వఱకు తగ్గిపోయెను. ఈకాలమునందే గుడ్డకూడ 50.3% నుంచి 43% తగ్గిపోయెను. అయినను టారిఫ్‌బోర్డువారీ దుస్థితిని ప్రభుత్వము చక్కజేయజాల దనిరి. సంరక్షణవిధానమువలన గొంతసహాయము గలిగినను, పరిశ్రమయంతయు చక్కబడునుపాయము ప్రభుత్వపుచేతియందు లేదనిరి. (1) పత్తిఖరీదు హెచ్చెను. 100 కి రు 27 లు పెరిగెను. (1924 జూలై) ప్రత్తిపైశుల్కము తగ్గింపబడలేదు. 1925 వఱకు అమెరికాప్రత్తిధర హెచ్చుగనేయున్నది. (2) మారకపురేటు 1 షి. 4 పెన్సులనుండి 1-6 పెన్నీలకు అసలే ధరలు తగ్గియున్నపుడు, ప్రభుత్వము తాఱుమాఱు జేయుటవలన విదేశపుదిగుమతులఖరీదు చాల

1. *Report on the Conditions and Prospects of British trade in India 1924-25 p. 39*

2. *Tariff Board Report p. 27*

తగ్గెను. అందువలన పోటీకిఆగజాలకున్నను మారకపుధరను 1 షి. 4 పెన్సులలో నిశ్చయించక 1షి. 6 పెన్సులలోనే ప్రభుత్వము నిశ్చయించెను. (3) రైల్వే రేటులయందును స్టీమర్ల రేటులయందును పక్షపాతము తొలగింపబడలేదు. లాంక్ షైరునుండి గుడ్డలబేలు పంపబడుచో యిచ్చుకొనవలసిన ఓడ కేవు, హిందూదేశమునం దేఓడరేవునకైన సమానమే. ట్యూటికొరను, బొంబాయి, మదరాసు మొదలగు అన్ని ప్రదేశములకు సమానమే. మఱియు నీ కేవు ఇండియాలో అహమ్మదాబాదు నుండి హైదరాబాదునకుగాని, నాగపురమునుండి ఢిల్లీకిగాని, పంపుచో నిచ్చుకొనవలసిన రైలుచార్జీకంటె చాలతక్కువ. తిరుప్పూరు నుండి లాంక్ షైరునకు పంపబడుప్రత్తికి అగుఖర్చు తిరుప్పూరునుండి ఢిల్లీకి పంపవలసినప్రత్తి కొసంగవలసిన రైలురేటుకంటె తక్కువ. ఇట్లే జపానునుండి ఇండియాకు దిగుమతియగు కేవుకన్న బొంబాయి నుండి పై పట్టణముల కెగుమతియగుబట్టకు రైలుచార్జీ హెచ్చు ఈవిధముగ విదేశపుదిగుమతులకు సౌకర్యములు కలిగింపబడియున్నవి. ఈ సౌకర్యములు విరమింపబడలేదు. స్వదేశపరిశ్రమ విదేశపుదిగుమతులతో పోటీచేయజాలకుండ కల్పింపబడియున్న యట్టిపరిస్థితిఘటనలు తొలగింపబడలేదు. (4) ప్రారంభదశయందునలె గుడ్డకింకను తయారుచేయ నవసరములేకుండ నూలును ఎగుమతిచేయువర్తకము పునరుద్ధరించుటకు లేశమైన సావకాశములేదు. (5) ఉత్పత్తిఖర్చులు చాల హెచ్చుగ నున్నవి. ఈవిషయము టారిఫ్ బోర్డువారుగూడ అంగీకరించిరి. తగ్గించుటకు రవంతయు సావకాశములేదు. తగ్గించుచో కార్మికులజీవితములు మహాదుర్భరములు కాగలవు. అందులకు కార్మికు లంగీకరించుస్థితియందు లేరు. తగ్గింపజూచుచో సమ్మెలు వచ్చుచున్నవి. సమ్మెలవలన నున్నగోడుకూడ చెడుచున్నది. జపానుదేశమునందు బట్టలమిల్లులలో స్త్రీలు, పిల్లలు కూడ హెచ్చుగ పనిచేయుచున్నారు.

(తక్కువకూలిమీద) "1922 లో 893266 మంది కార్మికులు జపాను బట్టలమిల్లులలో పని జేసిరి. ఇందు 704187 మంది స్త్రీలును, వీరిలో 203221 మంది 16 సం॥లకు లోపుగల పిల్లలును గలరు."[1]

1925 సం॥ లో జపానునందు పురుషుని 1 కి 3.8 మంది స్త్రీల చొప్పున మిల్లులలోనున్నారని టారిఫ్ బోర్డు మదింపు వేసెను. "1924లో హిందూదేశమందు 4.3 మంది పురుషులకు 1 స్త్రీవంతున పనిచేయు చున్నారు."[2]

స్త్రీలు బాలురు తక్కువకూలిమీద పనిచేయుదురు. అందుచే జపానులో నుత్పత్తికర్చులు తక్కువగ నగుచున్నవి. హిందూదేశమం దట్లుగావించుటకు వీలులేదు. ప్రత్తిధర హెచ్చుటతో పాటు గుడ్డధర 100 కి 56 వంతులు పెరిగినమాట నిజమే. కాని యీపెచ్చు ఉత్ప త్తిలో పెరిగిన ఖర్చులకంటె తక్కువగనే యున్నది. "ముడిదినుసులు గాక కూలిఖర్చులు 1914 లో 100 కి రూ 37½ నుండి 1924 లో 100 కి రూ 40 ల వఱకు పెరిగెను. 1921 వ సం॥ నందు కూలి, జీత ములు చాల హెచ్చుగ నున్నవి. పిమ్మట ఇతర మిల్లులలో కొంత వఱకు తగ్గినవి. బొంబాయియం దేమియు తగ్గింప వీలులేక పోయినది. సం। 1924 లో విరాళముల క్రింద (బోనసు) ఒక నెలజీతము వఱకు యియ్యబడుచున్న మొత్తము తగ్గించియే వేయబడెను."[3]

"అయినను యుద్ధమునకు పూర్వకాలముతో పోల్చిచూచిన 100 కి రూ 100 లు జీతబత్తెములు పెరిగెను." [4]

---

*1. From the Studies and reports of the International Labour Office Series B Economic conditions No. 16 Industrial conditions and labour legislation in Japan 1926.*

*2. Tariff Board Report on Cotton industry P. 5.*

*3. Tariff Board Report P. 109.*

*4. Tariff Board Report P. 110.*

"ఇంత పెరిగినను బొంబాయిలో జీవించుటకగు ఖర్చుకంటె జీత బత్తెము లత్యల్పములుగ నున్నవి."[1]

కార్మికుల దుస్థితి బొంబాయియందు చెప్పనలవి కాకున్నది. కార్మికుల కూలిజీతబత్తెములయం దెంతమాత్రము తగ్గించుట కవకాశము లేదు. (6) జపానునందు రాత్రింబవళ్ళు కూలీలను మార్చుచు పనిచేయు చున్నారు. (Double Shifts working) ఇట్లే యిండియాయం దేర్పఱచినను లాభమురాదని మదింపు వేయబడెను. పెట్టుబడిమీాద నగు తరుగు రెట్టించును, దీపములఖర్చున, మేనేజిమెంటున కగు అధిక ఖర్చు మొదలగునవి కలుపుచో నుత్పత్తియందగు ఖర్చువిశేషము తగ్గదు. టారిప్ బోర్డువారు 100 కి రూ 4 లకు లోపుగ తగ్గునవిరి. కాని యీతగ్గుదలలో వారు దీపములఖర్చు చేర్చలేదు. అదియు చేర్చుచో నిదియు ఖర్చు తగ్గజాలదు. ఒకవేళ స్వల్పముగ తగ్గినను యీపద్ధతి అసహజము అమానుషము. రాత్రులుకూడ పనిచేయింప జూచుట తగనిపని. ముఖ్యముగ స్త్రీలు పిల్లలు రాత్రులు పనిచేయుట నిషేధింప వలెను. ప్రోత్సాహింపరాదు. ముఖ్యముగ నీపద్ధతికి కూలీలు అధిక సంఖ్యాకులు కావలసి యున్నారు. బొంబాయివంటి నగరములో కూలీలను నేటికంటె హెచ్చుగ చేర్చుచో ఆపట్టణము పశువుల దొడ్డిగ మారును. మానవమాత్రులు జీవింప శక్యముండదు.

7. జపానుదేశమునందు గుడ్డలపై 100 కి రు 10 లు జపాను ప్రభుత్వము (Bounty) శుల్కమును తీసివేసి 1916 వఱకును సహాయముచేసిరి. ఇండియా జపానులమధ్య ప్రయాణముచేయు నోడలకు సహాయమును చేయకపోయినను జపానుప్రభుత్వమువారు, చైనా తూర్పు ఆఫ్రికాలకు ప్రయాణముచేయు స్వదేశీనావలకు సహాయము చేయుచున్నారు. హిందూదేశములో ప్రభుత్వ మిట్టి సౌకర్యములు

1. *Tariff Board Report P. 113.*

కలిగింపకపోవుటయేకాక వ్యతిరేక పరిస్థితులు నేర్పఱచియుంచి సహాయమైన చేయుటలేదు.

8. యంత్రశాలల నభివృద్ధిపఱుచుకొనుటకు వలయు యంత్రములు విదేశములనుండి తెప్పించుకొనుచో వీటిపై దిగుమతిసుంకము గలదు. అందుచే పెట్టుబడి విశేషమగుచున్నది.

9. "హిందూదేశమున పనివాడు 1కి 180 కదుళ్ళున్నవి. జపానులో 240 కదుళ్ళమీద నొకపనివాడున్నాడు. ఒక్కొక్క నేతగానికి 2 మగ్గములు హిందూదేశమున గలవు. జపానునందు రెండుమూడు గలవు. అమెరికా లాంక్షైరులయందునగూడ కదుళ్ళు మగ్గములు పనివాడు 1కి హెచ్చుగా నున్నవి." [1]

గుత్తపని ఇండియాయందు ప్రవేశపెట్టినచో చాలమంది పనివాండ్రు నిరుద్యోగులగుదురు. మఱియు నితరదేశములకంటె బలహీనులుగను, అనారోగ్యవంతులుగను నున్న భారతీయ కార్మికుల కింతకంటె పని హెచ్చింపరాదు. జీవితవిధానమును లేక అంతస్థును ప్రస్తుతస్థితికంటె నభివృద్ధిపఱచిగాని, పనిని హెచ్చింపరాదు. బొంబాయి మిల్లులు ప్రస్తుతస్థితిలోనే పనిని హెచ్చింపజూచినవి. కార్మికులు సమ్మెకట్టి 1928 వ సం॥ ప్రతిఘటించిరి. అందుచే పనివాని 1కి పని హెచ్చించి ఖర్చులను తగ్గించుట సాధ్యపడదు.

10. విద్యుచ్ఛక్తి నుపయోగించుటకై కంట్రాక్టులను గావించుకొనియుండిరి. యంత్రముల నడుపుఖర్చులనుగూడ తగ్గించుటకు వీలులేదు. ఈపరిస్థితులయందు వస్త్రపరిశ్రమ యిటునటు తన్నులాడుకొనుచున్నది. ఈ పరిస్థితుల నన్నింటిని విమర్శించుచు టారిఫ్‌బోర్డువారీముఖ్యసూచనలను గావించిరి.

---

1. *From Vera Anstey P 276*

1. తెలుపుచేయుటకును రంగులువేయుటకును అద్దకమునకును ప్రభుత్వసహాయమున బొంబాయి యందొక యంత్రశాల నిర్మింపవలెను.

2. 32- డవ నెంబరు నూలునకును ఆపై నెంబర్ల నూలునకును పౌను 1 కి 0-1-0 చొ॥ ప్రభుత్వము సహాయముచేయవలెను.

3. దిగుమతియగుచున్న విదేశపుబట్టలమీాద దిగుమతిసుంకము 100 కి రూ 11 లనుంచి 15 లకు పెంచవలెను. ఇట్లు 3 సం॥ల వఱకు మాత్రమే పెంచియుంచవలెను.

4. బట్టలమిల్లులకు కావలసిన యంత్రములు మొదలగు నితర పరికరముల దిగుమతులపై దిగుమతిసుంకమును తీసివేయవలెను. ఈసూచనలు మిల్లుయజమానులసంఘమువారి కోరిక ననుసరించి లేవు. నూలుపై దిగుమతిసుంకము విధించుచో, చేమగ్గములవారికి కష్టమనిరి. చేమగ్గములు విదేశపునూలునే యుపయోగించుటచే ఆనూలుఖరీదు హెచ్చగు ననియు హెచ్చుఖరీదునూలుతో నేసినబట్టలు ఖరీదు హెచ్చయి వారివృత్తి పోవుననియు బోర్డువారు వాదించిరి. ఈవాదము సక్రమముగ లేదు. చేమగ్గములవారు నేయునూలు సామాన్యముగ 30 వ నెంబరు 40 వ నెంబరు దాటి యుండదు. ఆనూలు హిందూదేశపు మిల్లులయందే లభించుచున్నది. విదేశపునూలు రాకపోయినందున నేవిధమయిన నష్టములేదు. చేమగ్గములకై చౌకగ విదేశపు నూలును దిగుమతి చేయుటకంటె చేమగ్గములువాడునూలు ఖరీదు తగ్గునట్లుగ ప్రభుత్వమువారు విరాళములు నొసంగుట సమంజసము. దిగుమతిబట్టమీాద విధించుసుంకమును అన్ని దేశములనుండి దిగుమతియగు బట్టలమీాదను విధింపవలెననిరి. జపానువారి బట్టలమీాదనే ప్రత్యేకించి విధించి, లాంకషైరు బట్టలమీాద విధించకుండనుండుట తగ

దనిరి. బోర్డువారు గావించిన యీస్వల్పసూచనలైనను ప్రభుత్వము వారి ఆమోదము పొందజాలకపోయినవి. ఒక్క మొదటిసూచనను గుఱించి విచారించెదమనిరి. మిగతాసూచనలను త్రోసిపుచ్చిరి. సహాకార ముగాని సంరక్షణ గాని చిరకాలమునుండియున్న బట్టలమిల్లుల కనవసర మనిరి. 1927 సం॥ జూలైమాసమున ప్రభుత్వ నిర్ణయమును ప్రతి ఘటించుచు బొంబాయిమిల్లు యజమానుల సంఘమువారు వైస్రాయి గారికి మొఱపెట్టుకొనిరి. ఈమొఱ నాలకించి సం॥ 1927 ఆగస్టు మాస మున ప్రభుత్వ మొకశాసనము శాసనసభలో ప్రవేశపెట్టెను. 1927 సం॥ సెప్టెంబరు మాసమందు దాచట్ట మామోదింపబడి శాసన మొనరింప బడెను. ఈశాసనము 3 ఏండ్లు అమలులో నుండును. ఈశాసనము ననుసరించి దిగుమతియంత్రముల పైన దిగుమతి సుంక ముల నెత్తివేసిరి. దిగుమతియగు నూలుపైన పౌ 1కి 0-1-6 లేక కీమ్మతుపైన 100కి రు 5 లు సుంకమును (వీటియందేవిధముగ నధిక ముగ వసూలగుచో నావిధముగ) విధింప నిశ్చయింపబడెను. కాని దిగు మతివస్త్రములపైన సుంకము విధింపబడలేదు. నూలునకు సహాకారము గావించలేదు. నూలుపై విధించిన సుంకమునకు మించుమలె దిగుమతి యగు కృత్రిమపు పట్టునూలుపై యున్నసుంకమును 100 కి రు 15 ల నుంచి రు 7 లకు తగ్గించిరి. 100 కి రు 5 లు నూలుపై విధించి కృత్రి మపు పట్టునూలుపై 7-8-0 తగ్గించిరి. ఇందువలన పట్టుపరిశ్రమ ధ్వం సమై పోవుచున్నది. ఇంగ్లండునుండి దిగుమతియగు కృత్రిమపు పట్టు నూలుదిగుమతికి అవకాశము హెచ్చినది. శాసనసభయందు ప్రజా ప్రతినిధు లీవిధానమును ప్రతిఘటించిరి. కోతినిగొట్టి కొండముచ్చునకు పెట్టినట్లుగ నొక పరిశ్రమకు రవంత సహాయముచేసి వేఱొకపరిశ్రమపై కొండ విసరుట కెవరు సమ్మతింతురు? మఱియు నూలుపై విధించిన 0-1-6 సుంకముతో ప్రత్తిపరిశ్రమ గట్టెక్క జాలదు. ఇందువలన పరి

శ్రమాభివృద్ధికి మార్గము వేయబడలేదు. ప్రజాప్రతినిధుల ప్రతిఘటనను ప్రభుత్వ మెట్లు సరకు జేయును? ఇట్లు 1927 వ సం. శాసనము ననుసరించి 3 ఏండ్లు ముగిసెను. అందుచే 1930–31 సం. ప్రభుత్వాదాయ వ్యయశాసనమునందు మరల మార్పులు మఱి 3 సంవత్సరముల వఱకు గలిగించిరి. దిగుమతి వస్త్రములపై సుంకము విధించుటకు నిర్ణయించిరి.

కాని యీనిర్ణయ మన్ని దేశములనుండి దిగుమతియగుబట్టకు సమానముగ వర్తింపజేయలేదు. లాంకెషైరునుండి దిగుమతిబట్టకు 100 కి రు 15 వంతునను, జపానునుండి దిగుమతియగుబట్టకు 100 కి రు 20 వంతునను నిర్ణయింపబడెను. ఈనిర్ణయము మూడుసంవత్సరములవఱకు నుండును.

"ఇట్టి ప్రభుత్వకృత్యమున తమకు బాధ్యత లేదనియు, ప్రజాభీష్ట విరుద్ధముగ ప్రభుత్వ మీసుంకమును విధించుచున్న దనియు, జపాను ప్రభుత్వమువారికి భారతశాసనసభ్యులగు జాతీయవాదులు తంతిని పంపిరి."* బ్రిటిషుదీవులవారు భారతవర్షమును పరిపాలించుచున్నందులకై బ్రిటిషువర్తకమునకు ప్రత్యేకసమపాయము గావింపవలెనట. ఇదియే సామ్రాజ్యతత్వము. ఈసామ్రాజ్యతత్వమే బ్రిటిషువారి దిగుమతిబట్టపై సుంకము తగ్గించుటకు హేతువు. ఇంగ్లండునుండి బట్టదిగుమతి హెచ్చుగ నున్నందున లాంకెషైరు బట్టలపైనగూడ హెచ్చు విధించుటయందు ధర్మమున్నది.

మరల సెప్టెంబరు 1931 వ సంవత్సరమునందలి అనుబంధ ఆదాయవ్యయశాసనమునందితరదిగుమతులతోపాటు 100 కి 25 వంతులు అధికపుసుంకమును (Surcharge) విధించిరి. ఈసుంకములు పరిశ్రమాభివృద్ధి కొసంగబడుట లేదనియు, పరిశ్రమ క్షీణించకుండ సంరక్షించుటకు మాత్రమే యొసంగబడు చుండెననియు, నాటిఆర్థికసభ్యుడు నుడివెను. 1933 వ సంవత్సరమునకు పిమ్మట మరల విచారింపబడు ననెను.

ప్రభుత్వమువారు వస్త్రపరిశ్రమకు ఎంగిలిమెతుకులను విదల్చినట్లుగ సంరక్షణము నొసంగుచున్నను, 1930 వ సంవత్సరమునుంచియు దేశమునందు జంఝామారుతమువలె వీచిన స్వదేశీయోద్యమమువలన వస్త్రపరిశ్రమ హెచ్చుగ సంరక్షింపబడెను. ప్రభుత్వ ప్రతిఘటనల నెదుర్కొనుచు విదేశస్థులస్వార్థమును లక్ష్యమొనరింపక కాంగ్రెసువారు మిల్లులన్నియుగూడ స్వదేశీవ్రతము నవలంభించు నట్లొనరింపగలిగిరి. బట్టలమిల్లులు హిందూదేశమునందు ఉత్పత్తియగుచుండిన నూలునే వాడుట కంగీకరించినవి. విదేశవస్త్రముల దుకాణములయొద్ద అహోరాత్రములు పికెటింగుచేయబడెను. ప్రజాసామాన్య మంతయు స్వదేశవస్త్రములను గట్టుటకు బూనిరి. ప్రపంచమునం దంతట ఆర్థిక దుస్థితి యలముకొని యున్నను, హిందూదేశమందలి వస్త్రపరిశ్రమ స్వదేశీయోద్యమమువలన అభివృద్ధి జెందెను. ఈ దిగువపట్టికలవలన హిందూదేశమందలి బట్టలమిల్లుల యభివృద్ధిని గ్రహింప గలము.

1 వ పట్టిక.

ఈపట్టిక ననుసరించి బట్టలమిల్లులు ప్రారంభింపబడినది మొదలు 1880 సం॥ వఱకుగల అభివృద్ధిని తెలిసికొనగలము.

| సంవత్సరము | మిల్లుల సంఖ్య | కదుర్లు (వేలలో) | మగ్గములు (వేలలో) | కూలీలు |
|---|---|---|---|---|
| 1851 | 1 | 29 | ... | .5 |
| 1866 | 13 | 309 | 3.4 | 7.7 |
| 1876 | 47 | 1100 | 9.1 | ... |
| 1877 | 51 | 1244 | 10.3 | ... |
| 1880 | 56 | 1461 | 13.5 | 44.7 |

*From Indian Finance Year Book Page 235 (1933.)*

2 వ పట్టిక.

ఈ పట్టిక 1879-80 మొదలు 1903-04 సంవత్సరము వఱకు ప్రతి 5 సంవత్సరముల వఱకును, పిమ్మట మఱి రెండు సంవత్సరముల వఱకును గలఅభివృద్ధిని తెలుపును.

లక్షలు

| సంవత్సరములు | పనిచేయుచున్న మిల్లులు | (Nominal Capital) అంచనా వేయబడిన పెట్టుబడి | పనివాండ్రు | మగ్గములు | కదుర్లు |
|---|---|---|---|---|---|
| 1879-80 మొదలు 1883-84 వఱకు | 63 | 657.6 | 51 | 14.5 | 1610.6 |
| 1884-85 మొదలు 1888-89 వఱకు | 93 | 887.9 | 75.7 | 18.2 | 2296.8 |
| 1889-90 మొదలు 1893-94 వఱకు | 127 | 1161.1 | 116.1 | 25.3 | 3283.8 |
| 1894-95 మొదలు 1898-99 వఱకు | 156 | 1419.5 | 150 | 36.6 | 4046.1 |
| 1899-1900 మొ॥ 1903-04 వఱకు | 195 | 1687.9 | 171.6 | 42 | 5000.9 |
| 1904-05 — | 203 | 1757.5 | 196.4 | 47.3 | 5195.4 |
| 1905-06 — | 204 | 1719.7 | 212.7 | 523 | 5293.8 |

*From Indian Finance year Book 235,*

3 వ పట్టిక.

## మొత్తపు హిందూదేశమందుగల మిల్లులసంఖ్య, స్వదేశ సంస్థానములతో గూడ నీపట్టిక దెలుపుచున్నది.

## Statistical Statement of Mills in India (Including Indian States and Foreign Territories) for the year ending 31st March.

| | మిల్లుల సంఖ్య | మగ్గముల సంఖ్య | కదుళ్ళ సంఖ్య | (1) తూకము జేలు 1కి 400 పౌ॥ చొ॥ వాడిన ప్రత్తిబేళ్ళు | తూకము ఉత్పత్తియైన నూలు పౌనులు | ఉత్పత్తియైన బట్ట తూకము | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | పౌనుల లోను | గజములలోను |
| 1909-10 | 245 | 80171 | 6142551 | 1935010 | 627581562 | 228824078 | 963869482 |
| 1910-11 | 254 | 84627 | 6346675 | 1905866 | 609927141 | 245814873 | 1042741658 |
| 1911-12 | 258 | 87640 | 6427181 | 2050102 | 625030199 | 266644256 | 1136151590 |
| 1912-13 | 266 | 91585 | 6495012 | 2096016 | 688455490 | 285467804 | 1220414529 |
| 1913-14 | 264 | 96688 | 6620576 | 2143126 | 682776851 | 274888550 | 1164291588 |
| 1914-15 | 255 | 103311 | 6598108 | 2102632 | 651984657 | 277205900 | 1135707952 |
| 1915-16 | 267 | 108417 | 6675688 | 2197718 | 722424579 | 352254556 | 1441614550 |
| 1916-17 | 267 | 110812 | 6670162 | 2198164 | 681107231 | 379728816 | 1578132789 |
| 1917-18 | 269 | 114805 | 6614269 | 2085678 | 660575615 | 381404169 | 1614126458 |
| 1918-19 | 264 | 116094 | 6590918 | 2044288 | 615040464 | 349580450 | 1450726160 |
| 1919-20 | 263 | 117558 | 6714265 | 1952318 | 685760273 | 383925750 | 1640047794 |

| | మిల్లుల సంఖ్య | మగ్గముల సంఖ్య | కదుళ్ళ సంఖ్య | (1) తూకము బేలు 1కి 400 పౌ॥ చొ॥ వాడిన ప్రత్తిబేళ్ళు | తూకము ఉత్పత్తియైన నూలు పౌనులు | ఉత్పత్తియైన బట్ట తూకము | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | | | పౌనుల లోను | గజములలోను |
| 1920-21 | 255 | 117953 | 6652474 | 2120230 | 660002597 | 367481791 | 1580449746 |
| 1921-22 | 271 | 123314 | 6814273 | 2203540 | 693571677 | 403520881 | 1731573296 |
| 1922-23 | 289 | 137235 | 7245119 | 2151698 | 705893599 | 405253739 | 1725284187 |
| 1923-24 | 310 | 147087 | 7903196 | 1917748 | 617328632 | 401660958 | 1701574355 |
| 1924-25 | 305 | 150690 | 8286206 | 2226310 | 719389994 | 458839645 | 1970399238 |
| 1925-26 | 303 | 154591 | 8403336 | 2113384 | 686427479 | 465039687 | 1954462650 |
| 1926-27 | 306 | 158124 | 8412817 | 2417412 | 807116133 | 538769358 | 2258716065 |
| 1927-28 | 296 | 159289 | 8236280 | 2009782 | 808940373 | 567806045 | 2356564805 |
| 1928-29 | 292 | 165384 | 8493310 | 2161166 | 648296956 | 445656573 | 1893268655 |
| 1929-30 | 305 | 173281 | 9021629 | 2393714 | 833559849 | 562236708 | 2418981049 |
| 1930-31 | 310 | 173281 | 9021629 | 23937114 | 867044558 | 590336923 | 2561133035 |
| 1931-32 | ... | ... | ... | ... | 966406632 | 672256961 | 2989891101 |

*From Indian Finance year Book 1933 page 244.*

(1) 31 వ ఆగస్టుతో అంతమగు సంవత్సరము

పైమూడవపట్టిక ననుసరించి 1930, 31, 32, వ సంవత్సరములలో వస్త్ర పరిశ్రమ యెట్లభివృద్ధి పొందగలిగినదియు తెలిసికొనగలము. కాని రానురాను జపానువారిపోటీ మితి మీఱినది. సీమవారి పోటీకంటె హెచ్చినది. ఈదిగువ పట్టికవలన ఒకయేటికంటె మఱొక ఏడు జపానువారిదిగుమతు లెట్లు హెచ్చినవో తెలిసికొన గలము. 2 వ పట్టికవలన జపానునందు బట్టలమిల్లు లెట్లభివృద్ధి జెందినదియు తెలిసికొనగలము.

## హిందూదేశమునకు వివిధదేశములనుండి దిగుమతి యగుచుండిన గుడ్డ.

### Imports of Cotton Piece goods in India

మిలియను గజములు.

| | యుద్ధపు పూర్వపు సగటు | యుద్ధపు సగటు | యుద్ధానంతరమందు సగటు | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రిటిషు దీవులు | 2568.7 | 1702 | 1199 | 1466.8 | 1543 | 1456 | 1247 | 523 | 382 |
| ఏడెన్ మొదలగునవి | .1 | .1 | 1.1 | .1 | .2 | 0 | 0 | 0 | ... |
| స్ట్రెయిటు సెటిల్ మెంట్సు | 2 | 9 | 1.5 | 3.5 | 3.3 | 2.5 | 1 7 | .8 | 4 |
| నెదర్లాండు | 23 | 12.7 | 11.4 | 19.7 | 19 5 | 19.6 | 2'.6 | 12.8 | 6.5 |
| బెల్జియము | 4.1 | .5 | .8 | 2.3 | 2 | 2 4 | 1.0 | .4 | .2 |
| స్విట్జరులాండు | 5.2 | 2.4 | 3.2 | 11.8 | 14.8 | 11.1 | 10.2 | 6.1 | 7.5 |
| ఇటలీ | 10.5 | 9.1 | 4.3 | 17.2 | 26.8 | 37 6 | 25.4 | 9.9 | 9 |
| జపాను | 3.1 | 97.6 | 113.4 | 243.5 | 323 | 357.5 | 561 | 320 | 338.8 |
| అమెరికా (సంయుక్త) | 10.6 | 12.7 | 12.3 | 15.6 | 28.2 | 29 | 33 | 9.4 | 16.7 |
| చైనా | .7 | .8 | 2.3 | ... | 7.4 | 18.5 | 6.4 | 2.9 | 3.9 |
| ఇతరదేశములు | 8.2 | 2.5 | 4.5 | 6.9 | 5.2 | 6.4 | 10 | 3 | 10 |
| మొత్తం | 2631 | 1840 | 1351 | 1788 | 1973 | [illegible] | [illegible] | 889 | 776 |

*From Indian Finance Year Book Page 241.*

## జపానువారి బట్టల మిల్లుల అభివృద్ధి. Progress of Japanese Cotton Mills.

2 వ పట్టిక.

| సంవత్సరము | మిల్లుల సంఖ్య | కదుళ్ళ సంఖ్య | పనిచేయుచున్న కదుళ్ల సగటు సంఖ్య | మగ్గముల సంఖ్య | రోజు1కి పనిచేయుచున్న కూలీల సగటు సంఖ్య | ఉపయోగించుచున్న ప్రత్తి సగటు బేలు 1కి 500 పౌ॥ బరువు |
|---|---|---|---|---|---|---|
| 1910 | 136 | 2099764 | 1741168 | 17702 | 109970 | 1087148 |
| 1920 | 198 | 3818580 | 3191758 | 50588 | 190801 | 1704633 |
| 1921 | 217 | 4161126 | 3162358 | 54994 | 179868 | 1721098 |
| 1922 | 235 | 4517612 | 3967265 | 60765 | 219410 | 2095760 |
| 1923 | 228 | 4197966 | 4079855 | 61421 | 208481 | 2039405 |
| 1924 | 232 | 4370232 | 4115692 | 64225 | 204557 | 1938027 |
| 1925 | 243 | 5447184 | 4669758 | 68350 | 229828 | 2267757 |
| 1926 | 247 | 5679852 | 5016467 | 77043 | 238662 | 2454250 |
| 1927 | 257 | 6116266 | 4662569 | 78352 | 210895 | 2378241 |
| 1928 | 259 | 6467174 | 4988089 | 81209 | 198468 | 2280861 |
| 1929 | 258 | 6836516 | 6149365 | 77898 | 214628 | 2607212 |
| 1930 | 263 | 7214001 | 5608080 | 79466 | 154683 | 2342184 |
| 1931 | 263 | 7585146 | 6079876 | 77782 | 152742 | 2408104 |

31 వ డిశంబరుతో అంతమగు సంవత్సరము.

*From Japanese Cotton Spinners' Association quoted by Indian Finance Year Book, P. 237.*

జపానుదేశము మిల్లులను అభివృద్ధిజేసి అధికముగ బట్టను ఎగుమతి చేయగలుగుటయేగాక చెలామణీనాణె మగు 'యన్న' యొక్క విలువను తగ్గించివేసెను. రూపాయవిలువకంటె యన్నవిలువ చాల తగ్గినది. అందువలన జపానువారిగుడ్డను చౌకగ దిగుమతి చేయగలుగుచున్నారు. (నాణెములవిలువ తగ్గుటవలన దిగుమతులు ఎట్లు హెచ్చుటకు వీలున్నదియు, నాణెపు లచెలామణి ప్రకరణమున వ్రాయబడె.) హిందూదేశప్రభుత్వము సువర్ణప్రమాణ వినిమయమును విరమించినది మొదలు జపానుదేశ మొకింత నష్టపడెను. హిందూదేశము సువర్ణప్రమాణ వినిమయమును విరమించినపిమ్మటగూడ జపానువారు కొంతకాలము సువర్ణప్రమాణమును వీడలేదు. ఈకాలమున బట్టలయెగుమతియందు నష్టముగలిగినను హిందూదేశపుప్రత్తిని చౌకగ జపానువారు కొని నిలువజేసికొనగలిగిరి. పిమ్మట జపానువారు తమనాణెమునకు విలువను తగ్గించిరి. ఇందువలన తమబట్టను విదేశములకు చౌకగ బంపగలుగుచున్నారు. జపానువారి నాణెములచెలామణీ విధానము వలన వారు ప్రత్తిని చౌకగ కొనగలుగుటయే కాక బట్టనుగూడ చౌకగ విదేశములయం దమ్మగలుగుచున్నారు. ఇట్లు జపానువారికి రెండువిధముల లాభము గలిగినచ్చుటచే జపానువారిబట్టతో హిందూదేశము పోటీ చేయజాలకపోవుచున్నది. 1932 వ సంవత్సరమున ఫ్యాక్టరీమున బొంబాయి బట్టలమిల్లులవారు కారణముల నెత్తిజూపుచు నిరోధనామా సంఘమును నియమించవలెనని ప్రభుత్వమువారిని కోరిరి. వీరినివేదిక 1934 వ సంవత్సరము ఫిబ్రవరినెలలో మాత్రమే ప్రకటింపబడెను. అంతవరకును ప్రభుత్వమువా రీనివేదికను ప్రకటింపకపోవుటకు గల కారణములను వివరింపలేదు. అయినను అంతకును బొంబాయిమిల్లు యజమానులకు భయోత్పాతము గలిగించిన జపానువారి దిగుమతులను నిరోధించుటకు గొంత ప్రయత్నించిరి.

ఈ దిగువ పట్టికవలన జపానుదేశమువారిబట్ట దిగుమతి ఎట్లు హెచ్చినదియు తెలిసికొనగలము. జపానునుండి బొంబాయిరేవునకు జరిగిన దిగుమతి.

| దేశము | 1931 వ జూన్ (పౌనులు) | 1932 మే (పౌనులు) | 1932 జూన్ (పౌనులు) | 1932 వ మే కంటె 1932 వ జూన్ లో గల పెచ్చు 100 కి | 1931 వ జూన్ కంటె 1932 వ జూన్ నందుగల పెచ్చు 100 కి |
|---|---|---|---|---|---|
| Grey Cotton yarn<br>శ్లో రానూలు | 6957 | 280000 | 536800 | 91.71 | 7637.80 |
| | గజములు | గజములు | గజములు | 100 కి | 100 కి |
| జపానువారి అన్ని విధములగు బట్టల దిగుమతియు కలిసిన మొత్తం | 11983341 | 15173896 | 28197453 | 85.83 | 135.30 |
| ఇతర దేశములనుండి యగుచుండిన దిగుమతి | 11394283 | 13418791 | 12432493 | ... | 9.11 |

జపానువారి 1932 వ సంవత్సరపు జూను నెలయందలి బట్ట దిగుమతులు హిందూదేశమొత్తమున మే కంటె 100కి 39 వంతు లధికముగ గలవు. 1931 వ సంవత్సరపు జూను కంటె 100కి 85 వంతుల హెచ్చుగలదు.*1

ఇట్లధికమగుచుండిన జపానువారి బట్టలదిగుమతిని నిరోధించు మార్గముల నరయుట్కై 1932 సం॥ జూలై 25 తేదీని హిందూదేశ ప్రభుత్వమువారొకనిరకునామాసంఘమువారిని నియమించిరి. ఈసంఘమువారికి సీమవారి బట్ట దిగుమతిపై విచారించుట కధికారము నొసంగలేదు. ఆంగ్లేయేతర దేశములనుండి దిగుమతియగు బట్టపై సుంకములను హెచ్చించుట అవసరమా ? అనవసరమా ? హెచ్చించిన ఎంతవఱకు హెచ్చింపవలయును అనుప్రశ్నలపై ఈనిరకు నామసంఘము వారు విచారింప నియమింపబడిరి. వీరి నివేదిక సెప్టెంబరు 2 వ తేదీని ప్రకటింపబడెను. ఈ నివేదికపై ప్రభుత్వమువారు వెంటనే చర్యగైకొనిరి. 1930 వ సంవత్సరమునందు ఆంగ్లేయేతర దేశముల దిగుమతిబట్టపై విధించిన 20% కిమ్మతు సుంకమును మరల 50% కిమ్మతు సుంకముగ హెచ్చింప నిర్ణయించిరి. విడివిడిగ వస్తువులపై విధింపబడు నిర్ణీతమగు పౌను 1కి 0-5-3 సుంకమునుగూడ విధింప బడును. ఇట్లు 31 మార్చి 1933 వ తేదీవఱకు అమలు జరుపబడును. 1931 వ సం. అధికపు పన్నుల ఆర్థికశాసనము ననుసరించియు 1931 వ సం॥ అనుబంధ ఆర్థికశాసనము ననుసరించియు వేయబడు సుంకములీ హెచ్చుసుంకములపై విధింపబడవు.[2]

31 మార్చి 1933 వ తేదీని మరల హిందూదేశ ప్రభుత్వము వారు ఆంగ్లేయేతర దేశముల దిగుమతిబట్టపై గల సుంకములను

1. *From Indian Tariff Board's Cotton Textile Industry Report P. 8- 1932*

2 *Indian Finance (Supplementary and Extending) Act of 1931.*

హెచ్చించుచు ప్రకటించిరి. ఈ ప్రకటన ననుసరించి పౌను 1కి గల 0-5-3 సుంకము, 0-6-6 కును కిమ్మతుసుంకము 50% నుండి 75% వఱకును హెచ్చెను. ఈ హెచ్చుదలపిమ్మట సంభవించిన పరిస్థితులు వేఱొక ప్రకరణమున వివరింపబడెను. జపానువారితో గావించుకొనిన సంధిషరతుల వివరములు 'భారతీయవర్తక' మను అధ్యాయమున విమర్శింపబడెను. ఇచ్చట మఱొకవిషయము మాత్రము గమనింప వలసి యున్నది. బొంబాయిమిల్లులలో వ్యయభారమును తగ్గించుటకు గూడ మార్గములు కలవని కొందఱి విశ్వాసము. ఇందుల కెంతమాత్రమును సావకాశము లేదనియు మిల్లుల యాజమాన్యము సరిగా లేదనుట అపవాద మనియు, మిల్లుల యజమానులు చెప్పుచున్నారు. 1932 వ సంవత్సరమున నియమింపబడి 1934 వ సంవత్సరమున ప్రకటింపబడిన నిరకునామాసంఘమువారి నివేదికయు ప్రత్యేకసంరక్షణము లేనియెడల బొంబాయిమిల్లులు పనిచేయజాల వని వ్రాసిరి. కాని "మానేజింగు ఏజెంట్ల పద్ధతి సక్రమముగ లే"దని నిరకునామాసంఘమువారు వ్రాసిరి. డైరెక్టరులును వాటాదారులును మిల్లుల పరిపాలనయందు తగుశ్రద్ధ వహించునటుల ప్రభుత్వమువారు శాసనముల నొనరింపవలెనని సూచించిరి. మేనేజింగు ఏజెంట్ల ఆర్థిక నీతి సక్రమముగ లేదనిరి. బొంబాయిమిల్లుల మానేజింగు ఏజంట్లపద్ధతి సంస్కరింపబడక తప్పదు. బొంబాయిరాష్ట్ర ప్రభుత్వ మీపరిశ్రమను స్వాధీనపఱచుకొని దేశాభ్యుదయ కరముగ నడుపప్రయత్నించుటయు యోచింపఁదగును. ఏపరిశ్రమయు స్వదేశాభిమానముపై ప్రభుత్వప్రత్యేకసంరక్షణపైన మాత్రమే ఆధారపడరాదు. స్వయముగ నెంత తక్కువ వెలకు సరకు నుత్పత్తిచేయగలుగునో నంతతక్కువ వెలకు ఉత్పత్తి చేయుటకుగూడ బూనవలెను. నిరకునామాసంఘము వారి సూచనలు వెలువడినపిమ్మట మిల్లులయజమానులు ఆత్మపరీక్షకు

గడంగవలసిన యవసరము హెచ్చినది. నిరకునామాసంఘమువారు సూచించిన సంరక్షణమువలన పరిశ్రమఅభివృద్ధి కాజాలదు. నిరకు నామాసంఘమువారు కోరామల్లుబట్టకు పౌను 1 కి 0-5-0, అంచు కోరాబట్టకు 0-5-3, తెలుపుబట్టకు 0-6-0 రంగుఅద్దకమ్ముబట్టలకు 0-6-4 ల చొప్పున దిగుమతిసుంకమును విధించవలెననిరి. ఈసుంకమును 10 సంవత్సరములవఱకు తగ్గింపరాదనియు ప్రభుత్వమువారికి కావలసిన ఆదాయము ననుసరించి అవసరము వచ్చినప్పుడెల్ల కిమ్మతు సుంకములను విధింపవచ్చుననియు సూచించిరి. నూలుదిగుమతిపైన సుంకమును 0-1-0 తగ్గించిరి. ఈసుంకమైనను 50 వ నెంబరునకు తక్కువగనుండు నెంబర్లనూలుపైన మాత్రమే విధింపవలె ననిరి. ఇందువలన లాంకషైరునుండి నూలు విస్తారముగ దిగుమతియగును. విదేశపుసన్ననూలుతో బట్టలను నేయు నేతపనివాండ్రకు చౌకగ నూలు లభించును. వరివృత్తికి కొంచెము ప్రోత్సాహము కలుగును.

ఈనిరకునామానీతివలన స్వదేశవస్త్రపరిశ్రమ యభివృద్ధి పొందునని విశ్వసించుటకు సావకాశము లేదు. దుర్భరమైన వర్తమానార్థిక దుస్థితియందు స్వదేశిఉద్యమమే భారతీయవస్త్రపరిశ్రమను సంరక్షింపగలదు. భారతీయులందఱు భారతదేశమందలి మిల్లుబట్టను ఖద్దరును నేతబట్టను మాత్రమే కట్టుచో విదేశపుదిగుమతులు సహజగతిని తగ్గిపోగలవు.

## 23. ఖద్దరుపరిశ్రమ.

ఖద్దరు-పౌరాణిక యుగము.

భారత రాజకీయాందోళనకు ఆర్థికదుస్థితియే మూలమని మహాత్మాగాంధీ లోకమునకు చాటుచున్నారు. రాజకీయాందోళనాపరుల దృష్టిని చిరకాలముక్రిందనే నశింపుచేయబడిన ఖద్దరు పరిశ్రమవంకకు మరల్చినాడు.

పౌరాణికయుగమునుండి చారిత్రక యుగమునుండి ప్రపంచప్రఖ్యాతి గాంచి మహోన్నతదశయం దున్న భారతదేశ ఖద్దరువస్త్రపరిశ్రమ గతించిన రెండుశతాబ్దములనుండియు రూపుమాసిపోయినది.

"వేదములు పుట్టినప్పుడే దారమును వస్త్రమును బుట్టినవి. సాలెలును వేదాంతులును హైందవప్రతిభకు మొదటిదృష్టాంతములుగా జెప్పవచ్చును. వేదాంతుల బ్రహ్మసూత్రములవలన సర్వోత్కృష్ట మయిన బ్రహ్మవిద్యయును తంతుకారుల కార్పాససూత్రములవలన అతిసున్నితములైన వస్త్రములును నిర్మింపబడినవి. ఈజిప్టు మహో న్నతములైన శివాలయములను, బాబిలోను ఉత్కృష్టములైన ధర్మ శాస్త్రములను నిర్మించినకాలమునందే ఆర్యులు అనుపమేయమయిన నీమహదారంభములలో విజయము గాంచియుండిరి. తాత్వికులు తమ (తత్త్వవాయువులతో) జ్ఞానతంతువులతో ఆత్మను పరిష్కరించి అజ్ఞా నతమస్సును బోగొట్టుచుండగా తంతువాయులుతమ దేహమును తమ వస్త్రములతో నలంకరించి మానమును గాపాడుచుండిరి. ఆర్యుల స్వర్ణ యుగము యొక్కయు నాగరికతయొక్కయు ప్రతిబింబములు తాత్వికు డయిన వేదాంతియు కళాప్రవీణుడయిన తంతువాయుడు నని చెప్ప వచ్చును.

ఋగ్వేదములో ఇంటియజమానులు పడుగును పేకను అమర్చి నేసినట్లు చెప్పబడియున్నది. (10-30) ఋషులు పరమాత్మను మా యను పడుగుపేకలతో పోల్చుటనుబట్టి వారిమనస్సులకు నేత యెంత నచ్చినదో గ్రహింపవచ్చును.

ఋగ్వేదములో నేతనుగూర్చి అనేకసార్లు ప్రస్తావించియున్నారు. యజ్ఞమనే నేతను అహోరాత్రములనే సాలెస్త్రీలు ఒకదానితరువాత నొకటి అల్లినట్లు ఋగ్వేదములో వర్ణింపబడినది. జగత్సృష్టి నిమిత్తమై ప్రజాపతిచేసినయజ్ఞము వడకుటనేయుటలతో పోల్చబడినది. వేదయుగములో నేత గృహస్థ ధర్మములలో నొకటిగా పరిగణింపబడినది. ఎలుకలు పడుగుదారలను రాత్రులుకొఱుకుట సర్వసాధారణమై యుండుటచేత గాబోలు ఋగ్వేదములో (౧౦-33-3) నొకచోట "ఎలుకలు సాలెవానిదారములు కొఱికినట్లు చింతలు నా మనస్సును నెఱియుచున్న" వని వ్రాయబడినది. ఆకాలములో నేత సర్వసామాన్యముగా అందరికి తెలియుటయే కాక దానియందలి నైపుణ్యము గూడ గమనించ బడినది. "నేర్పులైన సాలీండ్రు వస్త్రముల నేసినట్లు మీరు గేయముల నల్లుడు" (10-10-6) అను వాక్యముల వల్లను దివ్యులయిన "ఋషులు ఆకాశమునను సముద్రపు టడుగుభాగమునను నిరంతరము నేయుచునే యున్నారు." (1-149-4) అను వాక్యముల వల్లను పై విషయము స్పష్టపడు చున్నది—

"తండ్రులు తమవంశ నంతరింపక పరంపరగా సాగుటకు సంతానమును భూమిమీద ఎడతెగకసాగునట్లు నడికినదారమువలె నిలిపినారు". (తంతుమాతత-౧౧౦-౫౬౬.) అని ఋగ్వేదము చెప్పుచున్నది. మఱియొక వాక్యములో ఋషుప్తుని వేసినదారముగా వర్ణింపబడినది.

వాల్మీకిరామాయణమున బాలకాండములో సీతకు ఊర్ణవస్త్రములును, విలువగల రత్నములును, దుకూలములును, నిషిధవర్ణముల దుస్తులును, రాజయోగ్యమైన భూషణములును, అనేకవిధము లయిన వాహనములును, రథములును కలిగి యుండినట్లు చెప్పబడినది. భారతమున సభాపర్వములో యుధిష్ఠిర చక్రవర్తి భరత ఖండములో వివిధ

భాగములనుండి వచ్చిన సామంతరాజులు బంగారపు సరిగంచులుగల ఉన్నివస్త్రములు కానుకలిచ్చినట్లు వ్రాయబడియున్నది.

వడుకుటయును నేతయును సర్వసామాన్యముగా ప్రతి గృహమందును అవలంబింప బడుచుండెను. ప్రస్తుతము అస్సాము దేశములో వలెనే పూర్వము మనదేశమందలి ప్రతిగృహిణియును వడుకుచు, నేయుచు నుండెను. వడుకుటయును, నేతయును భార్యయొక్క ధర్మములుగ విధించిన వాత్స్యాయనఋషి ఆకాలపుఆచారమునుబట్టియే యిట్లు వ్రాసి యుండును. (కార్పాసస్యసూత్రకారణం సూత్రస్యవానం ఆచ్ఛాదనార్థం)అని వాత్స్యాయనుడు కామసూత్రములలో భార్యాధికరణమున జెప్పియున్నాడు. (ఈవిషయములు రాటము-మగ్గము అను గ్రంథమునుండి గ్రహింపబడెను.)

ఇట్లు గృహపరిశ్రమగ నింటింట వెలసినఖద్దరు ఆంగ్లేయయుగమునం దెట్లు నశించిపోయినదియు వేఱొకచోట వ్రాయబడెను. ఇట్లు పునరుద్ధరింపబడుటకై గావింపబడుచున్న ప్రయత్నములనే గమనింపవలసియున్నది.

"1920 సం. రము కలకత్తాయందు సమావేశమైన అఖిలభారత చర ప్రత్యేక కాంగ్రెసు మహాజనసభవారు మొట్టమొదట ఖాసంఘు చరిత్ర ఖద్దరుధారణమును గుఱించి తీర్మానించిరి. నూలు వడుకుటయు, నేత నేయుటయు, నేసినగుడ్డను కట్టుటయు, ప్రతిపురుషునకు, స్త్రీకి బాలునకు ఎల్లరకును త్యాగమనియు

సుశిక్షణను గఱపుననియు తీర్మానింపబడెను. నాగపురమందు సమావే శమైన కాంగ్రెసు మహాజనసభవా రీతీర్మానమును మరల నామో దించిరి. బెజవాడయందు సమావేశమైన అఖిలభారత కాంగ్రెసుసంఘ మువారు 20 లక్షల రాటములతో పని ప్రారంభింపవలెనని తీర్మానిం చిరి. ఆనాటనుండియు కాంగ్రెసుసంఘములే ఖద్దరుపనిని జేసెను. 1922 వ సంవత్సరమున అఖిలభారతకాంగ్రెసుసంఘము ఖద్దరుశాఖ నొకదాని నేర్పఱిచెను. 1923 డిశంబరునందు సమావేశమైన కాకినాడ కాంగ్రెసు మహాజనసభ ఖాదీబోర్డును నియమించెను. రాష్ట్రములయందు గూడ ఖాదీబోర్డు నియమింపబడెను. ఈరాష్ట్రబోర్డులను రాష్ట్రీయకాంగ్రెసుసంఘములు స్థాపించెను. 1925 వ సంవత్సరమునం దీఖాదిబోర్డులు రద్దుచేయబడినవి. అఖిలభారత చరఖాసంఘమును మహాత్మా గాంధీగారు స్థాపించిరి.

పాట్నాయందు అఖిలభారత కాంగ్రెసు సంఘము 1925 వ సెప్టెంబరులో సమావేశమయ్యెను. ఆసమావేశమునందు సమావేశమై మహాత్ముని యుపపాదన ననుసరించి ఖద్ధరుపరిశ్రమను కాంగ్రెసుకార్య క్రమమునుండి ప్రత్యేకింపబడెను. అంతవఱకు కాంగ్రెసు సంఘములచే, పెట్టబడిన పెట్టుబడికూడ చరఖాసంఘమున కొసంగబడెను. ఈసంఘము నకు వలయు నియమావళి సెప్టెంబరు 23 వ తేదీని నిర్ణయింపబడెను. అంతటనుంచియు ఖద్దరు పరిశ్రమవలె నడుపబడుచున్నది.

నియమావళి.

ఈచరఖాసంఘమునకు 12 మంది శాశ్వతసభ్యులు ధర్మకర్తలుగనుందురు. మఱిముగ్గురు సంఘసభ్యులవలన సంవత్సరమునకొకమాఱు ఎన్నుకొనబడుచుందురు.

శ్రీయుతులు (1) మహాత్మాగాంధీ (2) సేటుజమనాలాలుబజాజు (3) సి. రాజగోపాలాచార్యులు (4) దేశపాండ్య (5) కొండావెంకటప్పయ్యపంతులుగారు. (6) బాబూరాజేంద్రప్రసాదు (7) పండిత జవహరలాలునెహ్రూ (8) సతీశచంద్రదాసుగుప్త (9) వల్లభభాయిపటేలు (10) మనీలాలుకొఠారి (11) రణచోడలాలు అమృతలాలు (12) బ్యాంకరు. వీరు 12 గురును శాశ్వతధర్మకర్తలు. ఇందు నలుగురు సభ్యులు హాజరగుచో సభజరుపవచ్చును. ఈధర్మకర్తలకు పెట్టుబడిపై సర్వాధికారము గలదు. ఈసంఘమునకు నెల 1 కి 1000 గజముల వడుకు నూలును చందాయొసంగిన వారందఱు సభ్యులగనుందురు. వీరు విడవకుండ ఖద్దరును కట్టుచుండవలెను. క్రాంగ్రెసు మహాజనసభ కొసంగిన నూలుచందాకూడా చరఖాసంఘమున కొసంగినచందాగా గ్రహింపబడును.

ఏసభ్యుడైనను వరుసగ ఆఱుమాసములవఱకు నూలుచందాను పంపనియెడల ఆతనిసభ్యత్వము తీసివేయబడును.

పెట్టుబడి.

ఈచరఖాసంఘమునకు 27 లక్షలు పెట్టుబడి కలదు. వివిధరాష్ట్రములయందీమొత్తముపెట్టుబడి పెట్టబడి వ్యాపారము జరుపబడుచుండెను. ఇందు 7 లక్షల మొత్తము అప్పులక్రింద ఇతరఖద్దరుసంస్థల కొసంగబడెను.

30–9–1930 వ తేదీవఱకు అఖిలభారత చరఖాసంఘమువారు వివిధరాష్ట్రములయందు పెట్టిన పెట్టుబడి నీదిగువపట్టిక దెలుపును.

| రాష్ట్రములు | రూపాయలు |
|---|---|
| ఆంధ్రదేశము | 347412- 2- 5 |
| అస్సాము | 6800- 6- 6 |
| బీహారు | 261147- 1- 1 1/2 |
| వంగము | 303050- 0- 0 |
| బొంబాయి | 246575- 4- 8 |
| బర్మా | 24008-15- 2 |
| మధ్యరాష్ట్రములు | 2500- 0- 0 |
| కర్ణాటకము | 125712-12- 6 1/2 |
| గుజరాతు | 12581- 5- 6 |
| మహారాష్ట్రము | 126480- 4-11 1/2 |
| పంజాబు | 117340- 3- 9 |
| రాజస్థానము | 175825- 9- 7 |
| సింధు | 14000- 0- 0 |
| తమిళము | 543482- 3- 5 |
| సంయుక్తరాష్ట్రములు-ఢిల్లీ | 320462-14- 0 |
| ఉత్కళము | 98472-15- 9 1/2 |
| మొత్తము | 2725861- 3- 0 |

ఆంధ్రము, బీహారు, కర్ణాటకము, ఉత్కళములయందుగల పెట్టుబడిలో ఖాదీబోర్డులతాలూకు ఋణముల మొత్తముగూడ గలదు.

సిబ్బందీ.

ఈఖద్దరు పరిశ్రమయందు 2000 మంది పనిచేయుచున్నారు. చరఖాసంఘముగాక చరఖాసంఘమువారి సహాయమును బొందుచున్న సంఘములయందునను వ్యక్తుల ఖద్దరువ్యాపారమునందునను పనిచేయుచున్నవారిసంఖ్య వివరముగ దెలియదు.

చరఖాసంఘముక్రింద 1145 మంది సిబ్బందీకలదు. ఈదిగువ పట్టికవలన వివిధరాష్ట్రములయందలి సిబ్బందీవివరములు తెలియగలవు.

| | |
|---|---|
| అ. భా. చ. సంఘము ఆఫీసు | 12 |
| సాంకేతిక విద్యాలయములు | 5 |
| ఆంధ్రము | 116 |
| బీహారు | 159 |
| బొంబాయి | 60 |
| బర్మా | 8 |
| కర్నాటకము | 105 |
| కత్తియవారు | 5 |
| మహారాష్ట్రము | 59 |
| పంజాబు | 41 |
| రాజస్థానము | 96 |
| సింధు | 8 |
| తళమిము-కేరళము | 209 |
| సంయుక్తరాష్ట్రములు, ఢిల్లీ | 218 |
| ఉత్కళము | 44 |
| సంయుక్తరాష్ట్రములు | 10 |
| మొత్తము | 1145 |

ఈసిబ్బందీ 638 దుకాణములలో పనిచేయుచున్నారు. ఇందు 264 అ. భారతసంఘమువారి దుకాణములయందునను, 61 సహాయము

నుపొందుచున్న దుకాణములయందునను, 313 మంది వ్యక్తుల దుకాణములయందునను గలరు.

1926 వ సంవత్సరము నుంచియు ఖద్దరుసిబ్బందీ యనుపేర (Khadi Service) ఉద్యోగస్థులశాఖ ఏర్పఱుపబడెను. ఈయుద్యోగస్థుల శాఖలో జేరువారికి శిక్షణవిధానముగూడ నేర్పఱుపబడెను. ముందుగ మూడుమాసములు శిక్షణ బొందవలయును. పిమ్మట వరుసగ రెండు సంవత్సరములు శిక్షణగరుపబడును. కట్టకడపట మఱి 9 మాసములు అనుభవమును సంపాదించుటకై యొకఖాదీ పరిశ్రమాలయమునందు పనిచేయవలయును.

| | |
|---|---|
| ప్రత్తిపట్టుట | 2 వారములు |
| ఏకుట | 7 ,, |
| వడకుట | 21 ,, |
| నేయుట | 42 ,, |
| వస్త్రాంగము | 12 ,, |
| అద్దకము వేయుట | 8 ,, |

హిందీభాష నేర్చుకొనుట, లెక్కలను వేయుట, మిగిలిన కాలము మొదలగు శిక్షణ మొసంగబడును.

ఉత్పత్తి విడుదల. 1930 సెప్టెంబరు 30 వ తేదీవఱకునుగల ఖాదీఉత్పత్తియు విడుదలయు నీపట్టికవలన గ్రహింపగలము.

| రాష్ట్రము | ఉత్పత్తి రు. | అమ్మకము రు. |
|---|---|---|
| అంధ్రము | 802387 | 825001 |
| బీహారు | 401359 | 450096 |
| బెంగాలు | 495747 | 895833 |
| బొంబాయి | ... | 536472 |
| బర్మా | ... | 39624 |
| గుజరాతు | 46617 | 276856 |
| కర్ణాటకము | 98800 | 444232 |
| కాశ్మీరము | 222802 | 76756 |
| మహారాష్ట్రము | 119895 | 404996 |
| పంజాబు | 303892 | 267826 |
| రాజస్థానము | 486268 | 212313 |
| సింధు | ... | 104674 |
| తమిళనాడు, కేరళము | 1624411 | 1196607 |
| సంయుక్తరాష్ట్రములు, ఢిల్లీ | 814320 | 788217 |
| ఉత్కళము | 75162 | 100366 |
| మొత్తము | 5491610 | 6619869 |

ఈఖాదీఉత్పత్తివలన 6909 గ్రామములలో పని జరిగెను. 1196 గురు ఏకువారును 179553 గురు వడుకువారును 13733 గురు నేయువారును ఫలితములను పొందిరి.

ఈపట్టిక వివిధరాష్ట్రములయందు ఖాదీఉత్పత్తివలన ఫలితము పొందినవారి సంఖ్యను తెలుపుచున్నది.

| రాష్ట్రము | గ్రామములు | ఏకువారు | వడుకువారు | నేత నేయువారు |
|---|---|---|---|---|
| ఆంధ్రము | 674 | 436 | 20716 | 1246 |
| బీహారు | 778 | ... | 16432 | 1181 |
| బెంగాలు | 81 | ... | 3025 | 441 |
| గుజరాతు | 301 | ... | 4356 | 79 |
| కర్ణాటకము | 581 | 43 | 7879 | 505 |
| మహారాష్ట్రము | 2[illegible]1 | 227 | 4760 | 1386 |
| పంజాబు | 311 | ... | 65844 | 1336 |
| రాజస్థానము | 563 | 490 | 13062 | 2714 |
| తమిళము | 2983 | ... | 38997 | 3210 |
| సంయుక్త రాష్ట్రములు, ఢిల్లీ | 332 | ... | 2292 | 1560 |
| ఉత్కళము | 89 | ... | 2100 | 75 |
| మొత్తము | 6909 | 1196 | 179458 | 13733 |

వంగము, సంయుక్తరాష్ట్రములు, ఢిల్లీ రాష్ట్రముల అంకెలు సంపూర్ణముగాదు. వడుకువారే చాలతావులయందు ఏకువారుగ నుండుటవలన ఏకువారిసంఖ్య తక్కువగనున్నది.

ఈదిగువపట్టిక ననుసరించి 1929-30 వ సంవత్సరమున కూలి క్రింద వివిధరాష్ట్రములయం దొసంగబడిన సొమ్మువివరములను దెలిసి కొనగలము.

| రాష్ట్రము | వడుకువారు రు. | నేయువారు రు. |
|---|---|---|
| ఆంధ్రము | 209379- 8-5 | 285053-10-5 |
| బీహారు | 99939- 7-9 | 80568- 7-9 |
| కర్నాటకము | 28758- 0-0 | 22784- 0-0 |
| మహారాష్ట్రము | 40084- 9-8 | 88883- 1-8 |
| పంజాబు | 51588-11-6 | 71505-11-6 |
| రాజస్థానము | 88500- 0-0 | 182750- 0-0 |
| తమిళము | 411602- 0-0 | 454884- 0-0 |
| సంయుక్తరాష్ట్రములు ఢెల్హీ | 160183-15-6 | 117812- 8-9 |
| ఉత్కళము | 12264- 0-0 | 10289- 0-0 |
| మొత్తము | 1102245 -4-5 | 1220475- 7-8 |

ఆంధ్రదేశము- ఖాదీ ఉత్పత్తి. ఆంధ్రరాష్ట్రమునందు 1920 వ సంవత్సరమునకు పూర్వమే కొన్నికొన్ని గ్రామముల యందు నూలు వడుకుట నేయుట కలదు. ఖాదీ ఉద్యమము పునరుద్ధరింపబబడినపిమ్మట, ఆంధ్రరాష్ట్రమునం దీయుద్యమము తీవ్రముగ వ్యాపించెను. 1921-1922 వ సంవత్సరములయం దితరరాష్ట్రములకుగూడ ఆంధ్రరాష్ట్రమే ఖాదీని సరఫరా జేసెను. బీదలకు, భాగ్యవంతులకు, మధ్యతరగతివారికి, అందఱకును పనికి వచ్చు అన్నివిధములగు గుడ్డలు ఆంధ్రదేశమున తయారగుచున్నవి.

8 మొదలు 12 వఱకును, 12 మొదలు 16 వఱకును గల నెంబర్ల గుడ్డ ప్రతిజిల్లాయందునను గలదు. 16 మొదలు 25 వఱకును గల నెంబర్లగుడ్డ కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలయం దుత్పత్తి యగుచున్నది. విశాఖపట్నం, గంజాంజిల్లాలయందు సన్నగుడ్డ సుప్రసిద్ధముగ తయారుచేయబడుచున్నది. ఈ జిల్లాలయందు వెలకు నూలు 20 మొదలు 40 నెంబరు వఱకును, పట్టుసాలి నూలు 40 మొదలు 120 నెంబరు వఱకును వడకబడుచున్నది. ఈ నూలుతో నేసినబట్ట ఖరీదు హెచ్చుగనున్నను, మన్నిక చాల హెచ్చుగనుండును. పట్టుసాలినూలుతో నేయబడిన బట్టలలో పట్టంచులు వేయుచు ప్రశస్తమగు నైపుణ్యము ప్రదర్శింపబడుచున్నది. చికాకోలునందు అ.భా.చ సంఘమువారే వారిశాఖను స్థాపించి, సన్నని నూలును తీయించి బట్టలను నేయించుచున్నారు. ఈశాఖయందు నెల 1కి రు 5000 విలువగల గుడ్డ తయారగుచున్నది. ముతకగుడ్డను సాదాగుడ్డను తయారుజేయుటకు ఆంధ్రదేశమున 12 శాఖలు గలవు. అ. భా. చ సంఘశాఖలు అన్నియు గలిసి నెల 1కి రు 30,000 ల విలువగల గుడ్డనుత్పత్తిజేయుచున్నవి. ఆంధ్రశాఖకు 17 విక్రయశాలలు గలవు. ఈ దుకాణములయందు నెల 1కి రు 36000 ల లావాదేవీకముగలదు.[1]

నేటిస్థితి-1930 మొదలు 1934 వఱకును

ఖద్దరువిక్రయము, రాజకీయాందోళన ననుసరించుచున్నది. రాజకీయోద్యమము విజృంభించునపో ఖాదీవిక్రయము హెచ్చుచున్నది. రాజకీయోద్యమము మందగించునపో ఖాదీవిక్రయము తగ్గుచున్నది. 1930 వ సంవత్సరమునుండియు విదేశవస్త్ర బహిష్కారణమునకై ప్రయత్నములు హెచ్చుగనుండి మిల్లుగుడ్డనుగూడ కాంగ్రెసుసంఘమువారామోదించుచు స్వదేశమిల్లుల జాబితాను ప్రకటించియు నేటికి

1. *See All India Khadi Guide 1931 for above facts and figures.*

ఆమోదపత్రముల నొసగియు ప్రోత్సహించుచున్నారు. ఈకారణమున ఖాదీకి మారుగ మిల్లుబట్ట విస్తారముగ వాడబడుచున్నది. ఇందులకు తోడుగ 1932 వ సంవత్సర మధ్యభాగమునుండియు రాజకీయాందోళన కొంత మందగించినది. ఖాదీకట్టుటకూడ రాజకీయచిహ్నమగునని ప్రజలయందు భయముకూడ ప్రబలినది. ఆర్థికదుస్థితి నలుమూలల నలముకొనినది. మిల్లుగుడ్డ చౌకయగుటను, అదియు స్వదేశీయగుటను విదేశీగుడ్డలవలెనే మిల్లుగుడ్డ వివిధరకములుగ ప్రజల నాకర్షించునటుల తయారగుచుండుటవలనను మిల్లుబట్టయే విరివిగ వాడుబడుచు ఖాదీవిక్రయముతగ్గినది. 1933 వ సంవత్సరమునుంచియు సరకు విడుదల పూర్వమువలె లేదు.

ఖాదీ అనుకూల వాదము

ఖాదీయుద్యమమును ఆర్థికదృక్పథమున పరీక్షించినచో నిదియొక పరిశ్రమవలె నభివృద్ధి కాజాలదని కొందఱి విశ్వాసము. అన్నిపరిశ్రమలకంటె ఖాదీపరిశ్రమయే శాశ్వతాభివృద్ధి నొందగలదని మఱికొందఱి విశ్వాసము. ఖాదీఉద్ధారకుడు మహాత్ముడు. ఖాదీపరిశ్రమ అన్నిపరిశ్రమలకంటె సులభసాధ్యమైన దని మహాత్ముని విశ్వాసము. మహాత్ముని హేతువాద మేమి?

(1). "పనిజరుపుటకు ఖరీదుగల పనిముట్లతో నిమిత్తములేదు. పెట్టుబడి అవసరములేదు. ఖాదీని ఉత్పత్తిచేయుటకు వలయు పనిముటును ముడిదినుసులును గూడ స్థానికముగ చౌకగ లభించును.

(2). ఖాదీఉత్పత్తికి విశేష నైపుణ్యమవసరములేదు. హిందూదేశమునందు చదువులేక ఆకలిబాధతో నల్లాడుచున్న ప్రజాసామాన్యమునకు గల నైపుణ్యమే చాలును.

(3). దీనికి విశేషశ్రమ యవసరములేదు. బాలురు, వృద్ధులు కూడ పనిచేయవచ్చును. కుటుంబాదాయమును వారిశక్తికొలది స్వల్పముగనైనను హెచ్చింపగలరు.

(4). నూలువడుకు సాంప్రదాయము నశించిపోలేదు. ప్రజలయందు సజీవముగ నున్నది. అందువలన పునరుద్ధారణకు మొట్టమొదట విశేషకృషి చేయ నవసరములేదు.

(5). ఆహారముతరువాత బట్టయే అందరకు అన్నికాలములయందునను శాశ్వతముగ గావలసియున్నది. నూలుమాత్రమే సర్వకాలములయందును తన సమీపమునందే విక్రయమగుననుట నిశ్చయము. ఇందువలన దారిద్ర్యము ననుభవించుచున్న వ్యవసాయదారునకు విడువకుండ కొంతఆదాయము లభింపగలదు.

6. ఖాదీపరిశ్రమకు అతివృష్టి అనావృష్టులతో నిమిత్తము లేదు. అందువలన కఱవులు వచ్చినపుడుకూడ, ఖాదీపరిశ్రమ కొనసాగింపవచ్చును.

7. ఈపరిశ్రమ ప్రజల మత సాంఘికాచారములకు వ్యతిరేకమైనదికాదు.

8. కఱవులను ఎదుర్కొనుటకు ప్రశస్తమగు సాధనోపాయము.

9. రైతులగిడపవస్తుకే ఖాదీపరిశ్రమ వృత్తిని నిలిపికొని పోవును. అందు వలన ఆర్థికదుస్థితికిలోబడి రైతులు క్రుంగిపోవ పనిలేదు.

10. పాడొనరింపబడిన గ్రామజీవనమును సకల ఖాదీపరిశ్రమయే పునరుద్ధరింపగలదు.

11. ఈపరిశ్రమ చేమగ్గములవారికి మాత్రమేకాక వ్యవసాయదారులకుగూడ మూలాధారము. చేమగ్గముల పరిశ్రమ నేడు 8 లేక 10 మిలియనుల ప్రజలను రక్షించుచున్నది. హిందూదేశమునకు

గావలసిన బట్టలో మూడవవంతుబట్ట చేమగ్గములవలననే ఉత్పత్తియగు చున్నది. ఈ చేమగ్గముల పరిశ్రమకు ఖాదీపరిశ్రమయే శాశ్వతమగు పునాది కాగలదు.

12. ఖాదీ పునరుద్ధరింపబడినయెడల దానికి సంబంధించిన అనుబంధపరిశ్రమలుగూడ వృద్ధికాగలవు. అందువలన గ్రామములను నేటిక్షీణదశనుండి సంరక్షింపగలదు."[1]

ఖాదీపరిశ్రమ-వ్యతిరేకవాదము.

"రాటమునకు గూడ ఆర్థికవ్యవస్థయం దొక స్థానము గలదు. కాని మన ఆర్థికదుస్థితిని తొలగించుట కిది యొక్కటియే దివ్యౌషధమని చెప్పదగదు." అని కొందఱివాదము.

ఇట్లు బాధ్యులగు వారెవరును ఖద్దరుపరిశ్రమనుగుఱించి చెప్పి యుండలేదు. హిందూదేశమందలి ఆర్థికదుస్థితినంతను రాటమే తొలగించగలదని యెవరునుజెప్ప సాహసింపరు. రాటము ప్రజలందఱకును ఒక్కటేవృత్తియని యెవరును జెప్పరు. రాటము యంత్రములతో పోటీచేయగలదనికాని,యంత్రములకుమాఱుగ రాటమునే త్రిప్పుచుండ వలెననికాని యెవరును తలంచుటలేదు. వ్యవసాయకులకు అనుబంధ

1, *Young India Oct 1 st 1926.*
2. *Indian Economics by Mr. Kale p. 221*

**వృత్తిలేక,** సాలునకు ఆఱుమాసములకాలము నిర్వ్యాపారముగ నుండ **వలసి** వచ్చుటచేత నాకాలమందు రాటముమీద నూలువడికి కొంత ధనార్జన చేయవచ్చుననియే ఖాదీపారిశ్రామికుల వాదము. విత్తులను నాటినదిమొదలు పంటను కూడ దీసికొనువఱకు ఏపంట కెంతకాలము రైతులు పాటుపడవలసినదియు నీదిగువపట్టిక వలన గ్రహింపగలము.

| పంట పేరు | నెలల సంఖ్య | పంట పేరు | నెలల సంఖ్య |
|---|---|---|---|
| వరి | 7 | Til Seed | 5 |
| నార | 5 | కుసుమ | 7 |
| ప్రత్తి | 6 | ఆవాలు | 7 |
| తేయాకు | | కందులు | 6 |
| మొక్కజొన్న | | చిక్కుడు | 5 |
| గోధుమ | | బటాణీలు | 6 |
| వేరుసెనగ | | ఆగిసె | 6 |
| జొన్న | | | |

ఈ తీరికకాలమునందు రైతుకుటుంబములు ఖాదీపరిశ్రమవలన కొంత ఆదాయమును సంపాదింపవచ్చును. "ఏమియు చేయక నిరాధా

*From Co-operation in India P. 7.*

రులై యుండుటకంటె రాటముమీఁదనైన పనిజేసి కొంత ఆదాయ మును సంపాదింపవచ్చు ననునదియే ఖాదీవాదము''[1]

"ఖద్దరువలన నీప్రయోజనములన్నియు గలవు. కాని, ఖద్దరు పరిశ్రమయందు పనిచేయుకాలమునకు తగినంతగ ప్రతిఫలముముట్టదు. అందుచేత నీ పరిశ్రమ ఆర్థికాభివృద్ధికరమనుటకంటె ఆర్థికవ్యయ మన డగును. అత్యల్ప మగు ప్రతిఫలమునకై అధికకాలమును వ్యయ మొనరింపరాదు" అనునది వ్యతిరేకవాదము. దుర్వినియోగముచేయ బడుచున్నకాలము ఖాదీపరిశ్రమవలన సద్వినియోగము చేయబడు చున్నది. సద్వినియోగకాలము దుర్వినియోగపఱుపబడుటలేదు. అందు వలన కాలమునకు సంబంధించిన ఆర్థికవ్యయములేదు. కాలవినియోగ మునకు ప్రతిఫలముగ ధనార్జనకలదు. వినియోగింపబడుకాలమునకు తగిన ప్రతిఫలము లేదనుట వ్యక్తిగతాభిప్రాయమే యగును. నూలు వడుకుటవలన రోజు 1కి లభించు 0-1-6 యు రోజు 1కి సగటున సుమారు0-2-0 ఆదాయయముమాత్రమే గల రైతునకు ఎంతఅత్యధిక ఉపయోగమో అనుభవమునందు గ్రహింపవలయును.

ఈదిగువపట్టిక ననుసరించి వడుకుటవలన రైతుల ఆదాయమె ట్లభివృద్ధియైనదియు తెలిసికొనగలము. ఈ అంకెలు తమిళనాడు నందు పనిచేయుచుండిన ఖాదీ శాఖలతాలూకు లెక్కల ననుసరించి వేయబడెను.

---

1. *Jather and Beri Indian Economics p. 256 Vol, I.*

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| గ్రామము పేరు | రాట్నముల సంఖ్య | వడుకుటవలన సాలు సరి సంపాదన | వడుకువారికుటుంబముల ఇతర ఆదాయము వ్యవసాయము మొ,వా, వలన | ఇతర ఆదాయములో వడుకుటవలన వచ్చు ఆదాయము 100కి ఎన్ని వంతులు? |
| పుసుప్పాలెం శాఖ- | | రు. | రు. | |
| 1. ఉప్పలయము | 25 | 460 | 3360 | 13% |
| 2. సెంబం పాలెం | 29 | 450 | 3065 | 15% |
| 3. పులింపట్టి | 20 | 346 | 2650 | 13% |
| 4. చిత్తలంగరు | 25 | 375 | 2150 | 17 1/2% |
| 5. పుసుప్పాలెం | 25 | 386 | 2898 | 14% |
| కొనూరు శాఖ. | | | | |
| 6. కొమరపలయము | 60 | 1398 | 9009 | 15 1/2% |
| 7. చెల్లంపలయము | 14 | 242 | 2190 | 11% |
| ఊటుకుళ్లి శాఖ. | | | | |
| 8. వెలంపలయము | 25 | 401 | 1400 | 28 1/2% |
| 9. నాపం పలయము | 68 | 1205 | 5220 | 23% |
| 10. సింబంపలయము | 14 | 372 | 2672 | 14% |

*From All India Khadi Guide 1931 P. 7*

"ఈఅంకెల ననుసరించి కొన్నిగ్రామములలో చరఖావలన వ్యవసాయాదాయమునకు దోడుగ 100 కి 11 వంతులు మొదలు 20 వంతులవఱకు ఆదాయము లభించినట్లు తెలియుచున్నది. ఇది గమనింప దగిన ఆదాయము. వ్యక్తిగతమగు కుటుంబముల లెక్కలను పరీక్షించుచో కుటుంబము 1 కి ఇతర ఆదాయములతోపాటు 100 కి రు 50 మొదలు రు 60 లవఱకును లభించినది."[1]

"వ్యయసాయదారునకు ఇంతకంటె హెచ్చుఆదాయమును లభింపజేయగల అనుబంధపరిశ్రమ అవసరము."[2]

కాదని యెవరును జెప్పరు. కాని ఏఆర్థికశాస్త్రవేత్తయు నేటివఱకును ఆచరణయోగ్యమగు అనుబంధపరిశ్రమ సూచించియుండలేదు. ఆచరణకురాలేదు. ప్రస్తుతభారతదేశార్థిక పరిస్థితులయందేవిధముగ పరీక్షించినను ఖాదీపరిశ్రమ యుత్పత్తిదారునకు లాభకరమనుట నిశ్చయము.

ఖాదీవలన ఉత్పత్తిదారునకుగల లాభము వినియోగించువానికి కలదా, లేదా? యని కూడ విమర్శింపదగును. "అహ్లాదకరముగను సులువుగను లాభకరముగను నుండు సరకును గొనకుండ నేడుగలమానవప్రకృతిచేత చాలకాలమువఱకు నిట్లే యుండునట్లుగ దోచుచుండిన మానవప్రకృతిచేత విముఖత్వమును వహింపజేయుటకంటె కొండపైకి నీటినిప్రవహింపజేయుట సులభము" అని కొందఱి నిరుత్సాహము.[3]

ఈమాటయందు సత్యమున్నది. కాని గత 10 సంవత్సరముల నుంచియు, నేటి మానవప్రకృతిని, ఖాదీనికొని ధరించునట్లుగ ప్రోత్సహింపగలిగియుండుట అనుభవమునందు చూచుచున్నాము. ఇట్లే చిరకా

1. *Khadi Guide p. 8*

2. *Jathar and Beri p. 256*

3. *V. G. Kale Indian Economics Vol 1. P. 219.*

లము జాతీయోద్యమమును వినియోగించువారిని ప్రోత్సహింపగలుగునని ఆశించుటకు సావకాశము లేకపోలేదు. అస్థానము నొసగుటయందు ఖాదీధారణము విదేశపుగుడ్డకుగాని మిల్లుగుడ్డకుగాని వెనుకాడుటలేదు. ఖాదీధారణమునకు సాంఘికగౌరవము హెచ్చుగ గలదు. ఖాదీధారణము దేశభక్తికి చిహ్నముగ పరిగ్రహింపబడుచున్నది. ఈకారణములవలననే నేటివఱకు ఖాదీ సజీవముగనున్నది. కాని చిరకాలము దేశభక్తిమీద నాధారపడి ఖాదీపరిశ్రమను ప్రోత్సహింప జాలము. ఖాదీధారణము వినియోగించువానికిగూడ ఆర్థికముగ లాభకరమై యుండవలెననుట నిశ్చయము. ఖాదీఖరీదు మిల్లుగుడ్డకంటె హెచ్చుగ నున్నది. మిల్లుగుడ్డకట్టిన స్వదేశవ్రతమునకు భంగమగుటలేదు. చౌకగగూడలభించుచున్నది. రాజకీయముగ విదేశవస్త్రబహిష్కారమును గూడ సాధింపవచ్చును. ఈకారణములవలన మిల్లుగుడ్డ విశేషముగ నాదరింపబడుచున్నది. ఖాదీధర తగ్గి, మిల్లుగుడ్డతో సమానమైనగాని ఖాదీకొనుగోలు విశేషముగ హెచ్చదు. మిల్లుగుడ్డతో సమానముగ ఖాదీని అమ్మగలుగు సావకాశములు గోచరించవు.

ఖాదీశాఖ వ్యయమును తగ్గించుట.

ఖాదీయుత్పత్తికి అగు ఖర్చును తగ్గించుటకు మార్గములు లేకపోలేదు.

"1. వడుకుటకలయు పత్తిని వారివారే నిలవజేసి కొనునట్లు చేయవలెను.

2. ప్రత్తిని వడుకువారే [illegible] ఏకులు[illegible] చేసికొనవలెను. పట్టుటయు ఏకుటయు ఏకులు చేయుటయుగూడ వడుకువారికి నేర్పింపవలయును.

3. హెచ్చునెంబరునూలు (సన్నని) వచ్చు ఏకులనుండికూడ సన్నని నూలును తీయుటలేదు. ఎంతసన్న నూలు వచ్చుటకు సావకాశముండునో అంత సన్ననూలును తీయించవలయును.

4. మిల్లునూలు నేసినందులకు పుచ్చుకొనదానికంటె ఖాదీ నూలును నేసినందులకు నేతగాండ్రు హెచ్చుగ పుచ్చుకొనుచున్నారు. నూలులో సన్నదనము పురి హెచ్చినకొలదియు నేతకూలి తగ్గగలదు.

5. ఖాదీపరిశ్రమ స్థానికము కావలెను. నేటివలె కేంద్రీ కరణముగ నుండరాదు. ఇందువలన ఖర్చులు అధికముగనున్నవి. ఉత్పత్తి విడుదలలు స్థానికముగ నుండవలయును.

6. అధికోత్పత్తియగుటకు వలయు క్రొత్తరకపు రాటములను కనుగొనవలెను.

ఇట్టి మార్పులు ఖాదీపరిశ్రమయందు లభించినను ఖాదీఖరీదు మిల్లుబట్టలఖరీదుకంటె బస్తీవాండ్రకు తగ్గకపోవుట కవకాశములు గలవు." అని అఖిలభారత చరఖాసంఘ నివేదికయే అంగీకరించుచున్నది.[1]

అయినను "సమిష్టిలాభమును గమనించి వ్యక్తిగతముగ ఖాదీకై కొంత అధికముగ ఖర్చుపెట్టుటకై యెవరును వెనుకాడకూడదు" అని చరఖాసంఘమువారి కోరిక.[2]

ఈ కోరిక చిరకాలము కొనసాగించుకొనుటకు వీలున్నదా ? ఉత్పత్తిజేయువారెవరు ? వినియోగించువారెవరు ? అధికోత్పత్తి అయినపుడు బస్తీవారుమాత్రమే వినియోగించినచో సరకు అంతయు విడుదల కాజాలదు. పల్లెలయందలి రైతులే మరల వినియోగింపవలెను. 100కి సుమారు 75 వంతులు గల రైతులే వినియోగింపవలసియున్నది. రైతులందఱును ఉత్పత్తిచేయువారుగ లేరు. కొంతమంది యుత్పత్తిచేయుదానిని, యితర రైతులు అధికధర పెట్టి కొనగలిగిన స్థితియందుండరు. కట్టుగుడ్డకై అధికవ్యయమొనరంపగల ఆర్థికస్థితి రైతు

1. *Khadi Guide 1931. P. 9*
2. 1. *Khadi Guide 1931 P. 9.*

లము జాతీయోద్యమము వినియోగించువారిని ప్రోత్సహింపగలుగునని ఆశించుటకు సావకాశము లేకపోలేదు. ఆస్వాదనము కొసగుటయందు ఖాదీధారణము విదేశపుగుడ్డకుగాని మిల్లుగుడ్డకుగాని వెనుకాడుటలేదు. ఖాదీధారణమునకు సాంఘికగౌరవము హెచ్చుగ గలదు. ఖాదీధారణము దేశభక్తికి చిహ్నముగ పరిగ్రహింపబడుచున్నది. ఈకారణములవలననే నేటివరకు ఖాదీ సజీవముగనున్నది. కాని చిరకాలము దేశభక్తిమీద నాధారపడి ఖాదీపరిశ్రమను ప్రోత్సహింప జాలము. ఖాదీధారణము వినియోగించువానికిగూడ ఆర్థికముగ లాభకరమై యుండవలెననుట నిశ్చయము. ఖాదీఖరీదు మిల్లుగుడ్డకంటె హెచ్చుగ నున్నది. మిల్లుగుడ్డకట్టిన స్వదేశవ్రతమునకు భంగపాటులేదు. చౌకగగూడలభించుచున్నది. రాజకీయముగ విదేశవస్త్రబహిష్కారమును గూడ సాధింపవచ్చును. ఈకారణములవలన మిల్లుగుడ్డ విశేషముగ నాశమగుచున్నది. ఖాదీధర తగ్గి, మిల్లుగుడ్డతో సమానమయినగాని ఖాదీకొనుగోలు విశేషముగ హెచ్చదు. మిల్లుగుడ్డతో సమానముగ ఖాదీని అమ్మగలుగు సావకాశములు గోచరింపవు.

ఖాదీశాఖ వ్యయమును తగ్గించుట.

ఖాదీయుత్పత్తికి అగు ఖర్చును తగ్గించుటకు మార్గములు లేకపోలేదు.

"1. వడుకుటవలయు పత్తిని వారివారే నిలవజేసి కొనునట్లు జేయవలెను.

2. ప్రత్తిని వడుకువారే పట్టుకొని ఏకులుత్రిప్ప చేసికొనవలెను. పట్టుటయు ఏకుటయు ఏకులను జేయుటయుగూడ వడుకువారికి నేర్పింపవలయును.

3. హెచ్చునెంబరునూలు (సన్నని) వచ్చు ఏకులనుండికూడ సన్ననినూలును తీయుటలేదు. ఎంతసన్న నూలు వచ్చుటకు సావకాశముండునో అంత సన్ననూలును తీయించవలయును.

4. మిల్లునూలు నేసినందులకు పుచ్చుకొనుదానికంటె ఖాదీ నూలును నేసినందులకు నేతగాండ్రు హెచ్చుగ పుచ్చుకొనుచున్నారు. నూలులో సన్నదనము పురి హెచ్చినకొలదియు నేతకూలి తగ్గగలదు.

5. ఖాదీపరిశ్రమ స్థానికము కావలెను. నేటివలె కేంద్రీ కరణముగ నుండరాదు. ఇందువలన ఖర్చులు అధికముగనున్నవి. ఉత్పత్తి విడుదలలు స్థానికముగ నుండవలయును.

6. అధికోత్పత్తియగుటకు వలయు క్రొత్తరకపు రాటములను కనుగొనవలెను.

ఇట్టి మార్పులు ఖాదీపరిశ్రమయందు లభించినను ఖాదీఖరీదు మిల్లుబట్టలఖరీదుకంటె బస్తీవాండ్రకు తగ్గకపోవుట కవకాశములు గలవు." అని అఖలభారత చరఖాసంఘ నివేదికయే అంగీకరించుచున్నది.[1]

అయినను "సమిష్టిలాభమును గమనించి వ్యక్తిగతముగ ఖాదీకై కొంత అధికముగ ఖర్చుపెట్టుటకై యెవరును వెనుకాడకూడదు" అని చరఖాసంఘమువారి కోరిక.[2]

ఈ కోరిక చిరకాలము కొనసాగించుకొనుటకు వీలున్నదా? ఉత్పత్తిజేయువా రెవరు? వినియోగించువా రెవరు? అధికోత్పత్తి అయినపుడు బస్తీవారుమాత్రమే వినియోగించినచో సరకు అంతయు విడుదల కాజాలదు. పల్లెలయందలి రైతులే మరల వినియోగింపవలెను. 100కి సుమారు 75 వంతులు గల రైతులే వినియోగింపవలసియున్నది. రైతులందఱును ఉత్పత్తిచేయువారుగ లేరు. కొంతమంది యుత్పత్తిచేయుదానిని, యితర రైతులు అధికధర పెట్టి కొనగలిగిన స్థితి యందుండరు. కట్టుగుడ్డకై అధికవ్యయమొనరింపగల ఆర్థికస్థితి రైతు

1. *Khadi Guide 1931. P. 9*
2. 1. *Khadi Guide 1931 P. 9.*

లకు లేదనుట నిర్వివాదాంశము. అందువలన ఏ రైతు కుటుంబముల యుపయోగమున్నకై ఖాదీ పరిశ్రమ ప్రోత్సహింప బడుచున్నదో ఆ రైతుకుటుంబములకే అపరోక్షముగ నధికధనవ్యయకారణ మగుచున్నది. ఈ కారణమున ఉత్పత్తిచేయువారు వేఱుగను, వినియోగించువారు వేఱుగను నున్నంతకాలము ఖాదీపరిశ్రమ యభివృద్ధి పొందజాలదు. చిరకాల మట్లేయుండినయెడల సజీవముగకూడ నుండజాలదు. ఉత్పత్తిచేయువాడును వినియోగించువాడునుగూడ నొక్కడైనపుడే ఖాదీపరిశ్రమకు ఆర్థికవ్యవస్థయందు స్థానము లభింపగలదు. అనగా పూర్వకాలమునందువలె గృహపరిశ్రమయై అలరారిననాడు ఖాదీ సజీవమైనదని సంతోషింపదగును. అంతవఱకు ఖాదీపరిశ్రమ జాతకమునందు గండములభాగమే హెచ్చుగనుండును. ఖాదీపరిశ్రమ గృహపరిశ్రమగ నగుట కెంతకాలము పట్టునను ప్రశ్న యుదయించును. శతాబ్దమునకు పూర్వము రూపుమాసిపోయిన పరిశ్రమ మరల సహజస్థితిని బొందుటకు కాలనిర్ణయము నెవరును గావింపజాలరు. ఆధునికనాగరికమున కెదురీదుచు ప్రభుత్వప్రతిష్టంబనలకు తలయొగ్గుచు నేటివఱకు సజీవమై ఆఱువేలగ్రామములకు ప్రాకగలిగినది. ఇంతవఱకు అభివృద్ధి ప్రశంసాపాత్రముగ నున్నది. ముందు ప్రభుత్వసహాయమే పరిశ్రమకు లభించుచో త్వరితగతిని అభివృద్ధి కాగలదని ఆశింపవచ్చును.

ఖాదీపరిశ్రమ-ప్రభుత్వకర్తవ్యము

ప్రభుత్వమువారు ఖాదీవంటిబట్టను కృత్రిమముగ మిల్లులు తయారుజేసి, ప్రజలను మోసపుచ్చుటకు వీలు లేకుండ శాసనము లొనరింపదగును. ఖాదీఉత్పత్తికి ధనరూపమగు సహాయము నొసంగవచ్చును. విరాళముల నొసంగుచు ఖాదీఖరీదు తగ్గించుటకు సావకాశములను గలిగింపవలయును. రైళ్ళపై ఎగుమతిచార్జీ లేకుండ తీసివేయదగును. కనీసము

చార్జీతక్కువమైన చేయవలయును. ప్రభుత్వకార్యాలయములకు వలయుదుస్తులను ఖాదీయందే తయారు చేయించవలయును. ప్రభుత్వము వారు కొనవలసిన అన్నివిధములగు గుడ్డను ఖద్దరునందే కొనవలయును. ఇట్టిప్రభుత్వసహాయము లభించినయెడల అచిరకాలమున ఖాదీ భారత దేశ ఆర్థికవ్యవస్థయందు అర్హస్థానమును బడయగలదు. భారతశాసన సభయందు ఖాదీశాసన మామోదింపబడుట శుభసూచకము.

ఈశాసన మాచరణయందుంచుటకు రాష్ట్రప్రభుత్వముల కధికార మొసంగబడెను. రాష్ట్రప్రభుత్వము లాచరణయం దుంచుచో కృత్రిమమగు ఖాదీని యెవరును తయారుజేసి అమ్ముటకు వీలుండదు.

## 24. చేతిమగ్గముల నేతగాండ్రు.

భారతదేశమున చేతిమగ్గముల పనివాండ్రు హెచ్చుగనున్నారు. నూలువడుకుట విరమింపబడినను మగ్గములుమాత్రము నశించిపోలేదు. విదేశపునూలుతో బట్టలను నేయుచు గ్రామములవెంట జీవించుచున్నారు. హిందూదేశమునందు చేతిమగ్గముల పరిశ్రమపై 60 వేలమంది జీవించుచున్నారు.[1]

20 లేక ముప్పదిలక్షల మగ్గములు హిందూదేశమున పనిచేయుచున్నవనియు, మొత్తము 50 కోట్ల రూప్యముల ఆదాయ మిందువలన వచ్చుచున్నదనియు పరిశ్రమల విచారణసంఘము వారు మదింపువేసిరి. ఈపరిశ్రమ, గాలికిబ్రతికి గాలిలో జీవించుచున్నదనదగును. నేతగాండ్ర కెట్టిసహాయము లభించుటలేదు. ఈనేతపరిశ్రమ తగురీతి సంరక్షింపబడి నిర్మాణవిధానము నేర్పఱచుట అత్యావసరవిషయము. మిల్లులవలన చౌకగ గుడ్డతయారగుట యీపరిశ్రమకు ప్రతిబంధకముగ నున్నది.

---

1. *See Matheson Indian Industry. Appendix IV.*

కాని మిక్కిలి ముతకగుడ్డయందునను మిక్కిలి సన్ననిగుడ్డయందునను నేతబట్టలతో మిల్లుబట్టలు పోటీ చేయజాలవు. పల్లెలయందలి బీద వాండ్రు, నేతబట్టయందు జిగియు, మన్నికయు హెచ్చుగ నుండునని నేతబట్టలనే వాడుచున్నారు. ఇట్లే చేతినిపుణత నుపయోగించి సన్న బట్టలనుగూడ ధనాఢ్యు లుపయోగించుచున్నారు. మిల్లులు సాలుసరి సుమారు 24180 లక్షల గజములగుడ్డను తయారుచేయుచున్నవి. చేతిమ గ్గములు 14040 లక్షల గజములగుడ్డను తయారుచేయుచున్నవి. అనగా హిందూదేశమున వాడబడుగుడ్డలో 100 కి 25 వంతులు చేతిమగ్గముల వలన లభించుచున్నది. యుద్ధకాలమున మిల్లులు కావలసినంతబట్టను తయారుచేయజాలనందున నాడు చేతిమగ్గముల పరిశ్రమకు ప్రోత్సా హముగలిగెను. కాని 1922 వ సంవత్సరమునుండియు జపానువారి పోటీ వలన నేతగాండ్రపని వెనుకంజ వేయసాగినది. కొందరు నేతగాండ్రు పట్టుపరిశ్రమ నారంభించిరి. మఱికొందరు వ్యవసాయమునకు మరలు చున్నారు. ఒకవంక మిల్లులపోటీకిని వేఱొకవంక జపానువారిపోటీకిని నేతపరిశ్రమ ఆగజాలక కృశించిపోవుచున్నది. ఇన్నికాలమునుండియు నశించిపోక నిలిచి యున్నను ముందుముందు నేతపరిశ్రమజీవితము అపాయస్థితియందున్నదనుట నిశ్చయము.

చెన్నరాష్ట్రమున లుంగీపరిశ్రమ విస్తారముగ గలదు. సిలోను, బర్మా, జావా, సయాము, స్ట్రెయిట్సు, సెటిలుమెంట్సులు పెడరేటెడ్ మలయాదీవులు మున్నగు తావులకు చెన్నరాష్ట్రమునుండి లుంగీలు ఎగుమతి యగుచున్నవి. మన రాజధానియందు సుమారు 15 వేల మగ్గములపై లుంగీపరిశ్రమ కొనసాగింపబడుచున్నది. ఆంధ్రదేశమున వేటపాలెము, పెడన, చీరాల, పేరాల, నెల్లూరు, కాళహస్తి, చిత్తూరు ప్రాంతములయందు పరిశ్రమ కలదు. అరవ దేశమున, సైదాపేట, ఆరణి, కంజీవరము, కడలూరు, మద్రాసు, చెంగల్పట్టు, వృద్ధాచలము

పేరంబాకములయందు గలదు. జపానువారి పోటీవలన నీపరిశ్రమయు క్షీణగతికి వచ్చుచున్నది. మనకంటె జపానువారు సగము ఖరీదునకే అమ్ముచున్నారు. నేతపరిశ్రమకు విదేశపునూలు దిగుమతి యవసరమని కొందఱు తలంచుచున్నారు. విదేశపునూలు దిగుమతులపై సుంకములను విధించరాదని కొందఱివాదము. ఏ ప్రత్యేకపరిశ్రమయొక్క లాభనష్టములను గాని, విదేశ దిగుమతుల విషయమునందు గమనించరాదు. విదేశపునూలును బట్టను దిగుమతి నిషేధించుటయే భారతదేశకర్తవ్యము. విదేశపునూలు దిగుమతితో నిమిత్తము లేకుండ నేతపరిశ్రమ యభివృద్ధియగున ట్లితర మార్గముల నరయ వలయును. ఒకమేలుకొఱకు మఱొకకీడును పొందజాలము. నేతపరిశ్రమయు ఖాదీపరిశ్రమయు పూర్వకాలమునందువలెనే జంటగ నభివృద్ధియగుమార్గముల నరయవలయును. జపానువారును, బ్రిటిషువారును, బొంబాయి మిల్లులవారును కలిసి సంధిషరతులను గావించుకొనుటకంటె మిల్లులవారును ఖాదీపరిశ్రమవారును నేతపరిశ్రమవారును గలిసి, భారతదేశవస్త్రపరిశ్రమాభివృద్ధికి పాటుపడదగును. స్వదేశ వస్త్రపరిశ్రమాభివృద్ధికీమూడింటి కలయికయు అత్యవసరము. ఎవరికివారే యనుపద్ధతిని విరమించుటకు నేడే తరుణము.

# 25. నారపరిశ్రమ.

## JUTE INDUSTRY

ఇతర పరిశ్రమలవలెనే నారయు చేతిపనులలో నొకటిగ నుండెడిది. 18వ శతాబ్దమునందు చేతితో తయారుచేయబడిన నార కొలదిగ నెగుమతి యగుచుండెడిది.[1]

1. J. C. Sing Economic anals of Bengal P.37

19 శతాబ్దమువఱకు ఈనార చేతిపరిశ్రమక్రింద అధికాభివృద్ధి యం దున్నది. పిమ్మట నితరపరిశ్రమల వలెనే యీచేతిపని గూడ 1880 ప్రాంతమున నశింపు చేయఁబడినది. 1908 నాటికి రూపు మాసి పోయినది. సీమవారి మరలు బయలుదేరినవి. సీమవారి పెట్టుబడితో వారి అధ్వర్యముక్రింద కలకత్తాలో యంత్రపరిశ్రమ ప్రారంభింపబడెను. 1838 సం॥ ప్రాంతమునుండియు నార దండికి (Dundee) ఎగుమతి చేయ బడు చుండెడిది. 1854 సం॥ నుండియు నారపరిశ్రమ స్థితిగతులు మారి నవి. పవిత్ర గంగానదీతీరమున కలకత్తాకిరుప్రక్కల ఫ్యాక్టరీల నుదయ మగుట ప్రారంభించెను. ప్రప్రథమమున జార్జి ఆక్లాండ్ (George Acland) గారు 1855 లో రిష్రా (Rishra) ప్రాంతమునందు నార మిల్లును కట్టించెను. "1859 లో కలకత్తా పరిసర ప్రాంతములు బార్న గోరువద్ద చేతమరయంత్రమను స్థాపింపఁబడి 1860 నుండి నాలు పెరిగి స్థాపింపబడినది."[1]

ప్రారంభదశయందు గోనిసంచులు నేయఁబడు చుండెడివి. బర్మా కెగుమతి యగుచుండెడివి. 1879 ప్రాంతమున నీపరిశ్రమ అత్యంత అభివృద్ధి పొందినది. అనేక క్రొత్త కంపెనీలు లేర్పడు చుండెను. కలకత్తాలో వచ్చిన ప్లేగ్ వలన 1894 సం॥ ప్రాంతమున అభివృద్ధికి కొంతవరకు వెనుకాట ఆడినది. వెంటనే తొలగినది. నూతనోత్సాహముతో విస్తారముగా పోటీ చేయు ప్రారం భించెను. 1908 సం॥ ప్రాంతమున దండియందలి యుత్పత్తికన్న కల కత్తాయందలి యుత్పత్తి హెచ్చినది. ఎగుమతులు కూడ హెచ్చినవి. 1914 సం॥ మున నీపరిశ్రమ ఆరోహణక్రమమున నున్నది. యుద్ధ ప్రారంభమున నారపంట సరిగ లేనందువలన, ధరలు తగ్గుటవలనను, వెనుకటి లాభములకంటె కొలదిగ లాభములు వచ్చినవి. కాని యుద్ధము వలన యిసుకకట్టుటకు మొదలగు యుద్ధపరికరములకు సంచులయవసర

1. D. R. Vallace Romance of gate.

రము హెచ్చినది. 1917-19 సం॥ ల మధ్య ఎగుమతులు నియమింప బడుచు వచ్చినను యుద్ధావసరముల వలన పరిశ్రమ కెట్టినష్టము రాలేదు.

1916 వ సంవత్సరమునందు ఎగుమతి సుంకము విధింపబడెను. 1917 సం. లో హెచ్చింప బడెను. అయినను హిందూదేశపు పరిశ్రమ దెబ్బతినలేదు. హిందూదేశమే నారసరకును పంపగలస్థితియం దుండుటయే యిందులకు కారణము.

యుద్ధానంతరము విశేషలాభములు వచ్చినవి. తరువాత కొంత తగ్గినవి. మరల నేడున్నతస్థితియం దున్నది. నారపరిశ్రమను నాలుగు విధములుగ విభజింపవచ్చును. 1. గోనెసంచులు మొదలగునవి పోయుటకు, 2. గోనెగుడ్డ, ప్రత్తి, పూలు మొదలగునవి బేళ్ళక్రింద కుట్టుటకు, 3. ముతకరకము తివాచీలను, గొంగళ్ళను నేయుటకు, 4. పురికోస. యుద్ధకాలమునం దీనారబట్ట లనేకవిధములుగ నుపయోగింప బడినవి. ఈ పరిశ్రమ చాల సక్రమముగ నడిపింప బడుచున్నది. కలకత్తాయం దీమిల్లులన్నియు నొకచోటనే కట్టబడి యున్నవి. పలాసా యందు, ఏలూరునందు జ్యూటుమిల్లులు గలవు. కలకత్తా నారయంత్రములవారందఱు 1884 సం॥రము వారి సంఘమును నిర్మించికొనిరి. వీరందఱు సీమవారే. ఈ పరిశ్రమయంతయు సీమవారి హస్తగతమై యున్నది. ఈ సమవారందరు స్కాట్లెండ్ వారే. ఒక్క ఏలూరు జ్యూట్ మిల్లుమాత్రమే భారతీయుల పెట్టుబడితో భారతీయుల యాజమాన్యమున పనిచేయుచున్నది. గత 3 సంవత్సరములనుంచియు నాగిపోయినది. కలకత్తాయందలి కొన్ని మిల్లులలో వాటాలు 100కి రు 50 లు మాత్రము స్వదేశస్థులకు గలవు. 1918, 1919, 1920 సం॥ లలో జ్యూట్ మిల్లులు సంపాదించిన లాభమునకు పరిమితి లేదు. అంతకుముందుగూడ లాభములనే సంపాదించినవి. ఈమిల్లులు కొన్ని బొగ్గు

నుంచివచ్చు విద్యుచ్ఛక్తివలన నడుపబడు చున్నవి. ఈ మిల్లులు సీమ వారి ఆధిపత్యముక్రింద నుండుటచే, వీటియందు పనిచేయు కార్మికుల గతి చెప్పనలవిగాకుండ నున్నది. కూలి తక్కువ. కష్టము హెచ్చు. ఆత్మగౌరవములేదు. ఇతర మిల్లుపరిశ్రమలలో కంటె నీ పరిశ్రమయందలి కార్మికులగతి దుర్భరముగా నున్నది. గనుల పనివాండ్ర స్థితి కంటె దుస్థితిగ నున్నది. అందుచే కార్మికుల సమ్మెలు తరుచుగ జరుగుచున్నవి. స్వదేశస్థుల ఆధిపత్యములోనున్న ఏలూరు జ్యూట్ మిల్లులోని కార్మికుల గతియు నిట్లే యున్నది. వీరలకు సరియగు ఇండ్లసదుపాయము గాని విద్యారోగ్య సదుపాయములుగాని గావింపబడుట లేదు. ఎంతవఱకును లాభములను సంపాదించుటలోనే దృష్టిని కేంద్రీకరించుచున్నారు. లాభములు 1918 మొదలు 51 మిల్లులలో 32 మిల్లులు 100 కి రు 100 లు పైగా లాభములను పంచిపెట్టినవి. 29 మిల్లులు 100 కి 20 వంతులలాభములకు తక్కువ పంచిపెట్టలేదు. ఇందు 10 మిల్లులు 100 కి రు 60 ల లాభములకు తక్కువ యేయేడును పంచిపెట్టలేదు. మిగతామిల్లులుకూడ నెన్నడు నష్టముపొందలేదు. అయిననేమి? ఈమిల్లులకు నారను సరఫరా చేయు రైతులస్థితియు పనివాండ్రస్థితివలెనే భరింపరాలనంతగ నున్నది. కలకత్తా యూరపియనుమిల్లులవారీనారపండించువారిని కంట్రాక్టు కూలీలక్రింద వినియోగించుచున్నారు. ఈపరిశ్రమ క్షేత్రవాతావరణ స్థితియు నష్టకారణము కాజాలదు. విస్తారమగు మూలధనము గలిగి లాభములు పంచిపెట్టబడుచున్నవి. 1930 వ సంవత్సరము నుండియు నితరపరిశ్రమలతోపాటు నారపరిశ్రమయు ఆర్థికదుస్థితికి లోబడెను. 1931 వ సంవత్సరమునుండియు నార ఎగుమతి పరిమాణమునందును విలువయందును గూడ తగ్గెను. నార సాగుబడిభూమి సగమువఱకు

తగ్గింప బడెను. ఉత్పత్తియు సగమువఱకు తగ్గినది. నారపరిశ్రమకు వంగదేశమున సహజసౌకర్యము లున్నను అధికోత్పత్తిని తగ్గించుకొన వలసినతరుణము వచ్చినది. ఆర్థికదుస్థితికి పూర్వమే అధికోత్పత్తిని తగ్గించుకొనుటకై మిల్లులు ప్రయత్నించినవి. జ్యూటుమిల్లుల సంఘ మేర్పడి తమలోతాము విధినిషేధముల నేర్పఱచుకొన దలంచిరి. ఆర్థిక దుస్థితి తొలగినను అధికోత్పత్తిని తగ్గించవలసిన అవసరము తొలగక పోవచ్చును. 30 వ జూన్ 1929 వ సంవత్సరమున అధికోత్పత్తి నిషేధములను మిల్లులసంఘమువారు విరమించుకొనిరి. ఇందులకు కారణ మేమి?

1. ఉత్పత్తికంటె విడుదల హెచ్చుగనున్నట్లు తలంచిరి. అయి రోపాఖండమందలి నారమిల్లులు మగ్గములను హెచ్చించుటయే యిందులకు తార్కాణమని తలంచిరి. దండీమిల్లులు నారను విశేషముగ వినియోగించుటకూడ అధికోత్పత్తి అవసరము హెచ్చిన దని తలం చుటకు కారణము.

2. హిందూదేశమునందుగూడ క్రొత్తమిల్లులు స్థాపింపబడినవి. ఈమిల్లులు లాభములను అధికముగ సంపాదించునను భయము సంఘ మువారికి హెచ్చినది.

ఈపరిస్థితులలో ఆంగ్లేయమిల్లుల యజమానులు (అంతవఱకు నుత్పత్తి తగ్గించుటకు ఏర్పడినసంఘము) ఉత్పత్తిని తగ్గింపవలె నను నిషేధమును దొలగించుకొనిరని కొందఱివాదము. కాని యిదిసరియైన వాదముగాదని మఱికొందఱి విశ్వాసము.

వంగదేశమునందలి నారమిల్లులపరిశ్రమ అంతవఱకు ఆంగ్లేయుల వశమందున్నది. అప్పుడప్పుడే భారతీయులుకొందఱు క్రొత్త మిల్లులను స్థాపించిరి. ఈమిల్లులవారు ఆంగ్లేయసంఘసభ్యులు గారు. ఆంగ్లేయసంఘసభ్యుల మిల్లులు అధికోత్పత్తిని నిషేధించుకొనినపుడు బయలుదేఱిన స్వదేశీమిల్లులు, అధికోత్పత్తినిజేసి లాభములను సంపాదించుచున్నవను ఈర్ష్యాసూయలే ఆంగ్లేయులుగూడ నిషేధమును దొలగించుకొనుటకు కారణమని కొందఱి సందేహము. ఇదియే సత్యవాదము. 1928 నవంబరునందు మరల మిల్లులకు వారము 1 కి గం 54లకు మాఱుగ, గం 60లు పనిచేయించుటకు ఆంగ్లేయ మిల్లుయజమానులు నిశ్చయించుకొనిరి. ఇట్లొనరించుటవలన పరిశ్రమయే మూలచ్ఛేదనగునను భయము గలదు. ప్రజల ఆందోళన, పత్రికలఆందోళన హెచ్చినది. మరల మిల్లులు 54 గంటల పనినే చేయుచుబూనెను. ఈనియమము నంగీకరించుటకు మిల్లులు మూడువారములు మూసివేయవలసి వచ్చెను. పిమ్మట వారమునకు 40 గంటల పనినే చేయించుటకు నిశ్చయింపబడెను. అనుపిమ్మట 100 కి 15 వంతుల మగ్గములను మూసివేయుటకు నిశ్చయింపబడెను. (ఆంగ్లేయమిల్లుల సంఘసభ్యులు మాత్రమే) అనగా మిగిలిన 85 వంతుల మగ్గములు వారమునకు 1 కి 40 గంటలు పనిచేసిన, మొత్తముమగ్గములన్నియు వారమునకు 34 గంటలు పని చేసినట్లగును. ఇట్లు సంఘసభ్యులంతఱు ఉత్పత్తిని తగ్గించుకొనుచున్నపుడు సంఘమునందు సభ్యులు గాని మిల్లులు, ఉత్పత్తిని హెచ్చుజేయ మొదలిడెను. అన్ని నారమిల్లుల మగ్గముల సంఖ్యలో నీ మిల్లులకు 100 కి 5 వంతుల మగ్గములు మాత్రము

కలవు. అయినను వీరి ఖర్చులు తక్కువ. కొలదిగ పనిజేయుకాల మును హెచ్చించిరి. ఇందువలన మొత్తపు మిల్లుల ఉత్పత్తిలో 100కి 14, లేక 16 వంతులవఱకు, సంఘసభ్యత్వము లేనిమిల్లుల యుత్పత్తి పెరిగెను. ఈ పెరుగుదలను నారమిల్లుల సంఘసభ్యులు చూచి సహింప జాలకపోయిరి. అన్నిమిల్లులు కలసి పనిచేయుకాలమును తగ్గించుకొన వలె నని నారసంఘమువారి ప్రయత్నము. క్రొత్తగ బయలుదేఱిన మిల్లులు, చాలకాలమునుండి పనిజేయుచు విశేషలాభముల నార్జించిన మిల్లులతో కలిసి, పనిచేయుకాలమును తగ్గించుకొనజాల వని సంఘేతర సభ్యుల వాదము. మిల్లు లీపరస్పరసంఘర్షణమునందు కాలము జరుపు చున్నపుడే ధరలుకూడ పడిపోవుచున్నవి. వంగదేశపు ముఖ్యపరిశ్రమ యగు నారపరిశ్రమ, మిల్లు యజమానుల పరస్పర ద్వేషాసూయలకు లోనై నశించునను భయము కలిగెను. ఈ సమయమున వంగదేశపు గొర్నరు సర్. జోన్. ఎండరసనుగారు స్వయముగ కృషిసలిపి మిల్లు లకు రాజీ కుదిర్చిరి.

1. సంఘసభ్యత్వమును వదలివేసిన ఆడంజీ మిల్లులవారి డిపో జిట్టును వారికి తిరిగి యిచ్చివేయవలెను.

2. నారమిల్లుల సంఘమునందు సభ్యత్వముగల మిల్లులు వారమునకు 40 గంటల కాలమును, సభ్యత్వములేని మిల్లులు 54 గం టలకాలమును పనిచేయవలయును.

3. సంఘసభ్యత్వముగల మిల్లులు 100కి 15 మగ్గములను పని చేయించరాదు. ఇతర మిల్లులు వారిమగ్గముల నన్నింటిని పనిచేయిం చుకొనవచ్చును.

4. సంఘమువారు సంఘసభ్యులు గానివారిమిల్లులను పరీక్షించుచుండుట కధికారము గలదు.

ఈ యొడంబడికను మిల్లుల సంఘమువారామోదించిరి. సంఘసభ్యులగు వారి మిల్లులకుగూడ నిట్టి ప్రత్యేక సదుపాయమును అవసరము ననుసరించి గలిగించుటకు సంఘమువారికి అధికారము గలదనిరి. ఈయొడంబడిక 11 మాసములవఱకు అమలునం దుంచబడును. ఇట్టి యొడంబడికలు చిరకాలము కొనసాగవు. అన్ని మిల్లులు ఉత్పత్తి నిషేధమున కంగీకరింప జాలవు. మఱియు, క్రొత్తమిల్లులను స్థాపింపరాదనుటకు వీలులేదు. భారతీయులు క్రొత్త మిల్లులను స్థాపించి పరిశ్రమను భారతీయుల వశమొనరించుటకై చేయు ప్రయత్నములను నిషేధింప వీలులేదు. కాని ఉత్పత్తి అధికమైన కొలదియు, అన్ని మిల్లులును నష్టములకు గురియగును. పరిశ్రమయే పాడగును. ఈపరిస్థితులలో కర్తవ్య మేమి? నారపరిశ్రమను సంపూర్ణముగ జాతీయమొనరించుటయే మార్గము. వంగరాష్ట్ర ప్రభుత్వము నారమిల్లుల పరిశ్రమపై సంపూర్ణాధికారము వహింప వలయును. మిల్లులను స్థాపించుటకు పనిచేయుకాలమును నిర్ణయించుటకు పంచిపెట్ట వలసిన లాభములను మితమొనరించుటకు, నారను పండించువారి సౌకర్యములను మిల్లులయందుగల కార్మికుల సౌకర్యములను గమనించుటకు నారపరిశ్రమను ప్రభుత్వమువారు స్వాధీన మొనరించుకొన వలయును. వ్యక్తులు కాక, కంపెనీల అధికారమునుండి పరిశ్రమ సంరక్షించినగాని, వంగదేశ ముఖ్యపరిశ్రమ సుస్థిరముగ సంరక్షింప బడదు. కనీసము ముఖ్యవిషయముల నన్నింటి యందునను విధి నిషేధములనైన శాసన రూపకముగ నొనరింప వలయును.

## నార ఉత్పత్తిని దెలుపు పట్టిక.

| 30 జూన్ నెల ఆఖరు నకు | నార సాగుబడి భూమి ఎకరములు (వేలలో) | తూకము 400 పౌనులుగల బేలు వేలలో (1 బేలు=400 పౌ॥) | తూకము బేలు 1కి 400 పౌ॥ గల 1000 బేలుల చొ॥ యిండియన్ మిల్లులు ఉపయోగించిన మొత్తం | తూకము బేలు 1కి 400 పౌ॥ గల బేలుల యొగుమతి మొత్తం (వేలలో) |
|---|---|---|---|---|
| 1913-14 | 3169 | 8759 | 4874 | 4192 |
| 1915-16 | 2375 | 7424 | 5609 | 3106 |
| 1920-21 | 2508 | 5979 | 5467 | 2343 |
| 1922-23 | 1799 | 5486 | 4615 | 2902 |
| 1925-26 | 2926 | 9000 | 5344 | 3516 |
| 1926-27 | 2962 | 12187 | 5374 | 4448 |
| 1927-28 | 3144 | 9916 | 5633 | 4486 |
| 1928-29 | 3316 | 9956 | 5879 | 4428 |
| 1929-30 | 3485 | 11231 | 6246 | 4452 |
| 1930-31 | 1858 | 5560 | 5423 | 3425 |
| 1931-32 | † 2020 | † 6000 | ♦ 3400 | ♦ 2750 |

† నారపంట పండించిన పొలముల విస్తీర్ణము నారపంట ఉత్పత్తి సం॥ 1931-32 లకు సుమారుగ వేయబడెను.

♦ 1931 జూలై తేదీ 1 నుంచి 1932 మార్చి తేదీ 31 వఱకు గల 9 మాసములకు యొగుమతి వివరములు. మిల్లు లుపయోగించు కొనిన మొత్తపు నార వివరము.

*Indian Finance Year Book P. 216.*

## హిందూదేశము నుండి ఎగుమతి యగుచున్న గోనెగుడ్డ వివరములు.

(లక్షల గజములు.)

| | యుద్ధపూర్వపు సగటు | యుద్ధపు సగటు | యుద్ధానంతరము సగటు | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రిటిషు దీవులు | 423 | 1338 | 741 | 504 | 311 | 292 | 586 | 402 | 621 |
| కనడా | 333 | 534 | 508 | 596 | 685 | 557 | 816 | 731 | 632 |
| ఆస్ట్రేలియా | 209 | 253 | 175 | 265 | 246 | 222 | 260 | 188 | 198 |
| అమెరికా | 6639 | 6085 | 8938 | 9754 | 10230 | 10218 | 10719 | 8538 | 6917 |
| అర్జంటైను | 1727 | 1440 | 1813 | 3182 | 3310 | 3403 | 3298 | 2086 | 1049 |
| ఇతర దేశములు | 369 | 1016 | 528 | 730 | 743 | 791 | 831 | 770 | 787 |
| మొత్తం | 9700 | 11561 | 12703 | 15031 | 15528 | 15683 | 16505 | 12710 | 10204 |

*Indian Finance Year Book P 210.*

[118]

హిందూదేశమునుండి ఎగుమతి యగుచుండిన గోనెసంచుల వివరములను దెలుపుపట్టిక.

Exports of Gunny bags from India.
(లక్షల బస్తాలు.)

| | యుద్ధపు పూర్వపు సగటు | యుద్ధపు సగటు | యుద్ధానంతరమందు సగటు | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రిటిషు దీవులు | 305 | 2265 | 418 | 388 | 461 | 446 | 530 | 501 | 475 |
| ఇతరఐరోపాఖండభాగము | 206 | 688 | 299 | 194 | 191 | 186 | 279 | 287 | 275 |
| ఈజిప్టు | 119 | 385 | 102 | 144 | 142 | 157 | 190 | 170 | 144 |
| సౌత్ ఆఫ్రికా | 119 | 243 | 177 | 163 | 189 | 203 | 208 | 200 | 182 |
| ఈస్టు ఆఫ్రికా | 99 | 90 | 112 | 193 | 193 | 245 | 261 | 248 | 222 |
| ఆస్ట్రేలియా | 628 | 737 | 720 | 965 | 867 | 1023 | 843 | 999 | 744 |
| జావా | 130 | 206 | 205 | 270 | 250 | 421 | 373 | 416 | 296 |
| జపాను | 35 | 118 | 186 | 249 | 187 | 88 | 157 | 54 | 46 |
| దూరపుప్రాచ్యదేశము | 393 | 436 | 584 | 693 | 810 | 780 | 954 | 519 | 685 |
| సౌత్ అమెరికా | 431 | 532 | 335 | 872 | 490 | 490 | 473 | 278 | ... |
| సెంట్రల్ అమెరికా | 130 | 229 | 298 | 390 | 392 | 446 | 431 | 357 | 239 |
| ఇతరదేశములు | 796 | 747 | 607 | 470 | 451 | 492 | 524 | 416 | 526 |
| మొత్తం | 3391 | 6676 | 4043 | 4491 | 4631 | 4977 | 5223 | 4340 | 3884 |

*From Indian Finance Year Book Page 216.*

# 26. ఇతరనేతపరిశ్రమలు.

ఇతరనేత పరిశ్రమలనగా శాలు, పట్టు, సాగినార పరిశ్రమలు గమనింపదగినంతగ నభివృద్ధి పొందలేదు. శాలుమిల్లులు 1914సం. లో 6 గలవు. 40000 కార్మికులు పనిచేయుచుండిరి. శాలుఉత్పత్తికి శాస్త్రసమ్మతమగు మార్గము లేర్పడలేదు. ప్రశస్తమగు సన్నని శాలువలు నేయుటకు ఉన్నిగల గొర్రెలసంతానము నభివృద్ధిపరచజేయుటకు వలయు నేర్పాటులును లేవు. "హిందూదేశమందలి బజారులలో విక్రయింపబడుఊలు చచ్చిపోయిన గొర్రెలనుండి తీసినదియే గాని కత్తిరించిన ఊలుగాదు."[1]

ఉత్తరదిశయందలి కాశ్మీరమందుమాత్రమే కొంతవరకు ప్రశస్తమగుఊలు లభించుచున్నది. బికనీరుశాలు ప్రసిద్ధమైనదే. అట్టిఉన్ని విరివిగ లభించుటలేదు. 19వ శతాబ్దమునందు కాశ్మీరమునుండి ఫ్రాన్సుమొదలగు దేశములకు కాశ్మీరశాలువ లెగుమతి చేయుచుండెడివారు. కాని, రానురా నితరపరిశ్రమలవలె నీపరిశ్రమయు నడు గంటింపబడినవి. నేతగాండ్రీపరిశ్రమను విడిచి [illegible] కాశ్మీర[illegible]నందు గూడ తివాచీనేతను ప్రారంభించిరి. [illegible], తివాచీలు, దుప్పట్లు పంజాబులో వివిధప్రాంతములయందు తయారుచేయబడుచున్నవి. హిందూదేశములో నున్న [illegible] యందు గంటుటతో గొర్రెలపోషణయు, నుత్తమ [illegible] సంతానోత్పత్తికి ప్రయత్నములుగూడ [illegible]పింపబడుట సహజము. [illegible] పురస్కరింప బడలేదు. అందుచే "హిందూదేశమున గొర్రెలు సాలు 1 కి 66 [illegible] యనులపౌనులబొచ్చును ఇచ్చుచున్నట్లు మదింపు వేయుచుండెను.

1. *See C. W. E. Cotton : Hand Book of Commercial Information in India*

అనగా సగటున గొఱ్ఱె 1కి 2.1 పౌనులు మాత్రమే. ఆస్ట్రేలియా దేశ మునందు 7½ పౌ. సగటుబరువు. అమెరికాయందు 1840 లో 1-85 పౌను లుండెడిది. వా రవలంభించిన కొన్ని శాస్త్రరీతుల ననుసరించి 1887 లో 6 పౌనులవఱకు వృద్ధి యయినది. నేడు నాటికంటె వృద్ధియై యున్నది."[1]

కాన్పూరు, లక్నోలయందున్న ఊలు మిల్లులకు కావలసిన యున్నెను ఆస్ట్రేలియా, టిబెట్, ఆఫ్ఘనిస్థానము, దక్షిణాఫ్రికాయందలి కేపుపెర్షియాలనుండి తెప్పించుకొనుచున్నారు. ఇటలీ, ఇంగ్లండు మొదలగు ప్రాంతములనుండి ఉన్నిశాలువలుగూడ బట్టలతోపాటు దిగుమతి యగుచున్నవి. ఈ దిగుమతులవలనగూడ చేమగ్గములకు ప్రోత్సాహము నశించినది. ముడిఉన్నికూడ దిగుమతియగుచుండుట వలన ఉన్ని తయారుచేయు పరిశ్రమగూడ అడుగంటుటలో నాశ్చర్యము లేదు. ఉత్తరహిందూస్థానమున ఊలుసంబంధ మగు శాలువలును కంబళ్లును బట్టలవలెనే యుపయోగింతురు. పూర్వకాలమునం దీయుపయోగమునకు వలయు సరకునంతను, చేమగ్గములమీదనే తయారు చేయుచుండెడివారు. మిల్లుపరిశ్రమ ప్రారంభింపబడినపిమ్మట యుద్ధకాలములో నీపరిశ్రమ కొకింత ప్రోత్సాహము కలిగినది. ఉన్ని యెగుమతి నిషేధింపబడెను. సైన్యమునకు కావలసిన కంబళముల నీమిల్లులే తయారుజేయుచుండెడివి. ప్రభుత్వమువారు కొనుచుండెడివారు. 1925 నందీ యున్నిమిల్లులు 11 గలవు. స్వదేశసంస్థానములలో మఱి 5 నిర్మింపబడినవి. "ఇందు 3 మిల్లులలో మాత్రమే వివిధములగు కంబళ్లు నేయబడుచున్నవి. ఇతర మిల్లులలో ముతకరకములు మాత్రమే నేయబడుచున్నవి."[2]

---

1. *Notes on Wool in India by A. H. Silver 1919.*
2. *C. W. Cotton: Hand Book of Commercial information for India P. 230.*

అమృతసరము, ముల్తాను, జయపురము, బికనీరు, ఆగ్రా, మీర్జాపూరు, ఏలూరులయందు, చేమగ్గములమీద తివాచీలు నేటివఱకును తయారుచేయబడుచున్నవి. జైళ్లయందుగూడ నీపరిశ్రమ విస్తారముగ నున్నది.

## 27. పట్టు పరిశ్రమ.

పట్టుపనిగూడ 19-వ శతాబ్దమునందే నశింపు చేయబడెను. దిగుమతియగు పట్టునూలు బట్టలు, కోకలు యీపరిశ్రమను పొట్టను బెట్టుకొనినవి. వ్యవసాయమువలెనే భారతదేశమందలి కొన్ని ప్రాంతములలో పట్టుపురుగులను పెంచుట పట్టుతీయుట విస్తారముగ నుండెడిది. వ్యవసాయకులవలెనే వీరును జీవించుచుండెడివారు. ఫ్రాన్సు, ఇటలీ, రష్యా, జపాను, చైనా మొదలగు దేశములనుండి యంత్రములపై తయారుకాబడి, చౌకగ పట్టునూలు, బట్టలు దిగుమతి యగుచుండుటచే వీటిపోటీకి పరిశ్రమ నిలువ జాలక పోయినది. ఎప్పుడైతే పోటీకి నిలువ జాలకపోవునో అప్పుడే వస్తువునందు ప్రశస్తతకూడ తగ్గుట సహజము. నేడు శ్రేష్ఠత్వముగాని యుత్పత్తిగాని విశేషముగ లేక పట్టుపరిశ్రమ జీవచ్ఛవమువలె నున్నది. "సనాతనకాలములో వివిధములగుపట్టుపురుగులుండెడివి. మల్బరీపురుగు మాత్రము 6 శతాబ్దములకు పూర్వము హిందూదేశమునకు కొనిరాబడెనని చెప్పుదురు."[1]

ఈపరిశ్రమ మైసూరు, బెంగాలు. కాశ్మీరు, పంజాబునందలి కొన్ని జిల్లాలలో (మల్బరీపట్టుపురుగును) చోటానాగపురము, ఒరిస్సా, మధ్యరాష్ట్రములలో కొన్నిచోట్లను టసారుపురుగును అస్సాము నందు (మూగపరీపురుగులును) బర్మాయందలి ప్రోము మొదలగు జిల్లాలలోను, శల్యావశిష్టముగ నేటివఱకు నీపరిశ్రమ నిలిచియున్నది.

[1] *Industrial commission report Appendix G. p. 80.*

బర్మాయందీ పరిశ్రమ మల్బరీపురుగుపట్టుతో చిరకాలానుగతముగ నున్నది.

1886 వ సంవత్సరమునందు రు 3296,000 విలువగల తయారైన పట్టుసరకు హిందూదేశమునందుండి ఎగుమతి జరిగెను. 1928-29 వ సంవత్సరమున రు 436000 ల పట్టు సరకు మాత్రమే ఎగుమతి జరిగెను. ఈ అంకెల ననుసరించి పట్టుపరిశ్రమ యెట్లు నశించిపోవు చున్నదియు తెలిసికొన గలము.

1926-27 సం॥న 6, 846 పౌనుల ముడిపట్టును అనగా 8058 ల విలువగల పట్టు బర్మానుండి ఎగుమతి చేయబడెను. ఇండియానుండి మొత్తము 1,294,972 పౌనుల ముడిపట్టు రు 32,39,518 ల విలువగల సరకు ఎగుమతి చేయబడెను. 1830 సం॥ ప్రాంతమువఱకును భారత దేశమే దుకూలముల నెగుమతి చేయుచుండెడిది. 1840 నుండియు యెగుమతి తగ్గిపోవుటయే కాక స్వదేశమందలి యుపయోగమునకు కూడ స్వదేశ దుకూలములు లభించనిస్థితి కీపరిశ్రమ కృంగదీయ బడెను. రాను రాను కృంగుచునే యున్నది గాని, మరల తలయెత్త సావకాశము లభింపనేలేదు. కాశ్మీర ప్రభుత్వము నూతనపద్ధతులపై యీపరిశ్రమను పునరుద్ధరింప ప్రారంభించెను. మైసూరునందు తాతా కంపెనీవారు కొన్ని పరిశోధనలు గావించుచున్నారు. ఇందులకువలయు సాంకేతిక విద్యానిపుణుని జపానునుండి రావించిరి. 'సాల్వేషను ఆర్మి' వారుకూడ కొలదిప్రయత్నములను చేయుచున్నారు. బెంగాలు సిల్కు కమిటీవారు ఫ్రెంచ్ దేశపు నిపుణులసహాయమున ఉన్నతజాతి పురుగు పుట్టుకకు ప్రయత్నించుచున్నారు. కాని యీప్రయత్నము లేమియు ఫలప్రదము కాలేదు. ఇంతవఱకు పరిశ్రమ పునరుద్ధరింప బడలేదు. మూర్షిడాబాదు, తంజావూరు, కాశీ, సూరతు, అమృతసరము, చెంగల్పటు, మధుర, మాండలేలయందు పట్టు వస్త్రములు నేటివఱకు నేయ

బడుచున్నవి. మిల్లులు 5 దు మాత్రమే గలవు. 2 బొంబాయి యందు, బెంగుళూరు, కలకత్తా, అహమ్మదాబాదులయం దొక్కొక్క టియుగలదు. బర్మాదేశమందు విస్తారముగ పట్టుబట్టలనే వాడుదురు. ఈ వాడకమునకు వలయు మూడువంతులు మాన్చెష్టరు (ఇంగ్లండు) జపానులనుండి దిగుమతియగుచున్నవి. 1926-27 వ సం॥ముని బర్మా దేశమునుండి రు 3086 ల ఖరీదుగల పట్టుబట్టల ఎగుమతి కలదు. భారతవర్ష మంతటినుండియు రూ 268,497 ల విలువగల పట్టుబట్టల యెగుమతి జరిగెను. బర్మాదేశమునకు రు 53,67,548 ల విలువగల పట్టుబట్ట దిగుమతిగలదు. భారతవర్షమునందంతట రు 3,45,09,584 ల పట్టుగుడ్డ దిగుమతి యున్నది. ఏమి యీా దుస్థితి ! 1921 వ సం॥ నందు వర్తకవిషయముల విచారించిన ఇంపీరియల్ ఇన్ స్టిట్యూట్ వా రేమనిరి ? ప్రభుత్వమువారిసహాయమున నొక సంఘుపరిశ్రమాభి వృద్ధికి భాధ్యతవహింపవలె ననిరి.[1]

ప్రజలు పట్టుబట్టల విషయమునగూడ స్వదేశాభిమానము వహించవలయును. ప్రభుత్వమువారు విదేశములనుండి దిగుమతియగు పట్టుబట్టలమీాద కృత్రిమపు పట్టుమీాద సంరక్షణపు సుంకములను విధించవలయును. పట్టుపరిశ్రమకు విరాళములగూడ నొసంగవలయును. పట్టుపరిశ్రమనుగుఱించి విచారింప నియమింపబడిన నిరకునామాసంఘ మువారు సంరక్షణముసుంకములను విధింపవలె నని సూచించిరి. వీరి రిపోర్టులు 1934 ఫిబ్రవరియందు ప్రకటింపబడెను. పట్టుబట్టలదిగుమతిపై 100 కి 83 వంతుల కిమ్మతు సుంకమును విధించవలె ననిరి. కలగలుపు పట్టుబట్టలపై 100 కి 60 వంతుల కిమ్మతుసుంకమును విధించవలె ననిరి. ముడిపట్టు పట్టునూళ్ళపై 50% కిమ్మతు సుంకమును విధించవలె ననిరి.

1. *From Imperial Institute Trade Enquiry Reports on Jute and Silk 1921.*

కృత్రిమపు పట్టునూలుపై పౌను 1 కి 1-0-0 నరకు సుంకమును విధించవలె ననిగూడ సూచించిరి. ఈవిధముగ పట్టుపరిశ్రమ 5 సంవత్సరములు సంరక్షింప బడవలెననియు పిమ్మట మరల పరిశ్రమాభివృద్ధిని గుఱించి విచారింపబడుననియు నిరకునామాసంఘము వారు వ్రాసిరి.

# 28. తే యా కు.

తేయాకుచెట్లు అస్సాము దేశమునందు 1820 వ ప్రాంతమునందే కలవు. అస్సాముదేశముపై 1834 సం॥ దండెత్తుటకు యూరపియనువర్తకులు ప్రారంభించిరి. లార్డువిల్లియం బెంటిక్ (Lord William Bentinck) 1834 సం॥లో చైనాదేశమున కొక సంఘమును పంపిరి. చైనాదేశపు తేయాకువిత్తనములను కూలీలను ఇండియాకు దిగుమతి చేయుటయే ఈ సంఘము వారి పని. ఈ సంఘము వారి ఖర్చులన్నియు ప్రభుత్వమువారే భరించిరి. ఈ సంఘమువారి సహాయసూచనల ననుసరించి ప్రభుత్వము తేయాకుతోటలను వేయించుట ప్రారంభించెను. ప్రారంభదశయందు పెట్టవలసిన ఖర్చులు నష్టములు ముగిసినవి. ఇక లాభములు సంపాదింప వచ్చునను నంతలో 1839 సం॥ న అస్సాము టీ కంపెనీ లిమిటెడ్ వారికి తోటలు ప్రభుత్వము వారిచే అమ్మివేయబడినవి. సీమవారి ఆధిపత్యమున సీమవారి పెట్టుబడితో తేయాకు తోటలు విజృంభింప సాగినవి. ప్రారంభదశయందలి ఖర్చులను ప్రభుత్వము భరించి సీమవర్తకులకు ప్రభుత్వము తోడ్పడెను. ఇక బ్రిటిషువర్తకుల తేయాకు తోటలపరిశ్రమకు కొదువయేమి? 1850 వచ్చుసరికి అస్సాము, బెంగాలు, దక్షిణఇండియా, సిలోనులయం దీతోటలు విచ్చలవిడిగా పెంచబడు చున్నవి. స్వదేశ విత్తనములతోనే తోటలు వేయబడెను. వంగదేశమున కచార్ (Cachar)

1899 లో ఇంగ్లీషు తేయాకుకంపెనీ లన్నియు "ఇండియన్ టీ ఎసోసియేషన్" అనుసంఘమును స్థాపించుకొనిరి. ఇట్లు తేయాకు విరివిగ ఎగుమతిచేయబడుచున్నను నిందుపై ఎగుమతిపన్ను విధించ బడలేదు. 1903 వ సం॥లో టీసెస్సు ఆక్టును గావించిరి. ఈచట్టము నను సరించి అత్యల్పమైన ఎగుమతిసుంకమును అంతర్వ్యాపార శుల్కము లను విధించిరి. కాని యీసుంకముల మూలముగ వసూలైనధనమును మరల టీసంఘమువారికే ప్రభుత్వ మిచ్చివేయుచుండెను. ఎట్లు? తేయా కులో పరిశోధనల గావించుటకు సుంకములసొమ్ము వాపసు చేయబడు చుండెను. ఇన్నిరీతుల తేయాకువర్తకుల వర్తకము ప్రభుత్వముచే పోషింపబడెను. కాని యీతోటలలో పనిచేయు కార్మికులదుస్థితిని దొలగించుటకు కృషి యొనరింపలేదు. 1863, 1901, 1915 సం॥లలో కూలీలనుగుఱించిన శాసనములు గావింపబడినవి. ఈశాసనములయం దలి నియమము లేవియు కూలీలబాధలను పూర్తిగ తొలగించజాలక పోయినవి. కూలీలు తమజీవితములను అమ్ముడుపోయిన బానిసలవలె జీవచ్ఛవములై యున్నారు.

తేయాకువర్తకమునం దేరవంతమైన నష్టమువచ్చునట్లు గని పించుచో ప్రభుత్వము వెంటనే నష్టము తొలంగుటకు కృషిసల్పుటలో వెనుదీయలేదు. రష్యాయందు విప్లవమువచ్చి ముగిసినపిమ్మట రష్యా వారి తేయాకును తెప్పించుకొనుట మానిరి. అంతకుపూర్వమే గత ఐరోపా యుద్ధప్రారంభమునుండియు రష్యాయందలి బ్రిటిషువర్తకులు తమ తేయాకుదుకాణముల నెత్తివేసికొన మొదలిడిరి. అందువలన గలుగునష్టమును తొలగించుటకు ప్రభుత్వము మఱుక్షణమందే సింహా వలోకన మొనరించినది. 1919 సం॥ నందు బ్రిటిషుసామ్రాజ్యములో హిందూదేశమందలి సీమతేయాకు వర్తకుల తేయాకు యెగుమతులకు ప్రత్యేకసౌకర్యములు లభించినవి. మఱియు బ్రిటిషుదీవులయందే తేనీరు

త్రాగుబోతుదనము ప్రబలినది. 1913 సం॥ రముతో పోల్చినచో 1923 సం॥ నందలి త్రాగుబోతుతనము 100కి 35 వంతులు హెచ్చుపెరిగెను.[1]

"1925 లో బ్రిటిషుదీవులకు ఇండియానుండి 342,000,000 పౌనుల తేయాకు ఎగుమతిచేయబడెను. సిలోనునుండి 213,000,000 పౌనులను, 112,000,000 పౌనులను డచ్చి ఈస్టుఇండీసు దీవులనుండియు, చైనాదేశమునుండి 113,000,000 పౌనుల తేయాకును బ్రిటీషు దీవుల కెగుమతి చేయబడెను."[2]

ఉత్తరహిందూదేశమున టీ తోటలు, మేనేజింగు ఏజంట్లవలనను, దక్షిణహిందూస్థానమున ప్రత్యేకపు కంపెనీలవలనను లేక ప్రత్యేకవ్యక్తులవలనను వ్యాపారము జరుపబడు చున్నది. కంపెనీ 1కి ఒక్కొక్క ఫ్యాక్టరీ కలదు.

ప్రపంచమునందలి తేయాకుపంట. ఈదిగువపట్టికవలన హిందూదేశమునందు తేయాకు పంట యెట్లు హెచ్చినదియు గ్రహింపగలము.

| § సంవత్సరము | ఎకరములు (1000) వేలలో | ఉత్పత్తి (మిలియనులలో లేక 10 లక్షల పౌనులు) |
|---|---|---|
| 1901 | 524 | 201 |
| 1921 | 709 | 274 |
| 1924 | 714 | 375 |
| 1927 | 756 | 390 |
| 1928 | 776 | 404 |
| 1929 | 788 | 432 |
| 1930 | 805 | 391 |

*1. Memorandum No. 1 Stocks of Staple Commodities, London and Cambridge Economic Service, quoted by Vera Anstey. p. 287.*

*2. Vide International Year Book of Agricultural Statistics*

*§ From Finance Year Book p. 229.*

[1] ఈదిగువ పట్టికవలన ప్రపంచమునందలి తేయాకుపండించు ముఖ్య దేశములలో సాలుసరి పండింపబడుచుండిన తేయాకు మొత్తమును తెలిసికొనగలము.

మిలియను పౌనుల తూకము.

| పేరు. | 1927 | 1928 | 1929 | 1930 | 1931 |
|---|---|---|---|---|---|
| ఉత్తరహిందూస్థానము | 336 1/2 | 341 | 372 | 331 | 335 1/4 |
| దక్షిణహిందూస్థానము | | | | | |
| మొత్తపు ఎగుమతులు | 47 1/2 | 48 3/4 | 52 1/4 | 47 1/2 | 49 1/4 |
| సింహళము | | | | | |
| మొత్తపు ఎగుమతులు | 227 | 236 | 251 1/2 | 241 1/2 | 247 |
| జావా మొత్తపు | | | | | |
| ఎగుమతులు | 126 3/4 | 134 | 136 1/2 | 135 | 145 |
| సుమిత్రా మొత్తపు | | | | | |
| ఎగుమతులు | 12 1/2 | 19 | 22 1/4 | 22 1/4 | 26 1/2 |
| మొత్తము | 755 1/4 | 779 1/4 | 834 1/2 | 777 1/4 | 803 |

ఈఅంకెలననుసరించి హిందూదేశమునుండి ఎగుమతియగుచుండిన తేయాకునకు జావా సుమిత్రాద్వీపములయందు పండింపబడుచుండిన తేయాకు పోటీగానున్నట్లు తెలిసికొనగలము. 1911 లో సుమిత్రాయందు ఎ 500 లలో మాత్రమే తేయాకుపంట కలదు. 1924 లో జావాయందు ఎ 207000 లలో మాత్రమే తేయాకు పండింపబడుచుండెను. 1928 వ సంవత్సరమునకు సుమిత్రాయందు ఎ 53000 లలోను జావాయందు ఎ 235000 లోను తేయాకు పండింపబడుచుండెను.

1 *From Tea Market Report of Messers J. Thomas and Co.*

ఆఫ్రికా దేశమునందుగూడ తేయాకు పండింపబడుచున్నది.

1928-29

| § | ఎకరములు | ఉత్పత్తి 1000 పౌనుల (తూకము) |
|---|---|---|
| దక్షిణాఫ్రికా యూనియను | 2000 | 800 |
| న్యాసలాండు | 8900 | 1745 |
| కెన్యా | 5600 | 150 |

దక్షిణాఫ్రికాయందు పండింపబడుచుండిన పంటగూడ గమనింపదగియే యున్నది. ఒక్క చైనా దేశముమాత్రమే తేయాకుపంటలో వెనుకబడినది. చైనావారి తేయాకు హిందూదేశపు తేయాకుతో పోటీచేయజాలదు.

మొత్తముమీద ప్రపంచమునందు పండింపబడుచుండిన తేయాకులో 100 కి 70 వంతులు బ్రిటిషుసామ్రాజ్యమునందే పండింపబడి బ్రిటిషుసామ్రాజ్యమునందే వినియోగింప బడుచున్నది. "ఈపరిశ్రమయందు పెట్టబడిన పెట్టుబడిగూడ మూడింట రెండువంతులు బ్రిటిషుసామ్రాజ్యపౌరులదే కలదు."[1]

ఈదిగువపట్టికవలన ప్రపంచమునందే దేశ మెంత తేయాకును ఏ దేశముల కెగుమతిచేయుచున్నదియు తెలిసికొనగలము.

§ *Finance Year Book p. 229. 1933.*

1. *Finance Year Book p. 230. 1933.*

1928-1929 వ సంవత్సరములయందు ప్రపంచమునందు ఎగుమతిగావింపబడిన తేయాకు.

| ‡ | 1928 | 1929 |
|---|---|---|
| | మిలియనుల పౌనులలో (తూకము) | |
| హిందూదేశము | 355.5 | 380.4 |
| సింహళము | 236.7 | 251.5 |
| న్యాసలాండు | 1.4 | 1.7 |
| దక్షిణాఫ్రికా | .1 | .1 |
| బ్రిటిషు సామ్రాజ్యమునుండి మొత్తము | 593.7 | 633.7 |
| జావా సుమిత్రా | 153.5 | 161.3 |
| చీనా దేశము | 76.8 | 73.0 |
| జపాను, ఫార్మోసా | 33.4 | 32.8 |
| విదేశములనుండి మొత్తము | 263.7 | 267.1 |
| అన్ని దేశములనుండి మొత్తము | 857.4 | 900.8 |
| బ్రిటిషు సామ్రాజ్యము 100 కి | 69.1 | 70.3 |

ఈఅంకెలననుసరించి తేయాకుపరిశ్రమ బ్రిటిషుసామ్రాజ్యపరిశ్రమ యనదగును. అయినను ఆస్ట్రేలియాదేశము 100 కి 50 వంతులు జావానుండి తేయాకును తెప్పించుకొనుచున్నది.[1]

హిందూదేశమునందుండి అత్యల్పముగనే తీసికొనుచున్నది. సిలోనువారి తేయాకునుగూడ తెప్పించుట మానివేసినది. ఈవిషయ

‡ *From the Report of the Imperial Economic Committee*

1. *Finance Year Book 1933 p. 231.*

మై ఒటావాసభలో ప్రత్యేకవిమర్శనలు జరిగినవి. 1932-33 వ సంవత్స రమున సీమదేశపు ఆదాయవ్యయశాసనమున సామ్రాజ్యమందలి తేయాకు దిగుమతులపై 2 పెన్నీల సుంకమును తగ్గించిరి. "సామ్రాజ్యపు తేయాకుపై తగ్గించిన దిగుమతిసుంకమువలన జావా తేయాకున కంటె సామ్రాజ్యపు తేయాకునకు ఎక్కువలాభము లభించలేదు. బ్రిటిషుదేశమున జావా తేయాకే హెచ్చుగా వాడబడుచున్నది."*1

ప్రపంచమునందు తేయాకును పండించుచున్న దేశములన్నియు అమెరికావంకకు జూచుచున్నవి. అమెరికావారికి తేనీటిపానీయము నలవాటుచేయవలెనని వర్తకులందఱు ప్రయత్నించుచున్నారు. ఈప్రయత్నము లన్నియు విఫలములైనవి. అమెరికాయందు నానాటికి తేనీటిత్రాగుడు తగ్గుచున్నది. అమెరికాయందు సం॥ 50 పూర్వము తల 1 కి 1.32 పౌనుల (సాలకము) తేయాకు వినియోగింపబడెడిది. నేడు పౌ. 75 మాత్రమే వినియోగింపబడుచున్నది. అమెరికావారికి హిందూదేశపు తేయాకును విరివిగ నెగుమతిచేయుట కవకాశము లేదని ఋజువగుచున్నది.

ఆస్ట్రేలియా దేశముమాత్రమే తేయాకును విస్తారము వినియోగించుచున్నది. హిందూదేశపు తేయాకును ఎగుమతిచేయుటకు ఆస్ట్రేలియాదేశ మంగీకరించినయెడల అచ్చటకుమాత్రమే విరివిగ ఎగుమతి చేయుటకు సావకాశముగలదు.

*1. From Financial Times. London. Cable Published in Hindu 1933 June.*

ఈదిగువపట్టికవలన ఆస్ట్రేలియాదేశము దిగుమతిచేసికొనుచున్న తేయాకుమొత్తమును గ్రహింపగలము.

మిలియనుపౌనులు (తూకము)

| సంవత్సరము | సింహాళము | | ఉత్తర హిందూస్థానము | | జావా | | సుమిత్రా | | మొత్తము |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | మిలియనుల పౌనుల (తూకము) | | | | | | | | |
| 1910 | 23.3 | 66.6% | 10.4 | 29.7% | 1.3 | 29.7% | ... | | 35 |
| 1920 | 22.9 | 44.7,, | 9.1 | 17.7,, | 39.3 | 37.6,, | ... | | 51 |
| 1930 | 29.5 | 51.9,, | 4.2 | 7.4,, | 22.9 | 40.3,. | .2 | .4% | 50.8 |
| 1931 | 22.4 | 43.5,, | 3.7 | 7.2,, | 24.4 | 47.4,, | 1.0 | 1.9,, | 51.5 |

ఈఅంకెలననుసరించి హిందూదేశము యొక్కయు సింహాళద్వీపముయొక్కయు ఎగుమతులు తగ్గినవనియు జావాఎగుమతులు హెచ్చినవనియు తెలిసికొనగలుగుచున్నాము. సామ్రాజ్యతత్వమున ఆస్ట్రేలియాను పురికొల్పి హిందూదేశపు తేయాకును ఎగుమతిచేయగలమని కొందఱిభ్రమ. ఒటానాయొడంబడికయర్థ మిదియే. కాని ఆస్ట్రేలియాదేశముతో నిట్టిసంధికుదురుట దుర్లభము. ఆస్ట్రేలియానుండి దిగుమతియగుచుండిన గోధుమలపై హిందూదేశము సుంకమును విధించుచున్నది. ఇంకను విధింపవలసి యున్నది. ఆంగ్లేయవర్తకుల తేయాకు నమ్ముటకొఱకై హిందూదేశపు గోధుమపంటను బలియొసంగజాలము.

తేయాకుపంట యజమానులందఱు గలిసి 1932 వ సంవత్సరము డిశంబరుమాసమున ఉత్పత్తిని తగ్గించుకొనుటకై నిర్ణయించుకొనిరి.

ఉత్పత్తిని తగ్గించుకొనుటయే తేయాకుతోటలవారి కర్తవ్యము. 1929, 30, 31 వ సంవత్సరములయందే యేదు అధికముగ నెగుమతి జరిగెనో ఆయేటి లెక్కల ననుసరించి ఉత్పత్తినిర్ణయమును గావించుకొనుట కంగీకరించిరి. ఈయొడంబడికననుసరించి హిందూదేశము సాలుసరి 325205563 పౌనుల (తూకము) తేయాకును ఎగుమతిచేయవచ్చును.

ఆయాదేశము లెంత తేయాకు నెగుమతిచేయ గలిగినదియు నీపట్టికవలన గ్రహింపగలము.

పౌనులలో (తూకము)

| దేశము | సంవత్సరము | ఆయాదేశముల హెచ్చు ఎగుమతులు | 100 కి 85% ఏ దేశ మెంత ఎగుమతి చేయవచ్చును. |
|---|---|---|---|
| హిందూదేశము | 1929-30 | 382594779 | 325205563 |
| సింహళము | 1929 | 251522617 | 213794225 |
| జావా | 1931 | 145028631 | 123274337 |
| సుమిత్రా | 1931 | 26533397 | 22553388 |
| | | 805679424 | 684827513 |

హిందూదేశము ఎగుమతిచేయ నిర్ణయింపబడిన తేయాకు మొత్తమునం దేకంపెనీ యెంత తేయాకు నెగుమతి చేయవలసినదియు నిర్ణయించుటకు హిందూదేశప్రభుత్వ మొకసంఘమును నియమించినది. 1933 వ సంవత్సరము మే 26 వ తేదీనుంచియు నీ యొడంబడిక అమలునం దుంచబడును. హిందూదేశ ప్రభుత్వము 1933-5-19 వ తేదీని యొడంబడిక ననుసరించి ఎగుమతులు జరుప

బడుటకు తేయాకుతోటల యజమానులతో గూడిన లైసెన్సుబోర్డును స్థాపించిరి. నల్లమందుపంటవలె తేయాకుపంటగూడ నమసి పోవుట సమంజసము. ఔషధోపయోగముగమాత్రమే వినియోగింపబడురీతిని ప్రపంచ మంతయు తేయాకుపంటను నిషేధించినను హిందూదేశము వగవ బనిలేదు.

## 29. కాఫీ.

కాఫీతోటలు 16 వ శతాబ్దమునుండియు తేయాకుతోటల వలెనే హిందూదేశమున గలవు. 1830 సం॥రం ఆరంభము నుండియు తేయాకుతోటలవలెనే కాఫీతోటలుకూడ బ్రిటీషువర్తకుల పెట్టుబడితో వారియాజమాన్యముక్రింద నిర్వహింప బడుచున్నవి. మైసూరు, మైసూరుప్రాంతములయందలి యితరజిల్లాలలో కాఫీతోటలు విస్తారముగ గలవు. 1862 డవ సం॥ వఱకు విరివిగ నభివృద్ధి చెంది 1885 సం॥ ప్రాంతమున తెగుళ్ళు తగిలి తోటలు క్షీణించినవి. ఈతోటలయందుగూడ నిప్పుడు తేయాకే వేయబడుచున్నది.

## 30. రబ్బరు.

దక్షిణహిందూదేశమున, బర్మా, సిలోనులయందున రబ్బరు క్వైనెనుతీయుచెట్ల (Cinchona) తోటలు 19 వ శతాబ్దాంతమునందు ప్రవేశపెట్టబడెను. 1913-14 సం॥రమున 2-6 మిలియనుపౌనుల రబ్బరు ఎగుమతి చేయబడెను. 1920-21 సం॥న 14 మిలియనులపౌనుల రబ్బరు యెగుమతిచేయబడెను. బ్రిటిషుమలయాద్వీపమునుండి 200,000,000 పౌనుల రబ్బరు యెగుమతి యగుచున్నది. 1925-28 వఱకు రబ్బరు ధరలు తకమికలుగ నుండుటవలన కొంత అలజడి కలిగినది. 1927-28

సంవత్సరమున 25,403,266 పౌనుల కప్పురు ఎగుమతి చేయబడెను. 1932-33 లో 70,00000 పౌనుల బరువు మాత్రమే ఎగుమతి కలదు.

క్వైను

వంగదేశమునందలి ఉత్తరప్రాంతములలోను, దక్షిణ హిందూస్థానమందును క్వైనను ఉత్పత్తి చేయబడుచున్నది. ప్రభుత్వమువారును ప్రత్యేకవ్యక్తులుకూడ నీవర్తకమును చేయుచున్నారు. హిందూదేశమునందు పండింపబడుచున్న క్వైనను హిందూదేశమునందే ఖర్చుపెట్టబడుచున్నది. జావానుంచియే ప్రపంచమునకంతకు నెగుమతి కాబడుచున్నది.

## 31. నీలిమందు.

నీలిమందు సనాతనకాలమునుండియు హిందూదేశమునందు పండింపబడి యొకరంగుక్రింద నుపయోగింపబడుచున్నది. 18 వ శతాబ్దమునుండియు సీమవారి పెట్టుబడితో సీమవారి యాజమాన్యమున నీపంట యున్నది. 19 శతాబ్దమునుండియు విరివిగ విదేశములకు ఎగుమతి కూడ చేయబడుచున్నది. 19 వ శతాబ్దమునందు నీలిమందు వ్యవసాయదారులకును కోటలయజమానులకును సంఘర్షణలు సంభవించినవి. కాని ప్రభుత్వపుసహాయమును [illegible] తెల్లయజమానులు తొలగించుకొనగలిగిరి. 1897 వ సం॥ వరకు ఎగుమతులు [illegible] రించుకొనిరి. పిమ్మట ఎగుమతులు లొకింత తగ్గినవి. జర్మనీవారిపోటీకి నిలువజాలక పోయెను. 1896 సం॥లో నీలిమందుపంటక్రింద నున్న వ్యవసాయపుభూమిలో పదునవవంతుమాత్రమే 1913-14 లో గలదు. మరల యుద్ధకాలమున జర్మనీవారి యెగుమతులకు వీలులేకపోయినందున నీలిమందు పరిశ్రమ కొంచెము తల యెత్తినది. 1918 నుంచియు జర్మనీవారి కృత్రిమపు రంగులు మరల విరివిగ నెగుమతి యగు

చుండుటచే వెనుకటియున్నతస్థితిని సంపాదింప గలిగినవి. నీలిమందు 1932-33 వ సంవత్సరమున 50000 ఎకరముల సాగు చేయబడెను. అందుచే ప్రభుత్వమునకును ఆంగ్లేయవర్తకులకును నలజడి కలిగెను. 1918లో నీలిమందుపంటలో పరిశోధన లొనరించుటకు నీలిమందుపై శుల్కమును విధించి, ఆసుంకముల రాబడిని పరిశోధనకై వినియోగింప ప్రారంభించిరి. బీహారు, ఒరిస్సా, కాశీ, అయోధ్యలయందు సీమవారి ఆధిపత్యమున నీలిమందుపంట పండింపబడుచున్నది. మదరాసురాజధానిలో మాత్రము భారతీయుల ఆధిపత్యముక్రిందనే పండింప బడుచున్నది. "అందుచే నీలిమందు అప్రశస్తమనియు, సీమవారి యాజమాన్యమున పండింపబడుచున్నది ప్రశస్త" మనియు ప్రకటింపబడుచున్నది.[1]

మదరాసురాజధానిలో 40,181 ఎకరములలోను, ఇతరరాష్ట్రములలో 26935 ఎకరములలోను పండింప బడుచున్నది.

## 32. చిల్లర పరిశ్రమలు.

సనాతనకాలము నాటనుండియు గృహపరిశ్రమల క్రిందనున్న బియ్యము దంపుట, గోధుమపిండి విసరుట, ప్రత్తిగింజలు తీయుట, యేకుట, మొదలగున వన్నియు మిల్లులమూలమున జరుగు చున్నవి. గృహపరిశ్రమలు చాలవఱకేస్వల్పవిషయములందుగూడ నడుగంటినవి.

## 33. ధాన్యపు మిల్లులు.

దేశమందంతట ధాన్యము పండుటవలన ధాన్యపుమిల్లులు బయలుదేఱినవి. మదరాసు రాజధానిలో 444, బొంబాయిరాజ

1. *Vera Anstey p. 289.*

ధానిలో 65, వంగదేశమున 277, సంయుక్తరాష్ట్రములయందు 3, పంజాబునందు 20, బర్మాయందు 572, బీహారు ఒరిస్సా దేశములయందు 53, మధ్యరాష్ట్రములయందు 20, మొత్తము 1927 వ సం॥న 1459 మిల్లు లున్నవి. 1926 లో నున్న 1338 కంటె, మరు సం॥ రమే 121 మిల్లులు హెచ్చయినవి. ఈధాన్యపు మిల్లులవలన నభివృద్ధియగు పరిశ్రమ యేదియు లేదు. ధాన్యము మరాడించి తినుటవలన బియ్యము నందుగల బలమగు పదార్థములు నశించిపోవుచున్నవి. దేశమునందు నంజువ్యాధి ప్రబలు చున్నది. బీదవాండ్రకు దంపుట గృహపరిశ్రమగ నుండి, ఉపాధికి సహాయకారిగ నుండెడిది. ఏకారణములచేతగాని విదేశములనుండి యంత్రసామగ్రులు రాకున్నచో నప్పుడు బియ్యముచేసి కొనగలిగిన స్వయం సహాయముకూడ నశించి పోవుచున్నది. అనుదిన మవసరమగు ప్రధానమయినబియ్యముకొఱకుగూడ విదేశ యంత్రములపై ఆధారపడవలసి వచ్చినది. ఎంతటి పరాధీనత!

## 34. పంచదార పరిశ్రమ.

చెఱకుపంటకు లోటు లేదు. పంచదార వినియోగమునకు గొదువ లేదు. సహజసౌకర్యములకు బరిమితి లేదు. అయినను పంచదార విస్తారముగ దిగుమతి యగుచున్నదేల? ప్రకృతి ప్రసాదించిన సహజసౌకర్యముల నేల వినియోగించుకొనుట లేదు? సావకాశము లభించుచో, పరిశ్రమలకై పెట్టుబడిపెట్టుట కుత్సాహాము గలదు. గతించిన రెండుమూడు సంవత్సరములయందుననే సుమారు 60 క్రొత్తపంచదారమిల్లులు బయలుదేరినవి. ఈ మిల్లులు 20 సం॥ల క్రిందట, లేక ఒక

దశకు ముందుగ, నేల ప్రారంభింప బడలేదు ? "ప్రభుత్వము పంచ దార పరిశ్రమకు వలయు సహాయము నొసంగుసూచనలను గోచరింప జేసి యున్నను చాలకాలముక్రిందనే పంచదారపరిశ్రమ భారతదేశ మునం దభివృద్ధి జెందియుండెడిది" 1

పంచదారపరిశ్రమకు భారతజాతీయార్థికనిర్మాణమున ప్రాము ఖ్యస్థానము గలదు. వ్యవసాయాభివృద్ధితో పరోక్షమగు సంబంధము గలిగియుండిన పరిశ్రమలలో నిది యొకటి. ఈ పరిశ్రమ వివిధరీతుల ఆర్థికాభివృద్ధికి దోడ్పడగలదు. పంచదారసంఘమువారి నివేదిక ప్రచు రింపబడినవెంటనే 1920 వ సంవత్సరమునందే ప్రభుత్వమువా రీపరి శ్రమకు బ్రోత్సాహ మొసంగి యున్నచో, హిందూదేశ మానాటినుం డియు నేటివఱకును కనీసము 200 కోట్ల రూప్యములను విదేశముల కెగుమతి చేయవలసినపని యుండెడిది కాదు. విదేశములనుండి పంచ దార దిగుమతిని 10 సంవత్సరములకు పూర్వమే తగ్గించుకొని యుండె డివారము. యుద్ధానంతరము ప్రతిదేశమును పంచదారను స్వాయముగ నుత్పత్తి జేసికొన ప్రారంభించెను. ఈయదృష్టము హిందూదేశమునకే పట్టలేదు. ప్రపంచమువంకకు వెలవెలబోయి చూచుచుంటిమి. "ప్రభు త్వము దేశమున కనుకూలమైన ఆర్థికనీతి నవలంభింపక పోయినను, లేక వ్యతిరేకార్థికనీతి నవలంభించినను, దేశ మెంత దురదృష్టస్థితికి వచ్చునో పంచదార పరిశ్రమ పరివర్తనమే వేనోళ్ళ చాటుచున్నది."2

జాతీయార్థికాభివృద్ధి విధానము నవలంభించిన యెడల దేశ మున కెట్టిమేలు గలుగునో గతించిన రెండుమూడు సంవత్సరములలో

---

1. *Finance Year Book 1933 p. 260.*

2. *Indian Finance Year Book 1933 p. 261.*

పంచదార పరిశ్రమస్థితియే తెలుపుచున్నది. 1930 సంవత్సరమున భారతీయ వ్యవసాయ పరిశోధనమండలివారి ప్రయత్నమున పంచదార పరిశ్రమ తలయెత్త సాగెను. (పంచదార పరిశ్రమనుగుఱించిన కొన్ని వివరములు 5 దవ అధ్యాయమున చెఱకుపంట అను శీర్షిక క్రింద వ్రాయ బడెను.) కొలది సంవత్సరములలో భారతదేశము విదేశముల నుండి పంచదారను దిగుమతి చేసికొనవలసిన యవసరము తొలగిపోవునని యాశింప గలము. పంచదారపరిశ్రమ కొసగబడిన సంరక్షణము గమనింపదగి యున్నది. దిగుమతి పంచదారపై విధించుచుండిన సుంకములు జావాపంచదార ఖరీదును రెట్టింపు చేయుచున్నవి. ఇతర పరిశ్రమల కిట్టి సంరక్షణ మొసగబడుట లేదు. విదేశపు పోటీదారుల ముట్టడి నితరపరిశ్రమ లెదుర్కొన జాలకున్నవి. వస్త్రపరిశ్రమ ఉక్కు పరిశ్రమల చరిత్రను పరీక్షించితిమి. వాటి కొసగబడిన సంరక్షణము చావక బ్రతుకక జీవచ్ఛవములవలె నిలిచి యుండుటకు మాత్రమే సహాయపడు చుండెను. పంచదార పరిశ్రమ కొసంగబడిన సంరక్షణము పరిశ్రమాభివృద్ధికి దోడ్పడెను. పంచదారపరిశ్రమ కొసంగబడిన సంరక్షణమువలన గ్రహింపగలిగిన దేమి? "ప్రభుత్వ మేపరిశ్రమకైన సంరక్షణ మొసగ దలంచినయెడల, నాసంరక్షణము సకాలమునం దొసగ వలయును. సక్రమరీతిగ నొసగవలయును. సంపూర్ణముగ నొసగ వలయును. పరిశ్రమాభివృద్ధి దృష్టితో నొసంగ వలయును. అప్పుడే ఏపరిశ్రమ యైనను నభివృద్ధి జెందగలదు.

ఇదియే పంచదారపరిశ్రమ బోధించుచున్న గుణపాఠము. వస్త్రపరిశ్రమకును, ఉక్కుపరిశ్రమకును నొసంగిన అర్థాంగీకార సంర

క్షణము. ఎంగిలిమెతుకులవలె విసరుసంరక్షణము. ఏపరిశ్రమకును ఎవరి కిని ఎట్టియుపయోగమును గలిగింపదని సుబోధక మొనరించుచున్నది.[1]

నేటికి పంచదారపరిశ్రమ యుత్సాహకరముగ నున్నను, ముందు విషమపరిస్థితు లుదయింపవచ్చు నని ప్రభుత్వోద్యోగులు శకునము జెప్పుటకు ప్రారంభించిరి. ఉత్పత్తిని తగ్గించుటకై ప్రయత్నములను జేయవలయు ననుచున్నారు.[2]

అధికోత్పత్తి యగుచో నితరపరిశ్రమలవలెనే దీనియభివృద్ధియు వెనుకబట్టు ననుచున్నారు. సిమ్లాలో జరిగిన పంచదారపరిశ్రమ సభ యందు బీహారుమంత్రిగా రుపపాదించిన తీర్మానము ప్రజలయం దపో హాలను గలిగించునట్లుగ నుండెను. ఈయనతీర్మానము అధికోత్పత్తి భయమును, ఉత్పత్తిని కట్టుబాట్లయం దుంచవలసిన యవసరమును సూచించుచుండెను.[3]

ఈతీర్మానమును సభ్యులు సక్రమముగ నోడించిరి. ఉత్పత్తి అయిన పంచదార అంతయు వినియోగింపబడక నిలువయుండుకాలము భారతదేశమునం దింతలో రాదు. విదేశపుపంచదార దిగుమతి తొలగి పోయి, స్వదేశీపంచదార నంతను దేశము వినియోగించుకొన జాలక విదేశములకుగూడ నెగుమతి యగుటకు వీలులేనినాడు పంచదార యుత్పత్తిని తగ్గించుకొనుటకై విధినిషేధములనుగుఱించి యోచింప వచ్చును. అంతవఱకు నధికోత్పత్తికై ప్రయత్నించుటయే కర్తవ్యము.

---

1. *From Indian Finance Year Book 1933 p. 262.*

2. *See Review of Mr. R. C. Srivastava the Govt. Sugar Technologist on Sugar Industry for 1931-32.*

3. *Simla Sugar Conference Proceedings July 10th 1933.*

ఈదిగువపట్టికవలన 1931-2-28 వ తేదీవఱకును పంచదారపై గల దిగుమతిసుంకములవివరములను తెలుపును.

| సంవత్సరములు | | | | సుంకము | | |
|---|---|---|---|---|---|---|
| 1908-1909 | మొదలు | 1910-1911 | వఱకు | కిమ్మతుపై సుంకము | | 5% |
| 1911-1912 | ,, | 1913-1914 | ,, | ,, | ,, | ,, |
| 1914-1915 | ,, | 1916-1917<br>1916-2-28 | ,, | ,, | ,, | ,, |
| 1917-1918 | ,, | 1919-1920 | ,, | ,, | ,, | 10% |
| 1920-1921 | ,, | 1922-1923<br>1921-2-28 | ,, | ,,<br>,, | ,,<br>,, | 10,, |
| | | 1922-2-28 | ,, | ,, | ,, | 15% |
| 1923-1924 | ,, | 1924-1926<br>1925-5-25 | ,, | ,,<br>,, | ,,<br>,, | 25,,<br>25,, |
| | | హండ్రెడువెయిటు 1కి రు. | | 4—8—0 | | |
| 1926-27 | ,, | 1928-29 | | 4—8—0 | 28—2—30 | వఱకు |
| 1929-30 | ,, | | | 4—8—0 | | |
| | | | | 6—0—0 | 1—3—30 | నుంచి |

1931 వ సంవత్సరమున ప్రకటింపబడిన సుంకనామాసంఘము వారు 15 సంవత్సరములవఱకు సంరక్షణమొసంగవలెనని సూచించిరి. "మొదటి 7 సంవత్సరములవఱకును సంరక్షణము సుంకమును హండ్రెడ్వెయిటు 1 కి రు 7-4-0 వంతునను, పిమ్మట 8 సంవత్సరములవఱకును రు 6-4-0 వంతునను విధించవలెనని సూచించిరి. అనగా సగటున రు 6-9-3 దిగుమతిసుంకమును విధించుటయగును."[1]

ఈ నిరకునామాసంఘమువారు భారతీయ వ్యవసాయపరిశోధన మండలికి 10 లక్షలకు తక్కువగాని విరాళమును పరిశోధనకై ప్రతి సాలునందున నొసగవలెననికూడ సూచించిరి.

1. *See Tariff Board Report.*

ఈసూచనల ననుసరించి 1932 వ సంవత్సరమున పంచదార సంరక్షణశాసనముగావింపబడెను. ఈశాసనము ననుసరించి 1946-3-31 వఱకును సంరక్షణ మొసగ బడును. మొట్టమొదట 1938-3-31 వఱకును సంరక్షణ మొసగుటకు నిర్ణయింప బడెను. 1938 ద వ మార్చి నుండియు నొసగవలసిన సంరక్షణమును గుఱించి విచారించుటకై మరల నిరకు నామాసంఘము నియమింప బడును. వారి సూచనలను భారతశాసన సభవారికి సమర్పించవలయును. వీరి నివేదిక ననుసరించి మంత్రియుతుడైన గవర్నరు జనరలుగారికి సుంకములను హెచ్చించుట అవసరమని తోచినయెడల, ఆయన ప్రకటన రూపముగ సుంకములను హెచ్చింప వచ్చును. మిల్లులపై కొన్ని విధులు గూడ నీశాసనము ననుసరించి విధింప బడెను.

"ఈసంరక్షణమును బొంది పంచదార పరిశ్రమ 1934-35 వ సంవత్సరమున నేడు భారతదేశము వినియోగించు చున్నంత పంచదార నుత్పత్తి జేయగలదు. 1933-34 వ సంవత్సరమునకు 124 మిల్లులు పంచదార నుత్పత్తి జేయగలవు."[1]

భారతదేశమునకు పంచదార దిగుమతి కాకుండ భారతదేశమే పంచదార నుత్పత్తి జేసికొన గలిగిన దినము, భారతీయ పారిశ్రామిక పరివర్తనమునందు సువర్ణాక్షరములతో లిఖించికొన వచ్చును. ఆదినము నిశ్చయముగా సుదినము.

ఈదిగువ పట్టికల ననుసరించి ప్రపంచమునందు పంచదార వినియోగముకంటె ఉత్పత్తి అధికముగ నున్నదని తెలిసికొన గలము. ఈయధికోత్పత్తిని భారతదేశము గమనింప నవసరము లేదు. భారతదేశమున వినియోగించుకొనుటకే అధికోత్పత్తి అవసరము.

1. *Sir Hussain's speech at Sugar Conference 1933-7-10 Simla.*

## A. BEET SUGER

ఈ పట్టిక వివిధ దేశములయందుగల బీటుదుంపలపంచదారను తెలియజేయును.

(1000 మెట్రిక్ టన్నులు) సుమారు విలువ.

| | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 |
|---|---|---|---|---|
| (ఎ) యిరోపా | | | | |
| జర్మనీ | ... | 1864 | 1935 | 2460 |
| డేంజింగు | ... | 29 | 29 | 36 |
| జెకోస్లోవాకియ | ... | 1057 | 1035 | 1180 |
| ఆస్ట్రియా | ... | 107 | 120 | 145 |
| హంగాం | ... | 220 | 247 | 225 |
| ఫ్రాన్సు | ... | 907 | 917 | 1150 |
| బెల్జియము | ... | 279 | 252 | 270 |
| నెదర్ లేండ్సు | ... | 321 | 265 | 300 |
| పోలేండు | ... | 747 | 917 | 735 |
| డెన్మార్కు | ... | 170 | 134 | 166 |
| స్వీడన్ | ... | 161 | 121 | 181 |
| ఇటలీ | ... | 387 | 434 | 411 |
| స్పెయిన్ | ... | 239 | 248 | 320 |
| జుగోస్లావియా | ... | 129 | 121 | 95 |

ii

| | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 |
|---|---|---|---|---|
| రుమానియా | ... | 134 | 82 | 170 |
| బల్గేరియా | ... | 29 | 40 | 51 |
| స్విట్జరులాండు | ... | 7 | 7 | 7 |
| బ్రిటిషుదీవులు | ... | 218 | 319 | 485 |
| ఐరిష్‌ఫ్రీస్టేటు | ... | 22 | 23 | 25 |
| ఫిన్‌లాండు | ... | 3 | 3 | 3 |
| లాట్వియా | ... | 2 | 4 | 7 |
| టర్కీ (యూరోపియన్) | ... | 4 | 5 | 10 |
| అజోర్సు | ... | 2 | 3 | 3 |
| (బి) అమెరికా | | | | |
| సంయుక్త రాష్ట్రములు | ... | 1070 | 1027 | 1200 |
| కనడా | ... | 33 | 35 | 38 |
| అర్జంటైనా | ... | ... | 1 | 1 |
| (సి) ఆస్ట్రేలియా | | | | |
| విక్టోరియా (మఫా) | ... | 2 | 2 | 2 |
| (డి) ఆసియా | | | | |
| జపాన్ (హోక్కైడో) | ... | 23 | 29 | 30 |
| కొరియా | ... | 1 | 1 | 1 |
| టర్కీ (అంటోలియా) | ... | 2 | 4 | 6 |
| మొత్తము ఉత్పత్తి | 9142 | 9594 | 9832 | 11718 |

1. *From Indian Tariff Board on the Sugar Industry page 2.*

## చెఱకుగడవలన తయారగు పంచదార వివిధ దేశములయందు గల ఉత్పత్తి.

(1000 మెట్రిక్ టన్నులు) సుమారువిలువ.

| | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 |
|---|---|---|---|---|
| (ఎ) ఐరోపా | | | | |
| స్పెయిన్ | ... | 17 | 19 | 28 |
| (బి) నార్తు అమెరికా | | | | |
| లూసిఅనఫ్లోరిడా | ... | 126 | 205 | 210 |
| పోర్టోరికో | ... | 539 | 786 | 700 |
| హవాయి | ... | 832 | 844 | 830 |
| వర్జిన్ దీవులు | ... | 4 | 7 | 4 |
| క్యూబా | ... | 5240 | 4746 | 3627 |
| ట్రినిడాడ్ | ... | 91 | 81 | 80 |
| బార్బడోస్ | ... | 67 | 86 | 66 |
| జమైక | ... | 59 | 69 | 55 |
| ఇతరబ్రిటిషు పశ్చిమ యిండియా దీవులు. | ... | 32 | 45 | 45 |
| మార్టినిక్యూ గ్వాడెలూప్ | ... | 50 | 68 | 65 |
| సెంటోడొమింగు హయిటి మెక్సికో | ... | 355 | 604 | 588 |
| మధ్యఅమెరికా | ... | 122 | 141 | 141 |
| (సి) సౌత్ అమెరికా | | | | |
| బ్రిటిషుగయానా | ... | 118 | 119 | 114 |
| డచ్చిగయానా | ... | 18 | 19 | 19 |

ii

| | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 |
|---|---|---|---|---|
| అర్జంటైనా | ... | 410 | 375 | 410 |
| బ్రెజీలు | ... | 988 | 850 | 700 |
| పెరు | ... | 375 | 422 | 400 |
| తదితర||అమెరికాదీవులు | ... | 80 | 80 | 79 |
| (డి) ఆసియా | | | | |
| బ్రిటిషుయిండియా | ... | 3041 | 3105 | 3300 |
| జావా | ... | 2163 | 3115 | 3173 |
| జపాన్ పార్మోజా | ... | 907 | 925 | 920 |
| ఫిలిఫైన్ దీవులు | .... | 725 | 790 | 770 |
| చైనా, హిందూచైనా | ... | 279 | 220 | 220 |
| (ఇ) ఆఫ్రికా | | | | |
| ఈజిప్టు | ... | 109 | 90 | 100 |
| మాంటియన్ | .... | 274 | 244 | 220 |
| రీయూనియను | ... | 33 | 51 | 50 |
| సౌత్ ఆఫ్రికా యూనియను | ... | 267 | 271 | 350 |
| మొజంబిక్యు | ... | 91 | 78 | 75 |
| తదితరఆఫ్రికాదీవులు | ... | 34 | 38 | 40 |
| (యఫ్) ఆస్ట్రేలియా | | | | |
| క్వీన్సులాండు న్యూసౌత్ వేల్సు | ... | 546 | 547 | 523 |
| ఫిజిదీవులు | .... | 89 | 91 | 102 |
| | 17533 | 19286 | 19128 | 18004 |
| | 26675 | 28880 | 28460 | 29717 |

1. *From Indian Tariff Board on the Sugar Industry page 4.*

ఈదిగువ పట్టిక వివిధదేశములందుగల పంచదార వినియోగమును దెలుపును.

(1000 మెట్రిక్కు టన్నుల సుమారు విలువ.)

| | 1927-28 | 1928-29 | 1929-30 |
|---|---|---|---|
| ఐరోపా | | | |
| జెర్మని | 1623 | 1693 | 1654 |
| జెకోస్లోవాకియా | 393 | 407 | 405 |
| ఆస్ట్రియా | 202 | 209 | 219 |
| హంగరి | 113 | 116 | 114 |
| స్విట్జరులాండు | 167 | 172 | 173 |
| ఫ్రాన్సు | 971 | 1020 | 1043 |
| బెల్జియము | 210 | 223 | 226 |
| నిదర్లాండ్సు | 232 | 258 | 285 |
| బ్రిటిషుదీవులు | 2051 | 2129 | 2004 |
| పోలేండు | 386 | 411 | 385 |
| రష్యా | 1815 | 1350♦ | 1100♦ |
| డెన్మార్కు | 183 | 198 | 186 |
| స్వీడను | 231 | 244 | 270 |
| ఇటలీ | 379 | 395 | 381 |
| స్పెయిన్ | 269 | 286 | 295 |
| ఇతర దేశములు | 907 | 927 | 945 |
| ఐరోపా మొత్తము | 9632 | 10038 | 9685 |

ii

| | 1927-28 | 1928-29 | 1929-30 |
|---|---|---|---|
| ఆసియా. | | | |
| చైనా, హాంకాంగు | 1150 | 1210 | 1100♦ |
| బ్రిటిషు ఇండియా | 4325 | 4501 | 4250♦ |
| జపాన్ ఫార్మోసా | 829 | 898 | 860 |
| జావా | 297 | 338 | 396 |
| ఇతర దేశములు | 610 | 568 | 583 ♦ |
| మొత్తము | 7211 | 7065 | 7189 |
| ఆఫ్రికా | | | |
| యీజిప్టు | 150 | 169 | 170 |
| సౌత్ ఆఫ్రికన్ యూనియన్ | 169 | 182 | 185 |
| మారిటియస్ | 6 | 6 | 6 |
| ఇతర దేశములు | 361 | 467 | 469♦ |
| ఆఫ్రికా మొత్తము | 686 | 824 | 830 |
| అ మె రి కా | | | |
| సంయుక్త రాష్ట్రములు | 5983 | 6564 | 6302 |
| హవాజి | 19 | 20 | 29 |
| పోర్టోరికో వర్జిన్ దీవులు | 50 | 50 | 50 |
| కూబా | 156 | 168 | 140♦ |
| కనడా, న్యూఫౌండులాండు | 429 | 427 | 429♦ |

iii

| | 1927-28 | 1928-29 | 1929-30 |
|---|---|---|---|
| బ్రిటిష్ పడమటిదీవులు గయానా (West Indies) | 32 | 47 | 46 |
| ఫ్రెంచి పడమటి ఇండియా దీవులు | 5 | 4 | 4 |
| హైతి, సాణ, డొమింగో | 30 | 29 | 29 |
| మెక్సికో | 190 | 192 | 198 |
| మధ్యఅమెరికాలో ఇతర దేశములు | 83 | 92 | 92♦ |
| అర్జంటైనా | 340 | 350 | 350 |
| బ్రెజీలు | 800 | 825♦ | 825 |
| పెరు | 41 | 59 | 60 |
| సౌత్ అమెరికాలో ఇతర దేశములు | 274 | 310 | 310♦ |
| అమెరికా మొత్తము | 8432 | 9137 | 8855 |
| ఆస్ట్రేలియా | | | |
| ఆస్ట్రేలియా ఖండము | 327 | 340♦ | 350♦ |
| ఇతరదేశములు | 85 | 75 | 79 |
| ఆస్ట్రేలియా మొత్తము | 412 | 415 | 429 |
| ప్రపంచము | 26373 | 27479 | 26988 |

*From Indian Tariff Board on the Sugar Industry page 5.*

## Stocks in Selected Countries

## కొన్ని ముఖ్య దేశములలో గల పంచదార నిలవ.

(1000 మెట్రికు టన్నులు సుమారు విలువ)

| | 1922-23 | 1923-24 | 1924-25 | 1925-26 | 1926-27 | 1927-22 | 1928-29 | 1929-30 |
|---|---|---|---|---|---|---|---|---|
| జర్మని | 158 | 69 | 82 | 184 | 250 | 229 | 282 | 326 |
| జెకోస్లావికాయా | 9 | 7 | 36 | 44 | 9 | 47 | 34 | 45♦ |
| ఆస్ట్రియా | ... | 1 | 5 | 2 | 1 | 3 | 7 | 13 |
| హంగేరీ | 10 | 2 | 17 | 8 | 7 | 9 | 13 | 14 |
| ఫ్రాన్సు | 74 | 55 | 74 | 90 | 141 | 107 | 201 | 210 |
| బెల్జియము | 26 | 15 | 35 | 25 | 27 | 46 | 69 | 61 |
| నీదర్ లాండ్సు | 16 | 11 | 16 | 72 | 27 | 40 | 100 | 76 |
| బ్రిటిషు దీవులు | 261 | 145 | 305 | 378 | 263 | 157 | 183 | 165♦ |
| పోలాండు | 6 | 17 | ... | 20 | 4 | 14 | 31 | 104♦ |

| | 1922-23 | 1923-24 | 1924-25 | 1925-26 | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 |
|---|---|---|---|---|---|---|---|---|
| ఇటలీ | 100 | 130 | 178 | 10 | 2 | 2 | 17 | 70 |
| స్పెయిను | 46 | 19 | 107 | 156 | 159 | 130 | 104 | 78 |
| స్వీడను | 5 | 15 | 27 | 80 | 63 | 81 | 119 | 111 |
| మొత్తము యూరోపు | 711 | 486 | 882 | 1069 | 958 | 865 | 1110 | 1278 |
| కనడ | 55♦ | 40♦ | 50♦ | 85 | 93 | 79 | 72 | 88 |
| సంయుక్తరాష్ట్రములు అన్ని రేవులు | 200 | 219 | 228 | 347 | 296 | 503 | 907 | 470 |
| క్యూబా | 628 | 787 | 1268 | 1656 | 1450 | 1419 | 1395 | 2776 |
| జావా | ... | ... | ... | 22 | 24 | 7 | 10 | 148 |
| అర్జంటైనా | 118 | 121 | 87 | 217 | 350 | 368 | 358 | 310♦ |
| మొత్తము | 1712 | 1653 | 2615 | 3396 | 3166 | 3241 | 3852 | 5065 |

*From Indian Tariff Board on the Sugar Industry p. 6.*

## Area under Sugar cane in the various Provinces

## వివిధ రాష్ట్రముల యందలి చెఱకుతోటల విస్తీర్ణము. (ఎకరములలో)

| | 1908-09 | 1909-10 | 1910-11 | 1911-12 | 1912-13 | 1913-14 | 1914-15 | 1915-16 | 1916-17 | 1917-18 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సంయుక్తరాష్ట్రములు | 1120100 | 1037600 | 1047100 | 1340600 | 1425400 | 1379900 | 1192000 | 1261000 | 1202000 | 148000 |
| పంజాబు | 365700 | 403800 | 387900 | 284800 | 367000 | 410900 | 366000 | 347000 | 414000 | 503000 |
| బీహారు, ఒరిస్సా | ... | ... | ... | 263000 | 266100 | 262800 | 266000 | 262000 | 278000 | 263000 |
| బెంగాలు | 553000 | 507800 | 515600 | 223300 | 221800 | 218300 | 233000 | 231000 | 204000 | 207000 |
| బొంబాయి | 92800 | 89200 | 83400 | 94700 | 79400 | 91400 | 903000 | 106000 | 115000 | 130000 |
| మదరాసు | 90200 | 87600 | 94900 | 107700 | 98800 | 83600 | 74000 | 95000 | 114000 | 127000 |
| అస్సాము | ... | ... | ... | 36600 | 35900 | 37900 | 38000 | 37000 | 35000 | 37000 |
| పశ్చిమోత్తర పరగణాలు | 27500 | 30000 | 32700 | 31500 | 30000 | 31700 | 32000 | 31000 | 30000 | 31000 |
| మధ్యపరగణాలు, బీహారు | ... | ... | ... | ... | ... | 20400 | 19000 | 21000 | 23000 | 25000 |
| బర్మా | 12167 | 12244 | 13275 | 13902 | 14214 | 15040 | 15362 | 15791 | 18356 | 20417 |
| మైసూరు | 33256 | 34972 | 40510 | 44404 | 41555 | 41018 | 34217 | 32287 | 36141 | 44328 |
| ఇతరస్వదేశసంస్థానములు | 63748 | 68953 | 73803 | 71367 | 79542 | 77222 | 64078 | 63123 | 69777 | 89922 |
| మొత్తము | 2358471 | 2272169 | 2289188 | 2511873 | 2659711 | 2670180 | 2428657 | 2502201 | 2539274 | 2966667 |

| | 1918-19 | 1919-20 | 1920-21 | 1921-22 | 1922-23 | 1923-24 | 1924-25 | 1925-26 | 1926-27 | 1927-28 | 1928-29 |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| సంయుక్తరాష్ట్రములు | 1544000 | 1414000 | 1285678 | 1152255 | 1349000 | 1543902 | 1291097 | 1419000 | 1613000 | 1585000 | 1357000 |
| పంజాబు | 474000 | 482000 | 457000 | 380000 | 506000 | 491000 | 396000 | 398000 | 455000 | 505000 | 411000 |
| బీహారు, ఒరిస్సా | 274800 | 275000 | 286000 | 306000 | 306000 | 307000 | 303000 | 294000 | 289000 | 289000 | 287000 |
| బెంగాలు | 219000 | 218000 | 219000 | 221000 | 201000 | 202000 | 206000 | 215000 | 201000 | 209000 | 176000 |
| బొంబాయి | 126000 | 83000 | 92000 | 83000 | 99000 | 104000 | 84000 | 84000 | 88000 | 103000 | 85000 |
| మదరాసు | 123000 | 93000 | 103000 | 121318 | 131095 | 121298 | 110360 | 113000 | 114000 | 106000 | 89000 |
| అస్సాము | 33000 | 32000 | 25000 | 41000 | 42000 | 42000 | 42000 | 41000 | 40000 | 41000 | 36000 |
| వశ్చిమోత్తరపరగణాలు | 37000 | 34000 | 36000 | 34000 | 39000 | 48000 | 41000 | 48000 | 53000 | 48000 | 48000 |
| మధ్యపరగణాలు. బీహారు | 30000 | 19000 | 20000 | 17000 | 19000 | 22000 | 22000 | 23000 | 23000 | 23000 | 23000 |
| బర్మా | 20378 | 21794 | 25550 | 35032 | 31542 | 28483 | 23462 | 23276 | ... | ... | ... |
| మైసూరు | 40143 | 36000 | 31000 | 32000 | 38000 | 34000 | 32000 | 32000 | 35000 | 34000 | 31000 |
| ఇతరస్వదేశసంస్థానములు | 13827 | 175749 | 167641 | 161055 | 165702 | 176382 | 157678 | 139000 | 164000 | 165000 | 164000 |
| మొత్తము | 2935148 | 2883543 | 2747869 | 2583655 | 2927339 | 3115065 | 2708597 | 2829276 | 3075000 | 3103000 | 2727000 |

*From Indian Tariff Board on the Sugar Industry page. 12.*

## Imports of Sugar (Excluding Malasses and Confectionery)

## పంచదార దిగుమతి

(100 టన్నులు.)

| | యుద్ధపు పూర్వపు సగటు | యుద్ధపు సగటు | యుద్ధానంతరమందు సగటు | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రిటిషు దీవులు | 7 | 4 | 7 | ... | ... | 48 | 598 | 84 | 228 |
| స్ట్రెయిటు సెటల్ మెంటులు | 17 | 285 | 75 | 11 | 13 | 9 | 6 | 5 | 3 |
| హాంకాంగు | 44 | 57 | 65 | 30 | 31 | 21 | 59 | 42 | 41 |
| ఈజిప్టు | ... | 16 | 19 | ... | ... | ... | ... | ... | ... |
| హంగారి | ... | ... | 118 | ... | ... | 21 | 365 | 138 | 5 |
| మారిటియస్ | 1288 | 567 | 259 | 1 | ... | ... | ... | 8097 | ... |
| జావా | 4530 | 3672 | 3828 | 6117 | 6922 | 8508 | 7811 | ... | 3665 |
| జపాను | 2 | 57 | 4 | ... | 1 | 3 | 5 | ... | ... |
| నీదరులాండ్సు | ... | ... | 14 | 37 | 7 | ... | ... | ... | 4 |
| బెల్జియము | 1 | ... | 4 | 138 | 4 | 3 | 18 | 3 | 1 |
| రష్యా | ... | ... | ... | ... | ... | ... | ... | 425 | 684 |
| ఇతర దేశములు | 453 | 69 | 127 | 1935 | 280 | 75 | 539 | 218 | 525 |
| మొత్తం | 6335 | 4723 | 4435 | 8249 | 7258 | 8688 | 9896 | 9012 | 5160 |

*From Indian Finance Year Book page 253.*

## 35. చర్మపరిశ్రమ.

సులభసాధ్యమగు చర్మపరిశ్రమ మైన నభివృద్ధి కాలేదు. "మేక, గున్నపోతు, ఎద్దు మొదలగు వివిధజంతువుల చర్మము లీదేశమున నునుపు జేయుచున్నారు. అరేబియా మొదలగు దేశములకు ప్రతిసంవత్సరమును ఓడలకొలది చర్మముల నెగుమతి చేయుటకై వివిధరకముల చర్మములు నునుపు జేయబడుచున్నవి." అని 13 వ శతాబ్దమునందు దేశసంచార మొనరించిన మార్కోపోలో గారు చర్మపరిశ్రమనుగురించి వ్రాసిరి.[1]

17 వ శతాబ్దమునందు కోరమాండలు సముద్రతీరమునందుండి జపానుదేశమునకు వివిధరకముల చర్మము లెగుమతి చేయబడెను. ఈస్టిండియాకంపెనీవారి చరిత్ర ననుసరించి యొకశతాబ్దము క్రింద చర్మపరిశ్రమ కలకత్తాయందు విస్తారముగ నుండినట్లును, ఫ్రాన్సు, ఇంగ్లండు, ఉత్తరఅమెరికా దేశముల కెగుమతి చేయబడినటులును దెలియుచున్నది. 1850 వ సంవత్సరమున కలకత్తా రేవునుండి యెగుమతియయిన సరకులో చర్మముల యెగుమతి 8 వ స్థాన మాక్రమించెను.[2]

నేడు గమనింపదగిన యెగుమతియే లేదు.

గత శతాబ్దమునందు చర్మపరిశ్రము పునరుద్ధరింపబడుటకు ప్రయత్నములు జరిగెను గాని విఫలము లైనవి. కాన్పూరునందు గవర్నమెంటువారు తోళ్ళఫ్యాక్టరీని పెట్టిరి. పిమ్మట ఆగ్రా, కాన్పూరు, బొంబాయి యందున, తోళ్ళఫ్యాక్టరీలు పెట్టబడినవి. గవర్నమెంటుఫ్యాక్టరీ సరియగుప్రదేశమునందు పెట్టబడినను సక్రమముగ

1 *By. Marcopolo's Book on his Travels, 13th Century A. D. quoted by Finance Year Book 1933. p. 278.*

2, *Finance Year Book p. 279.*

నిర్వహింపబడలేదు. యుద్ధకాలమున చర్మపరిశ్రమయొక్క ప్రాముఖ్య స్థితి గమనింపబడెను. యుద్ధకాలమున విపరీతమగు లాభములను సంపాదింప గలిగిరి. ఈ తరుణమున ఆంగ్లేయులు కొన్ని ఫ్యాక్టరీలను కలకత్తాయందు స్థాపించిరి. కాని తుట్టతుదకు నష్టమువచ్చి ఎత్తి వేయబడెను. అమెరికా, అయిరోపా ఖండములయందు చర్మముల వాడుక హెచ్చుగ నున్నది. మనదేశమునుండి ముడితోళ్లు చర్మములును ఎగుమతి చేయబడుచున్నవి. 1919 వ సంవత్సరము సెప్టెంబరు 11 వ తేదీనుంచియు ఎగుమతి చర్మములపై 100కి రు 15 ల కిమ్మతు సుంకమును ప్రభుత్వమువారు విధించిరి. కాని బ్రిటీషుసామ్రాజ్యము నందలి దేశముల కెగుమతిచేయుచో మాత్రము 10% కిమ్మతు సుంకమును తగ్గించుటకు నిశ్చయించిరి. పరిశ్రమ నభివృద్ధిచేయుటకు మాత్ర మెట్టికృషియు చేయకపోవుటయే కాక ఎగుమతి సుంకమును గూడ విధించుట తోళ్లవర్తకుల యలజడికి కారణమయ్యెను. 1923 వ సంవత్సరమున ఎగుమతిసుంకమును 100కి రు 5 లకు తగ్గించిరి. అయినను వర్తకులు సంతృప్తిని బొందలేదు. 1927 వ సంవత్సరమున ఆదాయ వ్యయశాసనమునందు మరల ఎగుమతి సుంకమును తీసివేయుటకు ప్రభుత్వమువారు సంకల్పించిరి. భారతశాసనసభవా రీసంకల్పమును వికల్పమొనరించిరి. ఎగుమతిసుంకమును తగ్గించుట కంగీకరించలేదు. అందువలన ఎగుమతిసుంకమును అంతర్వ్యాపార శుల్కముగ ప్రభుత్వమువారు మార్చిరి. ప్రత్తిసంఘమువంటి సంఘమును (Indian Central Cotton Committee) నియమించి పరిశ్రమాభివృద్ధికై శుల్కము వలన వచ్చు ఆదాయము నొసంగ దలంచిరి. తోళ్ళశుల్కముల సంఘమును నియమించిరి. ఈ సంఘమువారు తమ నివేదికను సమర్పించి రెండు సంవత్సరములు గడచినది. ప్రభుత్వమువా రీనివేదిక ననుసరించి యేవిధమగు కృషిని చేయలేదు. (1933 సంవత్సరాంతమువఱకు)

చర్మవ్యాపారము గూడ నితరపరిశ్రమలవలెనే ఆర్థికదుస్థితియందు గిజగిజలాడుచున్నది. ధరలు యుద్ధమునకు పూర్వస్థితికి దిగజారినవి. పదునుజేసిన తోళ్ళవ్యాపారము మదరాసురాజధానియందును, ఉత్తర హిందూస్థానమందును గూడ పడిపోయినది. ఎగుమతులు తగ్గిపోయినవి. 1931 వ సంవత్సరమున రు 11 న్నర కోట్ల రూపాయల సరకుమాత్రమే ముడితోళ్లు, పదునుజేసినతోళ్ళు కలిసి యెగుమతి అయ్యెను.

చర్మపరిశ్రమకు సంబంధించిన మూడురకముల మిల్లులును గలిసి 1927 లో 32 మాత్రమే గలవు. 1926 లో 36 ఉండెడివి. తోళ్ళు చర్మములు ముడివి బాగుచేసినవి గలిసి 1927-28 లో రు 178151000ల కిమ్మతునకు విదేశముల కెగుమతి చేయబడెను. యంత్రశాలలకు వలయు బెల్టులు, చెప్పులు, మొదలగు చర్మపుసరకు విశేషముగ వాడబడుచుండినను చర్మపరిశ్రమ అభివృద్ధి చేసికొనుటకు మారుగ విదేశములనుండి దిగుమతి చేసికొనుచున్నాము. సాలుసరి హిందూదేశమున 300 లక్షల ఆవుచర్మములు తయారగుననియు, మేకచర్మములకు ప్రపంచమున హిందూదేశమే అగ్రస్థానము వహించుననియు ఆర్నాల్డు గారు మదింపువేసిరి.[1]

పాముచర్మములు తాబేటిచర్మములు గూడ విరివిగ లభింపగలవు. మొత్తము తోళ్లు చర్మములు సాలుసరి రు 20 కోట్ల విలువగలవి హిందూదేశమునం దుత్పత్తి యగుచుని అంచనా వేయబడుచుండెను. అయిననేమి? పరిశ్రమాభివృద్ధికి ప్రయత్నములు జరుగుట లేదు. మదరాసు, కాన్పూరు, కలకత్తాలయందు గల ప్రభుత్వమువారి తోళ్ళఫ్యాక్టరీ లీపరిశ్రమాభివృద్ధికై ప్రయత్నింపవలెను. ఈపరిశ్రమాభివృద్ధివలన జాతీయాదాయము హెచ్చగలదు.

1. *Arnold's Calculation See Finance Year Book. p. 280*

## 36. లక్క-సంబంధ పరిశ్రమ.

SHELLAC.

గ్రామఫోనులు, వార్నీషులు, లిథోగ్రాఫిక్ సిరా, విద్యుచ్ఛక్తి యంత్రములకు షిలాకు కావలసి యున్నది. హిందూదేశమునందు తయారుజేయుట కపారమగు పరికరములు గలవు. హిందూదేశమే యీపరిశ్రమను గుత్తగొనుటకు కూడ వీలున్నది. అయిననేమి? అభివృద్ధి కాలేదు.

## 37. కీలక పరిశ్రమలు.

KEY INDUSTRIES.

వివిధపరిశ్రమల ప్రస్తుతావస్థలనుగుఱించి పైన వివరించితిమి. ఏపరిశ్రమయు నభివృద్ధియందు లేదు. ఏల? పరిశ్రమల కన్నింటికి మూలపరిశ్రమ యొకటి కలదు. ఆపరిశ్రమ ప్రారంభింపబడిన గాని యేయంత్రపరిశ్రమయు సజీవము కాజాలదు. విదేశములనుండి యంత్రములు యంత్రసామగ్రులు తెప్పించుకొను చుండినగాని మన మిచట మిల్లులను కట్టుటకే వీలు లేకున్నది. ఆమిల్లులు పనిచేయుచుండవలె నన్న మధ్యమధ్య అవసరమగు చిల్లరపనిముట్లుకూడ విదేశములనుండియే తెప్పించుకొనవలసి వచ్చుచున్నది. ఈపరాధీనస్థితియొక్క బాధలు యుద్ధకాలమున బాగుగ ననుభవమునకు వచ్చినవి. యంత్రములనే భారతదేశమున చేయగల విద్య, పరిశ్రమ, యభివృద్ధి పొందినగాని యీపరాధీనత తొలగజాలదు. కనీసము యంత్రములకు వలయు చిల్లరపనిము ట్లయిన భారతదేశమునందే తయారుచేసికొన జాలనంత కాలము యంత్రపరిశ్రమాభివృద్ధి గగనకుసుమము. "బెంగాలు ఇంజనీరింగు ఫరములలో చిల్లరసామగ్రులు చేయుట ప్రారంభించిరి."[1]

1. *Munitions Hand Book. p. 14 and 21.*

ఎంతవఱకు ఫలప్రదమగునో! ఈకీలకపరిశ్రమాభివృద్ధికి వలయు సాంకేతికవిద్యాప్రబోధము ప్రభుత్వబాధ్యత. ఆబాధ్యతను రవంతయైన ప్రభుత్వము నిర్వహించలేదు. ఉదాసీనత వహించి నిర్లక్ష్యము చేయబడెను.

## 38. నిప్పుపెట్టెల పరిశ్రమ.

అగ్గిపుల్లల నిత్యావసరమును గుఱించి వేఱుగ వ్రాయ బనిలేదు. అయిననేమి? ఈపరిశ్రమాభివృద్ధికి వలయు పరిశ్రమ సక్రమముగ నేటి వఱకు గావింపబడ లేదు. 1926 సంవత్సరము అగ్గిపుల్లల మరలు 40 గలవు. ఈయంత్రములు గూడ సుమా రన్నియు స్వీడను జపాను దేశములవారి వలన నడుపబడు చున్నవి. సం|| 1924 లో అగ్గిపెట్టెల దిగుమతిపై కొంతసుంకము విధింపబడెను. ఈసుంకము దిగుమతుల నిషేధించి స్వదేశపరిశ్రమాభి వృద్ధిపరచుటకై విధించలేదు. 1927లో రూ 39,37,000 ల అగ్గిపుల్లలు దిగుమతి యయ్యెను

టారిఫ్ బోర్డువారు 1927-28 లో ఈ పరిశ్రమాభివృద్ధికి సహజ సౌకర్యములు గలవనిరి. అందుచేత డేరాడూనులో పరిశోధన చేయ వలెననిరి. దిగుమతి సుంకములను తీసివేయరాదనిరి. తీసివేయక పోయిన యెడల రక్షణ లభించు ననిరి

## 39. గాజు పరిశ్రమ.

యుద్ధకాలమున బొంబాయి యందు గాజు సామగ్రులను తయారుచేయు 5 మిల్లులు స్థాపింప బడినవి. 1926 సం||లో 10 యును, 1927 లో 13 మరు గలవు. ప్రతిసాలున సుమారు 1927సం. లో రు 24,841,000 ల విలువగల గాజుసామగ్రి మనదేశమునకు దిగుమతి యగుచున్నది. ఈపరిశ్రమాభి వృద్ధికి వలయు ముడిపదార్థములుగలవు.

# 40. కాగితపు పరిశ్రమ.

"కాగితపు పరిశ్రమ భారతదేశమునందు పూర్వ మొకపు డుండెడిది. చేతితో నితరగృహ పరిశ్రమలవలెనే తయారుచేయబడుచుం డెడిది. ఐరోపాఖండమునందుగూడ చింపిరిగుడ్డలతో నొకప్పుడు కాగి తములను తయారుచేయుచుండెడివారు"[1]

భారతదేశమున 19 దవ శతాబ్దమునందు 4 పేపరుమిల్లులు స్థాపింపబడినవి. యుద్ధానంతరము మఱియొకటి స్థాపింపబడెను. 1926-27 లో మఱిరెండు స్థాపింపబడెను. కాగితపుమిల్లులలో ఆంగ్లేయుల పెట్టు బడియే హెచ్చుగ నున్నది. కాగితమును తయారుజేయుటకు వలయు వెదురుగుంజు సమృద్ధిగ భారతదేశమునందు లభించును. సాలుసరి హిందూదేశమున 99000 టన్నుల కాగితము వినియోగింపబడు చున్నది. ఈ మొత్తమున స్వదేశీకాగితము బహుస్వల్పము. నాదారి రకముకాగితము మిక్కిలి చౌక. తెల్లని దళసరికాగితమునకు విని యోగము తక్కువ. వినియోగింపబడు మధ్యరకపు కాగితమును హిందూదేశము సునాయాసముగ 200,000 టన్ను లుత్పత్తి చేయ గలదు. అయిన నేమి? ఇంగ్లండు, జర్మనీ దేశములనుండి విస్తారముగ దిగుమతియగుచున్నది. స్వీడను నార్వేల నుండికూడ కొలదిగ దిగు మతి యగుచున్నది. ఇంగ్లండు జర్మనీల దిగుమతుల పోటీ హెచ్చుగ నున్నది. ఈ పరిశ్రమకు సంరక్షణ మవసరము.

1. విదేశములనుండి చౌకగ కాగితము దిగుమతియగుచున్నది.

2. విదేశములనుండి దిగుమతి యగుచుండిన కాగితములో సుమారు 200,000 టన్నులు హిందూదేశమునందే యుత్పత్తి చేయగలము.

3. ప్రపంచమునందలి కాగితపరిశ్రమకు హిందూదేశమునందలి

---

1. *Indian Finance Year Book 1933, p. 249.*

వెదురుగుంజుపై ఆధారపరిస్థితులు రావచ్చును. అందువలన వెదురు గుంజుపరిశ్రమను సజీవముగ నుంచవలయును.

ఈకారణములచే కాగితపుపరిశ్రమకు సంరక్షణ మొసంగవలయును. నిరకునామాసంఘమువారీపరిశ్రమను గుఱించి విచారించిరి. సంరక్షణ మొసంగవలె ననిరి. టన్ను 1 కి రు 140 లు లేక పౌను 1 కి (తూకము) 0-1-0 వంతున దిగుమతిసుంకమును సంరక్షణముకొఱకై విధింపవలె ననిరి. 1932 వ సంవత్సరమున కాగితపుపరిశ్రమ సంరక్షణ శాసనము గావింపబడెను.[1]

ఈశాసనము ననుసరించి 70% దిగుమతియగు కఱ్ఱగుంజుపై సుంకమును విధించలేదు. ఉచితముగ దిగుమతి యగును.

1932-33 వ సంవత్సరమున రు 286 లక్షల విలువగల కాగితపు దిగుమతియు, రు 23 లక్షల విలువగల గుంజు మొదలగు కాగితమును తయారుచేయు సరకును దిగుమతి యయ్యెను.

రాజమండ్రి పేపరుమిల్లు పనిచేయుచున్నను మిక్కిలి గోచరించుటలేదు. స్వదేశీపెట్టుబడితో ప్రారంభింపబడిన యీమిల్లును పని జేయించుట ఆంధ్రుల కర్తవ్యము.

## 41. గచ్చుసున్నము.

తుఫానులో నట్టనడిసముద్రమున చిక్కుకొనియున్న పొగయోడవలె నున్న పరిశ్రమలలో గచ్చుసున్నపుపరిశ్రమ యొకటి. ఈపరిశ్రమాభివృద్ధికి వలయు సహాయసౌకర్యము లన్నియు గలవు. అయినను అభివృద్ధియందు లేదు. నిరకునామాసంఘమువారి సంరక్షణము నీపరిశ్రమయు గొంత చవిచూచినది. విదేశపు దిగుమతులతో పోటీ చేయజాలక పోవుచున్నది. ఎగుమతులకగు నదనపుఖర్చువలన విదేశపు గచ్చునకంటె చౌకగ నమ్ముటకు వీలులేకపోవుచున్నది. విదేశపుగచ్చు

1. *Bamboo Paper Protection Act of 1932.*

మన రేవు పట్టణములకు దిగుమతియగు ఖర్చుకంటె స్వదేశీగచ్చు రేవుపట్టణముల కెగుమతియగుటకు ఖర్చు హెచ్చగుచున్నది. ఈకారణమువలన రేవుపట్టణము లన్నియు విదేశపుగచ్చుతో నింపివేయబడుచున్నవి. స్వదేశమునందైనను రైలురేట్లవలన విదేశీగచ్చుతో పోటీ చేయజాలక పోవుట సంభవించుచున్నది. సీమవారిగచ్చుతో సమాన ప్రాశస్త్యముగనే మనగచ్చుకూడ గలదని నిరకునామా సంఘము వారియెదుట సర్. హ్యూజికేలింగుగారు సాక్ష్య మొసంగిరి. ప్రభుత్వమునకు వలయు గచ్చునుగూడ సీమనుండియే తెప్పించుచున్నారు. స్వదేశపుగచ్చును కొని ప్రోత్సహించుట లేదు. ఇందులకు మెట్టూరు ప్రాజెక్టునకు కావలసినగచ్చును సీమనుండి తెప్పించుటయే తార్కాణము. ప్రజాప్రతినిధులు శాసనసభయం దీప్రభుత్వపక్షపాతమును తీవ్రముగ విమర్శించిరి. ప్రభుత్వము సర్వవిధముల సహాయ మొనరించుచో విదేశపుగచ్చు దిగుమతిచేసికొన నవసర ముండదు.

ఈపరిశ్రమయందు గచ్చుకంపెనీలవా రందఱు కలిసి రు 5 కోట్లు పెట్టుబడిని పెట్టిరి. ఈపరిశ్రమ సాలు 1 కి 250000 టన్నుల రాతిసిబొగ్గును వినియోగించును. తేయాకుతోటలకంటె నీపరిశ్రమయే హెచ్చుబొగ్గును వినియోగించు చున్నది. ఈపరిశ్రమవలన వారిపరిశ్రమకుగూడ లాభము కలదు. ఈపరిశ్రమ సాలుసరి 120 లక్షల గోనెసంచులను కొనును. రైళ్లకు సాలుసరి 50 లక్షల రూపాయిలు ఎగుమతులకై యొసంగును. (ఒక్క సంయుక్తసంఘము వారుచెల్లించు మొత్తముమాత్రమే (Marketing Board) 1930 వ సంవత్సరమున 564000 టన్నుల గచ్చుసున్న ముత్పత్తి చేయబడెను. 1931 యం దుత్పత్తి కొంత తగ్గినది. 1930 వ సంవత్సరమునందు 19440 టన్నులు విదేశములనుండి దిగుమతి చేయబడెను. 1931 లో 10407 టన్నులు మాత్రమే దిగుమతి కలదు. 50% దిగుమతి తగ్గినది. ఇది శుభసూచకము.

## Imports of Cement in India

## గచ్చు సున్నపు దిగుమతి.

(100 టన్నులు)

| | యుద్ధమునకు పూర్వపు సగటు | యుద్ధకాలపు సగటు | యుద్ధానంతరపు సగటు | 1926-27 | 1927-28 | 1928-29 | 1929-30 | 1930-31 | 1931-32 |
|---|---|---|---|---|---|---|---|---|---|
| బ్రిటిషు దీవులు | 1080 | 697 | 942 | 715 | 906 | 910 | 816 | 632 | 452 |
| జపాను | ... | 148 | 66 | 93 | 94 | 144 | 157 | 368 | 289 |
| హాంకాంగు | 22 | 73 | 36 | 25 | 2 | ... | ... | ... | ... |
| ఇటలీ | 13 | 7 | 9 | 45 | 20 | 44 | 83 | 12 | ... |
| ఇతరదేశములు | 188 | 29 | 156 | 132 | 101 | 175 | 177 | 108 | 137 |
| మొత్తము | 1303 | 954 | 1189 | 1010 | 1123 | 1273 | 1213 | 1120 | 878 |

*From Indian Finance Year Book p 259.*

## 42. మోటారులు-తొక్కుడుబండ్లు.

భారతదేశమున మోటారులు, తొక్కుడుబళ్ళు గూడ నిర్మించుటకు వలయుపరికరములు విశేషముగ గలవు. ఉక్కుపరిశ్రమతో బాటుగ నీపరిశ్రమలును వీటి అనుబంధపరిశ్రమలును గూడ ప్రారంభించుట యుచితము. ఈ పరిశ్రమతోపాటు రబ్బరుపరిశ్రమయు రసాయన పరిశ్రయు గూడ నభివృద్ధి జెందవలసియున్నవి. విశేషముగ రబ్బరును ఇండియానుండి పంపించి, తయారైన రబ్బరుసరకును దెప్పించుకొనుచున్నాము. ముడిదినుసులను పంపి తయారైనసరకును దెప్పించుకొను పరాధీనస్థితి పరిశ్రమలయందు సర్వతోముఖముగ దొలగించుకొనుటయే భారతదేశకర్తవ్యము.

## 43. మదరాసు రాజధాని - చేతిపనులు.

మదరాసు ప్రభుత్వము వారిచే నియోగింపబడిన డి. నారాయణరావుగారు, మదరాసు రాజధానియందలి జిల్లాలన్నియు పర్యటన మొనరించి ఆయాజిల్లాల యందుగల చేతిపనుల ప్రస్తుతస్థితిని విపులముగ మదరాసుప్రభుత్వమునకు నివేదించిరి.

గంజాము:—గంజాము జిల్లాయందు దూది, పట్టువస్త్రముల నేతయు, త్రాలు వడుకుటయు, రంగు వేయుటయు, లోహపు పనులను కొయ్యసామగ్రులను జేయుటయును, నారపనియును, దువ్వెనలు, పెట్టెలు చేయుటయును, వెదురుగడలనుండి చేయు వెదురుపనులును గలవు. ఈజిల్లాయందలి చికాకోలులో నింకను సుప్రసిద్ధమగు సన్నబట్టలు నేయబడుచున్నవి. బరహాంపురమునందు పట్టుబట్టలనేత విఖ్యాతవంతముగ నున్నది.

విశాఖపట్టణము:—ఈజిల్లాయందు చేతిపనులు పరిశ్రమలు స్వల్పముగ నున్నవి. నేతపరిశ్రమ గలదు. దూది, నార, నేతపరిశ్రమ గలదు. పట్టు ఉన్ని పరిశ్రమలు లేవు. అరణ్యప్రదేశములకు కావలసిన కంబళీ లన్నియు, ఇతర ప్రదేశముల నుండి దిగుమతి యగుచున్నవి. రంగులు వేయుట, అద్దకము, ఇత్తడి, అల్యూమినియమ్ పనులు, దంతపు పనులు గలవు. గాజులు తయారగును. తాటినార తీయబడి యీజిల్లానుండి ఎగుమతి యగుచున్నది.

తూర్పుగోదావరి:—నేతయు, ముఖ్యముగ సన్నబట్టల నేతయు, ఉప్పాడపెద్దాపురముల యందునను, గొల్లపాలెమునందు రంగులు వేయుటయు, అద్దకములు వేయుటయును, రాజమహేంద్రవరమున లోహ పరిశ్రమయు, బెండమూర్లంక, కుమారగిరి పట్నము, అంబాజీపేటల యందు కొబ్బరినార కొబ్బరిత్రాళ్ళ పరిశ్రమయు, కాకినాడయందు పడవలను జేయుటయు గమనింపదగినవి. పెద్దాపురమున పట్టునేత వృద్ధియగుచున్నది.

కృష్ణా,పశ్చిమ గోదావరి జిల్లాలు:—కృష్ణా పశ్చిమ గోదావరిజిల్లాలయందు నేత పరిశ్రమ ప్రాముఖ్యముగ నున్నది. ఇందు చాలమంది పనిచేయు చున్నారు. దూది, పట్టు, నారలు పరిశ్రమలతో వస్త్రములు, తివాచీలు, కంబళీలు తయారు చేయుచున్నారు. రంగులు వేయుట, అద్దకము, లోహపరిశ్రమ, గాజువస్తువులను జేయుట, లేసుపరిశ్రమ తాటిబెల్లమును తయారు జేయుట గమనీయములు. ఏలూరునందుగల తివాచీనేత ఈ జిల్లాలయందుగల ప్రాముఖ్యమగు పరిశ్రమ.

గుంటూరు:—ఈ జిల్లాయందు చేమగ్గముల పరిశ్రమ ప్రాముఖ్యమైనది. 1921 వ సంవత్సరపు జనాబా లెక్కల ననుస

సించి యీ జిల్లాలో 14974 చేమగ్గములు గలవు. 1923 వ సంవత్సరపు యట్లాసు ననుసరించి (Statistical Atlas) 19035 చేమగ్గములు గలవు. మదరాసు రాజధానియం దిన్నిచేమగ్గ ములుగలజిల్లా మఱియొకటి లేదు. మెట్టతాలూకా లన్నిటియందు నను ప్రత్తిపంట విస్తారముగ గలదు. అందుచే రాట్నముపై నూలు వడుకుటయు, చేమగ్గముపై నేతనేయుటయు, నీజిల్లాయందు విస్తార ముగగలదు. ఖాదీయుద్యమమువలన నీజిల్లాయందు పండుప్రత్తిలో చాలభాగము ఖద్దరుగుడ్డగ తయారుచేయుటకై వినియోగింపబడు చున్నది. అద్దకము, రంగులువేయుట, కంబళీలనేతయు గూడ కలవు. నర్సారావుపేటయందు సత్యాగ్యటుసామానులను జేయుటయు,ఇనవోలు నందు చాపలనేతయు, కొప్పుకొండయందు రాళ్ళుచెక్కుటయు, దుర్గి యందు యిత్తడిపనులను రాగిపనులను జేయుటయు, రెండుచింతల యందు చలవరాతి పరిశ్రమయును గలవు. ఈజిల్లాయందు ప్రశస్త మగు పొగాకు పండును. కాని యీపొగాకంతయు నెగుమతియగు చున్నది. బీడీలుతయారుచేయుటకు వలయు పొగాకు ఇతరప్రదేశముల నుండి దిగుమతి యగుచున్నది.

నెల్లూరు:—ఈ జిల్లాయందు వడ్రంగిపని, కంసాలిపని, కుమ్మరిపనులు, గృహపరిశ్రమలలో ప్రాముఖ్యముగ నున్నవి. సాలీలు ప్రత్యేకముగ చేమగ్గముల నేతపని జేయుచు చున్నారు. మదరాసుకు సమీపమునం దుండుటచే మదరాసులో విడుదలయగు రకములపనిముట్లను జేయుచు మదరాసున కెగుమతి జేయుచున్నారు. కొవ్వూరు, నెల్లూరు, గూడూరుతాలూకాలయందు గాక, యితరతాలూకాలయందు కమ్మ కాపు కుటుంబములలో నూలు వడుకుచున్నారు. స్వగృహములందు వడికిననూలుతో తయారయిన

నేత, పూలు వడుకుటయు, లోహపుపనియు, కొయ్యపనియు మాత్రము గలవు. తిరుపతి, తిరుచెన్నూరు మొదలగు పుణ్యక్షేత్రములలో రంగు లబొమ్మలు, జపమాలలు, వేడుకపెట్టెలు మొదలగునవి కలవు. మదనపల్లి తాలూకా పశ్చిమభాగమునందు కొన్ని కొబ్బరిచెట్లుం డుటచే కొలదిగ నారపరిశ్రమ గూడ గలదు.

ఇట్లే తమిళదేశమునందుగల వివిధజిల్లాలలో పలువిధములగు గృహపరిశ్రమలు గలవని డి. నారాయణరావుగారు తమ నివేదికల యందు వ్రాసిరి.[1]

ఈ ప్రభుత్వ ప్రత్యేకోద్యోగి గృహపరిశ్రమలను విపులముగ చర్చించుచు ప్రభుత్వమువారీపరిశ్రమల కొసంగవలసిన సహాయమును వివరించెను. కాని నేటివఱకు నారాయణరావుగారి సూచనల ననుస రించి ప్రభుత్వమువా రెట్టి చర్యను గైకొనలేదు.

# 44. ఆంధ్రదేశము: పెద్దపరిశ్రమలు.

ఆంధ్రదేశమునందు పెద్దపరిశ్రమ లభివృద్ధియందు లేవు. ఆంధ్ర దేశపరిశ్రమలచరిత్ర ఆంధ్రుల తలవంపులచరిత్రయే. పెద్దపరిశ్రమలకు వసతులు గలవు. ప్రజలలో పెట్టుబడినొసంగు చిత్తవృత్తియు గలదు. ప్రజలదక్షతతో గూడిన పెద్దపరిశ్రమలు గూడ ప్రారంభింప బడినవి. అయిననేమి? నేడొక్కపరిశ్రమయు ఆదర్శప్రాయముగ పనిచేయుట లేదు. విశాఖపట్నం జిల్లాయందు నారమిల్లులు స్థాపింపబడినవి. అనతి కాలమునం దాంధ్రుల యాజమాన్యమునుండి తొలగిపోయినవి. బెజ వాడయందు బట్టలమిల్లు నెలకొల్పబడెను. కొలదికాలములోనే ఆంధ్రు

1. *From the Preliminary Reports on the Survey of Cottege Industries by D. Narayanarao B A, Special Officer for the Cottage Industries appointed by the Government of Madras.*

లయాజమాన్యమునుండి హైదరాబాదువారి పరమయ్యెను. బందరులో పంచదారఫ్యాక్టరీ పెట్టబడెను. స్వల్పకాలములోనే యెత్తివేయబడెను.

ఏలూరు జ్యూటు మిల్లు.

ఏలూరునందలి జ్యూటుమిల్లు చిరకాలముక్రింద స్థాపింపబడి చాలకాలము లాభకరముగ పనిగొనసాగించెను. ఇందులకు మొట్టమొదట నుండియు మేనేజింగుడైరెక్టరులుగ పనిచేసిన మోతే జమీందారుల కుటుంబమే కారణము. శ్రీ మోతే గంగరాజు జమీందారుగారు బహుసంవత్సరములు మేనేజింగు డైరెక్టరుగనుండి విశేషలాభము నార్జించిరి. వీరి యాజమాన్యమునం దీనారమిల్లు అత్యంతాభివృద్ధి నొందె ఆంధ్రుల పరిశ్రమాభినివేశనమున కాదర్శముగ నుండునని విశ్వసింపబడెను. కాని కాలము వేఱుగతిని సూచించెను. గంగరాజుగారు మేనేజింగుడైరెక్టరుపని మానివేసిరి. 1929 వ సంవత్సరమునుండియు నీమిల్లు మూసివేయబడినది. పనిజరుగుటలేదు. సుమారు 1000 మంది కూలీలు నిరుద్యోగులైరి. ఈదుస్థితికిగల కారణములేవి?

1. మిల్లు లాభముతో పనిచేసినపుడు మూలధనము నేర్పఱుపలేదు. ఎప్పటికప్పుడు లాభములనన్నియు పంచివేయుటయే మేనేజింగు డైరెక్టర్ల లక్ష్యముగనుండెను. మేనేజింగుడైరెక్టర్ల పెట్టుబడిపై మిల్లు శాశ్వతముగ నాధారపడునట్టి ఆర్థికనీతి యవలంభింపబడెను.

2. ఈమిల్లు మూసివేయుటకు వాటాదార్ల నిర్లక్ష్యమొక ముఖ్యకారణము. ఆంధ్రదేశమునందంతట, నీమిల్లునకు వాటాదారులుగలరు. సాలుసరి సామాన్యసభకు వాటాదారులందఱువచ్చి పరిశ్రమాభివృద్ధి క్షయముల నరయ బూనలేదు. ఇతరపట్టణములనుండి వాటాదారులు రాకపోవుటచేత ఏలూరునందుగల కొలదివాటాదారులే

మిల్లునుపరిపాలించిరి. స్థానికవ్యవహారములయందలి వ్యక్తి గతకక్షలకు మిల్లు గురియైనది. మేనేజింగుడైరెక్టర్లను మార్చుచుండుటయే వరుసగ కొన్ని సంవత్సరములు సామాన్యసభలకు పరిపాటిగ నుండెను. మేనేజింగు డైక్టరులుగ బనిజేసిన చెఱకువారి కుటుంబమందలి పరస్పర వైషమ్యములుగూడ ఆంధ్రుల నారపరిశ్రమనాశనమునకు గారణమయ్యెను.

వ్యాపారకౌశల్యముగలిగి యుండియు సంవత్సరముల కొలదిగ లాభమున పనిజేసియు వేళ్లు పాతుకొనియున్నపరిశ్రమ వాటాదారుల నిర్లక్ష్యమువల్లను మేనేజింగుడైరెక్టరుల లోపమువల్లను, మూలధనము నేర్పరచక పోవుటవల్లను రూపుమాసి పోవుచున్నది. ఈపరిశ్రమ దేశీయపరిశ్రమ యగుటవల్లను స్వదేశీపెట్టుబడితో స్వదేశీయుల యాజమాన్యమున నడుపబడినదగుటవల్లను, పునరుద్ధరించుకొనుటకు సర్వవిధముల ప్రయత్నించుటయే ఆంధ్రులకర్తవ్యము.

రాజమండ్రి పేపరుమిల్లు.

రాజమండ్రి కాగితపుమిల్లుచరిత్ర స్మరించిన కంటతడి బెట్టని యాంధ్రుడుండడు. ఈమిల్లున కాంధ్రదేశము కోరినపుడెల్ల పెట్టుబడి నొసంగుటకు వెనుకాడలేదు. అయినను సజీవము కాలేదు.

వాటాదారుల పెట్టుబడి, మిల్లు పనిజేయ ప్రారంభించుటకు పూర్వమే హారతికర్పూరము వలె హరించి పోయినది. కర్నాటక పేపరుమిల్సు లిమిటెడ్ వారు రు 1137538 ల పెట్టుబడిని వాటాల రూపముగ వసూలు చేసిరి. పిమ్మట ప్రభుత్వమువారినుండి మఱి 4 లక్షలు అప్పు గైకొనిరి. ఆంధ్ర పేపరుమిల్సు కంపెనీ లిమిటెడ్ వారు రు 659973 ల పెట్టుబడిని వాటాల మూలముగ వసూలు చేసిరి. మొత్తము సుమారు 22 లక్షల రూపాయల పెట్టుబడి హరించి

పోయినను మిల్లుపని చేయుట లేదు. ప్రభుత్వమువారు, తమ పెట్టు బడిని రాబట్టుకొనుటకై మిల్లును విదేశీయులు కమ్మివేయ సంకల్పించి రని శాసన సభయందు విమర్శింప బడెను. ప్రభుత్వ ఋణమును దీర్చి మిల్లును సంరక్షించుటకై "ఆంధ్రపేపరుమిల్సు కంపెనీ లిమిటెడ్" బయలు దేరినది. మరల పెట్టుబడిని వసూలు చేసినది. విదేశీయుల పరము గాకుండ నీపేపరు మిల్లును శ్రీ మోతే నారాయణరావు జమీందారుగారు ప్రశంసనీయముగ సంరక్షించిరి. ఆంధ్ర పేపరుమిల్సు కంపెనీ లిమిటెడ్ను స్థాపించుటకు వీరే కారకులు.

"క్రొత్తకంపెనియగు (ఆంధ్రపేపరుమిల్సు కంపెని, లిమిటెడ్) నిజముగ మిక్కిలి శుభశకునములతో బయలుదేరెను. షేరర్లును, పరి శ్రమలకు పెట్టుబడి పెట్టువారును, చాల పట్టుదలతో మనసార పనిచేసి సాయపడిరి. కాని కల్పింపబడిన ఆశలకును చివరకు కన్పడిన ఫలితము లకును సమన్వయము కుదరకుండెను. వెనుకటిసంగతి నేడు మనము స్థిర పరుప జాలినంత మట్టుకు అట్టి ఆశలు ఆకాలములో నిరాధారముగ పుట్టియుండవు. రికార్డు చదివిచూడగా అప్పటి డైరక్టర్లు కనిపెట్టి నట్టియు (దర్శిలోను జరిగిన షేరర్ల మహాసభలో ఆమోదింపబడి నట్టియు) సంగతి ఒకటి కలదు. ఏమన, మిల్సుయొక్క పునః ప్రతిష్ఠ గురించి పూచీ పడినవారు ఎక్కువ శ్రద్ధతోను, బాధ్యతతోను వ్యవ హరించి యుండినచో, మిల్సు సఫలముగ పనిచేసి యుండునుగదా" అనిరి.

ఈవిషయము 'ది ఆంధ్ర పేపరుమిల్సు కంపెనీ లిమిటెడ్' వారి అసాధారణ మహాసభను గురించిన ప్రకటననుండి గ్రహింప బడెను. 30 జూన్ 1933) ఈమిల్లు పని చేయుట విరమించుటతో ఆంధ్రుల ఆశలు అడుగంటినవి. తలవంపులుమాత్రము నిలిచి యున్నవి.

ఈమిల్లు పని చేయకపోవుటవల్ల పరిశ్రమలయం దాంధ్రులకు గల పూర్వోత్సాహము గూడ నశించుచున్నది. ఆంధ్ర మహాశయులు మరొకమారు పునరుద్ధరింప ప్రయత్నించుట సమంజసము గాదా? ఆంధ్రుల యుత్సాహము పురికొల్పగలిగిన పరిశ్రమ యేదియు నుదాహరణముగ లేక పోవుట పునరుద్ధరణకు ప్రతిబంధక మనుట నిశ్చయము.

ప్రభుత్వవిధి. మదరాసు ప్రభుత్వము పెద్దపరిశ్రమ లిట్లడుగంటిపోవు చుండ జూచుచు నూరకొనుట తగినపని కాదు. ఈ పరిశ్రమలకు పరిశ్రమలరక్షణశాసనము ననుసరించి సహాయమొసంగుట ధర్మము. లేదా, ప్రభుత్వమువారే ఈ పరిశ్రమలగొని స్వంతబాధ్యతపై నడిపించుట సమంజసము. ప్రత్యేకాంధ్రరాష్ట్ర ప్రభుత్వమున్నచో ఆంధ్రదేశమందలి పరిశ్రమలకు సంరక్షణ లభించి యుండెడిదని కొందఱి విశ్వాసము. మదరాసురాష్ట్రప్రభుత్వమున ఆంధ్రులే ప్రధానమంత్రిపదవిని చాలకాలము వహించిరి. అయిననేమి. ఆంధ్రపరిశ్రమలు సంరక్షింపబడలేదు. ఇది ఆంధ్రుల దురదృష్టము. ఈ పరిశ్రమలు నశించిపోకుండ ఆంధ్రులు తమ సర్వశక్తులను ధారపోసి సంరక్షించుకొనుట విధి.

ఆంధ్రదేశము, చిల్లర పరిశ్రమలు. వివిధరాష్ట్రములయందు వివిధపరిశ్రమలు ప్రారంభింపబడుచున్నవి. సబ్బులు, తలనూనెలు, తోలుపెట్టెలు, పింగాణీసామానులు, అల్యూమినియముసరకు, లాంతర్లు, పౌంటెన్ కలములు, అద్దములు, సూదులు మొదలగు చిల్లరపరిశ్రమలు వివిధరాష్ట్రములయందు గలవు. దయాలుబాగు పరిశ్రమాలయము దేశమునకంతకు వన్నె దెచ్చుచున్నది. చిన్న చిన్న పరిశ్రమ లన్నియు దయాలుబాగునందు ప్రారంభింపబడినవి.

అభివృద్ధియందున్నవి. ఇట్టి చిన్న చిన్న పరిశ్రమలైనను ఆంధ్రదేశమునం దభివృద్ధియందు లేవు. అక్కడ సబ్బుల ఫ్యాక్టరీలు బయలుదేరినవి. అవియు అభివృద్ధియందు లేవు. అంతరించుచున్నవి. ఆంధ్రుల పరిశ్రమల విషాదచరిత్రను విస్తరించి వ్రాయుటకంటె విరమించుటయే ప్రశస్తము.

ఆంధ్రదేశమధ్యమున బయలువెడలిన ఆంధ్ర ఇన్స్యూరెన్సు కంపెనీ, డక్కను ఇన్స్యూరెన్సు కంపెనీ, ఆంధ్ర ప్రావిడెంటు కంపెనీలు మాత్రమే నేటివఱకు విజయవంతముగ పనిసాగించుచున్నవి. ఇందులకే కంపెనీల కార్యనిర్వాహకవర్గ సభ్యు లభివందనీయులు. ఆంధ్రుల సంపూర్ణముగు నాదరణమున్ననాడే యీ కంపెనీలైనను దినదినాభివృద్ధి నొందగలవని ఆంధ్రులు గ్రహించుట [illegible].

పారిశ్రామిక విప్లవము, ఆధునిక యంత్రసాహాయ్యము.

ఇంతవఱకు భారతీయపరిశ్రమల యుచ్ఛనీచస్థితులను వృద్ధిక్షయములను గమనించితిమి. భారతదేశమునందలి పారిశ్రామిక పరిస్థితి మందగతియందున్నదని స్పష్టమైనది. ఇందులకు బాధ్యులెవరు? ఈప్రశ్నకు కలకత్తాయందలి స్టేట్సుమెన్ [illegible] సర్. [illegible] దొసంగిన యుపన్యాసము [illegible].

"హిందూదేశము పారిశ్రామికముగ అభివృద్ధి [illegible] విషయముల గోల్పోయిన దేశము. ఇట్టి [illegible] బ్రిటిషుదీవుల బాధ్యతయే యధికముగ గలదు. బ్రిటిషుదీవులవలన [illegible] హాని కలిగినది. భారతదేశపారిశ్రామిక సహజసంపద నభివృద్ధిచేయుటకై సరియగు ప్రయత్నములను జేయలేదు."[1]

---

1. *Free Press Cable, London. Jan. 3 from the Indian Express of Madras dated 4 Jan. 1933.*

అయినను గతజలసేతుబంధన మేల! కాగలకార్యమేమి? చేయదగినపనియేమి? ఇవియే ప్రస్తుతాంశములు.

హిందూదేశమునం దాధునిక యంత్రసహాయ్యమున పారిశ్రామిక విప్లవము గలిగించుట సమంజసమా, అసమంజసమా అని ప్రశ్నించుకొనుకాలము గతించినది. ఆధునికయంత్ర సహాయమున గలుగు పారిశ్రామిక విప్లవములలో పలుబాము లున్నవనుట వాస్తవము. ఈపారిశ్రామిక విప్లవములవలన పాశ్చాత్య నాగరిక ప్రపంచమున దీరనికష్టములు వాటిల్లుచున్నవనుటయు నిజమే. చేతిపనుల యందలి యాత్మానుభవము, సంతృప్తి, శాంతి యంత్రాలయములలో మృగ్యమగుననుటయు సత్యమే. ప్రశాంత గ్రామజీవనమునకు భంగ పాటుగలిగి యనారోగ్యవంతమగు, యవినీతికరమగు, అల్పాయుర్దాయ కరమగు కార్మికుల వాసము లేర్పడుననుటయు నిజమే. అయినను నితరప్రపంచముతోబాటు భారతభూమికూడ కట్టగుడ్డ, తినతిండి, నిలువనీడ గలిగియుండవలెనన్న భారతదేశమునం దాధునిక పారిశ్రామిక పరిణామమును గలిగించుట అత్యవసరము. ఇంతవఱకు నట్టిపరివర్తనము కలుగమియే దేశము కూడుగుడ్డలకై తనలో తాను కృశించుచు తపించుటకు కారణము. అందువలననే నేడు దేశమున పరిశ్రమాభివృద్ధికై పలవరింతలు వినబడుచున్నవి.

విదేశములయందలి ప్రజలవలెనే మన ప్రజకు కూడ కూడుగుడ్డ వసతి రాకపోకల సౌకర్యములు గావలయును. మన దేశమున చాల మంది ప్రజలకు వ్యవసాయమే ఆధారము. వ్యవసాయమువలన నాహార పదార్థములు ముడిపదార్థములు లభించు చున్నవి. కాని ముడిపదార్థములనుండి తయారగు వస్తువులు మాత్రము విదేశములనుండి దిగుమతి యగుచున్నవి. ఆహార పదార్థముల ధరలు, ముడిపదార్థములధరలు

తయారైన దిగుమతియగు వస్తువులధరలతో పోల్చిన చాల తక్కువగను న్నవి. విదేశములలో యంత్రసహాయ్యమున ఆహారపదార్థములు ముడి దినుసులు అధికముగ నుత్పత్తిచేయుచో మనదేశమందలి ఆహారపదార్థములకు ముడిపదార్థములకు ధరలింకను తగ్గిపోగలవు. యంత్రసహాయ్యముపై నాధారపడక వ్యవసాయవృత్తిపై మాత్రమే యాధారపడుచో మనకు కడుపునిండ అన్నము లభించు సుదినము లెన్నటికిని గోచరింపవు. అమెరికా సంయుక్త రాష్ట్రములు, కనడా దేశము అధికవ్యవసాయముగల దేశము లయినను వ్యవసాయముపైన మాత్రమే యాధారపడుట యవివేకమని గుర్తెరింగి ఆధునికయంత్రసాహాయ్యమున పారిశ్రామిక విప్లవమునకు బూనినవి. భాగ్యవంతములయినవి. వ్యవసాయమునందుకంటె పరిశ్రమల వలననే యాదేశము లత్యధిక ధనమార్జించుచున్నవి. ఇట్లే గత యాంశతాబ్దములోపుగనే స్వీడన్, జపాను దేశములు పరిశ్రమల మూలముగ నమిత భాగ్యవంతముల యినవి. మన దేశమునకు దిగుమతి యగుచున్న తయారైనవస్తువులను పరీక్షించుచో మనదేశమందు లభించు ముడి పదార్థములనుండియే యవి తయారగుచున్నవని ఋజువగును. నిన్న మొన్నటిదాక భారతదేశము ప్రఖ్యాతివహించిన వస్త్రపరిశ్రమ ఇనుపపరిశ్రమ పంచదారపరిశ్రమలు నేడు సన్నగిల్లి యీవస్తువులు విదేశములనుండి దిగుమతి యగుచున్నవి. హిందూదేశము, తయారైన వస్తువులకొఱకై వ్యవసాయమువలన వచ్చు రాబడికి చాలీచాలని రాబడి నుండి యధికముగ ఖర్చుపెట్టుచున్నది. తయారైన వస్తువులకొఱకై విదేశములపై ఆధారపడుట మనదుర్గతి. ఆధునిక యంత్రసాహాయ్యమున పారిశ్రామిక విప్లవము భారతభూమియందు గూడ గలిగించుటయే భారతజాతి కర్తవ్యము.

ఇట్లే దేశభక్తులు వర్తకులు పారిశ్రామికులు కలిసి ఉద్యోగేతర మగు పారిశ్రామికాభివృద్ధి సంస్థను నెలకొల్ప వలెను. నేడు కొన్ని సంస్థలు గలవు. ఈసంస్థ లన్నియు నేకోన్ముఖముగ పనిజేయ బూనుట లేదు. ఈసంస్థలవలె గాక, అఖిలభారత పారిశ్రామికాభివృద్ధి సంఘమును నెలకొల్పి యీసంస్థకు శాఖోప శాఖలుగ రాష్ట్రీయ జిల్లా తాలూకా గ్రామసంస్థలను నెలకొల్పుచో భారత దేశమందు గల వివిధప్రాంతముల యందలి పరిశ్రమాను గుణ్యములగు వివిధ కార్యముల నొక్కుమ్మడిగ నడుప గలుగుదుము. ఇవి యన్నియు ప్రస్తుత రాజకీయ పరిస్థితుల ననుసరించి యవసరము. భారతదేశపు ఆర్థిక పరిపాలన భారతీయులవశ మగువఱకు పరిశ్రమాభివృద్ధి జరుగుట దుస్తరము. పరిశ్రమాభి వృద్ధికి ప్రభుత్వాధికారము కీలకము. పరిశ్రమ లనతికాలమునం దభివృద్ధి జెందవలె నన్నచో రష్యాదేశము నందువలె ఏ 5 సంవత్సరముల కార్యక్రమమునో ప్రభుత్వము నిర్ణయించుచో ప్రభుత్వ సంకల్పమునకు వికల్ప ముండదు.

ఇట్టికార్యక్రమమును జేబూనినపుడు వివిధ రాష్ట్రములయందలి పరిశ్రమలకు పోటీ రాకుండ జూచుట మొదటి కర్తవ్యము.ఏ రాష్ట్రమునం దేపరిశ్రమ నెలకొల్ప దగునో హిందూదేశ దృక్పథమున నిర్ణయింపదగును. అంతర్వ్యాపార శుల్కములను విధించుటకు రాష్ట్రప్రభుత్వముల కధికార మొసగరాదు. పరిశ్రమ నీతియు, వర్తక నీతియు విశాలదేశ దృక్పథమున నిర్ణయింపబడుచుండ వలయును. వస్త్రపరిశ్రమ యభివృద్ధి పొందవలెనన్న విదేశవస్త్రముల దిగుమతిని సంపూర్ణముగ నిషేధించుటయే కర్తవ్యము. ఇట్లే కొన్నిపరిశ్రమ లభివృద్ధి పొందవలెనన్న విదేశములనుండి దిగుమతియగువాటిపై అత్యధిక సుంకమును విధించుటయేకర్తవ్యము. దిగుమతి సుంకముల నధికముగ విధించుటయే కాకస్వదేశపరిశ్రమలకు విరాళములనొసంగి ప్రోత్సహించు

యంత్ర సహాయమున వ్యవసాయాభివృద్ధిని ప్రారంభించిన యెడల పలువురు వ్యవసాయ కార్మికులు నిరుద్యోగు లగుదురు. పరిశ్రమలను వివిధ ప్రాంతములలో ప్రారంభించి యీనిరుద్యోగులకు పని గలిపించ వలెను. పరిశ్రమలను, వ్యవసాయమును రెండును యంత్ర సాహాయ్యమున ఒకేసారి యభివృద్ధి చేయుటకు ప్రారంభింప వలయును. పరిశ్రమాభివృద్ధి లేనియెడల నూతన యంత్రసహాయమున వ్యవసాయాభివృద్ధి గూడ జరుగ నేరదు. వ్యవసాయాభివృద్ధియు, పరిశ్రమాభి వృద్ధియు పరస్పరాధారములు.

35 కోట్ల ప్రజలుగల యీమహావిశాల భారతభూమి యందు మోటారులను తయారు చేయుటకు గాని, వాయువిమానములను నిర్మించుటకు గాని, కనీసము కృత్రిమపు పట్టును తయారుచేయుటకు గాని, యొక్క యంత్రశాలయైన లేదే! అందు వలననే ప్రజ కందఱకు దురదృష్టముగ వ్యవసాయమే యాధార మైనది. ఈదురదృష్ట స్థితి తొలగవలె నన్న ప్రభుత్వము, స్థానిక సంస్థలు, ప్రజలు పరస్పర విశ్వాసమున కృషి సలుపవలసి యున్నది.

1. పెద్దపెద్ద పరిశ్రమలు ప్రభుత్వసహాయము లేక యభివృద్ధి కాజాలవు. ప్రజలు తమంతతాము పెద్దపెద్ద పరిశ్రమలలో కాలు పెట్టుట ప్రమాదకరముగ నున్నది. మఱియు వ్యక్తిగతముగ పెద్ద పరిశ్రమలను చేబూనుటవలన పరిశ్రమలకు సంబంధించిన కార్మిక సమస్య మొదలగు వివిధసమస్యలు సక్రమముగ పరిష్కారము కాజాలవు. రాష్ట్రస్వాతంత్ర్యమున పరిపాలింపబడు రాష్ట్రప్రభుత్వములు ప్రతిరాష్ట్రమందునను రెండుమూడు పెద్దపెద్ద పరిశ్రమలను ప్రభుత్వపు పెట్టుబడిపై ప్రభుత్వాధికారమున నడుపుట యుచితము. పెద్ద పరిశ్రమలను ప్రభుత్వము వశపఱుచుకొనుటవలన ఆధునికసమస్య లెన్ని

యో పరిష్కరింపబడును. ఇట్టి పెద్ద పెద్ద పరిశ్రమలకు భూరివిరాళము నొసంగుట సముంజసము.

రెండవరకపు పరిశ్రమలు భారతీయులచే భారతీయుల పెట్టుబడి మీద లిమిటెడ్ కంపెనీలమూలముగ నడుపనగును. వీటికికూడ సంరక్షణయు సాహాయ్యమును నొసంగుట ప్రభుత్వ విధి.

మూడవరకపు చిన్న చిన్న పరిశ్రమలు, అనగా గృహపరిశ్రమలు చేతిపనులు మొదలగునవి రెండవరకపు పరిశ్రమలవలెనే ప్రజలకృషి వలన నెక్కు డభివృద్ధి నొందగలవు. కాని వీటికిని ప్రభుత్వసహాయ మత్యవసరము. నేతపనివాండ్రకు అప్పులనిచ్చి ప్రభుత్వముసహాయపడ వచ్చును. ప్రజ లీవిషయమై ఎక్కువ శ్రద్ధచూపినచో గృహపరిశ్రమల వలననే యధికలాభమును పొందగలుగుదుము.

పరిశ్రమాభివృద్ధికి బూనుటకు పూర్వము ప్రతిరాష్ట్రమునందు నను ఏయేపరిశ్రమ లభివృద్ధిపరుచుటకు వీలుండునో గమనించుట అత్యవసరము. ఏపరిశ్రమ యెట్టిస్థితియందున్నదో కనుగొనుటయు ముఖ్యము. ఈవిచారణయందు యేయేవిధానముల నుపయోగించుట వలన చౌకగ వస్తువులను తయారుచేసి విదేశవస్తువులతో పోటీచేయ గలమో నిర్ణయింపవలెను. స్థానికసంస్థలు ఆయా ప్రదేశములయందు గల పరిశ్రమలస్థితిని కనుగొని తామే స్వయముగ పరిశ్రమలను నడుపుటకు బూనవలయును. ప్రతిసాలున స్థానికసంస్థలు తమఆదాయ వ్యయనిర్ణయ శాసనములతోపాటు నూతనపరిశ్రమలను నడుపుటకు వలయు ధనమును ప్రత్యేకించుటయు నట్టిపరిశ్రమలవలన కలుగు లాభనష్టముల నంచనావేయుటయు స్థానికసంస్థల కార్యములలో ప్రాముఖ్యస్థానము వహింపవలయును.[1]

---

1. *Sir, M. Visweswarayya's Speech, Banglore, 10 July 1933.*

# 46. లలితకళలు.

పారిశ్రామిక పరివర్తనమున లలితకళల పునరుద్ధరించుటయు నొకముఖ్యాంశము. శిల్పకళ, చిత్రకళ, గానకళయు, జాతీయపునర్నిర్మాణమున ప్రాముఖ్యస్థానము వహింపగలవు. లలితకళలు భావోత్తేజకరములు. మఱియు ఆయాకాలములయందలి లలితకళలు ఆకాలముల నాగరికపరివర్తనమును ప్రతిబింబింపజేయు దర్పణము.

అజంతా గుహలవంటి చోటగల చిత్రకళయు సింహాచల దేవాలయములవంటి దేవాలయములయందు గలశిల్పకళయు త్యాగరాజస్వామిగానకళయు నేటికిని సనాతన భారతీయ కళానైపుణ్యమునకు ప్రత్యక్షప్రమాణములుగ నున్నవి. అక్షయమగు భారతీయాధ్యాత్మిక సందేశప్రచారమును నేటికిని కొనసాగించుచున్నవి. ఐహికజీవితసంభవములగు సహజవిషాదప్రవృత్తులయందు మానవునకు శాంతిసందేశము నొసంగుటయే భారతీయ లలితకళావిధానమునకు ప్రాణము. వర్తమానకాలహావభావముల ప్రతిబింబింపజేయుటయే పాశ్చాత్య కళకు మూలము, ఈరెండింటి సమన్వయమే నేడు వాంఛితము. ఆధునికపారిశ్రామిక యుగమునం దాధ్యాత్మికతత్త్వమును మఱచిపోవుటయే నేడు పాశ్చాత్య ప్రపంచమునందున్న యశాంతికి కారణము. ఐహికజీవయాత్రకు విముఖత్వము జనించుటయే ఆసియాఖండమందలి నేటి అశాంతికి మూలము. ప్రపంచమంతయు నీరెండింట నేదో యొకకారణమున అశాంతిమయమై తెన్నుంగానక దురపిల్లుచున్నది. ఐహికాముష్మిక సుఖసమన్వయ మొనరించుసందేశమును ప్రపంచమునకునెదజల్లగల లలితకళావిధానమును భారతీయకళాకోవిదులు త్యజింపజేయుట సమంజసము. లలితకళాప్రచారకులు పూర్వము భక్తాగ్రేసరులై యోగనిష్ఠాగరిష్ఠులై యున్నటుల నేడు జాతీయభావపూరితులై

తాూర్కాణము. ఇట్టి వాతావరణమునందు భారతజాతి సంపూర్ణమగు స్వదేశీతత్వమును మననము జేసినగాని పరిశ్రమాభి వృద్ధికిని, పరిశ్రమల సంరక్షణ పోషణములకును, వేఱుమార్గము లేదు. ఈసిద్ధాంతమును భారత జాతీయవాదులు చాలకాలము క్రిందనే గ్రహించిరి. ఆచరణ యందుంచుటకు సర్వశక్తుల నుపయోగించుచున్నారు. ఈ శతాబ్దప్రారంభమునుండియు, భారతవర్షమున "స్వదేశీ" శబ్దము వినిపించుట ప్రారంభించెను. స్వదేశీ యుద్యమమునందు విదేశ వస్త్ర వస్తు బహిష్కారము గూడ నొక భాగముగ ప్రచారముసలుప బడెను.

ఇందు బ్రిటిషు వస్త్ర వస్తు బహిష్కారమును ప్రత్యేకించి ప్రచారము జేయదొడగిరి. ఈప్రచారము ప్రభుత్వ కోపానలమునకు గుర్తియగుచు మధ్యమధ్య దగ్ధమగు చున్నది. వంగదేశ విభజన కాలమున బ్రిటిషు వస్త్రవస్తు బహిష్కా రోద్యమము ప్రభుత్వమువారి కోపాగ్నిజ్వాలలకు గురియైనది. నిర్బంధ విధానమును రగుల్కొలిపినది."[1]

పలువురు వంగదేశమున లాటీదెబ్బలకు గురియైరి. కారాగృహముల పాలైరి. ఎన్నెన్నియో కష్టముల ననుభవించిరి. ఆనాడు త్యాగము పునాదిగ ప్రారంభింపబడిన స్వదేశీ యోద్యమము నేడు సౌధమునందు విహరించు చున్నది. స్వరాజ్యోద్యమముతో పాటు స్వదేశీ యోద్యమము గూడ దినదినాభివృద్ధి నొందుచు నేడు భారతీయుల హృదయ సీమలయందు నాటుకొను చున్నది. మహాత్మాగాంధీగారి సహాయ నిరాకరణోద్యమమునందు విదేశ వస్త్రవస్తు బహిష్కార మొకకార్యక్రమముగ కొనసాగింపబడు చున్నది. 1921 వ సంవత్సరము నందు ఆసేతు హిమాచల పర్యంతము విదేశ వస్త్రదహనము

1. *Lala Lajapati Rai. Young India.*

రమును పరిబోధమున కంగీకరింపలేదు. బ్రిటిషు వస్తు వస్త్రబహిష్కార ముసు ప్రత్యేకించి ప్రబోధించుటయందు హింసాతత్వము గలదని గాంధీగారివాదము. కాని, 1932 వ సంవత్సరమున మహాత్ముడే బ్రిటిషువస్తు వస్త్రబహిష్కారము నంగీకరించెను. కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గ సభవారిచే నామోదింపజేసెను. పాలకుల వస్తువులను పాలితులు కొనితీరవలెనను నిర్బంధము లేదనియు, అందుచే బ్రిటిషువస్తు వస్త్రబహిష్కారమును కొనసాగింపవలె ననియు మహాత్ముడు తన వాదమును మార్చుకొనెను.

హిందూదేశపరిభుత్వము స్వదేశీయుద్యమమునకు బ్రతిబంధకములను గల్పింపమని బ్రకటించెను. కాని బ్రిటిషువస్తు వస్త్రబహిష్కార పరిచారమును నిర్బంధవిధానమువలన నిరోధింపసాగిరి. పలువురు కాంగ్రెసువాదు లీపరిచారముచేయుచు కారాగృహములకు వెడలుచున్నారు. బహిష్కారోద్యమ న్యాయాన్యాయములను గాని, ప్రభుత్వమువా రవలంబించిన నిర్బంధవిధాన న్యాయాన్యాయములను గాని, తర్కించుట కిది తరుణముగాదు. ఈరాజకీయోద్యమ ఫలితముగ స్వదేశీయుద్యమము పల్లెపల్లెలకు బ్రాకినదని చెప్పుటయే నిట కర్తవ్యము. 1932 వ సంవత్సరమున విదేశవస్త్రములను తిరిగి యెగుమతిచేయుటకై యొక కంపెనీ ఏర్పడినది. ఇంతలో రాజకీయోద్యమము విజృంభించుటచే నీ కంపెనీ పనిచేయలేదు. 1930 సంవత్సరము నుండియు స్వదేశవస్త్రవస్తు విక్రయమునకును, స్వదేశీ ప్రచారము చేయుటకును, విదేశపుసరకును స్వదేశీ యని మోసపుచ్చకుండ నిరోధించుటకును దేశమునందంతట సంఘము లేర్పఱుపబడినవి. ఈసంఘములు ప్రశంసాపాత్రమగు పనిని జేయుచున్నవి. ఇంకను చేయగలవు బహిష్కారోద్యమమును కొనసాగించుటకు ప్రభుత్వశాసనము లంగీక

రింపవు. స్వదేశీప్రచారమును నిరోధము లేదు. స్వదేశీప్రచారమునందు శాసనోల్లంఘనము లేదు. స్వదేశీసిద్ధాంతము భారతీయ రక్తనాళములయందలి రక్తకణములలో ప్రవేశించునట్లు చేయుటయే భారతదేశ ప్రస్తుతకర్తవ్యము.

ప్రదర్శనములు. పరిశ్రమాభివృద్ధికి వలయు సాంకేతికవిద్యాప్రచారము, నూతనపరిశోధనలు, దేశాంతర్గత వ్యాపారముపై రైలుకేట్లను తగ్గించుట, నిర్మాణాత్మకశక్తిని పరిశ్రమాభివృద్ధికరముగ నాచరించుట మొదలగు పనులు ప్రభుత్వమువారు గావించినగాని, పరిశ్రమాభివృద్ధి కానేరదనుట నిశ్చయము, కాని ఈ పరిస్థితులన్నియు సంభవించువరకు స్వదేశీ సిద్ధాంతమును కొనసాగించుటయే దేశీయులపని. స్వదేశీయోద్యమమునకు ప్రచార మెంత అవసరమో ప్రదర్శనముగూడ నంతే అవసరము. స్వదేశీవస్తువుల ప్రదర్శనములు తరుచుగ 1930 వ సంవత్సరమునుండియు జరుగుచున్నవి. ఈ ప్రదర్శనములు పట్టణములయందు, నగరములయందు మాత్రమే జరుపబడుచున్నవి. పల్లెప్రాంతములకు స్వదేశీవస్తువులు అందుబాటుగ నున్నచోల స్వదేశీవస్తువు లందుబాటుగ లేవు. పల్లెలవారికి అందుబాటుగనుంచుటకును స్వదేశీపరిశ్రమల కెక్కువ ప్రోత్సాహము లభించుటకును దేశమునందంతట స్వదేశీసంతలు నేర్పరుప దగును. తాలూకా 1కి నాలుగుచోట్ల, నాలుగు వారములలో స్వదేశీసంతలకు వృద్ధిపొందవలయును. స్వదేశీయుద్యమ ప్రచారకులు సంతల నేర్పరచుటకును, ప్రదర్శనముల నేర్పరచుటకు విశేషకృషి సలుపవలయును



# భారతదేశము-ఆర్థికచరిత్ర

## కార్మికులు.

### 9 వ అధ్యాయము.

---

సాంకేతిక పదములు = Glossary.

| | | |
|---|---|---|
| ధనాఢ్య వ్యవస్థ | = | Capitalism |
| సాంఘిక వ్యవస్థ | = | Socialism |
| సామ్యవాదము | = | Bolshivism |
| స్వామ్యము | = | Ownership |
| పాటు | = | Work or labour |
| సర్వాధికారము | = | Dictatorship |
| పనితనముగల కూలీలు లేక నిపుణులగు కార్మికులు | = | Skilled Labourers |
| సర్వాధికారి | = | Dictator |
| నూతన ధనాఢ్య వ్యవస్థ | = | Rationalisation |
| జాతీయత | = | Nationalism |

| | | |
|---|---|---|
| వృద్ధాప్యభృతి | = | Old Age Pension |
| | ii | |
| నిరుద్యోగ భీమా | = | Unemployment Insurance |
| ఆరోగ్య భీమా | = | Health Insurance |
| కూలివాండ్ర నష్టపరిహారచట్టము లేక కార్మికులాపాయశాసనము | = | Workers Compensation Act |
| ప్రసూతి సహాయము | = | Maternity Benefit |

# కారికలు

-:o:

## 1. కార్మికుడు పూజ్యుడు.

కార్మికుడు పూజ్యుడు. కార్మికజీవనమే సృష్టిధర్మము. పంచ భూతసమ్మేళనమగు నీసృష్టిలో బ్రతిప్రాణియు సమానముగ జీవింప వలెననియే సృష్టికర్త యాదేశము. ఒకడు బానిసగాడు. మఱొకడు ప్రభువు గాడు. వేఱొకడు ధనవంతుడుగాడు. మఱొకడు ధనహీనుడు గాడు. ఇంకొకడు పాలితుడుగాడు. మరొక్కడు పాలకుడుగాడు. ఈవిభే ధములతో జీవింపవలయునని సృష్టికర్త యాదేశముగాదు. మానవుల నందఱిని ఏకస్వరూపమున సృష్టించుటయే యిందులకు తార్కాణము. అందఱకు గాలుసేతు లొసంగబడినవి. ఎల్లరకును బుద్ధిగలదు. ఈసహ జమానవపరికరములతో ప్రకృతి నన్వేషించి అందఱును, సమానముగ ననుభవించుటయే సృష్టిధర్మము. మానవుని సహజావయవములతో శారీరకశక్తిని మాత్రమే వినియోగించి జీవనాధారముకొఱకు ప్రకృతి సంపదను సంస్కృత మొనరించుకొనుచుండ వలయును. ఇట్లొనరించు వాడు జీవితపర్యంత మావృత్తియందున్నను తనవ్యక్తికి అనవసరమగు నాహారమును, పరుల కవసరమగు నాహారమును మిక్కుటముగ సంగ్ర హింపజాలడు. ఏవ్యక్తికి ఆవ్యక్తియే శరీరావయవముల సహజశక్తి ననుసరించి ప్రకృతిసంపద నాశ్రయించి జీవింపగలుగుచో మానవజీవ రాశియందేప్రాణియు మఱొకప్రాణిపై అధికారము చెలాయింపబని లేదు. ఒరులకు చేతులు ఒడించుచు, బానిసయై పరతంత్రజీవన

మే ప్రాణియు గడుప నవసరము లేదు. మానవులమధ్య పరస్పరసంఘర్ష
ణము గలుగదు.

స్వార్థపరు లగుమానవులు పురాణకాలము నుండియు గొంచె మించుమించుగ నానికాలమునుండియు సహోదరత్వము నుల్లంఘించు చున్నారు. కృత్రిమ శక్తుల విజృంభింప జేయు చున్నారు. కృత్రిమ సంస్థల సృష్టించు చున్నారు. కొంతకాలమున సాంఘిక సంస్థల సృష్టించి మానవులలో న్యూనాధిక భావముల గల్పించిరి. మఱికొంత కాలమున మతసంస్థల నేర్పఱిచి నీచోత్తమాభి ప్రాయముల నుద్భవింప జేసిరి. వేఱొకకాలమున రాజ్యాధికారముల గల్పించి అహంకారాధి కారముల నుత్పన్న మొనరించిరి. ఏకమానవ కుటుంబములో ఏక సృష్టిలో ఏకభూదేవిపై వివిధ ఖండములు, వివిధ భాగములు, వివిధ వ్యత్యాసములు కల్పింప జేసిరి. మానవులలో మానవులే విరోధులై పరస్పర హింసలకు పాల్పడ దొడగిరి. ఈసంఘర్షణమునం దధమాధమ స్థితికి ద్రొక్కబడినవాడు కార్మికుడు. ఉత్తమ స్థితియందుంచ బడినవాడు ధనాఢ్యుడు.

సంఘము ధనాఢ్యు నాశ్రయించు చున్నది. మతప్రవర్తకులు ధనాఢ్యుని చెప్పుచేతలకు లోనగుచున్నారు. సాంఘికసంస్థల మాట చెప్పనేల? రాజకీయాధికారుల మాట వచింపనేల? సూర్యుని చుట్టు గ్రహములు తిరుగుచున్న రీతిని ప్రభుత్వములు, ప్రభుత్వాంగములు ధనాఢ్యుని చేతిలో కీలుబొమ్మలై చిరకాల జీవితమును సంపాదింప గలుగు చున్నవి. మానవ చిత్తవృత్తిలో మహేశ్వరులకెల్ల మహేశ్వరుడగు సృష్టికర్తమాట మరపునకు వచ్చినది. ఆయననియమము లడుగంటినవి. ఆయనధర్మములు నమసిపోయినవి. ఆయనపేరు మీదుగ వ్యవహరింపబడు సంస్థ లన్నియుగూడ కాయకష్టజీవుల కడ

గండ్లకే మూలము లైనవి. ధనాఢ్యుల స్వోత్కర్షకే పునాదు లైనవి. ఇంక కాయకష్టజీవుల జీవితములు, ధనవిహీనులజీవితములు దుర్భర మగుటలో వింతయేమి? వ్యక్త్యాధార మగు చేతిపనులు నశించి, యంత్రాలయ నిర్మాణము వృద్ధియైన గతించిన రెండుమూడు శతాబ్దములలో కార్మికుల బానిసత్వము పెచ్చుపెరిగినది. ఈకాయ కష్టజీవుల దుర్భర జీవితమును, ధనాఢ్యుల అధికార అహంకార సుఖలోలత్వములనే నేడు నవనాగరిక మనుచున్నారు.

ఈ నాగరికచక్రపరిభ్రమణము సమాప్తిజెందుసూచన లప్పుడే గోచరించు చున్నవి. కార్మికులలో సంచలన ముదయించుచున్నది. ధనాఢ్యుల స్వార్థపోషణమునకే యుపకరించుచున్న మతసాంఘికరాజకీయార్థిక సంస్థలయందు కార్మికులకు విశ్వాసము సడలుచున్నది. ధనాఢ్యుల పటాటోపమునకు దోహద మొసంగుచున్న మతసాంఘిక నియమములయందలి కృత్రిమమును కార్మికులు గ్రహింపసాగిరి. వీటిపై తిరుగబడుచున్నారు. కార్మిక చిత్తవృత్తిలో తమ సహజ స్థితినిగుఱించి సంక్షోభ ముదయించు చున్నది. కార్మికచిత్తవృత్తియందు విప్లవము జనించుచున్నది. క్రియారూపము దాల్చుటకు గొంతకాలము కావచ్చును. కాని అనతికాలమునందే యీ భావవిప్లవము సృష్టియందంతట వ్యాప్తిజెందుసూచనలు గోచరించుచున్నవి. ఈ సంక్షుభితవిప్లవచిత్తవృత్తియే రష్యాదేశమున కార్మికప్రభుత్వస్థాపనకు కారణము. బ్రిటిషుదీవులయందు కార్మికులు రాజ్యాధికారము వహించుటకు గారణము.

పాశ్చాత్యరాజ్యములయందు కార్మికుల కర్తృస్థాన మింకను లభింపకపోయినను, రాజ్యాంగముల దృక్పథములయందు చాలవఱకు మార్పు జనించినది. రాజకీయవ్యవస్థల సిద్ధాంతస్వరూపములు పరి

వర్తనము నొందుచున్నవి. 18 వ శతాబ్దమునందలి ఆర్థికసంస్థల సిద్ధాంత స్వరూపములు తారుమారగుచున్నవి. 1930 సంవత్సరమునుండియు ప్రపంచము నావహించిన ఆర్థికక్షోభ, మూలసిద్ధాంతముల పరివర్తనమున కత్యధికముగ తోడ్పడుచున్నది. నేటి ప్రపంచార్థికవ్యవస్థను ధనాఢ్యు లొకవంకకును, కార్మికుడు మఱొకవంకకును లాగుచున్నారు. ఇం దెవరివశమగునో నేను చెప్పజాలను. ప్రకృతి వీరితగవు నెట్లు పరిష్కరించునో? శీఘ్రగతిని ప్రకృతి వీరితగవును కార్మికుల కనుకూలముగ పరిష్కరించు నని చెప్పజాలకపోయినను, రానురాను ప్రపంచపరివర్తనము స్పృహానో, నిస్పృహానో కార్మికవాదము నంగీకరించుటకే దారితీయుచున్నది. ధనాఢ్యతత్త్వమునకు పట్టుకొమ్మగ నుండిన పాశ్చాత్యరాజ్యాంగములుగూడ, ప్రభుత్వకోశమునుండి కార్మికుల సహాయసౌకర్యములకై విశేషధనమును వెచ్చించుచున్నవి. "నేటి ధనాఢ్యవ్యవస్థ గతశతాబ్దమునాటికన్న మారినది. పూర్వకాలమున సుప్రసిద్ధులగు అర్థశాస్త్ర పండితులు నిర్వచించిన సూత్రములకంటె చాల మారినది. నాడు నేర్పరులైన అర్థశాస్త్రపండితులు, పరిశ్రమలయందు మూలధనమును పెట్టినవారే వ్యక్తిగతముగ పనిచేయించువారని సహజముగనే యూహించిరి. నేటివలె లెక్కకు మించిన వాటాదారుల పెట్టుబడితో, నానావిధములైన కార్మికుల యెడ పరిశ్రమయెడ బాధ్యతలేని నిర్వాహకులచే నడపబడు పరిశ్రమలు నడుపబడును అని యూహించలేదు. నాటి కార్మికుడు ఉద్యోగమును వాంఛించు నిరాధారుడగు నొకవ్యక్తి యని, నాడు భావించిరి. నేటివలె కార్మికుడు కార్మికసంఘసభ్యుడుగ నుండు ననియు, రాజ్యాధికారమును వహించువారి నెన్నుకొనగలిగిన ఓటుహక్కును గలిగియుండు ననియు, ప్రభుత్వసహాయమున విద్యావంతు డగుననియు, తనకుదాను యోచించుకొనగలవా డగుననియు భావించి యుండలేదు.

ఆర్థికనీతిని నిర్ణయించుటయందు కార్మికునకుగూడ అర్హస్థాన ముండ వలెనను తలంపే వారి తలయందు ప్రవేశించలేదు. నాడు ఆర్థికశాస్త్ర పండితులకే కాక, కార్మికులుగూడ తమ కర్హస్థాన ముండవలె నని తలంచలేదు. నే డీభావము ప్రబలినది. ఇదియే ముఖ్యమగు మార్పు. కార్మికసంఘముండి ఓటుగలిగియుండి విద్య నభ్యసించు కార్మికులపై మునుపటివలె విద్యావిహీనులై సంఘీభావములేని పూర్వకాలపు జన సామాన్యమున కాధిపత్యము వహించినటుల నేడధికారము వహించుట కష్టతమము". [1]

## 2. ధనాఢ్య వ్యవస్థ.

నేటి ఆర్థికవ్యవస్థయందుగల ధనాఢ్య తత్వలక్షణముల నిట్లు నిర్వచింపవచ్చును.

1. చాలమంది వాటాదారులు కలిసి యేర్పఱుచుకొనిన పెద్ద పెద్దసంస్థలు వ్యాపారమును నిర్వహించుచుండుట. ఈవ్యాపారసంస్థలలో సొమ్ము వేసిన వాటాదారు లీవ్యాపారమునందు స్వయముగ నెట్టిజోక్య మును గలిగించుకొనక పోవుట.

2. ఈవ్యాపార సంస్థలయందు వేలకొలది కార్మికులు పనిచే యుచుండుట. ఈకార్మికులకు వారు పనిచేయు నుపకరణములమీద గాని, వాటివలన వారుచేయు నుత్పత్తిమీద గాని యెట్టి అధికారము నులేక యుండుట.

ఈవిధముగ కర్మకును కర్మఫలితమునకును మధ్యగల వ్యత్యా సమే ఆధునిక ధనాఢ్యవ్యవస్థయొక్క ముఖ్యలక్షణము. ఈనిర్వచన

---

1. *From Modern Theories and Forms of Industrial Organisation by G. D. H Cole. M. A. Reader in Economics, Oxford University, p. 40-41.*

మువలన పెట్టుబడిదారుడు పనిచేయడని తెలుపరాదు. కార్మికుడు ఆస్తి లేనివాడు మాత్రమే యని తలంపరాదు. చాలమంది పెట్టుబడి దారులు కష్టించి పనిచేయుచున్నారు. నేడు చాలమంది కార్మికులు గూడ పరిశ్రమలయందు పెట్టుబడిని పెట్టియున్నారు. పెట్టుబడిదారు నకును కార్మికునికిని మధ్యగల వ్యత్యాసమును స్పష్టముగ గుర్తింప జాలము.

పెట్టుబడిదారులయందు కార్మికులు గలరు. కార్మికులయందు పెట్టుబడిదారులు గలరు. పెట్టుబడిదారుడు పనిచేయనివా డనియు, కార్మికుడు నిరాధారుడనియు గ్రహింపరాదు. కర్మశాల స్వామ్య మునకును కార్మికునకును సంబంధము లేకపోవుటయే నేనాటి వ్యవస్థ యందు గమనింప దగినముఖ్యవిషయము.

## 3. సాంఘిక వాదము.

పరిశ్రమల నేవిధముగ నడుపుట యను విషయము కంటె, మానవులమధ్య సామాజిక సంబంధము గలిగించుట యందే సాంఘిక వాదముయొక్క మూలసూత్రము నిమిడి యున్నది. మానవు లందఱు నేక కుటుంబీకు లని గ్రహించిన జీవితమునందు సమాన సౌకర్యము లను పొందవలెననియే సాంఘికవాదుల తత్త్వము. పరిశ్రమలును, ధన మును, ఇతర విధములగు పెట్టుబడులును, వ్యక్తిగతముగ నున్నంత కాలము మానవ సమానత్వము సిద్ధింపదని సాంఘికవాదుల విశ్వా సము.

స్వామ్యమునకును, పాటునకును, నైక్యము గలిగించుటయే సాంఘికవాదుల మతము. సాంఘికవాదుల యూహయందు గల సాంఘికవ్యవస్థయందు పరిశ్రమలను నడుపు కార్యవిధాన మేమి? ఈవిషయమునే మనము గమనింపవలయును.

వ్యక్తిగతముగ పెట్టుబడిదారులు గాని, లేక వారి నియోజకులు గాని పారిశ్రామిక నీతిపై యాజమాన్యము వహింపరా దనుటయే సాంఘిక వాదము. సంఘ మంతయు యాజమాన్యము వహింపవలె ననుటయే సాంఘికవాదము. సంఘశ్రేయమునకై అన్ని విధములగు పరిశ్రమలపైన సంఘమున కంతకు సమిష్టియాజమాన్య ముండవలె ననుటయే సాంఘికవాదము.

• సాంఘికవ్యవస్థగూడ ధనాఢ్య వ్యవస్థవలెనే ఆచరణయందు కార్యనిర్వహణమునకు ఏజంట్లను నియమించవలసి యుండును. ఏవ్యవస్థయందైనను కార్యనిర్వహణమునకు సాంకేతిక విద్యాప్రవీణులను, లేక ప్రత్యేకార్హతగల వారిని నియమింపక తప్పదు. శాసన సభలుగాని, ప్రభుత్వములు గాని, ప్రత్యక్షముగ నిర్వహింప జాలవు. ధనాఢ్య వ్యవస్థయందు డైరెక్టర్లసంఘము వాటాదారుల లాభములను గమనించుచు పరిశ్రమలనీతిని నిరూపించు చుండును. ఆనీతినే ప్రత్యేకోద్యోగులు నిర్వహించు చుందురు.

సాంఘికవ్యవస్థయందు పరిశ్రమల నీతిని నిర్ణయించు సంఘము, సంఘశ్రేయమును గమనించుచు నీతిని నిర్ణయించుచుండును. ఇదియే ధనాఢ్యవ్యవస్థకును సాంఘికవ్యవస్థకును గల ముఖ్యవిభేదము. ధనాఢ్య వ్యవస్థయందు కంపెనీల డైరెక్టరులకు విశేషాధికారము గలదు. నీతిని నిర్ణయించుట, లాభములను పంచిపెట్టుట, మూలధనమును ప్రత్యేకించుట, ఖర్చులను నిరూపించుట మొదలగు నధికారముల సామాన్యముగ డైరెక్టరులే కొనసాగించుచున్నారు. వాటాదారులు నామమాత్రముగ నుందురు. ఇష్టమువచ్చినపుడెల్ల క్రొత్తపెట్టుబడిని సంపాదించుటకుగూడ ధనాఢ్యవ్యవస్థయందు డైరెక్టరుల కధికారము గలదు. ధనాఢ్యవ్యవస్థయందు డైరెక్టరులకు గల అధికారముల నన్నియు సాంఘిక

# 4. నూతన ధనాఢ్యవ్యవస్థ.

## RATIONALISATION

ధనాఢ్యవ్యవస్థ రూపుమాసిపోవ నవసరము లేదనియు, సాంఘికదృక్పథమున సంస్కరించుటకు నావకాశము గలదనియు కొందఱు తలంచుచున్నారు. ఇదియే నూతన ధనాఢ్యవ్యవస్థ స్వరూపము. మొట్టమొదట జర్మనీదేశమునం దీమాట పుట్టినది. దీనిలక్షణముల నిట్లు పేర్కొనవచ్చును.

1. ఆధునిక యంత్రసహాయమున, అధికోత్పత్తి చేయవలెను.

2. ఉత్పత్తిచేయుటయందు ఒకనిర్దేశమగు కార్యవిధానము నవలంభించి, అనవసరవస్తువుల నుత్పత్తిచేయుట మానవలయును. ఉత్పత్తివిధానమున వ్యయమును తగ్గించి వస్తువుల విలువలను చౌకచేయవలయును.

3. పరిశ్రమలను సమ్మేళన మొనరించి, వాటి ఉత్పత్తి విక్రియములలో స్పర్థను తొలగించుకొనవలయును. ప్రశస్తమగు ఆవేశనములయందు మాత్రమే ఉత్పత్తి జేయుచు, అప్రశస్తమగువాటిని మూసివేయించవలయును.

4. పరిశ్రమలకు వలయు ముడిపదార్థములను సంఘీభావమున గొనుచు, తయారైన సరకును కేంద్ర సమ్మేళనసంఘ నియమముల ననుసరించి సంఘసహాయమున విడుదలచేసికొనుచుండ వలయును.

5. వివిధ దేశములతో ఒడంబడికలను గావించుకొన వలెను. ఉత్పత్తి వినియోగములకు సంబంధించిన నియమములు అంతర్జాతీయ మొనరింప వలయును.

"ఈసిద్ధాంతముల ననుసరించుచో పరిశ్రమలయందు స్పర్థ తొలగును. అందువలన పెట్టుబడి దారునకు నష్టము రాదు. ఉత్పత్తిని నిర్దేశించుకొనుట వలన పొటుతగ్గుటచే కార్మికునికి శ్రమ కొంత తగ్గగలదు. స్పర్థతగ్గి నిర్ణీత కార్యవిధాన మవలంబించుటచే ధరలుతగ్గి విని యోగించుకొను వానికి లాభకరముగ నుండును." అని ధనాఢ్య వ్యవస్థ సంస్కరణవాదుల విశ్వాసము. ఈపద్ధతివలన ధనాఢ్యు లందఱు ధనాఢ్య వ్యవస్థను సంరక్షించు కొనుటకై సమ్మేళన మగుటయే జరుగును. సంఘశ్రేయోదాయకముగ పరిశ్రమల యుత్పత్తి విక్రయ ములు మాఱునని తలంచుటకు వీలులేదు. కార్మికునిస్థితి యొకింత చక్కబడ వచ్చును. కాని యీవిధానము సాంఘికవ్యవస్థను మాఱు గాజాలదు. నేడీవిధానమునే జర్మనీ, అమెరికా, ఫ్రాన్సు, ఇంగ్లండులలో ప్రవేశపెట్టిరి. "ధనాఢ్యవ్యవస్థ నింకను కొంతకాలము పొడిగించు కొనుటకై చేయు ప్రయత్నమే యీసంస్కరణ విధాన" మని సాంఘిక వాదు లీపద్ధతియందలి విశ్వాసమును ప్రకటించు చున్నారు. ఈపద్ధతి వలన నిరుద్యోగసమస్య పరిష్కరించుటకు సావకాశము లభింపకపోట నిశ్చయము.

## 5. సామ్యవాదము.

రష్యాదేశమునం దవలంభించిన సామ్యవాదముయొక్క సాంకేయ లక్షణములతో మనకు పనిలేదు. రష్యాదేశప్రభుత్వము ప్రకటించుచున్న ఆర్థిక నిర్మాణ విధానమే గమనీయము. రష్యాదేశముయొక్క ఐదు సంవత్సరముల కార్యక్రమము సఫల మగునా? విఫలమగునా? అను ప్రశ్నయే ప్రపంచదృష్టిని రష్యానంకకు నేడు కేంద్రీకరింపజేయు చున్నది.

"అయిరోపాఖండమందలి సాంఘికవాదులు ప్రజాస్వామిక ప్రభుత్వసంస్థలమూలమున సాంఘికవ్యవస్థను స్థాపింప ప్రయత్నించుచున్నారు. నానాటికి ధనాఢ్యవ్యవస్థ యభివృద్ధిజెందుటను జూచుచున్నారు. అచ్చటచ్చట సాంఘికసిద్ధాంతము లను అతుకులు మాత్రము పెట్టగలుగుచున్నారు. రష్యావలె 5 సంవత్సరముల కార్యక్రమమును సాగింపజాలకున్నారు......సాంఘికవ్యవస్థను నిర్మించవలెనని తలంచువారందఱు రష్యాదేశమునందలి 5 సంవత్సరముల కార్యక్రమము వంటి కార్యక్రమము,తమ కార్యక్రమమందుగూడ కలదనియే యూహించుచున్నారు. ఈకార్యసిద్ధి ప్రజాస్వామిక ప్రభుత్వసంస్థలమూలముననే బడయుటకై ప్రయత్నించుచున్నారు. ఈకార్యసిద్ధిని బడయుటకై విప్లవ మవసరమని గాని, సర్వాధికారమును స్థాపించవలయుననిగాని తలంచుటలేదు."[1]

ఇదియే సాంఘికవాదమునకును సామ్యవాదమునకునుగలవిభేదము.

# 6. నేటి ప్రపంచస్థితి.

నేడు ప్రపంచదృక్పథ మొకవంక సామ్యవాదము నాచరణయందుంచిన రష్యావంకకును, మఱొకవంక నూతన ధనాఢ్యవ్యవస్థను సృష్టించుచున్న అమెరికావంకకును మరలినది. వ్యక్తుల స్వామ్యమును రద్దుపఱచి సంఘశ్రేయమునకై రష్యా కార్యక్రమమును నిర్ణయించుకొనెను.

వ్యక్తుల స్వామ్యములను రద్దుపఱచక సంఘశ్రేయమున కనుకూలముగ ఆర్థికసంస్థను సంస్కరింప అమెరికాదేశమునందు కార్యక్రమము నిర్ణయింపబడుచుండెను. ఈనూతన పరివర్తనమునందు

1. *By Mr. Cole: Industrial Organisation p. 124.*

ఉయిరోపాఖండమే వెనుకబడి యున్నది. ఒకవంక, అమెరికావంక కును, వేఱొకవంక రష్యావంకకును చూచుచున్నది. హిందూదేశము వంటి అస్వాతంత్ర్య దేశములు ప్రపంచ ఆర్థిక పరివర్తనము నందు స్వేచ్ఛతో జేయగలిగినది లేక బిక్కమొగమున నటునిటు దిక్కులు చూచుచున్నవి. ప్రపంచమునందేవ్యవస్థవిజయముగాంచునో నేఁడెవరును జోస్యమును చెప్ప జాలరు. కాలగర్భమునం దేదిదాగియున్నదో! కాని నేటియంత్రయుగమునందు దాపరించిన కార్మికసమస్య పరిష్కరించు టకు రెండేమార్గములు గోచరించు చున్నవని యంగీకరింపక తప్పదు. (1) యంత్రయుగము రూపుమాసిపోయి తొల్లింటి చేతిపనులకు ప్రపంచము మరలవలయును. నాడు అధికోత్పత్తియు నుండదు. విమానములకై జలాంతర్గాములతో పనియుండదు. వాయు విమానములతో ప్రసక్తి గలుగదు. నౌకా నిర్మాణమునందు స్పర్థయు నుండబోదు. అత్యధిక సైన్య పోషణమునకై రాజ్యసువర్ణముల వెదజల్లవలసిన అవసరముండదు. మానవలోకమున శాంతి యుదయించును. సామ్రాజ్య ప్రకృతి తొలగిపోయి అహింసాచిత్తవృత్తి ప్రపంచమున [illegible] మూర్తీభవింప గలదు.

ఒక వ్యక్తికిని, మఱొకవ్యక్తికిని, ఒక సంఘమునకును, మఱొక సంఘమునకును, ఒక పరిశ్రమకును, మఱొక పరిశ్రమకును, ఒక దేశమునకును, మఱొక దేశమునకును మధ్య ప్రబలుచున్న అవిశ్వాసమునకు, అశాంతికి స్పర్థయేకారణము. అధికోత్పత్తివలన స్పర్థ జనించు చున్నది. అధికోత్పత్తి యంత్రములవలన జరుగుచున్నది. ఈ యంత్రములను విసర్జించి హస్తనైపుణ్యమునకు ప్రపంచము మరల గలుగుచో ప్రపంచశాంతి లభించుననుటయం దాశ్చర్యములేదు. నాడు ధనాఢ్యవ్యవస్థ సహజముగ ప్రకృతిలో లీనమగును. (2) అధికోత్పత్తి జేయుచు

సంఘుమంతయు సర్వస్వామ్యసంకలితమై సమానముగ సంఘూదాయమున నుభవించుటయే కర్తవ్యమని కొందఱివిశ్వాసము. చేతిపనులకు ప్రపంచము మరలనియెడల సామ్యవాదమునందే యంత్రములవలన సంభవించుచున్న కష్టములను నివారించుటకు మార్గముగలదు. సంఘమంతయు సర్వస్వామ్యములు సంఘూదాయమునందు గలిగియున్నపుడు స్పర్థకు సావకాశములేదు. స్పర్థ విజృంభించుటకు మార్గమేయుండదు. అన్నాడును ప్రపంచమున శాంతి యుదయింపగలదు.

నేడు ధనాఢ్యుని అధికారఅహంకారములకు స్థానము తొలగిపోయినది. కార్మికుని నిస్పృహకును వేళమించినది.

అయినను బ్రపంచమంతయు త్వరితగతిని ; సామ్యమార్గము నాలింగనమొనరింపనున్న దని యూహింపజాలము. ధనాఢ్యవ్యవస్థను సహింపజాలకున్నను చేతిపనులకై మరలుసూచనలుగూడ గోచరించుటలేదు. ఈ పరిస్థితులలో హిందూదేశమే ప్రత్యేకసిద్ధాంతమును గాని ఆచరింపబూనరాదు. జాతీయప్రభుత్వసిద్ధికై సర్వసంఘముల సంఘీభావమునకై ప్రయత్నించుటయే అత్యవసరము. అన్నితరగతుల ప్రజలును గలిసి పనిచేయుట ప్రధానకర్తవ్యము. అన్నిసిద్ధాంతముల కంటె నేటి భారతదేశమునకు "జాతీయ"సిద్ధాంతమే ఆచరింపదగి యున్నది. ఒకసంఘముపై మఱియొకసంఘము, ఒకతరగతి ప్రజలపై మఱియొకతరగతి ప్రజలు డీకొనుట, పరస్పరకలహములు జనించుట, భారతీయజీవితమునకు నేడు విషతుల్యమగును.

## 7. కార్మికుల సహాయశాసనములపరివర్తనము.

కార్మికోద్యమము పుట్టినది మొదలు నేటివఱకును బ్రపంచమునందుగల కార్మికశాసనపరివర్తనమును గ్రహించుచో, కార్మికోద్య

మము నానాటికి ప్రపంచమున విజృంభించుచున్నదని చెప్పకతప్పదు. ఒకదేశమునకంటె మఱొకదేశమున, ఒకనాడుకంటె మఱొకనాడు కార్మికులను సంతృప్తులుగ నొనరించుటకే ప్రభుత్వములు ప్రయత్నించుచున్నవనుటయు నిశ్చయము.

1782 లో ప్రప్రథమమున ఇంగ్లాండునందు బీదల సహాయ శాసనము పార్లమెంటువారిచే నామోదింప బడెను. ఈశాసనము ననుసరించి ప్రభుత్వదానము మీాద జీవించువారు, కష్టించి కూలినాల్జి చేసికొనువారికంటె సుఖపడుచు వచ్చిరి. ఇట్లు ఏబది సంవత్సరములు గడిచినవి. పిమ్మట కొన్ని నియమములు చేసిరి. ఆనియమముల ననుసరించి బ్రిటిషు దీవులలో బీదలకు సహాయము చేయబడుచున్నది. ఈసహాయము సంరక్షణసంఘములు చేయుచున్నవి. ఈసంరక్షణ సంఘముల సహాయమున కార్మికశాఖామంత్రి కార్మికశాసనము నమలు జరుపుచుండును. ఏఆరోగ్యవంతుడగు కార్మికుడైన బుద్ధిపూర్వకముగ బని చేయ నిరాకరించుచో వానికి మాత్ర మెట్టి సాహాయ్యము చేయబడదు. కాని వానిచే సంరక్షింప బడవలసినవారికి, అనగ వానిభార్యకు పిల్లలకు సహాయ్యము చేయగలుగుదురు. 1920 సం. మార్చి నెలాఖరువఱకు ననగ యీాబీదల సహాయశాసన మమలులోనికి వచ్చిన 86 సం. రములలోను షుమారు 780 మిలియను పౌనుల ష్టర్లింగులు ఇంగ్లండు వేల్సులలో స్థానికాధికారులు వ్యయమొనరించిరి. 1920 మార్చి నెలాఖరువఱకు అనగా 1919-20 సం॥న ఇంగ్లండు వేల్సులలో 24 మిలియనుపౌనులు బీదలకు సహాయము చేయబడినవి. స్కాట్లండులో 2 మిలియనుల పౌనులు దాన మొనరించిరి.

30 వ మే 1908 వ సంవత్సరమున జర్మనీ దేశమునందు కార్మిక శాసనము గావింప బడెను. ఈశాసనమునందు నియమములన్నియు నిర్వచింప బడినవి.

పట్టణములయందు బీదలసహాయ శాసనము లమలునందుంచుటకు ప్రత్యేకసంఘముల కధికార మొసంగ బడినది. గ్రామములలో నీపని స్థానికసంస్థలు నిర్వహించు చున్నవి. జర్మనీదేశమునం దేజర్మనుదేశస్థుడుగాని దుస్థితియం దున్నచో నతనికి సాహాయ్యమొసరించు బాధ్యత యాప్రాంతపు స్థానికసంస్థపై గలదు. ఆధన మాస్థానికసంస్థనుండిగాని లేక యూనియనునుండిగాని యిచ్చుట విధి. బీదల సహాయమునకై ప్రత్యేకపువన్ను విధింపబడకుండియు సహాయము గావింపబడు చున్నది.

ఫ్రాన్సు దేశమునగూడ నసమర్థులకు సాహాయ్య మధికముగనే జరుగు చున్నది. ప్రభుత్వపునిధి నుండియే గాక, భాగ్యవంతుల విరాళముల నుండి కూడ సహాయ మొనరింపబడు చున్నది. స్థానికసంస్థ లీకార్యము నిర్వహించు చున్నవి. ప్రభుత్వము తనిఖీదారుగా నున్నది. ప్రతిస్థానికసంస్థకు బీదలసహాయనిధి కలదు.

జపానుదేశమున 1899 వ సంవత్సరమున కార్మికశాసన మొనరింప బడెను. ఆశాసనము ననుసరించి ప్రతి సంవత్సరము బీదల సాహాయ్యమునకు అరమిలియను యెన్నులధనమునకు తక్కువ కాకుండ ప్రత్యేకింపబడవలెను.

న్యూజిలాండ్ దేశమున బీదలవసతిగృహములకు, వైద్యశాలలకు ప్రభుత్వము విరాళముల నొసంగుచున్నది. స్థానికసంస్థలు 12షిలు. 6పె. పౌను 1కి యిచ్చుచున్నవి. 10షి. పౌను 1కి మరణశాసనములవలన నాదాయము వచ్చుచున్నది. ఉచితవిరాళములవలన పౌ 1కి 24షిల్లింగులచొప్పున లభించుచున్నది.

1880 సంవత్సరప్రాంతమున జర్మనీదేశమునందు సాంఘికక్షేమావిధానము ప్రవేశపెట్టబడెను. ప్రతికార్మికుడు అస్వస్థత, అపా

యము, వృద్ధాప్యములకు భీమాచేయవలెనని శాసింపబడెను. డెన్మా ర్కు దేశము 1891 వ సంవత్సరమునందు జర్మనీ దేశము ననుసరించుచు వృద్ధాప్యభృతిశాసనమును గావించెను. బ్రిటీషుదీవులయందు కార్మిక శాసనములనుగుఱించి విచారణలు జరిగినవి. 1887 వ సంవత్సరపు జాతీయప్రావిడెంటు నివేదిక (National Provident Insurance) 1895 వ సంవత్సరపు మునలిబీదవాండ్రి విచారణసంఘనివేదిక (Report of the Royal Commission on Aged Poor) 1898 వ సంవత్సరపు అర్హులగు బీదపనివాండ్రి నివేదిక (Report of the Select Committee on Aged Deserving Poor) 1900 సం.రపు ప్రభుత్వశాఖనివేదిక (Departmental Committee Report on Aged Deserving Poor) లు విచారించినవి. బీదల సహాయశాసనములనుగుఱించి విపులముగ 1909 వసంవత్సర ప్రారంభమునుండియు వృద్ధాప్యభృతుల శాసనము బ్రిటిషుదీవులయం దమలునం దుంచబడెను.

1887 సం॥పు జాతీయప్రావిడెంట్ నివేదిక, 1895 సం॥పు ముసలి బీదవాండ్ర విచారణసంఘనివేదిక, 1898 సం॥పు అర్హులగు బీదపనివాండ్రనివేదిక,1900సం॥పుప్రభుత్వపుశాఖవారినివేదికలయందు కార్మికుల సమస్యలు విపులముగ చర్చింపబడినవి. మొదట ఇంగ్లండ్ దేశములో వృద్ధాప్య భృతులను, 1909 సం॥పు ఆగష్టు 1వ తేదీనుండియు నమలునం దుంచబడెను. 1908 సం॥లో వృద్ధాప్య భృతిశాసనము గావింపబడినది. 1911,21 సం॥ల జాతీయ భీమాశాసనములవల్ల ప్రతి కార్మికుడు అనారోగ్యస్థితి, నిరుద్యోగస్థితి, భీమాలనుచేయుట విధి యైనది. 1908 సం. లో ఆస్ట్రేలియాదేశమును, 1898 లో న్యూజీలాండ్ దేశమును వృద్ధాప్య భృతిశాసనముల గావించినవి. ఆస్ట్రేలియాదేశ మునం దారోగ్యభీమాశాసన మొనరింపబడినది. న్యూజిలాండ్, కనడా

దేశము లీవిషయమున జర్మనీ, బ్రిటిషుదీవుల ననుసరించినవి. నిరుద్యోగసమస్యను తొలగించుటకై యుద్యోగములిచ్చుఆఫీసు లేర్పఱుపబడెను.

ఫ్రాన్సుదేశమున 1905 సం॥నందు, 1908 లో స్పెయినుదేశమునందు వృద్ధాప్యభృతు లేర్పాటు గావింపబడినవి. 1911 సం॥నందు స్విట్జర్లాండ్ దేశమున అనారోగ్య భీమాశాసనము గావింపబడెను. కాని నిర్బంధ పద్ధతికాదు. ఆకస్మికముగ తటస్థించు నపాయములకు భీమా నిర్బంధింపబడినది. ప్రతిప్రభుత్వోద్యోగియు కార్మికుడును వర్తకుడును అపాయపుభీమా చేసితీరవలెనను నిర్బంధము కలదు. 1916వ సం॥న హాలండ్ దేశము నిరుద్యోగభీమా నమలునందుంచెను. 1919 వ సం॥ పోలండ్ దేశము ఆరోగ్యభీమాపద్ధతి నమలునందుంచెను. కాని నిర్బంధములేదు.

ఐస్‌లాండ్‌నందుకూడ వృద్ధాప్యభృతు లేర్పఱుప బడినవి. అందులకగు ధనము గొంత ప్రభుత్వమును, గొంత న్యాయాసంఘములును భరించు చున్నవి.

ఈవృద్ధాప్యభృతి నొసంగు వయోనిర్ణయము వివిధ దేశముల యందు వివిధరీతులుగ నున్నది. కొన్ని దేశములలో 70 సం॥ ల పై వయస్సు గౌరవభృతి నియ్యదగిన వయస్సుక్రింద గ్రహింప బడినది. గ్రీసువానికి మాత్రము 50 సం॥ పైనుండియే గౌరవభృతి కలదు. ఆస్ట్రేలియా, ఫ్రాన్సు, న్యూజిలాండ్ దేశములలో 65 సం॥ల నుండియు నర్హు లగుదురు. బ్రిటిషుదీవులలో సంవత్సరాదాయము మనిషి 1కి 26 పౌనల 5 షి. లకు హెచ్చు లేకున్నచో బ్రతివారము 10 షి. లివ్వబడును. సంవత్సరాదాయము 47 పౌనుల 5 షి. లు గాని, 49 పౌనల 17 షిల్లింగుల 6 పె. లు కాని వచ్చుచో వారమునకు 1 షి. వఱకు

పించను తగ్గింప వచ్చును. పిమ్మట ప్రతి 5 పౌనుల 5 షిల్లింగుల హెచ్చు ఆదాయమునకు ప్రతివారము 2 షి. ల పింఛను తగ్గింప బడును. ఇంతకంటె విశేషమగు మార్పులను పింఛనులలో చేయుటకు వీలులేదు.

బ్రిటిషు జాతీయఆరోగ్య భీమావిధానమున రెండు తరగతుల మనుష్యులు గలరు. నిర్బంధింపబడిన కార్మికులు, అనగ భీమాచేయుట విధియైనకార్మికులు, బుద్ధిపూర్వకముగా జేరిన యితరులు. ఈ యిరు తెగలవారికి భీమానలన వైద్యసాహాయ్యము లభించు చున్నది. (Sanitorium Treatment) ఆరోగ్య ప్రదేశములకు గొనిపోయి చేయు వైద్యము చేయబడుచున్నది. జబ్బుగా నున్నకాలమున కుటుంబ పోషణమునకు ధనసహాయము చేయబడుచున్నది. ఈధన సహా యము వారమునకు పురుషుడు 1 కి 15 షిల్లింగుల చొ॥నను స్త్రీ 1 కి 12 షి. చొ॥ నీయబడు చున్నది. అపాయమువచ్చి వికలాంగులుగాని అసమర్థులుగాని యయినచో 7 షి. 6 పె. చొ॥ ప్రతివార మొసగ బడును. వీరు గర్భవతులై ప్రసవించినకాలమున 40 షి. లొక్క పర్యాయ మొసంగుదురు.

ఆంగ్లేయ నిరుద్యోగభీమాకూడ ఆరోగ్యభీమావలెనే కార్మి కుడు, కార్మికాధికారి ప్రభుత్వములవల్ల విరాళము నొసంగుపద్ధతిపైన నడుపబడుచున్నది. ఇందువల్ల కూలిలేని పురుషునకు వారమునకు 18 షి॥లున్నూ, ఆతనిభార్యకు 5 షి॥లున్నూ 2 షి॥లు ఆకుటుంబము నందు ప్రతిపిల్లకాయకును, ప్రతి ఆడదానికి 15 షి॥లున్నూ నిరు ద్యోగకాలమునం దీయబడుచున్నది. 16, 18 సం॥గల బాలురకు 7 షి. 6 పెన్సులును, 16, 18 సం॥ల బాలికలకు 6 షి॥లున్నూ యొసం గబడుచున్నది. 1 సం॥రము కాలమున 26 వారములవఱ కిట్లు కార్మి

కులు లాభము పొందగలరు. (ఈ వివరములు 1924 సం॥పు నిరుద్యోగభీమాచట్టము నెం. 2 లో గలవు) ప్రభుత్వముచే నేర్పఱుపబడిన ఈ సౌకర్యములేగాక కార్మికసంఘములుకూడ వాటిసభ్యులకు సహాయముచేయుచున్నవి. స్కాట్లాండ్ దేశమున కార్మికశాసనపరిపాలనాధికారులాయాస్థానికపరిస్థితుల ననుసరించి కుటుంబావసరములగుర్తించి మఱికొంత సహాయము చేయుచున్నారు. నిరుద్యోగభీమాననుసరించి పొందినధనమున కిట్టివిరాళముల గలుపుచో వారమునకు 42 షి. లవఱకుకూడ కార్మికులకు ముట్టును.[1]

వృద్ధాప్యభృతి నొసంగు సిద్ధాంతముగూడ అన్ని దేశములయందొకరీతిగ లేదు.

బ్రిటిషుదీవులయందు ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, డెన్మార్కు దేశములలో (Non-Contributory) పనివాండ్రిమియు నియ్యనక్కఱ లేకుండగనే భృతియొసంగబడును. ఫ్రాన్సు జర్మనీ దేశములలో మాత్రమట్లుగాదు. ఉచితముగ నిచ్చుటవలన దుర్వ్యసనములకు లోనై వయసునందు, ముదుసలితనమునకు జాగ్రత్తపడని త్రాగుబోతు దూబరిగొండివాడు సోమరివాడు మొదలగువారికెల్ల యొసంగవలసి వచ్చుననియు, నందుచే కార్మికుడుకూడ వయసుకాలమునందు కొంత భృతి నిధికి విరాళమొసంగు పద్దతియె సక్రమమనియు గొందఱిమతము. ఈరెండిటి సక్రమాసక్రమ ములను పరీక్షించుచో నుచితముగ వృద్ధాప్యభృతి నిచ్చుటయె సమంజసము. బుద్ధిహీనుడై, వయసునందు గావించిన లోపములకు అసమర్థుడై, వృద్ధుడై బాధపడుచున్నపు డాబాధనివారణ గావింపక, పూర్వస్థితికి నాబాధ శిక్షగ ననుభవింపవలెననుట యోగ్యముగాదు.

1. *See G. Findly Shirras "The Science of Public Finance, p. 71—81 Second Edition 1925.*

# 8. భారతదేశము-కార్మికసమస్య.

హిందూదేశము-కార్మికశక్తి.

పరిశ్రమల అభివృద్ధితోపాటుపాశ్చాత్యదేశములయందు వలె భారతదేశమునందుగూడ కార్మికసమస్య జాతీయ సమస్యలలో ప్రాముఖ్యస్థానము వహించు చున్నది.

బొంబాయి, కలకత్తా, కాన్పూరు, మదరాసు, అహమ్మదాబాదు, నాగపూరు, జమ్‌షడ్‌పూరు మొదలగు నగరములు పరిశ్రమలవలన నభివృద్ధిజెందిన నగరము లనదగును. గడచి యుద్ధము వలన ప్రపంచమునందు కార్మికులలో నొకనూతన తేజము ప్రభవించినది. కార్మికులు తమసత్వములను గుఱించి తలపోయసాగిరి. నానారాష్ట్ర సమితి ప్రపంచమునందు పారిశ్రామికముగ ప్రాముఖ్యత వహించు దేశములలో 8 వ దేశముగ భారతదేశమును గుర్తించెను. ప్రతిసంవత్సరము భారతదేశప్రభుత్వ నియమితులగు కార్మికప్రతినిధులు అంతర్జాతీయ కార్మికసభకు పోవుచున్నారు.

1879-80 సంవత్సరమునందు బట్టలమిల్లులలో 47855 మంది కార్మికులుగలరు. నారమిల్లులలో 59222 మందికార్మికులు 1881 లో గలరు.[1]

1927 వ సంవత్సరమునకు మొత్తము 1533382 మంది కార్మికులు గలరు. ఇట్లే పరిశ్రమ లభివృద్ధియైనకొలదియు కార్మికులు వృద్ధి జెందుదురనుటకు సంశయములేదు. కార్మికుల రాకపోకలవలన బస్తీకిని పల్లెకును సంబంధము పెరుగుచున్నది. నగరవాసుల జీవితము ననుసరించి గ్రామవాసులజీవిత మిందువలన మాఱుచున్నది. (Brought for Labour in Indian Industries) మిల్లులయందు పనిచేయుచుండిన కార్మికులసంఖ్య జనసంఖ్యలో, కొలదిగ నున్నను హిందూదేశ

1. *See R. K. Das; Factory Labour in India. p. 15-16*

మునందుగల కార్మికశక్తిని ప్రభుత్వమువారిట్లు మదింపు వేసిరి. హిందూదేశరాజ్యాంగ కార్యదర్శిగారు నానారాజ్యసమితి కార్మిక శాఖవారి కీవిధముగ మదింపువేసి పంపిరి.

| | |
|---|---|
| వ్యవసాయ కార్మికులు. ఇందు 77664886 మంది భూమిగల వ్యవసాయ దారులు చేరలేదు. | 27810130 |
| సముద్రవ్యాపార కార్మికుల సంఖ్య. | 141000 |
| పరిశ్రమలు, గృహపరిశ్రములు, గనులు, యానసౌకర్యములలో గల కార్మికులు. | 20219000 |

ఈసంఖ్యల ననుసరించి పరీక్షించుచో ప్రపంచమునం దంతట కార్మికశక్తిలో భారతదేశమే అగ్రస్థానము వహించు నని చెప్ప గలము. అయిరోపాఖండమం దంతట గల పురుషకార్మికుల కంటె 10,000,000 హెచ్చుగ నున్నారు.

| | | |
|---|---|---|
| ఇటలీయందు | 11275000 | మందియు |
| జపానునందు | 18800000 | మందియు |
| బెల్జియము | 2600000 | మందియు |
| స్విజరాండు | 1777000 | మందియు గలరు. |

# 9. హిందూదేశ కార్మికులలక్షణములు.

విదేశముల యందలి కార్మికులవలె హిందూదేశ మందలి మిల్లుకూలీలు కార్మికవృత్తిపై మాత్రమే అధారపడి యుండరు. విదేశములయందు సాగుబడితో నిమిత్తము లేదు. మిల్లుల యందలి కార్మిక వృత్తియే ఆధారముగ చాలమంది కార్మికులు గలరు. హిందూదేశ

మందు మిల్లులలో పనిజేయుటయే జీవనాధారముగ నుండు కార్మికులు తక్కువగ నున్నారు. అహమ్మదాబాదు కాన్పూరువంటిచోట్ల నేడు స్థిరమగు కార్మికులు గలరు. సహజముగ హిందూదేశ కార్మికుడు వ్యవసాయ మనిన ప్రీతి గలవాడు. మిల్లులయందు గత్యంతరము లేక పొట్టకై పనిచేయుట కంగీకరించు చున్నాడు. ఇందువలన పరిశ్రమల నుండి వ్యవసాయమునకు, వ్యవసాయమునుండి పరిశ్రమలకును మారుట స్వభావమైనది. గ్రామజీవితమును కార్మికుడు త్రోసిపుచ్చ జాల కున్నాడు. కుటుంబమును పల్లెటూరి యింటియందే విడిచి, యొంత డొక్కడే పట్టణమునకు బోవుచున్నాడు. తరుచుగ నింటికి పోవుచుం డును. వ్యవసాయమువలన జీవయాత్ర దుర్భరమై నగరములవెంట చిన్నచిన్న రైతులు కూలికి దిరుగు చున్నారు. (Jathar and Beri) మిల్లులలో పనిచేయ బూనుచున్నారు. సంయుక్తరాష్ట్రములు, బీహారు, ఒరిస్సా, బొంబాయి రాజధానియందలి రత్నగిరి మొదలగు ప్రాంతముల చిన్నచిన్న రైతులు పట్టణములకు బోయి, కార్మిక వృత్తిపై ఆర్జించిన గాని జీవింప జాలరు. వ్యవసాయకాలము ముగిసిన పిమ్మట హెచ్చుమంది పట్టణములకు బోవు చుందురు. గ్రామముల యందలి బీదవాడు, పంచముడు మొదలగువారు హెచ్చుమంది కార్మికవృత్తికై పోవుచున్నారు. వర్షకాల ప్రారంభమున తిరిగి చాల మంది సాగుబడికి గ్రామములకు మరలు చున్నారు. ఇట్లు మరలిపోవు టకును కార్మికుడు స్థిరముగ లేకపోవుటకును మిల్లులయందుగల కష్టములే ముఖ్య కారణము. కార్మికుని ఆకర్షింపగలిగిన జీతబత్తెములు లేవు. సౌకర్యములు లేవు. వసతులులేవు. ఈసౌకర్యము లన్నియు నున్నచో పాశ్చాత్య దేశములలో వలెనే హిందూదేశమందుగూడ కార్మికులు స్థిరముగ పరిశ్రమల నంటియుందురనుట నిశ్చయము.

# 10. కార్మికుల సంచారవృత్తి ఫలితములు.

కార్మికుడు స్థిరముగ లేకపోవుటవలన ఆతని కార్మికవృత్తి యందు నైపుణ్యమును సంపాదింప జాలకున్నాడు. గ్రామముపై గల దృష్టి మరలనందున మిల్లులలో చేయుపనిపై బుద్ధి నిలుకడగ నుండుట లేదు. నిలుకడ లేకపోవుటవలన చేయగలిగినంత పనిని చేయ జాలడు. జీతబత్తెములు హెచ్చించుచో వెంటనే ఇంటికి పోవుచున్నాడు. మరలి వచ్చునప్పటికి తిరిగి పని సమకూడుట కష్టముగ నున్నది. ఈకారణ మున వీరు మేస్త్రీలబాధకు విశేషముగ గురియగు చున్నారు.[1]

మఱియు కార్మికసంఘములను స్థిరముగ నేర్పఱచుటకు గూడ ప్రతిబంధకముగ నున్నది. కాని ఇట్లు కార్మికుడు పల్లెకు సంవత్సరము నందు కొంతకాలమైన పోయి, అచ్చట వసింపనియెడల, ఆతని కారో గ్యము సరిపడదు. మిల్లుయందు పనిచేయుచున్నపుడు విధ్వంసమైన ఆతనిఆరోగ్యము,గ్రామమునందుగలసహజపరిస్థితులమధ్య వసించినగాని చక్కబడదు. ఇట్లు ఆరోగ్యవంతు డగుటకు పోయినను పరిశ్రమలకు నష్టము గలుగుననుట నిశ్చయము. పరిశ్రమలకు నష్టము గలుగకుండ నుండుటకై కార్మికుల ఆరోగ్యము చెడనిరీతిని యజమానులు వారికి సర్వసౌకర్యములను నొనగూర్చుటయే కర్తవ్యము. కార్మికుల ఆహా రారోగ్యములకు వలయునట్టి సౌకర్యము లొనగూర్పక కార్మికులు స్థిరముగనుండరని యజమాను లనుటవలన ఫలితములేదు.

---

1. *See B. Harst: Labour and Housing in Bombay p. VI and VII.*

# 11. కార్మికుల జీతబత్తెములు-కష్టములు.

ఫ్యాక్టరీకూలీలు. యంత్రాగారములయందు గనులయందు కార్మికుల వేతనములు పరిశ్రమాధిపతుల యిష్టము ననుసరించి యున్నవి. పరిశ్రమ లింకను విపులముగ వ్యాపింపకము నుపే, కార్మికసమస్యను గమనించుట సమంజసము. కొన్ని తావులలో రోజువారీ కూలియు, కొన్నిచోట్ల వారమునకొకమాఱును,కొన్నిచోట్ల నెలసరిజీతములును కార్మికుల కొసంగు ఈ వేతనము లాకర్షణీయముగ నుండవలెను. అట్లుండుచో పలువురు యంత్రశాలలయందు పనిచేయు టకు వచ్చెదరు. ఈకూలీలు నమ్మకముగ పనిచేయవలెనన్న వారికి తగువసతులేర్పఱుపవలెను. టాటాకంపెనీవారట్లేర్పఱచిరి. గనులయొద్ద అట్టివసతు లేర్పఱుపబడలేదు. అందుచే అచ్చట, కూలీలకై చిక్కుపడ వలసి వచ్చుచున్నది. వరుసగ అనేకసంవత్సరములు ఫ్యాక్టరీలయందు పనిచేసినను, వారికి ఏవిధమగు గౌరవభృతులును నొసంగ బడుటలేదు. (Gratuity fund) ప్రతిసంవత్సరము బోనసుగాని, చిరకాలసేవకు బహూ రకనిధులుగాని యేర్పఱుపబడలేదు. బొంబాయి, కలకత్తాలయందు మాత్రమేర్పఱుపబడెను. సుమారు 10 సం.ల సేవ యొనరించినపిమ్మట మొత్తపు జీతములో 5 మొదలు 10 వంతులవఱ కొసంగబడు చుం డెను. ఈస్వల్పమొత్తములైనను, తప్పక ముట్టునను నమ్మకములేదు. యజమానులు 10 సం.లు రాకపూర్వమే యేదోయొక నెపమున కూలీలను తప్పించివేయుచున్నారు. జీతములను యజమానులు తమ యిచ్చవచ్చినపుడు హెచ్చించుచున్నారు. లేదా తగ్గించుచున్నారు. అందువల్ల కూలీలు సమ్మెలగట్టుటయు, యజమానులు కూలీలను తీసి వేయుచుండుటయు బొంబాయి కలకత్తాలయందు నిత్యకృత్యముగ నున్నది.

ఇందులకుతోడుగ కూలీలపై సర్దారు లను అధికారులు గలరు. వీరే కూలీలను చేర్చుచుండుటయు తీసివేయుచుండుటయు చేయుచున్నారు. యజమానులు వీరిపై ఆధారపడుచుందురు. అందువల్ల వీండ్రు కూలీలపై సవారిచేయుచున్నారు. యజమానులకును కూలీలకును మధ్యగల యీతొరుపుకాండ్రబాధనుండి కూలీలు సంరక్షింపబడవలయును. కొన్ని తావులలో కూలీలు తమ్ము దీసివేయకుండగ సర్దారులకు లంచము లొసంగవలసినస్థితి గలదు. కూలీలు తమయజమానులెవరోగూడ ఎఱుంగనిస్థితియందున్నారు. కూలీలుగచేర్చికొనునపుడును పనిచేయునపుడునుగూడ సర్దారులు కూలీలను పీడించుచుందురు. ఈసర్దారులు కార్మికులలో నైకమత్యము భంగమొనరించుటకును గూడ నుపయోగింపబడుచున్నారు. కార్మికులు అల్పజీతములతో పనిచేయుచుండుటగాక, ఆ అల్పజీతములుగూడ, బాగుగ పనిచేయలేదను నెపమునవో, వలయునంత పనిచేయుటలేదనియో, సకాలమునరాలేదనియో కోసివేయబడుచున్నవి.

స్త్రీలు-పిల్లలు. సుమారు అరమిలియను స్త్రీలు ఫ్యాక్టొరీలయందును, గనుల యందును పనిచేయు చున్నారు. 80,000 మంది గనులలో పనిచేయు చున్నారు. ఇందు 63000 రాక్షసి బొగ్గు గనులలో పనిచేయు చున్నారు.

ఇందులో పిల్లలు, పిల్లలతల్లులు, గర్భిణీస్త్రీలు పనిచేయుచున్నారు. వీరందఱికిని జీతములు స్వల్పముగనే యున్నవి. సీమలో స్త్రీ పనివాండ్రిలో సహజముగ 18, 24 సం॥ ల మధ్యవా రుందురు. వీరు అవివాహితలు. అయినను వీరికి చాల సదుపాయములు గలవు. మన దేశమునందు బాల్యవివాహము లుండుటచే వివాహితలగు యువతులకు, గర్భిణీస్త్రీలకు, పిల్లలతల్లులకు అధికధన మవసరముగ నుండును.

అయిన నేమి? పురుషులకంటెగూడ వీరి జీతము లత్యల్పముగ నున్నవి. స్త్రీ కార్మికులకైన కనిష్టజీవితభృతు లొసగబడ వలె నని గాని, ప్రసూతి పూర్వాపరకాలముల సౌకర్యములు గాని, జీతముమీాద సెలవులుగాని ఇచ్చితీరవలెనను శాసనములు ప్రభుత్వ మింతవఱకు గావించి యుండలేదు. బాలబాలికలు గూడ గనులయందు పని చేయు చున్నారు. 12 ఏండ్లలోపు పిల్లలు ఫ్యాక్టరీలయందు, 13 ఏండ్లలోపు పిల్లలు గనులయందు పనిచేయరాదను నిషేధము గలదు. జీవితమున కంతకు ముఖ్యమైనదగునట్టి బాల్యదశయందు, బాలబాలికలు అనేక వ్యసనములకు లోనై, అమితకష్టముల కాలవాల మైయున్న గనుల యందు, ఫ్యాక్టరీలయందు పనిచేయు దుస్థితి మన దేశమునందే కలదు. ఈబాలబాలికలు దినమున కొక గంటకాల మైన పనిచేయు చోట్లనే చదువుకొనుటకు వలయునేర్పా ట్లయిన గావింప బడుటలేదు.

వంగ బీహారు దేశములయందు గల రాణిసిబొగ్గు గనులలో సుమారు 184,000 మంది కార్మికులు పనిచేయు చుందురు. రాణీ గంజియందు పనివాండ్రు ఇరువది మైళ్ళనుండివచ్చి,వారమునకు మూడు నాలుగు రోజులు మాత్రమే పనిచేయు చున్నారు మిగతకాలమున వ్యవసాయము చేసికొను చుందురు. ఇట్లు ఒకకాలు వ్యవసాయమునం దుంచుచు,వేఱొకకాలుగనులయందుపెట్టుటకు కారణ మేమి? గనులయం దాకర్షణీయమగు రాబడియు, సౌకర్యమును లేకపోవుటయే కారణము. గనులలో ఆకర్షణీయమగు విధానము ప్రవేశపెట్టబడి అచ్చటికి కార్మికు లాకర్షింపబడుచో వ్యవసాయముపై అధికజన మాధారపడుట గూడ తగ్గ గలదు. హజారాజిల్లాయందు గూడ పనివాండ్రు సాలుకు 7,8 మాసములే యుందురు. మిగతకాలమున వ్యవసాయమునకు పోవు చుందురు. 1920 సం.లో ఈగనులయందు సమ్మెగూడ కట్టబడినది. జీతములు సక్రమముగ లేకుండుటయే యీసమ్మెకు కారణము.

గనులలో పనినిబట్టి జట్టులవారీగ కూలి యొసగబడు చున్నది. ఒకతొట్టెడు బొగ్గున కొసగబడిన కూలి ఆజట్టునందుగలవా రందఱు పంచుకొన వలెను. రైళ్ళ కర్మాగారములలో గూడ జట్టులవారీ కూలి యొసగబడు చున్నది.

తోటల కూలీలు. అస్సాము తేయాకుతోటలయందు కూలీలస్థితి జెప్పనల విగాని కష్టములకు లోనై యున్నది. ఇచ్చటకు కూలీలను ఇతరరాష్ట్రములనుండివివిధ భావలుమాట్లాడువారిని గొనిపోవుచుందురు. ముఖ్యముగ ఆంధ్రదేశము సంయుక్తరాష్ట్రములు మధ్యరాష్ట్రములనుండి పోవుచున్నారు. వీరికి దిన.వార మాస భృతు లిచ్చుపద్ధతి లేదు. పనిననుసరించి సొమ్ము ముట్టజెప్పుచుందురు. ఈప్రదేశము కొండలప్రదేశమగుటవలనను,చిన్ననాటనుండిపెరిగినశీతోష్ణస్థితి మాఱుటవల్లను చలిజ్వరములు మొదలగుజ్వరములకు కూలీలందఱు లోనై జీవచ్ఛవములుగ నుందురు. ఆస్థితిలో నిండ్లకు తిరిగి రావలెనన్న వీలులేదు. వీరిని తీసికొనివెళ్లునపుడు అచ్చటిపరిస్థితులు విపులముగ చెప్పబడవు. పైగ విశేషధనార్జనకు వీలుండునని మాయమాటలు చెప్పి కంట్రాక్టులు వ్రాయించెదరు. ఈకంట్రాక్టులనుండి రావలెనన్న యజమానుల జోడుగుండ్లబారినుండి తప్పించుకొన గలుగు నంతటి దుర్భరమగును.

19వ. శతాబ్దమునందు చేయబడిన, కార్మికులను గొనిపోవునియమము లన్నియు, వీరియెడ చిత్తుకాగితములక్రింద నున్నవి. వీటిని అమలుజరుపు లేబరుబోర్డులు వేడుకసంఘములవలె నున్నవి. ఈతోటల తెల్లయజమానులచే శాసనములు పాటించునట్లు చేయుటలేదు.

బొంబాయియందు దూదిపరిశ్రమలో, బట్టలమిల్లుల యందు పనివాండ్రకు కాలమున కనుసరించియు పనినను సరించియు కూడ భృతి యొసంగబడుచున్నది. కాల

బట్టలమిల్లులకూలీలు

మునననుసరించి నూటికి 56 మంది వేతనములొసంగబడుచున్నవి. ఇందు 15 మొదలు 18 ఏండ్లవఱకుగల వయసుపిల్లు లున్నారు. స్త్రీకార్మికు లకు మాత్రము చేసినపని ననుసరించి భృతు లొసంగబడు చున్నవి. బొంబాయియందలికార్మికులు రత్నగిరి, పూనా, సతారా జిల్లాలనుం డియు సంయుక్తరాష్ట్రములనుండియు వచ్చుచున్నారు. నగరముల యందు జీవించుట నానాటికి కష్టముగ నున్నది. ఆహారపదార్థముల ఖరీదు హెచ్చుగనున్నది. ఆహారపదార్థములఖరీదు హెచ్చుతగ్గుల నను సరించి కార్మికులకు బోనసులిచ్చుట విధిగ చేయఁబడవలెను. మిల్లుల యజమానులు లాభముల ననుసరించి యిచ్చెదమందురు. లాభముల ననుసరించి కార్మికుల కనిష్ఠజీవితవిధానము కూడ మార్చుకొనవలెననుట సమంజసముగాదు. ఆహారపదార్థముల ఖరీదుల ననుసరించి ప్రతిసంవత్స రము బోనసు లిచ్చుచుండుటయే ధర్మము. బొంబాయియందు బోనసు లు అధికవేతనములు మొదలగు వివిధకార్మిక సమస్యలపై కార్మి కసమ్మెలు తీవ్రముగ జరుగుచున్నవి. ఈసమ్మెలయందు ప్రభుత్వము యజమానులపక్షము వహించి, కార్మికులపై దండయాత్ర బయలువె డలినది. పలుసార్లు కార్మికులపై తుపాకిగుండులు ప్రయోగింపబడినవి. అధికవే తనములు లభించుటకుమాఱుగ పలువురుకార్మికులు ప్రాణముల గోల్పోవలసివచ్చినది.

వంగదేశమునందు కలకత్తాయందు నారపరిశ్రమయందు కూలీలు బీహారుఒరిస్సాదేశములనుండియు, సంయుక్త రాష్ట్రములనుండియు, మదరాసురాజధానినుండియు, (ఉత్తరభాగములనుండియు) వచ్చుచున్నారు. వంగదే

నారపరిశ్రమ-కూలీలు

శీయులు స్వల్పముగ మాత్రమే యున్నారు. 1886 ప్రాంతమున 90 వంతులు వంగదేశీయులే యుండెడివారు. నేడు ఇంచుమించుగ నంద ఱితరప్రాంతములనుండి దిగుమతియగుచున్నారు. వస్త్రపరిశ్రమలోవ లెనే నారపరిశ్రమయందుగూడ సర్దారు లనబడు మధ్యవర్తులున్నారు. అందువల్ల ఆకూలీలకు వలెనే యీకూలీలకుగూడ తార్పుడుగాండ్ర వల్ల బాధ లమితముగ గలుగుచున్నవి. బొంబాయియందువలె కలక త్తాయందు కూలీలజనసంఖ్య పరిమితి దాటకున్నను కూలీలస్థితి అసహ జముగనే యున్నది. ఉండుటకు సరియయినవసతులు గాని పారిశుధ్య ముగాని వైద్యసాహాయ్యముగాని, ఆరోగ్యకరములగు నితరసదు పాయములుగాని లేవు.

చిన్న చిన్న సరిహద్దుల గుడిసెలయందు నివసించుచున్నారు. మిల్లుయజమానులు కట్టించినవాటిలో మఱుగు లేనందున నివసించుట లేదు. వీరికి దూదిపరిశ్రమలోవలె నెలజీతములు లేవు. ప్రతివారము కూలినిచ్చుచుందురు. ఈమిల్లులు వారమునకు 6 రోజులు నడుపబడు టకు మాఱుగ, నాలుగురోజులు మాత్రమే నడుపబడుచున్నవి. అందు వల్ల కార్మికులకు కనిష్టజీవితభృతిగూడ లభించుటలేదు. జీవించుటకని యొకరోజుకూలి మాత్రము అదనముగ నొసంగబడుచున్నది. దీనిపేరు (Khoraki) ఖోరకి. ఆఱురోజులు పనిచేయునప్పుడు మాత్రమె ఖోరకి యివ్వబడును. అందుచే కార్మికసమ్మెలు కలకత్తాయందుగూడ వచ్చినవి.

## 12. ప్రభుత్వశాసనములు.

భారతదేశమున బీదలసహాయశాసనమే లేదు. కఱవులు

క్షామనివారణనిధి. వచ్చుచో సహాయము చేయుటకని ప్రతిరాష్ట్రమునకు కొంతధనము ప్రత్యేకింప వలయునను నియమము

గలదు. ఇట్లు ప్రతిసంవత్సరము ప్రత్యేకింపవలెనను నియమము లేదు. ప్రతి సం. రమున ప్రత్యేకించు మొత్తమున కారింతలకన్న తక్కువలేని మొత్తము ప్రత్యేకింపబడియున్నపుడు,ప్రత్యేకించుటమాను టకు రాష్ట్రప్రభుత్వముల కధికారముగలదు. ఈప్రత్యేకించిన మొత్తములు సక్రమముగ బీదలసహాయమున కుపకరించియుండలేదు. ఎచ్చటనైన నేవేసవియందో బీదలయిండ్లు తగులబడుచో నెంగిలిమెతుకులు రాల్చినట్లుగ రాల్చుచుందురు. అవియు తగులబడి చాలకాలము గతించినగాని లభింపదు. మఱియు ప్రత్యేకింపబడిన మొత్తములు ప్రత్యక్షముగ క్షామనివారణకై వినియోగింపవలెనను నియమము లేదు. క్షామము రాకుండ నరికట్టుటకని వ్యవసాయాది కార్యములకై ఖర్చుపెట్ట బడుచున్నది. గ్రుడ్డి, కుంటి, ముసలి మొదలగు ననాథల కెట్టి సాహాయ్యమొనరింపబడుటలేదు. నిరుద్యోగుల కుపకారవేతనములు లేవు. కూలివానికి కూలిలేదు. ఎచ్చటచూచినను భిక్షాపాత్రము చేబూని సంచరించువారే గోచరించుచున్నారు. ప్రత్యక్షముగ కార్మికులకు సహాయ్యమొనరించు శాసనములు లేకపోవుటయే కాక, మిల్లులశాసనములు గనులశాసనములయందు గూడ కార్మికులకు వలయుసౌకర్యము లొనగూర్పలేదు.

## 13. మిల్లుల శాసనములు.

మిల్లుల శాసనములు-ప్రారంభదశ.

బొంబాయిలో బట్టల మిల్లులు బయలుదేఱుట ప్రారంభించినవి. ఇంగ్లండునందలి లాంక్‌షైరు బట్టలమిల్లులలో నలజడి పుట్టినది. సీమప్రభుత్వ మనగా నెవరు? మాంచెష్టరు లాంక్‌షైరు వర్తకులే గదా! ఇండియాలో మిల్లు లభివృద్ధి యగుచో లాంక్‌షైరుబట్టల దిగుమతి తగ్గును. అట్లు తగ్గకుండ చేయుటకు సాధనము లరయుట

విధియని లాంక్ షైరు వర్తకులు తలపోసిరి. ఆందోళన ప్రారంభించిరి. ఏదోయొక నెపమున బొంబాయి మిల్లుల యభివృద్ధి నరికట్టుటయే వారికర్తవ్యము. అందుచే కార్మిక సమస్యపై నవతితల్లిప్రేమ చిలుకరింప సాగించిరి. తక్కువపని యెక్కువ జీతములు, అను నెపమున బొంబాయి కార్మికులచే తక్కువపని చేయుటకు నెక్కువ జీతముల నిప్పించుటకు ప్రభుత్వ శాసనము గావించుచో, బొంబాయిమిల్లు లెక్కువ బట్టలను తయారు చేయజాలవనియు, నందువలన దమ యెగుమతి తగ్గదనియు పన్నాగము బన్నిరి. మిల్లుపరిశ్రమ మొలకెత్తుటలోనే త్రుంచి వేయ బూనిరి. 1870 సం॥ర ప్రాంతమున పార్లమెంటులోను, బ్రిటిషు పత్రికలలోను, నీ అలజడియే మిన్నుముట్టినది. అంతటితో బ్రిటిషువర్తకుల తాబేదారులగు ఇండియాప్రభుత్వము, 1875 సం॥న బొంబాయిలేబరు కమీషనును నియమించినది. ఈకమిషనునకు జ్యూట్ మిల్లులుమినహా యితరమిల్లులన్నిటివిషయమై విచారించుట కధికార మొసంగబడినది. జ్యూట్ మిల్లులు ఆంగ్లేయుల యాజమాన్యమునందుండుటచే వానిజోలికి పోలేదు. ఇతరమిల్లులనగా, లాంక్ షైరునకు పోటీకివచ్చు బట్టలమిల్లులేకాని యితరములు పేర్కొనదగినవిలేవు. అందుచే నీకమీషనును సంకుచితబుద్ధితో నియమింప లేదనుట సాహసము. ఈకమీషనువారు విచారించి మిల్లులుదయాస్తమయములు పనిచేయుచున్నవనియు, ప్రతివారము సెలవు దినము నిర్ణీతముగ లేదనియు, 6, 7 సం॥ల పిల్లలుకూడ పనిచేయుచున్నారనియు వ్రాసిరి. అట్లు పనిచేయుచున్నను మధ్యమధ్య విశ్రాంతి యుండుటచే బాధకరముగ లేదనికూడ వ్రాసిరి. వీరివిచారణ ననుసరించి మిల్లులయందు బనిచేయుటకు కనిష్ఠవయోనిర్ణయ ముండవలెననియు, గం॥ 10 టల కాలముకంటె నెక్కువకాలము పనిచేయరాదనియు, పిల్లలు పనిచేయుకాల మింకను దక్కువగ నుండవలెననియు

వారమునం దొకరోజు సెలవురోజుగ నిశ్చయింప బడవలెననియు సూచించిరి. ఈ సూచనలు 1881 వ సంవత్సరము వఱకు శాసనము గావింపబడలేదు. 1881 లో (ఇండియన్ ఫ్యాక్టరీ అక్టు) మిల్లులచట్టము గావింపబడినది. ఈచట్టము ననుసరించి సం॥ 7ల వయస్సునకు తక్కువయీడుగలపిల్లలు మిల్లులలో పనిచేయరాదు. 7-12. సం॥ల మధ్యవయస్సుగలపిల్లలు 9 గంటలకాలముమాత్రమే పనిచేయవలెను. మధ్యాహ్నమందు కొంత విశ్రాంతియు, నెలకు నాలుగురోజులు సెలవులు నేర్పాటు గావింప బడినవి. ఇవి యన్నియు పిల్లలకు మాత్రమే., పెద్దవారికి సంబంధించిన నియమములు లేవు. పిల్లలకు సంబంధించి గావించిన పైనియమములగూడ, జనదాటుట సునాయాసముగనుండెను. పిల్లలవయస్సును నిర్ణయించు టెట్లు? కాని యీచట్టము ననుసరించి లాంక్ షైరు వర్తకులకు లాభముకలుగునంత టిప్రమాదము హిందూదేశపు మిల్లులకు సంభవింపలేదు. ఇక లాంక్ షైరువర్తకులకు నిద్రపట్టుటెట్లు? 1882, 84 సం.లలో మఱల విచారణ లుజరిగినవి. 1890 సం.మున ప్రభుత్వము వేఱొక కమీషను వారిని నియమించెను. ఈకమీషను సూచనల ననుసరించి 1891 లో మఱొక చట్టము.గావించబడినది. ఈచట్టము 50 మంది కూలీలకు తక్కువలేని ఫ్యాక్టరీల కన్నింటికి వర్తింపజేసిరి. (గ్రిన్నింగ్ మిల్లులు తప్ప) రాష్ట్ర ప్రభుత్వము లీచట్టముక్రింద 20 మందికి తక్కువకాని కూలీలుగల మిల్లులకుగూడ నీ చట్టనియమములను వర్తింపజేయవచ్చును. ఈచట్టముననుసరించి, కనిష్టపు వయస్సు 9 సం.ల క్రిందను,9,14 సం.ల మధ్య వయసుగల పిల్లలచే రాత్రులుపనిచేయింపరాదనియు, 7 గంటలకంటె పగలుపనిచేయింపరాదనియు, 6 గంటలు పనిచేయించినపిమ్మట నొక అరగంటసేపు విశ్రాంతి యొసంగవలెననియు నియమములు గలవు. పిల్లలు 9 సం. లపై బడ్డవారని డాక్టర్ల వల్ల సర్టిఫికెట్ పొందవలె

ననియునియమముగూడ గలదు. రాత్రులు స్త్రీలుకూడ పనిచేయరాదు. పనిచేయు కాలము 11 గంటలకంటె నెక్కువగ నుండరాదు. విశ్రాంతి కాలముతోగలిసి 12న్నర గంటలు. ఈచట్టముకూడ లోపభూయిష్టమే. అప్పుడప్పుడు పనిచేయు ఫ్యాక్టరీ లిందులో చేర్పబడనందున స్త్రీలు రాత్రింబవళ్లు పనిచేయుచునె యుండిరి. మధ్యాహ్నమొక యరగంట కాలము పురుషులకుగూడ విశ్రాంతి యొసంగవలెనను నిబంధనకలదు. ఈస్వల్పనిబంధనలైన నమలులోనికి రాలేదు. వచ్చినంతవరకు బట్టల మిల్లులకు హానికరముగ వర్తించినవి. చాలమంది స్త్రీకూలీలు తొలగింపబడిరి. ఈనష్టము గూడ తీసికొనుటకు మిగిలినవారికూలి తగ్గింప బడినది. ఈచట్టమువల్ల మిల్లు యజమానులకును కూలీలకును గూడ నష్టమే కలిగినది. అయినను లాంక్ షైరు వర్తకులకు తృప్తి కలుగలేదు. ప్రతి సంవత్సరము వారియాందోళన మమితమగుచు వచ్చినది. ఇండియాయందు మిల్లు లభివృద్ధియైనకొలదియు మిల్లులలో విస్తారము బట్టయుత్పత్తి యైనకొలదియు లాంక్ షైరువారి యాందోళనము పెరుగుచు వచ్చినది. ఎట్లయినను కార్మికసమస్య పేరున హిందూదేశపు మిల్లులను బడగొట్టవలె నను పన్నాగము విరమింపరైరి. 1906 సం॥ న (Textile Factory Labour Committee) టెక్స్టైలు ఫ్యాక్టరీస్ లేబరు కమిటీని ప్రభుత్వము నియమించినది. దాని సూచనల ననుసరించి 1908 సం. న మఱియొక కమిషను నియమింప బడినది. హిందూదేశ మందలి యన్ని విధముల మిల్లుల పరిస్థితుల విచారించుటకీకమిటీవారి కధికార మొసంగ బడినది. ఈకమిటీ, కమీషనుల రెండిటి సూచనల ననుసరించియు లోగడ గావించిన చట్టములు సరిగ నమలునం దుంచ లేదని తేలినది. ఈశాసనములు విరళముగ లేవు. ఇందులకు దోడుగ రాష్ట్ర ప్రభుత్వములు తలకొక దారిని బట్టినవి. 1911లో గావించిన శాసనము ననుసరించి

వెనుకటి శాసనముల నమలులోబెట్టుటకు సిబ్బందిని వేసిరి. అయినను స్త్రీలును, బాలురును పనిచేయుట విరమింప బడలేదు. వారియారోగ్య స్థితియు జక్కబడలేదు. జైళ్ళలోనన్న ఖైదీలకన్నను, మిల్లులలో నుండు పనివాండ్రు సగటున 7,8 పౌనులు తక్కువగనే తూగుచుండిరి. ఇందులకు 1906 సం. రపు కమిటీవారు వ్రాసినట్లుగ కూలీల యనారోగ్య పరిసరములు అల్పజీతములే కారణములు. 1908 సం. కమిషను రిపోర్టులో డాక్టరు నాయరుగారధిక సంఖ్యాకులతో నంగీకరింపలేదు. స్త్రీపురుషు లిరువురకు బనిచేయుకాలము నిర్ణయింపబడవలె ననిరి. కాని స్త్రీల బూర్తిగ నిషేధింప పాడికాదనిరి.

1911వ సంవత్సర శాసనము

ఈనివేదిక ఫలితమే 1911 వ సంవత్సరమునందు గావింపబడిన శాసనము. ఈశాసనము ననుసరించి స్త్రీగాని పురుషుడుగాని 12 గంటలకుమించి పనిచేయరాదు. పిల్లలు6 గంటలుమాత్రమే పనిచేయవలయును. కార్మికుల సౌభాగ్యము నణసి యిట్లు నిషేధశాసన మొనరింపలేదు. ఆకాలమునం దింగ్లండుదేశమునందిట్టి నిషేధములేదు. అంతియే గాక 5 న్నర మొదలు 7 గంటలలోపుగ విద్యుద్దీపములు బట్టల మిల్లులలో వెలిగింపరాదని నిషేధించిరి. ఈనిషేధముల ప్రయోగించుటయే ప్రభుత్వము తాను నిర్వహింపవలసినబాధ్యతను గమనించుట గాని, కార్మికుల పిల్లలకు విద్యాదిసౌకర్యముల నేర్పఱచుటకాని చేయలేదు. 1914, 1919 సం॥ ల మధ్య యుద్ధకాలమునం దీశాసననియమములు గూడ తొలగింప బడినవి. ఊలుమిల్లులు రాత్రింబవళ్ళు పనిచేసినవి. పిమ్మట 1921 వ సం॥ రము వఱ కెట్టిశాసనముగాని లేదు.

1922 లో మరల శాసనమొకటి గావింపబడినది. నానా రాజ్య సమితి యొక్క కార్మిక శాఖ నిబంధనల ననుసరించి యీచట్టము గావింప ప్రయత్నింపబడినది. నానారాజ్యసమితి కార్మిక శాఖ కార్మికులకు 8 గంటల కాలము నిర్ణయించినది. కాని ప్రాచ్యదేశములకై ప్రత్యేకనియమము లొనరించెను. 1922 సం॥ పు శాసనము ననుసరించి బాలురవయస్సు 12 సం॥ లుండవలెనని నియమింపబడెను. 12 మొదలు 15 సం॥ ల లోపుపిల్లలు 6 గంటల సేపు పనిచేయవలెను. అంతకుమించి పనిచేయరాదు. పెద్దవారికి 11 గంటల కాలపరిమితి నిర్ణయింపబడెను. వారమునకు 60 గంటలపని కన్న హెచ్చుండరాదు. 6 గంటల విశ్రాంతియు నొకరోజు సెలవుదినమును గలవు.

1922వ సంవత్సర శాసనము

1922 వ సంవత్సరమునాటి మిల్లుల శాసనము 1923-1926 వ సంవత్సరములయందు మరల సంస్కరింప బడెను. సం. 1923 సం.రపు సంస్కరణ సెలవురోజునకు సంబంధించియున్నది. సం. 1926 సంస్కరణగూడ పరిపాలనా విధానమునకు సంబంధించినమార్పులను గావించెను. ఈశాసనముననుసరించి ఒకేనాడు బాలబాలికలను రెండుమూడు ఫ్యాక్టరీలలో పనిచేయించినయెడల తల్లిదండ్రులు దండింపబడుదురు.

సం. 1922 డవ శాసన సవరణ.

"1925-26 సంవత్సరమున పురుషులలో 100 కి 59 మందియు, స్త్రీలలో 100 కి 54 మందియు వారమునకు గం 54 లు పనిచేసిరి

100 కి 12 మంది 48 మొదలు 54 గంటలవఱకును వారమునకు పని చేసిరి. 100 కి 29 మంది పురుషులును 39 మంది స్త్రీలును గం. 48 ల కాలము పనిచేసిరి. 1922-23 లో పురుషులు 10 న్నర గంటలును స్త్రీలు గం. 9 ని 36 లును సగటున పనిజేసిరి.[1]"

ప్రభుత్వముగావించిన శాసనముల సంఖ్య ననుసరించి కార్మిక సంరక్షణము జరుగనేఱదు. సక్రమముగ గావింపబడి జాగరూకతతో నమలుజరుపబడినశాసనములు కొన్ని యైనను ఫలప్రదమే. మనదేశమునందెన్ని శాసనములగావించిన నేమి? ఫ్యాక్టరీలు, ఫ్యాక్టరీల స్థితి, కార్మికులస్థితి రవంతయు చక్కబడలేదు. "సగముమిల్లులు సాలుమొత్తమున నొక్కపర్యాయమును, మూడవవంతులమిల్లులొక పర్యాయమునకంటె హెచ్చుగను బరీక్షింపబడుచున్నవి. వెయ్యిమిల్లులు సాలుపొడుగున నొకపర్యాయము గూడ పరీక్షింపబడుటలేదు." అని లేడీ చటర్జీగారు 1925 సంవత్సరమునుగుఱించి వ్రాసిరి.

1933 సం॥ మిల్లుల శాసనము, సవరణ చట్టము.

1933 సంవత్సరము సెప్టెంబరు 16 వ తేదీని భారత శాసనసభయందు నూతన ఆవేశనశాసనము ప్రవేశపెట్టెను. ఈశాసనము ననుసరించి కార్మికులకు కొంత ఉపకారముకలుగును. ఈశాసనమువలన యజమానులు కార్మికులు

1. పనిచేయుకాలపరిమితిని ప్రకటింపవలయును.

2. పనిచేయుచున్న కార్మికుల హాజరుపట్టీని పెట్టవలయును.

1. *See Vera Anstey.*

3. సెలవులను గురించియు, పనిమార్పులను గురించియు, విశ్రాంతినిగురించియు ప్రకటించుచుండవలయును.

ఈనియమములవలన పనిచేయు కాలపరిమితి నిర్ణయింపబడుటయు, ఆనిర్ణయమును కార్మికులెఱుంగగలుగుటయు జరుగును.

ఈ శాసనమునందు పిల్లల వయసు నిర్వచింపబడలేదు. కాని కొంత పొడుగుగలవారిని మాత్రమే పనియందుంచవలెనను నియమముగలదు. పనిచేయుటకు శారీరకశక్తి పరీక్షింపదగు ననః నియమము గలదు. 15, 16 సంవత్సరముల మధ్యవయసువారిని పెద్ద పనివాండ్రుగ పనిచేయించుటకు, పనిచేయుట కర్హతగలదను ధృవపత్రమును పొందవలయును. పిల్లలను, స్త్రీలను రాత్రులయందు పనిచేయించుటకు సావకాశములు తొలగింపబడినవి. ఈ శాసనముననుసరించి యజమానులు, కార్మికులకు తగిన నీటిసదుపాయ మొనరింపవలెను. 250 మందికంటె హెచ్చుకూలీలు గలఫ్యాక్టరీలు విశ్రాంతిమందిరముల నెలకొల్పవలయునః.

సంతానవతులగు స్త్రీల ఉపయోగముకొఱకు కొన్నిగదులు ప్రత్యేకింపవలయును. ప్రాథమికచికిత్సకు వలయు సదుపాయము లొనగూర్పవలయును.

ఈ సవరణశాసనము సక్రమముగ నమలునందుంచ బడుచో, కార్మికులకు కొన్ని సదుపాయములు లభింపగలవు.

1929 సం॥ నందుగల ఆయా ప్యాక్టరీల సంఖ్య, అందు పనిచేయు కూలీల సంఖ్య యీా పట్టిక తెలుపును.

| పరిశ్రమ | ప్యాక్టరీల సంఖ్య | | | కూలీల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|
| | ఇండియా | బర్మా | మొత్తం | ఇండియా | బర్మా | మొత్తం |
| (1) అప్పుడప్పుడు కాలానుగుణ్యముగ పని చేయు మిల్లులు | | | | | | |
| ప త్తిపట్టుట, ఏకుట | 2149 | 27 | 2176 | 136666 | 3821 | 139987 |
| తేయాకు ప్యాక్టరీలు | 934 | ... | 934 | 68064 | ... | 68064 |
| నార మిల్లులు | 115 | ... | 115 | 37300 | ... | 37300 |
| ఇతరములు | 280 | 7 | 287 | 11368 | 276 | 11644 |
| (1) మొత్తము | 3478 | 34 | 3512 | 248398 | 3597 | 251995 |
| (2) అప్పుడప్పుడుమాత్రమే పనిమాను మిల్లులు | | | | | | |
| ధాన్యపు మరలు | 998 | 608 | 1606 | 36529 | 39685 | 76214 |
| నూనె మిల్లులు | 219 | 25 | 244 | 10258 | 1237 | 11495 |
| బెల్లం, పంచదార మిల్లులు | 44 | 1 | 45 | 14726 | 350 | 15076 |

| పరిశ్రమ | ఫ్యాక్టరీల సంఖ్య | | | కూలీల సంఖ్య | | |
|---|---|---|---|---|---|---|
| | ఇండియా | బర్మా | మొత్తం | ఇండియా | బర్మా | మొత్తం |
| పొగాకు మిల్లులు | 16 | ... | 16 | 9922 | ... | 9922 |
| ఇతరములు | 238 | 17 | 255 | 21738 | 926 | 22664 |
| (2) మొత్తం | 1515 | 651 | 2166 | 93173 | 42198 | 135371 |
| 1, 2, ల మొత్తం | 4993 | 685 | 5678 | 341571 | 45795 | 387366 |
| (3) సాలుసరి పనిచేయు మిల్లులు | | | | | | |
| బట్టల మిల్లులు | 455 | 3 | 458 | 695745 | 667 | 696412 |
| ఇంజనీరింగు ఖనిజముల మిల్లులు | 806 | 65 | 871 | 295068 | 19597 | 314665 |
| ఇతరములు | 899 | 228 | 1122 | 122708 | 32018 | 154726 |
| (3) మొత్తం | 2160 | 291 | 2451 | 1113521 | 52282 | 1165803 |
| 1, 2, 3, ల అన్నిటి మొత్తం | 7153 | 976 | 8129 | 1455092 | 98077 | 1553169 |

*From "Royal Commission on Labour in India" page 75.*

| రాష్ట్రము | | పనిచేసిన ఫ్యాక్టరీల సంఖ్య | ప్రతిదినము పనిలో నుండువారి సంఖ్య (దామాషాను) | | | | రిపోర్టు చేయబడిన అపాయముల సంఖ్య | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | పురుషులు | స్త్రీలు | పిల్లలు 1 | మొత్తము | చచ్చిపోయిన వారు | ప్రమాదకరమైనవి | స్వల్పమైనవి | మొత్తం |
| ఆయా సంవత్సరములలో మొత్తములు 2 | 1929 సం॥ | 8129 | 1249165 | 257161 | 46843 | 1553169 | 240 | 4889 | 15579 | 20208 |
| | 1928 సం॥ | 7863 | 1216471 | 252933 | 50911 | 1520315 | 264 | 3494 | 12590 | 16348 |
| | 1927 సం॥ | 7515 | 1222662 | 253158 | 57562 | 1533382 | 242 | 3403 | 12066 | 15711 |
| | 1926 సం॥ | 7251 | 1208628 | 249669 | 60094 | 1518391 | 270 | 3155 | 11441 | 14866 |
| | 1925 సం॥ | 6926 | 1180919 | 247514 | 68725 | 1497158 | 263 | 2481 | 9901 | 12645 |
| | 1924 సం॥ | 6406 | 1147729 | 235332 | 72531 | 1455592 | 284 | 1690 | 8055 | 10029 |
| | 1923 సం॥ | 5973 | 1113508 | 221045 | 74620 | 1409173 | 197 | 1333 | 5507 | 7037 |
| | 1922 సం॥ | 5026 | 1086457 | 206887 | 67658 | 1361002 | 191 | 1207 | 5562 | 6960 |
| | 1921 సం॥ | 3965 | 1010686 | 187596 | 68113 | 1266395 | 208 | 1179 | 5634 | 7016 |

1. పిల్లలనగా (1911 సంవత్సరపు 12 చట్టము) హిందూదేశ ఫ్యాక్టరీ చట్టప్రకారము 12 సంవత్సరములకు పైన 15 సంవత్సరములకు లోపువారు.

2. 1924 సంవత్సరమునకు పూర్వపు అంకెలలో బెంగుళూరు, కూర్గుల అంకెలు కలుపబడలేదు.

*From Statistical Abstract for British India 1930—31.*

1929 సం. లో ఆయారాష్ట్రములయందు గనుల శాసనముల ననుసరించిన గనులసంఖ్యయు ఆగనులలో పనిచేయుచున్న కూలీల రోజు 1కి సగటు సంఖ్యయు నీ పట్టిక తెలుపగలదు.

| రాష్ట్రములు | రాక్షసిబొగ్గు | | | మగ్నము | | | మైక (అభ్రకం) | | | ఇతర గనులు | | | అన్నిరకముల గనులు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | గనులు | కూలీల సంఖ్య | | గనులు | కూలీల సంఖ్య | | గనులు | కూలీల సంఖ్య | | గనులు | కూలీల సంఖ్య | | గనులు | కూలీల సంఖ్య | |
| | | భూగర్భమున | మొత్తం | | భూగర్భమున | మొత్తం | | భూగర్భమున | మొత్తం | | భూగర్భమున | మొత్తం | | భూగర్భమున | మొత్తం |
| మదరాసు | ... | ... | ... | 8 | ... | 1516 | 77 | 1868 | 4176 | 19 | 113 | 1786 | 104 | 1981 | 7478 |
| బొంబాయి | ... | ... | ... | 11 | 35 | 3680 | ... | ... | ... | 27 | ... | 5068 | 38 | 35 | 8748 |
| వంగదేశము | 208 | 29497 | 44803 | ... | ... | ... | ... | ... | ... | 8 | ... | 874 | 216 | 29497 | 45177 |
| సంయుక్త రాష్ట్రములు | ... | ... | .. | ... | ... | ... | ... | ... | ... | 51 | 301 | 5330 | 51 | 301 | 5330 |
| పంజాబు | 16 | 389 | 743 | ... | ... | ... | ... | ... | ... | 29 | 1132 | 4875 | 45 | 1521 | 5618 |
| బీహారు, ఒరిస్సా | 273 | 59321 | 108616 | 12 | 260 | 1673 | 397 | 8002 | 12044 | 124 | 291 | 16523 | 806 | 67874 | 138856 |
| మధ్యరాష్ట్రములు | 29 | 5376 | 7656 | 94 | 916 | 20374 | ... | ... | ... | 39 | 88 | 5995 | 162 | 6830 | 84025 |

| రాష్ట్రములు | రాక్షసి బొగ్గు | | | మగ్నము | | | మైక (అభ్రకం) | | | ఇతర గనులు | | | అన్ని రకముల గనులు | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | గనులు | కూలీల సంఖ్య | | గనులు | కూలీల సంఖ్య | | గనులు | కూలీల సంఖ్య | | గనులు | కూలీల సంఖ్య | | గనులు | కూలీల సంఖ్య | |
| | | భూగర్భమున | మొత్తం | | భూగర్భమున | మొత్తం | | భూగర్భమున | మొత్తం | | భూగర్భమున | మొత్తం | | భూగర్భమున | మొత్తం |
| అస్సాము | 9 | 2159 | 4128 | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 9 | 2159 | 4128 |
| ఇతరప్రదేశములు | 13 | 160 | 212 | ... | ... | ... | 24 | 129 | 335 | 35 | 124 | 365 | 72 | 413 | 912 |
| బర్మా కాక బ్రిటిషు ఇండియా | 548 | 96902 | 165658 | 125 | 1211 | 27243 | 498 | 9999 | 16555 | 332 | 1999 | 40816 | 1503 | 110111 | 250272 |
| బర్మా | ... | ... | ... | ... | ... | ... | ... | ... | ... | 229 | 6834 | 19429 | 229 | 6834 | 19429 |
| బ్రిటిషు ఇండియా మొత్తం | 548 | 96902 | 165658 | 125 | 1211 | 27243 | 498 | 9999 | 16555 | 561 | 8833 | 60245 | 1732 | 116945 | 269701 |

*From "Royal Commission on Labour in India page 136.*

ఈపట్టిక, గనులయందు పనిచేయు స్త్రీ పురుష కార్మికుల సంఖ్యను దెల్పును.

| కూలీల రకము | ఆడువాండ్రు 1928 | ఆడువాండ్రు 1929 | మగవాండ్రు 1928 | మగవాండ్రు 1929 |
|---|---|---|---|---|
| భూగర్భమున | 28408 | 21880 | 64727 | 75022 |
| (Open workings) | 8019 | 7945 | 9448 | 10793 |
| పైభాగమున | 13445 | 12652 | 36097 | 37366 |
| మొత్తం | 49872 | 42477 | 114267 | 123181 |

# 15. రైల్వే కార్మికులు.

హిందూదేశమునందు గల రైళ్ళలో 800,000 కార్మికులు (జీతగాండ్రు) గలరు. రైళ్ళ కార్మికుల జీవనవృత్తముల ననుసరించి కార్మికోద్యోగములయందు నేడు పరివర్తనము గలుగుచున్నది. రైళ్ళ ఉద్యోగములయందు జాతిద్వేష మమితముగ నున్నదనియు, పెద్ద

1 *From Royal Commission on Labour in India page 127.*

యుద్యోగములన్నియు ఆంగ్లేయులకు, ఆంగ్లోఇండియనులకు నీయబడు చున్న వనియు, లేబరుకమీషనువారు వ్రాసిరి. ఈ పక్షపాతబుద్ధిని ఉద్యోగములిచ్చుటయందు గాని, పెద్దయుద్యోగములకు ప్రమోషను చేయుటయందు గాని గమనింపరా దని కమీషనువారు ప్రభుత్వము వారిని మందలించిరి.

ఈపట్టిక మొదటితరగతి 12 రైలుమార్గములలోను పెద్ద యుద్యోగస్థుల సంఖ్యను జాతిని తెలుపుచున్నది.

| కార్మికుల తరగతులు | ఆంగ్లేయులు | ఆంగ్లో యిండియనులు | హిందువులు మహమ్మదీయులు ఇతరులు | ఉద్యోగుల మొత్తము |
|---|---|---|---|---|
| గజిటెడ్ ఆఫీసర్లు | 1394 | 160 | 519 | 2073 |
| నెల1కి రూ. 250 లేక అంతకుపైగ జీతముపుచ్చుకొను ఉద్యోగులు | 2045 | 3777 | 2935 | 8757 |
| నెల1కి రూ. 250 లకు తక్కువజీతము పుచ్చుకొను ఉద్యోగులు | 1397 | 10064 | 736465 | 747926 |
| మొత్తము | 4836 | 14001 | 739919 | 758756 |

1. *From The Royal Commission on Labour in India page 142.*

1930 మార్చి 31 తేదీవఱకు రైల్వేయందుగల కార్మికులసంఖ్యలో ప్రావిడెంటు ఫండునకు హక్కుగలవారి సంఖ్య నీపట్టిక తెలుపుచున్నది.

| రైల్వే | భారతవర్షమందలి రైల్వేకార్మికులు | | | ప్రావిడెంటు ఫండు | | |
|---|---|---|---|---|---|---|
| | నెలకి రూ. 20 లు జీతమునకు లోబడినవారు | రూ. 20 లు కెక పైమొత్తము జీతముగలవారు | మొత్తం | నెలకి రూ. 20 లు జీతమునకు లోబడినవారు | రూ. 20 లు కెక పైమొత్తము జీతముగలవారు | మొత్తము |
| ప్రభుత్వమువారివి | 240011 | 225445 | 465456 | 2109 | 138593 | 140702 |
| ఇతరములు | 207054 | 146548 | 353602 | 9308 | 105197 | 114505 |
| మొత్తము | 447065 | 371993 | 819058 | 11417 | 243790 | 255207 |
| మొదటితరగతి 12 రైలు మార్గములు | 408113 | 350796 | 758909 | 10797 | 230149 | 240946 |
| ఇతరములు | 38952 | 21197 | 60149 | 620 | 13641 | 14261 |

*From "The Royal Commission on Lobour in India" Page 152.*

నె 1 కి 5 లు జీతములకు తక్కువజీతము పుచ్చుకొనువారికి ఏవిధమగు ప్రోవిడెంటుఫండును లేదు. ఇట్లే ఉద్యోగములను తీసివేయుటను గుఱించియు ఉద్యోగ నియమములను గుఱించియు రైళ్ల యందలి కార్మికులకు వివిధ కష్టములు గలవు. రైళ్లకార్మికులలో ట్రేడ్యునియనులు గలవు. కార్మికులందఱిలోను రైళ్లకార్మికులే విజయవంతముగ సమ్మె (Strike) గట్టుచు తమయభీష్టములను గొంత వఱకు నెఱవేర్చుకొనుచున్నారు.

## 16. ఓడ కూలీలు.

ఓడరేవులయందు 1926-27, 1928-29 సం. మధ్య కలకత్తా యందు ఈమూడు సం. లలోను సాలుసరి 58,300 మందియు, కలకత్తా యందు 34,600 మందియు కూలీలుగలరు.

ఓడలకు కార్మికులను సాంపాదించు పద్ధతిని గుఱించి భారత శాసన సభయందు 1921 సం.న చర్చింపబడినది. ఈచర్చకు ఫలితముగ 1922 వ సం.న ఓడకూలీల నిర్ణయసంఘమును (Seamen's Recruitment Committee) ప్రభుత్వమువారు నియమించిరి. ఈసంఘమువారు అను భవముగల నావికోద్యోగులై కూలీలను నియమించుసంఘముగ నుండ వలెనని సూచించిరి. బ్రోకర్లు కార్మికులను కుదుర్చుపద్ధతి దోషభూయిష్టముగ నున్నదనిరి. లంచగొండితనము ప్రబలుచున్నదనిరి. సం. 1924లో హిందూదేశప్రభుత్వమువారొక ప్రత్యేకోద్యోగిని (Shipping Master) మాత్రమే నియమించిరి. ఇతరసూచనల నామోదింపలేదు. 1929 వ సం॥న పై సంఘమువారి సూచనలపై ప్రభుత్వమువారు తమనిర్ణయమును ప్రకటించిరి. ఈనిర్ణయప్రకారము ఓడలయధికారులే సరంగులద్వార కార్మికుల నిర్ణయించుకొనవలెను. ప్రభుత్వము

వారి ప్రత్యేకోద్యోగికూడ సలహా నొసంగవచ్చును. యుద్ధానంతరము నుండియు ఓడలయందు పనిచేయు కార్మికులయందు నిరుద్యోగ సమస్య ప్రబలినది. దేశాంతర్గత ఆనయమునకు అస్సాము బెంగాలు రాష్ట్రములలో సుమారు 16000 మందికిపైగ కార్మికులు గలరు. ఐరావతినదియందు తిరుగు స్టీమర్లలో 8000 మంది పనివాండ్రు గలరు. గంగా, సింధు, బ్రహ్మపుత్ర, ఐరావతి మొదలగునదీప్రవాహములయందు ప్రయాణముజేయు స్టీమర్లకు దేశాంతర్గత నౌకాయానశాసనము (Indian Vessels Act) ననుసరించి కార్మికులను నియమింపవలెను.

## 17. ట్రాములు—మోటారుబస్సులు.

ట్రాములు కలకత్తా, బొంబాయి, మద్రాసు, రంగూను, కాన్పూరు, డిల్లీ, కరాచీ మొదలగు నగరములయందు మాత్రమే నడుచుచున్నవి. హిందూదేశమున 200,000 పైజనసంఖ్యగల నగరములు తక్కువగ నున్నవి.

ట్రాములు నడుపవలసిన పట్టణములు కొలదిగ నుండుటవలన ట్రాములయందు కూలీలసంఖ్య పెరుగుటకు వీలులేదు. కలకత్తాయందు 6000 మందియు, బొంబాయియందు 4500 మందియు పనిచేయుచున్నారు. మోటారుబస్సులు విరివిగ పెరుగుచున్నవి. అంతకంతకు పెరుగుట కవకాశము గలదు.

## 18. ప్రభుత్వపు కట్టడములు.

ప్రభుత్వకట్టడములలో కూలీలు పనిచేయుదురు. క్రొత్తడిల్లీ పట్టణము కట్టుటకు రోజు 1కి 4000 కూలీలు మొదలు 20000 వేల

వఱకు పనిచేసిరి. ఈకూలీలసంఖ్యలో స్త్రీలు, చంటిపిల్లలు గలరు. ఇక్లండు ప్రభుత్వమువారి కట్టడములశాఖ (Public Works Department) చేయించురోడ్ల మరమ్మతులు ప్రభుత్వకార్యాలయముల కట్టించుట మొదలగు పనులలో స్త్రీలు చంటిపిల్లలుగూడ పనిచేయుచున్నారు. ఈ పనులన్నియు కంట్రాక్టర్ల ద్వారా చేయించుచున్నారు. అందుచే కార్మికులకు ప్రభుత్వమునకు మధ్య కంట్రాక్టర్లు లాభము పొందుచున్నారు. కంట్రాక్టర్లను తొలగించి ప్రభుత్వమే స్వంతబాధ్యతపై చేయించుచో ప్రభుత్వమునకును కార్మికులకును కూడ లాభదాయకము. "మధ్యరాష్ట్రములలో ప్రభుత్వము బిలాసపూరుజిల్లాయందు త్రవ్వించిన కాలువలకు ప్రభుత్వశాఖయే కూలీలను నియమించి స్వయముగ పనిచేయించెను. అందువలన స్వల్పవ్యయమున స్వల్పకాలములో పని ముగిసినది. పనివాండ్రకు హెచ్చుజీతములుకూడ ముట్టిన వని మధ్యరాష్ట్రముల ప్రభుత్వపు కట్టడములశాఖవారు తెలిపిరి"[1]

ప్రభుత్వమే స్వయముగ కార్మికుల నియమించి నడుపుటవల్ల కొన్నికష్టము లున్నవి. అయినను ప్రభుత్వమే స్వయముగ పనిచేయించుట సమంజస మని కార్మిక [illegible] కూడ వ్రాసిరి.[2]

## 19. కార్మికుల అపాయ శాసనము.

### WORKMEN'S COMPENSATION ACT.

1884 సం. ర ప్రాంతమున లార్డు కాండేగారు కార్మికులకు పని చేయుటలో సంభవించిన అపాయములకు తగుమొదరా యజమాను

1. *Labour Commission's Report.*
2. *Labour Commission's Report*

లోసంగుచుండునట్లు శాసనము గావింపవలెనని యాందోళన గావించిరి. 1923 సం. వఱ కామాట వినువారే లేరు. 1923 వ సంవత్సరమున కార్మికుల అపాయశాసనము గావింప బడెను. 1924 జూలై నుండియు అమలులోనికి వచ్చెను. ఈశాసనము ననుసరించి పనిచేయు కాలము లలో ప్రమాదవశమున అపాయము లేవైన సంభవించుచో కార్మికు లకు యజమానులకు ముదరా ఒసంగుట విధి. మఱియు పరిశ్రమలకు సంబంధించిన యితరజబ్బులు వచ్చినగూడ ముదరా యీయవలసిన ట్లున్నది. ఈచట్టము ఫ్యాక్టరీలలోను, గనులలోను, ఓడలలోను, ఓడ రేవులలోను, గృహనిర్మాణములలోను బనిజేయువారు, టెలిగ్రాము టెలిఫోను మార్గములను వేయువారు, భూగర్భమున పనిచేయువారు, నిప్పుతోసంబంధించిన పనిచేయువారు, రైల్వేకూలీలు మొదలగు పది రకముల కూలీలకు వర్తించును. అధికసంఖ్యాకులుగ నుండు వ్యవసా యపు కూలీలకు ఇండ్లలో పనిచేయు నౌకర్లకు నీచట్టము వర్తింపదు. రు 300 లకు పైగ జీతము తెచ్చుకొను ఉద్యోగస్థుల కీచట్టము వర్తిం పదు. రైళ్ళయందు పనిచేయు సిబ్బంది అన్నిరకములవా రీచట్టములో జేరియున్నారు. అయిన నీచట్టము వలన గలిగిన ప్రయోజన మేమి? ముదరా పొందవలసినమనిషి పిటిషను పెట్టుకొన్నగాని ముదరా విష యమై విచారింపబడదు. పిటిషను పెట్టుకొనుటకు కూలివానికి విద్య లేదు. తెలివిలేదు. ప్రబోధములేదు. పాశ్చాత్య దేశములవలె కార్మికు లను సంరక్షించుటకు కార్మిక సంఘములైన లేవు. కార్మికోద్యోగులే తమంతట తాముపిచారించి ముదరా లిప్పించుట కధికారములున్నచో గొంతవఱకు సమంజసముగ నుండెడివి. ఈశాసనము కాగితముమీద వ్రాయబడినది. ఆచరణయందు కూలీలకు ఫలప్రదముగ లేదు.

## 1922 సం॥ నుంచియు ఫ్యాక్టరీల శాసనము ననుసరించి ఫ్యాక్టరీలలో సంభవించిన రిపోర్టు చేయబడిన అపాయములు.

| సంవత్సరములు | దెబ్బలు తగిలినవారి సంఖ్య | | | | ప్రతి 100000 మంది కూలీలకు సగటున దెబ్బలు తగిలినవారి సంఖ్య | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | చచ్చి పోయిన వారు | ప్రమాద మగు దెబ్బలు తగిలిన వారు | స్వల్పగాయముల వారు | మొత్తం | చచ్చినవారు | ప్రమాదమగు గాయములు | స్వల్ప గాయముల వారు | మొత్తం |
| 1922 | 191 | 1207 | 5562 | 6960 | 14 | 89 | 409 | 512 |
| 1923 | 197 | 1333 | 5507 | 7037 | 17 | 91 | 391 | 499 |
| 1924 | 284 | 1690 | 8055 | 10029 | 20 | 118 | 565 | 703 |
| 1925 | 263 | 2181 | 9901 | 12646 | 18 | 166 | 662 | 846 |
| 1926 | 270 | 3155 | 11441 | 14866 | 18 | 208 | 753 | 979 |
| 1927 | 242 | 3403 | 12066 | 15711 | 16 | 222 | 787 | 1025 |
| 1928 | 264 | 3494 | 12590 | 16348 | 17 | 230 | 828 | 1075 |
| 1929 | 240 | 4389 | 15579 | 20208 | 15 | 283 | 1003 | 1301 |

*From "Royal Commission on Lobour in India" page 59.*

## గనులలో పనిచేయుచున్న కూలీలకు సంభవించిన అపాయముల సంఖ్య నీపట్టిక తెలుపును.

| సంవత్సరము | రాక్షసి బొగ్గు గనులు | | | | ఇతరగనులు | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| | చనిపోయిన వారు | ప్రతి 100000 కూలీలకు ఎంతమంది చనిపోయిరి | గాయములు తగిలినవారు | ప్రతి 100000 ఎంతమందికి గాయములు తగిలినవారు | చనిపోయిన వారు | ప్రతి 100000 కూలీలకు ఎంతమంది చనిపోయిరి | గాయములు తగిలినవారు | ప్రతి 100000 ఎంతమందికి గాయములు తగిలినవి |
| 1919 | 260 | 127 | 314 | 165 | 52 | 88 | 58 | 98 |
| 1920 | 172 | 98 | 240 | 186 | 53 | 91 | 61 | 105 |
| 1921 | 257 | 135 | 278 | 146 | 36 | 61 | 71 | 120 |
| 1922 | 209 | 113 | 248 | 132 | 34 | 77 | 57 | 129 |
| 1923 | 332 | 182 | 241 | 132 | 55 | 105 | 103 | 197 |
| 1924 | 230 | 123 | 299 | 160 | 51 | 72 | 125 | 176 |
| 1925 | 126 | 107 | 373 | 215 | 47 | 58 | 123 | 152 |
| 1926 | 171 | 100 | 367 | 215 | 56 | 68 | 173 | 193 |
| 1927 | 181 | 110 | 457 | 277 | 66 | 68 | 256 | 246 |
| 1928 | 218 | 133 | 555 | 277 | 41 | 40 | 228 | 220 |
| 1929 | 194 | 117 | 445 | 269 | 72 | 69 | 227 | 218 |

*From "Royal Commission on Labour in India" page 130.*

ఈపట్టిక అపాయముల పాలైన కార్మికుల కొసగబడిన ముదరాను దెలుపుచున్నది.

| | సంవత్సరము | 1924 (6 నెలలు) | 1925 | 1926 | 1927 | 1928 | 1929 |
|---|---|---|---|---|---|---|---|
| కవిూష నర్లకు | చర్యలు | 106 | 629 | 874 | 1289 | 1299 | 1418 |
| | రిజిష్టరు చేయుటకై పెట్టబడిన అప్లికేషనులు | 48 | 427 | 610 | 711 | 906 | 1067 |
| | మొత్తం | 154 | 1056 | 1484 | 1950 | 2205 | 2485 |
| యజమానులవల్ల చెల్లింపబడిన మొత్తం | ముదరా కోరికలు | 4168 | 11371 | 14096 | 15216 | 14827 | 18865 |
| | రూ. లు, | 150224 | 644120 | 821476 | 1111254 | 1095780 | 1260164 |

*From 'Royal Commission on Labour in India'' page 310.*

కార్మికుల అపాయశాసన సవరణ చట్టము.

"కార్మికుల కొసంగబడు ముదరామొత్తమే ముదరా శాసనములకు ప్రాణము" (By Dr. Downey in his Book on Workmens' Compensation) ప్రతిదేశము నందున ముదరాశాసనములు గలవు. పనిచేయుకాలమున కార్మికునికి సంభవించిన అపాయము ననుసరించియు, అతనిజీతము, లేక కూలి ననుసరించియు, ముదరామొత్తము ప్రతిదేశమున నిర్ణయింపబడుచున్నది. హిందూదేశమందలి ముదరా శాసనమున ఒక్కమాఱుగ ముదరామొత్తమును నిర్ణయించియిచ్చు సిద్ధాంతము గలదు. ఈ సిద్ధాంతమునే కార్మికవిచారణసంఘమువా రామోదించిరి.

మరణము లేక అపాయమువలన కార్మికుడు చనిపోయినయెడల ముదరా.

1933 వ సంవత్సరమున కార్మికుల అపాయశాసనమును సవరించుటకై భారతశాసనసభయందు దుపపాదింపబడిన సవరణచట్టమునందు గూడ నీ సిద్ధాంత మంగీకరింపబడినది. శాసనసభవారి ప్రత్యేకసంఘముగూడ నీ సిద్ధాంతమును మార్చలేదు. ఈ సవరణశాసనము ననుసరించి ఇట్లు నిర్ణయింపబడిన ముదరాలు శాసనసభవారి ప్రత్యేకసంఘము ఆమోదింపక మార్పులు గావించెను.

పాతచట్టము ననుసరించి.

1. పెద్దవాడు చనిపోయినయెడల నెలసరి ముట్టుసొమ్మునకు ముప్పదిరెట్లు హెచ్చుగ ముదరా ఒసంగవలెను. ఈ మొత్తము రు 240 లకు తక్కువగ నుండరాదు. రు 2,500 లకు హెచ్చుగ నుండరాదు.

సవరణచట్టము ననుసరించి.

మొదటిమొత్తము రు 600 లకు తక్కువగ నుండ రాదు. రు 4,500 ల కంటె హెచ్చుగ నుండరాదు.

శాసనసభవారి ప్రత్యేకసంఘు మీామొత్తము (Select Committee) రు 500 లకు తక్కువగ నుండగా దనియు, రు 4000 లకు హెచ్చుగ నుండరాదనియు నిర్ణయించెను. మైనర్లకు రు 200 ల నొసంగవలె నను నిర్ణయము. ఇందు మార్పుజరుగలేదు.

శాశ్వత అపాయము.

(అంగవైకల్యము కలిగి పాటుపడుటకు వీలులేక పోయినపుడు)

పూర్వ శాసనము ననుసరించి మైనర్లు గాని కార్మికులకు నెలసరి సంపాదనకు 42 రెట్లు హెచ్చుమొత్తము నొసంగ వలయును. ఈ మొత్తము రు 336 లకు తక్కువగ నుండరాదు. రు 3500 లకు హెచ్చుగ నుండరాదు. సవరణ శాసనము ననుసరించి ఈమొత్తము రు 840 లకు తక్కువగ నుండరాదు. రు 6300 ల కంటె ఎక్కువగ నుండరాదు. శాసనసభవారి ప్రత్యేక సంఘు మీామొత్తమును 770 లకు తక్కువగ నుండ రాదనియు రు 5600 లకంటె హెచ్చుగ నుండరాదనియు నిర్ణయించెను.

పూర్వశాసనము ననుసరించి మైనర్లకు నెలసరి సంపాదనకు 84 రెట్లధికముగ నొసంగవలె నను నియమము గలదు. ఈమొత్తము 672 లకు తక్కువగ నుండరాదు. రు 3500 ల కంటె హెచ్చుగ నుండరాదు. సవరణ శాసనము ననుసరించి యీామొత్తము రు 840 లకు తక్కువగ నుండరాదు. రు 6300 ల కంటె హెచ్చుగ నుండ రాదు.

శాసనసభ ప్రత్యేకసంఘు మీాపద్ధతినే తొలగించి వేసెను. నెలసరి జీతములను పుచ్చుకొను మైనర్లు చాల తక్కువగ నున్నందున ముదరాలు వారికి శాసనము ననుసరించి లభింపవని తలంచి మొత్తముగ రు 1200 ల నొసగవలయునని నిర్ణయించెను.

తాత్కాలిక అపాయము.

తాత్కాలిక అపాయములు సంభవించినపుడు మాసమునకు రెండుసారులు ముదరా యొసగవలయును. పెద్దవారికి నెలసరికూలి మొత్తములో నాల్గవవంతు మొత్తమును పక్షమున కొకమా ఱొసంగ వలయును. ఈమొత్తము రు 2 లకు తక్కువగ నుండరాదు. రు 15 ల కంటె హెచ్చుగ నుండరాదు.

సవరణ శాసనము ననుసరించి పక్షమున కొకమా ఱొసగు మొత్తము రు 30 ల కంటె నెక్కువగ నుండరాదని నిరూపించెను. నెల 1 కి రు 10 లు సంపాదించువానికి రు 5 లకు తక్కువగ నుండరాదు. నెల 1 కి రు 30 ల కంటె హెచ్చుగ సంపాదించని వానికి రు 10 ల కంటె హెచ్చు సంపాదించువానికి సంపాదించు మొత్తములో మూడవవంతు నొసగ వలయును. రు 30 ల కంటె హెచ్చు సంపాదించు వారికి నెలసరి సంపాదించు మొత్తములో నాల్గవ వంతు నొసగ వలయును.

శాసనసభవారి ప్రత్యేకసంఘు మీా విషయమునందు విశేషమగు మార్పుల నొనరింపలేదు.

మైనర్లకు పూర్వశాసనము ననుసరించి నెలసరి సంపాదించు మొత్తములో మూడవవంతు పక్షమున కొకమా ఱొసంగవలయును,

జరిగిన ప్రపంచకార్మిక సమావేశసూచనల ననుసరించి యున్నవి. అయిన నేమి? ఈచట్టము శాసనము గాలేదు. ప్రభుత్వమువారు శాసనముగావించుట కంగీకరింపలేదు.

# 21. పనివాండ్ర కంట్రాక్టుచట్టము.

1859 సం॥పు కూలివాండ్ర కంట్రాక్టుశాసనము ననుసరించి బజానాపుచ్చుకొని, సక్రమమగు కారణములేనిదె పని మానివేయు కార్మికులను శిక్షింప జేయుటకు యజమానికి అధికారము గలదు. ఈశాసనము ఇంగ్లీషువర్తకులచే నడిపించుచుండ వలెనని కలదు. వంగ రాష్ట్ర శాసనసభలో 1922 సం॥ నందిట్టి కనిష్ఠవేతనసవరణ తేబడినది. ప్రభుత్వప్రతిఘటనవలన వీగిపోయినది. ఈతోటల యజమానులు మొదలగు కార్మికాధికారుల దుర్ణయములనుండియు, జీతములు తఱుచుగ కోసివేయుట మొదలగు నక్రమములనుండియు కార్మికులు సంరక్షింపబడవలెను. ఇట్టిశాసనము ఇంగ్లండులో గలదు. 1926సం. ఏప్రిల్ నందు అమలులోనికి వచ్చినశాసనము ననుసరించి (Penal Laws) శిక్షింపబడుటను తొలగించిరి. అందువలన మాత్రము కొంతశాంతి యేర్పడినది.

# 22 కూలిచ్చు శాసనము.

PAYMENT OF WAGES BILL.

కార్మికుల కొసంగు కూలి, లేక జీతములను సకాలమున సక్రమముగ నొసంగుటనుగుఱించి 1933 వ సంవత్సరమునం దొక శాసనమును భారతశాసనసభయందు ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిరి. ఈ చట్టము ప్రజాభిప్రాయమును కనుగొనుటకై ప్రకటింపబడినది. ఈ

చట్టము నెల 1కి రు 100 లకు తక్కువ వేతనములుగల కార్మికులకంద ఱకు వర్తించును. ఫ్యాక్టరీలయందు పనిచేయుచున్న కార్మికులకు మాత్రమే వర్తింపజేయబడినది. ఈ శాసనము ననుసరించి తీసివేయ బడిన కార్మికునికి రావలసిన జీతమును, తీసివేసిన రెండురోజులలోపుగ నొసంగవలయును. జరిమానాలువేయుటయు, పనిముట్లకు కలిగించిన నష్టమునకు విలువగకోయుటయు, పాటునందలి లోటునకు కూలి తగ్గిం చుటయు, నీమూడురీతులుగను మాత్రమే జీతబత్తెములలో కోతల కీశాసనముననుసరించి సావకాశముగలదు. జరిమానాలు మైనర్ల కూలీ లపై వేయరాదు. పెద్దవారిపై వేసిన జరిమానాలు రెండుదఫాలుగ వసూలుచేసికోవలెను. జరిమానాకు పరిమితి గలదు. ఇట్టిశాసనము నైనను పారిశ్రామికసంస్థలన్నియు నంగీకరించుట లేదు. ఇది గర్హ్యా నీయము. కార్మికులకు జీతబత్తెములు ముట్టునను హామీలేకుండ నున్నంతకాలము కార్మికులయందు నిలుకడ జనింపదు. కార్మికవృత్తి యందు కార్మికులకు విశ్వాసము జనింపదు. అభిమతము శాశ్వతము గనుండదు.

## 23. వలస బోవుట.

కూలీ లొకచోటనుండి మఱియొక చోటికి పోవుటకును,ఇండియా నుండి యితరదేశములకు బోవుటకును గొన్ని శాసనరూపము లగు నిబంధన లేర్పఱుప బడినవి. మొట్టమొదట అస్సాము తేయాకు తోటలకు కూలీల దీసికొనిపోవు సందర్భమునం దిట్టి శాసనము మొల కెత్తెను. పిమ్మట విదేశములకు గొంపోవు కార్మికులపట్ల వర్తింపజేయ బడెను. 1922 సం. రమునం దీ (Indentured) పద్ధతి సంపూర్ణముగ రద్దుకాబడెను.[1]

1. *Assam Labour and Emigration Act of 1901 as amended in 1906.*

1901 సం. రపు కార్మికుల చట్టము 1906 సం. రమున సవరింప బడెను. ఈసవరణ ప్రకారము తోటలలో కూలీలవిషయమై పరీక్షించు టకు గొన్ని నియమములు గలవు. ఈకూలీలను లైసెన్సు పొందిన కంట్రాక్టర్లే తీసికొని రావలె నను నిబంధన కలదు. అయినను యజ మానుల బాధలకును, వారి బానిసవాండ్రగు కంట్రాక్టర్ల దుర్నయము లకును, 1859 సం. రపు కంట్రాక్టు చట్టపు శిక్షలకును భయపడి కూలీలు విరివిగ అస్సామునకు పోవుట విరమించిరి. అందుచే 1915 లో గావింప బడిన శాసనము ననుసరించి, కంట్రాక్టుదారులు కూలీలను తీసికొనివచ్చు పద్ధతి తొలగింప బడినది. కార్మిక సంఘములు (Labour Boards) నియ మింపబడి వాని యాజమాన్యమున కూలీలను తీసికొని పోవుటకును వారి పని జీతములు మొదలగు వారిసౌకర్యము లరయుటకు వీరి కధి కారము కలదు. అయిన నీకార్మిక సంఘములు, పైన వివరింపబడిన కార్మికశాసనములు, తెల్లయజమానులపట్ల నిరుపయోగములుగ నున్న వనదగును. తేయాకుతోటలయందలి కార్మికులబాధలు సంపూర్ణముగ తొలగ లేదు.

**వలసబోయిన కూలీలు.** విదేశములకు వలసబోయిన కూలీలస్థితి తలవంపులుగ నున్నది. ఇందులో మన బ్రిటిషు సామ్రాజ్యమున తెల్లవారిదేశములయం దున్న భారతీయులస్థితి చెప్ప నలవిగాదు. 2½ మిలియన్ల జనసంఖ్య బ్రిటిషుసామ్రా జ్యమునం దితరభాగములయం దున్నది. మొట్టమొదట 1834 సం. రమున 5 సం. ల కంట్రాక్టుతో భారతీయకూలీలు మారుతీకి (Mauritius) పోయిరి. అప్పుడే 1837 సం. రమున బ్రిటిషు గయానాకు గూడ చాలమంది పోయిరి. వీరికి కూడు, గుడ్డ, యిచ్చి నెల 1 కి రూ 5 ల నిచ్చు నిర్ణయము. ఇట్లు పోవుటలో ప్రభుత్వమువారు

విశేష నిషేధములేమియు గల్పింప లేదు. కూలీని ఒకస్థానమునుండి మరొకచోటికు నొద్దకు తీసికొని పోవుటయు, వారు స్వేచ్ఛమీదనే పోవుచున్నట్లు చెప్పుటయు గాలును. 1833 సం॥ లో బ్రిటిషు కాలనీలయందు బానిస వృత్తిని రద్దుపఱచియు, వేఱొక మార్గమున మరల బానిసవృత్తిని వల సకు గొనిపోవురీతిని సృష్టించుచున్నారని ఆందోళన ఫలితముగ వలసకు గొనిపోవుట యొకింత యాపుచేయబడి విచారణ జరిగినది. ఈవిచారణలో పలువిధములగు దుర్న్యయములు బయల్పడినవి.[1]

1842లో మరల మారుతీకిని, 1844లో బ్రిటిషుగయానాకు జ మైకాకు (Jamaica) ట్రినిడాడ్ (Trinidad)లకు తరువాత 1860,70 ప్రాంత ముల (West Indies Islands) పశ్చిమ హిందూదీవులకు (British and foreign) అనగా ఫ్రెంచ్, డచ్చివారి ద్వీపములకు గొన్ని సంవత్సరముల నియమముల ననుసరించి వలసబోనిచ్చిరి. 1850 సం॥లో రెంగాలునకు గూడ బోయిరి. ఈ వలసబోవు కూలీలపై కొన్ని యుద్యోగిని వేసిరి. ఈవలస బోవువారికి 5 సం॥ కంట్రాక్టు పనియు, మరి 5 సం॥లు స్వేచ్ఛతో గూడిన పనియు, మొత్తము పది సంవత్సరములు పనిచేసితీరవలెను. పిమ్మట కూలివాడు భారతదేశమునకు రావలెనన్నచో తిరిగి వెళ్ళు టకు టికెట్టును, లేదా మొత్తముగ కొంత డబ్బును, లేదా ఆ దేశమందె కొంత భూమిని, ఇచ్చుటకు నిర్ణయముకాని విదేశములకు భార తీయ కూలీలను గొనిపోయినపిమ్మట కంట్రాక్టుషరతులు సక్రమముగ పాటింపలేదు. కూలీలు వివిధకష్టములకు పాల్పడిరి. వారి కష్టములను గుఱించి భారతదేశమునందాందోళన జరుగుట ప్రారంభించినది. 1871,1882 సం॥రములలో నీ కూలీల స్థితిగతులగుఱించి విచారణలు జరుపబడినవి. ఈ విచారణవలన కంట్రాక్టు షరతులు సక్రమముగ

1. *Ranadey's Essays on Indian Economics; W. Aspinall:. The British West Indies and the Report of the Committee on Emigration of 1903.*

జరుపబడకుండుటయే గాక, కూలీలపై క్రిమినలు నేరములను బెట్టి కంట్రాక్టుషరతులకు భిన్నముగ నడిచిరి. శిక్షింపజేయుటకూడ సాగించిరి. 10 సం॥ల పిమ్మటనైన ఇళ్ళకు తిరిగి రాదలచినవారిని కంట్రాక్టుషరతులప్రకారము పంపివేయరైరి. అచ్చట వ్యవసాయదార్లుగ నుండదలచినవారిని స్వేచ్ఛగా నుండనీయరైరి. 1908 సం॥లో ప్రభుత్వము రాకపోకలను గురించి కొన్ని నియమముల నేర్పఱచెను. 1909 సం. లో లార్డు క్రూ (Lord Crewe) గారి సంఘము వలసబోయిన భారతీయులస్థితినిగురించి విచారించినది. ఈసంఘమువారి నివేదికననుసరించి 1842, 1870 సం॥ల మధ్య 531000 మంది కూలీలు హిందూదేశమునుండి విదేశములకు గొనిపోబడిరి. 5 సం॥ల కంట్రాక్టుషరతులమీాద మారుతీకి 351000 మందియు, బ్రిటిషుగయానాకు 79000, ట్రినిడాడునకు 42000, జామా 15000, (Other British West Indian Islands) ఇతరబ్రిటిషు పశ్చిమహిందూ దీవులకు 7000, నేటాలుకు 6000, ఫ్రెంచిదీవులకు (French Colonies) 31000 వెళ్లిరి. సిలోను, మలయాద్వీపములు (East Indies Islands) తూర్పు హిందూదీవులు, ఫిజీ ట్రాన్సువాలు మొదలగు దక్షిణాఫ్రికారాష్ట్రములకు, తూర్పు ఆఫ్రికా దేశమునకు గూడ 19-వ శతాబ్దమునుండి భారతీయ కార్మికులు వలసబోయిరి. స్ట్రెయిట్సు సెటిలుమెంటు 19 వ శతాబ్ద ప్రారంభమున ఇండియాప్రభుత్వమువారి చేతనే పరిపాలింపబడెను. 1867 లో ఇవి క్రొత్తకాలనీలక్రింద (Crown colonies) గ్రహింపబడినవి. అయినప్పటికి 1897 సం. వఱకీ ద్వీపములకు వలసబోనిచ్చు నధికారము ఇండియా ప్రభుత్వమునకే గలదు. ఈకాలమునసే మలయాద్వీపములలో రబ్బరుతోటలు ప్రారంభింప బడినవి.

వానికై అరవకూలీలు హెచ్చుమంది పంపబడిరి. వీరందఱుగూడ కాంట్రాక్టుమీద పోయినకూలీలే. 1910 సం॥న మాత్రమే యీకాంట్రాక్టుపద్ధతి హిందూదేశస్థులకు తొలగింపబడినది.

## 24. సింహళద్వీపము.

భారతీయులు వలసపోవుచున్న రెండు ముఖ్యదేశములలో సింహళద్వీప మొకటి. సింహళమందలి తేయాకుతోటలలో పనిచేయు నిమిత్తము కూలీలను గొంపోవుట 1930 సంవత్సరమునుండి విరమింపబడినను, వలసపోవుట మాత్ర మాగలేదు. 1923-31 సంవత్సరముల మధ్య వలసపోయినవారి సంఖ్య నికరము, క్రింద నుదాహరించిన పట్టికవలన తెలియును. 1931 సంవత్సరమున సింహళమున పూర్తిజనాభా తీసికొనక పోయినను, అంకెలు కొలంబోయందలి భారతీయుల సంఖ్యను తెలుపును. సింహళమందలి బెలూచీలను ఆఫ్ఘనులను లెక్కచేసినను, వేఱుగా 50 మంది బర్మాదేశీయులను లెక్కచేసిన, ఆసంఖ్యకు 300 చేర్చవలెను. సింహళమునందుగల భారతీయులలో అరవలు మొదటి వారు. తరువాత ముఖ్యమైనవారు మలయాళీలు. వారిలో 2500 కొచ్చిను సంస్థానమునుండియు, 4000 తిరువాన్కూరు సంస్థానము నుండియు వలసపోయిరి. నాటుకోటిచెట్టియార్లు, బోహరాలు, బెలూచీలు, మాపిలాలు, మెమనులు, 500 వంగీయులు, 200 పార్శీలు గలరు. సింహళమందలి భారతీయులలో నూటికి 95 మంది అరవలే. వారిసంఖ్య సుమారు 739,000.

సింహాళ ద్వీపమునకు వలసపోయినవారు, తిరిగి వచ్చిన వారు. వలసపోయినవారి సంఖ్య యెక్కువగు నెడల + గుర్తు. తిరిగి వచ్చిన వార లెక్కువగు నెడల —గుర్తు.

| సంవత్సరము[1] | సంఖ్య |
|---|---|
| 1923 | + 38530 |
| 1924 | + 97865 |
| 1925 | + 72382 |
| 1926 | + 40481 |
| 1927 | + 71917 |
| 1928 | + 40116 |
| 1929 | + 3867 |
| 1930 | — 7306 |
| 1931 | — 7529 |

ఈకూలీలు తేయాకుతోటలలో బనిచేయుటకై సింహాళద్వీపమునకు బోయిరి. నెలరోజులముందునోటీసుతో వా రాపనిని చాలించి వచ్చుటకు వారి కధికారముకలదు. అప్పులపాలైయున్న కార్మికుల కీహక్కు నిరుపయోగమే. మఱియు, ఇండియా ప్రభుత్వకార్మికాధికారి ఈవిషయమై జోక్యము కలిగించుకొనరాదు. 1922 సంవత్సరము నందు మాత్రమే వలసబోవుచట్టము సింహాళమునకుగూడ వర్తింప జేయబడినది.

1. *From Census Report p. 70. 1931*

## 25. దక్షిణాఫ్రికా.

నేటాలునందు 1893 సం. రము లో 38000 ల మంది భారతీయు లుండిరి. ఇందులో 24000 మంది కంట్రాక్టు ముగిసినపిమ్మట గూడ నుండిరి. 14000 మంది కంట్రాక్టులో పనిచేయుచున్నారు. ఇందులో కొందఱు నేటాలునుండి దక్షిణాఫ్రికా, ట్రాన్స్వాలు మొదలగు నితర భాగములకుగూడ పోయి వాణిజ్యము, సేద్యము, కూలి మున్నగు పనులను జేయుచుండిరి. 1921 సం.న 152000 మంది భారతీయులు దక్షిణాఫ్రికాయందు గలరు. అరణ్యప్రదేశములను సాగుబడిభూముల క్రింద, తోటభూములక్రింద, వాసస్థానములక్రింద చేయుటలో తెల్లదొర లకు భారతీయబానిసలు కావలసివచ్చిరి. భారతీయు లధికసంఖ్యాకు లగుచు అర్థిక రాజకీయములందు ప్రాధాన్యము పొందగలుగుస్థితి వచ్చునప్పటికి, తెల్లవారు చూచి సహింపలేకపోయిరి. భారతీయుల భాగ్యభోగ్య ములను, విద్యాభివృద్ధులను నశింపజేయుటకై [illegible] సర్వవిధ ముల భారతీయులను బాధించి [illegible] చేయుటకై ప్రయత్నింపసాగిరి. 1888 సంవత్సర [illegible] ట్రాన్స్వాలులో భారతీయులకు వ్యతిరేకముగ శాసనము [illegible] ప్రారంభించిరి. 1896 లో 3 పౌనుల [illegible], 1 [illegible] ఆసియాఖండ వాసుల [illegible] 1893 లో నేటాలునకు, 1906 లో ట్రాన్స్వాలునకు స్వాతంత్ర్యము లభించి నది. అంతతో తెల్లవారు శృతిమించిరి. భారతీయులకు వ్యతిరేకముగ శాసనపరంపరల ప్రయోగింప ప్రారంభించిరి. 1897 సం॥రము విద్యావిషయమై నిషేధము గావింపబడినది. అయిననేమి? ఏనీచపు పద్ధతులనైన కూలీల బంపించుటకు, వారి కష్టముల సహించుటకు హిందూదేశప్రభుత్వమున్నది. ఇక కూలీలకొఱత వారి కెట్లుగలుగును?

పది సంవత్సరములు కూలిచేసినవెంటనే హిందూదేశమునకు తిరిగి వచ్చుపద్ధతిపై నీకూలీలను రానిచ్చిరి. ఈ సమయమునందే మహాత్మాగాంధిగారు దక్షిణాఫ్రికాయం దుండిరి. భారతీయ కార్మికుల దుస్థితి కైకలవరపడసాగెను. (మహాత్ముని దక్షిణాఫ్రికావాసమునుదక్షిణాఫ్రికాప్రభుత్వమువారు భారతీయులనుబెట్టిన కష్టములను గురించిన చరిత్ర వ్రాయబడియెయున్నది. అందుచే నిట క్లుప్తముగ వ్రాయబడినది.) 1907 వ సం॥ ప్రతి ఆసియాఖండవాసుడును ఒక యూరినుంచి మఱియొకయూరికి పోవుచో దొంగలగుంపువలె తమచిరునామాను రిజిష్టరుచేయుచు వేలుముద్రలను వేయవలెనని ట్రాన్సువాలులో శాసనముగావింపబడినది. ఈశాసనముపై మహాత్ముడు నడిపిన సత్యాగ్రహము ప్రపంచప్రసిద్ధము. మహాత్ముని నాయకత్వమున భారతీయులు గావించిన సత్యాగ్రహ మద్వితీయము. ఈ త్యాగఫలితముగ నాఘోరశాసన మప్పటికి నిలుపుజేయబడెను. మరల 1908, 1909 సం॥లలో పూర్వస్వభావము తలయెత్తినది. 1913 వ సం॥లో దక్షిణాఫ్రికాప్రభుత్వము, ఒక రాష్ట్రమునుండి మఱియొకరాష్ట్రమునకు భారతీయులు దక్షిణాఫ్రికాయందు పోరాదని నిషేధించినది. గోపాలకృష్ణ గోఖేలుగారు భారతశాసనసభాముఖమున దక్షిణాఫ్రికా భారతీయుల కష్టములన్నియు దిక్కులు పిక్కటిల్లున ట్లుద్ఘోషించిరి. పోలకుగారు గూడ దక్షిణాఫ్రికా భారతీయుల బాధలు వివరింపసాగిరి. ఆసేతుహిమాచలపర్యంతము దక్షిణాఫ్రికా భారతీయులఘోష ప్రతిధ్వనించినది. అయినను హిందూదేశప్రభుత్వము చలింపలేదు. తన్నుగానట్లుగనున్నది. దక్షిణాఫ్రికాభారతీయులు స్వశక్తిపై నాధారపడిరి. త్యాగము మూర్తీభవింప జేసిరి. తెల్లవారియహంకారమును దక్షిణాఫ్రికా భారతీయులే యోడింపగలిగిరి. త్యాగఫలితముగ 1914 సంవత్సరమున స్మట్సుసేనాని గాంధిగారితో నొడంబడిక చేసికొనెను. ఒడంబడిక నను

సరించి భారతీయకార్మికులు దక్షిణాఫ్రికాకు పోరాదు. దక్షిణాఫ్రికా యందున్న వారి హక్కులుమాత్రము కాపాడవలెను. ఒడంబడిక జరిగి నను తెల్లవారిజాతిద్వేషము పోలేదు. దక్షిణాఫ్రికాయందుననే కాదు, బ్రిటిషుసామ్రాజ్యమునం దన్నితావుల నల్లవారిపై జాతిద్వేషము తెల్లవారు వర్షింపసాగిరి. బ్రిటిషుసామ్రాజ్యమున తెల్లవారు ప్రభువులు గను, రంగుజాతులవారు బానిసలుగను నుండవలెననిమాత్రమే వారి యభిప్రాయము. ఈ జాతిద్వేషానలమున కోర్వజాలక, 1914 సం॥న పెద్ద యోడ భారతీయులను తిరిగి తీసికొనివచ్చుటకై పంపబడినది. ఆఓడ కనడా సముద్రతీరమునం దాగినది. కనడా తెల్లప్రభుత్వ ముకూడ భారతీయకార్మికులను కనడాదేశమునకు రానీయ లేదు. అందుచే వారు కలకత్తాకు వచ్చివేసిరి. "హిందూదేశమునకు వచ్చిన పిమ్మటనైన వారిప్రాణములు వారికి దక్కలేదు. ప్రభుత్వమువారితో కలకత్తాయందే ప్రతిఘటన సంభవించినది. కార్మికులపై తుపాకులు కాల్పబడినవి. పలుప్రాణములు గతించినవి." [1]

యుద్ధకాలమున వలసబోవుట నిరోధింపబడినది. అందువలన నీయాందోళన కొంతవఱకు తగ్గినది.

## 26. కెనియా.

1921 సం॥లో కెనీయాదేశమున 25000 మంది భారతీయులు గలరు. 9651 మంది తెల్లవారు గలరు. తదితర స్వదేశజాతులతో కలసి కెనియాదేశమున, 2,500,000 మంది జనసంఖ్యగలదు. ఉగండా రైలుమార్గమును నిర్మించుటకుగాను కూలీలు భారతదేశమునుండి గొంపోబడిరి. 1903 సంవత్సరమునం దీపని పూర్తియైనది. 1926 సం॥ వచ్చుసరికి 26759 మంది భారతీయులును, 12529 తెల్లవారును

1. *Vera Anstey.*

గలరు. కెన్యావ్యవసాయభూముల సందర్భమున భారతీయులకు గావింప బడిన యన్యాయము మఱపునకు వచ్చునది గాదు. యుద్ధకాలమున భారతీయుల సహాయ మత్యవసర మైనది. భారతీయబానిసలా కాలమున కోట్లకొలది సీమదొరలకు తమప్రాణముల నర్పింపకున్నచో బ్రిటిషుసామ్రాజ్య మానాడే విచ్ఛిన్నమైయుండెడిది. ఆయవసరమును గ్రహించి యుద్ధకాలమునం దొకింత జాతిద్వేషమును విరమించిరి. యుద్ధము ముగిసినది. సామ్రాజ్యమునందు తెల్లవారు మరల తమ మామూలు పాటను పాడసాగిరి. గాంధి స్మట్సు ఒడంబడికను గాలి కెగురవేసిరి. మ్యునిసిపాలిటీలయందు భారతీయులకు ఓటుహక్కును తీసివేసిరి. భారతీయులు సముద్రతీరములయందే బ్రతుక వలసినదనిరి, అట్లు బ్రతుకజాలనివారు ఇండియాకు మరలిపోవుట విధి యనిరి.

"కెన్యాభూముల విషయమున భారతీయులకు జరిగినఅన్యాయ మింతలో నెవరు మరువ గలరు? అది మరపునకైన రాకమునుపే మఱి యొక అక్రమము జరుగనున్నది. అచ్చటగల ఆసియాఖండవాసు లెల్లరు, తల 1 కి 30 పౌనులు తలపన్ను చెల్లించు చుండిరి. ఇప్పుడా పన్నును 50 పౌనులకు హెచ్చింప నున్నటుల వింటిమి. తెల్లవారిపై కంటె నల్లవారిపై 20 పౌను లేల హెచ్చు వేయవలసివచ్చినది? విద్యకై యను నెపము చెప్పబడుచున్నది. తెల్లవారిపిల్లలకు తల 1 కి పౌ 22 లును, నల్లవారి పిల్లలకు తల 1కి 2 పౌనుల 8 షి॥లును విద్యకై ఖర్చు పెట్టుచున్నటుల డాక్టరు నారిసునుగారి లెక్కలవలన తెలియు చున్నది. తెల్లవారికంటె నల్లవారికి సుమారు తల 1 కి 20 పౌనులు తక్కువ వినియోగపఱచుచు, పన్నుమాత్రము హెచ్చించుటలో న్యాయమేమో? ఇట్టి అక్రమములు తలపెట్టబడుటకు భగవంతుడు నల్లరంగును ప్రసాదించుటయే కారణము."[1]

1. 8 దవ ఆంధ్రరాష్ట్రీయమహాజనసభ, ఏలూరు 28 నవంబరు 1926. అత్తికూరి గోవిందాచార్యులగారి ఆహ్వాన సంఘాధ్యక్షోపన్యాసమునుండి.

భారతీయుల చెమటవల్ల దేశము సస్యశ్యామలమై ఫలవంతమైనది. ఇక భారతీయులపని యేమి? ఏఱుదాటిరి. తెప్ప తగులబెట్టవలెను గదా! సామ్రాజ్యోపభాగములకంటె సామ్రాజ్యమునందే భారతీయులు పశువులవలె, పక్షులవలె, పిపీలికలవలె చూడబడిరి. సామ్రాజ్యమందలి ప్రజలనందఱు, నేకభావమున బరిపాలింతుమని యెన్నియోపర్యాయములు ప్రగల్భములుకొట్టిన బ్రిటిష్‌ప్రభుత్వము,జోక్యముకలిగించుకొనలేదు. జోక్యము కలిగించుకొన నవసరములేదని కూడ విస్పష్టపఱచినది. హిందూదేశపు ప్రభుత్వము వారు మాత్రము, భారతీయనాయకులయొక్క యొత్తిడిచే నొకశాసనముగావించిరి. ఇందువలన (పనియందు ప్రత్యేకనైపుణ్యములేని) సాధారణ కూలీలు, విదేశములకు వలసబోరాదని నిషేధింపబడిరి. కూలీలను తీసికొని పోదలచిన దేశములు, గవర్నరుజనరలుగారి యిష్టము ననుసరించి, వారిచే నిరూపింపబడు నియమముల ననుసరించి మాత్రమే, పోవుటకు వీలున్న దనిరి. పనితనముగలకూలీలనుగూడ పోకుండ నిషేధించుటకు గవర్నరుజనరలునకధికారముగలదు. ఇందువల్లతాప్పుగాండ్రమాటవిని, స్వదేశమువీడి, విదేశములకు బోయినప్పుడు పడుబాధలు మాత్రమే దప్పినవి. కాని, యిదివఱకే విదేశములకు బోయినకార్మికులకష్టము లెట్లు గట్టెక్కినవి? ఈ శాసనము ననుసరించి కూలీల బోనీయకుండుటచే, కూలీలు కావలసిన దేశములు యిండియాప్రభుత్వముతో రాయబారములకు దిగినవి. 1926 సం॥రము మార్చిలో శాసనసభవారిచే గావింపబడిన తీర్మానము ననుసరించి, కార్మికుల కూలిపని చేయుకాలనిర్ణయము, ఆరోగ్యము మొదలగునవి చక్కచేయబడు పద్ధతిని బ్రిటిషుగయానాకు మాత్రము, మరల కార్మికులను బోనిచ్చిరి. నేడు దక్షిణాఫ్రికాకు, హిందూదేశప్రభుత్వము భారతదేశమునుండి రాయబారిని పంపుచున్నది. ఈరాయబారి దక్షిణాఫ్రికాయందు వసించు భారతీయుల కష్టనిష్ఠురములను గమనించుచున్నాడు.

# 27. బ్రిటిషు మలయా ద్వీపము.

1921 సం॥లో 305000 మంది భారతీయులు గలరు. ఇందులో చాలమంది అరవలు. మలయాదీవుల మొత్తమున 1,300000 మంది జనసంఖ్యగలదు. భారతీయకూలీలు రబ్బరుతోటలలో పనిచేయుదురు. ఈద్వీపములలో (East Indies and west Indies)తూర్పుదీవులు,పశ్చిమ దీవులు మొదలగువాటియందు యజమానులకు, కార్మికులకు మధ్య సంఘర్షణము లంత యధికముగ లేవు. నేడు హిందూదేశమునుండి వలసబోవుటకు మలయా సింహళద్వీపములే వీలుగ నున్నవి. 1930 వ సంవత్సరమున మలయాకు కూలీలను తీసికొనిపోవుట మాని వేయబడెను. అయినను 1931 వ జనాభాయందు 624009 మంది భారతీయులు మలయాయందు గలరు.

| వృత్తి | మొత్తము | పురుషులు | స్త్రీలు |
|---|---|---|---|
| వ్యవసాయము | 222839 | 153408 | 69431 |
| వర్తకము | 30214 | 29596 | 618 |
| పరిశ్రమలు | 19415 | 18280 | 1135 |
| మిగిలినవారు చిల్లర వృత్తులు | | 133898 | 11845 |

ఈ వృత్తులయందు స్త్రీ పురుషులు జీవించుచున్నారు.

2,45,01,059 రూపాయల ఖరీదుగలభూమి మలయాదేశమునందు మన దేశస్థుల చేతులలో గలదని తెలిసికొనినపక్షమున మలయాకు భారతీయులు వలసపోవుటలో గల ఆర్థికప్రాముఖ్యత మనము

కొంత తెలిసికొన గలుగుదుము. 1931 సంవత్సరములో, మలయా సేవింగ్సు బ్యాంకులలో, భారతీయుల ధనము 35,58,614 రూపాయలు. అనగా దామాషాను డిపాజిటుచేసిన ప్రతివానికి 146 రూపాయ లుండెను. ఆసంవత్సరమునందే హిందూదేశమునకు పంపబడిన ధనము 38,83,065 రూపాయలు. దామాషాను నప్పొకటింటికి 69 రూపాయలు.

## 28. బర్మా.

బర్మాదేశమందలి కార్మికులలో భారతదేశమునుండి వలస పోయినవారే హెచ్చుమంది గలరు. 1921 సంవత్సరము జనాభా లెక్కల ననుసరించి బర్మాదేశమందు ఆంధ్రులు, అరవలు, ఓఢ్రులు హిందూస్థానీవారు ఎంతమందిగలరదియు నీపట్టికవలన తెలియగలదు.

| జాతి | బర్మావారు | బర్మాలో పుట్టినవారు | మొత్తము | బర్మాలో పుట్టినవారు 100 కి గల సంఖ్య |
|---|---|---|---|---|
| ఆంధ్రులు | 10384 | 100196 | 110580 | 91 |
| అరవలు | 22536 | 59011 | 81547 | 72 |
| హిందూస్థానీవారు | 12820 | 68580 | 81400 | 84 |
| ఓఢ్రులు | 1076 | 31826 | 32902 | 97 |

ఆంధ్రులు, ఓఢ్రులు, బర్మాకుపోయినవారియం దధికసంఖ్యాకులు. వీరే పరిశ్రమలయం దధికసంఖ్యాకులుగ నున్నారు. చిటగాంగువారు చాలమందిగలరు. కాని, వారు బర్మాలోనే పుట్టి, బర్మాయందే నివాసమేర్పఱుచుకొనిరి. కాని వీరు పరిశ్రమలలో నధికముగ పనిచేయరు. సాలుసరి 1922 సం॥రము మొదలు 29 సం॥ వఱకు, 320,000 మంది

హిందూ దేశకార్మికులు బర్మాకు పోవుచున్నారు. వీరందఱు రంగూను నందు ఓడ దిగుదురు. రంగూనునుండి సాలుసరి 260,00 మంది హిందూదేశమునకు తిరిగిపోవుదురు. బర్మాకు వలసపోయినవాండ్రలో పురుషులు 12 గురికి 1 స్త్రీ వంతున, వలస పోవుచున్నది. ఈ వలస పోయినకార్మికుల నైతికజీవనము పతితావస్థయం దున్నది. వీరి కార్మికవృత్తికూడ మేస్త్రీయనబడువారి చేతిలో బంధింపబడి యున్నది. కార్మికులకు గిట్టు కూలికంటె కార్మికులమూలముగ మేస్త్రీలు సంపాదించుకమీషను హెచ్చుగ నున్నది.[1]

నేడు బర్మావారికిని, భారతీయ కార్మికులకును మధ్య ఆర్థిక వైషమ్యములు పెరిగినవి. పరస్పరము దౌర్జన్యమునకు పాల్పడుచున్నారు. ఈ పరిస్థితులయందు కోరమాండల్ రేవులనుండి, అనగా కాకినాడ, విశాఖపట్నము, భీమునిపట్నం, గోపాలపురం మొదలగు రేవులనుండి బర్మాకు పోవుచున్న తెలుగు కూలీలను పోకుండచేయుట ప్రజానాయకుల ధర్మము. మదరాసుప్రభుత్వమువారి విధి. బర్మాకు పోయి, అవినీతిజీవనముగడుపుచు, బర్మావారి క్రోధానలజ్వాలలకు గుఱియగుచు, మేస్త్రీలచే పీడింపబడుచు, బర్మాయందు బాధపడుటకంటె ఆంధ్రకూలీలను వెనుకకు మరలించుటయే ఆంధ్రుల కర్తవ్యము.

# 29. వివిధదేశములయందలి భారతీయులు.

"ఆంగ్లసామ్రాజ్యమునందలి ఇతర భాగములకు వలస పోవు భారతీయుల సంఖ్య పెరుగుటలేదు. ఏకొలదిమందియో నిపుణులగు పనివాండ్రు వెళ్లుచుండుట తిరిగివచ్చుచుండుటయుతప్ప మార్పేమియులేదు.

1. *For Details see the Books of Mr. A. Narayanarao on Indian Labour in Burma.*

దక్షిణ ఆఫ్రికా యందున్న 165, 500 భారతీయులలో 142979 నేటాలునందు గలరు; కెన్యాయందు 26, 759 భారతీయులు గలరు. ఇతర దేశములలో మారిషియసునందు 268, 870, ట్రినిడాడ్, టొబాగోలలో 138, 667; బ్రిటిషుగయానాయందు 130, 540; ఫిజీదీవులలో 75, 117 టాంగనియాకాలో 23, 422; జమైకాలో 17599; జాంజిబార్లో 15246; ఉగండాలో 11, 613; హాంకాంగ్ నందు 4745 భారతీయులు గలరు. ఇంక నే ఆంగ్లేయ వలసరాష్ట్రమునందును, 2000 కు పైగ భారతీయులు లేరు.

ఇంగ్లాండు, వేల్సు దేశములందుండెడి భారతీయుల సంఖ్య 74,000 అనియు, స్కాట్లాండునందు 8000 అనియు, ఫైంక్స్ చెప్పియున్నాడు.[1] కాని, ఆంగ్ల దేశపు జనాభా లెక్కలనిబట్టి ప్రియాంకెలలో చాలవఱకు హిందూదేశమందు జన్మించిన వారిలో అచ్చట జనన మొందిన ఆంగ్లేయులు గూడ కలుపబడినని తేలుచున్నది. 1911 వ సంవత్సరముకంటె పెరుగుదల చూపిన 11, 000 సంఖ్యయు, పూర్తిగా భారతీయులే కాకపోయినను, భారతీయుల పెరుగుదల 9243 అని అంచనా వేయనగును. ఇంగ్లాండు, స్కాట్లాండ్లు దేశములందలి వివిధ విశ్వవిద్యాలయములందు 2000 భారతీయ విద్యార్థులు గలరు. ఇంగ్లాండు వేల్సుల జనాభా లెక్కలనుబట్టి ఆ దేశమునందు ఆసియా జాతులకు సంబంధించిన భారతీయులసంఖ్య 7,128 గలదు. మాన్ దీవి (Isle of Man) యందు ఒక భారతీయుడు గలడు. హిందూదేశమునందు గాక, మిగిలిన సామ్రాజ్యభాగములందు గల భారతీయుల సంఖ్య 2, 300, 000. సామ్రాజ్యమునకు వెలుపల 104, 000 మంది భారతీయులు గలరు. దాదాపు 5000 మంది అమెరికా సంయుక్తరాష్ట్రములలోను, డచ్చి

1. *International Migrations II page 592.*

గయానాయందు సురినంలో సుమారు 35, 000 మందియు, నెదర్లాండ్సు యిండీసునందు బ్రిటిషు హిందూదేశస్థులు 25,000 మందియు, పరాసురాజ్యమందలి మెడగాస్కరు, రూనియన్లందు 7500 మందియు భారతీయులు గలరు. ఈదశాబ్దములో పరిషియాలో 3900 మందియు, పోర్చుగీసు తూర్పు ఆఫ్రికాలో 5000 మందియు, ఇరాకులో 2362 మందియు, ఆఫ్ఘనిస్థానమునందు, ఐరోపాఖండమునందు, తదితర ప్రదేశములయందు గలిసి 20000 మందియు భారతీయు లుండవచ్చును. బరోడా రాష్ట్రపు జనాభా అధికారి స్పెయిను దేశమందు, ప్రయాణీకులు, విద్యార్థులు గాక 200 బరోడా వాసులగు బొంహరాలు, బిల్బో, మలాగా మొదలగు పట్టణములందు వర్తకము చేయుచున్నారని తెల్పెను. సామ్రాజ్య భారతీయ పౌరసత్వసంఘము (The Imperial Indian Citizenship Association)వారు ఆంగ్లసామ్రాజ్యమందును, పై చెప్పబడిన దేశములలో గాక యితర ప్రదేశములయందు దాదాపు 20, 000 మంది భారతీయులు గలరని వ్రాయుచున్నది. దీనినిబట్టి ఇతరప్రదేశములందలి భారతీయుల సంఖ్య 20238 మంది గలరనుకొనవచ్చును. మొత్తము విదేశములయందలి భారతీయుల సంఖ్య 2404000 మంది అగును. కాన విదేశముల యందలి భారతీయుల సంఖ్య దాదాపు 25 లక్షలనియు చెప్పవచ్చును.

వలసపోవుటవలన, వలస పోయిన భారతీయులయందు సాంఘికముగ విశేషమగు మార్పు కలుగుచున్నది. వలస పోయినవారిలో పురుషుల సంఖ్యకన్న స్త్రీల సంఖ్య తక్కువగ నుంటచే ఫిజీదీవులయందు దక్షిణాఫ్రికాయందు హిందువులు వారిలోగల కులకట్టుబాటుల

నతిక్రమించి వర్ణాంతర వివాహములు చేసికొనవలసి వచ్చుచున్నది సాంఘికవివక్షత హిందూదేశముకంటె చాల తక్కువగ నున్నది

"దాక్షిణాత్యులు తమ దేశముతో చాలకాలము వఱకు సంబంధము కలిగియుందురు. వీరు సాధారణముగా కుటుంబములతో వలస పోవుదురు. వలసపోవుటవలన వీరి మతమునందును నేమాత్రము మార్పుండదు. తన జాతివార లనేకులుండుటచే స్వదేశమునందలి ఆచారవ్యవహారములనే అచ్చటకూడ కొనసాగింప గలుగుచున్నారు. వలసపోవుటవలన కులబేధములు సడలినను, కొంతయును మార్పు అనుకొనినంత యుండదు. దక్షిణాదివారు వలసపోయినను, వారు స్వదేశ స్వజనసంబంధమునుమాత్రము త్రెంచుకొనరు. వారు తిరిగివచ్చి స్వసంఘములో జేరిపోవ యత్నింతురు. ఆక్రమణాకాంక్ష వారికి చాల తక్కువ. జనసామాన్యము క్రొత్తదేశములయందుగూడ స్వదేశమందలి వ్యవసాయవిధానమునే అవలంబింతురు. హిందూదేశమునందు ఏకులమువారు పనిపాటులు చేసికొందురో, అక్కడను అవేపనులు వారే చేసెదరు. అక్కడ వర్తకము నాయించువారు, హిందూదేశమునందును వర్తకము చేయుచుండెడివారే. దక్షిణాదినుండి వలసపోవువారు తమ తోపాటు తమ ప్రపంచమును వెంటగొని క్రొత్తదేశములందు దానినే నెలకొల్పెదరు."[1]

ఈదిగువ పట్టికవలన ఏవిదేశమునందెంతమంది భారతీయు లుండినదియు తెలిసికొనగలము.

1. *From Census Report p, 71-72, 1931.*

## వివిధ దేశముల యందలి భారతీయుల సంఖ్య.

1 వ పట్టిక.

| 1 దేశము | భారతీయుల సంఖ్య | లెక్క తీసికొనిన సంవత్సరము |
|---|---|---|
| ఆంగ్ల సామ్రాజ్యము | 2300000 | ... |
| సింహళము | 778178 | 1931 |
| మలయా | 624009 | 1931 |
| మారిషసు | 268870 | 1931 |
| దక్షిణ ఆఫ్రికా | 165500 | 1926-1930 |
| ట్రినిడాడ్ వగైరా | 138667 | 1931 |
| బ్రిటిషు గయానా | 130540 | 1931 |
| ఫిజీ | 75117 | 1930 |
| కెన్యా | 26759 | 1931 |
| టాంగనియాకా | 23422 | 1931 |
| జమైకా | 17599 | 1930 |
| జాంజిబార్ | 15246 | 1931 |
| ఉగండా | 11613 | 1926 |
| ఇంగ్లండు, వేల్సు | 7128 | 1931 |
| బ్రిటిషు దీవులు (ఇతరచోట్ల) | 2115 | ... |
| హాంకాంగ్ | 4745 | 1931 |
| ఇతర ప్రదేశములు | 10500 | 1911-1931 |

1. *From Census Report 1931.*

మమునకు సామ్రాజ్యమునందుగల వర్ణవిద్వేషమే పునాది. వర్ణవిద్వేషము నశించినగాని సామ్రాజ్యము జీవింపజాలదు. భారత దేశమునందు వివిధజాతులవా రెట్లు వసించుచున్నారో, ఆర్థికాభివృద్ధిని జెందుచున్నారో, అట్లే భారతీయులకుగూడ సామ్రాజ్యమునందు సర్వాధికారములుండియున్నను భారతీయులకు శాంతి యుండెడిది. భారతీయకార్మికులకైనను సామ్రాజ్యమునందు కూలిజేసికొనుటకే సావకాశములు లేని స్థితిలో, భారత దేశము, సామ్రాజ్యము నంటిపెట్టుకొనియుండునని విశ్వసింపవీలులేదు. మఱియు నీవర్ణ విద్వేషసమస్య సామ్రాజ్యమునందు మాత్రమేగాక ప్రపంచమునందంతటవ్యాపించియున్నది. "ఆసియాఖండవాసులగు రంగుప్రజలను గౌరవముతో సరిసమానముగ చూచుటయన, పాశ్చాత్యులు తెలిసికొన జాలకున్నారు. శ్వేతేతరజాతులన్నియు మానవ ప్రపంచమునకు సంబంధించినవని శ్వేతజాతులు తలంపజాలకున్నవి. అనుదినము రంగుప్రజలు వసించుచున్న ఈజిప్టు, మొరాకో, సిరియా, చైనా, ట్రిపోలీ మొదలగు ప్రాంతములలో రంగుప్రజలపై శ్వేతజాతులకత్తులు జళిపింప బడుచునే యున్నవి."[1]

అయినను భారత దేశము తన్ను అగౌరవ పఱచు దేశములనుగూడ సాదరముతో భారత దేశమున ఆర్థికవ్యాపారమును గావించుకొన నిచ్చుట, విధియని, ఆంగ్లేయ రాజకీయవేత్తలు చెప్పుచున్నారు. సామ్రాజ్యమందలి అధినివేశ రాజ్యములపౌరులకు గూడ భారత దేశమున భారతీయులతో సమాన పౌరసత్వము లభింపవలె నని ఆంగ్లేయ రాజకీయవేత్తల అభిమతము.

జాయింటు పార్లమెంటరీకమిటీవారి యెదుట హిందూదేశ రాజ్యాంగ కార్యదర్శియగు హోరుగారు సాక్ష్యమొసంగుచు సామ్రాజ్య

1 8 దవ ఆంధ్రరాష్ట్రీయమహాజనసభ ఆ. గోవిందాచార్యులగారి ఆహ్వానసంఘాధ్యక్షోపన్యాసమునుండి.

చున్నారు. తుపాకిగుండ్లబారి పడవలసివచ్చుచున్నది. కొందఱు హతు లగుచున్నారు. మఱికొందఱు వికలాంగు లగుచున్నారు. ఎట్లో కార్మికు లొక త్రాటిపైనుండి, తమకష్టములను సమ్మెలద్వారా తొలగించుకొనుటకు తగు సదుపాయములు లేవు. "బ్రిటిషుదీవులలో 1799-1800 సం॥ల ప్రాంతముననె కార్మికసంఘములు నెలకొల్పబడినవి. అచ్చట నున్న ధనాఢ్యుల ప్రభుత్వము కార్మికుల నిరోధింపక మానలేదు. కార్మికులపై ప్రభుత్వ మనేకమాఱులు దండయాత్రనెత్తినది. 1834 సం॥లో సమ్మెదారులపై రాజద్రోహనేరారోపణ జేయుటయు కఠినశిక్షలు విధింపబడుటయు జరిగినది. కాని ప్రజాభిప్రాయము సైదు కొనలేక రెండు సం॥లలో వారిని విడుదలచేయుట విధి యయ్యెను. నాటినుండియు సర్వవిధ కార్మికవృత్తియందుగల కార్మికులును సంఘముల నేర్పాటు జేసికొని ట్రేడుయూనియను కాంగ్రెస్‌ను స్థాపించి యుండిరి."[1]

ఆకాంగ్రెసు నేడు బ్రిటిషుసామ్రాజ్యము నంతయు బరిపాలించు చున్నది. సం1924నందొకమాఱును, సం1929 నందు మఱొకమాఱును కార్మికులే బ్రిటిషుసామ్రాజ్యాధిపత్యమును వహించిరి.

కార్మికోద్యమ ప్రారంభము.

భారతదేశమందన్నను 1884 సం॥ర ప్రాంతముననే కార్మికోద్యమము మొలకెత్త ప్రారంభించినది. నారాయణ మేఘాజి లోక్కండే గారు (Narayan Meghajee Lokhande) ఉద్యమ ప్రారంభకులు. ఈయన నాయకత్వమున కార్మికసమస్యపై 1890 సం॥రమున గవర్నరుజనరలుగారికి పిటిషను పెట్టబడెను. వీరు "దీనబంధు" అనువారపత్రికనుగూడ కార్మికసమస్యకై ప్రచురించుచుండెడివారు. ఆపత్రికయందున వారుపెట్టిన

1. *From "Trade Unions by Joseph Clayton"*

పిటిషను సందర్భమున నాడు వివరింపబడిన కష్టములు నేటికిని అట్లే ఏదోయొక రూపమున నిలిచియే యున్నవి. కార్మికోద్యమము 1890 సం. రముననే మాసిపోయినది. మరల 1905 సం. రము వంగదేశ విభజనకాలమున చిగురింప సాగినది. కొన్ని సమ్మెలు కూడ జరిగినవి. నాటి రాజకీయనాయకులు కార్మికోద్యమ ప్రాముఖ్యమును గ్రహించిరి. లోకమాన్య బాలగంగాధరతిలకు నిర్బంధానంతరము 1908 సం. రములో పేర్కొనదగినట్లు కార్మికులు సమ్మెకట్టిరి. కాని యీసమ్మెలవల్ల ట్రేడుయూనియనులు నెలకొనునంత యుద్బోధము కార్మికులలో గలుగలేదు. ఈసమ్మెలు 'ఎవరికివారే యమునాతీరే' అన్నట్లు జరిగినవియే కాని, సమిష్టిగ కార్మిక సంఘోద్ధారణ చేయలేక పోయినవి. 1920 సం. నకు కార్మికులలో కొంతసంచలనము కలిగినది. ఐరోపా సంగ్రామ ఫలితములే యందులకు కారణము. జీవనోపాధి దుర్ఘటమైనది. మిల్లులలో ఆహారపదార్థముల హెచ్చుధరల ననుసరించి వేతనములు వృద్ధికాలేదు. ఆర్థిక ఘోష మిన్నుముట్టినది. కార్మికుల సంతాపమునకు మేర లేదు. 1921-22 సం. లలో సమ్మెలు ప్రతినగరమందున వ్యాప్తి చెందినవి. 1921 సం. లో కార్మికమిత్రుండగు మహాత్ముడు కలిగించిన రాజకీయ ప్రబోధమువలన కార్మికులు తమ నిజస్వరూపమును తెలిసికొనగలిగిరి. కార్మిక సంఘములు స్థాపించుటకు పునాదులు వేయబడినవి. కార్మిక సమ్మెలను ప్రజ లాదరణతో జూచుట కలవడిరి. 1920 సం॥రమున నాగపురమున సమావేశమైన జాతీయ మహాసభవారు ట్రేడుయూనియనులతో తమ సంపూర్ణసానుభూతిని ప్రకటించిరి. నాడు మొదలు కార్మికోద్యమము క్రమక్రమముగ వేళ్ళు పాతుకొనుచు దినదినాభివృద్ధి నొందుచునే యున్నది. ప్రభుత్వ ప్రతిఘటనలకు తలయొగ్గుట తప్పలేదు. కృషిమాత్రము విరమింపబడలేదు. ఎన్నియో సమ్మెలు జరిగినవి. అందు ప్రభుత్వమువారిచే హతు

లైనవారియొక్కయు, వికలాంగులైన వారియొక్కయు సంఖ్యను స్థిర పఱుచు నాధారములు లేవు. ప్రభుత్వమువారి ఇండియన్ ట్రేడ్ జర్న లులో ప్రకటింపబడిన వివరములు సరియైనవి కావు. అందు చాల సమ్మెలు వదలివేయ బడినవి.

బొంబాయి, కలకత్తా, మద్రాసులు సమ్మెలకు ప్రాముఖ్యస్థా నములు. దూదినారపరిశ్రమలలో సమ్మెలు సాధారణముగ సంభవించు చున్నవి. అహమ్మదాబాదు, షోలాపూరు, కోచి, నాగపురములలోని బట్టల మిల్లులు, కాన్పూరునందలి దూది, ఉలు, తోలుమిల్లులు, వంగబీహారు దేశములలోని రాతిబొగ్గు, ఇనుపగనులు, పంజాబు నందలి సిమెంట్ పరిశ్రమ, రైళ్లకర్మాగారములు (వర్క్‌షాపులు) ఇంచుమించుగ భారతదేశములోని అన్ని రైలుమార్గముల కర్మాగా రములు సమ్మెలకు జన్మస్థానము లైనవి. కాని, యీ తావులయం దెల్ల సుస్థిరమగు కార్మికసంస్థలు నెలకొల్పబడలేదు. ఒక్క అహమ్మ దాబాదునందు మాత్రమే మహాత్ముని నాయకత్వమున సుస్థిరమగు కార్మికసంస్థ గలదు. వస్త్ర నారపరిశ్రమలలో నచ్చటచ్చట సంఘము లేర్పడినవి. భారతదేశ మొత్తమున ప్రతివృత్తికి కేంద్ర సంఘము లేర్పఱుప బడలేదు. రైళ్లు తంతి తపాలా పనివాండ్ర సంఘ ములు మాత్రము యావద్భారతదేశమున కేర్పఱుపబడి సక్రమముగ పనిచేయుచున్నవి. బొంబాయి, అహమ్మదాబాదులయందు రైలుపని వాండ్రలో కార్మికసంస్థలకు కట్టుదిట్టమైన పునాదులు వేయఁబడి యున్నవి. 1921 సం॥ రములో ఎన్. యమ్. జోషీగారు భారతశాసన సభలో మాటాడుచు సుమారు రెండువందకార్మికసంఘములు కలవని యు, అందు వేనకువేలు సభ్యులు కల రనియు వచించిరి. ఇన్ని సంఘములు మొలకెత్తినమాట నిజమే కాని, యన్నియు సజీవములై పనిచేయుట లేదు. 1927 సం॥ న. హిందూదేశపు ట్రేడుయూనియను

యందు తీవ్రమైన సమ్మెలు జరిగినవి. ప్రభుత్వమధ్యవర్తిసంఘము సమ్మెలాసమ్మెల నిలుపుజేయలేక పోయినవి. (Communists) సామ్యవాదు లీసమ్మెలకు జేయూత నిచ్చిరని గవర్నమెంటువారు వారిని నిందించిరి.

1920 లో స్థాపింపబడిన ట్రేడ్‌యూనియన్ కాంగ్రెస్ ట్రేడు యూని ప్రతి సంవత్సరము సమావేశ మగుచున్నది. కార్మిక యను కాంగ్రెసు సమస్యను సర్వతోముఖముగా చర్చించు చున్నది.

1925 సం. లో ట్రేడుయూనియనుకాంగ్రెసుకు 30 సంఘములు కలవు. వంగదేశమునందు 8, బీహారు ఒరిస్సా 1, మదరాసు 4, పంజాబు 2, సింధు 1, సంయుక్తరాష్ట్రములు 2. 1924 లో నియమ ప్రణాళిక యేర్పఱుప బడినది. నానాదేశ కార్మికసంస్థల మధ్య అంతర్జాతీయ సౌభ్రాతృత్వము స్థాపించుటకు గాను భారతదేశ ప్రతినిధుల నచటికి పంపుటకును, వారి నచటి కాహ్వానించుటకును తీర్మానించిరి. ప్రథమ ట్రేడుయూనియను సభకు లాలా లజపతిరాయ్ (Lala Lajapat Rai)గారధ్యాసనాధిపత్యము వహించిరి. కాని 1925 సం. రములో ట్రేడుయూనియను కాంగ్రెసు అధ్యక్షుడు కార్మిక సమస్యకును రాజకీయాందోళనమునకును సంబంధము లే దనియు, అన్నిపక్షముల సహాయ మపేక్షింపవలసినదనియు ప్రకటించెను. ట్రేడుయూనియను సభ నెలకొల్పబడినను, అది భారతదేశ కార్మికసంఖ్య, వైశాల్యము, పరిశ్రమల ననుసరించి యుండవలసినంత బలవత్తరమగు సంఘమై యుండ

ఈదిగువపట్టికవలన 1921 వ సంవత్సరము మొదలు జరిగిన సమ్మెలను, అందు పనిమానివేసినవారి సంఖ్యయు తెలిసికొనగలము.

| 1 సంవత్సరము | సం॥ న పనిమానిన సమ్మెల సంఖ్య | సమ్మెకట్టిన పనివాండ్ర సంఖ్య | సమ్మె వలన పోయిన పనిచేయు రోజులు |
|---|---|---|---|
| 1921 | 376 | 600000 | 700000 |
| 1922 | 372 | 435000 | 400000 |
| 1923 | 209 | 301000 | 510000 |
| 1924 | 132 | 312000 | 870000 |
| 1925 | 133 | 270000 | 1260000 |
| 1926 | 127 | 187000 | 1100000 |
| 1927 | 129 | 132000 | 2020000 |
| 1928 | 200 | 507000 | 3160000 |
| 1929 | 134 | 531000 | 1220000 |
| 1930 | 145 | 196000 | 230000 |

*1 Taken from "The Royal Commission on Labour in India" page 383.*

ఈసమ్మెలలో 3 డింట రెండువంతులు విఫలములైనవని ప్రభుత్వమువారు ప్రకటించిరి.

# 31. 1929 వ సం॥రపు సమ్మెలశాసనము.

## TRADE DISPUTES ACT

సమ్మెల శాసనము 1929 వ సం॥రము గావింపబడినది. ఈశాసనమునననుసరించి న్యాయాన్యాయములను విచారించుట కాక, ప్రత్యేక

ట నీటికై నూతిని త్రవ్వుట సమంజసముగాదు. తగవులు తీవ్రస్వరూప ము దాల్చుటకుముందే రాజీప్రయత్నము లొనరించుట ప్రజానాయ కులధర్మము. ప్రభుత్వవిధి.

## . కార్మికుల అంతస్థు .

కార్మికుల జీవనోపాధికి వలయునాదాయము లభించుచున్నదా, లేదో యను ప్రశ్నలకు సమాధానమిచ్చుటకు తగులెక్కలు లేవు. సుమారుగ మాత్రమే గ్రహింపగలము. కార్మికులజీవిత మరయవలెనన్న వ్యక్తిగత ఆదాయవ్యయముల మాత్రమే పరీక్షించుట తగదు. కార్మికుని కుటుంబాదాయమును, కుటుంబవ్యయమును, రెంటిని గమనింప వలయును. అప్పుడే కార్మికునినిజస్థితి చిత్రింప గలుగుదుము.

కార్మికుల ముదరాశాసనము ననుసరించి ప్రభుత్వమువారిచే తయారు చేయబడిన నీదిగువపట్టికవలన కూలీలుసంపాదించుకూలి యెట్లున్నదియు గొంతవఱకు తెలియును.

ఈపట్టిక 1925, 26, 27, 28, 29 సం॥రములయందు గలకూలి ననుసరించి వేయబడినది. ఈ యంకెలు పనిచేయునపుడు సంభవించిన అపాయములకు ముదరా కోరినవారి ననుసరించి వేయబడినవి. పనివాండ్ర అపాయముల ముదరాశాసనము తక్కువజీతగాండ్రగు కార్మికులకందఱకు తెలియనే తెలియదు. కొంచెము హెచ్చుజీతగాండ్రు మాత్రమే ముదరా కోరగలుగుచున్నారు. అట్లే పెద్దజీతగాండ్రకు అపాయములు సంభవించుటయే అఱుదు. అందుచే ముదరా కోరనేకోరరు. ఈవిషయముల గుర్తించుచు నీదిగువపట్టిక అంచనా మాత్రమే యని గ్రహింప నగును.

| రాష్ట్రములు | నెల 1కి 100 కి ఎంతమంది ఎంతెంత జీతము సంపాదించుచున్నారు! | | | | | | 1925-29 మధ్యనున్న [illegible] సంఖ్య. |
|---|---|---|---|---|---|---|---|
| | రూ 13 లకు లోపుగా | రూ 13 లకు పైగా రూ 17—8—0కు లోపుగా | రూ 17—8—0కు పైగా రూ 22-8-0 కు లోపుగా | రూ 22—8—0కు పైగా రూ 27-8-0 కు లోపుగా | రూ 27—8—0కు పైగా రూ 32-8-0 కు లోపుగా | రూ 32—8—0 కు లోపుగా | |
| సంయుక్తరాష్ట్రములు | 26 | 27 | 15 | 9 | 7 | 16 | 304 |
| మదరాసు | 22 | 25 | 19 | 15 | 4 | 15 | 110 |
| మధ్యపరగణాలు | 18 | 38 | 17 | 8 | 4 | 15 | 209 |
| బీహారు, ఒరిస్సాలు | 21 | 24 | 21 | 12 | 8 | 14 | 717 |
| బెంగాలు | 13 | 18 | 18 | 15 | 10 | 26 | 878 |
| పంజాబు | 10 | 16 | 36 | 10 | 7 | 21 | 324 |
| బొంబాయి | 8 | 10 | 19 | 23 | 13 | 32 | 1273 |
| బర్మా | 1 | 8 | 10 | 16 | 27 | 43 | 186 |

*From "The Royal Commission on Labour in India" page 204.*

ఈపట్టిక వ్యక్తిగతాదాయమును తెలుపుచున్నది. కుటుంబాదాయమును గమనింపదగు నాధారము లెంత మాత్రమును లేవు. 1921 వ సం॥ మున బొంబాయియందు గల 2000 కుటుంబముల ఆదాయమును పరీక్షించుచో నెల 1 కి రూ 52-4-6 లు, ఆదాయము తేలినది. కాని ఈసాలున జీతములు హెచ్చుగనున్నవి. అందుచే నీమొత్తమును గమనింప వీలులేక అహమదాబాదు, షోలాపూరు నగరములలో 900 కుటుంబముల ఆదాయము మదింపు వేయబడెను.

| కుటుంబాదాయము | అహమదాబాదు (1926) | | షోలాపూరు (1925) | |
|---|---|---|---|---|
| | 100 కి | కుటుంబము 1కి సగటున గల పనివాండ్ర సంఖ్య | 100 కి | కుటుంబము 1కి సగటున గల పనివాండ్ర సంఖ్య |
| రూ. 20 లకు లోపుగా | 2 | 1.2 | 8 | 1.0 |
| రూ. 20-30 లకు లోపుగా | 17 | 1.2 | 23 | 1.6 |
| రూ. 30-40 లకు లోపుగా | 21 | 1.5 | 26 | 1.9 |
| రూ. 40-50 లకు లోపుగా | 25 | 1.6 | 21 | 2.0 |
| రూ. 50-60 లకు లోపుగా | 18 | 1.9 | 11 | 2.4 |
| రూ. 60-70 లకు లోపుగా | 8 | 2.0 | 5 | 3.0 |
| రూ. 70-80 లకు లోపుగా | 5 | 2.4 | 3 | 2.7 |
| రూ. 80-90 లకు లోపుగా | 4 | 2.2 | 3 | 3.3 |

*From "The Royal Commission on Labour in India" page 205.*

| 1 పదార్థములు | షోలాపూరు | | అహమదాబాదు | |
|---|---|---|---|---|
| | సగటున నెలకు ఖర్చు | మొత్తపు ఖర్చులో 100 కి ఎన్నవ వంతు? | సగటున నెలకు ఖర్చు | మొత్తపు ఖర్చులో 100 కి ఎన్నవ వంతు? |
| ఆహారమునకు | రూ. అ. పై. | | రూ. అ. పై. | |
| కాయధాన్యములు | 9- 7- 6 | 25.00 | 11-11-11 | 29.84 |
| పప్పులు | 1- 5- 2 | 3.50 | 1- 7- 6 | 3.73 |
| పంచదార తినుబండారములు | 1- 1- 0 | 2.80 | 0-15- 7 | 2.47 |
| మాంసము | 1-10- 1 | 4.31 | 0-14- 1 | 2.24 |
| పాలు, నేయి | 1- 4- 8 | 3.41 | 3- 6- 1 | 8.59 |
| కూరగాయలు, పండ్లు | 0-15- 2 | 2.50 | 1-11- 1 | 4.30 |
| నూనెలు | 1- 0- 1 | 2.65 | 0-11-10 | 1.88 |
| ఉప్పు | 0- 3- 8 | 0.61 | 0- 1- 7 | 0.25 |
| పోపు దినుసులు | 1- 4- 9 | 3.43 | 0-11- 9 | 1.87 |
| తేయాకు | 0- 0-11 | 0.15 | 0- 2- 4 | 0.37 |
| ఇతరభోజనపదార్థములు | 0- 5- 5 | 0.89 | 0-14-10 | 2.36 |
| భోజన పదార్థముల కగు మొత్తము | 18-10- 5 | 49.25 | 22-12- 7 | 57.90 |
| వంట చెఱకు, దీపము | 3-10- 2 | 9.60 | 2-12- 4 | 7.04 |
| కట్టుగుడ్డలు | 4- 7-10 | 11.86 | 3-11- 6 | 9.45 |
| పడక పనిముట్లు, పాత్రసామగ్రి, వంటసామానులు | 0- 6- 1 | 1.00 | 0- 7- 4 | 1.16 |
| ఇంటి అద్దె | 2- 6- 0 | 6.27 | 4- 9-11 | 11.74 |

*From "The Royal Commission on Labour in India" page 206*

ii

| పదార్థములు | షోలాపూరు | | అహమదాబాదు | |
|---|---|---|---|---|
| | సగటున నె 1కి ఖర్చు | మొత్తపు ఖర్చులో 100 కి ఎన్నవ వంతు? | సగటున నె 1కి ఖర్చు | మొత్తపు ఖర్చులో 100 కి ఎన్నవ వంతు? |
| చాకలి, మంగలికర్చు | 0-12-10 | 2.12 | 0-15- 9 | 2.50 |
| పొగాకు | 0- 9- 8 | 1.60 | 1- 2- 9 | 2.97 |
| త్రాగుడు | 0-13- 9 | 2.27 | 0- 8- 9 | 1.39 |
| స్వగ్రామములకగు రాకపోకల ఖర్చులు | 0-10- 6 | 1.73 | 0- 9- 5 | 1.50 |
| అప్పుమీద యీయవలసిన వడ్డీ | 2- 8- 4 | 6.65 | ... | ... |
| చిల్లరలు | 2-14- 4 | 7.65 | 1-11- 4 | 4.35 |
| మొత్తం | 37-13-11 | 100.00 | 39- 5- 8 | 100.00 |

ఈపట్టిక కార్మికుల వ్యయమునకు సూచనగ మాత్రమే మదింపు వేయబడెను. అహమదాబాదు షోలాపూరుల అంకెలు పోల్చుటకు వీలులేదు. కార్మికులు తమకుగల అప్పును సక్రమముగ తెలుపలేదు. త్రాగుడుపై ఎంత ఖర్చుపెట్టుచున్నదియు గూడ సత్యము వచింపలేదు. అహమదాబాదు కూలీల కెక్కువ అప్పుగలదు. షోలాపూరు కూలీలు కొంచెము తక్కువ త్రాగెదరు. అహమదాబాదు, షోలాపూరునందలి కార్మికులకిచ్చు జీతములు (బర్మాగాక) ఇతరప్రదేశముల కంటె హెచ్చు. అందుచేత నీరెండునగరముల కార్మికుల ఆదాయవ్యయములు మదింపు వేయబడినవి. ఇతర పరిశ్రమలలోకంటె బట్టలమిల్లులలో కూలీల కెక్కు డాదాయము వచ్చుచున్నందున

బట్టలమిల్లుల కూలీల కుటుంబాదాయవ్యయములే గ్రహింపబడినవి. పై పట్టిక ననుసరించి వడ్డీ మినహాయించుచో తిండి, గుడ్డ, వంటచెఱకు, దీపములకే 100 కి 82 వంతుల ఆదాయము ఖర్చగు చున్నది. ఈఖర్చులు గాక గర్భదరిద్రుడగు కార్మికుడు కూడ చాకలిమంగలి ఖర్చులను పెట్టుకొనక తప్పదుగదా! ఇట్లే కొంతపాత్రసామగ్రి యవసరము. ఇంటి అద్దెలో సంసారమున కవసరమగు నితరసామాన్ల వ్యయము చేర్చలేదు. కూలీలయిండ్లలో పడకసామగ్రులు లేనేలేవు. ఈఖర్చులుగాక జబ్బులకగు వైద్యులఖర్చు, జననమరణములకగు ఖర్చు, పెండ్లిపేరంటములకల కగుఖర్చులు తప్పనిసరివి గదా! మతము ననుసరించిన పండుగలకు ఆచారములకు గూడ కొంత ఖర్చగును. ఈకూలీలందఱు పల్లెలనుంచి పట్టణవాసమునకు వచ్చినవా రగుటచే తమపల్లెల కప్పుడప్పుడు పోయివచ్చుటకు గొంతఖర్చు కాక తప్పదు. ఇందులకై చూపింపబడిన ఖర్చు స్వల్పము. అహమదాబాదు షోలాపూరు కార్మికు లాచుట్టుపట్ల పల్లెలవారగుటచే రాకపోకలఖర్చు తక్కువ యగుచున్నది. ఈఖర్చులన్నియు భరించి కార్మికుడు ఋణవిముక్తుడు కావలసి యున్నాడు. ఈవిషయములే కార్మికునిజీవితమును సంపూర్ణముగ జిత్రించు చున్నవి. కార్మికుడు దారిద్ర్యావస్థయందు శ్లేష్మమునందుబడిన యీగవలె పెనగులాడు చున్నాడనుట నిర్వివాదాంశము.[1]

# 33. త్రాగుడు.

కార్మికులు తమ జీతబత్తెములయందు త్రాగుడుక్రింద చాల భాగము ఖర్చుచేయు చున్నారు. మద్యపాననిషేధము జరుగుచో, కార్మికు లీత్రాగుడు పిశాచపుబారినుండి తప్పించుకొనగలరు. సంపూ

1. See "Royal Commission on Labour in India" p. p. 204. 5. 6. 7.

ర్ణమద్యపాన నిషేధము జరుగువఱకు కార్మికులను త్రాగుడుపిశాచపు బారినుండి తప్పింపజాలము. షాపులను తగ్గించుటయు, ఖరీదులను హెచ్చించుటయు, పూటమాత్రమే అమ్మించుటయు, నుజీయొకపూట మానిపించుటయు, మిల్లులకు దూరముగ దుకాణములను స్థాపించుటయు, త్రాగుడుబదులు తేయాకు నలవాటుచేయించుటయు మొదలగు సంస్కరణలవలన త్రాగుడుబారినుండి కార్మికులు సంరక్షింప బడజాలరు. త్రాగుడు మానువఱకు కార్మికుడు సుభిక్షముగ జీవింపజాలడు.

# 34. ఋణము.

"కార్మికులు 100కి 12,25,24,20,75,150,225 వరకుల వఱకు గూడ వడ్డీనిచ్చుచు ఋణము చేయుచున్నారు."[1]

దక్షిణహిందూదేశమున 100 కి 80 నుండి, నాలుగుకార్మికులయొక్క ఋణము జేయుచున్నారు. రూ 1 కి 1 అణా మొదలు 2 అణాల వఱకు వడ్డీ నొసంగుచున్నారు. ఈఋణములకు ఆదాయము చాల కుండుటయే మొదటి కారణము. త్రాగుడు రెండవకారణము. పెళ్లి పేరంటములు జననమరణములు ఇతరకారణములు. ఎంతకష్టించి పని చేసినను ఆదాయముచాలక కార్మికుడు కృంగి పోవుచున్నాడు. సహకారపరపతిసంఘములు, కార్మికులు ఋణవిముక్తులగుటకు నిరుపయోగముగనున్నవి. వీరి ఋణబాధ తొలగించుటకు ఎవంతయు సహాయముగలేవు. ఋణదాత కోర్టులమూలముగ పీడించుచున్నాడు. ఋణమునకై ఖయిదునకుపంపు శాసనము సవరణ చేయుట అత్యవసరము. కనీసము రూ 100 లకు తక్కువ జీతగానిజీతమును ఋణమునకై జప్తులచేయరాదని లేబరుకమీషనువారు సూచించిరి. ఇదిసమంజసము.

1. *See "The Royal Commission on Labour in India" page 224-25.*

# 35. వసతి (ఇండ్లు)

కార్మికుడు నివసించుచున్న ఇండ్లు, వాటిపరిసరములు దుర్భర ముగ నున్నవి. అపరిశుభ్రమునకు పనివాండ్ర వాడలే పుట్టినిండ్లు. అల్పాయుర్దాయమునకు, శిశుమరణమునకు, విషూచి మరణమునకు, కార్మికుడు నివసించు అపరిశుభ్రమగు గాలివెలుతురు రాని ఇండ్లే కారణము. కార్మికుడు సక్రమముగ పోషింపబడి, ఆరోగ్యవంతుడుగ, నీతి మంతుడుగ నున్నప్పుడే పరిశ్రమ లభివృద్ధి పొందగలవు. అపరిశుభ్ర మగు అనారోగ్యకరమగు ఇండ్లలో కార్మికులు వసించుట యన అవి నీతి, నేరము, రోగము, త్రాగుడు, దెబ్బలాట, కార్మిక జీవనమున ప్రబలుటయే యగును. ఇందులకు వైద్యశాలలు, ఖయిదులు, పిచ్చి ఆసుపత్రులు పెట్టి, వీరి దుస్థితిని మఱుగుపఱుచు చున్నాము. కార్మికు లకు పరిశుభ్రములగు వసతులేర్పఱిచిన గాని పరిశ్రమాలయములను స్థాపింపనీయరాదు. పరిశ్రమాలయములను నగరముల మధ్యనుండి తీసివేయవలెను. ప్రస్తుతపరిశ్రమల అన్నింటియందు గొంత కాలనిర్ణ యముచేసి, కార్మికులకు పరిశుభ్రములగు వసతు లేర్పడునట్లు శాసింప వలసి యున్నది. "హిందూదేశమున 100 కి 97 కార్మికకుటుంబములు ఒక గదియందు మాత్రమే కాపురము చేయుచున్నవి. గది 1 కి సగ టున 4 గురు నివసించుచున్నారు. లండను నగరమున 100 కి 6 గురు, ఒక్కొక్క గదియందు వసించు చున్నారు. గది 1 కి 1. 92 మంది మాత్రమే గలరు. ఫ్రాన్సు, బెల్జియములలో కార్మికుని 1 కి 2 గదులు గలవు. జర్మనీయందు 3 గదులు, ఇంగ్లండు వేల్సులలో 4, 5 గదులును గూడ గలవు"[1]

1931 సంవత్సరపు జనాభాని వేదికయందు హిందూదేశమునందు గల వసతి సౌకర్యములను గుఱించిన వివరములు గ్రహింపదగియున్నవి.

---

1. *Quoted From Jather and Beri p. 118.*

హిందూదేశమున కుటుంబము 1 కి సగటున 4 గురు లేక 5 మంది గలరు. ఈదిగువపట్టికవలన ఎన్నియిండ్లలో ఎంతమంది నివసించుచున్నదియు తెలియగలదు.

| | | | |
|---|---|---|---|
| డెల్హీ | 1000 | ఇండ్లకు సుమారు | 899 మంది మొదలు 629 మందివఱకు |
| మదరాసు | 100 | ... | 877 మంది |
| రాజమండ్రి | 100 | ... | 798 ... |
| మంగుళూరు | 100 | ... | 727 ... |
| మధుర | 100 | ... | 728 ... |
| నెల్లూరు | 100 | ... | 709 ... |

ఈఅంకెల ననుసరించి కుటుంబము 1కి ఒకయిల్లు వంతునగూడ లేదని తేలియున్నది.

"జనాబా లెక్కలలో గ్రహింపబడిన ఇంటిపరిమితి యొకగది కంటె హెచ్చుగ నుండదు. ఈగది సగటున $10 \times 10 = 100$ చ॥ అడుగుల వైశాల్యము మాత్రమే యుండును. ఇట్టి గదులలో సగటున 4 గురి కంటె హెచ్చుమంది నివసించు చున్నారు." ఇది బొంబాయి నగరమందలి స్థితి.

కోలారు బంగారుగనులయందుగల స్థితి మైసూరు జనాభా లెక్కల యధికారి యిట్లు వివరించెను. అచ్చటగల గదులు సగటున $9 \times 9 = 81$ చ॥ అడుగుల వైశాల్యము మాత్రమే. ఈదిగువ పట్టిక వలన గది 1 కి ఎంతమంది, వసించుచున్నదియు తెలియ గలదు.

| 1<br>మొత్తపుగుడిసెలు | ఒకకు టుంబము | 2 కు టుంబములు | 3 కు టుంబములు | 4 గురి కంటెతక్కువ | 4 గురు మొ॥ 6 గురు | 6 మొ॥ 8 వ॥ | 8 మొ॥ 10 వ॥ | 10 మంది కి పైన |
|---|---|---|---|---|---|---|---|---|
| ఒక్కగదిమాత్ర మేగల గుడిసెలు<br>6827 | 6591 | 235 | 1 | 3440 | 3522 | 749 | 106 | 10 |
| ఒక్కగది మఱొక వంటగది లేక వరండాగల గుడి సెలు<br>1850 | 1734 | 110 | 6 | 582 | 668 | 461 | 107 | 32 |

ఈపట్టిక వలన మూడుకుటుంబములు ఒకగదియందే కాపురము చేయుచున్నటుల తెలియు చున్నది. 235 గుడిసెలలో గుడిసె 1 కి రెండు కుటుంబములు కాపురము చేయుచున్నవి. గుడిసె 1 కి కుటుంబము 1 కి 10 మందికి పైగగల కుటుంబములు 42 గుడిసెలలో జీవించుచున్నటుల తెలియుచున్నది. 850 గుడిసెలలో గుడిసె 1కి 6 గురు, లేక అంతకు పైగగల కుటుంబములు, కాపురము చేయుచున్నవి.

ఈ దిగువపట్టికలు పరీక్షించిన వసతి యెంత క్రిక్కిరిసి యున్నదియు, అమానుషముగ నున్నదియు తెలిసికొనగలము.

100కి ఎన్నికుటుంబములు ఎన్నిగదులలో కాపురమున్నవి?

| | 1 గది | 2 గదులు | 3 గదులు | 4 గదులు | 5 లేక హెచ్చుగదులు |
|---|---|---|---|---|---|
| లక్నో | 50.4 | 28.9 | 10.7 | 5.2 | 4.8 |
| కాన్పూరు | 62.5 | 24.8 | 7.5 | 2.9 | 2.3 |

1 *From Census Report 1931.*

100కి ఎన్ని కుటుంబములు ఎంత యింటియందలి భాగములలో కాపురము జేయుచున్నారు?

| | 1 గది | 2 గదులు | 3 గదులు | 4 గదులు | 5 లేక హెచ్చు గదులు |
|---|---|---|---|---|---|
| బరోడా | 24.1 | 27.8 | 10.6 | 14.6 | 22.9 |

మన దేశమందలి యీస్థితిని లండనునగరముతో బోల్చికొని పరీక్షింపదగును.

100 కి ఎన్ని కుటుంబములు ఎన్ని గదులలో కాపురము చేయుచున్నవి?

| 1 | 1 గది | 2 గదులు | 3 గదులు | 4 గదులు | 5 లేక హెచ్చు గదులు |
|---|---|---|---|---|---|
| లండనునగరము | 12.2 | 21.5 | 25.1 | 18.4 | 22.8 |

లండను నగరమున సగటున కుటుంబము 1 కి 3. 5 మందియే గలరని గ్రహింపవలయును. కాన్పూరునందు గూడ కుటుంబము 1 కి 3. 5 మంది గలరు. లండనునగరమును కాన్పూరును పోల్చిన, ఎంత క్రిక్కిరిసిన గదులలో అమానుషముగ భారతీయులు జీవించుచున్నదియు, సుబోధక మగుచున్నది. కాన్పూరునందు 100కి 62. 5కుటుంబములు 1 గదియందు కాపురము చేయుచున్నవి. లండనునందు 100 కి 12. 2 కుటుంబములు మాత్రమే కాపురము చేయుచున్నవి.[2]

## 36. గల్లీలను తీసివేయుట.

"1838 సంవత్సరమునకు పూర్వము ఇంగ్లండునందు గూడ బీదలవసతిగృహముల సంస్కరించు ఉద్యమము లేదు. 14 గవ శతాబ్ద

1. From Census Report 1931
2. See Census Report 1931 p. p. 57. 58. 59.

మునందలి ఇంగ్లండులో వీధులు దుర్వాసన వేయుచుండెడివి. నీరు దుర్వాసన వేయుచుండెడిది. గాలిగూడ దుర్వాసనమయమై వీచెడిది. మశూచి, విషూచి, జ్వరములు విచ్చలవిడిగ చెలరేగి యుండెడివి. 19 దవ శతాబ్ద ప్రారంభము వఱకు ఇంగ్లండునందు గూడ చెల రేగియున్న ఈజబ్బులు నేడు ఉష్ణప్రదేశములజబ్బు లనబడుచున్నవి. 1838 సంవత్సరమునుంచియు వరుసగ 13 సంవత్సరములు ఎడ్విన్ చాడ్వికుగారు (Edwin Chadwick) ప్రజారోగ్యముకొఱకు విపరీతముగు నాందోళన మొనరించిరి. వీరి ఆందోళనకు ఫలితముగ 1848 వ సంవ త్సరమున మొట్టమొదట ఆరోగ్యశాసనము గావింపబడెను. పిమ్మట 1851, 1868, 1875 వ సంవత్సరములలో గల్లీలయందలి ఇండ్లను విశాల మొనరించుటకు వలయు శాసనములు గావింపబడెను. 1909 లో నగరనిర్మాణవిధానశాసన మొనరింప బడెను. (Town Planning Act) మరల 1919, 1923, 1924, 1925, 1930 వ సంవత్సరములయందు గృహనిర్మాణ శాసనములు గావింపబడెను. ఈశాసనముల ననుసరించి, 1938 వ సంవత్సరాంతమునకు, ఇంగ్లండునందు గల్లీ యనునది లేకుండ నిర్మూలింపబడును."[1]

ఆరోగ్యశాఖ మంత్రిగారు 1938 వ సంవత్సరముతోసుగ, ఇంగ్లం డునందు, క్రిక్కిరిసిన యిండ్లు గాని, సందులు గాని యుండరాదని నిశ్చ యించుకొనిరి. 5సంవత్సరముల కార్యక్రమమును నిర్ణయించుచు స్థానిక సంస్థలు కార్యవిధానమును నివేదింపవలె ననిరి. ఒక్కలండనునగర మున నూతనభవననిర్మాణమునకై 350 లక్షల పౌనులు విని యోగింపబడు కార్యక్రమము నివేదింప బడెను. మాంచెస్టరునందు 65 లక్షల పౌనులు వినియోగించు 5 సంవత్సరముల కార్యక్రమ మూ కార్పరేషనుసంఘమువారు నివేదించిరి.

1. *Rev. Ransom's address to Rotarians Madras, Aug 25-1933.*

ఈ దిగువపట్టికవలన ఇంగ్లండు వేల్సులలో గల జనసమ్మర్ద మును తెలిసికొనగలము.

100కి ఎన్నికుటుంబములు ఎన్నిగదులయందు కాపురముచేయు చున్నారు?[1]

| 1 | 1 గది | 2 గదులు | 3 గదులు | 4 గదులు | 5 గదులు అంతకు హెచ్చు |
|---|---|---|---|---|---|
| నగరములయందు | 6.2 | 13.6 | 17.7 | 22.7 | 39.8 |
| గ్రామములయందు | 0.7 | 6.2 | 13.3 | 26.8 | 53.0 |

ఈపట్టిక ననుసరించి ఇంగ్లండులో పల్లెలయందుకంటె పట్టణ ములయందు జనసమ్మర్దము హెచ్చుగ నున్నటుల తెలిసికొన గలము. హిందూదేశమునందు బస్తీలయందు వలెనే జనసమ్మర్దము పల్లెల యందుగూడ హెచ్చుగ నున్నది. అనగా హిందూదేశమున నిలువనీడ లేనివారు చాలమంది గలరని ఋజువగుచున్నది. "గ్రామములయొక్క వైశాల్యము ననుసరించి, మదింపు వేయుచో (పొలములు గాక) బస్తీల కంటె జనసమ్మర్దము గ్రామములయందే హెచ్చుగ నుండును."[2]

"ఉత్తర సర్కారులయందలి జిల్లాలలోను, తంజావూరు జిల్లా యందును, పల్లపుసాగువలన నీజిల్లాలు భాగ్యవంతములై యున్నను, జనసమ్మర్దము హెచ్చుగనుండి, వసతిసౌకర్య మత్యల్పముగ నున్నది. భూములకు ధరలు హెచ్చుగ నున్నచోట ఇండ్లవసతి అసంతృప్తి కరముగ నున్నది.........భాగ్యవంతుడు కూడ ఆశ్చర్యకరమగు చిన్నయింటిలో నివసించుచు, భూమిని వ్యవసాయమునకు గలుపుచుం డును. భూమిగల రైతులస్థితియే యిట్లుండ, భూమిలేనివారిస్థితి యెట్లుం

1. *From the Census Report 1931.*

2. *United Provinces Census Report.*

డునో యూహింప గలము. ప్రతి దేశమున దారిద్ర్యము, వానయో గ్యముగాని యిండ్లు, నొకదాని వెంట మఱియొకటి యుండును.*[1]

ఈదుస్థితిని తొలగించుటకు ఇంగ్లండు దేశమునందు వలెనే హిందూదేశ ప్రభుత్వముగూడ నిర్దేశముగు కార్యక్రమము నాచరింప బూనవలయును. విదేశములలోవలె గన్నిలను బాగుచేయుటయే హిందూ దేశసమస్య కాదు. నిలువ నీడలేనివారే హిందూదేశమున హెచ్చు మంది గలరు.

భారతదేశమున ఎండవానలకు గుఱియగుచు జీవయాత్రను గడుపు వారందఱికి వసతు లేర్పఱుప వలయును. బొంబాయి, మదరాసు, కల కత్తా మొదలగు నగరములయందు, గృహనిర్మాణకార్యక్రమ మాచ రింప బడుచున్నది. ఈ కార్యక్రమము తాబేలు నడకవలె నున్నది. దేశమునందు చెప్పటగాని కాపుర ముండుటకు ఇల్లు లేనివారు తిరుగాడ కుండ జూచుటయే ప్రధాన కర్తవ్యము. ఆయుష్కాలమును నిండ్లలో ప్రజాసామాన్య మంతయు నివసించునట్లు జూచుట ద్వితీయ కర్తవ్యము.

పరిశ్రమలయందు ప్రస్తుత కార్మికవృత్తియందున్న కార్మిక జీవితమును గుఱించి వలయు శాసనముల నొనరించుటలో ప్రభుత్వవిధి నెఱవేఱదు. నవృత్తియందుగాని, లేక, దేశమునందు తిరుగాడువారం దఱు కార్మికులేయను కార్మికశాసన మొకటి గావింపవలసి యున్నది. వీరికై ప్రభుత్వమే పరిశ్రమాలయముల స్థాపింప వలెను. అందు పని పాటుల చేయతగినవారందఱు పని చేయునట్లు శాసింపవలెను. యాచక వృత్తి క్రిమినల్ నేరముగ ప్రకటింప వలెను. వికలాంగులు గూడ యాచకవృత్తి చేయరాదు. వికలాంగుల సంరక్షణార్థమై ప్రభుత్వమే

1. *Madras Census Report.*

ఆశ్రమముల నెలకొల్పవలెను. దేశమునందు నిలువ నీడలేనివారు లేకుండ జేయుటకే భారతీయప్రభుత్వము తన సర్వశక్తులను ధార పోయవలయును.

# 37. ఇతర సౌకర్యములు.

కార్మికోద్యమమును గుఱించి సంపూర్ణమగు విచారణ సలిపి, అవసరమగు సూచనలను గావించుటకు 1929 వ సంవత్సరమున ప్రభుత్వమువారు కార్మిక విచారణ సంఘమును నియమించిరి. (Whitely Labour Commission) ఈ సంఘమువారు భారతదేశమంతయు పర్యటన మొనరించి, కార్మికుల స్థితిగతులనుగుఱించి విపులముగ విమర్శించి, ప్రభుత్వమునకు వారి సూచనలతో గూడిన నివేదికను సమర్పించిరి. పాశ్చాత్యదేశములయందు కార్మికులకుగల సౌకర్యములనైన నీసంఘమువారు సూచింప జాలకపోయిరి. వీరు సూచించిన సంస్కరణములనైనను, ప్రభుత్వమువారు సంపూర్ణముగ నామోదించి, శాసనరూపముగ నాచరణయందుంచలేదు. "రెండుచట్టములపై మాత్రమే ప్రజాభిప్రాయమును గనుగొన దలంచెను. (Trade disputes Bill) 1. వ్యాపారతగవుల చట్టము. 2. (Payment of wages Bill) కూలినిచ్చు చట్టము. ఈరెండవచట్టము 1925 వ సంవత్సరమున శాసనసభయందు ఉద్యోగేతరసభ్యునిచే ప్రవేశపెట్టబడెను. కూలినిచ్చు కాలపరిమితి; అప్పునకై అరెస్టుజేసి శిక్షించుట, జీతములను కూలిని అప్పులకై జప్తుచేయించుట, అప్పులను వసూలు చేయుటకై పరిశ్రమల సిబ్బందిని ఏర్పఱచుట, ఈనాలుగు విషయములపై కార్మికసంఘముల అభిప్రాయములను, ప్రభుత్వమువా రాహ్వానించిరి. కార్మిక విచారణ సంఘము రెండు

చున్నారు. రాజకీయనాయకులు, ప్రజాసేవకులు పలువిధముల
తోడ్పడు చున్నారు. కొన్ని సంఘములుకూడ నేర్పడినవి. సాంఘిక
సేవాసంఘములు బొంబాయి, ఢిల్లీ, కలకత్తా, మదరాసులలో కలవు.
బొంబాయి సంఘము ప్రధానమైనది. 1910 సం.రమున (Servants of
India Society)సర్వెంట్సు ఆఫ్ ఇండియా సొసయిటివారి రాజమాన్య
మున నీసంఘ మేర్పరుప బడెను. 1905 సం.రములో ఈ (Servants of
India Society) సంఘము గోపాలకృష్ణ గోక్లేమహాశయునిచే సృష్టింప
బడెను. మానవసేవయే దీని ప్రధానోద్దేశము. ఈసంఘశాఖలు వివిధ
స్థలముల మానవోద్ధరణకు కృషిసలుపు చున్నవి. బొంబాయిలో యన్.
యమ్. జోషీగారి సేవాసమితి నిరుపమానసేవ జేయుచున్నది.
పూనా, బొంబాయి, వంగదేశముల యందలి స్త్రీ సేవాసదనములు
పేర్కొన దగినవి. పూనాసేవాసమితి 1909 సం. రములో స్థాపింపబడి
నది. రామాబాయి రెనడేసతి, జి. కే. దేవధరుసతిగారల లీసంఘస్థాప
కులు. 1913 లో వంగదేశమందలి దత్తుగారిభార్య స్త్రీ సంఘముల
స్థాపించినది. 250 మహిళా సమితులు గలవు. ఈ సమితులు కూలినాలి
చేసికొని జీవించువారి ఆహారము, విద్య, ఆరోగ్యము మొదలగు విష
యములలో సాంఘికసేవను జేయుచున్నవి. అంతర్జాతీయ మహిళా
సభకు శాఖగ బొంబాయిలో 1918 సం. లో బొంబాయిరాష్ట్రీయ
మహిళాసంఘము స్థాపింప బడినది. ఇట్లే దేశమం దచ్చటచ్చట సంఘ
ములు కలవు. ఇవి ప్రత్యేకించి కార్మికోద్ధరణకు పూనినవి కావు.
మానవసేవలో కార్మికసేవ ప్రాముఖ్యము వహించు చున్నది గాన
కొన్ని సాంఘికసేవాసంఘములు పేర్కొన బడినవి.

## 39. కార్మికపక్షము.

"కార్మికునకు రాజకీయాధికారము లభించిన గాని, అతని కష్ట
ములు తొలగిపోవు. శాసనసభలయందు కార్మికులకు సంపూర్ణ ప్రాతి

నిధ్యము లభింపవలయును. ఆనాడే కార్మికాభివృద్ధికి వలయు సక్రమ శాసనములు నన్నియు నొనరించుటకు వీలగును. కార్మికసంఘమునకు ప్రత్యేక ప్రాతినిధ్య ముండరాదు. సమిష్టి ప్రాతినిధ్యమువల్లనే కార్మికోద్యమము అభివృద్ధి జెందగలదు. నేడు 10 మంది కార్మిక ప్రతినిధులను మాత్రమే, శాసనసభలకు నియమించుచున్నారు. ఈ నియామక పద్ధతి తొలగిపోవలయును. 18 సంవత్సరముల వయస్సుగలవారి కందఱకు 'ఓటు' అధికార మొసంగవలయును. ఆనాడు సంఘమునందు కార్మికు లధికసంఖ్యాకులుగ నుండుటచే సంఘమంతయు కార్మికులపై ఆధారపడుట విధి యగును. కార్మిక ప్రతినిధులే శాసనసభలయం దధికసంఖ్యాకులుగ నుండగలరు. ఆనాడే కార్మికాభివృద్ధి, వర్తకాభివృద్ధి, పరిశ్రమాభివృద్ధి పరస్పరాధారములై వృద్ధిచెందగలవు.

ఈ పరివర్తనమునకు నేటినుండియు రాజకీయముగ నొక కార్మికపక్షమును నేర్పఱుచుట సమంజసము. ఇట్టి పక్షము స్థానిక సంస్థలయందునను, శాసనసభలయందునను కార్మికాభివృద్ధికై కృషిసలుపదగును. శాసనసభామందిరములు కార్మికోద్యమప్రచారవేదికలుగ నొనరింపదగును. కార్మికపక్షము ఇతరరాజకీయ పక్షములలో లీనము గారాదు. కాని, జాతీయోద్యమమునకు వ్యతిరేకముగ సంచరింపరాదు. జాతీయోద్యమమున పాల్గొనుటయుగూడ నవసరము.

కార్మికోద్యమమున మత కుల జాతివివక్షతలను జొరనీయరాదు. ఆర్థికకార్యక్రమమే కార్మికోద్యమమునకు మూలముగ నుండవలయును. అంతర్జాతీయ కార్మికోద్యమములతో కలసి పనిచేయవచ్చును. కాని అంతర్జాతీయ కార్మికనీతిని భారతదేశ కార్మికపక్షము వా రవలంబించుట కింతలో తరుణము రాదు. అవలంబింపజూచుట ఆత్మవినాశనకరము. ఏ అంతర్జాతీయసంఘమునకు గాని అఖిలభారత కార్మికసంఘ మొకశాఖగ పనిచేయరాదు,

"కార్మికోద్యమ విజయమునకు మఱొకవిషయము ముఖ్యము. కార్మికోద్యమ నాయకులు కొలదిగగలరు. ఇందు సక్రమమగు కార్మిక సేవకులు చాల కొలదిగ గలరు. కార్మికోద్యమసేవకు లొనరించిన త్యాగమేమి? క్రాంగ్రెసు మహాజనసభయొక్క అనుచరు లొనరించిన మహాత్యాగముతో పోల్చిచూచుకొన దగును......మనము అత్యధిక త్యాగము చేయవలసి యున్నదని అంగీకరింపకతప్పదు." అని కార్మిక సంఘములసభయం దుపన్యసింపబడెను. ఇం దెంతయు సత్యము గల్గదు. ఏయుద్యమమునకైనను త్యాగుల చెమటబిందువులే దోహద మొనరింప గలవు. త్యాగుల రక్తధారలే నూతనోద్యమముల బోషింప గలవు. నిర్మలబుద్ధితో స్వచ్ఛంద త్యాగముతో వేలకొలది సేవకు లుద్భవించి ననాడే భారతదేశమున కార్మికోద్యమము సజీవమై దినదిన ప్రవర్ధమాన మగును. వేఱొకవిషయముగూడగమనింపదగియున్నది. 'సంఘీభావమే బల' మను నార్యోక్తి కార్మికనాయకులు గూడ మఱచు చుండుట శోచనీయము. ఐకమత్యవిహీనమే భారతీయుల అగచాట్లకు మూల మనుమాట కార్మికనాయకులు మఱువరాదు. "త్యాగము, సంఘీభావము" ఈ ఆదర్శముల రెంటిని ముందు నిడుకొని కార్మికోద్యమ నాయకులు ప్రవర్తింపవలయును. ఈఆదర్శములనుండి తొలగనంత వఱకు కార్మికోద్యమము నెవరును ప్రతిఘటింప జాలరు. కార్మికులకు వలయు సౌకర్యముల నొనగూర్చినగాని భారతావని సుఖింప లేదు. కార్మికోద్యమమునకు సర్వవిధముల చేయూత నొసంగుచుండుటయే దేశభక్తుల విధి. భారతదేశ సర్వతోముఖాభివృద్ధియే కార్మికుని ధర్మము గావలయును. ఆనాడే కార్మికుడు తన్ను తా నుద్ధరించుకొని దేశము నుద్ధరింప గలడు.

---